# శ్రీ లలితా సహస్ర నామ భాష్యం



డా॥ క్రోవి పార్థసారథి





# మేరుప్రస్తారము

(కళ్యానానందభారతి సంప్రదాయము)

# శ్రీవిద్యా సారథి

## 1. శ్రీ లలితా రహస్యనామ పారాయణ క్రమము

**న్యాసము :** అస్య శ్రీ లలితా సహస్రనామ స్తోత్రమాలామన్త్రస్య. వశిన్యాది వాగ్దేవతా ఋషయః అనుష్టుప్ఛన్దః శ్రీ లలితా పరాభట్టారికా మహా త్రిపురసుందరీ దేవతా, ఐం బీజం, క్లీం-శక్తిః సౌః-కీలకం, మమ ధర్మార్థకామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థే లలితా త్రిపురసుందరీ పరాభట్టారికా సహస్ర నామ జపే వినియోగః

| | |
|---|---|
| ఐం-అంగుష్ఠాభ్యాం నమః | ఐం-హృదయాయ నమః |
| క్లీం-తర్జనీభ్యాం నమః | క్లీం-శిరసే స్వాహా |
| సౌః-మధ్యమాభ్యాం నమః | సౌః-శిఖాయై వషట్ |
| సౌః-అనామికాభ్యాం నమః | సౌః-కవచాయ హుం |
| క్లీం-కనిష్ఠికాభ్యాం నమః | క్లీం-నేత్రత్రయాయ వౌషట్ |
| ఐం-కరతల కరపృష్ఠాభ్యాం నమః | ఐం-అస్త్రాయ ఫట్ |

భూర్భువస్సు వరో మితి దిగ్బంధః.

**ధ్యానం :**

అరుణాం కరుణా తరంగితాక్షీం
ధృతపాశాంకుశ పుష్పబాణచాపామ్,
అణిమాదిభి రావృతాం మయూఖై
రహమిత్యేవ విభావయే మహేశీమ్. 1

ధ్యాయేత్ పద్మాసనస్థాం వికసితవదనాం పద్మ పత్రాయ తాక్షీం ।
హేమాభాం పీతవస్త్రాం కరకలిత లసద్ధేమపద్మాం వరాంగీమ్ ।
సర్వాలంకారయుక్తాం సకలమభయదాం భక్తనమ్రాం భవానీం ।
శ్రీ విద్యాం శాన్తమూర్తిం సకల సురనుతాం సర్వసంపత్ప్ర దాత్రీమ్ ॥ 2

సకుంకుమ విలేపనా మళికచుమ్బి కస్తూరికాం
సమన్దహసితేక్షణాం సశరచాప పాశాంకుశామ్,
అశేషజనమోహినీ మరుణమాల్యభూషోజ్జ్వలాం
జపాకుసుమ భాసురాం జపవిధౌ స్మరే దమ్బికామ్. 3

లమిత్యాది పంచపూజాం విభావయేత్ !

1. లం పృథివీతత్త్వాత్మికాయై శ్రీ లలితాదేవ్యై గంధం పరికల్పయామి.
2. హం ఆకాశ తత్త్వాత్మికాయై శ్రీ లలితాదేవ్యై పుష్పం పరికల్పయామి.
3. యం వాయుతత్త్వాత్మికాయై శ్రీ లలితాదేవ్యై ధూపం పరికల్పయామి.
4. రం–వహ్నితత్త్వాత్మికాయై శ్రీ లలితాదేవ్యై దీపం పరికల్పయామి.
5. వం–అమృత తత్త్వాత్మికాయై శ్రీ లలితాదేవ్యై అమృత నైవేద్యం పరికల్పయామి.

సం–సర్వతత్త్వాత్మికాయై శ్రీ లలితాదేవ్యై తాంబూలాది సర్వోపచారాన్ పరికల్పయామి.

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుర్సాక్షాత్ పరబ్రహ్మా తస్మై శ్రీ గురవే నమః

శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ,
చిదగ్ని కుండసమ్భూతా దేవకార్యసముద్యతా. 1
ఉద్యద్భాను సహస్రాభా చతుర్బాహుసమన్వితా,
రాగస్వరూపపాశాఢ్యా క్రోధాకారాంకుశోజ్జ్వలా. 2
మనోరూపేక్షుకోదండా పచంతన్మాత్రసాయకా,
నిజారుణ ప్రభాపూర మజ్జద్బ్రహ్మాండ మండలా. 3
చమ్పకాశోకపున్నాగ సౌగన్ధిక లసత్కచా,
కురువిందమణిశ్రేణీ కనత్కోటీరమండితా. 4
అష్టమీచంద్ర విభ్రాజ దళికస్థలశోభితా,
ముఖచన్ద్రకళంకాభ మృగనాభివిశేషకా. 5
వదనస్మరమాంగల్య గృహతోరణ చిల్లికా,
వక్త్రలక్ష్మీ పరీవాహ చలన్మీనాభ లోచనా. 6

నవచంపకపుష్పాభ నాసాదండవిరాజితా
తారాకాంతి తిరస్కారి నాసాభరణభాసురా. 7

కదంబమంజరీక్లుప్త కర్ణపూరమనోహరా,
తాటంకయుగళీభూత తపనోడుప మండలా. 8

పద్మ రాగశిలాదర్శ పరిభావికపోలభూః,
నవవిద్రుమబింబ శ్రీన్యక్కారిదశనచ్ఛదా. 9

శుద్ధవిద్యాంకురాకార ద్విజపంక్తిద్వయోజ్జ్వలా,
కర్పూరవీటికామోద సమాకర్షద్దిగంతరా. 10

నిజసల్లాప మాధుర్య వినిర్భర్త్సిత కచ్ఛపీ,
మందస్మిత ప్రభాపూరమజ్జత్కామేశమానసా. 11

అనాకలితసాదృశ్య చుబుక శ్రీ విరాజితా,
కామేశబద్ధ మాంగల్య సూత్రశోభిత కంథరా. 12

కనకాంగద కేయూర కమనీయభుజాన్వితా,
రత్నగ్రైవేయచింతాక లోల ముక్తాఫలాన్వితా. 13

కామేశ్వర ప్రేమరత్న మణిప్రతిపణస్తనీ,
నాభ్యాలవాలరోమాళి లతాఫలకుచద్వయీ. 14

లక్ష్యరోమలతాధారతా సమున్నేయమధ్యమా,
స్తనభార దళన్మధ్య పట్టబంధవళిత్రయా. 15

అరుణారుణకౌసుంభ వస్త్ర భాస్వత్కటీతటీ,
రత్న కింకిణికారమ్యరశనా దామభూషితా. 16

కామేశజ్ఞాత సౌభాగ్యమార్దవోరుద్వయాన్వితా,
మాణిక్య మకుటాకార జానుద్వయ విరాజితా. 17

ఇంద్రగోప పరిక్షిప్త స్మర తూణాభజంఘికా,
గూఢగుల్ఫా కూర్మపృష్ఠజయిష్ణు ప్రపదాన్వితా. 18

నఖదీధితి సంఛన్న నమజ్జన తమోగుణా,
పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా. 19

శింజాన మణిమంజీర మండిత శ్రీపదాంబుజా,
మరాళీ మందగమనా మహాలావణ్య శేవధిః. 20

సర్వారుణా నవద్యాంగీ సర్వాభరణభూషితా,
శివకామేశ్వరాంకస్థా శివా స్వాధీనవల్లభా. 21

సుమేరుశృంగ మధ్యస్థా శ్రీ మన్నగరనాయికా,
చింతామణి గృహాంతస్థా పంచబ్రహ్మాసనస్థితా. 22

మహాపద్మాటవీసంస్థా కదంబవనవాసినీ,
సుధాసాగర మధ్యస్థా కామాక్షీ కామదాయినీ. 23

దేవర్షి గణసంఘాతస్తూయ మానాత్మ వైభవా,
భండాసురవధోద్యుక్త శక్తిసేనా సమన్వితా. 24

సంపత్కరీ సమారూఢ సింధుర వ్రజసేవితా,
అశ్వారూఢాదిష్ఠి తాశ్వకోటికోటిభిరావృతా. 25

చక్రరాజ రథారూఢ సర్వాయుధ పరిష్కృతా,
గేయచక్రరథారూఢ మంత్రిణీ పరిసేవితా. 26

కిరిచక్రరథారూఢ దండనాథాపురస్కృతా,
జ్వాలామాలినికా క్షిప్త వహ్ని ప్రాకారమధ్యగా. 27

భండసైన్యవధోద్యుక్త శక్తివిక్రమహర్షితా,
నిత్యాపరాక్రమాటోప నిరీక్షణసముత్సుకా. 28

భండపుత్రవధోద్యుక్తబాలా విక్రమనందితా,
మంత్రిణ్యంబా విరచిత విషంగవధతోషితా. 29

విశుక్ర ప్రాణహరణా వారాహీ వీర్యనందితా,
కామేశ్వరముఖాలోక కల్పిత శ్రీ గణేశ్వరా. 30

మహాగణేశనిర్భిన్న విఘ్నయంత్ర ప్రహర్షితా,
భండాసురేంద్ర నిర్ముక్త శస్త్ర ప్రత్యస్త్ర వర్షిణీ. 31

కరాంగులినఖోత్పన్న నారాయణ దశాకృతిః,
మహాపాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధాసురసైనికా. 32

కామేశ్వరాస్త్ర నిర్దగ్ధ సభండాసుర శూన్యకా,
బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవసంస్తుత వైభవా. 33

హరనేత్రాగ్ని సందగ్ధ కామసంజీవనౌషధిః,
శ్రీ మద్వాగ్భవకూటైక స్వరూప ముఖపంకజా. 34

కంఠాధఃతి కటిపర్యంత మధ్యకూట స్వరూపిణీ,
శక్తికూటైక తాపన్న కట్యధోభాగ ధారిణీ. 35

మూలమంత్రాత్మికా మూలకూటత్రయ కళేబరా,
కుళామృతైకరసికా కుళసంకేత పాలినీ. 36

కుళాంగనా కుళాంతస్థా కౌళినీ కుళయోగినీ,
అకుళా సమయాంతస్థా సమయాచార తత్పరా. 37

మూలాధారైక నిలయా బ్రహ్మగ్రంథి విభేదినీ,
మణిపూరాంతరుదితా విష్ణుగ్రంథి విభేదినీ. 38

ఆజ్ఞా చక్రాంతరాళస్థా రుద్రగ్రంథి విభేదినీ,
సహస్రారాంబుజా రూఢా సుధాసారాభివర్షిణీ. 39

తటిల్లతా సమరుచి ష్షట్చక్రోపరి సంస్థితా,
మహాశక్తిః కుండలినీ బిసతంతు తనీయసీ. 40

భవానీ భావనాగమ్యా భవారణ్య కుఠారికా,
భద్రప్రియా భద్రమూర్తిర్భక్తసౌభాగ్య దాయినీ. 41

భక్తప్రియా భక్తిగమ్యా భక్తివశ్యాభయాపహా,
శాంభవీ శారాదారాధ్యా శర్వాణీ శర్మదాయినీ. 42

శాంకరీ శ్రీకరీ సాధ్వీ శరచ్చంద్ర నిభాననా,
శాతోదరీ శాంతిమతీ నిరాధారా నిరంజనా. 43

నిర్లేపా నిర్మలా నిత్యా నిరాకారా నిరాకులా,
నిర్గుణా నిష్కళా శాంతా నిష్కామా నిరుపప్లవా. 44

నిత్యముక్తా నిర్వికారా నిష్ప్రపంచా నిరాశ్రయా,
నిత్యశుద్ధా నిత్యబుద్ధా నిరవద్యా నిరంతరా. 45

నిష్కారణా నిష్కళంకా నిరుపాధిర్నిరీశ్వరా,
నీరాగా రాగమథనీ నిర్మదా మదనాశినీ. 46

నిశ్చింతా నిరహంకారా నిర్మోహా మోహనాశినీ,
నిర్మమా మమతాహంత్రీ నిష్పాపా పాపనాశినీ. 47

నిష్క్రోధా క్రోధశమనీ నిర్లోభా లోభనాశినీ,
నిస్సంశయా సంశయఘ్నీ నిర్భవా భవనాశినీ. 48

నిర్వికల్పా నిరాబాధా నిర్భేదా భేదనాశినీ,
నిర్నాశా మృత్యుమథనీ నిష్క్రియా నిష్పరిగ్రహా. 49

నిస్తులా నీలచికురా నిరపాయా నిరత్యయా,
దుర్లభా దుర్గమా దుర్గా దుఃఖ హంత్రీ సుఖప్రదా. 50

దుష్టదూరా దురాచారశమనీ దోషవర్జితా,
సర్వజ్ఞా సాంద్రకరుణా సమానాధిక వర్జితా. 51

సర్వశక్తిమయీ సర్వమంగళా సద్గతి ప్రదా,
సర్వేశ్వరీ సర్వమయీ సర్వమంత్ర స్వరూపిణీ. 52

సర్వయంత్రాత్మికా సర్వతంత్రరూపా మనోన్మనీ,
మాహేశ్వరీ మహాదేవీ మహాలక్ష్మీ ర్మృడప్రియా. 53

మహారూపా మహాపూజ్యా మహాపాతక నాశినీ,
మహామాయా మహాసత్త్వా మహాశక్తిర్మహారతిః. 54

మహాభోగా మహైశ్వర్యా మహావీర్యా మహాబలా,
మహాబుద్ధి ర్మహాసిద్ధి ర్మహాయోగేశ్వరేశ్వరీ. 55

మహాతంత్రా మహామంత్రా మహాయంత్రా మహాసనా,
మహాయాగ క్రమారాధ్యా మహాభైరవ పూజితా. 56

మహేశ్వర మహాకల్ప మహాతాండవ సాక్షిణీ,
మహాకామేశ మహిషీ మహాత్రిపుర సుందరీ. 57

చతుష్షష్ట్యుపచారాఢ్యా చతుష్షష్టి కళామయీ,
మహాచతుష్షష్టి కోటియోగినీ గణసేవితా. 58

మనువిద్యా చంద్రవిద్యా చంద్రమండల మధ్యగా,
చారురూపా చారుహాసా చారుచంద్ర కళాధరా. 59

చరాచర జగన్నాథా చక్రరాజ నికేతనా,
పార్వతీ పద్మనయనా పద్మరాగ సమప్రభా. 60

పంచప్రేతాసనాసీనా పంచబ్రహ్మ స్వరూపిణీ,
చిన్మయీ పరమానందా విజ్ఞాన ఘనరూపిణీ. 61

ధ్యానధ్యాతృధ్యేయరూపా ధర్మాధర్మ వివర్జితా,
విశ్వరూపా జాగరిణీ స్వపంతీ తైజసాత్మికా. 62

సుప్తా ప్రాజ్ఞాత్మికా తుర్యా సర్వావస్థా వివర్జితా,
సృష్టికర్త్రీ బ్రహ్మరూపా గోప్త్రీ గోవిందరూపిణీ. 63

సంహారిణీ రుద్రరూపా తిరోధానకరీశ్వరీ,
సదాశివానుగ్రహదా పంచకృత్య పరాయణా. 64

భానుమండల మధ్యస్థా భైరవీ భగమాలినీ,
పద్మాసనా భగవతీ పద్మనాభ సహోదరీ. 65

ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళిః,
సహస్రశీర్ష వదనా సహస్రాక్షీ సహస్రపాత్. 66

ఆబ్రహ్మ కీటజననీ వర్ణాశ్రమ విధాయినీ,
నిజాజ్ఞారూపనిగమా పుణ్యాపుణ్య ఫలప్రదా. 67

శ్రుతి సీమంత సిందూరీకృత పాదాబ్జధూళికా,
సకలాగమ సందోహ శుక్తిసంపుట మౌక్తికా. 68

పురుషార్థప్రదా పూర్ణాభోగినీ భువనేశ్వరీ,
అంబికా నాది నిధనా హరిబ్రహ్మేంద్ర సేవితా. 69

నారాయణీ నాదరూపా నామరూప వివర్జితా,
హ్రీంకారీ హ్రీమతీ హృద్యా హేయోపాదేయవర్జితా. 70

రాజరాజార్చితా రాజ్ఞీ రమ్యా రాజీవలోచనా,
రంజనీ రమణీ రస్యా రణత్కింకిణి మేఖలా. 71

రమా రాకేందువదనా రతిరూపా రతిప్రియా,
రక్షాకరీ రాక్షసఘ్నీ రామా రమణ లంపటా. 72

కామ్యా కామకలారూపా కదంబకుసుమప్రియా,
కల్యాణీ జగతీకందా కరుణారస సాగరా. 73

కళావతీ కలాలాపా కాంతా కాదంబరీ ప్రియా,
వరదా వామనయనా వారుణీమదవిహ్వలా. 74

విశ్వాధికా వేదవేద్యా వింధ్యాచల నివాసినీ,
విధాత్రీ వేదజననీ విష్ణుమాయా విలాసినీ. 75

క్షేత్రస్వరూపా క్షేత్రేశీ క్షేత్ర క్షేత్రజ్ఞ పాలినీ,
క్షయవృద్ధి వినిర్ముక్తా క్షేత్రపాల సమర్చితా. 76

విజయా విమలా వన్ద్యా వందారుజనవత్సలా,
వాగ్వాదినీ వామకేశీ వహ్నిమణ్డల వాసినీ. 77

భక్తిమత్కల్ప లతికా పశుపాశ విమోచనీ,
సంహృతాశేష పాషండా సదాచార ప్రవర్తికా. 78

తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికా,
తరుణీ తాపసారాధ్యా తనుమధ్యా తమోపహా. 79

చితిస్తత్పదలక్ష్యార్థా చిదేకరసరూపిణీ,
స్వాత్మానందలవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః. 80

పరా ప్రత్యక్చితీ రూపా పశ్యంతీ పరదేవతా,
మధ్యమా వైఖరీ రూపా భక్తమానస హంసికా. 81

కామేశ్వర ప్రాణనాడీ కృతజ్ఞా కామపూజితా,
శృంగార రససంపూర్ణా జయా జాలంధరస్థితా. 82

ఓడ్యాణపీఠనిలయా బిందుమండల వాసినీ,
రహోయాగ క్రమారాధ్యా రహస్తర్పణ తర్పితా. 83

సద్యః ప్రసాదినీ విశ్వసాక్షిణీ సాక్షివర్జితా,
షడంగదేవతా యుక్తా షాడ్గుణ్యా పరిపూరితా. 84

నిత్యక్లిన్నా నిరుపమా నిర్వాణసుఖదాయినీ,
నిత్యా షోడశికారూపా శ్రీకంఠార్ధ శరీరిణీ. 85

ప్రభావతీ ప్రభారూపా ప్రసిద్ధా పరమేశ్వరీ,
మూలప్రకృతి రవ్యక్తా వ్యక్తా వ్యక్త స్వరూపిణి. 86

వ్యాపినీ వివిధాకార విద్యాఽ విద్యా స్వరూపిణీ,
మహాకామేశ నయన కుముదాహ్లాద కౌముదీ. 87

భక్తహార్దతమోభేద భానుమద్భాను సంతతిః,
శివదూతీ శివారాధ్యా శివమూర్తి శ్శివంకరీ. 88

శివప్రియా శివపరా శిష్టేష్టా శిష్టపూజితా,
అప్రమేయా స్వప్రకాశా మనో వాచామగోచరా. 89

చిచ్ఛక్తి శ్చేతనారూపా జడశక్తిర్జడాత్మికా,
గాయత్రి వ్యాహృతి స్సంధ్యా ద్విజబృందనిషేవితా. 90

తత్త్వాసనా తత్త్వమయీ పంచకోశాంతరస్థితా,
నిస్సీమమహిమా నిత్యయౌవనా మదశాలినీ. 91

మదఘూర్ణిత రక్తాక్షీ మదపాటలగండభూః,
చందన ద్రవదిగ్ధాంగీ చాంపేయకుసుమ ప్రియా. 92

కుశలా కోమలాకారా కురుకుళ్ళా కులేశ్వరీ,
కుళకుండాలయా కౌళమార్గతత్పర సేవితా. 93

కుమారగణనాంథాంబా తుష్టిః పుష్టిర్మతి ర్ధృతిః,
శాంతి స్స్వస్తిమతీ కాంతిర్నందినీ విఘ్ననాశినీ. 94

తేజోవతీ త్రినయనా లోలాక్షీ కామరూపిణీ,
మాలినీ హంసినీ మాతా మలయాచల వాసినీ. 95

సుముఖీ నళినీ సుభ్రూ శోభనా సురనాయికా,
కాలకంఠీ కాంతిమతీ క్షోభిణీ సూక్ష్మరూపిణీ. 96

వజ్రేశ్వరీ వామదేవీ వయో వస్థా వివర్జితా,
సిద్ధేశ్వరీ సిద్ధవిద్యా సిద్ధమాతా యశస్వినీ. 97

విశుద్ధి చక్రనిలయా రక్తవర్ణా త్రిలోచనా,
ఖట్వాంగాది ప్రహరణా వదనైక సమన్వితా. 98

పాయసాన్న ప్రియా త్వక్స్థాపశులోకభయంకరీ,
అమృతాది మహాశక్తి సంవృతా డాకినీశ్వరీ. 99

అనాహతాబ్జనిలయా శ్యామాభా వదనద్వయా,
దంష్ట్రోజ్జ్వలాక్షమాలాదిధరా రుధిరసంస్థితా. 100

కాళరాత్ర్యాది శక్త్యౌఘవృతా స్నిగ్ధౌదన ప్రియా,
మహావీరేంద్ర వరదా రాకిన్యంబా స్వరూపిణీ. 101

మణిపూరాబ్జ నిలయా వదనత్రయ సంయుతా,
వజ్రాదికాయుధోపేతా డామర్యాదిభిరావృతా. 102

రక్తవర్ణా మాంసనిష్ఠా గుడాన్న ప్రీతమానసా,
సమస్త భక్తసుఖదా లాకిన్యంబా స్వరూపిణీ. 103

స్వాధిష్ఠానాంబుజగతా చతుర్వక్త్ర మనోహరా,
శూలాద్యాయుధ సంపన్నా పీతవర్ణాతిగర్వితా. 104

మేదోనిష్ఠా మధుప్రీతా బందిన్యాది సమన్వితా,
దధ్యాన్నాసక్తహృదయా డాకినీ రూపధారిణీ. 105

మూలాధారాంబుజారూఢా పంచవక్త్రాస్థి సంస్థితా,
అంకుశాది ప్రహరణా వరదాది నిషేవితా. 106

ముద్గౌదనాసక్త చిత్తా సాకిన్యంబా స్వరూపిణీ,
ఆజ్ఞాచక్రాబ్జనిలయా శుక్లవర్ణా షడాననా. 107

మజ్జాసంస్థా హంసవతీ ముఖ్యశక్తి సమన్వితా,
హరిద్రాన్నైక రసికా హాకినీరూపధారిణీ. 108

సహస్రదళపద్మస్థా సర్వవర్ణోపశోభితా,
సర్వాయుధధరా శుక్ల సంస్థితా సర్వతోముఖీ. 109

సర్వౌదన ప్రీతచిత్తా యాకిన్యంబాస్వరూపిణీ,
స్వాహా స్వధామతిర్మేధా శ్రుతిస్మృతి రనుత్తమా. 110

పుణ్యకీర్తిః పుణ్యలభ్యా పుణ్యశ్రవణకీర్తనా,
పులోమజార్చితా బంధమోచనీ బంధురాలకా. 111

విమర్శరూపిణీ విద్యా వియదాది జగత్ప్రసూః,
సర్వవ్యాధి ప్రశమనీ సర్వమృత్యు నివారిణీ. 112

అగ్రగణ్యాఽ చింత్యరూపా కలికల్మష నాశినీ,
కాత్యాయనీ కాలహంత్రీ కమలాక్ష నిషేవితా. 113

తాంబూల పూరితముఖీ దాడిమీ కుసుమప్రభా,
మృగాక్షీ మోహినీ ముఖ్యా మృడానీ మిత్రరూపిణీ. 114

నిత్యతృప్తా భక్తనిధిర్నియంత్రీ నిఖిలేశ్వరీ,
మైత్ర్యాదివాసనాలభ్యా మహాప్రళయ సాక్షిణీ. 115

పరాశక్తిః పరానిష్ఠా ప్రజ్ఞాన ఘనరూపిణీ,
మాధ్వీపానాలసా మత్తా మాతృకా వర్ణ రూపిణీ. 116

మహాకైలాసనిలయా మృణాల మృదుదోర్లతా,
మహనీయా దయామూర్తి ర్మహాసామ్రాజ్యశాలినీ. 117

ఆత్మ విద్యా మహావిద్యా శ్రీ విద్యా కామ సేవితా,
శ్రీ షోడశాక్షరీ విద్యా త్రికూటా కామకోటికా. 118

కటాక్షకింకరీభూత కమలాకోటి సేవితా,
శిరఃస్థితా చంద్రనిభా ఫాలస్థేంద్ర ధనుఃప్రభా. 119

హృదయస్థా రవిప్రఖ్యా త్రికోణాంతర దీపికా,
దాక్షాయణీ దైత్యహంత్రీ దక్షయజ్ఞవినాశినీ. 120

దరాందోళిత దీర్ఘాక్షీ దరహాసోజ్జ్వలన్ముఖీ,
గురుమూర్తి ర్గుణనిధి ర్గోమాతా గుహజన్మభూః. 121

దేవేశీ దండనీతిస్థా దహరాకాశ రూపిణీ,
ప్రతిపన్ముఖ్య రాకాంత తిథి మండలపూజితా. 122

కళాత్మికా కళానాథా కావ్యాలాప వినోదినీ,
సచామర రమావాణీ సవ్యదక్షిణ సేవితా. 123

ఆదిశక్తిరమేయాత్మా పరమా పావనాకృతిః,
అనేకకోటి బ్రహ్మాండ జననీ దివ్యవిగ్రహా. 124

క్లీంకారీ కేవలా గుహ్యా కైవల్యపదదాయినీ,
త్రిపురా త్రిజగద్వంద్యా త్రిమూర్తి స్త్రిదశేశ్వరీ. 125

త్ర్యక్షరీ దివ్యగంధాఢ్యా సిందూర తిలకాంచితా,
ఉమా శైలేంద్రతనయా గౌరీ గంధర్వ సేవితా. 126

విశ్వగర్భా స్వర్ణగర్భా వరదా వాగధీశ్వరీ,
ధ్యానగమ్యా పరిచ్ఛేద్యా జ్ఞానదా జ్ఞాన విగ్రహా. 127

సర్వవేదాంత సంవేద్యా సత్యానంద స్వరూపిణీ,
లోపాముద్రార్చితా లీలాక్లుప్త బ్రహ్మాండమండలా. 128

అదృశ్యా దృశ్యరహితా విజ్ఞాత్రీ వేద్యవర్జితా,
యోగినీయోగదా యోగ్యా యోగానందా యుగంధరా. 129

ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణీ,
సర్వాధారా సుప్రతిష్ఠా సదసద్రూపధారిణీ. 130

అష్టమూర్తి రజాజైత్రీ లోకయాత్రా విధాయినీ,
యాకాకినీ భూమరూపా నిర్ద్వైతా ద్వైతవర్జితా. 131

అన్నదా వసుధా వృద్ధా బ్రహ్మాత్మైక్య స్వరూపిణీ,
బృహతీ బ్రాహ్మణీ బ్రాహ్మీ బ్రహ్మానందా బలిప్రియా. 132

భాషారూపా బృహత్సేనా భావాభావవివర్జితా,
సుఖారాధ్యా శుభకరీ శోభనా సులభాగతిః. 133

రాజరాజేశ్వరీ రాజ్యదాయినీ రాజ్యవల్లభా,
రాజత్కృపా రాజపీఠ నివేశిత నిజాశ్రితాః. 134

రాజ్యలక్ష్మీః కోశనాథా చతురంగ బలేశ్వరీ,
సామ్రాజ్యదాయినీ సత్యసంధా సాగరమేఖలా. 135

దీక్షితా దైత్యశమనీ సర్వలోక వశంకరీ,
సర్వార్థ దాత్రీ సావిత్రీ సచ్చిదానందరూపిణీ. 136

దేశకాలాపరిచ్ఛిన్నా సర్వగా సర్వమోహినీ,
సరస్వతీ శాస్త్రమయీ గుహాంబా గుహ్యరూపిణీ. 137

సర్వోపాధి వినిర్ముక్తా సదాశివ పతివ్రతా,
సంప్రదాయేశ్వరీ సాధ్వీ గురుమండల రూపిణీ. 138

కులోత్తీర్ణా భగారాధ్యా మాయా మధుమతీ మహీ,
గణాంబా గుహ్యకారాధ్యా కోమలాంగీ గురుప్రియా. 139

స్వతంత్రా సర్వతంత్రేశీ దక్షిణామూర్తి రూపిణీ,
సనకాది సమారాధ్యా శివజ్ఞాన ప్రదాయినీ. 140

చిత్కళానందకలికా ప్రేమరూపా ప్రియంకరీ,
నామపారాయణప్రీతా నందివిద్యా నటేశ్వరీ. 141

మిథ్యా జగదధిష్ఠానా ముక్తిదా ముక్తిరూపిణీ,
లాస్యప్రియా లయకరీ లజ్జా రంభాది వందితా. 142

భవదావ సుధావృష్టిః పాపారణ్య దవానలా,
దౌర్భాగ్యతూలవాతూలా జరాధ్వాంత రవిప్రభా. 143

భాగ్యాబ్ధిచంద్రికా భక్తచిత్తకేకి ఘనాఘనా,
రోగపర్వతదంభోళిర్మృత్యుదారు కుఠారికా. 144

మహేశ్వరీ మహాకాళీ మహాగ్రాసా మహాశనా,
అపర్ణా చండికా చండాముండాసుర నిషూదినీ. 145

క్షరాక్షరాత్మికా సర్వలోకేశీ విశ్వధారిణీ,
త్రివర్గదాత్రీ సుభగా త్ర్యంబకా త్రిగుణాత్మికా. 146

స్వర్గాపవర్గదా శుద్ధా జపాపుష్ప నిభాకృతిః,
ఓజోవతీ ద్యుతిధరా యజ్ఞరూపా ప్రియవ్రతా. 147

దురారాధ్యా దురాధర్షా పాటలీ కుసుమప్రియా,
మహతీ మేరునిలయా మందార కుసుమప్రియా. 148

వీరారాధ్యా విరాడ్రూపా విరజా విశ్వతోముఖీ,
ప్రత్యగ్రూపా పరాకాశా ప్రాణదా ప్రాణరూపిణీ. 149

మార్తాండభైరవారాధ్యా మంత్రిణీ న్యస్తరాజ్యధూః,
త్రిపురేశీ జయత్సేనా నిస్త్రైగుణ్యా పరాపరా. **150**

సత్యజ్ఞానానందరూపా సామరస్య పరాయణా,
కపర్దినీ కళామాలా కామధు క్కామరూపిణీ. **151**

కళానిధిః కావ్యకళా రసజ్ఞా రససేవధిః,
పుష్టాపురాతనా పూజ్యా పుష్కరా పుష్కరేక్షణా. **152**

పరంజ్యోతిః పరంధామ పరమాణుః పరాత్పరా,
పాశహస్తా పాశహంత్రీ పరమంత్ర విభేదినీ. **153**

మూర్తాఽ మూర్తానిత్యతృప్తా మునిమానస హంసికా,
సత్యవ్రతా సత్యరూపా సర్వాంతర్యామినీ సతీ. **154**

బ్రహ్మాణీ బ్రహ్మజననీ బహురూపా బుధార్చితా,
ప్రసవిత్రీ ప్రచండాఽ జ్ఞా ప్రతిష్ఠా ప్రకటాకృతిః. **155**

ప్రాణేశ్వరీ ప్రాణదాత్రీ పంచాశత్పీఠరూపిణీ,
విశృంఖలా వివిక్తస్థా వీరమాతా వియత్ప్రసూః. **156**

ముకుందా ముక్తినిలయా మూలవిగ్రహరూపిణీ,
భావజ్ఞా భవరోగఘ్నీ భవచక్ర ప్రవర్తినీ. **157**

ఛందస్సారా శాస్త్రసారా మంత్రసారా తలోదరీ,
ఉదారకీర్తి రుద్దామవైభవా వర్ణరూపిణీ. **158**

జన్మమృత్యు జరాతప్త జనవిశ్రాంతి దాయినీ,
సర్వోపనిషదుద్ఘుష్టా శాంత్యతీత కళాత్మికా. **159**

గంభీరా గగనాంతస్థా గర్వితా గానలోలుపా,
కల్పనారహితా కాష్ఠాఽ కాంతా కాంతార్ధవిగ్రహా. **160**

కార్యకారణ నిర్ముక్తా కామకేళితరంగితా,
కనత్కనక తాటంకా లీలావిగ్రహ ధారిణీ. **161**

అజాక్షయవినిర్ముక్తా ముగ్ధాక్షిప్ర ప్రసాదినీ,
అంతర్ముఖ సమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా. **162**

త్రయీ త్రివర్గనిలయా త్రిస్థా త్రిపురమాలినీ,
నిరామయా నిరాలంబా స్వాత్మారామా సుధాసృతిః. 163

సంసారపంక నిర్మగ్న సముద్ధరణ పండితా,
యజ్ఞప్రియా యజ్ఞకర్త్రీ యజమాన స్వరూపిణీ. 164

ధర్మాధారా ధనాధ్యక్షా ధన ధాన్య వివర్ధినీ,
విప్రప్రియా విప్రరూపా విశ్వభ్రమణ కారిణీ. 165

విశ్వగ్రాసా విద్రుమాభా వైష్ణవీ విష్ణురూపిణీ,
అయోని ర్యోనినిలయా కూటస్థా కులరూపిణీ. 166

వీరగోష్ఠీప్రియా వీరా నైష్కర్మ్యా నాదరూపిణీ,
విజ్ఞానకలనా కల్యా విదగ్ధా బైందవాసనా. 167

తత్త్వాధికా తత్వమయీ తత్త్వ మర్థస్వరూపిణీ,
సామగానప్రియా సౌమ్యా సదాశివకుటుంబినీ. 168

సవ్యాపసవ్యమార్గస్థా సర్వాపద్వినివారిణీ,
స్వస్థా స్వభావమధురా ధీరా ధీరసమర్చితా. 169

చైతన్యార్ఘ్య సమారాధ్యా చైతన్యకుసుమప్రియా,
సదోదితా సదాతుష్టా తరుణాదిత్య పాటలా. 170

దక్షిణాదక్షిణారాధ్యా దరస్మేరముఖాంబుజా,
కౌళినీ కేవలాఽ నర్ఘ్య కైవల్యపదదాయినీ. 171

స్తోత్రప్రియా స్తుతిమతీ శృతిసంస్తుత వైభవా,
మనస్వినీ మానవతీ మహేశీ మంగళాకృతిః. 172

విశ్వమాతా జగద్ధాత్రీ విశాలాక్షీ విరాగిణీ,
ప్రగల్భా పరమోదారా పరామోదా మనోమయీ. 173

వ్యోమకేశీ విమానస్థా వజ్రిణీ వామకేశ్వరీ,
పంచయజ్ఞప్రియా పంచప్రేత మంచాధిశాయినీ. 174

పంచమీ పంచభూతేశీ పంచసంఖ్యోపచారిణీ,
శాశ్వతీ శాశ్వతైశ్వర్యా శర్మదా శంభుమోహినీ. 175

ధరా ధరసుతా ధన్యా ధర్మిణీ ధర్మవర్ధినీ,
లోకాతీతా గుణాతీతా సర్వాతీతా శమాత్మికా. 176

బంధూకకుసుమప్రఖ్యా బాలా లీలావినోదినీ,
సుమంగలీ సుఖకరీ సువేషాఢ్యా సువాసినీ. 177

సువాసిన్యర్చనప్రీతా శోభనా శుద్ధమానసా,
బిందుతర్పణ సంతుష్టా పూర్వజా త్రిపురాంబికా. 178

దశముద్రాసమారాధ్యా త్రిపురా శ్రీవశంకరీ,
జ్ఞానముద్రా జ్ఞానగమ్యా జ్ఞాన జ్ఞేయ స్వరూపిణీ. 179

యోనిముద్రా త్రిఖండేశీ త్రిగుణాంబా త్రికోణగా,
అనఘాఽద్భుత చారిత్రా వాంఛితార్థ ప్రదాయినీ. 180

అభ్యాసాతిశయజ్ఞాతా షడధ్వాతీత రూపిణీ,
అవ్యాజ కరుణామూర్తి రజ్ఞానధ్వాంత దీపికా. 181

ఆబాల గోపవిదితా సర్వానుల్లంఘ్యశాసనా,
శ్రీ చక్రరాజనిలయా శ్రీమత్త్రిపురసుందరీ. 182

శ్రీ శివా శివశక్త్యైక్య రూపిణీ లలితాంబికా,
ఏవం శ్రీ లలితా దేవ్యా నామ్నాం సాహస్రకం జగుః. 183

*ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే. ఉత్తరఖండే. శ్రీహయగ్రీవా గస్త్య సంవాదే శ్రీ లలితారహస్యనామ సాహస్రస్తోత్ర కథనం నామ ద్వితియోధ్యాయః.*



# ౨. శ్రీవిద్య

నమస్కారం గురుదేవా ! రెండు గొంతులు ఒక్కసారిగా పలికేటప్పటికి ఉలిక్కిపడి తలెత్తి చూశాడు రత్నాకరుడు. ఎదురుగా చేతులు జోడించి నుంచుని ఉన్నారు అతని శిష్యులు కృష్ణశర్మ, నారాయణభట్టు.

చాలాకాలానికి వచ్చిన శిష్యులను చూసి ఆనందభరితుడైనాడు రత్నాకరుడు. కుశలప్రశ్నల అనంతరం అడిగాడు 'ఏంపని మీద వచ్చారు?' అని

"గురువర్యా! ఇప్పటిదాకా మీవద్ద ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, కామకలా విలాసము, సుభగోదయస్తుతి, యోగినీ హృదయం, త్రిపురారహస్యం, దేవీభాగవతము వంటి అనేక గ్రంథాలను చెప్పుకున్నాం. కాని ఇప్పుడు లలితా రహస్య నామాలకు ఆసాంతం భాష్యం చెప్పుకుందామని వచ్చాం. కాబట్టి కాదనక మమ్ములను కృతార్థులను చెయ్యండి" అన్నారు శిష్యులు.

ఆ మాటలు విన్న రత్నాకరుడు పరమానందం చెందినవాడై ఇవాల్టికి సెలవు తీసుకుని రేపు రండి. అన్నాడు. అనుకున్న ప్రకారం మరునాడు సాయంసమయాన వచ్చిన శిష్యులు, గురువుగారికి సాష్టాంగప్రణామాలర్పించి ఆయన అనుమతితో సుఖాసీనులైనారు. రత్నాకరుడు అమితానందంతో తన శిష్యులకు లలితారహస్యనామ భాష్యం చెప్పటం ప్రారంభించాడు. ఈ లలితా రహస్య నామాలే ప్రస్తుతం బహుళ ప్రచారంలో ఉన్న లలితా సహస్ర నామాలు.

**సకుంకుమవిలేపనా విలేపనా మళిక చుంబి కస్తూరికాం**
**సమందహసితేక్షణాం సశర చాపపాశాంకుశాం**
**అశేషజనమోహినీం అరుణమాల్య భూషాంబరాం**
**జపాకుసుమభాసురాం జపనిధౌ స్మరేదంబికాం ॥**

నుదుటన కస్తూరి తిలకము ధరించినది, చిరునగవు చిందించునది, పాశము, అంకుశము, ధనుర్బాణములు చేతులయందు ధరించినది, లోకాలన్నింటినీ మోహింపచేయునది, ఎర్రనివస్త్రములు ధరించినది, మంకెన్నపువ్వువలె పాటలవర్ణము గలది అయిన పరమేశ్వరిని ధ్యానించుచున్నాను.

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయినవాడు పరబ్రహ్మ. అతని ప్రతిరూపమే పరమేశ్వరి. సృష్టి ప్రారంభంకాకముందు పరమేశ్వరుడు బిందురూపంలో ఉండేవాడు.

తనలో లీనమై ఉన్న జీవులయొక్క కర్మను క్షయంచేసి వారికి మోక్షం కలిగించాలనే కోరికతో 'సృష్టిచెయ్యాలి' అని సంకల్పించాడు. అప్పుడు తన నుండి కొంతభాగాన్ని బయటకు పంపాడు. అదే శక్తి. త్రికోణరూపిణి. ఇప్పుడు

**త్రికోణరూపిణీ, శక్తిః. బిందురూపపర శ్శివః** త్రికోణమే శక్తి. కాగా బిందువు శివుడు. వీరిద్దరూ వేరువేరుగా ఉండరు. కలిసే ఉంటారు. శివుడు లేకుండా శక్తిగాని, శక్తి లేకుండా శివుడుగాని ఉండరు. **త్రికోణే బైందవంశ్లిష్టం.** త్రికోణంలో బిందువుంటుంది. ఈ త్రికోణం నుంచే నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది.

'త్రికోణం' అంటే యోని. అదే జన్మస్థానం. స్థావర జంగమాత్మకమైన జగత్తు అంతా ఈ త్రికోణం నుంచే వచ్చింది. ఆ త్రికోణమే పరమేశ్వరి రూపం. ఆ పరమేశ్వరియే లలితాత్రిపురసుందరి, రాజరాజేశ్వరి, కామేశ్వరి అని పిలువబడుతుంది. ఆవిడే పరాశక్తి. అమ్మలగన్నయమ్మ. జగన్మాత. శ్రీమాత. ఆమెను గురించి చెప్పే విషయమే శ్రీవిద్య.

మంత్రశాస్త్రంలో స్త్రీ దేవతలను గురించి చెప్పే మంత్రాలను 'విద్య' అంటారు. ఇదంతా పరమేశ్వరిని గురించి చెప్పే విద్య కాబట్టి దీన్ని శ్రీవిద్య అంటారు. ఈ విషయమంతా గతంలో మీకు కామకలావిలాసము, సుభగోదయస్తుతి, యోగినీహృదయము మొదలైన గ్రంథాలలో వివరించాను. ఆ పరదేవతను గురించి చెప్పే మంత్ర, యంత్ర, తంత్రశాస్త్రాన్నే శ్రీవిద్య అంటారు. గతంలో పైన చెప్పిన గ్రంథాలలో చక్రసంకేతము, మంత్రసంకేతము, పూజాసంకేతము అని ఆ మూడు విషయాలను వివరించటం జరిగింది. అదంతా శ్రీవిద్యయే. అయితే అంతటితో శ్రీవిద్య పూర్తికాలేదు. శ్రీవిద్యకు సారథి వంటిది 'లలితా సహస్రం'. ఇందులో యంత్ర, మంత్ర, తంత్రాలే కాకుండా ఇంకా అనేక విషయాలు చెప్పబడ్డాయి.

లోకంలో భోగాలు అనుభవించాలి అనుకునే వారికి మోక్షం రాదు. అలాగే మోక్షం పొందాలి అనుకునేవారు భోగాలను వదలివేయాలి.

**యత్రాపి భోగో న చ తత్ర మోక్షః యత్రాపి మోక్షో న చ తత్ర భోగః ।**
**శ్రీ సుందరీసేవనతత్పరాణాం భోగ శ్చ మోక్ష శ్చ కరస్థఏవ ॥**

కాని ఆ పరమేశ్వరిని అర్చించేవారికి ఇహము, పరము రెండూ లభిస్తాయి. అందుచేత ఆ పరమేశ్వరి అర్చన ఉత్తమమైనది.

లలితాసహస్రంలో కొన్నికొన్నినామాలను కలిపి ఒక గుంపుగా చెప్పటం జరిగింది. దీనిలో ఒక ప్రత్యేకమైన ఒక విషయాన్ని వివరించారు. ఈ రకంగా వేయినామాలలోను

అనేక విషయాలను వివరించారు. ఉదాహరణకు మొదటి ఐదునామాలలో పరమేశ్వరి ప్రాదుర్భావాన్ని వివరించారు. ఆ తరువాత ఆమె స్వరూపం. ఒకచోట ఆమె సూక్ష్మరూపాన్ని వర్ణించారు. అదే పంచదశి మహామంత్రం. ఇంకొకచోట శ్రీచక్రాన్ని వివరించారు. వేరొకచోట అర్చనా విధానం, ఆచారాలను చెప్పారు. చతుషష్ఠిపూజను వివరించారు. షట్చక్రాలను వివరించారు. అవస్థాపంచకము, చంద్రవిద్య, భానువిద్య, భువనేశ్వరీ విద్య, కాత్యాయనీవిద్య, వాగ్వాదినీవిద్య, శివదూతీవిద్య, గాయత్రీమంత్రం, ఆత్మవిద్య. ఈ రకంగా అనేకానేకమైన విషయాలను లలితాసహస్రంలో వివరించారు. ఒక్క లలితాసహస్రాన్ని గనక క్షుణ్ణంగా చదివినట్లైతే శ్రీవిద్య ఆసాంతం తెలుస్తుంది. అందుకే లలితాసహస్రము శ్రీవిద్యకు సారథి వంటిది.

లలితాసహస్రానికి భాష్యం వ్రాసిన మహానుభావుడు 'భాసురానంద' దీక్షానామం గల భాస్కరాచార్యులవారు. ఆ తరువాత ఎవరు వ్రాసినప్పటికీ వారందరికీ మాతృక భాసురానందుడి సౌభాగ్యభాస్కరమే అని మరచిపోకూడదు.

శంకరభగవత్పాదుల తరువాత మంత్రశాస్త్రంలో అందులోనూ శ్రీవిద్యలో నిష్ణాతులైనవారు ఇద్దరు.

1. లొల్లా లక్ష్మీధరుడు. ఇతడు సౌందర్యలహరికి వ్యాఖ్యవ్రాశాడు. కృష్ణాతీరవాసి, హరితసగోత్రీకుడు వెలనాటి బ్రాహ్మణుడు.

2. భాస్కరాచార్యుడు. విశ్వామిత్ర గోత్రీకుడు. తెలగాణ్యబ్రాహ్మణుడు. ఇతని వంశంవారు భారతుల ఇంటిపేరుతో ఇవాళ్టికి కూడా విజయవాడప్రాంతంలో ఉన్నారు.

**ఆదినాథ సమారంభాం శంకరాచార్యమధ్యమాం**
**అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్ ।**

ముందుగా నా గురు పరంపర విరజానంద, సదానంద, సుఖానందనాథులకు నమస్కరించి,

ధర్మసంస్థాపన కోసం ఏర్పాటయిన శృంగేరి, పూరి, బదరి, ద్వారక, కంచి పీఠాధిపతులకు ప్రణమిల్లి, పుష్పగిరి, కుర్తాళం, పీఠాధిపతులకు వందనాలర్పించి, గన్నవరం భువనేశ్వరీ పీఠాధిపతులకు, గుంటూరు శృంగేరీ శ్రీవిరూపాక్ష పీఠాధిపతులకు నమస్కరించి, అవధూత శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానందస్వామి వారికి ప్రణామాలర్పించి, పెదపులిపాక లలితాపీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ వాసుదేవానందగిరి స్వామివారికి, మాతాశివచైతన్యవారికి,

చంద్రకాళీమాతాజీకి నమోవాకములర్పించి భాస్కరాచార్యులవారి భాష్యాన్ని ప్రాతిపదికగా తీసుకుని, దానికి దేవీభాగవతము, సౌందర్యలహరి, సుభగోదయస్తుతి, యోగినీ హృదయము, ఉపనిషత్తులు, కామకలావిలాసము మొదలైన గ్రంథాలను కూడా జోడించి, లలితాసహస్రనామాలలో ఉన్న విషయం సామాన్యులకు కూడా అతి తేలికగా, విపులంగా తెలియాలి అనే ఉద్దేశ్యంతో, అతి సులభశైలిలో హరితస గోత్రీకుడనైన **క్రోవి పార్థసారథి** అను నేను **శ్రీవిద్యా సారథి** అను పేర లలితాసహస్రానికి భాష్యం వ్రాస్తున్నాను. పండితులు, పరమేశ్వరీభక్తులు, శ్రీవిద్యోపాసకులు అందరూ నా యీ ప్రయత్నాన్ని మన్నించి నన్ను ఆశీర్వదింతురుగాక.




శ్రీ చతుష్షష్ఠి యోగినిదేవి

# 3. భాస్కరాచార్యులు

లలితాసహస్రానికి అనేకమంది వ్యాఖ్యలు వ్రాశారు. వాటన్నింటిలోకి మొట్టమొదటిది, మూలమైనది భాస్కరరాయలవారు వ్రాసిన "సౌభాగ్య భాస్కరము". తరువాత వచ్చిన వ్యాఖ్యలన్నింటికీ ఇదే మాతృక అని చెప్పటంలో అతిశయోక్తి లేదు. వీరు క్రీస్తుశకం17, 18 శతాబ్దాల మధ్య జీవించారు.

కర్ణాటక రాష్ట్రంలోని బీజపూరు నందు బీజపూరు నవాబుకు విశ్వామిత్ర గోత్రీకుడైన గంభీరరాయ దీక్షితులు మంత్రిగా ఉండేవాడు. గంభీరరాయలు మహాపండితుడు. సోమయాజి, బహు గ్రంథకర్త, రాజనీతిజ్ఞుడు. మహాభారతాన్ని పార్సీభాషలోకి అనువదించి "భారతి" అని బిరుదు పొందాడు. ఈయన భార్య కోనమాంబ. రాచకార్యము మీద ఈయన హైదరాబాదు నగరానికి వచ్చినప్పుడు అక్కడ ఈ పుణ్యదంపతులకు భాస్కరరాయలు జన్మించాడు. బాలభాస్కరుడు దినదిన ప్రవర్ధమానుడై నారాయణపేట దగ్గరగల 'లోకాపల్లి' అనే గ్రామంలో సాక్షాత్తూ సరస్వతీస్వరూపమైన నృశింహయాజి దగ్గర సమస్త విద్యలు అభ్యసించి, ఆ తరువాత సూరత్ నగరవాసి అయిన "ప్రకాశానంద నాథ" అనే దీక్షానామంగల శివదత్తశుక్ల దగ్గర ఉపదేశం పొందాడు. గురువు యొక్క అనుగ్రహంతో పరదేవతా సాక్షాత్కారం పొందిన భాస్కరాచార్యుడు దేశాటన చెయ్యటం ప్రారంభించాడు.

ఆ రోజుల్లో మహారాష్ట్ర దేశానికి సేనాధిపతి అయిన 'చంద్రసేన జాదవు' భాస్కరాచార్యుని శిష్యుడైనాడు. చంద్రసేనుడికి సంతానం లేదు. అందుచేత అతడు భార్యతో సహా గురువుగారైన భాస్కరాచార్యుని దగ్గరకువెళ్ళి, సంతానాన్ని ప్రసాదించమని వేడుకున్నాడు. కరుణామయుడైన భాస్కరాచార్యుడు చంద్రసేనుడికి పుత్రసంతానం కలుగుతుంది అని దీవించాడు. కాలక్రమంలో చంద్రసేనుడి భార్య గర్భవతి అయింది.

ఆ రోజులలో నారాయణదేవుడు అనేవాడు భాస్కరునికి శిష్యుడుగా ఉండేవాడు. అతడు పండితుడు, సద్గుణసంపన్నుడు. అన్నిటికీ మించి గురువుగారి మీద అచంచలమైన భక్తిప్రపత్తులు కలవాడు. నారాయణదేవుని యొక్క దీక్షకు మెచ్చి భాస్కరాచార్యుడు అతడికి వాగ్దేవీ మంత్రాన్ని ఉపదేశించాడు. గురుకటాక్షవీక్షణాల వల్ల మంత్రసిద్ధి జరిగి నారాయణదేవుడికి వాక్సిద్ధి లభించింది. ఈ రకంగా వాక్సిద్ధిని పొందిన నారాయణదేవుడు కూడా దేశాటన చేస్తూ మహారాష్ట్ర ప్రాంతంలో చంద్రసేనుడున్న నగరానికి వచ్చాడు. అతడి గొప్పతనాన్ని విన్నటువంటివాడై చంద్రసేనుడు అతని వద్దకు వెళ్ళి, తన భార్య

గర్భవతి అని చెప్పి, తనకు ఏ సంతానం కలుగుతుంది ? అని అడిగాడు. దానికి నారాయణదేవుడు స్త్రీ సంతానము కలుగుతుంది అని చెప్పాడు. ఆ మాటలు వినగానే చంద్రసేనుడు "అయ్యో ! అదెలా జరుగుతుంది ? మా గురువుగారు భాస్కరాచార్యుల వారు పుత్ర సంతానం కలుగుతుందని చెప్పారు కదా !" అన్నాడు. ఆ మాటలు వినగానే నారాయణదేవుడు ఎక్కడో పొరపాటు జరిగిపోయిందని గ్రహించి "ఓ మూర్ఖుడా ? భాస్కరాచార్యుల వారే నాకు కూడా గురువుగారు. వారి దయవల్లనే నాకు వాక్సిద్ధి లభించింది. అటువంటి నాతో వేరేరకంగా చెప్పించావు. కాబట్టి నీకు ఆడామగా కాని శిశువు జన్మిస్తుంది." అని శాపం పెట్టాడు. చంద్రసేనుడు తను చేసిన పనికి విచారించసాగాడు. కొంతకాలానికి చంద్రసేనుని భార్య ప్రసవించింది. నారాయణదేవుడు చెప్పినట్లే నపుంసకుడు జన్మించినాడు. ఈ పరిణామానికి చంద్రసేనుడు విపరీతంగా దుఃఖించసాగాడు. కొంతకాలానికి భాస్కరరాయలవారు 'భలాకి' అనే నగరానికి వచ్చినట్లుగా తెలిసి, కుమారుణ్ణి వెంటపెట్టుకుని అక్కడకు వెళ్ళి గురువుగారి పాదాలనాశ్రయించి, నపుంసకుడైన తన కుమారుని పురుషుడుగా చెయ్యమని కోరాడు. కరుణాంతరంగుడైన భాస్కరాచార్యుడు రామచంద్ర జాదవుడనే పేరు గల ఆ బాలుణ్ణి వెంటపెట్టుకుని కృష్ణాతీర మందలి "మలీమడుగు" అనే పుణ్యక్షేత్రానికి పోయి కృష్ణలో తృచార్ఘ్యదానానుష్ఠానము మొదలుపెట్టాడు.

మలీమడుగు నుంచి కృష్ణానది కొంచెం దూరంగా ఉన్నది. ప్రతిరోజూ ఆచార్యుడు నదీ తీరానికి కాలినడకన ఏగి అనుష్టానం పూర్తి చేసుకుని వస్తుండేవాడు. ఇలా చెయ్యటం వల్ల అతడి కాళ్ళు బొబ్బలెక్కి పుండ్లు పడిపోసాగాయి. అది చూసిన శిష్యులు "గురుదేవా! మన నివాసం నదీతీరానికి మారుద్దాం !" అన్నారు. ఆ మాటలు విన్న భాస్కరుడు "కృష్ణానదినే మన దగ్గరకు రప్పిద్దాం" అన్నాడు. దానికోసం మరునాటి నుండి సూర్యోపాసన ప్రారంభించాడు. సూర్యభగవానుడు ప్రత్యక్షమై భాస్కరాచార్యుని కోరిక తెలుసుకుని, "బ్రహ్మ యొక్క సృష్టిని ఎదిరించటం కూడని పని. రామచంద్రుడికి పుంసత్వాన్ని నేను ప్రసాదిస్తాను. ఆ పని మానుకో" అన్నాడు. ఆ మాటలు విన్న భాస్కరాచార్యుడు కుపితుడై, "రామచంద్రుణ్ణి పురుషునిగా చెయ్యగల సామర్థ్యం నాకున్నది. నేనడిగినట్లుగా నువ్వు కృష్ణానదిని మళ్ళించు లేకపోతే సూర్యోపాసన ప్రయోజనం లేనిది అని ప్రచారం చేస్తాను" అన్నాడు. ఆ మాటలు విన్న సూర్యభగవానుడు భాస్కరుని కోరిక మన్నించి, నదీ ప్రవాహాన్ని మలీమడుగుకు మళ్ళించాడు. ఆ సందర్భంలోనే భాస్కరాచార్యుడు "తృచభాస్కరము" అనే గ్రంథాన్ని రచించాడు. తరువాత భాస్కరుని ఉపాసనతో రామచంద్రుని నపుంసకత్వం

కూడా పోయింది. దీనికి ఆనందించిన రామచంద్రుని తండ్రి చంద్రసేనుడు మలీమడుగు గ్రామాన్ని భాస్కరునకివ్వగా, భాస్కరాచార్యుడు ఆ గ్రామాన్ని బ్రాహ్మణులకు దానమిచ్చాడు. ఆ గ్రామంలో చింత చెట్లు ఎక్కువగా ఉండేవి. అందుచేత చింతకాయలను ఎవరూ అమ్మరాదు. ఎవరికి కావలసినవి వారు కోసుకుని వాడుకోండి. ఒకవేళ ఎవరైనా వాటిని అమ్మాలని చూస్తే, వాటిలో పురుగులు వస్తాయి. అని ఆంక్ష పెట్టాడు భాస్కరుడు.

భాస్కరాచార్యుడు శంకరాచార్యుని పరంపరగా అద్వైతమతాన్నే ప్రచారం చేశాడు. ఆ రోజులలో సత్యబోధస్వామి మధ్వమతాధిపతిగా ఉండేవాడు. భాస్కరాచార్యుడు దేశాటనచేస్తూ సత్యబోధస్వామిని వాదనలో జయించాడు. ఈ సత్యబోధుని సోదరుని కుమార్తె పార్వతి. శాస్త్రప్రకారము ముద్రాంకితురాలు. మధ్వ సంప్రదాయంలో శంఖు చక్ర ముద్రలు వేయించుకున్న వారే సంప్రదాయులు. అటువంటి ఆమెకు ప్రాయశ్చిత్తం చేయించి స్మార్తవిధిని ఆమెను వివాహం చేసుకున్నాడు. ఈ రకంగా మధ్వుల కుమార్తెను వివాహమాడాడు కాబట్టి మధ్వులు భాస్కరుడికి వ్యతిరేకులైనారు.

ఆ రకంగా దేశాటనచేస్తూ క్రీ॥శ॥ 1750 ప్రాంతంలో కాశీక్షేత్రానికి వచ్చి 'సౌభాగ్యభాస్కరము' అనే పేరుతో లలితా సహస్రానికి భాష్యం వ్రాశాడు. ఆ రోజులలో కాశీక్షేత్రంలో ఉన్న పండితులకందరికీ ఈ విషయం బాధాకరంగా తయారయి వారంతా ఒకచోట చేరి భాస్కరాచార్యుణ్ణి పరీక్షించాలి అనుకున్నారు. అప్పటి పండితులలో కుంకుమానందస్వామి చాలా ప్రసిద్ధుడు. అందుచేత కాశీలోని పండితులందరూ ఆతని అనుజ్ఞ తీసుకుని భాస్కరుని దగ్గరకు వచ్చి "అయ్యా ! మీరు పరదేవతాకటాక్షంతో లలితా సహస్రానికి భాష్యం వ్రాశారు అని చెబుతున్నారు. అలాగయినప్పుడు ఆ దేవి **'మహాచతుషష్టి కోటియోగినీ గణసేవితా'** అని చెప్పబడిందికదా. ఆ నామంలో ఉన్న యోగినీ దేవతల పేర్లు, రూపాలు, వారి చరిత్రలు వివరించండి" అన్నారు. వారి మాటలు విన్న భాస్కరుడు "అయ్యా మీరందరూ మీమీ పనులు పూర్తిచేసుకుని సాయంకాలం గంగానదీ తీరానికి రండి. నేను కూడా అక్కడికి వస్తాను. ఆ ప్రదేశంలోనే మీ సంశయం కూడా తీరుస్తాను" అన్నాడు. సరే అన్నారు. పండితులు సాయంకాలం నిర్ణీతసమయానికి ముందుగానే వచ్చారు. పండిత లోకమంతా గంగాతీరాన చేరింది. అప్పుడు వారిలోనుంచి ఒక పండితుడు లేచి, 'ఆర్యా ! చతుషష్టి కోటియోగినీ దేవతల రూపాలను వివరించండి' అన్నాడు. అప్పుడు భాస్కరులవారు, పండితులందరినీ సావధానులు కమ్మని చెప్పి యోగినీ చరిత్ర వివరించటం ప్రారంభించారు. అప్పుడు అనేక గొంతులతో, అనేక స్వరాలతో యోగినుల చరిత్ర ఒక్కసారిగా వినిపించసాగింది. అది విన్న పండితలోకం

ఆశ్చర్యబోయింది. ఒకే మనిషి ఒక్కసారిగా అన్ని గొంతులతో ఎలా మాట్లాడగలడో అర్థం కాలేదు వారికి. ఏమీ మాట్లాడలేక అక్కడ నుంచి కుంకుమానందస్వామి దగ్గరకు వెళ్ళి, జరిగినదంతా చెప్పి అదెలా సంభవమో చెప్పమని ప్రాధేయపడ్డారు. ఆ మాటలు విన్న కుంకుమానందస్వామి చిరునవ్వుతో తన కమండలంలోని నీళ్ళతో పండితులకళ్ళు తుడిచి ఇప్పుడు చూడండి అన్నాడు. గంగానదిలో ఆకాశభాగంలో యోగినీదేవతలు వారివారి వాహనాలు ఎక్కి, వారి చరిత్రలు వారే చెబుతున్నారు. ఆ సమయంలో భాస్కరాచార్యుని కుడిబుజం మీద లలితాదేవి, ఎడమభుజం మీద శ్యామలాదేవి కూర్చుని ఉన్నారు. ఆ దృశ్యం చూసిన పండితులనోట మాటరాలేదు. భాస్కరాచార్యుని శక్తి గమనించిన వారందరూ వెంటనే అతని పాదాలు పట్టుకుని క్షమించమని వేడుకున్నారు. అంతేకాకుండా భాస్కరాచార్యులు పరదేవతా స్వరూపులని, సౌభాగ్య భాస్కరము అత్యంత ప్రమాణగ్రంథమని విశ్వసించారు.

క్రీస్తు శకము 1700–1768 మధ్యకాలంలో భాస్కరాచార్యులవారు సౌభాగ్య భాస్కరము, సేతుబంధము, చండాభాస్కరము, తృచభాస్కరము, వరివస్యా రహస్యము మొదలైన 43 గ్రంథాలను రచించారు. భాస్కరరాయలవారి గురించి అతని శిష్యుడు జగన్నాధుడు 'భాస్కరవిలాస కావ్యము' అనే గ్రంథాన్ని కూడా వ్రాశాడు.

భాస్కరాచార్యుడు వేదవిదుడు. సకలశాస్త్రాలు క్షుణ్ణంగా చదివినవాడు. శ్రీవిద్యా సంప్రదాయంలో పూర్ణదీక్షాపరుడు. దక్షిణాచార సంపన్నుడు. గ్రంథాలను వ్రాసేటప్పుడు వాటిలో ఉన్న రహస్యాలను వివరించాలి కాబట్టి వామాచార పద్ధతులను కూడా వివరించారు. దీనిని బట్టి వారు అన్ని ఆచారాలను, సంప్రదాయాలను పూర్తిగా తెలిసినవారు అని తెలుస్తుంది. ఆయన మాత్రం స్వయంగా దక్షిణాచార సంపన్నుడు. మహామంత్రవేత్త.

భాస్కరరాయలవారి తండ్రిగారైన గంభీరరాయలవారు మహాభారతాన్ని పార్శీభాషలోకి అనువదించారు అనీ, ఆ సందర్భంగా వారికి 'భారతి' అని బిరుదు ప్రదానం చెయ్యటం జరిగింది అని ముందే చెప్పాము. కొన్నిచోట్ల ఈ బిరుదులు కాలక్రమేణా ఇంటిపేర్లుగా మారిపోతుంటాయి. మన ప్రాంతంలో 'శ్రీమాన్' అనే బిరుదు ఈ రకంగా మారినదే. అదేవిధంగా 'భారతి' అనే బిరుదు కూడా 'భారతుల' అయి ఇంటిపేరయింది. ఈ రోజున భారతుల అనే ఇంటిపేరుగల వారు కృష్ణానదీప్రాంతంలో ఉన్నారు. వీరు వైదిక బ్రాహ్మణులు. తెలగాణ్యులు. ఇన్ని గ్రంథాలు వ్రాసిన పరదేవతాస్వరూపమైన భాస్కరాచార్యుడు కృష్ణాతీరవాసి, వైదికబ్రాహ్మణుడు. విశ్వామిత్రగోత్రీకుడు, ప్రత్యేకించి ఆంధ్రుడు కావటం మన పూర్వజన్మల పుణ్యఫలం.

# 4. హయగ్రీవుడు - అగస్త్యుడు

**జ్ఞానానందమయం దేవం నిర్మలం స్ఫటికాకృతిం ।**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥**

పూర్వకాలంలో ఒకసారి విష్ణుమూర్తి రాక్షసులతో కొన్నివేల సంవత్సరాలు యుద్ధం చేసి అలసిపోయి ఏకాంత ప్రదేశానికి వెళ్ళి ఎక్కుపెట్టి ఉన్న ధనస్సును తన తల దగ్గర పెట్టుకుని గాఢంగా నిద్రపోయాడు. ఆ సమయంలో దేవతలు ఒక యజ్ఞం చెయ్యాలి అని సంకల్పించి దానికి శ్రీమహావిష్ణువును ఆహ్వానించటానికి వైకుంఠం వెళ్ళారు. విష్ణుమూర్తి అక్కడ లేడు. దాంతో యోగశక్తితో విష్ణువు ఎక్కడున్నదీ తెలుసుకుని అతడున్న ప్రదేశానికి చేరారు దేవతలు. విష్ణువు గాఢనిద్రలో ఉన్నాడు. మరి లేపటం ఎలా? ఏం చెయ్యాలి? అని ఆలోచిస్తుండగా శివుడు బ్రహ్మను చూసి "సృష్టికర్తా ! ఒక చిన్న పురుగును సృష్టించి వదిలిపెట్టు. అది వెళ్ళి వింటిని కొరుకుతుంది. దానివల్ల వింటినారి తెగిపోయి శబ్దమవుతుంది. ఆ శబ్దానికి విష్ణువు నిద్రలేస్తాడు" అన్నాడు. ఆ మాటలు విన్న బ్రహ్మ సరేనని ఒక చెదపురుగును సృష్టించి విష్ణువును నిద్రలేపమన్నాడు. అప్పుడు ఆ చెదపురుగు "స్వామీ ! తల్లీపిల్లలను విడదియ్యటం, భార్యాభర్తలను విడదియ్యటం, నిద్రించేవాళ్ళని లేపటం మహాపాపము అని నీకు మాత్రం తెలియదా? మరి ఆ పాపపు పని నన్ను ఎలా చెయ్యమంటావు?" అన్నది. దానికి బ్రహ్మ "నీకు పాపం రాకుండా వరమిస్తున్నాను. ఇది లోకకల్యాణం కోసం చేసే పని. అందుచేత నీ ఉపకారానికి ప్రతిఫలంగా యజ్ఞాలలో అగ్నికి ఆహుతి కాకుండా మిగిలిన పదార్థాన్ని నువ్వు తీసుకునేందుకు అనుమతిస్తున్నాను" అన్నాడు. అప్పుడు ఆ పురుగు మహా సంతోషంగా వెళ్ళి వింటినారిని కొరికివేసింది. వింటినారి ఎప్పుడైతే తెగిందో, అప్పుడు భీకరమైన శబ్దం వచ్చింది. వంగి ఉన్న ధనుస్సు బద్ద ఒక్కసారిగా నిటారుగా అయింది. ఆ బద్ద తగిలి విష్ణువు శిరస్సు కాస్తా ఎగిరి అవతలపడింది. దేవతలు అనుకున్నది ఒకటి, జరిగినది ఇంకొకటి అయింది. సంతోషానికి బదులు దేవతలకు భరించలేని దుఃఖం, బాధ ఎదురయినాయి. "దేవతలకు ఏ కష్టం వచ్చినా రక్షించేవాడు విష్ణుమూర్తి. అలాంటి విష్ణుమూర్తికే ఇవాళ కష్టం వచ్చింది. దీన్ని తీర్చేది ఎవరు ? ఇప్పుడు ఈ ఆపదసమయంలో రక్షించేవారెవరు?" అని విచారించసాగారు దేవతలు. ఆ సమయంలో దేవరాజయిన ఇంద్రుడు బృహస్పతి దగ్గరకు పోయి ఏం చెయ్యమంటారు? అని సలహా అడిగాడు. పరమేశ్వరిని ప్రార్థించమన్నాడు బృహస్పతి. దేవతలందరూ ముక్తకంఠంతో, అత్యంత భక్తిశ్రద్ధలతో ఆ పరమేశ్వరిని ప్రార్థించసాగారు.

దేవతల ప్రార్థనను మన్నించి ఆ పరమేశ్వరి ప్రత్యక్షమై "దేవతలారా! మీ భక్తి ప్రపత్తులకు చాలా సంతోషించాను. విష్ణుమూర్తి యొక్క తల ఈ రకంగా తెగిపోవటానికి కారణం లక్ష్మీదేవి శాపం. పూర్వం ఒకనాడు శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవితో కలసి విహరిస్తూ ఆమె ముఖం చూసి నవ్వాడు. భర్త తన ముఖం చూసి ఎందుకు నవ్వాడో తెలియలేదు లక్ష్మీదేవికి. ఆయన తనను హేళన చేస్తున్నాడా? లేక ఎవరినైనా సవతిని తెస్తున్నాడా? అని అనుమానం వచ్చింది. వెంటనే విష్ణుమూర్తి తల తెగిపడుగాక అని శాపం పెట్టింది. ఆ శాపవశాన ఇప్పుడు అతని తల తెగిపడింది. అదీగాక

ఒకప్పుడు హయగ్రీవుడు అనే రాక్షసుడు సరస్వతీనదీ తీరాన నన్ను గురించి కొన్నివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. వాడి తపస్సుకు మెచ్చి ఏదైనా వరం కోరుకోమన్నాను. ఎవరివల్ల చావులేకుండా వరం కావాలి అన్నాడు రాక్షసుడు. పుట్టిన ప్రతిప్రాణి మరణించక తప్పదు. అలాగే మరణించిన ప్రతిప్రాణి మళ్ళీ పుట్టకా తప్పదు. అందుచేత ఇంకేదయినా వరం కోరుకోమన్నాను. అప్పుడు వాడు తనవంటి ఆకారంగల హయగ్రీవుడితో తప్ప, ఇంకెవరివల్లా మృత్యువు రాకూడదు. అని వరమడిగాడు. నేను సరే అన్నాను. ఆ రాక్షసుడు వరగర్వంతో లోకాలన్నింటినీ బాధిస్తున్నాడు. వాణ్ణి సంహరించటానికి ఇప్పుడు విష్ణువు హయగ్రీవుడు కావాలి. కాబట్టి ఒక గుఱ్రపుతల తెచ్చి ఇతడి శరీరానికి అతికించండి. హయగ్రీవుడై రాక్షస సంహారం చేస్తాడు. లోకాలకు పట్టిన పీడ వదిలిస్తాడు" అని చెప్పి అదృశ్యురాలైంది పరమేశ్వరి.

ఆ మాటలు విన్న దేవతలు గుఱ్రపు తలను తెచ్చి విష్ణువుకు అతికించారు. విష్ణువు నిద్రనుంచి లేచినట్లుగా లేచాడు. దేవతల యజ్ఞం పూర్తయింది. పరమేశ్వరి అనుజ్ఞమేరకు శ్రీమహావిష్ణువు రాక్షస సంహారం చేసి, ఆ తరువాత శ్రీవిద్యను ఉపాసన చేసి ధన్యుడైనాడు.

హయగ్రీవుని రూపంలో విష్ణువు ఉపాసించిన మంత్రం ....

**అస్యశ్రీ విష్ణువిద్యాంబా మహామంత్రస్య దక్షిణామూర్తి ఋషిః పంక్తిశ్ఛందః । శ్రీవిష్ణువిద్యాంబా దేవతా ॥ హసకలహ్రీం బీజం । హసకహలహ్రీం శక్తిః । సకలహ్రీం కీలకం । జపే వినియోగః ॥**

**న్యాసము** : **హసకలహ్రీం । సఏఈలహ్రీం ।**
**హసకహలహ్రీం । సహహలహ్రీం ।**
**సకలహ్రీం । సకలహ్రీం ॥**

**ధ్యానం : సకుంకుమ విలేపనా.......................**

**మంత్రము : హసకలహ్రీం । హసకహలహ్రీం । సకలహ్రీం । సఏఈలహ్రీం । సహహలహ్రీం । సకలహ్రీం ॥**

పూర్వకాలంలో ఒకసారి సూర్యుడు, వరుణుడు వస్తూ త్రోవలో ఊర్వశిని చూశారు. ఆమె అందానికి వారి మనస్సు చలించింది. వెంటనే రేతః పతనమయింది. ఊర్వశి వారి రేతస్సు తీసి మట్టికుండలలో భద్రపరచింది. వాటినుంచి అగస్త్యుడు, వసిష్ఠుడు ఉద్భవించారు.

అగస్త్యుడు చాలాకాలం బ్రహ్మచారిగానే ఉన్నాడు. ఆ రోజులలో అడవులలో తిరుగుతూ చెట్లకు తలక్రిందులుగా వ్రేలాడుతున్న వారిని చూసి “అయ్యా మీరెవరు? ఇలా ఎందుకు వ్రేలాడుతున్నారు?” అని అడిగాడు. అందుకు వారు “మా వంశంలో పుట్టిన వాడొకడు వివాహం చేసుకోలేదు. అందుచేత వాడికి సంతానం లేదు. ఆ కారణాన మాకు ముందుగతులు లేక ఈ రకంగా ఉన్నాము” అని విలపించారు. వారి బాధను చూసిన అగస్త్యుడు జాలిపడి “అతడెవరో నాకు చెప్పండి. నేను అతణ్ణి ఒప్పించి వివాహం చేసుకునేటట్లు చేస్తాను.” అన్నాడు. ఆ మాటలు విన్న పిత్రుదేవతలు “అతడెవరో కాదయ్యా! నువ్వే. మేమంతా నీ పిత్రుదేవతలము. నువ్వు వివాహం చేసుకుని మాకు ఉత్తమ గతులు కలిగించు” అన్నారు తన పిత్రుపితామహుల స్థితిని ప్రత్యక్షంగా చూసిన అగస్త్యుడు వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నవాడై తన తపశ్శక్తితో విదర్భరాజుకు ‘లోపాముద్ర’ అను కూతురు పుట్టేటట్లు చేశాడు. ఆ బాలిక దినదిన ప్రవర్ధమానమై యుక్తవయస్సుకు చేరింది. అప్పుడు అగస్త్యుడు ఆ రాజు దగ్గరకు వెళ్ళి అతని కుమార్తెనిచ్చి తనకు వివాహం చెయ్యమని అడిగాడు. అడవులలో ఉంటూ, నారచీరెలు ధరించి, కందమూలాలు తినే తాపసికి తనకుమార్తె నివ్వనన్నాడు రాజు. అప్పుడు లోపాముద్ర వచ్చి తాను అగస్త్య మహర్షిని వివాహం చేసుకుంటాను అని చెప్పింది. దాంతో చేసేది ఏమీలేక విదర్భరాజు తన కుమార్తెను అగస్త్యుడికిచ్చి వివాహం చేశాడు. ఈ విధంగా అగస్త్యుడు, లోపాముద్ర భార్యాభర్తలైనారు.

అగస్త్యమహర్షి చాలా శక్తి సంపన్నుడు. ఆ రోజులలో వాతాపి, ఇల్వలుడు అని ఇద్దరు రాక్షసులుండేవారు. వాళ్ళు పరమ దుర్మార్గులు. అడవిలో బ్రాహ్మణ వేషంలో కాపుకాచి త్రోవనపోయే మునీశ్వరులకు నమస్కరించి వారిని భోజనం చేసి విశ్రాంతి

తీసుకుని తమ ఆశ్రమం పావనం చేసి వెళ్ళండి అని బ్రతిమిలాడేవారు. వారి మాటలు నమ్మిన మునులు ఆశ్రమానికి వచ్చేవారు. ఇల్వలుడు తన తమ్ముడైన వాతాపిని మేకపిల్లగా మార్చి, దానిని సంహరించి రుచికరంగా మునీశ్వరులకు వడ్డించేవాడు. అతిథులు తృప్తిగా భోజనం చేసిన తరువాత ఇల్వలుడు "ఒరే వాతాపీ! ఎక్కడున్నావురా? వెంటనే రారా!" అంటూ పిలిచేవాడు వాతాపి మునీశ్వరుల పొట్టలు చీల్చుకుని బయటకు వచ్చేవాడు. అప్పుడు ఆ అన్నదమ్ములిద్దరూ మునీశ్వరులను తనివితీరా పీక్కు తినేవారు. ఈ రకంగా జరుగుతుండటంతో తాపసులు ఆ మార్గంగుండా వెళ్ళటానికే భయపడిపోయారు.

ఒకరోజున తాపసుల కోరికమీద అగస్త్య మహర్షి ఆ త్రోవన వచ్చాడు. అందరినీ ఆహ్వానించినట్లే అగస్త్యుణ్ణికూడా శిష్యసమేతంగా ఆహ్వానించారు రక్కసులు. అలవాటు ప్రకారం వాతాపిని మేకగా మార్చి కూర వండిపెట్టాడు ఇల్వలుడు. సుష్టుగా భోజనం చేసిన అగస్త్య మహర్షి పొట్టమీద ఎడమచేత్తో రాచుకుంటూ "జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం" అన్నాడు. కొంతసేపటికి ఇల్వలుడు వాతాపిని పిలిచాడు. వాడు రాలేదు. ఇంకోసారి పిలిచాడు. రాలేదు. ఈసారి గట్టిగా "వాతాపీ ఎక్కడున్నా సరే ! వెంటనే రారా!" అంటూ అరిచాడు. అప్పుడు అగస్త్య మహర్షి నవ్వుతూ "వాతాపి ఇంకరాడయ్యా ! నా పొట్టలో జీర్ణమైపోయాడు" అన్నాడు. తన తమ్ముడైన వాతాపి మరణించాడని తెలుసుకున్న ఇల్వలుడు చేసేదేమీ లేక అగస్త్య మహర్షి కాళ్ళమీద పడి క్షమించమని వేడుకున్నాడు. ఇకనుంచి తాపసులను సంహరించను అని ఒప్పందం చేసుకుని, మహర్షికి ధనరాసులు ఇచ్చి సాగనంపాడు.

పర్వతాలలో విశిష్టమైనది వింధ్యపర్వతం. దాన్నిండా పెద్ద పెద్ద చెరియలు, లోయలు, ఫలవృక్షాలు, జలపాతాలు, అడవులు ఎన్నో ఉన్నాయి. దేవతలు ఈ ప్రాంతంలో విహరిస్తూ ఉంటారు. ఇక్కడున్న పుణ్యనదీ జలాల్లో స్నానం చేస్తుంటారు.

ఒకనాడు నారదుడు వింధ్యపర్వతం దగ్గరకు వచ్చి ఆ పర్వతరాజుతో "వింధ్యరాజా! మేరుపర్వతం భోగభాగ్యాలతో తులతూగుతున్నది. దానిమీద దేవతలు, వాళ్ళలోకాలు, అందమైన ఇళ్ళు వీటన్నింటితోనూ ఆ పర్వతం ఎంతో వైభవంగా ఉంది. శంకరుడు నివశిస్తుండటంవల్ల హిమాలయానికి గొప్పదనం వచ్చింది. అలాగే నీలాచలము, గరుడాచలము ఒకటేమిటి? అన్నింటికీ ఏదో ఒక ప్రత్యేకత ఉన్నది. కాని ఇక్కడ ప్రత్యేకమైన విషయం ఏమిటంటే మేరుపర్వతం ముందు ఇవేవీ సాటిరావు" అన్నాడు.

ఆలోచించాడు వింధ్యరాజు. తాను అసాధారణ బలసంపన్నుడు అని అంటారు అందరూ. కాని ఏం లాభం? ఏదో ఒకటి చెయ్యాలి. అనుకుని తెల్లవారేటప్పటికి శిఖరాలు పెంచేశాడు. బారలు చాపాడు. అంతే అనూహ్యంగా పెరిగిపోయింది కొండ.

మర్నాడు ఉదయం సూర్యోదయం అయింది. అనూరుడు గుర్రాలు తోలుతున్నాడు. సూర్యుని రథం పరుగు పెడుతున్నది. వింధ్యపర్వతం దగ్గరకు వచ్చేసరికి, ఆ శిఖరం తగిలి రథం ఆగిపోయింది. ఆ ఊపుకు రథంలో ఉన్న సూర్యుడు ముందుకు పడబోయి, జండా కర్రపట్టుకుని ఆగాడు. చుట్టూ చూశాడు. శత్రువులు ఎవరూ లేరు. మరి రథం ఎందుకాగిపోయింది? అదేమాట అనూరుణ్ణి అడిగాడు భాస్కరుడు. విషయం చెప్పాడు సారథి. గ్రహణ సమయంలో కొన్ని గంటలు మాత్రమే చలనం లేకుండా ఉండే సూర్యుడు, ఇప్పుడు వింధ్యపర్వతం పెరగటంవల్ల చాలాకాలం అచేతనుడైపోయాడు. పగలు రాత్రి భేదం లేకుండాపోయింది. లోకాలన్నీ చీకట్లో మునిగిపోయినాయి. లోకంలో యజ్ఞయాగాదులు, సంధ్యావందనాది విధులు ఆగిపోయినాయి. కొందరికి కేవలం పగలే. కొందరికి పూర్తిగా రాత్రి. సూర్యగమనం ఆగిపోయింది.

పరిస్థితిని చూసిన ఇంద్రాదిదేవతలు బ్రహ్మదగ్గరకు వెళ్ళారు. తనకేమీ తెలియదు. విష్ణువు దగ్గరకు పోండి అన్నాడు బ్రహ్మ. దేవతలందరూ విష్ణువు దగ్గరకు వెళ్ళారు. ఆ కాలంలో అగస్త్యుడు కాశీక్షేత్రంలో ఉన్నాడు. దేవతలంతా వెళ్ళి ఆ మహర్షిని ఆశ్రయించండి. లోకగతి మార్చగలిగిన మహానుభావుడు అతడే అన్నాడు విష్ణువు.

దేవతలందరూ అగస్త్యుడి దగ్గరకు వచ్చారు. వారందరినీ సాదరంగా ఆహ్వానించాడు మహర్షి. విషయం పూర్తిగా వివరించి సూర్యగమనాన్ని సజావుగా కొనసాగేటట్లు చూడమని వేడుకున్నారు దేవతలు. వారికి అభయమిచ్చి పంపేశాడు మహర్షి.

మర్నాడు అగస్త్యుడు భార్యతో "మన కాశీనగర నివాసానికి ఆటంకం ఏర్పడింది. నేను దేవతలకు మాటిచ్చాను అని చెప్పి ఆఖరిసారిగా గంగాస్నానం చేసి, విశ్వేశ్వర దర్శనం చేసుకుని భార్యా సమేతుడై వింధ్య పర్వతానికి బయలుదేరాడు.

అగస్త్యుణ్ణి చూడగానే వింధ్యపర్వతరాజు మహర్షికి ఎదురేగి సాదరంగా ఆహ్వానించి "స్వామీ ఈ సేవకుడివల్ల మీకేం కావాలి?" అన్నాడు.

దానికి మహర్షి "నాయనా! నేను దక్షిణదేశ యాత్రలు చెయ్యటానికి వెడుతున్నాను. ఎత్తైన ఈ కొండమీదనుంచి నడిచి వెళ్ళలేను కదా? అందుకని నేను వచ్చేదాకా కొంచెం ఒంగి ఉండు" అన్నాడు.

అగస్త్యుడి మాట మన్నించి పర్వతరాజు మొదట ఉన్న దానికన్న కూడా బాగా వంగి మహర్షి వెళ్ళటానికి వీలు కల్పించాడు. వింధ్యపర్వతం దాటిన అగస్త్యుడు దక్షిణాపథాన మలయపర్వతం మీద స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నాడు. ఇంక తిరిగి రాలేదు. కాని ఇచ్చిన మాట ప్రకారం అలా వంగేఉన్నాడు పర్వతరాజు.

మరీచియొక్క భార్య కాలక. వీరికుమారులే కాలకేయులు. రాక్షస ప్రవృత్తిగలవారు ఈ రాక్షసులు రాత్రిపూట బ్రాహ్మణులను చంపి తినేవారు. పగటిపూట ఎవరికీ కనపడకుండా సముద్రగర్భంలో దాగిఉండేవారు. వీరి బాధలు భరించలేక దేవతలంతా విష్ణువును శరణుజొచ్చారు. శ్రీమహావిష్ణువు తీవ్రంగా ఆలోచించి "ఈ రాక్షసులు సాగర గర్భంలో దాక్కుంటున్నారు. కాబట్టి సముద్రజలమున్నంత వరకు వీరిని ఏమీ చెయ్యలేము. అందుచేత సముద్రంలో ఉన్న జలాన్నంతటినీ పానం చెయ్యగలవాడు కావాలి. దానికి సమర్థుడు అగస్త్యుడు ఒక్కడే. కాబట్టి మీరంతా వెళ్ళి అగస్త్యుణ్ణి శరణువేడండి" అన్నాడు.

దేవతలంతా అగస్త్యుడి దగ్గరకు వెళ్ళి విషయమంతా వివరించి తమను రక్షించమని వేడుకున్నారు. దేవతలమాటలను మన్నించిన అగస్త్యుడు సముద్రాన్నంతా ఒక్కసారిగా ఆపోసన పట్టేశాడు. సముద్రంలో దాక్కున్న కాలకేయులు బయటపడ్డారు. వెంటనే వాళ్ళని సంహరించేశారు దేవతలు.

ఆ తరువాత సముద్రంలో ఉండే జీవరాశి నశిస్తుంది కాబట్టి మళ్ళీ సముద్రాన్ని నింపమని వేడుకున్నారు దేవతలు. మూత్రద్వారం ద్వారా సముద్రాన్ని పూరించాడు అగస్త్యుడు.

వృత్తాసుర సంహారం చేసిన తరువాత ఇంద్రుడికి బ్రహ్మహత్యా పాతకంచుట్టుకుంది. దాంతో ఇంద్రుడి తేజస్సు హరించిపోయింది. తేజస్సు లేని ఇంద్రుడు సింహాసనానికి అనర్హుడైనాడు. ఆ పాపం నివృత్తి కావటానికి ఇంద్రునితో అశ్వమేధం చేయించటం మొదలుపెట్టాడు బృహస్పతి.

ఈ లోపుగా దేవేంద్రుని సింహాసనం ఖాళీగా ఉండరాదు కాబట్టి భూలోకంలో నహుషుడు అనే చక్రవర్తిని తెచ్చి ఇంద్రపదవిని అలంకరింపచేశారు దేవతలు.

నహుషుడు వేదవేదాంగవిదుడు నూరు అశ్వమేధాలు చేసినవాడు. ధర్మవేత్త. అంతటివాడికి కూడా ఇంద్రపదవి వచ్చేసరికి మనసు చలించింది. కాలమంతా అప్సరాంగనలతోనే గడుపుతున్నాడు. ఒకరోజున అతడికి చిన్న ఆలోచన వచ్చింది. తాను

ఇంద్రుడు కదా! ఇంద్రుని భార్య అయిన శచీదేవి ఇప్పుడు తన దగ్గరే ఉండాలి కదా? ఈ ఆలోచన బలపడింది. శచీదేవికి కబురుచేశాడు. ఆమె తిరస్కరించింది. బలాత్కారం చేస్తానన్నాడు నహుషుడు. బృహస్పతి సలహామేరకు సప్తఋషులు మోసే పల్లకి ఎక్కి తన నివాసానికి రమ్మంది శచీదేవి. అలాగే బయలుదేరాడు నహుషుడు. ఋషులందరిలోకి అగస్త్యుడు పొట్టివాడు. ఎత్తుపల్లాలుగా ఉన్న నేల అగస్త్యుని భుజంమీద పల్లకి సరిగా ఆనలేదు. దాంతో ముందుకు తూలిపడ్డాడు నహుషుడు.

అసలే విరహవేదనతో బాధపడుతున్న నహుషుడు ఈ కుదుపులు భరించలేక "సర్పసర్ప" అంటే త్వరగా నడు అంటూ అగస్త్యుణ్ణి తన ఎడమకాలితో ఒక్క తన్ను తన్నాడు. వెంటనే మహర్షి కోపించినవాడై "సర్పోభవ" సర్పము కావలసినది అని నహుషుడికి శాపం పెట్టాడు. దీంతో దేవతలకు నహుషుడి బాధలు తప్పినాయి.

శ్రీవిద్యలో శ్రేష్ఠులైనవారు పన్నెండు మంది

**మను శ్చంద్రకుబేరశ్చ లోపాముద్రా చ మన్మథః**
**అగస్తిరగ్ని స్సూర్య శ్చ ఇంద్ర స్కంద శ్శివస్తథా**
**క్రోధభట్టారకో దేవ్యా ద్వాదశాదో ఉపాసకాః**

| | | | |
|---|---|---|---|
| 1. మనువు | 4. లోపాముద్ర | 7. అగ్ని | 10. కుమారస్వామి |
| 2. చంద్రుడు | 5. మన్మథుడు | 8. సూర్యుడు | 11. శివుడు |
| 3. కుబేరుడు | 6. అగస్త్యుడు | 9. ఇంద్రుడు | 12. దుర్వాసుడు |

పంచదశి మహామంత్రాన్ని ఉపాసించి తరించిన వారిలో అగస్త్యుడు ఒకడు. అతడు ఉపాసించిన మంత్రం .....

**అస్యశ్రీ అగస్త్యవిద్యాంబా మహామంత్రస్య దక్షిణామూర్తి ఋషిః। అనుష్టుప్ఛందః శ్రీఅగస్త్యవిద్యాంబా దేవతా। హనక ఏ ఈలహ్రీం బీజం। హసకహలహ్రీం శక్తిః । సహసకలహ్రీం కీలకం ॥ జపే వినియోగః ।**

**న్యాసము** : **కూటత్రయముతో రెండు ఆ వృత్తులు న్యాసము చెప్పాలి.**

**ధ్యానము** : **సకుంకుమ విలేపనా.........................**

**మంత్రము** : **హసక ఏ ఈ ల హ్రీం । హసకహలహ్రీం । సహసకలహ్రీం ॥**

అటువంటి అగస్త్యమహర్షి హయగ్రీవుడి దగ్గరకు వెళ్ళి శ్రీవిద్యను చెప్పమని ప్రార్థించాడు. అతని ప్రార్థనను మన్నించినవాడై హయగ్రీవుడు అతడి కోరిక తీర్చాడు. అయినప్పటికీ ఇంకా ఏదో మిగిలిపోయింది అనిపించింది అగస్త్యమహర్షికి. అందుచేత

**అశ్వానన! మహాబుద్ధే! సర్వశాస్త్రవిశారద ।**
**కథితం లలితాదేవ్యా శ్చరితం పరమాద్భుతం**

సర్వశాస్త్రవిశారదుడైన ఓ హయగ్రీవా ! పరమేశ్వరి యొక్క పరమాద్భుతమైన చరిత్రను ఇంతవరకు చెప్పావు. పరమేశ్వరి ఆవిర్భావము, పట్టాభిషేకము, భండాసురవధ, శ్రీచక్రము, పంచదశి మహామంత్రము, అంతర్యాగము, పూజాఖండము, పురశ్చరణవిధి, లలితాహోమము అన్నీ వివరించావు. కాని రహస్యనామాలను మాత్రం నాకు చెప్పలేదు.

వాటిని చెప్పుకునే అర్హత నాకు లేదా ? నేను యోగ్యుడనుకానా ? మరి వాటిని మీరెందుకు చెప్పలేదు ? అని ప్రశ్నించాడు. ఆ మాటలు విన్న హయగ్రీవుడు. నాయనా అగస్త్యా, అవి సహస్రనామాలు కాదు. రహస్యనామాలు. గురువు వాటిని అర్హుడైన శిష్యుడికి మాత్రమే చెప్పాలి. దుర్మార్గుడు, విశ్వాసం లేని వాడికి ఈ నామాలు చెప్పరాదు. ఇవి పరమపవిత్రమైనవి. సాధకుడికి సిద్ధినిస్తాయి. మహర్షీ తంత్రాలలో అనేకచోట్ల సహస్రనామాలు చెప్పబడ్డాయి. కాని రహస్యనామాలు వాటన్నింటికన్న ఉత్తమోత్తమమైనివి.

| | | |
|---|---|---|
| పురములలో | – | శ్రీపురము శ్రేష్ఠము |
| శ్రీవిద్యోపాసకులలో | – | పరమశివుడు శ్రేష్ఠుడు |
| సహస్రనామాలలో | – | రహస్యనామాలు శ్రేష్ఠము. |

రహస్యనామాలు పారాయణచేస్తే పరమేశ్వరి ప్రీతి చెందుతుంది. శ్రీచక్రంలో ఆ పరమేశ్వరిని బిల్వపత్రాలతోగాని, పద్మములతోగాని, తులసిపత్రాలతోగాని రహస్య నామాలతో అర్చించినవాడి సకల అభీష్టాలు నెరవేరతాయి. శ్రీచక్రాన్ని అర్చించి, పంచదశి మంత్ర జపం చేస్తే ఆ పరమేశ్వరి కరుణించి ప్రత్యక్షమవుతుంది. ప్రతిరోజూ జపంచేసి ఈ రహస్యనామాలను పఠించాలి. రహస్యనామాలను వశిన్యాదివాగ్దేవతలు చెప్పారు.

ఒకరోజు పరమేశ్వరి వాగ్దేవతలను పిలిచి శ్రీవిద్య గురించి పూర్తిగా తెలిసేటట్లు రహస్యనామాలను వివరించండి అన్నది. వాగ్దేవతలు ఆమె ఆజ్ఞను శిరసావహించారు.

ఒకసారి పరమేశ్వరి సభకు దేవతలు, గంధర్వులు, యక్షులు, మానవులు అందరూ వచ్చారు. దివ్యౌఘ, సిద్ధౌఘ, మానవౌఘములన్నీ హాజరయినాయి. అంతా కూర్చున్న

తరువాత పరమేశ్వరి రహస్యనామాలను వశిన్యాది వాగ్దేవతలు పారాయణ చేశారు. ఆ రహస్యనామాలను విని అక్కడ ఉన్న వారంతా అమితాశ్చర్యము, ఆనందము కూడా పొందారు. అప్పుడు పరమేశ్వరి. సభాసదులతో "సభాసదులారా లోకంలో ప్రతి ఒక్కరూ రహస్యనామ పారాయణ చేసేటట్టు చూడండి. దీని పారాయణవల్ల నేను అమితంగా ఆనందిస్తాను. నా ప్రీతి కోసం రహస్యనామ పారాయణ అవసరం.

నన్ను అర్చించకపోయినా ఇబ్బందిలేదు. కాని రహస్యనామ పారాయణ మాత్రం చేసి తీరాలి. మంత్రానుష్ఠానం చెయ్యకపోయినా ఫరవాలేదు. నామ పారాయణ మాత్రం తప్పనిసరి అని చెప్పింది. దాంతో బ్రహ్మాదిదేవతలు పరమేశ్వరి నామాలను పారాయణచేసి ఫలితం పొందారయ్యా. కాబట్టి ఓ మహర్షీ రహస్యనామాలు అత్యంత ప్రీతికరము, శుభకరము. రహస్యాతి రహస్యము. అందుచేతనే వాటిని ఇంతవరకు నీకు చెప్పలేదు. కాని నీవు అర్హుడివి అని గ్రహించాను. ఆ పరమేశ్వరి ఆజ్ఞ అయింది. అందుకే ఇప్పుడు ఈ నామాలను నేను నీకు చెబుతున్నాను. జాగ్రత్తగా వినవలసినది." అంటూ సహస్ర నామాలను చెప్పటం ప్రారంభించాడు హయగ్రీవుడు.




శ్రీ అకార దేవత

# 5. పరమేశ్వరి వైభవము

నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. ఆది మధ్యాంతములు లేనివాడు. సృష్టి ప్రారంభం కాకముందు జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యం మొత్తాన్ని ఆవరించి ఉన్నాడు పరమేశ్వరుడు ప్రళయకాలంలో జగత్తులోని జీవులన్నింటినీ లయంచేసి, కర్మ క్షయమైన వారికి మోక్షం కల్పించి, కర్మక్షయం కాని వారిని వారివారి కర్మలతో సహా తనలో లీనంచేసుకున్నాడు. ఈ రకంగా ప్రళయం సంభవించిన కొంతకాలానికి మళ్ళీ సృష్టి చెయ్యాలని సంకల్పించాడు.

ఇప్పుడు చిన్న సందేహం వస్తుంది. ప్రళయం జరిగిన తరువాత మళ్ళీ ఎంతకాలానికి సృష్టి మొదలవుతుంది ? గతంలో జరిగిన కల్పంలో, జీవులు చేసిన కర్మలు పరిపక్వం చెందేవరకూ మళ్ళీ సృష్టి జరగదు. ఇక్కడ పరిపక్వం చెందటం అంటే – కర్మ చెయ్యగానే దానియొక్క ఫలితం రాదు. ఆ ఫలితం రావటానికి కొంతకాలం పడుతుంది. గతంలో చేసిన కర్మల ఫలితాలను అనుభవించాడు. మిగిలిన కర్మల ఫలితాలు అనుభవించటానికి కర్మ పరిపక్వం కావాలి. ఏదైనా పదార్థం తినగానే కడుపు నొప్పిరాదు. కొంతకాలం పడుతుంది. ఇదే కర్మపరిపక్వతకు పట్టేకాలం. ఈ రకంగా జీవుల కర్మ పరిపక్వం చెందగానే మళ్ళీ సృష్టి ఆరంభమవుతుంది. సృష్టి స్థితి లయాలకు కారణం పరమేశ్వరుడు. ప్రళయకాలంలో కర్మ పరిపక్వత చెందని జీవరాసిని తన ఉదరమందు దాచుకుంటాడు. వారి కర్మ పరిపక్వం కాగానే దాని ఫలితం అనుభవించేందుకు జీవికి పునర్జన్మనిస్తాడు. కర్మ క్షయం అయిపోయిన వాళ్ళకి ముక్తిని ప్రసాదిస్తాడు. ఈ రకంగా సృష్టి జరుగుతుంది.

పరమేశ్వరుడు అత్యంత శక్తిమంతుడు. అతనితో సమానమైన వారుగాని, అతని కన్న అధికులు గాని లేరు. అతడు ఏకాకి. సర్వానికి సాక్షి. జీవులు చేసే కర్మలను పంచభూతాలు, సూర్యుడు, యముడు వీరిసాయంతో చూస్తూ ఉంటాడు. వారి కర్మకు తగిన ఫలితాన్ని ఇస్తూ ఉంటాడు.

జగత్తులోని జీవులన్నింటినీ సృష్టిస్తున్నాడు. కాబట్టి అన్నిజీవులకు అతడే తల్లి. లోకాలన్నింటినీ గతి తప్పకుండా పాలిస్తున్నాడు. కాబట్టి అతడే మహారాజు లేక మహారాజ్ఞి. అఖిలాండకోటి బ్రహ్మాండాలను పాలించటానికి సింహాసనం మీద కూర్చున్న చక్రవర్తి. అదే శ్రీమత్సింహాసనము. అతని రాజ్యానికి దిక్కులే ఎల్లలు. సర్వము అతడికిలోబడి

ఉండేవే. అందుచేతనే ఆ సింహాసనాన్ని పంచదిగాసనము, పంచబ్రహ్మాసనము అంటారు. అసలు పరమేశ్వరుడు అంటే తేజోమయమైన కాంతిపుంజము. ఇది పంచభూతాలలో ఉండే కాంతికాదు. జ్ఞానజ్యోతి. భగవంతుడు అంటే జ్ఞానస్వరూపమే. అందుకే పరమేశ్వరి 'చిదగ్నికుండ సంభూతా' అని చెప్పబడింది. కుండలినీ శక్తి గ్రంథిత్రయాన్ని భేదించుకుని సహస్రారం చేరితే అక్కడ కోట్లకొలది సూర్యులకాంతితో, చంద్రుల యొక్క చల్లదనంతో పరమేశ్వర సాక్షాత్కారమవుతుంది. అదే ఆత్మ సాక్షాత్కారం. ఇది కేవలము జ్ఞానికి మాత్రమే జరుగుతుంది. అందరికీ సాధ్యం కాదు. అటువంటి పరమేశ్వరుడు దేవతల యొక్క కార్యాలను పూర్తిచేయటానికి భూలోకంలో ఉద్భవిస్తాడు. ఏమిటా కార్యాలు ? దుష్టశిక్షణ, శిష్టరక్షణ. అందుకే ధర్మం నాశనమైపోయినప్పుడల్లా ఈ లోకంలో ఆవిర్భవిస్తుంటాడు భగవానుడు.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥**

లలితా సహస్రంలోని మొదటి ఐదు నామాలలోను పరమేశ్వరి వైభవము చెప్పబడింది. అంటే దేవిరూప విశేషాన్ని వర్ణిస్తున్నారు.

## 1. శ్రీమాతా

ఈ లోకంలో ఏ ప్రాణి అయినాసరే తనకు ఏదైనా బాధ కలిగినప్పుడు అమ్మా ! అంటుంది. అంటే తన తల్లి వచ్చి ఆ బాధను తీరుస్తుంది అని ఆ ప్రాణి నమ్మకం. **జన్మానాం నరజన్మ దుర్లభం.** జన్మలన్నింటిలోకి దుర్లభమైనది మానవజన్మ. ఎన్నో వేల జన్మలు ఎత్తిన తరువాత పూర్వజన్మలలో చేసిన మంచి ఫలితము ఆధారంగా మానవజన్మ వస్తుంది. అందుకే మానవజన్మ ఉత్తమమైనది. ప్రాణులకన్నింటికీ ఇంద్రియాలుంటాయి. ఆహార నిద్రా మైధునాలు అన్నిటికీ సమానమే. కాని మానవులకు మనస్సు అనబడే పదకొండవ ఇంద్రియము ఒకటి ఉంటుంది. దీనివల్లనే అతడు ఆలోచించగలుగుతాడు. అంటే మానవుడికి యుక్తాయుక్త విచక్షణ ఉంటుంది. పాపపుణ్యాల యోచన ఉంటుంది. ధర్మాధర్మాల వివేచన ఉంటుంది. ఆ ప్రాణి చేసే కర్మలను బట్టి ఎన్నోవేలసార్లు జన్మ ఎత్తవలసి ఉంటుంది. చివరకు పరమాత్మలో నుంచి వచ్చిన ఈ జీవాత్మ మళ్ళీ పరమాత్మను చేరుతుంది. ఈ లోగా కొన్ని లక్షల సార్లు పుట్టటం జరుగుతుంది. ప్రతి జన్మలోనూ ఒక తల్లి ఉంటుంది. లోకంలో పిల్లలు లేని తల్లులుంటారు. కాని తల్లిలేని పిల్లలు మాత్రం

ఉండరు. అందుచేతనే ప్రతివారికి ఒక తల్లి ఉంటుంది. మరి అమ్మ అని పిలిస్తే ఏ తల్లిని పిలిచినట్లు ? పోనీ ఈ జన్మలోని తల్లినే పిలిచాడు అనుకుందాం. ఆమె తన బిడ్డ యొక్క కష్టాలు తీర్చగలుగుతుందా ? తాపత్రయాలు పోగొట్టగలుగుతుందా ?

తాపత్రయాలు మూడురకాలు అవి.

**1. ఆధి భౌతికము :** తనకన్న ఇతరులైన అనగా భార్యాపుత్రులకు సంభవించిన వ్యాధుల వలన, సర్పవృశ్చికాది బాధల వలన పరితపించుట.

**2. ఆధి దైవికము :** ప్రకృతి సిద్ధమైన వాటివలన కలుగుబాధలు. అగ్ని ప్రమాదము, భూకంపము, వరదలు మొదలైన వాటివల్ల కలుగునవి.

**3. ఆధ్యాత్మికము :** తన దేహంలో ఉన్న ఇంద్రియాలకు కలిగిన వ్యాధులచే దుఃఖించుట. అలసత్వము, కపటము, అవిశ్వాసము, శ్రద్ధ మొదలైనవి.

బిడ్డ యొక్క తాపత్రయాలు తీర్చాలి అంటే ఆ తల్లికే సాధ్యమవుతుంది. మరి ఆ తల్లి అంటే ఎవరు ?

**అమ్మల గన్నయమ్మ ముగు రమ్మల మూలపుటమ్మ**

తల్లులకే తల్లియైనటువంటిది. ముగురమ్మలు అంటే త్రిశక్తులు. వారే మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులు. వారిని సృష్టించినటువంటిది. ఆవిడే పరమేశ్వరి. జగన్మాత పరాత్పరి. సృష్టి స్థితి లయకారిణి అయిన ఆ దేవియే అమ్మ. ఆమె కరుణామయి. దయాసముద్రురాలు. అందుకే అమ్మా ! అని ఒకసారి పిలవగానే పరవశించిపోయి కోరిన కోరికలు తీరుస్తుంది. మరి శ్రీ అంటే ఏమిటి ? శ్రీ అనేది గౌరవ వాచకము. విశేషణము. గొప్పదయిన అని అర్థం. **శ్రీయనలక్ష్మి, శ్రీయనగౌరి, శ్రీయనసరస్వతి.** శ్రీ అంటే లక్ష్మి, సరస్వతి, పార్వతి అని అర్థం కాబట్టి ఈ ముగ్గురికీ మూలస్వరూపురాలయినది. ఆమెయే సదాశివుని అర్ధాంగి పరాశక్తి.

దేవీ భాగవతంలో త్రిమూర్తులు ఒక దివ్య విమానం ఎక్కి మణిద్వీపం చేరతారు. అక్కడ పరమేశ్వరి శ్రీచక్రం మీద కూర్చుని దర్శనమిస్తుంది. అప్పుడు బ్రహ్మదేవుడు "తల్లీ నీవే పరమేశ్వరివా ? నీవే పరబ్రహ్మవా ? నీ తత్త్వాన్ని మాకు వివరించవలసింది" అని అడుగుతాడు. అప్పుడు ఆ దేవి చెబుతుంది. "నీటిలోని చల్లదానాన్ని నేనే. అగ్నిలోని వెచ్చదనాన్ని నేనే. సూర్యునిలోని తేజస్సును, చంద్రునిలోని మంచును నేనే. నేను లేని

వస్తువు జగత్తులో ఏదీలేదు. అంతదాకా ఎందుకు ? మీ ముగ్గురూ కూడా నేను లేకుండా ఏ పనీ చెయ్యలేరు. శక్తితో కలిస్తేనే బ్రహ్మ లోకాలను సృష్టిస్తాడు. విష్ణువు లోకాలను రక్షిస్తాడు. రుద్రుడు సంహారం చేస్తాడు. కాబట్టి నేను లేనిది ఏదీలేదు. చరాచర జగత్తంతా నేనే నిండి ఉన్నాను" అని చెబుతుంది. ఆ పరమేశ్వరియే శ్రీ మాత. ఆమె శక్తి స్వరూపిణి. ఆమె లేకుండా ఏ పనీ జరగదు. అందుకే శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలోని మొదటి శ్లోకంలో

**శివ శక్త్యా యుక్తోయది భవతి శక్తః ప్రభవితుం**
**న చే దేవం దేవో న ఖలు కుశలః స్పన్దితు మపి**
**అత స్త్వా మారాధ్యాం హరిహరవిరించాదిభి రపి**
**ప్రణన్తుం స్తోతుంవా కథ మకృతపుణ్యః ప్రభవతి ?**

ఓ భగవతీ ! సర్వమంగళ సహితుడగు శివుడు జగన్నిర్మాణశక్తివైన నీతో కూడిననే ఈ జగత్తును సృష్టించటానికి సమర్థుడౌతాడు. అలాకాకపోతే అతడు కదలటానికి కూడా అశక్తుడు. కాబట్టి హరిహర బ్రహ్మాదులచే పూజించుటకుగాని నీకు నమస్కరించటానికిగాని పూర్వపుణ్యము ఉండాలి కదా ?

అంటే త్రిమూర్తులను సృష్టించినది, వారిచేత పూజించబడేది అయిన ఆ పరదేవతయే శ్రీమాత. ఆవిడే వేదాలను సృష్టించి బ్రహ్మకు సమర్పించింది అని ఉపనిషత్తులలో చెప్పబడింది.

మాతృశబ్దం ఉభయలింగంగా చెప్పబడుతోంది. దేవీభాగవతంలో పరమేశ్వరి తన తత్త్వాన్ని వివరిస్తూ "ఉపాధి భేదంవల్ల రెండు విధాలయినట్లుగా, అద్దంలో కనిపించే ప్రకృతిలాగా క్రియాసమయంలో భిన్నంగా కనిపించినా పరమావస్థ యందు బ్రహ్మపదార్థం ఒక్కటే. దానికి వైవిధ్యం లేదు. సృష్టిసమయంలోగాని, లయసమయంలోగాని నాకు స్త్రీపురుష నపుంసక బేధాలు లేవు." అని చెబుతుంది. అందుచేతనే మాతృశబ్దం ఉభయలింగాత్మకమని చెప్పారు.

శ్రీ అంటే విషము. మాతి అంటే కంఠము నందుంచుకొనినది. గరళమును కంఠమునందుంచుకొన్నవాడు. గరళకంఠుడు అన్నప్పుడు పుంలింగము అవుతుంది. మాతా – తల్లి అనే అర్థంలో స్త్రీలింగమవుతుంది.

ఇక్కడ మాతృశబ్దం చాలా గొప్పది. అందుకే దానికిముందు శ్రీ అనే గౌరవవాచకము ఉంచటం జరిగింది. మాత అనే శబ్దము త్రిపురసుందరినే తెలుపుతుంది. హ స క ల ర డ అనే ఆరు అక్షరాలు బాలామంత్రం త్రిపుటిలో మూడు అచ్చులతో కూడి ఉన్నాయి. ఆ మూడు మాత అని చెప్పబడతాయి. ఇక్కడ

**హ స క ల ర డై ం, హ స క ల ర డీ ం, హ స క ల ర డౌః** లో చివర అచ్చులు ఐ ఈ ఔ బాలామంత్రం **ఐం క్లీం సౌః** ఇందులోని అచ్చులు మాతృకాబోధకాలు అని గుర్తించాలి. ఈ విషయాన్ని కాళిదాసు వ్రాసిన పంచస్తవాలలో ఒకటయిన "లఘుస్తవం"లోని 18వ శ్లోక వివరణలో చెప్పారు. ఆ శ్లోకం.

**మాయా కుండలినీ క్రియా మధుమతీ కాళీ కలామాలినీ**
**మాతంగో విజయా జయా భగవతీ దేవీ శివా శాంభవీ**
**శక్తి శ్శంకరవల్లభా త్రినయనా వాగ్వాదినీ భైరవీ**
**హ్రీంకారీ త్రిపురా పరాపరమయీ మాతా కుమారీ త్యపి॥**

స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తులో సర్వప్రాణులు ఎవరివల్ల జన్మిస్తున్నాయో ఆవిడ మాత

**ఎవ్వనిచే జనించుజగము ? ఎవ్వనిలోపల నుండు లీనమై ?**
**ఎవ్వని యందుడిందు పరమేశ్వరుడెవ్వడు. మూలకారణంబెవ్వ డనాది**
**మధ్యలయుడెవ్వడు సర్వము తానె అయినా వాడెవ్వడు ?**

జగత్తులోని లోకాలన్నీ ఎవరియందు లీనమైఉన్నాయో, ఎవని వల్ల సృష్టి జరుగుతున్నదో, అంటే సృష్టిస్థితి లయాలకు కారణభూతుడెవరో, ఆది మధ్యాంతర హితుడెవరో, సర్వమూ తానే అయిన వాడెవరో అతడే మాత.

సకలసద్గుణ సంపన్నురాలు, పవిత్రమూర్తి అయిన ఆ తల్లి సుఖసంపదలు, భోగభాగ్యాలే కాదు. శ్రీ రూపమయిన అమృతత్వాన్ని కూడా ప్రసాదిస్తుంది.

**యోబ్రహ్మణి విధాతిపూర్వం**

సృష్టికాలంలో బ్రహ్మదేవుడికి త్రయీవిద్యనుపదేశించింది. త్రయీవిద్య అంటే వేదవిద్య. అవి ఋగ్ యజుర్ సామవేదాలు. అంతేకాదు జీవికి ముక్తిని ప్రసాదిస్తుంది. అందుకే శ్రీమాత అని పిలువబడుతోంది.

ఏ విషయాన్ని తెలుసుకోవాలని ఉన్నప్పటికీ జ్ఞాత జ్ఞాతృ జ్ఞేయము అనే మూడు ఉండాలి. అంటే 1. తెలుసుకొనేవాడు. 2. తెలుసుకొను శక్తి 3. తెలుసుకొను విషయము. ఈ మూడింటినీ త్రిపుటి అంటారు. ఈ త్రిపుటికి అధిదేవత, త్రిభుజానికి అధిదేవత, వ్యక్తావ్యక్తస్వరూపిణి అయిన బాలాత్రిపురసుందరి శ్రీ అని చెప్పబడుతోంది. త్రికోణంలోనే బిందు వుంటుంది. ఆ బిందువులో పరమేశ్వరి ఉంటుంది. అందుకే ఆదేవి బిందుమండలవాసిని అని పిలవబడుతోంది. ఆవిడే శ్రీమాత.

పరమేశ్వరి నిరాకార, నిర్గుణస్వరూప. ఆమెకు రూపంలేదు. కాని జగత్తంతా ఆమె స్వరూపమే. ఛాందోగ్యోపనిషత్తులో సత్యకామజాబాలికి ఒక ఆబోతు బ్రహ్మ నాలుగు పాదాలుగా ఉంటుంది. అందులో మొదటి పాదం నేను చెబుతాను. "జగత్తులోని నాలుగుదిక్కులూ ఆ పరబ్రహ్మ స్వరూపమే" అంటుంది.

రెండవపాదాన్ని అగ్నిదేవుడు చెబుతూ" భూమి, ఆకాశము, సముద్రాలు, నదులు, పర్వతాలు అన్ని బ్రహ్మపదార్థంలోని అంతర్భాగాలే" అంటాడు.

మూడవపాదాన్ని ఒక హంస చెబుతూ "అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు అన్నీ పరబ్రహ్మలోని భాగాలే" అంటుంది.

నాల్గవపాదాన్ని ఒక నీటిపక్షి చెబుతూ "ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రవణం బ్రహ్మ, మనస్సు బ్రహ్మ" అంటుంది. అంటే జగత్తంతా పరమేశ్వరస్వరూపమే. అతడికి ఆది మధ్య అంతము అనేవి లేవు.

దేవీ భాగవతంలోని సప్తమస్కంధంలో తారకాసురుని బాధలు పడలేక దేవతలంతా పరమేశ్వరిని ధ్యానిస్తారు. అప్పుడు చైత్రశుద్ధ నవమి, శుక్రవారం  వేదసమ్మతమైన పరంజ్యోతి వారి ఎదుట ప్రత్యక్షమయింది. ఆ రూపం ఎలా ఉందంటే

**కోటిసూర్యప్రతీకాశం చంద్రకోటిసుశీతలమ్ ॥**

**విద్యుత్కోటిసమానాభ మరుణం తత్పరం మహః**
**నైవ చోర్ధ్వం న తిర్య క్చ న మధ్యే పరిజగ్రభత్ ॥**
**ఆద్యంతరహితం తత్తు న హస్తా ద్యంగ సంయుతమ్**
**న చ స్త్రీ రూప మథవా నపుంరూప మథోభయమ్ ॥**

కొన్నివేల కోట్ల సూర్యులయొక్క కాంతులతో, కోట్లకొలది చంద్రుల చల్లదనముతో, కొన్నికోట్ల మెరుపులు ఒక్కసారి వచ్చినట్లుగా ఒక్కసారి తళుక్కున మెరిసింది. అది

అరుణారుణకాంతులు వెదజల్లుతోంది. దానికి పైన, క్రింద, నడుమ, అడ్డము అనేవి ఏవీ లేవు. ఆద్యంతాలు లేవు. కాలు చేతులు లేవు. స్త్రీ పురుష నపుంసక భేదాలు లేవు. అది పరమేశ్వరి స్వరూపం. ఆవిడ శ్రీమాత. అందుకే ఆవిడను చెప్పేటప్పుడు

**అన్నిరూపులు నీ రూపమైనవాడ !**

**ఆది మధ్యాంతములు లేక అలరువాడ !**

అని చెప్పటం జరుగుతుంది. ఆ దేవి ఆత్రత్రాణ పరాయణ. బిడ్డల కోరికలు తీర్చేది. వారిని సన్మార్గంలో నడిపించేది. కాబట్టే ఆవిడ శ్రీమాత అనబడుతోంది. అందుచేతనే దుర్వాసుడు తన "శ్రీదేవీ మహిమ్నః స్తుతి"లో

**శ్రీమాత స్త్రిపురే ! పరాత్పరతరే దేవి ! త్రిలోకీ**

అంటాడు. లోకంలోని ప్రాణులకు మాత అని పిలిపించుకునే అధికారం ఉంది. ఆ పరమేశ్వరి సర్వులకు మాత లోకాలన్నింటికీ మాత. అందుకనే శ్రీమాత అనబడుతోంది. ఈ నామంలో దేవి సృష్టి రూపిణి.

## 2. శ్రీమహారాజ్ఞీ

మానవులలో శ్రేష్టుడు, మానవులను రక్షించేవాడు, భూమిని పాలించేవాడు, నరులకు అధిపతి, రాజు, పృథ్వీపతి. రాజులలో కెల్లా శ్రేష్టుడు మహారాజు. అలాగే లోకాలను పాలించునది మహారాణి. మహారాజ్ఞి, ఇక్కడ మహారాజ్ఞి అనే పదానికి శ్రీ అనే విశేషణం కూడా వాడటం జరిగింది. శ్రీ అంటే – శ్రేష్టమైనది. రాజులలోకి శ్రేష్టమైనవాడు మహారాజు. మహారాజులలోకి శ్రేష్టమైన వాడు లేదా మహారాణులలోకి శ్రేష్టమైనది అంటే అంతకన్న ఎక్కువైన వారుగాని, అధికులుగాని లేనటువంటిది. ఉత్తమమైన పాలకురాలు. పాలకులందరిలోకీ ఉత్తమోత్తమమైనది.

దేవీభాగవతంలో పరమేశ్వరి ఉండే మణిద్వీపాన్ని వివరిస్తూ "చింతామణి గృహంలో వేయిస్తంభాలు కలిగిన మంటపాలు నాలుగు ఉంటాయి.

**సహస్రస్తంభసంయుక్తా శ్చత్వార స్తే ఘమంటపాః ॥**

**శృంగారమంటప శ్చైకో । ముక్తిమంటప ఏవ చ**

**జ్ఞానమంటపసంజ్ఞ స్తు । తృతీయః పరికీర్తితః ॥**

**ఏకాంతమంటప శ్చైవ । చతుర్థః పరికీర్తితః**

1. శృంగారమండపము
2. ముక్తిమండపము
3. జ్ఞానమండపము
4. ఏకాంతమండపము

ఇవన్నీ కూడా పరిమళాలతోను, ధూపాలతోను విరాజిల్లుతుంటాయి.

**శృంగారమంటపే దేవ్యో గాయంతీ వివిధైస్స్వరైః ।**
**సభాసదో దేవవరా మధ్యే శ్రీ జగదంబికా ॥**

శృంగార మంటపంలో దేవతలు మధురస్వరాలతో గానం చేస్తుంటారు. అక్కడ సభాసదులైన దేవతల మధ్యన సింహాసనం మీద ఆ జగదంబ ఉంటుంది.

**ముక్తిమంటప ? మధ్యే తు యోచయత్య నిశం శివా ।**
**జ్ఞానోపదేశం కురుతే తృతీయే నృపమంటపే ॥**
**చతుర్థే మంటపే చైవ జగద్రక్షా వివించనమ్ ।**
**మంత్రిణీసహితా నిత్యం కరోతి జగదంబికా ॥**

ముక్తిమంటపం నుంచి ఆ దేవి జగత్తులోని భక్తులందరికీ ముక్తిని ప్రసాదిస్తుంది. జ్ఞానమంటపంలో భక్తులకు జ్ఞానోపదేశం చేస్తుంది. నాల్గవ మంటపంలో ఆ పరమేశ్వరి తన మంత్రులతో కొలువుదీరి లోకాల యొక్క రక్షణను గూర్చి ఆలోచిస్తుంటుంది.

ఈ రకంగా అన్నిరకాల పనులను చేస్తూ ఎల్లప్పుడూ లోకాలను రక్షించాలి అనే కోరిక గల పాలకురాలు శ్రీ మహారాజ్ఞి అనిగాక ఇంకేమని పిలువబడుతుంది ?

శ్రీ అనే బీజం షోడశీ కళను సూచిస్తుంది.

**కామరాజ ? మంత్రాంతే శ్రీబీజేన సమన్వితా**
**షోడశాక్షరీవి ద్యేయం శ్రీ విద్యేతిప్రకీర్తితా ॥**

పంచదశి మహామంత్రము అంటే పదిహేను అక్షరాలు గలది. ఆ మంత్రాన్ని భూలోకానికి తెచ్చినవాడు మన్మథుడు. అందుచేత అది కామరాజమంత్రము అనబడుతుంది. షోడశి అంటే పదహారు అక్షరాలు గల మంత్రం. ఈ రెండూ కూడా శ్రీవిద్యలోని మంత్రాలే. ఐతే కామరాజమంత్రమయిన పంచదశి మహామంత్రానికి షోడశీకళను సూచించే శ్రీ అనే బీజాన్ని గనక కలిపినట్లైతే అది షోడశి మహామంత్రం అవుతుంది.

శ్రీ మహారాజ్ఞీ అనే పదాన్ని శ్రీం అహారాజ్ఞీ అని గనక విడదీసినట్లైతే, శ్రీం అనేది షోడశీకళ అవుతుంది. ఇక్కడ అకారము ప్రకాశాంశ పరమేశ్వరస్వరూపము. హ కారము విమర్శాంశ పరమేశ్వరి స్వరూపము. కాగా రాజ్ఞీ అనేది మహారాజ్ఞీ మంత్రమైన పంచాక్షరిగా చెప్పబడుతోంది.

**యాని జాతాని జీవంతి.** ప్రభవించిన వానిని పాలించునది. లోకాలు సజావుగా నడవటానికి ఉన్నవి మూడు శక్తులు. లేదా మూడు కార్యాలు. అవే సృష్టి స్థితి లయాలు. వీటిలో రెండవది లోకాలను పాలించేటటువంటి స్థితిశక్తి. సర్వజగాలను పరిపాలిచేటటు వంటి విష్ణుశక్తి. మహాసామ్రాజ్యలక్ష్మి. భువనేశ్వరీ స్వరూపిణి. మహత్తులలో మహత్తు అయిన ఆత్మ స్వయంప్రకాశము గలది. అంటే ఏ విధమైన సాయము లేకుండానే ప్రకాశించేది. తాను ప్రకాశిస్తూ ఇతరులను ప్రకాశింపచేసేది. అంతరంగంలో బుద్ధిని ప్రకాశింపచేసేది. అటువంటి ప్రకాశశక్తియే మహారాజ్ఞి అనబడుతున్నది.

ఈ ప్రపంచంలో నవగ్రహాలు పంచభూతాలు, తన్మాత్రలు, దిక్పాలకులు గతులు తప్పకుండా ఎవరి ధర్మాలు వారు నెరవేరుస్తున్నారు అంటే, ఆ రకంగా వాళ్ళని పాలించటం సామాన్యమైన విషయం కాదు. ఈ బాధ్యతను నిర్వర్తిస్తున్నది కాబట్టే ఆ పరమేశ్వరి శ్రీ మహారాజ్ఞి అనబడుతున్నది. ఉపనిషత్తులలో చెప్పినట్లుగా పరబ్రహ్మ ఉన్నాడు కాబట్టే గాలి సక్రమంగా వీస్తోంది. ఎండలు సరిగా కాస్తున్నాయి. పంచభూతాలు వాటి పనులను సక్రమంగా నిర్వర్తిస్తున్నాయి. దిక్పాలకులు దిక్కులను సరిగా పాలిస్తున్నారు. అటువంటి పరబ్రహ్మ స్వరూపమే ఆ పరమేశ్వరి. కేనోపనిషత్తులో ఈ విధంగా ఉంది.

ఒకసారి దేవదానవ సంగ్రామం మహాభీకరంగా జరిగింది. అందులో దేవతలు విజయం సాధించారు. ఆ విజయం తమవల్లనే సాధించబడింది అని, ఆ విజయానికి కారణం తామేననీ దేవతలలో ప్రతివారూ గర్వంతో విర్రవీగి పోసాగారు. దీనికంతటికీ కారణమైన పరబ్రహ్మను మరిచిపోయారు. విజయోత్సాహంతో దేవతలంతా సభ తీర్చారు. అందులో ఎవరి ప్రతాపాన్ని వాళ్ళు చెప్పుకోవటం మొదలుపెట్టారు. ముందుగా అగ్నిదేవుడు తాను అగ్నిజ్వాలలను ప్రజ్వలింపచేస్తుంటే, రాక్షసులందరూ ఆ అగ్నికీలలలోపడి మలమలమాడి భస్మమైపోయారు. అందుచేతనే రాక్షసుల మీద విజయం సాధించటం తేలిక అయింది అన్నాడు. వాయుదేవుడు లేచి తాను చండప్రచండంగా గాలులు వీస్తుంటే వాటికి తట్టుకోలేక రాక్షసులు ఎండుటాకుల్లాగా ఎగిరిపోయారు. అందుచేతనే విజయం

తేలిక అయింది అన్నాడు. ఈ రకంగా దేవతలంతా తమపరాక్రమాన్ని గురించి వివరిస్తున్నారు.

బ్రహ్మతత్త్వం ఇదంతా గమనిస్తోంది. జ్ఞానులైన దేవతలు కూడా అజ్ఞానంలో పడిపోతున్నారు. వారి అహంకారాన్ని పోగొట్టాలి. అనుకున్నది అనుకున్నదే తడవుగా వారి ఎదురుగా భయంకరమైన యక్షరూపంలో ప్రత్యక్షమైంది. చూశారు దేవతలు. ఆ రూపం ఏమిటో వారికి అర్థంకాలేదు. ఆ రూపాన్ని చూసి భయపడ్డారు. ఏంచెయ్యాలో పాలుపోలేదు వారికి.

భయంకరమైన యుద్ధంలో రాక్షసులను తన అగ్నిజ్వాలలతో కాల్చివేశానని చెప్పినవాడు అగ్నిదేవుడు. అందుకని దేవతలంతా అగ్నిని సమీపించి "ఓ అగ్నిదేవా ! నువ్వు వెళ్ళి ఆ భయంకరమైన తత్త్వం ఏమిటో తెలుసుకుని రా" అన్నారు. సరే అని బయలుదేరాడు అగ్నిదేవుడు. ఆ తత్త్వాన్ని సమీపించాడు. భూతం లాంటి ఆ తత్త్వం అగ్నిదేవుణ్ణి చూసి అడిగింది "ఎవరు నువ్వు ?"

"నేను అగ్నిదేవుడను. లోకంలో అందరూ నన్ను జాతవేదుడు అంటారు" అన్నాడు అగ్ని.

"అయితే నీ శక్తి ఏమిటి ?"

"లోకంలో ఏ వస్తువునైనా సరే క్షణంలో కాల్చి బూడిద చేస్తాను".

"అంత గొప్పవాడివా ? అయితే ఈ గడ్డిపోచను దగ్ధం చెయ్యి". అంటూ ఒక గడ్డిపరకను అక్కడ ఉంచింది ఆ తత్త్వం.

ఆ గడ్డిపరకను చూసి చాలా తేలిక భావంతో మంటలు సృష్టించాడు అగ్నిదేవుడు. గడ్డిపరక కాలలేదు. భయంకరమైన అగ్నిశిఖలు సృష్టించాడు. లాభం లేకపోయింది. అగ్నిదేవుడు వెనక్కి తిరిగి దేవతలవద్దకు వెళ్ళి "ఆ తత్త్వం ఏమిటో నాకూపాలుపోలేదు" అన్నాడు.

అప్పుడు దేవతలంతా వాయువును సమీపించి "దేవా ! నువ్వు చాలా గొప్పవాడివి కదా ! ఆ తత్త్వము ఏమిటో తెలుసుకునిరా" అన్నారు. సరే అని బయలుదేరాడు వాయువు, ఆ తత్త్వాన్ని సమీపించాడు. పూర్వంలాగానే ఆ తత్త్వం అడిగింది.

"ఎవరు నువ్వు"

"నేను వాయుదేవుడను. ఆకాశంలో సంచరిస్తుంటాను. కాబట్టి నన్ను 'మాతరిశ్వుడు' అంటారు".

"నీ శక్తి ఏమిటి ?"

"లోకంలో ఏ వస్తువునైనా సరే నా యొక్క గాలులతో ఎగరగొట్టగలను".

"అయితే ఈ గడ్డిపరకను ఎగరగొట్టు" అంటూ ఇదివరకటి గడ్డిపరకనే చూపించింది ఆ తత్త్వం. వాయుదేవుడు తన బలాన్నంతా కూడదీసుకుని భయంకరమైన గాలులు వీచాడు. గడ్డిపోచకదలలేదు. వచ్చినదారినే వెనక్కువెళ్ళి దేవతలతో" ఆ తత్త్వం ఏమిటో నాకు అర్ధంకాలేదు" అన్నాడు.

అప్పుడు దేవతలందరూ తమ ప్రభువైన ఇంద్రుడి దగ్గరకు వెళ్ళి అతనికి జరిగిన సంగతంతా వివరించి "దేవేంద్రా ! ఆ విచిత్రమైన తత్త్వం ఏమిటో నువ్వైనా కనుక్కోవలసింది" అన్నారు. సరే అంటూ బయలుదేరాడు ఇంద్రుడు. ఆ తత్త్వాన్ని సమీపించాడు.

అప్పుడు అక్కడున్న తత్త్వం మాయమైపోయింది. దానిస్థానంలో మహాసౌందర్యరాశి అయిన ఒక స్త్రీమూర్తి కనిపించింది. ఆమె హిమవంతుని కుమార్తె హైమవతి. ఆమెను ఉమాదేవి అని కూడా అంటారు.

ఆశ్చర్యంగా చూశాడు ఇంద్రుడు. "అమ్మా ! దేవతలనందరినీ భయభ్రాంతులను చేసిన ఆ తత్త్వం ఏమిటి ?" అన్నాడు.

" ఆ శక్తియే బ్రహ్మము నాకు బ్రహ్మకూ తేడా లేదు. ఇద్దరమూ ఒక్కటే" అని ఉమాదేవి సమాధానం చెప్పింది. ఆ తరువాత "ఓ దేవేంద్రా ! పరబ్రహ్మ వల్లనే మీరు అసురుల మీద విజయం పొందారు. మీ గొప్పతనానికి కారణము బ్రహ్మము. మీ అల్పబుద్ధి వల్ల మీకు కనిపించిన బ్రహ్మాన్ని గుర్తించలేకపోయారు." అని చెప్పింది.

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ ఒక ఆకారం పొందితే, అదే పరమేశ్వరి. బిందురూపుడైన పరబ్రహ్మ నుంచి కొంత శక్తి బయటకు వచ్చింది. ఆ శక్తే పరమేశ్వరి. శక్తి త్రికోణాకారంగా ఉంటుంది. అదే యోని. దాని నుంచే జగత్తంతా ఆవిర్భవించింది. అదే శ్రీచక్రంలోని త్రికోణము. పరమేశ్వరుని వల్లనే ఈ జగత్తు ప్రవర్తిల్లుతున్నది. పరమేశ్వరునికి ప్రతిరూపం పరమేశ్వరి. అందుచేతనే ఆమె శ్రీమహారాజ్ఞీ.

చరాచరజగత్తులోని ప్రాణికోటికంతటికీ యుక్తాయుక్తవిచక్షణా జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. వారి కర్మలననుసరించి భవిష్యజ్జన్మలు ప్రసాదిస్తుంది. మానవులు చేసే పాపపుణ్యాలు విచారించటానికి లౌకికన్యాయస్థానాలు చాలవు. వీటిని విచారించటం ఆ పరమేశ్వరునికే సాధ్యపడుతుంది. ఈ రకంగా వారి పాపపుణ్యాలను విచారించి వారికి మరుజన్మ ప్రసాదించి, ధర్మాన్ని లోకాలను రక్షిస్తుంది కాబట్టే ఆవిడ శ్రీమహారాజ్ఞీ అని పిలువబడుతుంది.

## 3. శ్రీమత్సింహాసనేశ్వరీ

ఇక్కడ పరమేశ్వరి లయకారిణి ఈ రకంగా మొదటి మూడు నామాలలోను సృష్టి స్థితి లయాలు చెప్పబడ్డాయి. రాజులు సభలలో కూర్చునే ఆసనాన్ని సింహాసనము అంటారు. మృగాలలో శ్రేష్టమైనది సింహము. అడవికి రాజు. పరాక్రమానికి కూడా చిహ్నము. అందుచేతనే రాజుగారు తన వీరత్వానికి, పరాక్రమానికి గుర్తుగా సింహాసనం మీదకూర్చుంటాడు. ఈ ఆసనానికి రెండువైపులా సింహాలుంటాయి. రాజు భయంకరమైన క్రూరమృగమైన సింహాన్ని తాను ఓడించి ఆసనంగా చేసుకున్నాడు అని ఇక్కడ అర్థం. అటువంటి సింహాసనం ఆసనంగా కలది ఆ పరమేశ్వరి. దేవీపురాణంలో, మహిష్మతి అనే గంధర్వకాంత శాపవశాన మహిషిగా జన్మించింది. ఆ మహిషికీ, రంభుడు అనే రాక్షసుడికి జన్మించినవాడు మహిషాసురుడు. అతడు ముల్లోకాలను జయించాడు. దేవతలందరూ విష్ణువును శరణుజొచ్చారు. అప్పుడు అందరి దేవతల యొక్క అంశలతో తేజోరాశి అయిన స్త్రీమూర్తి ఉద్భవించింది. ఆవిడే పరమేశ్వరి. ఆవిడకు దేవతలందరూ తమ తమ శక్తులను ఇచ్చారు. ఆసమయంలో

**హిమవాన్ వాహనం సింహం రత్నాని వివిధాని చ**

హిమవంతుడు ఆ దేవికి వాహనంగా ఒక సింహాన్ని, వివిధరకాలయిన రత్నాలను ఇచ్చాడు. ఆ సింహం మీద ఎక్కి దేవి మహిషాసుర సంహారం చేసింది. అందుచేతనే ఆమె సింహాసనేశ్వరీ అని చెప్పబడింది.

సింహాసనము అనే పేరుగల ఎనిమిది మంత్రాలు చైతన్యభైరవి దగ్గరనుండి సంపత్ప్రదాభైరవి దాకా ఉన్నాయి. వీటిలో మొదటి ఆరుమంత్రాలు మూడు జతలుగాను, తరువాత ఒక్కొక్కటిగాను మొత్తం ఐదు దిక్కులందు ఐదు సింహాసనములు గలది ఆ పరమేశ్వరి అని జ్ఞానార్ణవ తంత్రంలో చెప్పబడింది.

పరమేశ్వరి ఐదు సింహాసనాలు ఏవిధంగా ఎక్కిందో శివుడు పార్వతికి వివరిస్తున్నాడు. ఓ దేవి సృష్టి కర్త అయిన బ్రహ్మ నిశ్చేతనుడుగా ఉన్నప్పుడు పరమేశ్వరిని ధ్యానించి సృష్టి కర్త అయినాడు. ఆ తరువాత ఇంద్రుడు బ్రహ్మను గురించి తపస్సుచేసి పూర్వదిక్పాలకు డైనాడు. అప్పుడు ఆ త్రిపురసుందరి పూర్వసింహాసనమధిష్టించింది. యముడు బ్రహ్మను గురించి తపస్సుచేసి దక్షిణదిక్కుకు అధిపతి అయినాడు. అప్పుడు ఆ దేవి దక్షిణ సింహాసనమలంకరించింది. వరుణుడు బ్రహ్మను గురించి తపస్సు చేసి పశ్చిమదిక్కుకు అధిపతి అయినాడు. అప్పుడు ఆ దేవి పశ్చిమ సింహాసనమలంకరించింది. కుబేరుడు బ్రహ్మను మెప్పించి ఉత్తరదిక్కుకు అధిపతి అయినాడు అప్పుడు ఆ దేవి ఉత్తర సింహాసనమధిష్టించింది. బ్రహ్మ సృష్టికర్తకాగానే ఆ దేవి ఊర్ధ్వదిక్కున ఉన్న సింహాసనం అధిష్టించింది. ఈ రకంగా ఐదు దిక్కులయందున్న సింహాసనాలను ఆ దేవి అధిష్టించింది. అందుకే ఆమె సింహాసనేశ్వరి అనబడుతోంది.

ఆ దేవి అధిష్టించినది ఒట్టి సింహాసనం కాదు. మహాసింహాసనం. శ్రీమత్ అంటే గొప్పదైనటువంటి అని అర్థం. మామూలుగా సింహాసనానికి నాలుగుకాళ్ళుంటాయి. కాని దేవతలు కూర్చునే సింహాసనానికి మధ్యన ఇంకొక కాలు ఉంటుంది. ఈ రకంగా ఐదు కాళ్ళుంటాయి. అందుకే దాన్ని శ్రీమత్సింహాసనము అంటారు.

త్రిపురసుందరి పంచాసనాసీన. పంచాసనాలంటే

**1. పంచప్రణవాసనము :** శ్రీం, హ్రీం, క్లీం, ఐం, సౌః, అనేవి పంచప్రణవాలు. వాటినే శక్తి ప్రణవాలు అంటారు. షోడశి మహామంత్రంలో ఈ ప్రణవాలను చెప్పటం జరుగుతుంది. ఈ ప్రణవాల మీద మంత్రరూపంలో ఆ దేవి ఉంటుంది.

**2. పంచకలాసనము :** నివృత్తి, ప్రతిష్ఠా, విద్యా, శాంతి, శాంత్యతీతములు పంచకలలు. వీటికి పైన చిత్కలగా ఉన్నది.

**3. పంచదిగాసనము :** పూర్వ, దక్షిణ, పశ్చిమ, ఉత్తర, మధ్యదిక్కులు ఎల్లలుగా గల బ్రహ్మాండమును పాలించునది.

**4. పంచభూతాసనము :** పృథివి, నీరు, నిప్పు, గాలి, ఆకాశము అనే పంచభూతాలకు పైన ఉండునది.

**5. పంచముఖాసనము :** సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములు పరమేశ్వరుని ముఖములు. ఈ ముఖములు గల ఆసనము నధిరోహించినది.

ఈ రకంగా దేవి ఐదురకాలయిన సింహాసనాలనధిష్ఠిస్తున్నది. కాబట్టి శ్రీమత్సింహాసనేశ్వరీ అనబడుతోంది.

షట్చక్రాలలోను భక్తులు, సాధకులు పరమేశ్వరిని అర్చిస్తారు. అలా అర్చించేటప్పుడు ఒక్కొక్క చక్రంలో అర్చించే వారికి ఒక్కొక్కరకమైన ముక్తి కలుగుతుంది.

ఆధారస్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు. వాటిలో ముక్తిలేదు. ఇక

1. మణిపురంలో దేవిని పూజించే వారికి సార్ష్టిరూపముక్తి కలుగుతుంది. అంటే దేవి పురానికి దగ్గరగా ఇంకొక పురము నిర్మించుకుని ఉంటారు.

2. అనాహతంలో దేవిని అర్చించే వారికి సాలోక్యముక్తి కలుగుతుంది. వీరు దేవి పట్టణంలోనే నివసించగలుగుతారు.

3. విశుద్ధి చక్రంలో దేవిని అర్చించేవారికి సామీప్యముక్తి కలుగుతుంది. వీరు దేవికి అతి దగ్గరగా సేవకులుగా ఉంటారు.

4. ఆజ్ఞా చక్రంలో దేవిని అర్చించే వారికి సారూప్యముక్తి కలుగుతుంది. వీరు వేరే దేహం ధరించి దేవితో సమానమైన రూపంలో ఉంటారు.

5. సహస్రారంలో దేవిని అర్చించే వారికి సాయుజ్యం కలుగుతుంది. వీరికి మరుజన్మ ఉండదు.

దేవతలలో ప్రసిద్ధులైన త్రిమూర్త్యాదులు ఆ పరమేశ్వరికి అతి దగ్గరగా ఉండి సేవించాలి అనే కోరిక కలవారై సామీప్యముక్తిని పొందారు. దీన్నే శంకర భగవత్పాదులవారు తమ సౌందర్య లహరి లోని 92వ శ్లోకంలో వివరిస్తూ

**గతా స్తే మంచత్వం ద్రుహిణహరిరుద్రేశ్వరభృతః**
**శివ స్వచ్ఛచ్ఛాయా కపట ఘటిత ప్రచ్ఛదపటః**
**త్వదీయానాం భాసాం ప్రతిఫలనరాగారుణతయా**
**శరీరీ శృంగారో రస ఇవ దృశాం దోగ్ధి కుతుకమ్ ॥**

ఓ తల్లీ ! బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు, సదాశివుడు అనువారు నీకు అతి సమీపంగా ఉండి, నిన్ను సేవించుకోవాలి అనే తలంపుతో మొదటి నలుగురు నీ సింహాసనానికి నాలుగుకోళ్ళుకాగా సదాశివుడు నువ్వు కప్పుకునే దుప్పటి అయినాడు.

అటువంటి పంచబ్రహ్మలు పరమేశ్వరి సింహసనానికి కోళ్ళుగా ఉన్నారు కాబట్టి ఆ దేవి శ్రీమత్సింహాసనేశ్వరీ అనబడుతుంది.

మహాసింహాసనము అనేది ఒక మంత్రరాజం. ఆ మంత్రానుష్ఠానం చేసిన వారికి ప్రపంచంలోని అన్ని మంత్రాలమీదా అధికారం వస్తుంది. ఇది ఉత్తరదేశంలో బహుళ ప్రచారంలో ఉంది. ఆ మంత్రానికి అధిదేవత త్రిపురసుందరి. కాబట్టి దేవి శ్రీమత్సింహాసనేశ్వరి అని పిలువబడుతున్నది. ఈ రకంగా మొదటి మూడు నామాలు త్రిగుణస్వరూపమును అనగా సృష్టి స్థితి లయాలను సూచిస్తున్నాయి.

## 4. చిదగ్నికుండ సంభూతా

చిత్ అంటే జ్ఞానము. అదే అగ్నికుండము. అజ్ఞానానికి చిహ్నమైన తమోగుణానికి విరోధి. అవిద్య, అజ్ఞానాలను తొలగించేది పరబ్రహ్మ. చిత్ అంటే జ్ఞానాగ్ని. శరీరం లోపలకట్టెలు లేకుండానే నిరంతరము మండే జ్ఞానాగ్ని, మోహము అనే అంధకారాన్ని తొలగిస్తుంది. శక్తిసూత్రాలలో చెప్పినట్లుగా

**చిద్వహ్ని రవరోధపదే ఛన్నోఽ పి చిన్మాత్రయామేయేంధనం పుష్య తీతి**

చిత్తు విశ్వమును తన స్వభావము చేతనే దహిస్తుంది. కాబట్టి అగ్ని అనబడుతుంది. అక్కడ చిత్తుకు అగ్నికి తేడా లేదు. చిచ్ఛక్తి పరమేశ్వరుని పరిశుద్ధ చైతన్యమని, ప్రసిద్ధమైన అగ్నికుండము వంటిది అని చెప్పబడింది. భగవద్గీతలో శ్రీ కృష్ణుడుఅర్జునునితో

**జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసా త్కురుతే ఽ ర్జున**

అర్జునా ! జ్ఞానాగ్ని అన్నింటినీ భస్మం చేసి వేస్తుంది అంటాడు. రేణుకాపురాణంలో ఇక్ష్వాకువంశంలో రేణుకుడు అనేవాడు జన్మించాడు. అతడు గొప్ప పరమేశ్వరి భక్తుడు. ఆ దేవిని గురించి అనేక వేలసంవత్సరాలు తపస్సుచేశాడు. అతని తపస్సుకు మెచ్చి అతనికి అనేకవరాలిచ్చింది పరమేశ్వరి. ఆ తరువాత

**ఏతస్మి న్నన్తరే యజ్ఞే వహ్నికుండా చ్ఛనై ర్ద్విజ**
**దివ్యరూపాన్వితా నారీ దివ్యాభరణభూషితా**

అగ్నికుండములో నుండి మెల్లగా దివ్యరూపంతో, దివ్యాభరణాలతో, చంద్రబింబము వంటి మోముతో బయటకు వచ్చింది అని చెప్పబడింది. అందుచేతనే పరమేశ్వరి అగ్నికుండము నుంచి పుట్టినది అనబడుతోంది.

బ్రహ్మాండపురాణంలో భండాసురునిచే పీడించబడిన దేవతలు పదిమైళ్ళ విస్తారము గల అగ్నికుండము నిర్మించి తమ శరీరాన్ని కోసి హోమం చెయ్యసాగారు. అప్పుడు ఆ

హోమకుండంలో నుంచి కోటిసూర్యుల కాంతులతో, అనేకకోట్ల చంద్రుల చల్లదనంతో వెలుగొందుచూ బాలభానుని కాంతులతో ఆ దేవి ఉద్భవించింది. అప్పుడా దేవిని గాంచిన దేవతలు సంతసించారు. అని చెప్పబడింది. అంటే పరమేశ్వరి అగ్నికుండం నుండే ఆవిర్భవించింది.

పరమేశ్వరి నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ స్వరూపిణి. కాని లోకంలోని భక్తులను రక్షించటం కోసం అగ్నికుండం నుంచి ఉద్భవించి సగుణ పరబ్రహ్మ స్వరూపిణి అయింది.

ఆ జగజ్జనని పరబ్రహ్మ అనబడే అగ్నికుండము నుండి ఆవిర్భవించింది. వ్యష్టిగా చూస్తే ఇది ఆత్మకుండలి. సమిష్టిగా చిదగ్నికుండము. చిదగ్నికుండము అంటే అఖండమైన జ్ఞానము యొక్క మాయాశబలిత రూపము. అసలు దేవతలే తేజ స్వరూపులు, అనంతమైన తేజస్సు గల పరమేశ్వరి చిదగ్ని. చిదగ్నికుండ సంభూత. దేవతలంతా అలసత్వము, మొండితనము, చేతగానితనము మొదలైన దుర్లక్షణాలను తమ శరీరం నుండి తీసి అగ్నికుండంలో ఆహుతి చేశారు. అలాగే మానవులు కూడా తమ అజ్ఞానాన్ని, ఇంద్రియాల అలసత్వాన్ని, ఇంద్రియ చపలత్వాన్ని తమ జ్ఞానాగ్నిలో భస్మం చెయ్యగలిగితే అప్పుడు వారియందు ఆ పరమేశ్వరి సంభూత అని చెప్పబడుతుంది.

సృష్టికి పూర్వము అఖండమైన బ్రహ్మతేజస్సు మాత్రమే ఉన్నది. తేజస్సుకు ఒక పరిధి ఉన్నది కాబట్టి కుండము అంటున్నాము. చిత్ అనేదే అగ్నికుండము. అదే చిదగ్నికుండము. జ్ఞానస్వరూపమైన పరమేశ్వరి, అజ్ఞానాన్ని నాశనం చేసే జ్ఞానాగ్ని నుంచి సంభవించింది.

ప్రపంచంలో విషయాలు అనేకముంటాయి. వాటిని బుద్ధికి నివేదించేది ఇంద్రియాలు. ఇంద్రియాలు జడాలు. విషయాలను నాశనం చెయ్యటం మన వల్లకాదు. ఇంద్రియాలు దేని పని అది చేస్తుంటాయి. ఒకదాని పని ఇంకొకటి చెయ్యలేదు. అంటే వినే చెవులు ఆశక్తితో చూడలేవు. కాబట్టి ఏ యింద్రియానికి ఆయింద్రియానికి చిదగ్ని వేరుగా ఉంటుంది.

పిండాండములాగానే చిదగ్నులు కూడా చాలారకాలున్నాయి. ఈ రకంగా ప్రపంచంలో ఉన్న అనంతజ్ఞానాగ్ని సముదాయమే చిదగ్నికుండము.

ఈ రకంగా పరమేశ్వరి చిదగ్నికుండ సంభుతా అని పిలవబడుతోంది.

## 5. దేవకార్యసముద్యతా

దేవతల యొక్క కార్యములు పూర్తిచెయ్యటంకోసం ఆ పరమేశ్వరి భూలోకంలో అవతరిస్తుంటుంది. మార్కండేయ పురాణంలో

**దేవానాం కార్యసిద్ధ్యర్థం ఆవిర్భవతి సా యదా !**
**ఉత్ప న్నేతి తథా లోకే సా నిత్యా ప్యభిధీయతే**

కాబట్టి ఆపన్నులను రక్షించటం కోసం పరమేశ్వరుడు భూలోకంలో ఉద్భవిస్తూనే ఉంటాడు. అయితే నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ పుట్టటం ఏమిటి? అంటారు. పరబ్రహ్మకు పుట్టుకలేదు. కాని భగవద్గీతలో చెప్పినట్లుగా

**యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత ! ।**
**అభ్యుత్థాన మధర్మస్య తదా త్మానం సృజాఽఽమ్యహం ॥**

లోకంలో తన అవసరం ఎప్పుడు వస్తుందో అప్పుడు ఆ నిరాకారుడు సాకారుడుగా జన్మిస్తాడు.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥**

దుష్టశిక్షణార్థమై ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీమన్నారాయణుడు ప్రతియుగంలోనూ ఆవిర్భవిస్తుంటాడు. చండీసప్తశతిలో శుంభ నిశుంభుల వధ జరిగిన తరువాత దేవతలు పరమేశ్వరిని పరిపరివిధాల కీర్తించి ఆమెను అడుగుతారు.

**సర్వబాధాప్రశమనం త్రైలోక్య స్యాఖిలేశ్వరి ।**
**ఏవ మేవ త్వయా కార్యం అస్మద్వైరివినాశనం ॥**

ఓ తల్లీ ! ఇదేవిధంగా ఎప్పుడూ మా శత్రువులను నాశనంచేసి ముల్లోకాను రక్షించాల్సింది. ఆ దేవి దేవతలను అనుగ్రహించి ఈ రకంగా చెబుతుంది.

**వైవస్వతేఽన్తరే ప్రాప్తే అష్టావింశతిమే యుగే ।**
**శుమ్భో నిశుమ్భ శ్చై వాన్యృత్పత్స్యేతే మహాసురౌ ॥**

**నన్దగోపగృహే జాతా యశోదాగర్భసమ్భవా ।**
**తత స్తౌ నాశయిష్యామి విన్ధ్యాచలనివాసిని ! ॥**

వైవస్వతమన్వంతరంలో ఇరవై ఎనిమిదవ మహాయుగంలో శుంభనిశుంభులని ఇద్దరు రాక్షసులు పుడతారు. ఆకాలంలో నందగోపుని ఇంట యశోదాగర్భాన జన్మించి వింధ్యపర్వతాలమీద నివసిస్తూ వారిద్దరినీ సంహరిస్తాను. అంటూ మొదలుపెట్టి

**ఇత్థం యదా యదా బాధా దానవోత్థా భవిష్యతి ।**
**తదా తదాఽవతీ ర్యాహం కరిష్యా మ్యరిసంక్షయమ్ ॥**

ఈ రకంగా రాక్షసుల వలన ఎప్పుడెప్పుడు బాధకలుగుతుందో అప్పుడెల్ల నేను అవతరించి శత్రువినాశనంగావిస్తాను. అని చెబుతుంది.

దేవకార్యసముద్యతా అనేది అష్టాక్షరీమంత్రం. దేవకార్యము అంటే రాక్షససంహారమే. ఇక్కడ దేవకార్యాలు ఏవి అంటే దశావతారాలు ఎత్తి రాక్షస సంహారం చెయ్యటం విష్ణువు పని. అతడు స్థితి కారకుడు, అతడికి కూడా సాధ్యంకాని పనులు ఏవైనా ఉంటే వాటిని పూర్తిచెయ్యటానికి స్వయంగా పరమేశ్వరి యే అవతరిస్తుంది. భండాసురుడు, మహిషాసురుడు మొదలైనవాళ్ళని సంహరించటానికి ఆమె అవతరించింది. ఈ రకంగా ఆమె ఈ లోకంలో మళ్ళీమళ్ళీ ఉద్భవిస్తున్నప్పటికీ, అది ఆమె పుట్టుక కాదు. అవతారం మాత్రమే. పరమేశ్వరి నిత్యురాలు. ఆదిమధ్యాంతములు లేనటువంటిది. ఇదేమాట మార్కండేయపూరాణంలో చెప్పబడింది. అలాగే కూర్మపురాణంలో

**అహం వై యాచితా దేవైః సంస్కృతా కార్యగౌరవాత్**
**వినిన్ద్య దక్షం పితరం మహేశ్వరవినిన్దకం ।**
**ధర్మసంస్థాపనార్థాయ త వారాధనకారణాత్**
**మేనాదేహా త్సముత్పన్నా త్వా మేన పితరం శ్రితా ॥**

“నేను దేవతలచే యాచించబడి కార్యగౌరవముచే నమస్కరింపబడిన దాననై మహేశ్వరుని నిందించిన, తండ్రియైన దక్షుని నిందించి, ధర్మసంస్థాపనకై నీవు ఆరాధించిన కారణమున నిన్ను తండ్రిగా పొంది మేనకాదేవి దేహమునుండి పుట్టితిని” అని హిమవంతుడితో చెబుతుంది.

మానవశరీరం ఒకే ఆకారంలో కనిపించినప్పటికీ అందులో

| | | |
|---|---|---|
| పంచప్రాణాలు | – | 5 |
| సప్తధాతువులు | – | 7 |
| ఇంద్రియాలు | – | 10 |
| మనోవృత్తి భేదములు | – | 11 |
| మొత్తం విలక్షణ పదార్థాలు | | 33 |

బ్రహ్మాండంలోని దేవతల సంఖ్య కూడా 33. బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యుడికి, శాకల్యుడికి వాదం జరుగుతుంది. ఆ వాదనలో యాజ్ఞవల్క్యుడు వివరిస్తాడు. యథార్థానికి దేవతలు ముప్పైముగ్గురే. వారెవరంటే.

| | |
|---|---|
| అష్టవసువులు | 8 |
| ఏకాదశరుద్రులు | 11 |
| ద్వాదశాదిత్యులు | 12 |
| ఇంద్రుడు | 1 |
| ప్రజాపతి | 1 |
| మొత్తం | 33 |

వీరందరిని వివరించుమంటాడు శాకల్యుడు.

**శాకల్యుడు :** అష్టవసువులు ఎవరు ?

**యాజ్ఞవల్క్యుడు :** అగ్ని, పృథివి, వాయువు, అంతరిక్షం, ఆదిత్యుడు, ద్యులోకము, చంద్రుడు, నక్షత్రాలు. వీటిలోనే జగత్తంతా వ్యాపించి ఉన్నది. కర్మఫలాన్ని బట్టి ఇవి దేహంగా పరిణమిస్తాయి.

**శా :** రుద్రులు ఎవరు ?

**యా :** జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు. ప్రాణి యొక్క కర్మ పరిసమాప్తమైనప్పుడు వీరు శరీరం నుండి ఉత్క్రమిస్తారు. ఈ రకంగా శరీరాన్ని వదలి బంధువులను రోదింపచేస్తారు కాబట్టి ఇవి రుద్రశబ్దంచేత పిలువబడతాయి.

**శా :** ఆదిత్యులెవరు ?

**యా :** పన్నెండు నెలలతోకూడిన సంవత్సరమే ఆదిత్యుడు. ప్రాణులయొక్క ఆయుర్దాయాన్ని 'అదదానా' అంటే గ్రహిస్తుంది. కాబట్టి ఆదిత్యులనబడతాయి.

**శా :** ఇంద్రుడు, ప్రజాపతి ఎవరు ?

**యా :** మేఘమే ఇంద్రుడు, మేఘదేవత కూడా ఇంద్రుడే. యజ్ఞమే ప్రజాపతి.

ఈ రకంగా దేవతల సంఖ్య ముప్పైమూడు, శరీరంలోని మొత్తం విలక్షణపదార్థాలు ముప్పైమూడు, ఇవి దేవతా సంజ్ఞ గలవి. వీటిని సంతృప్తి పరచటం మానవుడికి అసాధ్యం. అందుచేతనే ఇదికూడా దేవకార్యము అనే చెప్పబడింది. ఈ విలక్షణ పదార్థాలైన దేవకార్యసాధనకు మానవుడి. జ్ఞానమనే అగ్నికుండములో నుంచి ఆ పరమేశ్వరి ఆవిర్భవించింది.

ఈ రకంగా మొదటి ఐదునామాలలోను పరమేశ్వరి యొక్క ప్రాదుర్భావం వివరించబడింది.



శ్రీ 'ఆ'కార దేవి

# 6. పరమేశ్వరి స్వరూపము

బిందురూపుడుగా ఉన్న పరబ్రహ్మ, కర్మపరిపక్వం కాకుండా తనలో లీనమయి ఉన్న జీవరాసుల కర్మలను క్షయం చేసి, వారికి మోక్షం ప్రసాదించాలనే సంకల్పంతో సృష్టి చెయ్యాలని సంకల్పించాడు, అనుకున్నదే తడవుగా తనలోనుండి కొంత శక్తిని బయటకు పంపాడు. ఈ రకంగా బిందురూపంలో ఉన్న పరబ్రహ్మ శివశక్తులుగా మారాడు. శివశక్తులిద్దరూ వేరుకాదు. వారిద్దరూ ఒకటే. ఒకే నాణానికి బొమ్మా బొరుసులాంటివారు. ఒకే విత్తనంలో ఉన్న రెండు బద్దలలాంటివారు. ఆ శక్తి త్రికోణ రూపంలో ఉంటుంది. శివుడు బిందురూపంలో ఉంటాడు. అంటే శివుడు బిందురూపుడు కాబట్టి అవ్యక్తుడు. అదే శక్తి త్రికోణరూపిణి. అనగా ఒకరూపమున్నది. అందుచేతనే ఆ శక్తి వ్యక్తరూపిణి, కంటికి కనిపిస్తుంది. అంటే శక్తికి రూపమున్నది. ఆమెయే పరమేశ్వరి.

దేవీభాగవతంలో తారకాసురుని బాధలు భరించలేని రాక్షసులు పరమేశ్వరిని ధ్యానిస్తారు. చైత్రశుద్ధనవమి శుక్రవారం ఆ దేవి వారికి సాక్షాత్కరిస్తుంది. ఆ సమయంలో దివ్యమైన తేజోమయమైన కాంతిపుంజము అనేకకోట్ల సూర్యులకాంతులతో వారికి దర్శనమిస్తుంది. కొన్నికోట్ల విద్యుత్కాంతులతో తళుక్కున మెరిసింది. దానికి పైన క్రింద అడ్డము అనేవిలేవు. ఆద్యంతాలు లేవు. కాలు చేతులు లేవు. స్త్రీ పురుష నపుంసక బేధాలు లేవు. ఆ తేజస్సు చూడలేక దేవతలు కనులు మూసుకున్నారు.

ఇంతలోనే ఆ తేజోరాసి ఒక స్త్రీ రూపం దాల్చింది. ఆమె రమణీయాంగి. కుమారి నవయవ్వనమై అలరారుతున్నది. బంగారు కేయూరాలు, గ్రైవేయముతో అలంకరించ బడింది. మేలైన జాతిమణుల హారాలు ధరించింది. రకరకాల పూలను సిగలో అలంకరించుకుంది. కర్పూర తాంబూలము నములుతున్నది. అష్టమినాటి చంద్రుని బోలిన ముఖముతో, వెడల్పయిన కనుబొమలు, ఎర్రకమలములవంటి కనులు, ఎత్తైన నాసిక, మధురాధరము గలది. ఆమె దంతాలు మల్లెమొగ్గలులా ఉన్నాయి. ముత్యాలహారాలు, వజ్రాలహారాలు మెడలో ధరించింది. కేశాలు మల్లిక, మాలతి, సుమాలతో గుబాళిస్తున్నాయి. కస్తూరి తిలకం ధరించింది. మూడు కనులున్నాయి. ఎర్రని వస్త్రాలు ధరించి, దానిమ్మపూలవలె ఎర్రనికాంతులు విరజిమ్ముతున్నది. నాలుగు చేతులయందు పాశము, అంకుశము, ధనుస్సు, బాణాలు ధరించింది.

ఆ పరమేశ్వరిని దర్శించిన దేవతలకు నోటమాటరాలేదు అని చెప్పబడింది. ఇది పరమేశ్వరి స్వరూపం.

ఇక 6 నుంచి 54 నామాల వరకు అంటే 49 నామాలలో దేవిస్థూలదేహాన్ని వర్ణిస్తున్నారు. ఇందులో పరమేశ్వరి రూపలావణ్యాలు పూర్తిగా చెప్పబడతాయి.

## 6. ఉద్యద్భానుసహస్రాభా

ఉదయించుచున్న వేయి సూర్యులకాంతి గలది. సూర్యుని కిరణాలు వేయి. ఉదయించటమనేది అతడికి విశేషణము. బాలభానుడు అరుణారుణచ్ఛాయలో ఉంటాడు. కాబట్టి ఉదయిస్తున్న వేయి సూర్యులకాంతితో ప్రకాశిస్తున్నది పరమేశ్వరి. ఇక్కడ వేయి అనేది ఒక సంఖ్యను నిర్దేశించటంకోసం చెప్పబడింది. నిజంగా చెప్పాలంటే భైరవయామళంలో పరమేశ్వరి కాంతుల్ని వివరిస్తూ

**తేషాం అనంతకోటీనాం మయూఖానాం మహేశ్వరి !**

ఈ రకంగా లెక్కలేనన్ని, లెక్కకురానన్ని, లెక్కపెట్టటానికి వీలుకానన్ని కాంతి కిరణాలతో ఆ దేవి ప్రకాశిస్తున్నది. వాటిలోని కొన్ని కిరణాలవల్లనే బ్రహ్మాండమంతా ప్రకాశిస్తున్నది. దేవి నుంచి ప్రసరించే కిరణాలలో

**అష్టోత్తరశతం వహ్నేః, షోడశోత్తరశతంరవేః ।**
**షట్త్రింశ దుత్తర శతం చంద్రస్యకిరణా శ్శివే ॥**

108 కిరణాలను అగ్నిదేవుడు, 116 కిరణాలను సూర్యుడు, 136 కిరణాలను చంద్రుడు గ్రహించగలిగారు.

**బ్రహ్మాండం భాసయంత స్తే పిండాండ మపి శాంకరి ! ।**
**దివా సూర్య స్తథా రాత్రౌ సోమో వహ్ని శ్చ సంధ్యయోః ॥**

పగటిపూట సూర్యుని వెలుగులతోను, రాత్రిపూట చంద్రుని కాంతులతోను, సంధ్యవేళ యందు అగ్నికాంతులతోను ఈ జగత్తు ప్రకాశిస్తున్నది. అంటే చరాచరజగత్తు ఈ రకంగా ప్రవర్తిల్లుతూ ఉండటానికి కారణం ఆ దేవి శరీరం నుంచి వచ్చే కిరణసముదాయమే.

దేవీభాగవతంలో కూడా ఆ దేవి కాంతులను వర్ణిస్తూ **అనేకకోటి సూర్యానాం చంద్రకోటి సుశీతలం.** కొన్నికోట్ల సూర్యుల యొక్క కాంతులతో ఆ దేవి ప్రకాశిస్తుంటుంది

అని చెప్పబడింది. కాబట్టి ఆ దేవి అనేకకోట్ల సూర్యకాంతులు ప్రసరిస్తూ ఉంటుంది. ఇక ఆ దేవి యొక్క శరీరచ్ఛాయ గురించి చెబుతూ **ఉద్యద్భాను సహస్రాభా** అన్నారు. అంటే ఉదయిస్తున్న సూర్యునివలె అరుణారుణచ్ఛాయలో ఉంటుంది.

**అరుణాం కరుణాతరంగితాక్షీం**

అని చెప్పటం జరిగింది. అంటే ఆ దేవి అరుణకాంతులతో ప్రకాశిస్తున్నదన్నమాట. ఆధారచక్రంలో శివశక్తులను ధ్యానిస్తూ

**జపాకుసుమ సంకాశౌ మధుఘూర్ణిత లోచనౌ**

జపాకుసుమము అంటే మంకెన్నపువ్వు. ఎరుపు, తెలుపు కలిసినవర్ణంలో ఉంటుంది. స్వతంత్ర తంత్రంలో

**స్వాత్మైవ దేవతా ప్రోక్తా లలితా విశ్వ విగ్రహా ।**
**లౌహిత్యం తద్విమర్శస్స్యాత్ ఉపాస్తి రితి భావనా ॥**

విశ్వరూపిణి అయిన లలితాదేవి స్వస్వరూపంలో ఎర్రని దేహచ్ఛాయ కలిగి ఉన్నది. అలా భావన చేసే దేవిని ఉపాసించాలి. వామకేశ్వరతంత్రంలో

**స్వయం హి త్రిపురాదేవీ లౌహిత్యం తద్విమర్శనమ్.**

త్రిపురాదేవి స్వయంగా ఎర్రదైన విమర్శ అగుచున్నది.

**సకుంకుమవిలేపనా మళికచుంబికస్తూరికాం**
**సమందహసితేక్షణాం సశరచాపపాశాంకుశాం**
**అశేషజనమోహినీం అరుణమాల్య భూషాంబరాం**
**జపాకుసుమభాసురాం జపవిధౌ స్మరే దంబికామ్ ॥**

'జపాకుసుమభాసురాం' అంటే మంకెన్నపువ్వులాగా అరుణారుణచ్ఛాయలతో ప్రకాశించేది.

సూర్యోదయానికి ముందు సూర్యుని సారథి అయిన అనూరుడు వస్తాడు. అతన్నే అరుణుడు అని కూడా అంటారు. ఆ సమయంలో ఆకాశం అంతా ఎర్రనికాంతులలో నిండిఉంటుంది. అవే అరుణకాంతులు.

జీవకోటికి పగలు జాగ్రద్దశ. రాత్రులందు సుషుప్తి. సుషుప్తిలో మనోవృత్తి ఉండదు. జాగ్రదవస్థలోనే మనోవృత్తి ఉంటుంది. తెల్లవారగానే మనోవృత్తులు ప్రారంభమవుతాయి.

ఇవి అనంతమైనవి. మానవుని హృదయంలో ఉండే ఆ పరమేశ్వరి, మానవుని యొక్క అనంతమైన మనోవృత్తులను ప్రకాశింపచేస్తుంది. అందుచేతనే ఆమె ఉద్యద్భాను సహస్రాభా అని చెప్పబడుతోంది.

పరమేశ్వరికి మూడు రూపాలు చెప్పబడ్డాయి.

**1. స్థూలరూపము :** మధ్యములచేత ఆరాధించబడేది. ఇది సాకారము.

**2. సూక్ష్మరూపము :** ఇది మంత్రము. ఉత్తములచే ఆరాధించబడుతుంది. ఇది విమర్శరూపము.

**3. కారణరూపము :** ఇది యంత్రరూపము. ఉత్తమోత్తములచే ఆరాధించబడుతుంది. శ్రీచక్రము. ఇది ప్రకాశరూపము.

ఈ నామం నుంచి పరమేశ్వరి స్థూలరూపాన్ని వివరిస్తున్నారు. ఉదయిస్తున్న వేయి సూర్యుల వెలుగుతో ఆ దేవి ప్రకాశిస్తున్నది. ఆమె కాంతులను చర్మచక్షువులతో మనం చూడలేము. బ్రహ్మాండవ్యాప్తమైన తేజస్సే ఆమె రూపము.

## 7. చతుర్బాహుసమన్వితా

పరమేశ్వరికి నాలుగు బాహువులు ఉన్నాయి. అని ఈ నామంలో చెప్పబడుతోంది. బాహువు అంటే గ్రహించేది. దేవి తన చేతులతో వివిధరకాలయిన ఆయుధాలను తీసుకుని రాక్షససంహారం చేస్తుంది.

దేవికి మొత్తం మూడురూపాలున్నాయి. అవి

**1. స్థూలరూపము :** కాళ్ళు, చేతులు మొదలయిన అవయవాలు కలిగినటువంటిది.

**2. సూక్ష్మరూపము :** ఇది మంత్రమయము

**3. పరారూపము :** వాసనామయమైనది. మంత్రశాస్త్రప్రకారము వాసన అంటే సత్యము లేక స్వత్వము.

పరమేశ్వరికి బాహువులు ఉన్నాయి అని చెప్పటం సాకారవర్ణన. నిర్గుణబ్రహ్మకు రూపం లేదు. అప్పుడు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే నాలుగు ఆమె బాహువులు. అలాగే నాలుగు బాహువులు నాలుగు వేదాలకు ప్రతీక. చతుర్వర్ణాలకు ప్రతీక. చతురాశ్రమధర్మాలకు ప్రతీక.

**చతుర్వర్ణాలు :** బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు. చతురాశ్రమ ధర్మాలు బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము వానప్రస్థము, సన్యాసము. స్థూలరూపంలో గనక దేవిని ధ్యానించినట్లైతే, ఆమెకు నాలుగుచేతులుంటాయి.

గురువు దగ్గర మంత్రోపదేశం పొంది, ఆ మంత్రాన్ని కొంతకాలం జపించి, మళ్ళీ ఆశ్వీయుజశుద్ధనవమి నాటి రాత్రి గురువుకు నమస్కరించాలి. అప్పుడాయన హస్తమస్తక సంయోగం చేస్తాడు. దీన్నే శక్తిపాతము అని కూడా అంటారు. ఆ తరువాత చతుర్విధైక్య సంధానము, షట్చక్రబేధనము బోధిస్తాడు. అప్పుడు గురువు చెప్పిన ప్రకారము సాధన చేసినట్లైతే ఆధారచక్రంలో నిద్రాణమై ఉన్న కుండలినీ శక్తి మేల్కొని ఆధారస్వాధిష్ఠానాలు దాటి మణిపూరంలో ప్రవేశిస్తుంది. ఆధారస్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. అక్కడ సమయాచారులకు పూజలేదు. శివశక్తులకు ఐదురకాలుగా సామ్యం (పోలిక) ఉన్నది అని చెప్పేవారు సమయులు. వారి ఆచారాన్ని సమయాచారము అంటారు. అవి :

1. అధిష్ఠానసామ్యము
2. అనుష్ఠానసామ్యము
3. అవస్థాసామ్యము
4. రూపసామ్యము
5. నామసామ్యము

సమయాచారులు మణిపూరం నుంచే దేవిని అర్చించాలి. చతుర్విధైక్యము చేసిన వారికి మణిపూరంలో దేవి చతుర్భుజగా కనిపిస్తుంది. మణిపూరము అంటే సూర్యమండలము. అందుకే గౌడపాదులవారు

**సూర్యమండలమధ్యస్థాం దేవీం త్రిపురసుందరీం ।**
**పాశాంకుశ ధనుర్బణాన్ ధారయంతీం ప్రపూజయేత్ ॥**

సూర్యమండలము మధ్యన తన నాలుగు చేతులయందు పాశము, అంకుశము, ధనుస్సు, బాణములు ధరించినటువంటి త్రిపురసుందరిని అర్చించాలి అన్నారు. కాళిదాసు శ్యామలాదండకంలో

**చతుర్భుజే చంద్రకళావతంసే కుచోన్నతే కుంకుమరాగశోణే**
**పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణహస్తే నమస్తే జగదేకమాతః**

అన్నాడు. ఆ దేవి నాలుగుచేతులతో ప్రకాశిస్తున్నది అని అర్థం. శంకర భగవత్పాదులవారు తమ సౌందర్య లహరి లోని 7వ శ్లోకంలో

**క్వణత్కాంచీదామా కరికలభ కుంభస్తననతా**
**పరిక్షీణా మధ్యే పరిణత శరశ్చంద్ర వదనా**
**ధనుర్బాణాన్ పాశాన్ శృణమపి దధానా కరతలైః**
పురస్తా దాస్తాం నః పురమథితు రాహో పురుషికా

ఆ త్రిపురసుందరి నాలుగుచేతులయందు పాశము అంకుశము ధనుర్బాణములు ధరించి ప్రకాశిస్తున్నది. అంటే వీరంతా కూడా దేవి చతుర్భుజగానే ఉంటుంది అన్నారు. చతుర్విధైక్యము చేసిన వారికి ఆ దేవి చతుర్భుజగా దర్శనమిస్తుంది. చతుర్విధైక్యము అంటే

**పిండబ్రహ్మాండయో రైక్యం లింగసూత్రాత్మనో రపి**
**స్వాపావ్యాకృతి కారైక్యం క్షేత్రజ్ఞ పరమాత్మనౌ ॥**

1. పిండ బ్రహ్మాండాలకు ఐక్యము
2. లింగసూత్రాలకు ఐక్యము
3. స్వాపావ్యాకృతులకు ఐక్యము
4. క్షేత్రజ్ఞ పరమాత్ములకు ఐక్యము

షడ్విధైక్యసంధానము చేసిన వారికి దేవి దశభుజగా దర్శనమిస్తుంది గౌడపాదుల వారు తమ సుభగోదయస్తుతిలోని 16వ శ్లోకంలో దేవిని వర్ణిస్తూ

**భవాని ! శ్రీహస్తైః వహసి ఫణిపాశం సృణి మథో**
**ధనుః పౌంద్రం పౌష్పం శర మథ జపస్రక్శు కవరౌ ।**
**అథ ద్వాభ్యాం ముద్రా మభయవరదానైక రసికాం**
**క్వణద్వీణాం ద్వాభ్యాం త్వ మురసి కరాభ్యాం చ బిభృషే ॥**

ఓ భవానీ ! నీ హస్తములయందు సర్పరూపపాశము అంకుశము, పుండ్రేక్షుచాపము, పుష్పబాణము, జపమాల శుకవరము, వరద, అభయముద్రలు మరి రెండుచేతులయందు వీణ ధరించి ఉంటుంది అన్నారు.

ఈ రెండింటిలోను దేని ప్రకారం దేవిని అర్చించాలి ? అంటే నాలుగు చేతులున్న పరమేశ్వరినా ? పదిచేతులున్న దేవినా ? అన్నప్పుడు ఏదైనా మాకు సమ్మతమే అన్నారు గౌడపాదులు, శంకరభగవత్పాదులు కూడా. ఐతే ఎక్కువగా పరమేశ్వరి చతుర్భుజ అనేదే ప్రచారంలో ఉన్నది.

షడ్విధైక్య సంధానము అనగా సుభగోదయస్తుతిలోని 13వ శ్లోకంలో గౌడపాదుల వారు

**కళానాదో బిందుః క్రమశః ఇహవర్ణాశ్చ చరణం**
**షడబ్జం చాధార ప్రభృతిక మమీషాం మిలనమ్**
**తదేవం షోడైక్యం భవతి ఖలు యేషాం సమయినాం**
**చతుర్థైక్యం తేషాం భవతి హి సపర్యా సమయినామ్**

కళ, నాదము, బిందువు, చరణము (శ్రీచక్రము) వర్ణములు, షట్చక్రాలను కలపటమే షడ్విధైక్యము అన్నారు.

## 8. రాగస్వరూపపాశాఢ్యా

పరమేశ్వరి చతుర్బాహు సమన్విత. అంటే ఆమెకు నాలుగుబాహువులుంటాయి అని చెప్పటం జరిగింది. ఇప్పుడు ఆ బాహువులలో ఉండే ఆయుధాలను వివరిస్తున్నారు. మొట్టమొదటగా పాశము.

**రాగోఽనురక్తిః చిత్త వృత్తి విశేషః**

రాగము అంటే అనురాగము. ఇది మనోవ్యాపారవిశేషము లేదా కోరిక. ఒకరి మీద లేదా ఒక వస్తువు మీద ఉండేటటువంటి ఇష్టత. అదే ఆప్యాయత, అనురాగము, ఇష్టము, ప్రేమ ఈ రకంగా అనేక పేర్లతో పిలువబడుతుంది. అనురాగము అనేది పాశం వంటిది. కట్టిపడేస్తుంది. ఎవరిమీదనైనా ఇష్టత పెంచుకున్నట్లైతే అది వారియందు బద్ధులను చేస్తుంది. దానివల్ల వారిని విడిచి ఉండలేము. వారిని చూడందే ఉండలేము. ఆ వస్తువు లేదా ఆ మనిషి లేకుండా మనం జీవించలేము అనిపిస్తుంది. దానికోసం మనం ఏపనైనా చేస్తాం. ఎంతకైనా తెగిస్తాం. ఈ రకంగా అనురాగం పెంచుకున్నవాడికి మనస్సు ఇతర విషయాలమీదకిపోదు. దైవచింతన గుర్తుకురాదు. అంతగా మోహంలో పడిపోతాడు. జడభరతుడి కథ ఇందుకు చక్కని ఉదాహరణ.

పూర్వకాలంలో భరతుడు అని ఒకరాజుండేవాడు. చాలాకాలం రాజ్యం చేసిన తరువాత, రాజ్యాన్ని కుమారులకప్పగించి వానప్రస్థానికి వెళ్ళిపోయాడు. అతడు చాలాగొప్పవాడు. వేదవేదాంగవిదుడు. తపోనిష్ఠాగరిష్టుడు. ఒకరోజున స్నానం చెయ్యటానికి నదీతీరానికి వెళ్ళాడు. అక్కడ నిండుగర్భిణి అయిన లేడి ఒక పిల్లనుకని ప్రాణాలు విడిచింది. ఈ రాజర్షి ఆ లేడిపిల్లను తెచ్చి చాలా జాగ్రత్తగా పెంచసాగాడు. దానికి ప్రతిరోజూ క్రమం తప్పకుండా పాలుపట్టేవాడు. అది కూడా అతణ్ణి వదిలి ఎక్కడికీ వెళ్ళేదికాదు. ఈ రకంగా ఆ లేడిపిల్ల పెరిగి పెద్దదవుతున్నది. రాజుకు వయసు మీరుతున్నది. రాజుకు

అవసానకాలం సమీపించింది. ఆఖరుస్థితిలో కూడా దైవచింతనలేదు. తను లేకపోతే ఈ లేడిపిల్ల ఏవిధంగా బ్రతుకుతుంది అన్న ఆలోచనే. ఎప్పుడూ అదే ఆలోచన. ఆ లేడిపిల్లను చూడకుండా క్షణం కూడా గడవని స్థితి. అలాగే కళ్ళు ముశాడు రాజు. పర్యవసానం ? మరుజన్మలో లేడిఅయిపుట్టాడు. ఆ లేడిమీద ఉన్న ప్రేమతో, వానప్రస్థానికి పోయినవాడు కూడా మళ్ళీ లేడిగా జన్మించవలసిన దుర్గతి పట్టింది. ఇదే రాగము.

పరమేశ్వరి ఎడమచేతి వైపున గల పైచేతిలో ఈ పాశము ఉంటుంది. ఈ పాశము ప్రేమస్వరూపమయిన ఆయుధము. జీవిని కట్టపడేస్తుంది.

మనోవృత్తులు బాధాకరమైనవి. అందుకే ఆయుధాలుగా చెప్పబడ్డాయి. రాగము అనేది అరిషడ్వర్గాలకు మూలమైనది. అనురాగాన్ని గనక జయించినట్లైతే ముక్తి లభిస్తుంది. సుషుప్తిలో రాగము ప్రాణమునందు లయం చెందుతుంది. జాగ్రదవస్థలో బుద్ధి జాగ్రదమవుతుంది. అందుచేత అది మనసులో ఉంటుంది. గాఢమైన సుషుప్తిలోను, లేదా తురీయావస్థలోను తప్ప అనురాగానికి అంతమనేది లేదు. ఇది అనంతమైనది. పూర్వజన్మలో తెలిసిన విషయాలను మాత్రమే జీవికోరతాడు. అంతేగాని తెలియని పదార్థాల జోలికిపోడు. ఎవరైనా కొత్తవ్యక్తులను చూసినప్పుడు వారిని ఎక్కడో చూసినట్లు, వారితో మనకు బాగా పరిచయం ఉన్నట్లు అనిపిస్తుంది. నిజానికి వారితో మనకి ఏరకమైన పరిచయం లేదు. కాని గతజన్మలలో ఎప్పుడో వారితో బాగా పరిచయం ఉందన్నమాట. అందుకే మనకు అలా అనిపిస్తుంది. అందుచేతనే **రాగోనురక్తిః చిత్త వృత్తి విశేషతః** రాగము అనేది బుద్ధికి సంబంధించిన విషయము. చిత్తవృత్తి విశేషము. మాయలేదా అజ్ఞానము అనేవి ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తుల సమాహారము. ఈ మూడింటినీ విడదీయలేము. ప్రాపంచికమైన ఈ అనురాగాలను అరికట్టే పరమేశ్వరి శక్తియే పాశము. పైన చెప్పినటువంటి ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులలో

జ్ఞానశక్తి ఎక్కువపాలుంటే – ఉత్తమజన్మ ఇచ్ఛా, క్రియాశక్తులపాలు ఎక్కువ ఉంటే – పశుపక్ష్యాదుల జన్మ కలుగుతుంది. జ్ఞానశక్తి ఎక్కువగా ఉన్నటువంటి వారు ఋషులు, గంధర్వులు, సిద్ధులుగ జన్మిస్తారు. సాధకుడు పరమేశ్వరిని అర్చించేటప్పుడు ఈ రాగము అనే దాన్ని పూర్తిగా వదిలివేసి, అంటే రాగాన్ని పరమేశ్వరికి అర్పించి, ఆవిడచేతిలో పాశరూపంలో ఉంచి అర్చించాలి. అప్పుడే అతడికి ముక్తి లభిస్తుంది.

పరమేశ్వరి చేతిలో ఉన్నటువంటి పాశము వశీకరణము అని చెప్పబడుతోంది. ఈ పాశాన్ని అర్చించినవారు ముల్లోకాలను వశం చేసుకోగలుగుతారు. అందుకే నవావరణ

పూజ చేసేటప్పుడు ఎనిమిదవ ఆవరణ అనగా త్రికోణంలో ముందుగా దేవి యొక్క ఆయుధాలను అర్చించటం జరుగుతుంది.

**ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం ఆం సర్వవశీకరణా భ్యాం**

**కామేశ్వరీ కామేశ్వర పాశాభ్యాం నమః పాశశక్తి**

**శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః**

దుర్వాసుడు తన 'శ్రీదేవీ మహిమ్నః స్తుతి'లోని 43వ శ్లోకంలో

**పాశం ప్రపూరిత మహా సుమతి ప్రకాశో**

**యో వా తవ త్రిపురసుందరి ! సున్దరీణాం ।**

**ఆకర్షణేఽ ఖిలవశీకరణే ప్రవీణం**

**చిత్తే దధాతి స జగత్త్రయవశ్యకృత్స్యాత్ ॥**

ఓ తల్లీ ! సౌందర్యవంతులైన సుందరీమణులను ఆకర్షించగల, సకలదుష్టశక్తులను వశీకరించగల నీ పాశాయుధమును, పాశబీజమును ఉపాసించు వాడు ముల్లోకాలను వశం చేసుకోగలుగుతాడు.

## 9. క్రోధాకారాంకు శోజ్జ్వలా

క్రోధము అంటే ద్వేషము అనే పేరుకల మనోవ్యాపారము. మనకు ఇచ్ఛగనక బాగా కలిగినట్లైతే, అంటే ఒక మనిషియందు మనకు అత్యంతమైన ప్రేమ, అనురాగము ఉన్నాయి. ప్రతి విషయంలోనూ వారే ఉన్నతులుగా ఉండాలి అనుకుంటాం. అలాంటప్పుడు ఒకవేళ మనం అనుకున్నట్లుగా గనకవారు రాలేకపోయినప్పటికీ దాన్ని మనం భరించలేం. ఎదుటివారి గొప్పదనాన్ని ఒప్పుకోలేం. వారిమీద ఏదో కారణంగా కోపం పెంచుకుని వారిని అసహ్యించుకుంటాం. దీనికి కారణము మనవారి పట్ల మనకున్న రాగము. దీనివల్లనే మన వారు చేసిన తప్పులు కూడా ఒప్పులుగాను, ఎదుటి వారు చేసిన ఒప్పులు కూడా తప్పులుగాను కనిపిస్తాయి. అంటే మితిమీరిన అనురాగమే క్రోధము క్రింద మారుతుంది. మనమీద మనకు నమ్మకముంటుంది. ఆత్మాభిమానం ఉంటుంది. అంతవరకు మంచిదే. కాని అది బాగా పెరిగిపోతే దురభిమానమవుతుంది. అదే ఆవేశకావేశాలకు కారణం. అదే క్రోధం అందుకే

**క్రోధో ద్వేషాఖ్యా చిత్త వృత్తిః**

క్రోధము అనేది ద్వేషము అనే పేరుగల చిత్తవృత్తి. పరమేశ్వరికి కుడివైపున్నటువంటి పైచేతిలో అంకుశమున్నది. అంకుశము బాధించేది. క్రోధము వల్ల ఇతరులకు బాధకలుగుతుంది. ఇతరులను బాధించటమే క్రోధము యొక్క ముఖ్యలక్షణము. అంకుశము అంటే ఏనుగును పొడిచి నడిపించే ఆయుధము. అనగా బాధించేది. కాబట్టే క్రోధానికి గుర్తుగా దేవి కుడి చేతిలో అంకుశమున్నది.

ఇది భక్తులకు జ్ఞానరూపము. దుష్టులఎడ అంకుశము. క్రోధమనేది రజోగుణము. అట్టి క్రోధాకారమైన అంకుశము చేతియందు గలది ఆ పరమేశ్వరి. చతుశ్శతిలో చెప్పినట్లుగా

**పాశాంకుశౌ తదీయౌ తు రాగద్వేషాత్మకే స్మృతౌ**

దేవి పాశము అంకుశము ధరించి ఉంటుంది. అవి రాగద్వేషాలకు ప్రతీకలు. యోగినీహృదయంలో

**ఇచ్ఛాశక్తిమయం పాశం అంకుశం జ్ఞానరూపిణం**
**క్రియాశక్తిమయే బాణధనుషీ దధ దుజ్జ్వలమ్ ॥**

పాశము - ఇచ్ఛాశక్తి. అంకుశము - జ్ఞానరూపము. ధనుర్బాణములు క్రియాశక్తిమయాలు.

ఏదైనా జీవి హింసించబడేటప్పుడు, అది ఆ బాధ భరిస్తూ, ఎదిరించలేక "ఓ దేవీ! నన్ను హింసిస్తున్నారు. వారిని ఎదిరించే సామర్థ్యము నాకులేదు. ముందు జన్మలోనైనా ఇటువంటి వారిని ఎదిరించే సాహసము నాకు కలుగజెయ్యవలసినది" అని ఏడుస్తూ ప్రార్థిస్తుంది. ఈ జన్మలో దాని శరీరము నశించినప్పటికీ ప్రతీకారజ్వాల మాత్రం దాని మనసును అంటిపెట్టుకుని ఉంటుంది. అప్పుడు మరుజన్మలో ఆ జీవికి అది క్రోధము అవుతుంది. ఈ విధంగా ప్రపంచంలో జరిగే ప్రతి హింసా ప్రవృత్తికీ గతజన్మలోని అనుభవాలే కారణము. అదే పరమేశ్వరి చేతిలోని అంకుశశక్తి. పాపం చేసినటువంటి వారికి ఇది అంకుశము. మిగిలినటువంటివారికి ఇది ఆభరణము. శ్రీచక్రంలోని ఎనిమిదవ ఆవరణ అయిన త్రికోణంలో దీన్ని పూజిస్తారు.

**ఓం ఐం హ్రీం శ్రీం క్రోం క్రోం సర్వస్తంభనాభ్యాం**
**కామేశ్వరీ కామేశ్వరాంకుశాభ్యాం నమః అంకుశశక్తి**
**శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః**

దుర్వాసుడు శ్రీ దేవీ మహిమ్నః స్తుతిలోని 44వ శ్లోకంలో అంకుశాన్ని ధ్యానిస్తూ

**యః స్వాన్తే కలయతి కోవిద స్త్రీస్లోకీ**

**స్తంభారంభణచణ మత్యుదారవీర్యం ।**

**మాత స్తే విజయమహాంకుశం స యోషా**

**న్దేవాన్స్తమ్భయతి చ భూభుజోఽన్యసైన్యమ్ ॥**

తల్లీ ! ముల్లోకములను స్తంభింపచేయకల నీ అంకుశబీజమును ఉపాసన చేసేవాడు సకల స్త్రీలను, దేవతలను, రాజులను, శత్రువులసైన్యాలను కూడా స్తంభింపచేయగలుగుతాడు.

## 10. మనోరూపేక్షు కోదండా

జ్ఞానేంద్రియాలు కర్మేంద్రియాలు అనేవి ప్రతిజీవికి ఉంటాయి. అందుచేతనే ఆహార నిద్రామైథునాలు జీవులన్నింటికీ సమానంగానే ఉంటాయి. కాని సంకల్పవికల్పాలకు కారణమైనది మనస్సు. ఇది పదకొండవ ఇంద్రియము. మానవుడికి మాత్రమే ఉంటుంది. దీనివల్లనే మానవుడికి యుక్తాయుక్త విచక్షణ అనేది ఉంటుంది. ఏది ధర్మం. ఏది అధర్మం అనే విషయాలు నిర్ణయించుకోగలుగుతాడు.

మనోరూపమైన చెరకువిల్లును ఎడమవైపు క్రిందిచేతితో ధరించి ఉంటుంది. బాణం వెయ్యాలి అంటే ఎడమచేత్తో ధనుస్సును పట్టుకుని కుడిచేతితో నారిసారించి బాణం వదలాలి. అందకని పరమేశ్వరి ఎడమచేతిలో ధనుస్సు ఉంటుంది. ఇది క్రియాశక్తి.

మన్మథుడి ఆయుధం చెరకు విల్లు. అందుచేతనే కాళిదాసు ఆ దేవిని స్తుతిస్తూ

**పుండ్రేషుపాశాంకుశ పుష్పబాణ హస్తే !**

అంటాడు. అంటే చేతిలో చెరకు విల్లు, పాశము అంకుశము, ధరించినది. మన్మథుడు అంటే మనసును మథించేవాడు. అతడి యొక్క విల్లు తీయనైన చెరకుతో చేయబడింది. అదేవిధంగా పరమేశ్వరి చేతిలోని విల్లుకూడా చెరుకువిల్లే. ఆవిడ మనసు కూడా మధురమైనదే. కోదండము శతృభయంకరము. మనసు చంచలమైనది. దానికి స్థిరత్వం ఉండదు. అందుకే మనసు కోతిలాంటిది. కోతి ఒక కొమ్మ మీదనుంచి ఇంకొక కొమ్మమీదకు ఏవిధంగా గెంతుతుందో, అదేవిధంగా మనసు కూడా ఒక విషయం నుంచి ఇంకొక విషయం మీదకు వెడుతూ ఉంటుంది. మనసును నిశ్చలం చెయ్యగలిగితే సమాధిస్థితి వచ్చినట్లే. ఎప్పుడైతే సమాధిలోకి వెళ్ళగలిగాడో, అప్పుడు అతడికి

ఆత్మసాక్షాత్కారమైందన్న మాటే. అటువంటివ్యక్తికి విశాలమైన ఈ విశ్వమంతా రజ్జు సర్పభ్రాంతి అనిపిస్తుంది. ఇంకా చెప్పాలంటే మనసును ఏకాగ్రం చెయ్యగలిగిన వాడికి ఆత్మసాక్షాత్కారం త్వరగా జరుగుతుంది.

విషయమే ఆకారంగా గలది మనసు. జీవుల యొక్క మనోవృత్తియే దేవి చేతిలో ఉన్న కోదండము. మనసు అనేది కామనాశక్తి

సంకల్పవికల్పాలనబడే పదకొండు మనోవృత్తులచేత ప్రభవించే కర్మాగారమే మనస్సు. అవి :

| | | | |
|---|---|---|---|
| 1. కామము | 4. శ్రద్ధ | 7. అధృతి | 10. భీః |
| 2. సంకల్పము | 5. సత్యము | 8. శ్రీః | 11. ధీః |
| 3. వికల్పము | 6. ధృతి | 9. హ్రీః | |

ప్రతిజీవికి తన మనసులో ఉండే ప్రీతి విశ్వాసాలు ఇక్షుభావసూచితాలు. ఈ పదకొండు మానసిక అవాంతర భేదములు. మనసులోని ఈ అవాంతరము ప్రాణి యొక్క జ్ఞానాన్ని బట్టి ఉంటుంది. ఇవి సామాన్యుడి యందు ఒక రకంగా ఉంటే ఉత్తముడియందు ఇంకొక రకంగా ఉంటాయి. పామరుడికి నిత్యము సత్యము అనిపించే ఈ జగత్తు జ్ఞానికి అనిత్యము అనిపిస్తుంది. అస్థిరము అనిపిస్తుంది.

జీవియొక్క స్థూలదేహము నశిస్తుంది. కాని సూక్ష్మదేహము నశించదు. అది గతజన్మలో చేసిన పాపపుణ్యాలవల్ల లభించే స్వర్గనరకాలనుభవించి కర్మఫలశేషాన్ని అనుభవించటానికి ఇంకొక జన్మ ఎత్తుతుంది. గత జన్మ చివరలో ఏ కోరికలుంటాయో, దేన్ని గురించైతే మరణకాలంలో తీవ్రంగా ఆలోచిస్తుంటాడో వాటియొక్క వాసనలు ఈ జన్మలో కూడా ఉంటాయి. వాటికి తోడుగా క్రొత్తవి కూడా వస్తాయి. వీటన్నింటినీ ప్రవర్తింపచేసేవాడు పరమేశ్వరుడు. మనస్సు అనేది క్రియాశక్తి. అందుచేతనే క్రియాశక్తి రూపమయిన ధనుస్సు మనస్సుగా చెప్పబడుతోంది. నవావరణ పూజలో ఎనిమిదవ ఆవరణలో దేవి ఆయుధమయిన ధనుస్సును పూజిస్తారు.

**ఓం ఐం హ్రీం శ్రీం థం ధం సర్వసమ్మోహనాభ్యాం**
**కామేశ్వరీ రమేశ్వధనుర్భ్యాం నమః ధనుః శ్శక్తి**
**శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః**

దుర్వాస మహర్షి శ్రీ దేవీ మహిమ్నః స్తుతిలోని 41వ శ్లోకంలో దేవి ఆయుధమైన ధనుస్సును ధ్యానిస్తూ

**అథ తవ ధనుః పుండ్రేక్షూకృత్ ప్రసిద్ధ మతిద్యుతి**
**త్రిభువన వధూ ముద్య జ్యోత్స్నా కలానిధి మండలం**
**సకలజనని ! స్మారం స్మారం గతః స్మరతాం నరః**
**త్రిభువన వధూ మోహామ్భోధేః ప్రపూర్ణవిధు ర్భవేత్ ॥**

తల్లీ నీ చేతిలో ఉన్న పుండ్రేక్షుచాపము లోకాలలోని సుందరీమణుల మనస్సులలో విరహ బాధ కలిగిస్తుంది. అటువంటి నీ దుఃఖబీజాన్ని ఉపాసించే వాడు స్త్రీలను వశం చేసుకోగలుగుతాడు.

## 11. పంచతన్మాత్రసాయకా

ఈ నామంలో దేవి చేతిలోని బాణాలను వివరిస్తున్నాడు. పరమేశ్వరి చేతిలో ఐదుబాణాలుంటాయి. అవి.

**పంచసంఖ్యాని తన్మాత్రాణి శబ్దాదీని విషయాః, త దేవ తన్మాత్రమ్**

తన్మాత్రలు ఇవి ఐదు. శబ్ద స్పర్శ రూప రస గంధాలు. పంచభూతాల యొక్క సూక్ష్మరూపాలు. వీటివల్లనే భూతపంచకము సృష్టించబడింది. సృష్టి ప్రారంభం కాకముందు కృతయుగానికి ఆరంభంలో నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ బిందు రూపంలో ఉండేవాడు. గతంలో ప్రళయం సంభవించినప్పుడు కర్మ పరిపక్వము కాకుండా తనలో లీనమైనటువంటి జీవరాసులన్నింటికి వాటి కర్మను క్షయం చేసి, వాటికి ముక్తి కలిగించాలనే కోరికతో మళ్ళీ సృష్టి ప్రారంభించాలి అనుకున్నాడు. అప్పుడు తన నుంచి కొంతశక్తిని బయటకు పంపాడు. అదేశక్తి. విమర్శాంశ. ఆ శక్తి నుండే ఈ జగత్తంతా ఉద్భవించింది. ముందుగా శబ్ద స్పర్శ రూప రస గంధాలనబడే తన్మాత్రలు ఆవిర్భవించాయి. వాటి నుంచి పంచభూతాలయిన భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశము ఉద్భవించాయి. ఈ రకంగా పంచభూతాలు తన్మాత్రల నుంచి ఆవిర్భవించాయి. సృష్టి మొత్తం తన్మాత్రల నుంచి ఆవిర్భవించింది. సృష్టి మొత్తం తన్మాత్రల ఆధారంగానే జరిగింది. అది ఎలాగంటే పంచభూతాలు, తన్మాత్రలు కూడా పంచీకరణం చెందాయి. ఇవి గుణత్రయంతో కలియటం చేత సృష్టి జరిగింది. ఈ రకంగా సృష్టికి ఆధారమైనవి తన్మాత్రలు. ఆ తన్మాత్రలు బాణాలుగా పరమేశ్వరి కుడిచేతి యందు ఉంటాయి. వామకేశ్వరతంత్రంలో చెప్పినట్లుగా

**శబ్ద స్పర్శా దయో బాణాః మన స్తస్యాః భవద్ధనుః**

శబ్ద స్పర్శాదులే బాణాలు. మనస్సే ఆమె ధనుస్సు. కాదిమతంలో బాణాలు మూడురకాలు అని చెప్పబడింది.

**బాణా స్తు త్రివిధా ప్రోక్తాః స్థూల సూక్ష్మ పరత్వతః ।**
**స్థూలాః పుష్పమయాః సూక్ష్మాః మంత్రాత్మనః సమీరితాః**
**పరా శ్చ వాసనాయాం తు ప్రోక్తా**

బాణాలు మూడురకాలు. 1. స్థూలములు 2. సూక్ష్మములు 3. పరములు

| | | |
|---|---|---|
| 1. స్థూలములు | – | పుష్పమయములు |
| 2. సూక్ష్మములు | – | మంత్రాత్మకములు |
| 3. పరములు | – | వాసనామయములు (ఆం ఈం ఊం) |

**కమలం కైరవం రక్తం కల్హారేన్దీవరే తథా ।**
**సహకారక మిత్యుక్తం పుష్పపంచక మీశ్వరీ!**

| | | |
|---|---|---|
| కమలము | – | ఎర్రతామర |
| రక్తకైరవము | – | ఎర్రకలువ |
| కల్హారము | – | తెల్లకలువ |
| ఇందీవరము | – | నల్లకలువ |
| సహకారము | – | మామిడిపూవు |

ఇవి వసంత ఋతువులో తాపాన్ని రేకెత్తించేవి. కాలికాపురాణంలో ఈ బాణాలను వివరిస్తూ

**హర్షణం రోచనాఖ్యం చ మోహనం శోషణం తథా ।**
**మారణం చే త్యమీ బాణా మునీనా మపి మోహదాః ॥**

| | | |
|---|---|---|
| హర్షణము | – | హర్షము కలుగచేయునది |
| రోచనము | – | ప్రకాశింపచేయునది |
| మోహనము | – | మోహమును కలిగించునది |
| శోషణము | – | ఎండించునది, శోషిల్ల చేయునది |
| మారణము | – | నశింపచేయునది |

ఇవి మునీశ్వరులకు కూడా మోహము చేకూరుస్తాయి.

జ్ఞానార్ణవతంత్రంలో ఈ బాణాలను

**క్షోభణం ద్రావణం దేవి ! తథాకర్షణ సంజ్ఞకం ।**
**వశ్యోన్మాదౌ క్రమేణైవ నామాని పరమేశ్వరి! ॥**

| | | |
|---|---|---|
| క్షోభణము | – | క్షోభమునకు సాధనమైనది |
| ద్రావణము | – | పారద్రోలునది, కరిగించునది |
| ఆకర్షణము | – | ఆకర్షణ సాధనమైన కర్మ విశేషము |
| వశ్యము | – | వశము చేసుకోతగినది. |
| ఉన్మాదము | – | ఉన్మథనము, పీడించునది, చంపునది |

ఇవి శత్రుసంహారానికి ఉపయోగిస్తాయి. తంత్రరాజములో ఆ బాణాలను

**మదనోన్మాదనౌ పశ్చా త్తథా మోహనదీపనౌ ।**
**శోషణ శ్చేతి కథితా బాణాః పంచ వురోదితా ॥**

| | | |
|---|---|---|
| మదనము | – | వసంతకాలము |
| ఉన్మాదము | – | పీడించునది, చంపునది |
| మోహనము | – | మోహమును కలిగించునది |
| దీపనము | – | రగుల్చునది, ప్రేరేపించునది |
| శోషణము | – | ఎండించునది, శోషింపచేయునది |

విరాగులకు కూడా తాపాన్ని కలుగచేసే సాధనాలు. పరమేశ్వరి చేతిలోని బాణాలు మదనతాపాన్ని పెంచేవి. ద్రాం ద్రీం క్లీం బ్లూం సః అనేవి వీటి బీజాలు.

**ఓం నమో భగవతే కామదేవాయ, ద్రాం ద్రాం ద్రావణ**
**బాణాయ, ద్రీం ద్రీం సందీపనబాణాయ, క్లీం క్లీం**
**సమ్మోహన బాణాయ, బ్లూం బ్లూం సంతాపనబాణా**
**య, సః సః వశీకరణబాణాయ, హ్రీం హ్రీం మదనా**
**వేశయావేశయ, సకలజనచిత్తం ద్రావయ ద్రావయ**
**కంపిత కపిత హుంఫట్ స్వాహా ॥**

ఓంకారాన్ని ప్రణవము అంటారు. ప్రణవసహితమైన మంత్రాలే వైదికమంత్రాలు. అవే మోక్షకారకాలు. ప్రణవంలేని మంత్రాలు తాంత్రికాలు

**వైదికా ప్రణవైర్యు తాః । ప్రణవేన్యఃవిహీనం తు తాంత్రికా ఏవ ప్రకీర్తితాః**

వేదమంత్రాలకు, మహామంత్రాలకు అన్నింటికీ ముందు ఓంకారముంటుంది. ఓం నమశ్శివాయ, ఓం నమోనారాయణాయ. అయితే పరమేశ్వరి మంత్రమైన షోడశిలోగాని, పంచదశిలోగాని ఓంకారముండదు. కాబట్టి ఇది మహామంత్రంకాదని, తాంత్రికమని ఒక వాదన ఉంది. అది నిజంకాదు. శాస్త్రం తెలియకుండా చెప్పే మాటలవి. పంచదశీ మహామంత్రానికి అర్థం సృష్టి స్థితి లయకారకుడైన పరమేశ్వరుడు అని. షోడశిలో కూడా పంచదశి మహామంత్రం పునరావృతమవుతుంది. కాబట్టి షోడశిమంత్రానికి కూడా అర్థం పరమేశ్వరుడు అనే. అదీగాక ఓంకారాన్ని ప్రణవము అంటారు. అలాగే శక్తిప్రణవాలు ఐదున్నాయి. శ్రీం హ్రీం క్లీం ఐం సౌః. పరమేశ్వరి మంత్రాలయిన బాల, షోడశిలలో ఇవి ఉంటాయి. అందుచేతనే అవి మహామంత్రాలయినాయి. పంచదశి షోడశిమంత్రాల మీద వివరణకు నా చే వ్రాయబడిన "శ్రీవిద్యా పంచదశి" చూడండి.

శ్రీచక్రంలోని ఎనిమిదవ ఆవరణలో బాణాలను పూజిస్తారు.

**ఓం శ్రీం హ్రీం శ్రీం యం రం లం వం సం ద్రాం ద్రీం క్లీం బ్లూంసః**

**సర్వజంభనేభ్యః । కామేశ్వరీ కామేశ్వరబాణేభ్యో నమః । బాణశక్తి శ్రీ పాదుకాం పూజయామి నమః ॥**

ఇక్కడ పరమేశ్వరి చేతిలోని ఐదు బాణాలు శ్రీం హ్రీం క్లీం ఐం సౌః అనేవి శక్తి ప్రణవాలు. ఈ రకంగా పరమేశ్వరిచేతిలోని బాణాలను ఉపాసించే వాడు ముల్లోకాలను వశం చేసుకోగలుగుతాడు. ఆ పరమేశ్వరి కృప ఉంటే సాధించలేనిది ఏదీ లేదు. వామకేశ్వరతంత్రంలో చెప్పినట్లుగా

**పాశాంకుశౌ తదీయౌ తు రాగద్వేషాత్మకౌ స్మృతౌ**
**శబ్ద స్పర్శాదయో బాణాః మనఽస్తస్యాభవ ద్ధనుః**
**కరణేంద్రియచక్రస్థాం దేవీం సంవిత్స్వరూపిణీం**
**విశ్వాహంకారపుష్పేణ పూజయే త్సర్వసిద్ధిభాక్ ॥**

దేవి యొక్క పాశాంకుశాలే రాగద్వేషాలు. పంచతన్మాత్రలే బాణాలు. మనస్సే ఆమెచేతిలోని ధనుస్సు. అంటే సాధకుడు రాగద్వేషాలను విడిచి, మనస్సును నిశ్చలంచేసి అహంకారమనే పుష్పంతో ఆ పరమేశ్వరిని అర్చించినట్లైతే అనగా అరిషడ్వర్గాలను జయించి ఆ పరమేశ్వరిని ఆశ్రయించినట్లైతే సర్వసిద్ధులూ పొందుతాడు.

## 12. నిజారుణప్రభాపూరమజ్జద్బ్రహ్మాండ మండలా

అరుణ కాంతులలో మునిగినటువంటి బ్రహ్మాండములు గలది. అంటే ప్రాతః కాలములో ఏ రకమైన కాంతులు ఉంటాయో అటువంటి కాంతులు గలది. వేదాలలో **తామగ్ని వర్ణాం తపసాజ్వలంతీం** అని చెప్పబడింది. ఆ దేవి అగ్నివర్ణములో ప్రకాశిస్తుం టుంది. అలాగే **ఆదిత్యవర్ణే తపోసోదిజాతో** అన్నారు. ఆదిత్యుడు అంటే బాలభానుడు. ఆరవనామంలో ఆమె 'ఉద్యద్భానుసహస్రాభా' అని చెప్పబడింది. అంటే ఉదయిస్తున్న కొన్నివేల సూర్యులకాంతి గలది. ఎరుపు తెలుపు కలిసిన పాటల వర్ణము గలది. ధ్యాన శ్లోకంలో **అరుణాంకరుణా తరంగితాక్షీం.** అని **సింధూరారుణ విగ్రహాం** అని చెప్పబడింది. ఆ పరమేశ్వరి మంకెన్నపూవ్వులాగా ఎర్రని కాంతులు విరజిమ్ముతుంటుంది. అందుకే **సకుంకు విలేపనా........... జపాకుసుమభాసురాం...** అని చెప్పబడుతోంది. అలాగే **జపాకుసుమసంకాశౌ మధుఘూర్ణితలోచనౌ** అని శివశక్తులను ధ్యానంచేస్తున్నారు. వీటన్నింటివల్ల దేవి అరుణారుణచ్ఛాయతో ప్రకాశిస్తున్నదని తెలుస్తోంది. పరమేశ్వరి తన దేహకాంతులతో బ్రహ్మాండాలన్నీ ముంచివేస్తోంది. 'దేవి చిదగ్నికుండ సంభూత' కాబట్టి ఆమె దేహము నుండి కాంతులు ప్రసరిస్తున్నాయి. ఆమె 'నిజారుణప్రభాపూర' అంటే ఆమె దేహానికి ఉన్న కాంతికిరణాలు స్వతహాగా ఉన్నవే కాని సూర్యకాంతివల్లగాని, అగ్ని తేజమువల్లగాని, ఇతర కారణాలవల్లగాని వచ్చినవికావు. ఈ జగత్తులో కాంతులను ప్రసరించే పదార్థాలన్నీ ఆ దేవి శరీరం నుంచి గ్రహించినవే. ఈ విషయాన్ని గతంలో వివరించటం జరిగింది. దేవి శరీరం నుంచి అనేకకోట్ల కాంతి కిరణాలు ప్రసరిస్తున్నాయి. వాటిలో అగ్ని 108, సూర్యుడు 116, చంద్రుడు 136 కిరణాలను తీసుకున్నారు. ఈ జగత్తు పగటిపూట సూర్యుని వెలుగులచేత, రాత్రులందు చంద్రకిరణములచేత, సంధ్యవేళల యందు అగ్నివల్ల ప్రవర్తిల్లుతున్నది. ఈరకంగా బ్రహ్మాండమంతా ఆమెవల్లనే ప్రకాశిస్తున్నది. అంతేకాని ఆమెకు కాంతిని, ప్రకాశాన్ని ఇచ్చే శక్తి మరి దేనికీ లేదు. ఆమె స్వయంప్రకాశ రూపిణి. పరమేశ్వరి కాంతిమండలము చాలాపెద్దది. ఈ బ్రహ్మాండం కన్న విశాలమైనది. బ్రహ్మాండముకన్న విస్తృతమైన కాంతి మండలముతో అరుణారుణకాంతులతో ఆ దేవి వెలుగొందుచున్నది.

## 13. చంపకాశోకపున్నాగసౌగంధికలసత్కచా

పరమేశ్వరి అగ్నికుండము నుండి ఆవిర్భవించింది. కాబట్టి ముందుగ తలపైకి వచ్చింది. అందుచేతనే దేవిని వర్ణించేటప్పుడు పాదాల దగ్గరనుండికాక తల దగ్గరనుండి వర్ణించటం జరుగుతుంది.

ఇక్కడ ముందుగా దేవి కేశాలను వర్ణించటం జరుగుతోంది. ఆ పరమేశ్వరి ఆవిర్భవించినప్పుడు దేవతలందరి శక్తులతోను ఆమె ఉద్భవించింది. అప్పుడు

**యామ్యేన చా భవన్ కేశా, బాహవో విష్ణు తేజసా**

యముని యొక్క తేజస్సుతో వెంట్రుకలు వచ్చినాయి. ఆ కేశాలు సంపంగి, అశోకము, పున్నాగము మొదలైన పూలవాసనలతో గుబాళిస్తున్నాయి. ఇక్కడ గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే దేవి ఆ పూవులను ధరించటంవల్ల, వెంట్రుకలకు ఆ సువాసన రాలేదు. దేవి ధరించటంచేతనే పూలకు ఆ వాసన వచ్చింది. అంటే దేవి కేశపాశములు సహజ సుగంధములు. విశ్వరూప వర్ణనలో వనస్పతులే దేవి కేశపాశాలయినాయని చెప్పబడింది. దుర్వాసుడు శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 37వ శ్లోకంలో దేవి కురులను శ్లాఘిస్తూ

**జాతీ చంపక కుంద కేసర రజో గంధోత్కిర త్కేతకీ**
**నీపాశోక శిరీష ముఖ్యకుసుమైః ప్రోత్తంసితాధూపితా**
**ఆనీలాంగన తుల్య మత్త మధుప శ్రేణీవ వేణీ తవ**
**శ్రీమాతః ! శ్రయతాం మదీయ హృదయామ్భోజం సరోజాల యే ॥**

ఓ తల్లీ ! సంపెంగ, మొగలి, మొల్ల, కడిమి, అశోక, దిరిశెన మొదలైన పూలు అలంకారములుగ గలిగి అగరు మొదలైన ధూపములు వేయబడి దట్టమైన నీలవర్ణముగల, కాటుకతో సమానమైన, తుమ్మెదల వరుసవలె ప్రకాశించే నీ కురులు నా హృదయ పద్మమును ఆశ్రయముగా చేసుకొని ఉండాలి. అంటే నీ యొక్క వేణిని నేను భావన చేస్తున్నాను అన్నాడు. సౌందర్య లహరిలోని 43వ శ్లోకంలో శంకరభగవత్పాదులవారు

**ధునోతు ధ్వాన్తం న స్తులితదళితేన్దీవర వనం**
**ఘనస్నిగ్ధశ్లక్ష్ణం చికురనికురుంబం తవ శివే !**
**యదీయం సౌరభ్యం సహజ ముపలబ్ధుం సుమనసో**
**వస న్త్యస్మి న్మన్యే వలమథనవాటీ విటపినామ్ ॥**

తల్లీ ! వికసించుచున్న నల్లకలువల తండమును దీటుగా చేసుకున్నది, కారుమబ్బుల వలె దట్టమైన, చిక్కనైన, నునుపైన సుగంధితైలముతో కూడుకొన్నదాని లాగా మెత్తదనము గలది అగు నీ కురుల జడ మా అజ్ఞానాన్ని పోగొట్టుగాక, అమ్మా ! నీ కేశపాశము యొక్క సహజ సౌరభమును ప్రాపించుటకు దేవేంద్రుని నందనోద్యానమందలి కల్పవృక్షముల పుష్పములు నీ కేశసముదాయము నాశ్రయించి ఉన్నాయి.

పంచదశీ మహామంత్రంలో మూడు భాగాలున్నాయి. వాటిని విడివిడిగా మూడు కూటములు అంటారు. అవి. 1. వాగ్భవకూటమి. 2. కామరాజకూటమి 3. శక్తికూటమి. మానవదేహం కూడా ఈ రకంగానే మూడు కూటములుగా విభజించబడింది. అందులో తలభాగాన్ని వాగ్భవకూటమి అంటారు. హోమకుండము నుంచి వచ్చేటప్పుడు ముందుగా వాగ్భవకూటమి ఆవిర్భవించింది.

## 14. కురువిందమణిశ్రేణీకనత్కోటీరమండితా

కామము అనురాగము మొదలయిన గుణములు కలమణులను 'కురువిందమణులు' అంటారు. ఈ మణులన్నీ 'రావణగంగ' అను నదీతీరంలో దొరకుతాయి. ఆ నదిలో దొరికే సౌగంధికము, కురువిందము, స్పటికముల నుండి పుట్టిన వాటిని మణులు అంటారు. వీటిలో కురువిందముల నుండి పుట్టినవి పద్మరాగమణులు అంటారు. ఈ మణులు మంకెనపువ్వు, దాసానిపువ్వు, రక్తవర్ణము, దానిమ్మగింజలరంగులో ఉంటాయి. ఈ రకంగా కురువిందములనుండి పుట్టిన మణులు శ్రేష్ఠమైనవి. స్వచ్ఛమైన కాంతిగలవి. స్పటికములనుంచి పుట్టిన వాటికి ఈ లక్షణాలుండవు. ఈ విషయాలన్నీ గరుడపురాణంలో చెప్పబడ్డాయి.

పరమేశ్వరి యొక్క కిరీటము పద్మరాగమణులతో ప్రకాశిస్తున్నది. ఆ మణులయొక్క ఎరుపుదనము భక్తుల యొక్క భక్తిని ప్రవర్తిల్ల చేస్తుంది. అమ్మవారు ఎరుపురంగులో ఉంటుంది. ఎర్రని వస్త్రములు ధరిస్తుంది. ఎర్రని పూలు ధరిస్తుంది. ఆమె కిరీటంలోని మణులు కూడా ఎరుపురంగు గలవే.

కురువిందములు మణులు రెండుపదాలుకావు. అది ద్వంద్వ సమాసము అంతకన్న కాదు. అలా ఎవరైనా చెప్పినట్లైతే వారికి రత్నోత్పత్తిని గురించి తెలియదు. అని చెప్పాల్సి ఉంటుంది.

మాణిక్యములు నాలుగు రకాలు. అవి దొరికే ప్రదేశాన్ని బట్టి ఈ విభాగం చెయ్యబడ్డది. వీటిలో.

1. సింహళంలో దొరికేవి పద్మరాగాలు. ఇవి శ్రేష్టమైనవి.
2. కొల్హాపురము నందు దొరికే పద్మరాగాలు కొద్దిగా పసుపు రంగు కలిగి ఉంటాయి.
3. ఆంధ్రదేశంలో దొరికే వాటిని సౌగంధికాలు అంటారు. ఇవి మధ్యరకానికి చెందినవి.
4. తుంబురమున దొరికేవి కొద్దిగా నీలంరంగులో ఉంటాయి. ఇవి తక్కువజాతివి.

**కామానురాగః కురువిందజేషు యాస్తానతాదృక్ స్ఫటికోద్భవేషు**
**మాంగల్యయుక్తాన్ హరిభక్తిదాశ్చ వృద్ధిప్రదాస్తే స్మరాణాద్భవన్తి.**

కామము అనురాగము అనేగుణాలు గలవి కురువిందమణులు. వాటి నుండి పుట్టిన మణులచేత అలంకరించబడిన కిరీటము గలది ఆ దేవి. అటువంటి పరమేశ్వరిని ధ్యానించుట సర్వమంగళప్రదము.

పరమేశ్వరి కిరీటంలో పొదగబడినవి మణులు కాదు. మణులని భ్రమింపచేసే ద్వాదశాదిత్యులు అంటారు శంకరభగవత్పాదులు తమ సౌందర్యలహరిలోని 42వ శ్లోకంలో

**గతై ర్మాణిక్యత్వం గగనమణిభి స్సాంద్రఘటితం**
**కిరీటం తే హైమం హిమగిరిసుతే ! కీరయతి యః**
**స నీడే యచ్ఛాయాచ్ఛురణ శబలం చంద్రశకలం**
**ధను శ్శౌనా సీరం కి మితి న నిబధ్నాతి ధిషణామ్ ॥**

హిమవంతుని పుత్రికవగు ఓ తల్లీ ! ఆకాశంలో ప్రకాశించే ద్వాదశాదిత్యులనబడే మాణిక్యములచే కూర్చబడి, తయారుచేయబడినదైనటువంటి నీ బంగారు కిరీటమును ఎవడు వర్ణించుచున్నాడో, అతడు నీకు పాపటబొట్టుగా ఉన్న చంద్రరేఖను గాంచి, అది ఇంద్రధనుస్సే అని భ్రమిస్తాడు.

కిరీటంలోని ఎర్రనికాంతులు గాయత్రీవర్ణద్యోతకము అని కొందరు చెబుతారు. కాగా గుంటూరు శృంగేరీ శ్రీవిరూపాక్షపీఠవ్యవస్థాపకులైన శ్రీశ్రీశ్రీ కళ్యానానందభారతి ఈ కాంతులు శ్రీకళాయంత్రంలోని అనేకవృత్తాలను తెలుపుతాయి అంటారు.

## 15. అష్టమీ చంద్రవిభ్రాజదళికస్థలశోభితా

చంద్రుని యొక్క అష్టమికళ ఏ తిథిన ఉంటుందో అది అష్టమి తిథి అనబడుతుంది. అష్టమిరోజున చంద్రుడు సమంగా ఉంటాడు. అంటే అర్ధచంద్రుడు. అగ్నిపురాణంలో అర్ధచంద్రాకారమైన నొసటి ప్రదేశంతో ప్రకాశించే పరమేశ్వరి అని చెప్పబడింది.

దేవతల తలమీద కిరీటం ఉంటుంది. కాబట్టి ఆమె ముఖము అర్ధచంద్రాకారంగా కనిపిస్తుంది. ఇది అష్టమినాటి చంద్రుడికి ప్రతీక.

చంద్రుడికి పదహారు కళలున్నాయి.

**దర్శాద్యా : పూర్ణిమాంతాస్తు కళా పంచద శైవ తు ।**
**షోడశీ తు కళా జ్ఞేయా సచ్చిదానందరూపిణీ ॥**

పాడ్యమి దగ్గరనుంచి పూర్ణిమ వరకు తిథులు పదిహేను పదహారవకళ సాక్షాత్తూ సచ్చిదానందస్వరూపిణి అయి ఉన్నది.

చంద్రుని యొక్క పదహారుకళలు సూర్యునిలో దాగి ఉంటాయి. శుద్ధపాడ్యమి అంటే అమావాస్య తరువాత పాడ్యమి నుంచి ప్రతిరోజు ఒక కళ సూర్యుడి నుంచి వచ్చి చంద్రునిలో ప్రవేసిస్తుంది. ఆరకంగా పదిహేను కళలు వచ్చి చంద్రునిలో చేరిన రోజును పూర్ణిమ అంటారు. ఆ తరువాత ప్రతిరోజూ ఒక్కొక్క కళ చంద్రుని నుంచి విడిపోయి సూర్యునిలో చేరిపోతుంది. ఈ రకంగా పదిహేను కళలు చంద్రుని వదలి వెళ్ళిపోయిన రోజును అమావశ్య అంటారు. ఆ రోజు చంద్రుడు కళావిహీనుడు. ఇవే శుక్ల కృష్ణ పక్షాలు. ఈ రెండింటిలోనూ కూడా అష్టమినాడు చంద్రుడు ఒకే రకంగా ఉంటాడు. అందుచేతనే అష్టమి చంద్రుణ్ణి సమచంద్రుడు అంటారు. ఇతడే అర్ధచంద్రుడు.

తిథులు నిత్యాస్వరూపాలు. నిత్యలు కళాస్వరూపాలు. నిత్యలు మొత్తం పదహారు. వీటిని గురించి వసిష్టసంహితలో వివరించబడింది.

**శృణు దేవి! ప్రవక్ష్యామి నిత్యాషోడశకం తవ ।**
**న కస్యచిన్మయాఖ్యాతం సర్వతంత్రేషు గోపితం ॥**

**తత్రాదౌ ప్రథమా నిత్యా మహాత్రిపురసుందరీ ।**
**తతః కామేశ్వరీ నిత్యా । నిత్యా చ భగమాలినీ ॥**

**నిత్యక్లిన్నా తథా చైవ భేరుండా వహ్నివాసినీ ।**
**మహావిద్యేశ్వరీ రౌద్రీ త్వరితా కులసుందరీ ॥**

**నిత్యా నీలపతాకా చ విజయా సర్వమంగళా ।**
**జ్వాలామాలిని చిద్రూపాః ఏతా నిత్యా స్తు షోడశ ॥**

ఈ నిత్యల గురించి వామకేశ్వరతంత్రంలోని ఖడ్గమాలలో కూడా చెప్పబడింది.

**కామేశ్వరి, భగమాలినీ, నిత్యక్లిన్న, భేరుండ, వహ్నివాసిని, మహావజ్రేశ్వరి, శివదూతి, త్వరిత, కులసుందరి, నిత్య, నీలపతాక, విజయ, సర్వమంగళ, జ్వాలామాలినీ, విచిత్ర, మహానిత్య**

ఇవి పదహారునిత్యలు. ఈ నిత్యలు కళల రూపంలో తిరుగుతుండటంచేతనే చంద్రుడికి వృద్ధి క్షయాలు కలుగుతున్నాయి. శుక్ల కృష్ణ పక్షాలయందున్న తిధులు నిత్యలు ఈ దిగువ ఇవ్వబడ్డాయి.

| శుక్లపక్షము తిథి | నిత్యాదేవత | కృష్ణపక్షము తిథి | నిత్యాదేవత |
|---|---|---|---|
| 1. పాడ్యమి | కామేశ్వరి | 1. పాడ్యమి | చిత్ర |
| 2. విదియ | భగమాలిని | 2. విదియ | జ్వాలామాలిని |
| 3. తదియ | నిత్యక్లిన్న | 3. తదియ | సర్వమంగళ |
| 4. చవితి | భేరుండా | 4. చవితి | విజయ |
| 5. పంచమి | వహ్నివాసిని | 5. పంచమి | నీలపతాక |
| 6. షష్టి | మహావజ్రేశ్వరి | 6. షష్టి | నిత్య |
| 7. సప్తమి | శివదూతి | 7. సప్తమి | కులసుందరి |
| 8. అష్టమి | త్వరిత | 8. అష్టమి | త్వరిత |
| 9. నవమి | కులసుందరి | 9. నవమి | శివదూతి |
| 10. దశమి | నిత్య | 10. దశమి | మహావజ్రేశ్వరి |
| 11. ఏకాదశి | నీలపతాక | 11. ఏకాదశి | వహ్నివాసిని |
| 12. ద్వాదశి | విజయ | 12. ద్వాదశి | భేరుండా |
| 13. త్రయోదశి | సర్వమంగళ | 13. త్రయోదశి | నిత్యక్లిన్న |
| 14. చతుర్దశి | జ్వాలామాలిని | 14. చతుర్దశి | భగమాలిని |
| 15. పూర్ణిమ | చిత్ర | 15. అమావాస్య | కామేశ్వరి |

చంద్రుని యొక్క కళలు ఈ రకంగా మారినప్పుడు తిథి ఒకటే అయినప్పటికీ శుక్ల కృష్ణ పక్షాలలో నిత్యాదేవతలు వేరుగా ఉంటాయి. ఆ విషయం పైన పట్టిక చూస్తే తెలుస్తుంది. కాని రెండు పక్షాల యందు అష్టమినాడు మాత్రం 'త్వరిత' అనబడే నిత్యాదేవతయే ఉంటుంది. దాన్నే త్వరితాకళ అని కూడా అంటారు. అనగా ఎటువంటి మార్పులేనివాడు అష్టమినాటి చంద్రుడు. అందుచేతనే అష్టమినాటి చంద్రునితో దేవి ముఖాన్ని పోల్చటం జరిగింది.

గుండ్రని ముఖానికి పైన కిరీటము పెట్టటంచేత, దేవి యొక్క లలాటము అర్ధ చంద్రాకారంగా అష్టమినాటి చంద్రునిలాగా కనిపిస్తుంది.

శంకరభగవత్పాదులవారు పరమేశ్వరి ముఖారవిందాన్ని వర్ణిస్తూ సౌందర్య లహరి లోని 46వ శ్లోకంలో

**లలాటం లావణ్యద్యుతి విమల మాభాతి తవ యత్**
**ద్వితీయం త న్మన్యే మకుటి ఘటితం చంద్రశకలమ్ ।**
**విపర్యాసన్యాసా దుభయ మపి సమ్భూయ చ మిథః**
**సుధాలేపస్యూతిః పరిణమతి రాకాహిమకరః ॥**

ఓ తల్లీ ! లావణ్యము అనే వెన్నెల చేత ప్రకాశిస్తున్న కిరీటం ధరించినటువంటి నీ లలాటాన్ని రెండవచంద్రబింబముగా తలచెదను. నీ సిగపూవు అర్ధచంద్రము, లలాటము అర్ధచంద్రము. ఆ రెండూ కలిసి పూర్ణచంద్రబింబముగా ప్రకాశిస్తున్నాయి.

## 16. ముఖచంద్రకలంకాభామృగనాభివిశేషకా

దేవి ముఖము చంద్రబింబమువలె ఉన్నది.

**క్వణత్కాంచీదామా కరికలభ కుంభస్తననతా**
**పరిక్షీణామధ్యే పరిణతశరశ్చంద్రవదనా**

అన్నారు శంకరభగవత్పాదులు తమ సౌందర్య లహరిలో. పరిణిత శరశ్చంద్రవదనా. శరత్కాలములో ఉన్నటువంటి పరిణితి చెందిన చంద్రబింబము అనగా శరత్కాల పూర్ణిమనాటి చంద్రబింబమువలె పరమేశ్వరి ముఖమున్నది. అయితే ఆ బింబములో చిన్న మచ్చ కనిపిస్తోంది. ఏమిటది.

**కస్తూరీ తిలకం లలాట ఫలకే**

మృగనాభి విశేషము. కస్తూరి మృగము యొక్క బొడ్డు దగ్గర నుంచి వచ్చిన పదార్ధము. అదే కస్తూరి. దేవి నుదుటన కస్తూరి తిలకము ధరించి ఉన్నది. అది చూడటానికి చంద్రునిలో మచ్చలాగా కనిపిస్తోంది. చంద్రబింబంలో కళంకము అనేది సహజమైనది. చంద్రుడు మనస్సుకు అధిదేవత. మానవుడి మనసు కళంకం కావటం సహజం. అందుచేతనే లోకంలోని మానవుల మనసులాగానే చంద్రబింబం కూడా కళంకమైనది అని చెప్పబడింది. ఆ కళం కానికి గుర్తుగానే దేవి నుదటన కస్తూరి తిలకమున్నది. అందుకే

**సకుంకుమవిలేపనా మళికచుంబికస్తూరికాం ।**

అని చెప్పటం జరుగుతుంది.

చంద్రుడు షోడశకళాయుక్తుడు. పరమేశ్వరి ముఖము చంద్రునితో పోల్చబడింది. అంటే అది పదహారు అక్షరాలు గల షోడశాక్షరీ మహామంత్రము అని గుర్తించాలి. శంకరభగవత్పాదులు తమ సౌందర్య లహరిలోని 44వ శ్లోకంలో

**తనోతు క్షేమం న స్తవ వదన సౌందర్యలహరీ**
**పరీవాహస్రోత స్స రణి రివ సీమన్తసరణిః**
**వహన్తీ సింధూరం ప్రబల కబరీభార తిమిర**
**ద్విషాం బృందై ర్బందీకృత మివ నవీనార్కకిరణమ్ ॥**

ఓ తల్లీ ! నీ వదనము సౌందర్య ప్రవాహము ప్రవహించు మార్గము లాగా ఉన్న నీ సీమంతరేఖ మిక్కిలి బలముగల కేశపాశముల సముదాయములచే బందిగొన్న బాల భానుని కిరణమువలె సింధూరపుబొట్టును ధరించినదై మాకు క్షేమము కలుగచేయుగాక.

## 17. వదనస్మరమాంగల్యగృహతోరణచిల్లికా

చిల్లికా అంటే కనుబొమ. పరమేశ్వరి ముఖము మన్మథుని మంగళగృహము యొక్క బహిర్ద్వారతోరణము. పరమేశ్వరి వదనము అనే మన్మథుని గృహానికి కనుబొమలు తోరణాలు.

ముఖమనే మన్మథగృహానికి కట్టబడిన మంగళతోరణములవలె నున్న కనుబొమలు గలది. దేవి ఆవిర్భవించినప్పుడు ప్రాతఃస్సంధ్య, సాయం సంధ్యల వల్ల ఆమె కనుబొమలు ఏర్పడినాయి.

ఇక్కడ పంచప్రణవాలు చెప్పబడ్డాయి. అవి

| | | |
|---|---|---|
| ఐం | – | వదనము |
| క్లీం | – | స్మర |
| సౌః | – | మాంగల్య |
| శ్రీం | – | గృహము |
| హ్రీం | – | తోరణము |

షోడశి మహామంత్రంలో పంచప్రణవాలు అనులోమ విలోమంగా చెప్పబడ్డాయి. పరమేశ్వరి ముఖము ఎంత అందమైనదో వర్ణిస్తూ దుర్వాసుడు శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 43వ శ్లోకంలో

**ఉద్యత్పూర్ణకలానిధి(శివదనమ్ భక్తప్రసన్నం సదా**
**సంపుల్లాంబుజపత్రకాంతి సుషమాధిక్కారదక్షేక్షణమ్ ।**
**సానందం కృతమందహాస మసకృ త్ర్వాదుర్భవ త్కౌతుకమ్**
**కుందాకారసుదంతపంక్తిశశిభా పూర్ణం స్మరా మ్యంబికే ! ॥**

అప్పుడే ఉదయించిన సూర్యునివలె భక్తులకు ప్రసన్నమై, తామరపూవుల కన్న మిన్న అయిన నేత్రములతో, చక్కని పలువరుసతో మనోహరముగా నీ ముఖము ప్రకాశిస్తున్నది.

సౌందర్య లహరిలోని 47వ శ్లోకంలో శంకరభగత్పాదులవారు దేవి కనుబొమలను వర్ణిస్తూ

**భ్రువౌ భుగ్నే కించి ద్భువనభయభంగవ్యసనిని**
**త్వదీయే నేత్రాభ్యాం మధుకరరుచిరాభ్యాం ధృతగుణమ్**
**ధను ర్మన్యే సవ్యేతరకరగృహీతం రతిపతేః**
**ప్రకోష్ఠే ముష్టౌచ స్థగయతి నిగూఢాంతర ముమే ! ॥**

తల్లీ ! లోకాలకు కలిగే ఉపద్రవాలను తొలగించటంలో ఆసక్తిగల ఓ మాతా ! కొంచెము వంగిన నీ కనుబొమలు తుమ్మెదల వంటి కాంతిగల కనులచేత కట్టబడిన అల్లె త్రాడుగల మన్మథుని యొక్క ధనుస్సుగా తలుస్తాను.

పైన చెప్పిన నామంలో మన్మథుని గృహానికి కట్టిన తోరణాలలాగా దేవి కనుబొమలున్నాయి అంటే, సౌందర్య లహరిలో వాటిని మన్మథుని ధనుస్సుతో పోల్చారు.

## 18. వక్త్రలక్ష్మీ పరీవాహచలన్మీనాభలోచనా

ముఖకాంతి అనే ప్రవాహంలో కదలాడుతున్న చేపల జంటతో సాటి అయిన కనులు గలది. అందుచేతనే దేవి మీనాక్షి అని పేరు పొందింది.

వక్త్రము అంటే ముఖము. ఇది వాగ్భవకూటమి. ఐం బీజాన్ని నిర్దేశిస్తుంది. లక్ష్మీప్రదము. ఐశ్వర్యప్రదము. ఐశ్వర్యము, విద్య రెండూ పెల్లుబుకుతున్న పరమేశ్వరి ముఖపద్మమనే ప్రవాహంలో కదలాడుతున్న చేపల జంటలాగా ఆ దేవి కనుదోయి ఉన్నది. ఇక్కడ దక్షిణనేత్రానికి ఇంద్రుడు, వామనేత్రానికి విరాట్పురుషుడు అధిష్ఠానదేవతలు.

దేవి నేత్రాలను చేపలతో పోల్చటం ఒక విశేషము. చేపలు సంయోగము, సంపర్కము లేకుండానే, కేవలం చూడటంచేతనే సంతానోత్పత్తి చేస్తాయి. వీటి వీక్షణ మాత్రంచేతనే

సంతానానికి ఆహారం లభిస్తుంది. అలాగే భక్తులు కూడా పరమేశ్వరి అనుగ్రహం పొందినట్లైతే వారికి సర్వాభీష్టసిద్ధి కలుగుతుంది. అందుచేతనే ఆమె మీనాక్షి. చేపకనుల వంటికనులు కలది. అంటే వీక్షణమాత్రంచేతనే వాంచితార్ధములిచ్చేది.

సౌందర్య లహరిలోని 48వ శ్లోకంలో శంకరభగవత్పాదులు దేవి కనులను వర్ణిస్తూ

**అహస్యూతే సవ్యం తవ నయన మర్కాత్మ కతయా**
**త్రియామాం వామం తే సృజతి రజనీనాయకతయా ।**
**తృతీయా తే దృష్టి ర్దరదళితహేమామ్బుజరుచి**
**స్సమాధత్తే సన్ధ్యాం దివసనిశయో రన్తరచరీమ్ ॥**

తల్లీ నీ కుడి కన్ను సూర్యుడు. కాబట్టి పగటిని జనింపచేస్తాడు. ఎడమకన్ను చంద్రుడు. కాబట్టి రాత్రిని జనింపచేస్తోంది. నీ మూడవకన్ను అహోరాత్రులకు మధ్య ఉదయసాయంసంధ్యలు కావిస్తున్నది.

ఈ రకంగా దేవికనులు పగలు, రాత్రి, సంధ్యాకాలము, వాటివల్ల పక్షాలు, మాసాలు, సంవత్సరాలు, యుగాలు కలుగుతున్నాయి. వీటన్నింటికీ ఆమె అతీతురాలు. ఆ దేవి నేత్రాలు వివిధరకాలయిన దృష్టులను కలిగి ఉన్నాయి శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 49వ శ్లోకంలో అంటున్నారు.

**విశాలా కల్యాణీ స్ఫుటరుచి రయోధ్యా కువలయైః**
**కృపాధారాన్ ధారా కి మపి మధురాన్ భోగవతికా**
**అవన్తీ సృష్టి స్తే బహునగరవిస్తారవిజయా**
**ధ్రువం తత్తన్నామ వ్యవహరణ యోగ్యా విజయతే ॥**

దేవినేత్రాలు విశాల మొదలు విజయ వరకు ఎనిమిది నగరాలకు ప్రతీకలు.

1. ఆ నేత్రాలు విశాలమైనవి కాబట్టి విశాల నగరానికి ప్రతీక. అంతర్వికాశంతో కూడినది విశాల అనే దృష్టి, దృష్టి అనేది అందరికీ సమానమేకాని కొందరి దృష్టిలో ప్రత్యేకత ఉంటుంది. అలాగే దేవి దృష్టిలో

| | | | |
|---|---|---|---|
| 1. సంక్షోభణము | 3. ద్రావణము | 5. వశ్యము | 7. విద్వేషణ |
| 2. ఆకర్షణము | 4. ఉన్మాదము | 6. ఉచ్చాటన | 8. మారణము. |

అనేవి ఇక్కడ ప్రత్యేకమైనవి. భగవతి ఏ ప్రదేశంలో నిలబడి విశాల అనబడే దృష్టితో జనసంక్షోభం కావించిందో, ఆ ప్రదేశమే విశాలనగరము.

2. కళ్యాణవంతమైన దృష్టికాబట్టి కల్యాణి నగరము చెప్పబడింది. ఈ దృష్టి ఆశ్చర్యము లేక నవ్వుతో కూడినది. దేవి ఏ ప్రదేశంలో కల్యాణీ దృష్టితో జనాకర్షణ గావించిందో, ఆ ప్రదేశము కల్యాణీనగరము.

3. స్ఫుటమైన కాంతి కలిగి నల్ల కలువలకు మించిన సౌందర్యము గలది, అయోధ్యా నగరమునకు ప్రతీక అయినది అయోధ్యా దృష్టి. మొలకనవ్వుతో కూడిన కనుగ్రుడ్లు గల దృష్టిని అయోధ్యాదృష్టి అంటారు. దేవి ఏ ప్రదేశంలో నుంచుని అయోధ్యాదృష్టితో ద్రావణము కావించిందో, ఆ ప్రదేశము అయోధ్య.

4. కృపాసారమృతధారకు ఆధారమైనది దారా నగరము. అలసభావము లేక మాంధ్యము గల దృష్టిని దారాదృష్టి అంటారు. దేవి ఏ ప్రదేశంలో దారాదృష్టితో శత్రువులకు ఉన్మాదం తెప్పించిందో, ఆ ప్రదేశము దారానగరము.

5. అవ్యక్తమధురమై ఇలాంటిది అని చెప్పటానికి వీలుకానిది మధురానగరము. వక్రప్రసారము గల దృష్టిని మధురాదృష్టి అంటారు. దేవి ఏ ప్రదేశంలో శత్రువులను వశీకరణ కావించిందో అది మధురానగరము.

6. పరిపూర్ణత గలిగి, అభోగము కలదైన నగరము భోగవతి. సుందరమై స్నేహముతో కూడిన దృష్టిని భోగవతీదృష్టి అంటారు. దేవి ఏ ప్రదేశంలో శత్రువులకు ఉచ్చాటన చేసిందో, ఆప్రదేశమే భోగవతీ నగరము.

7. భక్తజనావసమై ఆశ్రితరక్షితమైనది అవంతీపురము. యవ్వనారంభదశలో ఉన్న కన్నెదృష్టి అవంతీదృష్టి. ఏప్రదేశంలో దేవి విద్వేషణ చేసిందో ఆప్రదేశము అవంతీ నగరము.

8. విజయాలకునిలయమైనది విజయానగరము. కంటి చివరిభాగాన్ని తాకిన నల్లగ్రుడ్డు గల దృష్టి విజయాదృష్టి. ఏ ప్రదేశంలో దేవి విజయాఖ్యదృష్టితో శత్రుమారణం గావించిందో, ఆ ప్రదేశము విజయానగరము.

ఈ రకంగా పరమేశ్వరి కనులు రకరకాలయిన దృష్టులను కలిగి ఉన్నాయి. అన్నిటికీమించి ఆమె దయార్ద్రుక్కులు ప్రసరిస్తే చాలు వాంఛితార్థాలు ఈడేరుతాయి.

## 19. నవచంపకపుష్పాభనాసాదండవిరాజితా

అప్పుడే వికసించినటువంటి సంపెంగ పూవు వంటి నాసిక కలది. అప్పుడే వికసించింది కాబట్టి సంపంగి పూవు పొడవుగా ఉంటుంది. దేవియొక్క నాసికకూడా పొడవుగా ఉంటుంది. ఇది సాముద్రిక లక్షణం. దాన్నే కోటేరు వేసిన ముక్కు అంటారు.

ఉత్తమజాతి వారికి ముక్కు ఈ విధంగా ఉంటుంది అనేది సాముద్రికం. సాముద్రికం రెండు రకాలు 1. అంగ సాముద్రికం 2. హస్త సాముద్రికం.

హస్త సాముద్రికంలో చేతులు, వ్రేళ్ళు, గోళ్ళు, చేతిలోని రేఖలగురించి చెప్పబడుతుంది.

అంగ సాముద్రికంలో శరీరంలోని అవయవాలన్నింటి గురించి చెప్పబడుతుంది. రామాయణంలోని సుందరకాండలో శ్రీరాముణ్ణి గురించి సీతాదేవితో చెప్పేటప్పుడు హనుమంతుడు రాముని అంగాంగం వర్ణిస్తాడు. అది అంగ సాముద్రిక శాస్త్రప్రకారం ఉంటుంది.

పరమేశ్వరి ఆవిర్భావ కాలంలో ఆమె శరీరం దేవతలయొక్క దివ్యతేజస్సుతో ఆవిర్భవించింది. అందులోను కుబేరుని తేజస్సుతో దేవి నాసాదండము రూపొందింది. ఈ విషయం సప్తశతిలో వివరిస్తూ దేవాసుర సంగ్రామం జరుగుతున్నది. అందులో దేవతలకు ఇంద్రుడు, అసురులకు మహిషుడు నాయకత్వం వహించారు. ఆ యుద్ధంలో దేవతలు పరాజయం పాలయి త్రిమూర్తులను ఆశ్రయించారు. త్రిమూర్తులు కూడా ఏం చెయ్యాలో పాలుపోక దేవతలతో సభ తీర్చారు. ఆ సభలో మహిషునివల్ల బాధింపబడిన దేవతలగోడు విని త్రిమూర్తులు భృకుటి ముడివేశారు. ఆ సమయంలో బ్రహ్మాది దేవతల శరీరంనుంచి గొప్ప తేజస్సు బయటకు వచ్చింది. ఆ తేజస్సంతా ఒక స్త్రీ మూర్తిగా రూపొందింది.

**యదభూచ్ఛామ్భవం తేజ స్తేనాజాయత తన్ముఖమ్ ।**
**యామ్యేన చాభవన్ కేశా బాహవో విష్ణుతేజసా ॥**

**సౌమ్యేన స్తనయోర్యుగ్మం మధ్యం చైంద్రేణ చాభవత్ ।**
**వారుణేన చ జఙ్ఘోరూ నితమ్బస్తేజసా భువః ॥**

**బ్రహ్మణస్తేజసా పాదౌ తదఙ్గుళ్యోఽర్కతేజసా ।**
**వసూనాం చ కరాఙ్గుళ్యః కౌబేరేణ చ నాసికా ॥**

**తస్యాస్తు దన్తాః సమ్భూతా ప్రాజాపత్యేన తేజసా ।**
**నయనత్రితయం జజ్ఞే తథా పావకతేజసా ॥**

**భ్రువౌ చ సన్ధ్యయోస్తేజః శ్రవణావనిలస్య చ ।**
**అన్యేషాం చైవ దేవానాం సమ్భవస్తేజసాం శివా ॥**
**తతః సమస్తదేవానాం తేజోరాశిసముద్భవామ్ ।**
**తాం విలోక్య ముదం ప్రాపురమరా మహిషార్దితాః ॥**

| | | |
|---|---|---|
| శివుని తేజస్సుతో | - | దేవి ముఖము |
| యముని తేజస్సుతో | - | కేశపాశాలు |
| విష్ణువు తేజస్సుతో | - | బాహువులు |
| చంద్రుని తేజస్సుతో | - | స్తనయుగము |
| ఇంద్రుని తేజస్సుతో | - | నడుము |
| వరుణుని తేజస్సుతో | - | తొడలు, పిక్కలు |
| భూమి తేజస్సుతో | - | పిరుదులు |

**బ్రహ్మణ స్తే జసా పాదౌ తదంగుళ్యోఽర్క తేజసా ।**
**వసూనాం చ కరాంగుళ్యః కౌబేరేణ చ నాసికా ॥**

| | | |
|---|---|---|
| బ్రహ్మతేజస్సుతో | - | పాదాలు |
| సూర్యుని తేజస్సుతో | - | కాలివ్రేళ్ళు |
| అష్టవసువుల తేజస్సుతో | - | చేతివ్రేళ్ళు |
| కుబేరుని తేజస్సుతో | - | నాసిక |
| ప్రజాపతి తేజస్సుతో | - | దంతాలు |
| అగ్ని తేజస్సుతో | - | కనులు |
| రెండు సంధ్యలు | - | కనుబొమలు |
| వాయువు | - | చెవులు |
| ఇతర దేవతల తేజస్సుతో | - | శరీరము ఏర్పడింది |

ఈ రకంగా ఆవిర్భవించిన దేవి నాసిక కుబేరుని తేజము అని చెప్పబడింది.

## 20. తారాకాంతితిరస్కారినాసాభరణభాసురా

తారా అంటే కుజ, శుక్ర నక్షత్రాలు. ఈ నక్షత్రాలు చాలా ప్రకాశవంతంగా ఉంటాయి. వాటికన్న కూడా ప్రకాశవంతమైన రత్నములు ముత్యములతో కూర్చబడిన నాసాభరణము (బులాకీ) ధరించినది. లేదా ముక్కెర ధరించినది. ముక్కు చివర పైవైపున ధరించేది ముక్కెర, రెండు ముక్కులను విడదీస్తూ మధ్యలో ఉండే ముక్కు దూలానికి ధరించేది బులాకి. ఈ రెండూ కూడా నాసాభరణాలే.

కుజనక్షత్రము ఎరుపు రంగులోను, శుక్రనక్షత్రము తెలుపురంగులోను ఉంటాయి అని రత్నశాస్త్రం చెబుతోంది. అందుచేత ఎరుపు తెలుపు రంగులు గల పగడపు ముక్కెర

కుడిముక్కుకు, తెలుపు రంగుగల వజ్రపు ముక్కెర ఎడమ ముక్కుకు ధరించినది. సౌభాగ్యా భరణములలో మంచిముత్యాలు కూడా చెప్పబడ్డాయి. అందుచేత కొంతమంది ముత్యాలముక్కెర అని చెబుతున్నారు.

శంకరభగవత్పాదులు అది ముత్యాలతో చేయబడిన మక్కెర అంటున్నారు సౌందర్య లహరిలోని 61వ శ్లోకంలో

**అసౌ నాసావంశ స్తుహినగిరి వంశ ధ్వజపటి**
**త్వదీయో నేదీయః ఫలతు ఫల మస్మాక ముచితమ్ ।**
**వహ త్యన్త ర్ముక్తా శ్శిశిరకరనిశ్వాసగళితం**
**సమృద్ధ్యా యత్తాసాం బహి రపి న ముక్తామణిధరః ॥**

ఓ తల్లీ ! నీ నాసావంశమునందు ముత్యాలున్నాయనటానికి సందేహం లేదు. ఎందుకంటే ముక్కులోపల ముత్యాలు లేకపోయినట్లైతే శ్వాసవదిలేటప్పుడు ముత్యమెందుకు వెలివడుతుంది? ఆ నాసాదండము నా కోరికలను తీర్చుగాక.

శంకరులవారు నాసాదండము అంటే ఇక్కడ రెండు ముక్కులమధ్యన ఉండే ముక్కు దూలము అని, నాసాభరణము అంటే బులాకీ అని చెప్పారు.

## 21. కదంబమంజరీక్లప్తకర్ణపూరమనోహరా

కడిమిపూలతో చేయబడిన కర్ణాభరణములు గలది. చెవి యొక్క పై భాగాన కదంబ పుష్పగుచ్ఛము ధరించుటచేత దేవి మనోహరంగా ప్రకాశిస్తున్నది. దేవియొక్క చెవులు వాయుతేజముతో ఏర్పడ్డాయి.

బహిర్మాతృకాన్యాసంలో ఉకారంతో కుడిచెవి ఊకారంతో ఎడమచెవిని చెబుతారు.

## 22. తాటంకయుగళీభూతతపనోడుపమండలా

సూర్యచంద్రులు దేవి కమ్మల జంటగా ఉన్నారు

**సూర్యచంద్రౌ స్తనౌ దేవ్యా స్తావేవ నయనే స్మృతే**
**ఉభౌ తాటంక యుగళ మిత్యేషా వైదికీశ్రుతిః**

సూర్యచంద్రులే దేవియొక్క స్తనాలుగా, కనులుగా, చెవి కమ్మలుగా ఉన్నారు అంటోంది శ్రుతి.

**తాటంకధారణం స్త్రీణాం భర్తు రాయుష్యవర్ధనమ్**

సౌభాగ్యవతులు తాటంకములు ధరించుట వారి భర్తలకు ఆయుః కారకము.

దేవీ భాగవతంలో మణిద్వీపంలోని దేవిని వర్ణిస్తూ

**కనచ్ఛ్రీచక్ర తాటంక విటంక వదనాంబుజా ।**

శ్రీచక్రాకారము గల బంగారు ఆభరణములతో పరమేశ్వరి ముఖము ప్రకాశిస్తున్నది. దుర్వాసుడు శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 36వ శ్లోకంలో దేవి కర్ణాభరణాలను ధ్యానిస్తూ

**తప్త స్వర్ణ కృతోరుకుండల యుగం మాణిక్యముక్తోలస**
**ద్ధీరాబద్ధ మనన్యతుల్య మపరం హైమం చ చక్రద్వయం ।**
**శుక్రాకారనికారదక్ష మమలం ముక్తాఫలం సుందరం**
**బిభ్ర త్కర్ణయుగం భజామి లలితం నాసాగ్రభాగం శివే ॥**

దేవీ నీ చెవుల జంటను, నాసాగ్ర భాగాన్ని నా మనస్సున సాక్షాత్కరింప చేసుకుని ఉపాసిస్తాను. పెద్ద పెద్ద బంగారు కుండలములను, మాణిక్యములు, ముత్యములు, వజ్రములు తాపడము చేసినటువంటి బంగారు ఆభరణములు ధరించి నీ కర్ణయుగళము శుక్రగ్రహము కన్న తెల్లగా ప్రకాసించేటటువంటి ముత్యాలు పొదిగిన ముక్కెరలు ధరించిన నీనాసాగ్ర భాగమును నేను ధ్యానిస్తున్నాను.

శంకరులవారు తమ సౌందర్య లహరిలోని 58వ శ్లోకంలో దేవియొక్క కమ్మలు మన్మథుని విల్లు అంటున్నారు.

**ఆరాళం తే పాళీయుగళ మగరాజన్య తనయే !**
**న కేషా మాధత్తే కుసుమశరకోదండకుతుకమ్**
**తిరశ్చీనో యత్ర శ్రవణ పథముల్లఙ్ఘ్య విలసన్**
**అపాఙ్గవ్యాసఙ్గో దిశతి శరసన్ధానధిషణామ్ ॥**

ఓ దేవీ ! శైలరాజతనయా ! నీ చెవి కమ్మలజంట మన్మథుని కోదండసౌభాగ్యాన్ని తలపింప చేస్తున్నది. ఎందుకంటే నీ కనుకొనల యొక్క కటాక్ష వీక్షణ ప్రకాశము అడ్డముగా తిరిగి చెవులను దాటి మెరయుచున్నదై బాణాలు సంధించబడుతున్నాయనే ఊహను కలిగిస్తున్నది.

## 23. పద్మరాగశిలాదర్శపరిభావికపోలభూః

పద్మరాగశిలలు అను అద్దములను మించిన నునుపైన, కాంతులీనుచున్న చెక్కిళ్ళు గలది.

పద్మరాగాలు స్వచ్ఛంగాను, నున్నగాను ఉంటాయి కాబట్టి అద్దములకన్న శ్రేష్ఠమైనవి. వాటిని మించినవి పరమేశ్వరి చెక్కిళ్ళు. చెక్కిళ్ళయందు పరమేశ్వరుని ప్రతిబింబం కనిపిస్తుందట.

సింహళంలో దొరికే పద్మరాగాలు కాంతిలోను మృదుత్వంలోను శ్రేష్ఠమైనవి. అద్వితీయమైనవి. సహజంగా శరీరంలోని భాగాలలో చెక్కిళ్ళు ఎర్రగా ఉంటాయి. ఇది సౌందర్యలక్షణం. యవ్వనవతులకు ఈ లక్షణం మరీ ఎక్కువగా ఉంటుంది. అయితే పరమేశ్వరి నిత్య యవ్వనవతి. లలితా అష్టోత్తరంలో ఆమె **'నిత్యయవ్వన మాంగల్య మంగళాయై నమోనమః'** అని చెప్పబడింది. కాబట్టి దేవి సర్వకాల సర్వావస్థల యందు నిండు యవ్వనవతి. అందుచేత ఆమె చెక్కిళ్ళు పద్మరాగాలకన్న మిన్నయైన ఎరుపుదనం గలిగి ఉంటాయి. అద్దముల కన్న నున్నగా ఉండి ప్రతిబింబిస్తుంటాయి. దేవి యొక్క చెక్కిళ్ళను వర్ణిస్తూ శంకర భగవత్పాదులవారు సౌందర్య లహరిలోని 59వ శ్లోకంలో

**స్ఫురద్గండా భోగ ప్రతిఫలిత తాటంక యుగళం**
**చతుశ్చక్రం మన్యే తవ ముఖ మిదం మన్మథరథం ।**
**య మారుహ్య ద్రుహ్య త్యవనిరథ మర్కేందుచరణం**
**మహావీరో మారః ప్రమథపతయే సజ్జితవతే ॥**

ఓ భగవతీ ! అద్దములాగా నిగనిగమెరుస్తున్న నీ చెక్కిళ్ళ విశాలప్రదేశమందు ప్రతిఫలిస్తున్న రతనాల కమ్మలజంటగల నీ ముఖము "మన్మథుని రథము" అని తలచుచున్నాను. ఆ రథమధిష్ఠించి మన్మథుడు భూమిరథముగా, రవిచంద్రులు చక్రాలుగా గల త్రిపురాంతకుడగు రుద్రునికి ద్రోహమాచరించుచున్నాడు.

బహిర్మాతృకాన్యాసంలో దక్షిణకపోలము ' ' కారము వామకపోలము ' ' కారము

## 24. నవవిద్రుమబింబశ్రీన్యక్కారిరదనచ్ఛదా

దొండపండులాంటి పెదవులు కలది ఆ దేవి. పరమేశ్వరి పెదవులు ఎర్రగా దొండ పండ్లవలె, పగడమువలె ప్రకాశిస్తున్నాయి. అప్పుడే సానపట్టిన పెదవులకన్న ఎరుపుదనము కల పెదవులు కలిగినది. పై పెదవిని విద్రుమమని, క్రింది పెదవిని బింబమని అంటారు. దుర్వాసుడు దేవి పెదవులను శ్లాఘిస్తూ

**తాంబూలారుణ పల్లవాధరయుతం రమ్యం త్రిపుండ్రం**

తాంబూలసేవనముచేత ఎర్రబారిన పెదవులు కలది. సౌందర్య లహరిలోని 62వ శ్లోకంలో శంకరభగవత్పాదులు దేవి అధరాలను వర్ణిస్తూ

**ప్రకృత్యా రక్తాయా స్తవ సుదతి ! దంతచ్ఛదరుచేః**
**ప్రవక్ష్యే సాదృశ్యం జనయతు ఫలం విద్రుమలతా ।**
**న బింబం తద్బింబప్రతిఫలనరాగా దరుణిమం**
**తులా మధ్యారోఢుం కథమివ న లజ్జేత కలయా? ॥**

చక్కని పలువరుస గల ఓ దేవీ! సహజంగా కెంపులు దేలుతున్న నీ పెదవుల సొబగునకు సరియైన పోలికను చెబుతాను. పగడపు తీగె పండు పండినప్పుడు, ఆ పండు నీ పెదవుల కాంతికి సాటి అగుచున్నది. అంతేకాని కేవలము పగడపు తీగె మాత్రం సాటికాదు.

## 25. శుద్ధవిద్యాంకురాకారద్విజపంక్తిద్వయోజ్జ్వలా

శుద్ధవిద్య అంటే జ్ఞానవిద్య. అది ఇది అనే భేదం లేనటువంటిది. అదే శ్రీవిద్య. దత్తాత్రేయసంహిత మొదలైనచోట్ల ఆ విషయం చెప్పబడింది. నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ సృష్టి చెయ్యాలని సంకల్పించినప్పుడు తనలోని కొంతశక్తిని ముందుగా బయటకు పంపాడు. అదే శక్తి శ్రీచక్రములోని ఎనిమిదవ ఆవరణ అయిన త్రికోణము. బిందువు పరబ్రహ్మ స్వరూపము త్రికోణముశక్తి స్వరూపము.

**త్రికోణ రూపిణీశక్తిః బిందురూపపర శ్శివః**

ఈ రెండింటికీ భేదం లేదు. రెండూ ఒక్కటే. పరమేశ్వరియే పరబ్రహ్మ స్వరూపము. కాబట్టే శ్రీవిద్య జ్ఞానవిద్య, మోక్షవిద్య అని చెప్పబడింది. శ్రీవిద్యలో పంచదశి మహామంత్రము గాయత్రి వంటిది. కాగా షోడశిమంత్రము జ్ఞానప్రదాయిని. ఇదే బ్రహ్మవిద్య. ఆధారచక్రం నుండి బయలుదేరి ముఖంద్వారా బయటకు వచ్చిన శ్రీవిద్య గురుశిష్య పరంపరగా వ్యాప్తి చెందింది. శబ్దబ్రహ్మ రూపమైనటువంటి బీజంలోని అభివృద్ధి దశ పరావాక్కు. అంటే పరాస్థానంలోవాక్కుకు నాంది ఏర్పడుతుంది. అక్కడ నుండి ఆధారచక్రంలో అంకురంగా ఉంటుంది. అది పశ్యన్తీవాక్కు. అక్కడ నుండి అనాహతము దగ్గర వరకు ఉండే వాక్కు మధ్యమ, ముఖము నుండి బయటకు వచ్చేది వైఖరి వాక్కు.

పరావాక్కు బ్రహ్మరంధ్రం దగ్గర పుడుతుంది. ఇది వాక్కుకు ఊహ. పశ్యన్తీ వాక్కు ఆధారచక్రంలో గాలిబుడగలాగా పుడుతుంది. ఇది మొలకెత్తుతున్న ధాన్యపుగింజలాగా ఉంటుంది. అది క్రమేణా అభివృద్ధి చెంది మొలక నుంచి రెండు ఆకులు కలిసి బయటకి వచ్చినట్లుగా ఉంటుంది. పరావాక్కును ఇది అని ఇదమిద్ధంగా చెప్పలేము. కేవలము ఇది ఊహ. పశ్యన్తీ వాక్కు కొద్దిగా తెలుస్తుంది. కాని అది ఏమిటి అనేది పూర్తిగా తెలియదు. మధ్యమావాక్కులో మొలకలోని రెండు ఆకులు విడిపోతాయి. కాబట్టి కొంతవరకు తెలుస్తుంది. ఈ మధ్యమవాక్కు కంఠస్థానం చేరి అక్కడ విశుద్ధి చక్రంలోని పదహారు దళాలలోగల అచ్చులతో కలిసి స్వచ్ఛంగా బయటకు వస్తుంది. అది వైఖరీ వాక్కు. ఆధారచక్రం నుంచి అనాహతం వరకు కేవలము హల్లులే ఉంటాయి. అందుచేత వాక్కులో స్వచ్ఛత ఉండదు.

**కకారాదిక్షకారాంతా వర్ణాస్తే శివరూపిణః**

క నుంచి క్ష వరకు ఉన్న హల్లులు శివరూపాలు. అలాగే అచ్చులు శక్తిరూపాలు. ఈ రెండూ కలిస్తేనే పూర్తిగా స్వరం బయటకు వస్తుంది.

హల్లులు లేకుండా ఉండే పదహారు అక్షరాలు అచ్చులు. శుద్ధవిద్య. ఈ పదహారు అక్షరాలు అంకురంలోని ఆకులజంట. శివశక్తులు ప్రతివర్ణంలోనూ కలిసే ఉంటారు. అందుచేత అచ్చులు పదహారు శివశక్తుల జంటగా భావిస్తే అవి పదహారు జతలు అంటే ముప్పైరెండు అవుతున్నాయి. ఆ ముప్పై రెండే దంతాల రూపంలో ఉన్నాయి.

షోడశిమంత్రం పదహారు అక్షరాలు గలది. ఈ పదహారు అక్షరాలలోను శివశక్తులున్నారు కాబట్టి అవి పదహారు జతలు అంటే ముప్పై రెండు సంఖ్య. అదే నోటిలోని దంతాల సంఖ్య.

ద్విజుడు అంటే బ్రాహ్మణుడు. వేదవిద్య బ్రాహ్మణుని ఆశ్రయించి ఉన్నది.

**వేదాదయో విద్యా హి బ్రాహ్మణ మే వాశ్రిత్య తిష్ఠంతి ।**
**విద్యాహవై బ్రాహ్మణమాజగా మేతి.**

అని శ్రుతి.

విద్య అనేది బ్రాహ్మణులచే ఉపదేశింపబడి విస్తరిస్తోంది కాబట్టి బ్రాహ్మణులే విద్యాంకుర రూపులు. అందుచేత వేదవిద్యాంకురాకారమైన బ్రాహ్మణులపంక్తిచే

ప్రకాశించేది. బ్రాహ్మణులు అంటే బ్రహ్మముఖంనుంచి పుట్టినవారు. బ్రహ్మయొక్క అన్వేషణలో కాలం గడిపేవారు. సదా సత్యాన్వేషణ చేసేవారు. వేదంలో **బ్రాహ్మణోస్యముఖ మాసీత్** అని చెప్పబడింది. కాబట్టి విద్యాంకురాలయిన బ్రాహ్మణులే పరమేశ్వరి యొక్క దంత పంక్తి.

మంత్ర శాస్త్రంలో బాలా, మాతంగీ మొదలయిన ముప్పై రెండు రకాల దీక్షలున్నాయి. వీటిని శుద్ధవిద్యలు అంటారు. వీటివల్ల జ్ఞానము విస్తరించటంచేతనే వీటిని విద్యాంకురాలు అంటారు. ఈ ముప్పై రెండు దీక్షలే దంతములు.

ద్విజుడు అంటే రెండు జన్మలు కలవాడు బ్రాహ్మణుడు. ఉపనయనము వరకు ఒక జన్మ.ఉపనయన సంస్కారము తరువాతది మరియొక జన్మ.

ద్విజ అంటే రెండు జన్మలు కలది. ముందు గ్రుడ్డుగా పుట్టి తరువాత రూపము పొందునది. పక్షి, చేప, పాము మొదలైనవి. ఈ నామంలో ద్విజపంక్తి అంటే వేదవిజ్ఞానాన్ని ప్రవర్తిల్ల చేస్తున్న బ్రాహ్మణుల వరుస అని అర్థం చెప్పటం జరిగింది.

మంత్రశాస్త్రంలో శుద్ధవిద్య అనే ప్రత్యేకమైన విద్య ఉన్నది. దీనికి సదాశివుడు ఋషి. గాయత్రి ఛందస్సు. ఈ విద్యయే అంకురముగా గలది.

శుద్ధవిద్య దగ్గర నుంచి అనుత్తర దీక్ష వరకు గల ముప్పై రెండు దీక్షలను తీసుకున్న శ్రేష్ఠులచేత పొందదగినది. కాబట్టే శుద్ధవిద్యాంకురాకారా అని చెప్పబడింది.

బ్రహ్మవిద్య, వేదవిద్య, ఉపనిషద్విద్య, తెలిసిన బ్రహ్మజ్ఞానులకు పరాశక్తి దర్శనం సుసాధ్యం. అంతే కాని అన్యులకు మాత్రం కాదు.

**అస్యశ్రీ శుద్ధవిద్యామహామంత్రస్య సదాశివఋషిః । గాయత్రీ ఛందః । శ్రీశుద్ధ విద్యామనోన్మన్యంబా దేవతా । ఐం బీజం ॥ ఈం శక్తిః । ఔః కీలకం । జపే వినియోగః ।**

**న్యాసము : మంత్రముతో రెండు ఆ వృత్తులు న్యాసము చెప్పాలి.**

**ధ్యానము : శుద్ధస్ఫటికసంకాశాం శుద్ధవిద్యాం మనోన్మనీం ।**
**పుస్తకం చాక్షమాలాం చ జ్ఞానముద్రా మభీతికం ॥**
**ధారయంతీం శివాం దేవీం పశుపాశ విమోచనీం ।**
**సర్వమంత్రప్రకాశాం చ మాతృకారూపిణీం భజే ॥**

**మంత్రము : ఐం ఈం ఔః ॥**

## 26. కర్పూరవీటికామోదసమాకర్షద్దిగంతరా

కర్పూరము మొదలైన సుగంధద్రవ్యాలతో కలిసిన తాంబూలము వేసికొనటంవలన దిగంతములవరకు సువాసనలు వ్యాపించినది.

అసలు తాంబూలంలో ఏం వేస్తారు? కర్పూర వీటిక అంటే ఏమిటి?

**ఏలా లవంగ కర్పూర కస్తూరీ కేసరాదిభిః ।**
**జాతీఫలదళైః పూగైః లాంగుల్యూషణ నాగరైః**
**చూర్ణైః ఖాదిరసారైశ్చ యుక్తా "కర్పూర వీటికా" ॥**

ఏలకులు, లవంగాలు, పచ్చకర్పూరము, కస్తూరి, నాగకేసరము అంటే కుంకుమ పువ్వు, జాజికాయ, వక్కలు, జాపత్రి, చలువ మిరియాలు, కాచు, తమలపాకులతో కూడిన దానిని కర్పూర వీటిక అంటారు. ఈ తాంబూలము యొక్క సువాసనను ఆఘ్రాణిస్తున్న దిక్పాలకులే వస్త్రముగా గలది.

దేవి ముఖం నుంచి బయటకు వచ్చే తాంబూలకబళము కోరుతున్న దేవతలకు అది లభించలేదు. కనీసం దాని వాసన అయినా గ్రహిద్దాము అని వారు ఆ సువాసనను ఆఘ్రాణిస్తున్నారు.

కర్పూర వీటికను వేసుకోవటంవల్ల దేవి ముఖ పరిమళము దిగంతములకు వ్యాపించినది. దేవి తాంబూలాన్ని దాని పరిమళాన్ని వర్ణిస్తూ శంకర భగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 65వ శ్లోకంలో

**రణే జిత్వా దైత్యా నపహృతశిరస్త్రైఃకవచిభి**
**నివృత్తై శ్చండాంశ త్రిపురహర నిర్మాల్యవిముఖైః ।**
**విశాఖేన్ద్రోపేన్ద్రై శ్శశివిశద కర్పూరశకలాః**
**విలీయన్తే మాత స్తవ వదన తామ్బూల కబళాః ॥**

తల్లీ ! రాక్షసులను జయించి యుద్ధ రంగాన్నుంచి తిరిగివస్తూ శివనిర్మాల్యము ఒద్దనుకున్న కుమారస్వామి, విష్ణువు, ఇంద్రులచేత, నీ నోటి నుంచి వచ్చిన తాంబూల కబళములు కాజేయబడుతున్నవి.

అంటే శివనిర్మాల్యముకన్న, శక్తి యొక్క తాంబూల కబళానికే ప్రాముఖ్యత ఉన్నదని చెబుతున్నారు.

## 27. నిజసంల్లాపమాధుర్య వినిర్భర్త్సిత కచ్ఛపీ

కచ్ఛపి అంటే సరస్వతీ దేవియొక్క వీణ. అమరకోశంలో

**విశ్వావసోస్సా బృహతీ ! తుంబురోస్తు కలావతీ ।**

**సా నారదస్య మహతీ । సరస్వత్యాస్తు కచ్ఛపీ ॥**

| | | |
|---|---|---|
| విశ్వావసుని వీణ పేరు | – | బృహతి |
| తుంబురుడి వీణ పేరు | – | కలావతి |
| నారదుడి వీణ పేరు | – | మహతి |
| సరస్వతి వీణ పేరు | – | కచ్ఛపి |

వీణలో అక్షరాలు స్పష్టంగా వినిపించక పోయినప్పటికీ, వ్రేళ్ళు మీటినప్పుడు వచ్చే స్వరము గతంలో మనకు తెలిసిన అక్షరాలను గుర్తుకు తెచ్చి రసానుభవం కలగచేస్తుంది. అయితే సరస్వతీ దేవి వీణలో మిగిలిన వాటికన్న స్పష్టత ఎక్కువగా ఉంటుంది.

పరమేశ్వరుని సేవిస్తున్నటువంటి సరస్వతీ దేవి తన వీణ అయిన కచ్ఛపిని సృతి చేసి శివుని యొక్క విలాసములను వాయిస్తోంది. అందుకు ఆనందించిన పరమేశ్వరి నోటి వెంట వచ్చిన పలుకులు ఆ వీణానాదం కన్న మనోహరంగా ఉన్నాయి. శంకర భగవత్పాదులవారు సౌందర్య లహరిలోని 66వ శ్లోకంలో ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ

**విపంచ్యా గాయంతీ వివిధ మపదానం పశుపతే**

**స్త్వయారబ్ధే వక్తుం చలితశిరసా సాధువచనే ।**

**తదీయై ర్మాధుర్యై రసలపిత తంత్రీకలరవాం**

**నిజాం వీణాం వాణీ నిచుళయతి చోళేన నిభృతమ్ ॥**

సరస్వతీ దేవి వీణను సృతి చేసి పరమేశ్వరి ఎదుట శివుని విజయ విలాసాలను మీటుతుండగా, దేవి సంతసించి ప్రశంశావాక్యాలు పలుకుతోంది. వీణానాదంకన్న మధురంగా ఉన్న ఆ పలుకులు విని సిగ్గుపడి సరస్వతీ దేవి తన వీణను గవిసెన గుడ్డతో రహస్యంగా కప్పివేస్తోంది. అంటే పరమేశ్వరి పలుకులు వీణానాదం కన్న మధురంగా ఉన్నాయి.

## 28. మందస్మితప్రభాపూర మజ్జత్కామేశ మానసా

స్మితము అంటే చిరునవ్వు. మందస్మితము అంటే కొద్దిపాటి చిరునవ్వు. ఇది సాధ్వీ లక్షణము నవ్వినప్పుడు పలువరుస కనిపించీ కనుపించకుండా ఉండేదాన్ని చిరునవ్వు అంటారు. ఇది శుభశూచకము మంగళప్రదము.

కామేశ్వరుడు అంటే కామేశ్వరీదేవి భర్త. శ్రీచక్రంలోని బిందువునందు ఉండేది కామేశ్వరి కామేశ్వరులని, రాజేశ్వరి రాజేశ్వరులని అంటారు. వారే శివశక్తులు. ఆ కామేశ్వరుణ్ణి మనసునందు భావించుటచే ఆనందము పొందునది. ఈ ఆనందము ఐదు రకాలు.

1. కారణరహిత ఆనందము
2. నాదానందము
3. ప్రణవానందము
4. బ్రహ్మానందము
5. పరమేశ్వరానందము

తన నాధుడు అయిన కామేశ్వరుణ్ణి మనసున తలచుకోవటంచేత దేవి పరమేశ్వరానందం పొందుతున్నది. మనసులో ఉన్న ఆ ఆనందము ముఖంలో పెదవులమీద కనిపిస్తున్నది.

శంకరభగవత్పాదుల వారు ఈ విషయాన్ని వివరిస్తూ తమ సౌందర్య లహరిలోని 63వ శ్లోకంలో

**స్మితజ్యోత్స్నాజాలం తవ వదన చంద్రస్య పిబతాం**
**చకోరాణా మాసీ దతిరసతయా చంచుజడిమా ।**
**అత స్తే శీతాంశో రమృతలహరీ రామ్లరుచయః**
**పిబన్తి స్వచ్ఛన్దం నిశి నిశి భృశం కాఞ్జికధియా ॥**

దేవి యొక్క చిరునగవు అనే మధురమైన వెన్నెలలను గ్రోలటంచేత చకోరపక్షుల నాలికలు రుచి తెలియకుండా పోయినాయి. అందుచేత పులుపుకోసమని చంద్రుని వెన్నెలను ప్రతిరాత్రీ అవి త్రాగుతున్నాయి.

దేవి యొక్క చిరునవ్వు అనే వెన్నెల ముందు చంద్రుని వెన్నెల వెలవెలపోతున్నదని అర్థం.

## 29. అనాకలితసాదృశ్యచుబుకశ్రీవిరాజితా

పరమేశ్వరి యొక్క చుబుకాన్ని వర్ణించటానికి ఇంతవరకు ఉపమానమే దొరకలేదు. బ్రహ్మాది దేవతలందరూ కూడా నునుపైన చెక్కిళ్ళు గలిగి గుండ్రంగా ఉన్నటువంటి ముఖానికి ఈ చుబుకము తొడిమలా ఉన్నది అన్నారు. అంతేకాని ఆ చుబుకానికి ఇంతవరకు సరియైన ఉపమానాన్ని చూపలేకపోయారు. అంటే పరమేశ్వరి చుబుకము సాటిలేనటువంటి అందముగలది. అద్దములో చూసినప్పుడు దాని ప్రతిబింబమే దానికి సరియైన ఉపమానము.

శంకరభగవత్పాదులవారు కూడా దేవిచుబుకాన్ని వర్ణించటానికి వీలు కాదు అంటున్నారు సౌందర్య లహరిలోని 67వ శ్లోకంలో

**కరాగ్రేణ స్పృష్టం తుహినగిరిణా వత్సలతయా**
**గిరీశే నో దస్తం ముహు రధరపానాకులతయా**
**కరగ్రాహ్యం శమ్భో ర్ముఖముకుర వృన్తం గిరిసుతే**
**కథంకారం బ్రూమ స్తవ చుబుక మౌపమ్యరహితమ్ ॥**

పర్వతరాజ పుత్రీ ! తండ్రియగు హిమవంతునిచే అమితమగు వాత్సల్యముతో మునివ్రేళ్ళతో పుణకబడినది, కైలాసపతిచేత అధరపానమునందలి అనులత్వము చేత మాటిమాటికి త్రొట్రుపడుచు పైకెత్తబడినది, శంభుని చేతితో మాత్రమే పట్టుకోతగ్గది, సాటిలేనిది అయిన ముఖము అనే అద్దానికి పిడివంటిది అయిన నీ చుబుకమును ఏ విధంగా వర్ణించను అన్నారు తండ్రికి పిల్లల మీద ఉండే ప్రేమను వాత్సల్యము అంటారు. ఈ ప్రేమను వివిధ సందర్భాలలో వివిధ పేర్లతో పిలుస్తారు.

| | | |
|---|---|---|
| పిల్లల మీద ఉండేది | - | వాత్సల్యము |
| భార్య ఎడ ఉండేది | - | ప్రేమ |
| శిష్యులయందుండేది | - | అనుగ్రహము |
| అగ్రజులందుండేది | - | భక్తి |

హిమవంతుడు పరమేశ్వరికి తండ్రి కాబట్టి, అతనికి దేవియందుండునది వాత్సల్యము.

## 30. కామేశబద్ధమాంగల్యసూత్రశోభితకంధరా

పరమశివునిచే కట్టబడి, మన్మథుడు మళ్ళీ బ్రతకటానికి కారణమై, సౌభాగ్యాభరణమైన మంగళసూత్రముచే ప్రకాశించు మెడగలది.

వేదంలో మంగళసూత్రం ప్రసక్తి లేదు. అక్కడ పాణిగ్రహణము, సప్తపది మాత్రమే చెప్పబడ్డాయి. కాని కాలానుగుణంగా సంప్రదాయం మారిపోయింది.

**మాంగల్యం తంతునాఽనేన మమ జీవనహేతునా ।**
**కంఠే బధ్నామి సుభగే ! త్వం జీవ శరద శ్శతం ॥**

"నా జీవమునకు హేతువైన యీ సూత్రముచేత నేను నీ కంఠమున మాంగల్యమును బద్ధము చేయుచున్నాను. నీవు నూరు సంవత్సరములు జీవించుము" అని చెప్పి మంగళసూత్రధారణ చెయ్యటము వివాహంలో ముఖ్యమైన తంతుగా మారిపోయింది. ఈ మాంగల్యం - ప్రథమాభరణము

ఇక్కడ శివునిచే కట్టబడిన మాంగల్యముతో శోభించుచున్న కంఠసీమ గలది అని భావన.

ఈ విషయాన్ని శంకరుల వారు తమ సౌందర్య లహరిలోని 69వ శ్లోకంలో

**గళే రేఖా స్తిస్రో గతిగమకగీతైకనిపుణే !**
**వివాహ వ్యానద్ధ ప్రగుణ గుణసంఖ్యా ప్రతిభువః ।**
**విరాజన్తే నానావిధ మధుర రాగకరభువాం**
**త్రయాణాం గ్రామాణాం స్థితినియమసీమాన ఇవ తే ॥**

దేవీ ! వివాహ సమయంలో నీ మెడలో కట్టిన మంగళసూత్రములోని మూడు ముడులు మృదు మధుర రాగాలయిన షడ్జగ్రామ, మధ్యగ్రామ, గాంధారగ్రామముల యొక్క ఉనికికి హద్దులాగా కనపడుతున్నవి.

పరమేశ్వరి వివాహ సమయంలో శివునిచేత వేయబడిన ముడులు మూడు ముడతలలాగా కనిపిస్తున్నాయి. అవే దేవి కంఠసీమయందు మూడు ముడుతలు గలవైన మూడు రేఖలు. ఈ రేఖలు అనేక రకాలయిన మనోహరమైన రాగాలు, ఉపరాగాలు, జనకరాగాలు, భాషారాగాలు, విభాషారాగాలు, అంతరాలు, భాషలు అనే ప్రసిద్ధమైనటు వంటి రాగాలకు గనులై, స్వరస్థానాలై, ఆశ్రయములై, షడ్జ, మధ్యమ, గాంధార

గ్రామాలనబడే స్వర ఆరోహణ, అవరోహణ క్రమాలన్నింటికీ సరిహద్దుగా ఆ మూడు ముడుతలు కనిపిస్తున్నాయి.

ఈ శ్లోకంలో దేవి కంఠసీమలోని మాంగల్యంలో ఉన్న మూడు ముడులు వళిత్రయమని అదే గాత్రత్రయము అని చెప్పబడింది. ఈ విధంగా పరమేశ్వరి సంగీతనిధి అంటున్నారు శంకరులు.

## 31. కనకాంగదకేయూరకమనీయభుజాన్వితా

అంగదము అంటే భుజమున ధరించే ఆభరణము. కేయూరము భుజముపైన అంటే చేతి మొదలునందు ధరించే ఆభరణము భుజకీర్తి. నిజానికి అంగదము, కేయూరము అనే రెండు పదాలు ఒకే అర్థాన్ని చెబుతాయి అని సూర్యరాయాంధ్ర నిఘంటువు చెబుతోంది. అంగదములు, కేయూరములు అనే ఆభరణాలను భుజములందు ధరించినది బ్రహ్మోత్తర ఖండంలోని శివధ్యాన ప్రకరణంలో

**దధానం నాగవలయకేయూరాంగదముద్రితా**

అని చెప్పబడింది. అంటే నాగవలయము, కేయూరము, అంగదము, ముద్రికలను ధరించినది. అలాగే

**కేయూరాంగదహారకంకణముఖాలంకారవిభ్రాజితా**

అన్నారు. అంటే కేయూరము, అంగదము, హారము, కంకణము మొదలైన ఆభరణములచే ప్రకాశించునది. అగ్నిపురాణంలో కేయూరములు, అంగదములు అని చెప్పబడింది.

బంగారముతో చేయబడిన కేయూరములు, అంగదములు ధరించి ప్రకాశించు భుజములు గలది.

దుర్వాసులవారు శ్రీదేవి మహిమ్నః స్తుతిలోని 34వ శ్లోకంలో ఆ దేవిని స్తుతిస్తూ

**ముక్తారత్న విచిత్ర కాంతి లలితై స్తే బాహువల్లీ రహం**
**కేయూరాంగద బాహుదండ వలయై ర్హస్తాంగులీభూషణైః ।**

ఓ తల్లీ ! నీ చేతులు ముత్యాలు రత్నాలు పొదగబడిన చిత్రవిచిత్ర కాంతులతో ప్రకాశిస్తున్న మణికట్టు, మోచేయి, భుజములమీద ధరించు ఆభరణములచేత వ్రేళ్ళ ఉంగరాలచేత ప్రకాశిస్తున్నాయి.

## 32. రత్నగ్రైవేయచింతాకలోలముక్తాఫలాన్వితా

రత్నములతో చెక్కబడిన బంగారు కంఠాభరణములు గలది. దీనిలో మువ్వలు వ్రేలాడుతున్న పతకము ఉంటుంది. దాన్నే ప్రస్తుతము మనం డాలరు అంటున్నాం. అదే చింతాకు పతకము. అయితే ఇది పాపిటబొట్టు అని కొందరంటారు. కాని గ్రైవేయము అని చెబుతున్నారు. గ్రీవము అంటే మెడ. గ్రైవేయము మెడను ధరించినది కాబట్టి రతనాలు ముత్యాలు బంగారము కలిపి చేయబడిన కంఠాభరణములు గలది.

ఆంధ్రదేశంలో చింతాకుపతకము ప్రసిద్ధి చెందినది. భక్తరామదాసు "సీతమ్మ కుచేయిస్తి చింతాకు పతకము" అంటాడు. కంఠస్థానమునందు పరమేశ్వరిని ధ్యానించేవారు గ్రైవేయ చింతాకులు. వీరు మధ్యములు. లౌకిక విషయములయందు ఆసక్తి కలవారు నీచులు. ముక్తికోసం ధ్యానించేవారు ఉత్తములు.

దుర్వాసుడు శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 34వ శ్లోకంలో పరమేశ్వరి కంఠసీమలోని ఆభరణాలను వర్ణిస్తూ

**సంసక్తాః కలయామి హీరమణిమన్మక్తావలీ కీలిత**
**గ్రీవా పట్టవిభూషణేన సుభగం కంఠం చ కంబుశ్రియమ్ ॥**

ఓ పరమేశ్వరీ ! నీ మెడ శంఖాకారములో ఉన్నది. అటువంటి మెడలో వజ్రములతోను, మంచి ముత్యములతోను కూర్చబడిన పట్టెడ అలంకరించబడి ఉన్నది. సౌందర్య లహరిలోని 74వ శ్లోకంలో శంకరభగవత్పాదులు దేవి మెడలోని హారాలను వర్ణిస్తూ

**వహ త్యమ్బ స్తమ్బేర మదనుజ కుమ్భ ప్రకృతిభిః**
**సమారబ్ధాం ముక్తామణిభి రమలాం హారతిలకాం ।**
**కుచాభోగో బింబాధరరుచిభి రన్త శ్శబలితాం**
**ప్రతాపవ్యామిశ్రాం పురదమయితుః కీర్తి మివ తే ॥**

తల్లీ ! నీ వక్షస్థలము గజాసురుని సంహరించి అతని కుంభస్థలము నుంచి తెచ్చిన ముత్యములతో చేసిన ఆభరణములతో చిత్రవిచిత్ర కాంతులతో ప్రకాశిస్తున్నది.

ఇక్కడ ఏనుగు కుంభస్థలంలో రత్నాలుంటాయి అని చెబుతున్నారు శంకరులు. ముత్యాలు ఆరు విధాలుగా దొరుకుతాయి.

**గజకుంభేషు వంశేషు ఫణాసు జలదేషు చ**
**శుక్తికాయాం ఇక్షుదండే షోఢా మౌక్తిక సంభవా॥**

ఏనుగుల కుంభస్థలము నందు, వెదురుచెట్ల యందు, పాము పడగలయందు, మేఘముల యందు, ముత్యపుచిప్పలయందు, చెరకుగడలందు ముత్యాలు దొరుకుతాయి. ఇవి రకరకాల రంగులు కలిగి ఉంటాయి.

**గజకుంభే కర్పూరాభాః వంశే రక్తసితాః స్మృతాః**
**ఫణాసువాసు కేరవ నీలవర్ణాః ప్రకీర్తి తాః ॥**
**జ్యోతి ర్వర్ణా స్తు జలదే శుక్తికాయాం సితాః స్మృతాః ।**
**ఇక్షుదండే పీతవర్ణాః మణయో మౌక్తికా స్స్మృతాః ॥**

1. ఏనుగు కుంభస్థలము నందు – చిత్రవిచిత్ర వర్ణములు గలవి
2. వెదురుచెట్ల యందు – తెలుపుతో కూడిన ఎరుపు వన్నె కలవి
3. పాముపడగలయందు – నీలవర్ణములు
4. మేఘములయందు – మెరుపు వర్ణము గలవి
5. ముత్యపుచిప్పల యందు – శ్వేతవర్ణము గలవి
6. చెరకుగడ యందు – పసుపు వర్ణము గలవి

పరమేశ్వరి మెడలో వేసిన హారములోని రత్నములు ఏనుగు కుంభస్థలము నుండి తెచ్చినవి. అందుచేతనే అవి చిత్ర విచిత్రకాంతులతో మెరుస్తున్నాయి.

## 33. కామేశ్వరప్రేమరత్నమణి ప్రతిపణ స్తనీ

ఈ నామంలో రెండు రకాలయిన రత్నాలున్నాయి. 1. ప్రేమ రత్నము 2. స్తనమణి ఆ కామేశ్వరి కామేశ్వరుని ప్రేమ అనే రత్నాన్ని, స్తనద్వయము అనే రెండు మణులను ప్రతిఫలంగా ఇచ్చికొన్నదట.

ఏదైనా వస్తువు చౌకగా దొరికితే దానిమీద శ్రద్ధ ఉండదు. వస్తువును అసలు ధరకే కొన్నప్పటికీ అది దొరకటం లేదు అని తెలిస్తే దానిమీద శ్రద్ధ పెరుగుతుంది. అదే వస్తువుని అసలు ధరకన్నా ఎక్కువకి కొంటే దానిమీద శ్రద్ధ మరీ పెరుగుతుంది. వస్తువుని రెండు రెట్లు ధర ఇచ్చికొంటే దానిమీద భక్తి శ్రద్ధలు మరీ పెరుగుతాయి. ఇక్కడ కామేశ్వరుని ప్రేమ అనేది ఒక మణి. మణికి మణి సమమూల్యమవుతుంది. కాని పరమేశ్వరి

స్థనమణులు రెండింటిని ప్రతిఫలంగా ఇచ్చి ప్రేమమణిని కొన్నది. రెండు రెట్లు ధర చెల్లించింది కాబట్టి ఆ దేవదేవుని ప్రేమమీద ఆమెకు అత్యంత శ్రద్ధ ఉంటుంది. ఇది పతివ్రతా లక్షణము.

పార్వతీ పరమేశ్వరులు. వారే శివశక్తులు. జగత్తులోని స్త్రీ పురుషులకు ప్రతీకలు. పురుషుడు జన్మించిన తరువాత తల్లితండ్రుల ఆధ్వర్యంలో విద్యావంతుడయి, యవ్వనంలో వ్యక్తిత్వాన్ని సముపార్జించుకుని, పూర్వజన్మలో సంబంధం గల స్త్రీని వెతికి వివాహం చేసుకుంటాడు. ధర్మేచ, అర్థేచ, కామేచ, మోక్షేచ, నాతిచరామి. అంటే ధర్మార్థ కామమోక్షాలలో నేను ఆ స్త్రీతో కలిసే చరిస్తాను. అని అగ్నిసాక్షిగా ప్రమాణం చేస్తాడు. ఈ రకంగా వివాహమాడిన స్త్రీ అతనికి సహధర్మచారిణి అవుతుంది. అలాగే స్త్రీ కూడా తన భర్తయొక్క సల్లాప, సంస్పర్శ, సంశ్లేష, సంయోగాలవల్ల తనకు లభించిన జ్ఞానంతో సంతానాభివృద్ధి ద్వారా వంశాన్ని వృద్ధి చేస్తుంది. భర్త యొక్క విద్యా విజ్ఞానాలను, తన స్తన్యము ద్వారా బిడ్డకు అందచేస్తుంది. ఇక్కడ 'ప్రతిఫణస్తనీ' అన్న మాటకు అర్థం ఇది.

## 34. నాభ్యాలవాలరోమాళిలతాఫలకుచద్వయీ

ఈ నామంలో స్త్రీ శరీరంలో నాభిదగ్గర నుండి వక్షస్థలము వరకు చెప్పబడుతున్నది. నాభినుంచి వక్షమువరకు వ్యాపించిన రోమావళి అనే లతకు ఫలములు స్తనద్వయముగా చెప్పబడింది.

అజ్ఞానాంధకారంతో కప్పబడిన జీవరాశే ఈ రోమావళి. మాయామయమైన జీవి అహంకారంతో లతలాగా విజృంభిస్తాడు. ఆధారం లేని లత ఏ విధంగా నిలబడలేదో అదే విధంగా జీవికూడా నిలబడలేడు. కుప్పకూలిపోతాడు. అటువంటి ఆ జీవిని ఉద్ధరించడానికి జ్ఞానమనే క్షీరము గలిగిన స్తనయుగము ఏర్పడింది. పరమేశ్వరి యొక్క స్తనములు మోహనాకారములు. అవి మాంసపు ముద్దలు కావు. సృష్టిలోని సకల జీవరాసులను ఉద్ధరించటానికి అమృతక్షీరమును దాల్చిన మాతృస్తనములవి.

నాభి అనేది ముఖ్యప్రాణమణి. రోమావళి లత అవ్యక్తమైనది. దీన్ని సుషుమ్నానాడితో పోల్చవచ్చు. ఫలములు అనాహతంలో అంటే హృదయ స్థానంలో రెండువైపులా ఉన్న ఇడ, పింగళనాడులు. దుర్వాసుడు శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 33వ శ్లోకంలో పరమేశ్వరి స్తనయుగాన్ని కీర్తిస్తూ

**కస్తూరీఘనసారకుంకుమరజోగంధోత్కటై శ్చందనై**
**రాలిప్తం మణిమాలయాఽ తిరుచిరం గ్రైవేయహారాదిభిః ।**
**దీప్తం దివ్య విభూషణై రగణితై ర్జ్యోతి ర్విభాస్వత్కుచ**
**వ్యాజస్వర్ణ ఘటద్వయం హరిహరబ్రహ్మాదిపీతం భజే ॥**

పరమేశ్వరి యొక్క స్తనయుగము కస్తూరి, కుంకుమ, కర్పూరము మొదలైన సుగంధ ద్రవ్యముల లేపనం గావించబడింది. మణిహారములతో అలంకరించబడింది. దివ్య భూషణములతో అలంకరించబడింది. బ్రహ్మాదిదేవతలకు స్తన్యమునిస్తున్నది. శంకర భగవత్పాదులవారు సౌందర్య లహరిలోని 77వ శ్లోకంలో

**య దేత త్కాళిన్దీ తనుతరతరంగాకృతి శివే**
**కృశే మధ్యే కించి జ్జనని ! తవ య ద్భాతి సుధియామ్ ।**
**విమర్దా దన్యోన్యం కుచకలశయో రన్తరగతం**
**తనూభూతం వ్యోమ ప్రవిశ దివ నాభిం కుహరిణీమ్ ॥**

ఓ తల్లీ ! నీ స్తనముల మధ్య జరిగిన ఒరిపిడికి నల్లబడి సన్నగా క్రిందికి జారిన లక్కవలె నాభివరకు గల రోమావళి లత కనిపిస్తున్నది.

## 35. లక్ష్యరోమలతాధారతాసమున్నేయమధ్యమా

కంటిచే చూడతగిన నూగారుతీగెకు ఆధారం కావటంచేత అక్కడ నడుము ఉన్నది. అని ఊహించటం జరుగుతున్నది. అంటే పరమేశ్వరి యొక్క నడుము చాలా చిన్నదైనదని అర్ధము. అజ్ఞానులకు ఆధారభూతమై మాయాతీతమైనది.

కనిపించీ కనుపించనట్లుండి రోమావళి లత మాత్రంచేత ఊహింపదగిన శరీర మధ్యభాగము గలది. ఆధారం లేకుండా తీగె ఉండదు. అనే ప్రమాణాన్ని తీసుకుని, లతకు ఆధారం నాభి. నాభికి స్థానమైన మధ్యభాగము అనగా నడుము ఉండి ఉంటుందని ఊహించటం జరుగుతోంది. పరమేశ్వరి నడుము అతిసన్నగా ఉన్నది అని చెప్పటం.

స్త్రీలకు సన్నని నడుము ఉండటమనేది సాముద్రిక లక్షణం. శుభప్రదం. పరమేశ్వరి నడుము ఊహించటానికి వీలు లేనంత సన్నగా ఉన్నది. శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 7వ శ్లోకంలో

**క్వణత్కాంచీదామా కరికలభ కుంభస్తననతా**
**పరిక్షీణామధ్యే పరిణత శరశ్చంద్రవదనా**

దేవి నడుము అతిసన్నగా ఉన్నది. అందుకే సింహమధ్య. సింహమువలె సన్నని నడుము గలది. అని చెప్పబడింది. సౌందర్య లహరిలోని 79వ శ్లోకంలో శంకర భగవత్పాదులవారు దేవి నడుమును వర్ణిస్తూ

**నిసర్గక్షీణస్య స్తనతటభరేణ క్లమజుషో**
**నమన్మూర్తే ర్నారీతిలక శనకై స్త్రుట్యత ఇవ ।**
**చిరం తే మధ్యస్య త్రుటితతటినీతీర తరుణా**
**సమావస్థా స్థేమ్నో భవతు కుశలం శైలతనయే! ॥**

ఓ దేవీ ! స్వభావంచేత కృసించినది, పాలిండ్ల భారంచేత వంగినది, మెల్లగా తెగిపోతున్న నదిగట్టులా ఉన్నది అయిన నీ నడుముకు చిరకాలము శుభము జరుగుగాక.

## 36. స్తనభారదళన్మధ్యపట్టబంధవళిత్రయా

పరమేశ్వరి నడుము చుట్టూ మూడు ముడతలు కనిపిస్తున్నాయి. అవి ఆమె స్తనముల యొక్క భారముచే వంగిన నడుముకు చుట్టూ వేసిన మూడు బంగారు కట్లుగా కనిపిస్తాయి.

పరమేశ్వరి నడుము సన్ననిది. అందులోనూ స్తనభారంచేత బాగా వంగి విరిగిపోతుందేమో అనే భయంతో ఆ నడుముచుట్టూ కట్లు బిగించారా అనట్లుగా ఆ ముడుతలు ఉన్నాయి.

దేవిస్తనాలు సూర్యచంద్రులు. అవి పగలు రాత్రి అనే భేదంతో కాలాన్ని తెలుపు తున్నాయి. ఒక పగలు, ఒక రాత్రి కలిపితే ఒకరోజు. ముప్పై రోజులు ఒక నెల. ఈ రకంగా కాలం లెక్క కట్టబడింది. కాలాన్ని భరించేది దేవి. ఆమె కాలస్వరూపిణి. కాలములు మూడు. అవి భూత భవిష్యద్వర్తమానాలు. కాని ఆ పరమేశ్వరి మాత్రం కాలాతీత. సాముద్రిక శాస్త్రప్రకారం.

**లలాటే చ గళే చైవ మధ్యే చాపి వళిత్రయమ్ ।**
**స్త్రీపుంసయో రిదం జ్ఞేయం మహాసౌభాగ్య లక్షణమ్ ॥**

లలాటమందు, కంఠస్థానమందు, నడుమునందు మూడు ముడతలుండటమనేది సౌభాగ్య లక్షణము. పరమేశ్వరుడికి రూపం లేదు. కాని

**సాధకానాం హితార్థాయ బ్రహ్మణోరూప కల్పనా ।**

సాధకుని యొక్క కోరిక తీరటం కోసం, అతనికి కావలసిన రూపం ఆ బ్రహ్మకు కల్పించబడింది. అప్పుడు అన్ని శుభలక్షణాలు ఆ బ్రహ్మరూపానికి ఆపాదింపబడతాయి. అదే విధంగా పరమేశ్వరికి లలాటము కంఠము, నడుము, వళిత్రయము మొదలైనవన్నీ సాముద్రిక శాస్త్రప్రకారం చెప్పబడ్డాయి.

నడుము చుట్టూ ఉన్న ఆ మూడు ముడుతలే స్థూల సూక్ష్మ కారణదేహాలు. సత్వరజస్తమో గుణాలు. మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులు, బ్రహ్మ, విష్ణు, రుద్రులు, భూలోక, భువర్లోక, సువర్లోకాలు.

సౌందర్య లహరిలోని 80వ శ్లోకంలో శంకరభగవత్పాదులవారు వళిత్రయాన్ని వర్ణిస్తూ

**కుచై స్సద్య స్స్విద్య త్తట ఘటిత కూర్పాసభిదురౌ**
**కషన్తౌ దోర్మూలే కనకకలశాభౌ కలయతా ।**
**తవ త్రాతుం భగ్నా దలమితి వలగ్నం తనుభువా**
**త్రిధా నద్ధం దేవి ! త్రివళి లవలీవల్లిభి రివ ॥**

దేవీ ! సన్నని నీ నడుముకు అపాయం కలుగకుండా అడవి తీగెలతో మూడు కట్లు వేశారు అన్నట్లుగా ఆ వళిత్రయం కనిపిస్తుంది.

## 37. అరుణారుణకౌసుంభవస్త్ర భాస్వత్కటీతటీ

అరుణము అంటే ఎరుపు. రక్త వర్ణము. అరుణారుణము అంటే ఎరుపు అనే మాటను రెండుసార్లు చెప్పటం జరిగింది. అనగా అరుణ వర్ణము మరింత అరుణంగా ఉన్నది. మిక్కిలి ఎర్రనైన. అనూరుని లాగా ఎర్రదైన వస్త్రముచే ప్రకాశించు కటి ప్రదేశము గలది. ఆ పరమేశ్వరి ఎర్రని వస్త్రములు ధరించి ఎర్రని కాంతులతో ప్రకాశించునది.

బాలబానునివలె అరుణ వర్ణము గలది. బంగారుచ్ఛాయవంటి కౌసుంభచ్ఛాయ గల వస్త్రముతో ప్రకాశించునది.

అరుణము అంటే సూర్యోదయానికి ముందున్న కాంతి. అరుణుడు లేక అనూరుడు ఉదయించే సమయంలోని కాంతి. కొద్దిగా ఎరుపు రంగులో ఉంటుంది. తెలుపుతో కలిసిన ఎరుపు. పాటలవర్ణము.

కౌసుంభము అంటే కుంకుమపువ్వు. అరుణుని యొక్క వర్ణము, కౌసుంభ పుష్పముయొక్క వర్ణముగల వస్త్రమును ధరించినది.

దేవి ఎరుపురంగులో ఉంటుంది. ఎర్రని వస్త్రాలు, ఎర్రని పూలమాలలనే ధరిస్తుంది. ఆమె పూజ కూడా రక్తాక్షతల (ఎర్రని అక్షంతలు) తోనే చెయ్యాలి. ఇది కామ్యము.

## 38, రత్నకింకిణికారమ్యరశనాదామభూషితా

రత్నాలు పొదగబడిన బంగారుగంటలచే అలంకరింపబడిన మొలనూలు గలది.

పూర్వకాలంలో స్త్రీలు మొలనూలు అనబడే బంగారు మొలత్రాడు ధరించేవారు. అది ఒక ఆభరణం. మొలత్రాడు అనేది లోపల ఉంటుంది. కాని మొలనూలు బయటవైపున అలంకారంగా ఉంటుంది. ఇక ధరించే వారిశక్తిని బట్టి దానిమీద రత్నాలు, ముత్యాలు కెంపులు పొదగబడతాయి. అయితే ప్రస్తుతకాలంలో కూడా ఈ ఆభరణాలు కనిపిస్తున్నాయి.

ఉపనయన కాలంలో వటువు నడుముకు ముంజిగడ్డితో చేసిన త్రాడును కడతారు. అప్పుడు చేసే సంస్కారంవల్ల అతడికి మంత్రోపాసన చేసేందుకు అధికారము వస్తుంది. అలాగే వివాహ సమయంలో పెండ్లికుమార్తెకు ఈ అధికారం వస్తుంది. పరమేశ్వరి ఓంకారము అనేటటువంటి ఈ సూత్రాన్ని ధరించి సదాచారాలను లోకానికి బోధిస్తుంది. ఆమె నాదమయి. ఓంకారాత్మక సూత్రధారిణి ఆ పరాశక్తి.

రతనాలు పొదిగి, చిరుగంటలచే అలంకరించబడిన పదహారు తీగెలు గల మేఖలా సూత్రము చే అలంకరించబడినది.

## 39. కామేశజ్ఞాతసౌభాగ్యమార్దవోరుద్వయాన్వితా

కామేశ్వరునికి మాత్రమే తెలియదగిన సౌభాగ్యమార్దవము, లావణ్యము, కోమలములయిన ఊరుద్వయము గలది.

ఈ జగత్తు అంతటికీ అంతర్ బహిసాక్షి, సచ్చిదానందరూప అయిన పరమేశ్వరి భర్త అయిన కామేశ్వరునికి మాత్రమే తెలియదగిన ఊరుద్వయము గలది. 'ఊరు' అనే శబ్దంలో ఊ, ఉ అని రెండు అక్షరాలున్నాయి. వీటిలో ఊ అనేది వామోరువు. ఎడమతొడ, సౌభాగ్య సంజ్ఞ కలది. అలాగే ఉ అనేది దక్షిణోరువు, కుడితొడ. మార్దవ సంజ్ఞగలది. ఊరుద్వయము యొక్క సంధిస్థానము రత్నమణి సంజ్ఞ గలిగి తొమ్మిది అంకెచేత సూచించబడుతున్నది. ఇది పరము అపరము అని రెండు విధాలు. వామోరువు

పరాసూచితము. దక్షిణోరువు అపరాసూచితము. వామోరువు సృష్టిలోని చతుర్వర్ణములలోను స్త్రీ పురుష భేదాలను సూచిస్తుంది. కాగా దక్షిణోరువు పంచ భూతాలు, మనస్సు, బుద్ధి, అహంకారములను సూచిస్తుంది.

"కామేశ్వరునికి మాత్రమే ఎరుక అయిన లావణ్యము (కాంతి విశేషము) మార్దవము గల ఊరుద్వయము గలది". అని భాస్కరరాయలవారి వ్యాఖ్య. అంటే

దేవియొక్క ఊరువులకాంతి, మృదుత్వము ఆ పరమేశ్వరునికే ఎరుక అని అర్ధము. ఈ నామంలో పరమేశ్వరి సతీత్వము, శివశక్త్యైక్యము నిరూపించబడుతున్నాయి.

సౌందర్య లహరిలోని 82వ శ్లోకంలో శంకరభగవత్పాదులవారు దేవి ఊరుద్వయాన్ని వర్ణిస్తూ

**కరీంద్రాణాం శుండాన్ కనకకదలీకాండపటలీం**
**ఉభాభ్యా మూరుభ్యాం ఉభయ మపి నిర్జిత్య భవతి ।**
**సువృత్తాభ్యాం పత్యుః ప్రణతికఠినాభ్యాం గిరిసుతే !**
**విధిజ్ఞే ! జానుభ్యాం విబుధకరికుంభద్వయ మసి ॥**

దేవీ ! ఏనుగు తుండములు, అరటి బోదెలను నీ రెండు ఊరువులచేత జయించి, పరమేశ్వరునికి మ్రొక్కుటచే కఠినమైన మోకాళ్ళు కలిగి ఏనుగుల కుంభస్థలములను కూడా జయించుచున్నావు.

స్త్రీల ఊరువులను అరటి బోదెలతోను, ఏనుగు తుండములతోను పోల్చటం పరిపాటి. ఇక్కడ పరమేశ్వరి వాటిని కూడా జయించింది అనటంచేత, ఆమె ఊరువులముందు అరటిబోదెలు, ఏనుగుతుండములు కూడా సాటిరావు అని భావము.

## 40. మాణిక్యమకుటాకార జానుద్వయవిరాజితా

ఇక్కడ మాణిక్యమకుటము అంటే **అఖండ మాణిక్యేన నిర్మితం మకుటం** అఖండమైన మాణిక్యములతో నిర్మించినటువంటి మోకాలి చిప్పలతో ప్రకాశించునది.

ఆ పరమేశ్వరి మోకాళ్ళు మాణిక్యములు కూర్చబడిన కిరీటాలులాగా టోపీలులాగా ఉన్నాయి. ఇక్కడ కిరీటములతో మోకాళ్ళను పోల్చటం జరిగింది. 39, 40 నామాలలో దేవి ఊరువులు జానువులను వర్ణించటం జరిగింది. ఈ రెండింటికీ సంధిస్థలము, కేంద్ర బిందువు రత్నమణి సంకేతము గలది. ఇది 'కలికా' అనే సంజ్ఞతో చెప్పబడింది. దీని

తత్త్వము రహస్యాతి రహస్యము. అవాఙ్మనసగోచరము. దీన్ని తెలుసుకున్నవాడే సర్వజ్ఞుడు. ఈ కలిక ప్రకృతి రూపము. రక్తశుక్ల ప్రభామిశ్రము. చరణద్వయ సమిష్టిరూపము.

ఆనందద్వైవిధ్యరూపము. ప్రణవద్వైవిధ్య రూపము కలాద్వైవిధ్య రూపము. శివశక్త్యైక రూపము. సర్వతత్త్వసారము. సాధారణ మానవులు దీన్ని తెలియలేరు. సర్వవేద వేద్యుడయిన ఆ పరమేశ్వరుడికే ఈ రహస్యం తెలుసు. కలికా అనే ఆనంద స్వరూపాన్ని ఆనంద స్వరూపుడయిన కామేశ్వరుడికే తెలియుట సహజము. ఎందుకంటే తన స్వరూప స్వభావాలు తనకు తెలిసినట్లుగా ఇతరులకు తెలియవు.

మోకాళ్ళు కఠినములు కాబట్టి వాటిని మాణిక్యమకుటములతో పోల్చారు.

## 41. ఇంద్రగోపపరిక్షిప్తస్మరతూణాభజంఘికా

ఇంద్రగోపములు అంటే ఆరుద్ర పురుగులు. అవి మాణిక్యాలలాగా ఎర్రని కాంతి కలిగి ఉంటాయి. ఈ పురుగులు వర్షాకాలంలో పుడతాయి. ఈ రకంగా ఆరుద్ర పురుగుల వలె ఎర్రని కాంతులతో ప్రకాశించు మణులతో చెక్కబడిన మన్మథుని అమ్ములపొదులతో సమానమైన కాంతులతో ప్రకాసించు పిక్కలు గలది.

**వారుణేన చ జంఘోరునితంబస్తేజసా భువః**

పరమేశ్వరి ఆవిర్భవించినప్పుడు వరుణుని తేజస్సుతో పిక్కలు, తొడలు ఏర్పడ్డాయి. ఇంద్రగోపములు అంటే మంత్రవర్ణములు బాణము అంటే మంత్రము. తూణీరము అంటే అమ్ములపొది. అందులో ఇటువంటి బాణ సముదాయముంటుంది. అందుచేత దీన్ని మహామంత్ర సంపుటమైన మహాపాదుక అని భావించాలి.

**అస్యశ్రీ శ్రీమహాపాదుకామహామంత్రస్య హంసఋషిః అవ్యక్తా గాయత్రీఛందః శ్రీమహాగురుపాదుకా దేవతా । హం బీజం । సః శక్తిః । సోఽహం కీలకం । జపే వినియోగః ॥**

**న్యాసము :**

**హంసాం సూర్యాత్మనే ।** **హంసైం నిరాభాసాత్మనే ।**
**హంసీం సోమాత్మనే ।** **హంసౌం అతనుసూక్ష్మ ప్రబోధాత్మనే।**
**హంసూం నిరంజనాత్మనే ।** **హంసః అవ్యక్త ప్రబోధాత్మనే ।**

**ధ్యానము :**

స్వప్రకాశ శివమూర్తిరేకికా
తద్విమర్శ తను రేకికా తయోః ।
సామరస్య వపురిష్యతే పరా
పాదుకా పరశివాత్మనో గురోః ॥

సంచింతయామి చరణౌ కులరంధ్రపీఠే
శంభోర శేష జనన స్థితినాశహేతూ ।
షష్ట్యుత్తర త్రిశత దివ్యమరీచికానాం
అంతే పదోపరి షడన్వయ రక్తశుక్లౌ ॥

సహస్రదళ పంకజే సకల  శీతరశ్మి ప్రభం
వరాభయ కరాంబుజం విమల గంధమాల్యాంబరమ్ ।
ప్రసన్నవదనేక్షణం సకల దేవతారూపిణం
స్మరేచ్ఛిరసి హంసకం తదభిధాన పూర్వం గురుమ్ ॥

వందే గురుపదద్వంద్వ మవాఙ్మాన సగోచరం ।
రక్తశుక్ల ప్రభామిశ్ర మతర్క్యం త్రైపురం మహః ॥

కరంధ్రే హృదయే మూలే దేశికాంఘ్రి యుగత్రయం ।
దధత్రీం దీప్తభూషాఢ్యాం శ్రీమహా పాదుకాం భజే ॥

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్ ।
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షి భూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥

**మంత్రము :**

షడామ్నాయస్థ మంత్రాణాం సారభూతాం పరాంశివాం ।
ద్వాదశభిర్మహామంత్రైరుచ్చరే ద్గురుపాదుకామ్ ॥

ఇంద్ర – పరమైశ్వర్యము, మోక్షము
గోప – రక్షించునది

స్మర - చింతింపతగిన

జంఘికా - పుట్టుక

ఈ రకంగా చూసినట్లైతే మోక్షమిచ్చి రక్షించు దేవి అని అర్థము.

## 42. గూఢగుల్ఫా

బలిసిన చీలమండలు గల పరమేశ్వరి. ధ్యానించువారిని రక్షించునది.

"ధ్యాయేత్పద్మాసనస్థాం" అని ధ్యానించినప్పుడు దేవి పద్మాసనాసీన అని చెప్పబడుతున్నది. ఆ పద్మాసనంలోని గుల్ఫములు గుహ్యస్థానానికి సన్నిహితంగా ఉంటాయి. గుహ్యస్థానము రత్నమణి సూచితము. చీలమండల సంధిస్థానానికి కేంద్రమునందున్న మణి సూచితమైన నవసంఖ్యాతలము. నవార్ణ మంత్రమందలి మధ్యవర్ణము చింతామణి సంజ్ఞ గలది. మిగిలిన ఎనిమిది బీజాలు అష్టప్రకృతులు.

## 43. కూర్మపృష్ఠజయిష్ణుప్రపదాన్వితా

తాబేటి వీపును జయించు స్వభావము గల మీగాళ్ళతో కూడినది. అనగా ఆమె మీగాళ్ళు తాబేలు వీపుకన్న బాగా ఉన్నాయి అని అర్థం.

తాబేలు వీపుమీద సురక్షితంగా ప్రకాశిస్తున్న చతుర్దశ భువనాల రక్షణ కలది. సంగ్రామంలో మరణం పొందకుండా ఉండాలంటే అమృతం తాగాలి అనే నిర్ణయానికి వచ్చారు దేవతలు. అమృతం కావాలి అంటే క్షీరసాగర మథనం జరగాలి. అందుకోసం మందరగిరి పర్వతాన్ని కవ్వంగా తెచ్చుకున్నారు. వాసుకిని త్రాడుగా చేసి దేవదానవులు క్షీరసాగరమథనం ఆరంభించారు. పర్వతం సముద్రంలో మునిగిపోతోంది. ఏం చెయ్యాలో తెలియలేదు. అప్పుడు దేవతలంతా శ్రీమహావిష్ణువును ప్రార్థించారు. ఆ సమయాన ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీమహావిష్ణువు కూర్మరూపంలో మందరగిరి పర్వతాన్ని మోశాడు. ఈ రకంగా జగాలను రక్షించాడు. అందుచేతనే కూర్మము వీపుమీద చతుర్దశ భువనాలకు రక్షణ కల్పించింది అన్నారు.

తాబేలు వీపు చాలా గట్టిగా ఉంటుంది. రాయితో కొట్టినా పగలదు. ప్రమాదం ఏదయినా సంభవించినప్పుడు తాబేలు తనకాళ్ళు, తల వీపు క్రిందికి లాక్కుని రక్షణ కల్పించుకుంటుంది. అటువంటి తాబేటి వీపులాగా పరమేశ్వరి పాదాలున్నాయి. అంటే దేవి పాదాలను ఆశ్రయించిన వారికి తాబేటి చిప్పవలె రక్షణ కల్పిస్తుంది. పాదముయొక్క

పైభాగాన్ని 'ప్రపదం' అంటారు. సౌందర్య లహరిలోని 88వ శ్లోకంలో శంకరభగవత్పాదులు దేవి ముంగాలును వర్ణిస్తూ

**పదం తే కీర్తీనాం ప్రపద మపదం దేవి ! విపదాం**
**కథం నీతం సద్భిః కఠినకమఠీకర్పరతులాం ।**
**కథం వా పాణిభ్యా ముపనయనకాలే పురభిదా**
**య దాదాయ న్యస్తం దృషది దయమానేన మనసా॥**

భక్తుల ఆపదలను తొలగించు పరమేశ్వరి మీగాళ్ళు కఠినమైన తాబేటి చిప్పతో పోల్చబడ్డాయి. తల్లీ ! అటువంటి నీ పాదాలను వివాహ సమయంలో శివుడు తనచేతితో తీసుకుని సన్నెకల్లు మీద ఏ విధంగా ఉంచగలిగాడు?

భార్య పాదాలను సన్నెకల్లు మీద ఉంచి మట్టెలు తొడగటం సంప్రదాయం.

## 44. నఖదీధితిసంఛన్ననమజ్జనతమోగుణా

పాదాభివందనం చేసేవారికి, దేవియొక్క కాలిగోళ్ళ కాంతులచేత అజ్ఞానము పటాపంచలవుతుంది. పరమేశ్వరికి పాదాభివందనం చేసినంతనే అజ్ఞానము తొలగిపోతుంది.

పాదాభివందనము అంటే ఎదిటివారి పాదాలకు సాగిలబడి నమస్కారం చెయ్యటం. పరమేశ్వరికి పాదాభివందనం చేసే వారందరూ దేవతలు. వారందరూ కిరీటధారులు. ఆ కిరీటాలు రత్నమణిమయాలు. చెప్పలేనటువంటి కాంతులు ప్రకాశింపచేస్తూ ఉంటాయి. అటువంటి కిరీటాలు గల దేవతలు వారి శిరస్సులు వంచి పరమేశ్వరికి పాదాభివందనం చేస్తున్నప్పుడు, దేవి కాలిగ్రోళ్ళ నుంచి ప్రసరించే కాంతులు పరమేశ్వరి పాదాలకు నమస్కరిస్తున్న దేవతల కిరీటాలలోని మణులనుంచి వచ్చే కాంతులకన్న ఎన్నో రెట్లు ఎక్కువైనవి. అది గమనించిన వారి యొక్క అజ్ఞానము పటాపంచలయి పోతుంది.

పద్మపురాణంలో నారదుడు హిమవంతుడి దగ్గరకు వచ్చి పార్వతీదేవి యొక్క సాముద్రిక లక్షణాలు వివరిస్తూ 1. ఈమెకు భర్త జన్మించలేదు. 2. ఈమె చేతులు ఎప్పుడూ పైకి ఎత్తబడే ఉంటాయి. 3. ఈమె పాదాలు వ్యభిచరించునవిగా ఉంటాయి. అని చెబుతాడు ఆ మాటలను తప్పుగా అర్థం చేసుకున్న హిమవంతుడు దుఃఖిస్తుంటాడు. అప్పుడు నారదుడు తన మాటలు వివరిస్తూ

1. భర్త జనించలేదు అంటే అతడు జనన మరణములు లేనివాడు. ఆద్యంతములు లేనివాడు అతడే పరమేశ్వరుడు.

2. ఆమె చేతులు ఎప్పుడూ పైకి ఎత్తబడే ఉంటాయి. అంటే ఎప్పుడూ ఆమె ఇచ్చే స్థితిలోనే ఉంటుంది. కాని ఎవరినుంచీ ఏమీ తీసుకోదు. ఇచ్చేవారి చేతులు ఎప్పుడూ పైనే ఉంటాయి.

3. తనకాంతులచే పాదాలు వ్యభిచరిస్తాయి అంటే, స్వచ్ఛమైన గ్రోళ్ళతో ప్రకాశించే దేవిపాదాలు పద్మములులాగా ఉంటాయి. దేవదానవులు ఆమె పాదాలకు నమస్కరించే టప్పుడు వారి కిరీటములలోని మణులకాంతులు దేవి పాదాలయొక్క వ్రేలిగోళ్ళ కాంతులముందు వెలవెలపోతాయి. వారి అజ్ఞానాన్ని హరించివేస్తాయి. అంటాడు.

ఈ కాంతులే చరాచర జగత్తునూ ప్రకాశింపచేస్తున్నాయి. అగ్ని కిరణములు 108, సూర్య కిరణములు 116, చంద్రుని కిరణములు 136. వెరసి 360 ఇవన్నీ మహావాక్య సూచకాలు. మంత్ర సంకేతాలు.

శంకరభగవత్పాదులవారు తన సౌందర్య లహరిలోని 89వ శ్లోకంలో పరమేశ్వరి నఖాలను వివరిస్తూ

**నఖైర్నాక స్త్రీణాం కరకమలసంకోచ శశిభిః**
**తరూణాం దివ్యానాం హసత ఇవ తే చండి చరణౌ**
**ఫలాని స్వఃస్థేభ్యః కిసలయ కరాగ్రేణ దదతాం**
**దరిద్రేభ్యో భద్రాం శ్రియమనిశ మహ్నాయ దదతౌ ॥**

దేవీ ! సకల సంపదలతోను తులతూగు దేవతలకు మాత్రమే కోర్కెలు తీర్చు కల్పవృక్షమును, దరిద్రులకు మంగళకరమై అధిక సంపదలనిచ్చు నీ పాదాలు శచీదేవి మొదలైన దేవతా స్త్రీల యొక్క కరపద్మములను ముకిళింప చేయు గోళ్ళను చంద్రులచేత పరిహాసము చేయబడుచున్నాయి.

ఇక్కడ దేవతా స్త్రీలయొక్క చేతులను 'కరపద్మములు' అంటూ పద్మాలతో పోల్చారు. పద్మాలు సూర్యకాంతిలోనే వికసించి ఉంటాయి. కాని చంద్రోదయం కాగానే అవి ముకుళించుకుపోతాయి. అలాగే పద్మాలు అనబడే దేవతా స్త్రీలచేతులు చంద్రకాంతిలాగా ఉన్న దేవి కాలివ్రేలి గోళ్ళకాంతులవల్ల ముడుచుకుపోతున్నాయి. వెలవెలబోతున్నాయి.

## 45. పదద్వయప్రభాజాలపరాకృతసరోరుహా

పాదముల సౌష్ఠవము మొదలైన గుణ సమూహముచే తిరస్కరించబడిన తామరలు గలది. దేవి పాదముల కాంతులచే కమలములు సైతము తిరస్కరించబడుతున్నాయి. అనగా దేవిపాదాలు పద్మాలవలె ప్రకాశిస్తున్నాయి. వాటియొక్క కాంతులముందు పద్మాలుకూడా వెలవెలబోతున్నాయి. పాదములయొక్క కాంతిచే తిరస్కరించబడిన పద్మాలయా అని గనక చెప్పినట్లైతే లక్ష్మీ సరస్వతులకు తల్లియైన పరాభట్టారిక అని అర్థం.

అర్చిష్మతి, మహస్వతి, జ్యోతిష్మతి. అనబడే అగ్ని, సూర్య, చంద్రకళలు ఇవి మొత్తం 360 అని గతంలో వివరించటం జరిగింది. ఈ కళలు మండలాకారంగా వ్యాపించి పిండాండ బ్రహ్మాండాలను ప్రకాశింపచేస్తున్నాయి. వీటివల్ల సుధాధారలు కురిసి శరీరంలోని 72000 నాడీమండలం తడుస్తుంది. ఈ 360 కళలు ఒక సంవత్సరానికి ప్రతీక ప్రజాపతి సంవత్సర స్వరూపుడు. **సంవత్సరోవై ప్రజాపతిః** ఈ కళలన్నీ దేవిచరణారవిందముల నుండే ఉత్పన్నమైనాయి.

శంకర భగవత్పాదులవారు ఈ విషయాన్ని తన సౌందర్య లహరిలోని 14వ శ్లోకంలో వివరిస్తూ

**క్షితౌ షట్పంచాశ ద్విమధిక పంచాశ దుదకే**
**హుతాశే ద్వాషష్ఠిశ్చతురధిక పంచాశ దనిలే**
**దివి ద్విషట్త్రింశ న్మనసి చ చతుష్షష్ఠి రితి యే**
**మయూఖాస్తేషాం అప్యుపరి తవ పాదాంబుజ యుగమ్**

| | | |
|---|---|---|
| ఓ పరమేశ్వరీ ! పృథివీ తత్త్వాత్మకమైన మూలాధార చక్రమందు | - | 56 |
| జలతత్త్వాత్మకమైన మణిపూర చక్రమందు | - | 52 |
| వెరసి 108. ఇవి అగ్నిజ్వాలలు | | |
| అగ్ని తత్త్వాత్మకమైన స్వాధిష్ఠానచక్రమందు | - | 62 |
| వాయుతత్త్వాత్మకమైన అనాహతచక్రమందు | - | 54 |
| వెరసి 116. ఇవి సూర్యకిరణాలు | | |
| ఆకాశతత్త్వాత్మకమైన విశుద్ధి చక్రమందు | - | 72 |
| మనస్తత్త్వాత్మకమైన ఆజ్ఞాచక్రమందు | - | 64 |

వెరసి 136 ఇవి చంద్రకళలు. ఈ మొత్తం కలిపి 360 కిరణాలు చరాచర జగత్తును ప్రకాశింపచేస్తున్నాయి.

ఈ మొత్తం 360 కిరణాలు బ్రహ్మరంధ్రం దగ్గర దర్శనమవుతాయి. సాధకుడు ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీ శక్తిని గనక జాగృతం చేసినట్లైతే, అది గ్రంధిత్రయాన్ని దాటి సహస్రారం చేరుతుంది. అప్పుడు సహస్రదళ పద్మంలో నుంచి జాలువారే అమృతపు జల్లులతో సాధకుని శరీరంలోని 72000 నాడీ మండలము తడపబడుతుంది. ఆ 360 కిరణములచేత చరాచర జగత్తు ప్రకాశిస్తుంది అంటే అర్థం ఇదే.

## 46. శింజానమణిమంజీరమండిత శ్రీ పదాంబుజా

మంజీరములు అనేవి స్త్రీల కాళ్ళకు ఉండే ఒక రకమైన ఆభరణము. అందెలు, పట్టాలు, పాంజేబులు, గొలుసులు, కడియాలు, మంజీరములు అనేవి కాళ్ళకు పెట్టుకునే రకరకాల ఆభరణాలు. వీటిలో మంజీరాలు రాళ్ళు పొదగబడి ఉంటాయి. పరమేశ్వరి ధరించిన ఈ మంజీరాలు మణులు పొదగబడి ఉంటాయి. ఆ మణులకాంతులచేత దేవి పాదాలు ప్రకాశిస్తున్నాయి. ఈ మంజీరాలకు చిరుమువ్వలు వేలాడుతుంటాయి. నడుస్తున్నప్పుడు ఆ మువ్వలు విచిత్రమైన ధ్వనులు చేస్తుంటాయి. ఆ ధ్వని ప్రణవాన్ని మరపింప చేస్తుంది. వేదాన్ని గుర్తుకు తెస్తుంది.

గజ్జెలతో కూడిన అందెలనే మంజీరాలు అంటారు. పరమేశ్వరి కాళ్ళకు ఉన్న ఈ మంజీరాలు హాది, కాది విద్యలు అని చెప్పబడుతున్నాయి. పంచదశి మహామంత్రాన్ని అనేకమంది అనేక రకాలుగా ఉపాసన చేశారు.

అ నుంచి క్ష వరకు గల అక్షరసమామ్నాయాన్ని 'మాతృకలు' అంటారు. వీటిలో కకారముతో మొదలయ్యే అక్షరాలను కాది మాతృకలని, హకారంతో మొదలయ్యే అక్షరాలను హాది మాతృకలని అంటారు. పంచదశి మహామంత్రం కకారంతో మొదలయితే కాదివిద్య, హకారంతో మొదలయితే హాదివిద్య. ఇంద్రుడు, చంద్రుడు, మనువు, కుబేరుడు, మన్మథుడు మొదలైన వారు కాదివిద్యనుపాసించగా, లోపాముద్ర సూర్యుడు, శివుడు, విష్ణువు మొదలైనవారు హాదివిద్యను ఉపాసించారు. హాదివిద్యలో యమనియమాలు ఎక్కువగా ఉంటాయి. కాదివిద్యలో అవి ఎక్కువ ఉండవు. ధర్మాచరణలో స్వేచ్ఛ ఇవ్వబడింది. అని శక్తి సంగమ తంత్రంలో చెప్పబడింది. ఈ రెండు విద్యలలోను కాదివిద్య శ్రేష్ఠమైనది.

**తేషు ద్వా మనురాజేతు వరిష్ఠా వింధ్య మర్దన**
**లోపాముద్రా కామరాజానితిఖ్యాతి ముపాగతౌ ।**
**హాది స్తు లోపాముద్రాస్యా త్కామరాజ స్తు కాదికః**
**తయో స్తు కామరాజోఽయం సిద్ధిదో భక్తి శాలినః ॥**

హాది విద్యలో లోపాముద్ర ఉపాసించిన మంత్రము కాదివిద్యలో కామరాజు (మన్మధుడు) ఉపాసించిన మంత్రము శ్రేష్ఠమైనవి. కాగా హాది, కాది విద్యలలో కాదివిద్య శ్రేష్ఠమైనది.

హాది, కాది విద్యలలో ఏ విద్యనుపాసించినా సాధకుడికి ఇష్టార్ధసిద్ధి కలుగుతుంది. అందుకే దేవి పాదాలకు ఉన్న రెండు మంజీరాలు హాదికాది విద్యలు అని చెప్పబడ్డాయి.

దేవి కాలి అందెలను శంకరభగవత్పాదుల వారు తమ సౌందర్య లహరిలోని 86వ శ్లోకంలో వర్ణిస్తూ

**మృషా కృత్వా గోత్రస్ఖలన మథ వైలక్ష్యసమితం**
**లలాటే భర్తారం చరణకమలే తాడయతి తే**
**చిరా దన్తశ్శల్యం దహనకృత మున్మూలితవతా**
**తులాకోటిక్వాణైః కిలికిలిత మీశాన రిపుణా ॥**

తల్లీ ! నీ దగ్గర ఉన్నప్పుడు, శివుడు తన్మయత్వంలో పొరపాటున నీ సవతి పేరు ఉచ్చరించాడు. దానికి నీవు కాని కాలితో నుదుటన తన్నావు. గిరిజా కల్యాణానికి ముందు శివుని కోపాగ్నికి భస్మమైన మన్మథుడు, శివుని మీద కోపగించి అదనుకోసం వేచి ఉన్నాడు. ఇప్పుడు అదనుచూసి నీ కాలి అందెలలోని మువ్వలలో చేరి శివుని చూసి హేళన చేస్తూ కిలకిలా రావం చేస్తున్నాడు.

అనగా పరమేశ్వరి కాలి అందెలరవళులు కిలకిలా రావాన్ని మరపిస్తున్నాయి.

## 47. మరాళీమందగమనా

**మరాళో హంసః, సఃస్వభావా దేవ మందగతిః**

మరాళము అంటే హంస. ఇది పక్షిజాతిలో ఉత్తమమైనది. సహజంగానే ఇది మెల్లగా నడుస్తుంది. అందులోనూ ఆడు హంస ఇంకా మెల్లగా నడుస్తుంది. ఆడు

హంసలాగానే పరమేశ్వరి కూడా అతిమెల్లని నడక గలది. మందగమనము అనేది ఉత్తమజాతి స్త్రీ లక్షణము.

హంస అంటే పరమాత్మ, యోగవిశేషము, శరీరవాయు విశేషము, మంత్రవిశేషము, అని సూరాయాంధ్ర నిఘంటువు చెబుతోంది.

మూలాధారంలో బయలుదేరిన ఈ హంస సుషుమ్నా నాడిద్వారా సహస్రారానికి చేరుతుంది. అక్కడి నుంచి మళ్ళీ మూలాధారానికి వస్తుంది. ఈ విధంగా తిరుగుతూ ఉంటుంది. ఇది మందగమన, శరీరంలో కోపము, భయము, శృంగారము ఎక్కువైనప్పుడు దీని గమనం పెరుగుతుంది. మిగిలిన సమయాలలో దీని గమనం చాలా మందంగా ఉంటుంది. జపతపాదులందు మరీ మందంగా ఉంటుంది. హంస స్వరూపిణి అయిన ఆ పరమేశ్వరి అందుచేతనే మందగమన.

## 48. మహాలావణ్యశేవధిః

పరమేశ్వరి మిక్కిలి సౌందర్యవతి

**మహతో లావణ్యస్య అతిశయ సౌందర్యస్య, శేవధిః = నిధిః ।**

దేవి అతిశయించిన సౌందర్యానికి నిధి. శేవధి అంటే నిధి అని అర్థము. లావణ్యము అంటే సౌందర్యము చక్కదనము, ముత్యములందువలె నయనముల యందు నీడ ప్రతిఫలించునట్టి కాంతి విశేషము. అని చెబుతోంది సూర్యరాయాంధ్ర నిఘంటువు. ఇక్కడ లావణ్యము అనే పదానికి ముత్యముల యందలి నిగనిగ చ్ఛాయ అని అర్థం తీసుకోవాలి. దేవి లావణ్యనిధి.

ఆమెను మించిన సౌందర్యము, లావణ్యము మరెక్కడా లేదు. ప్రకృతిలోని సౌందర్యమంతా దేవి సౌందర్యము నుంచి వచ్చినదే. పరమేశ్వరి సౌందర్యం నిరుపమానము. ఆ సౌందర్యము చెక్కు చెదరదు. మిగిలిన సౌందర్యమంతా వికారం చెందుతుంది. అనగా ఈ జగత్తులోని అందంగా కనిపించే ఏ వస్తువుకూ ఆ అందం శాశ్వతం కాదు. అది నశిస్తుంది. కాని పరమేశ్వరి సౌందర్యం మాత్రం శాశ్వతమైనది. లౌకికమైన సౌందర్యం మెరుపుతీగలాగా అశాశ్వతం. క్షణభంగురము. దేవి సౌందర్యం మాత్రమే శాశ్వతమైనది. అందుకే ఆమె సౌందర్యనిధి. మహాలావణ్య శేవధి. అని చెప్పబడింది.

దేవి జగద్వ్యాప్తమైన శరీరచ్ఛాయ గలది. రక్త శుక్ల కాంతే లావణ్య సూచకము. అంటే పరమేశ్వరి ఆ రక్తవర్ణంలో ఉంటుంది. అదే జపాకుసుమచ్ఛాయ మంకెన్న పూవులాగా, దానిమ్మపూవులాగా ఎరుపు తెలుపు కలిసిన పాటల వర్ణంలో ఉంటుంది. అదే అరుణ వర్ణము. ఆ కాంతే లావణ్య శూచకము. ఇక్కడ మహా అంటే బ్రహ్మ అని లావణ్యము అంటే ఆనందం అని కూడా అర్థం చెబుతున్నారు. మహాలావణ్యము అంటే బ్రహ్మానందము. శేవధి అంటే నిధి. పరమేశ్వరి బ్రహ్మానందానికి నిధి. ఆమెను సేవించినవారు బ్రహ్మనందం పొందుతారు. మరి బ్రహ్మానందము అంటే ఏమిటి?

'బ్రహ్మానందము' అనే దాన్ని తైత్తిరీయోపనిషత్తులో వివరించారు.

ఈ లోకంలోని సంపద అంతా యువకుడు, సదాచార సంపన్నుడు, వేదాధ్యాయి, బలమైనవాడు అనుభవించటానికే ఉన్నది. దీనిని అనుభవించటంవలన కలిగే ఆనందము మానుషానందము.

మానుషానందానికి నూరు రెట్లు – మనుష్య గంధర్వానందం. మానుష గంధర్వులంటే మానవులై ఉండి పుణ్యకర్మలచేత గంధర్వత్వం పొందినవారు. మనుష్య గంధర్వానందానికి నూరురెట్లు దేవగంధర్వానందం. దేవగంధర్వులంటే సృష్టికాలంలో దేవలోకంలో గంధర్వులుగా జన్మించినవారు. దేవగంధర్వానందానికి నూరురెట్లు – చిరలోక పితరానందం. చిరకాలం ఉండే లోకంలో ఉన్న పితృదేవతలను చిరలోక పితరులు అంటారు.

చిరలోక పితరానందానికి నూరురెట్లు – అజానజ దేవానందము. ఈ లోకం దేవలోకానికి పైన ఉన్నది.

అజానజదేవానందానికి నూరురెట్లు – కర్మదేవానందము. వైదిక కర్మలు చేసినవారు కర్మదేవతలు.

కర్మదేవానందానికి నూరురెట్లు – దేవానందము. యజ్ఞంలో హవిర్భాగము తీసుకునే 33 మంది దేవతలు.

దేవానందానికి నూరురెట్లు – ఇంద్రానందం

ఇంద్రానందానికి నూరురెట్లు – బృహస్పతి ఆనందం

బృహస్పతి ఆనందానికి నూరురెట్లు – ప్రజాపతి ఆనందం

ప్రజాపతి ఆనందానికి నూరురెట్లు – బ్రహ్మానందము

పరమేశ్వరిని సేవించేవారు ఈ రకమైన బ్రహ్మానందాన్ని పొందుతారు.

## 49. సర్వారుణా

**వసన, ఆభరణ, కుసుమ, కాంత్యాధికం సర్వమేవ అరుణం యస్యాః**

వస్త్రము, ఆభరణము, పుష్పము, కాంతి మొదలైనవన్నీ ఎర్రగా గలిగినది.

పరమేశ్వరి ధరించే ఆభరణాలు, పుష్పాలు మేనిపూతలు అంటే శరీరానికి రాచుకునే చందనముకూడా అన్నీ ఎర్రరంగులోనే ఉంటాయి.

కుంకుమపూవులాంటి ఎర్రని వస్త్రం. రక్తచందనం, ఎరుపుదనం గల మాణిక్యాలు. (పద్మరాగాలు) మందారపూలు. అందుకే దేవిని సర్వారుణా అంటారు.

**అంబా పదాంబుజోద్భూత ప్రారుణ్య రసపూరితం ।**
**సర్వారుణం జగ ద్భాతి తన్మయత్వం ప్రతీయతే ॥**

పరమేశ్వరి వేలకొలది ఉదయభానుల కాంతులు గలది. ఈమె కామకలా స్వరూపిణి. విమర్శరూపిణి. జ్యోతిర్మయి.

అరుణవర్ణము ఆనందకరము. పరమేశ్వరిని సర్వారుణగా ఉపాసించటము చరాచర జగత్తుకూ వశీకరణము. మంత్రరత్నాకరంలో

**రత్నాం వశ్యే, స్వర్ణవర్ణాం స్తంభనే, మారణేఽ సితాం**
**ఉచ్చాటనే ధూమ్రవర్ణాం, శాంతాశ్వేతాం స్మరే దుమామ్ ॥**

అని మంత్ర రత్నాకరంలో చెప్పబడింది.

రత్నము అంటే మాణిక్యము. అది ఎరుపు రంగులో ఉంటుంది. కాబట్టి రత్నము అంటే ఎరుపు వర్ణము అని అర్థం.

| | | |
|---|---|---|
| ఎరుపురంగు | – | వశ్యము |
| బంగారురంగు | – | స్తంభనము |
| నలుపురంగు | – | మారణము |
| దూమ్రవర్ణము | – | ఉచ్చాటన |
| తెలుపురంగు | – | శాంతి |

అందుచేత దేవి ఎరుపువర్ణంలో ఉన్నది అంటే అదిలోకవశ్యము అని గుర్తించాలి. దేవిని స్తుతిస్తూ సకుంకు విలేపనాం.... అరుణ మాల్యభూషాంబరాం, జపాకుసుమ భాసురాం... అన్నారు. అంటే ఆమె ఎరుపురంగు వస్త్రాలు, ఆభరణాలు ధరించి ఉంటుంది.

ఎర్రనిచ్ఛాయతో నిగనిగలాడుతుంటుంది. అందుకే ఆధారచక్రంలో భైరవీ భైరవులను ధ్యానించేటప్పుడు

**జపాకుసుమసంకాశౌ మధుఘూర్ణితలోచనౌ**
**జగతః పితరౌ వందే భైరవీ భైరవాత్మకౌ ॥** అంటారు.

## 50. అనవద్యాంగీ

అనవద్యములు అంటే నింద్యములు కాని అంగములు గలది.

**సులక్షణాన్యంగాని అవయవా యస్యాః సా**

మంచి లక్షణములతో కూడిన అవయవయములు గలది. పరమేశ్వరి అవయవాలన్నీ మంచి లక్షణాలు కలిగి ఉన్నాయి. అవి దోషములు లేనివి.

సౌందర్యము మనసును హరించేది కాకూడదు. బుద్ధికి పారవశ్యం కలిగించి ఆత్మానందాన్ని కలిగించేదిగా ఉండాలి. అటువంటి సౌందర్యానికి అనవద్యము అని పేరు.

శరీరంలోని అంగాలన్నీ కంటికి కనిపిస్తాయి. అంగాలు అన్నీ ఉన్నా లేకపోయినా అంగి అంటే శరీరము మాత్రము ఉంటుంది. అసలు అంగి గనక లేకపోతే అంగాలుండవు. ప్రపంచంలో కనిపించే వాటన్నింటికీ ఆ పరమేశ్వరియే అంగి, అందుకనే ఈ ప్రపంచం యథాతథంగా నడిచిపోతోంది. ఆ దేవి ఎప్పుడైతే ఈ ప్రపంచాన్నుంచి ఉపసంహరించుకుంటుందో, అప్పుడు మహాప్రళయం వస్తుంది.

సాముద్రిక శాస్త్రంలో చెప్పినట్లుగా ఆ దేవి అన్నీ శుభలక్షణాలతోనే ఉన్నది. ఆమెకు దృశ్యాదృశ్యదోషము ఏమాత్రంలేదు. దృశ్యాదృశ్యదోషములు అంటే

1. అసత్యము
2. అనిత్యము
3. జడత్వము
4. పరాధీనత్వము
5. పౌరుషేయము
6. అసాధ్యము
7. పరిచ్ఛిన్నత్వము

మొదలైనవి.

ఈ దోషములు ఏవీ లేనటువంటిది.

అనవద్యులయిన అంగదేవతల సమిష్టిరూపమే అంగి అయిన పరమేశ్వరి. ఈ అంగదేవతలు

| | | |
|---|---|---|
| 1. హృదయదేవి | – | సర్వజ్ఞత |
| 2. శిరోదేవి | – | నిత్యతృప్త |
| 3. శిఖాదేవి | – | అనాదిబోధ |

| | | |
|---|---|---|
| 4. కవచదేవి | - | స్వతంత్రతా |
| 5. నేత్రదేవి | - | అలుప్తతా |
| 6. అస్త్రదేవి | - | అనంతా |

## 51. సర్వాభరణభూషితా

శరీరాన్ని అలంకరించుకోవటం కోసం ధరించేవి ఆభరణాలు. దేవి సర్వాభరణ భూషిత. తల మీద పెట్టుకునే చూడామణి దగ్గరనుండి కాలిమట్టెల దాకా 44 రకాల ఆభరణాలున్నాయని కాలికాపురాణంలోను, పరశురాముడి కల్పసూత్రాలలోను, దత్తాత్రేయసంహితలోను వివరించబడింది. ఆ ఆభరణాలు వివరాలు.

1. నవమణిమకుటము
2. సీమంతసింధూరము (పాపిటబొట్టు)
3. కాలాంజనము
4. చంద్రశకలము
5. తిలకము
6. వాళీయుగళము
7. మణిమండలయుగళము
8. నాసాభరణము
9. అధరయావకము
10. మాంగల్యము
11. కనకచింతాకము
12. పదకము
13. మహాపదకము
14. ముక్తావళి
15. ఏకావళి
16. ఛన్నవీరము
17. కేయూరయుగళచతుష్టయము
18. వలయావళి
19. ఊర్మికావళి
20. కాంచీదామము
21. కటిసూత్రము
22. సౌభాగ్యాభరణము (నల్లపూసలు)
23. పాదకటకము
24. రత్ననూపురము
25. పాదాంగుళీయకము
26. పాశము
27. అంకుశము
28. పుండ్రేక్షుచాపము
29. పుష్పబాణము
30. మాణిక్యపాదుకలు
31. కంఠాభరణము (కంటె)
32. సీమంతాభరణము (పాపిటబిళ్ళ)
33. కాళ్ళకుపట్టాలు
34. గొలుసులు
35. పాంజేబులు
36. కడియాలు
37. అందెలు
38. చూడామడి
39. పసుపు
40. రవిక
41. పూలు
42. చెవికమ్మలు
43. తాంబూలము
44. ఫలము

ఆభరణము అనే పదానికి అంతటా భరించేది అనే అర్థం కూడా ఉంది. దీనినిబట్టి చరాచరజగత్తునూ దేవి భరిస్తోందని గ్రహించాలి.

మంత్రశాస్త్ర విశేషాలే పరమేశ్వరికి ఆభరణాలు. సప్తకోటి మంత్రాలు దేవికి ఆభరణాలుగా చెప్పబడ్డాయి.

ప్రపంచంలో అనేకజాతుల వారున్నారు. వీరంతా అనేక ఆచారాలు పాటిస్తున్నారు. వివిధరకాలయిన ఆభరణాలు ధరిస్తున్నారు. బంగారము, వెండి, రాగి, దంతము మొదలగు వాటితో చేసిన ఆభరణాలను వీరు ధరిస్తారు. విశాలమైన విశ్వంలోని సమిష్టి జీవరూపమే దేవి. కాబట్టి వీరందరూ ధరించే ఆభరణాలను దేవి ధరిస్తుంది. అందుచేతనే ఆమె సర్వాభరణభూషిత అని చెప్పబడింది.

శ్రీచక్రంలో 44 కోణాలున్నాయి. అవి :

త్రికోణం – 3, అష్టకోణం – 8, అంతర్దశారం – 10, బహిర్దశారం – 10, చతుర్దశారం – 14, బిందువు – 1 వెరసి 46 కోణాలు. కాని శ్రీచక్రాన్ని గీసి లెక్కపెట్టినట్లైతే త్రికోణంలోని రెండుకోణాలు అష్టకోణంలో కలిసిపోతాయి. అందుచేత 46–2 = 44 కోణాలు మాత్రమే ఉంటాయి. కాబట్టే దేవి 44 రకాల ఆభరణాలు ధరిస్తుంది.

దుర్వాసుడు శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 34వ శ్లోకంలో ఆమె యొక్క ఆభరణాలను

**ముక్తారత్నవిచిత్రకాంతిలలితై స్తేబాహువల్లీ రహం**
**కేయూరాంగద బాహు దండ వలయై ర్హస్తాంగులీ భూషణైః**
**సంసక్తాః కలయామి హీరమణిమన్ముక్తావలీ కీలిత**
**గ్రీవా పట్టవిభూషణేన సుభగం కంఠం చ కంబుశ్రియమ్ ॥**

38వ శ్లోకంలో చేతివ్రేళ్ళకు, చేతులకు, ఉన్న ఆభరణాలను, మెడలోని ముత్యపుదండలను వర్ణించాడు.

**లేఖాలభ్య విచిత్ర రత్నఖచితం హైమం కిరీటోత్తమం**
**ముక్తా కాంచన కింకిణీగణ మహాహీర ప్రబంధోజ్జ్వలమ్ ।**
**చంచచ్చంద్రకలాకలాపలలితం దేవద్రుపుష్పార్చితం**
**మాల్యై ! రంబ విలంబితం సుశిఖరం బిభ్రచ్ఛిర స్తే భజే ॥**

శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 42వ శ్లోకం దగ్గర నుంచి దేవి అంగాంగాలను, వివిధ ఆభరణాలను వర్ణించారు.

దేవీభాగవతంలోని 12వ స్కంధంలో పరమేశ్వరి ఆభరణాలను వర్ణిస్తూ

**నవరత్న గణాకీర్ణ కాంచీదామ విరాజితా ।**
**తప్త కాంచన సన్నద్ధ వైడూర్యాంగద భూషణా ॥**

**కనచ్ఛ్రీ చక్రతాటంక విటంక వదనాంబుజా ।**
**లలాటకాంతివిభవ విజితార్ధ సుధాకరా ॥**

**బింబకాంతి తిరస్కారి రదచ్ఛద విరాజితా ।**
**లసత్కుంకుమకస్తూరీ తిలకోద్భాసితాననా ॥**

**దివ్యచూడామణి స్ఫారచంచచ్చంద్రకసూర్యకా ।**
**ఉద్యత్కాంతిసమస్వచ్ఛనాసాభరణభాసురా ॥**

**చింతాకాలంబిత స్వచ్ఛ ముక్తా గుచ్ఛ విరాజితా ।**
**పాటీరపంకకర్పూరకుంకుమాలంకృత స్తనీ ॥**

**విచిత్రవివిధాకల్పా కంబుసంకాశకంధరా ।**
**దాడిమీ ఫలబీజాభ దంతపంక్తి విరాజితా ॥**

**అనర్ఘ్య చరత్నఘటిత మకుటాంచితమస్తకా ।**
**మత్తాలి మాలావిలస దలకాఢ్య ముఖాంబుజా ॥**

**కలంక కార్శ్యనిర్ముక్త శరశ్చంద్ర నిభాననా ।**
**జాహ్నవీ సలిలావర్త శోభినాభీ విభూషితా ॥**

ఆ పరమేశ్వరి నవరత్నములు పొదగబడిన మొలనూలితోను, వైడూర్యములు పొదిగిన మేలిమి బంగారు కడియములతోను, శ్రీచక్రాకారముగల తాటంకములతోను, కస్తూరి కాతిలకముతోను, సూర్యచంద్రులకాంతులను మించిన కాంతిగల దివ్యచూడామణితోను, శుక్రనక్షత్రములా ప్రకాశించే నాసాభరణముతోను, మంచి ముత్యములు గుత్తులుగా వ్రేలాడుచున్న చింతాకుపతకముతోను, వెలలేని రత్నాలు పొదిగిన బంగారుకిరీటముతోను విరాజిల్లుతున్నది. అంటూ 18 నుంచి 33వ శ్లోకం దాకా దేవి ఆభరణాలను వర్ణించారు.

సప్తశతిలోని ద్వితీయాధ్యాయంలో మహిషాసుర సంహారం కోసం దేవతలందరి తేజస్సుతోను ఆ పరమేవ్వరి ఆవిర్భవించింది అని చెబుతూ దేవతలందరూ తమ వద్దనున్న ప్రశస్తమైన ఆభరణాలను ఆమెకు అందించారు అని చెప్పారు.

**క్షీరోద శ్చామలం హార మజరే చ తథాంబరే**
**చూడామణిం తథా దివ్యం కుండలే కటకాని చ ॥**

**అర్ధచంద్రం తథా శుభ్రం కేయూరాన్ సర్వబాహుషు**
**నూపురౌ విమలౌ తద్వ గ్రైవేయక మనుత్తమమ్ ॥**

**అంగులీయకరత్నాని సమస్తా స్వంగులీషు చ**
**విశ్వకర్మా దదౌ తస్మై పరశుం చాతి నిర్మలమ్ ॥**

**అస్త్రాణ్యనేకరూపాణి తథా ఉ భేద్యం చ దంశనమ్ ।**
**ఆమ్లానపంకజాం మాలాం శిర స్యురసి చాపరామ్ ॥**

**అదద జ్జలధి స్తస్యై పంకజం చాతిశోభనమ్ ।**
**హిమవాన్ వాహనం సింహం రత్నాని వివిధాని చ ॥**

**దదా వశూన్యం సురయా పానపాత్రం ధనాధిపః**
**శేష శ్చ సర్వనాగేశో మహామణివిభూషితమ్ ॥**

**నాగహారం దదౌ తస్యై ధత్తే యః పృథివీ మిమామ్**
**అన్యై రపి సురై ర్దేవీ భూషణై రాయుధై స్తథా ॥**

పాలసముద్రము ఒక నిర్మలమైన ముత్యాలహారము, ఎన్నటికీ మాసిపోని, చిరిగిపోని రెండు చీరలు, దివ్యమైన శిరోరత్నము, కమ్మలు, కటకములు (గాజులు) అర్ధచంద్రాభరణము, భుజకీర్తులు, మంజీరములు, ఉత్తమమైన కంఠాభరణము, అన్నివ్రేళ్ళకు మంచి శ్రేష్ఠమైన ఉంగరాలు ఇచ్చాడు. విశ్వకర్మ మంచిగండ్రగొడ్డలి, అస్త్రములు, అభేద్యమైన కవచము ఇచ్చాడు. సముద్రుడు ఎప్పటికీ వాడిపోని రెండు తామరపూలమాలలు ఒకటి మెడను ధరించటానికి, రెండవది తలను ధరించటానికి, చేతులతో పట్టుకోటానికి ప్రశస్తమైన పద్మము ఇచ్చాడు. హిమవంతుడు సింహవాహనము అనేక రత్నాలు ఇచ్చాడు. కుబేరుడు పానపాత్రను, ఆదిశేషుడు రత్నాలంకృతమైన నాగహారము ఇచ్చాడు. ఈ రకంగా దేవతలంతా ఆమెకు సమస్త ఆభరణాలు సమర్పించారు.

ఈ రకంగా దేవి సమస్త ఆభరణాలను ధరించి ఉంటుంది. కాబట్టే ఆమె సర్వాభరణ భూషితా అనబడుతోంది.

## 52. శివకామేశ్వరాంకస్థా

దేవి కామేశ్వరుని వామాంకమున ఆసీనురాలయి ఉంటుంది. కామము అంటే కోరిక. కాముడు కోరికగలవాడు. లేక కామ్యరూపుడు కాముడు. అందుచేతనే మన్మథుడికి కాముడు అని పేరు.

**కమనీయత్వాత్కామః** మనోహరరూపము కలవాడు కాముడు. ప్రపంచావిర్భావము కలిగిన వాడు కాబట్టి ఈశ్వరుడు. **ప్రజ్ఞానమేవవాకామః** కామము అంటే ప్రజ్ఞానము తెలివి.

**యదే తత్ హృదయం మన శ్చైతత్ సంజ్ఞాన మజ్ఞానం**
**విజ్ఞానం ప్రజ్ఞానం మేధా దృష్టిః ధృతిః మతిః మనీషా**
**జాతిః స్మృతి సంకల్పః క్రతురసు**
**కామోవశ ఇతి సర్వా ణ్యే వైతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవన్తి**

ఏది హృదయమో, ఏది మనస్సో అది

1. సంజ్ఞానము
2. ఆజ్ఞానము
3. విజ్ఞానము
4. ప్రజ్ఞానము
5. మేధ
6. దృష్టి
7. మతి
8. బుద్ధి
9. స్మృతి
10. సంకల్పము
11. క్రతువు
12. ప్రాణము
13. కామము
14. వశము

అని చెప్పబడింది. ఇవన్నీ ప్రజ్ఞానానికి పేర్లు. ఇక్కడ ప్రజ్ఞానము అంటే శివుడు. స్కాందపురాణంలోని బ్రహ్మగీతలో "పండితులచే అనేకవిధముల కీర్తించబడు ప్రజ్ఞానమే శంకరుడు" అని చెప్పబడింది.

దీన్నే కొందరు హృదయము, వశము (స్వాధీనము) అంటారు. ఇవన్నీ శివుడి పేర్లే.

లోకాలను సృష్టించాలనే కోరిక గల ఆదిదేవుడే శివుడు. అతడు కామశబ్దంతో చెప్పబడుతున్నాడు.

అటువంటి శివకాముడైన ఈశ్వరుని వామాంకమున ఉన్నది ఆ పరమేశ్వరి. ఆమె జ్ఞాని. జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము మూడు ఆమెయే.

కామ అనే పదం మంత్రశాస్త్రానికి సంబంధించినది. బాలామంత్రం వాగ్భవ, కామరాజ, శక్తిబీజాల సమ్మేళనం. అలాగే పంచదశీమహామంత్రం మూడుకూటాలుగా ఉన్నది. అవి వాగ్భవ, కామరాజ, శక్తికూటములు. ఈ బీజాక్షరసంకేతాలను సౌందర్య లహరిలోని 32వ శ్లోకంలో శంకరభగవత్పాదులవారు వివరించారు.

**శివ శ్శక్తిః కామః క్షితిః అథ రవి శ్శీతకిరణః**
**స్మరో హంస శ్శక్ర స్తదను చ పరా మారహరయః ।**
**అమీ హృల్లేఖాభి స్తిసృభి రవసానేష ఘటితాః**
**భజన్తే వర్ణా స్తే తవ జనని! నామావయనతాన్ ॥**

ఇప్పుడు పరమేశ్వరి జగత్తును సృష్టించాలనే కోరిక గల పరమశివుని అంకభాగాన ఆశీనురాలయింది.

దేవీభాగవతంలో ఈ విషయాన్ని ప్రసావిస్తూ

**తస్యోపరి మహాదేవో భువనేశో విరాజితే ।**

అక్కడ ఆసనం మీద భువనేశ్వరుడు ఉన్నాడు.

**వామాంకే సన్నిషణ్ణా స్వదేవీ శ్రీభువనేశ్వరీ ॥**

అతని యొక్క వామాంకమున పరమేశ్వరి ఆసీనురాలయింది. ఆ దేవి యొక్క కనుసైగతో, కాలి కదలికతో చరాచరజగత్తంతా సృష్టించబడుతోంది. **శివాకారేమంచే పరమశివపర్యంకనిలయాం** అన్నారు శంకరులు తమ సౌందర్య లహరిలో.

## 53. శివా

**వశ కాన్తౌ శివః స్మృతః** శివుడు అంటే కాంతి, వశము అని అర్థము. కాంతి అంటే ఇచ్ఛ, కోరిక. పరమేశ్వరుని ఇచ్ఛారూపమే పరమేశ్వరి. ఆ రకంగా ఇచ్ఛారూపమైన శక్తికి ఆధారము శివుడు. కాబట్టి శివశక్తులకు భేదం లేదు. శైవాగమాలప్రకారము

1. మనః ప్రవృత్తులకు సాక్షీభూతుడు
2. ఆ ప్రవృత్తుల ఆవిర్భావానికి ముందున్నవాడు.
3. ప్రవృత్తులలో ఉన్నవాడు.
4. చిత్తవృత్తులకు కారకుడు
5. సత్యము, నిత్యము, చిద్రూపి అయినవాడు
6. అన్నింటికీ కారణము ఎవరో అతడే శివుడు.

జీవ ఈశత్వాదులు లేనివాడు. లోకాలకు మేలు కలిగించేవాడు శివుడు. అతడే పరమేశ్వరుడు. ఆ లక్షణాలన్నీ దేవి యందున్నాయి కాబట్టి ఆమె శివా అని పిలువబడు తున్నది. మంగళకరమైన గుణాలన్నీ ఆమెలో ఉన్నాయి. అందుకే ఆమె శివా అనబడింది.

అన్నిటికీ మూలమైనవాడు శివుడు. విశ్వమంతా అతనిలో లీనమైఉన్నది. అతడు పరిశుద్ధుడు. నిర్మల గుణసంపన్నుడు. కైవల్యోపనిషత్తులో త్రిలోచనుడు, నీలకంఠుడు, ప్రశాంతుడు శివుడని చెప్పబడింది. లోకాలకు ఆధారభూతుడు, భక్తులకు అమృతత్త్వాన్ని పంచిపెట్టేవాడు శివుడు. శివాశివులకు భేదంలేదు. లింగపురాణంలో

**యథా శివ స్తథా దేవీ యథాదేవీ తథాశివః**

అని చెప్పబడింది. శివుడు ఎలా ఉంటే దేవి కూడా అలానే ఉంటుంది. దేవి ఎలా ఉంటే శివుడు అలానే ఉంటాడు. ఆ ఇద్దరికీ భేదంలేదు.

**ఉమాశంకరయో ర్భేదో నాస్త్యేవ పరమార్థతః**
**ద్విధాసౌ రూప మాస్థాయ స్థిత ఏకో న సంశయః**

ఉమాశంకరులకు భేదం లేదు. రూపాలు వేరుగా కనిపించినా అది ఒకటే. మానసోల్లాసము అనే గ్రంథంలో చెప్పినట్లుగా

**యేఽ పి బ్రహ్మాదయో దేవా భవన్తి వరదాయినః**
**త్వద్రూపం శక్తి మాసాద్య తే భవన్తి వరప్రదః ।**
**తస్మాత్ త్వ మేవ సర్వత్ర కర్మణాం ఫలదాయినీ ॥**

శక్తి లేకుండా శివుడు ఉండడు. కాబట్టి శక్తికీ శక్తిమంతుడైన శివునకూ భేదం లేదు.

**పరమాత్మా శివః ప్రోక్తః శివా సైవ ప్రకీర్తితా**

పరమాత్మే శివుడు. అతడే శివా అని పిలువబడుతున్నాడు. పరిమళ అనే గ్రంథంలో చెప్పినట్లుగా

**అలేఖ్య విశేష ఇవ గజవృషభయోర్ద్వయోః ప్రతిభాసమ్**
**ఏకస్మిన్నే వార్థే శివశక్తి విభాగకల్పకాం కుర్మః ॥**

ఒకే బొమ్మను చూసి కొందరు ఏనుగు అని, మరికొందరు ఎద్దు అని భావించినట్లే, ఒకే బ్రహ్మను కొందరు శివుడని, కొందరు శక్తి అని భావిస్తున్నారు. దేవీపురాణంలో

**శివాముక్తి స్సమాఖ్యాతా యోగినాం మోక్షదాయినీ**
**శివాయ జయతే దేవీ తతోలోకే శివాస్మృతా ॥**

శివా అను ఆమె ముక్తినిస్తుంది. యోగులకు మోక్షాన్నిస్తుంది. లోకాలకు మేలు కలుగచేస్తుంది. ఆగమాలలో చెప్పినట్లు అగ్నికి వేడిలాగా, సూర్యునికి కాంతిలాగా, పరమేశ్వరునికి దేవి సహజమైనది.

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మలోకాలను సృష్టించాలనే ఉద్దేశ్యంతో తనలో నుంచి కొంతశక్తిని బయటకు పంపాడు. అతడు ప్రకాశాంశ కాగా బయటకు వచ్చిన శక్తి విమర్శాంశ. వారే శివశక్తులు. వారిద్దరూ ఒకటే. వేరుకాదు. శ్రీచక్రంలోని త్రికోణము శక్తిస్వరూపము బిందువు శివస్వరూపము.

**త్రికోణరూపిణీశక్తిః బిందురూప పరశ్శివః**

శివశక్తులు ఎప్పుడూ విడివిడిగా ఉండవు. ఆ రెండూ కలిసే ఉంటాయి. అందుకే శ్రీచక్రంలో

**త్రికోణే బైందవమ్శ్లిష్టమ్.**

త్రికోణంలో బిందువుంటుంది అని చెప్పబడింది.

శివుడు, శక్తి కలిసే శివా అనబడుతోంది. ప్రకాశ విమర్శాత్మకము, జ్ఞానాత్మకము, మాయాతీతమైన చిద్రూపము శివాస్వరూపమనబడుతుంది.

## 54. స్వాధీనవల్లభా

ఇందాక చెప్పిననామంలో శివుని ఇచ్ఛాశక్తియే దేవి అని చెప్పటం జరిగింది. కాని ఈ నామంలో తనకు అధీనుడైన కామేశ్వరుణ్ణి భర్తగా పొందినది దేవి అని చెప్పబడుతోంది. శివుని ఆత్మ శక్తికి అధీనము. కాలికాపురాణంలో

**నిత్యం వసతి తత్రాపి పార్వత్యా సహధర్మకృత్**
**మధ్యే దేవీ గృహం తత్ర తదధీనస్తు శంకరః**

శివుడు పార్వతితో ఆటలాడుతూ ఉంటాడు. దేవీగృహం మధ్యలో ఉంది. శివుడు ఆమెకు అధీనుడు. ఆగమశాస్త్రాలలో కూడా ఈ విషయం చెప్పబడింది. "లోకంలోని అజ్ఞానులకు భుక్తి ముక్తి కలిగించటానికి చిద్రూపిణి, ఆదిశక్తి అయిన దేవితో శివుడు కలసి ఉన్నాడు" స్కాందపురాణంలో

**జగత్కారణమాపన్నః శివో యో మునిసత్తమః**
**తస్యాపి సా భవేచ్ఛక్తిః తయాహీనో నిరర్థకః**

ఓ మునివర్యులరా ! చరాచర జగత్తుకు కారణభూతుడు శివుడు. అతడికి దేవి శక్తి నిస్తుంది. కాబట్టి దేవిలేకపోతే శివుడులేడు.

ఈ విషయాన్ని శంకర భగవత్పాదులు తమ సౌందర్యలహరిలోని మొదటి శ్లోకంలో వివరిస్తూ

**శివ శ్శక్త్యాయుక్తోయది భవతి శక్తః ప్రభవితుం**
**న చే దేవం దేవో నఖలు కుశలః స్పందితు మపి**
**అతస్త్వా మారాధ్యాం హరిహర విరించాదిభిరపి**
**ప్రణన్తుం స్తోతుం వా కథ మకృత పుణ్య ప్రభవతి ॥**

ఓ భగవతీ ! సర్వమంగళసహితుడైన శివుడు కూడా జగత్తును నిర్మించటానికి శక్తివైన నీతో కలిస్తేనే సమర్థుడవుతాడు. అలాకాకపోతే అనర్హుడవుతాడు. అతడికి కదలటానికి కూడా నేర్పుండదు.

శక్తి లేకపోతే శివుడు ఏమీ చెయ్యలేడు. కాబట్టి శివుడు కూడా శక్తికి అధీనుడే.

పర్వతరాజు కుమార్తెగా పుట్టిన పార్వతి తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమై **తవాస్మి దాసః** నేను నీ దాసుణ్ణి అన్నాడు. అందుచేతనే దేవి స్వాధీనవల్లభ అయింది.

ఈ రకంగా ఆరవనామం నుంచి 54వ నామం వరకు పరమేశ్వరి యొక్క స్థూలరూపాన్ని వర్ణించటం జరిగింది.



# 7. దేవీనివాస స్థానము

ఇప్పటివరకు పరమేశ్వరి స్థూలరూపాన్ని వర్ణించి ఇప్పుడు 55 దగ్గర నుంచి 63వ నామంవరకు ఆమె ఎక్కడ ఉంటుందో వివరిస్తున్నారు. అంటే ఆమె నివాసస్థానాన్ని చెబుతున్నారు. పరమేశ్వరి ఎక్కడ ఉంటుంది అనే విషయాన్ని శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 8వ శ్లోకంలో వివరిస్తూ

**సుధాసింధో ర్మధ్యే సురవిటపివాటీపరివృతే**
**మణిద్వీపే నీపోపవనవతి చింతామణి గృహే ।**
**శివాకారే మంచే పరమశివ పర్యంక నిలయాం**
**భజన్తి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీమ్ ॥**

సుధాసింధువు అంటే పాలసముద్రం. అదే అమృతపు సముద్రం. అమృతము అంటే మృతములేనిది. మరణము లేకుండా చేసేది. పాలు మానవుడి పౌష్టికాహారం. కాబట్టి పాలుగనక పుష్కలంగా లభిస్తే మానవుడు ఆరోగ్యంగా ఉంటాడు. పుష్టిగా ఉంటాడు. అటువంటి పాలసముద్రంలో సుర విటపి వాటీ కల్పవృక్షముల సముదాయము. కల్పవృక్షము కోరిన కోరికలు తీర్చేది. మానవుల యొక్క కోర్కెలు తీర్చటం కోసం కల్పవృక్షము, కామధేనువు. ఈ రెండూ క్షీరసాగరమధన సమయంలో పుట్టినాయి. జగత్తులోని ప్రాణికోటి కోర్కెలు తీర్చగల శక్తి వీటిలో ఏ ఒక్కదానికయినా ఉన్నది. ఒక్క కల్పవృక్షమే అందరి కోరికలు తీర్చగలుగుతుంది. అలాంటప్పుడు కల్పవృక్షాలు ఒక వనంగా, ఒక సమూహంగా ఉన్నాయట. మరి అక్కడ సాధకుడి కోరికతీరకపోవటం అనేది ఎలా జరుగుతుంది ? అటువంటి కల్పవృక్షాలవనంలో, మణిద్వీపే–మణి. చాలా విలువైన రాయి. ఈ మణి ఒక్కటి ఉంటే చాలు కొన్నితరాల తరబడి కూర్చుని తినవచ్చు. అటువంటి వెలలేని మణులు కోకొల్లలుగా ఉన్నాయట. అటువంటి మణిద్వీపంలో, చింతామణి గృహే–చింతామణి అనేది ఒక మణి. రోజుకు కొన్ని బారువుల బంగారం పెడుతుంది శమంతకమణిలాగా కాబట్టి దీన్ని పొందినవాడు లోకంలో అత్యంత ధనికుడవుతాడు. చింతామణి అనేది ఒక మంత్రం. ఈ మంత్రాన్ని గనక జపించినట్లైతే చాలా త్వరగా సిద్ధిస్తుంది. ఈ మంత్రాన్ని దక్షిణాచారంలోను, వామాచారంలోను కూడా చెయ్యవచ్చును. వామాచారంలో దీన్ని శవచింతామణి అంటారు. మృతదేహంమీద కూర్చుని, రాత్రిపూట గనక మంత్రజపం చేస్తే, తెల్లవారే సరికి మంత్రసిద్ధి జరుగుతుంది.

విద్వదౌషధంగా పిలువబడే నైషధాన్ని వ్రాసిన శ్రీహర్షుడు ఈమంత్రోపాసన చేశాడని ప్రతీతి. ఈ మంత్రాన్ని ఉపాసన చేసినవారికి కోరుకున్నది అతిశీఘ్రంగా లభిస్తుంది. అటువంటి చింతామణులతో చేసిన గృహంలో త్రికోణాకారమైన ఆసనము మీద, పరమశివుని పర్యంకమున ఆ పరమేశ్వరి ఉన్నది. అటువంటి దేవిని గనక ధ్యానిస్తే సమస్త వాంఛలు ఈడేరతాయి.

## 55. సుమేరుమధ్యశృంగస్థా

దేవి మేరుపర్వతం మీద ఉన్నది. ఇది బంగారుపర్వతము అని ప్రసిద్ధి. ఈ పర్వతం మీద త్రికోణాకారంలో మూడు శిఖరాలున్నాయి. వాటి మధ్యన ఇంకొక శిఖరమున్నది. 'లలితాస్తవరత్నము'లో దుర్వాసుడు "మేరుపర్వతము లోకాలన్నింటిలోకీ గొప్పదై ప్రకాశిస్తున్నది. ఈ పర్వతము మీద మూడు శిఖరాలున్నాయి. ఆ శిఖరాలు మూడూ త్రిమూర్తులకు నిలయమై ఉన్నాయి. వాటి మధ్యన నాల్గవశిఖరమున్నది. అదే దేవి నివాసస్థానము. ఆ శిఖరము 400 యోజనముల ఎత్తున్నది." అని చెప్పాడు.

లలితాఅష్టోత్తరశతానామావళిలో ఆ దేవిని **రజతాచలశృంగమధ్యస్తామైనమో నమః** అని చెప్పటం జరిగింది. రజతాచలము అంటే వెండికొండ. అదే వెండిలాగా తళతళామెరిసే హిమాలయము దీనిమీదనే ఉన్న కైలాసగిరిశిఖరం మీద శివాశివులుంటారు అని చెప్పబడుతోంది.

ఈ శిఖరము దేవతలచే పూజించబడుతున్నది. అందుచేతనే సామాన్యమానవులకు కనిపించదు. మానవశరీరంలో చెప్పబడే సహస్రదళపద్మమే మేరుపర్వతము. యోగి ఆజ్ఞాచక్రం దాటిన తరువాత మహానాదాన్ని దర్శిస్తాడు. అతడికి వాక్సిద్ధి కలుగుతుంది. మహానాదము నాగలిరూపంలో ఉంటుంది. అది శాంతమైనది. వరప్రదాయని ప్రకాశ మైనది. శూన్యమందు, విసర్గకు క్రిందగా సహస్రదళపద్మమున్నది. అది పూర్ణచంద్రునిలా ప్రకాశిస్తుంటుంది. అధోముఖంగా ఉంటుంది. దాని కిరణాలు సూర్యకిరణాలకన్న ఎక్కువగా ప్రకాశిస్తుంటాయి. ఇది కేవలము ఆనందరూపమైనది.

సహస్రదళపద్మంలో కళంకరహితుడైన చంద్రుడున్నాడు. ఆ చంద్రమండలము మధ్యన త్రికోణమున్నది. దానియందు మహాశూన్యమున్నది. దానిని దేవతలు రహస్యంగా సేవిస్తూ ఉంటారు. ఆ శూన్యప్రదేశము చాలా రహస్యమైనది. అతిప్రయత్నముమీదగాని దాన్ని పొందలేరు. అది అపరిమితమైన సంతానరాశి. పరమశివుడు ఇక్కడే ఉంటాడు.

ఆయన సర్వాంతర్యామి. అజ్ఞానాన్ని మోహాన్ని పోగొడతాడు. అని రాజయోగంలో చెప్పబడింది. దీనినిబట్టి పరమేశ్వరి నివసించే మేరుశృంగయే సహస్రదళపద్మము.

శ్రీచక్రంలోని ఎనిమిదవ ఆవరణ సర్వసిద్ధిప్రదచక్రము త్రికోణము. దీనిలో మూడువైపులా మూడుపీఠాలున్నాయి. అవి వరుసగా

1. కామగిరిపీఠము
2. పూర్ణగిరిపీఠము
3. జాలంధరపీఠము

కాగా త్రికోణం మధ్యన జాలందర పీఠమున్నది.

**జాలంధరపీఠము -** త్రికోణానికి ఉత్తరంవైపున ఉంటుంది. దీని అధిపతులు శక్తిబీజాధిపతులైన ఉమామహేశ్వరులుంటారు.

**పూర్ణగిరిపీఠము -** త్రికోణానికి దక్షిణంవైపున ఈ పీఠముంటుంది. దీని అధిపతులు కామరాజబీజాధిపతులైన లక్ష్మీనారాయణులు.

**కామగిరిపీఠము -** త్రికోణంలోని అగ్రభాగంతో కామగిరి పీఠమున్నది. దీని అధిపతులు వాగ్భవబీజాధిపతులయిన వాణీ హిరణ్యగర్భులు. ఈ మూడు పీఠాలమధ్యనా ఓ డ్యాణ పీఠమున్నది. అదే బిందువు. అక్కడ శివశక్తులుంటారు.

ఇక్కడ మూడువైపులా ఉన్న పీఠాలే ముడుశిఖరాలు. మధ్యన ఉన్నది పరమేశ్వరి

## 56. శ్రీమన్నగరనాయికా

శ్రీ అంటే లక్ష్మి. శ్రీ అంటే సంపద. శ్రీనగరము లక్ష్మీనగరము. సంపదలకు నిలయమైన నగరము. సంపద్యుక్తమైన నగరానికి నాయిక లేదా ప్రభ్వి ఆ దేవి. రుద్రయామళంలో

**అనేక కోటి బ్రహ్మాండ కోటీనాం బహి రూర్ధ్వతః**
**సహస్రకోటి విస్తీర్ణే సుధాసింధో స్తు మధ్యమే**
**రత్నద్వీపే జగద్వీపే శతకోటిప్రవిస్తరే**
**పంచవింశతితత్త్వాత్మ పంచవింశతివప్రకైః**
**త్రిలక్షయోజనోత్తుంగైః శ్రీవిద్యాయాః పురమ్ పరమ్ ॥**

అనేకకోట్ల బ్రహ్మాండాలకు పైన వేయికోట్ల విస్తీర్ణముగలిగి, ఇరవైఐదుతత్త్వాల స్వరూపమై మూడులక్షల ఆమడల ఎత్తు గలిగి 25 ప్రాకారములుగల శ్రీ విద్యాపురము సుధాసముద్రము మధ్యలో రత్న ద్వీపమునందున్నది.

ఈ శ్రీనగరము రెండువిధాలుగా ఉన్నది.

1. మేరుపర్వతము మధ్యన ఉన్నది.

2. సకలబ్రహ్మాండాలకు బయట, క్షీరసాగరంలో రత్నద్వీపము మధ్యన ఉన్నది. లలితాస్తవరత్నములో శ్రీనగరాన్ని గురించి చెబుతూ

**తత్ర చతుశ్శతయోజన పరిణామం దేవశిల్పినా రచితం**
**నానాసాలమనోజ్ఞం నమా మ్యహం నగర మాదివిద్యయాః**

అక్కడ 400 ఆమడల పరిమాణము గలిగి, దేవశిల్పిచే కట్టబడినది, అనేక ప్రాకారములచే మనోజ్ఞమైన ఆదివిద్యానగరానికి నమస్కరింతును.

భువనేశ్వరీదేవి నివసించు ప్రదేశమే మణిద్వీపము. అదే శ్రీనగరము అనబడుతోంది. సుబాలోపనిషత్తులో బ్రహ్మలోకముపైన సర్వలోకమున్నది. అందులో ఈ మణిద్వీపమున్నది. అని చెప్పబడింది. అన్ని లోకాలకు పైభాగాన ఉండటంచేతనే దీనికి సర్వలోకమని పేరు వచ్చింది. పరమేశ్వరి సంకల్పంచేతనే ఇది ఏర్పడింది.

శివరహస్యపురాణంలో శివుడే ఈ లోకాన్ని నిర్మించినట్లున్నది. "ఓ పరమేశ్వరా ! అన్నిటికన్న సుందరము, ఆనందామృతసాగరము, అక్కడ ఉండే వారికి ఆకలి దప్పికలు లేనటువంటిది, కైలాసముకన్న సుందరమైనది అయిన లోకము నాకోసం నిర్మించి ఇవ్వవలసినది" అని దేవి అడుగగా పరమేశ్వరుడే ఈ లోకాన్ని నిర్మించాడు.

బ్రహ్మాండపురాణంలోని లలితోపాఖ్యానంలో దేవి యొక్క అనుజ్ఞతో విశ్వకర్మ ఈ నగరాన్ని నిర్మించాడు అని చెప్పబడింది.

**తత్రశ్రీభువనేశానీ పరాశక్తి ర్విరాజితే**
**బ్రహ్మలోకాధికాలోకః సర్వలోకాదిభిః పరః**

బ్రహ్మలోకం కన్న అధికమైనది, సర్వలోకం కన్న గొప్పదైనది అయిన మణిద్వీప మందు భువనేశ్వరి నివసిస్తున్నది.

దేవీభాగవతంలోని 12వ స్కంధములోని 10వ అధ్యాయంలో మణిద్వీపాన్ని వర్ణించటం జరిగింది.

**బ్రహ్మలోకాదూర్ధ్వభాగే సర్వలోకోఽస్తి యఃశ్రుతిః ।**
**మణిద్వీపఃసఏవాస్తి యత్రదేవీ విరాజతే ॥**

బ్రహ్మలోకానికి పైభాగాన సర్వలోకమున్నది. దానినే మణిద్వీపము అంటారు. అన్ని లోకాలకన్న ఇది గొప్పది. కాబట్టి దీన్ని సర్వలోకము అంటారు.

**కైలాసా దధికో లోకో వైకుంఠాదపి చోత్తమః**
**గోలోకా దపి సర్వస్మాత్సర్వలోకోఽధికః స్మృతః ।**
**నతత్సమం త్రిలోక్యాంతు సుందరం విద్యతే క్వచిత్ ॥**
**ఛత్రీభూతం త్రిజగతో భవసం తాపనాశకమ్ ।**
**ఛాయాభూతం త దేవాస్తి బ్రహ్మాండానాం తు సత్తమ ॥**

అది కైలాసము కన్న మిన్న. వైకుంఠముకన్న ఉత్తమము. గోలోకముకన్న శ్రేష్టము. అందుకే దాన్ని సర్వలోకము అంటారు. ముల్లోకాలలోను దానిని మించిన సుందరమైన నగరము ఇంకొకటి లేదు. అది ముల్లోకాలకు గొడుగు వంటిది. సంసారతాపాన్ని నశింపచేస్తుంది. బ్రహ్మాండాలన్నింటికీ చల్లని నీడనిస్తుంది.

మణిద్వీపానికి నాలుగువైపులా క్షీరసాగరమున్నది. ఆ సాగరంలో గాలికి ఉవ్వెత్తున లేచిన కెరటాలు, రతనాల ఇసుకప్రదేశాలు దక్షిణావృతశంఖాలు, రంగురంగులచేపలు ఉన్నాయి.

లలితాస్తవరత్నము, రుద్రయామళము, శ్రీవిద్యారత్నభాష్యములలో చెప్పినట్లుగా మణిద్వీపానికి 25 ప్రాకారాలున్నాయి. రెండు ప్రాకారాలు మధ్యన ఉన్న ప్రదేశాన్ని ఆవరణ అంటారు. అవి.

1. ఇనుపప్రాకారము
2. కంచుప్రాకారము
3. రాగిప్రాకారము
4. సీసప్రాకారము
5. ఇత్తడిప్రాకారము
6. పంచలోహప్రాకారము
7. వెండిప్రాకారము
8. బంగారుప్రాకారము
9. పుష్యరాగప్రాకారము
10. పద్మరాగప్రాకారము
11. గోమేదికప్రాకారము
12. వజ్రప్రాకారము

13. వైడూర్యప్రాకారము
14. ఇంద్రనీలప్రాకారము
15. ముత్యాలప్రాకారము
16. మరకతప్రాకారము
17. పగడప్రాకారము
18. మాణిక్యరత్నప్రాకారము
19. సహస్రస్తంభమంటపము
20. మనస్సాలము
21. బుద్ధిసాలము
22. అహంకారసాలము
23. సూర్యబింబసాలము
24. చంద్రబింబసాలము
25. శృంగారసాలము

రెండు ప్రాకార మధ్యభాగాన్ని ఆవరణ అంటారు. అటువంటివి 24 ఆవరణలుంటాయి.

1. మొదటి ఆవరణలో పూలు కాయలతో ఉన్న చెట్లు మంచి నీటిదొరువులు ఉంటాయి. ఈ ప్రాకారానికి 4 ద్వారాలుంటాయి. దేవి దర్శనం కోసం వచ్చిన దేవతల గంధర్వులవాహనాలు అక్కడ బారులుతీరి ఉంటాయి.

2. ఈ ఆవరణలో పండ్లతోటలు, పూలతోటలు ఉంటాయి. కోకిలారావములతోను, భ్రమరముల ఝుంకారములతోను ఈ ఆవరణ ప్రతిధ్వనిస్తుంటుంది.

3. ఆవరణలో సుగంధద్రవ్యాలు వెదజల్లే చెట్లుంటాయి. ఇక్కడి వృక్షాలు బంగారు రంగుపూలతో, చిగురాకులతో, రతనాల బీజాలు గల ఫలాలతో ఉంటాయి. ఇక్కడ వసంతుడు పుష్పాసనం మీద కూర్చుని ఉంటాడు. అతనికి మధుశ్రీ, మాధవశ్రీ అని ఇద్దరు భార్యలుంటారు.

4. ఈ ప్రాకారంలో సంతానవృక్షవాటిక ఉన్నది. ఈ ప్రాకారానికి అధిపతి గ్రీష్మరాజు. అతడికి శుకశ్రీ, శుచిశ్రీ అని ఇద్దరు భార్యలు.

5. ఈ ప్రాకారంలో హరిచందన వనం ఉంటుంది. ఈ ప్రాకారానికి అధిపతి వర్షఋతువు. అతడికి 12మంది భార్యలుంటారు.

6. ఈ ప్రాకారంలో మందారవృక్షాలవనం ఉంటుంది. దీనికి ప్రభువు శరదృతువు. ఇతనికి ఇష్టలక్ష్మి, ఊర్జలక్ష్మి అని ఇద్దరు భార్యలు.

7. ఈ ప్రాకారంలో పారిజాతవనమున్నది. ఈ ప్రాకారానికి రాజు హేమంతుడు. అతనికి సహశ్రీ, సహ్యశ్రీ అని ఇద్దరు భార్యలు. దేవీవ్రతము ఆచరించే సిద్ధులు ఇక్కడ ఉంటారు.

8. ఈ ప్రాకారంలో కదంబవృక్షాలుంటాయి. దీని ఏలికశిశిరఋతువు, తపశ్రీ, తపస్యశ్రీ అని ఇద్దరు అతని భార్యలు. ఇక్కడ సిద్ధులు నివసిస్తారు.

9. ఈ ప్రాకారం ఎర్రని పుష్యరాగాలకాంతులతో ప్రకాశిస్తుంటుంది. ఇక్కడ నేల, వనాలు అన్నీ ఎరుపురంగులోనే ఉంటాయి. ఇక్కడ ఎనిమిది దిక్కులయందు ఇంద్రాది దేవతలుంటారు.

10. ఇది పద్మరాగాల ప్రాకారము. ఇక్కడి నేల నింగి అంతా ఎర్రగానే ఉంటుంది. ఈ ప్రాకారంలో చతుష్షష్టికళలూ శక్తిస్వరూపాలై ఉంటాయి.

11. ఇది గోమేదిక ప్రాకారము. ఇక్కడి భూమి, వస్తువులు గోమేదికాలలాగా మెరుస్తూ ఉంటాయి. ఇక్కడ విద్య మొదలైన 32 శక్తులు పిశాచముఖాలు కలిగి సర్వదా యుద్ధానికి సిద్ధమై ఉంటాయి.

12. ఇది వజ్రాల ప్రాకారము. ఇక్కడి నేల, వీధులు, సందులు, గొందులు అన్నీ వజ్రాలమయమే. ఇక్కడ పరమేశ్వరి దాసదాసీజనముంటారు.

13. ఇది వైడూర్యప్రాకారము. ఈ ప్రాంతమంతా వైడూర్యమయం. ఇక్కడ బ్రాహ్మీ మొదలైన అష్టమాతృకలుంటారు. ఇక్కడ దేవివాహనాలు నిత్యమూ అలంకరించబడి సిద్ధంగా ఉంటాయి.

14. ఇది ఇంద్రనీలమణి ప్రాకారము. ఈ ప్రాంతమంతా ఇంద్రనీలకాంతులతో ప్రకాశిస్తుంటుంది. ఇక్కడ 16దళాలు గల మహాపద్మము ఒకటి ఉన్నది. దాని దళాలయందు నల్లనిరంగుతో ఆయుధాలు ధరించిన శక్తులు ఉంటాయి.

15. ఇది ముత్యాలప్రాకారము. ఈ ప్రాంతమంతా ముత్యాలవలె కళకళలాడుతుంటుంది. ఇక్కడ 8 దళాలు గల పద్మమున్నది. ఆ దళాలలో పరమేశ్వరితో సమానమైన పరాక్రమము, సౌందర్యము, పాండిత్యము గల మంత్రిణిలుంటారు.

16. ఇది మరకత ప్రాకారము. ఇది భోగభాగ్యాలకు ఉనికిపట్టు. ఇక్కడ ఆరుకోణాలు గల పద్మమున్నది. ఆ కోణాలలో

1. తూర్పుకోణంలో – గాయత్రితో కూడిన బ్రహ్మ ఉంటాడు. వీరు వేదములు, స్మృతి, పురాణాలరూపంలో ఉంటారు.

2. నైరుతికోణంలో – సావిత్రి, విష్ణువు, శంఖము, చక్రము, గద ధరించి ఉంటారు.

3. వాయుకోణంలో – పరశువు, అక్షమాల, అభయ వరదముద్రలు ధరించిన రుద్రుడు, సరస్వతి ఉంటారు.

4. ఆగ్నేయకోణంలో – రత్నకుంభము, మణికరండకము చేతులందు ధరించి లక్ష్మీసహితుడైన కుబేరుడుంటాడు.

5. వారుణకోణంలో – రతితోకూడిన మన్మథుడు ఉంటాడు.

6. ఆశానకోణంలో – పుష్టిసమన్వితుడైన వినాయకుడు పాశాంకుశాలు ధరించి ఉంటాడు.

17. ఇది పగడప్రాకారము. ఇక్కడి భవనాలన్నీ పగడాలలాగా మెరుస్తుంటాయి. ఈ ప్రాకారంలో పంచభూతాల మీద అధికారంగల శక్తులు ఐదుంటాయి.

18. ఇది రత్నప్రాకారము. ఇక్కడ ఆమ్నాయదేవతలు, దశమహావిద్యలు, సప్తకోటిమంత్రాలు ఉంటాయి.

19. ఇది సహస్రస్తంభమంటపాలుండే ప్రాకారము

20. ఇది మనస్సాలము. ఇక్కడ అమృతేశ్వరి ఉంటుంది.

21. ఈ ఆవరణలో కురుకుల్లాంబ ఉంటుంది.

22. ఇక్కడ చతుష్మతీ, ఛాయాదేవి సమేతుడై మార్తాండభైరవుడుంటాడు.

23. ఈ ఆవరణలో నక్షత్రాలతో కూడిన చంద్రుడుంటాడు.

24. ఈ ఆవరణలో శృంగారశక్తి సహితుడైన మన్మథుడుంటాడు. దీని మధ్యలోనే చింతామణిగృహం ఉంటుంది. దీనికి

ఆగ్నేయభాగంలో – దేవి ఆవిర్భవించిన చిదగ్నికుండము.

నైరుతిదిశలో – శ్రీచక్రరథము

వాయువ్యదిశలో – గేయచక్రరథము. అందులో మంత్రిణిశ్యామల

ఈశాన్యదిశలో – కిరి చక్రరథము. అందులో దండనాయికవారాహి ఉంటారు.

చింతామణి గృహానికి నాలుగుద్వారాలుంటాయి. ఆ ద్వారాలలో ఆమ్నాయదేవతలుంటారు. అందుకే పీఠపూజ చేసేటప్పుడు

**ప్రాగామ్నాయమయా ప్రాగ్ద్వారే ద్వారశ్రీయై నమః**

**దక్షిణామ్నాయమయా దక్షిణ ద్వారే ద్వారశ్రీయై నమః**

**పశ్చిమామ్నాయమయా పశ్చిమద్వారే ద్వారశ్రీయై నమః**

**ఉత్తరామ్నాయమయా ఉత్తరద్వారే ద్వారశ్రీయై నమః**

**తన్మధ్యే క్షీరసాగరాయ నమః**

**క్షీరసాగరమధ్యే రత్నద్వీపాయ నమః**

**తన్మధ్యే కల్పవృక్ష వాటికాయై నమః**

**తన్మధ్యే రత్న సింహాసనాయ నమః**

**రత్నసింహాసనోపరిస్థితాయైశ్రీ లలితాపరాభట్టారికాయై నమః**

**ఇతి యోని ముద్రాం ప్రణమేత్.**

ఆ నాలుగు ద్వారాల మధ్యనా త్రికోణాకారమంచము మీద భువనేశ్వరుని వామాంకం మీద దేవి ఉంటుంది. ఇదంతా శ్రీనగరము. ఈ నగరానికి ఆ పరమేశ్వరినాయిక. అందుకే ఆమె శ్రీమన్నగరనాయిక అయింది.

శ్రీనగరానికి 25 ప్రాకారాలున్నాయి. ఇవి తత్త్వాలు. జ్ఞానేంద్రియాలు 5, కర్మేంద్రియాలు 5, పంచభూతాలు 5, తన్మాత్రలు 5, మనస్సు 1, మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు. ఇక్కడ 26వ తత్త్వమే పరమేశ్వరి.

గౌడపాదులవారి వ్యాఖ్యలో శ్రీచక్రమే శ్రీనగరము అన్నారు. కాబట్టి శ్రీచక్రంలో ఉన్న 25 తత్త్వాలే శ్రీనగరంలోని ప్రాకారాలు.

## 57. చింతామణిగృహాంతస్థా

చింతామణి అనేది ఒక మణి. ఈ మణి దగ్గర ఉంటే చాలు కోరినకోరిక తీరిపోతుంది. ఒక మణి ఉంటేనే కోరినకోరిక తీరుతుంది. మరి అటువంటి మణులు అనేకం ఉన్నాయి. వాటితో నిర్మించబడిన గృహమది. అందులో పరమేశ్వరి ఉంటుంది. భక్తుడు ఆ దేవి సన్నిధికి వెళ్ళవలసిన అవసరం లేదు. ఆమె పేరు తలిస్తే చాలు కోరినకోరికలు తీరిపోతాయి. అంటే పరమేశ్వరి భక్తులకు సంకల్ప మాత్రంచేతనే కోరికలు ఈడేరతాయి.

చింతామణి అనేది ఒక మంత్రం. దాన్ని గతంలో వివరించటం జరిగింది. అటువంటి చింతామణుల గృహంలో ఉంటుంది దేవి. బ్రహ్మాండపురాణంలో **చింతామణి**

**గృహే సర్వం చింతామణిమయంస్మృతం.** అక్కడ ఒక్క గృహమేకాదు. సర్వమూ చింతామణిమయమే అని చెప్పబడింది. లలితాస్తవరత్నములో

**చింతామణి గణరచితం చింతాందూరీకరోతు మే సదనమ్ ॥**

చింతామణులతో నిర్మించిన గృహము నానాచింతలను దూరంచేస్తుందని చెప్పబడింది.

**సహస్రయోజనా యామే చింతామణి మయే గృహే**
**మేరౌ తు స్వల్పపరిమాణం శృంగారవర్ణ వర్యస్యో**
**త్తరతః సకలవిబుధసంసేవ్యం చింతామణి**
**గణరచితం చింతాం దూరీకరోతు మే సదనమ్ ॥**

వేయి యోజనాలు పరిమాణముగల చింతామణి గృహము. దీనిముందు మేరుపర్వతం కూడా చాలాచిన్నది. సకలదేవతలచే సేవించబడు చింతామణి గృహము నా చింతలను దూరముచేయుగాక.

ఇక్కడ రెండు పదాలున్నాయి. 1. చిత 2. చింత.

**చితాచింతాద్వయో ర్మధ్యే చింతానామ గరీయసీ ।**
**చితాదహతి నిర్జీవం చింతాదహతి జీవినమ్ ॥**

చిత ప్రాణం లేని దాన్ని దహిస్తుంది. చింత అనేది ప్రాణమున్న శరీరాన్ని దహిస్తుంది. అటువంటి చింతలను దూరంచేసే చింతామణి గృహంలో ఉంటుంది పరమేశ్వరి. దేవీభాగవతంలో చింతామణిగృహాన్ని వర్ణిస్తూ

**నవరత్నమయా దగ్రే చింతామణి గృహం మహత్ ।**
**తత్రత్యం వస్తుమాత్రం తు చింతామణి వినిర్మితం ॥**
**సూర్యోద్గారో ఫలై స్తద్వ చ్చంద్రోద్గారో ఫలై స్తథా ॥**
**విద్యుత్ ప్రభోపలైః స్తంభాః కల్పితా స్తు సహస్రశః ।**
**యోసాంప్రభాఃభిరంతస్థవస్తు కించి న్న దృశ్యతే ॥**

నవరత్న ప్రాకారానికి ముందు శ్రీకరమైన చింతామణి గృహము మహోజ్వలమైన కాంతులతో ప్రకాశిస్తుంటుంది. దానిలోని ప్రతి వస్తువూ చింతామణులచే నిర్మించబడినదే.

సూర్యకాంత, చంద్రకాంతశిలలతో, మెరుగుకాంతమణులతో నిర్మించబడిన స్తంభములు దీపపుస్తంభాలలాగా ప్రకాశిస్తాయి. ఆకాంతులలో ఏ వస్తువూ కనిపించదు.

**తదేవదేవీసదనం మధ్య భాగేవిరాజితే ।**
**సహస్రస్తంభసంయుక్తా శ్చత్వారస్తేషుమండపాః ॥**
**శృంగారమంటప శ్చైకో ముక్తిమంటప ఏవ చ ।**
**జ్ఞానమండపసంజ్ఞ స్తు తృతీయః పరికీర్తితః ॥**
**ఏకాంతమండప శ్చైవ చతుర్థః పరికీర్తితః ।**
**నానావితాన సంయుక్తా । నానాధూపై స్తు ధూపితా ॥**
**కోటిసూర్యసమా కాంత్యా । భ్రాజంతే మండపాఃశుభాః**

ఇటువంటి వేయిస్తంభాలు గల మండపాలు నాలుగున్నాయి. అవి.

1. శృంగారమండపము
2. ముక్తిమండపము
3. జ్ఞానమండపము
4. ఏకాంతమండపము

ఈ మండపాలన్నీ ధూపములతో సువాసనలను వెదజల్లుతుంటాయి. ప్రతి మండపము కూడా కోటిసూర్యకాంతులు వెదజల్లుతూ ఉంటుంది. వీటికి నాలుగువైపులా కాశ్మీరవనాలున్నాయి. అక్కడ మృగాలు, మహాపద్మాలు, తుమ్మెదలు, కారండవపక్షులు, హంసలు తిరుగాడుతుంటాయి.

**శృంగారమండపే దేవ్యో । గాయంతీ వివిధై స్స్వరైః ।**
**సభాసదో దేవవరా । మధ్యే శ్రీజగదంబికా ॥**

శృంగారమండపంలో దేవతలు మధురస్వరాలతో గానం చేస్తుంటారు. అక్కడ దేవతలంతా సభ తీర్చి ఉంటారు. వారి మధ్యభాగన సింహాసనం మీద జగదంబిక ఆసీనురాలయి ఉంటుంది.

**ముక్తిమండపమధ్యే తు । మోచయ త్యనిశం శివా ।**
**జ్ఞానోపదేశం కురుతే । తృతీయే నృపమండపే ॥**

ముక్తిమండపంలో నుండి దేవి జగత్తులోని భక్తులందరికీ ముక్తి ప్రసాదిస్తుంది. జ్ఞానమంటపంలో భక్తులకు జ్ఞానోపదేశం చేస్తుంది.

**చతుర్థే మండపే చైవ । జగద్రక్షా వివించనమ్**

**మంత్రిణీసహితా నిత్యం । కరోతి జగదంబికా ॥**

నాల్గవమండపంలో దేవి తన మంత్రిణులతో కొలువుండి లోకరక్షణ గూర్చి ఆలోచిస్తుంటుంది.

## 58. పంచబ్రహ్మాసనస్థితా

పంచబ్రహ్మలచేత చేయబడిన అసనముమీద కూర్చున్నది.

**పంచభిః బ్రహ్మభిః నిర్మితం ఆసనం మంచరూపకం తత్ర స్థితా**

పంచబ్రహ్మలనే కోళ్ళుగా ఉంచి తయారుచేసిన ఆసనము మీద కూర్చున్నటువంటిది. రుద్రయామళంలో

**బిందుస్థానం సుధాసింధుః పంచయోన్య స్సుర ద్రుమాః ।**
**తత్రైవ నీపశ్రేణీ చ తన్మధ్యే మణి మంటపం ॥**

**తత్ర చింతామణికృతం దేవ్యా మందిర ముత్తమం ।**
**శివాత్మకే మహామంచే మహేశానోపబర్హణే ॥**

**అతిరమ్యతరే తత్ర కశిపుశ్చ సదాశివః ।**
**భృతకా శ్చ చ్చతుష్పాదా మహేంద్ర శ్చవ తద్గహః ॥**
**తత్రాస్తే పరమేశానీ మహాత్రిపురసుందరీ ।**
**శివార్కమండలం భిత్వా ద్రావయం తీందుమండలమ్ ॥**

బిందుస్థానమే పాలసముద్రము. పంచయోనులే కల్పవృక్షాలు. అక్కడ కదంబవనం మధ్యలో మణిమండపం. ఆ మణులు చింతామణులు. శక్తిరూపమైన మంచెయందు పరమేశ్వరుడు తలగడ, బ్రహ్మాదులు సేవకులు. ఇంద్రుడు తమ్మిపడిగ, అట్టిసింహాసనం మీద దేవి ఆసీనయై ఉంటుంది.

ఐదుగురు బ్రహ్మలతో నిర్మించబడిన ఆసనాన్ని పంచబ్రహ్మాసనము అంటారు. దానిమీద పరమేశ్వరి కూర్చుని ఉంటుంది. అందుకే ఆమెను పంచబ్రహ్మాసనస్థితా అంటారు.

బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు, సదాశివుడు. వీరిని పంచబ్రహ్మలు అంటారు. సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములు వీరి మంత్రాలు. షట్చక్రాలలోను పరమేశ్వరిని అర్చించే వారికి వివిధ రకాలయిన ఫలితము ఉంటుంది.

అంటే వారందరికీ ముక్తి లభిస్తుంది. కాని అది జీవాత్మపరమాత్మల విలీనం కాదు. అయితే ఆధారస్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు. ఇక్కడ పరమేశ్వరిని అర్చించే వారికి మోక్షముండదు. ఇక

1. మణిపూరంలో దేవిని అర్చించేవారు దేవి దగ్గరగా ఇంకొక పురము నిర్మించుకుని ఉంటారు. దీన్ని సార్ష్టిరూపముక్తి అంటారు.

2. అనాహతంలో దేవిని అర్చించేవారు దేవిపట్టణంలోనే నివసించగలుగుతారు. దీన్ని సాలోక్యముక్తి అంటారు.

3. విశుద్ధిచక్రంలో దేవిని అర్చించేవారు దేవికి అతిదగ్గరగా సేవకులుగా ఉంటారు. ఇది సామీప్యముక్తి.

4. ఆజ్ఞాచక్రంలో దేవిని అర్చించేవారు వేరే దేహం ధరించి దేవితో సమానమైన రూపంలో ఉంటారు. ఇది సారూప్యముక్తి.

5. సహస్రారంలో దేవిని అర్చించేవారు జన్మరాహిత్యం పొందుతారు. వీరికి మరుజన్మ ఉండదు. ఇది శాశ్వతమైన ముక్తి. సాయుజ్యం.

ఈ విధంగా సాధకుడు చేసే అర్చనా విధానాన్ని బట్టి అతడికి ముక్తి లభిస్తుంది. పంచబ్రహ్మలు దేవికి అతి సమీపంలో ఉండి ఆమెను సేవించాలి అనుకున్నటువంటివారై, బాగా ఆలోచించి సామీప్యముక్తి పొందినట్లైతే దేవికి అతిసమీపంగా ఉండి ఆమెను సేవించవచ్చు అని తలపోసి, విశుద్ధిచక్రంలో ఆమెను ఉపాసించారు. అందువల్ల దేవికి సేవకులుగా, అత్యంతదగ్గరగా ఆమె యొక్క సింహాసనానికి కోళ్ళుగా ఉండగలిగారు. ఈ విషయాన్ని శంకరభగవత్పాదుల వారు తమ సౌందర్య లహరిలోని 92వ శ్లోకంలో వర్ణిస్తూ

**గతా స్తే మంచత్వం ద్రుహిణహరిరుద్రేశ్వరభృతః**
**శివస్స్వచ్ఛచ్ఛాయా కపట ఘటిత ప్రచ్ఛదపటః ।**
**త్వదీయానాం భాసాం ప్రతిఫలన రాగారుణతయా**
**శరీరీ శృంగారో రస ఇవ దృశాం దోగ్ధి కుతకమ్ ॥**

ఓ భగవతీ ! బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు అనే నలుగురు నీవు కూర్చునే సింహాసనానికి కోళ్ళుకాగా సదాశివుడు నువ్వు కప్పుకునే దుప్పటి అయినాడు.

శ్రీచక్రంలో 5శక్తిచక్రాలు, 4 శివచక్రాలు ఉన్నాయి. ఇందులోని శక్తిచక్రాలే పంచబ్రహ్మలు. ఈ శక్తిచక్రాలకు పైన దేవి ఉంటుంది. కాబట్టి ఆమె పంచబ్రహ్మాసనస్థితా అనబడుతోంది.

మానవశరీరంలో షట్చక్రాలున్నాయి. ఆ చక్రాలలో ప్రతిదానికీ అధిదేవతలున్నారు.

| | | |
|---|---|---|
| ఆధారచక్రానికి అధిదేవత | – | గణపతి |
| స్వాధిష్ఠానానికి అధిదేవత | – | బ్రహ్మ |
| మణిపూరానికి అధిదేవత | – | విష్ణువు |
| అనాహతానికి అధిదేవత | – | రుద్రుడు |
| విశుద్ధిచక్రానికి అధిదేవత | – | మహేశ్వరుడు |
| ఆజ్ఞాచక్రానికి అధిదేవత | – | సదాశివుడు |

వీటన్నింటికీపైన సహస్రారంలో ఆ పరమేశ్వరి ఉంటుంది. కాబట్టి ఆమె పంచబ్రహ్మాసనస్థితా అని చెప్పబడుతోంది.

పంచబ్రహ్మలు – పంచభూతాలు. ఈ పంచభూతాలమీద అధికారం కలిగినటువంటిది; వాటిని తన అధీనంలో ఉంచుకున్నటువంటిది పరమేశ్వరి. అందుచేతనే ఆమె పంచబ్రహ్మాసనస్థితా అనబడుతుంది.

దేవీభాగవతంలో ఈ విషయాన్ని వర్ణిస్తూ

**చింతామణిగృహే రాజన్ । శక్తితత్త్వాత్మకై పరైః ।**
**సోపానైః దశభిర్యుక్తో । మంచకోఽ ప్యధిరాజితే ॥**
**బ్రహ్మో విష్ణుశ్చ రుద్రశ్చ । ఈశ్వరశ్చ సదాశివః**
**ఏతే పంచ ఖురాః ప్రోక్తాః ఫలకస్తు సదాశివః ॥**

రాజా ! చింతామణి గృహంలో శక్తితత్త్వాత్మకమైన పదిమెట్ల వరుసతో దివ్య కాంతులతో ప్రకాశించే మంచమున్నది. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు దానికి నాలుగుపాదాలు కాగా సదాశివుడు దానిపై పలకగా ఉంటాడు.

**తస్యోపరి మహాదేవో భువనేశో విరాజితే**
**యాదేవీ నిజలీలార్థం ద్వధాభూతా బభూవహ ॥**
**వామాంకే సన్నిషణ్ణా స్వదేవీ శ్రీభువనేశ్వరీ ॥**

దానిమీద త్రిభువనేశ్వరుడు, మహాదేవుడు అయిన కామేశ్వరుడు ఉంటాడు. పరమేశ్వరి అంటే నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మకదా ! మరి ఇక్కడ భువనేశ్వరుడు ఎవరు ? అనుకుంటావేమో ? ఆ పరమేశ్వరియే తనలీలావిలాసార్థము రెండురూపాలు ధరిస్తున్నది.

సృష్టి ప్రారంభానికి ముందు అంటే కృతయుగానికి పూర్వము బిందురూపంలో ఉన్న పరబ్రహ్మ అంతకు ముందు ప్రళయం జరిగినప్పుడు కర్మ పరిపక్వం చెందకుండా తనలో లీనమైన జీవులకు కర్మక్షయం కలిగించాలనే ఉద్దేశ్యంతో సృష్టి చెయ్యాలనుకున్నటువంటివాడై తనను తాను రెండుగా విభజించుకున్నాడు. అంటే తనలో నుంచి కొంత శక్తిని బయటకు పంపాడు. ఇప్పుడు

పరమేశ్వరుడు – ప్రకాశాంశ

శక్తి – విమర్శాంశ

వారే శివశక్తులు. పరమేశ్వరి పరమేశ్వరులు. కామేశ్వరి కామేశ్వరులు. భువనేశ్వరి భువనేశ్వరులు. కాబట్టి ఇక్కడ రెండురూపాలు ఆమెవే. అటువంటి భువనేశ్వరుడి వామాంకముమీద ఆ దేవి ఆసీనమై ఉంటుంది.

## 59. మహాపద్మాటవీసంస్థా

మహా అంటే గొప్పదైన పద్మము. రుద్రయామళంలో

**ఊర్ధ్వం త్రిలక్షయోజనా యామ మహాపద్మవనామృతం**పైన అంటే బ్రహ్మాండానికి పైభాగంలో మూడులక్షల యోజనాల విస్తీర్ణంగల మహాపద్మము ఒకటున్నది. లలితాస్తవరత్నంలో

**మణిసదన సాలయో రథిమధ్యం దశతాలభూమిరుహసువర్ణదీర్ఘైః ।**
**పర్ణైః వర్ణై ర్యుక్తాం కాండైశ్చ యోజనోత్తుంగైః**
**మృదులైస్త్రాళీపంచకమానైర్మిళితాం చ కేసర కదంబైః**
**సంతతగళిత మరంద స్రోతోనిర్యన్మిళిందసందోహమ్**
**పాటీరపవన బాలకధాటీ నిర్యత్పరాగ పింజరితాం**
**పద్మాటవీం భజామః పరిమళకల్లోలపక్ష్మలోపాన్తామ్**

చింతామణుల గృహము. ప్రాకారముల ఆదిమధ్యలయందు పదితాడిచెట్ల పొడవు గలవి. మేఘవర్ణము గల ఆకులు గలవి. యోజనము ఎత్తు గలవి. బలమైన కాండములు గలవి. ఐదు తాడిచెట్ల పొడవు గల  కింజిల్కముల గుంపుగలవి. ఎల్లకాలము స్రవించు మకరందప్రవాహము గలవి. మంచి గంధపువాసన గలవి. గాలికి కదలటంచేత బయటకు ఎగిరి వచ్చిన పుప్పొడితో కలసి పసుపురంగులో కనిపిస్తున్న పద్మములతో కూడిన అడవిని, వాసన గలిగి కదలుతున్న రేకులుగల దానిని నేను సేవింతును

మానవశరీరంలో పైభాగాన బ్రహ్మరంధ్రం దగ్గర ఉన్న సహస్రదళపద్మమే ఇక్కడ చెప్పిన  మహాపద్మాటవి.

సహస్రారము ఎనిమిది దళాలు గల పద్మము. ఇందులోని ఒక్కొక్కదళములోను చిన్నచిన్న రేకులు 125 చొప్పున ఉంటాయి. ఈ రకంగా వెయ్యిదళాలుంటాయి. అందుకే దాన్ని సహస్రదళపద్మము అంటారు. ఇందులోని ఎనిమిది దళాలు ఎనిమిది దిక్కులకు తిరిగిఉంటాయి.  స్వచ్ఛందతంత్రంలో

**తస్మా దూర్ధ్వం కులం పద్మం సహస్రారమథోముఖం**
**మహాపద్మవనం చేదం సమానం తస్య చోపరి ॥**

దానికి పైన వేయిరేకులు గల కులపద్మము అధోముఖమై ఉన్నది. అదే మహాపద్మవనము. అందులోనే దేవి ఉంటుంది.

ఇదే విషయాన్ని వివరిస్తూ

**తస్మా దూర్ధ్వమధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదం ।**
**నిత్యానందమయీ సదాశివపురీ శక్తేనమశ్శాశ్వతం ॥**

ఆజ్ఞాచక్రం దాటిన తరువాత, షట్చక్రాలకు పైన బ్రహ్మరంధ్రానికి కొద్దిగా దిగువభాగంలో వేయిదళాలు గల పద్మమున్నది. అది నిత్యానందమయమైన శివపురము.

ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీ శక్తిని గనక జాగృతంచేసినట్లైతే అది గ్రంథిత్రయాన్ని దాటి సహస్రారం చేరుతుంది. అప్పుడు అక్కడ నుంచి జాలువారిన అమృతపుధారలతో సాధకుని శరీరంలోని 72000 నాడీమండలము తడుస్తుంది. అప్పుడు తడనుభవించే ఆనందం అనుభవైకవేద్యము. మహాపద్మవనాన్ని శంకరభగవత్పాదులు తమ సౌందర్య లహరిలోని 21వ శ్లోకంలో

**తటిల్లేఖాతన్వీం తపనశశివైశ్వానరమయీం**
**నిషణ్ణాం షణ్ణాం అప్యుపరి కమలానాం తవ కలాం**
**మహాపద్మాటవ్యాం మృదితమల మాయేన మనసా**
**మహాన్తః పశ్యంతో దధతి పరమాహ్లాద లహరీమ్ ॥**

తల్లీ ! భగవతీ ! మెరుపుతీగలాగా సూక్ష్మమై, దీర్ఘమై, సూర్యచంద్రాగ్నిరూపమై, షట్చక్రాలకుపైన సహస్రారంలో ఉన్న మహాపద్మటవిలోని నీ పాదాఖ్యకళను మహాత్ములు పరమాహ్లాదలహరిగా భావిస్తారు.

## 60. కదంబవనవాసినీ

కదంబవృక్షము అంటే – కడిమిచెట్టు. పరమేశ్వరి కదంబవనవాసిని. కడిమిచెట్ల వనమునందుంటుంది. రుద్రయామళంలో

**బిందుస్థానం సుధాసింధుః పంచయోన్య స్సురద్రుమాః**
**తత్రై వ నీపశ్రేణీ చ తన్మధ్యే మణిమండపం ।**
**తత్రచింతామణికృతం దేవ్యామందిర ముత్తమం ॥**

బిందుస్థానమే సుధాసిందువు. పంచయోనులే కల్పవృక్షాలు. వాటిలో కదంబవనము. ఆ వనములో రత్నమండపము. దాని మధ్యచింతామణి గృహము ఉన్నాయి.

అర్చనచేసేటప్పుడు సప్తప్రాకారం చతుర్ద్వారకం సువర్ణమండపం పూజయేతు. అని చెబుతూ రత్నద్వీపమధ్యే కల్పవృక్ష వాటికాయై నమః అంటారు. ఇక్కడ కందబవృక్షము అంటే కల్పవృక్షము అని అర్థం చెప్పారు. సూర్యరాయాంధ్రనిఘంటువులో కూడా కదంబము అంటే – దేవతాళము అని చెప్పబడింది.

దేవీభాగవతంలో ఈ కదంబవనాన్ని వివరిస్తూ

**కనక రజిత ప్రాకార మధ్య భూః**
**సప్తయోజనాః తస్మాత్ ద్వియోజనోన్నతాః**
**కదంబవృక్షాస్సంతీప్యతి**

బంగారు వెండి ప్రాకారాల మధ్య ఏడుయోజనాల విస్తీర్ణం గల భూమి ఉన్నది. అక్కడ రెండు యోజనాల ఎత్తుగల కడిమిచెట్లున్నాయి.

శ్రీచక్రంలో బిందుస్థానమే క్షీరసాగరం. పంచకోణాలే కడిమిచెట్లు. వీటి మధ్య ఆ దేవి ఉంటుంది.

# 61. సుధాసాగరమధ్యస్థా

సుధాసాగరము – అమృతపు సముద్రము అదే క్షీరసాగరము. ఆ క్షీరసాగరం మధ్యలో దేవి ఉంటుంది.

**సుధాబ్ధౌ నందనోద్యానే రత్నమండప మధ్యమాం ।**
**బాలార్కమండలాభాసాం చతుర్బాహుం త్రిలోచనామ్ ॥**

క్షీరసాగరం మధ్యన రత్నమండపం మీద నాలుగుచేతులతో ఆ దేవి బాలభానునివలె ప్రకాశిస్తున్నది.

మృతము అంటే చావులేకుండా చేసేది అమృతము. **అమృతే నావృతాం పురీం** అటువంటి అమృతముచే ఆవరింపబడిన నగరము.

సుధాసాగరము అనేవి మూడున్నాయి.

1. క్షీరసాగరము
2. సహస్రారము పైనున్న బ్రహ్మరంధ్రము అదే బిందుస్థానము.

**బిందుస్థానం సుధాసింధుః**

3. సగుణబ్రహ్మోపాసనచే పొందదగిన మార్గము. **సగుణబ్రహ్మోపాసనా ప్రాప్యేనగరే.**

ఈ మూడు రకాలయిన సుధాసాగరాల మధ్యన ఉంటుంది ఆ పరమేశ్వరి. ఆమె సుధాసముద్రం మధ్యన ఉంటుంది. కాబట్టే సాధకుడికి చావులేకుండా చేస్తుంది. పుట్టిన ప్రతిప్రాణి మరణించాల్సిందే. మరి చావు లేకపోవటం అంటే జన్మలేకపోవటం అన్నమాట. అదే జన్మరాహిత్యం శాశ్వతమైన ముక్తి. సాయుజ్యం అంటే సాధకుడికి శాశ్వత బ్రహ్మలోకప్రాప్తి కలగచేస్తుంది.

ఆత్మసాక్షాత్కారం పొందిన వారికి మరుజన్మ ఉండదు. సాధకుడు జ్ఞానియై, విజ్ఞానాన్ని ఆర్జించి స్వరూపసిద్ధిని పొంది అంటే తన రూపం ఏమిటి ? తానెక్కడి నుంచి వచ్చాడు? అనే విషయాలు తెలుసుకుంటాడు. అటువంటి వ్యక్తికి సాయుజ్యం లభిస్తుంది.

మోక్షానికి కర్మ, ఉపాసన, జ్ఞానము కూడా సాధనాలే. వీరందరికీ మోక్షం లభిస్తుంది. కాబట్టి దేవి రెండురకాల మోక్షాలను ఇస్తుంది.

శ్రీచక్రమే సుధాసముద్రము. అక్కడ ఉన్న అష్టదళపద్మము, షోడశదళపద్మాలే మహాపద్మాటవులు. పంచకోణాలే కడిమిచెట్లు.

సగుణబ్రహ్మోపాసనవల్ల లభించే లోకంలో 'అర' 'ణ్య' అనే రెండు అమృతపు సరస్సులున్నాయి. వీటినే సుధాసాగరము అంటారు. అర్చిరాది మార్గంలో ప్రయాణంచేసే జీవుడు ఆ సరస్సులలో స్నానం చేస్తేనే అతడికి బ్రహ్మలోక ప్రవేశానికి అర్హత కలుగుతుంది.

## 62. కామాక్షీ

**కామే కమనీయే అక్షణీ యస్యాః సా**

ఇంపైన కనులు గలది.

**కామేశ్వర ఏవనేత్రం యస్యాః సా**

శివుడు లేక కామేశ్వరుడు నేత్రములుగా గలది. దేవి యొక్క రెండుకనులూ ఆ పరమేశ్వరుడే అని భావన. సప్తశతిలో **నయన త్రియం జజ్ఞౌతథాపాపక తేజసా.** అగ్ని యొక్క తేజస్సుతో ఆమె మూడు కనులు ఆవిర్భవించినాయి. కమనీయమైన నేత్రములు గలది.

సూర్యచంద్రులే దేవి నేత్రాలు. పురుషసూక్తంలో **చక్షో సూర్యోఅజాయత** పరమేశ్వరుని నేత్రములు సూర్యుని తేజస్సుతో ఉన్నాయి అన్నారు. ఇదే మాటను ఉపనిషత్తులలో కూడా చెప్పటం జరిగింది. నేత్రాలకు అధిదేవత సూర్యుడు.

కామాక్షి కాముని అక్షిగా గలది. కాముడు అంటే మన్మథుడు. మన్మథుడే నేత్రములుగా గలది. జీవజాలము యొక్క కోరికలే నేత్రములుగా గలది. పూర్వజన్మలోని కోరికల ననుసరించి ఈ జన్మలో వారి మనోవృత్తులను నెరవేర్చునది.

క అంటే – సరస్వతి. మ అంటే – లక్ష్మి కాబట్టి కామాక్షి – లక్ష్మీ సరస్వతులే నేత్రములుగా గలది. అష్టాదశశక్తి పీఠాలలో ఒక దేవత. కాంచీపురవాసి.

లంకాయాం శాంకరీ దేవీ

**కామాక్షీ కంచికాపురీ**

**ప్రద్యుమ్నేసింహళా దేవీ చాముండే క్రమపట్టణే**

**అలంపురే జోగులాంబా శ్రీశైలే భ్రమరాంబికా**

**కొల్హాపుర్యాం మహాలక్ష్మీ ముహుర్యాం ఏకవీరికా**

**ఉజ్జయిన్యాం మహాకాళీ పీఠాయాం పురుహూతికా**

**ఓఢ్యాణే గిరిజాదేవీ మాణిక్యా చిత్రకూటకే**

**హరిక్షేత్రే కామరూపా ప్రయాగే మాధవేశ్వరీ**

**జ్వాలాయాం వైష్ణవీదేవీ గయాయాం సర్వమంగళా**

**వారణాస్యాం విశాలాక్షీ కాశ్మీరేచ సరస్వతీ**

**ఏతానిశక్తినామాని సాయంప్రాతః స్మరే న్నరః**

**సప్తజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి**

| వ.నెం. | దేశము | ప్రాంతము | శక్తిపేరు |
|---|---|---|---|
| 1 | లంక | సింహళము | శాంకరీదేవి |
| 2 | కంచి | తమిళనాడు | కామాక్షిదేవి |
| 3 | ప్రద్యుమ్న | బెంగాల్ | సింహళాదేవి |
| 4 | క్రమపట్టణము | కర్నాటక | చాముండాదేవి |
| 5 | అలంపురి | ఆంధ్రప్రదేశ్ | జోగులంబదేవి |
| 6 | శ్రీశైలము | ఆంధ్రప్రదేశ్ | భ్రమరాంబాదేవి |
| 7 | కొల్హాపూర్ | మహారాష్ట్ర | మహాలక్ష్మీదేవి |
| 8 | మహురీ | గుజరాత్ | ఏకవీరాదేవి |
| 9 | ఉజ్జయిని | మధ్యప్రదేశ్ | మహాకాళీదేవి |
| 10 | పీఠికాపురీ | బీహార్ | పురుహూతికాదేవి |
| 11 | ఓడ్యా | ఒరిస్సా | గిరిజాదేవి |
| 12 | ద్రాక్షావాటికా | ఉత్తరప్రదేశ్ | మాణిక్యాంబాదేవి |
| 13 | హరిక్షేత్రము | ఉత్తరప్రదేశ్ | కామరూపీదేవి |
| 14 | ప్రయాగ | ఉత్తరప్రదేశ్ | మాధవేశ్వరీదేవి |
| 15 | జ్వాలా | జమ్మూ | వైష్ణవీదేవి |
| 16 | గయ | ఉత్తరప్రదేశ్ | మంగళగౌరీదేవి |
| 17 | వారణాసి | ఉత్తరప్రదేశ్ | విశాలాక్షీదేవి |
| 18 | కాశ్మీర్ | కాశ్మీర్ | సరస్వతీదేవి |

ఈ మొత్తం పీఠాలలో ఎక్కువభాగం (5) ఉత్తరప్రదేశ్‌లోనే ఉన్నాయి.

కామాక్షీ స్తోత్రంలో దేవిని కీర్తిస్తూ శంకర భగవత్పాదులవారు

**వందే శంకరభూషణీం గుణమయీం సౌందర్యముద్రామణీం**
**వందే రత్నవిభూషణీం గుణమణిం చింతామణిం సద్గుణామ్ ।**
**వందే రాక్షసగర్వసంహరకరీం వందే జగద్రక్షిణీం**
**కామాక్షీం కరుణాకటాక్ష విభవీ మంగీకరీ పాహి మామ్ ॥**

**సర్వజ్ఞా సాక్షిభావేన తత్త్వాకామా నపూరయత్**
**తం దృష్ట్వా చరితం దేవ్యా బ్రహ్మాలోకపితామహః**
**కామాక్షీతి తదునామ దదౌ కామేశ్వరీ**

సర్వజ్ఞురాలు, సాక్షీభూతురాలు అయిన దేవి అందరి కోరికలు తీర్చటం చేత బ్రహ్మ ఆమెను కామేశ్వరి, కామాక్షి అనే పేర్లతో పిలిచాడు.

## 63. కామదాయినీ

మన్మథుణ్ణి సంహరించినవాడు శివుడు. అతడి చేత శుభములను పొందినది.

కామ అంటే శివుడు. దాయని అంటే వంశపారంపర్యసంబంధముగలది. అనగా శివుడికన్న వేరైనదికాదు. శివునితో ఏకమై ఉండునది.

సమస్త భక్తకోటికి వారి కోరికలు తీర్చునది. భక్తుల అర్హతలను బట్టి వారికి సిరిసంపదలు, భోగభాగ్యాలు, మోక్షము ప్రసాదించునది.

భక్తులకు కామేశ్వరుని ప్రాపు కలుగుచేయునది. అంటే నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు, మాయారహితుడు అయిన పరమేశ్వరుణ్ణి గురించి తెలియచేసేది.



# 8. భండాసురవధ

ఇహ ఇక్కడనుంచీ భండాసురుడు అనే రాక్షసుణ్ణి వధించటం చెప్పబడుతోంది.

దక్షప్రజాపతి యజ్ఞం చేస్తున్నాడు. ఆ యజ్ఞానికి దేవతలనందరినీ పిలిచాడు. కాని తన కుమార్తె దాక్షాయణిని, అల్లుడైన ఈశ్వరుణ్ణి మాత్రం పిలవలేదు. పిలవకపోయినా సరే తండ్రి చేస్తున్న యజ్ఞానికి వెడతానన్నది దాక్షాయణి. వద్దన్నాడు శివుడు. ఆమె వినలేదు. పరివారాన్ని వెంటఇచ్చి పంపాడు. పుట్టింటికి వెళ్ళింది దాక్షాయణి. అక్కడ ఎవరూ పిలవలేదు, పలకలేదు. తండ్రి కూడా చూసీ చూడనట్లు ఊరుకున్నాడు. ఆ అవమానాన్ని భరించలేకపోయింది. తిరస్కారాన్ని తట్టుకోలేకపోయింది. వెంటనే అగ్నిని సృష్టించుకుని అందులో దగ్ధమైపోయింది. ఆ మాట విన్న శివుడు వీరభద్రుడు నాయకుడుగా పిశాచగణాన్ని పంపాడు. దక్షునియజ్ఞంకాస్తా నాశనమయిపోయింది. దేవతలంతా తలోదారినా పరుగెత్తారు. శివుడు విరాగియై హిమాలయాల్లో తపస్సు చేసుకుంటున్నాడు.

బ్రహ్మమానసపుత్రుడు కశ్యపప్రజాపతి. ఇతడికి దితి వలన జన్మించినవాడు వజ్రాంగుడు. ఇతని భార్య వరాంగి. ఇతడు దేవతలను బాధిస్తూ ఉండేవాడు. ఇతనికి తారకాసురుడు అనే కుమారుడు గలిగాడు. అతడు బ్రహ్మను గూర్చి ఘోరతపస్సు చేశాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. అందరి రాక్షసులలాగానే తనకు మృత్యువులేకుండా వరం ప్రసాదించమన్నాడు తారకుడు. అది మాత్రం నావల్లకాదు. ఎందుకంటే నాకులేనిది నేను ఇతరులకు ప్రసాదించలేను. కల్పము అయిన తరువాత నేనే ఉండను. కాబట్టి ఇంకేదయినా వరం కోరుకో అన్నాడు బ్రహ్మ.

ఆ మాటలు విన్న తారకుడు ఒక్కక్షణం ఆలోచించాడు. ఈ బ్రహ్మ తనను మోసం చెయ్యటం లేదు కదా ? అనుమానం వచ్చింది. అయినా ఇంకోసారి చూద్దాం అనుకుని ఇంతవరకు సృష్టిలో ఉన్న ఏప్రాణితోనూ చావులేకుండా వరమియ్యమన్నాడు. తారకుడు. అసలు చావులేకుండా కాదు. ఎవరిచేతిలోనో ఒకరిచేతిలో చావుంది కదా అనుకుని సరేనన్నాడు బ్రహ్మ.

వరబలంతో విర్రవీగిపోయాడు తారకుడు. దేవతలను నానాబాధలు పెడుతున్నాడు. దేవతలంతా విష్ణువును శరణువేడారు. విష్ణుమూర్తి దేవతలకు విషయం అంతా పూర్తిగా

వివరించి వారందరినీ హిమాలయాలకు తీసుకునిపోయాడు. అక్కడ దేవతలు రకరకాలుగా పరమేశ్వరిని ప్రార్థించటం మొదలుపెట్టారు. కొందరు ఉపవాసాలు చేస్తున్నారు. కొందరు చాంద్రాయణంలాంటి వ్రతాలు చేస్తున్నారు. కొందరు తపస్సు చేస్తున్నారు. కొందరు అంతర్యాగం చేస్తున్నారు. కొందరు యజ్ఞయాగాలు చేస్తున్నారు. అలా కొంతకాలం గడిచిపోయింది. చైత్రశుద్ధనవమి శుక్రవారం వారికి పరమేశ్వరి ప్రత్యక్షమైంది. దేవతలంతా ఆమెను శరణువేడారు. తారకుడి బారి నుండి రక్షించమని వేడుకున్నారు. అందుకు ఆ దేవి తన అంశ హిమవంతునికి కుమార్తెగా పుడుతుంది. ఆ బాలికకు ఈశ్వరుడికీ వివాహం చెయ్యండి. వారికి పుట్టిన బాలుడు తారకాసుర సంహారం చేస్తాడు అని చెప్పింది.

పరమేశ్వరి వాక్కు ప్రకారం హిమవంతుడి భార్య మేనక గర్భవతి అయి ఆడశిశువును ప్రసవించింది. ఆ బాలిక దినదిన ప్రవర్ధమానయై, యుక్తవయసుకు చేరింది. ఆ బాలిక పేరు హైమవతి. కుమార్తెకు వరుణ్ణి వెదకటం మొదలుపెట్టాడు హిమవంతుడు. ఈశ్వరుణ్ణి తప్ప వేరెవరినీ వివాహమాడను అని చెప్పింది హైమవతి. శివుడు విరాగియై తపస్సుచేసుకుంటున్నాడు. ఆ రకంగా విరాగియైన శివుణ్ణి సరాగిగా చెయ్యటానికి మన్మథుడు రతీసమేతంగా బయలుదేరాడు. తాను చేయగలిగినదంతా చేస్తున్నాడు మన్మథుడు. ఇతడితో విసుగుచెందిన ఈశ్వరుడు తన జ్ఞాననేత్రంతో మన్మధుణ్ణి భస్మం చేసేశాడు. శివుని కోపాగ్నికి కాలిబూడిద అయిపోయాడు మన్మథుడు.

**అథతద్భస్మ సంవీక్ష్య చిత్రకర్మా గణేశ్వరః ।**
**తద్భస్మనా తు పురుషం చిత్రాకారం చకార సః ॥**
**ఏత ద్దృష్ట్వా తు చరితం విధాతా భండితి భండితి ।**
**య దువాచ తతో నామ్నా భండో లోకేషు కథ్యతే ॥**

ఆ సమయంలో చిత్రకర్ముడైన గణేసుడు ఆ బూడిదను తీసుకుని పురుషాకృతిలో చిన్నబొమ్మ తయారుచేశాడు. అసలే బూడిద. అందులోనూ శివుని కోపాగ్నికి దహించబడినది. కాబట్టి తెల్లగా, అతి మెత్తగా ఉంది. దాంతో తయారయిన బొమ్మ కూడా చాలా అందంగా ఉన్నది. ఆ బొమ్మను చూసి బ్రహ్మదేవుడు భండభండ – బాగుబాగు అన్నాడు. ఇంకేముంది. ఆ బొమ్మకు భండుడు అని పేరు వచ్చింది. విధాతకృపవల్ల ప్రాణం వచ్చింది. అయితే భండుని పుట్టుక ఏమిటి ?

**రుద్రకోపానలాజ్ఞాతో యతో భండో మహాబలః**

**తస్మాత్ రౌద్రస్వభావ శ్చ దానవ శ్చా భవ త్తతః ॥**

రుద్రుని కోపాగ్నికి భస్మమైన మన్మథుడి బూడిద నుంచి పుట్టినవాడు కాబట్టి తమోగుణ ప్రధానుడైనాడు భండుడు. రాక్షసలక్షణాలు సంక్రమించాయి. ఇంకేముంది భండుడు కాస్తా భండాసురుడైనాడు. భండాసురసంహారమే ఇక్కడ 64 నుండి 84 వరకు నామాలలో చెప్పబడింది. అయితే 64 నుంచి 87 వరకు ప్రతినామము 16 అక్షరాలతో ఉంటుంది.

## 64. దేవర్షిగణ సంఘాతస్తూయమానాత్మవైభవా

దేవగణములచేత, ఋషిగణములచేత కొనియాబడుచున్నది. స్తుతింపబడుచున్నది. ఆత్మస్వరూపవైభవం కలది. దేవఋషిగణములచే అనేకవిధములుగా పొగడబడుచున్న ఆత్మవైభవము గలది. సంఘాతము అంటే నరకము. అటువంటి నరకం నుంచి తప్పించమని దేవగణాలు, ఋషిగణాలు ఆ దేవిని ప్రార్థిస్తున్నాయి. ఘాతము అంటే సంహరించటం. భండాసురసంహారం చెయ్యమని ఆ గణాలు దేవిని ప్రార్థిస్తున్నాయి.

భండాసురుడు దేవతలను ఓడించాడు. వారిని రాజ్యభ్రష్టులుగావించాడు. యజ్ఞయాగాదులు పాడుచేస్తున్నాడు. ఋషులను బాధిస్తున్నాడు. అప్పుడు వారంతా పరమేశ్వరిని ప్రార్థించి

**యది తుష్టాసి కల్యాణి ! వయం దైత్యేంద్ర పీడితాః**

**దుర్లభం జీవితం చాపి త్వాం గతా శరణార్థినః**

ఓ పరమేశ్వరీ ! నువ్వు మా పై దయ చూపదలచినట్లైతే మమ్ములను రక్షించు. మేము ఆ రాక్షసుని చేతిలో పీడించబడి నిన్ను శరణుకోరుతున్నాము అన్నారు. అప్పుడు నారదుడు అవును తల్లీ ఆ రాక్షసుడు నీ చేతిలో తప్ప ఎవరి చేతిలోనూ చావడు అన్నాడు. ఇక్కడ సంఘాతము అంటే నారదాది దేవవర్గులు అని అర్థం. వీరు బ్రహ్మాదిదేవతలు, వసిష్ఠాది ఋషులు, నారదాదులు అని చెప్పబడింది. కాని అగ్నిపురాణంలో

**ఆదిత్యా విశ్వవసవ స్తుషితా భాస్వరా నిలాః**

**మహారాజితి సాధ్యా శ్చ రుద్రా శ్చ గణదేవతాః ॥**

| | | | |
|---|---|---|---|
| మహారాజులు | – | 7 | మంది |
| వసువులు | – | 8 | మంది |
| రుద్రులు | – | 11 | మంది |
| విశ్వదేవతలు | – | 10 | మంది |
| సాధ్యులు | – | 12 | మంది |
| సూర్యులు | – | 12 | మంది |
| తుషితులు | – | 36 | మంది |
| అనిలులు | – | 49 | మంది |
| భాస్వరులు | – | 64 | మంది |
| మొత్తం దేవగణాలు | | 209 | మంది |

రుద్రయామళంలో దిక్పాలకులచేత ఇతర దేవతలచేత పొగడబడినది. అని చెప్పబడింది.

సమస్తలోకానికి ప్రేమాస్పదమైన చైతన్యమే ఆత్మ. ఆత్మయే పరమేశ్వరి

| | | | |
|---|---|---|---|
| దేవగణాలు అచ్చులు | – | 16 | |
| ఋషిగణాలు హల్లులు | – | 34 | |
| సంఘాతము క్ష కారము | – | 1 | |
| మొత్తం అక్షరాలు | | 51 | |
| అ ఇ ఉ ఋ ఏ ఐ ఓ ఔ అం అః | – | 11 | అచ్చులు |
| క చ ట త ప య శ వర్గులు | – | 33 | హల్లులు |
| సంఘాతాక్షరము | – | 1 | |
| మొత్తం అక్షరాలు | | 45 | |

ఇది భూమావిద్య. సంఖ్యాశాస్త్రం ప్రకారము భూ అంటే – 4, మ అంటే – 5. కాబట్టి దేవి భూ, మా విద్యచే స్తుతింపబడినది.

## 65. భండాసురవధోద్యుక్తశక్తిసేనాసమన్వితా

గతంలో పరమేశ్వరుని 5వ నామంలో దేవకార్యసముద్యతా అని చెప్పటం జరిగింది. అంటే దేవతల కార్యములు నెరవేర్చటం కోసమని దేవి ఆవిర్భవించింది. దేవతల కార్యము ఏమిటి ? దుష్టశిక్షణ, శిష్టరక్షణ.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం ।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥**

లోకంలో ధర్మం నశించి అధర్మం ఎప్పుడైతే పెచ్చుమీరిపోతుందో అప్పుడు ఆత్రత్రాణపరాయణుడైన శ్రీమన్నారాయణుడు భూలోకంలో అవతరించి ధర్మసంస్థాపన చేస్తాడు అని గీతలో చెప్పబడింది. దానికి కారణం కూడా పరమేశ్వరే.

బ్రహ్మమానసపుత్రుడు భృగువు. అతని భార్య 'ఉశన' వీరికుమారుడు శుక్రుడు. అంగిరసుని కుమారుడు బృహస్పతి. వీరిద్దరూ అంగిరసుని దగ్గరే విద్యాభ్యాసం చేశారు. అయితే బృహస్పతి దేవగురువు శుక్రాచార్యుడు రాక్షసగురువు అయ్యారు.

ఒకసారి దేవదానవులకు ఘోరమైన యుద్ధం జరిగింది. అందులో దేవతల ధాటికి ఆగలేక రాక్షసులు తమ గురువైన శుక్రాచార్యుడి దగ్గరకు వెళ్ళి "గురుదేవా ! మా బాధలు చూడండి. దేవతలు మమ్మల్నిచావకొట్టారు. మహామంత్రవేత్తవు. దివ్యమహిమోపేతుడవు మాకులగురువువు. నువ్వు మాట్లాడకుండా ఉంటే ఇంక మేం బ్రతకలేము. మమ్మల్ని రక్షించే భారం నీదే" అన్నారు.

ఆ మాటలు విన్న శుక్రుడు. "నాయనలారా ! దేవతలకు విష్ణుమూర్తి యొక్క అండ ఉన్నది. అతడు సామాన్యుడు కాదు. మాయోపాయాలు బాగా తెలిసినవాడు. అందుచేతనే ప్రతిసారీ దేవతలు జయిస్తున్నారు. అతడికి ప్రతిగా నిలవాలంటే శివుని అనుగ్రహం కావాలి. నేను వెళ్ళి పరమశివుణ్ణి ప్రసన్నం చేసుకుంటాను. అంతవరకు మీరు దేవతలతో యుద్ధానికి పోకుండా, శాంతంగా ఉండండి". అని చెప్పి తాను తపస్సు చెయ్యటానికి హిమాలయాలకు వెళ్ళిపోయాడు.

రాక్షసులంతా దండకమండలాలు ధరించి, తపస్సు చేస్తున్నట్లుగా కూర్చుని, ఇంద్రుడికి ప్రహ్లాదుడితో శాంతి సందేశం పంపారు. వచ్చింది భక్తశిఖామణి ప్రహ్లాదుడు కాబట్టి దేవతలు అతని మాట నమ్మారు.

శుక్రుని తపోవృత్తాంతము, రాక్షసుల కపటనాటకము చారులవల్ల విన్న ఇంద్రుడు, తన సేనలతో దండెత్తి వచ్చి రాక్షసులను చావబాదటం మొదలుపెట్టాడు. రాక్షసులు దిక్కుతోచక పారిపోతూ భృగుమహర్షి ఆశ్రమం చేరారు. భృగువు, అతని కుమారుడు శుక్రుడు కూడా తపోదీక్షలోనే ఉన్నారు. ఆశ్రమంలో భృగుపత్ని మాత్రమే ఉంది. రాక్షసులు ఆమెను శరణువేడారు. అభయమిచ్చింది భృగుపత్ని.

రాక్షసులను తరుముకుంటూ ఇంద్రుడు భృగు ఆశ్రమం చేరాడు. లోనికి ప్రవేశించాడు. దేవతలను అడ్డగించింది భృగుపత్ని. ఆగలేదు ఇంద్రుడు. దాంతో కోపగించి సమ్మోహనాస్త్రం ప్రయోగించింది. దాని ధాటికి దేవతలంతా మోహంలో పడిపోయారు. ఇంద్రుడు మాత్రం వెనుతిరిగి చూడకుండా పారిపోయాడు. వెంటపడింది సమ్మోహనాస్త్రం. చేసేదిలేక విష్ణువును శరణుజొచ్చాడు ఇంద్రుడు. అభయమిచ్చాడు విష్ణువు.

అస్త్రం సమీపించింది. ఆగమన్నాడు విష్ణువు. అస్త్రం ఆగలేదు సరికదా ఇంద్రుణ్ణి వదలకపోతే అతనితోపాటు నీ సంగతి కూడా చూస్తాను అన్నది. దాంతో కోపించినవాడై చక్రాయుధాన్ని ప్రయోగించాడు విష్ణువు. అది సమ్మోహనాస్త్రాన్ని నాశనంచేసి, దాన్ని ప్రయోగించిన భృగుపత్నిని కూడా సంహరించింది.

అది చూసిన రాక్షసులు భృగుమహర్షికి విషయం నివేదించారు. ఆఘమేఘాలమీద ఆశ్రమంచేరాడు మహర్షి. రక్తపుమడుగులో చచ్చిపడి ఉన్న తన భార్యను చూశాడు. అంతులేని దుఃఖం ముంచుకొచ్చింది. ఆ కోపంలో తన భార్య మరణానికి కారణమైన విష్ణుమూర్తిని భూలోకంలో నానాయోనులందు జన్మించమని శపించాడు.

విషయం తెలుసుకున్న విష్ణువు పరిపరివిధాల దుఃఖించసాగాడు. పుణ్యానికిపోతే పాపమెదురైనట్లుగా ఇంద్రుణ్ణి రక్షించటానికిపోతే ఈ శాపం తగులుకుంది. ఎంచెయ్యటమా? అని విచారిస్తున్నాడు.

ఆ సమయంలో పరమేశ్వరి ప్రత్యక్షమై “ఈ శాపాన్ని నేను వరంగా మారుస్తున్నాను. విచారించకు. భూలోకంలో ఎప్పుడైతే అధర్మం పెచ్చు మీరుతుందో, అప్పుడు నువ్వు భూలోకంలో జన్మించి ధర్మసంస్థాపన చేస్తావు”. అని చెప్పింది. ఆ రకంగా వచ్చినవే దశావతారాలు. కాబట్టి విష్ణుమూర్తి కూడా పరమేశ్వరి అనుగ్రహంవల్లనే దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తున్నాడు. ధర్మసంస్థాపనకావిస్తున్నాడు.

అయితే అతనికి కూడా సాధ్యంకాని సమయాలలో సాక్షాత్తూ ఆ పరమేశ్వరియే ఈ లోకంలో ఆవిర్భవించి దుష్టశిక్షణగావిస్తుంది. సప్తశతిలోని 11వ అధ్యాయంలో దేవతలు పరమేశ్వరిని శుత్రునాశనం చేసి మమ్ములను రక్షించవలసినది అని వేడుకుంటారు. అప్పుడు 41 నుంచి 54 శ్లోకాల వరకు తాను దేవతలను ఏ రకంగా రక్షిస్తాను అనే విషయం చెప్పి చివరకు

**ఇత్థం యదాయదాబాధా దానవోత్థా భవిష్యతి ।**
**తదా తదావతీఽర్యాహం కరిష్యా మ్యరిసంక్షయమ్ ॥**

ఎప్పుడైతే దానవులవల్ల దేవతలకు బాధ కలుగుతుందో, అప్పుడు నేను ఆవిర్భవించి రాక్షససంహారం చేస్తాను అంటుంది.

రాక్షసులలో ముఖ్యమైనవారు 1. మహిషాసురుడు 2. భండాసురుడు.

భండాసురుడు దేవతలను హింసిస్తున్నాడు. యజ్ఞయాగాదులు నాశనం చేస్తున్నాడు. దేవతలంతా పరమేశ్వరికి మొరపెట్టుకున్నారు. తమని రక్షించమని వేడుకున్నారు. అప్పుడు భండాసుర సంహారానికి తన సేనతో వ్యూహం నిర్మించింది.

భండ అంటే సిగ్గులేనివాడు. అజ్ఞాని సుఖదుఃఖాలలో మునిగితేలుతుండేవాడు. అతడే దేహి. అటువంటి అజ్ఞానాన్ని పటాపంచలు చెయ్యటమే భండాసురవధ.

ఈ శరీరమే నేను అనే అజ్ఞానభావన. అదే అసురతాసూచకము. ఈ విషయం ఉపనిషత్తులలో కూడా చెప్పబడింది. ఛాందోగ్యోపనిషత్తులో ఈ విధంగా ఉంది.

పూర్వకాలంలో ఒకసారి ప్రజాపతి ఆత్మతత్త్వాన్ని గురించి ఒక ప్రకటన చేశాడు.

"ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించలేదు. శోకం తాకదు. దానికి ఆకలి దప్పికలులేవు. మానవుడు సత్యకాముడు, సత్యసంకల్పుడు అయి ఆత్మజిజ్ఞాసను అలవరచుకోవాలి. ఆత్మను గురించి తెలుసుకున్నవాడు ఆత్మస్వరూపం పొందుతాడు."

దేవతలు రాక్షసులు అందరూ ఈ మాటలు విన్నారు. "ఆత్మను గురించి మనం కూడా అన్వేషిద్దాం. ఆత్మవల్ల కోరికలు తీరతాయని బ్రహ్మచెప్పాడుకదా ?" అని వారు భావించారు. దేవతలరాజు ఇంద్రుడు, రాక్షసులరాజు విరోచనుడు ఇద్దరూ ఆత్మజ్ఞానసముపార్జన కోసం బ్రహ్మవద్దకు వెళ్ళారు. బ్రహ్మవీరిద్దరినీ 32 సంవత్సరాలు బ్రహ్మచర్యదీక్ష వహించమన్నాడు. దీక్ష పూర్తిచేశారిద్దరూ. అప్పుడు వారిని చూసి

"వత్సలారా ! మీరు నా కోసం దేనికి వచ్చారు ?" అన్నాడు బ్రహ్మ.

"ప్రజాపతీ ! ఆత్మతత్త్వాన్ని గురించి నువ్వు చెప్పిన మాటలు విన్నాం. ఆత్మను గురించి తెలుసుకోవాలని వచ్చాం". అన్నారు ఇంద్ర విరోచనులు.

"మనుష్యుల కనుపాపలలో మెదులుతూ కనిపించే పురుషుడే ఆత్మ. ఆత్మ అభయం. అమృతమయం, అదే బ్రహ్మము" అన్నాడు ప్రజాపతి.

ఆ మాటలు విన్న ఇంద్ర విరోచనులు "భగవాన్ ! నీటిలో కనిపించే ప్రతిబింబము, అద్దంలో కనిపించే ప్రతిబింబము. ఈ రెంటిలో ఏది ఆత్మరూపం ?" అని అడిగారు.

"నేను మొదటగా కళ్ళలో మెరిసే ఏ పురుషుని వర్ణన చేశానో, అతడే వీటన్నింటి లోనూ ప్రతిఫలిస్తాడు. ఒకసారి నీళ్ళలోను, అద్దంలోను మీ రూపాలు చూసుకుని మీ అనుభవాలు నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ. ఇంద్ర విరోచనులిద్దరూ అలాగే చేసి ప్రజాపతి దగ్గరకు వెళ్ళారు. ప్రజాపతి వీరిని చూసి "మీరు ఏం చూశారు?" అన్నాడు.

"నఖశిఖ పర్యంతం కేశపాశాలతో మా శరీరాల ప్రతిరూపమే మాకు నీళ్ళలోను, అద్దంలోనూ కూడా కనిపించింది" అన్నారు వారు.

"నాయనలారా శరీరం శుభ్రపరచుకుని మంచి వస్త్రాలు ఆభరణాలు ధరించి నీటిలో మీ ముఖాన్ని చూసుకుని నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ. మరునాడు తిరిగివచ్చి "స్వామీ ! చక్కని వస్త్రాలతో ఆభరణాలతో అలంకరించిన మా శరీరాలే నీటిలో కనిపించాయి." అన్నారు.

"అభయమూ, అమృతమయమూ అయిన ఆత్మ అదే. అదే బ్రహ్మము" అన్నాడు ప్రజాపతి.

అదివిన్న ఇంద్రవిరోచనులు ఆత్మను గురించి తమకు పూర్తిగా తెలిసింది అనుకుని తిరిగి వెళ్ళిపోయారు. అలా వెడుతున్న వారిని చూసి "ఆత్మను గురించి పూర్తిగా తెలుసుకోకుండానే వారు వెళ్ళిపోతున్నారు. శరీరమే ఆత్మ అని భావించటం పతనహేతువు" అనుకున్నాడు బ్రహ్మ.

రాక్షసరాజైన విరోచనుడు ఈ సిద్ధాంతంతో తృప్తి చెంది శరీరమే ఆత్మ అని ప్రచారం చేశాడు. కాని ఇంద్రుడు మాత్రం ఇది నమ్మక మళ్ళీ తిరిగి బ్రహ్మ వద్దకు వచ్చి ఆత్మతత్త్వాన్ని గురించి తెలుసుకున్నాడు.

ఈ రకంగా శరీరమే ఆత్మ అనుకోవటం. అసురతాభావన. ఆత్మస్వరూపిణి పరమేశ్వరియే.

అరిషడ్వర్గాన్ని, శరీరాభిమానాన్ని నాశనం చేసి మోక్షాన్ని ప్రసాదించటమే భండాసురవధ.

## 66. సంపత్కరీసమారూఢసింధుర వ్రజసేవితా

సంపత్కరీ అనే పేరు గల దేవి ఏనుగులకు అధిపతి. అంటే పరమేశ్వరి యొక్క గజసైన్యానికి అధిపతి సంపత్కరీదేవి. ఆమె పరమేశ్వరి అంకుశము నుంచి పుట్టింది. సంపత్కరీ దేవి రణకోలాహలము అనే ఏనుగును అధిరోహించి ఉంటుంది. కోట్లకొలది

ఏనుగులు ఈమెను అనుసరించి ఉంటాయి. సంపత్కరీదేవికి గజశాస్త్రము గురించి బాగా తెలుసు. ఏనుగులలో సింధురగజము, భద్రగజము, మంద్రగజము, మృగగజము ఇలా అనేకరకాలున్నాయి.

ప్రస్తుతకాలంలో ఏనుగులలో రెండు జాతులున్నాయి. 1. ఎలిఫాస్ 2. లాక్సోడాంటా. వీటిలో మొత్తం 300 ఉపజాతులున్నాయి. వాటిలో ముఖ్యమైనవి.

1. ఉత్తరఅమెరికాలోని మాసోడాన్. దీనికి పెద్దపెద్దరోమాలు ఉండేవి.

**2. వూలీమామత్ :** ఇది బొచ్చు ఏనుగు. దీని శరీరం అంతా బాగా వెంట్రుకలుంటాయి. దీని చెవులు చిన్నవిగా దంతాలు మెలితిరిగి ఉంటాయి.

**3. ఎలిఫాస్ కొలంబి :** దీని దంతాలు బాగా మెలి తిరిగి ఉంటాయి.

**4. ఎలిఫాస్ ఇంపారేటర్ :** దీని ఎత్తు 13 అడుగులు. చాలా ఎత్తైన ఏనుగు.

ఏనుగులు ఆఫ్రికాలో కూడా బాగా ఉంటాయి. అక్కడ ఏనుగులు నుంచునే నిద్రపోతాయి. వాటిలో

**1. లాక్సోడాంటా :** దీని ఎత్తు 11 అడుగులు. దీని చెవులు 3 1/2 అడుగులు వెడల్పు ఉంటాయి. దంతాలు ఆరు అడుగుల పొడవుంటాయి.

**2. పిగ్మీఎలిఫెంట్ :** ఇదిగున్న ఏనుగు.

**3. వైట్ ఎలిఫెంట్ :** ఇది తెల్ల ఏనుగు. బర్మా, సియామ్ ప్రాంతాలలో ఉంటుంది. ఈ రకం ఏనుగులు చాలా తక్కువ. అందుచేత దీన్ని దేవతాస్వరూపముగా భావిస్తారు. దీంతో పనిచేయించరు. శుభశూచకంగా దీన్ని భావిస్తారు. ఇంద్రుని ఐరావతం కూడా తెల్లగానే ఉంటుంది.

ఇక ఆసియాలో కనిపించే ఏనుగులను 'ఎలిఫాస్ మాక్సిమస్' జాతి అంటారు. ఇవి పది అడుగుల ఎత్తుంటాయి. దంతాలు తొమ్మిది అడుగులదాకా ఉంటాయి. ఇవి పడుకుని నిద్రపోతాయి. సిలన్‌లోని ఏనుగులకు దంతాలుండవు.

వీటిలో యుద్ధాలలో ఉపయోగించే ఏనుగును సింధురగజము అంటారు.

సుఖసంపదలతో కూడిన మనోవ్యాపారమే సంపత్కరి. సుఖసంపదలతో కూడిన చిత్తవృత్తులు సంపత్కరీ సంజ్ఞగలవి. మనస్సు అనబడే పరమేశ్వరి ఈ చిత్త వృత్తులను అధిరోహించి శబ్దాదివిషయసమూహములను గజములచే సేవించబడుచున్నది.

మనసును ముఖ్యప్రాణంతో లయంచేసి తురీయస్థితిని చెంది ఉండటమే సంపత్కరీవిద్య. సామాన్యులు చిత్తవృత్తిచేత అప్పుడు కనిపించే పదార్థాలను చూడగలరు. కాని ఆత్మచైతన్యము పొందటమనేది యోగులకే సాధ్యము.

యోగులచిత్తవృత్తి అంతర్ముఖమైనప్పుడు, అఖండాకారవృత్తి జ్ఞానముతో ఐక్యమవు తుంది. చిత్తవృత్తి నాశనం అయితే మాయనశించినట్లే. అప్పుడు జగత్తంతా నేనే అనే పరిణితి కలుగుతుంది. ఈ జ్ఞానమే ఆ పరాత్పరి.

శ్రీచక్రంలోని త్రికోణంలో ఉండే కామేశ్వరీదేవియే సంపత్కరీదేవి.

మంత్రశాస్త్రంలో సంపత్కరీదేవి అని ఒక దేవత ఉన్నది.

**అస్య శ్రీసంపత్కరీ మహామంత్రస్య । శ్రీకంఠః ఋషిః । గాయత్రీ ఛ్ఛందః । సంపత్సరస్వతీ దేవతా । హ్సౌః బీజం । స్వ్హౌః శక్తిః । క్లీం కీలకం । జపే వినియోగః**

**న్యాసము** : **క్లీం । హ్రైం । హ్సౌః । స్వ్హౌః । హ్రైం । క్లీం ॥**

**ధ్యానము** : **అనేకకోటి మాతంగ తురంగ రథ పత్తిభిః ।**
**సేవితా మరుణాకారాం వందే సంపత్సరస్వతీమ్ ॥**

**మంత్రము** : **క్లీం హ్రైం హ్సౌః స్వ్హౌః । హ్రైం । క్లీం॥**

## 67. అశ్వారూఢాధిష్ఠితాశ్వకోటికోటిభిరావృతా

ఆశ్వారూఢ. ఈమె పరమేశ్వరి యొక్క అంకుశము నుండి పుట్టినది. అపరాజిత అనే గుర్రము ఎక్కి వాయువేగ మనోవేగాలతో తిరుగుతుంది. ఆవిడ వెనక అదే వేగంతో పరుగులు తీసే గుర్రాలు అనేకముంటాయి. ఈ దేవత అశ్వాన్ని అధిరోహించిఉంటుంది. కాబట్టి అశ్వారూఢ అనబడుతోంది.

సృష్టిలో మానవుడు మచ్చికచేసిన జంతువులలో మొదటిది కుక్క, తరువాత పశుసంపద. ఆ తరువాత స్థానము గుర్రానిదే. అందుకే గుర్రాలలో అనేక జాతులు అభివృద్ధి చెందినాయి. అసలు గుర్రాలలో లెక్కలేనన్ని జాతులున్నాయి. వాటిలో ముఖ్యమైనవి.

**1. ఓరియంటల్ గుర్రము :** యుద్ధాలలో దీన్ని వాడతారు.

**2. అరేబియన్ గుర్రము :** ఇది చిన్నగా ఉంటుంది. తెలుపు, ఎరుపు అనేకరంగులతో ఉంటుంది. సామాన్యంగా నలుపురంగు తక్కువ. యుద్ధాలలోను, పందేలకు దీన్ని వాడతారు.

**3. మోర్గాన్ :** అమెరికాకు చెందిన నలుపుగుర్రము.

**4. అమెరికన్ క్వార్టర్ :** దీన్ని ఎక్కువగా రేసులకు వాడతారు.

**5. పోనీ గుర్రాలు :** ఇవి ఎక్కువగా స్కాట్‌లాండ్‌లో దొరకుతాయి. వీటిని రేసులలో వాడతారు.

**6. బెల్జియన్ గుర్రాలు :** ఇది పెద్దసైజులో ఉంటుంది. యుద్ధాలకు వాడతారు.

**7. అప్పలూసా :** రంగురంగులగుర్రము.

గుర్రాలలో మూడు నుంచి ఐదురంగుల వరకు ఉండే గుర్రాన్ని పంచకల్యాణి అంటారు. ఇది ఉత్తమజాతికి చెందిన గుర్రం. చాలా అరుదుగా లభిస్తుంది. కేవలం మహారాజుల దగ్గరమాత్రమే ఉండేది.

ఆశ్వారూఢ అనబడే ఈ దేవి అశ్వశాస్త్రం బాగా అధ్యయనం చేసినది. ఆమె అపరాజిత అనే అశ్వాన్నధిరోహించి దేవి చుట్టూ తిరుగుతూ ఆమెను రక్షిస్తుంది.

**అశ్వపూర్వాం రథమధ్యాం**

అనటంచేత ఆశ్వికబలము దేవికి ముందుభాగాన నడుస్తోంది. అట్టి ఆశ్వికబలానికి నాయకురాలు అశ్వారూఢ.

మానవుడి ఇంద్రియాలు అశ్వరూపాలు. వాటిని అదుపులో ఉంచేది, వాటిపై స్వారీ చేసేది మనస్సు. కఠోపనిషత్తులోని తృతీయవల్లిలో ఈ విషయం చెబుతూ

**యస్తు విజ్ఞానవాన్ భవ త్యయుక్తేన మనసా సదా ।**
**త స్యేంద్రియాణి వశ్యాని దుష్టాశ్వా ఇవ సారథౌ ॥**

మనసును విచ్చలవిడిగా వదిలేసి సరైన జ్ఞానం లేకుండా సంచరించే వాడి ఇంద్రియాలు, దోషపూరిత అశ్వాలు సారధి అదుపుతప్పినట్లే వశం తప్పిపోతాయి.

**య స్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా ।**
**త స్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథౌ ॥**

మనసును అదుపులో ఉంచుకుని జ్ఞానం కలిగి ప్రవర్తించే వాని ఇంద్రియాలు సారధియొక్క మంచి గుర్రంలాగా అతని వశంలో ఉంటాయి.

మనోవ్యాపారము ఇంద్రియాల ద్వారానే బహిర్గతమవుతుంది. ఇంద్రియాలను అధిష్టించిన అశ్వారూఢ అనే దేవతపరమేశ్వరిని అనుసరించి తిరుగుతూ ఉంటుంది.

శ్రీచక్రంలోని త్రికోణంలో ఉండే వజ్రేశ్వరియే అశ్వారూఢ అని గుర్తించాలి.

మంత్రశాస్త్రంలో అశ్వారూఢదేవికి ప్రత్యేకమంత్రమున్నది.

**అశ్వారూఢాఖ్యా కాచిద్దేవతా తంత్రప్రసిద్ధా ।**
**యస్యాః త్రయోదశాక్షరోమంత్రః**

తంత్రశాస్త్రంలో అశ్వారూఢ అని ఒక దేవత ఉన్నది. ఆ మంత్రము 13 అక్షరములు గలది.

**అస్యశ్రీ అశ్వారూఢాంబా మహామంత్రస్య । స్వచ్ఛానంద భైరవ ఋషిః । గాయత్రీ ఛందః । అశ్వారూఢాంబా దేవతా । ఆం బీజం । హ్రీం శక్తిః । క్రోం కీలకం । జపే వినియోగః ।**

**న్యాసము** : ఆం । హ్రీం । క్రోం । ఏ హ్యేహి । పరమేశ్వరి । స్వాహా

**ధ్యానము** : అశ్వారూఢా కరాగ్రే నవకనకమయీం వేత్రయష్టిం దధానా
దక్షిణే నానయంతీ స్ఫురిత తనులతా పాశబద్ధాన్ స్వసాధ్యాన్ ।
దేవీ నిత్యప్రసన్నా శశికలధరా సా త్రినేత్రాభిరామా
దద్యా దాద్యా నవద్యా సకలసుఖవరప్రాప్తి హృద్యాం శ్రియం నః ॥

**మంత్రము** : ఆం హ్రీం క్రోం ఏహ్యేహి పరమేశ్వరి స్వాహా ॥

## 68. చక్రరాజరథారూఢసర్వాయుధపరిష్కృతా

అన్నిరకాలయిన ఆయుధములతోనూ అలంకరించబడిన 'చక్రరాజము' అనేరథాన్ని పరమేశ్వరి అధిరోహించింది. రథాలలో కూడా రకాలున్నాయి అని రథశాస్త్రము చెబుతోంది. అందులో ముఖ్యంగా మూడురకాలున్నాయి. 1. చక్రరాజము. 2. గేయచక్రము 3. కిరిచక్రము. లలితోపాఖ్యానంలో ఈ విషయాన్ని వివరిస్తూ

**ఆనందధ్వజసంయుక్తో నవభిః పర్వభి ర్యుతః**
**దశయోజన మున్నమ్రః చతుర్యోజన విస్తృతః**
**మహారాజ్ఞాశ్చక్రరాజరథేంద్రః ప్రచలన్‌బభౌ ॥**

ఆనందధ్వజముతో కూడినది. తొమ్మిది పర్వముల (ఆవరణలు)తో కూడినది. పదియోజనాలఎత్తు నాలుగుయోజనాల వెడల్పు గలిగినటువంటిది దేదీప్యమానముగా

ప్రకాశించునది అయిన చక్రరాజము అను రథమును పరమేశ్వరి అధిరోహించెను. ఈ చక్రరాజరథమే శ్రీచక్రము.

శ్రీచక్రము అంటే చరాచరజగత్తే కాని వేరు కాదు. అందుకే భైరవయామళంలో శ్రీచక్రాన్ని గురించి పరమేశ్వరుడు పరమేశ్వరికి వివరిస్తూ

**శ్రీచక్రంత్రిపురసుందర్యా బ్రహ్మాండాకారమీశ్వరీ ।**
**పంచభూతాత్మకంచైవ తన్మాత్రాత్మక మేవ చ ॥**
**ఇంద్రియాత్మక మేవం చ మన స్తత్త్వాత్మకం తథా ।**
**మాయాదితత్త్వరూపం చ తత్త్వాతీతం చ బైందవమ్ ॥**

ఓ పరమేశ్వరీ ! శ్రీచక్రము అంటే సామాన్యమైనటువంటి ఒక చిన్న యంత్రం కాదు. అది ఈ బ్రహ్మాండం మొత్తానికి ప్రతీక. ఏరకంగా అంటే...

సృష్టికి కారణం పంచభూతాలు, తన్మాత్రలు, సృష్టి ఆరంభంలో మొట్టమొదటగా తన్మాత్రలు ఏర్పడ్డాయి. అవే శబ్ద స్పర్శ రూప రస గంధాలు. ఆ తరువాత తన్మాత్రల స్థూలరూపాలయిన పంచభూతాలు ఏర్పడ్డాయి. అవి పృథివి, నీరు, నిప్పు, గాలి, ఆకాశము. ఇవన్నీ పంచీకరణం చెందినాయి. అప్పుడు పంచభూతాలు, తన్మాత్రలు విడివిడిగా 15 భాగాలయినాయి. ఆ తరువాత ఇవి గుణత్రయంతో కలిసాయి. అప్పుడు ఈ సృష్టి జరిగింది. కాబట్టి సృష్టికి మూలమైనటువంటివి పంచభూతాలు, తన్మాత్రలు. అవి రెండూ శ్రీచక్రంలోనే ఉన్నాయి. అంటే పంచభూతాల, తన్మాత్రలతత్త్వాలు శ్రీచక్రంలో ఉన్నాయన్న మాట. కాబట్టి శ్రీచక్రమే చరాచరజగత్తుకు ప్రతీక. అందుచేతనే శ్రీచక్రాన్ని అర్చించినట్లైతే చరాచరజగత్తును అర్చించినట్లే. జగత్తు అంటే కేవలము అడవులు, కొండలు, చెట్లు, పుట్టలతో కూడిన భూమి మాత్రమే కాదు. దానిమీద ఉండే జీవజాలము కూడా. శ్రీచక్రంలో ఇంద్రియాలున్నాయి అన్నారు. అని రెండు రకాలు. 1. జ్ఞానేంద్రియాలు. 2. కర్మేంద్రియాలు. ఈ ఇంద్రియాలు ప్రతిపాణికీ ఉంటాయి. అందుచేతనే ఆహారనిద్రా మైధునాలు అన్ని జీవులకు సామాన్యము అని చెప్పబడుతోంది. ఈ రకంగా దశేంద్రియాల తత్త్వాలు శ్రీచక్రంలో ఉన్నాయి కాబట్టి శ్రీచక్రం చరాచరజగత్తులోని జీవరాశి కంతటికీ ప్రతీక. అయితే ఈ జీవరాశిలో మానవుడున్నాడా ? అన్నదే ప్రశ్న. మిగిలిన జీవరాశికి లేనిది, మానవుడికి ఉన్నది ఒక్కటే. అదే మనస్సు. సంకల్పవికల్పాలకు కారణమైంది మనస్సు. దీనికారణంగానే మానవుడికి యుక్తాయుక్తవిచక్షణాజ్ఞానం కలుగుతోంది. ధర్మాధర్మాలను

విచారించగలుగుతున్నాడు. మరి ఆ మనస్సు యొక్క తత్త్వము కూడా శ్రీచక్రంలోనే ఉన్నది. కాబట్టి శ్రీచక్రము జగత్తులోని మానవాళికంతటికీ ప్రతీక. అందుచేతనే శ్రీచక్రానికి అంత గొప్పతనం ఉన్నది. శ్రీచక్రాన్ని గనక పూజించినట్లైతే చరాచరజగత్తునూ అర్చించినట్లే. విశ్వమానవాళినంతటినీ సేవించినట్లే. శ్రీచక్రపూజచెయ్యటమంటే తనను తాను గౌరవించుకోవటం తప్ప వేరుకాదు.

ఈ జగత్తుకు అధిపతి పరమేశ్వరుడు. పరమేశ్వరుడు ఎక్కడ ఉంటాడు ? అని అడిగితే – జగత్తులోని ప్రతి వస్తువునందు ఉంటాడు. చరాచరజగత్తంతా పరమేశ్వరమయం ఈ జగత్తే శ్రీచక్రం అయినప్పుడు మరి ఆ పరమేశ్వరి శ్రీచక్రంలోనే కదా నివశించేది. అందుచేతనే చక్రరాజము అనే రథాన్ని అధిరోహించింది పరమేశ్వరి.

ఇక మంత్రశాస్త్రంలోకి వెడితే ప్రపంచసార సంగ్రహంలో

**బిందుత్రికోణ కాష్టావతారయుగ లోకకోణవృత్తయుతమ్**
**వసుదళవృత్త కళాదళవృత్త త్రిమహీగృహం భజే చక్రమ్**

బిందువు, త్రికోణము, అష్టకోణము, పదికోణములుగల చక్రములు రెండు, పధ్నాలుగుకోణములుగల చక్రము. వృత్తము, అష్టదళము, వృత్తము, షోడశదళము, వృత్తము, భూగృహము అనే ఆవరణలున్నాయి.

**బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ**
**మన్వశ్రదళ సంయుత షోడశారమ్ ।**
**వృత్తత్రి భూపుర యుతం పరితశ్చతుర్ద్వాః**
**శ్రీచక్ర మేత దుదితం పరదేవతాయాః ॥**

ఈ రకంగా శ్రీచక్రంలో ఉండే ఆవరణలు అనేకచోట్ల చెప్పబడ్డాయి.

అయితే శ్రీచక్రంలో తొమ్మిది ఆవరణలున్నాయి. వాటన్నింటికీ కూడా విడివిడిగా పేర్లున్నాయి. రత్నాయరుషి వ్రాసిన ఆవరణ దేవతాస్తుతిలో వాటిని వివరించటం జరిగింది.

**త్రైలోక్యమోహనం వందే సర్వాశాపరిపూరకమ్**
**సర్వసంక్షోభణం చక్రం సర్వసౌభాగ్యదాయకమ్ ॥**
**సర్వార్థసాధకం చక్రం సర్వరక్షాకరం పరమ్**
**సర్వరోగహరం చక్రం సర్వసిద్ధిప్రదాయకమ్**
**సర్వానందమయం చక్రం ఇతి చక్రక్రమంభజే**

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రథమావరణ భూపురము | – | త్రైలోక్యమోహనచక్రము |
| 2. | ద్వితీయావరణ షోడశదళము | – | సర్వాశాపరిపూరకచక్రము |
| 3. | తృతీయావరణ అష్టదళము | – | సర్వసంక్షోభణచక్రము |
| 4. | చతుర్ధావరణ చతుర్దశారము | – | సర్వసౌభాగ్యదాయక చక్రము |
| 5. | పంచమావరణ బహిర్దశారము | – | సర్వార్ధసాధకచక్రము |
| 6. | షష్టావరణ అంతర్దశారము | – | సర్వరక్షాకరచక్రము |
| 7. | సప్తమావరణ అష్టకోణము | – | సర్వరోగహరచక్రము |
| 8. | అష్టమావరణ త్రికోణము | – | సర్వసిద్ధిప్రదచక్రము |
| 9. | నవమావరణ బిందువు | – | సర్వానందమయచక్రము |

ఈ రకంగా నవావరణలున్నాయి. వీటిలో వృత్తత్రయం మాత్రం లేదు అని గుర్తించాలి. ఏ సంప్రదాయంలోనూ కూడా వృత్తత్రయానికి పూజలేదు.

భండాసురుని యొక్క వేదవిద్యలకు విరుద్ధమైన చర్యలకు పరమేశ్వరి ఆచరించే దండనలే ప్రతి క్రియలు. అవి ప్రకృతులు, పరివారదేవతలు ఆవరణదేవతలు, ఆయుధదేవతలుగా చెప్పబడుతున్నారు.

శ్రీచక్రంలో ఉన్న తొమ్మిదిఆవరణలే, దేవికూర్చునే రథానికి పర్వములుగా ఉన్నాయి. ఈ ఆవరణలలో ఒక్కొక్క ఆవరణకు కొంతమంది దేవతలున్నారు. వారే ఆవరణ దేవతలు.

**1. మొదటి ఆవరణ :** ఇది భూపురము. త్రైలోక్యమోహనచక్రము. ఇందులో మూడు రేఖలున్నాయి. ఈ మూడు రేఖలు భూలోక భువర్లోక సువర్లోకాలకు ప్రతీక. ఈ ఆవరణలో ఉండే దేవతలవివరాలు.

ప్రథమరేఖలో అష్టసిద్ధులు ఉంటాయి.

| | | |
|---|---|---|
| 1. అణిమాసిద్ధి | 4. మహిమాసిద్ధి | 7. ప్రాకామ్యసిద్ధి |
| 2. లఘిమాసిద్ధి | 5. ఈశిత్వసిద్ధి | 8. ప్రాప్తిసిద్ధి |
| 3. గరిమాసిద్ధి | 6. వశిత్వసిద్ధి | 9. సర్వకామసిద్ధి. |

రెండవరేఖలో అష్టమాతృకలు ఉంటాయి.

| | | |
|---|---|---|
| 1. బ్రాహ్మి | 4. వైష్ణవీ | 7. చాముండా |
| 2. మాహేశ్వరి | 5. వారాహీ | 8. శ్రీమహాలక్ష్మి |
| 3. కౌమారీ | 6. మాహేంద్రి | |

మూడవరేఖలో ముద్రాశక్తులు ఉంటాయి.

| | | |
|---|---|---|
| 1. సర్వసంక్షోభిణీ | 4. సర్వవశంకరీ | 7. సర్వఖేచరీ |
| 2. సర్వవిద్రావిణీ | 5. సర్వోన్మాదినీ | 8. సర్వబీజా |
| 3. సర్వాకర్షిణీ | 6. సర్వమహాంకుశా | 9. సర్వయోనిః |

ఈ ఆవరణకు అధిదేవత 'త్రిపురా'. ఇక్కడ ఉండే యోగిని పేరుప్రకటయోగిని.

**2. రెండవ ఆవరణ :** ఇది షోడశదళపద్మము. అనగా 16 దళాలు ఉన్నటువంటి పద్మము. చంద్రకళాస్వరూపము. ఈ పదహారుదళాలలోను చంద్రుని యొక్క పదహారు కళలు ఉంటాయి. ఆ కళలన్నీ ఆకర్షణ దేవతల రూపంలో ఉంటాయి. అవి

| | | |
|---|---|---|
| 1. కామాకర్షిణి | 7. రసాకర్షిణి | 12. నామాకర్షిణి |
| 2. బుద్ధ్యాకర్షిణి | 8. గంధాకర్షిణి | 13. బీజాకర్షిణి |
| 3. అహంకారాకర్షిణి | 9. చిత్తాకర్షిణి | 14. ఆత్మాకర్షిణి |
| 4. శబ్దాకర్షిణి | | |
| 5. స్పర్శాకర్షిణి | 10. ధైర్యాకర్షిణి | 15. అమృతాకర్షిణి |
| 6. రూపాకర్షిణి | 11. స్మృత్యాకర్షిణి | 16. శరీరాకర్షిణి |

ఈ ఆవరణకు అధిదేవత త్రిపురేశి. ఇక్కడ ఉండే యోగిని పేరు గుప్తయోగిని.

**3. మూడవ ఆవరణ :** ఇది సర్వసంక్షోభణ చక్రము. 8 దళాలు గల పద్మము. అష్టమూర్త్యాత్మకము. దీని ఎనిమిది దళాలలోను విడివిడిగా ఉండే దేవతలు.

| | | |
|---|---|---|
| 1. అనంగకుసుమా | 4. అనంగమదనాతురా | 7. అనంగాంకుశా |
| 2. అనంగమేఖలా | 5. అనంగరేఖా | 8. అనంగమాలినీ |
| 3. అనంగమదనా | 6. అనంగవేగినీ | |

ఈ ఆవరణకు అధిదేవత త్రిపురసుందరి. ఇక్కడ ఉండే యోగిని పేరు గుప్తతరయోగిని.

**4. నాల్గవ ఆవరణ :** ఇది సర్వసౌభాగ్యదాయకచక్రము. చతుర్దశారము. అంటే 14 కోణాలుగల పద్మము ఇందులోని 14 కోణాలు 14 లోకాలకు ప్రతీక. ఇక ఇక్కడ ఉండే దేవతల వివరాలు.

| | | |
|---|---|---|
| 1. సర్వ సంక్షోభిణీ | 3. సర్వాకర్షిణీ | 5. సర్వసమ్మోహినీ |
| 2. సర్వవిద్రావిణీ | 4. సర్వాహ్లాదినీ | 6. సర్వస్తంభినీ |

| | | |
|---|---|---|
| 7. సర్వజృంభిణీ | 10. సర్వోన్మాదినీ | 13. సర్వమంత్రమయీ |
| 8. సర్వవశంకరీ | 11. సర్వార్థసాధినీ | 14. సర్వద్వంద్వక్షయంకరీ |
| 9. సర్వరంజనీ | 12. సర్వసంపత్తిపూరిణీ | |

ఈ ఆవరణకు అధిదేవత త్రిపురవాసిని. ఇక్కడ ఉండే యోగిని పేరు సంప్రదాయయోగిని.

**5. ఐదవ ఆవరణ :** ఇది సర్వార్థసాధక చక్రము. 10 కోణాలు గల పద్మము. దీన్ని బహిర్దశారము అంటారు. దీనిలోని పదికోణాలు విష్ణుమూర్తి యొక్క పది అవతారాలకు ప్రతీక. ఇందులో ఉండే దేవతలు.

| | | |
|---|---|---|
| 1. సర్వసిద్ధిప్రద | 5. సర్వకామప్రద | 9. సర్వాంగసుందరి |
| 2. సర్వసంపత్ప్రద | 6. సర్వదుఃఖవిమోచని | 10. సర్వసౌభాగ్యదాయిని |
| 3. సర్వప్రియంకరి | 7. సర్వమృత్యుప్రశమని | |
| 4. సర్వమంగళకారిణి | 8. సర్వవిఘ్ననివారిణి | |

ఈ ఆవరణకు అధిదేవత త్రిపురాశ్రీ. ఇక్కడ ఉండే యోగిని పేరు కుళోత్తీర్ణయోగిని.

**6. ఆరవ ఆవరణ :** ఇది సర్వరక్షాకరచక్రము. పదికోణములుగల పద్మము. దీన్ని అంతర్దశారము అంటారు. ఇందులోని కోణాలు అగ్నికళలకు ప్రతీక. ఇక్కడ ఉండే దేవతలు.

| | | |
|---|---|---|
| 1. సర్వజ్ఞా | 5. సర్వవ్యాధివినాశిని | 9. సర్వరక్షాస్వరూపిణీ |
| 2. సర్వశక్తిః | 6. సర్వాధారస్వరూప | 10. సర్వేప్సితఫలప్రద |
| 3. సర్వైశ్వర్యప్రదాయిని | 7. సర్వపాపహరా | |
| 4. సర్వజ్ఞానమయి | 8. సర్వానందమయీ | |

ఈ ఆవరణకు అధిదేవత త్రిపురమాలిని. ఇక్కడ ఉండే యోగిని పేరు నిగర్భయోగిని.

**7. ఏడవ ఆవరణ :** ఇది సర్వరోగహరచక్రము. అష్టకోణము. దీని కోణాలలో అష్టవసువులు వాగ్దేవతలరూపంలో ఉంటారు.

| | | |
|---|---|---|
| 1. వశిని | 4. విమల | 7. సర్వేశ్వరి |
| 2. కామేశ్వరి | 5. అరుణ | 8. కౌళిని |
| 3. మోదిని | 6. జయ | |

ఈ ఆవరణకు అధిదేవత త్రిపురా సిద్ధాంబ. ఇక్కడ ఉండే యోగిని పేరు రహస్యయోగిని.

**8. ఎనిమిదవ ఆవరణ :** ఇది సర్వసిద్ధిప్రద చక్రము. త్రికోణము. త్రిగుణాత్మకము. ఇందులో కామేశ్వరి వజ్రేశ్వరి భగమాలిని అనే ముగ్గురు దేవతలు ఆయుధబీజసంయుతులై ఉంటారు.

ఇక్కడ త్రికోణము యొక్క మూడు కోణాలయందు.

1. త్రిమూర్తులు (బ్రహ్మ విష్ణువు రుద్రుడు)
2. త్రిశక్తులు (మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి)
3. సృష్టి స్థితి లయాలు
4. వామజ్యేష్ఠరౌద్రి
5. ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు
6. జ్ఞాత జ్ఞానము జ్ఞేయము
7. అ నుంచి స వరకు 48 అక్షరాలు

ఉంటాయి. అసలు సృష్టి అంతా ఇక్కడి నుంచే జరిగింది. ఈ ఆవరణకు అధిదేవత త్రిపురాంబ. ఇక్కడ ఉండే యోగిని పేరు అతి రహస్యయోగిని.

**9. తొమ్మిదవ ఆవరణ :** ఇది సర్వానందమయ చక్రము. బిందురూపము. అదే పరబ్రహ్మస్వరూపము. ఈ ఆవరణకు అధిదేవత మహాత్రిపురసుందరి. ఇక్కడ ఉండే యోగిని పేరు పరాపర రహస్యయోగిని.

ఈ రకంగా తొమ్మిది ఆవరణలు గల శ్రీచక్రంలోని సర్వానందమయచక్రంలో పరమేశ్వరి ఉన్నది.

శ్రీచక్రము మీద మరిన్ని వివరాలకు 996వ నామం చూడండి.

శ్రీచక్రము అంటే కేవలము పూజామందిరంలో ఉంచి పూజించే ఒక యంత్రం మాత్రమే కాదు. చరాచరజగత్తే శ్రీచక్రము అని లోగడ చెప్పాం. అది ఎలా అంటే శ్రీచక్రంలోని వివిధ ఆవరణలను భావనోపనిషత్తు వివరిస్తోంది.

1. మొదటి ఆవరణలోని మొదటిరేఖలో సాధకుని శరీరంలోని నవరసాలే ఇక్కడ సిద్ధిదేవతలు. నవరసాలు అంటే –

శృంగారరసము, హాస్యము, కరుణ, రౌద్రము, వీరము, భయము, భీభత్సము, అద్భుతము, శాంతము.

రెండవరేఖలో సాధకుని శరీరంలోని మనోవికారాలే ఇక్కడ అష్టమాత్రుకలు. మనోవికారాలంటే –

కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, పుణ్య పాపములు.

మూడవరేఖలో సాధకుని శరీరంలోని మూలాధారం నుండి ద్వాదశాంతం వరకు ఉండే స్థానాలే. ముద్రాశక్తులు. ఆ స్థానాలవివరాలు.

మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహతము, విశుద్ధచక్రము, లంబికాగ్రము, ఆజ్ఞాచక్రము, సహస్రారము, ద్వాదశాంతము.

2. రెండవ ఆవరణలో చంద్రకళలు అంటే జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, పంచభూతాలు.

3. మూడవ ఆవరణలో ఇక్కడ అష్టమూర్తులు అంటే సాధకుని శరీరంలోని ఇంద్రియధర్మాలు. అవి వచన, దాన, గమన, విసర్గ, సంభోగ, ప్రవృతి, నివృత్తి, ఉపేక్ష.

4. నాల్గవ ఆవరణలో చతుర్దశభువనాలు అంటే సాధకుని శరీరంలోని ముఖ్యమైన నాడులే అవి.

అలంబుసా, కుహూ, విశ్వోదరి, వరుణా, హస్తిజిహ్వా, యశస్విని, అశ్విని, గాంధారి, పూషా, శంఖినీ, సరస్వతీ, ఇడా, పింగళా, సుషుమ్నా.

5. ఐదవ ఆవరణలో సాధకుని శరీరంలోని ప్రధాన వాయువులు, ఉపవాయువులే దశావతారాలు. ఆ వాయువుల వివరాలు.

ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, నాగ, కూర్మ, కృకుర, దేవదత్త, ధనుంజయములు.

6. ఆరవ ఆవరణలోని అగ్నికళలు దశవాయువులగుణాలు. చతుర్విదాన్నములను పచనముచేయు శక్తులు. అవి

దశవిధవాయువులగుణాలు : రేచకము, పూరకము, శోషకము, దాహకము, ప్లావకము.

వివిధాన్నములు : భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యము, పేయము.

7. ఏడవ ఆవరణలోని అష్టవసువులు సాధకుని శరీరంలోగల లక్షణాలు అవి శీతము, ఉష్ణము, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, సత్వగుణము, రజోగుణము, తమోగుణము.

8. ఎనిమిదవ ఆవరణలోని త్రిశక్తులు పాడ్యమి నుంచి పూర్ణిమలేక అమావాస్య వరకుగల తిథులు.

9. తొమ్మిదవ ఆవరణలో కామేశ్వరీ కామేశ్వరులుంటారు. సాధకుని ఆత్మయే కామేశ్వరి. బుద్ధికామేశ్వరుడు. ఈ రెండూ ఒకటైతే సాదకుడు బ్రహ్మైక్యానుసంధానం పొందుతాడు. అదే జీవన్ముక్తి.

కాబట్టి చక్రరాజరధములోని తొమ్మిదవ పర్వములో ఆ పరమేశ్వరి ఉన్నది అని చెప్పాలి.

అసలు మానవశరీరమే శ్రీచక్రము. శ్రీచక్రంలోని వివిధ ఆవరణలు మానవదేహం లోని వివిధ భాగాలు.

**బైందవమ్ బ్రహ్మరంధ్రం చ । మస్తకం చ త్రికోణకమ్ ।**
**లలాటే ష్టారకంపత్రం । భృవోర్మధ్యే దశారకమ్**
**బహి ర్దశారం కంఠే తు । మన్వశ్రంహృదయం భవేత్**
**నాభౌ చ వసుపత్రం చ । కట్యాం షోడశపత్రకమ్**
**వృత్తత్రయం చ ఊరుభ్యాం । పద్భ్యాం భూపురత్రయమ్ ॥**

| | | |
|---|---|---|
| బిందువు | – | బ్రహ్మరంధ్రము |
| త్రికోణము | – | తలముందు భాగము |
| అష్టకోణము | – | లలాటము |
| అంతర్దశారము | – | భ్రూమధ్యము |
| బహిర్దశారము | – | కంఠము |
| చతుర్దశారము | – | హృదయము |
| అష్టదళము | – | నాభి |
| షోడశదళము | – | కటిప్రదేశము |
| వృత్తత్రయము | – | ఊరువులు |
| భూపురము | – | పాదాలు |

మానవదేహమనే శ్రీచక్రంలో మొదటి ఆవరణ అయిన పాదాల దగ్గరనుండి బయలుదేరి పైకి వెళ్ళగా బ్రహ్మరంధ్రమే బిందుస్థానము. అదే తొమ్మిదవ ఆవరణ.

ఆధారచక్రంలో నిద్రుస్తున్న కుండలినీ శక్తిని జాగృతంచేసి సహస్రారానికి చేర్చినట్లైతే, అజ్ఞాని అయిన సాధకుడికి భగవసాక్షాత్కారం కలుగుతుంది. కాగా జ్ఞానికి ఆత్మసాక్షాత్కారము కలుగుతుంది. అంటే పరబ్రహ్మస్వరూపమైన పరమేశ్వరి సాధకుని దేహమనే శ్రీచక్రంలోని తొమ్మిదవ ఆవరణ అయిన సర్వానందమయ చక్రమనే బ్రహ్మరంధ్రం దగ్గర ఉన్నది.

ఇప్పుడు అజ్ఞాని అయిన భండాసురునికి జ్ఞానాన్ని ప్రసాదించటానికి ఆ దేవి అతడితో యుద్ధానికి సమాయత్తమవుతున్నది. శ్రీచక్రరథమును సిద్ధిపొందినవాడు అనగా శ్రీవిద్యలో సిద్ధిపొందినవాడు ఆత్మసాక్షాత్కారం పొందుతాడు. అతడికి సాయుజ్యం లభిస్తుంది.

## 69. గేయచక్రరథారూఢమంత్రిణీపరిసేవితా

**మంత్రినాథ మహాచక్రే గీతిచక్రే రథోత్తమే**
**సప్తపర్వాణిచోక్తాని తత్రదేవ్యశ్చ తాః శృణు ॥**

గేయచక్రము అనే రథమెక్కి మంత్రి అయిన శ్యామలాదేవి పరమేశ్వరికి కుడివైపు నడుస్తున్నది. పరమేశ్వరికి మంత్రిణులు 16 మంది. వీరు వరుసగా

1. సంగీతయోగిని
2. శ్యామా
3. శ్యామలా
4. మంత్రనాయకా
5. మంత్రిణీ
6. సచివేశానీ
7. ప్రధానేశా
8. కుశప్రియా
9. వీణావతీ
10. వైణికీ
11. మంద్రిణీ
12. ప్రియకప్రియా
13. నీపప్రియా
14. కదంబవేశ్యా
15. కదంబవనవాసినీ
16. సదామలా

వీరిలో ముఖ్యమైనటువంటిది శ్యామల. ఈమెనే రాజాశ్యామల అంటారు. మంత్రశాస్త్రంలో రాజాశ్యామలకు ప్రత్యేక అనుష్టానమున్నది. **అస్యశ్రీ రాజమాతంగీశ్వరీ మహామంత్రస్య**

**భగవాన్ మతంగఋషిః । పంక్తిచ్ఛందః । రాజమాతంగేశ్వరీ దేవతా । ఐం బీజం। సౌః శక్తిః । క్లీం కీలకం । జపే వినియోగః**

**న్యాసము :**

ఐం హ్రీం శ్రీం ఐంక్లీం సౌః ఓం నమో భగవతి శ్రీ రాజమాతంగేశ్వరి
సర్వజన మనోహరిణి సర్వముఖరంజని
క్లీం హ్రీం శ్రీం సర్వ రాజవశంకరి సర్వస్త్రీ పురుష వశంకరి
సర్వ దుష్టమృగ వశంకరి సర్వ సత్త్వవశంకరి
సర్వలోకవశంకరి అభీష్టం మే సర్వజనం మే వశ మానయ స్వాహా
సౌః క్లీం ఐం శ్రీం హ్రీం ఐం ॥

**ధ్యానము :**

మాతంగీం మోహనాంగీం మధుమదముదితాం ఘూర్ణమానాక్షియుగ్మాం
విద్యుద్వక్త్రాం కదంబప్రసవ పరిలస ద్వేణికామాత్త వీణాం ।
బింబోష్ఠీం రక్తవస్త్రాం మృగమదతిలకా మిందురేఖావతంసాం
కర్ణోద్య చ్ఛంఖపత్రాం కఠినకుచభరాం నౌమి తాం శ్యామలాంబామ్ ॥

**మంత్రము :** ఐం హ్రీం శ్రీం ఐంక్లీంసౌః ఓం నమో భగవతి శ్రీ రాజమాతంగేశ్వరీ సర్వజన మనోహరిణి సర్వముఖరంజనీ క్లీంహ్రీం శ్రీం సర్వరాజ వశంకరి సర్వ స్త్రీపురుష వశంకరి సర్వదుష్ట మృగవశంకరి సర్వ సత్వవశంకరి సర్వలోక వశంకరి అభీష్టం మే సర్వజనం మే వశయానయ స్వాహా సౌః క్లీం ఐం శ్రీం హ్రీం ఐం ॥

మంత్రశాస్త్రంలో శ్యామలాదేవి ఉపాసనకు ఏడురకాలమంత్రాలు చెప్పబడ్డాయి. అవి.

1. రాజాశ్యామల
2. హసంతీశ్యామల
3. శుకశ్యామల
4. శారికాశ్యామల
5. వీణాశ్యామల
6. వేణుశ్యామల
7. లఘుశ్యామల

మంత్రిశ్యామలాదేవి అధిరోహించే రథానికి ఏడుపర్వాలు (ఆవరణలు) ఉంటాయి. ఈ ఏడు ఆవరణలకు క్రిందభాగంలో లక్ష్మి, సరస్వతి, శంఖనిధి, పద్మనిధి ఉంటాయి. వీరిపైన గణపతి, క్షేత్రపాలకుడు, దుర్గాదేవి, వటుక దేవతలు ఆయుధాలు ధరించి ఉంటారు. రథము యొక్క ఏడు ఆవరణలలోను వివిధరకాల దేవతలుంటారు.

**1. ప్రధమావరణ :** దీనిలో మాతంగీ, సిద్ధలక్ష్మి, మహామాతంగికా, మహతీ అనే దేవతలు రక్తవర్ణంతో మెరుస్తూ ధనుర్ధారులై ఉంటారు.

**2. ద్వితీయావరణ :** ఈ ఆవరణలో ఎనిమిదిమంది భైరవులుంటారు. వారిని అష్టభైరవులంటారు. వారు :

| | |
|---|---|
| 1. అసితాంగభైరవ | 5. కపాలభైరవ |
| 2. రురుభైరవ | 6. భీషణభైరవ |
| 3. చండభైరవ | 7. కంకాళ భైరవ |
| 4. క్రోధోన్మత్తభైరవ | 8. సంహారభైరవ |

**3. తృతీయావరణ :** ఈ ఆవరణలో ఎర్రని వర్ణముతో ప్రకాశిస్తూ 16 శక్తులు ఉంటాయి. అవి :

| | | | |
|---|---|---|---|
| 1. వామ | 5. శ్రద్ధా | 9. తుష్టి | 13. వీచీ |
| 2. జ్యేష్ఠ | 6. సరస్వతీ | 10. మోహిని | 14. విద్యున్మాలినీ |
| 3. రౌద్రి | 7. క్రియాశక్తి | 11. పుష్టి | 15. సురానందా |
| 4. శాంతి | 8. లక్ష్మి | 12. ప్రమధనుశ్యాపినీ | 16. నాగబద్ధికా. |

**4. చతుర్థావరణ :** ఈ ఆవరణలో మొత్తం 16 శక్తులుంటాయి.

| | | | |
|---|---|---|---|
| 1. బ్రాహ్మి | 3. కౌమారి | 5. వారాహి | 7. చాముండా |
| 2. మాహేశ్వరి | 4. వైష్ణవి | 6. మాహేంద్రి | 8. శ్రీమహాలక్ష్మి |

వీరికి కొంచెం క్రిందుగా

| | | | |
|---|---|---|---|
| 1. లక్ష్మి | 3. రతి | 5. కీర్తి | 7. తుష్టి |
| 2. సరస్వతి | 4. ప్రీతి | 6. శాంతి | 8. పుష్టి |

**5. పంచమావరణ :** ఈ ఆవరణలో పంచబాణాలుంటాయి. అవి శక్తిరూపాలు ధరించి ఉంటాయి. అవి.

| | | |
|---|---|---|
| 1. ద్రావిణి | 3. ఉన్మాదినీ | 5. మోహినీ |
| 2. బంధినీ | 4. శోషిణీ | |

**6. షష్టావరణము :** ఇక్కడ నల్లని దేహాలతో చీకటిలాగా ఉండే మూడుశక్తులుంటాయి. అవి.

1. రతి    2. ప్రీతి    3. మనోజయ

**7. సప్తమావరణ :** ఇక్కడ పరమేశ్వరికి మంత్రి అయిన శ్యామలాదేవి ఉంటుంది. ఇక్కడ ఉండే దేవతలందరి చేతులయందు వివిధరకాలయిన ఆయుధాలుంటాయి.

| | | |
|---|---|---|
| 1. వజ్రము | 5. పాశము | 9. దర్భాస్త్రము |
| 2. శక్తి | 6. ధ్వజము | 10. చక్రము |
| 3. కాలదండము | 7. గద | |
| 4. ఖడ్గము | 8. త్రిశూలము | |

శ్రీచక్రంలోని త్రికోణమే గేయచక్రరథము. త్రికోణానికి అధిష్ఠానదేవత అయిన త్రిపురాంబయే పరమేశ్వరికి మంత్రి అయిన రాజాశ్యామల. ఈమె పేరున శతాక్షరీవిద్య అనే మంత్రం కూడా ఒకటున్నది.

గేయచక్రము అంటే సూర్యమండలము. సూర్యలోకాన్ని పొందిన యోగినులు దేవిని ధ్యానించి పరలోకం చేరతారు. ఈ రకంగా సూర్యమండలం చేరిన యోగినులచే సేవించబడునది ఆ పరమేశ్వరి.

మంత్రశాస్త్రంలో రాజాశ్యామలనే రాజమాతంగేశ్వరి అని కూడా అంటారు.

## 70. కిరిచక్రరథారూఢదండనాథాపురస్కృతా

**కిరిర్వరాహః** కిరి అంటే పంది, వరాహము. ఈ రథము వరాహరూపంలో ఉంటుంది. వరాహములచే లాగబడుతుంది. దీనిని అధిష్ఠించిన దేవత వారాహి. ఈమె చేతిలో దండము ఉంటుంది. అందుచేత ఈమె దండనాయికా అని పిలువబడుతుంది. పరమేశ్వరికి వారాహిసేనాని. కిరిచక్రము అనే రథాన్ని ఎక్కి పరమేశ్వరికి ముందు భాగాన ఎడమవైపు నడుస్తుంటుంది. ఈ రథానికి ఐదు ఆవరణలు, పర్వాలు లేక అంతస్థులు ఉన్నాయి.

**కిరిచక్రరథేంద్రస్య పంచపర్వసమాశ్రయాః**
**దేవతాశ్చ శృణుప్రాజ్ఞ నామాని శృణుత్వాంజయః**

కిరి చక్రరథానికి ఐదు పర్వాలు ఉంటాయి. దీనికి దేవత ప్రాజ్ఞ. గతంలో లాగానే ఇక్కడ కూడా వివిధ ఆవరణలలోను వివిధ దేవతలుంటారు.

**1. మొదటి ఆవరణ :** ఈ ఆవరణలో వార్తావళి మొదలైన దేవతలు తమతమ ఆయుధాలు ధరించి ఉంటారు.

**2. రెండవ ఆవరణ :** ఈ ఆవరణలో పరమేశ్వరితో సమానమైన శక్తిగల దేవతలు రెండు వరుసలలో ఉంటారు. మొదటి వరుసలో

1. బ్రాహ్మి 3. కౌమారి 5. మాహేంద్రి
2. మాహేశ్వరి 4. వైష్ణవి 6. చాముండ

రెండవవరుసలో

1. యాకినీ 3. లాకినీ 5. శాకినీ
2. రాకినీ 4. కాకినీ 6. హాకినీ

**3. మూడవ ఆవరణ :** ఈ ఆవరణలో భయంకరమైన శక్తులుంటాయి. వీరి అట్టహాసం మాత్రంచేతనే భూనభోంతరాళాలు దద్దరిల్లిపోతాయి. ఆ శక్తులు

1. అంధినీ 3. జృంభిణీ 5. స్తంభినీ
2. బంధినీ 4. మోహిని

**4. నాల్గవ ఆవరణ :** ఈ ఆవరణలో మొసలము, హలము మొదలైన ఆయుధాలను ధరించి 1. జంభినీ, 2. మోహిని 3. స్తంభినీ అనే శక్తులు ఉంటాయి.

**5. ఐదవ ఆవరణ :** ఈ ఆవరణలో నల్లగా కారుమేఘంలాగా మెరుస్తూ, పందికోరల వంటి కోరలు గలిగి దండినీ అని పిలువబడే వారాహీదేవత ఉంటుంది. పరమేశ్వరి సేనాలు మొత్తం 12 మంది వారు.

1. పంచమి 5. సమయసంకేతా 9. వార్తాళీ
2. దండనాథా 6. వారాహీ 10. మహాసేనాని
3. సంకేతా 7. పోత్రిణీ 11. ఆజ్ఞా చక్రేశ్వరీ
4. సమయేశ్వరీ 8. శివా 12. అలిందినీ

వీరిలో ముఖ్యరాలు వారాహి. ఆమె ప్రధానసేనాని.

మంత్రశాస్త్రంలో వారాహీ దేవత ఉపాసన ఉన్నది. ఇక్కడ

1. బృహద్వారాహి 3. స్వప్నవారాహి 5. కిరాతవారాహి
2. లఘువారాహి 4. ధూమ్రవారాహి

వీటన్నింటికీ ఋషి, చందస్సుకూడా వేరువేరుగానే ఉంటాయి.

**అస్యశ్రీ బృహద్వారాహీ మహామంత్రస్య । బ్రహ్మ ఋషిః । గాయత్రీచ్ఛందః । శ్రీ బృహద్వారాహీ దేవతా । గ్లౌం బీజం । ఐం శక్తిః । ఠః ఠః ఠః ఠః కీలకం । జపేవినియోగః**

**న్యాసము** : ఐం గ్లౌం ఐం ఓం నమోభగవతి వార్తాళి వార్తాళి
వారాహి వారాహి
వరాహముఖి వరాహముఖి
అంధే అంధినీ నమః ।
రుంధే రుంధినీ నమః ।
జంభే జంభినీ నమః ।

**ధ్యానము** :

రక్తాంబుజే ప్రేతవరాసనస్థాం మర్ధోరుకామార్భటి కాసనస్థాం ।
దంష్ట్రోల్లస త్పోత్రి ముఖారవిందాం కోటీరసంఛిన్న హిమాంశురేఖాం ॥
హలంకపాలం దధతీంకరాభ్యాం వామేతరాభ్యాం ముసలేష్టదౌ చ ।
రక్తాంబరాం రక్తపటోత్తరీయాం ప్రవాళకర్ణాభరణాం త్రినేత్రాం ।
శ్యామాం సమస్తాభరణ స్రగాఢ్యాం వారాహి సంజ్ఞాం ప్రణతోఽస్మి నిత్యం ॥

**మంత్రము** : ఐం గ్లౌం ఐం ఓం నమోభగవతి వార్తాళి వార్తాళి వారాహి వారాహి వరాహముఖి వరాహముఖి ఐం గ్లౌం ఐం అంధే అంధినీ నమః । రుంధే రుంధినీ నమః । జంభే జంభినీ నమః । మోహే మోహినీ నమః । స్తంభే స్తంభినీ నమః । ఐం గ్లౌం ఐం సర్వదుష్ట ప్రదుష్టానాం సర్వేషాం సర్వవాక్చిత్త చక్షుర్ముఖ గతిజిహ్వా స్తంభనం కురుకురు శ్రీఘ్రం వశ్యం కురుకురు ఐం గ్లౌం ఐం ఠః ఠః ఠః ఠః హుం ఫట్ స్వాహా ॥

## 71. జ్వాలామాలినికాక్షిప్తవహ్నిప్రాకారమధ్యగా

జ్వాలామాలిని అనుదేవత చేత వెలిగించబడిన వహ్ని ప్రాకారము మధ్యన ఆ పరమేశ్వరి. వెలుగొందుచున్నది అసలు ఈ జ్వాలామాలిని ఎవరు ? తిథులు నిత్యాస్వరూపాలు. నిత్యలు కళాస్వరూపాలు. కాబట్టి తిథులు, నిత్యలు, కళలు అన్నీ ఒకటిగానే పరిగణించవచ్చు. చంద్రుని కళలు 16. ఇవి 15 తిథుల రూపంలో ఉండగా 16వ కళ మహాత్రిపురసుందరి సాక్షాత్తూ సచ్చిదానందస్వరూపమై ఉన్నది.

**దర్శాద్యాః పూర్ణిమాంత స్తు కళా పంచదశైవ తు ।**
**షోడశీ తు కలా జ్ఞేయా సచ్చిదానందరూపిణీ ॥**

ధర్మ అంటే పాడ్యమి వరకు తిథులు (కళలు) 15 కాగా 16వ కళ సాక్షాత్తూ సచ్చిదానందస్వరూపిణి అయి ఉన్నది.

నిత్యాదేవతలు మొత్తం 16మంది వీరిని వామకేశ్వర తంత్రంలోని ఖడ్గమాలలో వివరించటం జరిగింది. ఈ నిత్యాదేవతే చంద్రుని కళలు. అయితే తిథులు మాత్రం 15 ఉన్నాయి. అందుకే పదహారవకళ సాక్షాత్తూ పరమేశ్వరి అయి ఉన్నది అని చెప్పటం జరిగింది. తిథులలో 14వది చతుర్దశి. ఆరోజున ఉండే నిత్యాదేవత జ్వాలామాలిని. వాటి వివరాలు ఇలా ఉంటాయి.

| **శుక్లపక్ష తిథులు** | **నిత్యాదేవతల పేర్లు** |
|---|---|
| పాడ్యమి | కామేశ్వరి |
| విదియ | భగమాలిని |
| తదియ | నిత్యక్లిన్న |
| చవితి | భేరుండ |
| పంచమి | వహ్నివాసిని |
| షష్టి | మహావజ్రేశ్వరి |
| సప్తమి | శివదూతి |
| అష్టమి | త్వరిత |
| నవమి | కులసుందరి |
| దశమి | నిత్య |
| ఏకాదశి | నీలపతాక |
| ద్వాదశి | విజయ |
| త్రయోదశి | సర్వమంగళ |
| చతుర్దశి | జ్వాలామాలిని |
| పూర్ణిమ | చిత్ర |

16వ నిత్యమహానిత్య. ఈమె మహాత్రిపురసుందరి. ఇప్పుడు ఈ నిత్యాదేవతలలో 14వది. అంటే శుద్ధచతుర్దశినాడు ఉండే నిత్య. జ్వాలామాలిని ఈవిడ అగ్నిదేవుని కుమార్తె. శుద్ధ చతుర్దశినాడు, బహుళవిదియనాడు కూడా ఈమె ఉంటుంది. ఈ విషయాన్ని 15 నామంలో వివరించటం జరిగింది.

భండాసురునితో యుద్ధం జరుగుతున్నది. పోరు భీకరంగా సాగుతోంది. అప్పుడు పరమేశ్వరి జ్వాలామాలినిని చూసి

**వత్సే ! త్వం వహ్నిరూపాసి జ్వాలామాలా మయాకృతిః**
**త్వయా విధీయతాం రక్షా బలస్యాస్య మహీయసీ**
**శతయోజనవిస్తారం పరివృతమహీతలం**
**త్రి శద్యోజన మున్నమ్ర జ్వాలాప్రాకార తాం వ్రజ ॥**

బిడ్డా ! నీవు అగ్నిదేవుని కుమార్తెవు. కాబట్టి ఈ మహాసైన్యాన్ని రక్షించటానికి వందయోజనాల వైశాల్యము, ముప్ఫైయోజనాల ఎత్తు కల అగ్నిజ్వాలను సృష్టించవలసినది. అని పరమేశ్వరి ఆజ్ఞాపించగా, జ్వాలామాలిని అలాగే చేసింది. ఈ రకంగా జ్వాలామాలినిచేత సృష్టించబడిన అగ్నివలయంలో మధ్యభాగాన ఆ పరమేశ్వరి ఉన్నది.

**త ఛ్ఛక్తిపంచకం సృష్ట్వా లయేనాగ్ని చతుష్టయం**
**పంచశక్తి చతుర్వహ్ని సంయోగా ఛ్చక్రసంభవః ॥**

శక్తి సంజ్ఞగల ఐదుచక్రాలు, అగ్ని సంజ్ఞగల నాలుగుచక్రాలు కలిపి శ్రీచక్రము అవుతుంది. వీటి కలయికవల్లనే త్రికోణం ఏర్పడింది. అదే వహ్నిప్రాకారము. త్రికోణం మధ్యనే బిందు ఉంటుంది. త్రికోణే బైందవమ్శ్లిష్టమ్ వహ్ని ప్రాకారానికి లోపల ఉన్నది అంతరావరణ అని, మిగిలినవి బహిరావరణ అని అంటారు. బహిరావరణములో అష్టకోణము, దశారయుగ్మము, మన్వస్రము, అష్టదళము, షోడశదళము, భూపురము ఉంటాయి. అయితే బహిరావరణలోనిసేన భండాసురుని సేనను నాశనం చెయ్యటానికి, అంతరావరణలోని సేన భండాసురుణ్ణి సంహరించటానికి ఏర్పాటుచెయ్యబడ్డాయి.

జ్ఞాని అయినవాడు ఈ ప్రపంచంలోనే నివసిస్తున్నప్పటికీ, అజ్ఞానానికి దూరంగా, జ్ఞానజ్వాలలకు మధ్యన ప్రకాశిస్తూ ఉంటాడు. అగ్ని నుండి విస్ఫులింగాలు వేరుగా ప్రసరిస్తాయి. వాటికి దూరంగా తనకుతానుగానే ప్రకాశించే అగ్నిలాగా జ్ఞానికూడా ప్రపంచంలో జీవిస్తూ కూడా ప్రపంచ వ్యవహారాలను పట్టించుకోకుండా తామరాకు మీది నీటిబొట్టులాగా ఉంటాడు.

మంత్రశాస్త్రంలో జ్వాలామాలినికి ప్రత్యేక మంత్రమున్నది.

**అస్యశ్రీ జ్వాలామాలిని నిత్యామహా మంత్రస్య । కశ్యప ఋషిః । గాయత్రీఛ్ఛందః శ్రీ జ్వాలామాలినీ నిత్యాదేవతా। రం బీజం। ఫట్ శక్తిః। హుంకీలకం । జపే వినియోగః**

న్యాసము : 1. ఓం నమోభగవతి జ్వాలామాలిని 4. జ్వలంతి జ్వలజ్వల
2. దేవివేవి సర్వభూత సంహారకారికే 5. ప్రజ్వల ప్రజ్వల హూం హూం
3. జాతవేదసి 6. రం రం హుం ఫట్

ధ్యానము : అగ్ని జ్వాలా సమాభాక్షీం నీలవక్త్రాం చతుర్భుజాం
నీలనీరద సంకాశాం నీలకేశీం తనూదరీం
ఖడ్గం త్రిశూలం బిభ్రాణీం వరా నభయ మేవ చ
సింహ పృష్ట సమారూఢాం ధ్యాయే జ్జ్వాలాద్యమాలినీం ॥

మంత్రము : ఓం నమోభగవతి జ్వాలామాలినీ దేవి దేవి సర్వభూత సంహారకారికే జాతవేదసి జ్వలంతి జ్వలజ్వల ప్రజ్వల ప్రజ్వల హూం హూం రంరం హుం ఫట్ ॥

## 72. భండసైన్యవధోద్యుక్తశక్తివిక్రమహర్షితా

భండాసురునితో యుద్ధం ప్రారంభమైంది. ఆ రాక్షససేనను వధించటానికి పరమేశ్వరిసేన ముందుకు కదిలింది. ఆ రకంగా రాక్షససేనను సంహరించటానికి ముందుకు కదిలిన దేవతాసైన్యాన్ని చూసి పరమేశ్వరి సంతసించింది. ఇక్కడ యుద్ధము రెండు భాగాలుగా జరుగుతోంది. 1. భండాసురవధ. 2. అతడి సేనను వధించటము. ఆ రాక్షసుని సేనను వధించటానికి 64కోట్ల దేవతాసైన్యం ముందుకు కదలింది.

భండాసురుడు అజ్ఞాని. జీవి వేరు, దేవుడు వేరు అని భావించేవాడు. అహంకార మమకారాలతో నిండి ఉన్నవాడు. ఈ శరీరమే నేను. అనగా నేను అంటే శరీరమేగాని ఆత్మకాదు అని భావించేవాడు. కంటికి కనిపించే ఈ జగత్తే శాశ్వతము. అని నమ్మేవాడు. అన్నీ తన అధీనంలోనే ఉన్నాయి. అని పూర్తిగా విశ్వసించేవాడు. ఇతడి సేన చాలా ఎక్కువగా ఉంటుంది. ముందుగా అరిషడ్వర్గాలను నాశనం చెయ్యాలి. ద్వైదీభావానికి కారణము మనస్సు. అందుకని ముందుగా మనసుకు ఉండే బాహ్యావృత్తులను నశింపచెయ్యాలి. దృష్టిని అంతర్ముఖము చెయ్యాలి. అప్పుడు అతడి అజ్ఞానము పటా పంచలయిపోయి స్వస్వరూపజ్ఞానము కలుగుతుంది. అంటే ఆత్మసాక్షాత్కారమవుతుంది. అప్పుడు జ్ఞాని ముక్తుడవుతాడు. ఈ పని చెయ్యటం కోసమని అద్వైతశక్తులు ముందుకు కదలినాయి. అలాకదలిన ఆ శక్తులను చూసి పరమేశ్వరి సంతసించింది.

## 73. నిత్యాపరాక్రమాటోపనిరీక్షణసముత్సుకా

దేవదానవయుద్ధంలో నిత్యాదేవతల యొక్క పరాక్రమాన్ని చూసి పరమేశ్వరి సంతసించింది. నిత్యాదేవతలు 16మంది. వీరినే షోడశనిత్యలు అంటారు. వీరిని గురించి 15వ నామంలో చెప్పటం జరిగింది. లలితోపాఖ్యానంలో ఈ నిత్యాదేవతల గురించి వివరిస్తూ

**పునఃస్వహృదయాకాశా త్సృష్ట్వామార్తాండభైరవమ్ ।**
**తస్య బింబా త్సమాకృష్టం తిథిచక్రం మహోదయమ్ ॥**

**తతః షోడశ సంఖ్యాతాః సర్వాదీప్తాః సముద్గతాః ।**
**తేభ్య శ్చాభ్యుత్గతా నిత్యాః కామేశీప్రముఖామునౌ ॥**

**తాశ్చ దేవీ సమాకారదేవ్యా ఏవాంశ మాశ్రితాః ।**
**తిథినిత్యా స్సమాఖ్యాతా స్తత్ర త్తిథ్యభిమానికాః ॥**

**సర్వానందమయాఖ్యస్యపరితోదళ పంచ చ ।**
**స్థానాన్యాశ్రిత్య వర్తన్తే రథమధ్యయపర్వణి ॥**

పరమేశ్వరి హృదయము నుండి మార్తాండ భైరవుడు, వాని నుండి 16 మంది కాంతివంతమైన కామేశీ మొదలైన షోడశనిత్యలు ఆ పరమేశ్వరితో సమానమైన రూపలావణ్యములు, పరాక్రమము గలవారు ఉద్భవించారు. ఈ షోడశనిత్యలు శ్రీచక్రములో సర్వానందమయమని చెప్పబడే బిందుచక్రము చుట్టూ ఆవరించి ఉంటాయి.

ఈ 16 నిత్యలూ శుక్లపక్షపాద్యమి మొదలు పౌర్ణిమి వరకు గల తిథులరూపంలోను, కృష్ణపక్ష పాద్యమి మొదలు అమావాస్య వరకు గల తిథుల రూపంలోను ఉంటాయి. వీటిలో కామేశ్వరి మొదలు చిత్రవరకు తిథులరూపాలు కాగా 16వ నిత్య మహా త్రిపురసుందరి. నిత్యలు చంద్రకళాస్వరూపాలు. నిత్యాదేవతలు 16. చంద్రకళలు 16.

| వ. నెం. | నిత్యాదేవతలు | చంద్రకళలు | తిథులు |
|---|---|---|---|
| 1. | కామేశ్వరి | అమృతా | పాద్యమి |
| 2. | భగమాలిని | మానదా | విదియ |
| 3. | నిత్యక్లిన్న | పూషా | తదియ |
| 4. | భేరుండా | తుష్టి | చవితి |

| వ. నెం. | నిత్యాదేవతలు | చంద్రకళలు | తిథులు |
|---|---|---|---|
| 5. | వహ్నివాసిని | పుష్టి | పంచమి |
| 6. | మహావజ్రేశ్వరి | రతి | షష్ఠి |
| 7. | శివదూతి | ధృతి | సప్తమి |
| 8. | త్వరిత | శశిని | అష్టమి |
| 9. | కులసుందరి | చంద్రికా | నవమి |
| 10. | నిత్య | కాంతా | దశమి |
| 11. | నీలపతాక | జ్యోత్స్న | ఏకాదశి |
| 12. | విజయ | శ్రీ | ద్వాదశి |
| 13. | సర్వమంగళ | ప్రీతి | త్రయోదశి |
| 14. | జ్వాలామాలిని | అంగదా | చతుర్దశి |
| 15. | చిత్ర | పూర్ణా | పూర్ణిమ |
| 16. | మహానిత్య | పూర్ణామృతా | |

కామకలావిలాసంలోని నిత్యాప్రకరణము ఈవిధంగా చెబుతోంది.

**నిత్యాస్తిద్యాకారాస్తిథయ శ్శివశక్తి సమరసాకారాః**

**దివస నిశామయ్యాస్తా శ్రీవర్ణాస్తేఽ పి త ద్వయీరూపాః ॥**

కామేశ్వరి మొదలయిన 15 నిత్యలు తిథులరూపంలో ఉన్నాయి. ఆ తిథులు పగలు రాత్రిరూపాలలో ప్రకాశ విమర్శాంశలుగా పంచదశీ మహామంత్రంలో బీజాలయి శక్తులరూపంలో ఉన్నాయి. సూర్యుని యొక్క సహాయంతోనే చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. పూర్ణిమరోజున 15 కళలు చంద్రునిలోనే ఉంటాయి. ఆ మరుసటిరోజునుంచి ఒక్కొక్కకళ చొప్పున చంద్రుని విడిచిసూర్యునిచేరుతుంది. ఈ విధంగా అమావాస్య వచ్చేటప్పటికి చంద్రకళలన్నీ చంద్రుని నుంచి వెళ్ళిపోతాయి. అప్పుడు చంద్రుడు కాంతి హీనుడవుతాడు. అమావాస్య వెళ్ళిన మరునాడు సూర్యుని నుంచి ఒక కళ వచ్చి చంద్రుని చేరుతుంది. ఈ రకంగా రోజుకు ఒకటి చొప్పున పౌర్ణిమి వచ్చేసరికి 15కళలు చంద్రుని చేరతాయి. ఈ రకంగా శ్లుక కృష్ణపక్షాలు ఏర్పడతాయి. దీనినుంచే కాలమానము ఏర్పడుతుంది. ఈ నిత్యాదేవతల రూపాలు, ధ్యానశ్లోకాలు నేను వ్రాసిన శ్రీవిద్యాదర్పణమునందు ఇవ్వబడినాయి.

నిత్యాదేవతల అర్చనలోకూడా సంప్రదాయ భేదాలున్నాయి. 1. ప్రతిరోజూ అన్ని నిత్యలను పూజించటము. 2. ప్రతిరోజూ ఆ రోజున ఉన్నటువంటి తిథినిత్యను మాత్రమే పూజిస్తూ మహానిత్యను తప్పనిసరిగా పూజించటము. అంతేకాకుండా నిత్యాదేవతలందరికీ విడివిడిగా షోడశోపచార పూజ చెయ్యాలి అని చెప్పబడుతోంది. ఈవిధంగా సంప్రదాయభేదాలున్నప్పుడు గురుసంప్రదాయాన్ని మాత్రమే పాటించాలనేది ఆర్యోక్తి.

నిత్యాదేవతలు త్రిభుజాకారంలో ఆవరణగా ఉంటారని, అదే శ్రీచక్రంలోని ఎనిమిదవ ఆవరణ అని చెప్పబడుతోంది. అయితే వామకేశ్వరతంత్రంలో

**చతురస్రాంతరాళే వా త్రికోణే వా యజౌత్సుధీః**

చతురస్రానికి అవతల త్రికోణంలోనే షోడశనిత్యలుంటాయి. అని చెప్పబడింది. తంత్రరాజంలో

**బిందావేవ నిత్యానాం యజనముక్తమ్**

శ్రీచక్రమందలి బిందువునందే నిత్యాదేవతలనుంచాలి. నిత్యాషోడశార్ణవతంత్రంలో

**మధ్యత్రికోణ రేఖాసు నిత్యాస్త్వన్యా స్ప్రపూజయేత్**
**షోడశీంతు తతో నిత్యాం మహాత్రిపురసుందరీం**
**తాసాం సమిష్టిరూపత్వాం బైందవే పరిచింతయేత్ ॥**

శ్రీచక్రంలోని త్రికోణాన్ని 16 చిన్న చిన్నకోణాలుగా విభజించి నిత్యాదేవతలనర్చించాలి.

శ్రీ విద్యావిలాసమనే గ్రంథంలో శ్రీచక్రంలోని త్రిభుజము యొక్క భుజముల వరుసలోనే 15 నిత్యలను అర్చించి 16వ నిత్యను బిందువునందు అర్చించాలి అని చెప్పబడింది. అయితే ఇంకొక సంప్రదాయంలో నిత్యాదేవతలనందరినీ బిందువునందే అర్చించాలని చెప్పబడింది. మంత్రరత్నాకరము అనే గ్రంథంలో బిందువు చుట్టూ ఒక త్రిభుజాన్ని నిర్మంచి వాటి భుజములయందు ఒక్కొక్క రేఖ మీద ఐదుచొప్పున 15 నిత్యలను పూజించాలి. 16వ నిత్యను బిందువునందు పూజించాలని చెప్పబడింది. ఎక్కువగా ఈ పద్ధతే వాడుకలో ఉన్నది.

దేవాసుర సంగ్రామం జరుగుతున్నది. రాత్రిపూటకూడా యుద్ధం కొనసాగుతోంది. రాత్రిపూట చీకట్లో దేవతాసైన్యము అసురసేనావాహినిని వెనకవైపునుంచి కూడా చుట్టుముట్టింది. అంటే భండాసురుని సైన్యం చక్రదిగ్బంధమయింది. దేవదానవులకు

భీకరంగా పోరు జరుగుతోంది. చిమ్మచీకటి. నిత్యాదేవతలలో జ్వాలామాలిని, వహ్నివాసిని అనబడే ఇద్దరు అగ్నిస్వరూపులు. అందుచేత వారు వెదజల్లినకాంతిలో శక్తిసైన్యము భండాసురునిసేనానులను సంహరించింది. భండాసురుని సేనానులు 15 మంది. వారు

| | | |
|---|---|---|
| 1. దమనక | 6. కల్లివాహన | 11. జంబుకాక్ష |
| 2. దీర్ఘజిహ్వ | 7. ధుక్లస | 12. కుంభగ |
| 3. హబక | 8. పుత్రకేతు | 13. తీక్షశృంగ |
| 4. హలుమల్ల | 9. చంద్రబాహు | 14. త్రికంటక |
| 5. కక్లస | 10. కుక్కుర | 15. చంద్రగుప్త |

భండాసురుని సేనలను సంహరించిన నిత్యాదేవతల పరాక్రమానికి పరమేశ్వరి సంతసించింది.

నిత్య అంటే అనాది సిద్ధమైన ఆత్మశక్తి. ఆత్మశక్తుల విజృంభణ చూడగా చూడగా ఆనందమవుతుంది. ఆత్మశక్తి అనేది ఒకసారి హృదయంలో పుట్టినట్లైతే అది వృద్ధిపొందుతుంది. అంతేకాని నశించదు. కాబట్టి జీవికి ఆత్మజ్ఞానశక్తి మీద ఉత్సాహం కావాలి. జ్ఞానబీజం హృదయంలో ఒకసారి గనక మొలకెత్తితే అది దినదినాభివృద్ధి చెందుతుందేగాని నశించదు.

## 74. భండపుత్రవధోద్యుక్త బాలావిక్రమనందితా

పరమేశ్వరికి రెండువైపులా మంత్రిణి శ్యామలా, దండనాయిక వారాహి నడుస్తుండగా, అశ్వారూఢా సంపత్కరీ ముందు వెనుక ఉండగా భండాసురుని యొక్క ముప్పైమంది కుమారులు అమితసైన్యముతో వచ్చి ఒక్కసారిగా ముట్టడించారు. అప్పుడు పరమేశ్వరి కుమార్తె తొమ్మిది సంవత్సరములుగల బాలాకుమారి, ఆ రాక్షసులను ఎదిరించి యుద్ధం చెయ్యటానికి పరమేశ్వరి అనుమతిని ప్రార్థించింది. అప్పుడు పరమేశ్వరి తన రథమునుండి రథాన్ని, ఆయుధాలనుంచి ఆయుధాలను సృజించి కుమార్తె కిచ్చి ఆమెను ఆశీర్వదించింది. అంటే బాలాత్రిపురసుందరి కూడా పరమేశ్వరి యొక్క ప్రతిరూపమే. ఆమెతో సమానమైన శక్తియుక్తులు గలది. అప్పుడు బాలాత్రిపురసుందరి చండప్రచండంగా యుద్ధం చేసి అసురులనుదురుమాడి, భండాసురుని ముప్పైమంది కుమారులను సంహరించింది. ఆ దృశ్యం చూసిన పరమేశ్వరి చాలా సంతసించింది. భండాసురుని కుమారులు :

| | | |
|---|---|---|
| 1. చతుర్బాహువు | 11. విరాలకుడు | 21. ఉగ్రధన్వా |
| 2. చకోరాక్షుడు | 12. లశునుడు | 22. స్వర్గపీడుడు |
| 3. చతుశిరస్కుడు | 13. కుట్టిశేనుడు | 23. దుర్గుడు |
| 4. వజ్రఘోషుడు | 14. పురజిత్తు | 24. స్వర్గకంటకుడు |
| 5. ఊర్ధ్వకేసుడు | 15. పూర్యరనూకుడు | 25. అతిమాయుడు |
| 6. మహాకాయుడు | 16. సర్గశత్రువు | 26. బృహన్మాయుడు |
| 7. మహాహనువు | 17. ఇంద్రశత్రువు | 27. విభీషణుడు |
| 8. ముఖశత్రువు | 18. అమీత్రకుడు | 28. శ్రుతిపారగుడు |
| 9. ముఖస్కందుడు | 19. విద్యున్మాలి | 29. విదురుడు |
| 10. సింహఘోషుడు | 20. ఉగ్రకర్మ | 30. ఉపమాయువు |

పరమేశ్వరి పుత్రిక అయిన బాలాత్రిపురసుందరియే విమర్శశక్తి. ఆ శక్తి సమస్త బంధాలను నశింపచేస్తుంది. ఆత్మస్వరూపిణి అయిన పరమేశ్వరి ఆత్మానందంతో మాత్రమే సంతోషిస్తుంది. భవబంధాలు నశించినట్లైతే మాయ నశిస్తుంది. అప్పుడు ఆత్మానందం కలుగుతుంది. పరమేశ్వరి యొక్క బుద్ధి నుంచి శ్యామల హృదయం నుంచి బాల ఉద్భవించారు.

మంత్రశాస్త్రంలో బాలాత్రిపురసుందరికి ప్రత్యేకమైన ఉపాసన ఉన్నది.

**అస్యశ్రీ బాలాత్రిపురసుందరీ మహా మంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః । పంక్తిచ్ఛందః । శ్రీ బాలాత్రిపురసుందరీ దేవతా । ఐం బీజం । సౌః శక్తిః । క్లీం కీలకం । జపే వినియోగః ।**

**న్యాసము : ఐం । క్లీం । సౌః । సౌః । క్లీం । ఐం ॥**

**ధ్యానము : అరుణకిరణజాలై రంచితాశావకాశా**
**విధృతజపటీకా పుస్తకాభీతి హస్తా ॥**
**ఇతరవర కరాఢ్యాపుల్ల కల్హారసంస్థా**
**నివసతు హృది బాలా నిత్యకల్యాణశీలా ॥**

**మంత్రము : ఐం క్లీం సౌః సౌః క్లీం ఐం ॥**

సంకల్పమాత్రంచేతనే ఉద్భవించి రాక్షససంహారం చేసిన పరమేశ్వరి స్వరూపు రాలయిన బాలాత్రిపురసుందరి యొక్క పూజ, ఉపాసనలు సకల అభీష్టప్రదము.

శరన్నవరాత్రులలో అనగా దసరాపండుగలో కలశస్థాపనచేసి తొమ్మిదిరోజులు పరమేశ్వరిని అర్చిస్తారు. ఆ అర్చనావిధానంలో ప్రతిరోజూ హోమం చెయ్యాలి. హోమకుండాన్ని త్రికోణాకారంలో నిర్మించాలి. ప్రతిరోజూ త్రిసంధ్యలయందు నృత్యగీతవాద్యములతో దేవీపూజ చెయ్యాలి. పూజచేసే వ్యక్తి దీక్షవహించి నేలమీదనే పడుకోవాలి. అని చెబుతూ దేవీభాగవతంలో ప్రతిరోజూ క్రొత్తబట్టలు, నగలు ఇచ్చి కుమారీ పూజ చెయ్యాలి అని చెప్పబడింది. ఇందులో మొదటిరోజు రెండు సంవత్సరాల వయస్సు గల బాలిక నుంచి తొమ్మిదవ రోజున పదిసంవత్సరాలు వయసుగల బాలిక వరకు అర్చించాలి అని చెప్పబడింది.

**ఏకవర్షా నకర్తవ్యా కన్యా పూజావిధౌ నృపా ।**
**పరమజ్ఞా తు భోగానాం గంధాదీనాం తు బాలికా ॥**
**కుమారికా తుసాప్రోక్తా ద్వివర్షీయా భవే దిహ ।**
**త్రిమూర్తి శ్చ త్రివర్షా చ కల్యాణీ చతురబ్దికా ॥**
**రోహిణీ పంచవర్షా చ షడ్వర్షా కాలికా స్మృతా ।**
**చండికా సప్తవర్షాస్యా దష్టవర్షా చ శాంభవీ ॥**
**నవవర్షా భవే ద్దుర్గా సుభద్రా దశవార్షికీ ।**
**అత ఊర్ధ్వం న కర్తవ్యా సర్వకార్య విగర్హితా ॥**

ఒక సంవత్సరంలోపు వయస్సున్న వారికి లోకజ్ఞానముండదు. వారికి భోగములు ఏమాత్రం తెలియవు. కాబట్టి వారు పూజకు అనర్హులు అందుచేత రెండు సంవత్సరాల బాలిక నుంచి మాత్రమే కుమారీపూజకు ఎన్నుకోవాలి. ఈ తొమ్మిదిరోజులలోనూ పూజించే బాలికలకు విడివిడిగా పేర్లున్నాయి.

| | | |
|---|---|---|
| మొదటిరోజు | రెండు సం॥ వయసు గలది | కుమారి |
| రెండవరోజు | మూడు సం॥ వయసు గలది | త్రిమూర్తి |
| మూడవరోజు | నాలుగు సం॥ వయసుగలది | కల్యాణి |
| నాల్గవరోజు | ఐదు సం॥ వయసుగలది | రోహిణి |
| ఐదవరోజు | ఆరు సం॥ వయసుగలది | కాళి |

| | | |
|---|---|---|
| ఆరవరోజు | ఏడు సం॥ వయసు గలది | చండిక |
| ఏడవరోజు | ఎనిమిది సం॥ వయసు గలది | శాంభవి |
| ఎనిమిదవరోజు | తొమ్మిది సం॥ వయసు గలది | దుర్గ |
| తొమ్మిదవరోజు | పది సం॥ వయసు గలది | సుభద్ర |

అంతకన్న ఎక్కువవయస్సున్నవారు కుమారీ పూజకు పనికిరారు. ఈరకంగా బాలికలను బాలాత్రిపురసుందరి రూపంగా భావించి పూజిస్తే గొప్ప ఫలితము వస్తుంది. అది :

1. కుమారీపూజ – దారిద్ర్య, దుఃఖనాశనము
2. త్రిమూర్తిపూజ – దీర్ఘాయువు, ధర్మార్ధకామాలు
3. కల్యాణీపూజ – విద్య, రాజభోగము
4. రోహిణీపూజ – రోగనాశనము
5. కాళీపూజ – శత్రునాశనము
6. చండికపూజ – సంపత్కరము
7. శాంభవిపూజ – రాజపూజ్యమైనధీశక్తి
8. దుర్గాపూజ – కష్టమైన కార్యములసాధన
9. సుభద్రపూజ – అభీష్టఫలదాయిని

కుమారీపూజ అంతాకూడా బాలాత్రిపురసుందరి అర్చనావిధానమే. ఈ రకంగా ఆమెను ఆర్చించినట్లైతే సాధకుని కార్యాలన్నీ నెరవేరతాయి. బాలామంత్రం చాలా చిన్నది. దాన్ని అనులోమవిలోమంగా అంటే ముందు నుంచి వెనుకకు, వెనుకనుంచి ముందుకు చెయ్యటంవల్ల విశేషఫలం సిద్ధిస్తుంది.

అందుకే మంత్రశాస్త్రంలో బాల ఉపనాపద్ధతి ప్రత్యేకంగా ఉంది. రుద్రయామళము, విష్ణుయామళము, మంత్రరహస్యము మొదలైన గ్రంథాలలో బాలా కవచము, బాలా అష్టోత్తరము, బాలాసహస్రము ఇత్యాదులు వివరించబడ్డాయి. అందుకే బాలా ఉపాసకులంతా

**ఓం కల్యాణీ త్రిపురా బాలా మాయా త్రిపురసుందరీ**
**సుందరీ సౌభాగ్యవతీ క్లీంకారీ సర్వమంగళా ॥**

అంటూ బాలా అష్టోత్తరంతోను,

**ఓం సుభగా సుందరీ సౌమ్యా సుషుమ్నా సుఖదాయినీ**

**మనోజ్ఞా సుమనో రమ్యా శోభనా లలితా శివా ॥**

అంటూ బాలాసహస్రంతోను అర్చన చేస్తారు.

## 75. మంత్రిణ్యంబావిరచితవిషంగవధతోషితా

భండాసురుడు పెద్దమాయావి. అనేక రకాలయిన రాక్షసగణాలను సృష్టించాలనే సంకల్పంతో కుడిభుజమునుంచి విశుక్రుణ్ణి, ఎడమభుజము నుంచి విషంగుడిని సృష్టించాడు.

శక్తియుక్తులలోగాని, యుద్ధకౌశలంలోగాని, తపస్సులోగాని రాక్షసులు దేవతలు ఇద్దరూ సమానమే. ఇంకా చెప్పాలి అంటే దేవతలకన్న రాక్షసులే గొప్ప తపోబలసంపన్నులు.

**అగ్నిహోత్రంచ వేదంచ రాక్షసానాం గృహే గృహే**

ప్రతి రాక్షసుని ఇంటాకుడా నిత్యాగ్నిహోత్రము, వేదపారాయణ జరుగుతూనే ఉంటాయి. వారు అరివీరభయంకరులు. కాని ఒక్కటే లోపం. అహంకారం. రాక్షసులంతా అహంకార పూరితులు. అందుకే వారు అపజయం పాలయినారు.

**పురా భండాసురోనామ సర్వదైత్య శిఖామణిః**

**పూర్వదేవాన్ బహువిధాన్ య స్రష్టుం స్వేచ్ఛయా పునః**

**విశుక్రం నామ దైత్యేయ వర్గసంరక్షణక్షమం**

**శుక్రతుల్యవిచారజ్ఞం దక్షాం సేన ససర్జ సః**

**వామాంసేన విషంగం చ స్రష్టవాన్ భ్రాతరా ॥**

దేవతలతో సమానమైన శక్తిగల భండాసురుడు తనతో సమానమైన శౌర్యపరాక్రమాలు గల విశుక్రుడు, విషంగుడు అనే వారిని సృష్టించాడు. వీరిలో విషంగుడు అనే రాక్షసుణ్ణి పరమేశ్వరి మంత్రి అయిన శ్యామలాదేవి సంహరించింది. ఆ విషయం తెలిసి దేవి సంతసించింది.

విషంగుడు అంటే విషయాలయందు ఆసక్తి కలవాడు. ఐహికసుఖాలయందు కోరిక గలవాడు. ప్రాపంచిక విషయాభిలాషి. అజ్ఞాని జ్ఞానదృష్టిలేనివాడు. మంత్రిణిగా చెప్పబడే శ్యామలామంత్రోపాసన వలన అజ్ఞానం పటాపంచలవుతుంది.

## 76. విశుక్రప్రాణహరణవారాహీ వీర్యనందితా

**వారహానందనాథస్య ప్రసన్నాత్మా మహేశ్వరి ।**
**వారాహీతి ప్రసిద్ధేయం వరాహవదనేననే ॥**

వరాహానందనాధుడు పరమేశ్వరిని గూర్చి ఘోరమైన తపస్సు చేశాడు. అతడి తపస్సుకు మెచ్చి ఆ దేవి వరాహవదనంతో ప్రత్యక్షమైంది. ఆవిడే వారాహి అని త్రిపురాసిద్ధాంతము చెబుతున్నది.

భండాసురునిచే సృష్టించబడిన విశుక్రుణ్ణి పరమేశ్వరి సేనాని అయిన వారాహి వధించింది. ఆ మాటలువిన్న దేవి వారాహి పరాక్రమానికి సంతసించింది. ఈ విశుక్రుడే యువరాజు. తెలివితేటలలో శుక్రాచార్యుని అంతటివాడు.

భండాసురుడు రాక్షసజాతిని బాగా అభివృద్ధి చేశాడు. విషంగుడు, విశుక్రుడేకాక తన నోటిఆవిరితో 'నామని' అనే ఒక స్త్రీని సృష్టించాడు. ఆమె అతని సోదరి. ఆమెకు కేకసుడు అనే రాక్షసునితో వివాహం చేశాడు వారికి

| | | | |
|---|---|---|---|
| 1. ఉలూకజిత్తు | 3. విషుడు | 5. మదలుడు | 7. మంగళుడు |
| 2. పరుషుడు | 4. కుంతిషేణుడు | 6. కుశూరుడు | 8. ద్రుషణుడు |

అని ఎనిమిదిమంది కుమారులు కలిగారు. వీరంతా భండాసురుని సైన్యంలో సేనానాయకులు. విషంగుడు, విశుక్రులతో కలిసి వీరుకూడా యుద్ధానికి వెళ్ళారు. ఆయుద్ధంలో

| | | |
|---|---|---|
| 1. ఉలూకజిత్తు | – | అశ్వారూఢచేత |
| 2. పరుషుడు | – | సంపత్కరిచేత |
| 3. విషుడు | – | సకులేశిచేత |
| 4. కుంతిషేణుడు | – | మహామాయాదేవిచేత |
| 5. మదలుడు | – | ఉన్మత్తభైరవిచేత |
| 6. కుశూరుడు | – | లఘుశ్యామలచేత |
| 7. మంగళుడు | – | స్వప్నేశదేవిచేత |
| 8. ద్రుషణుడు | – | వాగ్వాదినిచేత |

చంపబడ్డారు. విశుక్రుడు అహంకారపూరితుడు. ఐహికబంధాలలో కూరుకుపోయిన వాడు. సంసారలంపటుడు. వారాహీదేవి ఉపాసన వలన ఇవిపోతాయి. 74, 75, 76

నామాలలో బాల, శ్యామల, వారాహి అనే పదాలు మానవుడి యొక్క మనోవ్యాపారాలను గురించి చెబుతున్నాయి. ఇవి నశిస్తేనే ఆత్మదేవత సంతోషిస్తుంది. బలం కలిగినవాడే ఈ విశ్వాన్ని తనదిగా చేసుకోగలుగుతాడు. ఇక్కడ బలము అంటే భుజబలంకాదు. ఆత్మబలం. ఆత్మ సాక్షాత్కారం గనక కలిగినట్లైతే ప్రపంచానికి, తనకీ భేదము లేదు అని తెలుసుకుంటాడు. విశ్వమే ఆత్మగా గోచరిస్తుంది. మనోవృత్తులు నశిస్తేనే ఆత్మానందం కలుగుతుంది. కాబట్టి కోరికలు నశించాలి.

## 77. కామేశ్వరముఖాలోకకల్పితశ్రీగణేశ్వరా

దేవదానవ సంగ్రామం మహాభీకరంగా సాగుతోంది. దేవసైన్యము రాక్షసమూసహాలను చంపిపారేస్తోంది. అది చూసిన విశుక్రుడు యుద్ధంలో దేవతలకు విజయం సిద్ధించకుండా ఉండేటందుకు జయవిఘ్నము అనే ఒక యంత్రాన్ని తయారుచేసి శక్తిసైన్యానికి మధ్యన ప్రతిష్టచేశాడు. ఈ యంత్రానికి ఎనిమిది దిక్కులా ఎనిమిది కోణాలుంటాయి. ప్రతికోణం దగ్గరా ఒక శూలం పాతాడు. ఎనిమిది దిక్కులయందు ఎనిమిది మంది శక్తులను ఆవాహనచేశాడు. వారు

| | | | |
|---|---|---|---|
| 1. అలసా | 3. దీనా | 5. తంద్రా | 7. క్లీబా |
| 2. కృపణా | 4. నిద్రా | 6. ప్రమీలికా | 8. నిరహంకారా |

ఇది రాతితో నిర్మించిన యంత్రం. రెండుకోసుల విస్తారము గలిగి ఉంటుంది. దీని మహిమవల్ల పరమేశ్వరి సేనలు త్వరగా అలసిపోతాయి. నిద్రావస్థలోకి జారుకుంటాయి. వారిలో పిరికితనం ఆవహిస్తుంది. యుద్ధం మీద ఆసక్తి ఉండదు. యుద్ధభూమి నుంచి పారిపోదామనిపిస్తుంది. ఇది ఒక తాంత్రికప్రయోగము. శక్తిసైన్యానికి ఈ లక్షణాలన్నీ వస్తున్నాయి. సైన్యముయొక్క అవస్థను చూశారు. మంత్రిణి శ్యామల దండనాయిక వారాహి. ఏదో జరిగింది అని మాత్రం అర్థమయింది. వెంటనే పరమేశ్వరికి ఈ విషయం నివేదించారు. అప్పుడు ఆ యంత్రాన్ని నిర్వీర్యం చెయ్యటానికి గణేసుడు కావాలని తలచి చిరునవ్వుతో పరమేశ్వరుని ముఖం ఒకసారి చూసింది. అంతే మరుక్షణమే ఏనుగుతల, రక్తవర్ణము, పెద్దపెద్దచెవులు, పదిచేతులు కలిగి విచిత్రాకృతితో ఉన్న గజాననుడు ఉద్భవించాడు.

అతడే మహాగణపతి. ఎవరు ఈ గణపతి? గణాలకు అధిపతి గణపతి. గణము అంటే సమూహము అని అర్థం. సత్వరజస్తమోగుణాలన్నీ ఒక గణము. ఆ గణాలకు

అధిపతి పరమేశ్వరుడు. అతడే గణపతి. పృథివీతత్త్వాత్మకుడు. షట్చక్రాలలోనూ ఆధారచక్రానికి అధిష్ఠానదేవత. మంత్రశాస్త్రంలో గురువందనం చేసిన తరువాత చెప్పే మంత్రం గణపతిదే. అంటే గణపతికి అంత ప్రాముఖ్యత ఉన్నది. భారతదేశం అంతటా భాద్రపదశుద్ధచవితిని వినాయకచవితిగా జరుపుకుంటున్నారు. అంతేకాదు ఏ కార్యానికైనా గణపతిని ముందు అర్చించటం పరిపాటి. అందుకే కార్యక్రమం విఘ్నేశ్వరపూజతో ప్రారంభమవుతుంది.

**వక్రతుండ మహాకాయ కోటిసూర్యసమప్రభ ।**
**నిర్విఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా ॥**

పంచాయతనంలో గణపతి ఇకటి. మనదేశంలోని కొన్ని ప్రాంతాలలో గణపతినే పరబ్రహ్మగా అర్చించే సంప్రదాయమున్నది. అదే గాణాపత్యము. మంత్రమూర్తి అయిన గణపతిని షోడశగణపతి. అనగా పదహారురకాల గణపతులని, కొంతమంది చెబుతుంటే గణేశపురాణంలో 32 మంది గణపతులను వివరించటం జరిగింది. గణపతికి సంబంధించి కొన్ని ఉపనిషత్తులు కూడా ఉన్నాయి. అందులో వల్లభోపనిషత్తు, హేరంభోపనిషత్తు, గణపతి ఉపనిషత్తు ప్రధానమైనవి.

పరమేశ్వరస్వరూపమని చెప్పబడేవాడు మహాగణపతి.

**అస్యశ్రీ మహాగణపతి దేవతా మహామంత్రస్య గణకఋషిః। నిచృద్గాయత్రీచ్ఛందః శ్రీమహాగణపతిర్దేవతా । గం బీజం । స్వాహా శక్తిః । గ్లౌం కీలకం । జపే వినియోగః**

**న్యాసము** : ఓం గాం। శ్రీం గీం। హ్రీం గూం। క్లీం గైం। గౌం గౌం। గం గః॥

**ధ్యానము** : బీజాపూర గదేక్షుకార్ముక లసత్ చక్రాబ్జ పాశోత్పల
వ్రీహ్యగ్ర స్వవిషాణ రత్నకలశ ప్రోద్యత్కరాంభోరుహః
ధ్యేయో వల్లభయా సపద్మకరయా శ్లిష్టోజ్జ్వలద్భూషయా
విశ్వోత్పత్తి విపత్తి సంస్థితికరో విఘ్నేశ ఇష్టార్థతః

**మంత్రము** : ఓం శ్రీ హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే
వరవరద సర్వజనం మే వశమానయ స్వాహా ॥

మహాగణపతికి పదిచేతులుంటాయి. వాటిలో

1. బీజపూరము (దానమ్మపండు)
2. గద
3. చెరకుగడ
4. శూలము
5. చక్రము
6. పద్మము
7. పాశము
8. ఉత్పలము (కలువ)
9. వరికంకి
10. దంతము

తుండముతో రత్నకలశము పట్టుకుని ఉంటాడు. వామాకంమీద భార్య ఉంటుంది.

మహాగణపతికి తర్పణ, హోమము ఉంటాయి. ఈ మంత్రం లోకవశ్యం దక్షిణదేశీయులు కాబట్టే ప్రతినిత్యము గణపతి హోమం చేస్తారు.

బాద్రపదశుద్ధచవితి వినాయకచవితి. ఆ రోజున సూర్యోదయానికి ముందు ఆకాశంలో సప్తఋషిమండలానికి ఎడమవైపున ఒక నక్షత్రసముదాయం కనిపిస్తుంది. వాటిని గనక ఒక రేఖతో కలిపితే వినాయకుడి ఆకారంవస్తుంది. వాటినే వినాయక నక్షత్రాలు అంటారు. దానికి దిగువగా ఎలుక ఆకారాన్ని పోలిననక్షత్రాలుంటాయి. ఈ మొత్తం నక్షత్ర సముదాయాన్ని 'వినాయకమండలము' అంటారు.

ఖగోళపరంగా వినాయకచవితికి ప్రాశస్త్యం ఉన్నట్లే పత్రిపూజకు కూడా ప్రాశస్త్యం ఉంది. వినాయకుడికి 21 రకాల పత్రివాడతారు. అవన్నీ కూడా అద్భుతమైన ఔషదప్రశస్తి ఉన్నవే. అందుకే గణపతి అంత పూజ్యుడైనాడు.

## 78. మహాగణేశనిర్భిన్నవిఘ్నయంత్రప్రహర్షితా

విశుక్రుడు పాతిన జయవిఘ్నయంత్రాన్ని మహాగణేశుడు నాశనం చేశాడన్న వార్త విని పరమేశ్వరి అమితానందం చెందింది.

సంకల్పమాత్రంచేతనే ఆవిర్భవించిన మహాగణపతి తననుపోలిన ఆరుగురు గణపతులను సృష్టించాడు వారు

1. ఆమోద
2. ప్రమోద
3. సుముఖ
4. దుర్ముఖ
5. అవిఘ్న
6. విఘ్నకర్త

వీరందరితో కలసి మహాగణపతి యుద్ధానికి వెళ్ళాడు. అక్కడ విశుక్రునిచే స్థాపించబడిన జయవిఘ్నయంత్రాన్ని నాశనం చేశాడు.

మానవులు ఉత్తమగమ్యం వైపుకుసాగిపోయేటప్పుడు, మంచిపనులు చెయ్యటానికి ప్రారంభించినప్పుడు అసురభావాలు వచ్చి అడ్డుపడతాయి. అందుకే ఏ దేవతనైనా సరే అర్చన చెయ్యటానికి ముందు ప్రారంభంలో

**ఆగమార్థంతు దేవానాం గమనార్థం తు రాక్షసాం ।**
**కురు ఘంటా రావమ్ తత్ర దేవతాహ్వాన లాంఛనమ్ ॥**

పూజాదికాలు ప్రారంభం కాకుండా ఉండాలి అని, అవి ప్రారంభమైతే తమ బలం తగ్గుతుందనీ రాక్షసగణాలు మంచి కార్యక్రమాలు పాడుచెయ్యటానికి ఎదురుచూస్తుంటాయి. కాబట్టి వాటిని తరిమివేసి దేవతలకు ఆహ్వానం పలుకుతూ ఘంటానాదం చేస్తారు.

అలాగే కార్యక్రమం నిర్విఘ్నంగా పూర్తికావటానికి గణపతి పూజచేస్తారు. ఆ పరాశక్తిని ఆరాధించేవారికి విఘ్నాలు ఉండవు. ఆమె సంకల్పం ద్వారా ఆవిర్భవించిన గణపతి విఘ్నవినాశనం చేసి. తాపత్రయాన్ని అణచి, సాదకులకు శాంతిని ప్రసాదిస్తాడు.

ఈ రోజున కూడా సాధకుడు తన యొక్క అలసత్వము. నీచత్వము, దీనత్వము పోవటంకోసం, విఘ్నాలు కలగకుండా ఉండటంకోసం మహాగణపతిని ఆరాధిస్తారు.

## 79. భండాసురేంద్రనిర్ముక్తశస్త్రప్రత్యస్త్రవర్షిణీ

ధనుర్విద్యలో రెండురకాలబాణాలున్నాయి. 1. శస్త్రాలు 2. అస్త్రాలు. వీటిలో శస్త్రము అంటే ఆయుధం. దూరంగా ఉన్న వస్తువును గురిచూసి బాణంవేయటం. దగ్గరగా ఉన్న వస్తువునైతే కత్తితోనరకవచ్చు. కాని గురిదూరంగా ఉన్నది కాబట్టి బాణంతో దాన్నిఛేదించటం తప్పనిసరి. ఇక అస్త్రము అంటే మంత్రపూరితమైన బాణము. పంచభూతాలు, సర్వదేవతాశక్తులు, రాక్షసశక్తులు కూడా ఈ అస్త్రాలరూపంలో ఉంటాయి. ఉదా : విష్ణుమూర్తి శక్తితో వచ్చేది వైష్ణవాస్త్రము. శివునిశక్తితో వచ్చేది పాశుపతము. అదేవిధంగా నాగాస్త్రము, గరుడాస్త్రము, ఆగ్నేయాస్త్రము మొదలైనవి. యుద్ధాలు జరుగుతున్నప్పుడు ఎవరిమిత్రులు వారికి సాయంచేస్తారు. అలాగే ఎవరిశక్తులు వారికి సాయంచేస్తాయి. దేవతాశక్తులన్నీ దేవతలకు అండగానిలుస్తాయి. ఇక గతించిన రాక్షస శక్తులన్నీ రాక్షసులకు అండగా నిలుస్తాయి.

యుద్ధంలో భండాసురుడు ప్రయోగించిన అస్త్రాలను పరమేశ్వరి ప్రతిగా ఇంకొక అస్త్రంవేసి వాటిని నాశనం చేస్తోంది. రాక్షసుడు ప్రయోగించేవి అవిద్యాసూచకమైనవి. పరమేశ్వరి ప్రయోగించేవి జ్ఞానపూర్వకమైనవి. యుద్ధంలో వారువాడిన అస్త్రాలవివరాలు లలితోపాఖ్యానంలో చెప్పటం జరిగింది.

| వ.నెం. | భండుడు ప్రయోగించిన అస్త్రాలు | పరమేశ్వరి ప్రయోగించిన అస్త్రాలు |
|---|---|---|
| 1. | అంధతామిశ్రమ | మహాతరుణ్యస్త్రము |
| 2. | పాషండాస్త్రము | గాయత్ర్యస్త్రము |
| 3. | అంధాస్త్రము | చక్షుష్మత్యస్త్రము |
| 4. | శక్తినాశాస్త్రము | విశ్వావస్వస్త్రము |
| 5. | అంతకాస్త్రము | మృత్యుంజయాస్త్రము |
| 6. | సర్వస్మృతివాశాస్త్రము | ధారణాస్త్రము |
| 7. | భయాస్త్రము | ఐంద్రాస్త్రము |
| 8. | మహారోగాస్త్రము | నామత్రయాస్త్రము |
| 9. | ఆయుర్నాశాస్త్రము | సంకరణాస్త్రము |
| 10. | సర్వఅసురాస్త్రము | దుర్గాస్త్రము |
| 11. | మూకాస్త్రము | వాగ్వాదివ్యస్త్రము |
| 12. | వేదతస్కరాస్త్రము | మత్స్యాస్త్రము |
| 13. | ఆర్ణవాస్త్రము | కూర్మాస్త్రము |
| 14. | హిరణ్యాకాస్త్రము | వరాహాస్త్రము |
| 15. | హిరణ్యకస్యపాస్త్రము | నృశింహాస్త్రము |
| 16. | బలీంద్రాస్త్రము | వామనాస్త్రము |
| 17. | హైహయాస్త్రము | భార్గవాస్త్రము |
| 18. | రావణాస్త్రము | రామాస్త్రము |
| 19. | ద్వివిధాస్త్రము | బలరామాస్త్రము |
| 20. | రాజాసురాస్త్రము | కృష్ణాస్త్రము |
| 21. | కల్యస్త్రము | కల్క్యస్త్రము |
| 22. | మహామోహాస్త్రము | శాంభవాస్త్రము |

ఈరకంగా పరమేశ్వరి అసురుని అన్ని అస్త్రాలను నిర్వీర్యంచేసి పారేసింది. ఆ తరువాత

1. నారాయణాస్త్రముతో అసురసేనను సంహరించింది.
2. పాశుపతముతో అతని సేనానులను చంపింది.
3. మహాకామేశ్వరాస్త్రంతో భండాసురుని సంహరించింది.

మనలో ఉన్న అజ్ఞానపుచీకటులు పరమేశ్వరి వేసే అస్త్రాలనబడే జ్ఞానవీక్షణలతో నశిస్తాయి. దీపకాంతిరాగానే చీకటిపోయినట్లుగా, పరమేశ్వరికరుణతో సాధకుని మనసులోని అజ్ఞానపు చీకట్లు తొలగిపోతాయి.

## 80. కరాంగుళినఖోత్పన్ననారాయణదశాకృతిః

పరమేశ్వరి యొక్క చేతివ్రేళ్ళగోళ్ళ నుంచి విష్ణుమూర్తి యొక్క దశావతారాలు ఆవిర్భవించినాయి. అంటే పరమేశ్వరి అనుజ్ఞతోనే విష్ణుమూర్తి దశావతారాలు ఎత్తాడు అనే విషయం గతంలో వివరించాము. భృగుమహర్షి శాపాన్ని వరంగా మార్చి దుష్టశిక్షణార్థం అవసరమైనప్పుడల్లా ఈలోకంలో ఉద్భవించమని చెప్పింది పరమేశ్వరి. అందుచేత దశావతారాలు ఆమె అధీనంలోనే ఉన్నాయని చెప్పబడుతోంది. అదీగాక విష్ణుమూర్తి స్థితికారకుడు.

పూర్వకాలంలో కృతయుగానికి ముందు విష్ణుమూర్తి పాలసముద్రంలో నిద్రిస్తున్నాడు. అతడినాభికమలం నుంచి బ్రహ్మ ఉద్భవించాడు. అలా ఆవిర్భవించిన బ్రహ్మకు వేదాలనందించాడు పరమేశ్వరుడు. ఆ వేదాలను పారాయణం చేస్తున్నాడు బ్రహ్మ. ఇంతలో ఎక్కడినుంచో పెద్దగా అరుపులు వినిపించాయి. చుట్టూచూశాడు ప్రజాపతి. ఎక్కడా ఎవరూలేరు. అసలు ఎవరైనా ఉండటానికి ఆస్కారం కూడా లేదు. అంతాజలమయం భూమి అనేది లేదు. ప్రాణులు ఇంకా పుట్టలేదు. మరి ఈ శబ్దం ఎక్కడి నుంచి వచ్చింది? జాగ్రత్తగా పరిశీలించాడు. క్రిందివైపున నీళ్ళలో తిరుగాడుతూ రెండు ఆకారాలు కనిపించాయి. వారే మధుకైటభులు అనే రాక్షసులు. విష్ణుమూర్తి యొక్క చెవి గుబిలి నుంచి ఉద్భవించారు.

జీవి తల్లితండ్రుల ద్వారా అంటే శుక్రశోణితములవల్ల ఉద్భవించాలి. అంతేకాని చెవిగుబిలినుంచి, కాలిచెమటనుంచి ఎలా ఉద్భవిస్తుంది ? పురాణాలలో అనేకచోట్ల మరీచి, అంగిరసుడు, అత్రి, వసిష్ఠుడు, పులహుడు, క్రతువు, పులస్త్యుడు బ్రహ్మమానస పుత్రులు. అని రోషము వల్ల – రుద్రుడు, తొడ నుంచి – నారదుడు ఈ రకంగా అనేక మంది ఉద్భవించారు. అని చెప్పబడింది. అసలు జీవులు ఏరకంగా ఉద్భవిస్తాయి ?

ఐతరేయోపనిషత్తులో సృష్టిని గురించి చెబుతూ జీవులు నాల్గురకాలుగా ఉద్భవించాయి అని చెబుతారు. అవి 1. అండజాలు 2. జారజాలు 3. స్వేదజాలు 4. ఉద్భిజాలు.

ఛాందోగ్యోపనిషత్తులలో శ్వేతకేతువుకు అతని తండ్రి ఉద్దాలకుడు సృష్టి రహస్యాన్ని చెప్పి ఆత్మజ్ఞానాన్ని బోధిస్తూ జీవులు ఐదురకాలుగా ఉద్భవించాయి అవి 1. అండజాలు 2. జీవజాలు 3. స్వేదజాలు, 4. ఉద్భిజాలు 5. ఊష్మజాలు అని చెప్పి వాటిని వివరించాడు.

1. అండజాలు – గ్రుడ్డు నుండి పుట్టినవి పక్షులు
2. జీవజాలు – జీవులవల్ల పుట్టినవి. మనుష్యులు, పశువులు మొ॥నవి.
3. ఉద్భిజాలు – విత్తనాల వలన భూమినుంచి పుట్టినవి.
4. స్వేదజాలు – చెమట లేక బురద వల్ల పుట్టినవి
5. ఊష్మజాలు – వెచ్చదనంవల్ల పుట్టినవి క్రిమికీటకాలు

కాని జీవరాసులను చెప్పేటప్పుడు మొదటిమూడురకాలను మాత్రమే చెప్పాలి. ఐతరేయంలో చెప్పిన జారజములు అంటే స్త్రీ యొక్క జననేంద్రియము నుంచి పుట్టినవి అవే జీవజములు.

ప్రస్తుతము మన సైన్సు ప్రకారము జీవరాసులు మూడురకాలుగా ఆవిర్భవిస్తున్నాయి.

1. అండోత్పాదకాలు – గ్రుడ్డునుంచి వచ్చినవి.
2. శిశోత్పాదకాలు – పిల్లలుగా భూమి మీద ఉద్భవించినవి
3. అండశిశోత్పాదకాలు – ఇది పుట్టినప్పుడు శిశువుగా ఉండదు. అలా అని గ్రుడ్డుకాదు. దీనిని కొంతకాలం తల్లి పోషించిన తరువాత పూర్తి బిడ్డరూపు ధరిస్తుంది. కంగారు జంతువు. ఫైలేరియాని వ్యాపింపచేసే **ఉకరేరి బాంకరఫ్టీ** అనే క్రిమి ఈ కోవకు చెందినవే.

మనకు ఎక్కువగా అండజాలు, క్షీరజాలు కనిపిస్తుంటాయి. అండజాలు అన్నీ గ్రుడ్డుపెడతాయి. ఆ గ్రుడ్డు నుంచి పిల్లలు బయటకు వస్తాయి. పాము, మొసలి, తాబేలు, కోడి, బాతు వంటి జీవులు ఆకోవకు చెందినవే. అయితే పాములన్నీ గ్రుడ్డుపెట్టవు. కొన్నిరకాలపాములు పిల్లల్ని పెడతాయి. ఉదాహరణకు చెట్లమీద తిరిగే ఆకుపచ్చరంగు పసిగిరి పాము, సముద్రసర్పం హైడ్రోఫిష్. ఇవి పిల్లల్ని పొలిచ్చి పెంచవు. అలాగే పిల్లల్ని పెట్టే జంతువులన్నీ క్షీరదాలు కాదు. ఉదాహరణకు తేలు పిల్లలు దాని వెన్ను చీల్చుకుని బయటకు వస్తాయి. ఆ క్షణంలో తల్లితేలు చచ్చిపోతుంది. అందుకే అరటిచెట్టు, తేలు ఒకసారి మాత్రమే ఫలితాన్నిస్తాయి అని చెబుతారు. అయితే తేలు మాత్రం

క్షీరదంకాదు. ఇదే రకంగా క్షీరదాలలో గ్రుడ్లుపెట్టే జంతువులు కొన్నిఉన్నాయి. వాటిని ప్రోటోథీరియాజీవులు అంటారు. ఉదా : ఎకిడ్నా, ECHIDNE

వీటన్నింటికన్న విచిత్రమైనజననము ఇంకొకటిఉన్నది. అదే అనిషేకజననము. (పార్తినోజననము) మామూలుగా జీవి జన్మించాలంటే తల్లిదండ్రులు కావాలి అంటే శుక్లశోణితాలు ఉండాలి. కాని అందులో తండ్రి లేకుండా అంటే శుక్లము లేకుండానే జీవి ఉద్భవిస్తుంది. ఇది ఫలదీకరణము చెందని అండము. ఉదా : మగతేనెటీగ ఈ రకంగానే జన్మిస్తుంది. భారతంలోని కర్ణుడు, యేసుక్రీస్తుల జననాలు కూడా ఇలాంటివే.

చెమటవల్ల, వెచ్చదనంవల్ల జీవులు జన్మిస్తాయని ఉపనిషత్తులు చెబుతున్నాయి. కాని మన సైన్సు దాన్ని ఒప్పుకోవటంలేదు.

మధుకైటభులు బ్రహ్మను తమతో యుద్ధానికి రమ్మని పిలిచారు. బ్రహ్మ పారిపోయి తన తండ్రి అయిన విష్ణువును శరణుజొచ్చాడు. విష్ణుమూర్తి భీకరమైన యుద్ధం చేసి మధుకైటభులను సంహరించాడు. ఆ సమయంలో రుద్రుడు కూడా అక్కడ ప్రత్యక్షమయ్యాడు. త్రిమూర్తులు ముగ్గురూ కలిసి పరమేశ్వరిని ప్రార్థించారు. అప్పుడు ఆ దేవి వారిని కనికరించి మీరు వెళ్ళి మీ స్థావరాలు ఏర్పరచుకొని సృష్టి ఆరంభించండి అన్నది. భూమిలేదు, భూతాలు, తన్మాత్రలు ఏవీలేకుండా సృష్టి ఎలాసాధ్యము ? అదేమాటను వారు దేవిని అడిగారు.

అప్పుడు ఒక పెద్దవిమానం వచ్చి త్రిమూర్తులను ఎక్కించుకుని ఎక్కడికో తీసుకుపోయింది. చివరకు ఆ విమానం మణిద్వీపం చేరింది. అందులో కల్పవృక్షాలవనం. అమధ్యన చింతామణి గృహం. అక్కడ వారికి ఎర్రనివస్త్రాలు ధరించి, ఎర్రచందనం శరీరానికి పూసుకుని, సర్వాలంకృతమై కోట్లకొలది సూర్యచంద్రులకాంతులతో ప్రకాశిస్తూ ధనుస్సు, బాణము, సాశము, అంకుశములుచేతులందు ధరించి త్రికోణాకార ఆసనం మీద కూర్చుని ఉన్న పరమేశ్వరి సాక్షాత్కరించింది.

త్రిమూర్తులు ఆమెను పరిపరివిధాలస్తుతి చేశారు. అప్పుడు ఆ దేవి వారుచేయవలసిన కార్యక్రమాన్ని వివరిస్తూ "బ్రహ్మసృష్టి చేస్తాడు. అతడికి నా శక్తి అయిన భారతి తోడుగా ఉంటుంది. మీరిద్దరూ (విష్ణువు, రుద్రుడు) అతని సృష్టికార్యానికి సహాయంగా ఉంటూ స్థితి, లయాలను నిర్వహించండి" అని చెప్పింది. కాబట్టే విష్ణువుస్థితి కారకుడైనాడు. లోకాలను రక్షించటమే అతని పని. రాక్షసత్వం పెచ్చు మీరినప్పుడు విష్ణువుభూలోకంలో జన్మించి ధర్మసంస్థాపన చేస్తుంటాడు. దానికోసం అతడు ఎత్తినజన్మలే దశావతారాలు.

రాక్షసశ్రేష్టుడైన భండాసురుడు యుద్ధంలో రాక్షసాస్త్రాలను ప్రయోగించాడు. అవి.

1. సోమకాసురాస్త్రము, 2. హిరణ్యాక్ష్యాస్త్రము, 3. హిరణ్యకశ్యపాస్త్రము, 4. రావణాస్త్రము మొ॥వాటిని ప్రయోగించటం మొదలుపెట్టాడు. పరమేశ్వరి అధీనంలో ఉన్నటువంటి మత్స్యావతారము నుంచి కల్క్యావతారము వరకు దశావతారాలు ఆ రాక్షసఅస్త్రాలను నిర్వీర్యంచేసినాయి.

దశావతారాలు దేవి చేతివేలిగోళ్ళయందున్నాయని చెప్పటం ఆమె యొక్క అఖిలాండేశ్వరి తత్త్వానికి నిదర్శనము.

దశాకృతులు అంటే పది కృత్యములు. అవి జాగ్రస్వప్న సుషుప్తి తురీయము తురీయాతీతము, సృష్టి, స్థితి, లయాలు, తిరోదానము, అనుగ్రహము జీవుడికి ఐదు. ఈశ్వరుడికి ఐదు మొత్తం పది. ఇవన్నీ పరమేశ్వరి అధీనంలో ఉన్నాయి. అంటే జీవేశ్వరులు ఆ దేవికి అధీనులు.

## 81. మహాపాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధాసురసైనికా

పాశుపతాస్త్రాన్ని సంధించి ఆ పరమేశ్వరి రాక్షససేనలను సంహరించింది. పాశుపతము షడక్షరి. మహాపాశుపతము 14 అక్షరాలమంత్రము. పాశుపతానికి అధిదేవత శివుడు. మహాపాశుపతానికి అధిదేవత సదాశివుడు. అత్యంత శక్తివంతమైనది అయిన మహాపాశుపతాన్ని ప్రయోగించి పరమేశ్వరి అసురసేనలను సంహరించింది.

పశూనాంపతిః పశుపతి. అని అర్థం అంటే పశువులకు పతి పశుపతి. పశువులు అంటే అజ్ఞానులు. భగవంతుడు వేరు భక్తులువేరు అని ద్వైదీభావం కలవారు. జీవాత్మ పరమాత్మ ఒకటే అని తెలియనివారు. ఈ అస్త్రంతో అజ్ఞానులైన సేనావాహని అంతా నాశనమయిపోయింది. ఇక మిగిలింది భండాసురుడొక్కడే. అతడే జీవి. జీవిలో దాగిఉన్న అసురభావం నశిస్తే అతడి జీవభావం కూడా నశిస్తుంది.

మంత్రశాస్త్రంలో పాశుపతమహామంత్రమున్నది.

**అస్యశ్రీ పాశుపతాస్త్ర మహామంత్రస్య । వామదేవఋషిః । పంక్తిచ్ఛందః । శ్రీ పశుపతిర్దేవతా । శ్లీం బీజం । హుం శక్తిః । ఫట్ కీలకం । జపే వినియోగః**

**న్యాసము : ఓం । శ్లీం । పశు । హుం । ఫట్ । స్వాహా ।**

**ధ్యానము** : మధ్యాహ్నేర్క సమప్రభం శశిధరం భీమాట్టహాసో జ్జ్వలం
త్ర్యక్షం పన్నగభూషణం శిఖిశిఖాశ్మశ్రు స్ఫురన్మూర్ధజం
హస్తాబ్జై స్త్రిశిఖం సముద్గర మసిం శక్తిం దధానం విభుం
దంష్ట్రా భీలచతుర్ముఖం పశుపతిం దివ్యాస్త్రరూపం భజే ॥

**మంత్రము** : ఓం శ్లీం పశుహుం ఫట్ స్వాహా

## 82. కామేశ్వరాస్త్రనిర్దగ్ధసభండాసురశూన్యకా

అన్ని అస్త్రాలకన్నా శ్రేష్టమైనది కామేశ్వరాస్త్రము. అటువంటి కామేశ్వరాస్త్రాన్ని ప్రయోగించి పరమేశ్వరి భండాసురుణ్ణి సంహరించి అతడి నగరానికి శూన్యకనగరమనే పేరు సార్థకం చేసింది. భండాసురుడు శూన్యక నగరాన్ని పాలిస్తున్నాడు. దేవి కామేశ్వరాస్త్రం ప్రయోగించి ఆ నగరం నామరూపాలు లేకుండా చేసింది. బ్రహ్మాండపురాణంలో సకలబంధువులు నశించిన తరువాత ఒంటరిగా ఉన్న దుష్టుడైనవాడు ముల్లోకాలాను గడగడలాడించినవాడు, క్రోధముచే మండుచున్నవాడు, మహాబలశాలి అయిన భండాసురుణ్ణి వేయి సూర్యులతేజస్సుగల కామేశ్వరాస్త్రము ప్రయోగించి సంహరించింది. అది ఒక అణుబాంబు వంటిది. ఆ అస్త్రము యొక్క మంటలచే అతని రాజధాని అయిన శూన్యకనగరంలోని స్త్రీలు, బాలురు, వృద్ధులు, పశువులు, పక్షులు సర్వమూ నశించిపోయినాయి. అన్ని కట్టడాలు కూలిపోయినాయి. చివరకు ఏమీ మిగలకుండా, ఎడారి ప్రాంతంలాగా శూన్యక నగరము సార్థకనామధేయమయింది.

ఈ అస్త్రము అస్త్రాలన్నింటిలోకీ గొప్పది. మహాశక్తివంతమైనది. ముల్లోకాలలోనూ కూడా దీనితో సమానమైనశక్తి ఇంకొకటిలేదు. ఇది ప్రళయాగ్నిశూచకము. ఈ అస్త్రప్రయోగంచేసి పరమేశ్వరి భండాసుర సంహారం పూర్తిచేసింది.

కామేశ్వరాస్త్రము అంటే చిదగ్ని. మానవునిలో చిదగ్ని ప్రకాశించినట్లైతే ద్వైతభావ రూపమైన జీవస్వభావం నశిస్తుంది. అప్పుడు ఆత్మశక్తి ప్రకాశిస్తుంది. అరిషడ్వర్గాలతో జీవినాశనమవుతాడు. వాసనాత్రయంచేత కర్తవ్యాన్ని మరిచిపోతాడు. వాసనాత్రయము అంటే 1. కర్మవాసన, 2. జన్మవాసన, 3. భోగవాసన. కాబట్టి వాసనాత్రయము నశించాలి. అది కామేశ్వరుని చేతనే జరుగుతుంది. మంత్రశాస్త్రంలో కామేశ్వరమహామంత్రమున్నది.

అస్యశ్రీ మహాకామేశ్వర భట్టారక మహామంత్రస్య పరమానందభైరవ ఋషిః। అమృతవిరాట్ఛంధః । శ్రీమహాకామేశ్వరభట్టారకోదేవతా ।

హ స క్ష మ ల వ ర య ఊం బీజం । య ర ల క్ష మ య ఊం శక్తిః । స హ క్ష మ ల వ ర ల ఊం కీలకం । జపే వినియోగః ।

**న్యాసము** : హ స క్ష మ ల వరయ ఊం ।
స హ స క్ష మ ల వరయ ఊం ।
య ర ల క్ష మ య ఊం ।
హ స క్ష మ ల వ ర య ఊం ।
స హ స క్ష మ ల వరయ ఊం ।
య ర ల క్ష మ య ఊం ॥

**ధ్యానము** : శ్రీదేవీ భూషితోత్సంగం సాంద్రసింధూర రోచిషం ।
హకారాది మనోర్వాచ్యం వందే కామేశ్వరం హరమ్ ॥

**మంత్రము** : ఐం క్లీం సౌః । ఓం ఐం హ్రీం శ్రీం । హ స క్ష మ ల వ ర య ఊం। స హ క్ష మ ల వ ర య ఊం। య ర ల క్ష మ య ఊం । శ్రీం హ్రీం ఐం । సౌః క్లీం ఐం ॥

## 83. బ్రహ్మోపేంద్రమహేంద్రాది దేవసంస్తుతవైభవా

ఇక్కడితో భండాసురుడు అనే రాక్షస శ్రేష్టుని వధించటం పూర్తయింది. అంటే దుష్టశిక్షణ శిష్టరక్షణ జరిగిందన్నమాట. అసలు పరమేశ్వరి ఆవిర్భవించిన కారణము ఇదే. ఆ పని పూర్తయింది. అందువల్ల సంతుష్టులైన బ్రహ్మాదిదేవతలు పరమేశ్వరిని పరిపరివిధాల స్తుతించారు. దానవులవలన ఎప్పుడైతే దేవతలకు బాధకలుగుతుందో, అప్పుడు తాను భూలోకంలో అవతరించి దుష్టశిక్షణ చేస్తానని చెప్పిన మాట ప్రకారము ఆ దేవి రాక్షససంహారము చేసింది. అందుకని దేవతలంతా ఆమెను వేనోళ్ళకొనియాడారు.

"పరమేశ్వరీ ! భండాసురుని బారినుండి మమ్ములను కాపాడిన నీకు మాటిమాటికీ నమస్కారములు. సమస్తసృష్టికి నీవే కారణభూతురాలవు. పంచకృత్యపరాయణవు. మాకు బాధలు కలిగినప్పుడల్లా నువ్వు ఉద్భవించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తుంటావు. నీకు మా మీద గల దయను ఎంచి చెప్పటానికి మేమెంతవారము తల్లీ ! మా అపరాధములు మన్నించి మమ్ములను సదా కాచి రక్షించవలసినది".

పరతత్త్వము సర్వత్రావ్యాప్తి చెంది ఉన్నది. దాన్ని బ్రహ్మాదిదేవతలు స్వాత్మయందు కనుగొన్నారు. మనలోని ఇంద్రియాలకు అధిపతులున్నారు. వారే దేవతలు. మనలో ఉన్న దుష్టశక్తులు నశించగానే దేవతలు ఆనందిస్తారు. ఆ పరాశక్తిని తమలోనే గుర్తించి ఆనందానుభవం పొందుతారు.

## 84. హరనేత్రాగ్ని సందగ్ధకామసంజీవనౌషధిః

శివుని కోపాగ్నికి బూడిద అయిపోయిన మన్మథుడిని ఆ పరమేశ్వరి మరల జీవింపచేసింది.

హిమవంతుని కుమార్తె హైమవతితో శివుడి వివాహం జరిపించటంకోసం ప్రయత్నం చేశాడు మన్మథుడు. ఆ ప్రయత్నంలో శివుని కోపాగ్నికి కాలి బూడిద అయిపోయినాడు. ఆ బూడిదతోనే గణేషుడు భండాసురుణ్ణి సృష్టించాడు. అయితే ఆ భండాసురుని పరమేశ్వరి సంహరించింది. దేవతల కార్యము పూర్తి అయింది. అంతా సుఖంగా ఉన్నారు. ఈ తరుణంలో రతీదేవి ఒక్కర్తే బాధపడుతోంది. పతీ వియోగం భరిస్తోంది. అందుచేత మన్మథుని భార్య రతీదేవి, తల్లి లక్ష్మీదేవి పరమేశ్వరికి నమస్కరించి దేవకార్యంకోసం ప్రాణాలర్పించిన మన్మథుణ్ణి తిరిగి బ్రతికించమని వేడుకున్నారు రతీదేవికి మాంగల్యదానం చెయ్యమనికోరారు. భక్తులపాలిట కల్పవృక్షం ఆ దేవి. వారి ప్రార్ధనలాలకించి మన్మథుణ్ణి బ్రతికించింది.

విరాగి అయిన శివుని కోపాగ్నిజ్వాలలకు మన్మథుడు దహించబడ్డాడు. ఆ తరువాత లోకంలోని ప్రజలందరూ విరాగులవుతున్నారు. కాబట్టి మన్మథుణ్ణి బ్రతికించమని దేవతలు వేడుకున్నారు.

పూర్వకాలంలో ఒకసారి మానవులు కోరికలు త్యజించి యజ్ఞయాగాదులు మానేశారు. అప్పుడు దేవతలందరూ లక్ష్మీదేవి దగ్గరకు పోయి ఆమె కుమారుడైన మన్మథుణ్ణి పంపి మానవులలో కోరికలు రేపవలసినదిగా కోరారు. లక్ష్మీదేవి వారి కోరిక నంగీకరించి తనకుమారుణ్ణి భూలోకానికి పంపింది. మన్మథుడు భూలోకంలో వీరవ్రతుడనే మహారాజుతో యుద్ధంచేశాడు. ఆ రాజు శివుణ్ణి గురించి ఘోరమైన తపస్సుచేసి, అతణ్ణి మెప్పించి త్రిశూలము సంపాదించి దాని సాయంతో మన్మథుణ్ణి సంహరించాడు. ఈ విధంగా కామదహనం జరిగింది. ప్రజలంతా విరాగులవుతున్నారు. ఈ పరిస్థితి చూడలేక దేవతలు మన్మథుణ్ణి బ్రతికించమని పరమేశ్వరిని ప్రార్థించగా, ఆమె వారి మొర ఆలకించింది.

అయితే పునర్జీవితుడైన మన్మథుడు అనంగుడు అంటే అంగములు లేనివాడు. అతడికి కాళ్ళు, చేతులు మరి ఏ ఇతర అవయవాలు లేవు. ఛాయామాత్రంగా రతీదేవికి మాత్రమే గోచరిస్తాడు. ఈ రకంగా పరమేశ్వరి కటాక్షము రతీదేవి సౌభాగ్యానికి సంజీవిని అయింది. మన్మథుడు మళ్ళీ జీవంపోసుకున్నాడు. లోకంలో సృష్టి కార్యం యధాతథంగా జరుగుతోంది. పరమేశ్వరి కృపాకటాక్షవీక్షణాలుంటే ఏ పనీ అసాధ్యంకాదు. అన్ని పనులూ చాలా తేలికగా జరుగుతాయి. ఈ విషయం శంకభగత్పాదులు తమ సౌందర్య లహరిలోని 6వ శ్లోకంలో వర్ణిస్తూ

**ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ పంచ విశాఖాః**
**వసంత స్సామంతో మలయమరు దామోధనరథః**
**తథాప్యేక స్సర్వం హిమగిరిసుతే కామపికృపాం**
**అపాంగా త్తే లబ్ద్వా జగ దిద మనంగో విజయతే ॥**

అనంగుడైన మన్మథుడు ఏరకంగా ఉన్నాడంటే

| | |
|---|---|
| ధనుఃపౌష్టం | – ధనుస్సు చూద్దామాపూలతో చేసినది. |
| మౌర్వీంమధుకరమయీం | – అల్లెత్రాడు చూద్దామా తుమ్మెదవరుస |
| పంచవిశిఖాః | – బాణాలు కేవలం ఐదు మాత్రమే |
| వసంతస్సామంతో | – సామంతుడు చూద్దామా ! వసంతుడు (ఒక ఋతువు) |
| మలయమరుదాయోధనరథః | – రథం చూద్దామా దక్షిణ దిక్కున ఉండే మలయమారుతము. కొండగాలి. |

పూలతో చేసిన ధనుస్సు. పట్టుకుంటేనే పాడయిపోతుంది నలిగిపోతుంది. విల్లుత్రాడు తుమ్మెదల వరుస. అవి సరిగా ఉండవు. ఎప్పుడు ఏది ఎటువెళ్ళిపోతుందో తెలియదు. బాణాలు కేవలం ఐదు. అవి కూడా పూలబాణాలు, చెలికాడు వసంతవరుతువు. అది ఒక జడపదార్థం. సలహా చెప్పటానికి కాదుకదా మాట్లాడటానికి కూడా పనికిరాడు. ఇక రథం దక్షిణకొండగాలి అది ఎప్పుడు వస్తుందో పోతుందో కూడా తెలియదు. అన్నింటికీ మించి మన్మథుణ్ణి చూద్దామా అతడు అనంగుడు. కాళ్ళు లేవు రథం మీద నుంచోలేడు. చేతులులేవు. బాణాలు, ధనుస్సు పట్టుకోలేడు. మాట్లాడటానికి నోరులేదు. చూట్టానికి కళ్ళులేవు. ఇన్ని అవలక్షణాలున్న ఆ మన్మథుడు లోకంలో అతి గొప్పవారు, శక్తిమంతులు

అయిన ఋషీశ్వరుల మీదికి యుద్ధానికి వెళ్ళి, వాళ్ళమీద విజయం సాధిస్తున్నాడు. దీనికి కారణం ఆ పరమేశ్వరి కృప అతడిమీద ఉండటమే. ఆ దేవి దయగనక ఉన్నట్లైతే లోకంలో అసాధ్యమనేవి ఏవిఉండవు.

విరాగి అయిన కామేశ్వరుణ్ణి తనవైపు మరల్చుకోటానికి ఆ పరమేశ్వరి మన్మథుణ్ణి పునర్జీవితుణ్ణి చేసింది అని బ్రహ్మాండపురాణంలో ఉన్నది.

అజ్ఞానమనేది ఆత్మజ్ఞానాన్ని కప్పివేస్తుంది. అంలాటి అజ్ఞానాన్ని నాశనం చేసేవాడు, హరించేవాడు హరుడు. మన్మథుడు దగ్ధమైనాడు అంటే అజ్ఞానం నశించిపోయింది. మాయ నుంచి విముక్తి కలిగించేవాడే కామేశ్వరుడు. ఆత్మస్వరూప జ్ఞానం కలిగించటంలో ఆ పరమేశ్వరి సంజీవిని వంటిది. జీవి అజ్ఞానిగా ఉన్నప్పుడు శరీరాన్ని ధరించి ఉంటాడు. జ్ఞాని అయిన తరువాత శరీరభావన నశించి బ్రహ్మైక్యప్రాప్తి  కలుగుతుంది.

ఈ రకంగా 64వ నామం దగ్గరనుంచి 84వ నామం వరకు భండాసురవధ వివరించబడింది.




శ్రీ ఇకారదేవి

# 9. దేవి - సూక్ష్మరూపవర్ణన

## (పంచదశీ మహామంత్రము)

ఇంతవరకు దేవి యొక్క స్థూలరూపము చెప్పి ఇక సూక్ష్మరూపాన్ని వర్ణిస్తున్నారు.

పాంచభౌతికమైనది ఈ దేహం. దీన్ని మూడురకాలుగా చెబుతారు అవి 1. స్థూలశరీరము. 2. సూక్ష్మశరీరము 3. కారణశరీరము.

1. **స్థూలశరీరము :** శంకరభగవత్పాదులవారు తమ వివేక చూడామణిలో

**త్వక్మాంసరుధిరస్నాయు మేదో మజ్జాస్థి సంకులమ్ ।**
**పూర్ణం మూత్రపురీషాభ్యాం స్థూలమ్ నింద్యమిదం వపుః ॥**

చర్మము మాసంము రక్తము, నరాలు, మేద, మజ్జ ఎముకలు మొదలైన వాటితోను, మలమూత్రాలతోను కూడిన ఈ దేహాన్ని స్థూలదేహం అంటారు. ఇది అసహ్యకరమైనది. పూర్వకర్మలననుసరించి, పంచభూతాలకలయికచే ఈ దేహం ఏర్పడింది. భోగాలు అనుభవించటానికి ఆధారము ఈ దేహమే. జీవుడు ఈ శరీరంతోనే సుఖదుఃఖాలు అనుభవిస్తాడు. స్థూలశరీరము జాగ్రదావస్థలోనే అనుభవం పొందుతుంది. మిగిలిన అవస్థలు దానికి తెలియవు. గృహస్తుకు గృహం లాగా జీవాత్మకు ఈ శరీరం ఆ వాసమై ఉన్నది. జీవి చేసిన పాపపుణ్యాలన్నీ ఈ శరీరం ద్వారానే అనుభవిస్తాడు.

**స్థూలస్య సంభవజరామరణాని ధర్మాః**
**స్థౌల్యాదయో బహువిధాః శిశుతాద్యవస్థాః**
**వర్ణాశ్రమాది నియమా బహుధా యమాః స్యుః**
**పూజావమాన బహుమానముఖా విశేషాః ॥**

జననము, మరణము, ముసలితనము, రోగము అన్నీ ఈ శరీరానివే, బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము మొదలైన దశలు ఈ శరీరానివే, బ్రహ్మచర్యము, గృహస్త్రాశ్రమము, వానప్రస్థము, సన్యాసము వంటి వర్ణాశ్రమధర్మాలు ఈ శరీరానికే. అలాగే యమనియమాలు, మానావమానాలు మొదలైన విశేషాలు కూడా ఈ శరీరానికి సంబంధించినవే అన్నారు.

**2. సూక్ష్మశరీరము :**

**వాగాదిపంచ శ్రవణాదిపంచ**
**ప్రాణాదిపంచా భ్రముఖానిపంచ**
**బుద్ధ్యాద్యవిద్యాపి చ కామకర్మణీ**
**పుర్యష్టకం సూక్ష్మశరీరమాహుః ॥**
**ఇదం శరీరం శ్రుణు సూక్ష్మసంజ్ఞితం**
**లింగం త్వపంచీకృత భూతసంభవమ్**
**సవాసనం కర్మఫలానుభావకం**
**స్వాజ్ఞానతో ఽ నాదిరుపాధిరాత్మనః ॥**

వాక్కు మొదలయిన కర్మేంద్రియాలు ఐదు, జ్ఞానేంద్రియాలు ఐదు. పంచప్రాణాలు, పంచభూతాలు, అంతఃకరణ చతుష్టయము, విద్య, కామము, కర్మ అనేవి అన్నీ కలసి సూక్ష్మశరీరం అనబడుతుంది. సూక్ష్మశరీరాన్నే లింగశరీరం అని కూడా అంటారు. ఇది అపంచీకృతభూతాల వలన ఏర్పడి వాసనలతో కూడినదై కర్మఫలాలు అనుభవిస్తూ ఉంటుంది. స్వప్నాన్ని ఈ సూక్ష్మశరీరమే అనుభవిస్తుంది. అంటే కలలో అనుభవించేది ఈ సూక్ష్మశరీరమే.

**3. కారణశరీరము :**

**అవ్యక్తమేతత్త్రిగుణైర్నిరుక్తం**
**తత్కారణం నామ శరీరమాత్మనః**
**సుషుప్తిరేతస్య విభక్త్యవస్థా**
**ప్రలీన నరేంద్రియబుద్ధివృత్తిః ॥**

గుణత్రయమే ఆత్మ యొక్క కారణశరీరము. ఇది సుషుప్తావస్థలో ఉంటుంది. సుషుప్తిలో అన్నిరకాలయిన జ్ఞానము నశిస్తుంది. బుద్ధికేవలము బీజరూపంలో ఉంటుంది. ఆ స్థితిలో శరీరంలోని అన్ని అవయవాలు పూర్తిగా విశ్రమిస్తాయి.

ఇప్పుడు దేవి యొక్క సూక్ష్మరూపాన్ని వర్ణిస్తున్నాడు. సూక్ష్మరూపము మళ్ళీ మూడు విధాలు అవి.

| | | |
|---|---|---|
| 1. సూక్ష్మము | – | పంచదశీ మహామంత్రము |
| 2. సూక్ష్మతరము | – | కామకలాక్షరము |
| 3. సూక్ష్మతమము | – | కుండలిని |

పంచదశీ మహామంత్రం 85, 86, 87 నామాలలో వివరించబడుతోంది.

పంచదశీ మహామంత్రము పదిహేను అక్షరాలు గల మంత్రము. ఈ మంత్రాన్ని దర్శించి ఈ లోకానికి తెచ్చినవాడు మన్మథుడు. అతడే ఈ మంత్రానికి ఋషి అని కొందరి వాదన. కాగా దక్షిణామూర్తి మూలపురుషుడని కొందరంటారు. భాషకు గల అక్షరాలను మూడుభాగాలుగా చేశారు.

1. అ నుంచి అః వరకు 16 అక్షరాలు మొదటిభాగము
2. క నుంచి త వరకు 16 అక్షరాలు రెండవభాగము
3. థ నుంచి స వరకు 16 అక్షరాలు మూడవభాగము

ఈ భాగాలలో సత్వరజస్తమోగుణాలు, చంద్రసూర్యాగ్నులతత్త్వాలు, జాగ్రస్వప్నసుషుప్తి అనే అవస్త్రాత్రయము యొక్క తత్త్వాలు, షోడశనిత్యలు, యోగినులను వీటిలో అంతర్భావంచేసి, ఒక్కొక్క భాగానికి ఒక్కొక్క హ్రీంకారాన్ని ఏర్పాటుచెయ్యటం జరిగింది. ఈ మంత్రంలోని బీజాలకు చంద్రకళలు, షోడశనిత్యలే అధిదేవతలు.

షోడశనిత్యలను, చంద్రకళలను ఇదివరకే వివరించటం జరిగింది. తిధులే నిత్యాదేవతలు, నిత్యాదేవతలే చంద్రకళలు. పదిహేనుకళలే పదిహేనునిత్యలు. పదహారవనిత్యయే సాక్షాత్తూ ఆ పరమేశ్వరి అయి ఉన్నది. పదహారవనిత్యయే పదహారవ కళ అదే సాదాఖ్యకళ. బ్రహ్మకళ, సర్వస్వానికి అధిదేవత. ఈ కళలన్నింటినీ మూడుభాగాలుగా చేయబడ్డాయి.

1. శివ, శక్తి, మాయ, శుద్ధవిద్య, జలము అనే ఐదు తత్త్వాలకు సంబంధించిన మొదటి ఐదుకళలు గల ప్రథమఖండాన్ని 'ఆగ్నేయఖండము' అంటారు. దీనికి అధిదేవత అగ్ని.

2. తేజస్సు, వాయువు, మనస్సు, పృథివి, ఆకాశము అనే ఐదుతత్త్వాలకు సంబంధించిన ఆరు నుంచి పది వరకు గల కళలు గల ద్వితీయఖండాన్ని 'సౌరఖండము' అంటారు. దీనికి అధిదేవత సూర్యుడు.

3. విద్య, మహేశ్వరి, పర, ఆత్మ, సదాశివతత్త్వాలకు సంబంధించిన చివరి ఐదుకళలు గల తృతీయఖండాన్ని 'సౌమ్యఖండము' అంటారు. దీనికి అధిదేవత సోముడు.

అన్ని కళలకు, ఖండాలకు అధినాధుడు కామేశ్వరుడు. అధిష్టాత్రికామేశ్వరి. ఈ రకంగా సోమసూర్యఅనలాత్మకములైన మూడు ఖండాలుగా ఈ మంత్రం విభజించబడి ప్రతిఖండానికి చివర హ్రీంకారము చేర్చబడింది. ఇక లలితాసహస్రంలో 85వ నామం చూద్దాం.

# 85. శ్రీమద్వాగ్భవకూటైకస్వరూపముఖపంకజా

పంచదశీ మహామంత్రం మూడుభాగాలుగా ఉంటుందని ముందే చెప్పాం. వీటిలో మొదటిభాగంలో నాలుగు, రెండవభాగంలో ఐదు, మూడవభాగంలో మూడు బీజాక్షరాలు ఉంటాయి. ఈ భాగాలనే ఖండాలు లేదా కూటములు అంటారు. ప్రతిఖండానికి చివర హ్రీం కారముంటుంది. ఈరకంగా పంచదశీమహామంత్రంలో పదిహేను బీజాక్షరాలు ఉంటాయి. ఈ ఖండాలకు విడివిడిగా పేర్లున్నాయి.

1. ప్రథమఖండాన్ని – వాగ్భవకూటమి
2. ద్వితీయఖండాన్ని – కామరాజకూటమి
3. తృతీయఖండాన్ని – శక్తికూటమి అంటారు.

**1. వాగ్భవకూటమి :** ఇది ఋగ్వేదాత్మకము. దీనివల్ల పురుషార్ధసాధనచేత కలిగే బ్రహ్మవర్చస్సు, సద్బుద్ధి కలుగుతాయి. ఇందులో గాయత్రీమంత్రసారము చెప్పబడింది.

**2. కామరాజకూటమి :** ఇది యజుర్వేదాత్మకము. దీనిలో అర్ధకామపురుషార్ధ నిర్మాణము, క్షత్రియులచే ఉపాసింపబడు త్రిష్టచ్ఛందస్సు ఉన్నాయి.

**3. శక్తికూటమి :** ఇది సామవేదాత్మకము. ఇందులో మోక్షసాధనకు మార్గము చెప్పబడింది.

పంచదశీమహామంత్రాన్ని అనేకచోట్ల ప్రతిపాదించటం జరిగింది. శంకర భగవత్పాదులవారు సౌందర్య లహరిలోని 32వ శ్లోకంలోను, గౌడపాదులవారు సుభగోదయస్తుతిలోని 19వ శ్లోకంలోను ఇంకా అనేకమంది అనేకచోట్ల ఈ మంత్రాన్ని ప్రతిపాదించారు. ఈ మంత్రాన్ని అనేకమంది ఉపాసించి తరించారు. వారిలో

**మను శ్చంద్ర కుబేరశ్చ లోపాముద్రా చ మన్మథః**
**అగస్తి ర్నంది సూర్యశ్చ ఇంద్రో విష్ణు శ్శివ స్తథా ॥**
**క్రోధభట్టారకోదేవ్యా ఏతే ముఖ్యఉపాసకాః**
**ఏవంద్వాదశధాభిన్నా శ్రీమత్పంచదశాక్షరీ ॥**

మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, మన్మథుడు అగస్త్యుడు, నందీశ్వరుడు, సూర్యుడు, ఇంద్రుడు, విష్ణువు, శివుడు, దుర్వాసుడు శ్రేష్టులు. కాని వారు ఉపాసించిన మంత్రాలు వేరువేరుగా ఉన్నాయి. ఆ వివరాలకు నా చే వ్రాయబడిన శ్రీ విద్యాపంచదశి చూడండి.

పంచదశీమహామంత్రాన్ని రెండురకాలుగా ఉపాసన చేస్తారు. 1. హాదివిద్య, 2. కాదివిద్య.

**తేషుద్వా మనురాజేతు వరిష్ఠౌ వింధ్యమర్దన**
**లోపాముద్రా కామరాజా ఇతిఖ్యాతి ముపాగతా ।**
**హాది స్తు లోపాముద్రాస్యాత్ కామరాజ్ఞాస్తుకాదికః**
**తయోస్తు కామరాజోఽయం సిద్ధిదా భక్తిశాలినః ॥**

మంత్రం హకారంతో మొదలైతే హాదివిద్య. కకారంతో మొదలైతే కాదివిద్య. హాదివిద్యలో లోపాముద్ర, కాదిమతంలో కామరాజీయము శ్రేష్ఠమైనవి. కాగా ఈ రెండింటిలోను కాదివిద్య అయిన కామరాజీయము అంటే మన్మథుడుపాసించిన పంచదశీ మహామంత్రము శ్రేష్ఠమైనది.

పంచదశీ మహామంత్రాన్ని శైవ, వైష్ణవ, గాణాపత్యమంత్రాలతో సంపుటం చేయటంకూడా జరుగుతోంది. పంచదశీమహామంత్రాన్ని

1. బాలామంత్రంతో సంపుటంచేస్తే – సౌభాగ్యవిద్య
2. గణపతిమంత్రంతో సంపుటంచేస్తే – విద్యాగణపతి
3. గోపాలమంత్రంతో సంపుటంచేస్తే – గోపాలసుందరి

మంత్రం అవుతుంది.

పరమేశ్వరి స్థూలరూపాన్ని మూడుభాగాలుగా విభజించారు. ఆ భాగాలనే కూటములు అంటారు.

1. తలభాగము మెడవరకు – వాగ్భవకూటమి
2. కంఠమునుండి కటివరకు – కామరాజకూటమి
3. కటి నుండి కాళ్ళ వరకు – శక్తికూటమి

**1. వాగ్భవకూటమి :** దీని నుంచే వాక్కు వస్తుంది. అందుచేతనే దీన్ని వాగ్భవకూటిమి అన్నారు. ఇందులోని ఐదుఅక్షరాల సమూహమే స్వరూపంగా గల ముఖపద్మము గలది ఆ పరమేశ్వరి. పరమేశ్వరి యొక్క కనులు, చెవులు, ముక్కు, నోరు, కంఠము – వాగ్భవకూటమి. ఈ కూటమిలో **క ఏ ఈ ల హ్రీం** అనే ఐదు బీజాక్షరాలుంటాయి. బాలమంత్రంలోని ఐం బీజము వాగ్భవము. వాగ్బీజాన్ని ఉపాసిస్తూ దుర్వాసుడు. తన శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 3వ శ్లోకంలో

**వందే వాగ్భవ మైందవాత్మ సదృశం వేదాది విద్యగిరో**
**భాషా దేశ సముద్భవాః పశుగతా శ్ఛందాంసి సప్తస్వరాన్ ।**
**తాలా న్పఞ్చ మహాధ్వనీ న్ప్రకటయ త్యాత్మ ప్రసారేణ యత్**
**తద్బీజం పదవాక్యమానజనకం శ్రీమాతృకే తే పరమ్ ॥**

ఓ పరాత్పరీ ! నీ రూపమే అయినటువంటి వాగ్భవబీజమునకు నమస్కరించు చున్నాను. ఈ బీజము శ్వేతవర్ణము గలది. అది తన వ్యాప్తిచేతనే వేదాదిసకల విద్యలను, సకలవాక్కులను, సకలభాషలను, సకల ఛందస్సులను, సప్తస్వరాలను, తాళములను, ధ్వనులను ప్రకాశమొనర్చుచున్నది. ఇంత మహాశక్తి. శాలి, పరము అయిన వాగ్భవబీజాన్ని నేను ఉపాసిస్తున్నాను అన్నాడు.

## 86. కంఠాధఃకటిపర్యంతమధ్యకూటస్వరూపిణీ

**కంఠస్య అధః కటి పర్యంతోయస్య స మధ్యభాగః**
**స ఏవ మధ్యస్య కామరాజాఖ్యస్య కూటస్య**

కంఠస్థానము నుండి కటి ప్రదేశము వరకు గల మధ్యభాగము కామరాజకూటమి. దీనిలో ఆరు బీజాక్షరాలుంటాయి. ఇక్కడ బాహుసంధులు, కటిసంధులు, నాభి, హృదయము. ఇవే ఈ కూటమిలోని బీజాలు. **హ స క హ ల హ్రీం**

బాలమంత్రంలోని క్లీం అనే అక్షరము కామరాజబీజము. ఈ భాగాన్ని ఉపాసనచేస్తూ దుర్వాసుడు శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 7వ శ్లోకంలో

**కామా న్కారణతాం గతా నగణితాన్ కార్యై రనేకై ర్మహీ**
**ముఖ్యైః సర్వమనోగతా నధిగతాన్ మానై రనేకైః స్ఫుటం**
**కామక్రోధసులోభమోహమదమాత్సర్యారి షట్కం చ య**
**ద్బీజం భ్రాజయతి ప్రణౌమి త దహం తే సాధు కామేశ్వరి ! ॥**

ఓ దేవీ ! కామరాజబీజము సృష్టి, స్థితి, లయాలను నిర్వర్తించు త్రిమూర్తుల శక్తులను ప్రకాశింపచేయును. పంచభూతాలు, తన్మాత్రలు, త్రిమూర్తులు, సృష్టి స్థితి సంహారాలను, ఆయాదేవతల శక్తులను గోచరింపచేయునది, అరిషడ్వర్గములను ప్రాణులయొక్క మనసు నందు ఉత్పన్నము చేయునది అయిన కామరాజబీజమునకు నమస్కరించుచున్నాను.

## 87. శక్తికూటైకతాపన్నకట్యధోభాగధారిణీ

కటిప్రదేశము నుంచి పాదాల వరకు గల భాగమును శక్తికూటమి అంటారు.

**కామస్తే హృదివసతీతి కామరాజం**
**స్రష్టృత్వాత్తదను తవాంబ శక్తికూటమి.**

కాముడు నీ హృదయమందు గలవాడు. కామరాజును సృష్టించుటచే అది నీ శక్తికూటమి అయినది.

పంచదశీమహామంత్రంలోని మూడవభాగము శక్తికూటమి. ఇందులో నాలుగుబీజాలుంటాయి. వీటిలో మొదటి రెండు బీజాలను మణిపూరస్వాధిష్ఠానాల మధ్యన, మూడవది మూలాధారంలోను, నాల్గవది స్వాధిష్టానంలోను ఉన్నట్లుగా భావించి ఉపాసించాలి. ఈ రకంగా చెయ్యటంవల్ల ఉపాసకులకు దేవతాభావసిద్ధి కలుగుతుంది. సత్పురుషులలో దాగినశక్తి ఈ కూటానికి మూలము. దీనిలోని బీజాక్షరాలు స క ల హ్రీం, బాలామంత్రంలోని మూడవబీజము సౌఃశక్తిబీజమే. దుర్వాసుడు ఈ కూటమిని ఉపాసిస్తూ శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 12వ శ్లోకంలో

**స్వాత్మశ్రీ విజితాజ విష్ణు మఘవ శ్రీపూరణైకవ్రతం**
**యద్విద్యా కవితా వితానలహరీ కల్లోలినీ దీపకం ।**
**బీజం య త్త్రిగుణప్రవృత్తిజనకం బ్రహ్మేతి యద్యోగినః**
**శాంతా స్సత్య ముపాసతే త దిహ తే చిత్తే దధే శ్రీపరే ॥**

తల్లీ ! శక్తిబీజము త్రిమూర్తులరూపవిశేషాలను జయిస్తున్నది. వారు వారి పనులు సక్రమంగా నిర్వహించటానికి వారికి శక్తినిస్తుంది. ఉపాసకులకు విద్య కవిత్వము సిద్ధింపచేస్తుంది. త్రిగుణములప్రవృత్తిని కలిగిస్తుంది. యోగులకు సత్యాత్మకమైన బ్రహ్మము ఇదే. అట్టి నీ శక్తిబీజమును నేను ఉపాసింతును అంటాడు.

## 88. మూలమంత్రాత్మికా

పంచదశీమహామంత్రం దేవికి ఆత్మస్వరూపం. శ్రీవిద్యాసంప్రదాయానికి పంచదశీ మహామంత్రం గాయత్రివంటిది. ఈ మంత్రోపాసనచేసిన వారికి ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. **మననాత్త్రాయత ఇతిమంత్రః,** మననము చేయుటవలన మననము చేయు వానిని రక్షించునది మంత్రము. సంసారబంధనాలను త్రెంచి ఆత్మసాక్షాత్కారము చెయ్యగలిగేదే మంత్రము. అటువంటి మంత్రస్వరూపిణి ఆ పరమేశ్వరి.

చతుర్విధపురుషార్థాలకు మూలకారణమవటం చేత పంచదశాక్షరీమంత్రము మూలమవుతున్నది. ఆ మంత్రమే ఆత్మస్వరూపంగా గలది ఆ దేవి. వేదమందలి మూలమంత్రము పరమేశ్వరి స్వరూపము.

## 89. మూలకూటత్రయకళేబరా

పైన చెప్పినట్లుగా మూలమంత్రము మూడుకూటములుగా ఉన్నది. ఆ కూటత్రయమే పరమేశ్వరి స్వరూపము. అదే దేవిస్థూలరూపము. ఇక్కడ మూల అనే శబ్దము కామకలాక్షరము (శ్రీ)ను చెప్పుచున్నది. కూటత్రయము అనటంచేత మూడువిధాలయిన అవయవాలు చెప్పబడుతున్నాయి. కామకళలో ఊర్ధ్వబిందువు, దాని క్రింద అడ్డుగా ఉన్న రెండుబిందువులు, దానికింద హార్దకళ, ఇంకా వివరంగా చెప్పాలి అంటే కామకళలో ఊర్ధ్వబిందువు, మధ్యబిందువు, నాదబిందువు అని మూడు కూటములున్నాయి. పంచదశీ మహామంత్రానికి అనేక అర్థాలు చెప్పబడ్డాయి వాటిలో

**అథాతః పూర్ణగాయత్ర్యాః ప్రతిపాద్యోర్థఆదిమః**

మొట్టమొదటగా పంచదశి మహామంత్రానికి గాయత్రి మంత్రార్థం చెప్పబడింది. ఆ తరువాత భావార్థము, సంప్రదాయార్థము ఈ రకంగా 15 అర్థాలు చెప్పబడ్డాయి. దీనిమీద ఇంకా వివరాలకు నా చే వ్రాయబడిన 'శ్రీవిద్యాపంచదశి' చూడండి.

గాయత్రిమంత్రంలోని మూడుపాదాలను మూడుకూటములుగా భావించాలి. ఈ కూటత్రయమే పరమేశ్వరి శరీరము. మూలమంత్రంలోని వాగ్భవశక్తి కామరాజకూటాలే పరమేశ్వరి శరీరము. మంత్రానికి ఇవే బీజము, శక్తి, కీలకము.

పంచదశీ మహామంత్రానికి (సౌభాగ్యవిద్య) దక్షిణామూర్తి ఋషిః । పంక్తిఛందః । శ్రీసౌభాగ్యవిద్యేశ్వరీత్రిపురసుందరీ దేవతా । ఐం బీజం । సౌః శక్తిః । క్లీం కీలకం ।

ఆధారచక్రంలో కుండలినీ శక్తి స్వయంభూ లింగానికి మూడున్నరచుట్లుచుట్టుకుని సర్పాకారంలో నిద్రావస్థలో ఉంటుంది. ఆ మూడువలయాలే మూడుకూటములు. మూల మంత్రభావం నుంచి దేవతయొక్క కూటత్రయాన్ని, స్థూల, సూక్ష్మ, కారణదేహ భావాన్ని వేరుచేసినట్లైతే మిగిలే దృక్పదార్థమే దేవతయొక్క నిజస్వరూపం. వేరుచేయబడిన స్థూల సూక్ష్మ కారణ దేహాలసముదాయమే కళేబరము.

దేవి మూలమంత్రం పంచదశి. శ్రీవిద్యకు మూలమంత్రం షోడశి. శ్రీ అనే బీజముతో కూడిన శ్రీవిద్య దేవికి సూక్ష్మరూపము. శ్రీ అనేది కామకలాబీజము. పదిహేనుచంద్రకళలు

షోడశీకల నుంచి ఆవిర్భవించాయి. అందుకే దేవికి 15 కళలు అవయవాలు. కూటత్రయము శరీరము. స్థూలరూపము – ముఖము మొదలైన అవయవాలు. సూక్ష్మరూపము – మంత్రము. దుర్వాసుడు పంచదశీ మహామంత్రాన్ని వర్ణిస్తూ శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 14వ శ్లోకంలో

**ఇత్థం త్రీణ్యపి మూల వాగ్భవ మహాశ్రీకామరాజస్ఫుర**
**చ్ఛక్త్యాఖ్యాని చతుఃశ్రుతి ప్రకటితా న్యుత్కృష్ట కూటాని తే**
**భూత ర్తుశృతి సంఖ్య వర్ణవిదితా న్యారక్తకాంతే ! శివే !**
**యో జానాతి స ఏవ సర్వజగతాం సృష్టి స్థితి ధ్వంసకృత్ ॥**

అరుణకాంతులతో విరాజిల్లు ఓ దేవీ ! శుభస్వరూపా ! ఈ రకంగా వాగ్భవకామరాజ శక్తికూటములుకలది, నాలుగువేదాలయందు ప్రతిపాదించబడినది, అయిన పంచదశీ మహామంత్రాన్ని ఉపాసించేవారు సర్వజగత్కర్త అంటే పరమేశ్వరుడవుతాడు.

పంచదశీ మహామంత్రం సామాన్యమైనదికాదు. ఆ మంత్రాన్ని జపం చెయ్యాలంటే పూర్వజన్మకృతం ఉండాలి. అసలు పరమేశ్వరిని గురించి తలచాలన్నా, నమస్కరించాలన్నా పూర్వజన్మకృతము ఉండితీరాలి. ఇదే మాటను శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని మొదటిశ్లోకంలో

**ప్రణన్తుం స్తోతుం వా కథమకృతపుణ్యఃప్రభవతి ?**

అంటారు. మంత్రము దేవి యొక్క సూక్ష్మరూపమే కదా ! మరి అటువంటి మంత్రోపాసన చెయ్యాలి అంటే ఎంత పుణ్యం ఉండాలి ? లలితాత్రిశతి ఫలశృతిలో

**యస్యనో పశ్చిమం జన్మ యదివా శంకరస్స్వయం**
**తేనైవలభ్యతే విద్యా శ్రీమత్పంచదశాక్షరీ ।**

పంచదశీ మంత్రోపాసన చెయ్యాలి అంటే అతడికి మరుజన్మ లేకుండా ఉండాలి లేదా సాక్షాత్తూ అతడే పరమేశ్వరుడై ఉండాలి.

ఇది జ్ఞానప్రదమైనది. మోక్షహేతువు. అందుచేతనే

**ఏతద్విజ్ఞానమాత్రేణ శ్రీవిద్యా సిద్ధిదాభవేత్**
**కత్రయం హద్వయం చైవ శైవభాగో ప్రకీర్తితః**
**శక్త్యక్షరాణి శేషాణి హ్రీంకార ముభయాత్మకః**

పంచదశీ మహామంత్రంలోని కకారాలు మూడు, హకారాలు రెండు వెరసి ఐదు శివాత్మకాలు. హ్రీంకారములు మూడు ఉభయాత్మకాలు. అంటే శివశక్త్యాత్మకాలు. మిగిలిన ఏడు అక్షరాలు శక్త్యాత్మకాలు. ఈ విషయం తెలిసిన వాడికి శ్రీవిద్య త్వరగా సిద్ధిస్తుంది. శ్రీవిద్యోపాసన చాలా ఉత్తమమైనది. సాధకుడికి మంచి ఫలితాన్ని ఇస్తుంది. మనోవాంఛలను ఈడేరుస్తుంది.

**ఆయుష్కరం పుష్టికరం పుత్రదం వశ్యకారకమ్**
**విద్యాప్రదం కీర్తికరం సుకవిత్వప్రదాయకమ్**
**సర్వసంపత్ప్రదం సర్వభోగదం సర్వసౌఖ్యదమ్**
**సర్వాభీష్టప్రదం చైవ దేవీనామశతత్రయమ్ ॥**

లలితాత్రిశతి అంటే పంచదశీ మహామంత్రమే. కాని వేరుకాదు. ఈ మంత్రంలోని ఒక్కొక్క అక్షరానికి 20 నామాలను చెప్పటం జరిగింది. 15 × 20 = 300 నామాలు. అదే లలితాత్రిశతి.

దీనిని గనక జపించినట్లైతే ఇది ఆయుష్యకరము, పుష్టికరము, వశీకరణము, విద్యాప్రదము, కీర్తికరము, కవిత్వప్రదము, సంపత్ప్రదము, భోగప్రదము, సౌఖ్యప్రదము, సర్వాభీష్టప్రదము

ఈ రకంగా 85 నుంచి 89 వరకు అంటే ఐదునామాలలో పంచదశీ మహామంత్రాన్ని వివరించటం జరిగింది.



## 10. దేవీపూజ - ఆచారాలు (కౌళాచారము)

ఇక 90వ నామం నుంచి దేవీపూజలోని ఆచారాలను వివరిస్తున్నారు. మనదేశంలో అనాదిగా అనేక దేవతలను అర్చించటం జరుగుతోంది. ఈ ఉపాసనను సాధకులు తమ కోరికలననుసరించి ఎవరికి అనువైన పద్ధతిలో వారు గురువుయొక్క ఆదేశానుసారము చేస్తుంటారు. శ్రీవిద్యాసంప్రదాయంలో యతులకు, గృహస్తులకు కలిపి పదిరకాల గురుపరంపరలున్నాయి. అవి.

1. గిరి
2. సాగర
3. భారతి
4. పురి
5. సరస్వతి
6. అరణ్య
7. తీర్ధ
8. ఆనంద
9. నాధ
10. ఆశ్రమ

వీరందరికీ ఈ ఆచారాల్లో తేడాలుంటాయి. ఇవేకాక ఇంకా అనేక ఆచారాలున్నాయి.

1. కౌళాచారులు - వీరు ఆధారచక్రాన్ని పూజిస్తారు.
2. క్షిపణికులు - స్త్రీయోనిని పూజిస్తారు. పూర్వాదితంత్రాలు వీరికి ప్రమాణము
3. కాపాలికులు - పంచామృత తంత్రం వీరికి ప్రమాణము
4. దిగంబరులు - రూపభేదము, భూతోడ్డారము మొదలైన 8 తంత్రాలు వీరికి ప్రమాణాలు
5. ఇతిహాసులు - వీరు వస్త్రహీనులు. భైరవయామళము వీరికి ప్రమాణము
6. వామాచారులు - వీరు తంత్రవాదులు. వామకేశ్వరతంత్రము వీరికి ప్రమాణము

వీరిలో క్షిపణికులు, కాపాలికులు, దిగంబరులు జంతుబలులు కూడా ఇస్తారు. అలా అయితే తమ కోరికలు త్వరగా సిద్ధిస్తాయిని వారి నమ్మకము. వీరందరూ కూడా ఐహిక వాంఛలు తీర్చుకోటానికే పరమేశ్వరిని అర్చనచేస్తారు. ప్రస్తుతం మనకు 1. కౌళాచారము 2. సమయాచారము 3. వామాచారము అని మూడురకాల ఆచారాలు కనిపిస్తున్నాయి.

**1. కౌళాచారము :** పురుషార్థాలలో అర్ధకామాలకే ప్రాధాన్యతనిచ్చేవారు కౌళులు. వీరికి బాహ్యాపూజయేగాని అంతఃపూజలేదు. వీరు ప్రత్యక్షంగా శ్రీచక్రాన్ని పూజిస్తారు. వీరికి కౌళాగమాలుగా పిలువబడే 64 తంత్రాలు ప్రమాణికాలు. ఈ తంత్రాలు దేవిపూజకు ఉత్తమమైనవి. ఈ తంత్రాలను చతుశ్శతిలో వివరించారు.

చతుష్షష్టిశ్చ తంత్రాణి మాతౄణా ముత్తమాని చ ।
మహామాయాశంబరం చ యోగినీ జాలశంబరం ॥

తత్త్వశంబరకం చైవ భైరవాష్టక మేవ చ ।
బహురూపాష్టకం చైవ యమళాష్టక మేవ చ ॥

చంద్రజ్ఞానం మాలినీంచ మహాసమ్మోహనం తథా ।
వామజుష్టం మహాదేవం వాతులం వాతులోత్తమమ్ ॥

హృద్భేదం తంత్రభేదంచ గుహ్యతంత్రంచ కామికమ్ ।
కలావాదం కలాసారం తథాన్యత్ కుండికామతమ్ ॥

మతోత్తరం చ వీణాఖ్యాం త్రోతలం త్రోతలోత్తరమ్ ।
పంచామృతం రూపభేదం భూతోడ్డార మేవ చ ॥

కులసారం కులోడ్డీశం కులచూడామణి స్తథా ।
సర్వజ్ఞానోత్తరం చైవ మహాకాళీమతం తథా ॥

అరుణేశం మోదినీశం నికుంతేశ్వర మేవ చ ।
పూర్వ పశ్చిమ దక్షంచ ఉత్తరంచ నిరుత్తరమ్ ॥

విమలం విసులోత్థం చ దేవీమత మతః పరమ్.

ఈ తంత్రాలు పూర్తిగా ఐహికార్థసిద్ధికి మార్గాలు. కాబట్టి పండితులను కూడా పెడత్రోవను పట్టిస్తాయి.

కౌళాచారము అంటే బాహ్యపూజ. కుః అంటే పృథివీతత్త్వము. అది షట్చక్రాలలోను దేనియందున్నదో దాన్ని కులము అంటారు. ఇది ఆధారచక్రంలో ఉన్నది. అందుకే కౌళులు ఆధారచక్రాన్ని పూజిస్తారు.

## కుండలినీ శక్తి

ధ్యాయేత్ కుండలినీం దేవీం స్వయంభూలింగవేష్టితాం
శ్యామాం సూక్ష్మాం సృష్టిరూపాం సృష్టి స్థితి లయాత్మికాం
విశ్వాతీతాం జ్ఞానరూపాం చింతయే దూర్ధ్వవాహినీమ్ ॥

మూలాధార చక్రంలో స్వయంభూలింగానికి మూడున్నర చుట్లు చుట్టుకుని అధోముఖంగా సర్పాకారంలో, సదానిద్రావస్థలో ఉంటుంది కుండలినీ శక్తి. నల్లని రూపంలో ఉంటుంది. సృష్టి స్థితి లయాలకు కారణభూతమైనది, విశ్వాతీతమైనది, జ్ఞానరూపమైనది అయిన ఆ కుండలినీశక్తికి నమస్కరిస్తున్నాను.

## 90. కులామృతైకరసికా

ఇక ఈ నామం దగ్గర నుంచీ కుండలినీ శక్తిని వివరిస్తున్నారు. కులము అంటే వంశము ఇది రెండురకాలు. 1. పైతృకవంశము 2. విద్యావంశము. పరమేశ్వరి అమృత స్వరూపిణి. ఆమె అమృతాన్నే ఆస్వాదిస్తుంది. ఉపాసకుడు తాను అమృతతుల్యుడను అనే భావంతో తాను సంపాదించిన యాగద్రవ్యాలు కూడా అమృతసమానమే అని భావించి జపహోమాదులు నిర్వహించాలి. ఈ రకంగా అమృతము నందు ఆసక్తికలదిదేవి. ఆ అమృతము కులము అంటే సహస్రారము నుంచి ఉద్భవించింది. కులామృతైకరసికా అని పిలువబడుతోంది. అంటే మూలాధారంలోని నిద్రావస్థలో ఉన్న ఆ కుండలినీ శక్తి సహస్రారం చేరుతుంది. అప్పుడు అక్కడి అమృతంతో సాధకుని శరీరంలోని నాడీమండలం అంతా పూర్తిగా తడుస్తుంది. ఈ విషయాన్ని వామకేశ్వరతంత్రంలో వివరిస్తూ

**భుజంగాకారరూపేణ మూలాధారం సమాశ్రితా ।**
**శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభాఽశుభా ॥** 1

**మూలకందం ఫణాగ్రేణ దష్ట్వా కమలకందవత్ ।**
**ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమాశ్రితా ॥** 2

**వజ్రాసనగతో స్వస్థో గుద మాకుంచ్య సాధకః ।**
**వాయుమూర్ధగతిం కుర్వన్ కుంభకావిష్టమానసః ॥** 3

**వాయ్వాఘాతవశా దగ్నిః స్వాధిష్ఠానగతో జ్వలన్ ।**
**జ్వలనాఘాత పవనాఘాతై రున్నిద్రితో విరాట్ ॥** 4

**రుద్రగ్రంథిం తతో భిత్త్వా విష్ణుగ్రంథిం భిన త్త్వతః ।**
**బ్రహ్మగ్రంథిం చ భిత్త్వైవ కమలాని భినత్తి షట్ ॥** 5

**సహస్రకమలే శక్తిః శివేన సహ మోదతే**
**సా చావస్థా పరా జ్ఞేయా సైవ నిర్వృతి కారణమ్ ॥** 6

1. భుజంగాకారము ధరించి తామరతూడులోని దారమువలె సన్నగా మెరుపు తీగలాగా ప్రకాశిస్తూ ఆ కుండలినీ శక్తి మూలాధారాన్ని ఆశ్రయించి ఉన్నది.

2. ఆ శక్తి ఆధారచక్రము యొక్క మూలకందమును తామరదుద్దువలె నోటితో కరచిపట్టుకుని బ్రహ్మరంధ్రాన్ని ఆశ్రయించి ఉన్నది.

3. సాధకుడు వజ్రాసనంలో కూర్చుని, శ్వాసను పైకివదులుతూ కుంభకము చెయ్యాలి. అంటే గాలిని లోపలికి పీల్చి అట్టిపెట్టాలి.

4. ఆ వాయువు యొక్క తాకిడికి స్వాధిష్టానంలో ఉన్న అగ్నిప్రజ్వరిల్లి కుండలినీ శక్తి మేల్కొంటుంది.

5,6. ఆ తరువాత ఆ శక్తి గ్రంధిత్రయాన్ని భేదించుకుని సహస్రారము చేరి సదాశివునితో సుఖిస్తుంది. అట్టి స్థితిలో ఉన్న ఆమెయే పరాశక్తి. నిత్యసుఖకారిణి.

గ్రంధిత్రయాన్ని భేదించిన తరువాత ఆ కుండలినీ శక్తి కోట్లకొలది సూర్యచంద్రుల కాంతులతో సహస్రారం చేరుతుంది. అప్పుడు తన యొక్క నోటితో అధోముఖంగా ఉన్న సహస్రదళపద్మాన్ని కరచిపట్టుకుంటుంది. సహస్రదళపద్మము చంద్రమండలము ఎప్పుడైతే కుండలినీ శక్తి తననోటితో ఆ పద్మాన్ని కరచిపట్టుకున్నదో, అప్పుడు అక్కడ ఉన్నటువంటి అమృతము, ఆ రంధ్రాల ద్వారా క్రిందికి జాలువారి సాధకుని యొక్క శరీరంలోని 72000 నాడీమండలాన్నీ తడుపుతుంది. అప్పుడు సాధకుడు అవ్యాజమైన, అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందుతాడు. ఈరకంగా పరమేశ్వరియైనకుండలినీ శక్తి అమృతపానమునందు ఆసక్తి గలది. ఆ అమృతము కులపద్మము అంటే సహస్రారము నుంచి ఆవిర్భవించింది. అందుకే కుండలినీ శక్తిని కులామృతైకరసికా అన్నారు.

కులము అంటే వర్ణము. భగవద్గీతలో శ్రీకృష్ణుడు

**చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగ శః ।**

అన్నాడు. అంటే మానవుడు చేసే వృత్తులననుసరించి వారిని నాలుగు వర్ణాలుగా నేను సృష్టించాను. ఈ చతుర్వర్ణాలగురించి మొదటిసారిగా యజుర్వేదంలోని పురుషసూక్తంలో చెప్పబడింది.

**బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్ బాహూ రాజన్య కృతః ।**
**ఊరూ తదస్య య ద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత ॥**

దీనికి యథాతథంగా అర్థం చెప్పాలి అంటే ఆ విరాట్స్వరూపం ముఖం నుంచి బ్రాహ్మణులు, బాహువులనుంచి క్షత్రియులు, ఊరువుల నుంచి వైశ్యులు, పాదాల నుంచి శూద్రులు జన్మించారు. అయితే విషయపరిజ్ఞానం పూర్తిగాలేనివారు పై వాక్యాలకు వాచ్యార్థాన్ని మాత్రమే చెబుతారు.

బ్రహ్మను గురించి తెలుసుకోవాలనుకునేవారు బ్రాహ్మణులు. సృష్టి ప్రారంభంలో సనకసనందనాదులు సంసారసుఖాలు వద్దని వాటిని త్యజించి సత్యాన్వేషణలో నిమగ్నమై పోయారు. ఆ తరువాత ఉద్భవించిన వసిష్ఠాదులు గృహస్థులైనారు. వీరు కూడా బ్రహ్మ పదార్థం కోసం వెతుకుతూనే ఉన్నారు. వీరి వంశాలు విస్తరించినాయి. వీరందరూ కొద్దిగానో గొప్పగానో సత్యాన్వేషకులే. వీరందరూ బ్రహ్మతేజస్సుతో వెలుగొందుతుంటారు కాబట్టి వారికి బ్రాహ్మణులు అని నామకరణం జరిగింది. కొంతకాలానికి ఈ బ్రాహ్మణులకు, జ్ఞానాన్ని రక్షించవలసిన బాధ్యత ఎవరైనా స్వీకరించవలసిన అవసరం వచ్చింది. అప్పుడు బాహుబలం గల క్షత్రియులు ఉద్భవించారు. ఆ తరువాత ధనార్జన చేయవలసిన అవసరం వచ్చింది. వైశ్యులు ఉద్భవించారు. చివరకు వీరందర్నీ పోషించవలసిన బాధ్యత, సేవించవలసిన బాధ్యత వచ్చాయి. అప్పుడు శూద్రులు జన్మించారు. ఈ రకంగా వర్ణాశ్రమధర్మాలు ఏర్పడ్డాయి. అంటే ఎవరు చేసే పనిని బట్టివారి వర్ణాన్ని నిర్ణయించానని భగవానుడు గీతలో చెప్పాడు.

బృహదారణ్యకోపనిషత్తులో మానవుడు ఉద్భవించిన విధానాన్ని వివరిస్తున్నాడు.

నామరూపాత్మకమైన సృష్టికి ఆరంభంలో ఉన్నది పరబ్రహ్మ స్వరూపమే. అదే విరాట్స్వరూపంలో ఉన్న అగ్ని. అదే బ్రాహ్మణరూపం. అంతవరకు క్షత్రియాది ఇతరవర్ణాలేవీ లేవు. క్షత్రియులు లేకపోవటంవల్ల పాలనవ్యవహారాలు కష్టమైనాయి. అప్పుడు పరమేశ్వరుడు క్షత్రియుల్ని సృష్టించాడు. దేవతలలో ఇంద్రుడు, సోముడు, వరుణుడు, రుద్రుడు, మేఘుడు, యముడు, ఈశానుడు. వీరంతా క్షత్రియులు. బ్రహ్మపదార్థాన్ని తెలుసుకోవాలనుకునే బ్రాహ్మణులకు వీరు రక్షకులు.

క్షత్రియుణ్ణి సృష్టించిన తరువాత బ్రహ్మ తన పనిలో కృతకృత్యుడు కాలేదు. అందుచేత ధనాన్ని సంపాదించటానికి, దాచిపెట్టటానికి వైశ్యజాతిని సృష్టించాడు. వీరు ధనాన్ని గురించిన రహస్యాలను దాచిపెట్టాలి. అందుచేతవారు గుహ్యాతి గుహ్యమైన ఊరువులనుంచి పుట్టారు.

వైశ్యులంతా గణాలు గణాలుగా అంటే సమూహాలుగా ఆవిర్భవించారు. వీరిలో

| | | |
|---|---|---|
| వసువులు | – | ఎనిమిది మంది |
| రుద్రులు | – | పదకొండు మంది |
| ఆదిత్యులు | – | పన్నెండు మంది |
| విశ్వేదేవతలు | – | పదమూడు మంది |
| మరుద్గణాలు | – | నలభైతొమ్మిది మంది. వీరంతా దేవవైశ్యులు. |

ఆ తరువాత సేవకులు లేకపోవటం వల్ల బ్రహ్మ తన పనిలో సమర్థుడు కాలేకపోయినాడు. అందుచేత శూద్రులను సృష్టించాడు. వీరు సేవకావృత్తి చేస్తూ భూమిని దున్ని పంటలు పండిస్తారు. ఆ కారణంగానే శూద్రులు పాదాలు నుంచి ఉద్భవించారు. ఈ రకంగా లోకంలో ఉన్న ప్రజలను రక్షించటం కోసం మాత్రమే నాలుగుజాతులవారు సృష్టించబడ్డారు. అంతేకాని ఇందులో ఎవరు ఎక్కువ, ఎవరు తక్కువ అనేదిలేదు. అందరూ పరబ్రహ్మచేతనే సృష్టించబడ్డారు. ఆ వర్ణాలనే మనం కులములు అంటున్నాము.

సాధకులు వారివారి కులాన్ని బట్టి పూజావిధానంలో వాడే సామగ్రి చెప్పబడింది.

| | | |
|---|---|---|
| బ్రాహ్మణులు | – | ఆవుపాలు |
| క్షత్రియులు | – | ఘృతము |
| వైశ్యులు | – | మధువు |
| శూద్రులు | – | ఆసవము (కల్లు) |

వర్ణభేదంతోనే కాకుండా సాధకుల కోర్కెలననుసరించి కూడా ఈ పదార్థాలు మారుతుంటాయి.

కులము అంటే సమూహము. జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము. ఈ మూడింటినీ త్రిపుటి అంటారు. ఈ మూడు ఐక్యమైతేనే అమృతమయమైన ఆనందం కలుగుతుంది. మాత, మానము, మేయముల సమూహమే కులము అని చిద్గగనచంద్రికలో కాళిదాసు వర్ణించాడు. కులాన్ని అధివశించి, అమృతాన్ని స్రవింపచేస్తుంది. కాబట్టి ఆ దేవి 'కుళామృతైకరసికా' అనబడుతోంది.

శరీరమే కులం. శరీరసంబంధమైనదే కులామృతము. అలాంటి అమృతంలోని రసాన్ని ఆస్వాదించటంలో ఆసక్తి కలది ఆ దేవి.

చక్రార్చనలో విశేషార్ఘ్యపాత్రలో సంస్కరించబడిన గోక్షీరమే అమృతము. అలాంటి అమృతంతో తర్పణ, హోమము చేయబడుటలో ఆసక్తి గలది ఆ దేవి.

## 91. కులసంకేతపాలినీ

ఉపాసింపతగినది, ఉపాసించేవాడు, పూజాద్రవ్యాలు అన్నీ జ్ఞానమయాలే. కాబట్టి వాటిని ప్రతిపాదించే శాస్త్రాన్ని కూడా 'కులము' అంటారు. ఆగమాలలో

**న కులం కుల మి త్యాహుః ఆచారః కుల ముచ్యతే**

కులము అంటే వంశం కాదు. ఆచారమే కులము అని చెప్పబడింది. కల్పసూత్రాలలో **కుళపుస్తకాని చ గోపయేదితి** ఆచారం గురించి చెప్పే పుస్తకాలను దాచాలి అని చెప్పబడింది. అంటే పరమేశ్వరి పూజలో ఆచారాలకు ప్రాముఖ్యత ఎక్కువన్నమాట. అటువంటి ఆచారాలను పాటించేది దేవి. జ్ఞానులకు ఈ ఆచారాలు అవసరం లేదు. వారిది పరలోక చింతన. అందుకని దేవి ఈ ఆచారాలను జ్ఞానులకు చెప్పదు. సంప్రదాయాన్ననుసరించే వారికి, ఐహికమైన కోర్కెలు గలవారికి మాత్రమే ఈ శాస్త్ర రహస్యాలు చెబుతుంది. ఆ రహస్యాలు మూడు రకాలు **చక్రసంకేతో మంత్రపూజా సంకేతకా**

1. చక్రసంకేతము 2. మంత్ర సంకేతము 3. పూజా సంకేతము

చింతామణి స్తవములో ఈ విధంగా చెప్పబడింది.

**కులాంగనై షా పృథరాజవీథీః ప్రవిశ్య సంకేత గృహాంతరేషు ।**
**విశ్రమ్య విశ్రమ్య పరేణ పుంసా సంగమ్య సంగమ్య రసంప్రసూత ॥**

కులస్త్రీ అంటే కుండలిని రహదారిలో ప్రవేసించి (ఇక్కడ రహదారి అంటే సుషమ్నా మార్గము) రహస్య స్థానాలలో (షట్చక్రాలయందు) విశ్రాంతి పొందుతూ పరపురుషుని (సహస్రారంలో పరమేశ్వరుణ్ణి) చేరి అమృతపు సరస్సులోకి ప్రవేశిస్తోంది.

బ్రాహ్మణాది వర్ణాలు, బ్రహ్మచర్యాది అవస్థలు, పిత్రువంశము యొక్క ధర్మాలు, గురువుగారి వంశము మొదలైనవి. వీటన్నింటినీ కులసంకేతము అంటారు.

కుండలినీ శక్తి సుషమ్నా మార్గంగుండా గ్రంథిత్రయాన్ని భేదించుకుని సహస్రారం చేరటాన్నే "కులసంకేతపాలన" అంటారు. దేవి ఈ ఆచారాలను పాటిస్తుంది కాబట్టి ఆమెను కులసంకేతపాలిని అని చెప్పటం జరిగింది.

మూలాధారము నుంచి ఆరు చక్రాలున్నాయి. అవి

1. గుద స్థానంలో – మూలాధారము
2. లింగస్థానంలో – స్వాధిష్ఠానము

3. నాభిస్థానంలో - మణిపూరము
4. హృదయస్థానంలో - అనాహతము
5. కంఠస్థానంలో - విశుద్ధి చక్రము
6. భృకుటి స్థానంలో - ఆజ్ఞా చక్రము

వీటన్నింటికీ పైన సహస్రదళ పద్మమున్నది. వీటన్నింటినీ కలిపి 'కులము' అంటారు.

శంకర భగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 10వ శ్లోకంలో కుండలినీ శక్తిని స్తుతిస్తూ

**సుధాధారాసారై శ్చరణయుగళాంతర్విగళితైః**
**ప్రపంచం సించంతీ పునరపి రసామ్నాయ మహసః**
**అవాప్య స్వాం భూమిం భుజగనిభ మధ్యుష్ఠవలయం**
**స్వ మాత్మానం కృత్వా స్వపిషి కులకుండే కుహరిణీ ॥**

తల్లీ ! నీ పాదయుగము నుండి స్రవించు సుధాధారలచే ప్రపంచమును తడుపుచు అమృతమునకు నిధానమై కాంతిచే వెలుగొందు చంద్రుని వీడి స్వస్థానమైన ఆధారచక్రమును మరల బ్రాపించి, అందు స్వస్వరూపమును సర్పమువలె కుండలా కారము కావించి తామరదుద్దు నడుమనుండు సన్నని రంధ్రమువలె మిక్కిలి సూక్ష్మమైన పృథివీతత్త్వమునందు కుండలినీ శక్తివై నిద్రింతువు.

## 92. కులాంగనా

కులము అంటే పాతివ్రత్యాది గుణశీలమైన వంశము. తల్లివైపు, తండ్రివైపు సక్రమమైన వంశము గలిగి, రూపవిద్యాశీల భావములు కలిగిన స్త్రీ ఉత్తమ కుల సంజాత, తనను బోలిన సత్కుల సంజాతుడు, సకల విద్యాపారంగతుడు, ఉత్తముడు అయిన వ్యక్తిని వివాహమాడి, అన్ని విషయములలోను భర్తలోనే పరమాత్ముణ్ణి చూస్తూ

స్థూలదేహ బుద్ధితో - భర్తకు దాసిగా
సూక్ష్మదేహ బుద్ధితో - తాను భర్త యొక్క అంశ అని
పారమార్థిక బుద్ధితో - తనకు భర్తకు భేదము లేదని

తన భర్తకన్న అన్యము శూన్యమని తలచి మనోవాక్కాయ కర్మలచే భర్తనే అనుసరించు స్త్రీ 'కులాంగన' అనబడుతుంది. అటువంటి రూపంలోనే పరమేశ్వరి ఉంటుంది కాబట్టి ఆమె కులాంగనా అని స్తుతించబడుచున్నది.

పతివ్రత అయిన స్త్రీ ఏ రకంగా రక్షించబడుతోందో, ఆ రకంగానే శ్రీవిద్య కూడా దాచబడుచున్నది. కులార్ణవ తంత్రంలో

**అన్యా స్తు సకలా విద్యాః ప్రకటా గణికా ఇవ ।**
**ఇయం తు శాంభవీ విద్యా గుప్తా కులవధూ రివ ॥**

ఇతర విద్యలు వేశ్యవలె బాహ్యమైనవి. శ్రీవిద్య కులస్త్రీవలె గుప్తమైనది.

అంతర్ముఖులైన వారికి మాత్రమే దేవి తన స్వరూపాన్ని ప్రకటింపచేస్తుంది.

## 93. కులాంతస్థా

కులము యొక్క మధ్యలో గౌరవప్రదంగా ఉండేది పరమేశ్వరి. మాతృ, మాన, మేయములలో మానరూపంగా తెలియతగినది. కులశాస్త్రముల మధ్యలో తెలియతగినదిగా ఉన్నది.

కులము అంటే విద్యావంశము. తన గురుసంప్రదాయానికి చెందిన అందరి యొక్క సమూహాన్నీ కులమంటారు. ఈ సమూహం మధ్యన ఉంటుంది కాబట్టి దేవి కులాంతస్థా అనబడుతోంది.

ప్రాణికోటిలోని జాతులన్నీ కులాలు. ఇక్కడ జాతులు అంటే మానవ, పశు, పక్ష్యాదులు. దీనిలో, మానవజాతిలో నాలుగు వర్ణాలు, స్త్రీ పురుష జాతులు ఉన్నాయి. స్త్రీలలో అనేక జాతులు, పురుషులలో అనేక జాతులు. ఈ రకంగా కన్ను, ముక్కు, చెవి, నోరు మొదలైన అవయవ భేదంచేత 33 రకాలున్నాయని చెప్పబడుతోంది. వీటన్నింటిలోను పరమేశ్వరి ఉన్నది. అంటే దేవి సర్వాంతర్యామి.

మూలధారమధ్యలో ధ్యానింపతగినది దేవి. అని కులశాస్త్రాలు చెబుతున్నాయి. సమయాచారులు మణిపూరంలో దేవిని ధ్యానిస్తే కౌళులు ఆధార స్వాధిష్ఠానాలలో దేవిని అర్చిస్తారు. ఇక్కడ కౌళాచారాన్ని క్లుప్తంగానైన చెప్పటం ఎంతైనా అవసరము.

పురుషార్థాలలో అర్థకామాలకే ప్రాధాన్యతనిచ్చేవారు కౌళులు, వీరికి బాహ్యమేకాని అంతఃపూజ లేదు. వీరు ప్రత్యక్షంగా శ్రీచక్రాన్ని పూజిస్తారు. కౌళాగమాలుగా పిలవబడే

64 తంత్రాలు వీరికి ప్రామాణికాలు. ఇవే దేవి పూజకు ఉత్తమమైనవని వీరి నమ్మకము. వీటి వివరాలకు నాచే వ్రాయబడిన శ్రీవిద్యా దర్శనము చూడండి.

కౌళులు షట్చక్రాలలో ఆధారచక్రాన్ని పూజిస్తారు. కుః అంటే పృథివీతత్త్వము. అది షట్చక్రాలలోను ఏచక్రమందున్నదో దాన్నే కులము అంటారు. అది ఆధారచక్రంలో ఉంటుంది. వీరు శ్రీచక్రానికి బాహ్యపూజ చేస్తారు. పృథివీ తత్త్వాత్మకమైన ఆధారచక్రాన్ని పూజిస్తారు. అందుకే వీరి ఆచారాన్ని కౌళాచారము అంటారు. ఆధారచక్రమే త్రికోణం. అందులోనే బిందు ఉన్నది. కౌళమతానుసారం త్రికోణమే బిందుస్థానం. బిందువే త్రికోణమునందు ఆరాధింపతగినది. కౌళాచారులు రెండు రకాలు.

1. పూర్వకౌళులు 2. ఉత్తరకౌళులు

పూర్వకౌళులు శ్రీచక్రాన్ని భూర్జరీ పత్రము, పట్టువస్త్రము, బంగారు వెండి రేకులమీద వ్రాసి దానిలోని త్రికోణాన్ని పూజిస్తారు. ఉత్తరకౌళులు స్త్రీ యొక్క ప్రత్యక్షయోనిని పూజిస్తారు. ఈ రెండు రకాల పూజలూ బాహ్యపూజలే. అందుచేత వారికి ఆధారచక్రమే పూజనీయమౌతుంది. అందులో ఉండే కుండలినినే కౌళిని అంటారు. త్రికోణపూజలో కౌళినియే ఉపాశ్య. ఆధారచక్రంలో కుండలినీ శక్తి సర్పాకారం ధరించి నిద్రావస్థలో ఉంటుంది. నిద్రావస్థలో ఉన్నప్పటికీ కుండలినీశక్తి పూజింపతగినదే. అందుకే ఆ పూజను తామిశ్రము అంటారు. ఆధార స్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. వాటిమీద కౌళులకు మాత్రమే అధికారం ఉంది. కుండలినీ ప్రబోధము ఎప్పుడు కలుగుతుందో, ఆ క్షణంలోనే వారికి ముక్తి కలుగుతుంది. వీరికి త్రికోణంలో భైరవీ భైరవులు పూజనీయులు. అందుచేతనే వారు ఆధారచక్రంలో శివశక్తులను భైరవీ భైరవులంటారు.

**జపాకుసుమ సంకా సౌ మధుఘూర్ణిత లోచనౌ ।**
**జగతః పితరౌ వందే భైరవీ భైరవాత్మ కౌ ॥**

ఆధారచక్రంలో భైరవీ భైరవులు జపాకుసుమము అంటే ఎర్రని మంకెన పూవు వంటి రంగుతో మధువును త్రాగటంచేత మత్తెక్కిన కళ్ళతో ఉన్నటువంటి, ఈ జగత్తుకు తల్లిదండ్రులయినటువంటి భైరవి, భైరవులకు నమస్కరిస్తున్నాను.

## 94. కౌళినీ

భవిష్య పురాణంలో

**పూజనీయా జనై ర్దేవీ స్థానే స్థానే పురే పురే ।**
**గృహే శక్తి పరై ర్గ్రామే గ్రామే వనే వనే ॥**

శాక్తేయులైన జనులచేత దేవి ప్రతి పట్టణము నందు, ప్రతి వనమునందు, ప్రతి గ్రామమునందు, ప్రతి గృహమునందు పూజింపబడదగినది.

తంత్రసారంలో

**కుళం శక్తిరితి ప్రోక్తం కులం శివ ముచ్యతే ।**
**కుళాకుళత్వ సంబంధః కౌళ మి త్యభిధీయతే ॥**

కుళము అంటే శక్తి. అకుళము అంటే శివుడు. కుళాకుళ సంబంధమే కౌళము. అంటే శివశక్తుల సంబంధమే కౌళము అని చెప్పబడింది.

మానవదేహంలో బ్రహ్మరంధ్రం క్రింద గల సహస్రారంలో తెల్లనిరంగులో ఉన్న వేయిదళములు కల పద్మమున్నది. అలాగే మూలాధారములో రక్తవర్ణ సహస్రదళమున్నది. వీటిని అకులా, కులపద్మాలంటారు. ఇవే శివశక్తి స్థానాలు. శివశక్తుల సామరస్యము కౌళము. ఆ కౌళము గలది కౌళిని.

## 95. కులయోగినీ

బాహ్యప్రదేశములో శ్రీచక్రాన్ని వ్రాసి పూజించే పద్ధతిని కౌళము అంటారు. కౌళాచారాన్ని 93వ నామంలో వివరించటం జరిగింది. కులపద్మంలో కుండలినీ స్వరూపంలో ఉండే దేవతను కులయోగిని అంటారు. శ్రీచక్రంలోని ఆవరణలలో ఉండే దేవతలను యోగినులు అంటారు. వీరందరూ దేవితోపాటుగా సమానమైన రూపలావణ్య పరాక్రమాలు కలిగి ఉంటారు. ప్రతి ఆవరణలోను వారిని ఒక్కొక్క పేరుతో పిలుస్తారు.

1. భూపురంలో – ప్రకట యోగినులు
2. షోడశదళంలో – గుప్తయోగినులు
3. అష్టదళంలో – గుప్తతరయోగినులు
4. మన్వస్రములో – సంప్రదాయ యోగినులు
5. బహిర్దశారములో – కుళోత్తీర్ణ యోగినులు (కులయోగినులు)
6. అంతర్దశారములో – నిగర్భయోగినులు
7. అష్టకోణములో – రహస్యయోగినులు
8. త్రికోణములో – అతిరహస్య యోగినులు
9. బిందువులో (సర్వానందమయ చక్రం) – పరాపర రహస్యయోగినులు

ఇందులో బహిర్దశారంలో ఉండే దేవతలను కులయోగినులు అంటారు. ఈ దేవతలరూపం కలది కాబట్టి పరమేశ్వరి కులయోగిని అనబడుతోంది.

పధ్నాలుగు లోకాలలోను మొత్తం 84 లక్షల జీవరాసులున్నాయి. ఆ జీవులయొక్క కర్మఫలాన్ననుసరించి భవిష్యత్తును ఏర్పాటుచేయు పరాత్పరిని కులయోగిని అంటారు.

**బాహ్యపూజారతాః కౌళాః క్షపణా శ్చ కపాలికాః**

**దిగంబర శ్చేతిహాసాః వామకా స్త్రంత్ర వాదినః**

కౌళాచారము అనేది బాహ్యపూజ. క్షపణకులు, కాపాలికులు, దిగంబరులు, ఇతిహాసులు, తంత్రవాదులు వామాచారులు మాత్రమే ఈ పూజను చేస్తారు.




శ్రీ 'ఈ'కార దేవి

# 11. సమయాచారము

సమయమతంలో ప్రధానమైనది కైవల్యము. వీరిది పారమార్థికదృష్టి. కర్మకాండవల్ల మోక్షము లభించదు, అని వీరు నమ్ముతారు. జీవాత్మ, పరమాత్మల ఏకీభావమే వీరి సిద్ధాంతము. వీరికి శుభాగపంచకము అని పిలువబడే సనక, సనందన, సనత్కుమార, వసిష్ఠ శుకసంహితలు ప్రమాణాలు. సమయాచారులకు బాహ్యపూజ లేదు. అంటే వారు శ్రీచక్రాన్ని వేరుగా పూజించరు. సనత్కుమార సంహితలో

**బాహ్యపూజా న కర్తవ్యా కర్తవ్యా బాహ్యజాతిభిః**

వైదికవాదులు, మోక్షవాదులు బాహ్యపూజలు చెయ్యరు. వీటిని బాహ్యజాతులవారు మాత్రమే చేస్తారు. బాహ్యజాతులవారు అంటే ఐహికమైన సుఖాలను కోరుకునేవారు.

**అంతరారాధనపరా వైదికా బ్రహ్మవాదినః**
**జీవన్ముక్తా శ్చరం త్యేతే త్రిషు లోకేషు సర్వదా ॥**

వైదికులు, బ్రహ్మవాదులు అందరూ అంతరారాధన మాత్రమే చేస్తారు. వీరు జీవన్ముక్తులై ముల్లోకాలలోనూ సదా సంచరిస్తుంటారు.

సమయాచారులలో కూడా ఒక తెగవారికి బాహ్యపూజ ఉన్నది. వారు శ్రీచక్రాన్ని విడిగా పూజిస్తారు. అంతరారాధనలో మూలమంత్రానికి ఋషి ఛందస్సు అవసరం లేదు. అవి కేవలం బాహ్యపూజలోనే కావాలి.

సమయాచారులు శివశక్తులను సమయుడు సమయ అంటారు. సమయ అంటే శివునితో సామ్యము అనగా పోలిక గలిగినశక్తి అని అర్థము. ఈ రకంగా శివశక్తులకు సామ్యము ఉన్నదని నమ్ముతారు కాబట్టే వీరిని సమయాచారులు అంటారు. ఈ సామ్యము 5 రకాలుగా ఉంటుంది.

1. అధిష్టాన సామ్యము – శివశక్తులిద్దరూ ఒకేస్థానాన్ని అధిష్టించి ఉండటము
2. అనుష్ఠానసామ్యము – ఇద్దరూ ఒకే పనిలో నిమగ్నమై ఉండటము.
3. అవస్థాసామ్యము – ఇద్దరూ ఒకే అవస్థలో ఉండటము
4. రూపసామ్యము – ఇద్దరూ ఒకే రూపంలో ఉండటము
5. నామసామ్యము – ఇద్దరి పేర్లూ ఒకే రకంగా ఉండటము

షట్చక్రాలలోని ప్రతి చక్రంలోను వీరికి ఈ రకంగా సామ్యం చెప్పబడింది. ఉదాహరణకు ఒక చక్రంలో చూద్దాం.

**ఆధారచక్రంలో :**

1. శివాశివులిద్దరికీ ఆధారచక్రమే అదిష్టానము. అందుచేత వీరికి అధిష్టాసామ్యము చెప్పబడింది.
2. ఇద్దరూ అక్కడ నాట్యం చేస్తుంటారు. ఇది అవస్థాసామ్యము
3. ఇద్దరూ జగత్తును సృష్టించే కార్యక్రమంలో నిమగ్నమై ఉంటారు. ఇది అనుష్టాన సామ్యము.
4. ఇద్దరూ ఎర్రని రంగులో ఉంటారు. ఇది రూపసామ్యము
5. ఇద్దరికీ భైరవి భైరవుడు, లేదానవాత్మ నవాత్మకుడు అని పేర్లు. ఇది నామసామ్యము.

ఈ రకంగా షట్చక్రాలలోనూ సామ్యముంటుంది. దీనిమీద మరిన్ని వివరాలకు నాచే వ్రాయబడిన శ్రీవిద్యా దర్శనము చూడండి.

ఇక్కడ 96 నుంచి 98 నామాలవరకు సమయాచారము వివరించబడుతోంది.

## 96. అకులా

సుషుమ్న నాడికిపైన గల సహస్రదళ పద్మాన్ని 'అకులము' అంటారు. షట్చక్రాలను దాటిన తరువాత సహస్రదళ పద్మము ఉంటుంది.

సహస్రదళ పద్మంలో ఎనిమిది పెద్దపెద్ద దళాలు ఎనిమిది దిక్కులకూ ఉంటాయి. ఒక్కొక్క దళంలో మళ్ళీ చిన్నచిన్న దళాలు 125 చొప్పున ఉంటాయి. ఈ రకంగా ఈ పద్మంలో వేయిదళాలు ఉంటాయి. మానవశరీరంలో రెండు సహస్రదళ పద్మాలున్నాయి. ఒకటి ఆధారచక్రానికి దిగువన, రెండవది ఆజ్ఞా చక్రానికిపైన వీటిలో క్రింద భాగాన ఉన్నది కులమని, పైన ఉన్నదాన్ని అకులమని అంటారు. కొన్నిచోట్ల కులము, అకులము అనేపేర్లు అటు ఇటు చెప్పబడుతున్నాయి. పాఠకులు గమనించగలరు. స్వచ్ఛందతంత్రంలో పరమేశ్వరి ఈ రెండు పద్మాలతోనూ కలిసి కులాకులమయ స్వరూపిణిగా ఉంటుంది అని చెప్పబడింది. సహస్రారానికి క్రింద భాగంలో, లలాటానికి పైన అకుల రూపంలో షట్చక్రాలతో సంబంధం లేకుండా సుధాసాగరంలో ప్రవేశించి ఆ పరమేశ్వరి విహరిస్తుంటుంది. ఆమె 'అకుల'

కులము, వంశము, జాతి, మొదలగు పదములచే సూచించబడేవన్నీ ఇంద్రియాలకు, ప్రాణాలకు సంబంధించినవి. కేవలము జ్ఞానస్వరూపిణి అయిన పరమేశ్వరికి వాటితో సంబంధం లేదు కాబట్టి ఆమె అకుల అనబడుతున్నది.

## 97. సమయాంతస్థా

హృదయాకాశంలో శ్రీచక్రాన్ని ఊహించి అక్కడ పరమేశ్వరిని అర్చించటాన్నే సమయమతం అంటారు. ప్రాచీన సంప్రదాయంలోని వైదిక పద్ధతిలో నిర్ణయించబడిన ఆచారాన్ని సమయాచారము అంటారు.

ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీశక్తిని నిద్రలేపి, షట్చక్రాలను దాటించి, సహస్రారానికి చేర్చి, మళ్ళీ ఆ శక్తిని అవరోహణ క్రమంలో మూలాధారానికి చేర్చటమే సమయాచారము.

బండి చక్రంలో నేలమీద తిరిగే పట్టా, చక్రానికి ఉన్న ఆకులు ఇవన్నీ లోపల ఉన్న ఇరుసును ఆధారంగా చేసుకుని తిరుగుతాయి. అలాగే పంచకోశాలు లోపల ఉండే వస్తువును ఆధారంగా చేసుకుని ప్రవర్తిస్తాయి. దానినే 'అంతస్థా' అంటారు. వైదిక కర్మలు చేసే సమయాచారుల అంతస్థమున ఉండునది ఆ పరమేశ్వరి అందుచేత ఆమె సమయాంతస్థా అనబడుతోంది.

సమయాచార గ్రంథాలచే ప్రతిపాదించబడుతోంది కాబట్టి సమయాంతస్థా అనబడుతోంది. శివాశివులకు పంచసామ్యాలున్నాయని ముందే చెప్పాం. ఆ పంచసామ్య రూపంలో ఉండేది కాబట్టి సమయాంతస్థా అనబడుతోంది.

## 98. సమయాచారతత్పరా

సమయాచారమునందు ఆసక్తిగలది ఆ పరమేశ్వరి. సమయాచారాన్ని గురించి ముందే వివరించటం జరిగింది. దక్షిణామూర్తి ఋషిగా, కామేశ్వరీ కామేశ్వరులు అధిదేవతలుగా ఉన్న మంత్రానుష్ఠానమే సమయాచారము. శివశక్తులకు పంచసామ్యమున్న దని చెప్పటమే సమయాచారము. ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీశక్తిని నిద్రలేపి సహస్రారానికి చేర్చి మళ్ళీ ఆ శక్తిని ఆధారచక్రానికి చేర్చటమే సమయాచారము. వ్యాస, పాణిని, సూర్య, పింగళ, యాస్క, మను, యాజ్ఞవల్క్య, ఆపస్తంబ, గౌతమ ఋషులు వ్రాసిన శ్రుతులు సమయాచారాన్ని బోధించాయి. వీటి ప్రకారము పరమేశ్వరిని

అర్చించటమే సమయాచారము. హృత్పద్మంలోనే పరమేశ్వరిని భావన చేసి, షట్చక్రాల లోనూ భావనోపనిషత్తులో చెప్పిన విధంగా అర్చన చెయ్యటమే సమయాచారము. దీనిమీద మరిన్ని వివరాలకు నాచే వ్రాయబడిన 'భావనోపనిషత్తు' చూడండి.

ఈ విధమైన సమయాచారము నందు ఆసక్తిగలది ఆ పరమేశ్వరి.

గురువు వద్ద మహావేధ అనే సంస్కారము పొంది షట్చక్రబేధనము, చతుర్విధైక్య సంధానము తెలుసుకుని, వాటి ప్రకారము దేవిని అర్చించటాన్ని అంతర్యాగము అంటారు. ఈ రకమైన అర్చనయందు దేవి ఇష్టపడుతుంది. అందుచేతనే ఆమె 'సమయాచార తత్పరా' అనబడుతోంది.

దేవీపూజ శ్రేష్ఠము, స్మార్త పూజ ఉత్తమము, పౌరాణికపూజ మధ్యమము తాంత్రికపూజ అధమము అని చెప్పబడింది.

**మకారపంచకము :** పరమేశ్వరి అర్చనలో మకార పంచకము తప్పనిసరిగా ఉండాలి. మకారపంచకము అంటే తంత్రశాస్త్రాలలో

**మద్యం మాంసం తథా మత్స్యం ముద్రా మైధున మేవ చ**

**శక్తిపూజా విధానాద్యైః పంచతత్త్వః ప్రకీర్తితః**

ఈ మకార పంచకాన్ని వాడేటప్పుడు వాచ్యార్థాని బట్టి వస్తువులను వాడరాదు. అజ్ఞానులు బాహ్యార్థాన్ని గ్రహించి జుగుప్సాకరము, హింసాత్మకము అయిన పనులు చేస్తున్నారు. దానివల్ల భ్రష్టులవుతారు. శక్తి సంగమతంత్రంలో

| | | |
|---|---|---|
| బెల్లపు పానకము | – | మద్యము |
| తెలకపిండి, గారెలు | – | మాంసము |
| వెల్లుల్లి, తిత్తిడిపదార్థాలు | – | మత్స్యము |
| గోధుమలు మినుములచే చేయబడిన పదార్థాలు | – | ముద్ర |
| భక్ష్యభోజ్యముల కలయికే | – | మైధునము |

అని చెప్పబడింది. ఇది కౌళాచారము మహానిర్వాణ తంత్రంలో

**న మద్యం మాధవీ మద్యం, మద్యం శశికిరణ రసోద్భవం**

**కర్మాకర్మ పశూన్ హత్వా జ్ఞానఖడ్గేన చేశ్వరీ**

**మనోమీనం తృతీయే చ హత్యాసంకల్ప వాసనః**

**భక్ష్యభోజ్యాన్నం భక్ష్య మింద్రియనిగ్రహః తాం చతుర్థాం విజానీయాత్**

**హంసఃసోహం శివః శక్తి శ్చైవ ఆనందనిర్మలః పంచమీంతాం విజానీయాత్**

1. చంద్రబింబము నుంచి జాలువారు అమృతమే మద్యము.
2. కర్మాకర్మలను పశువులను జ్ఞానఖడ్గంతో సంహరించటమే మాంసము.
3. మనస్సే మత్స్యము దాని సంకల్పవాసనలను హరించుటయే మత్స్య సమర్పణ.
4. ఇంద్రియ నిగ్రహమే భక్ష్యభోజ్యాలు. ఇది ముద్ర
5. హంసస్సోహం అనే మంత్రార్థమయిన శివశక్తుల కలయికయే మైథునము.

ఇది సమయాచారము. అయితే జ్ఞాని అయినవాడు పరమేశ్వరిని పంచపుష్పాలతో పూజిస్తాడు. అవి

**అహింసా ప్రథమం పుష్పం పుష్ప మింద్రియనిగ్రహః**

**దయాక్షమాజ్ఞానపుష్పం పంచపుష్పం తతః పరమ్ ॥**

ఈ విషయాలు తెలుసుకుని పరమేశ్వరిని అర్చన చేసిన వాడికి ముక్తి లభిస్తుంది.



శ్రీ ఉకార దేవి

# 12. గ్రంథిభేదనము

మానవుడి శరీరంలో షట్చక్రాలున్నాయి. అవి

| | | |
|---|---|---|
| 1. మూలాధారము | 3. మణిపూరము | 5. విశుద్ధి చక్రము |
| 2. స్వాధిష్ఠానము | 4. అనాహతము | 6. ఆజ్ఞా చక్రము |

ఈ ఆరుచక్రాలకు పైన సహస్రదళ పద్మమున్నది. ఈ చక్రాలలో రెండు రెండు చక్రాల తరువాత ఒక గ్రంథి ఉంటుంది. గ్రంథి అనేది చిన్న ముడి లాంటిది. వెదురుబొంగుకు కణుపులాంటిది ఈ గ్రంథి.

| | | |
|---|---|---|
| ఆధార, స్వాధిష్ఠానాల తరువాత | – | బ్రహ్మగ్రంథి |
| మణిపూర, అనాహత చక్రాల తరువాత | – | విష్ణుగ్రంథి |
| అనాహత, ఆజ్ఞా చక్రాల తరువాత | – | రుద్రగ్రంథి |

ఈ రకంగా మూడు గ్రంథులు ఉంటాయి. పంచదశీ మహామంత్రంలోని మూడు హ్రీంకారాలే ఈ మూడు గ్రంథులు. శ్రీచక్రంలోని మూడు వృత్తాలే ఈ మూడు గ్రంథులు అని చెప్పబడుతున్నాయి.

ఆధారచక్రంలో స్వయంభూలింగానికి మూడున్నర చుట్లు చుట్టుకుని, అధోముఖంగా నిద్రావస్థలో ఉంటుంది. కుండలినీ శక్తి. ఆ శక్తియే సాక్షాత్తూ పరమేశ్వరి స్వరూపము.

**ధ్యాయేత్ కుండలినీం దేవీం ఇష్టదేవస్వరూపిణీం ।**
**సదా షోడశవర్షీయాం పీనోన్నతపయోధరామ్ ॥**

**నవయౌవన సంపన్నాం సర్వాభరణ భూషితాం ।**
**పూర్ణచంద్ర ప్రభాం రక్తాం సదా చంచలలోచనామ్ ॥**

కంకాళమాలినీ తంత్రంలో ఈ కుండలినీ శక్తి పరబ్రహ్మ స్వరూపము అని చెప్పబడింది.

**కోటిచంద్ర ప్రతీకాశం పరబ్రహ్మ స్వరూపిణీం ।**
**చతుర్భుజాం త్రినేత్రాం చ వరదాభయ కరాంతథా ॥**

**తథా పుస్తకవీణాం చ ధారిణీం సింహవాహినీం ।**
**గచ్ఛంతీం స్వాపనాం భీమాం నానారూప ధరాత్మికాం ॥**

రుద్రయామళంలో ఎనిమిది శ్లోకాలతో కుండలినీ స్తవంకూడా ఉన్నది.

ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీశక్తిని జాగృతం చెయ్యాలి. దీనికి అనేకరకాల అభ్యాసాలున్నాయి. వాటిలో వామకేశ్వరతంత్రంలో చెప్పినదాన్ని గతంలో వివరించాము. తంత్రసారంలో కూడా ఇంచుమించు ఇలాంటి పద్ధతే చెప్పబడింది.

మానవశరీరంలో బ్రహ్మనాడికి రెండు వైపులా ఆధారచక్రంనుంచి ముక్కు రంధ్రంపై దాకా ఇడా, పింగళా అనే రెండు నాడులు వ్యాపించి ఉంటాయి. వీటిలో ఇడానాడి చంద్రనాడి. ఇది పిత్రుయానము. ఇది ఎడమవైపు ఉంటుంది. శరీరంలోని కుడిభాగంలో పింగళానాడి ఉంటుంది. ఇది సూర్యనాడి దేవయానము. ఈ నాడులలో చంద్రసూర్యులు ఉఛ్వాసనిశ్వాసల రూపంలో తిరుగుతుంటారు. ముందుగా చంద్రుడు తనకిరణాల ద్వారా అమృతాన్ని స్రవింపచేస్తూ వెడుతుంటాడు. ఆ వెనకవచ్చే సూర్యుడు ఆ అమృతపు బిందువులను హరించి వేస్తుంటాడు. ఈ రకంగా వీరిద్దరూ తిరుగుతూ ఆధారచక్రంలో కలుస్తారు. చంద్రసూర్యులు ఎప్పుడైతే ఒక చోట కలిశారో ఆ రోజు అమావాస్య. అంటే వారు ఆధారచక్రంలోకి వచ్చినప్పుడు అమావాస్య. ఆ రోజు పరమేశ్వరికి (కుండలినీ శక్తికి) అర్చన ఉండదు. ఆధారచక్రంలోకి సూర్యచంద్రులు వచ్చినప్పుడు అమావాస్య కాబట్టే ఆధార స్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు అని చెప్పబడుతున్నాయి. అక్కడ కౌళులకు తప్ప సమయులకు ప్రవేశం లేదు.

చంద్రుని కిరణాలనుండి జాలువారే అమృతపు బిందువులను ఆహారంగా తీసుకుని, కుండలినీశక్తి సుఖంగా నిద్రిస్తూ ఉంటుంది. ఇప్పుడు దాన్ని జాగృతం చెయ్యాలి అంటే చంద్రసూర్య గమనాన్ని ఆపాలి. అంటే ఉఛ్వాస నిశ్వాసలను బంధించాలి. అనగా ప్రాణాయామం చెయ్యాలి. సాధకుడు ఎప్పుడైతే శ్వాసను బంధించాడో, అప్పుడు చంద్రగమనం ఆగిపోతుంది. దాంతో చంద్రకిరణాల నుంచి అమృతపు జల్లులు జాలువారవు. ఆ అమృతపు జల్లులే ఆహారంగా గల కుండలినీశక్తికి ఆహారం దొరకదు. నిరాహార అవుతుంది. అప్పుడు ఆ శక్తి జాగృతమై బుసలు కొడుతూ ఊర్ధ్వముఖంగా ప్రయాణించి సహస్రారం చేరుతుంది. ఇప్పుడు 99వ నామాన్ని చూద్దాం.

## 99. మూలాధారైక నిలయా

మూలాధారము. ఇది గుదస్థానంలో ఉంటుంది. నాలుగు దళాలు గల పద్మము. సుషుమ్నా నాడి ఇక్కడినుంచే బయలుదేరుతుంది. కుండలినీ శక్తి ఇక్కడ నిద్రావస్థలో ఉంటుంది. ఇది మాయ. ఆ శక్తి నిద్రావస్థలో ఉన్నంతవరకు సిరిసంపదలు, భోగభాగ్యాలు, భార్యాపిల్లలు ఇవే నిత్యమనిపిస్తుంది. కనిపించని పరబ్రహ్మ కోసం ప్రాకులాడటం

అనవసరం అనిపిస్తుంది. ఆ కుండలినీ శక్తి మేల్కొనగానే మాయ తొలగిపోతుంది. నేను నాది అనే భ్రాంతి నశిస్తుంది.

నిద్రావస్థలో ఉన్న కుండలినీ శక్తికి, సుషుమ్న నాడికి ఆధారం కావటంచేతనే ఈ చక్రాన్ని ఆధారచక్రము అంటారు. ఆ పరమేశ్వరి ఇక్కడ ఉంటుంది. కాబట్టే ఆమె 'మూలాధారైక నిలయా' అనబడుతుంది.

ఆధారచక్రంలో శివాశివులు దాసాని పూలవలె ఎఱ్ఱని రంగుతో, మధుపానంవల్ల మత్తెక్కిన నేత్రములతో జగత్తును సృష్టి చేసే కార్యక్రమంలో నిమగ్నులై భైరవీ భైరవులని పిలువబడుతుంటారు.

## 100. బ్రహ్మగ్రంథి విభేదినీ

గ్రంథి అంటే చిన్నముడి అని ఇదివరకే చెప్పాం.

**గ్రంథి ర్నామ సత్యాసత్య ద్వయస్య**

చిక్కుముడిగా ఉండి విడదీయటానికి వీలుకాని స్థితిని గ్రంథి అంటారు. సత్యాసత్యాల స్థితిని స్పష్టంగా వివరించటానికి వీలు కానిదాన్ని గ్రంథి అంటారు. ఆధార స్వాధిష్టాల తరువాత ఉండేది బ్రహ్మగ్రంథి. బ్రహ్మ అంటే సంకల్పము, సృష్టి, ప్రపంచ వ్యవహారానికి మూలమైన విషయాలు. ఇవన్నీ ఇక్కడ చిక్కుముడిగా పడి ఉంటాయి. మానవుడు నేను నాది అనే మాయలో పడి కొట్టుమిట్టాడుతూ ఉంటాడు. కుండలినీ శక్తిని నిద్రలేపి ఊర్ధ్వముఖంగా నడిపిస్తే ముందుగా అది బ్రహ్మగ్రంథిని భేదిస్తుంది. అంటే సాధకుడికి నేను నాది అనే భావం పోగొట్టి స్వస్వరూప జ్ఞానం కలిగిస్తుంది. సృష్ట్యాది సంబంధాలను భేదించి పునర్జన్మ రహితమైన ముక్తిని ప్రసాదిస్తుంది. ఇదే బ్రహ్మగ్రంథి భేదనము.

## 101. మణిపూరాంతరుదితా

నాభిస్థానంలో పదిదళాలతో ప్రకాశించే పద్మాన్ని మణిపూరమంటారు. ఇది సూర్యమండలము జలతత్త్వాత్మకమైనది. దీనిలో ఆధారస్వాధిష్ఠానాలకు ప్రతీకలుగా పది దళాలుంటాయి. ఇది మణులచే పూరించబడి ఉంటుంది. కాబట్టి దీన్ని మణిపూరకము అంటారు. సూర్యచంద్రాగ్నులు మణిపూరంలో ప్రకాశిస్తాయని, వాటికాంతులే మణులని అరుణోపనిషత్తులో చెప్పబడింది. ఈ చోటనే పిండోత్పత్తి, దాని అభివృద్ధి జరుగుతుంది.

సమయాచారులు పరమేశ్వరిని ఇచ్చట నుండే పూజిస్తారు. ఇక్కడ దేవి చతుర్ద్వైక్య సంధానము చేసినవారికి చతుర్భుజగాను, షడ్విధైక్య సంధానము చేసినవారికి దశభుజగాను దర్శనమిస్తుంది. చతుర్భుజగా కాళిదాసు దేవిని స్తుతిస్తూ

**చతుర్భుజే ! చంద్రకళావతంసే కుచోన్నతే ! కుంకుమరాగశోణే ! ।**
**పుంద్రేక్షు పాశాంకుశ పుష్పబాణ హస్తే ! నమ స్తే జగదేకమాతః ॥**

లఘుస్తవంలో చెప్పినట్లుగా దేవి దశభుజ.

**వామే పుస్తకధారిణీ మభయదాం సాక్షస్రజం దక్షిణే**
**భక్తేభ్యో వరదాన పేశలకరాం కర్పూరకుందోజ్వలాం ।**
**ఉజ్జృంబాంబుజ పత్రకాంతి నయన స్నిగ్ధ ప్రభాలోకనీం**
**యే త్వా మంబ ! న శీలయంతి మనసా తేషాం కవిత్వం కుతః ? ॥**

సూర్యమండల మధ్యవర్తి అయి ఎర్రని ఛాయతో వెలుగొందుతున్న ఆ పరమేశ్వరిని ఆరాధించినట్లైతే సాధకుని యొక్క కోర్కెలు అన్నీ నెరవేరుతాయి. లేడి కనులు గల జవరాండ్రు అతడికి వశమౌతారు. చర్చాస్తవంలో

**యే చింతయం త్యరుణమండలమధ్యవర్తి**
**రూపం త వాంబనవయావకపంకరమ్యమ్ ।**
**తేషాం సదైవ కుసుమాయుధబాణభిన్న**
**వక్షస్థలా మృగదృశో వశగా భవంతి ॥**

అని చెప్పబడింది.

## 102. విష్ణుగ్రంథివిభేదినీ

మణిపూర అనాహత చక్రాలకుపైన విష్ణుగ్రంథి ఉన్నది. దీనికి అధిపతి విష్ణువు. ఆధార చక్రం నుంచి బయలుదేరిన కుండలినీశక్తి మణిపూర అనాహతాలను దాటి విష్ణుగ్రంథిని ఛేదిస్తుంది. అంటే పోషణకు సంబంధించిన సర్వజీవుల పాలనావ్యవహారము, పోషణఅనే భావాలు నశించటమే విష్ణుగ్రంథి భేదన. సాధకుడికి తనవల్లనే ఈ జగత్తంతా నడుస్తోందన్న భావన నశిస్తుంది. అహంకారంవల్ల, తానే ఈ పనులకు కర్తననే కర్తృత్వ భావనవల్ల ఆత్మానందం పొందటానికి ఆటంకం ఏర్పడుతుంది. వాటిని వదలటానికే విష్ణుగ్రంధిని భేదన చెయ్యాలి. దేవి అనుగ్రహానికి పాత్రులైనవారే ఈ పని చేయగలరు.

## 103. ఆజ్ఞాచక్రాంతరాళస్థా

కనుబొమల మధ్యన రెండు దళములు గల పద్మము. ఇక్కడ నుండే శరీరంలోని అన్ని భాగాలకు ఆజ్ఞలు జారీ అవుతుంటాయి. ఆజ్ఞాచక్రానికి కుండలినీశక్తిని ప్రయాణింప చేసే సాధకుడు గురువు ఆజ్ఞ పొందుతాడు. ఈ చక్రం చేరేదాకా మనసును నిగ్రహించు కుంటూ అభ్యాసము చేసినట్లైతే జ్ఞానస్పర్శ కలుగుతుంది. అటువంటి ఆజ్ఞా చక్రం మధ్యలో దేవి నివసిస్తుంది. ఈ చక్రాన్ని ఓఢ్యాణపీఠము, ప్రయాగక్షేత్రము అంటారు.

ఆజ్ఞాచక్రము శబ్దోత్పత్తి స్థానము. ఇది ఇడ, పింగళ, సుషుమ్నానాడుల సంగమస్థానము. దీనినే త్రివేణీ సంగమము అంటారు. ఇక్కడ ఉండే దేవినే ఆజ్ఞా చక్రాంతరాళస్థా అంటారు.

**ఆజ్ఞాత్మక ద్విదళ పద్మగతే ! తదానీం విద్యున్నిభే ! రవి శశి ప్రయుతోత్కటాభే!।**
**గండస్థల ప్రతిఫల త్కరదీపజాల కర్ణావతంసకలికే ! కమలాయతాక్షి ! ॥**

## 104. రుద్రగ్రంథివిభేదినీ

షట్చక్రాలలోను ఆరవదయిన ఆజ్ఞాచక్రం దాటినతరువాత రుద్రగ్రంథి ఉంటుంది. రుద్రుడు లయకారకుడు. కాబట్టి రుద్రగ్రంథిని ఛేదించినట్లైతే సర్వమూ లయం చేసి సాధకుడికి దేవి అమృతత్త్వాన్ని ప్రసాదిస్తుంది.

శ్రీవిద్యా మంత్రమయిన షోడశాక్షరిలో నాలుగు భాగాలున్నాయి.

**కామరాజమంత్రాంతే శ్రీబీజేన సమన్వితా ।**
**షోడశాక్షరీ విద్యేయం శ్రీవిద్యేతి ప్రకీర్తితా ॥**

పంచదశీ మహామంత్రానికి చివర శ్రీం బీజము చేర్చినట్లైతే షోడశాక్షరి అవుతుంది. అదే శ్రీవిద్యామంత్రము.

ఈ మంత్రం నాలుగు ఖండాలుగా ఉంది. అవి

1. అగ్ని, 2. సూర్య 3. సౌమ్య 4. చంద్రకళలు ఇది నాలుగు కూటాలుగా చెప్పబడుతున్నది అవి

1. వాగ్భవకూటము
2. కామరాజకూటము
3. శక్తికూటము
4. తురీయాకూటము

వీటిలో రెండు రెండు కూటాలకు మధ్యన హృల్లేఖ (హ్రీం) ఉన్నది. ఈ రకంగా నాలుగు కూటాలకు మధ్యన మూడు హృల్లేఖలున్నాయి. ఈ హ్రీంకారాలే షట్చక్రాలలో చెప్పబడిన బ్రహ్మ, విష్ణు, రుద్రగ్రంథులు. దేవి ఈ గ్రంథిత్రయాన్ని ఛేదిస్తుంది. అంటే సాధకుడికి అమృతత్త్వం ప్రసాదిస్తుంది.

మట్టితో చేయబడినవి, శిలలతో నిర్మించబడినవి అయిన దేవతా విగ్రహాలు కాని, పుణ్యనదీ స్నానాలు కాని, క్షేత్రదర్శనం కాని మానవుణ్ణి ఉద్ధరించటానికి చాలాకాలం పడుతుంది. కాని

**"యోగినాం దర్శనం పుణ్యం స్పర్శనం పాపనాశనమ్"**

గ్రంథిభేదము చేసిన యోగులను దర్శించినంత మాత్రంచేతనే పుణ్యం కలుగుతుంది. వారిని స్పర్శించినంత మాత్రం చేతనే పాపప్రక్షాళనమౌతుంది. అలాంటప్పుడు గ్రంథిభేదన చేసిన యోగికి వచ్చే ఫలము ఏ విధంగా ఉంటుందో వివరించలేము కదా.

గౌడపాదులవారు తమ సుభగోదయ స్తుతిలోని 6వ శ్లోకంలో కుండలినీ శక్తికి మూడు దశలున్నాయన్నారు.

**కుమారీ యన్మంద్రం ధ్వనతి చ తతో యోషి దపరా**
**కులం త్యక్త్వా రౌతి స్ఫుటతి చ మహాకాలభుజగీ ।**
**తతః పాతివ్రత్యం భజతి దహరాకాశ కమలే**
**సుఖాసీనా యోషా భవసి భవసీత్కార రసికా ॥**

1. నిద్రావస్థ. ఆ శక్తి సుఖంగా నిద్రిస్తూ ఉంటుంది. 2. ప్రయాణావస్థ. నిరాహార అయిన కుండలిని మేల్కొని ఊర్ధ్వముఖంగా ఫూత్కారం చేస్తూ ప్రయాణిస్తుంది. 3. సుఖావస్థ. సహస్రారంలో శివునితో కలసి సుఖిస్తుంది. ఇప్పుడు గ్రంథిత్రయాన్ని ఛేదించి మూడవ స్థితికి చేరబోతోంది. కుండలినీ శక్తి.

## 105. సహస్రారాంబుజారూఢా

బ్రహ్మరంధ్రానికి కొద్ది క్రిందగా గల సహస్రదళ పద్మమునందు దేవి ఉంటుంది.

యోగి ఆజ్ఞా చక్రము దాటిన తరువాత మహానాదాన్ని దర్శిస్తాడు. బ్రహ్మరంధ్రానికి కొద్దిగా క్రింద సహస్రదళ పద్మము ఉన్నది. అది పూర్ణచంద్రుడిలాగా ప్రకాశిస్తూ ఉంటుంది. దాని కాంతి కిరణాలు సూర్యకిరణాలవలె ప్రకాశిస్తుంటాయి. అక్కడ అకారాది సర్వవర్ణములు ఉన్నాయి. సహస్రారము అనేది ఎనిమిది దళాలు కలిగిన పద్మము

ఇందులోని ఒక్కొక్క దళంలోనూ నూటిరవై ఐదు చొప్పున రేకులుంటాయి. ఈ రకంగా మొత్తం వెయ్యిదళాలుంటాయి. ఇందులోని ఎనిమిది దళాలు, ఎనిమిది దిక్కులకు తిరిగి ఉంటాయి. సహస్రదళ పద్మంలోని ఒక్కొక్క భాగము మానవునిలోని ఒక్కొక్క లక్షణానికీ ప్రతీక.

| | | |
|---|---|---|
| తూర్పు దిక్కు | – | సద్బుద్ధి |
| ఆగ్నేయం | – | నిద్ర, దప్పిక |
| దక్షిణము | – | క్రూర బుద్ధి |
| నైరుతి | – | తాపబుద్ధి |
| పడమర | – | విలాసము |
| వాయువ్యము | – | నడచుట మొ॥ విషయములు |
| ఉత్తరము | – | సురతమునందు ఆసక్తి |
| ఈశాన్యము | – | దానగుణం |
| పద్మాంతరాళం | – | ఇహ, పరలోక విముక్తి |
| కింజిల్కము (కేసరములు) | – | మెలకువ |
| తామరదుద్దు | – | కల |
| దుంప | – | నిద్ర |

ఈ రకంగా ఉన్న సహస్రదళ పద్మంలో కళంక రహితుడైన చంద్రుడున్నాడు. ఆ చంద్రమండలానికి మధ్యన త్రికోణమున్నది. దానియందు మహాశూన్యమున్నది. దానిని దేవతలు రహస్యంగా సేవిస్తుంటారు. సర్వాంతర్యామి అయిన పరమేశ్వరుడు ఇక్కడే ఉంటాడు.

**శివస్థానంశైవాః పరమపురుషం వైష్ణవగణాః**
**లపం తీతి ప్రాయో హరిహరపదం కేచి దపరే ।**
**పదం దేవ్యా దేవీచరణ యుగళాంభోజరసికా**
**మునీంద్రా అప్యన్యే ప్రకృతిపురుష స్థాన మమలమ్ ॥**

శైవులు ఈ స్థానాన్ని శివస్థానము అంటారు. వైష్ణవులు పరమపురుష స్థానము అంటారు. మిగిలినవారు హరిహరస్థానము అంటారు. దేవీభక్తులు దీన్ని దేవీస్థానమంటారు.

ఈ స్థానాన్ని తెలుసుకున్న వాడికి పునర్జన్మ లేదు. ఇహలోకబంధాలు ఉండవు. పాపపుణ్యాలు లేవు. సాధకుడికి ఇష్టార్థసిద్ధి కలుగుతుంది. అట్టి సహస్రార పద్మంలో

ఉంటుంది కాబట్టి దేవిని సహస్రారాంబుజారూఢా అంటారు. షట్చక్రాలను దాటి సహస్రారంలో ప్రవేశించిన కుండలినీ శక్తి సాధకుడికి సర్వతోముఖ తేజస్సు కలిగించి, అనంతమైన ఆనందాన్నిస్తుంది. సాధకుడికి వాక్సిద్ధి కలుగుతుంది. భూత, భవిష్యత్ వర్తమానాలు తెలుస్తాయి. అటువంటి వ్యక్తికి ఈ లోకం నీరాజనాలర్పిస్తుంది. మహారాజులుకూడా అతనికి పాదాభివందనం చేస్తారు. అంటున్నారు దుర్వాసులవారు తమ శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 40వ శ్లోకంలో

**ఏవం యః స్మరతి ప్రబుద్ధ సుమతిః శ్రీమత్స్వరూపం పరం**
**వృద్ధో ఽప్యాశు యువా భవ త్యనుపమః స్త్రీణా మనంగాయతే ।**
**సోఽ ష్టైశ్వర్య తిరస్కృతాఖిలసురః శ్రీజృంభితాత్మాలయః**
**పృథ్వీపాల కిరీట కోటి వలభీ పుష్పార్చితాంఘ్రి ర్భవేత్ ॥**

## 106. సుధాసారాభివర్షిణీ

సహస్రకమలము యొక్క కర్ణిక నుండి అమృతధారలు వర్షిస్తాయి.

**అమృతస్య ధారా బహుధా దోహమానం ।**
**చరణం నో లోకే సుధితాం దధాత్వి ॥**

ఆమె చరణకమలము అమృతధారలను వర్షించును. ఆ ధారలు లోకంలోని అన్ని దిక్కులకు వ్యాపించి మనకు తృప్తినిచ్చునుగాక.

ఇంతవరకు చెప్పిన గ్రంథి భేదనానికి ఫలము ఇక్కడ వివరించబడుతోంది. పరమేశ్వరుడు ప్రకాశాంశ. పరమేశ్వరి విమర్శాంశ. ఆధారచక్రంలో నిద్రిస్తున్న కుండలినీ రూపమైన పరమేశ్వరి సహస్రారం చేరి ప్రకాశాంశ అయిన పరమేశ్వరుణ్ణి కూడి సుధా ధారలు వర్షిస్తుంది. ఈమెయే వాగ్దేవి, సరస్వతి, భారతి, ఇడా అని వేదంలో చెప్పబడింది. ఈ యోగానికి ఫలము మోక్షప్రాప్తి.

సహస్రారంలో చంద్రమండలమున్నది. అదే సుధాసముద్రము. అతిచల్లగా ఉంటుంది. దేవి అగ్నిస్వరూపిణి. ఆధారచక్రంలోని కుండలినీశక్తి ఎప్పుడైతే సహస్రారం చేరిందో అప్పుడు ఆ దేవి యొక్క అగ్నితత్త్వానికి, చంద్రమండలంలో ఘనీభవించి ఉన్న సుధారసము ద్రవీభవించి, ధారలుగ వర్షిస్తుంది. శరీరంలో చంద్ర, అగ్నులు సమానంగా ఉన్నంతవరకే మానవుడి శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. ఈ రెండింటిలోను తేడా వచ్చినట్లైతే మానవుడి ఆరోగ్యంలో కూడా మార్పు వస్తుంది.

జీవుడు తన సాధనద్వారా పరమేశ్వరితో తాదాత్మ్యం పొంది అమృతత్త్వ స్థితిని చేరుకుంటాడు. అలాంటివాడికి జన్మరాహిత్యం కలుగుతుందని **లలితా సహస్రనామ ఫలశృతి**లో చెప్పబడింది. అందుచేతనే

**చరమేజన్మని శ్రీవిద్యోపాసకో భవేత్**

ఆఖరి జన్మలో శ్రీవిద్యోపాసకుడవుతాడు.

## 107. తటిల్లతా సమరుచిః

మెరుపు తీగతో సమానమైన కాంతి కలది.

**తటి త్సౌదామిన్యేవ లతా వల్లీ, తయా సమా రుచిః కాంతిఃయస్యాః సా**

నల్లని మేఘముల మధ్య మెరుపు తీగవలె ప్రకాశించేది. మానవ శరీరంలో ముఖ్యమైన నాడులు మూడు. అవి 1. ఇడ 2. పింగళ 3. సుషుమ్న. వీటిలో ఇడ పింగళానాడులు ఒకదానితో ఒకటి పెనవేసుకుని ఉంటాయి. ఆ మధ్యన సుషుమ్న ఉంటుంది. ఇది ఆధారచక్రం నుంచి సహస్రారందాకా వ్యాపించి నీలిమేఘముల మధ్యన ప్రకాశించే మెరుపుతీగలాగా ఉంటుంది.

**నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖే వ భాస్వరా**

సౌందర్య లహరిలో శంకరులవారు ఈ విషయాన్ని వివరించారు.

**తటిల్లేఖా తన్వీం తపనశశి వైశ్వానరమయీాం**
**నిషణ్ణాం షణ్ణా మప్యపురి కమలానాం తవ కలామ్**
**మహాపద్మాటవ్యాం ధితమల మాయేన మనసా**
**మహాన్తః పశ్యంతో దధతి పరమాహ్లాదలహరీమ్ ॥**

మెరుపుతీగ వలెనుండునది, సహస్రారమునందు మహాపద్మాటవిలో ఉన్న నీ సాదాఖ్యకళను ధ్యానించు సజ్జనులు పరమానందము పొందుతారు.

## 108. షట్చక్రోపరి సంస్థితా

1. మూలాధారము 2. స్వాధిష్ఠానము 3. మణిపూరకము 4. అనాహతము 5. విశుద్ధిచక్రము 6. ఆజ్ఞాచక్రము వీటిపైన ఉన్న సహస్రారమందుండునది. వీటిలో రెండు రెండు చక్రముల తరువాత ఒక గ్రంథిచొప్పున గ్రంథిత్రయము కూడా ఉన్నది. ఆ గ్రంథిత్రయాన్ని కూడా దాటి సహస్రారంలో దేవి ఉంటుంది. సహస్రారము అనేది

చంద్రమండలము అదే సుధాసముద్రము. అక్కడ చింతామణి గృహంలో పంచబ్రహ్మాసనం మీద దేవి ఆసీనురాలయి ఉంటుంది. సౌందర్య లహరిలోని 92వ శ్లోకంలో

**గతా స్తే మఞ్చత్వం ద్రుహిణ హరి రుద్రేశ్వరభృతః**
**శివ స్వచ్ఛచ్ఛాయా కపట ఘటిత ప్రచ్ఛదపటః ।**
**త్వదీయానాం భాసాం ప్రతిఫలనరాగారుణతయా**
**శరీరీ శృఙ్గారో రస ఇవ దృశాం దోగ్ధి కుతుకమ్ ॥**

## 109. మహాసక్తిః

మహః అంటే తేజస్సు, ఉత్సవము అని అర్థం. దేవి మహా ఆసక్తి కలది. అంటే ప్రకాశాంశ అయిన జ్యోతి స్వరూపుడగు పరమేశ్వరుని యందు ఆసక్తి కలది. అనగా పరమేశ్వర సమాగమంలో ఆసక్తి కలది. సంశయములేని ఆత్మజ్ఞానమునందు ఆసక్తి కలది. పరబ్రహ్మ స్వరూపమునందు అభేదము కలది. తాను, పరబ్రహ్మ రెండూ ఒక్కటే. దేవియే పరబ్రహ్మ స్వరూపము. కామేశ్వరుని సంయోగానికై దేవి ఎప్పుడూ ఎదురు చూస్తుంటుంది. ఆత్మానందానుభవం వల్ల సాధకులకు నిరంతరాసక్తి కలిగిస్తూ దేవి సాధకుణ్ణి అనుగ్రహిస్తుంది. దివ్యజ్ఞానం పొందటంవల్ల సాధకునిలో కలిగే ఆసక్తి దేవీరూపమే ఆమే "మహాశక్తి"

## 110. కుండలినీ

పాములవలె గుండ్రముగా చుట్టుకొని ఆధారచక్రంలో ఉంటుంది.

1. కుటిలాంగి
2. భుజంగి
3. శక్తి
4. ఈశ్వరి
5. కుండలిని
6. అరుంధతి
7. కుండలి

పైన చెప్పిన ఏడుపేర్లు కుండలినికి నామాంతరాలు.

కుండలములు కలది కుండలిని. తంత్రరాజంలో కుండలిని గురించి ఈ విధంగా ఉంది.

**మూలాధారస్థ వహ్న్యాత్మా తేజోమధ్యే వ్యవస్థితా ।**
**జీవశక్తిః కుండలాఖ్యా ప్రాణాకారా థ తైజసీ ॥**
**ప్రసుప్త భుజగాకారా త్రిరావర్తా మహాద్యుతిః ।**
**మాయాశీర్షాం నదంతీం తాం ఉచ్చరం త్య నిశం ఖగే ॥**

**సుషుమ్నా మధ్యదేశే సా యదా కర్ణద్వయస్య తు ।**

**పిధాయ న శృణో త్యేనం ధ్వనిం తస్య తదామృతిః ॥**

మూలాధారంలో అగ్ని తేజస్సు మధ్యన ఉన్నదై జీవశక్తి తేజోరూపమైన ప్రాణాకారము కలది, సర్పాకారంలో మూడు చుట్టలు చుట్టుకుని నిద్రిస్తూ ఉంటుంది. సుషుమ్న మధ్యలో మాయాశీర్షముపై నుండి బుసకొడుతూ ఉంటుంది. చెవులు మూసుకుని ఎవరు ఆ ధ్వనిని వినలేడో, అతడికి త్వరలో మృత్యువు ప్రాప్తిస్తుంది. దేవీపురాణంలో కుండలినీ శక్తిని గురించి చెబుతూ

**యత శృృంగాటకాకారా కుండలి న్యుచ్యతే తతః**

అన్నారు అంటే – కుండలినీ శక్తి శృంగాటకాకారము గలది. శృంగాటకము అంటే త్రికోణము అని అర్థం. ఇచ్ఛా జ్ఞానక్రియాశక్తులే శృంగాటకము అని యోగినీ హృదయం చెబుతోంది.

మూలాధారంలో భుజంగాకారంలో చుట్టలు చుట్టుకుని తేజోరూపంలో ప్రకాశించేదే కుండలిని. పంచదశీ మంత్రానికి వాగ్భీజమే కుండలిని. మేరుదండానికి చివర మూలాధారానికి దగ్గరగా యోనికమునందు అగ్ని తేజస్సుతో ప్రకాశించే జీవశక్తికి కుండలిని అని పేరు. ఇది సర్వశక్తులకు, సమస్త జ్ఞానాలకు మూలమైనది. అజ్ఞానదశలో ఈ శక్తి నిద్రాణమై ఉంటుంది. జ్ఞానదశలో అది జాగృతమై సాధకుడికి సర్వశక్తులు ప్రసాదిస్తుంది. గురుముఖతః షట్చక్రభేదనం తెలుసుకుని సాధనద్వారా ఈ శక్తిని సహస్రారానికి చేర్చాలి. రుద్రయామళంలో కుండలినీ స్తుతిచేస్తూ

**జన్మోద్ధార విరక్షిణీ హ తరుణీ వేదాది బీజాదిమా**

**నిత్యం చేతసి భావ్యతే భువి కదా సద్వాక్య సంచారిణీ**

**మాంపాతు ప్రియదాస భావకపదం సంఘాతయే శ్రీధరే**

**ధాత్రి ! త్వం స్వయ మాదిదేవవనితా దీనాతిదీనం పశుమ్ ॥**

ఓ పరాత్పరీ ! శివుని అర్ధాంగి అయిన ఓ పార్వతీ ! నువ్వు సర్వకాల సర్వావస్థల యందు ఉపనిషద్వాక్యముల యందు సంచరిస్తుంటావు. నీవు నిత్యయవ్వనవు. మమ్ములను ఉద్ధరించటానికి సదామెలకువతో ఉంటావు. అట్టి నిన్ను నేను ఎల్లప్పుడూ ధ్యానం చేస్తాను.

**సిద్ధార్థీ నిజదోషవిత్ స్థలగతి ర్వ్యాయీయతే విద్యయా**
**కుండల్యా కులమార్గ ముక్తనగరీ మాయా కుమార్గా శ్రియా**
**య ద్వేవం భజతి ప్రభాతసమయే మధ్యాహ్నకాలే థవా**
**నిత్యం యః కులకుండలీ జప పదాంభోజం స సిద్ధో భవేత్ ॥**

దేవీ ! కుండలినీ శక్తిగా ఉన్న నీ పాదాలను త్రిసంధ్యలయందు ధ్యానించేవారు సిద్ధులవుతారు.

## 111. బిసతంతుతనీయసీ

తామరతూడులోని దారములాగా అతిసూక్ష్మమైనది. బాగా సన్ననైనది. బాగా కృశించిన రూపము కలది.

**నీవారసూకవత్తన్వి పీతా భాస్వ త్యణూపమా**

వడ్లగింజ ములికిలాగా బాగా సూక్ష్మమైనది. అణుస్వరూపమైనది. పీతవర్ణము గలది. అని శ్రుతి చెబుతున్నది. ఈ కుండలినీ ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉంటుంది అని చెప్పటం జరిగింది. దాన్ని జాగృతం చెయ్యాలి. గౌడపాదులవారు తమ సుభగోదయ స్తుతిలోని 4వ శ్లోకంలో

**యదా తౌ చంద్రార్కౌ నిజసదన సంరోధన వశా**
**దశక్తౌ పీయూష స్రవణహరణే సా చ భుజగీ ।**
**ప్రబుద్ధా క్షుత్క్రుద్ధా దశతి శశినం బైందవగతం**
**సుధాధారాసారైః స్నపయతి తనుం బైందవకళే ॥**

కుండలినీ శక్తి ఆధారచక్రంలో, నోటితో తోకను పట్టుకున్న సర్పములాగా నిద్రిస్తూ ఉంటుంది. చంద్రకిరణాలవల్ల స్రవించే అమృతపుధారలే దానికి ఆహారం. నిద్రావస్థలో ఉన్న ఆ కుండలినీశక్తిని గనక లేపగలిగితే భగవస్సాక్షాత్కారం జరుగుతుంది. సాధకుడు వజ్రాసనంలో కూర్చుని వాయువును కుంభించాలి. అప్పుడు ఆ వాయువు ఊర్ధ్వముఖంగా బయలుదేరి చంద్ర సూర్యుల గమనాన్ని ఆపుతుంది. చంద్రగమనం ఆగిపోతే అమృతపు ధారలు స్రవించవు. అప్పుడు నిరాహార అయిన కుండలినీశక్తి మేల్కొని సుషుమ్నానాడి ద్వారా ఊర్ధ్వముఖంగా బయలుదేరి షట్చక్రాలను దాటుతూ, గ్రంథిత్రయాన్ని భేదించి

సహస్రారం  చేరి అక్కడ సహస్రదళ పద్మాన్ని నోటితో కరచి పట్టుకుంటుంది. అప్పుడు చంద్రమండలము నుండి అమృతపుధారలు స్రవించి సాధకుని శరీరంలోని 72000 నాడీమండలాన్ని తడుపుతాయి. ఇదే విషయాన్ని వామకేశ్వర తంత్రంలో

**భుజంగాకార రూపేణ మూలాధారం సమాశ్రితా**

అంటూ ఆరు శ్లోకాలలో వివరించటం జరిగింది. ఆ విషయాన్ని గతంలో చెప్పటం జరిగింది కాబట్టి మళ్ళీ వ్రాయటం లేదు. ఇదే విషయం తంత్రసారంలో కూడా చెప్పబడింది.

**కుండల్యేన భవే చ్ఛక్తి స్తాంతు సంచాలయే ద్బుధః**
**స్వస్థానా దాభృవో ర్మధ్యం శక్తిస్థాన ముదీరితం**
**మూలాధారాది షట్చక్రం శక్తిస్థాన ముదీరతం**
**కంఠా దుపరి మూర్ధాంతం శాంభవస్థాన ముచ్యతే ॥**

**మూలాధారే ధ్వనిం శృత్వా ప్రబుద్ధా శక్తికుండలీ ।**
**జ్వల త్పావకసంకాశా సూక్ష్మతేజ స్స్వరూపిణీ ॥**

**శక్తిః కుండలినీ నామ బిసతంతునిభాశుభా ।**
**సా చ విద్యుల్లతాకారా బ్రహ్మద్వారం మనోమయమ్ ॥**

**ముఖేనాఽఽచ్ఛాద్య తద్వారం ప్రసుప్తా పరమేశ్వరీ ।**
**సార్ధత్రివలయాకారా గ్రంథిత్రయ విభేదినీ ॥**

**పృధ్వ్యాప్య చక్రద్వితయం రుద్రగ్రంథిం పదోదితం ।**
**వహ్ని సూర్యమయం చక్రద్వయం తేజోమయం మహత్ ॥**

**విష్ణుగ్రంథిం పదే నోక్తం తేజసం సర్వసిద్ధిదమ్ ।**
**వాయ్వాకాశ ద్వయీరూపం చక్రద్వితయ ముత్తమమ్ ॥**

**బ్రహ్మగ్రంథిం పదే నోక్తం మంగళాయతనం మహత్ ।**
**రుద్రగ్రంథిం తతో భిత్వా విష్ణుగ్రంథిం భినత్యతః ॥**

**బ్రహ్మగ్రంథించభిత్త్వైవ కమలాని భినత్తి షట్**
**సహస్రకమలే శక్తిః శివేన సహ మోదతే ॥**

గౌడపాదులవారు తమ సుభగోదయస్తుతిలో కుండలినీశక్తికి మూడు అవస్థలున్నాయన్నారు. అవి 1. నిద్రావస్థ, 2. ప్రయాణావస్థ 3. సుఖావస్థ వీటినే

1. కౌమారావస్థ 2. యోషిదవస్థ 3. పతివ్రతావస్థ అని కూడా అంటారు. వీటిని గతంలో వివరించటం జరిగింది.

**తత్రా స్తే పరమేశానీ మహాత్రిపురసుందరీ ।**

**శివార్కమండలం భిత్వా ద్రావయం తీందుమండలమ్ ॥**

**తదూ్భతా మృతస్యంది పరమానందనందితా ।**

**కులయోషి త్కులం త్యక్త్వా పరం వర్షణ మే త్యసౌ ॥**

షట్చక్రాలను దాటి చంద్రమండలం చేరి అక్కడ నుండి అమృతాన్ని స్రవింపచేసి శరీరంలోని 72000 నాడీమండలాన్నీ తడుపుతుంది. ఆ తరువాత మళ్ళీ స్వాధిష్ఠానానికి వచ్చి నిద్రిస్తుంది.

కుండలినీ శక్తికి మూడు దశలున్నాయని చెప్పాము అవి 1. కౌమారావస్థ 2. యోషిదవస్థ 3. పతివ్రతావస్థ గౌడపాదులవారు తమ శ్లోకంలో 'కుమారీ యన్మంద్రం' అన్నారు. ఇక్కడ కుమారి అంటే భూతత్త్వము. మూలాధారము. కుండలిని మంద్రస్వరంతో శబ్దం చేస్తుంది. ఆధారచక్రంలో కుమారిగా ఉంటుంది. ఆ తరువాత అక్కడ నుంచి ప్రయాణమై అనాహతం దాటేసరికి రెండవ అవస్థ అయిన 'తరుణీ' అవుతుంది. అక్కడ నుండి రుద్రగ్రంథిని దాటి సహస్రారంలో తన పతి అయి పరమేశ్వరునితో కలసి సుఖిస్తుంది. అది మూడవ అవస్థ. అదే పతివ్రతావస్థ. భర్తతో కలసి సుఖించటమనేది కులస్త్రీ లక్షణము. అదే పాతివ్రత్యము. అందుకే దాన్ని పతివ్రతావస్థ అన్నారు.

సాధకుడు ఉచ్ఛ్వాసనిశ్వాసలను బంధించేసరికి స్వాధిష్ఠానచక్రంలో అగ్ని రగుల్కొంటుంది. దానికే స్వాధిష్ఠానాగ్ని అని పేరు. సహస్రదళ పద్మము చంద్రమండలము. అక్కడ చంద్రుని చల్లదనంవల్ల అమృతము ఘనీభవించి ఉంటుంది. స్వాధిష్ఠానంలో అగ్ని ప్రజ్వరిల్లినప్పుడు ఆ వేడికి చంద్రమండలంలో ఘనీభవించిన అమృతం ద్రవరూపం దాలుస్తుంది. ఎప్పుడైతే కుండలినీ శక్తి తననోటితో సహస్రదళ పద్మాన్ని కొరికిందో, అప్పుడు దానికి పంటిగాట్లు పడతాయి. ఆ రంధ్రాలద్వారా అక్కడ ద్రవీభవించిన అమృతం క్రిందికి జాలువారి సాధకుని శరీరంలోని 72000 నాడీమండలము తడుస్తుంది.

సనత్కుమార సంహితలో పృశ్నులు అనే మునులు ఈ విధంగా మాట్లాడు కుంటున్నారు. **ఓ శ్రీవిద్యోపాసకులారా! లేవండి. ఆలస్యం చెయ్యకండి. స్వాధిష్ఠానము**

**యొక్క కర్ణికలో అగ్నిని ప్రజ్వలింపచెయ్యండి. సూర్యుని సాయముతో సహస్రారమందలి చంద్రమండలమును ద్రవింపచేసి అమృతాన్ని పొందండి.**

శుక్రసంహిత కూడా ఇదే విషయాన్ని చెబుతున్నది. అగ్నియొక్క వేడిచేత సూర్యుని వెలుగుతో, చంద్రుని ప్రకాశముతో రహస్యముగ సంచరించు కుండలిని అమృతధారలను పిదుకుచు 72000 విధములుగా ప్రవహింపచేయుచు మనలను తృప్తిపరచుచున్నది.

కుండలినీ శక్తి మూలాధారంలో కుమారివలె పుట్టిన పసిపిల్లల ఏడుపులాగా బుసకొడుతూ, స్వాధిష్ఠానానికి పోయి అక్కడ ఉండే అగ్నికి ఆ బాలిక యవ్వనవతియై, అక్కడి నుండి సహస్రారము చేరి పరమేశ్వరునితో కలసి అక్కడి నుండి అమృతధారలు కురిపించి శరీరంలోని 72000 నాడీమండలాన్ని తడుపుతుంది. 'కులామృతైకరసికా' అనే 90వ నామం దగ్గరనుంచి 'బిసతంతు తనీయసీ' అనే 111వ నామం వరకు ఈ విషయాన్ని ప్రతిపాదించటం జరిగింది. ఉపనిషత్తులు మంత్రశాస్త్రము, ఆగమాలు, యోగశాస్త్రము అన్నీ ఈ విషయాన్ని ఒప్పుకుంటున్నాయి.




శ్రీ 'ఊ'కార దేవి

# 13. శాంభవీవిద్య

శంభుని యొక్క రాణి శాంభవి. ఇక్కడ శంభుడు అంటే పరమేశ్వరుడు. 112 నామం దగ్గరనుంచి 131 నామం వరకు శాంభవీవిద్య వివరించబడుతోంది.

ఆ పరమేశ్వరిని ఎప్పుడు ఉపాసించాలి? దేవీ భాగవతంలో ఈ విషయం చెబుతూ వసంత ఋతువులోని చైత్ర మాసంలోను, శరదృతువులోని ఆశ్వీయుజ మాసంలోను శుక్లపక్ష పాడ్యమి మొదలు నవమి వరకు తొమ్మిదిరోజులు ఆ దేవిని అర్చించాలి. వీటినే 1. వసంత నవరాత్రులు 2. శరన్నవరాత్రులు అంటారు. ఈ రెండూ ప్రశస్తమైనవే. కాని ఈ రెండింటిలోనూ శరన్నవరాత్రులు మరీ విశేషమైనవి.

'రామో లలితాంబికాయ' అన్నారు. కాబట్టి వసంత నవరాత్రులయందు శ్రీరామనవమి శరన్నవరాత్రులయందు దేవీపూజ చెయ్యటం ఆచారంగా మారింది.

ఈ పూజ చేసే వ్యక్తి ఆ క్రితం రోజునే కావలసిన సంబారాలన్నీ సమకూర్చుకోవాలి. ఏకభుక్తం చెయ్యాలి. 16 మూరల పరిమాణంతో ఒక మంటపం నిర్మించాలి. దానిని అరటి స్తంభాలతోను, రంగులపూలోను అలంకరించాలి. ఆ ప్రదేశమంతా ఆవుపేడతో అలికి ముగ్గులు పెట్టాలి. ఆ మంటపంమీద నాలుగుమూరల వైశాల్యం మూరెడు ఎత్తుతో వేదిక నిర్మించాలి. వేదవిదులు, మంత్రవేత్తలు అయిన బ్రాహ్మణులను క్రితంరోజే ఇంటికి ఆహ్వానించాలి.

ఆ మరునాడు వేదికమీద పట్టుబట్ట పరచి దానిమీద సింహాసనము, అందులో పరమేశ్వరి విగ్రహము ఉంచాలి. ఒకవేళ విగ్రహం లేకపోతే కలశస్థాపన చెయ్యాలి. పూజావిధానంలో నియమాలను ముందే నిర్ణయించుకోవాలి. అవి రెండు రకాలు. 1. పగలంతా ఉపవాసముండి రాత్రికి భోజనం చెయ్యటం 2. తొమ్మిది రోజులు ఉపవాసముండటము

ఇక పూజాక్రమంలో త్రికాలములయందు దేవిని అర్చించాలి. మంత్రజపము, సప్తశతి పారాయణ, హోమము నిత్యము జరగాలి. హోమకుండం త్రికోణాకారంగా ఉండాలి. ప్రతిదినము నృత్య గీత వాద్యాలతో పూజ జరగాలి. ప్రతిరోజూ ఉదయం పూట కుమారీ పూజ, రాత్రిపూట సువాసినీ పూజ చెయ్యాలి.

ఈ పూజలో బలులకు నిషేధం లేదు. కావలసిన వారు కోడి, పంది, దున్నలను బలిగా సమర్పించవచ్చు. కాని జుగుప్సాకర విధానాలను వదలివేయటం శ్రేయస్కరము.

పూజకు అన్ని రకాల పూలు, సుగంధద్రవ్యాలు వాడాలి. అన్ని పదార్థాలను నివేదన చెయ్యవచ్చు. ఈ విధంగా పరమేశ్వరిని అర్చిస్తే ఆయురారోగ్య ఐశ్వర్యాలు కలుగుతాయి. ఇష్టకామ్యార్థసిద్ధి కలుగుతుంది. సాధకునియొక్క మనోవాంఛితము ఈడేరుతుంది.

ఇప్పుడు 112వ నామాన్ని చూద్దాం.

## 112. భవానీ

'భవస్యపత్నీ భవానీ' భవుని యొక్క భార్య భవానీ అని చెప్పబడింది. దేవీ పురాణంలో

**రుద్రో భవోభవః కామోభవః సంసారసాగరః ।**
**తత్ర్వాణనా దియం దేవీ భవానీ పరికీర్తితా ॥**

అని చెప్పబడింది. రుద్రుడు అంటే భవుడు, కాముడు సంసారసాగరము వీనిని జీవింపచేయునది భవాని. వాయుపురాణంలో

**యస్మాద్భవంతి భూతాని తాభ్య స్తా భావయంతి చ ।**
**భవనా ద్భావనా చ్చైవ భూతానాం స భవ స్స్మృతః ॥**

భవుడు సకలస్థావర జంగమస్వరూపుడు.

అతని పత్ని భవాని. వేదవాదులచేత, దేవతల చేత లోకాలను బ్రతికింప చేసేవాడు కాబట్టి అతడికి భవుడని పేరు. జలాన్ని జీవింపచేసేవాడు కాబట్టి భవుడు అని వాయుపురాణం చెబుతోంది.

భవుడు అంటే అష్టమూర్తులలో ఒకడు. అష్టమూర్తులు

| | | | |
|---|---|---|---|
| 1. భవుడు | 3. ఈశానుడు | 5. రుద్రుడు | 7. భీముడు |
| 2. శర్వుడు | 4. పశుపతి | 6. ఉగ్రుడు | 8. మహాదేవుడు |

సుభగోదయస్తుతిలోని మొదటి శ్లోకంలో గౌడపాదులవారు దేవిని స్తుతిస్తూ

**భవాని ! త్వాం వందే భవమహిషి ! సచ్చిత్సుఖ వపుః**
**పరాకారాం దేవీ మమృతలహరీ మైందవకళామ్ ।**
**మహాకాలాతీతాం కలితసరణీకల్పితతనుం**
**సుధాసింధో రంత ర్వసతి మనిశం వాసరమయీామ్ ॥**

భవానీ ! శివుని అర్ధాంగి అయిన ఓ పార్వతీ ! నీవు సచ్చిదానంద రూపిణివి. పరాకారమైన దేవివి. అమృతలహరివి. అఖండకాలమునకు అతీతురాలవు. నిరాకారవు.

అయినప్పటికీ మాయాశక్తివలన కల్పించబడిన ఆకారముతో ప్రకాశించుచున్నావు. అట్టి బిందుస్వరూపిణివగు నీకు నేను నమస్కరించుచున్నాను.

భవుని జీవింపచేయునది భవాని. పంచబ్రహ్మల యందు ఐక్యము కలది అవటంచేత దేవి పంచబ్రహ్మ స్వరూపిణి అయింది. పంచబ్రహ్మలు శక్తిహీనులై దేవి ఆసనానికి కోళ్ళుగా (పంచప్రేతాలుగా) ఉన్నారు. వారికి చలనం రావాలంటే జీవం కావాలంటే దేవి కృప కావాలి. అందుచేతనే భవుని జీవింపచేయునది భవాని అని చెప్పబడింది. దేవి యొక్క అనుగ్రహంతోనే శ్రీ మహావిష్ణువు శింశుమార రూపంలో ఊర్ధ్వలోకాలను, ఆదిశేషుని రూపంలో అధోలోకాలను మోయగలుగుతున్నాడు.

**శింశుమారాత్మనా విష్ణుః భూరాదీ నూర్ధ్వతః స్థితాన్ ।**
**దధ్రే శేషయతా లోకాన్, సప్తలోకా నథస్థితాన్ ॥**

సృష్టి స్థితి లయాలకు కారణము ఆ దేవియే. ఈ విషయాన్ని శంకరులవారు సౌందర్యలహరిలోని మొదటి రెండు శ్లోకాలలో వివరించారు. 22వ శ్లోకంలో

**భవాని ! త్వం దాసే మయి వితర దృష్టిం సకరుణాం**
**ఇతి స్తోతుం వాంఛన్ కథయతి భవాని ! త్వ మితి యః ।**
**తదైవ త్వం తస్మై దిశసి నిజసాయుజ్యపదవీం**
**ముకుంద బ్రహ్మేంద్ర స్ఫుట మకుట నీరాజిత పదమ్ ॥**

ఓ భవుని రాణీ ! నేను నీ దాసుడను. నన్ను కటాక్షించుము. అని ప్రార్థించబోయి ఉపాసకుడు సగము పలుకులు చెప్పబోవునంతలోనే ముకుంద బ్రహ్మేంద్రులు తమ కిరీటములచే నీరాజనము పెట్టిన నీ సాయుజ్య పదవి నొసంగుచున్నావు.

**స్థానేశ్వరే భవాన్యాఖ్యా । బిల్వకే నామపత్రికే ॥**

స్థానేశ్వరంలో బిల్వపత్రంలో భవానీదేవి ఉన్నదని పద్మపురాణంలో చెప్పబడింది.

## 113. భావనాగమ్యా

ఉపాసనచే ఒకసారి అనుభూతి అయిన విషయాన్ని మళ్ళీ మళ్ళీ స్మృతి పథంలోకి తెచ్చుకోవటాన్నే భావన అంటారు. అటువంటి అనుభూతిని ఉపాసనా పంచకముచే మననం చేయటమే భావన. ఉపాసనా పంచకము అంటే

| | | |
|---|---|---|
| 1. న్యాస | 3. హోమ | 5. అభిషేకాలు |
| 2. జప | 4. అర్చన | |

భావన అంటే ధ్యానము అని చెప్పవచ్చు.

భావన రెండు విధాలు 1. శబ్దభావన 2. అర్ధభావన

**1. శబ్దభావన :** ఇది వైదిక శబ్దాలతో కూడినది. గురువువల్ల శిష్యునికి ఉపదేశింపబడి, ఇద్దరికీ క్షేమాన్ని కలిగించేది.

**2. అర్ధభావన :** ఇది క్రియారూపమైనది. కార్యకారణ సంబంధ రూపమైనది.

భావన మూడు విధాలని కూర్మపురాణంలో చెప్పబడింది.

**బ్రాహ్మీ మాహేశ్వరీ చైవ తథై వాక్షరభావనా**
**తిస్రస్తు భావనా రుద్రే వర్తన్తే సతతం ద్విజా**

బ్రాహ్మీ, మాహేశ్వరి, అక్షర భావన అని బ్రాహ్మణులు మూడురకాలుగా శివుణ్ణి భావిస్తారు.

**1. బ్రాహ్మీభావన :** విగ్రహ రూపంలో పరమేశ్వరుణ్ణి భావించేదే బ్రాహ్మీభావన. ఇదే తామసీభావన.

**2. మహేశ్వరీ భావన :** అవ్యక్తమైన చిత్కలా రూపంలో సర్వవ్యాపకమైన పరమేశ్వరుణ్ణి భావించటమే మహేశ్వరీ భావన. ఇదే సాత్వికభావన.

**3. అక్షర భావన :** మంత్రంలోని అక్షరాలను అర్ధతాత్పర్యాలతో హృదయంలో భావించేది అక్షరభావన. ఇదే రాజసభావన.

యోగినీహృదయంలో ఈ భావనను మూడు విధాలుగా చెప్పారు. అవి 1. సకల 2. సకల నిష్కల 3. నిష్కల

**ఆజ్ఞాంతం సకలం ప్రోక్తం తతస్సకల నిష్కలం**
**ఉన్మన్యన్తం పరేస్థానం నిష్కలం చ త్రిధా స్థితం**

1. మూలాధారము నుండి ఆజ్ఞవరకు భావన, సకల
2. ఆజ్ఞాచక్రం నుండి ఉన్మన వరకు భావన, సకల నిష్కల
3. పరస్థానంలో భావన (మహాబిందువులో) నిష్కల

ఈ రకంగా ఉపాసన (భావన)చే పొందదగినది ఆ పరమేశ్వరి. ఉపాసన అంటే సమీపమున ఉండుట అని అర్థము. మనసు సమాధిలో లగ్నమైతే పరమేశ్వరి సాక్షాత్కారం కలుగుతుంది. ధ్యానంలో లీనమైన మనస్సు అంతర్గతంగా ఉన్న ఆ దేవిని దర్శించ గలుగుతుంది. విశ్వవ్యాప్తియైన ఆ పరమేశ్వరిని గుర్తించాలంటే భావన ఒక్కటే శరణ్యము.

## 114. భవారణ్యకుఠారికా

భవము అంటే సంసారము. జరామరణములతోను, ఆలుబిడ్డలతోను, కూడుకున్నది సంసారము. ఈ సంసారచక్రంలో మానవుడు పుడుతూ, చస్తూ ఉంటాడు. చనిపోయిన మానవుడు అతని పాపపుణ్యాలననుసరించి మళ్ళీ పుడతాడు. శంకరభగవత్పాదులవారు చెప్పినట్లుగా

**పున రపి జననం పున రపి మరణం**
**పున రపి జననీ జఠరే శయనమ్ ।**

మళ్ళీ మళ్ళీ జన్మిస్తూ, మరణిస్తూ, తల్లి ఉదరంలో శయనిస్తూ సంసారసాగరంలో భరించలేక పీడింపబడుతూ ఉంటాడు.

సంసారమనే మోహంలో చిక్కుకున్నవాడు దాన్ని వదలి బయటకు రాలేడు. అది పెద్దకీకారణ్యం లాంటిది. మహాభయంకరమైన ఆ అరణ్యానికి గొడ్డలివంటిది ఆ పరమేశ్వరి. ఆమె తన భక్తులకు భవబంధాలు విడదీస్తుంది. రాగద్వేషాలు లేకుండా చేస్తుంది. వారు ఆమె కృపచేత అరిషడ్వర్గాల్ని జయిస్తారు. అప్పుడు సాధకునిలో సత్వగుణం వృద్ధి అవుతుంది. పరచింతన పెరుగుతుంది. నిరంతర సాధనవల్ల పరమేశ్వరి సాక్షాత్కరిస్తుంది. సాధకుడికి ఆత్మసాక్షాత్కారం అవుతుంది. పునర్జన్మ నశించి మోక్షప్రాప్తి కలుగుతుంది. అందుకే సంసారమనే ఘోరాటవికి ఆ పరమేశ్వరి గొడ్డలివలె ఉపకరించి, సాధకుడికి భవబంధాలు తెంచి మోక్షాన్ని ప్రసాదిస్తుంది.

## 115. భద్రప్రియా

భద్రము అంటే మంగళము అని అర్థం. **భద్రం మగళం ప్రియం యస్యాః**

మంగళమును ప్రియముగా కలది. సర్వజనులకు శుభమును, మంగళమును చేయుటయందు ఆసక్తి కలది. సర్వమంగళ స్వరూపురాలు వీరభద్రుడు, భద్రకాళి మొదలైన వారితో ఆరాధింపబడుతుంది కాబట్టి భద్రప్రియా అనబడుతుంది.

మంగళకరమైన వస్తువులపట్ల ఆసక్తి కలది. పసుపు, కుంకుమ, పూలు, ముత్యాలు, పగడాలు మొదలైనవి మంగళకరమైనవి. వీటియందు ఆసక్తి కలది.

భద్రము అనేది ఒకజాతి ఏనుగు. దీన్ని భద్రగజం అంటారు. ఆ భద్రగజముమీద మక్కువ కలది. తనను ఆరాధించే వారికి నిరంతరము శుభాన్ని చేకూర్చేది.

## 116. భద్రమూర్తి

భద్రమైన రూపము కలది. మంగళకరమైన శరీరము కలది. దేవివిరాట్ స్వరూపిణి. దేవి ఆవిర్భావం చెప్పేటప్పుడు సప్తశతిలో సర్వదేవతల తేజస్సునుంచి ఆమె ఉద్భవించింది.

**తతః సమస్తదేవానాం తేజోరాశి సముద్భవామ్**

అని చెప్పబడింది. వేదంలో చెప్పినట్లుగా

**చంద్రమా మనసో జాతః చక్షో సూర్యో అజాయత**
**ముఖా దింద్ర శ్చాగ్ని శ్చ ప్రాణా ద్వాయు రజాయత ।**

ఈ సృష్టి మొత్తం ఆ పరబ్రహ్మ నుంచే సృష్టింబడింది అని చెప్పబడింది. ఆమె సహస్రారంలో సుధాసాగరం మధ్యన భద్రపీఠమందు ఉంటుంది కాబట్టి భద్రమూర్తి అనబడింది.

భద్రమైన (మంగళప్రదమైన) వస్తువులందు ప్రీతికలది. శుభకరమైన వస్తువులే దేవికి ప్రతి రూపం.

**శివలింగేతథా శంఖే పద్మే ముక్తముఖాదిషు ।**
**సీమంతినీనాం సీమంతే లక్ష్మీః తిష్ఠతి సర్వదా ॥**

శివలింగములందు, ముత్యాలయందు (రతనాలు) శంఖములందు, స్త్రీల పాపటుల యందు లక్ష్మీదేవి పద్మమునందు ఉంటుంది. అని చెప్పబడింది. వాటిని ఆదరించేవారింట లక్ష్మీదేవి తాండవిస్తుంది. విశ్వవ్యాపిని అయిన ఆ దేవి మంగళకరమైన వస్తువుల రూపంలో ఉంటుంది. లోకాలన్నింటికీ భద్రతను ప్రసాదిస్తూ, భద్రమే తానై, భద్రమూర్తిగా ప్రకాశిస్తోంది ఆ పరమేశ్వరి.

## 117. భక్తసౌభాగ్యదాయినీ

భక్తులకు సౌభాగ్యాన్ని ప్రసాదించేది కాబట్టి భక్తసౌభాగ్యదాయినీ అని పిలవబడు తోంది అగ్నిపురాణంలో భగశబ్దానికి

**"భగశ్రీకామ మాహాత్మ్యవీర్య యత్నార్కకీర్తిషు"**

భగము అంటే – ఐశ్వర్యము, వీర్యము, సూర్యుడు, కామము, కీర్తి, మాహాత్మ్యము, అని అర్థం చెప్పబడింది. ఇలాంటి శక్తులప్రభావమే సౌభాగ్యము. భగవతి అంటే పై ఆరూ కలసినది అని అర్థం. సుభగ అంటే పరాత్పరి. ఈమె తన భక్తులకు సౌభాగ్యము, సంపద ఇచ్చి రక్షిస్తుంది. సౌభాగ్యద్రవ్యాలు ఎనిమిది. పద్మపురాణంలో వాటి

**ఇక్షువఃస్తరురాజ శ్చ నిష్పావా జీరధాన్యకే**
**వికారవ చ్చ గోక్షీరం కౌసుంభం కుసుమం తథా**
**లవణం చాష్టమం తద్వత్ సౌభాగ్యాష్టకముచ్యతే ॥**

| | | |
|---|---|---|
| ఇక్షు | – | చెరకు |
| తరురాజము | – | పారిజాతము |
| నిష్పావాజీర | – | తూర్పారబట్టినటువంటి జీలకర్ర |
| ధాన్యము | – | ధనియాలు, వడ్లు మొదలైనవి |
| వికారవచ్చ | – | ఆకారము, రూపము మారునట్టి |
| గోక్షీరం | – | ఆవుపాలు (ఇవి పెరుగు, వెన్న, నెయ్యి, మజ్జిగగా మారతాయి. |
| కౌసుంభం | – | కుంకుమ |
| కుసుమం | – | పూలు |
| లవణం | – | ఉప్పు |

ఇవి ఎనిమిది సౌభాగ్య ద్రవ్యములు. వీటిని శుభకార్యాలలో వాడతారు. ఈ రకంగా దేవి సౌభాగ్యద్రవ్యాలు ఇచ్చి భక్తులను అనుగ్రహిస్తుంది కాబట్టి భక్తసౌభాగ్యదాయినీ అని చెప్పబడింది.

## 118. భక్తప్రియా

భక్తి అంటే ప్రీతి కలది. భక్తులు అన్నా కూడా దేవికి ప్రేమ ఎక్కువ. పరమేశ్వరుని యందు అనురక్తి ఉండటాన్నే భక్తి అంటారు. ఈ భక్తి రెండు రకాలు 1. ముఖ్యము 2. గౌణము సర్వకాల సర్వావస్థలయందు భగవంతుని యందే మనసు నిల్పి అతడే తండ్రిగా, తల్లిగా, బిడ్డగా, పతిగా, పరాత్పరుడుగా ఏ విధంగానైనా సరే భావిస్తూ ఆ పరమేశ్వరుని ఆరాధించటమే ముఖ్యభక్తి. ఇది నిష్కామ్యము. రామదాసు, తుకారామ్‌వంటి మహానుభావులు ఎందరో దీనితో తరించారు. రెండవది గౌడభక్తి కామ్యసిద్ధి కోసం భగవంతుణ్ణి ప్రార్థించటం. సామాన్యంగా ఈ కోవకు చెందిన వాళ్ళకి కష్టాలు వచ్చినప్పుడే భగవంతుడు స్ఫురిస్తాడు. మామూలు రోజులలో పెద్దగా భక్తి లేకపోయినా కష్టకాలంలో మాత్రం అర్చనలు, జపాలు, హోమాలు మొదలయినవి తప్పనిసరిగా చేస్తారు. వీరిధ్యేయము ఐహిక ఫలప్రాప్తి. ఇష్టకామ్యసిద్ధి. భక్తులు నాలుగు రకాలు అని భగవానుడు గీతలో చెప్పాడు 1. ఆర్తులు 2. జిజ్ఞాసులు 3. అర్థార్తులు 4. జ్ఞానులు వీరిలో

1. ఆర్తితో భగవంతుని ప్రార్థించినవాడు గజేంద్రుడు
2. జిజ్ఞాసతో భగవంతుని ప్రార్థించినవాడు ఉద్ధవుడు
3. అర్థార్తితో భగవంతుని ప్రార్థించినవాడు ధృవుడు
4. జ్ఞానంతో భగవంతుని ప్రార్థించినవాడు ప్రహ్లాదుడు.

భగవంతుణ్ణి ఏ రకంగా సేవించినా ఆ భక్తి ఫలప్రదమే అవుతుంది. అయితే భక్తి తొమ్మిది రకాలు : అవి,

| | | |
|---|---|---|
| 1. శ్రవణం | 4. పాదసేవ | 7. సఖ్యం |
| 2. కీర్తనం | 5. అర్చనం | 8. దాస్యం |
| 3. స్మరణం | 6. వందనం | 9. ఆత్మనివేదనం |

వీటిలో ఏ మార్గంలోనైనా పరమేశ్వరుణ్ణి ఆరాధించవచ్చు. ఏ విధంగా ఆరాధించి నప్పటికీ ఆ సాధకునియందు కరుణ కలిగినది. శివపురాణంలో భక్తులు బాహ్యంగాగాని, అంతర్గతంగాగాని చేయు సేవలను నేను గ్రహిస్తాను అన్నాడు ఈశ్వరుడు.

# 119. భక్తిగమ్యా

నిశ్చలమైన భక్తి భావంతోనే సాధకులు పరమేశ్వరి సన్నిధి చేరగలుగుతారు. మనసును ప్రాపంచిక విషయాలవైపునుండి పరమేశ్వరునిపైకి మరల్చటమే భక్తి. భక్తి పెరగగా పెరగగా సాధకుడి దృష్టి అంతర్ముఖం అవుతుంది. అప్పుడు భగవస్సాక్షాత్కారము కలుగుతుంది. అయితే ప్రపంచంలో కొన్నివేలమందిలో ఒకడు మాత్రమే దృష్టిని అంతర్ముఖం చెయ్యగలగుతున్నాడు. భక్తి గురించి చెబుతూ శంకరులు.

**కర్మణా జాయతే భక్తిః । భక్త్యా జ్ఞానం**
**ప్రజాయతే । జ్ఞానాదేవతు కైవల్యమ్ ॥**

సత్కర్మవల్ల చిత్తశుద్ధి, దానివల్ల భక్తి, భక్తిచేత జ్ఞానం, జ్ఞానంచేత మోక్షము లభిస్తాయని చెప్పారు. మోక్షము అంటే జన్మరాహిత్యం పొందటం. జీవాత్మను తీసుకొని వెళ్ళి పరమాత్మలో లీనం చెయ్యటం. మోక్షసాధనకు మొదటి ఆచరణ భక్తి అని గుర్తించాలి. భక్తి ముక్తికి హేతువు. భక్తి ఐదు రకాలు.

1. కష్టకాలంలోనే భగవస్మరణ చెయ్యటం
2. ఆకర్షణ భావన
3. పతివ్రతా స్త్రీలాగా ఎల్లకాలము దేవిని అర్చించటం
4. అన్నిటికీ ఆధారము పరమేశ్వరుడు అని నమ్మటము
5. అద్వైతసిద్ధాంతము

వీటిలో మొదటి తెగవారు కష్టాలు వచ్చినప్పుడు మాత్రమే భగవంతుణ్ణి స్మరిస్తారు ఇతర సమయాలలో మరచిపోతారు.

రెండవ తెగవారు ఇనుపముక్క, సూదంటు రాయిమాదిరిగా, మధ్యన ఎవరూ లేకపోతే ఆకర్షితులౌతారు.

మూడవ తెగవారు పతివ్రత అయిన స్త్రీ భర్తలోనే భగవంతుణ్ణి ఎలా దర్శిస్తుందో, అదే రకంగా పరమేశ్వరి చింతలోనే ఎల్లకాలము గడుపుతారు.

నాల్గవ తెగవారు తీగెమొక్క ఏ విధంగా ఆధారం చూచుకొని ప్రాకుతుందో అలాగే ఈ లోకంలో అన్నింటికీ ఆ పరమేశ్వరుడే బాధ్యుడు అని నమ్మి దేవిని ధ్యానిస్తాడు.

ఐదవ తెగవారు అద్వైత సిద్ధాంతంలో పరమేశ్వరుడు ఒక్కడే. జీవాత్మకు పరమాత్మకు భేదం లేదు. అని నమ్మి దృష్టిని అంతర్ముఖంచేసి ధ్యానం చేస్తారు.

ఈ రకంగా పరమేశ్వరి భక్తికి వశమయ్యేది. అందుకే దేవి భక్తి గమ్యా అని చెప్పబబడింది. భక్తులయందు ప్రేమ గలిగినది.

## 120. భక్తివశ్యా

పైన చెప్పిన లక్షణాలుకల భక్తులకు వశ్యురాలు. ఆమె భక్తిచేతనే వశమవుతుంది. దేవి సర్వస్వతంత్రురాలు. అయినప్పటికీ భక్తులకు వశం కావటంచేత అస్వతంత్రురాలవు తోంది. ధ్యానిస్తూ ఒక్కొక్క మెట్టే దాటి అద్వైతస్థితికి చేరుతాడు. అట్టివారికి దేవి వశమౌతుంది. సాధకుడు రాగద్వేషాలకు అతీతంగా ప్రపంచంలోని అన్ని ప్రాణులయందు పరమేశ్వరుణ్ణి చూడగలగటమే భక్తికి పరాకాష్ట. ఆ స్థితికి చేరుకున్న భక్తులకు వశమౌతుంది పరమేశ్వరి.

## 121. భయాపహా

భయాన్ని పోగొట్టేది. ఆ పరమేశ్వరి భక్తులయొక్క భయాన్ని పోగొట్టి వారికి మనశ్శాంతిని ఇస్తుంది. భయము అనేక రకాలు. అవి

1. శారీరక సంబంధమైన రోగాలవలన వచ్చేవి మొ॥వి
2. జంతువులు, మృగములవలన వచ్చేవి
3. ఈతిబాధలు (అతివృష్టి, అనావృష్టి, మిడతలు, పందికొక్కులు, చిలకలు, సన్నిహితులు కలుగచేయు బాధలు)
4. జరామృత్యుభయాలు.

దేవి తనభక్తులకు ఈ రకమైన భయాలు పోగొడుతుంది. రాక్షస సంహారంచేసి దేవతలభయాన్ని పోగొట్టినదేవి, భక్తులలోని అసురసంపత్తిని నాశనంచేసి మనసుకు ప్రశాంతత చేకూరుస్తుంది. ఆ దేవి అనుగ్రహం ఉంటే భయం ఉండదు. అందుకే భయం కలిగినపుడు ఆ దేవిని స్మరించమని చెప్తారు. ఆ దేవిని స్మరించినట్లైతే సప్తశతిలోని 12వ అధ్యాయంలో చెప్పినట్లుగా

**శత్రుతో న భయం తస్య దస్యుతో వా న రాజతః ।**
**న శస్త్రానలతో యౌఘాత్ కదాచిత్ సమ్భవిష్యతి ॥**

శత్రువులవలనగానీ, చోరులవలనగాని, రాజులవలనగాని, ఆయుధములవలనగాని, అగ్నివలనగాని నీటివల్లగాని భయముండదు.

**అరణ్యే ప్రాన్తరేవాపి దావాగ్ని పరివారితః ।**
**దస్యుభి ర్వావృతః శూన్యే గృహీతో వాపి శత్రుభిః ।**
**సింహవ్యాఘ్రానుమాతో వా వనేవా వనహస్తిభిః ॥**

**రాజ్ఞా క్రుద్ధేన చాజ్ఞప్తో వధ్యో బన్ధగతోఽపివా ।**
**ఆఘూర్ణితో వా వాతేన స్థితః పోతే మహార్ణవే ॥**

**పతత్సు చాపి శస్త్రేషు సఙ్గ్రామే భృశదారుణే ।**
**సర్వాబాధాసు ఘోరాసు వేదానా భ్యర్ధితోఽ పి వా॥**

**స్మరన్ మ మైత చ్చరితం నరో ముచ్యేత సఙ్కటాత్ ।**

అరణ్యమధ్యమందుగాని, కారుచిచ్చునందుగాని, నిర్మానుష్య ప్రదేశమునగాని, చోరులమధ్య చిక్కుకొన్నప్పుడు కాని, శతృవులచేతికి చిక్కినప్పుడు, అడవిలో క్రూరమృగాలచే తరమబడుచున్నప్పుడు, ఆగ్రహించిన రాజుతో శిక్ష విధింపబడినప్పుడు నడి సముద్రంలో తుఫానులో చిక్కుకున్నప్పుడు, యుద్ధంలో తనబలం చాలక పోయినపుడు, ఘోరమైన విపత్తులు సంభవించినప్పుడు, పరమేశ్వరి నామపారాయణ చేసినట్లైతే ఆ ఉపద్రవాలు తొలగిపోతాయని సప్తశతి ఫలశృతిలో చెప్పబడింది.

కాళిదాసు లఘుస్తవంలోని 17వ శ్లోకంలో

**లక్ష్మీం రాజకులే, జయాం రణభువి, క్షేమంకరీ మధ్యని,**
**క్రవ్యాదద్విపసర్పభాజి శబరీం, కాంతారదుర్గే గిరౌ,**
**భూతప్రేత పిశాచ జంబుకయే స్మృత్యా మహాభైరవీం**
**వ్యామోహే త్రిపురాం స్మరంతి విపద స్తారాం చ తోయప్లవే ॥**

యుద్ధంలో విజయంకావాలన్నా, అరణ్యాలయందు, పర్వత ప్రాంతాలలోను, భూతప్రేతపిశాచాల బారినుండి రక్షణ కావలసినప్పుడు ఆ పరమేశ్వరిని ధ్యానించాలి.

వాయుపురాణంలో ఈ విధంగా ఉంది.

**అరణ్యే ప్రాంతరేవాపి జలేవాపి స్థలేఽపివా ।**
**వ్యాఘ్రకుంభీర చోరేభ్యో భయస్థానే విశేషతః ॥**
**ఆధిష్వపి చ సర్వేషు దేవీనామాని కీర్తయేత్ ।**

పంచభూతాలవల్లగాని, అరణ్యమృగాలవల్లగాని, చోరులవల్లగాని, వ్యాధులవల్లగాని భయం కలిగినపుడల్లా ఆ పరమేశ్వరిని కీర్తించాలి.

ఆ పరమేశ్వరి ఆనందస్వరూపిణి. సమస్త భయాలనూ పోగొట్టి చిత్తశాంతిని ప్రసాదిస్తుంది. అందుకనే ఆమెను భయాపహా అనటం జరిగింది.

## 122. శాంభవీ

శం అనగా అపరిమితమైన సుఖమును కలుగ చేయువాడు శంభుడు. శంభుని భార్య శాంభవి భక్తులకు సుఖమును ప్రసాదించునది. ఈ నామం దగ్గరనుండి (131) శాంతిమతి వరకు ఉన్న పదినామాలు శాంభవీ మంత్రోద్ధారము గురించి తెలియచేస్తాయి.

యోగశాస్త్రంలో ఇది ఒక ముద్రావిశేషము

**అంతర్లక్ష్యం బహిర్దృష్టిః నిమేషోన్మేషవర్జితా ।**
**ఏషా సా శాంభవీముద్రా సర్వతంత్రేషు గోపితా॥**

అరమోడ్పుకనులతో దృష్టిని అంతర్ముఖం చేసి మనస్సును పరమేశ్వరిపై లగ్నంచేసే ప్రక్రియకు శాంభవీముద్ర అని పేరు. కల్పసూత్రములలో చెప్పిన ప్రకారము దీక్షలు మూడు రకాలు అవి

1. శాక్తి 2. శాంభవి 3. మాంత్రి అని చెప్పబడింది. సద్గురువు యోగ్యుడైన శిష్యునికి ఇచ్చే దీక్షలలో శాంభవీ దీక్ష ఒకటి. ఈ దీక్ష స్వీకరించినవారు శాంభవీ దేవినుపాసిస్తారు. శరన్నవరాత్రులలో సప్తమినాడు ఎనిమిది సంవత్సరాల బాలికను పూజిస్తారు. దీన్నే కుమారీపూజ అంటారు. ఆ దేవతకు శాంభవి అని పేరు.

**చండికాసప్త వర్షాస్యా దష్టవర్షా చ శాంభవీ**

## 123. శారదారాధ్యా

సరస్వతి మొదలైన వాగ్దేవతలచే పూజింపబడునది. లేక శరదృతువునందు లేక వర్షాకాలమునందు పూజింపబడునది. వర్షాకాలంలో దేవిని పూజించాలని మార్కండేయ పురాణంలో చెప్పబడింది.

**వాసంతే నవరాత్రే తు పూజయేత్ రక్తదంతికాం**

వసంతఋతువులోని నవరాత్రులందు దేవిని పూజించాలని రుద్రయామళంలో చెప్పబడింది. కాళికా పురాణంలో

**శరత్కాలే పురా యస్మా న్నవమ్యాం బోధితాసురైః ।**
**శారదా సా సమాఖ్యాతా పీఠే లోకే చ నామతః ॥**

పూర్వము దేవతలచే శరత్కాల నవమినాడు మేల్కొల్పబడుటచే శారదా పీఠమని, శారద అని పిలవబడుతోంది. శారదచేత ఆరాధింపబడేది శారదారాధ్యా. శారదవాగ్దేవి. చదువులతల్లి ప్రతిభకలవారు శారదులు అంటే కవులు, పండితులు. వారు తమ పాండిత్యాన్ని చాటుకోటానికి దేవిని ప్రార్థిస్తారు. శారదులచేత ఆరాధింపబడే దేవి కాన శారదారాధ్యా అనబడుతోంది.

వసంత నవరాత్రులు మంచిరోజులు కావు. ప్రజల ఆరోగ్యం దెబ్బతింటుంది. రోగాలు వస్తాయి. అందుకని ఆ రోజుల్లో దేవిని ఆరాధిస్తే ఆ బాధలు పోతాయి.

వశిన్యాది దేవతలు శారదాదేవి స్వరూపులు. వారిచే ఆరాధింపబడేది కాబట్టి శారదారాధ్యా అనబడుతోంది.

ఆదిశంకరులు కర్ణాటక రాష్ట్రంలోని శృంగేరీలో దక్షిణామ్నాయ శారదాపీఠం స్థాపించి దానికి అధిపతిగా సురేశ్వరాచార్యులను (మండన మిశ్రుని) నియమించారు. ఆ పీఠాధిదేవత శారదాదేవి. ఆ దేవియే పరమేశ్వరి పరాత్పరి

**సువక్షోజకుంభాం సుధాపూర్ణ కుంభాం**
**ప్రసాదావలంబాం ప్రపుణ్యావలంబామ్ ।**
**సదాస్యేందు బింబాం సదానోష్ఠబింబాం**
**భజే శారదాంబా మజస్రం మదంబాం ॥**

**కురంగే తురంగే మృగేంద్రే ఖగేంద్రే**
**మరాళే మదేభేమ హోక్షేఽ_ధిరూఢామ్ ।**
**మహత్యాం నమామ్యాం సదాసామరూపాం**
**భజే శారదాంబా మజస్రం మదంబాం ॥**

## 124. శర్వాణీ

పరమేశ్వరుని అష్టమూర్తులలో రెండవవాడు శర్వుడు. అష్టమూర్తుల వివరాలు 112వ నామంలో ఇవ్వబడ్డాయి. శర్వుని శక్తి శర్వాణి

**శృణాతి సంహారసమయే సంహరతి**

**సంహారయతి సకలాః ప్రజా ఇతిశర్వః**

సంహార సమయమందు సకల ప్రజలను సంహరించువాడు, సంహరింపజేయువాడు శర్వుడు. అతని శక్తి శర్వాణి. లింగపురాణంలో

**చరా చరాణాం భూతానాం ధాత విశ్వంభరాత్మకః**

**శర్వ ఇత్యుచ్యతే దేవః సర్వశాస్త్రార్థపారగైః**

**విశ్వంభరాత్మన స్తస్య శర్వస్య పరమేష్ఠినః**

**సుకేశీ కథ్యతే పత్నీ తనుజోఽంగారక స్మృతః**

చరాచర జగత్తును భరించేవాడు శర్వుడు. అలాంటి శర్వుని అర్ధాంగిశర్వాణి. ఆమెకూడా భర్తతోపాటుగా సకలలోకాలను పాలిస్తూ సకల ప్రాణుల సంరక్ష సాగిస్తోంది. అందుకే ఆమె శర్వాణి. వాయుపురాణంలో

**శర్వస్యయా ద్వితీయా తు నామభూమి తనుస్మృతా**

శర్వుని యొక్క రెండవ రూపము భూమి.

## 125. శర్మదాయినీ

శర్మ అనగా సుఖము శర్మదాయినీ అంటే సుఖమును ఇచ్చేది దేవీ భాగవంతలో

**సుఖం దధాతి భక్తేభ్యః తేనైషా శర్మదాయినీ**

భక్తులకు సుఖమును ప్రసాదించేది. ఇక్కడ సుఖం అంటే ధనధాన్యాలు, భోగభాగ్యాలు మొదలైన ఐహిక సుఖం కాదు. శాశ్వతమైన సుఖం. అదే మోక్షం. ఈ లోకంలో మనం సుఖాలుగా భావిస్తున్నవన్నీ దుఃఖాలకు హేతువులే. ధనధాన్యాలు, భార్యాపుత్రులు ఇవేవీ శాశ్వతం కాదు. ఇవి క్షణకాలం మాత్రమే సుఖాన్నిస్తాయి. ఆ తరువాత వాటివల్లనే కష్టాలు వస్తాయి. మానవుడు పోయేటప్పుడు ఇవి ఏవీ వెంటరావు. గీతాచార్యుడు చెప్పినట్లుగా

**అర్థాగృహే నివర్తంతే స్మశానే మిత్రబాంధవాః ।**
**సుకృతం దుష్కృతం చైవ గచ్ఛంత మనుగచ్ఛతి ॥**

సంపాదించిన ధనధాన్యాలు ఇంటివద్దనే ఉండిపోతాయి. అతడిమీద ప్రేమ ఉన్న మిత్రులు బంధువులు స్మశానందాకా వెడతారు. అంతేగాని అతడితో వెళ్ళేది అతడు చేసిన పాపపుణ్యాలే. అవే పారలౌకికానందాన్ని ఇచ్చేవి.

జీవులకు తమతమ పూర్వజన్మ పుణ్యఫలాన్ననుసరించి దేవి వారికి సుఖాన్ని కలగచేస్తుంది. ఉత్తమమైన యోగ్యత కలవారికి మోక్షాన్నికూడా ప్రసాదిస్తుంది. ఈ రకంగా శాశ్వతమైన సుఖాన్ని కలగచేస్తుంది కాబట్టి శర్మదాయినీ అనబడుతున్నది.

## 126. శాంకరీ

**శంకరుని భార్య శాంకరీ**

**శం సుఖం కరోతీతి శాంకరీ** సకల సుఖాలను కలగచేసేది కాబట్టి శాంకరీ అనబడుతోంది. కాళికా పురాణంలో

**ప్రతిసర్గాది మధ్యాంత మహంశంభుం నిరాకులం**
**స్త్రీరూపేణానుయాస్యామి ప్రాప్య దక్షా దహం జనుః**
**తత స్తు విష్ణుమాయాం మాం యోగనిద్రాం జగన్మయీం**
**శాంకరీతి స్తుతిష్యంతి రుద్రాణీతి దివౌకసః ॥**

సృష్టి స్థితి లయాలందు నిరాకులుడైన శంభుని నేను స్త్రీ రూపంలో అనుసరించి ఉంటాను. నన్ను దేవతలు విష్ణుమాయ, జగన్మయి, శాంకరీ అని స్తుతిస్తారు.

లలితాదేవి భద్రమూర్తి. శర్మదాయిని. తన భక్తులకు సకలశుభాలు, సకల సుఖాలు ప్రసాదించే దేవత శాంకరి.

## 127. శ్రీకరీ

లక్ష్మీప్రదురాలు. శ్రీ అంటే శోభ, సంపద, శుభము అని అర్థం. తన భక్తులకు సకల సంపదలు ప్రసాదిస్తుంది. కాబట్టి దేవిని శ్రీకరీ అనటం జరిగింది.

శ్రీ మహావిష్ణువు శ్రీకరుడు. విష్ణు సహస్రంలో

**శ్రీదరః శ్రీకరః శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః**

అని చెప్పబడింది. శ్రీకరుడు విష్ణువు అతని భార్య అయిన లక్ష్మీదేవి శ్రీకరి. దేవి ఇక్కడ లక్ష్మీ స్వరూపంగా చెప్పబడుతోంది. లక్ష్మీస్వరూపము అంటే కేవలం సంపదలిచ్చే లక్ష్మీదేవి మాత్రమే కాదు. అష్టలక్ష్మీ స్వరూపమైన దేవి. అష్టలక్ష్ములు అంటే

| | | | |
|---|---|---|---|
| 1. ఆదిలక్ష్మి | 3. ధైర్యలక్ష్మి | 5. సంతాన లక్ష్మి | 7. విద్యాలక్ష్మి |
| 2. ధాన్యలక్ష్మి | 4. గజలక్ష్మి | 6. విజయలక్ష్మి | 8. ధనలక్ష్మి |

భక్తులకు వారివారి కర్మఫలాన్ననుసరించి అష్టైశ్వర్యముల నొసగునది.

**లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం**
**దాసీభూత సమస్తదేవవనితాం లోకైక దీపాంకురామ్ ॥**
**శ్రీమన్ మంద కటాక్ష లబ్ధవిభవ బ్రహ్మేంద్ర గంగాధరాం ।**
**త్వాం త్రైలోక్యకుటుంబినీం సరసిజాం వందే ముకుంద ప్రియాం ॥**

## 128. సాధ్వీ

సాధ్వీ అంటే పతివ్రత. భూతభవిష్యద్వర్త మానములందు కూడా మనోవాక్కాయ కర్మలచే వేరొకరితో సంబంధములేని స్త్రీ సాధ్వి అనబడుచున్నది. భర్తనే ప్రత్యక్షదైవంగా భావించి అతణ్ణి పూజించే లక్షణంగల స్త్రీ పతివ్రత.

సౌందర్య లహరిలోని 96వ శ్లోకంలో శంకరులు

**కళత్రం వైధాత్రం కతికతి భజన్తే న కవయః**
**శ్రియో దేవ్యాః కో వా న భవతి పతిః కై రపి ధనైః ।**
**మహాదేవం హిత్వా తవ సతి సతీనామచరమే**
**కుచాభ్యా మాసంగః కురవకతరో ర ప్యసులభః ॥**

ఓ పతివ్రతా శిరోమణీ ! పండితులు, కవులు తమ పాండిత్యముచే సరస్వతీపతి అని పిలవబడుతున్నారు. బాగా ధనం సంపాదించినవాడు లక్ష్మీపతి అని పిలవబడు తున్నారు. అంటే వారి వారి పాతివ్రత్యానికి భంగం వాటిల్లుతోంది. కాని నీకు మాత్రం అటువంటి కళంకం లేదు కదా! అంటే దేవి పాతివ్రత్యము అవాఙ్మానస గోచరము అని అర్థము.

ప్రాణులు చేసే పనులను బట్టి ఎవరికీ ఏ విధమైన అపరాధము, హాని, అపకారము కలుగకుండ సర్వదా క్షేమము కలిగేటట్లుగా జీవనయాత్రా విధానము ఉపదేశించేది

వేదమాత. ఆ రకంగా 84 లక్షల జీవరాసులక్షేమం కోరేది వేదము మాత్రమే. అందుకనే వేదము సాధ్వము అనబడుతోంది. ఆ వేదము యొక్క స్వరూపమే దేవి. సృష్టి స్థితి లయాలన్నీ వేదములో చెప్పిన ప్రకారమే జరుగుతాయి. కాబట్టి వేదస్వరూపిణి అయిన పరమేశ్వరి సాధ్వీ అనబడుతోంది.

## 129. శరచ్చంద్రనిభాననా

శరదృతువునందలి చంద్రబింబముతో సమానమైన ముఖము కలది.

శ్రావణ, భాద్రపద మాసములు - వర్షఋతువు

ఆశ్వీయుజ, కార్తీక మాసములు - శరదృతువు వెన్నెల బాగుగా కాయును.

సంవత్సరంలోని పన్నెండు నెలలలోను శరదృతువులోనే వెన్నెల బాగా కాస్తుంది. అంటే స్వచ్ఛమైన పూర్ణచంద్రుడు ఆ ఋతువులోనే కనిపిస్తాడు. అందుకే పరమేశ్వరి ముఖము శరత్కాలమునందలి పున్నమినాటి చంద్రబింబమువలె అందంగా, స్వచ్ఛంగా ఉన్నది అని చెప్పబడింది. ముఖము మనసుకు దర్పణంలాంటిది. అంటే దేవిముఖమే కాదు, మనసుకూడా స్వచ్ఛమైనదిగా, నిష్కల్మషంగా ఉంది అని అర్థం.

దేవిముఖం చంద్రబింబంతో పోల్చబడింది. చంద్రుడు షోడశకళాయుక్తుడు. అందుకే దేవి ముఖమండలం పూర్ణచంద్రునితో పోల్చబడి **పూర్ణేందుబింబాననా** అని చెప్పబడింది.

సౌందర్య లహరిలోని 63వ శ్లోకంలో శంకరభగవత్పాదులు

**స్మితజ్యోత్స్నాజాలం తవ వదనచంద్రస్య పిబతాం**
**చకోరాణా మాసీ దతిరసతయా చంచుజడిమా ।**
**అతస్తే శీతాంశో రమృతలహరీ మామ్లరుచయః**
**పిబన్తి స్వచ్ఛందం నిశి నిశిభృశ కాజింక ధియా ॥**

తల్లీ ! నీ వదనచంద్రుని చిరునవ్వు అనెడి వెన్నెలను తాగుతున్న చకోరాలకు, అతిమాధుర్యమువలన అరుచి కలిగింది. అప్పుడు ఆ పక్షులు పులుపుమీద కోరికకలవై, చంద్రకాంతి అను బియ్యపు కడుగును తృప్తిగా తాగుతున్నాయి. అంటే దేవి ముఖము చంద్రబింబము కన్న ఎక్కువ కాంతితో ప్రకాశిస్తున్నది.

## 130. శాతోదరీ

శాతము అంటే కృశించినది అని అర్థం. కృశించిన ఉదరముకలది. సన్ననైన నడుము కలది. స్త్రీ సాముద్రిక లక్షణాలలో సన్ననైన నడుము ఒకటి.

శతోదరుడు అంటే లెక్కలేనన్ని గుహలు కలవాడు హిమవంతుడు. హిమవంతుని కుమార్తె హైమవతి. శతోదరుని కుమార్తె శాతోదరి. తారకాసుర సంహారానికి హిమవంతుని ఇంట హైమవతిగా పుట్టింది ఆ పరమేశ్వరి.

**అంబా శంకర భద్రరాజగమనా ఆర్యా ఉమా పార్వతీ**
**కాళీ హైమవ తీశ్వరీ త్రినయనీ కాత్యాయనీ భైరవీ**
**సావిత్రీ నవయౌవనా శుభకరీ సామ్రాజ్యలక్ష్మీకరీ**
**చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ ॥**

## 131. శాంతిమతీ

**శాంతిరస్యా స్తీతి శాంతిమతీ** శాంతస్వభావము కలది. భక్తులయందు తీక్షణమైన భావము లేనిది. అంతరింద్రియ నిగ్రహము కలది. శాంతము అంటే సుఖము అంతమందు కలది. ఇంద్రియ నిగ్రహంవలన ఏర్పడే మానసికమైన సుఖావస్తే శాంతము. అలాంటి శక్తి కల దేవి శాంతిమతి. శ్రీచక్రంలోని తొమ్మిదవ ఆవరణలో ఉన్న రసము శాంతరసము.

ఉపశమించిన మానసము కలది. శాంతము పొందిన మనస్సు అంటే తురీయావస్థలో మనోవృత్తులు ముఖ్యప్రాణమునందు లయము పొందుతాయి. బుద్ధి మాత్రమే జాగరూకమై ఉంటుంది. దీనినే ప్రజ్ఞాన ఘనస్థితి అంటారు. ఈ స్థితిలో

| | | | |
|---|---|---|---|
| 1. శృంగార | 3. కరుణ | 5. వీర | 7. భయానక |
| 2. హాస్య | 4. అద్భుత | 6. రౌద్ర | 8. భీభత్స |

రసములు లేకుండా ఒక్క శాంతరసము మాత్రమే ఉంటుంది. ఇచ్ఛాక్రియాంశలు దాదాపు పూర్తిగా నశిస్తాయి. కేవలము జ్ఞానము మాత్రమే ఉంటుంది. జ్ఞానాధిక్యమే దైవాంశ విశేషము.

| | | |
|---|---|---|
| 1. శాంభవి | 3. సాధ్వి | 5. శాతోదరి |
| 2. శర్వాణి | 4. శరచ్ఛంద్రనిభాననా | 6. శాంతిమతి |

ఈ ఆరుగురు భవానీ దేవియొక్క అంగదేవతలు.

112వ నామం నుంచి 131వ నామం వరకు శాంభవీ విద్య వివరించబడింది. **శాంభవీ** విద్యోపాసనవలన ఫలశృతి **శర్మదాయినీ, శాంకరీ, శ్రీకరీ** అనబడే 125, 126, 127 నామాలలో వివరించబడింది. శాంభవీదేవిని ఎప్పుడు ఉపాసించాలనేది **శారదారాధ్యా** అనే 123వ నామంలో చెప్పబడింది.

ఈ రకంగా 20 నామాలలో శాంభవీ విద్య వివరింపబడింది.

# 14. పరబ్రహ్మతత్త్వము

పరమేశ్వరియొక్క గుణవిశేషాలను వర్ణించిన తరువాత హయగ్రీవుడు పరమేశ్వరి యొక్క నిర్గుణతత్త్వాన్ని వివరిస్తున్నాడు.

**ప్రథమం సగుణమాశ్రిత్య తతోనిర్గుణ మాశ్రయేత్**

మొదటగా సగుణరూపం చెప్పి ఆ తరువాత దేవియొక్క నిర్గుణతత్త్వాన్ని వివరించి సాధనాక్రమాన్ని బోధిస్తున్నాడు.

సాధనలో ఇది పద్ధతి. ఉపనిషత్తులలోకూడా ఈ పద్ధతే చెప్పబడింది. ప్రశ్నోప నిషత్తులో పిప్పలాద మహర్షి మహాజ్ఞాని బ్రహ్మవేత్త. ఒకరోజున సుకేసుడు, సత్యకాముడు, గార్గ్యుడు, కౌశల్యుడు, వైదర్భి, కబంధి అనే ఆరుగురు పిప్పలాదుడి దగ్గరకు వచ్చారు. వీరందరూ నియమనిష్ఠలతో జీవితం గడుపుతున్నవారు వేదాధ్యయనం చేసినవారు. సగుణబ్రహ్మ ఆరాధనలో శ్రేష్టులు. యజ్ఞయాగాదులు నిర్వహించటంలో తమకు సాటిలేనివారు. ఇప్పుడు నిర్గుణబ్రహ్మను గురించి తెలుసుకోవాలనే తలంపుతో మంచి గురువు కోసం వెదకటం మొదలుపెట్టారు. ఆ కాలంలో పిప్పలాదుడు మహాజ్ఞాని. తత్త్వవేత్త. అందుచేత ఆయన దగ్గర బ్రహ్మజ్ఞాన సముపార్జన చెయ్యాలనే తలంపుతో ఆచార ప్రకారం సమిధలు చేతితో పట్టుకుని పిప్పలాదుణ్ణి దర్శించారు.

కఠోపనిషత్తులో గౌతముడు మహాపండితుడు. వేదవేదాంగవిదుడు. మహాతపస్వి. మరణానంతరము ఉత్తమలోకాలు పొందటం కోసమని 'విశ్వజిత్' అనే యాగాన్ని చెయ్యాలనుకున్నాడు. ఈ యాగంచేసేవారు ముందుగా తమ సర్వస్వాన్ని దానం చెయ్యాలి.

ఆచారం ప్రకారం గౌతముడు అన్ని దానాలు చేశాడు. చివరకు గోదానం వచ్చింది. అందులో వట్టిపోయిన ఆవులు, ముసలి ముతక ఆవులు, ఆఖరి క్షణాలలో ఉన్న ఆవులను కూడా దానం ఇవ్వటానికి సిద్ధపడ్డాడు.

అతని కుమారుడు నచికేతుడు. వేదాధ్యయనం చేసినవాడు. తండ్రితోపాటుగా సమానమైన పండితుడు. ఈ ఆవులను దానం చెయ్యటంవల్ల పుణ్యలోకాలు కలగకపోగా, ఆనందము అనే నరకము ప్రాప్తిస్తుంది అని తెలిసినవాడు. అంటే నచికేతుడు మహా పండితుడు. కర్మలు చేయటంలో ఆరితేరినవాడు. తండ్రి ఆ గోవులను దానం ఇవ్వకుండా ఆపాలని చూశాడు. సాధ్యపడలేదు. చివరకు తనను తానే యముడికి దానం ఇప్పించుకుని యముని దగ్గర బ్రహ్మవిద్య నభ్యసించాడు.

ముండకోపనిషత్తులో పూర్వకాలంలో పాంచాలదేశంలో త్రిగర్త అనే పల్లె ఉంది. అందులో శునకుడు అనే మహాపండితుడు ఉండేవాడు. ఆయన దగ్గర పాండిత్యంతోపాటుగా ధనధాన్యాలు కూడా సమృద్ధిగా ఉండేవి. అందుచేత విద్యార్థులకు తన ఇంట్లోనే వసతికూడా కల్పించి విద్య నేర్పేవాడు. అందుచేత అతని యశశ్చంద్రికలు దశదిశలా వ్యాపించినాయి.

అతని పెద్దకుమారుడు శౌనకుడు. కఠోర నియమాలతో బ్రహ్మచర్యం పాటించి విద్యాభ్యాసం పూర్తిచేశాడు. అంటే వేదవేదాంగాలు, శాస్త్రాలు, కర్మానుష్టానము అన్నీ పూర్తిగా తెలుసుకున్నాడు. వాటిలో నేర్పు సంపాదించాడు. ఇప్పుడు గురువుగారైన అంగిరసుని దగ్గరకు వెళ్ళి "స్వామీ ! దేన్ని గురించి తెలుసుకున్నంత మాత్రంచేత సర్వమూ తెలుస్తాయో, దాన్ని నాకు వివరించండి" అని అడిగాడు. అదే బ్రహ్మవిద్య. పరబ్రహ్మ తత్త్వాన్ని గురించి వివరించమని అడిగాడు శౌనకుడు.

అదేవిధంగా ఛాందోగ్యోపనిషత్తులో శ్వేతకేతువు. విద్యాభ్యాసం పూర్తిచేశాడు. అంటే సగుణబ్రహ్మారాధనలో నిష్ణాతుడైనాడు. ఇప్పుడు తన తండ్రి అయిన ఉద్దాలకుణ్ణి నిర్గుణ బ్రహ్మను గురించి చెప్పమని అడుగుతున్నాడు.

తైత్తిరీయోపనిషత్తులో వరుణమహర్షి కుమారుడు భృగుమహర్షి. విద్యాభ్యాసం పూర్తిచేశాడు. కర్మాచరణలో నిష్ణాతుడు. ఇప్పుడు తండ్రియైన వరుణ మహర్షిని అడుగుతున్నాడు. బ్రహ్మవిద్యను బోధించమని.

ఈ రకంగా ఉపనిషత్తులలో ఎక్కడ చూసినా సగుణ బ్రహ్మారాధనలో నిష్ణాతుడైన వాడే నిర్గుణబ్రహ్మ. ఎందుకంటే ముందుగా మనసు నిశ్చలం కావాలి. ఏకాగ్రత ఏర్పడాలి. కర్మానుష్ఠానము చెయ్యాలి. కర్మలవల్ల ఫలితం అనుభవించాలి. ఆ తరువాత కర్మలుచేసినా చెయ్యకపోయినా ఒకటే అనే భావన రావాలి. భగవంతుడి ప్రతిమను ఆరాధించవలసిన అవసరం లేదు. ఆ భగవంతుడు తనలోనే ఉన్నాడు. అనే భావన రావాలి. అప్పుడు భగవంతుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు. సర్వాంతర్యామి. ఎల్లఎడలా వ్యాపించి ఉన్నాడు. సర్వవ్యాపి అనే విషయం తెలుస్తుంది. అప్పుడు నిర్గుణభావంలోకి వెళ్ళినట్లైతే కొంత కాలానికి 'అహంబ్రహ్మాస్మి' నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అనే విషయం తెలుస్తుంది. ఇప్పుడు భగవదారాధన అంటే తనను తాను పూజించుకోవటమే.

అందుచేత ముందుగా సగుణబ్రహ్మను గురించి చెప్పి ఆ తరువాత నిర్గుణబ్రహ్మను వివరిస్తాడు.

బ్రహ్మసూత్రాలలో మొట్టమొదటి సూత్రం

**అథాతో బ్రహ్మజిజ్ఞాసా** ఇక పరబ్రహ్మను గురించి తెలుసుకోవాలనే కోరిక. ఈ కోరిక ఎప్పుడు కలిగింది? వ్యాసుడు బ్రహ్మసూత్రాలు ఎప్పుడు వ్రాశాడు? ముందుగా వేదాలను విభజించి వేదవ్యాసుడైనాడు. ఆ తరువాత వేదాలలో చెప్పిన విషయం అందరికీ అందుబాటులోకి రావాలనే తలంపుతో, అష్టాదశ పురాణాలు వ్రాశాడు. ఈ పురాణాలలో అనేక కథలు. ఆ కథలలో ధర్మసూత్రాలు. నీతిసూత్రాలు. భగవంతుడిని గురించిన స్తుతులు, స్తోత్రాలు. యజ్ఞయాగాది క్రతువులు పూజలు, వ్రతాలు వాటివల్ల వచ్చే ఫలితాలు. జ్ఞానబోధ, ఎవరో ఒక మహర్షి వచ్చి రాజుగారికి ఏదో సందర్భంలో బ్రహ్మపదార్థాన్ని వివరిస్తాడు. ఈ రకంగా వేదంలో చెప్పిన పర, అపరావిద్యలు రెండూ పురాణాలలో చెప్పబడ్డాయి. అంతదాకా ఎందుకు? పురాణాలు మానవుని మనుగడకు ఆధారాలు. ఆ రకంగా వేదాలసారాన్ని పురాణాలలో నిక్షిప్తం చేశాడు.

అయితే కొంతకాలానికి పరబ్రహ్మను గురించి అనేక ప్రశ్నలు తలఎత్తినాయి. వైశేషికులు, సాంఖ్యులు, చార్వాకులు వీరంతా తమయొక్క వాదనాపటిమతో పరమేశ్వరుణ్ణి గురించి ప్రశ్నించారు. అసలు వేదాలేవని కొందరన్నారు. అప్పుడు వ్యాసమహర్షి బ్రహ్మసూత్రాలు వ్రాసి అద్వైతసిద్ధాంతాన్ని పునః ప్రతిష్ఠ చేశాడు.

అంటే ముందుగా సగుణ బ్రహ్మను వివరించి కర్మానుష్ఠానము వల్ల వచ్చే ఫలితాలను చెప్పి, వాటివల్ల వచ్చే ఫలితాలు అశాశ్వతాలు. అని చెప్పి అప్పుడు పరబ్రహ్మ తత్త్వాన్ని బోధించాడు.

ఈ విధంగానే ముందు సగుణ బ్రహ్మను గురించి పూర్తిగా తెలుసుకుని, కర్మలను ఆచరించి, ఆ తరువాత నిర్గుణోపాసనవైపు మళ్ళాలి. ఇది సంప్రదాయం. ఈ కారణంచేతనే ముందుగా పరమేశ్వరి వైశిష్ట్యము, ఆమె స్థూల సూక్ష్మరూపాలను వర్ణించారు. రాక్షస సంహారం చేసి ఆమె భక్తులను ఏ విధంగా కాపాడుతుందో వివరించారు. తరువాత పరమేశ్వరిని అర్చించాలంటే విధానమేమటి? ఆచారమేమిటి? అంటూ కౌళసమయాచారాలను వివరించారు. అసలు పరమేశ్వరిని ఆరాధించటం ఎలా? ఆరాధిస్తే ఫలితము ఏమిటి? అనే విషయాలను వివరిస్తూ శాంభవీ విద్యను వివరించారు. ఇంతవరకు దేవియొక్క స్థూల సూక్ష్మ రూపాలు, అర్చనావిధానము వివరించారు. ఇక్కడి వరకు సగుణ బ్రహ్మోపాసన పూర్తి అయింది. ఇక నిర్గుణ బ్రహ్మదగ్గరకు వెడుతున్నారు.

పరమేశ్వరి అంటే ఎవరో కాదు సాక్షాత్తూ పరబ్రహ్మస్వరూపమే. నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ సృష్టి చెయ్యాలనే తలంపుతో బిందురూపుడుగా

ఉన్న తనను తాను రెండు భాగాలుగా విభజించుకున్నాడు. అంటే తనలోని కొంతభాగాన్ని బయటకు పంపాడు. అదే పరమేశ్వరుని ప్రతిరూపమయిన శక్తి. అదే మాయ. ఈ సృష్టి అంతా ఈ మాయ లేదా శక్తి వల్లనే జరిగింది. లోకాలన్నీ దీనివల్లనే ఉద్భవించినాయి అదే పరమేశ్వరి.అన్నీ దీనివల్లనే ఉద్భవించాయి కాబట్టే దానిని యోని అన్నారు. అదే త్రికోణము.

పరమేశ్వరుడే శివుడు. పరమేశ్వరిశక్తి. శివశక్తులు వేరు కాదు ఇద్దరూ ఒకటే. నాణానికి బొమ్మ బొరుసులాగా అవ్యక్తమైనది శివుడైతే, వ్యక్తమయ్యేది శక్తి. అందుకే ఆ పరమేశ్వరియే పరబ్రహ్మ స్వరూపమని చెప్పబడింది. ఇప్పుడు ఆ పరబ్రహ్మతత్త్వాన్ని అంటే నిర్గుణతత్త్వాన్ని 132వ నామం నుంచి వివరిస్తున్నారు.

## 132. నిరాధారా

నిరాధారా అంటే ఆధారములేనిది. అన్ని జగత్తులకు ఆమెయే ఆధారం. అంతేకాని ఆమెకు ఆధారం వేరే లేదు. చరాచర జగత్తులోని సకలప్రాణులకు ఆధారం పరమేశ్వరి. ప్రపంచంలోని ప్రతివస్తువుకు ఏదో ఒక ఆధారం ఉంటుంది.

| | | |
|---|---|---|
| దీపానికి | – | వత్తి, చమురు ఆధారం |
| జీవికి | – | శరీరం ఆధారం |
| అగ్నికి | – | ఇంధనం ఆధారం |

ఈ రకంగా తానే అన్నింటికీ ఆధారమై, తనకు ఏ రకమైన ఆధారము లేనిది ఆ దేవి. చరాచర జగత్తుకూ అధిష్ఠానరూపమై ఆధారమైనది దేవి. ఆమె సర్వస్వతంత్ర. ఆమెకు వేరొక ఆధారం లేదు.

సూతసంహితలో పూజావిధానాలు రెండుగా చెప్పబడ్డాయి.

**పూజా శక్తేః పరాయా స్తు ద్వివిధా సంప్రకీర్తితా**

అవి 1. బాహ్యపూజ, 2. అంతఃపూజ

పరమేశ్వరిని ప్రతిమరూపంలో అర్చించటం బాహ్యపూజ. ఇది సగుణోపాసన. ఆ దేవిని రూపరహితంగా మానసిక ధ్యానం చెయ్యటమే అంతఃపూజ ఇది నిర్గుణోపాసన. దీన్నే అభ్యంతర పూజ అని కూడా అంటారు. మళ్ళీ బాహ్యపూజ వైదికము, తాంత్రికము అని రెండు విధాలు. అలాగే అంతఃపూజ కూడా 1. సాధారము 2. నిరాధారము అని

రెండు రకాలు వీటన్నింటిలోనూ నిరాధారపూజ శ్రేష్ఠమైనది. నిరాధారపూజ మంత్ర రహితమైనది. అంటే ఇందులో మంత్రం ఉండదు.

మంత్రము అంటే మంత్రయము. మలము అనగా మలినము, మడ్డి, పాపము అని అర్థము. ఇక మలత్రయము అంటే 1. అణవమల, 2. మాయీకమల 3. కార్మికమల అని మూడు రకాలయిన మలినాలు.

1. సాధకుడు శరీరంలోని ఇంద్రియాలే తాను అనే భావం పొందటమే అణవమల.

2. ప్రపంచంలోని సర్వజంతువుల దేహేంద్రియాలను స్వపరభేదన గావించటం మాయీకమల

3. తాను ప్రపంచంలోని శక్తిని ఉపయోగించు స్థితులందు ఒక భావన, తాను ప్రపంచానికి ఉపయోగపడే విధులందు ఒక భావన కార్మికమల.

ఈ రకంగా మలత్రయం భావరహితమై, తనకన్న భిన్నమైనది ఏదీలేదని, తాను ప్రపంచానికి ఉపయోగించే వస్తువులలో ఒకటిగా ఉన్నాననే భావన కావాలి. ఈ రకంగా మలత్రయం లేకుండా చేసే పూజ నిరాధారము అని చెప్పబడుతుంది.

## 133. నిరంజనా

అంజనము అంటే కాటుక, పూత, ఆవరణ అని అర్థం. ఏదైనా ఒక వస్తువుకు రంగు వేస్తే లేదా పూతపూస్తే ఆ వస్తువుయొక్క సహజ స్వరూపం కనిపించదు. పరమేశ్వరి అటువంటి పైపూతలు, రంగులు లేనటువంటిది. **నిరవద్యం నిరంజనం** అనే శృతివాక్యం వల్ల ఆ పరమేశ్వరి దోషరహితమైన తత్త్వం కలది అని చెప్పబడుతోంది. హయగ్రీవుడు జ్ఞానవిషయకమైనటువంటి నిరాధారా పూజాస్వరూపమును విధి నిషేధములచేతను, రూఢి అయిన లక్షణముల చేతను చెబుతూ దానిని పొందటానికి ఉపాయము, దానివల్ల ఫలితము ఇక్కడనుంచి 8 శ్లోకాలలో చెబుతున్నాయి.

అజ్ఞానులు మూడు విధాలుగా ఉంటారు.

1. విజ్ఞాకేవలులు 2. ప్రళయాకలులు 3. సకలులు

1. కేవలము మలమూత్రములతో కూడినవాడు; అపవిత్రుడు – విజ్ఞానకేవలుడు.

2. కర్మతోకూడి, ఆత్మను తెలుసుకోలేక అనేక జన్మలకు కారణమైన కర్మలలో మునిగిపోయినవాడు – ప్రళయాకలుడు.

3. భేదబుద్ధి అనగా ద్వైతబుద్ధిని గలిగించేటటువంటి మాయ అను మలము గలవాడు – సకలుడు. వీటిలో మూడవది రెండవదానిలో కలసి ఉంటుంది. అలాగే రెండవది మొదటి దానిలో కలిసి ఉంటుంది. లోకంలో అన్ని జీవరాసులకు ఈ రకమైన అజ్ఞానం ఉంటుంది. అటువంటి మూడు విధానాలయిన అజ్ఞానము తొలగిస్తుంది పరమేశ్వరి.

అవిద్య, అజ్ఞానము అనేవి లేనిది పరమేశ్వరి. ఇంద్రియాలు వాటిపని అవి చేస్తున్నప్పటికీ, ఆ విషయంలో వాటికి ఏ రకంగా సంబంధం లేదో, అలాగే పరమేశ్వరి కూడా అజ్ఞానరహితురాలు. మాయకు అతీతమైనది. జ్ఞానమూర్తి.

అవిద్యాసంపర్కము లేని శుద్ధజ్ఞానస్వరూపిణి పరమేశ్వరి. సహస్రారంలో చంద్రమండలమున్నది. అక్కడ చిత్కలారూపంలో కేవలము ఆనందరూపిణిగా ఉన్నది. అందుచేత 'నిరంజనా' అని పిలువబడుతోంది యోగ వాసిష్ఠంలో చెప్పినట్లుగా

**భావా ఽ భావే పదార్థానాం హర్షామర్ష వికారదా ।**
**మలినా వాసనారామ సంగశబ్దేన కథ్యతే ॥**

పదార్థమందలి భావాభావము. ఇష్టానిష్టములు, సంగపదార్థాలు ఏవీ లేనిది.

## 134. నిర్లేపా

లేపము అంటే మాయ అని అర్థం. నిర్లేపా మాయలేనిది. మాయకు లొంగనిది, మాయారహితమైనది. జగత్తులో ప్రతి జీవీ మాయకులోనైనదే. మాయ పరబ్రహ్మకు అధీనమై ఉంటుంది. పాముకోరలలో ఉండే విషంలాగా మనిషి వెనక ఉండే నీడలాగా ఆ మాయ పరమేశ్వరుణ్ణి ఆవరించి ఉంటుంది. దానివల్లపరమేశ్వరుడికి ఏ రకమైన హాని ఉండదు. మాయ అతన్ని ఏమీ చెయ్యలేదు. పాముకోరలలో ఉండే విషంవల్ల పాముకు ఏ ప్రమాదము లేదు. కాని దానిచే కరవబడ్డ జీవికి మాత్రం ప్రమాదం. అలాగే మాయవల్ల పరమేశ్వరుడికి ఏ హాని ఉండదు. దానివల్ల హాని మిగిలిన జీవులకే. మాయవల్ల మనుష్యులే కాదు. దేవతలు, ఋషులు అందరూ మాయకు లోనైనవారే.

ఒకసారి నారదమహర్షి వైకుంఠానికి వెళ్ళాడు. ఆ సమయంలో లక్ష్మీదేవి విష్ణువు యొక్క పాదాలు వత్తుతోంది. నారదుడు రాగానే ఆమెలేచి లోపలకు వెళ్ళిపోయింది. అలా ఎందుకు వెళ్లిందో నారదుడికి అర్థం కాలేదు. తాను బ్రహ్మచారి. అందునా

మునీశ్వరుడు. అందులోనూ దేవర్షి. త్రిలోక సంచారి, విరాగి, పరోపకార పారాయణుడు అటువంటి తనను చూసి లక్ష్మీదేవి వెళ్ళిపోవటంలో అర్థం లేదు. అదే మాటను విష్ణువుతో అన్నాడు. విష్ణుమూర్తి చిన్నగా నవ్వి "అంతే నారదా ! కులస్త్రీలు పరపురుషుని కంటపడరు." అన్నాడు. ఆ మాటలు విన్న నారదుడు "తాతా! నేను జితేంద్రియుణ్ణి విరాగిని, సంసారబంధంలో చిక్కిన నీబోటివారికిగాని, సన్యాసిని పైగా మహర్షిని నాకు మాయ ఏమిటి?" అన్నాడు.

కొంచెం ఆలోచించి శ్రీ మహావిష్ణువు "నిజమే నారదా! మాయకు నువ్వు అతీతుడివి" అన్నాడు అంతలో గరుడవాహనం వచ్చింది. విష్ణుమూర్తి దానిమీద ఎక్కి నారదుణ్ణి కూడా రమ్మన్నాడు. ఇద్దరూ బయలుదేరారు. చాలాదూరం ప్రయాణం చేశారు. నదులు పర్వతాలు దాటారు. చివరకు ఒక మంచి వనం వచ్చింది. అక్కడ సెలయేళ్ళు, జలపాతాలు, పూవుల సువాసనలు మనసుకు ఆహ్లాదం కలిగిస్తున్నాయి. "నారదా కొంచెంసేపు ఇక్కడ విశ్రాంతి తీసుకుని తరువాత బయలుదేరదాము." అన్నాడు విష్ణుమూర్తి. సరే అన్నాడు నారదుడు. గరుడవాహనం క్రిందికి దిగింది. ముందుగా స్నానం చేద్దాం అనుకున్నారు. నారదుడు తన దండకమండలాలు, కృష్ణాజినము విష్ణుమూర్తి దగ్గరపెట్టి స్నానానికి వెళ్ళి సెలయేటిలో మునిగాడు. అంతే లేచేసరికి ఒక దివ్యసుందరమూర్తి. చుట్టూ ఎవరూ లేరు. నిర్జన ప్రదేశం. ఏమీ తెలియటం లేదు. చిన్నగా వచ్చి ఒక చెట్టునీడన విశ్రాంతి తీసుకున్నది ఆ స్త్రీమూర్తి. ఆ దారి వెంబటి పొరుగుదేశపు రాజు తాళధ్వజుడు తనసేనతో వెడుతున్నాడు. ఒంటరిగా ఉన్న జగదేక సుందరిని చూశాడు. దగ్గరకు వచ్చి వివరాలు అడిగాడు. ఆమె ఏమీ తెలియదంది. తనను వివాహం చేసుకోమన్నాడు. ఆమె సరేనన్నది.

తాళధ్వజుడు ఆమెను వెంట పెట్టుకుని తన రాజ్యానికి పోయి, ఆమెను వైభవోపేతంగా వివాహమాడాడు. వారికి వందమంది సంతానంకలిగారు. వారందరికి వివాహాలు చేశారు. మనమలు మనమరాండ్రతో చాలా హాయిగా ఉన్నారు.

ఇంతలో అనుకోకుండా పొరుగుదేశపు రాజు దండెత్తి వచ్చాడు. తాళధ్వజుని సేనలు ప్రతిఘటించినాయి. అతని కుమారులు కూడా యుద్ధానికి వెళ్ళారు. పోరుభీకరంగా సాగుతోంది. ఇంతలో ఒక వాహనం వచ్చింది. అందులో రాకుమారుల శవాలు. రాకుమారులందరూ మరణించారు. చూసింది రాణి. ఘొల్లుమని ఏడుస్తోంది. ఆమెను ఓదార్చటం ఎవరివల్ల కావటంలేదు. నూర్గురు కుమారులు ఒక్కసారే మరణించారు.

రాజును నిందిస్తోంది. ఏడుస్తోంది. ఇంతలో ఒక ముసలి బ్రాహ్మణుడు అక్కడకు వచ్చి ఆమెను ఓదార్చటానికి ప్రయత్నించాడు. "అమ్మా ! ఏడవకు పుట్టిన ప్రతివారూ మరణించక తప్పదు. మరణించిన ప్రతివాడూ మళ్ళీ పుట్టకా తప్పదు. ఎవరి కాలము పూర్తికాగానే వాళ్ళు వెళ్ళిపోతారు. నీవు ఎక్కడ నుంచి వచ్చావో నీకు తెలుసా? చావుపుట్టుకలు దైవాధీనాలు. నువ్వు విచారించకు. తల్లీ ! పోయినవారికి కర్మ చెయ్యాలి కదా! ముందు ఎదురుగా కనిపించే సెలయేటిలో స్నానం చేసిరా" అన్నాడు.

అతి కష్టంమీద సరేనన్నది రాణి. సెలయేటిలో మునిగింది. పైకి లేచేసరికి నారదుడు. వడ్డున ఉన్న విష్ణుమూర్తి ఇంత ఆలస్యం ఏమిటని అరుస్తున్నాడు. విష్ణుమూర్తి ప్రక్కనే తానువదలిన దండకమండలాలు, కృష్ణాజినం ఉన్నాయి. మరి ఇప్పుడు జరిగింది అంతా మాయ. విష్ణుమాయ అనుకున్నాడు.

సిగ్గుతో తలవంచుకుని వస్తున్నాడు. ఇంతలో తాళధ్వజ మహారాజు ఏడుస్తూ పరుగెత్తుకు వచ్చి స్వామీ! నా భార్యను నాకప్పగించండి. ఆమె లేకపోతే నేను బ్రతకలేను అంటున్నాడు. ఆ మాటలువిన్న విష్ణువు "ఏమిటినారదా? ఏమిటిదంతా? భార్య ఏమిటి? బ్రతకలేకపోవటం ఏమిటి?" అన్నాడు.

అప్పుడు నారదుడు చెంపలు వేసుకుని విష్ణుమూర్తి పాదాలనాశ్రయించి స్వామీ ! జగన్నాటక సూత్రధారీ! "నేను సన్యాసిని నాకు మాయ ఉండదు" అన్నందుకు ఇంత పని చేశావా? అహంకరించాను. నేను మహర్షినని విర్రవీగాను కరుణించు అన్నాడు. ఈ రకంగా దేవఋషి అయిన నారదుడు కూడా మాయకు వసుడే. మాయకు లోబడే మధుకైటభులను సంహరించలేకపోయాడు విష్ణుమూర్తి. బ్రహ్మచేసిన ప్రార్ధనమీద మాయ అతన్ని వదలిపెట్టిన తరువాతనే రాక్షస సంహారం చెయ్యగలిగాడు. కాబట్టి మాయకు ఎవరూ అతీతులు కారు.

బ్రహ్మజ్ఞాని కర్మలచే బాధించబడడు. అసలు కర్మలు చెయ్యడు. ఒకవేళ చేసినప్పటికీ లోకకల్యాణం కోసం మాత్రమే చేస్తాడు కాబట్టి ఫలితము అతనికి రాదు. అదే విధంగా కర్మఫలము పరమేశ్వరి దగ్గరకు రాదు. ఆమె కర్మలకు, మాయకు అతీతురాలు. అందుచేతనే తనను ఆరాధించే వారిని మాయలో పడకుండా కాపాడుతుంది. కాబట్టే ఆమె నిర్లేపా అనబడుతోంది.

## 135. నిర్మలా

నిర్మలా – మలము లేనటువంటిది. నిర్మలమైనది. పరిశుద్ధమైనది. మాయీక, కార్మికమలములు లేనిది. నిత్యము ముక్తిని ప్రసాదించేది. జీవుని వెంట ఉండే దోషాలు మలనిక్షేపాలు. అటువంటి దోషాలు అంటకుండా పరిశుద్ధురాలుగా ఉండేది ఆ పరమేశ్వరి.

కర్మలు అజ్ఞానము మొదలైన దోషాలవల్ల కలిగే మాలిన్యము పరమేశ్వరికి లేదు. ఆమె కర్మలు చెయ్యదు అందుచేత వాటి ఫలితాలు ఆమెకు రావు. ఆమె జ్ఞానస్వరూపమయి. అందుచేతనే నిర్మలా అని పిలువబడుతోంది. అవిద్య అజ్ఞానము మొదలయిన మలరూపాలన్నీ దృగ్ రూపము నుండి కల్పితాలు. అందువలన పరమేశ్వరి నిర్మలా అనబడుచున్నది.

## 136. నిత్యా

నిత్యమైనటువంటిది. శాశ్వతమైనటువంటిది. జన్మమృత్యు జరాభయాదులు లేనటువంటిది. భూత భవిష్యద్వర్తమానాలలోను, జాగ్రస్వప్న సుషుప్తులలోను కూడా నాశనము లేనిది.

ఆ పరమేశ్వరి భూతభవిష్యద్వర్తమానాలకు అతీతమైనది. అందుకే ఆమెను 'కాలాతీత' అన్నారు. అలాగే త్రిగుణాలకు, త్రిశక్తులకు అతీతమైనది శాశ్వతమైనది. సృష్టి ప్రారంభంలో ఉన్నది, ప్రళయం సంభవించిన తరువాత ఉండేది ఆ పరమేశ్వరి ఒక్కటే. ఆది మధ్యాంతరహితమైనది ఆ దేవి.

శుద్ధపాడ్యమి నుంచి పూర్ణమి వరకు 15 తిథులున్నవి. ఆ తిథి దేవతలకే నిత్యాదేవతలు అనికూడా పేరు. వారు మొత్తం 16 మంది వీరిని గురించి గతంలో చెప్పటం జరిగింది. వారిలో 'నిత్యా' అనే పేరుకల దేవత ఒకతె.

## 137. నిరాకారా

నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ.

**సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా**

సాధకుల కోరికలకు అనుగుణంగా భగవంతుడికి ఒక రూపం కల్పిస్తున్నారు. అంతేకాని పరబ్రహ్మకు రూపం లేదు. కాబట్టి అన్ని రూపాలు ఆమెవే. అందుకే గజేంద్ర మోక్షంలో గజేంద్రుడు పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తూ **అన్ని రూపులు నీరూపమైన వాడ** అంటే

పరమేశ్వరుడికి రూపం అంటూ ఏదీలేదు. కాని జగత్తులోని రూపాలన్నీ ఆయనవే. అందుచేతనే సాధకులు పరమేశ్వరిని ఏ రూపంలోనైనా సేవించవచ్చు. భక్తుల కోరికలు అనుసరించి రకరకాల రూపాలు ధరిస్తుంటుంది. ఆ జనరక్షణార్ధము ఏ రూపమైనా ధరిస్తుంది.

ఈ రూపాలలో ఏ ఒక్కటీ ఆమె రూపం కాదు. దేవీ భాగవతంలో పూర్వకాలంలో తారకాసుర సంహారం కోసం దేవతలు ఆమెను ప్రార్థించినప్పుడు చైత్రశుద్ధ నవమి శుక్రవారం ఆమె వారికి దర్శనమిచ్చింది.

"ఆమె తేజస్సు రూపుదాల్చిన నాలుగువేదాల చేత స్తుతించబడుతూ ఉన్నది. కోటి సూర్యకాంతులతో ప్రకాశిస్తున్నది. కోటిచంద్రుల చల్లదనం కలిగి ఉన్నది. కొన్నికోట్ల మెరుపుతీగలు ఒక్కసారి మెరిసినట్లుగా తళుక్కుమన్నది. పైన, క్రింద, అడ్డము అనే తేడా లేకుండా కాంతులు విరజిమ్ముతున్నది. దానికి ఆద్యంతాలు లేవు. కాళ్ళు చేతులవంటి అవయవాలు లేవు. స్త్రీ పురుష నపుంసక భేదాలు లేవు." అని చెప్పబడింది.

ఇంద్రియాలకు కనిపించే ఆకారము శరీరానికే కాని ఆత్మకు కాదు. ఆత్మ అనేది పరబ్రహ్మ స్వరూపము. అందుచేత పరమేశ్వరి నిరాకార అని చెప్పబడింది.

## 138. నిరాకులా

అకులా అంటే కలత. ఇది అజ్ఞానంవల్ల కలుగుతుంది. ఈ రకంగా అజ్ఞానంవల్ల కలిగే కలవరపాటు లేనిది పరమేశ్వరి. అవిద్యా సంబంధంచేత కలత లేనిది. అకులత్వము అంటే – ఏమీ లేకుండా ఉండటం అందుకే దేవి నిరాకులా అనబడుతున్నది.

చంచల స్వభావంగల జీవుల మనసు చంచలమై ఉంటుంది. అలాంటివారికి పరమేశ్వరి దుర్లభమైనది. చంచలమైన మనసు వ్యాకులతకు కారణమవుతుంది. నిశ్చలమైన మనసుగలవారికి మాత్రమే దేవి ప్రసన్నమవుతుంది. అంతేకాదు. దేవి అనుగ్రహంవల్ల నిశ్చలమైన మనసు ఏర్పడుతుంది. శంకర భగవత్పాదులవారు తమ భజగోవింద శ్లోకాలలో వివరించినట్లుగా

**సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం ।**
**నిర్మోహత్వేనిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥**

అన్నారు ఆ నిశ్చలత్వము సాధిస్తే ముక్తి లభించినట్లే

## 139. నిర్గుణా

గుణరహితమైనది. **సాక్షీచేతా కేవలోనిర్గుణశ్చ** పరబ్రహ్మ సాక్షీభూతుడు. కేవలుడు. నిర్గుణుడు. ఈ గుణాలు అనేవి శరీరానికి సంబంధించినవే కాని మనసుకు సంబంధించినవి కాదు. పరమేశ్వరి నిర్గుణురాలు. ఆమెను గుర్తించటం సాధ్యం కాదు. ఆమె గుణాతీత. గుణాలకు అతీతురాలు.

తర్కశాస్త్రంలో ఆత్మకు గుణాలున్నాయని నిరూపించారు. ఈ నామంలో తర్కశాస్త్రాన్ని ఖండిస్తున్నారు. వృద్ధిక్షయాలు, వికాసము, నాశనము మొదలైన వికారాలన్నీ శరీరానికే. ఆత్మకు కాదు. అందుచేత దేవి గుణాలకు అతీతురాలు.

## 140. నిష్కలా

కలా అంటే అంశము, భాగము అవయవము అని అర్ధము. నిష్కలా అంటే అవయవములు లేనిది అని అర్ధం. అవయవాలు గనక ఉన్నట్లైతే ఆకారము ఉంటుంది పరమేశ్వరి నిరాకార. పరబ్రహ్మ అవయవములతో కూడినది అనేవాదాన్ని ఇక్కడ తిరస్కరించటం జరిగింది. గతించిపోయిన కల అంటే అంశం లేదా అవయవములు కలది పరబ్రహ్మము. జీవుడు ఆ పరబ్రహ్మ నిష్కలయొక్క చింత. అది నిరాధారము, నిరాశ్రయను చేర్చి లేదా కల్పించి చేసేది ధ్యానము కాదు.

**ధ్యానం యా నిష్కలా చింతా నిరాధారా నిరాశ్రయా ।**
**న తు ధ్యానం శరీరస్య ముఖహస్తాది కల్పనే ॥**

ఇక్కడ గుర్తించవలసిన విషయము ఏమిటంటే జీవసముదాయమంతా పరమాత్మ యొక్క అంశమే. పరబ్రహ్మనుంచి ఆవిర్భవించిన జీవసముదాయానికి అవయవాలున్నాయి. కాని పరమాత్మకు అవయవాలు లేవు.

**నిరంజనం నిరవయవం నిర్గుణం శాంతం బ్రహ్మ**

కళలకు అతీతమై గుణరహితమై, ధ్యానంచేత మాత్రమే పొందదగినది పరమేశ్వరి.

## 141. శాంతా

శమము గలది శాంత. **నిష్కలం నిశ్చలం శాంతం** అని త్రిపురోపనిషత్తులో దేవి రూపము చెప్పబడినది. శ వర్ణము అమృతబీజము. అమృతబీజమే ఆత్మగా కలది. శాంతా అంటే సమస్తాన్నీ సుఖాంతం చేసే దేవి. శం అంటే శుభము, మంగళము అని కూడా అర్ధము. పరమేశ్వరి విశ్వమంతా వ్యాపించి ఉంది. అంతేకాని కొంత పరిధికి మాత్రమేకాదు.

ఈ నామంతో జైనదిగంబరుల వాదము త్రోసి పుచ్చబడింది.

## 142. నిష్కామా

కామము అంటే కోరిక. నిష్కామా కోరికలు లేనిది. కోరికలకు అతీతమైనది.

**'అవాప్తాఖిలకామాయాః తృష్ణా కిం విషయా భవేత్ ?**

అన్ని కోర్కెలు పొంది ఉన్న దేవికి ఏ కోరికా లేదు. అందరి కోరికలు ఆమే తీరుస్తుంది అన్నింటికీ అధిపతి ఆమె. కాబట్టి ఆమెకు ఏ కోరికా లేదు. అందుకే ఆమె నిష్కామా అని చెప్పబడింది.

పూర్వకాలంలో బదరీ క్షేత్రంలో నరనారాయణులు తపస్సు చేసుకుంటున్నప్పుడు, వారికి తపోభంగం కలిగించటానికి దేవరాజైన ఇంద్రుడు అప్సరాంగనలను పంపించాడు. నారాయణుడు దేవకాంతలను చూసి చిరునవ్వు నవ్వి తన తొడలవైపుకు చూడగా, ఊరువుల నుంచి అపురూప సౌందర్యరాసి ఉద్భవించింది. ఆమే ఊర్వశి. ఊర్వశి సౌందర్యాన్ని చూసి అప్సరాంగనలు సిగ్గు చెందారు. అని చెప్పబడింది. అప్సరాంగనలను మించిన సౌందర్యరాశులను సృష్టించగల నారాయణుడు, వారి సౌందర్యానికి దాసుడు కాడు కదా! అలాగే సర్వప్రాణి కోటియొక్క కోర్కెలు తీర్చగల ఆ దేవికి ఇంక ఏ రకమైన కోర్కెలు ఉండవు.

ఇంతకు పూర్వం పరబ్రహ్మ ఇలాంటిది అనేవాదం ఉండేది. సత్యకామ, సత్యస్సంకల్ప అనే శృతులవలన ఈ వాదాన్ని ఖండించటం జరిగింది. అన్ని కోరికలు పొందిన దేవికి ఇంకా ఏ విషయంమీద కోరిక ఉంటుంది? అందుకే దేవి నిష్కామా.

## 143. నిరుపప్లవా

ఉపప్లవము అంటే నాశనము. నిరుపప్లవా నాశనము లేనిది. దేవి ఆద్యంత రహితమైనది. జన్మమృత్యుజరాదులు లేనిది. పుట్టిన ప్రతిప్రాణి గిట్టక మానదు. జన్మమెంత సహజమో మరణము అంతే సహజము. మరణము అంటే మార్పు. గీతలో చెప్పినట్లుగా మానవుడు మాసిపోయిన వస్త్రాన్ని వదలి క్రొత్త వస్త్రాన్ని ధరిస్తున్నట్లే ఆత్మ ఒక శరీరాన్ని వదలి ఇంకొక శరీరాన్ని ఆశ్రయిస్తుంది. ఆత్మ నాశనము లేనిది. దేవి ఆత్మ స్వరూపిణి. మరి ఆమెకు నాశనము ఎలా ఉంటుంది? అందుకే నిరుపప్లవా అని చెప్పబడింది.

'ఉపప్లవము' అంటే దగ్గరలో ఉన్న పడవ అని అర్థం. సముద్రంలో కొట్టుకుపోతూ దిక్కు తోచనివాడికి దగ్గరలో పడవ కనిపించినట్లైతే ఏ రకంగా రక్షణ కలుగుతుందో

అలాగే సంసార సాగరంలో కొట్టుకుపోతున్నవాడు దేవిని ఆశ్రయించినట్లైతే రక్షణ దొరుకుతుంది. అటువంటివాణ్ణి సంసారసాగరం దాటించి తేలికగా ఆవలివడ్డు చేరుస్తుంది. అంటే తరుణోపాయం చూపిస్తుంది.

| | | |
|---|---|---|
| నిర్ | – | నిశ్శేషముగా, పూర్తిగా |
| ఉప | – | సమీపమందు, దగ్గర |
| ప్లవము | – | అమృత ప్రవాహము |

సాధకుల దేహములందు అమృతస్రావాన్ని కలుగచేసి డెబ్బైరెండు వేల నాడీమండలాన్ని తడుపుతుంది. కాబట్టి నిరుపప్లవ అనబడింది.

## 144. నిత్యముక్తా

ముక్తి అంటే విడుదల అని అర్థం. సాధకుడికి ముక్తి లభించింది అంటే ఐహిక బంధాలనుండి శాశ్వతంగా విడుదల లభించింది అన్నమాట. అదే సాయుజ్యము లేదా మోక్షము. ఐహిక బంధాలకు బద్ధులై ఉండటము మానవ లక్షణము. అలాకాకుండా వాటినుండి విముక్తులై ఉండటం దైవలక్షణం. ఈ బంధనాలు ఉండి, కర్మలు చేస్తూకూడా వాటికి బద్ధులుకాకుండా తామరాకు మీద నీటిబొట్టులాగా ఉండటం జ్ఞాని లక్షణము. పరమేశ్వరి కర్మలు వాటిఫలము, ఐహిక బంధాలు, విషయ వాంఛలు మొదలైనవాటికి కట్టుపడదు. ఆమెకు జరామృత్యుభయాలు లేవు. అరిషడ్వర్గాలు లేవు. వీటన్నింటి నుండి విముక్తి పొందింది. అందుకే ఆమె నిత్యముక్త. అంతేకాకుండా ఆమె భక్తులుకూడా నిత్యముక్తులే. ఈ రకంగా తనభక్తులకు నిత్యము ముక్తిని ప్రసాదించునది.

ఎప్పుడు ఏ రకమైన సంగమములేనిది. కాలత్రయమునందుకూడా ఏ మార్పు చెందనట్టి నిరాకార, నిర్వికారస్వరూపమైనది. ఈ దేహముమీద, ఇంద్రియాలమీద ఆసక్తిలేనిది. తన భక్తులకుకూడా ఈ ఆసక్తిని లేకుండా చేసి వారికి మోక్షము ప్రసాదిస్తుంది.

## 145. నిర్వికారా

వికారము అంటే మార్పు. నిర్వికారా అంటే మార్పు లేనిది. శరీరానికి ఆరు రకాలైన వికారాలు ముఖ్యమైనవి అవి.

| | | |
|---|---|---|
| 1. జన్మ | 3. వృద్ధి | 5. క్షయము |
| 2. స్థితి | 4. విపరిణామము | 6. నాశనము |

వీటిని భావవికారాలు అంటారు. అలాగే

1. బాల్యము
2. యౌవనము
3. కౌమారము
4. వార్ధక్యము

అనే అవస్థలవల్ల కూడా శరీరం మార్పు చెందుతుంది. శరీరం నశిస్తుంది. కాని ఆత్మ నశించదు. ఆత్మస్వరూపిణి అయిన దేవికి జన్మజరామృత్యువులు లేవు. కాబట్టి పైన చెప్పిన వికారాలు ఏవీ ఉండవు.

**నిష్కలం నిర్గుణం శాంతం నిర్వికారం నిరంజనం**

అనే శ్రుతివాక్యాన్ననుసరించి దేవి నిరాకారా అని చెప్పబడింది. ఈ నామంతో సాంఖ్యమత ఖండన జరిగింది.

## 146. నిష్ప్రపంచా

ప్రపంచము అంటే పంచభూతాల సమ్మేళనము పరాశక్తి పంచభూతాలకు అతీత మైనది. పంచభూతాల శక్తులే తన్మాత్రలు. వీటితోకూడిన ప్రపంచం నాశనమవుతుంది. పరమేశ్వరి ఈ ప్రపంచంలో ఉంటూనే, దానికతీతంగా ఉంటుంది. ఆమెకు ఈ తత్త్వాలు ఏవీ అంటవు. దేవికి వీటితో ఏ రకమైన సంబంధం లేదు. ఈ బ్రహ్మాండానికి అతీతంగా ఉంటూ సమస్త జగత్తునూ నడిపిస్తూ ఉంటుంది. అందుకే ఆమె నిష్ప్రపంచా అనబడుతోంది.

## 147. నిరాశ్రయా

ఈ నామంవల్ల చార్వాకమతాన్ని ఖండిస్తున్నారు. వారి మతంప్రకారము ఆత్మశరీరాన్ని ఆశ్రయించి ఉంటుంది. పరమేశ్వరి అన్నింటికీ తానే ఆశ్రయం ఇస్తోంది. తనకు వేరే ఆశ్రయం లేనిది.

ఈ విశ్వమంతా ఎవరియందున్నదో వారికి వేరే ఆధారము ఏముంటుంది? సమస్త జగత్తూ శక్తిని ఆధారంగా చేసుకుని ఉన్నది. కాబట్టి శక్తికి వేరే ఆధారం ఉండదు. దేవి స్వయంప్రకాశిత. ఆమెకు వేరే ఆశ్రయం లేదు. ఆమె నిరాశ్రయ.

## 148. నిత్యశుద్ధా

శుద్ధ అంటే మాలిన్యము లేనిది. పరమేశ్వరి సర్వకాల సర్వావస్థలలోనూ మాలిన్యం అంటనటువంటిది. **అత్యంత మలినోదేహో దేహీచాత్యంత నిర్మల** దేహము మిక్కిలి మలినమైనది. ఆ దేహము నందుండేవాడు నిర్మలుడు అని స్మృతిలో చెప్పబడింది.

అందుచేత దేహం మలినమైనదైనప్పటికీ, ఆ దేహంలో ఉండే పరాశక్తి నిర్మలమైనది. ఏ రకమైన మాలిన్యం లేకుండా నిర్మలంగా ఎల్లప్పుడూ పరిశుద్ధంగా ఉంటుంది. అందుకే ఆమె నిత్యశుద్ధ.

## 149. నిత్యబుద్ధా

బుద్ధి అంటే జ్ఞానము. పరమేశ్వరి నిత్యజ్ఞాన స్వరూపిణి కాబట్టి పరమేశ్వరి నిత్యబుద్ధా అని చెప్పబడింది. జైనమత తీర్ధంకరులు శుద్ధులు బుద్ధులు అనువారు. దేవి అనుగ్రహంచేత నిత్యులై మోక్షము పొందారు. షడ్దర్శన పూజలో జైనదర్శనంలో తారాదేవి రూపం ఉంది. ఆమె జైన తీర్ధంకరులచే పూజింపబడింది.

## 150. నిరవద్యా

అవద్య అంటే దోషము. దీనికి కారణం అవిద్య అంటే అజ్ఞానం. అజ్ఞానులైన జీవులకు అనేక రకాలయిన దోషాలు సంక్రమిస్తాయి. ఇవన్నీ అజ్ఞానం వలనే కలగుతాయి. పరమేశ్వరి జ్ఞానస్వరూపిణి. ఆమెకు అజ్ఞానం లేదు. అందుకని ఈ రకమైన దోషాలేవీ ఆమెను అంటవు. పరబ్రహ్మ **నిరవద్యం నిరంజనం** అని చెప్పబడింది. అవద్య అనేది ఒక విధమైన నరకం. ఈ రకమైన నరకాన్నుంచి తనభక్తులకు విముక్తిని ప్రసాదించేది పరమేశ్వరి కూర్మపురాణంలో

**తస్మా దహర్నిశం దేవీం సంస్మరే త్పురుషో యది ।**
**న యా త్యవద్యం నరకం సంక్షీణా శేషపాతకః ॥**

అహర్నిశలు దేవిని స్మరించేవాడు సమస్త పాపాలనుండి విముక్తుడై అవద్య నరకము పొందడు. లింగపురాణంలో

**మాయాం త్వాశ్చైవ ఘోరాద్యా అష్టావింశతి కోటయః ।**
**నరకాణా మవద్యానాం పచ్యం త్యేతాసు పాపినః ॥**

పరమేశ్వరుని ఆశ్రయించనటువంటి పాపులు ఇరవై ఎనిమిది కోట్ల సంఖ్యలో గల అవద్య నరకములందు పడిపోతారు.

పరమేశ్వరి నాశ్రయించినవారు అవద్య నరకాలలో పడరు. అందుకే ఆమె నిరవద్య. దోషరహిత.

## 151. నిరంతరా

అంతరము అంటే అవకాశము, ఛిద్రము, అవధి, హద్దు, భేదము, అంతఃకరణము, అని అర్థము. ఇటువంటి భేదములు లేక అంతటా తానై వ్యాపించి ఉన్నది పరమేశ్వరి, పరమాత్మ సర్వాంతర్యామి, సర్వవ్యాపి. హద్దులు లేనినాడు మనస్సు సంకుచితములైన పరిధులకు లోబడి భేదభావాలకు నిలయమై ఉంటుంది. భేదదృష్టివల్ల భయం కలుగుతుంది. దేహం వేరు, ఆత్మ వేరు. దేహాన్ని చూసి ఆత్మ అని భ్రమించటమే భేదబుద్ధి. ఈ రకమైన భేదభావాలను దూరం చేసి ఆత్మానందాన్ని అనుగ్రహించే పరమేశ్వరికి నిరంతరా అని పేరు.

## 152. నిష్కారణా

అన్నింటికీ కారణము ఆ పరమేశ్వరియే. ఆమె సృష్టి స్థితి లయాలు నిర్వర్తించే పరాశక్తి. సమస్త విశ్వానికీ కారణము ఆమె. మరి ఆమెకు వేరొక కారణం లేదు. అందుచేతనే ఆమె నిష్కారణ అనబడుతున్నది. ఈ సృష్టికి ఆమె ఆది, అనాది. కాబట్టి ఆమెకు వేరే కారణం లేదు. పరమేశ్వరికి కార్యకారణాలతో నిమిత్తం లేదు. స్వభావసిద్ధంగా ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులు కలది. ఈ జగత్తును నిర్మించటానికి పరమేశ్వరికి కారణాలతో నిమిత్తం లేదు. "లోకమునందు పరమేశ్వరునికన్న గొప్పవాడు ఎవరూ లేరు. అతనికి చిహ్నము లేదు. కారణము లేదు. అన్నింటికీ అతడే కారణము. అతనిని ఎవరూ సృష్టించలేదు. అతనికి మించి ఎవరూ లేరు" అని శృతిలో చెప్పబడింది.

పరమేశ్వరి నిత్యసంతోషి. ఆమె మహాపద్మవనమునందు అనగా సహస్రారమునందు ఉంటుంది. కారణానంద విగ్రహము కలది. అంటే అమృత కారణముచే కలుగు ఆనందస్వరూపిణి.

అమృతమయమైన ఆనందంనుంచి పుట్టిన ద్రవపదార్థానికి కారణమని పేరు. అలాంటి ఆనందంచేత పరిపూర్ణురాలు పరమేశ్వరి. ఆమె ఆత్మ స్వరూపిణి. ఆత్మకు కార్యకారణాలు లేవు. అందుచేతనే దేవి 'నిష్కారణ'.

## 153. నిష్కలంకా

**కళంకం పాపం తదభావా న్నిష్కళంకా**

కళంకము అంటే పాపము. పాపము లేనిది కాబట్టి నిష్కళంక అనబడుతోంది. శ్రుతిలో **శుద్ధమపాపవిద్ధం** శుద్ధము పాపరహితమని చెప్పబడింది. పరమేశ్వరి సకలపాపాలకు దూరమైనది. కళంకరహితురాలు. పరిశుద్ధతత్త్వము.

కళంకము అంటే దోషము, మచ్చ అని కూడా అర్థము. గుణరూప భావాలతో సంబంధం గల జీవులకు కళంకం తప్పనిసరిగా ఉంటుంది. వాటికి అతీతురాలైనది దేవి. కాబట్టి నిష్కలంక అనబడుచున్నది.

## 154. నిరుపాధిః

ఉపాధి అంటే శరీరము, సమీపమునందు తనధర్మాన్ని కలుగచేయునది అని అర్థం. దాసానిపువ్వు ఎర్రని ఎరుపురంగులో ఉంటుంది. దీనిదగ్గర తెల్లగా తళతళామెరుస్తున్న స్ఫటికం ఉన్నది అనుకోండి. దాసాని పువ్వుయొక్క ఎరుపుదనంవల్ల తెల్లని స్ఫటికంకూడా ఎర్రగా కనిపిస్తుంది. అదే ఉపాధి. అవిద్య. అజ్ఞానం. ఉపాధి మనసునందు భేదబుద్ధిని కలిగిస్తుంది. అంటే ద్వైదీభావము ఏర్పరుస్తుంది. ఉపాధి అంటే శరీరం. శరీర సంబంధంవల్ల భేదభావం ఏర్పడుతుంది. పరమేశ్వరి వీటికి అతీతురాలు. ఆమెకు ఉపాధి లేదు. శరీరసంబంధమైన అజ్ఞానం లేదు. అందుకే నిరుపాధి అనబడుచున్నది.

## 155. నిరీశ్వరా

మీ మాంసశాస్త్రము సేశ్వరవాదము చెబుతున్నది. స+ఈశ్వర = సేశ్వర – ఈశ్వరుడు కలది. జగత్తు అదేవిధంగా సాంఖ్యశాస్త్రము నిరీశ్వరవాదాన్ని చెబుతున్నది.

నిః + ఈశ్వర = నిరీశ్వర – ఈ జగత్తుకు వేరే ఈశ్వరుడు లేదు. ఈ రెండు రూపాలు కలిగినదవటంచేత పరమేశ్వరి నిరీశ్వర అనబడుచున్నది. ఏ విధంగా అంటే అన్నింటికీ ఆమే ఈశ్వరి కాబట్టి 'సేశ్వరి' ఆమెకన్న అధికుడైన వాడింకొకడు లేడు కాబట్టి నిరీశ్వరి.

**న చాస్య కశ్చి జ్జనితా న చాధిపః**

తనకు సమములుగాని, అధికులుగాని లేనిది. తనకెవరు ప్రభువులేనిది. సకల చరాచరజగత్తు కారణము తానె. తనకు కారణము వేరేలేదు. అధికారము ఉన్నట్లయితే ఒకరిపై ఇంకొకరు ఉంటారు. గ్రామేశ్వరుడు, మండలేశ్వరుడు, ఈశ్వరుడు – రాజు, భర్త, అధికారి అని అర్థం. వీరందరికి వారి అర్హతలను బట్టి అధికారము లభిస్తుంది. అయితే పరమేశ్వరికి అధికారము ఇచ్చేశక్తి ఇంకొకటి లేదు. ఈమె కొంత ప్రాంతానికే పరిమితం కాదు. దేవి సర్వప్రపంచానికీ ఈశ్వరి. అందుకే సర్వేశ్వరి. ఈశ్వరత్వము పరమోత్కృష్టము, సర్వనియంతృత్వము. అందుచేతనే దేవి నిరీశ్వరా అనబడుచున్నది.

## 156. నీరాగా

రాగము అంటే ఇచ్ఛ, కోరిక అని అర్ధము. రాగము అంటే కావలసిన పదార్ధము లందు కోరిక. దీనివలన అరిషడ్వర్గములు ఉద్భవిస్తాయి.

1. ఒక వస్తువు కావాలి అనుకోవటమే – కామము
2. కోరిక తీరనపుడు కలిగే మానసిక పరిణామమే – క్రోధము
3. ఆ వస్తువు ఇతరులకు చెందకూడదనే భావన – లోభము
4. మనం చేసే ప్రతి పనిలోనూ, మనకు కావలసిన దాన్నే చూడటము – మోహము.
5. ఆ వస్తువు నా దగ్గరే ఉన్నది. ఇతరులకు లేదు అనే భావన – మదము
6. ఆ వస్తువును ఇతరులు కూడా కోరుతున్నట్లైతే వారిని సాధింపనెంచుట – మాత్సర్యము

ఈ ఆరింటినీ అరిషడ్వర్గాలు అంటారు. ఇవన్నీ రాగముయొక్క వివిధ దశలు. ఇవన్నీ మనసుకు సంబంధించినవే కాని ఆత్మకు సంబంధించినవి కాదు. రాగము ఎక్కడైతే ఉంటుందో ద్వేషముకూడా అక్కడే ఉంటుంది. పరమేశ్వరి రాగద్వేషాలకతీతురాలు. భక్తుల కోర్కెలు తీర్చే వరప్రదాయిని పరమేశ్వరి. కాని ఆమె మాత్రం నీరాగ. ఇక్కడ నుండి 183 నామం నిష్పరిగ్రహా వరకు ఉపాసన, దానివల్ల ఫలము వివరించబడింది.

## 157. రాగమథనీ

కోరికలను నశింపచేయునది. భక్తులకు వైరాగ్యము ప్రసాదించి వారి కోర్కెలు నశింపచేయునది. కోరికలు తీర్చుకొనుటవలన, లేదా అనుభవించుటవలన తృప్తి కలగదు.

**న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి**

ఆజ్యము పోసినందువల్ల అగ్ని ఏ విధంగా చల్లారదో అలాగే అనుభవించటం వలన కోరికలు తీరవు. ఇంద్రియాలన్నీ బుద్ధికి వశమై ఉంటాయి. బుద్ధి ఇంద్రియాలకు వశమై ఉండాలా, ఆత్మకు వశమై ఉండాలా అనేది బ్రహ్మవిద్యలో చెప్పబడి ఉంది. పరమేశ్వరి రాగమును (కోరికలను) నాశనం చేస్తుంది. అందుకే ఆమె రాగమథనీ అనబడుతోంది.

## 158. నిర్మదా

మదము, దర్పము లేనిది. మదము అనేక రకాలు.

| | | |
|---|---|---|
| 1. శారీరకబలం వల్ల మదము | 2. ధనమదము<br>3. అధికారమదము | 4. విద్యామదము<br>5. భాగ్యమదము |

ఇది మనసుకు చెందినదే కాని ఆత్మకు చెందినది కాదు. మదము జాగ్రస్వప్న అవస్థలయందే ఉంటుంది. కాని సుషుప్తిలో ఉండదు. దంభము, దర్పము, అభిమానము అనేవి రాక్షస గుణాలు. తన పరిమితులను తాను గుర్తించలేనివాడు అజ్ఞానంవల్ల గర్విస్తూ ఉంటాడు. పరమేశ్వరి గర్వం లేనటువంటిది. తనభక్తులకు దర్పాన్ని లేకుండా చేస్తుంది.

## 159. మదనాశనీ

మదమును నాశనము చేయునది. పరమేశ్వరి తన భక్తులయొక్క మదాన్ని నాశనం చేస్తుంది. తద్వారా సాధకుడు సన్మార్గంలో ముందుకు సాగుతాడు. అప్పుడు దర్పము డంబము మదము మొదలైన అసురసంపదను జయించి అమృతత్త్వ స్థితి సంపాదించుకుంటాడు.

మదనము అంటే ఉమ్మెత్త. అశనము అంటే ఆహారము. ఉమ్మెత్త కాయలు తింటే ఉన్మాదము (పిచ్చి) కలుగుతుందని చెప్పబడింది. అటువంటి ఉమ్మెత్తను ఆహారంగా తీసుకుంటుంది దేవి. అంటే ఉన్మాదాన్ని పోగొడుతుంది. అనగా రాగద్వేషాలకు సంబంధించిన ఉన్మాదాన్ని పోగొట్టి సాధకుడికి ప్రశాంతత కలిగిస్తుంది.

## 160. నిశ్చింతా

చింత అంటే దుఃఖము, విచారము బంధువుల, మిత్రుల వియోగమువల్ల, కోర్కెలు తీరకపోవుటవల్ల, మిత్రులవల్ల మోసపోవుట, బాధలు కలుగుట మొదలగు విషయములచే చింత కలుగుతుంది. ఈ చింత అనేది మనసుకే గాని ఆత్మకు కాదు. ఇటువంటి చింతలు లేనిది పరమేశ్వరి.

**చింతా చితా సమాజ్ఞేయా చింతా వై బిందునాఽధికా ।**
**చితా దహతి నిర్జీవం చింతా దహతి జీవితమ్ ॥**

చింత అనే శబ్దములో బిందువును తొలగించినట్లైతే చిత అవుతుంది. చితి మృత కళేబరాలను దహించి వేస్తుంది కాని చింత అనేది ప్రాణమున్న శరీరాలను దహించి వేస్తుంది. అందుకే మనోవ్యాధికి మందు లేదని చెప్పబడింది.

ఈ రకమైన చింతలేనిది కాబట్టి పరమేశ్వరి నిశ్చింతా అనబడుతోంది.

## 161. నిరహంకారా

అహంకారము లేనిది. అహంకారము త్రిగుణాత్మకమైనది. అంటే అహంకారము సాత్త్విక, రాజస, తామసములని మూడు రకాలు. ఈ దేహము నాది. నేను అంటే ఈ దేహము.

సూక్ష్మదేహము తాను అనేది - రాజసాహంకారము

కారణదేహము తాననుకునేది - సాత్త్వికాహంకారము

ఈ జగత్తు త్రిగుణాత్మకం. అందులోని రజోగుణం కర్తృత్వభావానికి కారణం. అది హద్దుమీరితే అహంకారమవుతుంది. పరమేశ్వరి ఆత్మస్వరూపిణి. శరీరంతో ఆమెకు సంబంధం లేదు. అందుకనే ఆమె నిరహంకార అంతేకాకుండా తన భక్తులకుకూడా అహంకార రహితస్థితిని కలిగించి వారికి సన్మార్గం చూపిస్తుంది.

## 162. నిర్మోహా

మోహము అంటే భ్రాంతి, అజ్ఞానము. చిత్త భ్రాంతినే మోహం అంటారు. దీనివల్ల ధర్మం అధర్మంగా గోచరిస్తుంది. తప్పుఒప్పుగా కనబడుతుంది. మోహంవల్ల జ్ఞానం నశించి జీవుడు భ్రాంతిలో మునిగిపోతాడు. అలాంటి మోహానికి అతీతురాలు పరమేశ్వరి.

## 163. మోహనాశినీ

పరమేశ్వరికి మోహం లేదు. తననాశ్రయించిన వారిమోహాన్ని నాశనం చేస్తుంది. ఈశావాశ్యోపనిషత్తులో ఈ విధంగా చెప్పబడింది.

**యస్మిన్ సర్వాణి భూతా న్యాత్మైవా భూ ద్విజానతః ।**
**తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః ॥**

అన్ని జీవులను తన ఆత్మగానూ, చరాచర జగత్తు యొక్క ఐక్యతనూ దర్శించే ఆ విజ్ఞానానికి మోహమేమిటి? దుఃఖమేమిటి? అంటే ఆ పరబ్రహ్మకు మోహము, దుఃఖము లేదని భావము.

రాగము, ద్వేషము మొదలైన ప్రవృత్తులన్నీ మోహమువలనే కలుగుతాయి. వేదములో చెప్పబడిన కర్మలనాశ్రయించటంవల్ల మోహము నశిస్తుంది.

మానవుడు ఎంత విజ్ఞుడైనప్పటికీ మోహము అతణ్ణి కప్పివేస్తుంది. కురుక్షేత్ర సంగ్రామంలో అర్జునుణ్ణి మోహం కప్పివేసి వీరంతా తనవారు అనే భ్రాంతి కలిగింది. భగవానుడి గీతోపదేశంతో ఆ మాయ తొలగిపోయింది. మోహం సర్వనాశనకారి. పరమేశ్వరి మోహనాశని, జ్ఞాన స్వరూపిణి.

## 164. నిర్మమా

మమ అంటే అనాది అనే భావన. దేహము ఇంద్రియాలు మొదలైన వాటిమీద ఉండే అభిలాష ఇదే. ఈ రకంగా నాది అని భ్రాంతి పొందే జీవి ఈ ఇల్లునాది, వాకిలినాది, ధనమునాది, ఈ వస్తువులు నావి అని భావిస్తాడు. ఏదైనా ఒక వస్తువు అతనికి అంది నప్పుడు ఆ వస్తువు తనసొంతంగా భావిస్తాడు. దానిమీద మమకారం పెంచుకుంటాడు. ఒకవేళ అది అతన్నుంచి దూరమైతే దాన్నే తలచుకుంటూ కొన్ని సందర్భాలలో ప్రాణత్యాగం కూడా చేస్తాడు ఇది మనసుకు సంబంధించినది. అంతేకాని ఆత్మకు సంబంధించినది కాదు. మమకారం మానవుణ్ణి బంధిస్తుంది. 'నా' అనే భావం భేదదృష్టికి కారణం. స్వపరభేదాన్నే ద్వైతభావన అంటారు. ఇది మానవుణ్ణి భాదిస్తుంది. పరమేశ్వరి సర్వవ్యాపిని. ఆమె దగ్గర మమత్వానికి తావులేదు. సర్వాంతర్యామియైన ఆదేవికి స్వపరభేదాలుండవు. అందుకే ఆమె నిర్మమా అని పిలవబడుతోంది.

## 165. మమతా హంత్రీ

హంత్రీ అనగా నాశనము చేయునది. పరమేశ్వరికి మమకారం లేదు. ఆమె తన భక్తులయొక్క మమకారాన్ని కూడా నాశనం చేస్తుంది. మమకారం బంధహేతువు. జీవికి స్వస్వరూప జ్ఞానం కలిగినట్లైతే మమత నశిస్తుంది. పరమేశ్వరి తనభక్తులను మమకారం నుంచి మరల్చి విముక్తి కలిగిస్తుంది. తనభక్తుల భవబంధాలను త్రెంచి వారికి మోక్షమార్గం చూపుతుంది కాబట్టి ఆమె మమతాహంత్రి.

## 166. నిష్పాపా

పాపము లేనటువంటిది. అవిద్య, అజ్ఞానము మొదలైనవి పాపహేతువులు. ప్రపంచంలోని ప్రతిమనిషి ప్రతిక్షణము ఏదో ఒక పని చేస్తూనే ఉంటాడు. ఆ రకంగా చేసేటప్పుడు కొన్ని పనులవల్ల కొంతమందికి కష్టము, బాధకలుగుతాయి. కొన్ని పనులవల్ల సుఖాలు కలుగుతాయి. **పరోపకార పుణ్యాయ పాపాయ పరపీడనం** ఇతరులకు ఉపకారం కలిగించినా, ఆనందం, సుఖము కలిగించే పనులు చేసినా అది పుణ్యము. మన పనులవల్ల ఇతరులకు బాధలు కలిగితే దానివల్ల పాపము కలుగుతుంది. ఈ రకంగా కలిగే పాపపుణ్యాల వల్లనే మానవుడి తరువాత జన్మలు నిర్ధారింపబడతాయి. ఏ రకమైన కర్మలు చేయని జీవికి మరుజన్మ ఉండదు. పుణ్యఫలం ఎక్కువ ఉన్నవారికి ఉత్తమ జన్మలు ప్రాప్తిస్తాయి. పాపఫలం ఎక్కువ ఉన్నవారు పశువులు, పక్షులు, క్రిమికీటకాలుగా జన్మిస్తారు. పరమేశ్వరికి ఈ రకమైన పాపం ఏ మాత్రం లేదు. అందుకే ఆమె నిష్పాప.

## 167. పాపనాశినీ

పరమేశ్వరి యొక్క మంత్రజపం చెయ్యటంచేత, ఆమెను ధ్యానించటంచేత ఆమె భక్తులకు పాపాలు నశిస్తాయి. వాసిష్ఠ స్మృతి యందు

**విద్యాతపోభ్యాం సంయుక్తం సదాపి పాపకర్మాణమేనో**
**నప్రతియుజ్యతే జాపినాం హేమినాం చైవ ధ్యాయినాం**
**తీర్థవాసినాం న సంవసంతి పాపాని యే చ స్నాతాశ్శిరోవ్రతైః ॥**

విద్యా, తపస్సులతో కూడి జపపరాయణుడైన బ్రాహ్మణునికి పాపములు అంటవు. మంత్రజపం చేసేవాడికి, తీర్థములు సేవించేవాడికి, శిరస్సున అగ్నిని ధరించేవాడికి పాపములు అంటవు. పద్మపురాణంలో

**మేరుపర్వతమాత్రోఽపి రాశిః పాపస్య కర్మణః ।**
**కాత్యాయినీం సమాసాద్య నశ్యతి క్షణమాత్రతః ॥**

పాపకర్ముని పాపము మేరుపర్వతమంత గొప్పదైననూ పరమేశ్వరి దర్శనముచేత అది నశిస్తుంది. దేవీ భాగవతంలో

**ఛిత్త్వా భిత్త్వా చ భూతాని హత్వా సర్వమిదంజగత్ ।**
**ప్రణమ్య శిరసా దేవీం న స పాపై ర్విలిప్యతే ॥**

ఈ లోకమున ప్రాణులను చంపి, పాపకర్మలు చేసినప్పటికీ, దేవికి శిరసా నమస్కరించినట్లైతే ఆ పాపము పోతుంది. బ్రహ్మాండపురాణంలో

**వర్ణాశ్రమ విహీనానాం పాపిష్ఠానాం నృణామపి ।**
**యద్రూపధ్యానమాత్రేణ దుష్కృతం సుకృతాయతే ॥**

వర్ణాశ్రమ ధర్మాలు విడచినవారు, పాపకర్ములు, పరమేశ్వరిని ధ్యానించినంత మాత్రం చేతనే పుణ్యాత్ములగుదురు అని చెప్పబడింది.

ఈ జన్మలో ఎవరికైనా ఉపకారం చేసినట్లైతే మరుజన్మలో మనకు మంచి జరుగుతుంది. ఒక్కొక్కసారి ఈ జన్మలోనే దానిఫలితం పొందుతాము. ఒక మంచివ్యక్తికి కష్టం కలిగినట్లైతే పదిమంది చేతనైన సహాయం చేస్తారు. అది చేయలేకపోతే కనీసం 'అయ్యోపాపం' అని జాలి చూపిస్తారు. అదే ఒక దుర్మార్గుడికి కష్టం కలిగితే తగిన శాస్తి జరిగింది అంటారు. మనం చేసిన పాపం ఎప్పుడో ఒకప్పుడు మనం అనుభవించవలసి ఉంటుంది. ఈ పాపము మూడు స్థాయిల్లో ఉంటుంది.

1. రోగాలతో స్థూలదేహాన్ని
2. అరిషడ్వర్గాదుల రూపంతో సూక్ష్మదేహాన్ని
3. విచక్షణాజ్ఞాన శూన్యత వలన కారణదేహాన్ని బాధిస్తుంది.

పాపము మూడు రకాలుగా ఉంటుంది.

1. అనేక జన్మల నుండి చేసిన పాపము.

అసత్యము, ఇంద్రియ లాలసత్వము, కామక్రోధాదులు. ఇవి ప్రారబ్ధరూపంలో అనుభవించాలి.

2. తండ్రి, తాతలవల్ల ఈ శరీరము ఏర్పడినట్లే వంశానుగతంగా కొంత పాపము వస్తుంది.

3. దేవతల గురించిన విషయ పరిజ్ఞానము లేకపోవుటవలన వచ్చేది. అంటే పైన చెప్పిన రెండు రకాల పాపాలు ఏ ఏ దేవతలనర్చిస్తే పోతాయో తెలియకపోవటం.

ప్రతివ్యక్తి ఈ మూడు రకాలయిన పాపాలతో బాధపడుతుంటాడు. పరమేశ్వరి తన భక్తులకు అటువంటి పాపాలన్నింటినీ తొలగిస్తుంది. అందుకే ఆమె పాపనాశిని.

## 168. నిష్క్రోధా

క్రోధము లేనిది కాబట్టి నిష్క్రోధా అనబడుతోంది. క్రోధమనేది సర్వనాశనానికి కారణము. కోపంవల్ల జ్ఞానం నశిస్తుంది. అజ్ఞానంవల్ల ఆలోచనాశక్తి నశిస్తుంది. ఇది వినాశనానికి హేతువు. అలాంటి క్రోధం లేనిది మాత. రాగద్వేషాలకు అతీతమైనది. కుమారుడు ఎంత దుర్మార్గుడైనా, దుర్వర్తనుడైనా తల్లికి అతనిమీద వాత్సల్యమే ఉంటుంది. అంతేకాదు సన్మార్గుడైన కుమారునిమీద కన్న, దుర్మార్గుడైన కుమారునిమీదనే తల్లికి ఎక్కువ ప్రేమ ఉంటుంది అటువంటిది దేవి.

## 169. క్రోధశమనీ

క్రోధము లేని పరమేశ్వరి భక్తులక్రోధాన్ని శమింపచేస్తుంది. **క్రోధశ్చ దుష్టత్వం** క్రోధము అంటే దుష్టత్వము. భక్తులయొక్క కామక్రోధాలను నాశనం చేసేది పరమేశ్వరి. ఆపస్తంభుడు

**క్రోధయుక్తో యదృజతి యజ్జుహోతి యదర్చతి ।**
**స తస్య హరతే సర్వం ఆమకుంభో యథోదకమ్ ॥**

కోపము గలవాడు యాగాలు చేసినా, హోమాలు చేసినా, పూజలు చేసినా వాటిఫలము పచ్చికుండను నీరువలె హరిస్తుంది అని చెప్పాడు. అంటే క్రోధముతో నిండిన మనసుకలవాడు ఎన్ని యజ్ఞాలు, యాగాలు, క్రతువులు, హోమాలు, జపాలు, పూజలు చేసినా అవన్నీ నిష్ప్రయోజనము. కోపము కలవాడు ఎన్ని సత్కార్యములు చేసినా వాటిఫలము పొందలేడు. అందుకే పరమేశ్వరి తన భక్తులకోపాన్ని ఉపశమింపచేసి వారిని సన్మార్గంలో నడిపిస్తుంది.

## 170. నిర్లోభా

లోభగుణము లేనిది. ఉన్నటువంటి సంపద మొత్తం తానే అనుభవించాలనే కోరిక. ఈ గుణసంపన్నులు కొందరు సంపదను తాముకూడా అనుభవించకుండా దాచిపెట్టి బికారులులా తిరుగుతుంటారు. వీరు పరమలోభులు. లోభగుణం ఉన్నవారికి ధనార్జన చేసేటప్పుడు ఉచ్ఛనీచాలుండవు. డబ్బుకోసం ఏ పనైనా చేస్తారు. పాపపుణ్యాలమాట కాదు కదా కనీసం మానవత్వం కూడా ఉండదు. ఇలాంటివారు ఎక్కువ తప్పులు చేస్తుంటారు. అదే పాపం. పాపమనేది నరకానికి మార్గం. అందుకే లోభగుణము నరకద్వారమని చెప్పబడింది.

| | | |
|---|---|---|
| ఉన్నది చాలు అనుకోవటం | – | తృప్తి |
| ఇంకా కావాలనుకోవటం | – | ఆశ |
| మొత్తం తనకే కావాలనుకోవటం | – | దురాశ |
| అంతా తానే అనుభవించాలనుకోవటం | – | లోభం |
| తనకున్నదానిని పదిమందికీ పంచటం | – | ఔదార్యం |
| తనకున్నదాన్ని అవసరంలేదని ఇతరులకు ఇచ్చివేయటం | – | త్యాగం |

లోభగుణానికి పూర్తిగా విరుద్ధమైనది త్యాగగుణము. మనకున్నదంతా పూర్వజన్మలో చేసిన కర్మలననుసరించి వచ్చిందే. అక్కడ సుకృతం లేనప్పుడు పరమేశ్వరుని ప్రార్థిస్తే అనగా భగవంతుని కృపకోసం జపతపాలు చేస్తే, ఆయన కనికరించి ఇచ్చినదే. అందుచేత మనకున్నదానిలో కొంతభాగమైనా దానధర్మాలకు, సత్కార్యాలకు తప్పనిసరిగా వినియోగించాలి. సద్గతులకోసం కాకపోయినా, మరుజన్మలో అనుభవించటం కోసమైనా దానధర్మాలు చేసి తీరాలి. ఈ సందర్భంలో **అంతకింతైంది, ఇంతకెంతౌనో** అనే సామెతను,

**ఇల్లోనారాయణమ్మ** చరిత్రను మనం గుర్తుంచుకోవాలి. ఒకరికి మనం సాయంచేస్తేనే ఇంకొకరు మనకి సాయంచేస్తారు. లోభమనేది ఇంద్రియాలకు, మనసుకు సంబంధించినది. అంతేకాని ఆత్మకు సంబంధించినది కాదు. స్వార్జితమైన ద్రవ్యము ప్రతిఫలాపేక్ష లేకుండా అర్హత కలిగినవారికి ఇవ్వటాన్నే దానము అంటారు. దీనివలననే ఉత్తమగతులు వస్తాయి.

పరమేశ్వరికి లోభత్వం లేదు. అడిగినవారికి అడిగినట్లుగా అపార సంపదలు కలగచేస్తుంది. అందుకే ఆమె నిర్లోభ అనబడుతోంది.

## 171. లోభనాశినీ

లోభము అన్ని మంచిగుణాలనూ నాశనం చేస్తుంది. స్వపరభేదానికి లోభమే కారణము. లోభము మానవుణ్ణి పతనావస్థకు దిగజార్చి, అసురసంపత్తికి అవకాశం కల్పిస్తుంది. లోభగుణము తనభక్తులకు లేకుండా నశింపచేసేది దేవి. ఆశారహితుడై సంశయములేనివాడై, శిష్యుని సంశయములను పోగొట్టగలిగేవాడే గురువని తంత్రరాజంలో చెప్పబడింది.

లోభానికి వ్యతిరేకము త్యాగము. త్యాగం చెయ్యటము అంటే కష్టపడి న్యాయమార్గంగా సంపాదించిన ధనాన్ని ప్రతిఫలవాంఛ లేకుండా ఇతరులకుగాని, ఇతర పనులకుగానీ ఖర్చు చేయటము. నేను ఇంతకన్న ఎక్కువ ఇవ్వలేకపోతున్నాను. అని మనసులో అనుకుంటూ ఖర్చు చెయ్యాలి. ప్రపంచంలోని ప్రతివస్తువూ ఆ భగవంతునిచేతనే ఇవ్వబడింది. మనకున్న సిరిసంపదలు కూడా పరాత్పరుని కృపవల్లనే లభించాయి. కాబట్టి వాటిని ఆయనకోసమే నివేదించాలి అనే ఉద్దేశ్యంతో ఖర్చు చెయ్యాలి. ఈ రకంగా చేసే ఉపాసకులయొక్క లోభత్వము నశింపచేసేది పరమేశ్వరి. అందుకే ఆమె లోభనాశినీ అనబడుచున్నది.

## 172. నిస్సంశయా

సంశయములు లేనిది. సంశయములు పోగొట్టునది. సంశయాలు అనేక రకాలు. అందులో ముఖ్యమైనవి.

1. ఆత్మ అంటే ఏమిటి? కొందరు దేహమే ఆత్మ అంటారు. మరికొందరు ఇంద్రియాలే 'ఆత్మ' అంటారు. ఇంకొందరు మనస్సే 'ఆత్మ' అంటారు. బుద్ధియే ఆత్మ అంటారు. కాబట్టి అసలు ఆత్మ అంటే ఏమిటి?

2. ఊర్ధ్వలోకాలు, అధోలోకాలు అంటే చతుర్దశ భువనాలు ఉన్నాయా? ఉంటే వాటి విశేషాలేమిటి?

3. జీవితము ఎక్కడినుంచి వచ్చింది? ఎక్కడికి పోతుంది.

4. మృత్యువు అంటే ఏమిటి?

5. కర్మ అంటే ఏమిటి? కర్మఫలము ఎలా ఉంటుంది?

6. ధనము, సంపద, కీర్తి, సంతానము, సుఖము మొదలగువాటిపై కోరిక ఎందుకుంటుంది?

ఈ రకంగా జనులకు అనేక సంశయాలుంటాయి. వీటికి సమాధానము వేదాలు, వేదాంగాలు, పురాణ ఇతిహాసాలలో లభ్యమవుతుంది. వేదమాత పరమేశ్వరి. కాబట్టి ఆమె నిస్సంశయా అనబడుచున్నది. దేవి గురు రూపిణియై సర్వసంశయాలను తొలగించి తత్త్వాన్ని తెలియచేస్తుంది.

## 173. సంశయఘ్నీ

దేవిని ధ్యానించువారి మనసులోని సంశయములన్నింటిని ఆమె తీరుస్తుంది.

**భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః ।**

**క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥**

అంటోంది శ్రుతి. ఆ పరమేశ్వరి భక్తులయొక్క సంశయాలను తీర్చి వారి అజ్ఞానాన్ని పోగొడుతుంది. అన్ని వర్ణాలవారికీ కలిగే సంశయాలను తీర్చగలిగినటువంటిది పరమేశ్వరి. దేహము, ఇంద్రియాలే తాను అనే అజ్ఞాన భావన అయిన హృదయగ్రంథి విడిపోయి సాధకుడికి తానే సచ్చిదానంద స్వరూపుడను అనే జ్ఞానం కలుగుతుంది. ఈ విధంగా జ్ఞానం కలగటమే సంశయనాశనము. అది పరమేశ్వరివల్లనే జరుగుతుంది. అందుచేతనే ఆమె సంశయాఘ్నీ అనబడుతున్నది.

## 174. నిర్భవా

జన్మమృత్యుజరాదులు లేనిది. జీవికి ఆరు రకాలయిన వికారాలుంటాయి.

| | | |
|---|---|---|
| 1. పుట్టుక | 3. వృద్ధి | 5. క్షయము |
| 2. స్థితి | 4. విపరిణామము | 6. నాశనము |

ఈ రకమైన ఆరువికారాలు లేనటువంటిది. దేహము ఇంద్రియాలు బుద్ధి ప్రాణాలు వీటిలో ప్రతిక్షణంలోనూ ఏదో ఒక మార్పు వస్తూనే ఉంటుంది. ఈ రకంగా మార్పు చెందటాన్నే 'భవము' అంటారు. కేవలము పరమేశ్వరికి మాత్రమే మార్పు ఉండదు. అందుకే ఆమె 'నిర్భవా' అనబడుతున్నది. భావవికారాలన్నీ నిర్గుణ పరబ్రహ్మనుంచే కలుగుతాయి. అంతేకాని అవి పరబ్రహ్మకుండవు.

## 175. భవనాశినీ

సంసారాన్ని నశింపచేసేది. భవబంధాలను లేకుండా చేసేది. పుట్టుక సంసార బంధము లేకుండా చేసేది. గర్భవాసక్లేశము లేకుండా చేసేది. జీవికి తాను చేసిన పాపపుణ్యాల ననుసరించి ఉత్తర జన్మలు ప్రాప్తిస్తాయి. ఈ లోకంలో జన్మించటమంటే మాటలు కాదు. మాతృగర్భంలో తలక్రిందులుగా ప్రాణాలు అరచేత్తో పట్టుకుని, మలమూత్రాలతో కలుషితమైన స్థితిలో శిశువుగా ఉండటంకన్న దురవస్థ ఇంకేమీ ఉండదు. క్రిములు కరుస్తుంటాయి. ఆకలి వేస్తుంది. ఒత్తిగిల్లటానికి వీలుండదు. ఈ రకంగా పదినెలలు గడవాలి. ఒక కల్పాంతము అంటే దాదాపు 42 కోట్ల సంవత్సరాలైనా నరకం అనుభవించవచ్చు కాని ఒక్కగంటైనా సరే గర్భవాసం అనుభవించటం మాత్రం దుర్భరం. గర్భంనుంచి బయటకు రావటం మరీబాధ. ఈ రకమైన క్లేశాలు తనభక్తులకు లేకుండా చేస్తుంది పరమేశ్వరి. అందుకే శంకరభగవత్పాదులు తమ భజగోవింద శ్లోకాలలో

**పున రపి జననం పున రపి మరణం పున రపి జననీ జఠరే శయనం**
**ఇహసంసారే బహుదుఃఖారే కృపయాపారే పాహి మురారే ! ॥**

మళ్ళీ జన్మించటం కర్మలు చెయ్యటం మరణించటం. ఆ కర్మల ఫలితాన్ని అనుభవించటానికి మళ్ళీ జన్మించటం, ఈ రకంగా సంసారసాగరం దాటలేక నానాబాధలు పడుతున్న నన్ను రక్షించవలసినది. అని ఆ పరమేశ్వరుణ్ణి ప్రార్ధిస్తున్నాడు.

గంగానది జీవనది. పవిత్రమైన నది. అందులో స్నానం గనక చేసినట్లైతే పాపాలన్నీ నశిస్తాయి. అందుచేతనే గంగానది భవనాశనీ అంటారు.

**మూలాది బ్రహ్మబిలపర్యంతం మహాత్రిపురసుందరీ ।**
**యా తను స్తే తటిత్ప్రఖ్యా తాం భజే భవనాశనీమ్ ॥**

మూలాధారము నుండి బ్రహ్మరంధ్రం దాకా మెరుపు తీగలాగా ప్రకాశించు మహాత్రిపురసుందరీ ! నా దుఃఖాన్ని పోగొట్టవలసినది. శక్తి రహస్యము అనే గ్రంథంలో

**నవమ్యాం శుక్లపక్షే తు విధివత్ చండికాం నృప ! ।**
**ఘృతేన స్నపయే ద్యస్తు తస్య పుణ్యఫలం శృణు ॥**
**దశ పూర్వాన్ దశ పరా నాత్మానం చ విశేషతః ।**
**భవార్ణవా త్సముద్ధృత్య దుర్గా లోకే మహీయతే ॥**

శుక్లపక్ష నవమి తిథి యందు చండికను ఆవు నేతితో స్నానం చేయించినవారిని అటు, ఇటు పదితరాలదాకా ఆ దేవి సంసారసాగరము నుండి ఉద్ధరించును.

కూర్మపురాణంలో

**సైషా ధాత్రీ విధాత్రీ చ పరమానన్ద మిచ్ఛతాం ।**
**సంసారతాపా న్నిఖిలా న్నిహంతీశ్వర సంజ్ఞయే ॥**

తనను పూజించువారికి, పరమానందము, కోరువారికి ఆ దేవి సంసార తాపములను నశింపచేయును. దేవీ భాగవతంలో

**అహం వై మత్సరాన్ భక్తా నైశ్వర్యం యోగమాశ్రితాన్ ।**
**సంసారసాగరా త్తస్మా దుద్ధరా మ్యచిరేణతు ॥**

నా యందు ఆసక్తి గలవారై యోగము నాశ్రయించిన భక్తులను సంసారార్ణవము నుండి అనతికాలములో ఉద్ధరింతును. అని పరమేశ్వరి చెబుతుంది.

కాబట్టి భవనాశని అంటే ఐహిక బంధనాలను పరమేశ్వరి త్రెంచి వేస్తుంది అని అర్ధం.

## 176. నిర్వికల్పా

వికల్పము అంటే శూన్యమైన విషయము నుండి పుట్టిన జ్ఞానము. అటువంటి వికల్పజ్ఞానము లేనిది. నిర్వికల్పా అనబడుతోంది.

వికల్పము అంటే మార్పు. యోగం చేసేటప్పుడు చివరిదశలో సమాధిస్థితికి చేరతాడు సాధకుడు. ఈ రకంగా యోగం చేసేటప్పుడు షట్చక్రాలను దాటతాడు. ఇక ఆజ్ఞా చక్రందగ్గర నుంచి సహస్రారందాకా తొమ్మిది చక్రాలుంటాయి.

శరీరంలో మేరుదండమున్నది. దీన్నే వెన్నుపూస అంటారు. దీని వెంబడి సుషుమ్నానాడి ఉన్నది. ఈ సుషుమ్నకు రెండు చివరలా సహస్రదళ పద్మాలున్నాయి. ఈ రెండింటినీ కలుపుతూ సుషుమ్నలో 30 పద్మాలున్నాయి. ఆధారచక్రం నుంచి

సహస్రారందాకా (మహాబిందువు) 19 స్థానాలున్నాయి. ఇవి మొత్తం మూడుజట్లుగా ఉంటాయి. మొదటి జట్టులో 9, రెండవ జట్టులో 9, మూడవజట్టులో మహాబిందువు ఉంటాయి. శ్రీచక్రాన్ని మొదట మొదటి జట్టులోను, తరువాత రెండవ జట్టులోను ఆ తరువాత మూడవ జట్టులోను భావన చెయ్యాలి. అవి మొదటి జట్టు.

**అకులే విషుసంజ్ఞే చ శాక్తే వహ్నౌ తథా పునః**
**నా భావనాహతే శుద్ధే లంబికాగ్రే భ్రువోఽన్తరే**

1. అకులము – ఆధారచక్రానికి దిగువన ఉన్న సహస్రదళము
2. విష్ణువు – అష్టదళము, షడ్దళముల మధ్య భాగము
3. శక్తి – ఆధారచక్రము
4. వహ్ని – స్వాధిష్ఠానము
5. నాభి – మణిపూరము
6. అనాహతము – అనాహతము
7. విశుద్ధి – విశుద్ధిచక్రము
8. లంబికాగ్రము – ఆజ్ఞాచక్రము
9. భృకుటి – ఆజ్ఞాచక్రము

**బిందౌ తదర్థం రోదిన్యాం నాదో నాదా న్త యేవ చ**
**శక్తిః పునర్వ్యాపికాయాం సుమన ఉన్మన గోచరే**

రెండవ జట్టులో

| | | |
|---|---|---|
| 1. బిందువు | 4. నాదము | 7. వ్యాపిక |
| 2. తదర్థం | 5. నాదాన్తము | 8. సుమన |
| 3. రోదిని | 6. శక్తి | 9. ఉన్మన |

**మహాబిందౌ పునశ్చైవం త్రిధాచక్రంతు భావయేత్**

ఇది మూడవ జట్టు. మహాబిందువు. ఇది ఈ చక్రాలకన్నింటికీ పైభాగాన ఉన్నది. ఈ మహాబిందువు దేశకాలములకన్నింటికీ అతీతమైనది. పరమపదమైనది. సర్వోత్కృష్టమైనది.

సాధకుడు యోగసాధన చేసేటప్పుడు సుమన వరకు మనస్సు పనిచేస్తూనే ఉంటుంది. అవి దాటిన తరువాత ఉన్మనాస్థితి. అక్కడ మనసు పని చెయ్యని స్థితి. అదే సమాధిస్థితి అక్కడ మనసు పని చెయ్యదు కాబట్టి సంకల్ప వికల్పాలుండవు. అదే నిర్వికల్ప సమాధిస్థితి. దీనినే నిధి ధ్యానము అనికూడా అంటారు.

## 177. నిరాబాధా

ఏ రకమయిన బాధలేనటువంటిది. అసలు బాధలకు కారణము వికల్పము. మరి వికల్పానికి మూలము – అజ్ఞానము. ఈ బాధలన్నీ దేహానికి మాత్రమే ఉంటాయి గాని పరమాత్మకు ఉండవు. ఎప్పుడూ కలిగే మార్పులన్నీ ఆత్మనుంచే కలుగుతాయి. పద్మాలన్నింటిలోను వాటి లక్షణం ఒక్కటే కాకపోతే రంగులు వేరు. అలాగే జీవులన్నింటిలోను సచ్చిదానంద విశేషము ఒకటే ఉంటుంది.

ముత్యపుచిప్ప ఎండలో తళతళా మెరుస్తుంది. అందుచేత ముత్యపుచిప్పను చూసి వెండి అని భ్రమపడతారు. అది వెండికాదు అని తెలిసి భ్రమపోగానే ముత్యపుచిప్పకు ఏ బాధా ఉండదు. అలాగే ఆ పరమేశ్వరి స్థితికి బాధలేదు కాబట్టి ఆమె 'నిరాబాధా' అనబడుచున్నది.

## 178. నిర్భేదా

ఏ రకమైన భేదము ఏ మాత్రము లేనిది. భేదాలు మూడు రకాలు 1. సజాతీయ 2. విజాతీయత 3 స్వగతము

| | | |
|---|---|---|
| 1. సజాతీయము | – | తనతోటి జాతిలోగల భేదము |
| 2. విజాతీయము | – | ఇతర జాతితో గల భేదము |
| 3. స్వగతము | – | పాదాల దగ్గర నుండి శిరస్సువరకు అవయవాలయందున్న భేదము |

ఈ రకమైన భేదాలు ఏవీ లేనటువంటిది పరమేశ్వరి.

**ఏకమేవా ద్వితీయం బ్రహ్మ** పరమేశ్వరుడు ఒక్కడే. రెండవవారు ఎవరూ లేరు.

ఐతరేయోపనిషత్తులో ఈ విధంగా చెప్పబడింది. జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే. మరణానంతరము జీవాత్మ పరమాత్మలో లీనమయిపోతుంది. సృష్టి జరగటానికి ముందు ఈ జగత్తంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానికి భిన్నమైన పదార్థం ఏదీ లేదు. అదే ఈ లోకాలను సృష్టించింది.

సృష్టి జరగకముందు నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ ఒకడే. ఈ జగత్తంతా బ్రహ్మమయంగా ఉండేది. ఆ పరబ్రహ్మతో సమానమైన వారు కాని, అంతకన్న అధికులుగాని ఎవరూ లేరు.

ఈ రకంగా రెండవవారు అనే భేదంలేనిది దేవి. కూర్మపురాణంలో

**త్వం హి సా పరమా శక్తిః అనంతా పరమేష్ఠినీ**
**సర్వభేదవినిర్ముక్తా సర్వభేదవినాశినీ ॥**

నీవే ఆ పరాశక్తివి. అంతము లేనిదానవు. పరమేష్ఠివి. అన్ని భేదములనుండి వదలబడినదానవు. అన్ని భేదాలను తొలగించేదానివి. అని చెప్పబడింది. పరిమళ అనే గ్రంథంలో చెప్పినట్లుగా

**ఆలేఖ్య విశేష ఇవ గజవృషభయో ర్ద్వయోః ప్రతిభావమ్ ।**
**ఏకస్మిన్నే వార్థే శివశక్తి విభాగకల్పనాం కుర్మః ॥**

ఒకే బొమ్మను చూసి కొందరు ఏనుగు అని, కొందరు ఎద్దు అని భావించినట్లే, ఒకే బ్రహ్మను చూసి కొందరు శివుడని, కొందరు శక్తి అని భావిస్తున్నారు.

మానసోల్లాసము అనే గ్రంథంలో

**యేఽపి బ్రహ్మాదయో దేవా భవన్తి వరదాయినః**
**త్వద్రూపం శక్తి మాసాద్య తే భవన్తి వరప్రదాః**
**తస్మాత్ త్వ మేవ సర్వత్ర కర్మణాం ఫలదాయినీ**

శివుడు లేకుండా శక్తి ఉండదు. శక్తి లేకుండా శివుడు ఉండడు. అసలు ఆ ఇద్దరూ ఒకటే. పరమాత్మకు లింగభేదం లేదు.

కాబట్టి పరమేశ్వరి నిర్భేదా అనబడుతోంది.

## 179. భేదనాశినీ

భక్తి కలిగే అన్నిరకాల భేదాలను నాశనం చేసేది. ఇక్కడ ఉన్న ముఖ్యమైన భేదం ఒక్కటే. అదే ద్వైతభావన. జీవాత్మ పరమాత్మ వేరు. అనే భావన. భక్తుడు వేరు భగవంతుడు వేరు. భగవంతుణ్ణి పూజిస్తే భక్తుడికి కావలసినవి ఇస్తాడు. అతని కోర్కెలు తీరుస్తాడు. అందుచేత భక్తుడు వేరు, భగవంతుడు వేరు అనే భావన వీరికి ఉంటుంది. అదీకాక. నేను అంటే శరీరము ఇంద్రియాలే. కంటికి కనిపించే ఈ శరీరమే నేను. అనే భావన ఉంటుంది. వీరిదృష్టిలో పరమాత్మ వేరే ఎక్కడో ఉన్నాడు. ఈ రకమైన భావన పతనహేతువు. బృహదారణ్యకోపనిషత్తులో ప్రజాపతి కథ చెప్పబడింది. దాన్ని లోగడ వివరించాం. అందులో ఈ శరీరమే ఆత్మ అనుకుని వెళ్ళిపోతాడు రాక్షసరాజైన విరోచనుడు. అదిచూసి

బ్రహ్మదేవుడు "చాలా పొరపాటు జరిగిపోతుంది. ఈ శరీరమే నేను అని ఎవరైతే అనుకున్నారో వారు పతనానికి చాలా దగ్గరలో ఉన్నారు" అనుకుంటాడు. అదే విధంగా విరోచనుడు కూడా ఈ శరీరమే ఆత్మ అని రాక్షసులకు చెప్పి వారి పతనానికి కారణమైనాడు.

శరీరమే నేను అనుకునే వాళ్ళు అజ్ఞానులు. వారు పశుతుల్యులు. అందుకే పరమేశ్వరుణ్ణి పశుపతి అంటారు. అంటే 'పశూనాం పతిః' జ్ఞానం లేనటువంటి పశుతుల్యులైన మానవులకు పతి అని అర్థం. అదే పరమేశ్వరి తత్త్వం. అందుచేత తనభక్తుల యొక్క అజ్ఞానాన్ని పోగొట్టేది. వారిలో భేదభావాన్ని పోగొట్టేది ఆ పరమేశ్వరి.

ప్రపంచంలోని జీవరాసులన్నింటిలోనూ ఆత్మ ఒక్కటే. జీవరాసులే కాదు కనిపించే పదార్థాలు కనిపించని పదార్థాలయందు కూడా ఉన్న తత్త్వము ఒకటే. ఛాందోగ్యోప నిషత్తులో సత్యకామజాబాలి కథ ఇందుకు చక్కని ఉదాహరణ.

సత్యకామజాబాలి బ్రహ్మతత్త్వం తెలుసుకోవటానికి గౌతముడి దగ్గర శిష్యుడుగా చేరతాడు. గౌతముడు అతడికి 400 వట్టిపోయిన ఆవులు కదలలేని ఆబోతులు ఇచ్చి 'వీటిని అడవికి తీసుకునిపోయి మేపు. వీటిసంఖ్య 1000 అయిన తరువాత తిరిగి రా" అంటాడు.

సత్యకాముడు బ్రహ్మవిద్య ఇంతకాలమైనా తనకు లభించనందుకు దుఃఖిస్తూ, గురువుగారి ఆజ్ఞ ప్రకారము ఆవులను మేపుతుంటాడు. అలా కొన్ని సంవత్సరాలు గడిచినాయి. అప్పుడు ఒకరోజు సాయం సమయంలో మందలోనుంచి ఒక ముసలి ఆబోతువచ్చి "సత్యకామా! పరబ్రహ్మతత్త్వం నాలుగు పాదాలుగా ఉంటుంది. నేను నీకు మొదటి పాదన్ని వివరిస్తాను. సత్యకామా ! ఈ విశాల విశ్వంలో నాలుగు దిక్కులు బ్రహ్మతత్త్వంలో ఒకభాగము" అంటుంది. రెండవపాదాన్ని అగ్నిదేవుడు చెబుతూ 'భూమి, ఆకాశము, సముద్రాలు, పర్వతాలు, నదులు అన్నీ పరబ్రహ్మలోని భాగాలే' అంటాడు. మూడవపాదాన్ని ఒక హంస చెబుతూ అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు అన్నీ పరబ్రహ్మలో భాగాలే' అంటుంది. నాల్గవభాగాన్ని నీటిపక్షి చెబుతూ ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రవణం బ్రహ్మ, మనస్సు బ్రహ్మ అంటుంది.

అలాగే ఉపకోశలుడికి ఆశ్రమంలోని అగ్నులు పరబ్రహ్మతత్త్వాన్ని ఉపదేశిస్తూ "ప్రాణమే బ్రహ్మ, ఆకాశమే బ్రహ్మ, ఆనందమేబ్రహ్మ, సూర్యునిలో ఉన్న బ్రహ్మతత్త్వం నాలో ఉన్న బ్రహ్మతత్త్వం ఒకటే. ఆకాశంలోని మెరుపులో ఏ తత్త్వమైతే ఉన్నదో, అదే నాలోనూ ఉన్నది. అదే చరాచరగత్తంతా వ్యాపించి ఉన్నది" అంటాయి.

కాబట్టి చరాచరజగత్తులోని నేల, నింగి, నిప్పు, నీరు, కొండలు, కోనలు, జీవరాశి అంతా పరబ్రహ్మస్వరూపమే. అంతకన్న వేరుగా ఏదీలేదు. తన భక్తులకున్న భేదభావాన్ని పోగొట్టి జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అనే విషయాన్ని బోధిస్తుంది ఆ పరమేశ్వరి అందుకే ఆమె భేదనాశిని అనబడుతుంది.

## 180. నిర్నాశా

నాశనములేనిది. అంతములేనిది. ఆది మధ్యాంతములు లేనిది.

**సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ**

సత్యము జ్ఞానము అయినది పరబ్రహ్మ.

కళ్ళకు కనిపించే వాటికే నాశనమున్నది. కనిపించని వాటికి నాశనం ఉండదు. ఈ లోకంలో పుట్టిన ప్రతిప్రాణీ, ప్రతివస్తువూ లయం అంటే నాశనం కావలసిందే. నాశనం లేనివాడు ఆ పరమాత్మ ఒక్కడే. భాగవతంలో గజేంద్రుడు పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తూ **ఆది మధ్యాంతములు లేక అలరువాడ** అంటే జన్మమృత్యుజరాదులు ఏవీ లేనివాడు. నాశనములేనివాడు.

ప్రళయకాలంలో కూడా భూమి నీటిలో, నీరు నిప్పులో, నిప్పు గాలిలో, గాలి ఆకాశంలో, ఆకాశం మాయలో లీనమవుతాయి. కర్మక్షయం కానటువంటి జీవులు తమ కర్మను మూటకట్టుకుని మాయలో లీనమవుతాయి. ఇప్పుడు ఆ మాయ పరబ్రహ్మతత్త్వంలో లీనమవుతుంది. అప్పుడు ఉండేది పరబ్రహ్మ ఒక్కడే. ఈ జగత్తంతా బ్రహ్మమయం. మళ్ళీ సృష్టి చెయ్యాలనుకున్నప్పుడు పరబ్రహ్మ తననుంచి కొంతశక్తిని బయటకు పంపాడు. ఈరకంగా జగత్తులో అన్నీ నాశనమవుతాయి. కాని నాశనం కానిది ఒక్కటే అదే పరబ్రహ్మ అదే పరమేశ్వరి. ఈ విధంగా నాశనంలేనిది కాబట్టి ఆమె నిర్నాశా అనబడుతున్నది.

## 181. మృత్యుమథనీ

ఆ పరమేశ్వరి తనను ధ్యానించు వారిని మృత్యువాత పడనీయకుండా అమృతత్వాన్ని ప్రసాదిస్తుంది.

మరణధర్మాన్ని నశింపచేసి అమృతత్వాన్ని అందించేది. పూర్వజన్మ కర్మఫలాను సారంగా జీవి ఈ లోకంలో ఉత్తరజన్మఎత్తుతాడు. మళ్ళీ కర్మలుచేస్తాడు. మరణిస్తాడు. ఈ పరంపరలో మరణించిన తరువాత తాను చేసిన కర్మలననుసరించి స్వర్గసుఖాలు, నరకబాధలు అనుభవిస్తాడు. ఆ తరువాత కర్మశేషాన్ననుభవించటానికి ఉత్తరజన్మ

ఎత్తుతాడు. ఇది కర్మలుచేసే వారి గురించి. మరి అసలు కర్మలు చెయ్యనివారు? వీరు జ్ఞానులు. కర్మచేసినా చెయ్యకపోయినా ఫలితము ఒక్కటే అనే విషయాన్ని తెలుసుకుని, తానే సాక్షాత్తూ పరమేశ్వర స్వరూపము అని, ఈ జగత్తంతా తనలోనే ఉన్నదని భావిస్తాడు. ఎవరైతే పరబ్రహ్మ తత్త్వాన్ని తెలుసుకున్నారో, వారు కూడా పరబ్రహ్మ స్వరూపులే. **బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి** అంటోంది బృహదారణ్యకోపనిషత్తు. వారికి కూడా చావుపుట్టుకలుండవు. పుట్టుక అంటూ ఉంటే చావు ఉంటుంది. పుట్టుక ఉండాలంటే కర్మలు చెయ్యాలి. కర్మలు చెయ్యనివారు, ఏ కోరికలు లేకుండా కర్మచేసేవారు (నిష్కామ్యకర్మలు) వీరికి పాపపుణ్యాలుండవు. అందుచేత జన్మరాహిత్యం కలుగుతుంది. జన్మంటూ లేదు కాబట్టి మరణము ఉండదు.

ఈ విధంగా తన భక్తులకు మోక్షము ప్రసాదించి వారికి మృత్యువు లేకుండా చేసేది ఆ పరమేశ్వరి. అందుకే ఆమె మృత్యుమథనీ అని పిలువబడుతోంది.

## 182. నిష్క్రియా

విధించిన క్రియలు ఏవీ లేనటువంటిది. నిషేధించబడిన క్రియలు కూడా లేనటువంటిది. ఆ పరమేశ్వరికి నిషేధాలు ఏవీ లేవు. అన్నింటికీ ఆమే కర్త.

అసలు క్రియ అంటే ఏమిటి ? తనకు లేని దాన్ని సంపాదించటానికిగాని, తనకున్న దానిని వదిలించుకోటానికి గాని చేసే ప్రయత్నమే క్రియఅనబడుతుంది. చేయవలసినవి, చేయకూడనివి అన్నీ క్రియలే. పరమేశ్వరికి ఇటువంటిక్రియలు ఏవీలేవు. దేవికి అసలు అవయవాలే లేవు. క్రియలన్నీ అవయవాల ద్వారాచేసేవే. దేవి నిరవయవకాబట్టి క్రియలు ఉండవు. అందరికీ అన్నింటినీ ఇచ్చేది ఆ పరమేశ్వరి. అన్నీ ఆమె దగ్గరే ఉన్నాయి. కాబట్టి ఆమె దేన్నీ సంపాదించుకునే పనిలేదు. అలాగే అన్నింటికీ ఆమే కారణము. అందుచేత దేన్నీ వదిలించుకోవలసిన పనీలేదు. అందుచేతనే ఆమె నిష్క్రియా అనబడుతోంది.

## 183. నిష్పరిగ్రహా

పరిగ్రహము లేనిది. పరిగ్రహము అంటే పట్టుకొనుట, స్వీకారము, పుచ్చుకొనుట, ధనము, అలంకారము కానుక, భార్య, పరిజనము, పరివారము, ఉపకరణము అని అర్థం చెబుతోంది సూర్యరాయాంధ్రనిఘంటువు. పరిగ్రహము లేనిది ఆ పరమేశ్వరి అనగా సంసారబంధనాలు లేనిది. దాసదాసీజనములేనిది, ధనధాన్యాదులులేనిది.

అలంకారాలు లేనిది. దేనినీ ఎవరినుంచీ తీసుకోనిది ఆ దేవి అందరికీ అన్నీ ఇచ్చేది ఆమె. దేవీభాగవతంలో మణిద్వీపంలో దేవిని వర్ణిస్తూ

**యస్యాస్తు పార్శ్వభాగేతు నిధీతౌ శంఖపద్మకౌ ।**
**నవరత్న మహానద్యా స్తదా వై కాంచనస్రవా ॥**

దేవి ప్రక్కన శంఖము, పద్మము మొదలైన నవనిధులు ఉన్నాయి. అక్కడినదులలో బంగారము, రతనాలు ప్రవహిస్తుంటాయి. అని చెప్పబడింది. అంటే అంతులేని ధనరాసులు, ధనధాన్యాలు ఆమె దగ్గరే ఉన్నాయి. ఇంకా ఇతరులనుంచి తీసుకోవలసిన అవసరం ఏముంది ?

ఈ శరీరమే శాశ్వతము అనుకొనే అజ్ఞానులు ధనధాన్యాదులతో, భోగభాగ్యాలను భవించాలనుకుంటారు. అందుకే ధనంసంపాదించటానికి నానాఅవస్థపడుతుంటారు. ఈ శరీరం శాశ్వతంకాదు అని తెలిసినప్పుడు ధనధాన్యాల అవసరం లేదు. పరమేశ్వరి నిరాకార. కాబట్టి ఆమెకు భోగభాగ్యాలుండవు. సుఖదుఃఖాలుండవు. అవన్నీ కర్మానుసారము ఆమే జీవులకు పంచుతుంది. అందుచేతనే ఆమె నిష్పరిగ్రహా అనబడుతున్నది.

## 184. నిస్తులా

నిస్తులా ఉపమానము లేనటువంటిది. సాటిలేనిది. త్రిపురోపనిషత్తులో హేతు దృష్టాంతవర్జితేతి. హేతు దృష్టాంతములు లేనిది. తనతోసమానమైన ఇతరవస్తువులు ఏవీలేనిది. సృష్ట్యాదిలో పరబ్రహ్మ ఒక్కటే ఉండేది. దానితో సమానమైన వారుకాని, దానికన్న అధికులుకాని వేరెవరూ లేరు. అని ఉపనిషత్తులయందు చెప్పబడింది. కాబట్టి పరమాత్మతో సమానమైన వారెవరూ లేరు. అందుచేతనే పరమేశ్వరి నిస్తులా అనబడుచున్నది. ఉండటము, లేకపోవటము అనే ధర్మాలు కనిపించే వస్తువులకే గాని కనిపించని వస్తువులకు కాదు. పరబ్రహ్మదృష్టికి గోచరముకాని పదార్థము.

కేనోపనిషత్తులో

**న చక్షు ర్గచ్ఛతి న వా గ్గచ్ఛతి నో మనః**

ఆత్మ ఉన్నచోటికి కన్నుగాని, వాక్కుగాని, మనసుగాని పోలేవు.

**యత్ర్పాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే ।**
**తదేవ బ్రహ్మత్వం విద్ధి వేదం య దిద ముపాసతే ॥**

ఆత్మను ఊపిరిచేత వాసన చూడలేము. ముక్కుకు వాసనచూసే శక్తిని కలిగించేది ఆ ఆత్మే.

ఈ రకంగా ఆత్మ దృశ్యవస్తువు కాదు. అందుచేత దానితో సమానమైన వస్తువు ఏదీలేదు. అందుకనే పరమేశ్వరి నిస్తులా అని చెప్పబడింది.

## 185. నీలచికురా

**నీలా శ్చికురాః కుంతలాః యస్యాః సా**

నీలములైన వెంట్రుకలు కలిగినటువంటిది. చికురములు అంటే ముంగురులు. సాముద్రికశాస్త్రంలో తలవెంట్రుకలు సౌందర్యకారకాలు. మానవుడి యొక్క యవ్వనాన్ని సూచిస్తాయి. పరమేశ్వరి నిత్యయవ్వనసంపన్న. ఎప్పుడూ నిండు యవ్వనంతోనే ఉంటుంది. **సదాషోడశవర్షీయాం** కాబట్టి తలవెంట్రుకలు ఎప్పుడూ నల్లగానే ఉంటాయి. తెల్లవెంట్రుకలు ముసలితనానికి గుర్తు. సప్తశతిలో ఆమె యొక్క కురులు **యామ్యేచాభవన్‌కేశా** యముని యొక్క తేజస్సుచే వచ్చినాయి.

## 186. నిరపాయా

అపాయము లేనిది. అపాయము అనేది అనేక రకాలుగా కలుగుతుంది. విద్యాపాయము, ధనాపాయము, ఆరోగ్యాపాయము, ప్రాణాపాయము మొదలైనవి. ఈ అపాయాలు దేహమున్నవారికేగాని లేనివారికి కాదు. పూర్వజన్మకర్మఫలితాన్ని బట్టి దేహము, ఇంద్రియాలు అన్నీ ఏర్పడతాయి. పరమేశ్వరికి జన్మే లేదు. కర్మ అంతకన్నా లేదు. మరి అలాంటి దేవికి శరీరమెలా ఏర్పడుతుంది ? శరీరం లేకపోతే అపాయం ఎలా వస్తుంది? కాబట్టి ఆ దేవికి ఏ విధమైన అపాయము లేదు. తన భక్తులకు వచ్చిన ఆపదలను ఆ పరమేశ్వరే పోగొడుతుంది. అలాంటి దేవికి అపాయమెక్కడిది ? అందుకే ఆమె నిరపాయా అనబడుతుంది.

## 187. నిరత్యయా

అత్యయము అంటే అతిక్రమించుట, లేకపోవుట, ముగియుట, నాశనము, అపాయము, శిక్ష, దండము అని అర్థం చెబుతోంది సూర్యరాయాంధ్ర నిఘంటువు. ఈ అత్యయములు ఏవీ లేనిది ఆ పరమేశ్వరి.

ఆ దేవి సర్వవ్యాపి. అంతటాతానే ఉన్నది. కాబట్టి ఆమెను అతిక్రమించటానికి వీలుకాదు. ఈ సృష్టిలో అన్నింటి యొక్క ఉత్పత్తికి కారణము ఆ దేవే. అందుచేత ఆమె యొక్క ఆజ్ఞను అతిక్రమించేవారు ఉండరు.

పరబ్రహ్మ ఉన్నాడు కాబట్టే ఇంద్రాది దిక్పాలకులు గతి తప్పకుండా వారి పనులు వారు చేస్తున్నారు. సూర్యుడు ఎండను కాస్తున్నాడు. చంద్రుడు చల్లదనాన్ని ఇస్తున్నాడు గాలి వీస్తున్నది. పరమేశ్వరుని ఆజ్ఞను ఎవరూ అతిక్రమించరు. అందుచేతనే దేవి నిరత్యయా అనబడింది.

## 188. దుర్లభా

**దుర్లభా యోగినామప్య సాధ్యత్వాత్**

యోగులకు కూడా సాధ్యముకానిది. అసాధ్యురాలు. ఏ మాత్రమూ సాధ్యముకానిది. అవాఙ్మానసగోచరమైనది. అనగా వాక్కుచేతగాని, మనసుచేతగాని ఏ ఇతర ఇంద్రియముల చేతగాని గోచరముకానిది. పరబ్రహ్మస్వరూపాన్ని మాటలద్వారా కనిపెట్టలేము. చెవుల ద్వారా వినలేము. కంటిద్వారా చూడలేము. మనసుతో గుర్తించలేము. అందుచేతనే ఆమె దుర్లభా అనబడుతోంది.

## 189. దుర్గమా

పొందశక్యము కానిది. సామాన్య మానవులకు ఆ దేవి దర్శనము సాయుజ్యము దుర్గమము. అంటే పొందటానికి వీలులేనివి. కాని నియమనిష్ఠలతో శరీరాన్ని కృశింపచేసిన వారు, చాంద్రాయణాదివ్రతాలు ఆచరించేవారు, నిష్కామకర్ములు, జ్ఞానులు. వీరిలో కొందరికి దేవి దర్శనం లభిస్తుంది. కొందరికి సాయుజ్యం లభిస్తుంది. ఇది వారివారి కర్మఫలాన్ని బట్టి ఉంటుంది. కాబట్టి పరమేశ్వరి దర్శనం కాని, సాయుజ్యంకాని రెండూ కష్టమైనవే. అందుకే దేవి దుర్గమా అనబడుతోంది.

## 190. దుర్గా

మార్కండేయపురాణంలోను, పాంచరాత్రలక్ష్మీతంత్రంలోనూ ఈ విధంగా ఉంది.

**తత్రైవ చ వధిష్యామి దుర్గ మాఖ్యం మహాసురమ్ ।**

**దుర్గాదేవీ తి విఖ్యాతం త న్మే నామ భవిష్యతి ॥**

ఆ కాలంలో దుర్గముడు అనే రాక్షసుణ్ణి సంహరిస్తాను. అందుచేత నాకు దుర్గాదేవి అను నామము ప్రసిద్ధమగును. అని పరమేశ్వరి చెబుతుంది. ఈ దేవి బీమరధి అనే నదీ తీరమందున్నది. దేవీపురాణంలో

**ధీబలాది భయే దుర్గే తారితా రిపు సంకటే ।**
**దేవా శ్శక్రాదయో యేన తేన దుర్గా ప్రకీర్తితా ॥**

ఇంద్రాది దేవతలు శత్రువుల వలన భరించలేని బాధలు పొందినప్పుడు వారియొక్క భయాన్ని తొలగించేది కాబట్టి దుర్గా అనబడుతుంది.

వారణాసి నగరాన్ని బాహువు అనే రాజు పాలించాడు. ఆ రాజు పరమేశ్వరి భక్తుడు. అతడు ఆ దేవిని గురించి ఘోరమైన తపస్సుచేసి దేవి దుర్గ అనే పేరుతో ఆవిర్భవిస్తుంది అని వరం పొందాడు.

దేవీభాగవతంలో సుబాహువు పరమేశ్వరిని మెప్పించి

**నగరేఽత్ర త్వయా మాతః స్థాతవ్యం సర్వదా శివే ।**
**దుర్గాదేవీతి నామ్నా వై త్వం శక్తి రిహ సంస్థితా ॥**

ఈ కాశిలో నువ్వు ఎప్పుడూ సదాశివా, దుర్గా అనే పేర్లతో ఉండాలి అని కోరాడు.

దుర్గముడు అనే రాక్షసుడు పురుషుని వలన మరణం లేకుండా వరం కోరాడు. అందుచేత పరమేశ్వరి స్త్రీరూపంతో అతణ్ణి సంహరించింది. ఆ రూపమే దుర్గ.

దేవీ నవరాత్రులందు కుమారీ పూజచేసేటప్పుడు తొమ్మిది సంవత్సరాల వయసుగల బాలిక దుర్గ.

**నవవర్షా భవే ద్దుర్గా సుభద్రా దశవార్షికీ**

ఈ దుర్గాదేవిని పూజించటం వల్ల కష్టమైన పనులన్నీ జరుగుతాయి.

దేవీకవచంలో నవదుర్గలను చెప్పటం జరిగింది.

**ప్రథమం శైలపుత్రీ చ ద్వితీయం బ్రహ్మచారిణీ ।**
**తృతీయం చంద్రఘంటేతి కూష్మాండేతి చతుర్థకమ్ ॥**
**పంచమం స్కందమా తేతి షష్ఠం కాత్యాయనీతిచ ।**
**సప్తమం కాళరా త్రీతి మహాగౌరీతి చాష్టకం ॥**
**నవమం సిద్ధిదా ప్రోక్తా నవదుర్గాః ప్రకీర్తితాః**

వీరు వరుసగా

| | | |
|---|---|---|
| 1. శైలపుత్రి | 4. కూష్మాండ | 7. కాళరాత్రి |
| 2. బ్రహ్మచారిణి | 5. స్కందమాత | 8. మహాగౌరి |
| 3. చంద్రఘంట | 6. కాత్యాయని | 9. సిద్ధమాత |

దసరా తొమ్మిదిరోజులయందు ఈ రూపాలతో దేవిని అర్చించే ఆచారమున్నది.

పవిత్రకృష్ణానదీ తీరాన, విజయవాడలో ఇంద్రకీలాద్రి మీద వెలసిన దేవత కనకదుర్గ.

## 191. దుఃఖహంత్రీ

దుఃఖములను హరించి వేయునది. సంసారికమైన అన్నిరకాల దుఃఖాలను, బాధలను నశింపచేసి ముక్తిని ప్రసాదించేది. గౌతమసూత్రాలలో

**త దత్యంత విమోకోపవర్గ** సంసార బాధల నుండి విముక్తే ముక్తి అని చెప్పబడింది.

సర్వవిధాలయిన దుఃఖాలను నశింపచేసేది. దుఃఖాలు అనేకరకాలు.

**జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునః పునః ।**
**సంసారసాగరం దుఃఖం తస్మా జ్జాగృత జాగృత ။**

అసలు ఈ పుట్టుకే ఒక పెద్ద దుఃఖము, సంసారం, దుఃఖం, ముసలితనం దుఃఖం, అన్నీ దుఃఖహేతువులే.

దారిద్ర్యం వల్ల దుఃఖం, అనారోగ్యం వల్ల దుఃఖం, పిల్లలు లేరని దుఃఖం, పిల్లలకు చదువురాలేదని, వివాహంకాలేదని, ఉద్యోగం రాలేదని, తనకు అనుకూలంగా పనులు జరగటంలేదని ఒకటేమిటి ? అనేక కారణాలవల్ల దుఃఖం వస్తుంది. ఈ దుఃఖాల నుండి విముక్తి కావాలంటే తత్త్వచింతన ఒక్కటే ప్రధానమయింది. అదే పరమేశ్వరి ధ్యానం. దేవిని నమ్మినవారికి కష్టాలను ఆమె హరించి వేస్తుంది. అందుచేతనే ఆమె దుఃఖహంత్రీ అనబడింది.

## 192. సుఖప్రదా

సుఖములను ప్రసాదించేది. పరమేశ్వరి తన భక్తులకు సుఖసంతోషాలనిస్తుంది. సుఖాలు రెండు రకాలు. 1. ఐహికము 2. ఆముష్మికము. సిరిసంపదలు, భోగభాగ్యాలు ఇవన్నీ ఐహికము. మానవుడికి ఈ లోకంలో ధనంకన్న ప్రియమైన వస్తువు ఇంకేదీలేదు. ధనంతో అన్నిరకాల బాధలను దూరంచేయవచ్చు. అన్ని సుఖాలు పొందవచ్చు

అనుకుంటాడు. కాని అది నిజంకాదు. కేవలము ధనము వల్ల దుఃఖాలన్నీ తీరవు. అలాగే కోరుకున్నవన్నీ జరగవు. మానవుడు కోరుకునే ఈ రకమైన ఐహికసుఖాలన్నీ అశాశ్వతమైనవి.

**అర్థా గృహే నివర్తంతే స్మశానే మిత్రబాంధవాః ।**
**సుకృతం దుష్కృతం చైవ గచ్ఛంత మనుగచ్ఛతి ॥**

మానవుడు సంపాదించిన ధనధాన్యాలు, సిరిసంపదలు గడపదాటిరావు. అతని బంధుమిత్రులు మహా అయితే స్మశానం దాకా వస్తారు. కాని మనిషితోపాటు శాశ్వతంగా వచ్చేది అతడు చేసిన పాపపుణ్యాలే.

ఈ జన్మలో అతడు సంపాదించిన ధన ధాన్యాలు శాశ్వతం కాదు. ఈ సుఖాలు శాశ్వతం కాదు. మరి శాశ్వతమైన ఆనందం ఒక్కటే. అదే బ్రహ్మానందం, సంపన్నుడు, వేదవిదుడు, ఆరోగ్యవంతుడు, కర్మిష్టి అయిన మానవుడు ఈ లోకంలో పొందే ఆనందానికి కొన్నివేలకోట్ల రెట్లు ఉంటుందది. అది శాశ్వతమైన ఆనందం. అటువంటి ఆనందాన్ని, సుఖాన్ని తన భక్తులకు కలగచేస్తుంది పరమేశ్వరి అందుకే ఆమె సుఖప్రదా అనబడుతోంది.

## 193. దుష్టదూరా

దుష్టులను, దుర్మార్గులను, దోషపూరితులను దూరముగ ఉంచునది విడిచిపెట్టునది. దేవీభాగవతంలో

**న భజంతి కుతర్కజ్ఞా దేవీం విశ్వేశ్వరీం శివాం ।**

కుతర్కవాదులు ఆ పరమేశ్వరిని ఎన్నటికీ పొందలేరు.

శరీరమే తాము అనే అహంకారంతో ఉండేవారు దుష్టులు. వీరు అహంకారులు. వీరికి దూరంగా ఉంటుంది. నీతిశాస్త్రంలోకూడా **దుర్జనం పరివర్జయేత్** అని చెప్పబడింది. అంటే దుర్జనులను విసర్జించండి. వారితో మైత్రివద్దు. వారు దురహంకారులు. శరీరమే తాము అనుకునే అజ్ఞానులు. వారిని గనక వదలకపోతే మంచివాడు కూడా పాడైపోయే ప్రమాదం ఉంది. లేదా అతని వల్ల మనకు హాని కలుగుతుంది. అందుచేతనే దుర్జనులను దూరంగా ఉంచాలి.

## 194. దురాచారశమనీ

దురాచారాలు అంటే శాస్త్రవిరుద్ధమైన ఆచారాలు. అటువంటి దురాచారాలను శమింపచేసేది. కర్మలు రెండురకాలు. 1. చేయవలసినవి. 2. చేయకూడనివి. చేయవలసిన

కర్మలు చెయ్యకపోవటం వల్ల పాపం వస్తుంది. అలాగే చెయ్యకూడని పనులు చెయ్యటం వల్ల కూడా పాపం వస్తుంది. ఈ రెండురకాలయిన పాపాలను శీఘ్రంగా నశింపచేసేది పరమేశ్వరి. అనగా దురాచారాలన్నింటినీ శమింపచేసి భక్తులను సదాచారులుగా మారుస్తుంది.

మానవుడు తానుచేసిన కర్మలవల్ల ఫలితము తానే అనుభవించాలి. ఈ జన్మలో కాకపోతే ఇంకొక జన్మలో అనుభవించాలి. అదే సంచితకర్మ. ఈ కర్మను కల్పాంతంవరకు అనుభవించినా క్షయం కాదు. పరమేశ్వర చింతనతో కర్మక్షయం అవుతుంది. అందుచేత ఆ దేవి దురాచారాలన్నింటినీ శమింపచేసి తన భక్తులను రక్షిస్తుంది. కాబట్టి ఆమె దూరాచారశమనీ అనబడింది.

## 195. దోషవర్జితా

### దోషైః రాగద్వేషాదిభిః వర్జితా

రాగద్వేషాలు లేనిది. రాగద్వేషాలనే దోషములు లేనిది. అరిషడ్వర్గాలు. ఇవి మానవుడికి అంతశ్శత్రువులు. అవే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు. బాహ్యంగా కనిపించే శత్రువులను ఎదుర్కొనవచ్చు. నాశనం చేయవచ్చు. కాని అంతః శత్రువులను నాశనం చెయ్యటమే గొప్పపని. వాటివల్ల అనేక రకాలయిన దోషాలు వస్తాయి. అసలు వీటన్నింటికీ కారణము రాగద్వేషాలు. వీటిని వదిలేస్తే అన్నింటినీ జయించినట్లే.

ఈ జన్మలో చేసిన పాపకర్మలే మరుజన్మలో వెంటాడతాయి. ఎవరైనా మనవల్ల బాధించబడ్డారంటే ఆ పాపం ఊరికేపోదు. ఆ వ్యక్తి మనని ఇప్పుడు ఏమీ చెయ్యలేక పోవచ్చు. కాని మరుజన్మలో మనమీద కసితోపుడతాడు. మన మీద శత్రుత్వం పెంచుకుంటాడు. ఇవన్నీ దోషాలు రాగద్వేషాలవల్ల కలుగుతాయి. అటువంటి దోషాలను వర్జింపచేసేది.

ఈ రకంగా 132వ నామం దగ్గర నుంచి 195వ నామం వరకు పరమేశ్వరి నిర్గుణబ్రహ్మఅని, నిర్గుణారాధనవల్ల వచ్చే ఫలితము – దుఃఖోపశమనము, శాశ్వతమైన సుఖము, దుష్టత్వాన్ని దూరం చెయ్యగలగటం, దురాచారాలను తన భక్తులకు అంటకుండా చూడటం. ఇవన్నీ ఇక్కడ వివరించబడ్డాయి.

# 15. సర్వజ్ఞత్వము

పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. అన్ని విషయాలు అతనికి తెలుసు. భూతభవిష్య ద్వర్తమానాలు అన్నీ అతని అధీనంలోనే ఉన్నాయి. కాబట్టి జరిగినది జరుగుతున్నది జరుగబోయేది అన్నీ అతడికి తెలుసు. అతడు త్రికాలజ్ఞాని. దయామయుడు. తనను శరణన్న వారిని రక్షించటంలో అతడికి సాటివేరెవరూ లేరు. సృష్టి ప్రారంభంకాకముందు నుంచి అతడొక్కడే ఉన్నాడు. అతడితో సమానమైనవారు కాని, అతనికన్న అధికులుగాని మరెవరూ లేరు. ఈ విషయం పదేపదే చెప్పబడింది. పరమేశ్వరుడు త్రికాలజ్ఞుడు త్రికాలాతీతుడు కూడా.

అతడు బిందురూపంలో ఉన్నాడు. ఆ రూపం బిందువే ఎందుకు కావాలి? త్రికోణం గాని, చతుర్భుజంగాని, అష్టకోణంగాని ఎందుకు కాకూడదు ? అనే ప్రశ్నలకు వివరణ 'షట్చక్రాలు' అనే శీర్షికలో ఇవ్వబడుతుంది. ఇప్పుడు పరమేశ్వరుని సర్వజ్ఞతని చూద్దాం.

## 196. సర్వజ్ఞా

సర్వమును తెలియునది. అన్నింటినీ ఎరిగినది. **'యస్సర్వజ్ఞః స సర్వవిధి'** ఎవరు సర్వజ్ఞుడో వాడే సర్వవేత్త. సర్వమును ఎరిగినవాడు. దేవీపురాణంలో **సర్వజ్ఞా సర్వవేతృత్వా** సమస్తాన్ని ఎరిగినది కాబట్టే ఆ పరమేశ్వరి సర్వవేత్త అనబడుతోంది.

భగవంతుడు అని చెప్పటానికి కొన్ని లక్షణాలున్నాయి. అవి.

| | | |
|---|---|---|
| 1. సర్వజ్ఞత | 3. స్వతంత్రత | 5. సంపూర్ణత |
| 2. అనాదిబోధ | 4. నిత్యత | 6. అనంతత. |

1. సర్వజ్ఞత – అన్ని విషయాలు తెలిసిఉండటము
2. అనాదిబోధ – అనాదిగా జ్ఞానం కలిగి ఉన్నవాడు.
3. స్వతంత్రత – ఎవరి మీద ఆధారపడకుండా స్వతంత్రంగా ఉండటము.
4. నిత్యత – శాశ్వతంగా ఉండటము, నాశనము లేకపోవటము
5. సంపూర్ణత్వము – అన్నింటినీ కలిగి ఉండటము
6. అనంతత – అంతము లేకుండా ఉండటము

కాబట్టి సర్వజ్ఞత అనేది భగవంతుడి యొక్క లక్షణం. ఇక్కడ సర్వ అంటే ఈ జగత్తులో కంటికి కనిపించే విషయాలన్నీ అని అర్థం. పరమేశ్వరుడు సర్వజ్ఞుడు అంటే అన్ని రూపాలు తానే అయినవాడు. అన్ని రూపాల గురించి, విషయాల గురించి పూర్తిగా

తెలిసినవాడు. జీవులు చేసిన పాపపుణ్యాలు ఆధారంగా వారికి ఉత్తర జన్మలు ప్రసాదింపచేసేవాడు. ఈ లక్షణాలన్నీ పరమేశ్వరివే. అదే పరమేశ్వరి నిర్గుణరూపం. అందుచేతనే ఆమె సర్వజ్ఞ అనబడుతున్నది.

## 197. సాంద్రకరుణా

**సాంద్రా ఘనా కరుణాయస్యాః సా**

ఘనమైన దయ గలది. దయా స్వరూపిణి. కరుణా సముద్రురాలు. కరుణరసంలో అఖరిమజిలి సాంద్రకరుణ. అంతకన్న ఇంక పెద్దపదం లేదు. దీని అర్థం పరమేశ్వరి అపారమైన దయాస్వరూపిణి. పిల్లలు తల్లిని ద్వేషించవచ్చుగాని తల్లి మాత్రం పిల్లలను ద్వేషించదు. ఒక వేళ అలా చెయ్యవలసి వచ్చినా అందులో కూడా దయ, కరుణ ఉంటాయి. మన కళ్ళకు కనిపించే సామాన్యులయిన తల్లులే ఈ రకంగా ఉంటే ఆ పరమేశ్వరి, శ్రీమాత ఆవిడను గురించి వేరే చెప్పాలా ? జగత్తులోని జీవరాశి అంతా ఆమె సంతానమే. వారందరి మీద అపారమైన దయను చూపిస్తుంది. అందుకే ఆమె సాంద్రకరుణ.

## 198. సమానాధికవర్జితా

**న తత్సమ శ్చ అభ్యధిక శ్చ దృశ్యతే** దేవితో సమానమైన వారుకాని, ఆమెకన్న అధికులుగాని లేరు.

ప్రపంచంలో కంటికి కనిపించే దృశ్య పదార్థాలు చాలా ఉంటాయి. కాని దృక్పదార్థం మాత్రం ఒక్కటే. అదే పరమేశ్వరతత్త్వము. కంటికి చూసేశక్తి నిచ్చేది ఆత్మ. చెవికి వినే శక్తినిచ్చేది ఆత్మ. కాలుకు నడిచే శక్తినిచ్చేది ఆత్మ. ఈ రకంగా ప్రతి అవయవానికి, ప్రతిజీవికి, ప్రతి వస్తువుకు చైతన్యశక్తిని ప్రసాదించేది ఆత్మ. అటువంటప్పుడు ఆత్మస్వరూపిణి అయిన ఆ దేవితో సమానమైనవారు కాని, ఆమెకన్న అధికులుగాని ఏరకంగా ఉంటారు ? అందుచేతనే ఆమె సమానాధికవర్జితా అనబడుతున్నది.

ఇక్కడ తొమ్మిది నామాలలో దుర్గానవార్ణవమంత్రము, మూడు అక్షరాలలో ఆ మంత్రోపాసనవల్ల ఫలము చెప్పబడ్డాయి.

నిస్తులా, నీలచికురా, నిరపాయా, నిత్యయా, దుర్లభా, దుర్గమా, సర్వజ్ఞా, సాంద్రకరుణా, సమానాధిక వర్జితా. – దుర్గానవార్ణవము

దుఃఖహంత్రీ, సుఖప్రదా, దురాచారశమనీ –మంత్రోపాసనవల్ల ఫలము.

## 16. సగుణరూపవర్ణన

పరమేశ్వరుడికి రెండు రూపాలున్నాయి. 1. ఆయన యొక్క నిజస్థితి. అదే నిర్గుణస్వరూపుడు. 2. సగుణరూపము. ఇందులో పరమేశ్వరుడికి ఆకారమున్నది. ఆ ఆకారం కూడా మనం కల్పించిందే. **సాధకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా** సాధకుడు తన యొక్క కోరిక తీర్చుకోవటం కోసం పరబ్రహ్మకు రూపం కల్పించాడు. ఈ రూపం అనేక రకాలుగా ఉంటుంది. ఎవరికి ఏరకంగా కావాలంటే ఆ రకంగా రూపు తీర్చిదిద్దటం జరిగింది. అంటే చదువు కావాలి అనుకున్నవారు పరమేశ్వరి చేతులయందు, స్ఫటికమాల, పుస్తకము, వీణ ఏర్పాటుచేశారు. అప్పుడు ఆమె ధరించిన శ్వేతాంబరాలు – జ్ఞానచిహ్నాలు. ఆమె చేతులలోని

| | | |
|---|---|---|
| స్ఫటికమాల | – | అక్షరమాల |
| పుస్తకము | – | వేదవేదాంగాలు, సాహిత్యం |
| రెండుచేతులందు వీణ | – | సంగీతం |
| వాహనం హంస | – | జీవాత్మ |

ఈ రకంగానే శత్రువులనుంచి రక్షణ కావాలి అనుకొన్నవారు దుర్గ, కాళి మొదలైన రూపాలను ధ్యానిస్తారు. ఆ దేవతల చేతులలోని వివిధ రకాలయిన ఆయుధాలు సాధకుల శత్రునాశనం చేస్తాయి.

ఇదేవిధంగా ఇప్పుడు వనదుర్గా మాలా మంత్రం వివరించబడుతోంది.

## 199. సర్వశక్తిమయీ

సర్వశక్తులు కలిగి ఉన్నటువంటిది. సృష్టి స్థితి లయాలను చేయుశక్తి గల పరమేశ్వరి. మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతుల స్వరూపమయినదేవి. విద్య, ధనము, పరాక్రమము మొదలైనవన్నీ ఇవ్వగలిగిన దేవి. మామూలుగా చూసినట్లైతే ప్రతి దేవతకు ఏదో ఒక ప్రత్యేకత ఉంటుంది. గాలికి వీచే శక్తి, అగ్నికి మండే శక్తి, వరుణుడికి వర్షాలు కురిపించే శక్తి కాని అన్ని శక్తులూ ఉండేది ఆ పరమేశ్వరికే. ధనానికి అధిపతి ఆమె. దారిద్ర్యానికి అధిపతి ఆమె. అందుకే మధుకైటభసంహారానికి ముందు బ్రహ్మ పరమేశ్వరిని ప్రార్థిస్తూ

**త్వం స్వాహా త్వం స్వధా త్వం హి వషట్కారః సర్వాత్మికా ।**
**సుధా త్వమ క్షరే నిత్యే త్రిధా మాత్రాత్మికా స్థితా ॥**

**అర్ధమాత్రా స్థితా నిత్యా యా నుచ్చార్యా విశేషతః ।**
**త్వ మేవ సా త్వం సావిత్రీ త్వం దేవజననీ పరా ॥**

దేవతలకు ఆహుతులిచ్చేటప్పుడు చెప్పే స్వాహాకారము నువ్వే, పిత్రుదేవతలకు తర్పణలిచ్చేటప్పుడు చెప్పే స్వధాకారము నువ్వే. యజ్ఞయాగాదులలో ఉపయోగించే వషట్కారము నువ్వే. నాశనములేని దానవు. శాశ్వతవు. ఓంకారము నువ్వే. ఓంకారము ఉచ్చరించేటప్పుడు చివర ఉండే నాదము నువ్వే.

**కాళరాత్రి ర్మహారాత్రి ర్మోహరాత్రి శ్చ దారుణా**

కల్పాంతాన ప్రళయకాలపు కాళరాత్రివి నీవే అంతిమ ప్రళయకాలపు మహారాత్రివి నీవే భయంకరమైన మోహరాత్రివి నీవే.

**త్వం శ్రీ స్త్వ మీశ్వరీ త్వంహ్రీ స్త్వం బుద్ధి ర్బోధలక్షణా**
**లజ్జా పుష్టి స్తథా తుష్టి స్త్వం శాన్తిః క్షాన్తి రేవ చ**

నీవు లక్ష్మివి, నీవు ఈశ్వరివి, నీవు బుద్ధివి, లజ్జ, పుష్టి, తుష్టి, శాంతి, ఓరిమికలదానవు. అంటాడు.

ఈ రకంగా పరమేశ్వరి సర్వశక్తిమయి.

పరమేశ్వరి రూపమే శ్రీచక్రము. అందులో అష్టసిద్ధులు, మాతృకలు, ముద్రాశక్తులు, షోడశకళలు, అష్టమూర్తులు, చతుర్దశభువనాలు, దశావతారాలు, అగ్నికళలు, అష్టవసువులు, త్రిమూర్తులు, త్రిశక్తులు, వామజ్యేష్ఠరౌద్రి, సృష్టిస్థితిలయాలు, షోడశనిత్యలు, తిథులు, అక్షరాలు ఈ రకంగా జగత్తంతా అందులో ఉంది. అందుచేతనే పరమేశ్వరి సర్వశక్తిమయి అనబడింది.

మంత్రశాస్త్రం గనక చూసినట్లైతే మణిద్వీపంలో సప్తకోటి మంత్రాలు, మహావిద్యలు అన్నీ ఒక రూపుదాల్చి పరమేశ్వరిని సేవిస్తుంటాయి.

దేవికి ఇరుప్రక్కలా శంఖపద్మనిధులు, బంగారము, రతనాలతో కూడిన నదులు ప్రవహిస్తుంటాయి. దేవి చుట్టు ప్రక్కల నవవిధులు ఉంటాయి. అవి

| | | |
|---|---|---|
| 1. కాళము | 4. మాణవకము | 7. శంఖము |
| 2. మహాకాళము | 5. వైసర్పము | 8. పద్మము |
| 3. పాండుకము | 6. సర్వరత్నము | 9. పింగళకము |

పరమేశ్వరిని వర్ణించేటప్పుడు

**కోటి సూర్య ప్రతీకాశాం చంద్రకోటి సుశీతలాం**

ఈ జగత్తు కంతటినీ తన యొక్క కాంతితో ప్రజ్వలింపచేసేవాడు సూర్యుడు. అతడే ప్రాణదాత. ఇక చంద్రుడు చల్లదనాన్నిస్తాడు. అటువంటి కొన్ని కోట్లకొలది సూర్యుల కాంతితో, చంద్రులచల్లదనంతో ఆ దేవి ప్రకాశిస్తున్నది.

ఈ జగత్తులో శక్తివంతమైనవి ఏవైతే ఉన్నాయో అవి అన్నీ ఆమే, గీతలోని 10వ అధ్యాయంలోని 22, 23 శ్లోకాలలో భగవానుడు చెప్పినట్లుగా

**వేదానాం సామవేదోఽస్మి దేవానాం అస్మి వాసవః ।**
**ఇంద్రియాణాం మన శ్చాస్మి భూతానాం అస్మి చేతనా ॥**
**రుద్రాణాం శంకర శ్చాస్మి । విత్తేశో యక్షరక్షసాం ।**
**వసూనాం పావక శ్చాస్మి । మేరు శ్శిఖరిణా మహమ్ ॥**

వేదాలలో సామవేదాన్ని నేనే, దేవతలలో ఇంద్రుడు నేనే. ఇంద్రియాలలో మనస్సును, భూతములందు చైతన్యము, ఏకాదశరుద్రులలో శంకరుడను, యక్షులలో కుబేరుడను, అష్టవసువులలో అగ్ని అనువాడను, పర్వతశిఖరములలో మేరువును నేనే.

ఈరకంగా జగత్తులో గొప్పశక్తి కలది ఏదైతే ఉన్నదో అది ఆ పరమేశ్వరియే.

లక్ష్మీతంత్రమందు "స్వాయంభువకల్పంలో నేను సకలదేవతల హితము కొరకు మహాలక్ష్మిగా అవతరించి మహిషమర్దినిని అవుతాను. నా శక్తి లేశములే దేవతల శరీరములవుతాయి. నాశక్తులే దేవతల ఆయుధములవుతాయి" అని చెప్పబడింది.

కాబట్టి అన్నిరకాల శక్తులు గలది కాబట్టే ఆ పరమేశ్వరి సర్వశక్తిమయి అని పిలువబడుతోంది.

## 200. సర్వమంగళా

అన్నిరకాలయిన శుభములు గలది. దేవీ పురాణంలో

**సర్వాణి హృదయస్థాని మంగళాని శుభాని చ ।**
**ఈప్సితాని దదాతీతి తేన సా సర్వమంగళా ॥**
**శోభనాని చ శ్రేష్ఠాని యా దేవీ దదతే హరే ।**
**భక్తానాం ఆర్తిహారిణీ తే నేయం సర్వమంగళా ॥**

హృదయమందు గల సకల శుభములను ఒసగునది కాబట్టి ఆమె సర్వమంగళ అంటే సౌభాగ్యచిహ్నమైన అన్నిరకాల శుభాలను ఇచ్చేది. అంతేకాకుండా భక్తుల కష్టాలను తీర్చి వారికి శుభమును కలుగచేసేది. సర్వమంగళ.

**సర్వమంగళ మాంగల్యే ! శివే! సర్వార్థ సాధకే !**
**శరణ్యే! త్ర్యం బకే దేవి ! నారాయణి నమోఽస్తు తే ॥**

బంగారము, అగ్ని, గోవు, బ్రాహ్మణుడు, నెయ్యి, సూర్యుడు, పుణ్యస్త్రీ, తులసిపత్రము, పుష్పము ఇత్యాదులు మంగళద్రవ్యాలు. వీటన్నింటినీ ప్రసాదించేది. అంటే దేశం ధనధాన్యాలతో, భోగభాగ్యాలతో, సుఖశాంతులతో, సకలైశ్వర్యాలతో, పుణ్యస్త్రీలతో ఎల్లకాలము కళకళలాడుతుండేటట్లుగా చూసేది.

వర్ణాశ్రమ ధర్మాలు పాటించే వారి మనోరథమును ఈడేర్చేది. సర్వులకు సర్వ శుభాలను చేకూర్చేది. కాబట్టే ఆ దేవి సర్వమంగళ అనబడుతుంది.

## 201. సద్గతిప్రదా

మానవుడు చేసిన కర్మలననుసరించి వారికి సద్గతులు ప్రసాదించునది. సాధకుని యొక్క సాధనను బట్టి అన్నిరకాల ముక్తులను ప్రసాదించునది. ముక్తి 5 రకాలు.

1. మణిపూరంలో దేవిని అర్చించే వారికి 'సార్షిరూపముక్తి'.
2. అనాహతంలో దేవిని అర్చించేవారికి 'సాలోక్యముక్తి'
3. విశుద్ధిచక్రంలో దేవిని అర్చించే వారికి 'సామీప్యముక్తి'
4. ఆజ్ఞాచక్రంలో దేవిని అర్చించే వారికి 'సారూప్యముక్తి'
5. సహస్రారంలో దేవిని అర్చించే వారికి 'సాయుజ్యము'

లభిస్తాయి. ఇవేకాక భక్తులకు వారివారి కర్మానుసారము స్వర్గనరకాలు ప్రాప్తిస్తాయి. స్వర్గసుఖాలు ఎంతకాలం అనుభవించాలి ? తిరిగి ఎప్పుడు జన్మించాలి ? అనేది నిర్ణయించేది కూడా ఆ పరమేశ్వరే. ఈ రకంగా ఆ దేవి మానవులకు సద్గతులను ప్రసాదిస్తుంది.

పద్మపురాణంలో చతుర్దశినాడు మూడు కాలములందు దేవిని ఎవరైతే పూజిస్తారో వారు పరాస్థానము పొందుతారు అని చెప్పబడింది.

తనకున్నంతలో పుష్కలంగా పూజాద్రవ్యాలు తెచ్చి పరమేశ్వరిని అర్చించినవాడు శివసాన్నిధ్యం పొందుతాడు.

సద్గతులు రెండు రకాలు 1. ఇహము 2. పరము. ఐహికమైన వాంఛలతో పరమేశ్వరిని అర్చించిన వాడికి భోగభాగ్యాలు, సిరిసంపదలు కలుగుతాయి. దేవీభాగవతశ్రవణ ఫలం ఈ రకంగా చెప్పబడింది.

**అపుత్రో లభతే పుత్రాన్ అర్థార్థీ అర్థమాప్నుయాత్ ।**

**విద్యార్థీ ప్రాప్నుయా ద్విద్యాం కీర్తి మండిత భూతలః ॥**

**వంధ్యా వా కాకవంధ్యా వా మృతవంధ్యా చ యాంగనా ।**

**శ్రవణాదస్య త ద్దోషా న్నివర్తేత న సంశయః ॥**

దుర్వాస మహర్షి శ్రీచక్ర పూజాఫలాన్ని చెబుతూ

**ఆశానాం పూరకం చక్రం అర్చకానాం అహర్నిశం**

ఆ దేవిని ఏ కోరికతో అర్చిస్తే అది తీరుతుంది. ఈ జగత్తులో ఇహం కావాలి అంటే పరం ఉండదు. పరం కావాలంటే ఇహం ఉండదు. అనగా భోగభోగ్యాలు కావాలి అంటే ముక్తి ఉండదు. అలాగే ముక్తికావాలంటే భోగభాగ్యాలను త్యజించాలి.

**యత్రా పిభోగో న చ తత్ర మోక్షః యత్రా పి మోక్షోన చ తత్ర భోగః ।**

**శ్రీ సుందరీ సేవన తత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ ॥**

కాని పరమేశ్వరిని అర్చించిన వారికి భోగము, మోక్షము ఏది కావాలంటే అది దొరుకుతుంది.

ఈ జగత్తులో చతుర్దశభువనాలున్నాయి. అందులో భూలోకానికి పైన ఆరు లోకాలున్నాయి. మానవుడు చేసిన కర్మ ఆధారంగా అతడు పైలోకాలకుపోతాడు. అవన్నీ సద్గతులే.

మానవుడు తాను చేసిన కర్మఫలాన్ని బట్టి ఉత్తరజన్మ పొందుతాడు. లోకంలో 84 లక్షల రకాల జీవరాసులున్నాయి. క్రిమికీటకాలు, పశువులు, పక్షులు, జంతువులు, మృగాలు, కుక్కలు, పిల్లులు చివరకు మానవుడు అన్ని జన్మలలోకి మానవజన్మ దుర్లభమైనది.

**జన్మానాం నర జన్మ దుర్లభమ్** అందులోనూ బ్రాహ్మణ జన్మ శ్రేష్ఠమైనది అని చెప్పారు. బ్రాహ్మణుడికి జన్మతోనే కొన్ని వాసనలు వస్తాయి. కొన్ని విషయాలను ప్రత్యేకంగా తెలుసుకోనవసరం లేదు. అంటే జన్మతః కొంత సంస్కారముంటుంది. అయినప్పటికీ వాటిని నిరుపయోగం చేసినట్లైతే పతనం చెందుతాడు.

ఈ రకంగా క్రిమికీటకాల దగ్గర నుంచి ఆలోచనాశక్తి గల మానవుడిగా జన్మిస్తుంది జీవి. ఇవన్నీ ఒక దానికన్న ఒకటి సద్గతులే. ఈ విధంగా జీవులకు సద్గతులు ప్రసాదిస్తుంది. కాబట్టి ఆమె సద్గతిప్రదా అనబడుతోంది.

## 202. సర్వేశ్వరీ

సర్వులకు ఈశ్వరి కాబట్టి సర్వేశ్వరి. ఈశ్వరి అంటే ఆరాధ్యదేవత. పరమేశ్వరి సర్వులకు ఈశ్వరి. **పరాపరాణాం పరమా త్వమేవ పరమేశ్వరీ** పరములకు, అపరములకు కూడా పరమైనది కాబట్టి పరమేశ్వరి.

ఈ జగత్తులో కనిపించే వాటికన్నింటికీ ప్రభువు. నామరూపాత్మకమైన జగత్తుకు నియంత. త్రిమూర్తులను త్రిశక్తులను, ఇంద్రాదిదేవతలను, దిక్పాలకులను వారి వారి స్థానాల యందు నియమించి, వారిచేత ఆరాధింపబడుచున్న ఈశ్వరి. ఆమే సర్వేశ్వరి.

## 203. సర్వమయీ

సర్వమయమైనది. అన్నిటియందు ఉన్నది. శివాది క్షితిపర్యంతము అంతటా తానై ఉన్నది. మొత్తం తత్త్వాలు 51 అని 36 అని భిన్నాభిప్రాయాలున్నాయి.

**తత్త్వాని శివశక్తి శ్చ సదాశివా మహేశ్వరా**
**విద్యేతి పంచశుద్ధాని శుద్ధా శుద్ధాని సప్త చ ।**
**మాయాకళా విద్యారాగః కాలో నియతి రేవచ**
**పురుష శ్చాథా శుద్ధాని ప్రకృతి ర్బుధ్యహంకృతీ**
**మన శ్చేంద్రియ దశకం తన్మాత్ర భూతపంచకం ॥**

ఈరకంగా తత్త్వాలు 36. అవి

| | | |
|---|---|---|
| పంచభూతాలు | – | 5 |
| తన్మాత్రలు | – | 5 |
| జ్ఞానేంద్రియాలు | – | 5 |
| కర్మేంద్రియాలు | – | 5 |
| త్వగాది ధాతువులు | – | 7 |
| మనస్సు | – | 1 |
| ప్రాగ్ పశ్చిమ దక్షిణ ఉత్తర వాయువులు | – | 4 |
| మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు | – | 4 |
| మొత్తం తత్త్వాలు | | 36 |

వీటిలో 11 తత్త్వాలు, మిగిలిన వాటిలో కలిసిపోతున్నాయి. అందుచేత తత్త్వాలు 25 అవుతాయి అని శంకరులవారన్నారు. ఈ తత్త్వాలన్నింటిలోను ఇమిడి ఉన్నది ఆ పరమేశ్వరి. అందుకే ఆమె సర్వమయీ అనబడింది. మాండూక్యోపనిషత్తు

**ఓ మిత్యే తదక్షర మిదగ్ం సర్వం, తస్యోప వ్యాఖ్యానమ్**
**భూతం భవ ద్భవిష్య దితి సర్వమోంకారవ । యచ్చాన్యత్**
**త్రికాలాతీతం తద స్యోంకార మేవ**

కంటికి కనిపించే ఈ జగత్తంతా ఓంకార స్వరూపమే. భూత భవిష్య ద్వర్త మాన కాలాలు ఓంకారమే. త్రికాలాతీతమైనది కూడా ఓంకారమే అంటోంది.

అంటే ఈ జగత్తులో సర్వమూ కంటికి కనిపించేది, కనిపించనిది అంతా పరమేశ్వరస్వరూపమే. అందుకే ఆ దేవి సర్వమయీ అని చెప్పబడింది.

## 204. సర్వమంత్రస్వరూపిణీ

అన్ని మంత్రాల యొక్క స్వరూపం గలది ఆ దేవి.

**మననాత్ త్రాయతే ఇతి మంత్రః** మననము చేయుట వలన మననము చేయు వానిని రక్షించునది మంత్రము.

మంత్రాలు మూడురకాలు

1. వైదికమంత్రాలు 2. తాంత్రికమంత్రాలు 3. అపభ్రంశములు

వేదాలలో చెప్పబడ్డ మంత్రాలను వైదికమంత్రాలు అంటారు. అవి జ్ఞానప్రదాలు. ఐహికమైన వాంఛలు తీర్చుకోటానికి ఉపయోగించే మంత్రాలను తాంత్రిక మంత్రాలు అంటారు. సంస్కృతంలో కాకుండా ఇతరమైన భాషలలో హిందీ, తెలుగు, మళయాళీ భాషలలో ఉండే మంత్రాలను అపభ్రంశాలు అంటారు.

**వైదికా ప్రణవైర్యుతాః ప్రణవేన విహీనం తు తాంత్రికా ఏవ ప్రకీర్తితాః**

ఓంకార సహితములైన మంత్రాలన్నీ వైదికమంత్రాలు. ఓంకారములేని మంత్రాలు తాంత్రికములు అని చెప్పబడింది.

మంత్రాలను మళ్ళీ స్త్రీ పురుషనపుంసకమంత్రాలు అని మూడు రకాలుగా విభజించారు. స్వాహా' అనే పదము చివరగలవి స్త్రీమంత్రాలు. 'హాంఫట్' అనే పదం చివర గలవి పురుష మంత్రాలు. 'నమః' అనే పదం చివర గలవి నపుంసక మంత్రాలు. ఇలా కాకుండా

పురుష దేవతలను ఉపాసించే వాటిని మంత్రాలని, స్త్రీ దేవతలను ఉపాసించే వాటిని విద్య అని అంటారు. పరమేశ్వరి ఉపాసన అంతా శ్రీవిద్య అని చెప్పటానికి గల కారణము ఇదే.

ఇక మంత్రాలలో చాలా రకాలున్నాయి. అవి

**మంత్రం ఏకాక్షరాః పిండాః కర్తర్య స్త్ర్యక్షరా మతాః**
**వర్ణత్రయం సమారభ్యా న వార్ణా వథ బీజకాః**
**తతో దశార్ణ మారభ్య యావద్వింశతి మంత్రకాః**
**అత ఊర్ధ్వంగతా మాలా స్తా సుభేదో న విద్యతే ॥**

1. ఒక అక్షరము గల మంత్రాన్ని – పిండముఅని
2. మూడు అక్షరాలు గల మంత్రాన్ని – కర్తరులని
3. మూడు నుంచి తొమ్మిది అక్షరాలు గల మంత్రాలను – బీజములని
4. పది నుంచి ఇరవై అక్షరాలు గల మంత్రాలను – మంత్రాలని
5. ఇరవై కన్న ఎక్కువ అక్షరాలున్న మంత్రాలను – మాలామంత్రమని

అంటారు. వైదిక మంత్రాలు సమయాచారానికి, తాంత్రికమంత్రాలు వామాచారానికి సంబంధించినవి. సప్తకోటి మహామంత్రాలలో ప్రధానమైనవి వైదిక మంత్రాలే. తాంత్రిక

మంత్రాలు అంటే మంత్రంతోపాటుగా తంత్రం అంటే క్రియ కూడా ఉంటుంది. ఈ మంత్రాన్ని ఈ రకంగా చేస్తే త్వరగా సిద్ధిస్తుంది. ఈ ప్రకారంచేస్తే ఫలితం ఎక్కువగా ఉంటుంది. అని తంత్రగ్రంథాలలో చెప్పబడింది.

మంత్రాలు మొత్తం ఏడుకోట్లున్నాయి. ఆ సప్తకోటి మంత్రాలు ఆమ్నాయ దేవతలరూపంలో ఉన్నాయి. ఇవి ఆరు ఆమ్నాయాలు వీటిని షడామ్నాయాలు అంటారు. అవి

1. పూర్వామ్నాయము 3. పశ్చిమామ్నాయము 5. ఊర్ధ్వామ్నాయము
2. దక్షిణామ్నాయము 4. ఉత్తరామ్నాయము 6. అనుత్తరామ్నాయము.

ఈ రకంగా సప్తకోటి మంత్రాలను శంకరభగవత్పాదులు తమ ప్రపంచసార సంగ్రహంలో నిక్షిప్తంచేశారు.

శ్రీవిద్యకు పంచదశి మహామంత్రం గాయత్రి వంటిది కాగా శ్రీవిద్యకు ముఖ్యమైన మంత్రం షోడశాక్షరి.

ప్రతి మంత్రానికి ఋషి, ఛందస్సు, దేవత, బీజము, శక్తి, కీలకము ఉంటాయి. వీటిని షడంగాలు అంటారు.

ఈ మంత్రాల యొక్క స్వరూపమంతా ఆ పరమేశ్వరియే. అందుకే ఆవిడ సర్వమంత్రస్వరూపిణి అనబడుతోంది.

వేదమంత్రాలలో కూడా ఋక్కులు, యజస్సులు, సామములు అని ఉన్నాయి. ఈ మంత్రాలకు కూడా అధి దేవతలుంటారు. మొత్తం వేదాలకన్నింటికీ అధి దేవత వేదమాత ఆ పరమేశ్వరి. కాబట్టి ఆమె సర్వమంత్రస్వరూపిణి అనబడుతోంది.

## 205. సర్వయంత్రాత్మికా

### సర్వేషాం ఘంటార్గళాదీనాం యంత్రాణాం ఆత్మ స్వరూపే వాత్మికా

ఘంటార్గళాది సకల యంత్రములే ఆత్మగా గలది. అసలు యంత్రాలు మూడురకాలు.

1. ప్రతిష్ఠా యంత్రాలు 2. పూజా యంత్రాలు 3. ధారణ యంత్రాలు. యంత్రము దేవతకు ప్రతిరూపము. బిందు వికసనము వల్ల ఏర్పడ్డ తరంగాల రూపము యంత్రము. తరంగాలనాదము యంత్రము. ప్రపంచంలో ఉపాసన చెయ్యబడే ప్రతిదేవతకూ ఒక యంత్రమున్నది. అన్ని యంత్రాలు ఆ పరమేశ్వరి యొక్క ఆత్మస్వరూపాలే.

యంత్రాలన్నింటిలోకీ ముఖ్యమైన యంత్రరాజము శ్రీచక్రము. ఈ శ్రీచక్రము అనేది కేవలము ఒక పూజాగదిలో ఉంచబడే యంత్రం కాదు. ఇది చరాచరజగత్తుకూ ప్రతీక. విశ్వమానవాళికి ప్రతీక. అందుకే శ్రీచక్రాన్ని గనక అర్చించినట్లైతే చరాచరజగత్తునూ అర్చించినట్లే. విశ్వమానవాళినంతటినీ అర్చించినట్లే. ఇటువంటి వివరణ గల యంత్రం మంత్ర శాస్త్రంలో ఇంకొకటి లేదు. మిగిలిన యంత్రాలను అర్చిస్తే కార్యసిద్ధి జరగుతుంది. లేదా మంత్రం సిద్ధిస్తుంది. కాని శ్రీచక్రాన్ని అర్చిస్తే విశ్వమానవ కళ్యాణం చేకూరుతుంది. అందుకే అది శ్రీచక్రరాజమయింది. దీనిమీద మరిన్ని వివరాలకు నా చే వ్రాయబడిన శ్రీచక్ర సర్వస్వము చూడండి.

ఈ రకంగా అన్ని యంత్రాలు ఆమె హృదయంలోనే ఉంటాయి. కాబట్టి ఆ పరమేశ్వరి సర్వయంత్రాత్మిక.

## 206. సర్వతంత్రరూపా

సర్వతంత్రములు శరీరముగా గలది. సర్వతంత్రాలచేత నిరూపించబడ్డది. తంత్రము అంటే విధి. కర్మకాండ. ఉపాసనా విధానము. సంకల్పంచేసిన దగ్గర నుంచి పరిసమాప్తమయ్యే దాకా చేయవలసిన విధివిధానము. దేవతల తృప్తికోసము, తమ యొక్క కోరికల సాధనకోసము ఈ తంత్రాలు చెప్పబడ్డాయి. ఇవన్నీఐహికానికి సంబంధించినవి. అంటే ఈ తంత్రాల వల్ల ఈ లోకంలో మనకు కావలసిన వాటిని సాధించుకోవచ్చు. శంకరభగవత్పాదుల వారు తమ సౌందర్యలహరిలోని 31వ శ్లోకంలో

**చతుష్షష్ట్యా తంత్రైః సకల మతిసంధాయ భువనం**
**స్థిత స్తత్తత్సిద్ధి ప్రసవ పరతంత్రైః పశుపతిః**
**పున స్త్వధాన్నిర్బందా దఖిల పురుషార్థైక ఘటనా**
**స్వతంత్రం తే తంత్ర క్షితితల మవాతీతరదిదమ్ ॥**

ఓ భగవతీ ! ఆ పరమేశ్వరుడు 64 రకాల తంత్రాలను ఉపదేశించాడు. అవి సకల ఫల ప్రదాయకము ఐహిక దాయకము అయి పండితులను కూడా భ్రమింప చేస్తున్నాయి. అందుచేత పరమశివుడు మళ్ళీ నీ నిర్బంధం మీద మోక్షప్రదమైన శ్రీవిద్యా తంత్రాన్ని ఉపదేశించాడు.

అంటే ఐహికఫల సాధనకు 64 తంత్రాలున్నాయి. వీటిని గతంలో వివరించటం జరిగింది. గౌడపాదులవారు తమ సుభగోదయస్తుతిలోని 18వ శ్లోకంలో

**చతుష్షష్టి స్తంత్రా ణ్యపి కులమతం నిందిత మభూ**
**ద్యదేత న్మిశ్రాఖ్యం మత మపి భవే న్నిందిత మిహ**
**శుభాఖ్యాః పంచైతాః శ్రుతి సరణిసిద్ధాః ప్రకృతయో**
**మహావిద్యా స్తాసాం భవతి పరమార్థో భగవతీ ॥**

శాక్తేయంలో కౌళాచారులకు 64, మిశ్రమాచారులకు 8 తంత్రాలున్నాయి. సమయాచారులకు మాత్రం 'శుభాగపంచకము' ప్రామాణికము.

తంత్రము అంటే శాస్త్రము. వేదాలన్నీ పరమేశ్వరుని ముఖం నుంచి వచ్చినాయి. వాటిని ఆధారంగా చేసుకుని వచ్చినవి తంత్రాలు. ఇవి వేద సమ్మతాలు. అయితే కొన్ని తంత్రాలు వేదాలనాధారంగా చేసికొనిలేవు. కాబట్టి అవి వేదసమ్మతములు కాదు. వేదాలు ఉపాసనా విధానాన్ని చెబితే, తంత్రాలు వాటి ఆచరణ విధానాన్ని చెప్పాయి. **తన్యతే విస్తార్యతే జ్ఞానం ఇతి తంత్రః** జ్ఞానాన్ని విస్తరింపచేసే శాస్త్రమే తంత్రము. త్రాణ అంటే జాగరూకత, శక్తి కలిగించునది తంత్రము. తంత్రాలు మూడురకాలుగా ఉన్నాయి. 1. శైవతంత్రాలు 2. వైష్ణవతంత్రాలు 3. శాక్తేయతంత్రాలు. ఇవి మళ్ళీ సాత్వికము రాజసము తామసము అని మూడు రకాలు. అయితే

| | | |
|---|---|---|
| సాత్వికులు | – | వైదిక దేవతలను |
| రాజసులు | – | యక్ష రాక్షసులను |
| తామసులు | – | భూత ప్రేత పిశాచాలను పూజిస్తారు. |

వీటిలో మళ్ళీ

| | | |
|---|---|---|
| సాత్వికుల గ్రంథాలు | – | తంత్రాలు |
| రాజసుల గ్రంథాలు | – | యామళాలు |
| తామసులగ్రంథాలు | – | డామరాలు |

ఈ రకంగా ఉన్న ఇహ పరసాధనకు తోడ్పడే తంత్రాలన్నీ ఆ పరమేశ్వరి స్వరూపాలే. అందుచేతనే ఆ దేవి సర్వతంత్రరూపా అనబడుతోంది.

## 207. మనోన్మనీ

మనస్సు కూడా పనిచేయనటువంటి స్థితి. అదే ఉన్మన స్థితి. దాన్నే మనోన్మనీ స్థానము అంటారు. ఆజ్ఞా చక్రం నుంచి లెక్కపెట్టినట్లైతే తొమ్మిది సూక్ష్మచక్రాలు ఉంటాయి. అవి.

**బిందౌ తదర్థం రోదిన్యాం నాదో నాదా న్త ఏవ చ ।**
**శక్తిః పున ర్వ్యాపికాయాం సుమనా ఉన్మన గోచరే ॥**

ఈ స్థానాలను గతంలో చెప్పటం జరిగింది. సాధకుడు ప్రాణాయామం చేసినప్పుడు సుమన చేరే వరకు మనసు పనిచేస్తూనే ఉంటుంది. ఆ తరువాత మనసు కూడా పనిచేయని స్థితి ఉన్మన.

యోగినీ హృదయంలో ఉన్మన లక్షణాలను చెబుతూ

**సుమనా బిందు విలస దృజురేఖా తథోన్మనా ।**
**శక్త్యాదీనాం వపుః స్ఫూర్జ ద్ద్వాదశాదిత్య సన్నిభమ్ ॥**

బిందువు పైభాగం ప్రకాశించే తిన్నని రేఖయే సుమన. ఆ తరువాతది ఉన్మన. అక్కడ మనస్సు పనిచెయ్యదు. ఇది బ్రహ్మరంధ్రానికి క్రిందుగా ఉంటుంది. స్వచ్ఛంద్రతంత్రంలో

**యా శక్తిః కారణత్వేన తదూర్ధ్వం చోన్మనీ స్మృతా ।**
**నాత్ర కాలకలామానం న తత్త్వం న చ**
**దేవతా సునిర్వాణం పరం శుద్ధం రుద్ర వక్త్రం**
**తదుచ్యతే శివశక్తి రితిఖ్యాతా నిర్వికల్పా నిరంజనే**

కారణాలకు కారణమైన శక్తి ఉన్మని. దానియందు కాలము లేదు. కలలేదు, తత్త్వము లేదు, దేవత లేదు. పరిపూర్ణ స్వాతంత్ర్యము పరము, రుద్రవక్త్రము అయి ఉన్నది ఇదే శివశక్తిగా ప్రసిద్ధము. ఇది నిర్వికల్పము నిరంజనము అని చెప్పబడింది.

**రుద్రాధ్యాయంలో వామదేవాయనమోౖ.....మనోన్మనాయనమః** అంటారు. మనోన్మనుడైన శివుని యొక్క శక్తి ఉన్మన అని చెప్పబడింది.

యోగశాస్త్రంలో ఉన్మన గురించి చెబుతూ

**నేత్రే య యోన్మేషనిమేషయుక్తే**
**వాయుర్యయా వర్జితరేచపూరః ।**
**మనశ్చ సంకల్ప వికల్ప శూన్యం**
**మనోన్మనీ సా మయి సన్నిధత్తాం ॥**

కనులు ఉన్మేష నిమేషములతో కూడి ఉండగా, వాయువు రేచక పూరకములు లేక ఆగి ఉన్నప్పుడు, మనస్సు సంకల్ప వికల్ప రహితంగా ఉండే స్థితే ఉన్మన. అట్టి స్థితి నాకు కలుగుగాక.

బృహన్నారదీయంలో ధ్యాన ధ్యాతృ ధ్యేయ భావాలు పూర్తిగా నశించగా కేవలము జ్ఞానామృతము నాస్వాదించుటయే ఉన్మన స్థితి అన్నారు.

ఈ రకంగా చూస్తే సాధకుడు ప్రాణాయామం చేస్తూ అంటే ఉఛ్వాస నిశ్వాసాలను బంధించి, ఇలా చెయ్యటానికి అనేక పద్ధతులున్నాయి. వామకేశ్వరతంత్రము, తంత్రసారములలో చెప్పినపద్ధతులు గతంలో వివరించబడ్డాయి. కుండలినీశక్తిని జాగృతం చేసి, ఊర్ధ్వముఖంగా ప్రయాణం చేయించాలి. అప్పుడది గ్రంథిత్రయాన్ని ఛేదించి అక్కడ నుండి సూక్ష్మచక్రాల ద్వారా ప్రయాణం చేస్తుంది. ఆ మార్గంలో ఎనిమిదవదయిన సుమన దాటిన తరువాత ఉండేదే ఉన్మన. అక్కడ మనస్సు పనిచెయ్యదు. సంకల్ప వికల్పాలుండవు. దేవత ఉండదు. అటువంటి స్థితి. ఆ స్థానం దాటిన తరువాత మహాబిందువు ఉంటుంది. ఆ స్థితిలో పరమేశ్వరస్వరూప మొక్కటే గోచరిస్తుంది. మనస్సు కూడా పనిచెయ్యని స్థితిలో ఉంటుంది. కాబట్టి ఆ పరమేశ్వరి మనోన్మని అనబడుతుంది.

## 208. మహేశ్వరీ

సృష్టికి ముందు ఈ జగత్తంతా పరమేశ్వరునిలో లీనమయి ఉంది. ప్రళయం తరువాత మళ్ళీ పరమేశ్వరునిలోనే లీనమవుతుంది. అదే ఓంకారము. పరమేశ్వర స్వరూపము మాండూక్యోపనిషత్తులో మొదటి మంత్రంలో

**ఓమిత్యేతదక్షరమిదగ్ంసర్వం** చరాచరజగత్తు అంతా ఓంకారంలోనే నిండి ఉన్నది. అని చెప్పబడింది. ఓం కారమనేది సహస్రారంలో ఉన్నది దాని నుంచే భాషకు గల మిగిలిన అక్షరాలన్నీ ఉద్భవించి షట్చక్రాలలోనూ చేరాయి. ఈ అక్షరాల ప్రతిరూపమే ఓంకారము. అదే పరమేశ్వర స్వరూపము. నిరాకారుడు నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. అతని నామరూపాలే ఓంకారము.

అకార ఉకార మకారముల యొక్క సమిష్టిరూపమే ఓం కారము. అకారము – సత్వగుణము, ఉకారము – రజోగుణము, మ కారము – తమోగుణము. ఈ రకంగా పరమేశ్వరుడు త్రిగుణాత్మకుడు. త్రిగుణాతీతుడు కూడా. వాతుల శుద్ధ ఆగమములో ఇరవైఐదు తత్త్వాలకు అతీతుడైనవాడు పరమేశ్వరుడు అని చెప్పబడింది. గౌడపాదులవారు తమ సుభగోదయస్తుతిలోని 5వ శ్లోకంలో

**పృథివ్యాపస్తేజః పవన గగనే తత్ప్రకృతయః**
**స్థితా స్తన్మాత్రా స్తా విషయదశకం మానస మితి**

**తతోమాయావిద్యా తదను చ మహేశః శివ ఇతి**
**పరం తత్త్వాతీతం మిలిత వపు రిందోః పరకళా ॥**

పంచభూతాలు - 5, తన్మాత్రలు - 5, ఇంద్రియాలు - 10, మనస్సు - 1, మాయా, శుద్ధవిద్ధ, మహేశ్వరుడు, సదాశివుడు వెరసి 25 తత్త్వాలున్నాయి అన్నారు.

అయితే ఈ 25 తత్త్వాలు శ్రీచక్రంలో ఉన్నాయి. వీటికి అతీతమైన 26వ తత్త్వమే పరమేశ్వరి.

భైరవయామళంలో శ్రీచక్రాన్ని వివరిస్తూ

**శ్రీచక్రం త్రిపుర సుందర్యాః బ్రహ్మాండాకార మీశ్వరీ**
**పంచభూతాత్మకం చైవ తన్మాత్రాత్మక మేవ చ**
**ఇంద్రియాత్మక మేవం చ మనస్తత్త్వాత్మకం తథా**
**మాయాదితత్త్వరూపం చ తత్త్వాతీతం చ బైందవమ్ ॥**
**బైందవే జగదుత్పత్తి స్థితి సంహారకారిణీమ్ ।**
**సదాశివేన సంపృక్తా తత్త్వాతీతా మహేశ్వరి ॥**

ఈ 25 తత్త్వాలకు అతీతమైనది బిందువు. ఆ బిందువునందే సృష్టి స్థితి లయాలకు కారణమైన మహేశ్వరి ఉంటుంది.

**మాయాంతు ప్రకృతిం వింద్యా న్మాయినంతు మహేశ్వరమ్**

మాయ అనేది ప్రకృతి. మాయ కలవాడు మహేశ్వరుడు. జగత్తులోని జీవరాశికి, వాటి కర్మానుసారము ఉత్తర జన్మలనిచ్చేది మహేశ్వరి.

## 209. మహాదేవీ

మహతీ గొప్పదైన. మహత్త్వము గొప్పదనము. మహా అనే విశేషణం గొప్పదనాన్ని సూచిస్తుంది. మహాదేవి – ప్రమాణానికి కొలతకు అందని శరీరము గలది. దేవీపురాణంలో

**బృహ దస్య శరీరం య దపమేయం ప్రమాణతః**
**ధాతు ర్మ హేతి పూజాయాం మహాదేవీ తతః స్మృతః ॥**

ఆమె శరీరము అపారము. ఎట్టి ప్రమాణముచేతను కొలవబడనిది. పూజింపదగినది అని చెప్పబడింది. లింగపురాణంలో సకల సౌమ్య వస్తువులకు ప్రకృతిగా ప్రసిద్ధుడయిన సోమాత్మకుడైన దేవుడే మహాదేవుడు అని చెప్పబడింది.

వాయుపురాణంలో శివుని యొక్క అష్టమశరీరము చంద్రుడు. అటువంటి చంద్రాత్మక శివునకు భార్య రోహిణి. అతని కుమారుడు బుధుడు అని ఉన్నది. ఈ రోహిణీదేవి గండకీ నదీ తీరమున చక్రతీర్థానికి అధిదేవత.

దేవీభాగవతంలో దేవతలంతా తారకాసుర సంహారం కోసం పరమేశ్వరిని ప్రార్థించగా చైత్రశుద్ధ నవమి శుక్రవారము ఆమె వారికి సాక్షాత్కరించింది.

**నైవ చోర్ధ్వం న తిర్యక్చ న మధ్యే పరిజగ్రభత్ ।**
**ఆద్యంతరహితం తత్తు నహస్తాద్యంగసంయుతం ॥**

పైన క్రింద నడుమ అడ్డము అనే తేడా లేకుండా కాంతులు ప్రసరిస్తున్నది. దానికి ఆద్యంతాలు లేవు. కాళ్ళు చేతులు లేవు. శరీరం అనేక పనులు చేస్తుంది. వినటం, మాటలాడటం, చూడటం, తాకటం. ఈ రకంగా వీటితో ప్రతిపనికి ఒక దేవత చొప్పున ఉన్నది. ఈ దేవతల అందరి యొక్క సమష్టి రూపమే మహాదేవి.

## 210. మహాలక్ష్మీః

అష్టాదశ శక్తిపీఠాలను గురించి గతంలో చెప్పటం జరిగింది. అందులో **కొల్హాపుర్యాం మహాలక్ష్మీ** కొల్హాపూరు (కరవీరము) నందున్న అధిదేవత మహాలక్ష్మి. ఈవిడ స్థితి కారకుడైన విష్ణువు యొక్క భార్య. **కరవీరం కలౌకోలా పురమితిప్రసిద్ధం.** కరవీరమ్ కలియుగంలో కోల్హాపురమని ప్రసిద్ధి చెందినది. మైలారతంత్రంలో

**మహాలసనామకం దైత్యం స్యతి క్షపయతీతి చ ।**
**మహాలసా మహాలక్ష్మీ రితి చ ఖ్యాతి మాగతా ॥**

మహాలసుడు అనే రాక్షసుణ్ణి సంహరించింది. కాబట్టి ఆమె మహాలస మహాలక్ష్మి అని ప్రసిద్ధి చెందింది. ఆమె పడమటి సముద్రతీరాన సహ్యాద్రి చరియలో ఉన్నది. శివపురాణంలో

**తస్యాం అంకమండలారూఢాం శక్తి ర్మాహేశ్వరీ పరా ।**
**మహాలక్ష్మీ రితి ఖ్యాతా శ్యామా సర్వమనోహరా ॥**

శివుని అంక భాగమందున్న మహేశ్వరీ శక్తియే మహాలక్ష్మి. ఆమె శ్యామ, సర్వమనోహరి అని చెప్పబడెను. మార్కండేయ పురాణంలో

**సర్వస్యాద్యా మహాలక్ష్మీః త్రిగుణా సా వ్యవస్థితి**

అన్నింటికి ఆదియైనది మహాలక్ష్మి. ఆమె త్రిగుణాత్మిక సప్తశతిలో మహిషాసురుని సంహరించినదేవి మహాలక్ష్మి.

ధౌమ్యుడు కన్యారూపం చెబుతూ **త్రయోదశవర్షాత్మక కన్యారూపా** అన్నాడు. అంటే 13 సంవత్సరాల బాలిక కన్య అనబడుతుంది.

ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి, ధైర్యలక్ష్మి, విద్యాలక్ష్మి............. అని ఎనిమిదిమంది దేవతలున్నారు. వీరు అష్టలక్ష్ములు.

జీవులకు వారివారి కర్మానుసారము సిరిసంపదలనందించేది మహాలక్ష్మి.

**నమఽ స్తే స్తు మహామాయే శ్రీపీఠే సురపూజితే ।**
**శంఖచక్రగదాహస్తే మహాలక్ష్మీ ర్నమోఽ స్తు తే ॥**

**నమ స్తే గరుడారూఢే ! డోలాసురభయంకరి ! ।**
**సర్వపాపహరే ! దేవి ! మహాలక్ష్మీ ర్నమోస్తుతే ॥**

**అస్యశ్రీ మహాలక్ష్మీ మహామంత్రస్య దక్షప్రజాపతి ఋషిః । గాయత్రీ ఛందః । శ్రీం బీజం । హ్రీం శక్తిః । నమః కీలకం । శ్రీ మహాలక్ష్మీ ప్రసాదేన మమ సకలైశ్వర్య ప్రాప్తిద్వారా మనోవాంఛా ఫలసిద్ధ్యర్థే జపేవినియోగః ॥**

**న్యాసము :**

**శ్రీం హ్రీం శ్రీం కమలే శ్రీం హ్రీం శ్రీం ।**
**శ్రీం హ్రీం శ్రీం కమలాలయే శ్రీం హ్రీం శ్రీం ।**
**శ్రీం హ్రీం శ్రీం ప్రసీద శ్రీం హ్రీం శ్రీం ।**
**శ్రీం హ్రీం శ్రీం ప్రసీద శ్రీం హ్రీం శ్రీం ।**
**శ్రీం హ్రీం శ్రీం మహాలక్ష్మ్యై శ్రీం హ్రీం శ్రీం ।**
**శ్రీం హ్రీం శ్రీం నమః శ్రీం హ్రీం శ్రీం ॥**

**ధ్యానము** : సింధూరాభాం చ పద్మస్థాం పద్మపత్రం చ దర్పణం ।
అర్ఘపాత్రం చ దధతీం సద్ధారముకుటాన్వితాం ।
నానాదాసీపరివృతాం కాంచీకుండలమండితాం ।
లావణ్యభూమికాం వందే సుందరాంగద బాహుకాం ॥

**మంత్రము** : ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీద ప్రసీద శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మ్యై నమః

## 211. మృడప్రియా

మృడ అంటే సుఖము, ఆనందము అని అర్థం. ఆనందాన్ని ప్రియముగా గలిగినటువంటిది. ఆనందము అనేది అనేకరకాలుగా కలుగుతుంది. ఒక రూపాన్ని చూసినప్పుడు కలిగే ఆనందం రూపానందం. అలాగే రసానందం. శ్రవణానందం, స్పర్శానందం. ఆనందము అనేది మూడు గుణాలతో కలిసిఉంటుంది. శరీరంలో పంచకోశాలున్నాయి. వాటిలో అఖరుది ఆనందమయకోశము.

ఈ ఆనందము శాశ్వతమైనది. అశాశ్వతమైనది అని రెండు రకాలు. ఐహికకర్మలవల్ల కలిగే ఫలితాలవల్ల వచ్చేది అశాశ్వతమైన ఆనందం. రెండవది పరలోకానందం ఇది శాశ్వతమైనది. ఇది అనేకరకాలు మానుషానందం. మానవగంధర్వానందం, దేవగంధర్వానందం, పితరానందం, అజానజ దేవానందం, దేవానందం, ఇంద్రానందం, బృహస్పతి ఆనందం, ప్రజాపతి ఆనందం, ఆ తరువాత అఖరుది బ్రహ్మానందం. పరమేశ్వరి పరబ్రహ్మస్వరూపమే. అందుచేత ఆనందమే ప్రియముగా గలది – పరమేశ్వరి. ఆమెయే మృడప్రియ.

## 212. మహారూపా

గొప్పదైనటువంటి, శ్రేష్టమైనటువంటి రూపము గలది. విష్ణుపురాణంలో ఈ విధంగా ఉంది.

**పరస్య బ్రహ్మణో రూపం పురుషః ప్రథమం ద్విజ ।**
**వ్యక్తావ్యక్తే తథైవాన్యే రూపే కాల స్థథాపరం ॥**

పరబ్రహ్మ యొక్క ప్రథమరూపము పురుషుడు. వ్యక్తావ్యక్త రూపము రెండవది. కాలము మూడవది. ఈ మూడు రూపాలే సృష్టి, స్థితి, లయాలకు కారణాలు.

పరమేశ్వరి విరాట్స్వరూపిణి. ఆమే పరబ్రహ్మ స్వరూపము. ఈ జగత్తంతా నామరూపాత్మకమైనది. రూపం అంటూ ఉంటే ఒక నామం ఉండి తీరుతుంది. అంతేకాని నామంలేని రూపం మాత్రం ఉండదు. అసలు ఈ సృష్టి ఎలా జరిగింది. ముందుగా అవ్యక్తము. అవ్యక్తము నుంచి – మహత్తత్త్వము, దాని నుంచి – అహంకారము, అక్కడి నుండి నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. ఇదంతా మహద్రూపం. ఆ పరమేశ్వరి నుంచి ఏర్పడినదే సువిశాలమైన ఈ జగత్తు. అందుకనే ఆమె మహారూప.

## 213. మహాపూజ్యా

**మహతీ చసా పూజ్యా** మహాపూజ్యా – గొప్పగా పూజింపదగినది. బ్రహ్మోపేంద్ర మహేంద్రాదులచే పూజింపబడునది. పూజలు అనేకరకాలుగా ఉంటాయి.

**1. పంచోపచారపూజ :** జపంచేసేసమయంలో చేసేది లమిత్యాది పంచపూజలు

లం – పృథివీ తత్త్వాత్మికాయై శ్రీ పరదేవతాయై గంధం పరికల్పయామి.

హం – ఆకాశ తత్త్వాత్మికాయై శ్రీపరదేవతాయై పుష్పం సమర్పయామి

యం – వాయుతత్త్వాత్మికాయై శ్రీ పరదేవతాయై ధూపం మాఘ్రాపయామి

రం – తేజస్తత్త్వాత్మికాయై శ్రీ పరదేవతాయై దీపం సమర్పయామి

వం – అమృత తత్త్వాత్మికాయై శ్రీ పరదేవతాయై నైవేద్యం సమర్పయామి

**2. షోడశోపచారపూజ :** ఇందులో పదహారు రకాల ఉపచారాలుంటాయి. అవి వరుసగా

1. ఆవాహనం
2. ఆసనం
3. పాద్యం
4. అర్ఘ్యం
5. ఆచమనం
6. స్నానం
7. వస్త్రం
8. యజ్ఞోపవీతం/ కంఠసూత్రం
9. శ్రీచందనం
10. పూజ అలంకారము
11. ధూపం
12. దీపం
13. నైవేద్యం
14. తాంబూలం
15. నీరాజనం
16. మంత్రపుష్పం

**3. చతుష్షష్ట్యుపచారికపూజ :** పరమేశ్వరిని 64 రకాల ఉపాచారాలతో పూజిస్తారు. వాటిని 235వ నామంలో వివరించటం జరిగింది.

**4. ఆవరణపూజ :** యంత్రాలను పూజించేటప్పుడు అందులోని వివిధ ఆవరణలలోని దేవతలను పూజచేస్తారు. శ్రీచక్రానికి నవావరణ పూజ అలాంటిదే.

**5. వైదికపూజ :** వేదంలో చెప్పిన విధంగా వేదమంత్రాలతో చేసే పూజ. ఇది అగ్రవర్ణాలవారు మాత్రమే అంటే వేదం చదవటానికి అర్హత ఉన్నవారు మాత్రమే చేస్తారు.

**6. పౌరాణిక పూజ :** ఈ రకమైన పూజలో మంత్రభాగం ఉండదు. కేవలము శ్లోకభాగం మాత్రమే ఉంటుంది.

**7. తాంత్రికపూజ :** ఐహిక వాంఛలతో చేసే పూజ ఇది. దీనిలో మంత్రంతోపాటుగా క్రియ కూడా ఉంటుంది.

**8. అంతఃపూజ :** ఈ పద్ధతిలో శరీరంలోని షట్చక్రాలలోను పరమేశ్వరుణ్ణి ఆరాధిస్తారు. దీన్ని మోక్షవాదులు మాత్రమే చేస్తారు.

పరమేశ్వరి సర్వదేవతా స్వరూపిణి. కాబట్టి అన్నిరకాలుగాను ఆమెను పూజించవచ్చు. వసంత నవరాత్రులలో **రామోలలితాంబికాయ** అన్నారు కాబట్టి పరమేశ్వరిని రాముని రూపంలో పూజిస్తారు. అలాగే కృష్ణుడు, ఆంజనేయుడు ఇలా వివిధరూపాలలో పూజించేది కూడా ఆ పరమేశ్వరినే. అందుచేతనే ఆమె మహాపూజ్యా అనబడుతుంది.

## 214. మహాపాతకనాశినీ

మహాపాతకాలు - ఇవి ఘోరమైన తప్పిదాలు. ఇవి మొత్తం ఐదు. వీటినే పంచ మహాపాతకాలు అంటారు. అవి

| | | |
|---|---|---|
| 1. స్వర్ణస్తేయము | - | బంగారం దొంగిలించటము |
| 2. సురాపానము | - | మద్యము త్రాగటము |
| 3. బ్రహ్మహత్య | - | సద్బ్రాహ్మణుని చంపటము |
| 4. గురుపత్ని సంగమము | - | గురువుగారి భార్యతో కలియటము |
| 5. మహాపాతకసహవాసము | - | పైన చెప్పిన పాపాలు చేసిన వారితో స్నేహము చెయ్యటం |

బ్రహ్మాండ పురాణంలో

**తస్య అఖిల పాపస్య జ్ఞానతో ఽజ్ఞానతోపి వా**
**ప్రాయశ్చిత్తం పరం ప్రోక్తం పరాశక్తే పదస్మృతి**

తెలిసిగాని తెలియకగాని చేసిన పాపాలన్నీ పరాశక్తి పాద ధ్యానం చెయ్యటంవల్ల పటాపంచలైపోతాయి. అని చెప్పబడింది.

బ్రహ్మోత్తరపురాణంలో

**బ్రహ్మహత్యాశతం వాపి శివపూజా వినాశయేత్**

వంద బ్రహ్మహత్యలు చేసినప్పటికీ ఒక్క శివపూజతో ఆ పాపమంతాపోతుంది.

పాపాలు అనేకవిధాలు. మహాపాతకాలు, ఉపపాతకాలు, సంకలీకరణములు, అపాత్రీకరణములు మొదలైనవి. ఈ పాపాలు పోవటానికి ప్రతిదానికీ ఒక ప్రాయశ్చిత్తం చెప్పారు. వీటినే శాంతికర్మలు అంటారు. ఇందులో ఇంద్రాది దేవతలు 33 మందిని పూజించటం ఉన్నది. సర్వదేవతాస్వరూపము ఆ దేవే కాబట్టి ఆ పూజలన్నీ పరమేశ్వరివే. ఆ పాతకాలు పోగొట్టేది కూడా ఆ దేవియే.

## 215. మహామాయా

బ్రహ్మాది దేవతలను కూడా మోహింపచేయునది. కాబట్టి ఆ పరమేశ్వరి మహామాయ అనబడుచున్నది. మార్కండేయపురాణంలో

**జ్ఞానినా మపి చేతాంసి దేవీ భగవతీ హి సా ।**
**బలా దాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి ॥**

దేవి మహామాయ. జ్ఞానుల యొక్క మనస్సులను కూడా ఆకర్షించి మోహంలో పడేస్తుంది.

కాళికాపురాణంలో జ్ఞానిని కూడా గర్భాన జన్మింపచేసి అతడికి జ్ఞానము లేకుండా చేస్తుంది. పూర్వజన్మల కర్మానుసారము జీవిని పుట్టించి, అతడికి తిండి, బట్ట కల్పించి, నేను, నాది అనే అహంకారమమకారాలను ఇచ్చి, లోభమున త్రోసి, చివరకు కామమునచేర్చి, రేయింబవళ్ళు చింతలు కలిగించి, ఆ జీవిని సుఖదుఃఖాలలో ముంచి తేల్చేదే మహామాయ.

చరాచరజగత్తంతా మాయాశక్తితోనే సృష్టించబడుతోంది. మాయకు పరమేశ్వరికి తేడా లేదు. మాయ నీటిగుంటలో తేలి ఉండే నాచు లాంటిది. నాచును దూరంగా త్రోసివేస్తే వెళ్ళిపోతుంది. కాని మళ్ళీ వచ్చిచేరుతుంది. అలాగే వేదాంతవిచారము, సజ్జన సాంగత్యము చేసినంతకాలము ఈ మాయ మనలను వదిలేసినట్లు కనిపిస్తుంది. కాని ఆ తరువాత వెంటనే వచ్చిచేరుతుంది. అంటే విషయవాంఛల యందు మనసు ఎప్పుడు లగ్నమవుతుందో అప్పుడు మాయ ఆవరించింది అని అర్థం.

జగత్తులో ప్రతిప్రాణీ మాయకు లోబడే ఉంటుంది. పరమేశ్వరుడు ఒక్కడే మాయకు అతీతుడు. పాము కోరల యందు విషం ఉండటంవల్ల పాముకు ఏ అపాయము జరగదు. కాని దాని కాటు తగిలిన ఇతర ప్రాణులకు మాత్రం హాని జరుగుతుంది. అలాగే పరమేశ్వరుణ్ణి ఆవరించి ఉన్నమాయ అతడికి హాని చేయదు.

మాయచే కప్పబడిన మానవుడు, తాను మాయా ప్రభావంలో ఉన్నాను అని తెలుసుకున్నట్లైతే మాయ అతణ్ణి విడిచిపెడుతుంది.

జీవాత్మ పరమాత్మల మధ్య మాయ అనే తెర ఒకటి ఉన్నది. అది పరమాత్మ దర్శనంకానీదు. ఆ తెరను గనుక తొలగించగలిగినట్లైతే పరమాత్మ దర్శనం జరుగుతుంది.

మాయ రెండు విధాలుగా ఉంటుంది. 1. విద్యామాయ. 2. అవిద్యామాయ

1. విద్యామాయ భగవంతుడి సన్నిధికి తీసుకుపోతుంది. ఇది. 1. వివేకము 2. వైరాగ్యము అని రెండు విధాలు. దీనిని ఆశ్రయించిన వారు భగవంతుని శరణు పొందుతారు.

2. అవిద్యామాయ ఇదే అజ్ఞానము. ఇది కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు అని ఆరువిధాలు. దీనివల్లనే మానవుడికి నేను నాది అనే బుద్ధిపుడుతుంది. అందుచేతనే సంసారానికి అతడు బందీ అవుతాడు.

కాని విద్యామాయ వ్యక్తంకాగానే అవిద్యామాయ తొలగిపోతుంది. మురికిగా ఉన్న నీటిలో సూర్యచంద్రుల ప్రతిబింబం కనిపించదు. అలాగే మాయ అనే తెర తొలగిపోయేదాకా నేను నాది అనే అహంకార మమకారాలు నశించవు. పరమాత్మ సాక్షాత్కారం కాదు.

పరమేశ్వరుడు అనే సూర్యుడు భూమిని ప్రకాశింపచేస్తున్నాడు. కాని చిన్న మబ్బు తునక అడ్డుపడితే సూర్యుడు కనిపించడు. అలాగే మాయ అనే తెర పరమేశ్వరుణ్ణి మనం చూడకుండా చేస్తుంది. నిర్మలమైన ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. అలాంటప్పుడు ఒక్కసారిగా ఆకాశం మేఘావృతమైతే సూర్యుడు కనిపించడు. అప్పుడు ఒక్కసారి జ్ఞానజ్యోతులనే పెనుగాలులు వీచినట్లైతే అజ్ఞానపు చీకట్లు తొలగిపోయి ఆత్మ సాక్షాత్కారం జరుగుతుంది.

మాయకు ఎవరూ అతీతులుకారు. బ్రహ్మాదిదేవతలు కూడా మాయకు లోబడిన వారే. అందరినీ మాయలో పడేసేది ఆ దేవి కాబట్టి ఆవిడ మహామాయ.

మహాలయక్షేత్రంలోను, గుంటూరులోని శృంగేరి శ్రీవిరూపాక్ష పీఠంలోనూ కూడా మహామాయ అనే పేరు గల దేవత ఉన్నది.

## 216. మహాసత్త్వా

సత్వము అంటే – ఉనికి, బలము, గుణము, స్థితి అని అర్థము. పరమేశ్వరి గొప్పబలము, గుణము కలది.

సత్వము – ఉనికి. పరమేశ్వరి చరాచరజగత్తులోని ప్రతివస్తువునందు అంతర్లీనంగా ఉన్నది. అందుచేతనే ఆమె మహాసత్వా అనబడుతున్నది.

సత్వము – బలము, శక్తి. చరాచరజగత్తును పాలించటానికి కావలసిన శక్తిగలిగినది కాబట్టే ఆమె మహాసత్వా.

సత్వము – గుణము. దేవి త్రిగుణాత్మిక. గుణాతీత. అందుచేతనే ఆమె మహాసత్వ.

జీవులకు వారివారి కర్మఫలానుసారము ఉత్తరజన్మలిస్తుంది కాబట్టి దేవి మహాసత్వా అనబడుతుంది.

## 217. మహాశక్తిః

జగత్తును పాలించుట మొదలైన వివిధరకాలయిన సామర్థ్యములు గలది. అయితే ఇక్కడ రెండు పదాలున్నాయి. 1. శక్తి 2. సామర్థ్యము. శక్తి అనేది బలమందు, సామర్థ్యము అనేది ఆయుధములు ప్రయోగించుట యందు ఉంటుంది. విష్ణుపురాణంలో

**ఏకదేశస్థిత స్యాగ్నేః జ్యోత్స్నా విస్తారిణీ యథా ।**

**పరస్య బ్రహ్మణః శక్తిః త ద్పైత దఖిలం జగత్ ॥**

అగ్ని ఒక ప్రదేశమందున్నప్పటికీ దాని వెలుగు ఏరకంగా విస్తరిస్తుందో, అలాగే పరబ్రహ్మ యొక్క శక్తి విశ్వమంతటా వ్యాపించును అని చెప్పబడింది. పరమేశ్వరుడు మహాశక్తిమంతుడు.

**న తత్సమశ్చా భ్యధికశ్చ దృశ్యతే** అతనికన్న శక్తిమంతులుగాని అధికులుగాని ఎవరూలేరు.

**మహతీ శక్తిః సామర్థ్య మస్యేతి – మహాశక్తిః**

అనంతమైన శక్తులుకలది. ఎక్కువైన సామర్థ్యము గలది. ఇక్కడ శక్తి అనేకవిధాలు. సృష్టిశక్తి స్థితిశక్తి లయశక్తి సమష్టిశక్తి. ఆవరణశక్తులు, పరివారశక్తులు, నిత్యాశక్తులు అన్నింటి యొక్క సమష్టిరూపము పరమేశ్వరి. అందుకే ఆమె మహాశక్తి అనబడుతోంది.

ఇంద్రియాలకు చలనశక్తిని ప్రసాదించేది ఆ పరమేశ్వరి. సూర్యునిలోనివేడి, చంద్రునిలోని చల్లదనం, అగ్నిలోని దహనశక్తి అంతేకాదు కాలకూటం, అమృతం. ఈ శక్తులన్నీ వాటికి పరమేశ్వరి ప్రసాదించినవే. ఆ శక్తులన్నింటికీ అధిదేవత పరమేశ్వరి. అందుకే ఆమె మహాశక్తిః ఆనబడుతోంది.

## 218. మహారతిః

జ్ఞానులకు, యోగులకు ప్రాపంచిక విషయాల కన్న ఆ పరమేశ్వరి మీదనే ప్రీతి ఎక్కువ, ఈ రకంగా వారందరికీ ప్రీతిపాత్రురాలవుతోంది. కాబట్టి ఆమె మహారతి అవుతున్నది.

విశేషమైన అనురాగము కలది. ఈ జగత్తులో మాతాపుత్రులందు, సోదరులందు, స్నేహితులయందు, భార్యాభర్తలయందు, ఈ రకంగా వీరందరి మధ్యన ఉన్న అనురాగాన్ని రతి అంటారు. ఈ విధమైన వ్యష్టి రతికి సమష్టి రూపము ఆ పరమేశ్వరి. అందుకే ఆమె మహారతి అనబడుతోంది. లోకంలోకి 84 లక్షల జీవరాశులందు దేవికి గల అనురాగమే మహారతి. అందుచేతనే పరమేశ్వరి మహారతిః అనబడుతోంది.

## 219. మహాభోగా

భోగము అంటే సుఖము, ధనము అని అర్థం. మహాభోగా గొప్పదైన సుఖము, ధనము గలది. బ్రహ్మాండమే పరమేశ్వరి శరీరం. అంచేత విరాట్పురుషుని దేహమైనది ఆ దేవి.

పాంచభౌతికమైనది ఈ దేహం. పంచభూతాల కలయికచేత ఏర్పడింది. ఈ దేహమే సుఖ దుఃఖాలను అనుభవించేది. మానవుడు చేసిన పాపపుణ్యాలఫలితాలు ఈ దేహం ద్వారానే అనుభవిస్తాడు. కర్మలు చేసే అధికారం ఈ దేహానికే ఉన్నది. సృష్టిలో మరి దేనికీ ఈ అధికారం లేదు. పశుపక్ష్యాదులు, క్రిమికీటకాలు కర్మలు చెయ్యలేవు. దేవతలు అశరీరులు కాన కర్మ చెయ్యలేరు. పై లోకాలలోని మిగిలినవారూ అంతే. కాబట్టి కర్మ చేసే అధికారం మానవదేహానికి మాత్రమే ఉంది. ఆ కర్మ ఫలితం వల్లనే ఉత్తరజన్మ లభిస్తుంది. అన్ని జీవులయందు ఉండి అన్ని రకాలభోగాలు అనుభవిస్తుంది కాబట్టి ఆమె మహాభోగా అనబడుతున్నది.

భోగాలు 8 రకాలు

| | | | |
|---|---|---|---|
| 1. గృహము | 3. వస్త్రము | 5. స్త్రీ | 7. గంధము |
| 2. శయ్య | 4. ఆభరణము | 6. పుష్పాలు | 8. తాంబూలము |

వీటన్నింటిని పుష్కలంగా అనుభవించేవాడు భోగి. ఇటువంటి వ్యక్తుల సమష్టి రూపమే పరమేశ్వరి. కాబట్టి ఆమె మహాభోగి.

## 220. మహైశ్వర్యా

ఐశ్వర్యము అంటే ఈశత్వము, సంపద. ఆ రెండింటినీ ఇచ్చేది దేవి. నిరతిశయమైన సంపద ఈశ్వర విభూతి అనంతముగా గలది ఆ పరమేశ్వరి. వీటన్నింటినీ తన భక్తులకు ప్రసాదిస్తుంది. ఐశ్వర్యము అంటే సంపద అని వాడుకలో ఉన్న అర్ధం. కాని ఐశ్వర్యాలు ఎనిమిది రకాలు. వీటినే అష్టైశ్వర్యాలు అంటారు. వీటిని విద్యార్థికల్పతరువులో

| | | | |
|---|---|---|---|
| 1. దాసీజనము | 3. పుత్రులు | 5. బంధువులు | 7. ధనము |
| 2. సేవకులు | 4. మిత్రులు | 6. వాహనము | 8. ధాన్యము |

సామాన్యంగా జనులకు వీటిలో కొన్ని ఉంటాయి. కాని అన్నీ ఉండటమే ఐశ్వర్యము అనబడుతుంది. జీవులకు వారి కర్మఫలాన్ని బట్టి ఈ ఐశ్వర్యాన్ని ప్రసాదిస్తుంది. పరమేశ్వరి దగ్గర ఉన్నది మహదైశ్వర్యము ఎన్నటికీ ఎంతమందికి ఎంత ఇచ్చినా తరిగిపోనిది. మణిద్వీపంలో దేవిని వర్ణించేటప్పుడు ఆ పరమేశ్వరి దగ్గర నవనిధులు ఉన్నాయని చెప్పబడింది. ఆమె ప్రక్కనుంచి బంగారము రతనాలు కలబోసిన నదులు ప్రవహిస్తున్నాయి. అని ఆ పరమేశ్వరి యొక్క మహదైశ్వర్యాన్ని వర్ణించారు. వీటిని గతంలో చెప్పటం జరిగింది.

గతంలో చెప్పినట్లుగానే ఐశ్వర్యం రెండువిధాలు. 1. ఐహికము 2. ఆముష్మికము. వీటిలో ఐహికము అంటే సిరిసంపదలు, భోగభాగ్యాలు ఇత్యాదులు అలాగే ఆముష్మికము అంటే మోక్షము. కేవలము ఆనందస్వరూపమైనది. యోగులకు, జ్ఞానులకు మాత్రమే లభించేది. మరుజన్మలేనటువంటిది. అటువంటి ముక్తిని ప్రసాదిస్తుంది మహేశ్వరి. అందుకే ఆమె మహైశ్వర్యా అనబడుతోంది.

## 221. మహావీర్యా

గొప్పదైన అనన్యసామాన్యమైన వీర్యము గలది. **వీర్యం శుక్రే ప్రభావేచ తేజః సామర్థ్యయోరపి.** వీర్యము శుక్రము, ప్రభావము, తేజము, సామర్థ్యము ఇవి వీర్యపదార్థాలు అని విశ్వకోశము చెబుతోంది.

వీర్యము అంటే – వీరధర్మము, శౌర్యము, పరాక్రమము, బలము, పుంసత్వము, ధైర్యము, శక్తి, సామర్థ్యము, శుక్రము, రేతస్సు అని సూర్యరాయాంధ్ర నిఘంటువు చెబుతోంది.

ఇవన్నీ జీవుల యొక్క దేహములందు విడివిడిగా ఉంటాయి. పరమేశ్వరి సమష్టిరూపం. అందుచేత ఇవన్నీ ఆమె యందు సమష్టిగా ఉంటాయి. అందుచేత ఆమె దగ్గరలేని వీర్యగుణం ఈ జగత్తులో ఇంకెక్కడా ఉండదు. అందుకే ఆ పరమేశ్వరి మహావీర్యా అనబడుతుంది.

**మహ దుత్పత్తికారణ మవిద్యాలక్షణం వీర్య మస్యా ఇతి – మహావీర్యా**

జగత్తును సృష్టించటానికి కారణమైన మహావీర్యము కలిగినది పరమేశ్వరి. అందుచేత మహావీర్యా అనబడింది. లోకానికి ఎప్పుడు ఏరకంగా ఆపద వాటిల్లినా తన శౌర్య పరాక్రమాలతో రాక్షస సంహారం చేసి లోకాలను రక్షించింది. అందుచేతనే ఆమె మహావీర్యా అనబడింది. స్థితికారకుడైన విష్ణుమూర్తికి కూడా అలవికానటువంటి మహిషుడు, శుంభ నిశుంభుడు మొదలైన రాక్షస సంహారము చేసింది కాబట్టే ఆ దేవి మహావీర్యా అనబడింది. 'మహత్' అనే శబ్దము పరబ్రహ్మ వాచకము. అందుచేత వీర్యములన్నీ ఆ పరబ్రహ్మ స్వరూపాలే.

## 222. మహాబలా

బలము అనగా – గంధము, రసము, రూపము, జీవము, సేన, కాకి అని విశ్వకోశం చెబుతుంది.

బలము అంటే – బలిమి, సత్తువ, బలాత్కారము, సైన్యము, బలుపు, రూపము, శుక్లము, రక్తము, గంధము, దేవము, పల్లవము, చిగురు. అని సూర్యరాయాంధ్ర నిఘంటువు చెబుతోంది.

బలము అంటే కాకి అని కూడా అర్థమున్నది యోగవాసిష్ఠంలో భుసుండుడు అనే వాయసము వసిష్ఠునితో "మేము 21 మంది అన్నదమ్ములము. చండునికుమారులము. మా సోదరీమణులైన ఆడు హంసలతోచేరి బ్రాహ్మీదేవిని చిరకాలము పూజించాము. అప్పుడు దేవికి మాపై కరుణ కలిగి మమ్ములను అనుగ్రహించింది. అప్పటి నుండి మేము ముక్తులమైనాము" అంటుంది. అంటే భుసుండాదివాయసములకు ముక్తి నిచ్చినది.

**బలినామపి బలిత్వాత్** బలవంతులకన్న కూడా బలవంతురాలు ఆ పరమేశ్వరి. అందుచేత మహాబలా అనబడుతోంది. బలము అనేది అనేక రకాలు. బుద్ధిబలము,

తపోబలము, అర్థబలము, అంగబలము. వీటిలో ఏ ఒక్క లక్షణం ఉన్నా ఆ వ్యక్తి బలవంతుడే. అలాంటప్పుడు అన్ని లక్షణాలు ఉన్న పరమేశ్వరిని మహాబలా అనేకదా అనాలి ?

**మహాంతి సైన్యాని బలాని యస్యా** అనంతములైన సైన్యబలము గలది. పరమేశ్వరి సైన్యబలమంతా భండాసుర యుద్ధంలో వివరించబడింది. అలాగే మహిషునితోను, శుంభ నిశుంభులతోను యుద్ధం చేసేటప్పుడు ఆమె సైనికబలం చెప్పబడింది. ఆమెకు శ్యామలాదేవి మంత్రి. వారాహి దండనాయిక. ఈ రకంగా అమితమైన సైనికబలము గలది కాబట్టే ఆమె మహాబలా అనబడింది.

పరమేశ్వరి మహాచతుష్షష్టికోటి యోగినీ గణసేవితా అనిచెప్పబడింది. అంటే 576 కోట్లమంది యోగినీ గణాలచే సేవించబడుతున్నది. అందుకే ఆ దేవి మహాబలా అనబడింది.

## 223. మహాబుద్ధిః

**మహతీ చ సా బుద్ధిశ్చ – మహాబుద్ధిః**

మహా అంటే – గొప్పదైన బుద్ధి గలది. బుద్ధిని గనక భగవంతుడి వైపు మళ్ళించినట్లైతే ఇంకా తెలుసుకోవలసినది ఏదీ మిగలదు.

**యస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం స్యాత్** 'దేని తెలుసుకోవటం వలన సర్వము తెలియబడునో' అని వేదం చెబుతున్నది.

పూర్వకాలంలో పుణ్యానందుడు అని ఒక మహాముని ఉండేవాడు. అతడు వేదవేదాంగవిదుడు. బ్రహ్మవేత్త మహాజ్ఞాని.

ఒకరోజు సాయంసమయంలో అతడు తన ఆశ్రమప్రాంగణంలో ఒక పెద్ద రావిచెట్టు క్రింద కూర్చుని ఉన్నాడు. ప్రశాంతంగా ఉన్నది వాతావరణం. పక్షుల కిలకిలారావాలు తప్ప ఇంకేమీ వినబడటంలేదు. ఇంతలో అతనికి ఏదో శబ్దం వినిపించింది. చుట్టూ చూశాడు. ఎవరూ లేరు. ఆకాశంలోకి చూశాడు. పైన వినీలాకాశంలో రెండు హంసలు ఎగురుతూ వాటిలో అవి మాట్లాడుకుంటున్నాయి. జాగ్రత్తగా వింటున్నాడు మునీశ్వరుడు. అందులో ఆడహంస మగహంస నడుగుతోంది "స్వామీ ! దేనిని తెలుసుకోవటం చేత ఈ లోకంలో సర్వమూ తెలుస్తుందో ఆ విషయం నాకు వివరించవలసినది" అన్నది.

మగహంస దానికి సమాధానం చెబుతోంది. "కుమ్మరివాడు మట్టిని తెచ్చి మెత్తగా త్రొక్కి దానితో కుండలు, బానలు ఇలా రకరకాల పాత్రలు తయారు చేస్తున్నాడు. ప్రతి పాత్రకూ ప్రత్యేకమైన పేరుంది. కాని ఈ పాత్రలకన్నింటికీ మూలము మట్టే. అనే విషయం తెలుసుకో". ఆ మాటవిన్న ఆడహంస చాలు. నాకు విషయమంతా తెలిసింది. చరాచరజగత్తుకు కారకుడు పరబ్రహ్మ. అతన్ని గురించి తెలుసుకుంటే అంతా తెలిసినట్లే అంది. ఆ మాటలు విన్న పుణ్యానందముని ఆ హంసలను శివశక్తులుగా భావించి, వాటి సంభాషణను ఉపదేశంగా స్వీకరించి **కామకలావిలాసము** అనే గ్రంధాన్ని వ్రాశాడు. దానికి నేను వ్రాసిన వ్యాఖ్యానమే **శ్రీవిద్యాసర్వస్వము.**

ఎవతెవల్ల గొప్ప బుద్ధి కలుగుతుందో ఆమె మహాబుద్ధి అనబడుతుంది.

ఏదైనా ఒక విషయాన్ని తెలుసుకుని అందులో ప్రావీణ్యత సంపాదించినవాడే బుద్ధిగలవాడైనప్పుడు, అన్ని జీవులయొక్క సమష్టిరూపమైన ఆ పరమేశ్వరి మహాబుద్ధియే.

దేనివల్ల అయితే ఆత్మజ్ఞానం లభిస్తుందో, అది మహాబుద్ధి. సమిష్టిరూపమైన పరమేశ్వరి నుంచే భూతాలు, తన్మాత్రలు వచ్చాయి. నామరూపాత్మకమైన సృష్టి జరిగింది. బుద్ధి పరమేశ్వర స్వరూపము మనస్సు శక్తి స్వరూపము. ఈ రెండూ అంటే మనస్సు బుద్ధి ఎప్పుడూ కలిసే ఉంటాయి. వీటిలో ఒకటి ఎక్కువగా ఉన్నప్పుడు రెండవది తక్కువగా ఉంటుంది. ఈ విధంగా మనస్సు తక్కువగా బుద్ధి ఎక్కువగా ఉన్న స్థితే మహాబుద్ధి. అంటే మనసును లయం చేసుకున్నటువంటి బుద్ధే మహాబుద్ధి అనబడుతుంది.

## 224. మహాసిద్ధిః

సిద్ధి అంటే – లాభము, ప్రాప్తి, సమగ్రత, సంపూర్తి, జయము, వృద్ధి, ప్రతిష్ఠాపనము, నిరూపణము, నిశ్చయము, పరిష్కారము అంటూ ఈ రకంగా 25 రకాల అర్థాలు చెప్పింది సూర్యరాయాంధ్ర నిఘంటువు. మామూలుగా మనం వాడే అర్థం సిద్ధించుట – ప్రాప్తించుట, ఫలించుట అని. సాధకుడికి అష్టసిద్ధులు లభిస్తాయి. ఇక్కడ సిద్ధి అంటే శక్తి అని అర్థం. ఇవి ఎనిమిది సిద్ధులు. వీటినే అష్టసిద్ధులు అంటారు. ఇవి అతీంద్రియశక్తులు అవి.

1. అణిమాసిద్ధి – శరీరము అతిచిన్నదిగా చెయ్యటము
2. మహిమాసిద్ధి – శరీరము అతిపెద్దదిగా చెయ్యటము
3. గరిమాసిద్ధి – శరీరము బరువును విపరీతంగా పెంచటం.

4. లఘిమాసిద్ధి – శరీరము బరువును అతి తేలికగా చెయ్యటము.

5. ప్రాప్తిసిద్ధి – కావలసిన వస్తువులను పొందటము

6. ప్రాకామ్యసిద్ధి – ఆకాశసంచారము

7. ఈశిత్వసిద్ధి – సమస్థానికీ ఆదిపత్యం పొందటం

8. వశిత్వసిద్ధి – సమస్త భూతములను లోబరచుకోవటం

శ్రీచక్రంలోని ప్రథమ ఆవరణలోని ప్రథమరేఖలో ఉండే దేవతలనర్చిస్తే ఈ సిద్ధులు లభిస్తాయి.

స్కందపురాణంలో ఈ సిద్ధులను ఇంకొక రకంగా వ్రాశారు.

**రసానాం స్వత ఉల్లాసః ప్రథమా సిద్ధి రీరితా**
**ద్వంద్వైరనిభిభూతి శ్చ ద్వితీయా సిద్ధి రుచ్యతే**
**అధమోత్తమతాభావః తృతీయా సిద్ధి రుత్తమా**
**చతుర్థీ తుల్యతా తేషాం ఆయుషః సుఖదుఃఖయోః**
**కాంతే ర్బలస్య బాహుళ్యం విశోకా నామ పంచమీ**
**పరమాత్మపరత్వేన తపో ధ్యాననిష్ఠతా షష్ఠీ**
**నికామచారిత్వం సప్తమీ సిద్ధిరుచ్యతే**
**అష్టమీ చ తథాప్రోక్తా యత్ర క్వచన శాయితే**

1. రసముల యొక్క ప్రకాశము
2. ద్వంద్వములచే తిరస్కరింపబడనిది
3. అధమ ఉత్తమత్వాభావము
4. సుఖదుఃఖముల సమానత్వము
5. కాంతి బలముల ఆధిక్యము
6. పరమాత్మ పరంగా తపోధ్యానాదులందు నియమము
7. ఆకాశసంచారిత్వము
8. ఎక్కడైనా సమానస్థితి

సిద్ధులు రెండురకాలు 1. కార్యసిద్ధులు 2. దైవసిద్ధులు. కార్యసిద్ధులు మళ్ళీ అనేకరకాలు. విద్యాసిద్ధి, ధనసిద్ధి, ధాన్యసిద్ధి, ఔషధసిద్ధి, రససిద్ధి మొదలైనవి. అణిమాదులు దైవసిద్ధులు. ఈ కార్యసిద్ధులు, దైవసిద్ధులు రెండూ కలిస్తేనే మహాసిద్ధి అవుతుంది. ఇటువంటి సిద్ధులు ప్రసాదిస్తుంది కాబట్టే పరమేశ్వరి మహాసిద్ధిః అనబడుతుంది.

# 225. మహాయోగీశ్వరేశ్వరీ

**మహతాం యోగీశ్వరాణాం ఈశ్వరీతి** గొప్ప యోగీశ్వరులకు కూడా ఈశ్వరి ఆ పరమేశ్వరి. అందుకే మహాయోగీశ్వరేశ్వరీ అనబడుతుంది.

యోగ ప్రక్రియలో శ్రేష్టులైనవారు యోగీశ్వరులు. యోగము అంటే – కలయిక, కూటమి, ఉపాయము, దానము, చిత్తవృత్తి నిరోధము, ఇంద్రియ నిగ్రహము. ఈ రకంగా 21 అర్థాలనిచ్చింది సూర్యరాయాంధ్ర నిఘంటువు. యోగాన్ని కలిగి ఉన్నవాడు యోగి. యోగి అంటే – కలిగి ఉన్నవాడు. ధ్యాననిష్ఠుడు, సన్యాసి మంత్రశాస్త్రజ్ఞుడు, మాంత్రికుడు, యోగానుసారి అని అర్థం చెప్పబడింది.

**యోగః చిత్తవృత్తి నిరోధః** యోగము మనస్సు యొక్క వృత్తులను నిరోధిస్తుంది. అంటే మనో నిశ్చలతను చేకూరుస్తుంది.

యోగము మూడు రకాలు 1. భక్తి 2. కర్మ 3. జ్ఞానము. వీటిలో మొట్టమొదటిది భక్తి. దేవీభాగవతంలో హనుమంతుడు పరమేశ్వరి యొక్క విశ్వరూప దర్శనం చేసిన తరువాత, ఆ దేవిని 'అమ్మా ! పూర్తిగా విరాగి కానటువంటి మధ్యమపురుషునికి తేలికగా ఉండే మార్గము ఏదైనా ఉపదేసించవలసినది.” అని అడిగాడు. ఆ మాటలు పరమేశ్వరి హిమవంతునితో “రాజా ! మోక్షం పొందటానికి భక్తి, కర్మ, జ్ఞానమార్గాలు మూడున్నాయి. వాటిలో అతి తేలిక అయినది భక్తిమార్గము. మానవుడు గుణభేదాలననుసరించి భక్తి మూడురకాలు

1. దంభాచారంతో పరులకు బాధ కలిగించేది తామసభక్తి. ఇది మచ్చరము, కోపము కలిగి ఉంటుంది.

2. స్వార్థం చూచుకోవటం రాజసభక్తి. ఈ భక్తులు భోగభాగ్యాలు, సిరిసంపదలు, కీర్తి ప్రతిష్ఠలు కోరతారు. ఆ రకంగా జీవుడు దేవుడు వేరువేరని భావించి అర్చన చేస్తారు.

3. పరమేశ్వరుని వేరుగా తలచినప్పటికీ దృఢదీక్షతో దేవి ప్రీతి కోసం చేసేది సాత్వికభక్తి. ఈ రకమైన భక్తి వలన పరాభక్తి సాధ్యమవుతుంది.

రాజస తామస భక్తిమార్గాలు పరాభక్తికి దోహదం చెయ్యవు. పరాభక్తి అంటే పరమేశ్వరి యందు చిత్తము నిలిపి, తైలాధారవలె నిత్యము ఆమెనే ధ్యానం చెయ్యటంచేత సామీప్య, సార్షి, సాలోక్య, సాయుజ్య మనబడే వివిధరకాలయిన ముక్తులను సాధకులు పొందుతారు.

ఫలాపేక్ష లేకుండా, కేవలం సేవాభావంతో, తనకూ పరదేవతకూ భేదము లేదని భావించి, జితేంద్రియుడై ఆ దేవినే ధ్యానించేవాడు సార్ష్టిరూపముక్తి పొందుతాడు.

ఎల్లజీవులయందు పరమేశ్వరి స్వరూపాన్ని దర్శించటము, తన యందున్న ప్రేమనే ఇతరులయందు కూడా చూపటము, ప్రాణులందరిలోనూ జీవ చైతన్యమున్నది. కాబట్టి జీవుడికీ, దేవుడికీ భేదంలేదని చెప్పటము, ఎవరియందు భేదబుద్ధి ద్రోహము చూపకుండా, ఛండాలుని మొదలు ఈశ్వరుని దాకా అందరినీ గౌరవించటము, సమానంగా చూడటము, దివ్యక్షేత్రాలు, పుణ్యక్షేత్రాలు దర్శించటము, భక్తులను గౌరవించటము, మంత్ర తంత్రాలయందు, శాస్త్రశ్రవణమందు భక్తి చూపటము, పరమేశ్వరి భక్తియందు ఓలలాడటము, ఆనందపారవశ్యంలో మునిగితేలటము, సర్వకార్య సర్వావస్థలయందు పరమేశ్వరినే పూజించటము, వ్రతాలు, దేవీమహోత్సవాలు చెయ్యటము, అహంకారము, దేహాభిమానము వదలి దివ్యనామ సంకీర్తనము చెయ్యటము, ఇవన్నీ కలిగిన భక్తిని పరాభక్తి అంటారు" అని చెప్పింది. ఇది భక్తి యోగము.

ఇక కర్మను చూసినట్లైతే యజ్ఞయాగాదులను నిర్వహించటం పరమేశ్వరి కోసం నిత్యనైమిత్తిక కర్మలు, ఫలాపేక్ష లేకుండా యజ్ఞయాగాలు చెయ్యటం కర్మయోగం.

వీటిలో మూడవది జ్ఞానము. జ్ఞానము వల్లనే ముక్తి లభిస్తుంది. మరి దేనివల్ల కలగదు. జ్ఞాని అయినటువంటివాడు బ్రహ్మవిదుడు. బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి. బ్రహ్మవేత్త కూడా పరబ్రహ్మ స్వరూపమే. కంటికి కనిపించే వస్తువులకన్నా, కనిపించని మాయకన్నా రూపము వేరైనది. అతీతమైనది. వైరాగ్యము కలిగినప్పటికీ జ్ఞానము లేనివాడు మరణానంతరము ప్రళయము వరకు బ్రహ్మలోకంలో ఉండి తరువాత ఆ కర్మఫలాన్ని అనుసరించి పుణ్యవంతుల ఇళ్ళలో పుడతాడు. ఆ తరువాత సాధనతో బ్రహ్మజ్ఞానం పొందుతాడు. కొట్లకొలది జన్మలెత్తితేనేగాని జ్ఞానం కలగదు. జ్ఞానమనేది ఒకే జన్మలోవచ్చి పడేదికాదు. కాబట్టి సాధకుడు తనకు వీలయినంతవరకు జ్ఞానసముపార్జన చెయ్యాలి.

అసలు మానవజన్మ రావటమే దుర్లభం. అందులోనూ బ్రాహ్మణత్వం మరీ దుర్లభం. వేదాభ్యాసం ఇంకా దుర్లభం శమదమాది గుణసంపద, యోగసిద్ధి, ఉత్తమగురు ప్రాప్తి కడు దుర్లభం. ఇవన్నీ ఉండి కూడా జ్ఞాన సముపార్జనకు ప్రయత్నించని వాని జన్మ వ్యర్థము.

భక్తి కర్మ జ్ఞాన యోగాలు అన్నీ ఒకటే దేనిలోనైనా తాదాత్మ్యత ఉండాలి. భక్తిలో కూడా ఆ పరమేశ్వరుడు సర్వత్రా వ్యాపించి ఉన్నాడు అనే భావన రావాలి. అలాగే కర్మలో కూడా. ఏరకమైన యోగమైనా మనసును నిశ్చలంచేసి పరమేశ్వరుని యందు లగ్నం చెయ్యటానికే అని గుర్తించాలి. ఈ యోగాలలో నిష్ణాతులను యోగీశ్వరులంటారు. అటువంటి యోగీశ్వరులకు ఈశ్వరి కాబట్టి యోగీశ్వరేశ్వరి అనబడుతోంది.

ఈ రకంగా 199వ నామం దగ్గర నుంచీ పరమేశ్వరి యొక్క మహత్త్వాన్ని వర్ణిస్తూ ఆమె సగుణ రూపాన్ని వివరించటం జరిగింది.




శ్రీ ఋకార దేవి

# 17. మహాయాగ విశేషము

ఇంతవరకు దేవి యొక్క స్థూలరూపము సూక్ష్మరూపము చెప్పి ఆ తరువాత నిరీశ్వరతత్త్వము అంటే నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ ఆ పరమేశ్వరియే అని చెప్పారు. తరువాత దేవి సర్వజ్ఞురాలు అని వివరించి మళ్ళీ ఆరు నామాలలో ఆమె సగుణరూపాన్ని వివరించారు. ఇప్పుడు మహాయాగ విశేషాన్ని వివరిస్తున్నారు.

మహా అంటే గొప్పదయినటువంటిది అని అర్థం. అన్ని విషయములందు పరమేశ్వరి కన్న అధికులు ఎవరూ లేరు. యంత్రాలన్నింటిలోనూ పరమేశ్వరి యంత్రమైన శ్రీచక్రమే గొప్పది. తంత్రాలన్నింటిలోనూ శ్రీవిద్యాతంత్రము గొప్పది. మంత్రాలన్నింటిలోనూ శ్రీవిద్యామంత్రము అంటే షోడశి మహామంత్రము గొప్పది. యాగాలన్నింటిలోకీ శ్రీవిద్యాయాగము గొప్పది. ఆ పరమేశ్వరి పరమేశ్వరస్వరూపమే. పరమేశ్వరరూపంలో ఉన్న శివుడు భైరవుడుగా ఆ దేవిని పూజిస్తాడు. అంటే ముక్కోటిదేవతలతోనూ అర్చన లందేది ఆ పరమేశ్వరియే. ఆమె నిత్య. ఆమె శాశ్వత. ఆమెకు నాశనం లేదు. అందుకే కల్పాంతమునందు మహాప్రళయం సంభవించినప్పుడు శివుడు ఆత్మానందంతో తాండవం చేస్తుంటాడు. దానికి ఆ దేవియే సాక్షి. అప్పుడు ఇంకెవ్వరూ ఉండరు. శివశక్తులే ఉంటారు. ఆ శివుడే మహాకామేశ్వరుడు అనబడతాడు. ఆయన యొక్క పట్టపురాణి ఆదేవి. త్రిపురములకు సుందరి మహాత్రిపురసుందరి.

అర్చనా విధానంలో అనేక ఉపచారాలున్నాయి. పంచోపచారాలు, షోడశోపచారాలు ఇలా అనేకరకాలున్నాయి. కాని చతుష్షష్టి ఉపచారాలను అందుకునే అర్హత ఆ దేవికి తప్ప ఇంకెవరికి లేదు. ఆమె చతుష్షష్టికళలందూ ఆరితేరినది. ఆ కళలన్నీ ఆమె అధీనంలోనే ఉంటాయి. ఆమె అనేకమంది సేవకులచే సేవించబడుతుంటుంది. ఒక్కొక్క ఆవరణలోనూ 64 కోట్లమంది చొప్పున తొమ్మిది ఆవరణలయందు కలిపి 9×64 = 576 కోట్లమంది యోగినీగణంతో సేవించబడుతుంటుంది. ఇటువంటి గొప్పదనం ఇంకెవరికీ లేదు. అందుచేతనే 226 నామం దగ్గర నుంచి 237వ నామం వరకు ఆమె యొక్క మహత్వాన్ని, మహాయాగాన్ని వివరిస్తున్నారు.

పరమేశ్వరికి చేసే పూజ చాలా గొప్పది. ఆ మంత్రము, తంత్రము, యంత్రము, పూజావిధానము, పూజించే (భైరవులు) వారు అందరూ గొప్పవారే. అందుచేతనే అది మహాయాగమనబడుతున్నది. ఇక మహాయాగాన్ని వివరిస్తున్నారు.

## 226. మహాతంత్రా

**మహాంతి బహుఫలప్రదాని తంత్రాణి కులార్ణవ జ్ఞానార్ణవాదీని ......**

అనేక విధాలయిన ఫలితాలను ఇచ్చేవి, గొప్పవైన కులార్ణవ, జ్ఞానార్ణవ మొదలైన తంత్రముల రూపము గలది.

ప్రధానంగా శ్రీవిద్య ఎక్కడైతే నిరూపించబడిందో అది తంత్రము. పరమేశ్వరుడు 64 తంత్రాలు చెప్పాడు. అవన్నీ కూడా ఐహిక వాంఛలను తీరుస్తున్నాయి. అందుచేత పండితులు కూడా మోసపోతున్నారు. కాబట్టి, వారిని తరింపచేయటానికి వేరే ఇంకొక తంత్రము ఏదైనా చెప్పవలసినది అని పార్వతి అడుగగా శివుడు శ్రీవిద్యాతంత్రాన్ని ఉపదేశించాడు. దీన్నే స్వతంత్రతంత్రము, మహాతంత్రము, కాదివిద్యాతంత్రము అని కూడా అంటారు.

అసలు తంత్రము అంటే ఉభయార్ధసాధకమైన ప్రక్రియను బోధించే ఉపాయము. ఇందులో దేవత యొక్క స్వరూపము, యంత్రము, మంత్రము, పూజావిధానము, స్తోత్రము, కవచము మొదలైనవన్నీ చెప్పబడతాయి. తంత్రాలలో అనేక విషయాలు పారమార్థిక, వ్యావహారిక విషయాలు చెప్పబడ్డాయి. ఏవైనా కార్యాలు పూర్తికావాలంటే ఏ పనిచెయ్యాలి? ఏ విధంగా చెయ్యాలి ? ఏ దిక్కుకు తిరిగి చెయ్యాలి ? ఏ ఆసనం మీద కూర్చోవాలి ? ఏ పదార్థం నివేదన చెయ్యాలి ? ఇవన్నీ అందులో ఉంటాయి. అలాగే తంత్రశాస్త్రంలో త్వరగా మోక్షాన్ని పొందే విధానము కూడా చెప్పబడింది. వామకేశ్వరతంత్రము, షట్చక్రనిరూపణము అలాంటివే.

ఈ తంత్రాలలో వైష్ణవతంత్రము, శైవతంత్రము, శాక్తేయతంత్రము అని మూడురకాలున్నాయి. వీటిలో ఏ తంత్రంలోని ఆచారం దానిదే. ఈ తంత్రాలన్నీ కౌళాచారానికి సంబంధించినవి. వీటిలో కొన్ని వామాచార సంప్రదాయంలోవి. మోక్షవాదులకు శుభాగపంచకము ప్రామాణికమని గతంలోనే చెప్పటం జరిగింది.

ఏదైనా ఒక కర్మ చేయటానికి ప్రారంభించినప్పుడు సంకల్పం దగ్గర నుంచి, పరి సమాప్తి వరకు జరిగే క్రియాకలాపమంతా తంత్రమే. వేదాలలో చెప్పబడిన యజ్ఞయాగాదుల నిర్వహణకూడా తంత్రమే. ఈ శాస్త్రాన్ని ఆపస్తంభుడు మొదలైనవారు వ్రాశారు. వీటిలో కూడా ఒక్కొక్క యాగానికి ఒక్కొక్క తంత్రం పరిమితమై ఉంటుంది. ఈ రకంగా ఉన్న అనేకమైన తంత్రాలకు అధిష్ఠాత్రి ఆ పరమేశ్వరి. అందుకే ఆమె మహాతంత్రా అనబడుతోంది.

## 227. మహామంత్రా

బాలా బగళా మొదలైన మంత్రాల స్వరూపమే ఆ పరమేశ్వరి.

పరమేశ్వరి బిందురూపిణి. ఆ బిందువు నుండే నామరూపాత్మక జగత్తు ఆవిర్భవించింది. నామాత్మకమైన జగత్తు అంటే ఓంకారము పరబ్రహ్మస్వరూపం. ఓంకారం నుంచి సంస్కృతభాషకు గల 50 అక్షరాలు వచ్చినాయి. ఇవే బీజాక్షరాలు. జగత్తులో ఈ బీజాక్షరాలకు శక్తి ఉన్నది. అది ఒక్కొక్క అక్షరానికి ఒక్కొక్క రకమైన శక్తి. ఆ శక్తి ఆధారంగా బీజాక్షరాలను సంపుటీకరణం చెయ్యటం జరిగింది.

పరమేశ్వరుని బీజం ఓంకారం. ఈం లక్ష్మీ బీజం. ఐం వాగ్బీజం, క్లీం మన్మథబీజం, హ్రీం శక్తి బీజం, గం గణపతి బీజం. ఇలా దేవతలకే కాకుండా పంచభూతాలకు కూడా బీజాలున్నాయి. లం పృథివీ బీజం, హం ఆకాశ బీజం, యం వాయుబీజం, రం అగ్నిబీజం, వం అమృతబీజం.

సాధకుడి యొక్క అవసరాన్ని బట్టి మంత్రాలు సంపుటీకరణం చెయ్యబడతాయి. మంత్రాన్ని సృష్టించేవాడు – మంత్రస్రష్ట కాగా మంత్రాన్ని దర్శించేవాడు – మంత్రద్రష్ట.

బీజాక్షరాలన్నీ పరమేశ్వరి స్వరూపమే. ఆ అక్షరసమామ్నాయం నుంచి ఆవిర్భవించిన మంత్రాలు కూడా ఆ దేవి రూపమే కదా ? అందుకే ఆమె ఈ మంత్రాలకన్నిటికీ అధిదేవత. దేవీభాగవతంలో చెప్పినట్లుగా సప్తకోటిమంత్రాలు, ఆమ్నాయ దేవతల రూపుదాల్చి ఆ దేవి ముందు నడుస్తున్నాయి. ఆమెను సేవిస్తున్నాయి. అందుకే ఆమె మహామంత్రా అనబడుతోంది.

## 228. మహాయంత్రా

పూజాచక్ర, పద్మచక్ర, అమృతఘట, మేరులింగాది యంత్రములు గలది. సర్వోత్తమమైన శ్రీవిద్య అనే మంత్రము, సిద్ధివ్రజము అనే యంత్రము చాలా గొప్పవి. వీటిని గల దేవి 'మహాయంత్రా' అనబడుతోంది. స్వతంత్ర తంత్రము అంటే మరే ఇతర తంత్రము మీదా ఆధారపడనటువంటిది. కాబట్టి చాలా గొప్పది. శ్రీవిద్యాతంత్రంలో పరమేశ్వరి పరమేశ్వరుణ్ణి అడుగుతుంది. ఓ దేవా ! ఇప్పటి వరకు చెప్పిన తంత్రాలన్నీ ఒకదాని మీద ఇంకొకటి ఆధారపడి ఉన్నాయి. అందుచేత కష్టంగా ఉన్నది. కాబట్టి స్వతంత్రంగా ఉండే తంత్రం ఒకటి చెప్పవలసినది. అని అడగగా పరమేశ్వరుడు స్వతంత్రమైన శ్రీవిద్యాతంత్రాన్ని చెప్పాడు. ఇదే విషయాన్ని శంకరభగవత్పాదులవారు

తమ సౌందర్య లహరిలోని "చతుషష్ట్యా తంత్రైః" అనే శ్లోకంలో వివరించారు. ఆ శ్లోకం గతంలో వివరించబడింది.

యంత్రాలు మూడు రకాలు 1. భూప్రస్తారము 2. మేరుప్రస్తారము 3. కైలాస ప్రస్తారము. అయితే యంత్రాలలో శ్రీచక్రము, రుద్రయంత్రము, వనదుర్గాయంత్రము, మహాయంత్రాలనబడతాయి. శ్రీచక్రాన్నే యంత్రరాజము సిద్ధవ్రజము అని కూడా అంటారు.

బిందువు నుంచి వచ్చిన నాదము మంత్రమైతే, దాని రూపము యంత్రము. సర్వమంత్రరూపిణి అయిన దేవి సర్వయంత్రరూపిణి, సర్వతంత్రరూపిణి కూడా.

యంత్రాన్ని పూజలోపెట్టాలంటే అది సంప్రదాయసిద్ధమైనదై ఉండాలి. గురువుగారి దగ్గర నుంచి వచ్చినదై ఉండాలి. ప్రతి యంత్రానికి సృష్టి క్రమము, సంహారక్రమము అని రెండు క్రమాలుంటాయి. స్థితిక్రమము అని మూడవది కూడా ఉంటుంది. కాని సృష్టిసంహారాలే ముఖ్యమైనవి. బిందువు దగ్గర నుంచి భూపురం వరకు సృష్టిక్రమము. భూపురం దగ్గర నుంచి బిందువు వరకు సంహారక్రమము. ఈ రెండు క్రమాలలోనూ యంత్రాన్ని అర్చించాలి. యంత్రానికి చేసేపూజ ఎప్పుడూ సంహారాంతంగా ఉండాలి. అన్ని యంత్రాలు పరమేశ్వరస్వరూపాలే. కాబట్టి ఆ దేవి మహాయంత్రా అనబడుతుంది.

## 229. మహాసనా

క్షితి మొదలైన తత్త్వములే ఆసనముగా గలది. దేవీ భాగవతంలో **ఏషా భగవతీ సర్వతత్త్వాన్యాశ్రిత్య తిష్ఠతి** ఈ దేవి అన్ని తత్త్వములను ఆశ్రయించి ఉన్నది. అని చెప్పబడింది.

ఆసనము – నివాసస్థానము. మహాసనము – గొప్పదైన నివేశనస్థానము. భైరవయామళంలో శ్రీచక్రాన్ని గురించి వివరిస్తూ

**శ్రీచక్రం త్రిపురసుందర్యాబ్రహ్మాండాకారమీశ్వరీ ।**

అంటూ 25 తత్త్వాలు శ్రీచక్రంలో ఉన్నాయి. ఆ తత్త్వాలకు అతీతమైన 26వ తత్త్వమే పరమేశ్వరి అని చెప్పబడింది. ఆ విషయాన్ని గతంలో వివరించాం. మహాసనము అంటే పంచబ్రహ్మాసనము, పంచదిగాసనము, పంచప్రణయమహాసనము అని 'శ్రీమత్సింహాసనేశ్వరీ' అనే నామంలో వివరించటం జరిగింది.

మహాయంత్రాలు నివాసస్థానంగా గలది కాబట్టి ఆ పరమేశ్వరి మహాసనా అనబడుతోంది.

# 230. మహాయాగక్రమారాధ్యా

బ్రాహ్మీ మొదలయిన 64 యోగినీ పూజలతో కూడినటువంటిది మహాయాగము. ఇతరమైన యాగాలు పూజలు కొన్ని ఫలితాలే ఇస్తాయి. కాని ఈ పూజ పూర్తి ఫలితాన్ని, త్వరగా ఇస్తుంది.

శ్రీచక్రము యొక్క బిందువు నందు పరదేవత ఉంటుంది. ఆమె ఒక్కొక్క ఆవరణయందు ఎనిమిది దిక్కులా ఎనిమిదిమంది చొప్పున మొత్తం 64మంది యోగినులతో సేవింపబడుతూ ఉంటుంది. వీరందరూ పరదేవతతో సమానమైన రూపలావణ్యాలు, శక్తులు కలవారు. వారందరికీ విడి విడిగా కోటిమంది సేవకులుంటారు. ఈ రకంగా పరమేశ్వరి మహాచతుష్షష్ఠి కోటియోగినీ గణసేవిత అనబడుతుంది. ఈ దేవతలనందరినీ పూజించటమే మహాయాగము అనబడుతుంది.

యాగ ప్రక్రియలో పాటించవలసిన ముఖ్యమైన విధి ఒకటుంది. యాగం చేసే యజమాని కష్టపడి సంపాదించిన ధనంతోనే యాగం చెయ్యాలి. అప్పుడే మంచి ఫలితం వస్తుంది. ఈ విషయమే దేవీ భాగవతంలో చెబుతూ దశరథమహారాజు న్యాయమార్గంలో సంపాదించిన విత్తంతో ఒక కుమారుడు కావాలని యజ్ఞ ంచేశాడు. నలుగురు కుమారులు కలిగారు. ద్రుపద మహారాజు ఒక కుమారుడు కావాలని యజ్ఞం చేశాడు. కుమారుడు కుమార్తె గలిగారు. మరి ధర్మరాజు పటాటోపంగా రాజసూయం చేశాడు. యాగపరిసమాప్తి అయిన కొద్ది రోజులకే అవబృధస్నానం చేసిన ద్రౌపది శిరోజాలను బట్టి సభలోకి ఈడ్చాడు దుశ్శాసనుడు. అన్న అభీష్టంమేరకు ఏకవస్త్రను వివస్త్ర చెయ్యటానికి ప్రయత్నించాడు. పాండవులు రాజ్యం పోగొట్టుకుని ఘోరమైన అవమానం పొందారు. ఎందుకని వారు యాగానికి ఉపయోగించింది అన్యాయార్జితము కాబట్టి. అందుచేత న్యాయమార్గంలో సంపాదించిన విత్తంతో పూజలు, యాగాలు చెయ్యాలి. లేకపోతే ఫలితం సక్రమంగా ఉండదు.

శ్రీయాగము, అంబాయాగము, అగ్నిష్టోయము, పాకయజ్ఞము మొదలైన వాటిని మహాయాగాలు అంటారు. వీటిలో శ్రీయాగము అంతర్యాగమని, బహిర్యాగమని రెండురకాలు. ఆరాధనసగుణము నిర్గుణము అని రెండు రకాలు. వీటిని గతంలో వివరించాం.

ఈరకంగా ఈ మహాయాగాలన్నింటికీ అధిపతి ఆ పరమేశ్వరి కాబట్టి ఆమె మహాయాగక్రమారాధ్యా అనబడుతుంది.

## 231. మహాభైరవపూజితా

భైరవుడు అంటే – శివుడు. ఈశ్వరుడు. సృష్టి స్థితి లయాలకు కారణమైనవాడు. మహాగొప్పదైన, బ్రహ్మస్వరూపము. ఆదిత్యమండలాంతర్వర్తి అయిన నారాయణుడు మహాభైరవుడు. మహాయాగం చేసిన మొదటివ్యక్తి నారాయణుడే. ఆ నారాయణుడు మహాయాగం చేసి పరమేశ్వరిని ఆరాధించాడు. పద్మపురాణంలో

**శంభుం పూజయతే దేవీం మంత్రశక్తి మయీం శుభాం,**
**అక్షమాలాం కరే ధృత్వా న్యాసే నైవ భవోద్భవ**

మంత్రశక్తిమయి అయిన శుభురాలైన దేవిని, జపమాలచేతితో ధరించిన శివుడు పూజిస్తున్నాడు అని ఉంది. లలితోపాఖ్యానంలో

**మహాశంభునాథో మహాయాగేన చిదగ్నికుండాత్, లలితాం ప్రాదుర్భావయా మానే**

మహాశంభునాధుడు మహాయాగముచే చిదగ్ని కుండము నుంచి లలితాదేవిని పుట్టింపచేసెను అని చెప్పబడింది.

పైన చెప్పిన భైరవులు 8 రకాలు. వారే అష్ట భైరవులు. శ్రీచక్రార్చన పూర్తికాగానే 8 మంది దంపతులను వయసువారీగా కూర్చుండపెట్టి వారికి ప్రసాదం ఇవ్వాలి. ఈ దంపతులు ఏ సంప్రదాయానికి సంబంధించినవారైనా ఫరవాలేదు అని యోగినీ హృదయం చెబుతోంది.

**అష్టాష్టకంతు కర్తవ్యం విత్తశాఠ్యవివర్జితం**
**త్వ మేవ తాసాం రూపేణ క్రీడసే విశ్వమోహినీ**

ఇక్కడ దంపతులు అంటే భైరవులు 8 మంది. బ్రాహ్మీ మొదలైన మాతృకలు 8 మంది

| | | | |
|---|---|---|---|
| 1. | అసితాంగభైరవ | – | బ్రాహ్మి |
| 2. | ఋుఋుభైరవ | – | మహేశ్వరి |
| 3. | చండభైరవ | – | కౌమారి |
| 4. | క్రోధభైరవ | – | వైష్ణవి |
| 5. | ఉన్మత్తభైరవ | – | వారాహి |
| 6. | కపాలభైరవ | – | మాహేంద్రి |
| 7. | భీషణభైరవ | – | చాముండా |
| 8. | సంహారభైరవ | – | మహాలక్ష్మి |

వీరి పూజను కులార్ణవతంత్రంలో చెప్పిన విధంగా చెయ్యాలి.

ఈ భైరవులందరి సమష్టిరూపం మహాభైరవుడు. అతనిచే పూజింపబడినది. కాబట్టే మహాభైరవపూజితా.

## 232. మహేశ్వరమహాకల్పమహాతాండవసాక్షిణీ

మహాప్రళయం జరిగేటప్పుడు, ఈ సృష్టి మొత్తాన్ని లయం చేస్తూ, తానొక్కడే ఉన్నటువంటివాడై ఆత్మానందంకోసం మహాతాండవం చేస్తాడు. అప్పుడు జగత్తులో ఆ పరమేశ్వరి తప్ప ఇంకెవరూ ఉండరు. అందుచేత ఆ తాండవానికి పరమేశ్వరియే సాక్షి. అందుచేతనే ఈ నామం చెప్పబడుతోంది. ఇదే విషయాన్ని పంచదశీస్తవములోని 13వ శ్లోకంలో చెబుతూ

**కల్పోపసంహరణకల్పితతాండవస్య**
**దేవస్య ఖండపరశోః పరభైరవస్య ।**
**పాశాంకుశైక్షవశరాసన పుష్పబాణా**
**సా సాక్షిణీ విజయతే తవ మూర్తి రేకా ॥**

కల్పాంతములో ఖండపరశువైన ఈశ్వరుడిచే కల్పించబడిన తాండవంలో పాశాంకుశాలు, ధనుర్బాణాలు ధరించిన ఆ దేవి సాక్షిగా ఉండి నీ మూర్తితో సారూప్యమై శోభిల్లుతున్నది అన్నారు. దేవీభాగవతంలో

**ఏషా సంహృత్య సకలం విశ్వం క్రీడతి సంక్షయే లింగాని సర్వ జీవానాం స్వ శరీరే నివేశ్యచ**

ఈ దేవీ సకల విశ్వాన్ని సంహరించి సర్వజీవులను తన శరీరమందు ప్రవేశపెట్టి క్రీడిస్తున్నది.

మహావాసిష్టంలో శివపార్వతుల తాండవము వర్ణించి "వక్షమున పూసల మాలలు గలదై, శిరస్సున గరుడుని ఈకలను ధరించి, రక్తాసనములతో నిండినదై యముని యొక్క మహిషశృంగమును చేబట్టి, శివుని శబ్దవాద్యముల ననుసరించి **డింభం డింభం సుడింభం పచ పచ ఝుమ్య ఝుమ్య ప్రఝుమ్య** అని నృత్యం చేస్తూ సంతసించిన కాళరాత్రీదేవితో కూడిన భైరవుడు మిమ్ము రక్షించుగాక !" అని చెప్పబడింది.

ప్రళయకాలంలో ఈ సృష్టి అంతా నాశనం అయిపోతుంది. భూమి – జలంలో, జలం – అగ్నిలో, అగ్ని – వాయువునందు, వాయువు – ఆకాశంలో, ఆకాశం ఆ పరమేశ్వరిలో లీనమైపోగా అంతా శూన్యమే మిగులుతుంది. అప్పుడు ఆనందంతో ఆ పరమేశ్వరుడు తాండవం చేస్తుంటే, ఆ తాండవానికి సాక్షిగా పరమేశ్వరి మాత్రమే ఉంటుంది.

ఈశ్వరుడు అనే పేరు గలవారు అనేకమంది దేవతలున్నారు. వారిలో నందీశ్వరుడు, భృంగీశ్వరుడు, విఘ్నేశ్వరుడు ఈ రకంగా ఉన్న ఈశ్వరుల యొక్క సమష్టి రూపము మహేశ్వరుడు. ఈశ్వరులకే ఈశ్వరుడు పరమేశ్వరుడు.

సర్వులకు ఈశ్వరుడు కాబట్టి సర్వేశ్వరుడు.

ఈశ్వరుడు మహాకల్పాంతాన తాండవం చేస్తాడు.

| | | |
|---|---|---|
| పదిహేను తిథులు | – | ఒక పక్షము |
| రెండు పక్షములు | – | ఒక మాసము |
| ఆరు మాసములు | – | ఒక అయనము |
| రెండు అయనములు | – | ఒక సంవత్సరము |
| 17,28,000 సంవత్సరాలు | – | కృతయుగము |
| 12,96,000 సంవత్సరాలు | – | త్రేతాయుగము |
| 8,64,000 సంవత్సరాలు | – | ద్వాపరయుగము |
| 4,32,000 సంవత్సరాలు | – | కలియుగము |
| నాలుగుయుగాలు కలిసి | – | ఒక మహాయుగము |
| 71 మహాయుగాలు | – | ఒక మన్వంతరము |
| 14 మన్వంతరాలు | – | ఒక కల్పము (బ్రహ్మకు ఒక దినము) |
| ఈ రకంగా 100 సంవత్సరాలు | – | బ్రహ్మ ఆయువు. బ్రహ్మ కల్పము. |

బ్రహ్మ కల్పాన్నే మహాకల్పము అని కూడా అంటారు. మహా కల్పాంతాన మహా ప్రళయం సంభవిస్తుంది. అప్పుడు శివుడు తాండవం చేస్తాడు. ఆ మహాతాండవానికి ఆ పరమేశ్వరియే సాక్షి.

## 233. మహాకామేశమహిషీ

మహాకామేశుడు అంటే – పరమశివుడు. ఆయనకు పట్టపురాణి ఆ పరమేశ్వరి.

కామము అంటే – కోరిక. కోరికలు అనేకరకాలు. వీటిని కలిగించేవాడు కామేశ్వరుడు. ఈ కోరికల సమిష్టి స్వరూపమే మహాకాముడు. కొంతమంది పునర్జన్మ అవసరం లేదు మోక్షం కావాలి అనుకుంటారు. మోక్షమనేది సామాన్యమైనది కాదు. చాలా గొప్పకోరిక. అది మహాకామన. కోరికలు ప్రసాదించేవాడు కామేశ్వరుడైతే, వాటియొక్క కామదాయనిశక్తి మహాకామేశ్వరి.

ఈ జగత్తులో 84 లక్షల జీవరాసులున్నాయి. 14 లోకాలున్నాయి. వీటన్నింటినీ పాలించేవాడు. మహాకామేశ్వరుడు. ఈ జీవరాశి అంతా కూడా ఏదో ఒక కర్మ చేస్తూనే ఉంటారు. ఆ కర్మలవల్ల పాపం రావచ్చు. పుణ్యం కూడా రావచ్చు. అలాంటి ఈ జగత్తును రక్షించే బాధ్యత ఈశ్వరుడిది. అతని అర్ధాంగి అయిన పరమేశ్వరిది కూడా. జీవుల యొక్క పుణ్యపాప కర్మల సముదాయమే మహాకామేశమహిషీ అని చెప్పబడుతోంది.

## 234. మహాత్రిపురసుందరీ

త్రిపుటి అనే నగరాలతో తాదాత్మ్యతను పొందినదేవి.

త్రిపుటి మూడు సంఖ్య గల పురములు. అవే త్రిపురములు. ఇవి

1. జ్ఞాత జ్ఞాన జ్ఞేయములు
2. మాతృ మాన మేయములు
3. సృష్టి స్థితి లయాలు
4. ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులు
5. వామ జ్యేష్ట రౌద్రి శక్తులు
6. సత్వ రజ స్తమోగుణాలు
7. బ్రహ్మ విష్ణు రుద్రులు
8. మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులు
9. కామేశ్వరి వజ్రేశ్వరి భగమాలిని.

బిందుస్వరూపుడైన పరబ్రహ్మ నుంచి కొంత శక్తి బయటకు వచ్చి త్రికోణంగా ఏర్పడింది అని ముందే చెప్పటం జరిగింది. ఆ త్రికోణము యొక్క మూడుకోణాలయందు పైన చెప్పిన త్రిపుటి ఉంటుంది. త్రిపుటి అంతా బిందువునుంచి వచ్చినదే కాబట్టి, బిందురూపిణి అయిన ఆ పరమేశ్వరి మహాత్రిపురసుందరీ అనబడుతోంది.

# 235. చతుష్షష్ట్యుపచారాఢ్యా

పరశురామకల్ప సూత్రాలలో ఉపచారాలు 64 అని చెప్పబడింది. అయితే మిగిలిన తంత్రాలలో ఇంకా 8 ఉపచారాలు కూడా చెప్పారు.

పరమేశ్వరికి తప్ప 64 ఉపచారాలతో పూజించబడే అర్హత ఇంకెవరికీ లేదు. ప్రతి జీవి కొన్ని భోగాలు అనుభవిస్తాడు. అవి రెండు రకాలు 1. ఆవశ్యకాలు. 2. వినోదాలు. సాధారణపూజ కంటే షోడశోపచార పూజలో ఆవశ్యక భోగాలుంటాయి. కాని ఉపచారాలసంఖ్య పెరిగిన కొద్దీ వినోదభోగాల సంఖ్య పెరుగుతుంది.

లోకంలో ప్రతిజీవికి ఉండే సామాన్యమైన కోరిక ధనార్జన. దానికోసం పూజలు, వ్రతాలు అనేకం చేస్తాడు. ఇష్టదేవతను తృప్తిపరచటానికి తాననుభవించే భోగాలను దేవతకు సమర్పిస్తాడు. ఇదే ఉపచారము. ఏదైనా వస్తువుని పరమేశ్వరుడికి గనక సమర్పిస్తే, ఆ పరమేశ్వరుడు విరాడ్రూపుడు కాబట్టి, ఆ వస్తువు లోకంలోని అందరికీ చెందుతుంది అని, తిరిగి భగవంతుడు తనకు కూడా అలాంటివి ఇస్తాడని భక్తుడు భావిస్తాడు. అందుచేతనే రకరకాల ఉపచారాలు చేసి ఆ పరమేశ్వరుణ్ణి తృప్తిపరచటానికి ప్రయత్నం చేస్తాడు. ఈ రకమైన వాటిలో చతుష్షష్ట్యుపచార పూజ ఒకటి. దీన్ని గతంలో ప్రస్తావించాం. కాని ఇక్కడ వివరిస్తున్నాం. 64 ఉపచారాలు వరుసగా

1. పాద్యము
2. ఆభరణావరోపణం
3. సుగంధితైలాభ్యంగం
4. మజ్జనశాలాప్రవేశనం
5. మజ్జనశాలామణిపీఠోపవేశనం
6. దివ్యస్నానీ యోద్వర్తనం
7. ఉష్ణోదకస్నానం
8. సకలతీర్థాభిషేకం
9. వస్త్రం
10. అరుణదుకూల పరిధానం
11. అరుణకుచోత్తరీయం
12. ఆ లేపమంటప ప్రవేశనం
13. ఆ లేపమంటపమణి పీఠోపవేశనం
14. చందనాగరుకస్తూరిలేపనం
15. కాలాగరుధూపం
16. కుసుమమాలా
17. భూషణమంటపప్రవేశనం
18. భూషణమంటపమణి పీఠోపవేశనం
19. నవమణిమకుటం
20. చంద్రశకలం
21. సీమంతసింధూరం
22. తిలకరత్నం
23. కాలాంజనం
24. వాళీయుగళం
25. మణికుండలయుగళం
26. నాసాభరణం

27. అధరయావకం
28. మాంగల్యం
29. కనకచింతాకం
30. పథకం
31. మహాపథకం
32. ముక్తావళి
33. ఏకావళి
34. ఛన్నపీఠం
35. కేయూరయుగళచతుష్టయం
36. వలయావళి
37. ఊర్మికావళి
38. కాంచీదామం
39. కటిసూత్రం
40. సౌభాగ్యాభరణం
41. పాదకటకం
42. రత్ననూపురం
43. పాదాంగుళీయకం
44. పాశం
45. అంకుశం
46. పుండ్రేక్షుచాపం
47. పుష్పబాణం
48. మాణిక్యపాదుక
49. మహాచక్రాధిరోహణం
50. కామేశ్వరాంకోపవేశనం
51. అమృతావచషకం
52. ఆచమనం
53. కర్పూరవీటికా
54. ఆనందోల్లాసవిలాసహాసం
55. ఛత్రం
56. చామరయుగళం
57. దర్పణం
58. తాళవృంతం
59. గంధం
60. పుష్పం
61. ధూపం
62. దీపం
63. నైవేద్యం
64. తాంబూలం

ఈ ఉపచారాలు వరుసలో సంప్రదాయాన్ని బట్టి తేడాలున్నాయి. పాఠకులు గమనించ ప్రార్థన.

## 236. చతుష్షష్టికలామయీ

కళలు 64 ఉన్నాయి. వీటన్నింటిలోనూ ఆ పరమేశ్వరి అందెవేసిన చేయి. ప్రావీణ్యురాలు. అందుచేత ఆమె. చతుష్షష్టికళామయీ అనబడుతోంది.

ఈ కళలు రెండురకాలు 1. విద్యాకళలు 2. వృత్తికళలు. ఈ కళలు ఒక్కొక్కచోట ఒక్కొక్క రకంగా ఉన్నాయి. శార్ఙ్గధరీయము, కథాకోశము, శ్రీధరీయము లందు ఈ కళలు వేరువేరుగా ఉన్నాయి. వామకేశ్వరతంత్రంలో వేరుగా ఉన్నాయి. మనకు అందుబాటులో ఉన్న **విద్యా కళలు.**

1. అన్వీక్షికి
2. త్రయీ
3. వార్తా
4. దండనీతి
5. ఆకర్షణము
6. స్తంభనము
7. మారణము
8. విద్వేషణము
9. ఉచ్చాటనము
10. మోహనము
11. ఋగ్వేదము
12. యజుర్వేదము
13. సామవేదము
14. అధర్వణవేదము
15. శిక్షా
16. వ్యాకరణము
17. ఛందస్సు
18. నిరుక్తి
19. జ్యోతిషము
20. కల్పము
21. మీమాంస
22. న్యాయశాస్త్రము
23. పురాణము
24. ధర్మశాస్త్రము
25. ఆయుర్వేదము
26. ధనుర్వేదము
27. నీతిశాస్త్రము
28. అర్ధశాస్త్రము
29. బ్రాహ్మము
30. పాద్మము
31. వైష్ణవము
32. శైవము
33. భాగవతము
34. భవిష్యోత్తరము
35. నారదీయము
36. మార్కండేయము
37. ఆగ్నేయము
38. బ్రహ్మవైవర్తము
39. లైంగము
40. వారాహము
41. స్కాందము
42. గారుడము
43. వామనము
44. కూర్మము
45. మాత్స్యము
46. బ్రహ్మాండము
47. సనత్కుమారము
48. నారసింహము
49. స్కాందము
50. శివధర్మము
51. దౌర్యసము
52. నారదీయము
53. కాపిలము
54. మానవము
55. ఔశనము
56. బ్రహ్మాండము
57. వారుణము
58. కౌశికము
59. లైంగము
60. సాంబము
61. సౌరము
62. పారాశరము
63. మారీచము
64. భార్గవము

వీటిలో మొదటినాలుగు - చతుర్విద్యలు
5 నుంచి 10 వరకు - షడ్విద్యలు
11 నుంచి 14 వరకు - చతుర్వేదములు
15 నుంచి 20 వరకు - వేదాంగములు
21 నుంచి 28 వరకు - శాస్త్రాలు
29 నుంచి 46 వరకు - పురాణాలు
47 నుంచి 64 వరకు - ఉపపురాణాలు

**వృత్తులకు సంబంధించిన కళలు 64 అవి.**

1. గీతం
2. వాద్యం
3. నృత్యం
4. నాట్యం
5. అలేఖ్యం
6. విశేషకము
7. పుష్పకండుల బల్యాది
8. కుసుమాస్తరము
9. దంతవస్త్రాంగరాగము
10. మణికుట్టికర్మ
11. శయ్యానిధి
12. వారివాద్యము
13. చిత్రయోగము
14. పుష్పలావికా విద్య
15. మాల్యగ్రధనం
16. నేపథ్యరచన
17. కర్ణపత్రభంగము
18. సుగంధరచన
19. భూషాయోగము
20. ఇంద్రజాలము
21. కౌచుమారయోగము
22. చిత్రశాకా పూప భక్ష క్రియ
23. హస్తలాఘవం
24. సానకాసవరాగాదినిర్మాణం
25. సూచీవాయప్రక్రియ
26. వీణాడమరువాద్యం
27. సూత్రక్రీడ
28. ప్రహేళికా
29. ప్రతిమాలా
30. దుర్వాచకయోగా
31. పుస్తకవాడకం
32. నాటిఖ్యాయిక
33. సమస్యాపూరణం
34. పట్టికావేత్రవాసము
35. తక్షకర్మ
36. తక్షణం
37. వాస్తు
38. రత్నపరీక్ష
39. ధాతువాదము
40. మణిరాగజ్ఞానము
41. అకరవేదన
42. వృక్షాయుర్వేదము
43. మేషకుక్కుటలనాదియుద్ధం
44. శారికాశుకాలాపనము
45. కేశప్రసాదనము
46. అక్షరోదనము
47. ముష్టికాకధనము
48. మ్లేచ్ఛచ్కర్కవికల్పము
49. దేశభాషాదివేదన
50. ప్రశూనశలజ్ఞానం
51. నిమిత్తజ్ఞానము
52. యంత్రమాతృక
53. ధారణయంత్ర
54. సంవాచ్యము

55. మానసీకావ్యక్రియ
56. ఛందోదీ
57. నానాకోశధీ
58. నానాక్రియాదికల్ప
59. చలఆశయయోగము
60. వస్త్రసంగోపనము
61. దూత్యము
62. బాలక్రీడ
63. ఆకర్షణక్రీడ
64. వైతాళికవిద్య

ఇవన్నీ వృత్తికలు. వీటిని ఆచరించవచ్చు. అయితే విద్యార్థికల్పతరువులో 64 కళలు విడిగా చెప్పటం జరిగింది. ఈ విధంగా ఒక గ్రంథానికి ఇంకొక గ్రంథానికి సంబంధంలేదని పాఠకులు గమనించగలరు.

## 237. మహాచతుష్షష్టికోటియోగినీగణసేవితా

576 కోట్ల యోగినులు అనబడే శక్తిగణముచే సేవించబడునది లలితాదేవి.

తంత్రరాజంలో

**లలితాచక్రనవకే ప్రత్యేకం శక్తి మయః ప్రియే చతుష్షష్టిమితాః కోట్యః**

అని చెప్పబడింది. అంటే – ఓ దేవీ ! లలితా చక్రములు తొమ్మిదింటి యందు ప్రత్యేకముగ 64 కోట్ల యోగినీ శక్తులు గలవు. ఇక్కడ లలితా చక్రములు అనగా శ్రీచక్రంలోని తొమ్మిది ఆవరణలు అని గుర్తించాలి.

పరమేశ్వరి శ్రీచక్రంలోని తొమ్మిది ఆవరణలలోనూ ఒక్కొక్క ఆవరణలో ఎనిమిది దిక్కులయందు ఎనిమిది మంది చొప్పున 9×8×8=576 మంది యోగినులు ఉంటారు. వారందరికీ ఒక్కొక్కరికీ కోటిమంది సేవకులుంటారు. ఈ రకంగా 576 కోట్లమంది యోగినలతో సేవించబడతూ ఉంటుంది ఆ పరమేశ్వరి

శ్రీచక్రానికి అర్చన చేసేటప్పుడు అష్టాష్టకార్చన కూడా చేయవలసి ఉన్నది. అని కులార్ణవతంత్రము, శ్రీవిద్యార్ణవతంత్రములలో చెప్పబడింది.

అష్టాష్టకార్చన అంటే – ఎనిమిది ఆవరణలలోనూ ఎనిమిది దిక్కులయందు యోగినీ ద్వయమును పూజించాలి. అనగా అసితాంగభైరవ మొదలైన ఎనిమిది మంది భైరవులు, బ్రాహ్మి మొదలైన ఎనిమిది మంది మాతృకలు. వీరికి ఒక్కొక్కరికీ ఎనిమిదిమంది చొప్పున సేవకులు. యోగినీ హృదయంలో

**చతుః షష్టియుతాః కోట్యో యోగినీనాం మహౌజసామ్ ।**

**చక్ర మేతత్ సమాశ్రిత్య సంస్థితా వీరవందితే ॥**

వీరుల చేత నమస్కరించబడు ఓ దేవీ ! శ్రీచక్రంలోని ప్రతి ఆవరణలోనూ మహాతేజస్సుతో కూడిన యోగినులు 64 కోట్లమంది ఉన్నారు. ఈ రకంగా తొమ్మిది ఆవరణలలోనూ అసంఖ్యాకమైన యోగినులున్నారు.

చతుష్షష్టికోటియోగినుల వివరాలు

**ప్రథమావరణ :** ప్రధానయోగిని బ్రాహ్మి. ఇతర యోగినులు.

| | | | |
|---|---|---|---|
| 1. అక్షోంబా | 3. రాక్షసాంబా | 5. క్షపాంబా | 7. అక్షపయాంబా |
| 2. ఋక్షకర్ణాంబా | 4. క్షపణాంబా | 6. పింగళాక్ష్యంబా | 8. క్షమాంబా |

**ద్వితీయావరణ :** ప్రధానయోగి మాహేశ్వరి. ఇతర యోగినులు.

| | | | |
|---|---|---|---|
| 1. లీలాంబా | 3. లుత్థాంబా | 5. లూకాంబా | 7. లోలసాంబా |
| 2. లోలాంబా | 4. లుబ్దాంబా | 6. లంకేశ్వరాంబా | 8. విమలాంబా |

**తృతీయావరణ :** ప్రధానయోగిని కౌమారి. ఇతర యోగినులు

| | | | |
|---|---|---|---|
| 1. హుతాశనాంబా | 3. బాడబాముఖ్యంబా | 5. హరయాంబా | 7. క్రోధిన్యంబా |
| 2. విశాలక్ష్యంబా | 4. హర్షంబా | 6. క్రోధిన్యంబా | 8. సరయాంబా |

6, 7 యోగినులకు ఒకటే పేర్లు ఉన్నాయి. ఇది అచ్చు తప్పని భావించకండి.

**చతుర్థావరణ :** ప్రధానయోగిని వైష్ణవి. ఇతర యోగినులు

| | | | |
|---|---|---|---|
| 1. సంఖ్యాపీఠసిద్ధంబా | 3. తారాంబా | 5. హృల్లేఖాంబా | 7. సరసాంబా |
| 2. కరలాంబా | 4. హృష్టాంబా | 6. దశకుందరాంబా | 8. రససంగ్రాహిణ్యంబా |

**పంచమావరణ :** ప్రధానయోగిని వారాహి, ఇతరయోగినులు

| | | | |
|---|---|---|---|
| 1. తాలజంఘాంబా | 3. విద్యుజ్జిహ్వాంబా | 5. మేఘనాధాంబా | 7. కాలకర్ణాంబా |
| 2. రక్తాక్ష్యంబా | 4. కరంకాంబా | 6. ప్రచండౌఘంబా | 8. బలప్రదాంబా |

**షష్టావరణ :** ప్రధానయోగిని మాహేంద్రి. ఇతర యోగినులు

| | | | |
|---|---|---|---|
| 1. శపాంబా | 3. ప్రవాయాంబా | 5. పిచువక్త్రాంబా | 7. పిశితాజ్ఞానాంబా |
| 2. చంపావళ్యంబా | 4. శూలాసాదికాంబా | 6. పిశాచాక్ష్యాంబా | 8. లోలుపాంబా |

**సప్తమావరణ :** ప్రధానయోగిని చాముండ. ఇతర యోగినులు.

| | | | |
|---|---|---|---|
| 1. చామనసాంబా | 3. వాసనాంబా | 5. వాయువేగాంబా | 7. వికనాంబా |
| 2. వానరాంబా | 4. వికటాస్యాంబా | 6. బృహత్కాలాంబా | 8. విశ్వరూపిణ్యంబా |

**అష్టమావరణ :** ప్రధానయోగిని మహాలక్ష్మి. ఇతరయోగినులు.

| | | | |
|---|---|---|---|
| 1. యమజిహ్వాంబా | 3. దుర్జయాంబా | 5. బిడాలాంబా | 7. పూనాంబా |
| 2. జయన్త్యంబా | 4. యమాంతకాంబా | 6. రేవత్యంబా | 8. విజయాంబా |

ఈరకంగా ఒక్కొక్క ఆవరణలోనూ 64 కోట్లమంది చొప్పున తొమ్మిది ఆవరణలలోను 9×64=576 కోట్లమంది యోగినులతో సేవించబడుతోంది. అందుకే దేవి మహాచతుష్షష్టికోటి యోగినీగణసేవితా అనబడింది.



శ్రీ ఋూకార దేవి

# 18. చంద్రవిద్య

శ్రీవిద్యలో పంచదశీ మహామంత్రము ప్రసిద్ధమైనది. శాక్తేయానికి ఇది గాయత్రి వంటిది. గాయత్రీ మంత్రం బ్రాహ్మణులకోసం ఏర్పడగా పంచదశీ మహామంత్రం అన్ని వర్ణాలవారి కోసం ఏర్పడింది. ఈ మంత్రం అందరికీ ఉపాశ్య అని అగస్త్యమహర్షి వ్రాసిన శ్రీవిద్యాదీపిక అనే గ్రంథంలో చెప్పబడింది. పంచదశీ మహామంత్రం మాయను పోగొట్టి పరబ్రహ్మను ప్రకాశింపచేస్తుంది. సూర్యుడికి కిరణములు ఉన్నట్లుగానే పరబ్రహ్మకు మాయసహజంగా ఉంటుంది. కాబట్టి శివుణ్ణి గాని, శక్తినిగాని విడివిడిగా ఆరాధించటం కుదరదు.

పూర్వకాలంలో ఎంతోమంది మహానుభావులు పంచదశీ మహామంత్రాన్ని జపించి తరించారు. వారిలో

**మనుఃశ్చంద్రకు బేరశ్చ లోపాముద్రా చ మన్మథః**
**అగస్తి రగ్నిః సూర్యశ్చ ఇంద్రస్కందః శ్శివ స్తథా**
**క్రోధ భట్టారకో దేవ్యా ద్వాదశాదో ఉపాసకాః**

మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, మన్మథుడు, అగస్త్యుడు, అగ్నిభట్టారకుడు, సూర్యుడు, ఇంద్రుడు స్కందుడు, శివుడు, దుర్వాసుడు శ్రేష్ఠులు. మానసోల్లాసము అనే గ్రంథంలో

**విష్ణుః శివః సురజ్యేష్ఠో మను శ్చంద్రో ధనాధిపః**
**లోపాముద్రా తథాగస్త్యః స్కందః కుసుమసాయకః**
**సురాధీశో రౌహిణేయో దత్తాత్రేయో మహామునిః**
**దుర్వాసా ఇతి విఖ్యాతా ఏతే ముఖ్య ఉపాసకాః**

విష్ణువు, శివుడు, బ్రహ్మ, మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, అగస్త్యుడు, కుమారస్వామి, మన్మథుడు, ఇంద్రుడు, బలరాముడు, దత్తాత్రేయుడు, దుర్వాసుడు అనేవారు దేవీ ఉపాసకులలో శ్రేష్ఠులు.

జ్ఞానార్ణవము అనే తంత్రంలో

**మను శ్చంద్రకుబేర శ్చ మన్మథ స్తదనంతరమ్**
**లోపాముద్రా తథాగస్త్యః స్కందో విష్ణు స్తథా శివః**

**దత్తాత్రేయో మునిః శక్రో దుర్వాసా శ్చ త్రయోదశ**
**ఉపాసతే మహావిద్యాః ద్వాదశోక్తా స్తవా నఘే ! ॥**

ఈ రకంగా పంచదశీ మహామంత్రాన్ని జపించి తరించినవారు అనేకమంది ఉన్నారు. కాని ఈ మంత్రాన్ని ఈ లోకానికి తెచ్చినవాడు మన్మథుడు. అతడే ఈ మంత్రానికి ఋషి అని కొందరి వాదన. కాగా దక్షిణామూర్తి మూలపురుషుడని కొందరంటారు.

మనువు చంద్రుడు కుబేరుడు మొదలైన వారంతా ఈ మంత్రాన్ని ఉపాసన చేశారు. కాని

**ఏవం ద్వాదశధా భిన్నా శ్రీమత్పంచదశాక్షరీ ।**

వీరు ఉపాసించిన మంత్రం వేరుగా ఉన్నది. ఈ 12 మంది ఉపాసించిన మంత్రాలలో ఏ రెండు మంత్రాలూ కలవవు. విచిత్రం ఏమంటే ఈ మంత్రాలకన్నింటికీ ఋషి దక్షిణామూర్తే.

అసలు ఈ మంత్రం రెండు రకాలుగా ఉంటుంది. 1. కాదివిద్య 2. హాదివిద్య.

అకారాదిక్షకారాంతం ఉన్న అక్షరసమామ్నాయానికి మాతృకలు అని పేరు. వీటిలో కకారం తో మొదలయ్యే మాతృకలను కాది మాతృకలని, హకారంతో మొదలయ్యే మాతృకలను హాది మాతృకలని అంటారు. అలాగే పంచదశీ మహామంత్రం కూడా క కారంతో మొదలైతే కాదివిద్య, హకారంతో మొదలైతే హాదివిద్య. పైన చెప్పిన ఉపాసకులలో కొంతమంది కాది విద్యనుపాసించగా, మరికొందరు హాది విద్యనుపాసించారు.

**తేషుద్వావనురాజౌతు వరిష్ఠౌ వింధ్యమర్ధన**
**లోపాముద్రా కామరాజావితి ఖ్యాతి ముపాగతౌ ।**
**హాది స్తు లోపాముద్రా స్యా త్కామరాజస్తు కాదికః**
**తయోస్తు కామరాజోయం సిద్ధిదో భక్తిశాలినః ॥**

ఈ మంత్రాలన్నింటిలోనూ హాదిమతంలో లోపాముద్రా, కాదిమతంలో కామరాజీయము ప్రసిద్ధి చెందినాయి. వాటిలో కూడా కామరాజమంత్రమే శ్రేష్ఠమైనది.

## 238. మనువిద్యా

సృష్టిలో మొట్టమొదటివాడు మనువు. ఈ మనువునుంచే మానవలోకం అంతా ఉద్భవించింది.మనువులు 14మంది. వీరినే చతుర్దశ మనువులు అంటారు. వారు.

| | | |
|---|---|---|
| 1. స్వాయంభువ | 6. చాక్షుష | 11. రుద్రసావర్ణి |
| 2. స్వారోచిష | 7. వైవస్వత | 12. ధర్మసావర్ణి |
| 3. ఉత్తమ | 8. సూర్యసావర్ణి | 13. రౌచ్య |
| 4. తామస | 9. దక్షసావర్ణి | 14. భౌచ్యులు |
| 5. రైవత | 10. బ్రహ్మసావర్ణి | |

ప్రస్తుతం జరుగుతున్నది వైవస్వతమన్వంతరం.

పంచదశీ మహామంత్రాన్ని ఉపాశించిన వారిలో మొదటివాడు మనువు. అతడు ఈ మంత్రాన్ని ఉపాసించి తరించాడు. మనువు ఉపాసించిన మంత్రం

**అస్యశ్రీ మనువిద్యాంబా మహామంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః । అనుష్టుప్ఛందః । మనువిద్యాంబాదేవతా ।**

**క హ ఏ ఈ ల హ్రీం - బీజం ।**
**హ స క హ ల హ్రీం - శక్తిః ।**
**స క ల హ్రీం - కీలకం - జపేవినియోగః**

**న్యాసము : కూటత్రయముతో రెండు ఆ వృత్తులు చెప్పాలి.**

**ధ్యానము : సకుంకుమవిలేపనా ........ స్మరేదంబికాం ।**

**మంత్రము : క హ ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ।**

ఇది మనువు ఉపాసించిన మంత్రం కాబట్టి మనువిద్య అనబడుతోంది. ఇది చంద్రవిద్య, భానువిద్య అని రెండు రకాలు. ఇక చంద్రవిద్యను వివరిస్తున్నారు.

**గమనిక :** శ్రీవిద్యకు పంచదశి మహామంత్రం ప్రధానమైనది. ఈ గ్రంథంలో అవసరమైనచోట్ల ఆ మంత్రాన్ని వివరించటం జరుగుతోంది. లేకపోతే గ్రంథం అసమగ్రం అవుతుంది. అయితే ఉపాసనలేనివారు మంత్రరహస్యాలను చదివేటప్పుడు ఆ పరమేశ్వరి యందు దృష్టినిల్పి, ఆమెనే గురువుగా భావించి గ్రంథం చదివితే దోషం ఉండదు.

## 239. చంద్రవిద్యా

ఆ పరమేశ్వరి చంద్రవిద్యా స్వరూపిణి. ఆమె చంద్రమండలాన్ని ఆధారంగా చేసుకుని పూజింపబడుచున్నది.

పంచదశి మంత్రాన్ని ఉపాసించిన వారిలో చంద్రుడు ఒకడు. అతడుపాసించిన మంత్రం.

అస్యశ్రీ చంద్రవిద్యాంబా మహామంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః అనుష్టుప్ఛందః శ్రీ చంద్రవిద్యాంబా దేవతా ।

స హ క ఏ ఈ ల హ్రీం - బీజం

స హ క హ ల హ్రీం - శక్తిః

స హ స క ల హ్రీం - కీలకం - జపేవినియోగః

**న్యాసము** : కూటత్రయముతో రెండు అవృత్తులు న్యాసము అని చెప్పాలి.

**ధ్యానము** : సంకుంకుమ విలేపనా....

**మంత్రము** : స హ క ఏ ఈ ల హ్రీం । స హ క హ ల హ్రీం ।
స హ స క ల హ్రీం ।

ఈ రకంగా చంద్రుడు ఉపాసించిన విద్య కాబట్టి చంద్రవిద్యా అనబడుతోంది.

## 240. చంద్రమండలమధ్యగా

**చంద్రమండలస్య మధ్యం గచ్ఛతీతి**

చంద్రమండలము యొక్క మధ్యభాగమున ఉండునది. శ్రీచక్రమే చంద్రమండలము. దానియొక్క మధ్యభాగమున లేక శిరోభగామున ఉండునది. శివపురాణంలో శివుడు పార్వతికి చెబుతున్నాడు.

**అహ మగ్ని శిరోనిష్ఠ త్వం సోమశిరసి స్థితా ।**
**అగ్నీషోమాత్మకం విశ్వం ఆవాభ్యాం సమధిష్ఠితం ॥**

నేను అగ్నిశిరసున ఉంటాను. నీవు చంద్రుని శిరసున ఉంటావు. అగ్ని సోమాత్మకమైన విశ్వము మన వలన ఉద్ధరింపబడుతున్నది.

చంద్రమండలం ప్రత్యక్షంగా ఆకాశంలో కనిపిస్తుంది. సాయం సమయంలోను, రాత్రులందు పరమేశ్వరిని చంద్రమండలమందుండునదిగా భావించి ఉపాసన చెయ్యాలి.

శ్రీచక్రమే చంద్రమండలమని చెప్పాం. అందులోని రెండవ ఆవరణ 16 దళాలున్న పద్మము. అందులో చంద్రుని యొక్క షోడశకళలు ఉంటాయి. ఆ దళాలలో షోడశి మంత్రాన్ని భావించి ధ్యానించాలి.

మానవశరీరంలో ద్వాదశాంతము అని ఒక స్థానమున్నది. బిందుస్థానాన్నే ద్వాదశాంతము అంటారు. ఆధారచక్రం దగ్గర నుండీ లెక్కపెట్టినట్లైతే బిందువు పన్నెండవదవుతుంది. అందుకే దాన్ని ద్వాదశాంతము అన్నారు.

| | | |
|---|---|---|
| 1. అకుల పద్మము | 5. స్వాధిష్ఠానము | 9. లంబికాగ్రము |
| 2. అష్టదళపద్మము | 6. మణిపూరము | 10. ఆజ్ఞాచక్రము |
| 3. షడ్దళపద్మము | 7. అనాహతము | 11. సహస్రకమలము |
| 4. మూలాధారము | 8. విశుద్ధిచక్రము | 12. కులపద్మము |

ఇక్కడున్న సహస్రారకర్ణికనే బిందుస్థానమంటారు. అదే చంద్రమండలము. సుధాసింధువు. ఇది చంద్రాగ్నుల అంటే శివశక్తుల సంగమస్థానము. ఈ చంద్రమండల మధ్యభాగాన ఉండేదే పరమేశ్వరి.

## 241. చారురూపా

**చారుసుందరం రూపం లావణ్యంయస్యాః - సా**

అందమైన రూపలావణ్యములు గలది

**హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజామ్**
**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ**

ఇక్కడ చెప్పినట్లుగా ఆ పరమేశ్వరి సువర్ణ వికారమైన రూపలావణ్యము గలది. లోకంలోని మానవులకు, పశుపక్ష్యాదులను కూడా వశము చేసుకొనగల రూప లావణ్యములు గలది కాబట్టే ఆమె చారురూపా అనబడింది.

## 242. చారుహాసా

**చారుః హాసోయస్యాః** అందమైన నగవు కలది. **తవైవ మందస్మిత బిందురిందుః** నీ చిరునగవే చంద్రబింబము.

మనోహరమైన మందహాసము గలది. పరమేశ్వరి ముఖము **శరశ్చంద్రవదనా** శరత్కాలములో పున్నమినాటి చంద్రునివలె స్వచ్ఛంగా గుండ్రముగా ఉన్నది. ఆ ముఖము నుంచి వచ్చే దరహాసచంద్రికలు శరత్పూర్ణిమా చంద్రికల కన్న చల్లగా ఉంటాయి. అందుచేత దేవి చారుహాసా అనబడుతోంది. పరమేశ్వరి చిరునగవు సామాన్యులను భక్తులుగా మారుస్తుంది. భక్తులను తన్మయులుగా చేస్తుంది. పరమేశ్వరి ముఖాన ఈ చిరునగవు దర్శించేవారు ఇహపరాలు పొంది ఉంటారు.

## 243. చారుచంద్రకళాధరా

వృద్ధిక్షయాలు లేనటువంటి సాదాఖ్యకళ అను జ్ఞానకళను ధరించినది. దేవీ భాగవతంలో "కాశీరాజు కుమార్తె శశికళ. పేరుకు తగినట్లే రూపవతి. గుణవంతురాలు. పరమేశ్వరి భక్తురాలు. ఒక నాటి తెల్లవారు ఝామున పరమేశ్వరి ఆమె కలలో కనిపించి అందగాడు శౌర్యవంతుడు, పరాక్రమవంతుడు అయిన సుదర్శనుడు నీకు భర్తగా లభిస్తాడు అని చెప్పి అదృశ్యురాలైంది" అని చెప్పబడింది. ఆ శశికళకు ఆధారభూతురాలు కాబట్టి చారుచంద్రకళాధరా అనబడింది.

మనోహరమగు చంద్రకళను శిరోభూషణముగా ధరించినది. ఇక్కడ ఉన్న చంద్రకళకు వృద్ధి క్షయాలు లేవు. అది అష్టమినాటి కళ. అందుకే పరమేశ్వరిని స్తుతించేటప్పుడు **చంద్రకళావతంసే** అంటారు.

**విశుద్ధజ్ఞానదేహాయ త్రివేదీ దివ్యచక్షు షే ।**
**శ్రేయః ప్రాప్తి నిమిత్తాయ నమః సోమార్ధ ధారిణే ॥**

## 244. చరాచరజగన్నాథా

**జంగమం స్థావరాత్మకస్య జగతః అధీశ్వరీ**

స్థావరజంగమాత్మకమైన జగత్తుకు అధీశ్వరి. స్థావరములు అంటే కదలిక లేకుండా స్థిరంగా ఉండేవి. జంగమములు అంటే కదలిక లేక చలనము గలవి. మొత్తం మీద చరాచరజగత్తుకు అధీశ్వరి, ప్రభ్వి అని అర్థం.

ఈ లోకంలో అనేకరకాలయినటువంటి వస్తువులు పదార్థాలు జీవులు మన కంటికి కనిపిస్తుంటాయి. వీటిలో అడవులు, ఎడారులు, కొండలు, కోనలు, నదులు, సముద్రాలు జీవజాలము ఉన్నాయి. 84 లక్షల జీవరాశికి ప్రాణమున్నది. కాబట్టి అవి కొద్దోగొప్పో కదులుతూనే ఉంటాయి. చెట్లు చేమలకు కూడా ప్రాణమున్నది అని నిరూపించాడు. జగదీష్ చంద్రబోసు. కాబట్టి ఇవన్నీ ప్రాణమున్నవే. అయితే ఎడారులు, కొండలు, పర్వతాలు, నదులు వీటి విషయంలోనే సందేహం వస్తుంది. ఎడారి కూడా భూమే కాబట్టి దాన్ని గురించి ఆలోచనలేదు. అది పంచభూతాలలో ఒకటి. ఇక కొండలు పర్వతాలు. ఇవి నేలలో ఏర్పడిన రాతిపొరగదా ? మరి వీటికి ప్రాణమున్నదా ? ఉన్నది అంటున్నాయి మన పురాణాలు. ఈ పర్వతాలన్నింటికీ రెక్కలు ఉండేవని, అవి ఎగురుతూ పోయి జనావాసాల మీద వాలేవనీ, అప్పుడు జరిగే జననష్టాన్ని నివారించటం కోసమే

దేవేంద్రుడు వాటిరెక్కలు నరికేశాడు. అప్పుడు మైనాకుడు అనే పర్వతం పారిపోయి సముద్రగర్భంలో దాక్కుంది. రామాయణంలో ఆంజనేయుడు సముద్రాన్ని దాటుతున్నప్పుడు మైనాకుడు పైకి వచ్చి ఒకింతసేపు తన తల మీద విశ్రాంతి తీసుకోవలసినదిగా హనుమంతుణ్ణి కోరతాడు అని చెప్పబడింది.

అలాగే, ఒకప్పుడు వింధ్యపర్వతం తనకు ప్రత్యేకమైన గుర్తింపు కావాలనే తలంపుతో తన ఆకారాన్ని, శిఖరాలను బాగా పెంచేసి సూర్యగమనాన్ని సైతం అడ్డుకుంది. ఆ తరువాత అగస్త్యమహర్షి వచ్చి వింధ్యపర్వతాన్ని వంచేశాడు. అని చెప్పబడింది. ఈ విషయం అందరికీ తెలిసినదే.

తారకాసుర సంహారం కోసం దేవతలనందర్నీ వెంటపెట్టుకుని విష్ణుమూర్తి హిమాలయాలకు వెళ్ళి పరమేశ్వరిని పరిపరివిధాల కీర్తిస్తారు. అప్పుడు ఆ దేవి ప్రత్యక్షమై వారి కోరికలు తీరుస్తుంది. తారకాసుర సంహారానికి ఉపాయం చెబుతుంది. ఆ తరువాత హిమవంతుడు పరమేశ్వరిని తన ఇంట కుమార్తెగా జన్మించమని అడుగుతాడు. ఆ సరేనని హిమవంతుని ఇంట హైమవతిగా జన్మిస్తుంది.

జైమినీ భారతంలో ఉద్దాలకుడు తన భార్య అయిన చండికను "గొండారారణ్యంబున గుండురాయివై పెద్దకాలంబు పడిఉండుమని" శపిస్తాడు. ఆ తరువాత చండిక పశ్చాత్తాపంతో దుఃఖిస్తే శాపవిమోచనం చెబుతూ" అశ్వమేధాశ్వరక్షణకై అర్జునుండు ఏతెంచు వానికరంబు సోకిన పునీతవయ్యెదవు" అంటాడు.

ఈ రకంగా రాళ్ళు, రప్పలు, కొండలు, పర్వతాలకు కూడా ప్రాణాలున్నాయని అనేక ఉదాహరణలున్నాయి.

అదే విధంగా రామాయణంలో సముద్రుణ్ణి దారివ్వమని అడుగుతాడు రాముడు. సముద్రుడు తన మాట వినలేదని కోపించి బాణం అతడి మీదికి సంధిస్తాడు. అప్పుడు సముద్రుడు ప్రత్యక్షమవుతాడు. సముద్రాన్ని దాటే ఉపాయం చెబుతాడు.

భగీరథుడిచే ప్రార్థింపబడిన గంగ ఆకాశంనించి క్రిందికి దిగుతూ శివుని తలమీద కూర్చుంటుంది.

భారతంలో ప్రతీపుడు అనే మహారాజు గంగానదీ తీరంలో విశ్రమించి ఉండగా, గంగానది స్త్రీరూపంలోవచ్చి అతని కుడితొడమీద కూర్చుని తనను వివాహం చేసుకోమని అడుగుతుంది. కుడివైపున కూర్చున్న స్త్రీని వివాహమాడటం ధర్మశాస్త్రవిరుద్ధం. కాబట్టి

నా కుమారుడైన శంతనుణ్ణి వివాహమాడవలసినది అని చెప్పాడు. ఆ తరువాత కొంత కాలానికి గంగానదీతీరానికి వచ్చిన శంతన మహారాజును వివాహమాడుతుంది గంగ.

కొన్ని సందర్భాలలో పుణ్యస్త్రీలు నదీమ తల్లులుగా మారారని చెప్పబడింది. రామాయణంలోని శబరి నదిగా మారింది.

ఈ రకంగా చూస్తే నదులు సముద్రాలు కూడా ప్రాణమున్నవే. కాబట్టి స్థావర జంగమాత్మకమైన జగత్తు అంటే కంటికి కినిపించేటటువంటి దృశ్యము అంతా అని అర్థం. ఈ జగత్తంతా పరమేశ్వరివల్లనే ఉద్భవించింది. లోకంలో ఘోరమైన పాపాలుచేసినవారు కొండలు బండలుగా పుడతారని, పుణ్యాత్ములు నదులుగా పుడతారని ప్రతీతి. ఇదంతా వారి పూర్వజన్మ సుకృతం వల్ల జరుగుతుంది. ఈ రకంగా జీవుల కర్మఫలాన్ని బట్టి వారికి ఉత్తరజన్మలు ప్రసాదించేది ఆ దేవి. అందుకే ఆమె చరాచరజగన్నాథా అనబడుతుంది.

## 245. చక్రరాజనికేతనా

**త్రైలోక్యమోహనాది నవచక్రరాజమేవ నికేతనం వాసస్థానం యస్యాః ॥**

త్రైలోక్యమోహనము మొదలైన తొమ్మిదిచక్రములు నివాసస్థానముగా గలది.

యంత్రానికి చక్రము అని కూడా పేరు. యంత్రాలు అనేకరకాలు. యంత్రశాస్త్రంలో ప్రతి దేవతకు ఒక యంత్రం ఉంటుంది. యంత్రము – దేవతకు ప్రతిరూపము. ఇది శ్రీవిద్య. శ్రీవిద్య అంటే బ్రహ్మవిద్య. శ్రీవిద్యామంత్రము అంటే – షోడశాక్షరి. ఇది మంత్రరాజము అని చెప్పబడుతుంది. అదేవిధంగా శ్రీచక్రం యంత్రరాజము. 'భండాసురవధ'లో శ్రీచక్రాన్ని చాలావరకు వివరించటం జరిగింది. కాని సందర్భాన్ని బట్టి ఇప్పుడు కొద్దిగా చెప్పటం జరుగుతున్నది.

4 శివచక్రములతోను 5 శక్తిచక్రములతోను శ్రీచక్రము శివాశివుల సంగమస్థానమై విరాజిల్లుతున్నది. శ్రీచక్రంలో మొత్తం తొమ్మిదిఆవరణలు ఉంటాయి. అవి.

| | | |
|---|---|---|
| ప్రథమావరణ | – | భూపురము |
| ద్వితీయావరణ | – | షోడశదళము |
| తృతీయావరణ | – | అష్టదళము |

| | | |
|---|---|---|
| చతుర్థావరణ | – | చతుర్ధశకోణము |
| పంచమావరణ | – | బహిర్దశారము |
| షష్ఠావరణ | – | అంతర్దశారము |
| సప్తమావరణ | – | అష్టకోణము |
| అష్టమావరణ | – | త్రికోణము |
| నవమావరణ | – | బిందువు |

శ్రీచక్రంలో మూడువృత్తాలు కూడా ఉన్నాయి. కాని వాటిని ఆవరణలలో చేర్చలేదు. ఏ సంప్రదాయంలోనూ కూడా వాటికి పూజలేదు. ఈ నవావరణలలోనూ తొమ్మిదవ ఆవరణ అయిన బిందువునందు ఉంటుంది ఆ పరమేశ్వరి. అందుచేతనే ఆమె చక్రరాజనికేతనా అనబడుతుంది.

మానవదేహమే శ్రీచక్రము అని కూడా చెప్పటం జరిగింది. మానవదేహంలోని వివిధస్థానాలు శ్రీచక్రంలోని వివిధ ఆవరణలుగా చెప్పబడ్డాయి. అందులో

| | | |
|---|---|---|
| బిందువు | – | బ్రహ్మరంధ్రము |
| త్రికోణము | – | మస్తకము |
| అష్టకోణము | – | లలాటము |
| అంతర్దశారము | – | భృకుటి |
| బహిర్దశారము | – | కంఠము |
| చతుర్దశారము | – | హృదయం |
| అష్టదళపద్మము | – | నాభి |
| షోడశదళపద్మము | – | కటి |
| వృత్తత్రయము | – | ఊరువులు |
| భూపురము | – | పాదాలు |

ఈ రకంగా ఉన్నటువంటి శ్రీచక్రంలోని తొమ్మిదవ ఆవరణ అంటే బిందువు నందు, (అదే మానవదేహంలో బ్రహ్మరంధ్రము) శివశక్తులు ఉంటారు. అందుచేతనే ఆ పరమేశ్వరి చక్రరాజనికేతనా అనబడుతుంది.

## 246. పార్వతీ

పర్వతరాజు యొక్క కుమార్తె కాబట్టి పార్వతి అనబడింది.

వజ్రాంగుని కుమారుడు తారకాసురుడు. బ్రహ్మను గూర్చి ఘోరతపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చి ఏ వరం కావాలో కోరుకోమన్నాడు బ్రహ్మ. చావులేకుండా వరం కావాలన్నాడు తారకుడు. అది అసంభవం కాబట్టి ఇంకేదయినా కోరుకోమన్నాడు బ్రహ్మ. ఈ సృష్టిలో ఇంతవరకు ఉన్న దేనితోను నేను మరణించకూడదు అన్నాడు తారకుడు సరేనన్నాడు బ్రహ్మ.

వరబలంతో గర్వించిపోయాడు తారకుడు. దేవతలను నానావిధాలుగా పీడించటం మొదలుపెట్టాడు. అతని ఆగడాలు భరించలేక విష్ణువుకు మొరపెట్టుకున్నారు దేవతలు. తారకుడి వరప్రభావం వారికి తెల్పి అందరమూ కలిసి ఆ పరమేశ్వరిని ప్రార్థిద్దాంరండి అని దేవతలందరినీ హిమాలయాలకు తీసుకుపోయాడు విష్ణువు. అక్కడ దేవతలు పరమేశ్వరిని నానావిధాల కీర్తిస్తున్నారు.

చైత్రశుద్ధ నవమి శుక్రవారం దేవి వారికి దర్శనమిచ్చింది. శివపార్వతుల కల్యాణం జరిపించండి. వారికి పుట్టిన కుమారస్వామి తారకుని సంహరిస్తాడు అని చెప్పింది. అప్పుడు పర్వతరాజైన హిమవంతుడు పరమేశ్వరిని తన ఇంట జన్మించమని అర్థించాడు. అతని కోర్కెనంగీకరించి మేనక హిమవంతులకు పార్వతి అనే పేరుతో జన్మించింది ఆ పరమేశ్వరి.

తరువాత కాలంలో శివపార్వతుల కల్యాణం జరిగింది. వారికి కుమారుడైన కుమారస్వామి తారకుని సంహరించాడు.

కాబట్టి పార్వతి అంటే ఆ పరమేశ్వరియే. హిమవంతుని ఇంట జన్మించింది. అంచేత ఆ పరమేశ్వరి రూపమే పార్వతి.

పర్వతములాగా కదలనిది. ఎటువంటి మార్పులేనిది, నిర్వికారమైనది.

## 247. పద్మనయనా

**పద్మే ఇవ నయనే యస్యాః సా - పద్మనయనా**

పద్మములవలె అందమైన విశాలమైన కనులు గలది. పద్మాలు రెండు రకాలు. 1. ఎర్ర రంగులో ఉండే పద్మాలు 2. తెల్లని పద్మాలు. దేవిచేతిలోని ఆయుధాలను చెప్పేటప్పుడు కమలము - ఎర్రకలువ, కల్హారము - తెల్లకలువ అని చెప్పటం జరిగింది.

పరమేశ్వరికి సూర్యచంద్రులే నేత్రాలు. వాటిలో రక్తవర్ణము సూర్యనేత్రము, శ్వేతవర్ణము చంద్రనేత్రము అని చెప్పబడుతోంది. కాబట్టి దేవి నేత్రాలు ఎరుపు, తెలుపు వర్ణాలతో పద్మములలాగా ప్రకాశిస్తుంటాయి.

## 248. పద్మరాగసమప్రభా

మిక్కిలి ఎర్రనైన పద్మరాగమణితో సమానమైన కాంతిగలది. పద్మరాగములవలె ఎర్రని శరీరకాంతి గలది. కురువిందమణిశ్రేణి అనే 14వ నామంలో మాణిక్యాలను గురించి వివరించటం జరిగింది.

సింహళదేశంలో దొరికే వాటిని పద్మరాగాలు అంటారు. ఇవి మాణిక్యాలలో శ్రేష్ఠమైనవి. ఈ పద్మరాగములను పోలిన శరీరకాంతి గలది. అందుచేతనే దేవి పద్మరాగ సమప్రభా అనబడుతోంది.

## 249. పంచప్రేతాసనాసీనా

పంచప్రేతములే ఆసనముగా గలది. పరమేశ్వరి యొక్క ఆసనానికి పంచబ్రహ్మలు కోళ్ళుగా ఉన్నారు.

బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు, సదాశివుడు వీరందరూ శక్తి తమతో ఉంటేనే ఏ పని అయినా చెయ్యటానికి సమర్థత గలిగి ఉంటారు. సృష్టి ప్రారంభంలో పరమేశ్వరి వీరందరికీ తన అంశ అయిన శక్తులను సహాయకారులుగా ఇచ్చి, తమ పనులను కొనసాగించమని చెప్పింది. మీరు ఆ శక్తులను ఎప్పుడూ అవమానించకండి. ఒకవేళ ఆ శక్తులు గనక మిమ్ము వదలివెళ్ళిపోతే మీరు శక్తిహీనులై పోతారు అని చెప్పింది. అవే పంచశక్తులు. వామ, జ్యేష్ఠా, రౌద్రి, ఆదిశక్తి, పరాశక్తి తరువాత కాలంలో ఈ శక్తులు తమ వద్ద లేక వారు శక్తిహీనులైపోయారు. శంకరభగవత్పాదులవారు సౌందర్య లహరిలోని మొదటిశ్లోకంలో చెబుతూ

**శివ శ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవతుం**
**న చే దేవం దేవో న ఖలు కుశలః స్పందిత మపి**

అంటారు. ఆ శక్తి గనక లేకపోయినట్లైతే సాక్షాత్తూ ఈశ్వరుడు కూడా ఏ పనీ చెయ్యలేడు. శక్తిహీనుడవుతాడు. జ్ఞానార్ణవతంత్రంలో పార్వతీదేవి శివుణ్ణి "దేవా ! పంచప్రేతాల కారణం ఏమిటి ? వారు నిర్జీవులు ఎందుకు అయినారు ?" అని అడుగుతుంది. అప్పుడు శివుడు

**సాధు పృష్టం త్వయాభద్రే పంచప్రేతాసనం కథం**
**బ్రహ్మో విష్ణుశ్చ రుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః**
**పంచప్రేతా వరారోహే నిశ్చలా ఏవ తే సదా**
**బ్రహ్మణః పరమేశాని ! కర్తృత్వం సృష్టి రూపకం**
**వామా శక్తి స్తు సాజ్ఞేయా బ్రహ్మప్రేతో న సంశయః**
**శివస్యకరణం నాస్తి శక్తేస్తు కరణం యతః**

దేవీ! బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర సదాశివులు పంచప్రేతాలు. సృష్టికర్త అయిన బ్రహ్మకు వామాశక్తి లేనప్పుడు అతడు నిశ్చలుడు ప్రేత అవుతున్నాడు. అట్లాగే మిగిలిన వారు కూడా తమ శక్తులు లేనప్పుడు వారు ప్రేతలగుచున్నారు" అని చెప్పాడు.

అటువంటి నిశ్చలులు, చలనం లేని పంచబ్రహ్మలు దేవి కూర్చునే ఆసనానికి మొదటి నలుగురు కోళ్ళుకాగా సదాశివుడు పైన పలక అయినాడు. ఇదే విషయం దేవీభాగవతంలో కూడా చెప్పబడింది.

**బ్రహ్మోవిష్ణుశ్చరుద్రశ్చ । ఈశ్వరశ్చ సదాశివః**
**ఏతే పంచఖురాః ప్రోక్తాః ఫలకస్తు సదాశివః**

అందుచేతనే ఆ దేవి పంచప్రేతాసనాసీనా అనబడుతోంది.

## 250. పంచబ్రహ్మస్వరూపిణీ

పంచబ్రహ్మ లందు ఐక్యము కలది కావటంచేత ఆ దేవి పంచబ్రహ్మస్వరూపిణి అనబడుతోంది. త్రిపురా సిద్ధాంతంలో పరబ్రహ్మ తన మాయావిలాసంతో బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు అనే పేర్లతో పిలువబడుతున్నాడు అని చెప్పబడింది. సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములు వారి మంత్రాలు.

లింగపురాణంలో జీవ, ప్రకృతి, బుద్ధి, అహంకార మనస్సులను పంచబ్రహ్మలు అన్నారు అలాగే పంచతన్మాత్రలస్వరూపాలు. జీవి యొక్క ఇంద్రియాలు.

| | | |
|---|---|---|
| శబ్దము | – | చెవి |
| స్పర్శ | – | చర్మము |
| రూపము | – | కన్ను |
| రసము | – | నాలుక |
| గంధము | – | ముక్కు |

వీటి యొక్క స్వరూపమే ఆ పరమేశ్వరి. అందుచేత పంచబ్రహ్మ స్వరూపిణి అనబడుతోంది. యజ్ఞవైభవఖండంలో సత్యము, జ్ఞానము మొదలైన లక్షణాలు కలవాడు, వికారరహితుడు పరిశుద్ధుడు అయినవాడు ఈశ్వరుడొక్కడే. అయినప్పటికీ తన యొక్క శక్తిచేత ఐదువిధాలుగా ఉన్నాడు అని చెప్పబడింది.

గరుడపురాణంలో సర్వదుష్ట సంహారం కోసం శ్రీమహావిష్ణువు నారాయణ, సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న అనిరుద్ధులు అని ఐదురూపములుగా ఉన్నాడు అని చెప్పబడింది.

ఆ పరమేశ్వరి యొక్క లీలలు పంచపురుషులైనారు. వారందరి స్వరూపమే ఆ దేవి. అందుచేతనే ఆమె పంచబ్రహ్మ స్వరూపిణి అనబడింది.

## 251. చిన్మయీ

ఆ పరమేశ్వరి చిత్స్వరూపిణి. **చిదభేదాత్ చిన్మయీ** చిత్తుతో భేదము లేక ఉందునది. పరమేశ్వరి జ్ఞానస్వరూపిణి. నిర్వికారమయిన పరబ్రహ్మ యొక్క ఆనందమయరూపము. జగత్తులోని జీవరాశినందంతటా చిత్కలారూపంలో వెలుగొందుతున్నది. నామ రూపాత్మకమైనది ఈ జగత్తు. ఇందులో నామ రూపాలే వ్యవహారములు. వీటిలోని చైతన్యము పరమేశ్వరి. ఆ చైతన్యమే లేకపోతే జగత్తు అంతా జడము అయిపోతుంది. అంటే చైతన్యము గనక లేకపోతే జగత్తంతా లయం అయిపోతుంది. అందుచేత చైతన్యరూపంలో ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నది కాబట్టే ఆమె చిన్మయీ అనబడుతోంది.

**చతుర్బీజం చతుర్బిందు చతుష్కూటం చతుష్పదం ।**
**చతుష్టయమవస్థానాం నిష్కలం చిన్మయం స్మృతం ॥**

పరమేశ్వరి యొక్క ఏకాక్షరిమంత్రంలో రక్త, శుక్ల, మిశ్రమ, సంవిద్బిందువులు నాలుగు, ఈ నాలుగు బీజములు, కూటచతుష్టయము, పాదచతుష్టయము, అవస్థాచతుష్టయముగా చెప్పబడుతున్నాయి. షోడశకళాప్రపూర్ణమైన చంద్రమండలాకారమే సచ్చిదానందరూపము. దానిమీద నిష్కలారూపమే చిన్మయీ అనబడుతుంది. ఇది చంద్రవిద్య.



# 19. జ్ఞేయరూపము

ఇంతవరకు చంద్రవిద్యలో పరమేశ్వరి యొక్క ఉపాస్యరూపాన్ని వివరించటం జరిగింది. ఇక నుంచి పరమేశ్వరి జ్ఞేయరూపాన్ని వివరిస్తున్నారు. జ్ఞేయము అంటే తెలుసుకోదగినది. ఎరుగదగినది అని అర్థము.

## 252. పరమానందా

**పరమః ఉత్కృష్టః ఆనందోయస్యాః స్వరూపం - సా**

ఉత్కృష్టమైన ఆనందము స్వరూపంగా గలది. నిరతిశయ సుఖస్వరూపం గలది. 'ఏది అనంతమో అది సుఖము' అంటోంది శ్రుతి.

ఆనందము రెండు రకాలు 1. ఇహము 2. పరము. ఇహంలో ఉండే ఆనందము అశాస్వతము అనిత్యము అది అనుభవించినంతవరకే ఉంటుంది. ఆ తరువాత దుఃఖానికి దారితీస్తుంది. పరమానందం ఒక్కటే శాశ్వతమైన ఆనందం. అదే బ్రహ్మానందం. బ్రహ్మానందాన్ని గురించి తైత్తిరీయోపనిషత్తులో చెప్పబడింది.

ఈ ఆనందం శ్రోతీయుడు, సదాచారసంపన్నుడు. నిష్కాముడు అయిన బ్రహ్మవేత్తయే అనుభవించతగ్గది. ఈ మూడు గుణాలు లేనివాడికి ఈ ఆనందం లభించదు.

ఈ లోకంలోని సంపద అంతా యువకుడు, సదాచారసంపన్నుడు, వేదాధ్యాయి, బలమైనవాడు అనుభవించటానికే ఉన్నది. దీనిని అనుభవించటంవల్ల కలిగే ఆనందం మానుషానందం.

మానుషానందానికి నూరురెట్లు - మనుష్యగంధర్వానందం. మనుష్యగంధర్వులు అంటే మానవులై ఉండి పుణ్యకర్మలచేత గంధర్వత్త్వం పొందినవారు.

మనుష్యగంధర్వానందానికి నూరురెట్లు - దేవగంధర్వానందం. సృష్టికాలంలో దేవలోకంలో గంధర్వులుగా పుట్టినవారు దేవగంధర్వులు. దేవగంధర్వానందానికి నూరురెట్లు - చిరలోక పితరానందము. చిరకాలం ఉండే లోకంలో ఉన్న పిత్రుదేవతలను చిరలోకపితురులు అంటారు. చిరలోకపితరానందానికి నూరురెట్లు - అజానజదేవానందం. దేవలోకానికి పైన ఈ లోకమున్నది. అజానజదేవానందానికి నూరురెట్లు - కర్మ దేవానందం. వైదిక కర్మలు చేసిన వారు కర్మదేవతలు.

కర్మ దేవానందానికి నూరురెట్లు - దేవానందం. యజ్ఞంలోహవిర్భాగం తీసుకునే 33 మంది దేవతలు.

| | | |
|---|---|---|
| దేవానందానికి నూరురెట్లు | – | ఇంద్రానందం |
| ఇంద్రానందానికి నూరురెట్లు | – | బృహస్పతి ఆనందం |
| బృహస్పతి ఆనందానికి నూరురెట్లు | – | ప్రజాపతి ఆనందం |
| ప్రజాపతి ఆనందానికి నూరురెట్లు | – | బ్రహ్మానందం |

అతడే పరబ్రహ్మ. జీవులందరిలోనూ ఉన్నాడు. అదే పరమానందము. పరమేశ్వరి పరబ్రహ్మ స్వరూపిణి కాబట్టి పరమానందం పొందుతుంది.

## 253. విజ్ఞానఘనరూపిణీ

**విజ్ఞానం చైతన్య మేవ ఘనంసాంద్రం త దేకరసం రూప మస్యాః**

దట్టమైన చైతన్యరూపము గలది. 'ఈ భూతముల నుండి విజ్ఞానముద్భవించింది' అని వేదంలో చెప్పబడింది. కాబట్టి విజ్ఞానఘనము అంటే చిదేకరసరూపము అని అర్థం చెప్పారు. విజ్ఞానము అంటే జీవుడు అని అర్థం. జీవుడు పరబ్రహ్మయందు అంతర్యామి. కాబట్టి జీవసమష్ట్యాత్మకరూపం గలది దేవి. అంటే జీవుల యొక్క సమష్టిరూపమే ఆ దేవి. అందుకే విజ్ఞానఘనరూపిణీ అనబడింది.

విజ్ఞానము అంటే చైతన్యము. దానియొక్క అఖండస్వరూపమే విజ్ఞాన ఘనరూపము.

**ఇదం మహద్భూతం అనంతం అపారం ప్రజ్ఞాన మేవ**

అఖండము అనంతము అయిన మహద్భూతమే ప్రజ్ఞానము అంటోంది శ్రుతి.

ఏదైనా ఒక విషయాన్ని గురించి కలిగేది జ్ఞానము. కళలు 64 అని ముందే చెప్పాం. మరి అటువంటి జ్ఞానం అన్ని కళలలోనూ కలిగినట్లైతే పూర్తిగా గలిగిన ఆ పాండిత్యాన్ని విజ్ఞానఘనము అంటారు. ప్రపంచంలో ఒకరికి ఉండే దాన్ని విజ్ఞానమని, అందరికే ఉండే సమష్టిజ్ఞానాన్ని విజ్ఞానఘనమని అంటారు. లోకంలోని సర్వజీవరూపము, సర్వచైతన్యరూపము ఆ పరమేశ్వరియే. అందుచేతనే ఆమె విజ్ఞాన ఘనరూపిణి అనబడింది.

## 254. ధ్యానధ్యాతృధ్యేయరూపా

ధ్యాన ధ్యాతృ ధ్యేయములే రూపముగా గలిగి నటువంటిది.

| | | |
|---|---|---|
| ధ్యానము | – | ఉపాసనక్రియ |
| ధ్యాత | – | ఉపాసకుడు కర్త |
| ధ్యేయము | – | ఉపాస్యదేవత |

ఈ మూడింటి యొక్క సమష్టిరూపమైన దేవి. త్రిపుటి యొక్క సమైక్యరూపమే ఆ దేవి అని గతంలో వివరించటం జరిగింది. జ్ఞాత జ్ఞాతృ జ్ఞేయరూపము ఆ దేవి. మాతృమానమేయములు ఆ దేవియే.

ధ్యానము అంటే బుద్ధిని స్థిరము చెయ్యటం. ధ్యానమనేది రెండువిధాలు. 1. సగుణ ధ్యానము 2. నిర్గుణధ్యానము. సగుణధ్యానంలో త్రిపుటి అంటే ధ్యాన ధ్యాతృ ధ్యేయాలుంటాయి. కాని నిర్గుణధ్యానంలో అవేవీ ఉండవు. అన్నీ ఒకటే. అందుకే మంత్రము, మంత్రాధిదేవత, మంత్రంచేసేవాడు ముగ్గురూ ఒకటే.

పరదేవత, మంత్రము మాదిరిగానే గురుశిష్యులకు కూడా గణేశాదిరూపత్వమున్నది అని భాస్కరరాయలవారు తమ వరివస్యారహస్యంలో వ్రాశారు.

## 255. ధర్మాధర్మవివర్జితా

ధర్మము, అధర్మము అని వాడుకలో కూడా చెబుతుంటాం. వాటి నిర్ణయమెలా ? ఇష్టాన్ని పొందించేది ధర్మము. అయిష్టాన్ని కలిగించేది అధర్మం. ఇది ఒక వ్యక్తికి కాదు. సంఘానికి, లోకాన్ని దృష్టిలో ఉంచుకుని ఆలోచించాలి. మత్స్యపురాణంలో గొప్పగా ధరించునది ధర్మము. ఏది ఇష్టమో ఏది అయిష్టమో కూడా గురువులే చెబుతారు అని చెప్పబడింది.

సంవర్తస్మృతిలో

**దేశే దేశే య ఆచారః పారంపర్యక్రమాగతః**

**ఆమ్నాయైః అవిరుద్ధ శ్చ స ధర్మః పరికీర్తితః**

ఆయా దేశాలయందు పారంపర్యముగ వచ్చునది, వేదవిరుద్ధముకాని ఆచారమే ధర్మము.

యాజ్ఞవల్క్యస్మృతిలో

యజ్ఞము, సచ్ఛీలము, దమము, అహింస, దానము, స్వాధ్యాయము అను కర్మలే పరమధర్మములు. వీటివల్ల ఆత్మదర్శనం కలుగుతుంది అని చెప్పబడింది. ధర్మము అనేది కేవలం మానవులకే. దేవతలకు ధర్మంలేదు. ఎందుకంటే వారు అశరీరులు. కర్మ చేయలేరు.

నిత్యాహృదయ మందు

**ధర్మాధర్మస్వవాచ్యస్య విషామృత మయస్య చ**

ధర్మాధర్మములు విషామృతమయాలు. త్రిపురోపనిషత్తులో

**న నిరోధో న చోత్పత్తిః న బంధో న చ సాధకః**

**న ముముక్షుః న వై ముక్తిః ఇత్యేషా పరమార్థతే**

లయము లేదు. పుట్టుక లేదు, బంధము లేదు, మోక్షము లేదు ఇదే పరమార్థం.

ఆ దేవి గుణి గుణ రహితురాలు. ధర్మాధర్మాలు లేనటువంటిది.

విద్వాంసులైన పెద్దలచేత చెప్పబడిన ఆచారాలు ధర్మాలు. వాటికి వ్యతిరేకమైనవి అధర్మాలు. మానవుడు వర్ణాశ్రమ ధర్మాలు పాటించేంతవరకు ఈ ధర్మాలను కూడా పాటించాలి. ధర్మాధర్మాలు బంధమోక్షాలు. ధర్మాన్ని ఆచరించే వారికి ఉత్తమగతులు కలుగుతాయి. ఉత్తమజన్మలు ప్రాప్తిస్తాయి. అలాగే అధర్మపరులకు అధోగతులు, నీచజన్మలు కలుగుతూయి. ఈ ధర్మాధర్మాలు శివశక్తిస్వరూపాలు. అదే ప్రకృతిపురుషులు. కాబట్టి సుగుణారాధకులకే ఈ ధర్మాలు. పరమేశ్వరి నిర్గుణస్వరూపిణి. ఆమే పరబ్రహ్మస్వరూపం. నిరాకార. రూపమే లేనివారికి ధర్మాధర్మాలు ఎలా ఉంటాయి ? పరమేశ్వరికి ధర్మాధర్మాలు లేవు. అందుచేతనే ఆమె ధర్మాధర్మ వివర్జితా అనబడుతోంది.

అంటూ 252 నామం దగ్గర నుండి 255వ నామంవరకు అంటే 4నామాలలో పరమేశ్వరి యొక్క జ్ఞేయరూపం వివరించారు.



# ౨౦. అవస్థాపంచకము

పరమేశ్వరిని స్తుతిచేసేటప్పుడు జాగ్రస్స్వప్న సుషుప్తి నాం సాక్షిభూత్యైనమో నమః అన్నారు. అంటే జాగ్రస్స్వప్న సుషుప్తులనబడే మూడు అవస్థలకు ఆ పరమేశ్వరి సాక్షి. కాని అవస్థలు ఐదు.

1. జాగ్రదవస్థ 2. స్వప్నావస్థ 3. సుషుప్తి 4. తురీయావస్థ 5. తురీయాతీతము

**1. జాగ్రదవస్థ :** ఇది మేలుకొని ఉన్నటువంటి స్థితి. ఈ స్థితి ననుభవించేది స్థూలదేహము. ఈ స్థితిలో ఉండే పురుషుణ్ణి వైశ్వానరుడు అంటారు. విశ్వములోని నరులకందరికీ ప్రతీక అయినవాడు. భోగాలు అనుభవించటానికి ఈ దేహమే ఆధారము. జీవి ఈ శరీరంతోనే సుఖదుఃఖాలు అనుభవిస్తాడు. స్థూలశరీరం ఎప్పుడూ జాగ్రదావస్థలోనే అనుభవం పొందుతుంది. అటువంటి స్థూలదేహానికి ప్రతినిధి వైశ్వానరుడు. జాగ్రదావస్థ ఇతని సంచారస్థానము. ఇతడికి ఏడు అంగములు, పంథొనిమిదినోళ్ళు ఉంటాయని మాండూక్యోపనిషత్తు చెబుతోంది.

**సప్తాంగాలు :**

| | | | |
|---|---|---|---|
| 1. | స్వరము | – | శిరస్సు |
| 2. | సూర్యుడు | – | కన్ను |
| 3. | వాయువు | – | ప్రాణం |
| 4. | ఆకాశం | – | శరీరం |
| 5. | జలం | – | మూత్రస్థానం |
| 6. | భూమి | – | పాదాలు |
| 7. | ఆహవనీయాగ్ని | – | నోరు |

ఇతనికి ముఖాలు పంథొనిమిది. ఇక్కడ ముఖము అంటే శిరస్సు కాదు. అనుభవించే సాధనం అవి.

| | | |
|---|---|---|
| జ్ఞానేంద్రియాలు | – | 5 |
| కర్మేంద్రియాలు | – | 5 |
| ప్రాణాలు | – | 5 |
| అంతఃకరణచతుష్టయం | – | 4 |
| (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము) | | 19 |

**2. స్వప్నావస్థ :** ఆత్మ యొక్క రెండవపాదం తైజసుడు. స్వప్నావస్థ ఇతని సంచారస్థానము. స్వప్నంలో ఇంద్రియాలన్నీ మనసులో లయం అయిపోతాయి. అప్పుడు మనసు అనేక విషయాలను అనుభవిస్తుంది. స్వప్నంలో లేనివన్నీ తనకుతానే సృష్టించుకుని తనవితీరా అనుభవిస్తుంది.

స్వప్నం చూసే వాడికి అది నిజంగా జరుగుతోంది అనిపిస్తుంది. రకరకాల వస్తు సముదాయాన్ని పొందుతాడు. ఎనలేని ఆనందం అనుభవిస్తాడు. కొన్నిసార్లు భయపడతాడు. దుఃఖిస్తాడు. ఈ రకంగా జాగ్రదావస్థలో కలిగే అనుభవాలన్నీ స్వప్నావస్థలో కలుగుతాయి. ఇక్కడ తైజసుడు సూక్ష్మశరీరుడు. ఇతడికి కూడా వైశ్వానరుడుకి మల్లేనే ఏడు అంగాలు, పంధొనిమిది ముఖాలు ఉన్నాయి.

**3. సుషుప్తి :** నిద్రించినపుడు ఏ కోరికలులేని స్థితి. గాఢనిద్ర ఇక్కడ సంచారం చేసేవాడు ప్రాజ్ఞుడు. ఇక్కడ అనుభవాలన్నీ ఏకమైపోతాయి. అంటే జాగ్రస్వప్నావస్థలలోని అనుభవాలన్నీ కరిగిపోతాయి. అంతేగాని నశించవు. ఆ అనుభవాలకు ప్రత్యేకత ఏమీలేదు. చేతనాశక్తి – అంటే గ్రహణశక్తి అస్పష్టంగా నిలిచిపోతుంది. గతించిన అనుభవాలు ఎక్కడో లోపల నిలిచిపోతాయి. అసలు అతను బ్రతికి ఉన్నాడా ? లేదా ? అనిపిస్తుంది. ఆ స్థితిలో ఆనందమయుడై ఆనందం అనుభవిస్తాడు. ఈ ఆనందం స్తబ్ధమైనది. తమోగుణ ప్రధానమైనది. ఈ ఆనందంలో 1. అజ్ఞానము 2. అహంభావము 3. సుఖము ఉంటాయి. ఈ ఆనందము, బ్రహ్మానందము ఒకటి కాదు.

**4. తురీయావస్థ :** యోగసాధనలో కుండలినీ శక్తిని సహస్రారానికి చేర్చిన అవస్థ. ఇక్కడ మనసు కూడా పనిచెయ్యదు. ఇది స్థూల సూక్ష్మ కారణ శరీరాలకు అతీతమైనది.

**5. తురీయాతీతము :** ఈ నాలుగు స్థితులకు అతీతమైనది. సాధకుడు తురీయాన్ని దాటితే అన్నింటినీ వదలివేస్తాడు. ఇది వ్యష్టి సమిష్ట్యాత్మకమైన స్థితి. ఈ స్థితి పొందినవాడు సాక్షాత్తూ పరమేశ్వరుడు. ఇక్కడ అన్ని కాలములయందు ఆనందమే ఉంటుంది.

ఈ అవస్థలలో ఆ పరమేశ్వరి సాక్షీభూతమై ఉంటుంది. అంటూ 256 నామం దగ్గరనుంచి 263 నామం దాకా అవస్థా పంచకాన్ని వివరిస్తున్నారు.

## 256. విశ్వరూపా

సృష్టి ఏరకంగా జరిగిందో ముందు చూద్దాం. సృష్టి క్రమంలో ముందుగా ఆవిర్భవించింది తమస్సు. ఆ తరువాత మహత్సృష్టి జరిగింది. ఆ తరువాతనే అహంకారము వచ్చింది. దాని నుండి పరంచతన్మాత్రలు వచ్చినాయి. అవే శబ్దస్పర్శరూప రసగంధాలు.

ఇవి సూక్ష్మరూపంలో ఉంటాయి. వీటిలో ఐదు జ్ఞానశక్తులు, ఐదుక్రియాశక్తులు ఉన్నాయి. వీటిలో ఉన్న జ్ఞానశక్తులు జ్ఞానేంద్రియాలను ఏర్పరుస్తున్నాయి. అవి

| | | |
|---|---|---|
| శబ్దము | – | చెవి |
| స్పర్శ | – | చర్మము |
| రూపము | – | కన్ను |
| రసము | – | నాలుక |
| గంధము | – | నాసిక |

సమిష్టిగా అంతఃకరణ ఏర్పడుతున్నది. ఆ తరువాత క్రియాశక్తులవల్ల కర్మేంద్రియాలు ఆవిర్భవిస్తున్నాయి. ఇవి సమిష్టిగా ప్రాణాలను పుట్టిస్తున్నాయి. తన్మాత్రలు పంచభూతాలను సృష్టిస్తున్నాయి. ఇప్పుడు పంచభూతాలు, తన్మాత్రలు, కారణ ఉపాధులతో కూడిన చైతన్యము క్రమంగా విశ్వతైజసప్రాజ్ఞ అనబడుతున్నది. వాటితో కూడిన సమిష్టితత్వము వైశ్వానర, హిరణ్యగర్భ ఈశ్వరులవుతున్నారు. అంతఃకరణకు కారణమైన పరమాత్మే హిరణ్యగర్భుడు. ప్రాణాకారంతో కూడినవాడు సూత్రాత్మ. వేరుగాని, విడిపోనటువంటి ఈ రెండు కారణాలను అనుసరించి కూడినటువంటివాడు అంతరాత్మ అని చెప్పబడుతున్నాడు. ఇప్పుడు ఈ మూడు అంటే 1. పరమాత్మ 2. సూత్రాత్మ 2. అంతరాత్మలే బ్రహ్మ విష్ణు రుద్రులు. వ్యష్టిగా విశ్వతైజసప్రాజ్ఞులకు, సమిష్టిగా వైశ్వానర, హిరణ్యగర్భసూత్రాత్మలకు భేదము ఉపనిషత్తులననుసరించి చెప్పబడింది. ఉపనిషణ్మతములో జీవాత్మ, పరమాత్మలకు ప్రత్యేకంగా ఐదువిభాగాలు ఏర్పడుతున్నాయి. అవి సృష్టి స్థితి లయ జీవాత్మ పరమాత్మలు. కొంతమంది ఈ జగత్తుకు మూడే కారణాలు అంటారు. అవే సృష్టి స్థితి లయాలు. వీరిద్దరికీ తేడాలేదు. ఎందుచేతనంటే స్థూలకారణాలు మూడు. కాగా సూక్ష్మకారణాలు ఐదు. వీటన్నింటినీ మాండూక్యోపనిషత్తులో వివరించారు.

**సర్వంహ్యేతద్ బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ, సోఽయమాత్మా చతుష్పాత్**

ఈ చరాచరజగత్తంతా బ్రహ్మమయమే. ఆత్మ కూడా పరబ్రహ్మమే. ఆత్మకు నాలుగుపాదాలున్నాయి.

**జాగరితస్థానో బహిః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి**
**ముఖః స్థూలభుగ్ వైశ్వానరః ప్రథమపాదః**

విశ్వములోని జీవులన్నింటి స్వరూపుడు అయినవాడు వైశ్వానరుడు. జాగ్రదవస్థ ఇతని సంచారస్థానం. అలాగే రెండవవాడు తైజసుడు. స్వప్నమే ఇతని సంచారస్థానం. మూడవవాడు ప్రాజ్ఞుడు. సుషుప్తి అవస్థ ఇతని సంచారస్థానము. ఈ రకంగా ఉపనిషత్తు చెబుతుంది.

సుషుప్తిలో ప్రాజ్ఞుడికి బ్రహ్మభావం కలుగుతుంది. ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు సుషుప్తిని గురించి వివరిస్తాడు.

కుమారా ! గాఢనిద్రలో ఉన్నప్పుడు అతడు సుషుప్తిలో ఉన్నాడు అంటారు. ఆ స్థితిలో జీవుడు పరమసత్తను పొందుతాడు. అంటే తన నిజస్వరూపాన్ని పొందుతాడు. తన ఆత్మను తాను పొందుతాడు. కాబట్టి అతన్ని గురించి చెప్పేటప్పుడు అతను నిద్రిస్తున్నాడు అంటారు.

అద్దంలో చూసినప్పుడు మన ప్రతిబింబం మనకు కనిపిస్తుంది. కాని అద్దం తియ్యగానే అది మాయమైపోతుంది. మన నిజరూపం మాత్రమే మిగులుతుంది. అదేవిధంగా సుషుప్తావస్తలో మనస్సు ఇంద్రియాలు పనిచెయ్యటం మానేస్తాయి. అప్పుడు మిగిలేది ఆత్మ మాత్రమే. ఆ ఆత్మ నిజరూపంలో మిగులుతుంది. ప్రతిబింబంలాంటి జీవభావంపోయి ఆత్మభావం మిగులుతుంది. ఆ స్థితిలో ఆత్మను 'స్వపితి' అంటారు. తన ఆత్మ తనలోనే ఉన్నాడని, నిద్రిస్తున్నాడని అంటారు. ఇంద్రియాలన్నీ అలసట చెంది ఒక్కొక్కటి మనసులో లీనమైపోతాయి. మనసు ప్రాణంలో లీనమైపోతుంది. అంటే సుషుప్తావస్తలో ప్రాణం ఒక్కటే మేల్కొని ఉంటుంది. ఆ ప్రాణమే ఇంద్రియాల యొక్క మనసు యొక్క అలసటను తీరుస్తుంది. మనసుకు బంధనస్థానమైన ప్రాణమే పరదేవత.

బృహదారణ్యకోపనిషత్తులో అజాతశత్రువు అనే రాజు బాలాకి అనే బ్రాహ్మణబాలుడికి సుషుప్తి గురించి వివరిస్తాడు.

సుషుప్తిలో జీవికి బ్రహ్మభావం కలుగుతుంది. అప్పుడు అతణ్ణి ప్రాజ్ఞుడు అంటారు. కాని జీవుడు అవిద్యతో కలిసి ఉంటాడు. అందుచేత అతడు పరమాత్మకాడు. అందుకని సుషుప్తి పొందిన జీవుణ్ణి కారణశరీరమని, తురీయావస్థ పొందిన జీవుణ్ణి మహాకారణ శరీరము అని అంటారు. తురీయావస్థ పైన ఉండేది తురీయాతీతము. ఇది ఐదవ అవస్థ. ఈ స్థితిలో జీవి శివతుల్యుడు అవుతాడు. ముండకోపనిషత్తులో 'నిరంజనుడు అంతకన్న పరమసామ్యము పొందుతాడు' అని చెబుతోంది. పరమసామ్యము అంటే – ఐక్యము. ఈ స్థితిలో పూర్ణజీవత్వము పూర్ణశివత్వాలు వేరుగా లేవు.

ఐదువిధాలయిన జీవోపాధులు పంచకోశాలుగా వ్యవహరించబడుతున్నాయి. పరమాత్మకు తిరోధానము అనుగ్రహము అనబడే బంధమోక్షాలు ఉపాధులు కావటం చేత బహిరున్మేషుడు (ప్రత్యక్షము అయ్యేవాడు – శివుడు) అవుతున్నాడు. సదాశివుడు నిమేషాంతుడు. అంటే – కొంత ప్రత్యక్షము, కొంత అప్రత్యక్షము. కాబట్టి తిరోదాన అనుగ్రహముల స్థితులు రుద్రుని కన్న వేరైనవి.

విశ్వ అంటే – జాగరిదావస్థ. స్థూలరూపం గల చైతన్యము గల జీవులు. ఆ జీవుల సమష్టిరూపమే వైశ్వానరుడు.

పరమేశ్వరి ధర్మాధర్మవిర్జితా అని చెప్పబడింది. కాబట్టి జగత్తుకు, దేవికి భేదం లేదు. అందుచేత పరమేశ్వరిరూపము విశ్వరూపము అవుతున్నది. ఈ విశ్వానికి ఆధారము ఆ దేవి. అందుచేత దర్మీభూతమైన ఇంకొక శరీరము ఆమెకు లేదు.

విష్ణుపురాణంలో "అరటిచెట్టు ఆకులకన్న వేరుగా కనిపించినట్లుగానే, ఓ పరమేశ్వరీ! ఈ విశ్వమంతా నీ యందే ఉన్నది. విశ్వము నీకన్నవేరైనదికాదు" అని చెప్పబడింది. దేవీభాగవతంలో ఆ పరమేశ్వరి శ్రీ మహావిష్ణువుతో "ఈ సమస్తమునేనే. నాకన్న సనాతనమైనది వేరేలేదు" అంటుంది.

విశ్వరూపము అని గ్రహించిన బ్రహ్మ యొక్క జీవభావము మిక్కిలి నీచ రూపము. అటువంటి నీచ రూపము ఎవరి మహిమవల్ల నాశనమవుతుందో ఆమె విశ్వరూప. ఆమె అనుగ్రహము వలననే నీచమైన సేవ వంటి అనుగ్రహము లభించును.

ఆ పరమేశ్వరి పదహారు కళల స్వరూపము. దర్శ నుండి పూర్ణిమ వరకు 15 కళలు కాగా 16వ కళ సచ్చిదానందరూపిణి అయి ఉన్నది. తిథేలే నిత్యాదేవతలు. నిత్యలే కళలు. ఈ నిత్యాదేవతలను 15వ నామం 'అష్టమీచంద్రభిభ్రాజదళిక స్థలశోభితా'లో వివరించటం జరిగింది. ఈ 15 తిథుల స్వరూపమే శ్రీవిద్య. 16వ కళయే మహాత్రిపురసుందరి. ఈ రకంగా తిథులే పంచదశీమంత్రము అని చెప్పటంవల్ల తిథులు, పంచదశిమంత్రము, చంద్రమండలము, ఆ పరమేశ్వరి అంతా ఒకటే అవుతున్నారు. అందుకే ఆమె విశ్వరూపా.

తైత్తిరీయ బ్రాహ్మణంలో శుక్లపక్ష, కృష్ణపక్ష తిథులను వివరించటం జరిగింది. వీటిలో మళ్ళీ పగటి తిథులు వేరు రాత్రి తిథులు వేరు. ఆ వివరాలను ఇక్కడ ఇవ్వటం జరుగుతోంది. శుక్లపక్షపగటి పేర్లు.

**సంజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం జానదభిజానతాత్**

**సంకల్పమానం ప్రసంకల్ప మానం ఉపకల్పమానము పక్లప్తం**

**క్లప్తం శ్రేయోవశీయ ఆయస్సంభూతం భూతం.**

శుక్లపక్షరాత్రుల పేర్లు

**దర్శాదృష్టా దర్శితా విశ్వరూపా సుదర్శనా**

**ఆప్యాయమానా ప్యాయమానా ప్యాయా సూనృతా ఇరా**

**అపూర్యమాణా పూర్యమాణా పూరయంతీ పూర్ణాపూర్ణమాసి**

| వ.నెం. | తిథి | నిత్యాదేవి | పగటి తిథి | రాత్రి తిథి |
|---|---|---|---|---|
| 1 | పాడ్యమి | కామేశ్వరి | సంజ్ఞానం | దర్శ |
| 2 | విదియ | భగమాలిని | విజ్ఞానం | దృష్టా |
| 3 | తదియ | నిత్యక్లిన్నా | ప్రజ్ఞానం | దర్శతా |
| 4 | చవితి | భేరుండా | జానత్ | విశ్వరూపా |
| 5 | పంచమి | వహ్నివాసిని | అభిజానత్ | సుదర్శనా |
| 6 | షష్ఠి | మహావజ్రేశ్వరి | సంకల్పమానం | ఆప్యాయమానా |
| 7 | సప్తమి | శివదూతి | ప్రకల్పమానం | ఆప్యాయమానా |
| 8 | అష్టమి | త్వరిత | ఉపకల్పమానం | ఆప్యాయా |
| 9 | నవమి | కులసుందరి | ఉపక్లప్తం | సూనృతా |
| 10 | దశమి | నిత్యా | క్లప్తం | ఇరా |
| 11 | ఏకాదశి | నీలపతాక | శ్రేయః | అపూర్వమాణా |
| 12 | ద్వాదశి | విజయా | వశీయః | పూర్వమాణా |
| 13 | త్రయోదశి | సర్వమంగళా | ఆయత్ | పూరయంతే |
| 14 | చతుర్దశి | జ్వాలామాలిని | సంభూతం | పూర్ణా |
| 15 | పూర్ణిమ | చిత్రా | భూతం | పూర్ణమాసీ |

కృష్ణపక్ష పగటి తిథులు

**ప్రష్టుతం విష్టుతగ్ం సంస్తుతం కల్యాణం విశ్వరూపం**
**శుక్ర మమృతం తేజస్వి తేజ స్సమిద్ధం**
**అరుణం భాను త్మరీచీ మదభితపస్తపస్విదితి**

కృష్ణపక్షరాత్రి తిధులు

| వ.నెం. | తిథి | నిత్యాదేవి | పగటితిథి | రాత్రితిథి |
|---|---|---|---|---|
| 1 | పాడ్యమి | చిత్రా | ప్రష్టుతం | సుతా |
| 2 | విదియ | జ్వాలామాలిని | విష్టుతం | సున్వతీ |
| 3 | తదియ | సర్వమంగళా | సంస్తుతం | ప్రసుతా |
| 4 | చవితి | విజయా | కల్యాణం | సూయమానా |
| 5 | పంచమి | నీలపతాకా | విశ్వరూపం | అభిసూయమానా |
| 6 | షష్ఠి | నిత్యా | శుక్రం | ప్రీతీ |
| 7 | సప్తమి | కులసుందరీ | అమృతం | ప్రసా |
| 8 | అష్టమి | త్వరితా | తేజస్వి | సంసా |
| 9 | నవమి | శివదూతి | తేజః | తృప్తిః |
| 10 | దశమి | మహావజ్రేశ్వరి | సమిద్ధం | తర్పయంతి |
| 11 | ఏకాదశి | వహ్నివాసిని | అరుణం | కాంతా |
| 12 | ద్వాదశి | భేరుండా | భానుమత్ | కామ్యా |
| 13 | త్రయోదశి | నిత్యక్లిన్నా | మరీచిమత్ | కామజాతా |
| 14 | చతుర్దశి | భగమాలినీ | అభితసత్ | ఆయుష్మతి |
| 15 | అమావాస్య | కామేశ్వరి | తపస్విత్ | కామధూఘా |

పంచదశీ మహామంత్రము మూడుఖండములు గల మంత్రము మొదటిఖండంలో 5, రెండవఖండంలో 6, మూడవఖండంలో 4 బీజాక్షరాలుంటాయి. తిథులను కూడా మూడుభాగాలుగా చేయటం జరిగింది.

మొదటి భాగంలో 5, రెండవభాగంలో దశమి, ఏకాదశి రెండూ ఒకటిగానే పరిగణస్తారు కాబట్టి 6. మూడవభాగంలో ద్వాదశి నుంచి 4 తిథులుంటాయి. అయితే

ఇంకొక మతం ప్రకారము మూడు ఖండాలలోను ఐదు చొప్పున 15 తిథులు ఉంటాయి. ఈ తిథులే పంచదశి మంత్రంలోని బీజాక్షరాలు.

ఈ రకంగాచూస్తే శుక్లపక్షపు నాల్గవనాటిరాత్రి పేరు విశ్వరూపా. ఇది వాగ్భవకూటమి లోని నాల్గవఅక్షరము, పరమేశ్వరిని విశ్వరూపా అనటం ఈ రాత్రిపేరున చెప్పటముకాక వేరుకాదు.

దేవీభాగవతంలోని సప్తమస్కంధంలోని 31వ అధ్యాయంలో తారకాసురుని బాధలు పడలేక దేవతలంతా ఆ పరమేశ్వరిని ప్రార్థిస్తారు. అప్పుడు ఆమె వారికి సాక్షాత్కరించింది. హిమవంతుడు. "తల్లీ ! నీ విశ్వరూపం చూడాలని కోరికగా ఉన్నది. దేవతలంతా కూడా ఇదే కోరుతున్నారు. ఒకసారి మాకు చూపవలసినది. అని అడుగుతాడు. అప్పుడు ఆ పరమేశ్వరి తన విరాడ్రూపం వారికి చూపింది.

**ద్యౌ ర్మస్తకం భవే ద్యస్య చంద్రసూర్యౌ చ చక్షుషీ**
**దిశః శ్రోత్రో వచో వేదాః ప్రాణోవాయుః ప్రకీర్తితాః**
**విశ్వం హృదయమిత్యాహుః పృథివీజఘనం స్మృతమ్ ॥**
**నభస్తలం నాభిసరో జ్యోతిశ్చక్ర మురః స్థలమ్**
**మహర్లోకస్తు గ్రీవాస్యా జ్జనోలోకో ముఖంస్మృతమ్ ॥**
**తపోలోకో లలాటస్తు సత్యలోకాదధః స్థితః**
**ఇంద్రాదయో బాహవః స్యు శబ్ధః శోత్రం మహేశితుః ॥**
**నాసత్య దస్రౌ నాసేస్తో గంధో ఘ్రాణం స్మృతోబుదైః**
**ముఖమగ్నిః సమాఖ్యాతో దివారాత్రీ చ పక్ష్మణీ ॥**
**బ్రహ్మస్థానం భ్రూవిజృంభోఽ ప్యాపస్తాలుః ప్రకీర్తితా**
**రసోజిహ్వాసమాఖ్యాతా యమోదంష్ట్రాః ప్రకీర్తితా ॥**
**దంతాః స్నేహకలా యస్య హాసోమాయా ప్రకీర్తితా**
**సర్గ స్త్వపాంగమోక్షః స్యాద్రీడోర్ధ్వోష్ఠా మబేశితుః ॥**
**లోభః స్యాదధరోష్ఠోఽ స్యా ధర్మమార్గ స్తు పృష్ఠభూః**
**ప్రజాపతి శ్చ మేఢ్రం స్యాదః స్రష్టా జగతీతలే ॥**

**కుక్షిః సముద్రా గిరయోஉస్థీని దేవ్యా మహేశితుః**
**నద్యోనాడ్యః సమాఖ్యాతా వృక్షాః కేశాః ప్రకీర్తితాః ॥**

అంటూ దేవి విశ్వరూపాన్ని వర్ణిస్తారు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| సత్యలోకం | – | శిరస్సు | సూర్యచంద్రులు | – | కనులు |
| దిక్కులు | – | చెవులు | వేదాలు | – | వాక్కు |
| వాయువు | – | ప్రాణం | ప్రపంచం | – | హృదయం |
| భూమి | – | కటి | ఆకాశం | – | నాభి |
| నక్షత్రగణం | – | రొమ్ము | మహర్లోకం | – | కంఠం |
| జనలోకం | – | ముఖం | తపోలోకం | – | నుదురు |
| ఇంద్రాదులు | – | బాహువులు | ఆశ్వినులు | – | నాసికారంధ్రాలు |
| గంధం | – | నాసిక | రాత్రిపగలు | – | కనురెప్పలు |
| బ్రహ్మస్థానం | – | కనుబొమ్మలు | జలం | – | దవడలు |
| రసం | – | నాలుక | యముడు | – | దంష్ట్రలు |
| స్నేహం | – | దంతాలు | నవ్వు | – | మాయ |
| కడగంటి చూపు | – | సృష్టి | లజ్జ | – | పైపెదవి |
| లోభము | – | క్రిందపెదవి | సముద్రాలు | – | కడుపు |
| ధర్మము | – | వీపు | కొండలు | – | ఎముకలు |
| నదులు | – | నాడులు | చెట్లు | – | కేశాలు |
| చంద్రుడు | – | మనస్సు | రుద్రుడు | – | అంతఃకరణ |
| మేఘాలు | – | రోమాలు | విజ్ఞానశక్తి | – | విష్ణువు |

అనేక బాహువులు, వేలతలలు, నానారకాల ఆయుధాలు ధరించి కోట్లకొలది సూర్యులకాంతితో ప్రకాశిస్తున్నది ఆ పరమేశ్వరి.

శ్రీమద్భాగవతంలోకూడా శ్రీ మహా విష్ణువును ఈ రకంగానే వర్ణించటం జరిగింది.

**బ్రహ్మోవాచ**

వాచాం వహ్నేర్ముఖం క్షేత్రం ఛందసాం సప్తధాతవః ।
హవ్యకవ్యామృతాన్నానాంజిహ్వా సర్వరసస్య చ ॥

సర్వాసూనాంచ వాయోశ్చ తన్నాసే పరమాయనే ।
అశ్వినోరోషధీనాం చ ఘ్రాణోమోద ప్రమోదయోః ॥

రూపాణాం తేజసాం చక్షుర్దివః సూర్యస్య చాక్షిణీ ।
కర్ణౌదిశాంచతీర్థానాం శ్రోత్రమాకాశ శబ్దయోః ।
తద్గాత్రం వస్తు సారాణాం సౌభగ్యస్య చ భాజనం ॥

త్వగస్య స్పర్శవాయోశ్చ సర్వమేధస్య చైవ హి ।
రోమాణ్యు ద్భి జ్జజాతీనాం యైర్వాయజ్ఞస్తు సంభృతః ॥

కేశ శ్మశ్రు నఖాన్యస్య శిలా లోహాభ్రవిద్యుతామ్ ।
బాహవో లోకపాలానాం ప్రాయశః క్షేమకర్మణాం ॥

విక్రమో భూర్భువః స్వశ్చక్షేమస్య శరణస్య చ ।
సర్వకామ వరస్యాపి హరేశ్చరణ ఆస్పదమ్ ॥

అపాం వీర్యస్య సర్గస్య పర్జన్యస్య ప్రజాపతేః ।
పుంసః శిశ్న ఉపస్థస్తు ప్రజాత్యానంద నిర్వృతేః ॥

పాయుర్యమస్య మిత్రస్య పరిమోక్షస్య నారద ।
హింసాయా నిర్రుతేర్మృత్యోర్నిరయస్య గుదః స్మృతః ॥

పరాభూతేరధర్మస్య తమసశ్చాపి పశ్చిమః ।
నాడ్యోనదనదీనాం తు గోత్రాణామాస్థి సంహతిః ॥

అవ్యక్త రస సింధూనాం భూతానాం నిధనస్యచ ।
ఉదరం విదితం పుంసో హృదయం మనసః పదమ్ ॥

ధర్మస్య మమ తుభ్యం చ కుమారాణాం భవస్యచ ।
విజ్ఞానస్యచ  సత్త్వస్య పరస్యాత్మా పరాయణమ్ ॥

అహం భవాన్ భవశ్చైవ త  ఇమే మునయోఽగ్రజాః ।
సురాసురనరా నాగాః ఖగా మృగ సరీసృపాః ॥

**గంధర్వాప్సరసో యక్షా రక్షోభూతగణోరగాః ।**
**పశవః పితరః సిద్ధా విద్యాధ్రా శ్చారణా ద్రుమాః ॥**

**అన్యేచ వివిధా జీవా జలస్థలనభౌకసః ।**
**గ్రహరకేతవస్తారా స్తడితః స్తనయిత్నవః ॥**

**సర్వం పురుష ఏ వేదం భూతం భవ్యం భవశ్చయత్ ।**
**తేవేదమావృతం విశ్వం వితస్తిమధి తిష్ఠతి ॥**

**స్వధిష్ణ్యం ప్రతపన్ ప్రాణో బహిశ్చ ప్రతపత్యసౌ ।**
**ఏవం విరాజం ప్రతపంస్తపత్యన్తర్బహిః పుమాన్ ॥**

**సోఽమృ తస్యాభ యస్యే శో మర్త్యమన్నం యదత్యగాత్ ।**
**మహిమైష తతోబ్రహ్మన్ పురుషస్య దురత్యయః ॥**

**పాదేషు సర్వభూతాని పుంసః స్థితిపదోవిదుః ।**
**అమృతం క్షేమమభయం త్రిమూర్ధ్నోఽధాయి మూర్ధసు ॥**

**పాదాస్త్రయో బహిశ్చాసన్న ప్రజానాం య ఆశ్రమాః ।**
**అంతస్త్రిలోక్యాస్త్వపరో గృహమేధోవ ఉబృహద్వ్రతః ॥**

**సృతీ విచక్రమే విష్వఙ సాశనానశనే ఉభౌ ।**
**యదవిద్యా చ విద్యాచ పురుష స్తూభయాశ్రయః ॥**

**యస్మాదండం విరాడ్ జజ్ఞే భూతేంద్రియ గుణాత్మకః ।**
**తద్ ద్రవ్యమత్యగాద్ విశ్వం గోభిః సూర్యయివాతపన్ ॥**

బ్రహ్మదేవుడు నారదుడికి శ్రీ మహావిష్ణువు యొక్క విశ్వరూపాన్ని వివరిస్తూ

| | | |
|---|---|---|
| ఊర్ధ్వలోకాలు | – | కటి ప్రదేశము నుండి ఊర్ధ్వదేహము |
| అథోలోకాలు | – | అథోదేహము |
| భూలోకము | – | కటిప్రదేశము |
| భువర్లోకము | – | నాభి |
| సువర్లోకము | – | హృదయము |
| మహర్లోకము | – | వక్షము |
| జనలోకము | – | మెడ |

| | | |
|---|---|---|
| తపోలోకము | – | స్తనద్వయము |
| సత్యలోకము | – | శిరస్సు |
| అతలము | – | జఘనము (పిరుదులు) |
| వితలము | – | తొడలు |
| సుతలము | – | జానువులు (మోకాళ్ళు) |
| తలాతలము | – | జంఘలు (పిక్కలు) |
| మహాతలము | – | గుల్ఫములు (చీలమండలు) |
| రసాతలము | – | పాదాగ్రము |
| పాతాళము | – | పాదాలు |
| ముఖము | – | వాక్కు, అగ్ని |
| రోమాలు | – | ఉష్ణిక్ ఛందస్సు |
| చర్మము | – | ధాత్రీ ఛందస్సు |
| మాంసము | – | త్రిష్టుప్ ఛందస్సు |
| స్నాయువులు (నరాలు) | – | అనుష్టుప్ ఛందస్సు |
| అస్థి | – | జగతీఛందస్సు |
| మజ్జ | – | పంక్తి ఛందస్సు |
| ప్రాణము | – | బృహతీ ఛందస్సు |
| రసము | – | నాలుక |
| వాయువు | – | శ్వాస |
| సూర్యుడు | – | కనులు |
| దిశలు | – | చెవులు |
| స్పర్శ | – | దేహము |
| చెట్లు, చేమలు | – | రోమాలు |
| పర్వతాలు | – | గోళ్ళు |
| మేఘములు | – | కేశములు |
| మెరుపులు | – | శ్మశ్రువులు (గడ్డము, మీసము) |
| జలం | – | తాలు భాగం |
| రాత్రింబవళ్ళు | – | కనురెప్పలు |

స్నేహకల - పలువరుస
మహామాయ - చిరునవ్వు
సముద్రం - కుక్షి
నదులు - నాడీ సమూహము
కాలం - గమనం
సంధ్య - వస్త్రం
అవ్యక్తం - హృదయం
రుద్రుడు - అహంకారం
మనుష్యులు- - విరాట్స్వరూపుని నివాసము
దేవగణాలు - షడ్జమాది స్వరాలు

అంతే కాదు నారదా

**నీలకంధరునకు, నీకు నాకు సనత్కు**
**మారముఖ్య సుతసమాజమునకు**
**ధర్మసత్వబుద్ధి తత్త్వములకు నీశ్వ**
**రాత్మవినుము పరమమైన నెలవు ॥**

**నరసురాసుర పితృనాగకుంజర మృగ, గంధర్వ యక్షరాక్షస మహీజ**
**సిద్ధ విద్యాధర జీమూతచారణ గ్రహ తారకాప్సరోగణ విహంగ**
**భూతతటిద్వసు పుంజంబులును, నీవు ముక్కంటియును, మహామునులు, నేను**
**సలిలనభస్స్థలచరములు మొదలైన వివిధ జీవులతోడి విశ్వమెల్ల**
**విష్ణుమూర్తిమయము పుత్ర । వేయేల, బ్రహ్మాండ**
**మతని జేనలోన నడగియుండు**
**బుద్ధినెరుగరాదు; భూతభవద్భవ్య**
**లోకమెల్ల విష్ణులోన నుండు ॥**

**మండలములోన భాస్కరుఁ**
**డుండి జంగములకు దీప్తి నొసఁగెడి క్రియ బ్ర**
**హ్మాండములోపల నచ్యుతుఁ**
**డుండుచు బహిరంతరముల నొగి వెలిఁగించున్**

భగవద్గీతలోని 11వ అధ్యాయంలో 15 నుంచి 23 వరకు శ్లోకాలలో శ్రీకృష్ణుని విశ్వరూపాన్ని వర్ణించాడు అర్జునుడు.

**పశ్యామి దేవాన్ తవ దేవ ! దేహే**
**సర్వాన్ తథా భూతవిశేష సంఘాన్ ।**
**బ్రహ్మాణం ఈశం కమలాసనస్థం**
**ఋషీన్ చ సర్వానురగాన్ చ దివ్యాన్ ॥**

శ్రీకృష్ణా ! నీ శరీరమునందు సకల దేవతలను, సమస్త ప్రాణి సమూహములను, చతుర్ముఖ బ్రహ్మను, బ్రహ్మ ఆజ్ఞానువర్తియగు రుద్రుని, సకల ఋషిపుంగవులను, ప్రకాశించు వాసుకి మొదలగు సర్పరాజములను చూచుచున్నాను.

**అనేక బాహూదర వక్త్రనేత్రం**
**పశ్యామిత్వాం సర్వతోఽనంతరూపం ।**
**నాంతం న మధ్యం న పునస్తవాదిం**
**పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ! ॥**

ప్రపంచమునకు నాథుడవగు ఓ విశ్వరూపధరా ! నిన్ననేక భుజములు, కడుపులు, ముఖములు, కన్నులు కలిగి ఇంతింతనరాని యాకారములు కలవానినిగా నంతటను చూచుచున్నాను. పైగా నీయాది మధ్యాంతములు నాకు గోచరించుటలేదు.

**కిరీటినం గదినం చక్రిణం చ**
**తేజోరాశిం సర్వతో దీప్తిమంతం ।**
**పశ్యామి త్వాం దుర్నిరీక్షం సమంతాత్**
**దీప్తానలార్కద్యుతిం అప్రమేయమ్ ॥**

కాంతిపుంజమై యంతటను నిండిన కాంతివలన చూడశక్యముగాక మండుచున్న నిప్పు, సూర్యులకాంతివంటి కాంతి గలిగి యింతయని హద్దుగా చెప్పదగని నిన్ను కిరీటాది భూషణములను చక్రగదాద్యాయుధములను ధరించియున్నట్లు దర్శించుచున్నాను.

**త్వమక్షరం పరమం వేదితవ్యం**
**త్వమస్య విశ్వస్య పరం నిధానం ।**
**త్వమవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా**
**సనాతనస్త్వం పురుషో మతో మే ॥**

ముండకాది ఉపనిషత్తులలో తెలియదగినదిగా నిర్దేశింపబడిన పరమైన అక్షరము నీవే. ఈ జగత్తునకు సర్వోత్కృష్టమైన ఆధారము నీవే, స్వరూపాదుల యందెల్లప్పుడు నొక్క రూపముతో నుండువాడవు నీవే. నిత్యమైన ధర్మములను కాపాడువాడవు నీవే. పురాణపురుషుడవు నీవే యని నాకిప్పుడు తెలిసినది.

**అనాది మధ్యాంతం అనంతవీర్యం**
**అనంతబాహుం శశిసూర్యనేత్రం ।**
**పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం**
**స్వతేజసా విశ్వమిదం తపంతమ్ ॥**

ఆది మధ్యాంతములు లేనట్టియు, అపరిమిత పరాక్రమము కలిగి యున్నట్టియు, లెక్కలేనన్ని చేతులు కలిగియున్నట్టియు, చంద్రునివలె చల్లగను, సూర్యునివలె తీవ్రముగా నుండు కండ్లు కలిగినట్టియు, కాలాగ్నివలె మండుచున్న ముఖము కలిగినట్టి నీ తేజస్సుచేత ఈ ప్రపంచమును తపింపజేయుచున్న నిన్ను జూచుచున్నాను.

**ద్యావాపృథివ్యోః ఇదమంతరం హి**
**వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।**
**దృష్ట్వాఽద్భుతం రూపముగ్రం తవేదం**
**లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ! ॥**

భూమి ఆకాశముల మధ్యభాగమంతయును అన్ని దిక్కులను నీవే వ్యాపించి యున్నావు. మహాత్మా ! బ్రహ్మాది దేవతావర్గములో అనుకూలురు – ప్రతికూలురు మధ్యస్థులు అనెడు మూడు విధముల వారును అత్యద్భుతమై అతి భయంకరమైయుండు నీ రూపమును జూచి భయపడుచున్నారు. (అర్జునునకు తన ఐశ్వర్యమును జూపుటకై భగవానుడు వీరందరికిని దివ్యదృష్టి నొసంగెను.)

**అమీ హి త్వాం సురసంఘా విశంతి**
**కేచిత్ భీతాః ప్రాంజలయో గృణంతి ।**
**స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః**
**స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥**

ఈ గొప్ప దేవతా సమూహము నీ సమీపమునకు వచ్చుచున్నది. కొందరు భయపడి చేతులు జోడించి స్తోత్రము చేయుచున్నారు. భృగువు మొదలగు మహర్షులు, సనకాది సిద్ధులును నీకు మంగళాశాసనమును గావించి నీకు తగిన సంపూర్ణస్తోత్రములచే నిన్ను స్తుతించుచున్నారు.

**రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యాః**
**విశ్వేఽశ్వినౌ మరుతశ్చ ఊష్మపాశ్చ ।**
**గంధర్వ యక్షాసుర సిద్ధ సంఘాః**
**వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥**

ఏకాదశ రుద్రులును, ద్వాదశాదిత్యులును, అష్టవసువులును, సకల సాధ్యులును, విశ్వేదేవతలును, ఇద్దరశ్వినీదేవతలును, సప్తమరుత్తులును, పితృదేవతలును, గంధర్వ యక్ష రాక్షస సిద్ధసమూహములున్ను, అందరును ఆశ్చర్యమును పొంది నిన్ను చూచుచున్నారు.

**రూపం మహత్తే బహువక్త్రనేత్రం**
**మహాబాహో ! బహుబాహూరుపాదం ।**
**బహూదరం బహుదంష్ట్రాకరాళం**
**దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాఽహమ్ ॥**

శ్రీకృష్ణా ! అనేక ముఖములను, లెఖ్ఖలేని కన్నులును పరిమితిలేని భుజములును, పెక్కుతొడలును, బహుపాదములును, అనేకములగు కడుపులును, పెక్కు కోరలచేత అతిభయంకరమగు నీ యిట్టి గొప్ప ఆకారమును జూచి జనులందరును అతిభయముతో వణుకుచున్నారు, అట్లే నేనును భయపడుచున్నాను.

వేదంలోని పురుషసూక్తంలో

**సహస్రశీర్షా పురుషః సహస్రాక్ష సహస్రపాత్ .....**

**పద్భ్యాంభూమిః దిశశ్రోత్రాత్ తథా లోకాగ్ం అకల్పయన్** అని చెప్పబడింది.

ఈ రకంగా విశ్వమంతా ఆమెలో నిండి ఉన్నది కాబట్టే విశ్వరూపా అనబడింది.

అలాగే 'విశ్వరూపం' అనేది కృష్ణపక్షంలో పంచమితిథి పగటిపేరు. అంటే తిథులస్వరూపం గలది ఆ దేవి. ఈ రకంగా కృష్ణపక్షంలో పగటితిథులు, రాత్రి తిథులు కూడా ఆ దేవతాస్వరూపమే.

సమయ మతస్తులు శుక్లపక్ష రాత్రులందు చివరిభాగంలో మాత్రమే ఉపాసన చేస్తారు. గౌడపాదులవారు తమ సుభగోదయస్తుతిలోని 31వ శ్లోకంలో

**అతః శుక్లేపక్షే ప్రతిదిన మిహ త్వాం భగవతీం**
**నిశాయాంసేవంతే నిశి చరమభాగే సమయినః**

అన్నారు. శుక్లపక్షరాత్రులందు మాత్రమే కుండలినీ ప్రబోధం జరుగుతుంది.

శంకరభగవత్పాదులవారు కూడా తమ సౌందర్య లహరిలోని 87వ శ్లోకంలో ఇదే మాటను చెప్పారు.

**హిమానీ హన్తవ్యం హిమగిరి నివాసైక చతురౌ**
**నిశాయాం నిద్రాణాం నిశి చరమభాగే చ విశదౌ**

కాబట్టి శుక్లపక్ష తిథులన్నీ పరమేశ్వరి స్వరూపమే. ఈ రకంగా తిథులు, కాలమానము అంతా పరమేశ్వరి స్వరూపమే కాబట్టి ఆ దేవిని 'విశ్వరూపా' అన్నారు.

శుక్లపక్షరాత్రులు మధుకృతులు. పగళ్ళు మధువృషులు అని వేదం చెబుతోంది. ఈ విషయాన్ని తెలుసుకున్నవాడి శరీరంలో బ్రహ్మరంధ్రము నుంచి మధువు వర్షిస్తుంది. అతనికి ఇష్టా పూర్తి కలిగిస్తుంది. ఈ విషయం తెలియని వాడికి మధువు స్రవించదు. అతని కర్మలు సఫలంకావు.

విశ్వము అంటే ప్రపంచం. పరమేశ్వరి ప్రపంచమంతా ఆవరించి ఉన్నది కాబట్టి విశ్వరూపా అనబడుతోంది.

బ్రహ్మాండము–విరాడ్రూపము. పిండాండము–జీవుని శరీరము. ఈ రెండింటికీ తేడా ఏమీలేదు. ఇక్కడ విశ్వరూపా అంటే పరమేశ్వరికి ఈ జగత్తుకూ భేదము లేదని భావము.

ఈ కారణాలచేత పరమేశ్వరి విశ్వరూపా అనబడుతోంది.

## 257. జాగరిణీ

జాగ్రదవస్థ అందరికీ ప్రసిద్ధమైనది. సర్వేంద్రియ గోచరమైనది.

ప్రభోధాత్మకమైన సర్వేంద్రియజ్ఞానము గల విశ్వుడు అనే జీవుని అవస్థ జాగరము. అటువంటి జాగ్రదావస్థ గలది ఆ పరమేశ్వరి.

జాగ్రదవస్థలో స్థూలశరీరాభిమాని అయిన దేవి విశ్వునిరూపంలో ఉంటుంది. అందుచేత జాగరిణీ అనబడుతోంది. మాండూక్యోపనిషత్తులో

**సోయమాత్మాచతుష్పాత్** ఆత్మకు నాలుగుపాదాలు ఉన్నాయి. అందులో మొదటిది

**జాగరితస్థానో బహిః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి**

**ముఖః । స్థూల భుగ్ వైశ్వానరో ప్రథమపాదః ॥**

ఆత్మ యొక్క మొదటిపాదం వైశ్వానరుడు. ఇతడు విశ్వంలోని నరులందరికీ ప్రతినిధి. స్థూలశరీరమున్నవారందరికీ ప్రతినిధి. భోగాలు అనుభవించటానికి ఈ దేహమే ఆధారం. జీవి ఈ శరీరంతోనే సుఖదుఃఖాలు అనుభవిస్తాడు.

గృహస్తుకు గృహంలాగా జీవికి దేహం ఆధారమై ఉన్నది. జగత్తులో ఇటువంటి దేహానికి ప్రతినిధి వైశ్వానరుడు. జాగ్రదవస్థ ఇతని సంచారస్థానము. ఆ రూపంలో ఉన్నది కాబట్టే పరమేశ్వరి జాగరిణీ అనబడుతోంది.

## 258. స్వపంతీ

**నిద్రావస్థాయామంతః ప్రజ్ఞామాత్రేణ ప్రపంచానుభవో వాసనారూపేణ సః స్వప్నః**

నిద్రావస్థయందలి మానసికమగు ప్రపంచానుభవము స్వప్నము అని తెలియబడును. స్వప్నమనేది సూక్ష్మశరీర సంబంధమైన వ్యవహారము. జాగ్రదవస్థలో ప్రపంచానుభవాలన్నీ బీజం రూపంలో ఉండి, స్వప్నకాలంలో మనసుకు కనిపిస్తాయి. ఇవి అన్నీ ఈ జన్మలోని అనుబంధాలే అవనవసరంలేదు. ఆ అనుభూతులు గతజన్మలకు సంబంధించినవి కూడా కావచ్చు. ఈ దశలో శరీరంలోని ఇంద్రియాలు విశ్రాంతి తీసుకుంటూ ఉంటాయి. మనస్సు మేల్కొని ఉంటుంది. ఈ మనస్సే ఇంద్రియధర్మాలను నిర్వర్తిస్తూ ఉంటుంది. జాగ్రదవస్థలో ఇంద్రియజ్ఞానము స్థిరము. స్వప్నావస్థలో ఇంద్రియజ్ఞానము స్థిరము కాదు. మనసే ఇంద్రియాల పనులన్నీ చేస్తుంటుంది. స్వప్నమనేది కేవలము మానసిక సంబంధము. నిద్రాసమయంలో విషయాలు తెలుస్తాయి. మెలకువరాగానే అవన్నీ మాయమవుతాయి. ఈ రకంగా సూక్ష్మశరీరంతో మానవుడు పొందే అనుభూతికి ఆ పరమేశ్వరియే సాక్షీభూతంగా ఉన్నది. అందుకే ఆమె స్వపంతీ అనబడుతుంది.

## 259. తైజసాత్మికా

స్వప్నస్థానము పొందిన సూక్ష్మదేహాభిమాని అయిన జీవుల సమిష్టిరూపుడైన తైజసుడను హిరణ్యగర్భుని యొక్క ఆత్మ గలది.

స్వప్నము సూక్ష్మదేహము యొక్క వ్యవహారము. ఈ స్థితిలో వ్యష్టిదేహాభిమాని తైజసుడు. సమిష్టిగా అతడు హిరణ్యగర్భుడు. సూక్ష్మదేహంతో చేసే కర్మలన్నింటికీ సాక్షి ఆ పరమేశ్వరి. ఆమె తైజసుని రూపంలో ఉంటుంది. కాబట్టి తైజసాత్మికా అనబడుతున్నది. మాండుక్యోపనిషత్తులో స్వప్నస్థానాన్ని వివరిస్తూ

**స్వప్నస్థానోఽ౽ంతః ప్రజ్ఞః । సప్తాంగ ఏకోనవింశతిముఖః**
**ప్రవివిక్త భుక్ తైజసో ద్వితీయ పాదః ॥**

ఆత్మ యొక్క రెండవపాదము తైజసుడు. అదే మానసికస్థితి. ఈ మానసికస్థితికి హిరణ్యగర్భుడని పేరు. ఇతడు అంతర్ముఖమైన చేతన కలవాడు. స్వప్నంలో జరిగే విషయాలను మాత్రమే గ్రహించగలడు.

ఆ తైజసుని ఆత్మ గల పరమేశ్వరి తైజసాత్మికా అనబడుతుంది.

## 260. సుప్తా

సుప్తా అంటే ఇంద్రియవ్యాపారము నశించిన నిద్రావస్థ. శివసూత్రాలలో ఇది మాయ, అజ్ఞానము సౌషుప్తము అని ఉన్నది. బాహ్య వస్తువులను గురించిన జ్ఞానము ఏ మాత్రము ఉండదు. అందుకే నేను సుఖంగా నిద్రపోయాను నాకేం తెలియదు అంటాడు. ఇలా చెప్పటంవల్ల అవిద్యావృత్తులు మూడు ప్రస్ఫుటమవుతున్నాయి. 1. అజ్ఞానము 2. అహంభావము 3. సుఖము. ఈ మూడు వృత్తులు కలది సుషుప్తావస్థ. ఈ అవస్థకు అభిమాని ప్రాజ్ఞుడు.

నిర్వికార స్వరూపస్థితినే సుషుప్తి అంటారు. ఈ అవస్థను సంప్రసాదావస్థ అని కూడా అంటారు. మనస్సు, బుద్ధి కూడా హృదయంలో లీనమయ్యే స్థితి అది.

ఈ స్థితిలో ఇంద్రియాలు, బుద్ధి ముఖ్యప్రాణంలో కలిసిపోతాయి. ఈ రకంగా మనసు, బుద్ధి కూడా లయమయినప్పటికీ, మెలకువరాగానే తాను సుఖంగా నిద్రించాను అని తెలుస్తోంది. అంటే జ్ఞానము మాత్రము ఉన్నది. ఇక్కడ ఆనందాన్ని పొందుతుంది. కాబట్టి పరమేశ్వరి సుప్తా అనబడింది.

## 261. ప్రాజ్ఞాత్మికా

సుషుప్తిలో ఆనందము పొందిన జీవులయొక్క సమిష్టిరూపము కలది ఆ పరమేశ్వరి. ఈ స్థితిలో జీవుడు వ్యష్టిగా ప్రాజ్ఞుడు, సమిష్టిగా ఈశ్వరుడు. ప్రాజ్ఞుడిరూపంలో ఉన్నది కాబట్టి ఆ దేవి ప్రాజ్ఞాత్మికా అనబడుతుంది. మాండూక్యోపనిషత్తులో

నిద్రించినపుడు  ఏ కోరికలు, కలలు లేని స్థితి సుషుప్తి. గాఢనిద్ర. ప్రాజ్ఞుడు సుషుప్తిలో సంచారం చేస్తాడు. ఇక్కడ అతని అనుభవాలన్నీ ఏకమైపోతాయి. చేతనాశక్తి అంటే గ్రహణశక్తి అస్పష్టంగా నిలచిపోతుంది. అసలు అతను చేతనుడా ? కాదా ? అని కూడా అనిపిస్తుంది. అటువంటి ప్రాజ్ఞుని ఆత్మగా కలది కాబట్టి ప్రాజ్ఞాత్మికా అనబడుతుంది ఆ పరమేశ్వరి.

## 262. తుర్యా

ఇది యోగంలో సాధించే స్థితి. మనస్సు, బుద్ధి రెండూ బ్రహ్మరంధ్రం చేరినప్పుడు కలిగే స్థితి. ఇది స్థూల సూక్ష్మ కారణ శరీరాలకు అతీతమైనది. మనస్సు, బుద్ధుల యొక్క మార్పులను బట్టి అవస్థలు మారతాయి.

| | | |
|---|---|---|
| మనసు బుద్ధి కళ్ళను ఆశ్రయిస్తే | – | జాగ్రదవస్థ |
| మనసు బుద్ధి మనోగతమైతే | – | స్వప్నావస్థ |
| అవి హృదయగతమైతే | – | సుషుప్తావస్థ |
| అవి సహస్రారం చేరితే | – | తురీయావస్థ |

సాధకుడు యోగసాధనలో తురీయస్థితి చేరటము గతంలో వివరించటం జరిగింది. ఈ రకంగా మూడు అవస్థలలోనూ ఉంటూ అన్నింటికీ సాక్షీభూతమైనది కాబట్టే ఆ పరమేశ్వరి తుర్యా అనబడింది.

అందుకే లలితా అష్టోత్తరంలో **జాగ్రస్వప్నసుషుప్తీనాం సాక్షిభూత్యైనమోనమః** అని చెప్పబడింది.

## 263. సర్వావస్థావివర్జితా

జాగ్రస్వప్న సుషుప్తులు మూడు అవస్థలు నాల్గవది తురీయావస్థ. ఇక ఐదవ అవస్థ తురీయాతీతము. తురీయాన్ని దాటిన తరువాత సాధకుడు అన్నింటినీ వదలివేస్తాడు. వివర్జిత – వర్జించినది. విడిచినది. ఒక దాని నుంచి వేరొక దానికి రాలేనిది. పునరావృత్తి లేనిది. ఈ అవస్థ వ్యష్టి సమష్ట్యాత్మకమైనది. తురీయాన్ని గనక గట్టిగాసాధిస్తే, తురీయాతీతము లభిస్తుంది. ఇదే పరమపదము. తుర్యాతీతము పొందినవాడు శివునితో సమానమగును. ఏ మాత్రము ద్వైతభావము లేనిస్థితి. ఇక్కడ కాలభేదముండదు. అన్ని కాలాలయందు ఆనందమే స్వరూపము. ఇటువంటి సాధకుడు జీవన్ముక్తుడు. దేహేంద్రియాలు ఉన్నప్పటికీ అతడు కర్మలు చెయ్యడు. మాడిపోయి మొలకెత్తటానికి పనికిరాని విత్తనము వంటివాడు.

అతడు జీవించి ఉన్నప్పటికీ కర్మలు చేయడు. లోకంతో అతనికి సంబంధం లేదు. అతడు పరమేశ్వర స్వరూపుడు.

ఈ రకంగా జీవి యొక్క ఐదు అవస్థలను వివరించటం జరిగింది.



శ్రీ ఇ కార దేవి

# 21. పంచకృత్యములు

కృత్యములు అంటే చేయదగినవి. నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ బిందురూపంలో ఉన్నాడు. అతడు బిందురూపంలోనే ఉన్నాడు. ఇంకేరూపంలోనూ లేడు అనే విషయాన్ని మనం మరిచిపోకూడదు. అయితే పరబ్రహ్మ బిందురూపంలోనే ఎందుకున్నాడు ? అన్నది సందేహము. పరమాత్మ చరాచరజగత్తంతా వ్యాపించి ఉన్నాడు. కంటికి కనపించేదంతా పరబ్రహ్మస్వరూపమే. కంటికి కనిపించేది భూగోళం. భూగోళమంతా పరమేశ్వరమయం. భూమి గుండ్రంగా ఉన్నది. అందుచేతనే ఈ జగత్తంతా వ్యాపించి ఉన్న పరమేశ్వరుడు కూడా బిందురూపంలోనే ఉన్నాడు.

పరమేశ్వరుడు పూర్ణస్వరూపుడు. ఆ విధంగా పూర్ణస్వరూపంగలది బిందు వొక్కటే. 360 డిగ్రీలు ఉంటే వృత్తం అవుతుంది. అంతకుమించి ఇంకొక డిగ్రీలేదు. అంతకు తక్కువ ఉంటే అది వృత్తం కాదు. అది పూర్ణత్వానికి ప్రతీక. అందుకే పరమేశ్వరుడు బిందురూపంలో ఉన్నాడు. ఈ రెండు కారణాలచేత పరబ్రహ్మ బిందురూపంలో ఉన్నాడని చెప్పటం జరిగింది.

మహాప్రళయంలో ఈ జగత్తంతా నశించిపోయింది. అంటే ఏమీలేదు. అంతా శూన్యంగా ఉంది. అలా కొంతకాలం జరిగిన తరువాత గతంలో ప్రళయం సంభవించినప్పుడు కర్మక్షయం కాకుండా తనలో కలిసి ఉన్నటువంటి జీవరాశికంతటికీ కర్మక్షయంచేసి, వారికి మోక్షం కల్పిద్దామనే ఉద్దేశ్యంతో ఆ పరమేశ్వరుడు సృష్టి చెయ్యాలని సంకల్పించాడు. అంతేగాని తన లీలా వినోదం కోసం మాత్రం కాదు. ఆ రకంగా సృష్టి చెయ్యాలనుకున్నవాడై ముందుగా తనలో నుంచి కొంతశక్తిని బయటకు పంపాడు. ఆ శక్తినుంచే ఈ జగత్తంతా ఆవిర్భవించింది. అందుచేత ఈ జగత్తుకు జన్మస్థానం ఆ శక్తే. అదే త్రికోణము యోని, అదే మాయ. పరమేశ్వరుని యొక్క శక్తి. పరమేశ్వరుడు శివుడు ఆ మాయ శక్తి వారే శివశక్తులు. కామేశ్వరీ కామేశ్వరులు. ఇప్పుడు సృష్టి ఆరంభమైంది. 'విశ్వరూపా' అనే నామంలో వివరించినట్లుగా ముందు తమస్సు పుట్టింది. తమస్సు నుంచి మహత్తు, దాని నుంచి అహంకారము. అహంకారం నుంచి ముందుగా తన్మాత్రలు వాటి నుంచి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు వచ్చినాయి. తన్మాత్రలనుంచి వాటి స్థూలరూపమైన పంచభూతాలు ఆవిర్భవించినాయి. ఇప్పుడు పంచభూతాలు, తన్మాత్రలతో కారణఉపాధులతో కూడిన చైతన్యము కలిసి నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది.

ముందుగా రూపాత్మకమైన జగత్తు. అంటే అడవులు, కొండలు, పర్వతాలు 84 లక్షల జీవరాశి ఏర్పడ్డాయి. నామాత్మకమైన జగత్తు అంటే ముందుగా పరమేశ్వర స్వరూపమైన ఓంకారము. దాని నుంచి – అక్షరసమామ్నాయము, వాటి నుంచి – పదాలు, మాటలు, వాక్యాలు, మంత్రాలు, వేదాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలు, సంగీత సాహిత్యాలు. ఈ రకంగా నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది.

ఈ సృష్టికి ముందుకాలంలో పరమేశ్వరుడు బిందువుగా ఉన్నాడు. అతని నుంచి కొంతశక్తిని బయటకు పంపాడు. ఇప్పుడు చిన్న సందేహం. పరమేశ్వరునిలోంచి కొంతశక్తి బయటకుపోతే, అతని బిందుత్వానికి ఆటంకం ఏర్పడలేదా ? దానికి సమాధానం లేదు. అలా జరగదు. బిందువులోంచి కొంతభాగం బయటకుపోయినా, లేక మరికొంతభాగం బిందువుకు కలసినా దాని బిందుత్వానికి ఏమాత్రం విఘాతం కలగదు. ఇప్పుడు శూన్యాకారంలో ఈ శక్తి ఒక్కటే ఉంది. అప్పుడు ఆమె సృష్టి చెయ్యటానికి

**సంహారశ్చహరాయత్తః ఉత్పత్తిర్భవనిర్మిత రక్షాతుమృడసంలగ్నా**

వీరు ముగ్గిరినీ తానే సృష్టించింది. పంచభూతాలు సృష్టించబడ్డాయి. పంచభూతాలలో వాయువు, ఆకాశములేవు. జలము, అగ్ని, భూమి ఈ మూడింటినుంచే జగత్తు ఉద్భవించింది అని కొందరి సిద్ధాంతం. ఆ తరువాత ఆ మహాసముద్రంలో యోగనిద్రలో శ్రీమహావిష్ణువు. అతని బొడ్డునుండి బ్రహ్మ జన్మించటం మధుకైటభసంహారం.

ఆ తరువాత బ్రహ్మస్వాయంభువ మనువును సృష్టించాడు. అతడి వల్లనే ఈ సృష్టి జరిగింది. అని చెప్పబడుతోంది.

అయితే సృష్టిని గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. ప్రశ్నోపనిషత్తులో పిప్పలాద మహర్షిని కబంధుడు అనే శిష్యుడు "గురుదేవా ! ఈ ప్రాణికోటి ఎక్కడి నుంచి పుట్టింది?" అని అడుగుతాడు.

దానికి పిప్పలాదుడు "ప్రజాపతి సంతానాన్ని పొందాలనే కోరికగలవాడై తపస్సు చేశాడు. ఇక్కడ తపస్సు అంటే పూర్వకల్పంలో తాను చేసిన సృష్టిని ధ్యానించటం.

ఈ రకంగా తపస్సు చేసి 'రయి' 'ప్రాణము' అనే జంటను సృష్టించాడు.

రయి అంటే – అన్నము, పదార్థము, చంద్రుడు అని అర్థం. చంద్రునివల్లనే ఈ భూమిమీద ద్రవ్యత్వము, రసము కలుగుతున్నాయి. చంద్రుడే ఓషధులకు, వనస్పతులకు కారకుడు. ఓషధులు, వనస్పతులే అన్నము. ఈ రకంగా పదార్థము అంటే–చంద్రుడు, అన్నము.

ఇక ప్రాణము అంటే సూర్యుడు, శక్తి అగ్నే ప్రాణము. కాబట్టి అన్నము ప్రాణం ద్వారానే జీవం వర్ధిల్లుతున్నది. ఈ విధంగా ప్రజాపతి సృష్టించిన జంటలు మూడు.

1. చంద్రుడు, సూర్యుడు 2. పదార్ధము, శక్తి 3. ప్రాణము, అన్నము.

ఆదిత్యుడే ప్రాణము. అతడే అగ్ని. అతడే భోక్త అతడే సమస్త జీవుల కార్యకలాపాలకు కారణం. అందుచేత అతడే సమష్టి ప్రాణం. చంద్రుడే రయి. స్థూలము, సూక్ష్మము, మూర్తామూర్తము అంతా పదార్ధమే. పదార్ధం ప్రాణం రెండూ ఒక్కటే. ఈ రకంగా అన్నము. ప్రాణమునుంచి జీవరాశి ఉద్భవించిందని చెప్పబడింది.

ఐతరేయోపనిషత్తులో ''జీవాత్మపరమాత్మ రెండూ ఒక్కటే. ఆత్మయే ఆలోచనాపూర్వకంగా ఈ లోకాలను సృష్టించింది. సృష్టి జరగటానికి ముందు ఈ సృష్టి అంతా బ్రహ్మమయంగానే ఉండేది. ఈ ఆత్మ కొంతకాలానికి మరీచి, అంభస్సు, ఆపః, మర అనే లోకాలను సృష్టించింది. భూలోకమే మరము. ఇదే మర్త్యలోకం. ఇక్కడ జన్మించిన ప్రతిప్రాణీ మరణించాల్సిందే. లోకాలను సృష్టించిన తరువాత 'లోకాలను రక్షించేవారు లేకపోతే అవి నాశనమయిపోతాయి' అని ఆలోచించి ముందుగా విరాట్స్వరూపాన్ని సృష్టించింది. ఆ తరువాత ఇంద్రియ అధిష్ఠాన దేవతలను సృష్టించింది.

పరమేశ్వరుడు విరాట్స్వరూపానికి ఆకలిదప్పికలు కలిగేలా చేశాడు. అప్పుడు ఇంద్రియాధిష్ఠానదేవతలు మేము కూర్చుని భుజించేందుకు వీలుగా మాకు తగిన స్థానాన్ని ప్రసాదించమని వేడుకున్నారు.

పరమేశ్వరుడు దేవతల కోసం ఆవును సృష్టించాడు. దేవతలు 'ఇది మాకు సరిపోదు' అన్నారు. గుర్రాన్ని సృష్టించాడు. ఇది మాకు చాలదన్నారు. ఈ రకంగా జీవకోటిని సృష్టించి చివరకు విరాట్స్వరూపాన్ని పోలిన మానవాకారాన్ని సృష్టించాడు అని చెప్పబడింది.

ఇంకొకచోట స్వాయంభువ మనువు, శతరూపవల్లనే 84 లక్షల జీవరాశి ఉద్భవించింది అని చెప్పబడింది.

దేవీ భాగవతంలో మధుకైటభుల సంహారం తరువాత పరమేశ్వరి బ్రహ్మతో "నువ్వు సృష్టి కార్యం చెయ్యి. శివకేశవులిద్దరూ నీకు సహాయకారులుగా ఉంటారు" అని చెప్పి, మహాకాళి మహాలక్ష్మి, మహాసరస్వతులను సృష్టించి 'వీరు నా ప్రతిరూపాలు. సృష్టి కార్యక్రమంలో మీకు సహాయంగా ఉంటారు. వాళ్ళని మీరెప్పుడూ అవమానించవద్దు. ఇక వెళ్ళి మీ స్థావరాలు ఏర్పాటు చేసుకుని సృష్టి చెయ్యండి అని చెబుతుంది.

ఈ రకంగా తన అంశలే అయిన త్రిమూర్తుల ద్వారా సృష్టి ప్రారంభించింది. అందుచేతనే సృష్టి చేసేటప్పుడు బ్రహ్మగా, స్థితిలో విష్ణువుగా, లయం చేసేటప్పుడు రుద్రుడుగా, ఆ తరువాత ఈశ్వరుడుగా, సదాశివుడుగా సృష్టి, స్థితి, లయ, తిరోదాన అనుగ్రహములు అనబడే పంచకృత్యాలను ఆ పరమేశ్వరే చేస్తుంది.

ఆ విషయాన్నే 264 నుంచి 274వ నామం వరకు వివరిస్తున్నారు. శంకరభగవత్పాదుల వారు తమ సౌందర్య లహరిలోని 24వ శ్లోకంలో

**జగ స్సూతే ధాతా హరి రవతి రుద్రః క్షపయతే**
**తిరస్కుర్వ న్నేత త్స్వమపి వపురీశ స్థిరయతి**
**సదాపూర్వ స్సర్వం తదిద మనుగృహ్ణాతి చ శివః**
**తవాజ్ఞా మాలంబ్య క్షణచలితయో ర్భ్రూలతికయోః ॥**

ఓ దేవీ ! సృష్టికర్త అయిన బ్రహ్మ ఈ లోకాన్ని సృష్టిస్తున్నాడు. విష్ణువు జగత్తును రక్షిస్తాడు. రుద్రుడు లయం చేస్తాడు. మహేశ్వరుడు ఈ ముగ్గురినీ తనలో లీనం చేసుకుని సదాశివుని యందు లయం అవుతాడు. సదాశివుడు నీ ఆజ్ఞ ప్రకారము ఆ నలుగురిచే మళ్ళీ సృష్టి చేయిస్తున్నాడు.

## 264. సృష్టికర్త్రీ

జగన్నిర్మాణమనేది రజోగుణప్రధానుడైన ఈశ్వరుని పని. అటువంటి సృష్టిని చేస్తుంది. కాబట్టి ఆ పరమేశ్వరి సృష్టికర్త్రీ అనబడుతోంది.

పూర్వ కల్పంలోని జీవరాసుల కర్మవాసనలే 'మాయా' అనబడుతుంది. ఇది జడము. అందుచేత పరమేశ్వరుని యందు అభివ్యక్తమవుతుంది.

సృష్టి చెయ్యటము రజోగుణధర్మము. ఆ పరమేశ్వరి మూలప్రకృతి రూపం పొంది సృష్టిని చేస్తున్నది. అంటే గతంలో కర్మక్షయం కాకుండా ఉన్న జీవులకర్మానుసారము వారికి ఉత్తరజన్మ ఇస్తున్నది. అందుచేతనే ఆమె సృష్టికర్త్రీ అనబడుతోంది.

సృష్టి గుణాల ఆధారంగా జరుగుతుంది. అందుకే సృష్టి మూడువిధాలు.

1. ఏకగుణసృష్టి 2. ద్విగుణసృష్టి 3. త్రిగుణసృష్టి

**1. ఏకగుణసృష్టి :** ఇందులో ఒకే గుణముంటుంది.

| | | |
|---|---|---|
| సత్వగుణము వల్ల | – | బ్రహ్మాదిదేవతలు. |
| రజోగుణమువల్ల | – | మనుష్యులు, మృగాలు, పక్షులు, జలచరాలు. |
| తమోగుణం వల్ల | – | చెట్లు, చేమలు, పర్వతాలు ఉద్భవిస్తాయి. |

**2. ద్విగుణసృష్టి :** ఇందులో ప్రతిగుణము మళ్ళీ మూడు భాగాలవుతుంది. దాని నుంచి ప్రాణికోటి ఆవిర్భవిస్తుంది.

| | | |
|---|---|---|
| సత్వసత్త్వము నుంచి | – | విరాట్పురుషాదులు |
| సత్వరజము నుంచి | – | దేవరుషులు, వాలఖిల్యులు, వైఖానసులు |
| సత్వతమస్సు నుంచి | – | యక్ష రాక్షస విద్యాధరులు |
| రజసత్త్వమున | – | మానవులు |
| రజోరజమున | – | పశువులు, మృగాలు |
| రజోతమస్సున | – | స్వేదజాలు, అండజాలు, జలచరాలు |
| తమస్సులో సత్వమువల్ల | – | పైరులు, గడ్డిపంటలు |
| తమోరజమువల్ల | – | చెట్లు, పొదలు, తీగెలు |
| తమోతమమువల్ల | – | భూములు, కొండలు, బండలు |

**3. త్రిగుణసృష్టి :** ఇందులో ప్రతిగుణంలోనూ మూడుభాగాలుంటాయి. మళ్ళీ అవి ఒక్కొక్కటి మూడుభాగాలవుతాయి. ఈరకంగా మొత్తం 27 భాగాలవుతాయి.

| | | | |
|---|---|---|---|
| 1. | సత్వంలో తమోతమము | – | శేషుడు, వాసుకి మొ॥వారు |
| 2. | సత్వంలో తమోరజము | – | దేవతలు, అంగిరసుడు మొ॥వారు |
| 3. | సత్వంలో తమోసత్వము | – | కర్మదేవతలు, నవగ్రహాలు |
| 4. | సత్వంలో రజోతమము | – | సిద్ధులు, సాధ్యులు |
| 5. | సత్వంలో రజోరజము | – | సప్తరుషులు, శుకవామదేవాదులు |
| 6. | సత్వంలో రజోసత్త్వము | – | దిక్పాలకులు, పంచబ్రహ్మలు |
| 7. | సత్వంలో సత్వతమస్సు | – | విరాట్టు, హిరణ్యగర్భుడు |
| 8. | సత్వంలో సత్వరజస్సు | – | సూత్రాత్మ, నిర్వికల్ప సమాధి నిష్ఠులు |
| 9. | సత్వంలో సత్వసత్వము | – | సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము, సర్వాంతర్యామిత్వము |

| | | | |
|---|---|---|---|
| 10. | రజంలో తమోతమము | – | కందిరీగలు, తేళ్ళు, చీమలు, పాములు |
| 11. | రజంలో తమోరజము | – | మొసళ్ళు, పీతలు, నత్తలు |
| 12. | రజంలో తమోసత్వము | – | కాకులు, పిచ్చుకలు, చిలకలు, గోరువంకలు |
| 13. | రజంలో రజోతమము | – | సింహాలు, పులులు, ఎలుగుబంట్లు |
| 14. | రజంలో రజోరజము | – | ఏనుగులు, గుర్రాలు, కోతులు, మేకలు |
| 15. | రజంలో రజోసత్త్వము | – | క్రరిఆవులు, చమరీమృగాలు, జింక, దుప్పి |
| 16. | రజంలో సత్వతమము | – | శూద్రులు, మంగలి, మాల, చాకలి |
| 17. | రజంలో సత్వరజము | – | పుణ్యకర్మలు చెయ్యటం, దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసే పాలకులు |
| 18. | రజంలో సత్వసత్వము | – | బ్రహ్మావాదులు, వేదవిదులు. దశవిధ బ్రాహ్మణులు |
| 19. | తమంలో తమోతమం | – | కొండలు, బండలు, ముళ్ళచెట్లు, నిర్జన ప్రదేశాలు, చవిటినేలలు. |
| 20. | తమంలో తమోరజస్సు | – | మంచి పంటపండే నేలలు, తపస్సు, యజ్ఞము చేసే ప్రాంతాలు. దేవబ్రాహ్మణనివాసాలు. |
| 21. | తమంలో తమోసత్త్వము | – | పుణ్యక్షేత్రాలు, పుణ్యనదులు |
| 22. | తమంలో రజోతమము | – | ముష్టి, వేము, బలురక్కసి, నాగజెముడు, తాడి, ఈతచెట్లు. |
| 23. | తమంలో రజోరజము | – | నిమ్మ, దానిమ్మ, బత్తాయి, మర్రి, జమ్మి |
| 24. | తమంలో రజోసత్త్వము | – | అరటి, పనస, మామిడి, వెలగ, పద్మ, కలువ పారిజాతాదులు. |
| 25. | తమంలో సత్వతమము | – | ఉలవ, జొన్న, ఆరిగ, ధాన్యాలు |
| 26. | తమంలో సత్వరజము | – | కంది, నువ్వు, మినుము, నల్లవరి |
| 27. | తమంలో సత్వసత్త్వము | – | తెల్లవరి, సన్నవరి, పెసలు, చెరకు |

దశవిధ బ్రాహ్మణులు అంటే – వేద విద్యా సంపన్నులు, ఆచారవంతులు అయిన ఆంధ్ర, కర్ణాటక, ద్రావిడ, ఘూర్జర, మహారాష్ట్రులు. వీరు పంచద్రావిడులు. ఉత్కల, మైథిల, గౌడ, కన్యాకుబ్జ, సారస్వతులు. వీరు పంచగౌడులు. వీరు మొత్తం కలిపి దశవిధ బ్రాహ్మణులు.

ఈ రకంగా సృష్టి జరుగుతుంది. ఆ సృష్టికి కర్త పరమేశ్వరి కాబట్టి సృష్టికర్త్రీ అనబడుతుంది.

## 265. బ్రహ్మరూపా

**బ్రహ్మో చతుర్ముఖః తాదృశ ఈశ్వరః స ఏవం రూపం యస్యాః** బ్రహ్మ అనగా నాలుగు ముఖాలు కలవాడు. చతుర్ముఖుడు. అట్టివాడే ఈశ్వరుడు. అటువంటి రూపము గలది దేవి. విష్ణుపురాణంలో బ్రహ్మవిష్ణుశివులు బ్రహ్మ యొక్క ప్రధానశక్తులు అని ఉన్నది.

సృష్టి కర్తృత్వము రజోగుణప్రధానము. త్రిగుణాత్మకమైన దేవి రూపాలలో రజోగుణప్రధానుడు బ్రహ్మ. ఇటువంటి చతుర్ముఖబ్రహ్మ రూపంలో ఈ జగత్తును పరమేశ్వరి సృష్టిస్తోంది కాబట్టి బ్రహ్మరూపా అనబడింది. బ్రహ్మరూపాన్ని వివరిస్తూ

**యేన సర్వం విజానాతి యదాధార మిదం జగత్ ।**
**త దేవ బ్రహ్మత్వం స్యాత్ తత్త్వ్యరూప మితీర్యతే ॥**

దేనివల్లనైతే సకల జగత్తును గురించి తెలియబడుచున్నదో, ఈ జగత్తుకు ఆధారమైనదేదో, అదే బ్రహ్మము. ఏదైతే స్వయంప్రకాశమో, అన్నిటికన్న బృహత్తరమైనదో, జగత్తంతా వ్యాపించి ఉన్నదో, సమస్త ప్రాణికోటియందు జీవునిరూపంలో ఉన్నదో అదే బ్రహ్మము. ఇక్కడ బ్రహ్మ అంటే త్రిమూర్తులలో మొదటివాడు. కర్మబ్రహ్మ అని అర్థం.

## 266. గోప్త్రీ

**గోపనం జగతః స్థితిః** గోపనము అంటే జగత్తు యొక్క రక్షణ' అది సత్వగుణ ప్రధానుడైన ఈశ్వరుని పని. ఆ పనిని చెయ్యటంచేత పరమేశ్వరి గోప్త్రీ అనబడుతున్నది. సత్త్వగుణప్రధానమై సకల జగత్తును రక్షిస్తున్నది కాబట్టి పరమేశ్వరి గోప్త్రీ అనబడుతున్నది.

**సమస్త భూతాని పాలయన్ రక్షకో జగత ఇతి గోప్తా**

సకల భూతజాలమును పాలించి రక్షించునది.

**స్వమాయయా స్వమాత్మానం సంవృణోతీతి గోప్త్రీ**

తన మాయచే తానే మరుగున పడుతున్నది కాబట్టి గోప్త్రీ అనబడుతున్నది.

జగత్తులోని అన్ని జీవులయందు పరమేశ్వరి రహస్యంగా దాగి ఉంటుంది. కాబట్టి గోప్త్రీ అనబడుతున్నది.

శ్రీవిద్య చాలా గుప్తమైనది. దానిని ఎవరికి పడితే వారికి చెప్పరాదు. పెద్దకుమారునికి లేదా మంచి శిష్యుడికి మాత్రమే చెప్పాలి. అటువంటి రహస్యమైన విద్యకి అధికారి కాబట్టి గోప్త్రీ అనబడుతుంది. ఈ విద్యను రహస్యంగా ఉంచి గురుశిష్యపరంపరగా లోకంలో వ్యాప్తి జరిగేటట్లు చూస్తున్నది కాబట్టి గోప్త్రీ అనబడుతోంది.

## 267. గోవిందరూపిణీ

గోవిందరూపుడైన విష్ణువే ఈశ్వరుడు. అటువంటి రూపము గలదవటంచేత గోవిందరూపిణి అనబడుతోంది. గోవిందుడు అంటే – గవాధ్యక్షుడు. బృహస్పతి అని ఉంది. కాబట్టి బృహస్పతి రూపము గలది. ఆ దేవి.

జగద్రక్షణ సత్త్వగుణ ప్రధానము. పరమేశ్వరుని మూర్తులలో సత్త్వగుణప్రధానుడు గోవిందుడు. ఇటువంటి గోవిందుని రూపంలో ఈ జగత్తును రక్షిస్తున్నది. కాబట్టి గోవిందరూపిణి అనబడుతోంది. గో శబ్దానికి భూమి అని అర్థం. హిరణ్యాక్షుడు భూమిని ఎత్తుకుపోతే, వరాహరూపంలో దానిని రక్షించినవాడు గోవిందుడు. అతడి రూపంలో ఉన్నది కాబట్టి దేవి గోవిందరూపిణి. ఒకసారి ఇంద్రుడు విష్ణువుతో "నేను వేల్పులకు ఇంద్రుడైనట్లుగానే నువ్వు గోవులకు ఇంద్రుడవు" అన్నాడు. అట్టి రూపంలో ఉన్న దేవి గోవిందరూపిణి. వాక్కుచేతగాని వేదాంతవాక్కులచేతగాని పొందదగినవాడవటం చేత పరమేశ్వరుడు గోవిందుడు అనబడుతున్నాడు. ప్రకృతి యొక్క మొదటిభాగము ఉమాదేవి రెండవభాగము సర్వమయుడైన లోకరక్షకుడు విష్ణువు స్త్రీ సంజ్ఞ గలవాడు. అందుచేత గోవిందరూపిణి అనబడుతున్నది.

## 268. సంహారిణీ

ఈ ప్రపంచాన్ని అణుస్వరూపంగా నాశనం చేసేది. ఇది తమోగుణప్రధానుడైన రుద్రుని పని. అటువంటి లోకసంహారము చేసే దేవి.

సంహారము తమోగుణం గలవారు చేసేపని. ఇది ఆ పరమేశ్వరుని కృత్యాలలో మూడవది. ఈ రకంగా సంహారం చేస్తుంది. కాబట్టి సంహారిణీ అనబడుతుంది.

## 269. రుద్రరూపా

రుద్రుడు – శివుడు, ఈశ్వరుడు. దుఃఖించువాడు రోదించువాడు. ప్రళయకాలంలో సూర్యుని కంటి నుండి కన్నీటి రూపమున వర్షించును. వేదంలో "అతడు ఏడ్చెను. అది రుద్రుని రుద్రత్వము' అని చెప్పబడింది. శివరహస్యంలో

**రుజం ద్రావయతే తస్మా ద్రుద్రః పశుపతిః స్మృతః**

దుఃఖములను పోగొట్టువాడు రుద్రుడు. అతడే పశుపతి. అజ్ఞానులైన జీవులకుపతి అని చెప్పబడింది. వాసవీయసంహితలో రుద్ – అనగా దుఃఖము లేక దుఃఖకారణము. అట్టి దుఃఖకారణము పోగొట్టుప్రభువు రుద్రుడనబడుతున్నాడు అని ఉంది.

త్రిమూర్తులలో తమోగుణ ప్రధానుడు రుద్రుడు. పరమేశ్వరి రుద్రుని రూపంలో జగత్తును లయం చేస్తుంది. కాబట్టి రుద్రరూపా అనబడుతోంది.

**రుదంద్రావయతీతి రుద్రః** సంసారబంధనాలను పోగొట్టేది కాబట్టి పరమేశ్వరి రుద్రరూపా అనబడుతుంది. రుద్రులు పదకొండుమంది. వారే ఏకాదశరుద్రులు.

| | | |
|---|---|---|
| 1. అజైకపాదుడు | 5. హరుడు | 9. కపర్ది |
| 2. అహిర్బుధ్న్యుడు | 6. త్ర్యంబకుడు | 10. మృగవ్యాధుడు |
| 3. త్వష్ట | 7. వృషాకపి | 11. శర్వుడు |
| 4. రుద్రుడు | 8. శంభుడు | |

అయితే దీనిలో మతాంతరమున్నది. ఇంకొక లెక్కప్రకారము.

| | | |
|---|---|---|
| 1. అజుడు | 5. రుద్రుడు | 9. అపరాజితుడు |
| 2. ఏకపాదుడు | 6. హరుడు | 10. ఈశానుడు |
| 3. అహిర్బుధ్న్యుడు | 7. శంభుడు | 11. త్రిభువనుడు |
| 4. త్వష్ట | 8. త్ర్యంబకుడు | |

బృహదారణ్యకోపనిషత్తులో శాకల్యుడు యాజ్ఞవల్క్యుణ్ణి అడుగుతాడు రుద్రులెంతమంది ? వారెవరు ?

**యాజ్ఞవల్క్యుడు :** జ్ఞానేంద్రియాలు 5, కర్మేంద్రియాలు 5, మనస్సు. ప్రాణియొక్క కర్మ పరిసమాపన మైనప్పుడు వీరు శరీరం నుంచి నిష్క్రమిస్తారు. ఈ రకంగా శరీరం వదిలి బంధువులను రోదింపచేస్తాయి. కాబట్టి ఇవి రుద్రశబ్దం చేత పిలువబడతాయి.

ఈ రకంగా రుద్రుని యొక్క రూపమయినది కాబట్టి ఆ దేవి రుద్రరూపిణి అనబడుతోంది.

## 270. తిరోధానకరీ

తిరోధానము అంటే ఆచ్ఛాదనము. సంపూర్ణనాశనము. అణువులను కూడా ప్రకృతిలో లయింపచేయుట, దీపనాశనముతో సమానంగా లయం చెయ్యటము. ఇది శుద్ధసత్త్వగుణ ప్రధానుడైన ఈశ్వరుని పని. అటువంటి సంపూర్ణ లయంచేసేది దేవి. త్రిపురాసిద్ధాంతములో

**అభక్తానాం చ సర్వేషాం తిరోధాన కరీ యతః**
**శ్రీ తిరస్కరిణీ తస్మాత్ ప్రోక్తా సత్యం వరాననే**

సమస్తమైన అభక్తులను తిరోదానము చేయునది. కాబట్టి తిరోధానకరి అనబడుతుంది.

కల్పాంతమున చరాచరజగత్తు యొక్క సకల కారణ శరీరములను బీజరూపంలో తన యందు ఇముడ్చుకుని కనపడకుండా ఉండేటట్లు చేయునది. కాబట్టి ఆ దేవి తిరోదానకరి అనబడుతోంది.

## 271. ఈశ్వరీ

శుద్ధసత్త్వము గలవాడు ఈశ్వరుడు. అట్టి ఈశ్వరుని కన్న వేరుకానిది.

సత్వగుణప్రధానమైనది ఈశ్వరి. పరాహంతభావమే స్వతంత్రము. చిత్స్వరూపము కాబట్టి అట్టిభావము గలది. పరాహంతభావము అంటే-ఉత్కృష్టమైన అహం అనే భావము.

మాయను వశమునందుంచుకొనినది. మాయను వశము నందుంచుకున్న ఈశ్వరుని యొక్క శక్తి. ఈశ్వరుని శక్తి కాబట్టి ఈశ్వరీ అనుబడుతోంది. పంచకృత్యాలలో నాల్గవది తిరోధానము. పంచబ్రహ్మలలో నాల్గవవాడు ఈశ్వరుడు. తిరోధానుడైన ఈశ్వరరూపిణి కాబట్టి ఈశ్వరీ అనబడింది.

కల్పాంతంలో ఈశ్వరుడు తిరోధానము చేస్తాడు. మళ్ళీ కల్పారంభం జరిగినప్పుడు పరమేశ్వరి యొక్క మాయకు లోనైనవాడై ఈ సృష్టి కార్యము సాగిస్తాడు. అప్పుడు అన్ని ప్రాణులకు బుద్ధి, ఇంద్రియాలు తానే అయి ఉండే శక్తి ఈశ్వరి.

జీవులు ఏఏ కర్మలు చేశాయో జాగ్రత్తగా లెక్కవేసి, వాటి యొక్క ఫలితాలను ఏరి, అందులో వరుస ప్రకారం ఆ జీవి ఆ ఫలితం అనుభవించేటట్లుగా ఏర్పాటుచేసేది ఈశ్వరీ శక్తి. అందుకే ఆమె కర్మఫలస్వరూపుడు, శరణాగత రక్షకుడు, సర్వసాక్షి, సర్వజీవపోషకుడు, సృష్టి,స్థితి, లయకారకుడు, అవ్యయుడు, శాశ్వతుడు, అనంతుడు అయిన ఈశ్వర శక్తి.

ఎవరి సంకల్పం వ్యర్థం కాకుండా వెంటనే ఫలిస్తుందోవాడు ఈశ్వరుడు. నిర్గుణ బ్రహ్మమే ఈశ్వరుడు. మాయతో కూడిన పరబ్రహ్మ ఈశ్వరుడు. అతని శక్తియే ఈశ్వరి.

## 272. సదాశివా

**విరలతర శుద్ధసత్త్వప్రధాన ఈశ్వర స్సదాశివః**

విస్తారమైన శుద్ధసత్వప్రధానుడైన ఈశ్వరుడే సదాశివుడు. అటువంటి సదాశివరూపం గలిగినటువంటిది ఆ పరమేశ్వరి.

సదాశివత్త్వము అనేది శుద్ధసత్త్వ స్వరూపము. పంచబ్రహ్మలలో ఐదవవాడు సదాశివుడు. పంచబ్రహ్మ కృత్యాలలో ఐదవది అయిన అనుగ్రహముతో పునఃసృష్టికి సుముఖమైనవాడు సదాశివుడు. ఎల్లప్పుడు శుభమును, మంగళములను చేకూర్చువాడు సదాశివుడు. సదాశివా అంటే బ్రహ్మతో ఐక్యము గల స్వరూపిణి. సదాశివుడితో భేదంలేదు కాబట్టి ఆ పరమేశ్వరి సదాశివా అనబడుతోంది.

## 273. అనుగ్రహదా

నిరవశేషంగా అంటే పూర్తిగా, ఏమీ మిగలకుండా పరమాణువులతో సహా నాశనమయిపోయిన జగత్తును మళ్ళీ సృష్టించటానికి సుముఖంగా ఉండటం అంటే పునఃసృష్టి చేయటమనేది సదాశివుని పని. అదే అనుగ్రహము. అంటే మళ్ళీ సృష్టి ప్రారంభించటమే అనుగ్రహము. తిరోధాన అనుగ్రహాలే బంధమోక్షాలు. పరమేశ్వరి సదాశివులే బంధమోక్షాలకు కారకులు.

మహాకల్పాంతమున చరచరజగత్తు అంతా నిశ్శేషంగా నాశనమయిపోతుంది. అణువులు, పరమాణువులు కూడా నాశనమయిపోతాయి. ఏమీ ఉండదు. ఆ సమయంలో సృష్టి మొత్తాన్ని త్రిమూర్తులను తనలో లయం చేసుకున్న ఈశ్వరుడు సదాశివునిలో లీనమవుతాడు. మళ్ళీ సృష్టి ప్రారంభమైనప్పుడు సదాశివుని అనుగ్రహంతో ఈశ్వరుడే ఈసృష్టిని ప్రారంభిస్తాడు. ఈరకంగా సదాశివుని రూపంలో పునఃసృష్టి ప్రారంభిస్తుంది. కాబట్టి ఆ పరమేశ్వరి అనుగ్రహదా అనబడుతోంది.

## 274. పంచకృత్యపరాయణా

ఇంతవరకు చెప్పిన సృష్టి స్థితి లయము తిరోధానము అనుగ్రహము అనే పంచకృత్యములు నెరవేర్చేది. సృష్టికర్త్రీ, గోప్త్రీ, సంహారిణీ, తిరోధానకరీ, అనుగ్రహదా అనే రూపాలతో ఆ పరమేశ్వరి ఈ పంచకృత్యాలను చేస్తుంటుంది.

పంచకృత్యముల యందు ఆసక్తి కలది. పంచకృత్యములు అభీష్టముగా గలది. పరాయణ అంటే – అభీష్టము, తత్పరాశ్రయము అని విశ్వకోశం చెబుతోంది. పరాయణము అంటే – అత్యంతా సక్తము, తత్పరము, అభీష్టము, ప్రియము, అని చెబుతోంది. సూర్యరాయాంధ్ర నిఘంటువు. మృగేంద్రసంహితలో 'విశ్వము యొక్క సృష్టి స్థితి లయము తిరోధానము భూత భౌతికభావముల నియమము వీటికి బ్రహ్మకారణము' అని చెప్పబడింది.

ఆగమాంతరంలో 'సృష్టిస్థితిలయము తిరోధాన అనుగ్రహము అనే పంచకృత్యాలు పరబ్రహ్మ యొక్క కార్యములు' అని చెప్పబడింది.

దేవీభాగవతంలో 'పరమేశ్వరి యథేచ్ఛగా ఈ జగత్తును సృష్టిస్తున్నది పాలిసున్నది. నాశనం చేస్తున్నది. ఈ రకంగా ఆమె మూడురూపాలు కలిగి ఉంటున్నది. బ్రహ్మ ఆ శక్తితో కలిసి సృష్టి చేస్తున్నాడు. విష్ణువు ఆమెతో కలిసే లోకాలను పాలిస్తున్నాడు. రుద్రుడు కూడా ఆమెతో కలిసే ఈ జగత్తును లయం చేస్తున్నాడు. సమస్త జగత్తూ ఆమె యొక్క మాయ అనే పాశంతో బంధించబడి ఉన్నది.' అని చెప్పబడింది. శంకరభగవత్పాదులవారు కూడా తమ సౌందర్య లహరిలోని 24వ శ్లోకంలో ఈ విషయమే వివరించారు. దానిని మేం గతంలో వివరించాం. శక్తిసూత్రాలలో

**తథాపి తద్వత్పంచవిధకృత్యాని కరోతి**

ఈ రకంగా ఆ పరమేశ్వరి పంచకృత్యాలను చేస్తున్నది. పంచకృత్యాలు అంటే సృష్టి స్థితి లయ తిరోధాన అనుగ్రహములు అని చెప్పబడింది.

ఈ రకంగా పంచకృత్యాలయందు ఆసక్తి కలది కాబట్టి ఆ దేవి పంచకృత్యపరాయణా అనబడుతోంది.

ఈ విధంగా 264 నుంచి 274వ నామం దాకా పరమేశ్వరి యొక్క పంచకృత్య పరాయణత్వాన్ని వివరించటం జరిగింది.



శ్రీ ఇకార దేవి

# 22. భానువిద్య

శ్రీవిద్యను అనేకమంది ఉపాసనచేసి తరించారు. వారిలో మనువు, చంద్రుడు మొదలైన 12 మంది శ్రేష్ఠులు అని గతంలో చెప్పుకున్నాం.

శ్రీవిద్య చంద్రకలా విద్య. చంద్రుని యొక్క వృద్ధి క్షయాలనుసరించి దీనిని ఉపాసన చేసే సంప్రదాయం ఒకటి ఉంది. అలాగే శుక్లపక్షరాత్రులందు చివరిభాగంలో మాత్రమే దేవిని ఉపాసన చెయ్యాలి. అని సుభగోదయస్తుతిలోను, సౌందర్య లహరిలోను కూడా చెప్పబడింది.

అయితే శ్రీవిద్య చంద్రవిద్యయే కాదు భానువిద్య కూడా. ఆధారస్వాధిష్ఠానాలు అంధకారబంధురాలు. వాటిలో సమయులకు ప్రవేశం లేదు. సమయులు మణిపూరం దగ్గర నుంచే పరమేశ్వరిని ధ్యానించాలి అని శాస్త్రం చెబుతున్నది. ఆధారస్వాధిష్ఠానాలు అగ్నిమండలం. మణిపూరఅనాహతాలు సూర్యమండలం. విశుద్ధి ఆజ్ఞలు చంద్రమండలం. ఇక్కడ పరమేశ్వరినిసూర్యమండలం నుంచే అర్చించాలి. చంద్రజ్ఞానవిద్యలో

**సూర్యమండలమధ్యస్తాం దేవీంత్రిపురసుందరీం**
**పాంశాంకుశ ధనుర్బాణహస్తాన్ ధారయంతీం ప్రపూజయేత్**

సూర్యమండలంలో పాశము అంకుశము ధనుర్బాణాలు ధరించిన పరమేశ్వరిని అర్చించాలి. గౌడపాదులవారు దేవిఅర్చనను వివరిస్తూ

**సూర్యమండలమధ్యస్థాం దేవీం త్రిపురసుందరీం**
**పాశాంకుశధనుర్బాణ హస్తాం ధారయంత్రీంప్రపూజయేత్**
**త్ర్యైలోక్యం మోహయేదాసునరనారీ గణైర్యుతామ్**

సూర్యమండలంలో దేవిని అర్చిస్తే సకల జనవశ్యం కలుగుతుంది.

కాళిదాసు తనచర్చాస్తవంలో

**యే చింతయం త్యరుణమండలమధ్యవర్తి**
**రూపం తవాంబ నవయావక పంకరమ్యమ్**
**తేషాం సదైవ కుసుమాయుధబాణ భిన్న**
**వక్షఃస్థలా మృగదృశో వశగా భవన్తి**

అన్నాడు. ఈ రకంగా పరమేశ్వరి భానుమండలంలో ఉంటుంది. అంచేత అది భానువిద్య కూడా.

పంచదశీ మహామంత్రాన్ని ఉపాసించిన వారిలో సూర్యుడు ఒకడు.

**అస్యశ్రీ సూర్యవిద్యాంబా మహామంత్రస్య। దక్షిణామూర్తి ఋషిః। పంక్తిచ్ఛందః సూర్యవిద్యాంబా దేవతా। హ స క ల హ్రీం బీజం। హ స క హ ల హ్రీం శక్తిః। స క హ ల హ్రీం కీలకం। జపే వినియోగః**

**న్యాసము : కూటత్రయముతో రెండు ఆవృత్తులు న్యాసము చెప్పాలి.**

**ధ్యానము : సకుంకుమవిలేపనా.................**

**మంత్రము : హ స క ల హ్రీం। హ స క హ ల హ్రీం। స క హ ల హ్రీం।**

పరమేశ్వరి భానుమండలంలో ఉంటుంది. అందుచేతనే ఆమెను సంధ్యాసమయంలో భానుమండలంలో ఉపాసించాలి. బ్రహ్మలోకానికి తలవాకిలి సూర్యమండలం. ఉత్తరాయణమార్గంలో ప్రయాణం చేసినవాడు అర్చిరాది మార్గం గుండా బ్రహ్మలోకంచేరి, కల్పాంతం వరకు అక్కడే ఉండి కల్పాంతాన కర్మబ్రహ్మతో కలిసి పరబ్రహ్మలో లీనమవుతాడు. అయితే బ్రహ్మలోకానికి తలవాకిలి సూర్యమండలం. అక్కడి దాకా వెళ్ళాడు జీవుడు. ఆ ద్వారాన్ని కొన్నివేలకోట్ల సూర్యులకాంతి కప్పిఉంచుతుంది. అందుకని జీవి పరమేశ్వరుణ్ణి ఈశావాశ్యోపనిషత్తులో చెప్పినట్లుగా

**హిరిణ్మయేన పాత్రేణ సత్య స్యాపిహితం ముఖమ్ ।**
**తత్త్వం పూష న్న పావ్రుణు సత్యధర్మాయ దృష్టయే ॥**

ఓ సూర్యుడా ! ప్రజాపతి పుత్రుడా ! స్వర్గవీధిలోని బహుదూరపు బాటసారీ ! సర్వపోషకా ! నీ కిరణాలను కాస్త తొలగించు. నీ కాంతిని ఉపసంహరించుకో. నీ అనుగ్రహంతో నీరూపాన్ని చూడటానికి వీలుగా నీ తేజస్సును ఉపసంహరించుకో.

సత్యము యొక్క ద్వారాన్ని మెరుస్తున్న నీ బంగారు బింబం మూతలాగా కప్పి ఉన్నది. సత్యదర్శనం చెయ్యటానికి వీలుగా ఆ మూతను తొలగించు అంటాడు. ఆ రకంగా పరమేశ్వరుడు భానుమండల మధ్యవర్తి. భానుమండలమంటే మణిపూర అనాహతాలు. హృదయస్థానమే అనాహతం. అక్కడ పరమేశ్వరుడు ఉంటాడు. ఈ విషయంవేదంలో చెప్పబడింది. ఇక ఆ దేవి భైరవి. అంటే భైరవునిశక్తి. ఆమె భగమాలిని.

జగత్సృష్టికర్త. సుఖస్వరూపిణి. ఆనందరూపిణి ఐశ్వర్యప్రదాత. ఆమె పద్మాసనమనే యోగాసనంలో ఉంటుంది. ఆ పరమేశ్వరి పద్మనాభుని సహోదరి. ఆమె కనులు తెరిస్తే సృష్టి జరుగుతుంది. కనులు మూస్తే ప్రళయం సంభవిస్తుంది. ఆ పరమేశ్వరి చరాచరజగత్తంతా నిండి ఉంటుంది. అనేక శిరస్సులు, కనులు, కాలుచేతులు ఉంటాయి. జగత్తులో బ్రహ్మ నుంచి స్తంభం దాకా సృష్టించినది ఆమె. వర్ణాశ్రమాలను నిర్ణయించింది ఆమె. ఆమె మాటలే వేదాలు. లోకంలోని జీవులకు వారివారి కర్మలననుసరించి వారితో పాపపుణ్యాలనుభవింపచేస్తుంది. కర్మ శేషం అనుభవించటానికి ఉత్తరజన్మలు ప్రసాదిస్తుంది. ఈ విషయమంతా 275 నుంచి 288 నామాల వరకు వివరించటం జరిగింది.

## 275. భానుమండల మధ్యస్థా

**భానుమండలస్య మధ్యే తిష్ఠతీతి**

భానుమండలము మధ్యన ఉన్నది. సంధ్యాసమయంలో పరమేశ్వరిని భానుమండలం మధ్యనధ్యానించాలి అంటోది మంత్రశాస్త్రం.

**య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యత**

ఆదిత్యుని మధ్యలో హిరణ్యయుడైన పరమాత్మ చూడబడతాడు. కూర్మపురాణంలో హిమవంతుడు పరమేశ్వరిని స్తుతిస్తూ

**అశేష వేదాత్మక మేక వేద్యం - స్వతేజసా పూరితలోకభేదం ।**
**త్రిలోకహేతుం పరమేష్ఠిసంజ్ఞం - నమామి రూపం రవి మండలస్థం ॥**

సమస్త వేదస్వరూపమైనటువంటిది, ముఖ్యంగా తెలియతగినది, తన తేజస్సుతో లోకాలను నిండించినది. ముల్లోకాలకు కారణభూతమైనది, పరమేష్ఠి అను సంజ్ఞ గలది అయిన ఆ దేవికి సూర్యమండలం మధ్యన మ్రొక్కెదను.

**భాతీతి భానుః** ప్రకాశించువాడు భానుడు. చంద్రజ్ఞానవిద్యలో

**సూర్యమండలమధ్యస్థాం దేవీం త్రిపురసుందరీం ।**
**పాశాంకుశ ధనుర్బాణహస్తాన్ ధారయంతీం ప్రపూజయేత్ ॥**

చేతులయందు పాశము అంకుశము ధనుర్బాణములు ధరించి సూర్యమండల మధ్యవర్తి అయిన ఆ పరమేశ్వరిని అర్చించాలి.

సూర్యమండలము చంద్రాగ్నుల మిశ్రమరూపము. అందుచేత అది పరబ్రహ్మ స్వరూపము. భానుమండలము అంటే అనాహతమండలము. అనాహతము హృదయ స్థానము షట్చక్రాలస్థానాలు చెబుతూ

**నాభి స్తుమణి పూరాఖ్యం హృదయం చాబ్జమనాహతమ్**

నాభిస్థానంలో మణిపూర చక్రమున్నది. హృదయస్థానంలో అనాహతపద్మమున్నది. వేదంలో

**పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చా ప్యధోముఖమ్**

కంఠానికి క్రింది భాగంలో, నాభికి పైభాగన 12 అంగుళాల ప్రమాణం కలిగి అధోముఖంగా ఒక పద్మమున్నది.

**అథో నిష్ట్యా వితస్యాంతే నాభ్యా ముపరి తిష్ఠతి**
**జ్వాలమాలాకులం భాతి విశ్వస్యాऽ యతనం మహత్**
**సంతతగ్ం శిలాభి స్తు లంబ త్యాకోశ సన్నిభమ్**
**తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్**
**తస్య మధ్యే మహా నగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతోముఖః**
**సోऽ గ్రభు గ్విభజం తిష్ఠ న్నాహార మజరః కవిః**
**తిర్య గూర్ధ్వ మధశ్శాయీ రశ్మయస్తస్య సన్తతా ॥**

ఆ హృదయకమలాన్ని ఆశ్రయించి జ్వాలామాలగా వెలుగొందుతూ, జీవులకు ప్రధానస్థానమై అనేక నాడీసమూహాలకు ఆలంబనమై, హృదయాగ్రభాగంలో సూక్ష్మమైన కమలం ఒకటి ఉన్నది. దానిలోనే సర్వమూ ప్రతిష్ఠితమై ఉన్నది. దాని మధ్యన అంతటాజ్వాలలు వ్యాపించు గొప్ప అగ్ని దేవుడున్నాడు. అదే జఠరాగ్ని.

**సంతాపయతి స్వందేహ మాపాదతలమస్తకః**
**తస్య మధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః**

భుజించినటువంటి ఆహారాన్ని ఆ జఠరాగ్ని సమభాగాలుగా విభజించి శరీరంలోని అన్ని ప్రాంతాలకు పంపుతుంది. ఇక్కడ ధ్యానం చేసే యోగులు మహాతేజో వంతులవుతున్నారు.

**నీలతోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా**
**నీవార శూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా**

ఈ జఠరాగ్ని నడుమ సూక్ష్మమైన అగ్నిశిఖ పైకి ఎగుస్తూ ఉంటుంది. అది నీలమేఘము మధ్యన మెరుపువలె ప్రకాశిస్తుంది. ధాన్యపుగింజ ములికివలె సూక్ష్మమై పచ్చనివన్నె కలిగిఉంటుంది.

**తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః**
**సబ్రహ్మ సశివ స్సహరిశ్చేంద్రః సోఽక్షరఃపరమస్స్వరాట్**

ఆ అగ్నిశిఖమధ్యన పరమాత్మ ఉంటాడు. అతడే బ్రహ్మ, అతడే శివుడు, అతడే విష్ణువు, అతడే ఇంద్రుడు, నాశనము లేనివాడు. స్వయంప్రకాశము కలవాడు. కాబట్టి భానుమండలము అంటే అనాహతము. అదే హృదయస్థానము అక్కడ ఆ పరమేశ్వరి ఉంటుంది. కాబట్టే భానుమండల మధ్యస్థా అనబడింది.

## 276. భైరవీ

భైరవుడు అంటే – శివుడు. అతని భార్య భైరవి.

**జగతః పితరౌవందే భైరవీ భైరవాత్మకౌ ॥**

భైరవి అనగా స్త్రీల గుంపు. చెలుల సమూహంతో ఉంటుంది. కాబట్టి పరమేశ్వరి భైరవి.

బైరవి అంటే – దుర్గాదేవి, 8 పురుషరాగాలలో ఒకటి అంటోంది. సూర్యరాయాంధ్ర నిఘంటువు. పురుష రాగాలు :

| | | | |
|---|---|---|---|
| 1. భైరవి | 3. బంగాళ | 5. రాగమంజరి | 7. గౌళ |
| 2. మాళవి | 4. హిందోళ | 6. శ్రీరాగ | 8. భూపాళ |

వీటిలో మొదటిరాగం భైరవి.

**ద్వాదశవర్షకన్యారూపా భైరవీ** పన్నెండు సంవత్సరాలు గల బాలిక భైరవి అని ధౌమ్యుడు చెప్పాడు.

భైరవే భవాని. అనాహతపద్మంలో 12 దళాలపద్మంలో ఆ దేవి ధ్యానించబడుతుంది.

భైరవుని యొక్క శక్తి భైరవి. భైరవుడు అంటే పరమేశ్వరుడు అని గతంలో వివరించటం జరిగింది. భైరవులు ఎనిమిదిమంది.

| | | | |
|---|---|---|---|
| 1. అసితాంగభైరవ | 3. చండభైరవ | 5. ఉన్మత్తభైరవ | 7. భీషణభైరవ |
| 2. రురుభైరవ | 4. క్రోధభైరవ | 6. కపాలభైరవ | 8. సంహారభైరవ |

భైరవునిశక్తి కాబట్టి ఆ పరమేశ్వరి భైరవీ అనబడుతోంది.

# 277. భగమాలినీ

భగము అంటే – అదృష్టము, సుఖస్థితి, ఘనత, కీర్తి, అందము, మాహాత్మ్యము, కామము, యోని, సుగుణము, ధర్మము, కాంతి అని అర్థం చెబుతోంది సూర్యరాయంధ్ర నిఘంటువు.

సుఖస్థితి సంపూర్ణంగా కలిగినటువంటిది. బ్రహ్మానందము అనుభవించేది. గొప్పదైన మాహాత్మ్యము గలిగినటువంటిది. సర్వలోకాలకు జన్మస్థానమైనది. సర్వధర్మాలను మాలికగా గలిగినటువంటిది. జ్ఞానము అనే కాంతులచే ప్రకాశించేది.

భగము అంటే షడ్గుణైశ్వర్యము.

**ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః**
**జ్ఞానవైరాగ్యయో శ్చైవ షణ్ణాంవర్గోభగఃస్మృతః**

| | | |
|---|---|---|
| 1. పరిపూర్ణత | 3. కీర్తి | 5. జ్ఞానము |
| 2. వీర్యము | 4. సంపద | 6. వైరాగ్యము |

వీటిని షడ్గుణైశ్వర్యాలంటారు. వీటిని మాలగా గలది ఆ పరమేశ్వరి.

అనాహత పద్మం సూర్యమండలం. ఇక్కడ పన్నెండుదళాలు గల పద్మమున్నది. ఈ పన్నెండు దళాలలోనూ ద్వాదశాదిత్యులు ఉంటారు. వారు

| | | |
|---|---|---|
| 1. ఇంద్రుడు | 5. పూష | 9. విష్ణువు |
| 2. ధాత | 6. ఆర్యముడు | 10. అంశుమంతుడు |
| 3. పర్జన్యుడు | 7. భగుడు | 11. వరుణుడు |
| 4. త్వష్ట | 8. వినస్వంతుడు | 12. మిత్రుడు |

దేవి తామరదుద్దులో ఉండగా 12 దళాలలోనూ వీరు ఆమెను చుట్టి ఉంటారు. సూర్యకళలు 12. కాబట్టి సూర్యకళలను మాలగా ధరించినది. సూర్యకళలు.

| | | |
|---|---|---|
| 1. తపిని | 5. జ్వాలిని | 9. విశ్వా |
| 2. తాపిని | 6. రుచికల | 10. బోధిని |
| 3. ధూమ్ర | 7. సుషుమ్న | 11. ధారిణి |
| 4. మరీచి | 8. భోగద | 12. క్షమా |

## 278. పద్మాసనా

**బ్రహ్మరూపత్వాత్పద్మాసనా** బ్రహ్మరూపిణి కావటం చేత పద్మాసనా అనబడుతోంది. ఇక్కడ పద్మంలో ప్రకృతే దళాలు, వికారాలే కేసరాలు, జ్ఞానమయమైన నాళాలు ఉన్నాయి. ఇటువంటి పద్మాన్ని ఆసనంగా చేసుకున్నది ఆ పరమేశ్వరి.

లక్ష్మి ని అంటే ఐశ్వర్యాన్ని తన భక్తులకు విభజించి ఇచ్చేది. ఆ పరమేశ్వరి గనక అనుగ్రహిస్తే భక్తుల ఇల్లు బంగారమవుతుంది. సుఖశాంతులు, ఆయురారోగ్యాలు కలుగుతాయి. ఆమె కోపిస్తే అవన్నీ నశిస్తాయి.

శూరపద్మాసురుడనే రాక్షసుని సంహరించినది.

పద్మాసన అంటే పద్మాసనము అనే యోగాసంలో కూర్చున్నది. ధ్యానంలో ఉన్నటువంటిది.

పద్మము అనేది నిధి అష్టనిధులలో ఒకటి. ఆ నిధికి అధిపతి. బ్రహ్మరూపము గలది.

**ధ్యాయే పద్మాసనస్థాం విపులకటితటీం పద్మపత్రాయ తాక్షీం**

ఈ శ్లోకము ప్రకారము ఆ దేవి పద్మాసనమున ఉన్నది. మూలాధారం నుంచి సహస్రదళపద్మం దాకా అన్ని పద్మాలనూ ఆసనంగా కలిగినది.

శ్రీచక్రంలో బిందు మండలమునందుండేది. అందుచేత ఆ పరమేశ్వరి పద్మాసనా అనబడుతోంది.

## 279. భగవతీ

భగవతీ – ఐశ్వర్యము, మాహాత్మ్యము, జ్ఞానము, వైరాగ్యము, యోని, యశస్సు, వీర్యము, ప్రయత్నము, ఇచ్ఛ, ధర్మము, శ్రీ ఇవి ముక్తులు. ఈ గుణాలన్నీ ఈమె యందున్నాయి కాబట్టి పరమేశ్వరి భగవతి అనబడుతున్నది. దేవీభాగవతంలో

**ఉత్పత్తించ వినాశంచ భూతానా మాగతిం గతిం**
**వేత్తి విద్యా మవిద్యాం చ సవాచ్యో భగవా నితి**

సృష్టి, ప్రళయము, విద్య, అవిద్య, ప్రాణుల గమనాగమనముల గురించి తెలిసినది ఆ పరమేశ్వరి అని చెప్పబడింది. సకల దేవతలు పరమేశ్వరిని సేవిస్తారు. ఆ దేవి వారిని అనుగ్రహిస్తుంది. అందుచేతనే భగవతి అనబడింది.

భగవంతుడికి కొన్ని లక్షణాలున్నాయి. అవి

1. సర్వజ్ఞత
2. నిత్యతృప్తి
3. అనాదిబోధ
4. స్వతంత్రతాశక్తి
5. నిత్యాలుప్తశక్తి
6. అనంతతాశక్తి

ఈ శక్తులన్నీ కలది కాబట్టి భగవతి అనబడుతోంది.

## 280. పద్మనాభసహోదరీ

పద్మమును నాభి యందు కలవాడు – విష్ణువు. అతని సహోదరి.

పూర్వకాలంలో రాక్షస సంహారం కోసం దేవతలు పరమేశ్వరి ప్రీతికై ఒక యజ్ఞం చేశారు. ఆ సమయంలో హోమకుండంలో ఒక గోళాకారమేర్పడింది. అందులో ఒక భాగం నుంచి పద్మనాభుడు, రెండవ భాగం నుంచి పరమేశ్వరి వచ్చారు. అందుచేత ఆమె పద్మనాభసహోదరీ అనబడుతోంది. ఈ రకంగా బ్రహ్మము ధర్మము, ధర్మి అని రెండురూపాలయింది. ధర్మము పద్మనాభుడు కాగా దర్మి పరమేశ్వరి.

**నారాయణస్య భగినీ నారాయణీ**

నారాయణుడి యొక్క సోదరి కాబట్టి నారాయణీ అన్నారు.

శ్రీకృష్ణపరమాత్ముడితో పాటుగా దేవకి గర్భాన జన్మించింది. ఆమె పద్మనాభ సహోదరి.

**కాంచీక్షేత్రే పురా ధాతా సర్వలోక పితామహః**
**శ్రీదేవీ దర్శనార్థాయ తప స్తేపే సుదారుణం**
**ఆత్మైక్యధ్యానయుక్తస్య తస్య ప్రతపతో మునేః**
**ప్రాదుర్బభూవ త్రిపురా పద్మహస్తా సహోదరా**
**పద్మాసనే చ తిష్ఠంతీ విష్ణునా జిష్ణునా సహ**

పూర్వకాలంలో కాంచీక్షేత్రంలో సర్వలోక పితామహుడైన బ్రహ్మ శ్రీదేవి దర్శనం కోసం భయంకరమైన తపస్సు చేశాడు. అప్పుడు దేవి తన సోదరుడైన విష్ణువుతో కలిసి ప్రత్యక్షమైంది. అందుచేతనే ఆ పరమేశ్వరి పద్మనాభసహోదరీ అనబడుతోంది.

## 281. ఉన్మేషనిమిషోత్పన్నవిపన్నభువనావళిః

ఉన్మేషము అంటే – కనులు తెరవటము

నిమిషము అంటే – కనులు మూయటం

అదేక్రమంలో సృష్టి జరుగుతుంది. అనగా పరమేశ్వరి కనులు తెరిస్తే సృష్టి జరుగుతుంది. కనులు మూస్తే ప్రళయం సంభవిస్తుంది. ఈ విషయాన్ని శంకర భగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 55వ శ్లోకంలో

**నిమేషోన్మేషాభ్యాం ప్రళయ ముదయం యాతి జగతీ**
**తవే త్యాహు స్సన్తో ధరణిధరరాజన్య తనయే !**
**త్వదున్మేషాజ్జాతం జగ దిద మశేషం ప్రళయతః**
**పరిత్రాతుం శంకే పరిహృతనిమేషా స్తవ దృశః**

ఓ తల్లీ ! నీవు కనులు మూయుట తెరయుట వలన జగత్తులో సృష్టి, ప్రళయము సంభవిస్తున్నాయి. నీవు కనులు తెరచుట వలన పుట్టిన జగత్తుకు ప్రళయం రాకుండా ఉండేటట్లు నీకనురెప్పలను మూయకుండా ఉండవలసినది.

**యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి**

పరమేశ్వరి కను తెరచుటవల్లనే ఈ బ్రహ్మాండాలన్నింటిలోను సృష్టి జరుగుతున్నది. అంటే ఆమె రెప్పపాటు ఒక బ్రహ్మకల్పము. సంకల్ప మాత్రముచేతనే సృష్టి, లయాలు చేయగల మహాశక్తి ఆ పరమేశ్వరి.

## 282. సహస్రశీర్షవదనా

వేయితలలు, ముఖాలు కలిగినటువంటిది.

**సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్**

వేయితలలు కనులు చేతులు కాళ్ళు, కలిగిఉన్నది. ఇక్కడ వేయి అనేది అనేకానేకమైన, లెక్కలేనన్ని అనే అర్థంలో వాడటం జరిగింది. అంతేకాని వేయిసంఖ్యావాచకం కాదు. వేలకొలది శిరస్సులు కలిగినటువంటిది. చరాచరజగత్తులో ఎన్ని జీవరాశులైతే ఉన్నాయో అన్ని శిరస్సులు కలిగినటువంటిది. ఈ జగత్తంతా తానే అయినది. పరమేశ్వరుడు ప్రతిజీవి యందు ఉన్నాడు. అని చెప్పటం కోసం వాడిన పదమిది. సహస్రశీర్షవదనా అంటే ఆ పరమేశ్వరి విరాడ్రూపిణి అని అర్థం.

## 283. సహస్రాక్షీ

వేయికనులు గలది. ఇందాక చెప్పినటువంటి అర్థమే ఇక్కడ చెప్పబడుతోంది. దేవి విరాట్స్వరూపిణి అవటంచేత ప్రపంచలోని కనులన్నీ ఆమెవే. ఆమె సకలజీవరాశికి కనులు. అందుచేతనే ఆమె సహస్రాక్షి అనబడుతున్నది.

## 284. సహస్రపాత్

అనేకమైన పాదములు గలది. 282 నామంలో చెప్పిన విషయాన్నే ఆ తరువాత నామాలు నిర్ధారణ చేస్తున్నాయి. విరాడ్స్వరూపానికి అనేకవేల శిరస్సులు, కనులు, కాళ్ళుచేతులు ఉన్నాయి. దేవీభాగవతంలో 'ఆ పరమేశ్వరి వేయి శిరస్సులు, వేయికనులు, వేయిచేతులు, వేయి కాళ్ళు కలిగి ప్రకాశించుచున్నది' అని చెప్పబడింది.

**సహస్రనయనా రామా సహస్రకరసంయుతా**

**సహస్రశీర్షచరణా భాతి దూరా దసంశయమ్**

ఈ నామాలవల్ల భైరవీదేవి విరాడ్రూపిణి అంటున్నారు.

## 285. ఆబ్రహ్మకీటజననీ

బ్రహ్మము మొదలు స్తంభము వరకు, పిపీలికాది బ్రహ్మపర్యంతము సకలజీవరాశిని సృష్టించేటటువంటిది ఆ పరమేశ్వరి. ఇక్కడ కీటకము అంటే సాలీడు. అతిచిన్న జీవి అయిన సాలీడు దగ్గర నుంచి కర్మ బ్రహ్మవరకు అందరినీ సృష్టించింది ఆ పరమేశ్వరి.

బ్రహ్మ మొదలు అంటే బ్రహ్మాండము మొదలుకొని లేదా హిరణ్యగర్భుడు మొదలుకొని సూక్ష్మాతిసూక్ష్మమైన జీవరాశినంతటినీ సృష్టించునది. సర్వప్రపంచానికి కారణభూతురాలు.

ఈ జగత్తులో అనేక రకాల జీవరాశి ఉన్నది. నడిచేవి, ప్రాకేవి, ఎగిరేవి, పరుగెత్తేవి, గ్రుడ్లు పెట్టేవి, పిల్లలను కని పాలిచ్చి పెంచేవి, జలచరాలు, భూచరాలు, ఉభయచరాలు, విషజీవులు ఈ రకంగా 84 లక్షల జీవరాసి ఉన్నది. వీటిలో ఒక దానికన్న ఒకటి ఉత్తమమైనది. ఆ జీవులయొక్క కర్మఫలాన్ననుసరించి వాటికి ఉత్తరజన్మలు వస్తాయి.

ఈ జీవులు రాగద్వేషాలవల్లనే కర్మలు చేస్తాయి. ఈ సృష్టిలో పుట్టిన ప్రతిజీవి తన కర్మఫలాన్ని అనుభవించాల్సిందే సంచితకర్మ అనేది అనుభవించటంచేత కాని, భగవంతుని స్మరించటం చేతగాని తీరుతుంది. అనుభవంచేతనే అది క్షయం కావాలి అంటే కల్పాంతందాకా అనుభవిస్తూనే ఉండాలి. అప్పుడైనా కర్మక్షయం అవుతుందనే నమ్మకం లేదు. ఒకవేళ కర్మక్షయం కాకపోతే మళ్ళీ కల్పంలో మళ్ళీ జన్మించి ఈ కర్మను అనుభవించాలి. ఇలా కాదు అంటే భగవంతుని ఆరాధన ఒక్కటే శరణ్యం అమ్ములపొదిలో ఉన్న బాణాలులాగా ఉంటుంది సంచితకర్మ. భగవన్నామస్మరణచేత ఆ కర్మను క్షయం చెయ్యవచ్చు. వర్తమానంలో ఉండే కర్మను మాత్రం అనుభవించి తీరాల్సిందే.

ఈ రకంగా జీవి చేసిన కర్మను అనుభవించటానికే ఈ జన్మలు. అయితే జన్మలన్నింటిలోనూ నరజన్మ దుర్లభమైనది. ఇంద్రియాలు అన్ని జీవులకు ఉంటాయి. ఆహారనిద్రా మైథునాలు అన్ని జీవులకు సమానమే. క్రిమికీటకాలకు కూడా ఇవి ఉంటాయి. మానవుడికి ప్రత్యేకంగా ఉండేది మనస్సు. ధర్మాధర్మ విచక్షణ. యుక్తాయుక్త విచక్షణాజ్ఞానం. కాబట్టి మానవుడు ఏది మంచి ఏది చెడు అనేది తెలుసుకుని ప్రవర్తించాలి. ఈ విధంగా జగత్తులోని జీవులన్నింటి జన్మకూ కారణమైనది కాబట్టే ఆబ్రహ్మకీటజననీ అనబడుతున్నది ఆ పరమేశ్వరి.

## 286. వర్ణాశ్రమవిధాయినీ

ఈ రకంగా ఆవిర్భవించిన జీవకోటికి సన్మార్గాన్ని ప్రసాదించటంకోసం వేదాలనందించింది. వేదాలలో ముఖ్యంగా రెండు విషయాలున్నాయి. 1. కర్మకాండ. 2. బ్రహ్మకాండ వీటినే అపరావిద్య, పరావిద్య అంటారు.

ముండకోపనిషత్తులో అంగిరసుడు అనే మహర్షి శౌనకుడికి తత్త్వాన్ని బోధిస్తూ :

లోకంలో మనం తెలుసుకోవలసిన విద్యలు రెండున్నాయి. 1. పరావిద్య 2. అపరావిద్య

చతుర్వేదాలు, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, ఇవన్నీ అపరావిద్య. ఆత్మతత్త్వాన్ని బోధించేది పరావిద్య.

జ్ఞానేంద్రియాలకు లొంగనిది, కర్మేంద్రియాల విషయం కానిది, గోత్రము, వర్ణము, నేత్రములు, శ్రోత్రములు, కాలుచేతులు లేనిది, నిత్యమై అన్నింటియందు ఉన్నది, సూక్ష్మాతిసూక్ష్మమైనది, అవ్యయమైనది, పంచభూతాలకు కారణమైనది, – అదే బ్రహ్మతత్త్వము. అటువంటి తత్త్వాన్ని జ్ఞానియైనవాడు సర్వత్రా చూడగలడు. అపరావిద్య లౌకిక ప్రయోజనాలకు ఉపయోగిస్తుంది. యజ్ఞకర్మలు. స్వర్గసాధనాలు కర్మాచరణ పరాయణులు వాటిని నిర్వర్తిస్తున్నారు. సత్ఫలితాలు పొందుతున్నారు" అని చెబుతాడు.

అయితే పశుపక్ష్యాదులకు కర్మానుష్ఠానము లేదు. ఎందుచేతనంటే అవి కర్మను చెయ్యలేవు. అలాగే దేవగణాలకు కూడా కర్మాధికారం లేదు. వారు అశరీరులు. కాబట్టి కర్మలు చెయ్యాలి అంటే మానవ రూపం పొందాల్సిందే ఈ మానవులను నాలుగు వర్ణాలుగా విభజించింది ఆ పరమేశ్వరియే. గీతలో

**చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః**

మానవులు చేసే పనిని బట్టి వారిని నాలుగు వర్ణాలుగా విభజించాను. అంటాడు

మొట్టమొదటగా ఈ వర్ణాల ప్రసక్తి పురుష సూక్తంలో చెప్పబడింది.

**బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్ । బాహూ రాజన్యః కృతః**

**ఊరూతదస్య యద్వైశ్యః । పద్భ్యాగ్ం శూద్రో అజాయత**

ఇక్కడ పదాలకు మాటలకు కనిపించే అర్ధం కాదు చెప్పవలసినది.

సత్యాన్వేషణ కోసం తిరిగేవాడు బ్రాహ్మణుడు.

బ్రాహ్మణుడిని, వేదాలను రక్షించేవాడు క్షత్రియుడు.

ధనాన్ని కూడబెట్టేవాడు వైశ్యుడు.

సేవకావృత్తి, సేద్యం వ్యవసాయం చేసి వీరందరినీ పోషించేవాడు శూద్రుడు.

వీటి వివరణ బృహదారణ్యకోపనిషత్తులో ఉన్నది. దాన్ని గతంలో వివరించటం జరిగింది. ఈ రకంగా చతుర్వర్ణాలు, ఆశ్రమాలు విభజించి జీవులు వారి వారి ధర్మాలను నిర్వర్తించేటట్లు చూసేది. అందుచేతనే వర్ణాశ్రమ విధాయనీ అనబడుతోంది.

## 287. నిజాజ్ఞారూపనిగమా

తన ఆజ్ఞను వేదవిదులచే శాబ్దీభావనగా వ్యవహరించబడునది. అందుచేతనే 'వేదములలోని పదములన్నీ జరిగిన క్రియార్ధముల సమామ్నాయము' అంటాడు జైమిని. కూర్మ పురాణంలో

**మ మైవాజ్ఞా పరాశక్తి ర్వేదసంజ్ఞా పురాతనీ**

**ఋగ్ యజు స్సామరూపేణ సర్గాదౌ సంప్రవర్తత**

నా ఆజ్ఞలే పురాతనమైన పరాశక్తి రూపమైన వేదాలు. ఋగ్యజుస్సామాలుగా సృష్ట్యాదిలో ప్రత్యక్షమైనాయి. అని చెప్పబడింది.

వేదానుసారమైన తంత్రాలు కొన్ని, వేదవిరుద్ధాలు కొన్ని ఉన్నాయి. వాటిలో వైదికతంత్రాలను నిగమము లంటారు. అవి పరమేశ్వరుని ముఖం నుంచి వచ్చాయి. కాపాలికాది తంత్రములు శివుని అధో భాగమునుండి వచ్చినవి. వేదవిరుద్ధములు. శివునియొక్క

| | | |
|---|---|---|
| సద్యోజాత ముఖము నుండి | - | కామికాది తంత్రాలు |
| వామదేవ ముఖం నుండి | - | దీప్తాదులు |
| అఘోర ముఖం నుండి | - | విజయాదులు ఐదు |
| తత్పురుష ముఖం నుండి | - | వైరోచనాదులు ఐదు |
| ఈశాన ముఖం నుండి | - | ప్రోద్గీథాదులు ఎనిమిది |

పుట్టినాయి. అంటే పరమేశ్వరి యొక్క ఆజ్ఞారూపాలే వేదాలు కామికాది తంత్రాలు.

**శ్రుతిస్మృతి యమైవాజ్ఞే** వేదాలు, వేదాంగాలు, స్మృతులు, పరమేశ్వరి యొక్క విధి వాక్యాలే. వేదాలలో కర్మాచరణ అంతా నిష్ఠలు నియమాలతో ఉంటుంది. ఇదంతా పరమేశ్వరిచేతనే విధింపబడింది. ఆమె ఆజ్ఞానుసారము వేదమార్గానుయాయులంతా ఆ నిబంధనలను అనుసరిస్తారు కాబట్టి ఆ పరమేశ్వరి నిజాజ్ఞారూపనిగమా అనబడుతోంది.

## 288. పుణ్యాపుణ్య ఫలప్రదా

వేదాలలో చెప్పినట్లుగా కర్మలను ఆచరించాలి. వేదవిహితమైన కర్మలనాచరిస్తే సత్ఫలితము వస్తుంది. విరుద్ధ కర్మలు ఆచరిస్తే దుష్ఫలితము వస్తుంది. కూర్మపురాణంలో 'వేదవిరుద్ధమైన కర్మలనాచరించు వారికి నరకము ప్రాప్తిస్తుంది. నా ఆజ్ఞచే యముడు వారిని రౌరవాది నరకాలలో తోస్తాడు. నాయందు భక్తిగలవారు సత్కర్మలను చేసి స్వర్గం చేరతారు. అని చెప్పబడింది.

శివసూత్రాలలో "మంచి కర్మలు చేసినవారు ఊర్ధ్వలోకాలు, చెడ్డ కర్మలు చేసినవారు అధోలోకాలు పొందుతారు' అని చెప్పారు.

పరమాత్మకు పక్షపాతము లేదు. అతడు దయారహితుడు. ధర్మాధర్మాలు లేనివాడు. మానవుడు చేసిన కర్మలనుబట్టి అతడికి ఫలితాన్ని ఇస్తాడు.

చరాచర జగత్తులోని ఏ జీవికి ఏ రకమైన కష్టం కలిగించకుండా సుఖసంతోషాలు కలిగించేవి సత్కర్మలు. దానికి భిన్నమైనవి పాపకర్మలు. ఈ కర్మల ఫలమే పాపపుణ్యాలు. ఈ కర్మలు మళ్ళీ బాహ్యము, అంతరము అని రెండు రకాలు. బాహ్యమైనవి బయటకు కనిపిస్తాయి. వీటిని న్యాయస్థానంలో విచారిస్తారు. అంతరమైనవి కనపడవు. వీటిని ఈ లోకంలో విచారించటానికి లేదు. పై లోకంలో పరమేశ్వరి విచారిస్తుంది. బాహ్యకర్మలకు సాక్ష్యం లేకపోతే శిక్షనుంచి తప్పించుకోవచ్చు. కాని అంతరమైన వాటికి సాక్ష్యముండదు.

వీటికి పరమేశ్వరే సాక్షి వాటినుంచి తప్పించుకోవటం జరగదు. ఈ కర్మలకు ఆత్మే సాక్షి. ఆత్మే పరమేశ్వరి అందుచేత జీవులకు వారివారి కర్మల ననుసరించి ఫలితాన్ని ఇచ్చేది ఆ పరమేశ్వరి. అందుకే ఆమె పుణ్యాపుణ్య ఫలప్రదా అనబడుతోంది.

కర్మలు చేసినవారు ఉత్తమగతులు పొందుతారు. ఆ కర్మిష్ఠి మరణానంతరము తాను చేసిన కర్మలననుసరించి పాపపుణ్యాలనుభవిస్తాడు. ఇక్కడ చిన్న సందేహం వస్తుంది. ఆ ఫలితాన్ని మానవుడు ఎంతకాలం అనుభవిస్తాడు? మహాభారతంలో

ఇంద్రద్యుమ్నుడు అనే ఒక మహారాజు ఉండేవాడు. అతడు వేదవేదాంగవిదుడు. కర్మిష్ఠి అనేక యజ్ఞాలు యాగాలు చేసి వేలకొలది గోవులను దానం చేశాడు. గోదానం చేసేటప్పుడు దానితోక పట్టుకుని నీరు వదుల్తారు. అలా విడిచిపెట్టిన నీరు పెద్ద సరోవరంగా మారిపోయింది. అవసానకాలం సమీపించింది. ఇంద్రద్యుమ్నుడిని దేవదూతలు తీసుకుపోయారు. అతడు చేసిన కర్మలననుసరించి స్వర్గసుఖాలు అనుభవిస్తున్నాడు మహారాజు. చాలాకాలం గడిచింది. ఒక రోజున భటులు వచ్చి 'నువ్వు చేసిన కర్మ పూర్తయిపోయింది. ఇంక వెళ్ళిపో' అంటూ ఇంద్రద్యుమ్న మహారాజును స్వర్గం నుంచి బయటకు పంపేశారు. "లేదు నేను చేసిన పుణ్యఫలం ఇంకా ఉన్నది. నేను చేసిన కర్మవలన భూలోకంలో జీవులు ఇంకా సుఖమనుభవిస్తున్నాయి. కాబట్టి నేను ఇంకా స్వర్గసుఖాలనుభవించవచ్చు" అంటాడు రాజు.

ఈ విషయం నిర్ధారణ చేసుకోటానికిగాను దేవదూతలనిచ్చి రాజును భూలోకానికి పంపాడు ఇంద్రుడు. భూలోకంలో తాను ఏలిన రాజ్యం చేరాడు రాజు. రాజ్యం అంతా కొత్తగా ఉన్నది. తనకు తెలిసిన వారెవరూ లేరు. కట్టడాలు కూడా క్రొత్తగా ఉన్నాయి. కనిపించిన వారిదగ్గరకు వెళ్ళి నేను మీకు తెలుసా అని అడిగాడు రాజు. తెలియదు అన్నారు వారు. ఈ రకంగా తిరుగుతూ తాను గోదానాలు ఇచ్చిన చోటికి చేరాడు దేవదూతలతో. అక్కడ మార్కండేయుడు కనిపించాడు. రాజు అతన్ని అడిగాడు నన్నెరుగుదువా? అని. నాకు తెలియదు నాకన్న పెద్దవాడు ప్రావాకర్ణుడు అనే గుడ్లగూబ ఒకటుంది. దాన్ని అడుగు అన్నాడు మార్కండేయుడు.

ప్రావాకర్ణుడి దగ్గరకుపోయి నన్నెరుగుదువా? అన్నాడు రాజు. నేనెరుగను. నాకన్న పెద్దవాడు నాళీకజంఘుడు అనే కొంగ ఉన్నది. దానిని అడుగు అన్నది గుడ్లగూబ. రాజు నాళీకజంఘుని దగ్గరకు వచ్చి నన్నెరుగుదువా? అన్నాడు. నేనెరగను. నాకన్న

పెద్దది ఆకూపారుడు అనే తాబేలు ఉన్నది. దాన్ని అడుగు అన్నది కొంగ. రాజుదేవ దూతలతో కలసి ఆకూపారుడి దగ్గరకు వెళ్ళి నన్నెరుగుదువా? అన్నాడు. వెంటనే ఆ తాబేలు 'రాజా నేను నిన్ను ఎరుగుదును. నువ్వు ఇంద్రద్యుమ్నుడనే మహారాజువు. అనేక యజ్ఞాలు యాగాలు చేశావు. నువ్వు గోదానం ఇచ్చేటప్పుడు వదలిన నీరే ఈ సరస్సుగా మారింది. దీనినాశ్రయించి అనేక జీవులు బ్రతుకుతున్నాయి. ఇప్పుడు ఈ నగరానికి జీవనాధారం ఈ సరస్సే' అంటుంది. ఆ మాటలు విన్న ఇంద్రద్యుమ్నుడు దేవదూతలతో చూశారా? నేను చేసిన కర్మఫలము ఇంకా పోలేదు. నావల్ల ఎంతోమంది సుఖంగా ఉన్నారు. కాబట్టి నా పుణ్యం పూర్తి కాలేదు. అంటూ మళ్ళీ స్వర్గం చేరాడు.

ఈ రకంగా మానవుడు చేసిన పాపపుణ్యాలను ఈ లోకంలో ఎంత కాలం తలచుకుంటారో, అంతకాలము ఆ జీవి స్వర్గనరకాలు అనుభవిస్తుంది. ఈ విధంగా జీవులకు పాపపుణ్యాల ఫలితాన్ని పంచిపెట్టేది ఆ పరమేశ్వరి. అందుచేతనే పుణ్యాపుణ్య ఫలప్రదా అనబడుతోంది.

శ్రీ 'ఏ'కార దేవి

# 23. షోడశి మహామంత్రము

శ్రీవిద్యకు పంచదశి మహామంత్రం గాయత్రివంటిది. కాగా శ్రీవిద్యామంత్రము షోడశి. దీన్నే మహాషోడశి అంటారు ఇది బ్రహ్మవిద్య.

షోడశి అంటే పదహారు అక్షరాలమంత్రం. పంచదశి మహామంత్రానికి శ్రీం బీజం చేర్చినట్లైతే పదహారు అక్షరాలవుతుంది. అదే షోడశి అన్నారు. అయితే కొంతమంది శ్రీం కాదు ఈం అనే బీజం చేర్చాలి అన్నారు. ఏ రకంగా అయినా అది పదహారు అక్షరాల మంత్రమే. కాని అది బ్రహ్మవిద్య మాత్రం కాదు.

**వైదికా ప్రణవై ర్యుతా ప్రణవేన విహీనం తు తాంత్రికా ఏవ ప్రకీర్తితా ॥**

వైదికమంత్రాలు లేదా మోక్షానిచ్చే మంత్రాలకు ప్రణవము తప్పనిసరిగా ఉండాలి అన్నారు. మరి పంచదశి మహామంత్రంలో ప్రణవం లేదు. షోడశిలోనూ ప్రణవం లేదు. కాబట్టి అది బ్రహ్మవిద్య ఎలా అవుతుంది. అన్నదే సందేహము.

ఓంకారాన్ని ప్రణవము అంటారు. ఇది పరమేశ్వర స్వరూపము. అలాగే శక్తి ప్రణవాలు కొన్ని ఉన్నాయి. శ్రీం హ్రీం క్లీ ఐం సౌః ఈ ఐదింటినీ శక్తిప్రణవాలు అంటారు.

పంచదశి మహామంత్రానికి ముందు ఎనిమిది తరువాత ఐదు బీజాక్షరాలు చేర్చినట్లైతే అది మహాషోడశి అవుతుంది. అప్పుడు ఈ శక్తి ప్రణవాలు పంచదశికి ముందు అనులోమంగాను తరువాత విలోమంగాను ఉండాలి. అప్పుడు

**శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం క ఏ ఈ ల హ్రీం ।**
**హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । సౌః ఐం క్లీం హ్రీం శ్రీం ॥**

ఇది మహాషోడశి. దీనిలో ఇరవై ఎనిమిది అక్షరాలుంటాయి. అయితే పంచదశి మంత్రానికి ముందు ఎనిమిది, తరువాత ఐదు మొత్తం పదమూడు. పంచదశి మంత్రంలో మూడు కూటములు మూడు బీజములుగా లెక్కిస్తే మొత్తం పదహారు అక్షరాలవుతాయి.

మోక్షాన్నిచ్చే మహామంత్రాలలో ప్రణవం ఒకటే ఉంటుంది. కాని షోడశిలో ఐదు ప్రణవాలు అనులోమ విలోమంగా ఉంటాయి. ఏ మంత్రానికైనా అనులోమ విలోమంగా ఉంటే శక్తి ఎక్కువ. ఒక ప్రణవం ఉంటేనే బ్రహ్మవిద్య అంటున్నప్పుడు ఐదు ప్రణవాలు అనులోమ విలోమంగా ఉంటే దాన్నింకేమని చెప్పాలి? అందుకే మహాషోడశి బ్రహ్మవిద్య, మోక్ష ప్రదాయిని.

289 నుంచి 304 నామం వరకు ఈ మంత్రాన్ని వివరించారు. 289 నామంలో వేదాలుకూడా పరమేశ్వరి తత్త్వాన్ని చెప్పలేవు అంటూ 290వ నామంలో షోడశి మంత్రాన్ని వివరించారు. ఆ తరువాత ఆ మంత్రాధిదేవత అంబిక, అనాదినిధనా, హరిబ్రహ్మేంద్ర సేవితా. అంటూ ఆమె ఆధిక్యతను చెప్పి ఆ మంత్రజపం చేస్తే పురుషార్థాలు తీరతాయని, భోగాలు కలుగుతాయని వివరించి మళ్ళీ ఆ దేవి నారాయణి, ఓంకారరూపిణి, ఆమె పరబ్రహ్మ స్వరూపము అని వివరించారు.

## 289. శ్రుతిసీమంత సిందూరీకృపాదాబ్జధూళికా

శ్రుతులు అంటే చతుర్వేదాలు. సీమంత సింధూరము అంటే శరీరంలో ఉన్నత స్థానమైన శిరస్సు. పాదాబ్జధూళి అంటే మహావాక్యాలు. వేదాలు, ఉపనిషత్తులు, పరమేశ్వరి స్వరూపాన్ని వర్ణించటానికి చాలావరకు ప్రయత్నం చేశాయి కాని అవికూడా పూర్తిగా సఫలం కాలేదు. వేదాలు, ఉపనిషత్తులచేత కూడా వర్ణింపనలవి కానిది. అవి ఆమెకు పాపిట బొట్టులాంటివి.

శివస్తుతిలో "శివా ! నీకు ప్రియమైన శ్రుతులుకూడా నిన్ను పూర్తిగా వర్ణించలేకుండా ఉన్నాయి. మిగిలినవి నేతినేతి (ఇదికాదు ఇదికాదు) అంటూ నిషేధ వాక్యములచే చెప్పటానికి ప్రయత్నించాయి. అటువంటి నిన్నుగురించి వివరించటానికి నేనేంతటివాడను తండ్రీ!" అని చెప్పబడింది. అంటే వేదాలకు ఉపనిషత్తులకు కూడా అందనటువంటిది పరబ్రహ్మరూపం.

నాలుగు వేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. వాటిలో 108 మాత్రమే చదవతగ్గవి అని తేల్చారు. అందులో 10 ఉపనిషత్తులు ముఖ్యమైనవి అన్నారు శంకరభగవత్పాదులు. ప్రతి ఉపనిషత్తుకూడా ఏదో ఒక వేదానికి సంబబంధించినదే. ఈ పది ఉపనిషత్తులలోను

| | | |
|---|---|---|
| ఐతరేయోపనిషత్తు | – | ఋగ్వేదంలోది |
| కఠ, తైత్తిరీయోపనిషత్తులు | – | కృష్ణయజుర్వేదంలోవి |
| ఈశావాశ్య, బృహదారణ్యకాలు | – | శుక్ల యజుర్వేదంలోవి |
| కేన, ఛాందోగ్యోపనిషత్తులు | – | సామవేదంలోవి |
| ప్రశ్న, ముండక, మాండూక్యోపనిషత్తులు | – | అధర్వవేదంలోవి |

ఉపనిషత్తు అంటే బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్యా పరిశీలకులైన విద్వాంసులకు కర్మ, జన్మ, మరణాలు లేకుండా చేసేది. ఆ జన్మాదిమరణాదికమైన దానిని నశింపచేసి బ్రహ్మపదార్థ లాభం కలిగించేది.

ప్రతి ఉపనిషత్తులోనూ కూడా పరబ్రహ్మ తత్త్వాన్నే చెప్పారు. నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. ఆది మధ్యాంతాలు లేనివాడు. శాశ్వతుడు. స్వతంత్రుడు. ధర్మాధర్మాలు లేనివాడు, పక్షపాతం లేనివాడు, నిమిత్తమాత్రుడు, ఆనందస్వరూపుడు, జీవులయొక్క కర్మలననుసరించి వారికి ఉత్తరజన్మలు ప్రసాదిస్తాడు. సృష్టిస్థితిలయాలకు అతడే కారకుడు. పిపీలికాది బ్రహ్మపర్యంతము నిండి ఉన్నవాడు. చరాచర జగత్తంతా ఆవరించి ఉన్నవాడు, సర్వవ్యాపి.

ఈ విధంగా ఉపనిషత్తులు పరబ్రహ్మస్వరూపాన్ని ప్రతిపాదించటంలో చాలావరకు సఫలీకృతమైనాయి. ఉపనిషత్తులసారమంతా మహావాక్యాలలో ఉంది. మహావాక్యాలు నాలుగు. అయితే 'మహావాక్య దర్పణము' అని ఇంకొక గ్రంథం ఉంది. అదికూడా శంకరుల వారే వ్రాశారంటారు. కాని శంకరుని పుస్తకాలలో ఎక్కడా ఇది ముద్రితం కాలేదు. 1953లో వావిళ్ళవారు ఈ గ్రంథాన్ని ప్రచురించారు. ఇందులో మహావాక్యాలు ఉండవు. కేవలము 'తత్త్వమసి' అదే దానిమీద వివరణ ఉంటుంది.

నాలుగు మహావాక్యాలూ నాలుగు వేదాలకు సంబంధించిన ఉపనిషత్తులనుండి చెప్పబడ్డాయి. అవి

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రజ్ఞానంబ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదం |
| 2. | అహంబ్రహ్మాస్మి | బృహదారణ్యకం | శుక్లయజుర్వేదం |
| 3. | తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదం |
| 4. | అయమాత్మాబ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అధర్వణవేదం |

ఈ వాక్యాలలో చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపం. ఆ పరబ్రహ్మ ఎవరో కాదు నువ్వే. ఛాందోగ్యోపనిషత్తులో ఉద్ధాలకుడు తనకుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మవిద్యనుపదేశిస్తూ ఆత్మ అనేది విశ్వమంతా వ్యాపించి ఉంటుంది. అదే సత్యం. అదే నిత్యం – అదే నీవు తత్త్వమసి అని చెబుతాడు. ఈ రకంగా ఉపనిషత్తులు పరబ్రహ్మను ప్రతిపాదించినాయి.

ఉపనిషత్తులు కాకుండా మిగిలినవి నేతినేతి అనే పదాలతో పరబ్రహ్మ ఇది కాదు అని తెలుసుకుంటూ చివరకు ఆ బ్రహ్మను గురించి తెలుసుకుంటారు. అందుచేత పాదాబ్జధూళి అంటే ఉపనిషత్తులసారమయిన మహావాక్యాలు. వీటివల్లకూడా పూర్తిగా తెలుసుకోలేకపోయినది. వేదాలకు ఉపనిషత్తులకు అతీతురాలు.

## 290. సకలాగమసందోహశుక్తిసంపుటమౌక్తికా

సకలవేద సమూహములనుబడు ముత్యపు చిప్పలచే కప్పబడిన ఆణిముత్యము వంటిది. ఆగమాలు అన్నీ పరబ్రహ్మను ప్రతిపాదించటానికి అరుంధతీ న్యాయంలో ప్రయత్నిస్తున్నాయి.

అరుంధతి చాలా చిన్ననక్షత్రం. కంటికి కనిపించదు. దాన్ని చూపటానికి ముందుగా ప్రక్కన ఉన్న పెద్ద నక్షత్రాలను చూపుతారు. అదేవిధంగా వేదాలు తటస్థ లక్షణాలను చూపి పరబ్రహ్మను ప్రతిపాదిస్తున్నాయి.

సమస్తమైన వేదాలు అనే ముత్యాలతో కూర్చబడిన నాసాభరణముగలది. నాసాభరణము మొదలైనవి ఆభరణాలను తెలుపుతాయి. అంతే కాని ఆమె స్వభావాన్ని తెలుపలేవు.

ఆత్మను ఏదీచేరలేదు. కేనోపనిషత్తులో

**న చక్షు ర్గచ్ఛతి న వా గ్గచ్ఛతి నో మనః** అక్కడికి కనులు పోలేవు. వాక్కు పోలేదు, మనస్సు పోలేదు. అంటే ఆత్మను కనులద్వారా తెలుసుకోలేము. ఎందుకంటే అదికళ్ళకి దృష్టినిచ్చే శక్తి. చెవులద్వారా వినలేము. అది చెవులకు వినికిడిశక్తి నిచ్చేది. ఈ రకంగా అవయవాలద్వారా, మనస్సుద్వారా ఆత్మను తెలుసుకోలేము. ఆత్మ వాగ్గోచరము కాదు. చక్షుర్గోచరము కాదు.

ఇక్కడ మౌక్తికము అంటే – మంత్రరాజము అని అర్థం. శ్రీవిద్యా మంత్రరాజము షోడశాక్షరి. ఆ షోడశాక్షర మంత్రము ఈ నామంలో చెప్పబడింది.

శ్రీవిద్యలో ప్రధానమైన మంత్రం షోడశాక్షరి. దీన్నే శ్రీవిద్యా మహామంత్రము అని కూడా అంటారు. షోడశి అంటే 16 అక్షరాలు గల మంత్రం. పంచదశీ మహామంత్రానికి శ్రీం అనే బీజాన్ని గనక చేర్చినట్లైతే అది 16 అక్షరాలు గల షోడశాక్షరి అవుతుంది.

**కామరాజమంత్రాంతే శ్రీ బీజేన సమన్వితా**
**షోడశాక్షరీ విద్యేయం శ్రీవిద్యేతి ప్రకీర్తితా**

మన్మథుడు ఉపాసించిన మంత్రానికి శ్రీం బీజం గనక చేర్చినట్లైతే అది షోడశాక్షరి అవుతుంది. అనగా షోడశాక్షరి మంత్రం.

**క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । శ్రీం ॥**

లొల్లా లక్ష్మీధరులు భాస్కరాచార్యులు కూడా దీన్ని సమర్థించారు. కాని పంచదశి మహామంత్రానికి ఈం బీజం చేర్చినట్లైతే షోడశాక్షరి అవుతుంది అని ఒక సంప్రదాయం. దీనిప్రకారం షోడశాక్షరి మంత్రం.

**క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । ఈం ॥**

కావ్యకంఠ గణపతి మునివర్యులు తమ మహావిద్య సూత్రగ్రంథంలో

**బ్రహ్మ (క) యోని (ఏ) శాంతి (ఈ) ఇంద్ర (ల) మాయా (హ్రీం) భిః ఖ (హ) భృగు (స) బ్రహ్మ (క) ఖ (హ), ఇంద్ర (ల) మాయా (హ్రీం) భిః భృగు (స) బ్రహ్మ (క) ఇంద్ర (ల) మాయా (హ్రీం) భిశ్చ పంచదశీ రమో (శ్రీం) త్తురీయం షోడశీ ॥**

**క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం। స క ల హ్రీం । శ్రీం ॥**

ఇది షోడశి మహామంత్రం అన్నారు.

అయితే కేవలము ఇది 16 అక్షరాలు గల మంత్రం. కాని బ్రహ్మవిద్య మాత్రం కాదు. బ్రహ్మవిద్య అంటే మోక్షవిద్య. జీవాత్మను పరమాత్మతో ఏకం చేసేందుకు ఉపకరించే విద్య. ఎక్కువమంది గురువులు ఉపదేశం చేసే బ్రహ్మవిద్య షోడశాక్షరికి 28 అక్షరాలుంటాయి.

**అష్టౌ బీజాక్షరాణ్యాదౌ పశ్చాత్పంచదశీ తతః**
**పంచబీజాక్షరాప్యేషా శ్రీమహాషోడశీమతా ॥**

పంచదశీ మహామంత్రానికి ముందు 8 బీజాక్షరాలు తరువాత 5 బీజాక్షరాలు ఉన్నట్లైతే, దాన్ని మహాషోడశి అంటారు. అది బ్రహ్మవిద్య. అయితే ముందు ఉండే అక్షరాలేవి? తరువాత ఉండే అక్షరాలేవి?

**శ్రీబీజమాయా స్మరయోనిశక్తిః సర్వం చ మాయా కమలాత్మవిద్యా ।**
**శక్త్యాదిబీజాని విలోవితాని శ్రీషోడశార్ణాపరదేవతాయాః ॥**

దీనిని బట్టి మహాషోడశికి 16 అక్షరాలే ఉంటాయి. ప్రణవము అంటే – ఓంకారము. శ్రీం హ్రీం క్లీం ఐం సౌః అనే ఐదు బీజాలను శక్తి ప్రణవాలు అంటారు ఇవే పంచప్రణవాలు. పంచప్రణవాలు, ఓం హ్రీం శ్రీం మొత్తం ఎనిమిది బీజాక్షరాలు పంచదశి మంత్రానికి ముందు, పంచదశి తరువాత మళ్ళీ పంచప్రణవాలు అయితే ముందున్న పంచప్రణవాలు అనులోమంగాను, తరువాత ఉన్నవి విలోమంగాను ఉంటాయి. ఈ రకంగా చూస్తే పంచదశి మంత్రానికి పదిహేను అక్షరాలు, ముందు ఎనిమిది, తరువాత ఐదు. వెరసి పదమూడు. మొత్తంమీద మంత్రంలో ఇరవై ఎనిమిది అక్షరాలుంటాయి. అయితే ఇక్కడ పంచదశి మంత్రంలోని మూడు కూటాలను మూడు బీజాలుగా లెక్కపెట్టాలి. అప్పుడు 8+3+5 = 16 అక్షరాలవుతాయి. ఇదే మహాషోడశి మంత్రము.

**శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం । క ఏ ఈ ల హ్రీం ।**
**హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । సౌః ఐం క్లీం హ్రీం శ్రీం ।**

ఈ మంత్రం సకల వేదసారము. పరమేశ్వరి స్వరూపము. బ్రహ్మవిద్యా స్వరూపము. దీనిని మించిన మంత్రంగాని వేదసారంగాని లేవు.

ఈ నామంలో వేదాలన్నీ చదివినప్పటికీ ఆ పరమేశ్వరి యొక్క ముక్కెర మొదలైన ఆభరణాల గురించి తెలుస్తుంది కాని ఆమె తత్త్వము మాత్రం తెలియదు. అంటే వేదాలు పరమాత్మ స్వరూపాన్ని ప్రతిపాదించలేవు. అని చెప్పబడింది.

## 291. పురుషార్థప్రదా

పురుషార్థములను ప్రసాదించునది. ధర్మార్థ కామమోక్షాలను పురుషార్థాలు అంటారు. ఎవరైతే ఆ పరాశక్తిని అర్చిస్తారో వారి పురుషార్థాలను తీరుస్తుంది. శాస్త్రీయంగాగాని అశాస్త్రీయంగాగాని దేవిని పూజించేవారు ముక్తి పొందుతారు. శాస్త్రీయంగా అంటే– సమయ మార్గంద్వారా అశాస్త్రీయంగా అంటే – వామాచారంద్వారా దేవిని అర్చించేటప్పుడు

**అర్చనం ద్వివిధం చైవ వామదక్షిణభేదతః**
**వామేన వా దక్షిణేన పూజనం తు యథారుచి**

అన్నారు. కాబట్టి ఏ రకంగానైనా సరే దేవిని అర్చించవచ్చు. ఆ త్రిపురసుందరిని గనక ఆరాధించకపోతే ఏ వర్ణమువారికైనా భోగమోక్షాలు కలగవు. అని బ్రహ్మపురాణం చెబుతోంది. ఉదయంపూట ధర్మము, మధ్యాహ్నకాలం నుంచీ అర్థసాధన, సాయం సమయందాటిన తరువాత కామము. ఆ తరువాత మోక్షము. రాత్రులందు చివరిభాగంలో పరమేశ్వరిని ఉపాసించాలనే విషయాన్ని గతంలోనే వివరించాము. పురుషుడే రుద్రుడు. అతడే పురుషార్థాలనిస్తాడు.

290వ నామంలో షోడశి మహామంత్రాన్ని చెప్పి ఈ నామంలో ఆ మంత్రోపాసనవల్ల వచ్చే ఫలితాన్ని వివరిస్తున్నారు. ఇక్కడ

1. ధర్మము అంటే – జన్మజన్మలకు ఇష్టప్రాప్తిని అనిష్ట పరిహారాన్ని పొందటానికి సాధనాలను గ్రహించటం
2. అర్థము అంటే – ఆ సాధనాలను జీవితాంతము అనుష్ఠించటము
3. కామము అంటే – తాత్కాలిక సుఖాలు పొందటానికి అవసరమైన ఉపాయాలు ఉపయోగించటం
4. మోక్షము అంటే – పునర్జన్మ లేకుండా జీవాత్మ పరమాత్మలో ఏకం కావటానికి చేసే సాధన

ఈ పురుషార్థాలు ప్రతిజీవి నెరవేర్చేటట్లుగా అవకాశములు కల్పించేది. పురుషార్థాలను ప్రసాదించేది ఆ పరమేశ్వరి. అందుకే ఆమె పురుషార్థ ప్రదా అనబడుతున్నది.

## 292. పూర్ణా

పూర్ణమైనటువంటిది. పరబ్రహ్మ స్వరూపము. **పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణ మేవా వశిష్యతే.** ఆ పూర్ణము నుండి ఈ పూర్ణము వస్తోంది. అయినప్పటికి ఆ పూర్ణముయొక్క పూర్ణత్వానికి లోటురాదు. అటువంటి పూర్ణమైన పరబ్రహ్మ స్వరూపిణి ఆ పరమేశ్వరి.

పరిమాణము లేనటువంటిది. దేశకాలములచే విభజింపబడనటువంటిది, కాబట్టి పూర్ణా అనబడుతుంది. అది సంపూర్ణమైన పదార్థము. సృష్టికి ఆదిలోను అంతంలోనుకూడా ఉండేది. జనన మరణాలు లేనిది. వృద్ధిక్షయాలు లేనిది. సర్వాంతర్యామి. ఈ రకంగా సర్వమూ తానే అయినది. సకలైశ్వర్య ప్రదాయని అయిన పరమేశ్వరి పూర్ణా అనబడుతోంది.

పంచమీ, దశమీ, తిథి స్వరూపము గలది. శుక్ల పక్ష చతుర్దశి రాత్రి స్వరూపము గలది. శుక్ల పక్ష చతుర్దశి రాత్రికి 'పూర్ణా' అని పేరు. పూర్ణా అనేది ఒక నది.

## 293. భోగినీ

**భోగః సుఖసాక్షాత్కారః** సుఖ సాక్షాత్కారము గలది. భోగము - సుఖము, ఆనందానుభవము. ఆ దేవి ఆనందమే స్వరూపంగా గలది కాబట్టి భోగినీ అనబడుతుంది. భోగాలు ఎనిమిది రకాలు.

| | | | |
|---|---|---|---|
| 1. గృహము | 3. వస్త్రము | 5. మాంగల్యము | 7. గంధము |
| 2. శయ్య | 4. ఆభరణము | 6. పుష్పము | 8. తాంబూలము |

వీటిని అష్టభోగాలంటారు. వీటిని కలది భోగిని. భోగము అంటే - నివేదన. వివిధ రకాలయిన పదార్థాలను నివేదన చేయబడునది.

భోగము అంటే–అనుభవము. జీవులయొక్క కర్మనుబట్టి వారికి సుఖదుఃఖాలనిచ్చేది. భోగిని అనే పేరు కల నాగకన్య ఉన్నది.

## 294. భువనేశ్వరీ

చతుర్దశ భువనాలకూ ఈశ్వరి అధిపతి. భువనము అంటే - ప్రపంచము, లోకము, భూమి, స్వర్గము, ప్రాణి, నీరు, జలము, ఆకాశము అని అర్థం.

పద్నాలుగు లోకాలకు ఈశ్వరి కాబట్టి భువనేశ్వరి. అధోలోకాలు ఏడు. అవి

| | | | |
|---|---|---|---|
| 1. అతల | 3. సుతల | 5. రసాతల | 7. పాతాళములు. |
| 2. వితల | 4. తలాతల | 6. మహాతల | |

అలాగే ఊర్ధ్వలోకాలు ఏడు. అవి

| | | | |
|---|---|---|---|
| 1. భూలోక | 3. సువర్లోక | 5. జనలోక | 7.సత్యలోకాలు |
| 2. భువర్లోక | 4. మహాలోక | 6. తపోలోక | |

వీటన్నింటికీ ఈశ్వరి ఆ దేవి. అందుకే భువనేశ్వరి అనబడింది. జలాధి దేవత కాబట్టి భువనేశ్వరి.

హ్రీంకార స్వరూపము గలది. హ్రీంకార మంత్రరూపము గలది. ఆ పరమేశ్వరి.

**హ్రీంకారరూపా హ్రీంకారనిలయా హ్రీంపదప్రియా**
**హ్రీంకారబీజా హ్రీంకారమంత్రా హ్రీంకారలక్షణా**

అంటూ వివరిస్తోంది లలితాత్రిశతి.

పంచదశి మంత్రంలో ఉన్న బీజాక్షరాలన్నింటిలోకి హ్రీంకారము ముఖ్యమైనది. మంత్రంలోని ప్రతికూటమి చివరా హ్రీంకారమున్నది. ఈ మంత్రంలోని

**కత్రయం హద్వయం చైవ శైవభాగః ప్రకీర్తితః ।**
**శక్త్యక్షరాణి శేషాణి హ్రీంకార ముభయాత్మకః ॥**

మూడు కకారాలు, రెండు హకారాలు శివభాగాలు హ్రీంకారాలు మూడు ఉభయాక్షరాలు. మిగిలినవి శక్తి భాగాలు హ్రీంకారాలను శివశక్తులు కలిసి చెప్పారు కాబట్టే హ్రీంకారానికి అంతటి ప్రాముఖ్యత ఉన్నది.

మణిద్వీపంలో ఉండే శుకశారికలు కూడా హృల్లేఖీ భువనేశీ అని ధ్యానం చేస్తున్నాయి. హ్రీంకార జపం పరమేశ్వరికి ప్రీతిపాత్రం. హ్రీంకార జపసుప్రీతా అనబడుతోంది దేవి. ఇది మాయాబీజం. దీన్ని మాత్రమే జపించి తరించిన వాళ్ళున్నారు ఆ పరమేశ్వరి హ్రీంకార రూపంలో ఉంటుంది. హ్రీంకారమందే నివసిస్తుంది. హ్రీంకార జపం చేస్తే దేవిని ఆరాధించినట్లే.

హ్రీంకారము అగ్నికుండమైతే – ఆ పరమేశ్వరి దానిలోని అగ్నిశిఖ.
హ్రీంకారము వెన్నెలైతే – దేవి అందులోని చల్లదనం
హ్రీంకారము సూర్యుడైతే – పరమేశ్వరి కాంతి
హ్రీంకారము మేఘమైతే – దేవి మెరుపు తీగ

భువనేశ్వరీ దేవిని ప్రాతఃకాలంలో భైరవిగాను, సాయంసమయంలో పార్వతిగాను ఉపాసించాలి. భువనానందనాధుడనే గురువుకు ఆ దేవి సాక్షాత్కరించింది. కాబట్టి భువనేశ్వరి అనబడింది.

## 295. అంబికా

అంబిక అంటే జగన్మాత. ఇచ్ఛా జ్ఞానక్రియాశక్తుల సమిష్టిరూపం రాత్రిరూపము గలిగినది. నిద్రారూపము గలిగినది.

అంబిక అంటే – ఒక రకమైన సిద్ధి, ఆకాశము, నిద్ర, రాత్రి అని అర్థం. స్కాందపురాణంలో

**రాత్రిరూపా మహాదేవీ దివారూపో మహేశ్వరః**

మహాదేవి రాత్రి స్వరూపిణి కాగా పగటి రూపము మహేశ్వరుడు.

మాయ అనే పదాన్ని నిద్ర అని లోకంలో వ్యవహరిస్తారు. దేవీ భాగవతంలో మధుకైటభ సంహారానికి ముందు బ్రహ్మ వేదాలు చదువుతుంటాడు. విష్ణుమూర్తి నిద్రావస్థలో ఉంటాడు. అది మామూలు నిద్రకాదు. యోగనిద్ర మాయచే ఆవరించబడి అతడు నిద్రావస్థలో ఉన్నాడు. విష్ణువును నిద్రనుంచి మేల్కొల్పటానికి బ్రహ్మ ఆ పరమేశ్వరిని ప్రార్థిస్తూ తల్లీ ! అచ్యుతుని త్వరగా మేల్కొల్పవలసినది. అతడు లేచి రాక్షస సంహారం చేస్తాడు" అంటాడు. బ్రహ్మమొర ఆలకించినదై మాయాశక్తి విష్ణువునుంచి విడిపోయింది ఆ తరువాత అతడు నిద్రనుంచి మేల్కొన్నాడు. అని చెప్పబడింది.

'ఆమె శరీరమే చీకటి ప్రసరింపచేస్తుంది. కాంతిని హరించి వేస్తుంది. రాత్రియందు జీవుల అర్ధశరీరాన్ని మ్రింగివేస్తుంది. ఆ మాయకు సాటిలేదు. విష్ణువు తప్ప ఇంకెవరూ ఆ మాయను నిగ్రహించలేరు. అని హరివంశంలో చెప్పబడింది. ఆ పరమేశ్వరియే జగన్మాత. వాక్స్వరూపిణి. ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తి స్వరూపిణి. రాత్రి రూపిణి. నిద్రా రూపిణి పరమేశ్వరి ప్రీతికరమైన నామం అంబిక.

మార్కండేయ పురాణంలో

**విశ్వేశ్వరీం జగద్ధాత్రీం స్థితిసంహారకారిణీం**
**స్తౌమి నిద్రాం భగవతీం విష్ణో రతులతేజసామ్**

ఇంకా అనేకచోట్ల ఆ దేవి పలువిధాలుగా కీర్తించబడింది. సప్తశతిలో

**తతోఽంబికాం పరం రూపం బిభ్రాణాం సుమనోహరామ్**

అని కీర్తించబడింది.

## 296. అనాది నిధనా

ఆద్యంతము లేనిది.

**ఆదిర్జన్మ నిధనం వినాశః తద్వయం యస్య నవిద్యతే సః అనాదినిధనః**

జనన మరణాలు లేనటువంటిది. నిత్యము, సత్యము అయినటువంటిది. ఏ రకమైన వికారాలు లేనటువంటిది. అనాది అంటే 80 సంఖ్య. ద-8, అ అంటే – సున్న. మొత్తం 80. ఇవి అమృతవిఘాతాలు. మరణ సాధనాలు అటువంటి మరణ సాధనాలు

లేనటువంటిది. ఈ మరణ సాధనాలు రెండు రకాలు 1. పాశము 2. వధ. వీటిలో పాశములు 52 వధ 28 రకాలు వెరసి 80. ఈ మృత్యుసాధనాల నుండి భక్తులను కాపాడే పరమేశ్వరి అనాదినిధనా అనబడుతుంది.

దేవీ భాగవతంలో తారకాసుర సంహారం కోసం దేవతలు పరమేశ్వరిని ప్రార్థిస్తారు. అప్పుడు ఆమె వారికి దర్శనమిస్తుంది.

**నై వ చోర్ధ్వం న తిర్యక్చ న మధ్యే పరిజగ్రభాత్**
**ఆద్యంత రహితం తత్తు నహస్తా ద్యంగ సంయుతం**

పైన క్రింద నడుము అడ్డము అనే తేడాలు లేవు. దానికి ఆద్యంతములు లేవు. కాలు చేతులు లేవు. పోతనగారి భాగవతంలో గజేంద్రుడు శ్రీహరిని ప్రార్థిస్తూ

**అన్నిరూపులు నీ రూపమైనవాడ !**
**ఆది మధ్యాంతములు లేక అలరువాడ !**

అంటాడు. ఈ విధంగా జన్మమృత్యు జరాదులు అంటే ఆద్యంతాలు లేనిది ఆ పరమేశ్వరి. అందుకే ఆమె అనాదినిధనా అనబడుతోంది.

## 297. హరిబ్రహ్మేంద్రసేవితా

**హరిబ్రహ్మేంద్రైః విష్ణువిధిశక్రైః సేవితా ఉపాసితా**

విష్ణువు బ్రహ్మ ఇంద్రాదులచే సేవించబడునది. మణిద్వీపంలో పరమేశ్వరి ఉంటుంది. దానికి 25 ప్రాకారాలుంటాయి. వాటిలోని

14వ ప్రాకారంలో ఇంద్రుడు మొదలైన దిక్పాలకులుంటారు.

16వ ప్రాకారంలో మరీచి మొదలైన ప్రజాపతులతో కూడిన బ్రహ్మ ఉంటాడు.

17వ ప్రాకారంలో విష్ణు ఉంటాడు

18వ ప్రాకారంలో శివుడుంటాడు. ఈ విషయాలన్నీ 'శ్రీమన్నగరనాయకా' అనే 56వ నామంలో వివరించబడ్డాయి.

దేవీ భాగవతంలో

**బ్రహ్మావిష్ణుస్తథా శంభుర్వాసవో వరుణో యమః**
**వాయు రగ్ని, కుబేర శ్చ త్వష్టా పూషాశ్వినౌ భగః**

**ఆదిత్యా వసనో రుద్రా విశ్వేదేవా మరుద్గణాః**
**సర్వే ధ్యాయంతి తాం దేవీం సృష్టి స్థిత్యంతకారిణీమ్ ॥**

బ్రహ్మ, విష్ణువు, శంభుడు, రుద్రుడు ఇంద్రుడు, వరుణుడు, యముడు, వాయువు, అగ్ని కుబేర, త్వష్ట పురుషులు, అశ్వనీ దేవతలు, భగుడు, ఆదిత్యుడు, వసువులు, రుద్రులు, విశ్వదేవతలు, మరుద్గణాలు అందరూ సృష్టి స్థితిలయకారిణి అయిన దేవిని ధ్యానిస్తున్నారు.

లోకంలో ధనం కావాలంటే ధనవంతుణ్ణే అడగాలి. అంతేకాని యాచకవృత్తి చేసేవాణ్ణి అడిగి ఉపయోగం ఏముంటుంది? అలాగే బ్రహ్మ విష్ణువు మొదలగు వారందరూ యాచకులు. వారికి కావలసిన దానికోసం ఆ పరమేశ్వరినే ఆశ్రయిస్తారు. మరి అలాంటప్పుడు ఆ హరిహర బ్రహ్మాదులను ఆశ్రయిస్తే వచ్చే ఫలము ఏమీ ఉండదు. ఆ పరమేశ్వరిని శరణువేడితే సర్వసిద్ధులు ప్రసాదిస్తుంది.

కేనోపనిషత్తులో దేవతలకు ఉమాదేవి సాక్షాత్కరిస్తుంది. ఆ పరబ్రహ్మతత్త్వాన్ని చూసినందువల్లనే అగ్నివాయువు ఇంద్రుడు మిగిలిన వారికన్న గొప్పవారైనారు. ఆ తత్త్వాన్ని ముందుగా చూసిన ఇంద్రుడు దేవతలకు రాజైనాడు. అని చెప్పబడింది.

ఆ పరమేశ్వరిని సేవించే హరిహర బ్రహ్మాదులు తమ పదవులు అలంకరించారు. వారిచేత సేవించబడే పరమేశ్వరినే మోక్షగాములు సేవించాలి.

## 298. నారాయణీ

నరుడు అంటే పరమాత్మ. అటువంటి ఆత్మవలన జన్మించిన పంచభూతాలు నారములు అనబడతాయి. ఆ పంచభూతముల యందు వ్యాపించినది. పంచభూతాలే స్థానముగా గలది – నారాయణి అనబడుతుంది.

జలమే – నారము అని చెప్పబడింది. ఆ నీరే మార్గము, నివాసముగా గలవాడు నారాయణుడు.

నరులకు వాసము (మార్గము) ఎవరివలన కలుగుతున్నదో వాడు నారాయణుడు. మహాభారతంలో నరునినుండి పుట్టిన తత్త్వములు నారాయణి అని చెప్పబడింది. నారాయణుని భార్య నారాయణి. ఇక్కడ నారాయణుడు అంటే పరమశివుడు. అయితే నారాయణుని చెల్లెలు నారాయణి అని చెప్పబడింది. ఆమె పరమశివుని భార్య. ఈ విషయంగతంలో కూడా వివరించబడింది. కూర్మపురాణంలో శివుడు "నారాయణుడనైన

నేను రెండురకాలుగా విభజించబడ్డాను. 1. నారాయణుడు 2. గౌరి నా పరతత్త్వాన్ని దేవాదులుగాని ఎరగరు. నేనే గౌరిని, నేనే విష్ణువును" అన్నాడు.

పద్మపురాణం ప్రకారము ఆ దేవి యొక్క స్థానము జలము. సముద్రమునందు శయనించునది. కాబట్టి నారాయణి అనబడుతున్నది.

కాబట్టి జలము స్థానముగా గలిగినది - నారాయణి. శివునకు నారాయణుడని పేరు. అతని భార్య నారాయణి. సుపార్శ్వక్షేత్రంలో పూజింపబడే దేవి నారాయణి.

**త్రిశూలచంద్రాహిధరే ! మహావృషభవాహిని !**

**మహేశ్వరీ స్వరూపేణ నారాయణి ! నమోఽస్తు తే ॥**

మహేశ్వరీ రూపము ధరించి, త్రిశూలమును, చంద్రుని, సర్పములనుదాల్చి, పెద్ద ఎద్దుపై ఎక్కి ఉండు ఓ నారాయణీ నీకు ప్రణామములు.

**సర్వమంగళమాంగల్యే ! శివే ! సర్వార్ధసాధికే !**

**శరణ్యే ! త్ర్యంబకే ! దేవి ! నారాయణి ! నమోఽస్తు తే**

సర్వమంగళములు చేకూర్చునది, శివుని శక్తి, సర్వార్ధములు సాధించుటకు, శరణ్యమగునది, మహేశ్వరుని పత్ని నారాయణికి నమస్కారము.

## 299. నాదరూపా

బిందువునందు ఎనిమిది వర్ణాలున్నాయి. బిందువుతో కలిపి అవి తొమ్మిది. యోగినీ హృదయంలో

**బిందౌ తదర్ధం రోదిన్యాం నాదో నాదాంత ఏవ చ**

**శక్తిః పున ర్వ్యాపికాయాం సుమనా ఉన్మన గోచరే**

| | | |
|---|---|---|
| 1. బిందువు | 4. నాదము | 7. వ్యాపిక |
| 2. అర్ధచంద్రము | 5. నాదాంతము | 8. సుమన |
| 3. రోదిని | 6. శక్తి | 9. ఉన్మన |

ఇక్కడ నాల్గవది నాదము. దీని లక్షణము.

**బిందు ద్వయాంతరే దండ శ్చైవ రూపో మణిప్రభః**

కనులవలె ఉండే రెండు బిందువులున్నాయి. వీటిని తిర్యక్ బిందువులు అంటారు. వాటిని కలుపుతూ మధ్యలో సన్నని రేఖ ఒకటి ఉంటుంది. అది మణిప్రభలు కలిగి ఉంటుంది. అనగా ఎర్రని కాంతి ప్రకాశిస్తుంది.

ఈ పైన చెప్పినవి సూక్ష్మాతి సూక్ష్మమైనవి. స్వచ్ఛందతంత్రంలో నాదాన్ని వివరిస్తూ

**పద్మకింజల్కసంకాశః సూర్యకోటిసమప్రభః**

పద్మకింజిల్కములతో సమానమైనది. కోటిసూర్యులకాంతి కలది అని చెప్పబడింది.

ఈ జగత్తంతా నామరూపాత్మకమైనది. అందులో

నామము – శక్తిరూపము విమర్శాంశ

రూపము – శివరూపము ప్రకాశాంశ

సృష్టిలో అంతా అవ్యక్తంగా శూన్యంగా ఉండేది. ఆ శూన్యంలో నుండి అంటే అవ్యక్తం నుంచి మొదటగా వ్యక్తమైనది నాదము. సంవిద్బిందువునందలి శక్తి అంశ అయిన రక్తబిందువుతో ఈ నాదము ఏర్పడింది. అందుచేత దేవి నాదరూపా అనబడు తోంది. నాదము పరబ్రహ్మ స్వరూపము. ఏదైనా ఒక శబ్దాన్ని చేసినట్లైతే, అది తరంగాలుగా వ్యాపించి బ్రహ్మాండమంతా ఆవరిస్తుంది. అందుకే అది సర్వవ్యాపి. పరమేశ్వర స్వరూపము.

## 300. నామరూపవివర్జితా

జగత్తుకు ఐదురూపాలున్నాయి అవి

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | అస్తి | – కలదు | 4. | నామము | – పేరు |
| 2. | భాతి | – జ్ఞానము | 5. | రూపము | – ఆకారము |
| 3. | ప్రియం | – ఆనందము | | | |

వీటిలో మొదటి మూడు బ్రహ్మరూపాలు. మిగిలినవి జగద్రూపాలు. అంటే లోకానికి సంబంధించినవి. జగద్రూపాలయిన నామరూపాలు అంతా మిథ్య. కాబట్టి వాటిని వదలివేసినది. సత్యాసత్యములు లేనిది. ఆ పరమేశ్వరి.

పరమేశ్వరి జగత్తులోని జీవరాశి యందు అంతటా తానే అయి ఉన్నది. కాని కంటికి కనిపించే రూపంలోను పేరుతోను మాత్రం కాదు. అందుచేతనే నామరూప వివర్జితా అనబడుతోంది.

## 301. హ్రీంకారీ

హ్రీంకారము చే సూచింపబడునది ఆ పరమేశ్వరి. హ్రీంకారంలో హ కారము – సృష్టి, రకారము – స్థితి, ఈకారము – లయము, ఈ రకంగా ఇది బ్రహ్మవిష్ణు శివాత్మకము. శ్రీం హ్రీం క్లీం ఐం సౌః అనేవి శక్తి ప్రణవాలు. వాటిలో రెండవది హ్రీంకారము. భువనేశ్వరీ బీజము. మాయా స్వరూపము. శివశక్తుల స్వరూపము. హ్రీంకారము పరమేశ్వరీ రూపము. అందుచేతనే ఆ దేవి హ్రీంకారీ అనబడుతుంది. పంచదశీ మహా మంత్రంలో హ్రీంకారాలు 3 శివశక్తులచే చెప్పబడ్డాయి. వీటిని గతంలో వివరించటం జరిగింది.

**హకారఃస్థూలదేహఃస్యా ద్రకారస్సూక్ష్మ దేహకః ।**
**ఈకారః కారణాత్మాఽసౌ హ్రీంకారోఽ హం తురీయకమ్ ॥**

| | | |
|---|---|---|
| హకారము | – | స్థూలదేహము |
| రకారము | – | సూక్ష్మదేహము |
| ఈకారము | – | కారణదేహము |
| మొత్తం హ్రీంకారము | – | తురీయకము మహాకారణ దేహము |
| ఓంకారము | – | పరబ్రహ్మ స్వరూపము అలాగే |
| హ్రీంకారము | – | పరమేశ్వరి స్వరూపము |

**నమ స్తే భువనేశాని ! నమ స్తే ప్రణవాత్మికే !**
**సర్వవేదాంతసంసిద్ధే ! నమో హ్రీంకార మూర్తయే ॥**

శక్తి, మాయ, హృల్లేఖా అనే హ్రీంకార వాచ్యాలు. పరబ్రహ్మకు దానిశక్తికి తేడా లేదు. అలాగే ఓంకారానికి, హ్రీంకారానికి తేడాలేదు. అందుచేతనే పరమేశ్వరి హ్రీంకారీ అనబడుతోంది. 'పంచదశీ మహామంత్రస్తవం'లో

**హ్రీం బీజాగత నాదబిందు భరితాం ఓంకార నాదాత్మికాం**
**బ్రహ్మానంద ఘనోదరీం గుణవతీం జ్ఞానేశ్వరీం జ్ఞానదాం**
**ఇచ్ఛా జ్ఞానకృతీం మహీంగతవతీం గంధర్వ సంసేవితాం**
**శ్రీచక్ర ప్రియబిందు తర్పణ పరాం శ్రీరాజరాజేశ్వరీమ్ ॥**

పంచదశీ స్తవంలో

**హ్రీం హ్రీమితి ప్రతిదినం జపతాం తవాఖ్యాం**
**కిం నామ దుర్లభ మిహ త్రిపురాదివాసే !**

**మాలాకిరీట మద వారణ మాననీయాం**
**త్వాం సేవతే వసుమతీ స్వయ మేవ లక్ష్మ్యాః ॥**
**హ్రీంకార మేవ తవ నామ త దేవరూపం**
**త్వన్నామ దుర్లభ మిహ త్రిపురే గృణంతి**
**త్వత్తేజసా పరిణతం వియదాదిభూతం**
**సౌఖ్యం తనోతి సరసీరుహ సంపదాద్యైః ॥**

అంటూ హ్రీం కారాన్ని స్తుతించారు.

## 302. హ్రీమతీ

లజ్జ గలది కాబట్టి హ్రీమతి. హ్రీ అనగా లజ్జ, మతి, తుష్టి, పుష్టి అని అర్థాలున్నాయి. పరమేశ్వరి సకల జీవములందు లజ్జా రూపంలో ఉంటుంది. అందుకే సప్తశతిలో

**యా దేవీ సర్వభూతేషు లజ్జారూపేణ సంస్థితా ।**
**నమ స్తస్యై నమ స్తస్యై నమ స్తస్యై నమో నమః ॥**

## 303. హృద్యా

హృదయమునందు పుట్టునది. మునీశ్వరుల హృదయమందు నివసించేది.

మనోహరమైన రూపము గలది. సకల ఉపాసకుల హృదయస్థానమున ఉండునది. ఉపాసించువారి హృదయములలో ఆనందము నింపునది.

## 304. హేయోపాదేయవర్జితా

ఇష్టానిష్టములచే వదలబడినది. నింద్యానింద్యములచే వదలబడినది. ప్రవృత్తి నివృత్తులచే వదలబడినది. అంటే పరమేశ్వరి ఇష్టము అయిష్టము, ప్రవృత్తి నివృత్తి అనేవి ఏవీ లేనటువంటిది. కేవలము సాక్షీభూతము

హేయము అంటే – విసర్జించటము

ఉపాధి అంటే – స్వీకరించటం ఈ రెండూ లేనిది.

పరమేశ్వరికి జాతిని బట్టి గాని, కులాన్ని బట్టి గాని, సంపదను బట్టి గాని, మానవులందు భేదముండదు. కేవలము వారి భక్తి భావాలను మాత్రమే స్వీకరిస్తుంది. అందుచేతనే హేయోపాదేయవర్జితా అనబడుతోంది. ఈ రకంగా ఈ నామాలలో షోడశి మహామంత్రాన్ని, దాని ఉపాసన ఫలితాన్ని వివరించారు.

# 24. భువనేశ్వరీ మంత్రము

భువనేశ్వరి. భువనేశ్వరుని యొక్క పత్ని. త్రిభువనములకు ఈశ్వరి. భూలోక భువర్లోక సువర్లోకాలకు అధిపతి. ఈశ్వరి అంతేకాదు చతుర్దశ భువనాలకు కూడా ఈమే ఈశ్వరి. చతుర్దశ భువనాలు అంటే ఊర్ధ్వలోకాలు ఏడు, అధోలోకాలు ఏడు, ఈ రకంగా పధ్నాలుగు లోకాలకు ఈమే ఈశ్వరి. శ్రీచక్రంలోని నాల్గవ ఆవరణ చతుర్దశారము. పధ్నాలుగు కోణములు గల చక్రము. ఇందులోని పధ్నాలుగు కోణాలు పధ్నాలుగు లోకాలకు ప్రతీక. ఈ భువనాలన్నింటికీ అధిపతి. భువనేశ్వరి అంటే ఆ పరమేశ్వరియే.

దేవీభాగవతంలో చింతామణి గృహంలో పంచబ్రహ్మలు కోళ్ళుగా గల ఆసనము మీద

**తస్యోపరి మహాదేవో భువనేశో విరాజతే**

**యా దేవీ నిజలీలార్థం ద్విధా భూతా భభూవహ**

భువనేశ్వరుడు, మహాదేవుడు అయిన కామేశ్వరుడుంటాడు. అయితే కామేశ్వరి కామేశ్వరులు వేరు కాదు. ఇద్దరూ ఒకటే. భువనేశ్వరీ దేవియే తనలీలావిలాసార్థం రెండు రూపాలు ధరిస్తున్నది. ఆ భువనేశ్వరుడే సర్వేశ్వరుడు. కోటిసూర్యుల వెలగులతో, కోటిచంద్రుల చల్లదనంతో స్వచ్ఛమైన స్ఫటికమువలె ప్రకాశిస్తూ దయార్ద్ర దృక్కులు విరజిమ్ముతూ ఉంటాడు.

**వామాంకే సన్నిషణ్ణా స్వదేవీ శ్రీ భువనేశ్వరీ ।**

**నవరత్న గణాకీర్ణా కాంచీదామ విరాజితా ॥**

**తప్తకాంచనసన్నద్ధ వైడూర్యాంగదభూషణా**

**కన చ్ఛ్రీచక్రతాటంక విటంకవదనాంబుజా**

**లలాటకాంతివిభవవిజితార్ధ సుధాకరా ॥**

భువనేశ్వరుని వామాంకమందు భువనేశ్వరి ఉంటుంది. నవరత్నములు పొదిగిన మొలనూలితోను, వైడూర్యములు పొదిగిన చేతి కడియములతోను, శ్రీచక్రాకారముగల తాటంకములతో దేవిముఖము ప్రకాశిస్తుంటుంది అని చెప్పబడింది.

అంటే ఆ పరమేశ్వరియే భువనేశ్వరి అని గుర్తించాలి. మంత్రశాస్త్రంలో భువనేశ్వరీ మంత్రం ప్రత్యేకంగా ఉన్నది.

**అస్యశ్రీ భువనేశ్వరీ మహామంత్రస్య। వేదవ్యాసో భగవాన్ ఋషిః। అనుష్టుప్ ఛందః। శ్రీ భువనేశ్వర్యంబా దేవతా। హ్రీం బీజం। శ్రీం శక్తిః। ఓం కీలకం। జపే వినియోగః ॥**

**న్యాసము** : హ్రాం। హ్రీం। హ్రూం। హ్రైం। హ్రౌం। హ్రః ॥

**ధ్యానము** : **ఉద్యద్భాస్వత్సమాభాం విజిత నవజపా మిందుఖండావతంసాం**
**జ్యోతిరౌళింత్రినేత్రాం వివిధమణి లసత్కుండలాం పద్మహస్తాం।**
**హారగ్రైవేయ కాంచీ గుణమణివలయో ద్యద్విచిత్రాం బరాఢ్యాం**
**దేవీం పాశాంకుశాఢ్యా మభయవరకరా మంబికాం తాం నమామి॥**

**మంత్రము** : **ఓం శ్రీం హ్రీం శ్రీం**

ఈ మంత్రోపాసన ధన, ధాన్య, విద్యా, ఐశ్వర్య, విజయ ప్రాప్తికరము.

ఇక 305 నుంచి 312 వరకు గల ఎనిమిది నామాలలోను భువనేశ్వరీ మంత్రాన్ని వివరించటం జరుగుతోంది. రాజరాజార్చితా అనే నామంలో ఈ మంత్రాన్ని ఉపాసించిన వారిని గురించి చెబుతూ రమ్యా అనే నామంలో మంత్రంలోని – హకారము, రమణీ అన్నప్పుడు – రేఫ, రస్యా అన్నప్పుడు – ఈకారము, రంజనీ అన్నప్పుడు –బిందువును సూచిస్తున్నాయి.

**జగజ్జనానందకరీం జయాఖ్యాం**
**యశస్వినీం యంత్ర సుయజ్ఞ యోనిం।**
**జితామితామిత్ర కృతప్రపంచాం**
**భజామహే శ్రీభువనేశ్వరీం తామ్ ॥**

ఇక నామాలను చూద్దాం.

## 305. రాజరాజార్చితా

రాజరాజు అంటే – సార్వభౌము, చక్రవర్తి, కుబేరుడు చంద్రుడు అని అర్థం.

రాజరాజు చేత అర్చించబడినది. సేవించబడినది. అనగా రాజరాజు అయిన కుబేరుడు, చంద్రుడు మొదలైన వారిచేత ఆరాధింపబడినది.

పంచదశీ మహామంత్రాన్ని అనేకమంది ఉపాసించారు. వారిలో మనువు, చంద్రుడు, కుబేరుడు మొదలైనవారు శ్రేష్ఠులని గతంలో వివరించబడింది. వీరు లోకపాలకులు.

బ్రహ్మోపేంద్ర మహేంద్రాదులు వీరికి పాలకులు. కాబట్టి రాజులకు రాజులు రాజరాజులు. అటువంటి రాజరాజులచేత అర్చించబడినది.

కుబేరాది విద్యారూపము గలది. గతంలో మనువు చంద్రుడు ఉపాసించిన పంచదశి మంత్రాలను వివరించాం. ఇప్పుడు కుబేరుడు ఉపాసించిన మంత్రాన్ని చెబుతున్నాం.

**అస్యశ్రీ కుబేరవిద్యా మహామంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః । అనుష్టుప్ ఛందః । శ్రీ కుబేర విద్యాంబా దేవతా । క ఏ ఈల హ్రీం బీజం । హసక హలహ్రీం శక్తిః । సహ సకల హ్రీం కీలకం । జపే వినియోగః**

**న్యాసము : కూటత్రయముతో రెండు ఆ వృత్తులు న్యాసము చెప్పాలి**

**ధ్యానము : సకుంకువిలేపనా .......**

**మంత్రము : క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । సహ స క ల హ్రీం ॥**

మనవు, చంద్రుడు, కుబేరుడు మొదలైన పాలకుల (రాజులు) చేత అర్చించబడునది.

వీరి పాలకులైన బ్రహ్మోపేంద్రాదులచే (రాజరాజులు) అర్చించబడునది. రాజరాజు అంటే కుబేరుడు, చంద్రుడు కాబట్టి వారిచే అర్చించబడునది ఆ పరమేశ్వరి.

## 306. రాజ్ఞీ

**రాజరాజేశ్వరస్య పట్ట మహిషీత్వాత్ రాజ్ఞీ**

రాజరాజేశ్వరుని పట్టపురాణి కాబట్టి రాజ్ఞి అనబడుతున్నది.

భువనేశ్వరీదేవికి నామాంతరము రాజ్ఞి. కామేశ్వరునితో పట్టాభిషిక్తురాలయిన దేవి కామేశ్వరి. ఆమెయే రాజ్ఞి.

చరాచర జగత్తునంతటిని పాలించేది. రాజులచేత, రాజరాజులచేత అర్చించబడేది, దేవగణాలు, ఋషి గణాలచేత అర్చించబడేది, స్తుతించబడేది, ఆత్మ వైభవము గలది, రాజరాజములైన యంత్ర, మంత్రాదులచే అర్చించబడునది. శ్రీచక్రము యంత్రరాజము శ్రీవిద్యా మంత్రము – మంత్రరాజము. అందుచేత ఆ పరమేశ్వరి రాజ్ఞీ అనబడుతున్నది.

## 307. రమ్యా

**సౌందర్యవతి** సౌందర్యము గలది కాబట్టి ఆమె రమ్యా అనబడుతోంది.

మనోహరమైన, సుందరమైన లావణ్యము గలది. **ఉమా హైమవతీ బహుశోభనా** పరమేశ్వరి మిక్కిలి సౌందర్యవతి. శ్రీ సూక్తంలో

**హిరణ్య వర్ణాం హరిణీం సువర్ణరజత స్రజాం ।**

అని చెప్పబడింది. సౌందర్య లహరిలో శంకర భగవత్పాదులవారు 12వ శ్లోకంలో

**త్వదీయం సౌందర్యం తుహినగరికన్యే ! తులయుతం**

**కవీన్ద్రాః కల్పంతే కథ మపి విరించిప్రభృతయః**

**యథా లోకౌత్సుక్యా దమరలలనా యాంతి మనసా**

**తపోభి ర్దుష్ప్రాపా మపి గిరిశసాయుజ్యపదవీం ॥**

అమ్మా ! ఓ పార్వతీ ! నీ సౌందర్యాన్ని వర్ణించటానికి బ్రహ్మ విష్ణువు ఇంద్రుడు మొదలైన కవిశ్రేష్టులు ఎంత ప్రయత్నించినా సమర్ధులు కాలేదు. అటువంటి లోకోత్తరమైన నీ సౌందర్యమును దర్శింపకోరిక గలవారై నీ సాయుజ్యము పొందటానికి ఇష్టపడుతున్నారు.

'రమ్యా' అనేది భువనేశ్వరీ మంత్రంలోని హ కారాన్ని సూచిస్తుంది. ఇక ఇక్కడనుంచి భువనేశ్వరీ మంత్రము వివరించబడుతోంది.

## 308. రాజీవలోచనా

రాజీవము అంటే – పద్మము, జింక, చేప అని అర్ధం. పద్మము వంటి కనులు గలది. జింక కనులవంటి కనులు గలది హరిణాక్షి. చేప కనులవంటి కనులు గలది. మీనాక్షి. మీనాక్షి అన్నప్పుడు చేపలవంటి కనులు గలది అని కూడా అర్ధమున్నది. కాని చేపకనుల వంటి కనులు గలది అన్నప్పుడు భక్తులయొక్క కోరికలను వీక్షణ మాత్రంచేతనే తీర్చునది అని అర్ధం. చేపలు తమ గ్రుడ్లను కంటిచూపుతోనే పొదుగుతాయని గ్రంథాలలో చెప్పబడింది.

పద్మాలు లేక కమలములు రెండు రకాలు. 1. శ్వేత కమలము 2. రక్త కమలము పరమేశ్వరి యొక్క నేత్రాలు సూర్యచంద్రులు. కాబట్టి శ్వేత రక్త కాంతులు కలిగి ఉంటాయి.

## 309. రంజనీ

**భక్తాన్ రంజయతీతి రంజనీ**

భక్తులను రంజింపచేయునది. స్ఫటికమువంటి ప్రకాశించు పరమశివుని, దాసాని పువ్వులా ఉన్న దేవి రంజింపచేస్తుంది. అనగా స్వచ్ఛమైన స్ఫటికము ప్రక్కన ఎర్రని రంగు పెట్టినట్లైతే, ఆ స్ఫటికంకూడా ఎర్రగానే ప్రకాశిస్తుంది.

భక్తులను తనకృపారసముతో రంజింపచేయునది. రంజనీ అనేది ఈ మంత్రములో బిందువును సూచిస్తుంది.

## 310. రమణీ

**భక్తాన్ రమయతి** భక్తులను రమింపచేయునది. ఆనందింపచేయునది. భక్తజనుల హృదయములందు విహరించునది. శ్రుతిలో 'నవ్వుచు, ఆడుచు రమించును' అని చెప్పబడింది. రమణి అనేది మంత్రంలోని రేఫను సూచిస్తుంది.

## 311. రస్యా

రసించటానికి, ఆస్వాదించటానికి యోగ్యురాలు. పదార్థంలో ఉండే సారాన్ని రసము అంటారు. జగత్తులోని ప్రతిపదార్థంలోనూ కూడా ఉండే రసము ఆ పరమేశ్వరి యొక్క స్వరూపమే అయి ఉన్నది. పాలలోని నెయ్యిలాగా పరమేశ్వరుడు ప్రతిజీవిలోనూ అంతర్గతంగా ఆవరించి ఉన్నాడు. ఇక్కడ పాలలోని నేయిలాగా అనే పదానికి అర్థం – నిజంగా చూస్తే పాలలో నెయ్యి కనిపించదు. వాటిని కాచి, తోడుపెట్టి వెన్న తీసి, ఆ వెన్నను కరగపెడితేనేగాని నెయ్యి రాదు. అంటే జీవి తనలో ఉన్న ఆత్మ స్వరూపాన్ని తెలుసుకోవాలంటే ఇంత కష్టపడాలి. అప్పుడే ఆత్మదర్శనమవుతుంది. ఆ రకంగా ప్రతిజీవిలోని రసగ్రహణ శక్తి ఆ పరమేశ్వరి అంశయే అని తెలుసుకోవాలి. పరమేశ్వరి ఆనందరసమే స్వరూపముగా గలది. అందుచేత ఆమె రస్యా అనబడుతున్నది. ఈ నామము మంత్రంలోని ఈకారాన్ని సూచిస్తుంది.

## 312. రణత్కింకిణిమేఖలా

**రణంత్యః కింకిణయః క్షుద్రఘంటికాః యస్యాం**

శబ్దించుచున్న చిరుగంటలు గల మొలనూలు గలది. మ్రోగుచున్న చిరుగంటలు గల మొలనూలు గలది. భువనేశ్వరీ మంత్రానికి వర్ణవిభాగమే కింణిణులు వాటి ఉచ్చారణ ధ్వనియె కింకిణీనాదము.

ఈ రకంగా 305 నుంచి 312 నామం దాకా భువనేశ్వరీ మంత్రం ఉపదేశించబడింది.

# 25. మహాలక్ష్మీ మంత్రము

పరమేశ్వరి జగన్మయి. జగత్తులోని అన్ని రూపాలు ఆమెవే. సృష్టి ప్రారంభం కాకముందు అంటే కృతయుగానికి ముందు శ్రీ మహావిష్ణువు పాలసముద్రంలో నిద్రిస్తున్నాడు. అతడి నాభిలో నుంచి వచ్చి బ్రహ్మ వేదాలు వల్లిస్తున్నాడు. విష్ణుమూర్తి చెవి గుబిలిలో నుంచి మధుకైటభులనే రాక్షసులు పుట్టారు. వాళ్ళు సముద్రమంతా కలియదిరిగినా ఇంకొక ప్రాణి కనిపించలేదు. చివరకు బ్రహ్మ కనిపించాడు. బ్రహ్మను తమతో యుద్ధం చెయ్యవలసినదిగా పిలిచారు. బ్రహ్మ భయపడి పారిపోయి తన తండ్రిని శరణుకోరాడు. ఆ పరమేశ్వరి కటాక్షంవల్ల విష్ణువు మధుకైటభులను సంహరించాడు.

ఆ తరువాత ఒక విమానం వచ్చింది. అందులో నుంచి ఒక స్త్రీ మూర్తి క్రిందికి దిగి, త్రిమూర్తులను విమానంలో ఎక్కించుకుని గౌరవంగా తీసుకుపోయింది. ఆ విమానం గగన మార్గంలో ప్రయాణించి సుదూర తీరాలకు చేరింది. అక్కడ సముద్రం మధ్య భాగాన మణిద్వీపం దాని మధ్యలో చింతామణి గృహం. అక్కడ త్రికోణాకార మంచం మీద ఒక స్త్రీమూర్తి కూర్చుని ఉంది. ఆమె తేజోరాసి.

త్రిమూర్తులు ఆమెను పరి పరి విధాల స్తుతించారు. ఆ సమయంలో దేవి త్రిమూర్తులకు తన తత్త్వాన్ని తెలియచెప్పి తన ప్రతిరూపాలయిన మహాకాళి, మహాలక్ష్మి, మహా సరస్వతులను సృష్టించి వారికి ఇచ్చి, వీరు మీ కార్యక్రమాలలో మీకు సహాయ కారులుగా ఉంటారు. వీరిని ఎప్పుడూ అవమానించకండి అని చెప్పింది.

ఈ రకంగా త్రిశక్తులను తన ప్రతిరూపాలుగా ఆవిర్భవింపచేసింది. కాబట్టి కాళి అన్నా, గౌరి అన్నా, లక్ష్మి అన్నా ఆ పరమేశ్వరి రూపమే.

ఇప్పుడు మహాలక్ష్మీ మంత్రం వివరించబడుతోంది. రమా – అనేది లక్ష్మీదేవి నామము. శకార సంకేతం. రతిరూపా – ఈకారము, రాకేందువదనా – బిందువు. రామా – రేఫ మొత్తం కలిపి శ్రీం మహాలక్ష్మీ మంత్రము.

**అస్యశ్రీసౌభాగ్య ఏకాక్షరీ మహామంత్రస్య । భృగుఋషిః । నిచ్ఛృద్గాయత్రీచ్ఛందః। శ్రీ మహాలక్ష్మీ దేవతా । శ్రాం బీజం । శ్రీం శక్తిః । శ్రూం కీలకం । జపే వినియోగః**

**న్యాసము** : శ్రాం । శ్రీం । శ్రూం । శ్రైం । శ్రౌం । శ్రః ॥

**ధ్యానము** : **వందే పదకరాం ప్రసన్నవదనాం సౌభాగ్యదాం భాగ్యదాం**
**హస్తాభ్యా మభయప్రదాం మణిగణై ర్నానావిధై ర్భూషితాం**
**భక్తాభీష్ట ఫలప్రదాం హరిహర బ్రహ్మాదిభిస్సేవితాం**
**పార్శ్వే పంకజశంఖపద్మనిధిభి ర్యుక్తాం సదా శక్తిభిః**

**మంత్రము** : **శ్రీం**

ఈ రకంగా 313 నుంచి 320 నామాలవరకు మహాలక్ష్మీ మంత్రం చెప్పబడింది. ఆ దేవిని గనక ఉపాసనచేస్తే శత్రునాశనం జరుగుతుంది. భోగభాగ్యాలు ఒనగూడుతాయి.

ఇక నామాలను చూద్దాం.

## 313. రమా

సూత సంహితలో

**లక్ష్మీ వాగాదిరూపేణ నర్త కీవ విభాతియా**

లక్ష్మీవాగాది రూపముచే నర్తకి వలె ప్రకాశిస్తున్నది అని చెప్పబడింది. అందుచేత రమా అంటే లక్ష్మీ స్వరూపము గలది.

లక్ష్మి విష్ణుమూర్తి యొక్క శక్తి. చరాచర జగత్తుకు స్థితి రూపమైనటువంటిది. శ్రీం బీజం లక్ష్మీబీజముగా ఉపాసింపబడుతుంది. శ్రీ అంటే – లక్ష్మి, శ్రీ అంటే – గౌరి, శ్రీ అంటే – సరస్వతి. మొత్తం మీద శ్రీ అంటే త్రిశక్తుల రూపము. శ్రీం బీజము కామకలా స్వరూపము. ఈమె ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి, విద్యాలక్ష్మి, విజయలక్ష్మి. ఇలా అష్టలక్ష్మిగా ప్రసిద్ధి చెందినది.

## 314. రాకేందువదనా

**కలాహీనే సానుమతిః పూర్ణే రాకానిశాకరే**

ఆగ్నేయ పురాణంలో ఒక కళ హీనమయిన సానుమతి. పూర్ణచంద్రుడు గలది. రాక అని చెప్పబడింది.

చంద్రుని కలలు పదహారు అవి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | అమృతా | 5. | పుష్టి | 9. | చంద్రికా | 13. | ప్రీతి |
| 2. | మానదా | 6. | రతి | 10. | కాంతి | 14. | అంగదా |
| 3. | పూసా | 7. | ధృతి | 11. | జ్యోత్స్నా | 15. | పూర్ణా |
| 4. | తుష్టి | 8. | శశిని | 12. | శ్రీ | 16. | పూర్ణాంమృతా |

అయితే తిథులు పదిహేను. అందుచేత ఒక కళ తగ్గినట్లైతే పూర్ణచంద్రుడు అవుతాడు. కాబట్టి రాకేందువదనా – పూర్ణ చంద్రుని వంటి ముఖము గలది. షోడశకలా ప్రపూర్ణుడగు చంద్రునివంటి ముఖము గలది.

ఇక్కడ పూర్ణచంద్రుడు అని చెప్పటం పరమేశ్వరి వృత్త రూపంలో అంటే బిందురూపంలో ఉన్నది అని చెప్పటమే. నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ బిందురూపంలో ఉన్నాడు. బిందువు అంటే గుండ్రంగా ఉంటుంది కాబట్టి వృత్తము అని చెప్పవచ్చా? లేదు. ఎందుకంటే, వృత్తము అంటే గుండ్రంగా ఉండే గీత. అయితే మధ్యభాగం అంతా శూన్యం కావచ్చు ఇంకేదయినా కావచ్చు. కాని బిందువు అన్నప్పుడు మధ్యభాగం అంతాకూడా ఆ బిందువు ఆవరించి ఉంటుంది. పెనంమీద వేసిన అట్టులాగా మధ్యభాగం అంతా బిందువు ఆక్రమించి ఉంటుంది. అనగా బిందురూపుడైన పరమేశ్వరుడు చరాచర జగత్తంతా ఆవరించి ఉన్నాడు అని చెప్పటానికి ఇది సంకేతము. అందుచేత ఈనామం ద్వారా పరమేశ్వరి బిందుమండలరూపిణి అని చెబుతున్నారు. ఈ నామం బిందు సంకేతం.

## 315. రతిరూపా

**రతి రేవ రూపం యస్యాః కామపత్నీత్వాత్**

మన్మథుని భార్య అయిన రతీదేవి వంటి రూపము గలది. పరమేశ్వరుడు కామేశ్వరుడనబడుచున్నాడు కాబట్టి అతని భార్య కామేశ్వరి. రతిరూప అనబడుతోంది.

రతిరూపా అంటే – ఈకారము. రాకేందువదనా అంటే – బిందువు. ఈ రెండు కలిసి ఈంకార రూపము గల దేవి – కామకలారూపము.

ఈ కారము మాయా బీజము. ఈం అనేది కామకలా రూపము అని భాస్కరరాయవారు వ్యాఖ్యానించారు.

బీజాక్షర నిఘంటువునందు ఈ కారాన్ని వివరిస్తూ

**మాయాదైవత్వ మీకారం । మహామాయాం వశీకరం**
**అంతర్మాయా జగద్విశ్వం । వశీకర్యం వరాననే ! ॥**

అని చెప్పబడింది. అయితే రమా అంటే శ్రీకారము లక్ష్మీ బీజము చెప్పాలి. అనేది ఒక సంప్రదాయం. శ్రీ అనేది లక్ష్మీబీజం

**శకారం లక్ష్మీబీజం చ । పంచలక్ష్మ్యేణ సిద్ధ్యతి ।**
**లక్ష్మీవ స్యాతి సిద్ధిస్యాత్ । చక్రవర్తిత్వ మాప్నుయాత్ ॥**

కాబట్టి 313, 314 నామాలలో కామకలా బీజము చెప్పి కామకలా మంత్రోద్ధారము సూచించబడుతుంది.

## 316. రతిప్రియా

మన్మథుని భార్య అయిన రతీదేవికి ప్రియురాలు. రతము అనగా భోగము. భోగము ప్రియముగా గలిగినది.

రతీదేవియందు ప్రీతి గలిగినటువంటిది. తాను రతిరూపము కాబట్టి తనరూపమే అయిన రతీదేవి యందు ప్రీతి కలిగి ఉంటుంది.

గిరిజా కల్యాణం సందర్భంగా మన్మథుడిని భస్మం చేశాడు శంకరుడు. భండాసురవధ తరువాత ఆ మన్మథుణ్ణి పునర్జీవుడుగా చేసింది పరమేశ్వరి. కాబట్టి రతీదేవికి పరమేశ్వరి యందు మక్కువ ఎక్కువ.

## 317. రక్షాకరీ

రక్షణ కలిగించేది. రక్ష అనగా భస్మము. లోకనాశనము చేసేది.

పరమేశ్వరి తన భక్తులను మంచి మార్గంలో సంచరించేటట్లు చేసి వారిని రక్షిస్తుంది. దుష్టులు దుర్మార్గులు చేసే అభిచారికా ప్రయోగాలనుండి తన భక్తులను సదా కాపాడుతుంటుంది.

రక్షణ అంటే జగద్రక్షణ. జీవులను సృష్టించిన తరువాత, వాటిని పోషించే బాధ్యతకూడా ఆ పరమేశ్వరిదే. వారికి ఆరోగ్యము, జీవనోపాది, ఆపదల నుంచి రక్షణ. అంతా ఆ పరమేశ్వరియే చేస్తుంది. అందుచేతనే ఆమె రక్షాకరీ అనబడుతుంది. ఇతర దేవతలు కొన్ని రకాల రక్షణలు మాత్రమే ఇస్తారు. కాని పరమేశ్వరి అన్ని రకాలుగా రక్షణ ఇచ్చి తన భక్తులను కాపాడుతుంది.

## 318. రాక్షసఘ్నీ

రాక్షస సంహారము చేయునది. దేవతలను ద్వేషించేవారిని, అధర్మపరులను, అసత్యవాదులను, దైత్యులను, దానవులను, ఈ దేహమే ఆత్మ అని విర్రవీగే అజ్ఞానులను, అవైదికాచారులను, దుష్టులను, దుర్మార్గులను సంహరిస్తుంది. స్థితి కార్యక్రమం విష్ణువుది. కాని విష్ణుమూర్తికి కూడా శక్యం కానటువంటి రాక్షసులను పరమేశ్వరి సంహరిస్తుంది. ద్వాపరయుగంలో శ్రీకృష్ణునికి కూడా చేతకాని నరకాసుర సంహరం చేసింది. అలాగే మహిషాసుర సంహారం చేసింది. భండాసురుని సంహరించింది. ఇంకా శుంభ నిశుంభులను దుర్గముడిని, విప్రచిత్తీయ వంశస్తులను, ఈ రకంగా అనేకానేక మంది రాక్షసులను సంహరించి భక్తజనులను రక్షించింది. ధర్మాన్ని ఉద్ధరించింది.

బయట ఉండే రాక్షసులను శత్రువులనే కాదు. అరిషడ్వర్గాలనబడే అంతశ్శత్రువులను కూడా నాశనం చేస్తుంది. రాజ్ఞీమంత్రం అనుష్ఠానం చేస్తే ఫలితము ఏమిటో ఈ నామం చెబుతోంది.

## 319. రామా

స్త్రీ మాత్ర స్వరూపముగలది. యోగులు ఈమెను రమిస్తారు. అంటే ఈమె సన్నిధిలో ఆనందిస్తారు. లింగపురాణంలో

**శంకరః పురుషా సర్వే స్త్రియస్సర్వా మహేశ్వరీ**

పురుషులందరు శంకర స్వరూపులు. స్త్రీలందరూ గౌరీ స్వరూపులు అని చెప్పబడింది. అలాగే విష్ణుపురాణంలో పురుషులందరూ విష్ణు స్వరూపులు స్త్రీలందరూ లక్ష్మీస్వరూపులు అని చెప్పబడింది. బ్రహ్మవైవర్త పురాణంలో ముల్లోకాలలోను కనిపించేది దేవి. అది ఆమె రూపము. అని చెప్పబడింది. బృహత్పరాశర స్మృతిలో

**స్త్రియ స్తుష్టాః స్త్రియో రుష్టా తుష్టా రుష్టా శ్చ దేవతాః**
**వర్ధయంతి కులం తుష్టా నాశయన్త్వవమానితాః ॥**

స్త్రీలు కోపించినట్లైతే దేవతలు కోపిస్తారు. స్త్రీలు ఆనందించినట్లైతే దేవతలు ఆనందిస్తారు. స్త్రీలు ఆనందిస్తే కులము అభివృద్ధి అవుతుంది. స్త్రీలను అవమానిస్తే వంశనాశనం అవుతుంది అని చెప్పబడింది. అందుచేతనే "కలకంఠి కంటి కన్నీ రొలకిన సిరి ఇంట నుండనొల్లదు" అని చెప్పారు.

శ్రీయే – లక్ష్మి – ఆమెయే రామా అనబడుతుంది. ఆమె నిత్యము ఆనందమయి కాబట్టి రామా అనబడుతుంది. యోగుల హృదయాలతో రమిస్తుంది. కాబట్టి రామా అనబడుతుంది. ఇది – రేఫ

## 320. రమణలంపటా

పరమేశ్వరి జగత్తులోని సకల స్త్రీరూపిణి. అందుచేత వారు తమ తమ భర్తలతో ఆనందించుటయందు ఆసక్తి గలది. రమించుటయందు ఆసక్తి గలది. కామేశ్వరునియందు ఆసక్తి గలది. స్వాత్మయందు రమించుటలో ఆసక్తి గలది.

రమణుడు – కామేశ్వరుడు. కామేశ్వరునితో ఏకత్వము గలది. కాబట్టి రమణ లంపటా అనబడుతోంది రామా – రమణునియందు ఆసక్తి కలది.

రమణుడు అంటే – నాధుడు, బ్రహ్మ, ఆత్మ అని అర్థం. నాధుని యందు ఆసక్తి కలిగి ఉండటము పతివ్రతా లక్షణము. పరబ్రహ్మయందు ఆసక్తి గలిగినది. – ఆనంద స్వరూపిణి.

305 నుండి 320 వరకు నామాలన్నీ రకారంతోనే ప్రారంభమవుతాయి.

ఈ రకంగా 313 నుండి 320 వరకు ఎనిమిది నామాలలోను మహాలక్ష్మి మంత్రాన్ని వివరించటం జరిగింది.



శ్రీ 'ఐ'కార దేవి

## 26. కామకల

చంద్రుని యొక్క కళలు పదహారు. పాడ్యమి నుంచి పూర్ణిమి వరకు తిథులు పదిహేను. కాగా పదహారవ కళ సాక్షాత్తూ ఆ పరమేశ్వరి అయి ఉన్నది.

**షోడశీ తు కళా జ్ఞేయా సచ్చిదానంద రూపిణీ ॥**

అంటే పరమేశ్వరియే షోడశీకళ. సాదాఖ్యకళ, చిత్కళ, ధృవకళ, బ్రహ్మకళ, పరమాకళ, కామకళ అని పిలువబడుతోంది.

కామము అంటే కోరిక. సాధకుని కోరికలు తీర్చేకళ. అదే కామకళ. సాధకుడి కోరికలు అనేకానేకాలు ముఖ్యంగా అవి రెండు రకాలు 1. ఇహము 2. పరము. ఇహానికి సంబంధించినవి అర్ధకామాలు. పరానికి సంబంధించినవి ధర్మమోక్షాలు. సంసార లంపటంలో కూరుకుపోయిన మానవుడు తన కష్టాలన్నీ తీరిపోవాలని, సుఖాలు పొందాలనుకుంటాడు. అందుకోసం ధన సంపాదన కావాలి. ఈ రెండింటి కోసమే అతడు ప్రాకులాడతాడు. అయితే ఉత్తర జన్మ ఉత్తమ జన్మ కావాలంటే ధర్మము తప్పనిసరి. దానిద్వారానే మోక్షప్రాప్తి కలుగుతుంది. ఈ రకంగా భక్తులకు చతుర్విధ పురుషార్ధాలను తీర్చేది ఆ పరమేశ్వరియే. అందుచేతనే ఆమె భక్తులయొక్క కోరికలు తీరుస్తుంది. కాబట్టి కామకల అనబడుతుంది.

ఇది సచ్చిదానంద స్వరూపము. కాబట్టి బిందుమండలంలో ఉంటుంది. అనగా శ్రీచక్రంలోని బిందువులో ఈ పరమేశ్వరి ఉంటుంది. మరి అక్కడ ఒక్క పరమేశ్వరియే ఉంటుందా? అన్నప్పుడు ఆ దేవి పరబ్రహ్మ స్వరూపము. అంటే శివశక్తుల సమ్మేళనము. కాబట్టి 'శివేన వినాశక్తిః' శివుడు లేకుండా శక్తి లేదు.

శక్తి లేకుండా శివుడు లేడు. ఇద్దరూ కలిసిన 321 నుంచి 330 దాకా నామాలలో కామకలను వివరించటం జరిగింది. కామకలా విలాసము అనే 55 సూత్రాలున్న గ్రంథాన్ని పుణ్యానంద మునీంద్రుడు వ్రాశాడు. దాన్ని గతంలో వివరించాం.

కామకలారూపా – అనే నామంలో కామకలను వివరించటం జరిగింది. ఆ దేవి యొక్క తత్త్వాన్ని వివరిస్తూ ఆమె కదంబ కుసుమప్రియ, మంగళ స్వరూపమైనది, చరాచర జగత్తుకూ మూలాధారమైనది. ఆమె కలాస్వరూపిణి. కలలు అంటే విద్యాకళలు, వృత్తి కళలు, దేవతా కళలు, షోడశ కళలు వీటన్నింటి స్వరూపము ఆ పరమేశ్వరి. ఆ దేవి మృదుమధురమైన వాక్కు గలిగినది. జగత్తులోని స్త్రీత్వమంతా ఆమెలోనే ఉన్నది. ఉత్తమమైన మధువును సేవిస్తుంది. మహిషాసురునితో యుద్ధం చేసేటప్పుడు ఆ రాక్షసుడు గర్జిస్తుంటే

**గర్జ గర్జ క్షణం మూఢా మధు యావ త్పిబా మ్యహమ్**

ఓరి మూర్ఖుడా ! నేను ఈ మద్యము తాగేవరకు నువ్వు గర్జిస్తూ ఉండు అంటుంది.

మరి ఇటువంటి కామకలను అర్చిస్తే వచ్చే ఫలితము ఏమిటో చెబుతున్నాడు. ఆ పరమేశ్వరి కరుణామృతసాగరా. కరుణా సముద్రురాలు. భక్తులందరి కోరికలు తీరుస్తుంది. దయాసముద్రురాలు. ఆమె కామ్యా అనబడుతోంది. అంటే భక్తులయొక్క అన్ని కోరికలను తీరుస్తుంది. ఇహపరాలు రెండూ ఇస్తుంది. అందుచేతనే

**శ్రీ సుందరీ సేవన తత్పరాణాం భోగ శ్చ మోక్ష శ్చ కరస్థ ఏవ ॥**

అన్నారు. ఆ దేవిని అర్చిస్తే తీరని కోరిక అంటూ ఏదీ లేదు. ఇక నామాలను చూద్దాం.

## 321. కామ్యా

జ్ఞానముచే పొందబడినది. ముముక్షువులచే కోరదగినది.

ధర్మార్థకామాలను కోరేవారు ఇష్టాపూర్తి కర్మలను విధిగా ఆచరించాలి. వీటిలో ఇష్టకర్మలు అంటే – అగ్నిహోత్రము, జపము, సత్యవాక్పాలన, వేదాధ్యయనము, అతిథిపూజ, వైశ్యదేవము మొదలైనవి.

పూర్తికర్మలు అంటే – తోటలు పెంచటము, జలాశయాలు ఏర్పరచటము, సత్రాలు, దేవాలయాలు కట్టించటము అన్నదానము చెయ్యటము మొదలైనవి. ఈ రెండు విధాలయిన కర్మలు చేసేవారికి వారివారి కోరికలననుసరించి ధర్మార్థకామములు తీరతాయి. ఈ మూడింటినీ కలిపి త్రివర్గ ఫలములు అంటారు.

పరమేశ్వరి జ్ఞానరూపిణి. సాధకులు జ్ఞానభావంతో జీవాత్మ పరమాత్మ వేరుకాదు అని ఆ పరమేశ్వరుణ్ణి అర్చించినట్లైతే, అట్టివారికి మోక్షం ప్రసాదిస్తుంది. అందుచేత దేవి కామ్యా అనబడుతుంది. సృష్టి ప్రారంభం కాక ముందు పరమేశ్వరుణ్ణి సృష్టికి సుముఖునిగా చేసిన రూపవిశేషము ఆ దేవి. అందుకే ఆమె కామ్యా అనబడుతోంది.

కామము అనగా – కోరిక. ఈ కోరికలన్నీ బుద్ధివలన కలుగుతాయి. బుద్ధి జడపదార్థం. అయితే బుద్ధికి చైతన్యము కలిగినప్పుడు పూర్వజన్మలలో చేసిన కర్మానుసారము ఈ కోరికలు కలుగుతాయి. అంటే జీవుల స్థాయిని బట్టే కోరికలు కలుగుతాయి. అంతేకాని అంతకన్న ఎక్కువ కోరికలు కలగవు. పంది బురదలో

పడుకుందాము అనే అనుకుంటుందిగాని పట్టుపరుపులమీద పవళించాలనుకోదు. అందుకే భతృహరి సుభాషితాలలో

**క్రిమిసముదాయసంకులము కేవలనింద్యము పూతిగంధ హే**
**యమును నిరామిషంబును. ఖరాంగ భవంబగు నెమ్ము గుక్క తా**
**నమలుచు జెంతనున్న సురనాథుని గన్గొని సిగ్గు చెందద**
**ల్పమని నిజస్వభావము దలంపదు నీచపు ప్రాణియెయ్యెడన్**

కుళ్ళిపోయి, పురుగులు పడి, వాసన కొడుతున్న గాడిద యొక్క ఎముకను పీక్కుతింటూ కుక్క తన ప్రక్కనుంచుని ఉన్న దేవేంద్రుణ్ణి చూసి సిగ్గుపడదు. ఎందుకంటే అది నీచమైన జాతికి చెందినది. దానికర్మ ఫలము, సంస్కారము అంతే.

ఆ రకంగా జీవులకు తమ కర్మననుసరించి కోరికలు పుడుతుంటాయి. అయితే ఈ కోరికలు నాలుగురకాలుగా ఉంటాయి. అవి

1. తాత్కాలికంగా ఇప్పుడున్న కష్టాలు తొలగిపోయి సుఖాలు పొందాలి అనుకోవటం. ఇది కామము.

2. జీవించి ఉన్నంతవరకు దుఃఖము లేకుండా ఉండటము, సుఖాలు పొందాలి అనుకోవటము ఇది అర్ధము.

3. తనకు రాబోయే జన్మలలో దుఃఖం లేకుండా సుఖం పొందేటట్లు కోరటం. ఇది ధర్మము.

4. అన్ని జన్మలలోను నిత్యనిరతిశయ ఆనందాన్నే కోరటం. ఇది మోక్షము.

| | | |
|---|---|---|
| వీటిలో ధర్మాన్ని కోరేవాడు | – | ఉత్తముడు |
| అర్ధాన్ని కోరేవాడు | – | మధ్యముడు |
| కామాన్ని కోరేవాడు | – | అధముడు |
| మోక్షాన్ని కోరేవాడు | – | ఉత్తమోత్తముడు |

జీవులు వారి కర్మఫలాన్ననుసరించే ఈ కోరికలు కోరతాయి. ఈ కోరికలు అన్నీ తీరుస్తుంది. ఆ పరమేశ్వరి. అందుచేతనే ఆమె కామ్యా అనబడుతుంది.

పైన చెప్పిన కోరికలలో మొదటి మూడు సాపేక్ష కామములు కాగా నాల్గవది నిరపేక్ష కామము.

కృష్ణ, పక్ష ద్వాదశి నాటి రాత్రి తిథి కామ్యా.

## 322. కామకలారూపా

కామేశ్వరుని కలా విభూతి శక్తి కామకల అనబడుతుంది. పరమేశ్వరి ఇచ్ఛాశక్తి స్వరూపిణి అందుచేత కామకలా రూపా అనబడుతోంది.

కామకల మూడు విధాలుగా ఉంటుంది.

1. కామకలా విలాసములో చెప్పినట్లు

'కామకలా విలాసము' అనేది పుణ్యానంద మునీంద్రుడు వ్రాసిన 55 సూత్రాలతో కూడిన చిన్న గ్రంథము.

అకారరూపుడైన పరమేశ్వరుడు ప్రకాశాంశ. హకార రూపి అయిన పరమేశ్వరి విమర్శాంశ. ఈ రెండింటి సమ్మేళనము వలన అహం అనే ఆత్మ మంత్రమవుతున్నది.

శివశక్తి రూపమయిన రక్తశుక్ల బిందువుల యొక్క అన్యోన్య సమ్మేళన రూపమే సూర్యబింబము. ఇది మనోహరమైనది. మహాయోగులచే కోరబడునది. చంద్రాగ్నులే శరీరముగా గలది. ప్రకాశాత్మకమైన విమర్శ శక్తి రూపము గలది. అంటూ కామకలాంగనా రూపాన్ని కామకలా విలాసంలోని ఏడవ సూత్రంలో వివరించారు.

2. క్లీం కారము కామరాజ బీజము. అందులోని కకార లకారాలను వదలి కేవలము బిందువుతో కలిసిన ఈకారాన్ని (ఈం) వినేవారు, దాన్ని పలికేవారు అనన్య సామాన్యము పరమోత్కృష్టము అయిన పరమపదమును పొందుతారు.

**తా మీకారాక్షరోద్ధారాం సారా త్సారాం పరాత్పరాం ।**
**ప్రణమామి మహాదేవీం పరమానందరూపిణీమ్ ॥**

3. ఏ బీజము ప్రధానమవటంచేత షోడశాక్షరీ మంత్రం శ్రీవిద్యగా ప్రఖ్యాతి చెందినదో, అది ప్రకాశ విమర్శాంశలయిన శివశక్తుల స్వరూపము. అదే షోడశకలా స్వరూపము. నిత్యాకలా స్వరూపము. సర్వకామ ప్రదము. అది ఏకాక్షరీ మంత్రము. దానినే జపం చెయ్యాలి.

**అగ్రబిందు పరికల్పితాననాం మధ్యబిందు రచిత స్తనద్వయీం**
**నాదబిందు రశనాగుణాస్పదాం నౌమి తే పరశివాం పరాం కళామ్ ॥**
**ఈకారోర్ధ్వగతో బిందు ర్మఖం భాను రథోముఖౌ**
**స్తనౌ దహనశీతాంశూ యోనిర్ధ్వార్ధ్వా కలా భవేత్ ॥**

సూర్య మండల స్వరూపమైనట్టి మిశ్రమ బిందువు ముఖముగా,

శుక్ల రక్త బిందువులు - స్తనద్వయంగా

సంవిద్బిందువు - కటిప్రదేశంగా

ఇది కామకలా స్వరూపము. ఆకారము గుణము లేనటువంటిది. పరమేశ్వరి ఇక్కడ అన్నీ తానే అయినది కాబట్టి కామకలారూపా అనబడుతోంది. శంకర భగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 19వ శ్లోకంలో కామకలను వర్ణిస్తూ

**ముఖం బిందుం కృత్వా కుచయుగ మథ స్తస్య తదధో**
**హరార్ధం ధ్యాయే ద్యోహరమహిషి తే మన్మథకలామ్**
**స సద్య స్సంక్షోభం నయతి వనితా ఇ త్యతి లఘు**
**త్రిలోకీ మప్యాశు భ్రమయతి రవీందు స్తనయుగామ్ ॥**

ఓ తల్లీ ! నీ ముఖమును బిందువుగా చేసి, దాని క్రిందుగా కుచయుగమునుంచి, దాని క్రిందగా త్రికోణముంచి, నీ మన్మథకలను ఎవరు ధ్యానిస్తారో వాడు మరుక్షణంలోనే లోకంలోని స్త్రీలందరినీ సంక్షోభితులను చేస్తున్నాడు. అంతేకాదు ముల్లోకాలను మోహింపచేస్తున్నాడు అన్నారు.

ఈ విధంగా ఆ పరమేశ్వరి కామకలా రూపాన్ని ధ్యానించేవాడు ముల్లోకాలను వశం చేసుకోగలుగుతాడు.

త్రిపురా సిద్ధాంతంలో "ఓ పార్వతీ ! కామేశ్వరీ కామేశ్వరుల విలాసమే (రూపమే) కల. అందుకే అది కామకల అనబడుతోంది" అని చెప్పారు.

మంత్రశాస్త్రంలో కామకళా మంత్రము ఉన్నది.

**అస్యశ్రీ కామకళాంబా మహామంత్రస్య । మన్మథ ఋషిః । జగతీచ్ఛందః । శ్రీ కామకళాంబా దేవతా। ఈం బీజం। ఈం శక్తిః । ఈం కీలకం । జపే వినియోగః ।**

**న్యాసము : ఆం । ఈం । ఊం । ఐం । ఔం । అః ॥**

**ధ్యానము : పంకజపాశేషు ధనుః కింశుక శాల్యగ్ర పుష్పబాణ ధరాం ।**
**సతతం అభయవరహస్తాం కలయే కామకళాధరీ మంబామ్ ॥**

**మంత్రము : హ స క ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । క ల హ్రీం। ల హ్రీం । హ్రీం । ఈం ॥**

## 323. కదంబకుసుమప్రియా

కదంబ కుసుమము లందు ప్రీతిగలది. కదంబ వృక్షాన్ని నీప వృక్షము, కడిమిచెట్టు అంటారు. ఈ వృక్షాలు మేఘాలు గర్జించినప్పుడు మొగ్గలు వేస్తాయి. ఎర్రని రంగులో ఉండే పూలను గుత్తులుగుత్తులుగా పూస్తాయి. ఇవి త్రిపురాంతకంలో చెరువుగట్టున అదికూడా తొమ్మిదిమాత్రమే ఉన్నాయి.

కదంబ వృక్షంలో చాలా రకాలున్నాయి.

1. ధారాకదంబ, 2. భూమికదంబ 3. ధూళికదంబ 4. రాజధూళికదంబ 5. రాజకదంబ.

వీటన్నింటిలోకీ రాజకదంబము పెద్దవృక్షము. కడిమిచెట్టు ఆకు జీడిమామిడి ఆకులాగా ఉంటుంది. ఈ చెట్టు బెరడు దళసరిగా ఉంటుంది. చెట్టుకు సన్నని ఊడల వంటి కాడలు కూడా ఉంటాయి. దీని పూలు గుండ్రంగా, ఎర్రనిరంగులో, చిన్నవిగా ఉంటాయి. మంచి వాసన కలిగి ఉంటాయి. వర్షాకాలంలో ఈ చెట్టు పూలు పూస్తుంది. ఈ పూల నుంచి వచ్చే రసము చల్లగా, తియ్యగా ఉంటుంది. విషాన్ని హరించి వేస్తుంది. శరీరతాపాన్ని తగ్గిస్తుంది. ఈ రసము త్రిగుణ హరి. అంటే వాత, కఫ, పిత్తములను హరిస్తుంది. వీర్యవృద్ధి శరీరానికి మంచి కాంతిని కలిగిస్తుంది.

కదంబ వృక్షాన్నే రుద్రాక్ష వృక్షమని, భూతనాశనమని కూడా అంటారు. అని నాట్కర్ణి వృక్షశాస్త్రంలో చెప్పబడింది.

పరమేశ్వరికి కదంబ వృక్షాలన్నా, వాటి పూలు అన్నా మక్కువ ఎక్కువ. ఆమె ఎల్లవేళల యందు కదంబవనంలోనే ఉంటుంది. కదంబ పుష్పాల నుంచి వచ్చే మధువును త్రాగుతుంది.

## 324. కల్యాణీ

మంగళ స్వరూపము గలది. మంగళప్రదమైనది. సర్వదా శుభములు చేకూర్చునది. కల్యాణమే రూపముగా గలది. పరమేశ్వరి కల్యాణానంద స్వరూపిణి అందుచేత కల్యాణీ అనబడుతోంది.

శుభకరమైన వాక్కులను పల్కునది. మలయాచలమునందు ఉండే దేవి కల్యాణి. పరమేశ్వరి కదంబ కుసుమప్రియ కాబట్టి కల్యాణి అనబడుతున్నది.

## 325. జగతీకందా

లోకాలన్నింటికీ మూలమైనది. లోకాలను నిండించునది. కందము అంటే – వేరు, మూలము, మేఘము అని అర్థం.

దృశ్యరూపమైన ఈ చరాచర జగత్తుకు మూలమైనది. మాయాస్వరూపిణి. మూలప్రకృతి. ఈ జగత్తంతా నామరూపాత్మకమైనది. నామానికి, రూపానికి కూడా ఆ పరమేశ్వరియే మూలమై ఉన్నది. పరమేశ్వరియే పరబ్రహ్మ కాబట్టి ఆమే ఈ చరాచర జగత్తుకూ మూలాధారము. ఆమే పరబ్రహ్మ స్వరూపిణి అందుచేతనే ఆ దేవి జగతీకందా జగత్తుకంతటికీ అఖిలాండకోటి బ్రహ్మాండాలకు మూలమైనటువంటిది అనిచెప్పబడింది.

## 326. కరుణారససాగరా

కరుణా స్వరూపము, దయారసము గల సముద్రమువంటిది. అంటే ఆ పరమేశ్వరి దయ అపారమైనది. అవధులు లేనటువంటిది. అందుకే దయాసముద్రురాలు.

ప్రపంచంలో ఏ తల్లికైనా తన బిడ్డలమీద, ప్రేమ, దయ, వాత్సల్యము ఉండటం సహజము. అది తమ బిడ్డలవరకే పరిమితము. కాని పరమేశ్వరికి లోకంలోని జీవులన్నీ బిడ్డలే. వారు చేసిన కర్మనుంచి తప్పించటానికి శతవిధాల ప్రయత్నిస్తుంది. ఎన్ని పాపాలు చేసినా, ఒక్కసారి తాను చేసిన వాటికి పశ్చాత్తాపపడి ఆ పరమేశ్వరిని మనసారా గనక ధ్యానించినట్లైతే, అతడికి ఉత్తమగతులు ప్రసాదిస్తుంది.

## 327. కలావతీ

**చతుష్షష్టి సంఖ్యాః కలా ఆస్యాస్సంతీతి కలావతీ**

అరవైనాలుగు కళలు గలది.

చతుష్షష్ఠి కళలు అంటే – వృత్తి కళలు, లలిత కళలు అని గతంలో వివరించాం. కాని ఇప్పుడు పరమేశ్వరుని కళలను చూద్దాం.

అగ్నికళలు, సూర్యకళలు, చంద్రకళలు, బ్రహ్మకళలు, విష్ణుకళలు, రుద్రకళలు, ఈశ్వర కళలు, సదాశివ కళలు ఈ రకంగా అన్ని రకాల కళలు కలిగి ఉన్నటువంటిది. అగ్ని కళలు పది అవి

| | | |
|---|---|---|
| 1. ధూమ్ర | 5. విస్ఫులింగినీ | 9. హవ్యవాహిని |
| 2. ఊష్మ | 6. సుశ్రీ | 10. కవ్యవాహిని |
| 3. జ్వలినీ | 7. సురూపా | |
| 4. జ్వాలినీ | 8. కపిలా | |

సూర్యకళలు పన్నెండు అవి

| | | |
|---|---|---|
| 1. తపిని | 5. జ్వాలిని | 9. విశ్వా |
| 2. తాపిని | 6. రుచి | 10. బోధిని |
| 3. ధూమ్రా | 7. సుషుమ్న | 11. ధారిణి |
| 4. మరీచి | 8. భోగదా | 12. క్షమా |

చంద్రకళలు పదహారు అవి

| | | |
|---|---|---|
| 1. అమృతా | 7. ధృతి | 13. ప్రీతి |
| 2. మానదా | 8. శశిని | 14. అంగదా |
| 3. పూషా | 9. చంద్రిక | 15. పూర్ణా |
| 4. తుష్టి | 10. కాంత | 16. పూర్ణామృతా |
| 5. పుష్టి | 11. జ్యోత్స్న | |
| 6. రతి | 12. శ్రీ | |

బ్రహ్మకళలు పది అవి

| | | |
|---|---|---|
| 1. సృష్టి | 5. కాంతి | 9. స్థితి |
| 2. బుద్ధి | 6. లక్ష్మి | 10. సిద్ధి |
| 3. స్మృతి | 7. ద్యుతి | |
| 4. మేధా | 8. స్థిరా | |

విష్ణు కళలు పది అవి

| | | |
|---|---|---|
| 1. జరా | 5. రతి | 9. ప్రీతి |
| 2. పాలిని | 6. కామికా | 10. దీర్ఘా |
| 3. శాంత | 7. వరదా | |
| 4. ఈశ్వరి | 8. హ్లాదిని | |

రుద్రకళలు పది అవి

| | | |
|---|---|---|
| 1. తీక్షణ | 5. తంత్ర | 9. ఉద్గార |
| 2. రౌద్రి | 6. క్షుధా | 10. మృత్యు |
| 3. భయా | 7. క్రోధిని | |
| 4. నిద్రా | 8. క్రియా | |

ఈశ్వర కళలు నాలుగు అవి

1. పీతా  2. శ్వేతా  3. అరుణా  4. అసితా

సదా శివకళలు పదహారు అవి

| | | |
|---|---|---|
| 1. నివృత్తి | 7. రోచిక | 13. జ్ఞానామృతా |
| 2. ప్రతిష్ఠా | 8. మోచిక | 14. ఆప్యాయిని |
| 3. విద్యా | 9. పరా | 15. వ్యాపిని |
| 4. శాంత | 10. సూక్ష్మ | 16. వ్యోమరూప |
| 5. ఇంధక | 11. సూక్ష్మామృతా | |
| 6. దీపిక | 12. జ్ఞానా | |

ఈ కళలన్నీ కలిగి ఉన్నది కాబట్టి కళావతీ అనబడుతోంది. వేదాలు వేదాంగాలు, స్మృతులు, పురాణాలు మొదలైన విద్యాకళలు కలిగిఉన్నది.

ఇవి కాక షోడశకళలు అని విడిగా ఉన్నాయి. ప్రశ్నోపనిషత్తులో సుకేసుడు అనే విద్యార్థి పిప్పలాద మహర్షిని అడుగుతాడు. "గురుదేవా! షోడశకళా ప్రపూర్ణుడు అంటే ఎవరు? అతడెక్కడుంటాడు?" నాకు తెలియజేయవలసినది.

ఆ మాటలు విన్న పిప్పలాదుడు చెబుతున్నాడు. "సుకేశా ! నువ్వడిగిన పదహారు కళలు గలిగినవాడు పురుషుడు. ఆ కళలన్నీ అతన్నుండే పుడుతున్నాయి.

షోడశ కళలు

| | | |
|---|---|---|
| 1. ప్రాణము | 7. భూమి | 13. వేదమంత్రాలు |
| 2. శ్రద్ధ | 8. ఇంద్రియాలు | 14. కర్మలు |
| 3. ఆకాశము | 9. మనస్సు | 15. లోకాలు |
| 4. వాయువు | 10. అన్నం | 16. ప్రాణులపేర్లు |
| 5. అగ్ని | 11. బలం | |
| 6. జలము | 12. తపస్సు | |

ఈ రకంగా అన్ని కళలకు రూపమయినది ఆ పరమేశ్వరి. అందుకే ఆమె కళావతి అనబడింది.

## 328. కలాలాపా

**కలా ఏవ ఆలాపో భాషణం యస్యాః**

కళలే సంభాషణగా గలది. ఇంపైన మాటలు గలది. కలా అంటే – మధురధ్వని అని అర్థం.

కం అంటే – బ్రహ్మ. అతని లాలాజలమువలె సులభముగా పొంద దగినది. అంటే, ఆ పరమేశ్వరి గనక అనుగ్రహించినట్లైతే సులభంగా బ్రహ్మను అంటే ఆత్మసాక్షాత్కారము పొందవచ్చును.

పరమేశ్వరి యొక్క ఆలాపనయే కల. వేదము సర్వానికి ఆదికల. అంటే మొదటగా పుట్టింది. ఇది సాక్షాత్తూ బ్రహ్మముఖం నుంచి వచ్చింది. వేదనాదము మధురంగా ఉంటుంది. అది పరమేశ్వరి ముఖం నుంచి వచ్చింది కాబట్టి ఇంకా మధురంగా ఉంటుంది. అటువంటి మృదుమధురమైన వాక్కులు దేవిముఖం నుంచి రావటంచేతనే ఆమె కలాలాపా అనబడుతోంది.

## 329. కాంతా

కమనీయురాలు, మిగులచక్కనిది. కం అంటే – బ్రహ్మ. అంతః – సిద్ధాంతము గలది. దేవి పరబ్రహ్మ స్వరూపము గలది

**అభిరూపతమం దేహం వహన్ కాంతః**

మిక్కిలి చక్కనైన రూపం గలది కాబట్టి కాంతా అనబడుతోంది. పరమ మనోహరమైన రూపం గలది. జగత్తులోని స్త్రీ జాతి రూపముగలది. కాబట్టి కాంతా అనబడుతుంది.

## 330. కాదంబరీ ప్రియా

**కాదంబరీ ఉత్తమామదిరా సైవ ప్రియా యస్యాః**

కాదంబరి అనగా ఉత్తమమైన కల్లు ప్రియముగా గలది. త్రిపురోపనిషత్తులో

**పరిస్రుతం ఝషమాద్యం పలం చ భక్తాని యోనీస్సుపరిష్కృతాని నివేదయన్ దేవతాయై మహాత్యై స్వాత్మీకృత్య సుకృతీ సిద్ధి మేతి**

మదిర, చేపలు, మాంసము, ఉడికిన పప్పు, యోనులను దేవికి నివేదన మొనర్చి పుణ్యాత్ముడు సిద్ధి పొందుతున్నాడు. అని చెప్పబడింది.

కాదంబరి అంటే – కదంబ పుష్పముల నుండి తీసిన మద్యము, సరస్వతి, ఆడుకోయిల అని అర్థం చెబుతోంది సూర్యరాయాంధ్ర నిఘంటువు. కదంబపుష్పముల నుండి తీసిన మధువునందు ప్రీతిగలది.

సరస్వతీదేవి యందు ప్రీతిగలది. అందుచేత ఆ దేవి కాదంబరీ ప్రియా అనబడుతోంది.

ఈ రకంగా 321 నుంచి 330 నామాలవరకు కామకలను వివరించటం జరిగింది. ఈ పది నామాలు కకారంతోనే ప్రారంభమవుతాయి.

**క కారం కామరూపంచ**

**విషభు గ్భుహ్మ బీజకం**

అంటోంది. బీజాక్షర నిఘంటువు.

కాబట్టి కకారము బ్రహ్మబీజం కావటం దానితోనే కామకలను వివరించే నామాలు ప్రారంభం కావటం అత్యంత విశేషం.



శ్రీ 'ఓ'కార దేవి

# 27. పరమేశ్వరీ ధ్యేయరూపము

పరమేశ్వరి ఈ జగత్తును సృష్టిస్తోంది. ఆమెయే సృష్టి స్థితి సంహార కారిణి. అయితే అసలు ఎందుకు ఈ సృష్టిని చేస్తోంది? జీవులయొక్క కర్మని క్షయం చేసి, వాటన్నింటికీ మోక్షం కలిగించాలనే కోరికతో ఈ సృష్టిని చేస్తోంది. జీవిని సృష్టించి వదిలేస్తే సరిపోదు. దానికి సన్మార్గం చూపించాలి. సన్మార్గంలో ప్రవర్తించేవారికి సత్ఫలితాన్ని ఇవ్వాలి. అంటే చేసిన పనికి ఫలితం కనిపించాలి. మంచి పనిచేస్తే మంచి ఫలితము, చెడ్డ పనికి చెడు ఫలితము వస్తుంది అని జీవులకు తెలియచెయ్యాలి. అప్పుడు అవి సన్మార్గంలో ప్రవర్తిస్తాయి. దానివల్ల పుణ్యలోకాలు పొందుతాయి. ఉత్తమజన్మలు పొందుతాయి. అలా కొన్ని జన్మలు జరిగిన తరువాత ఐహిక సుఖాలమించి జ్ఞానవైరాగ్యాల వైపుకు మనసు మళ్ళుతుంది. అందులో బాగాసాధన చేస్తే మోక్షం సిద్ధిస్తుంది. ఈ రకంగా జీవులన్నింటికీ మోక్షం సిద్ధింపచెయ్యాలనేది ఆ పరమేశ్వరి ధ్యేయము. అందుకే ఆమె ఈ జగత్తును సృష్టిస్తోంది. ఈ కల్పంలో కర్మ పరిపక్వం కాకపోతే మళ్ళీ కల్పంలో పునర్జన్మ ఎత్తాల్సిందే ఈ రకంగా జీవి పుడుతూనే ఉండాలి. కర్మలు చేసి వాటి ఫలితాన్ని అనుభవించాలి. జీవి చేసిన కర్మలకు సరి అయిన ఫలితమందించటమే ఆమె ధ్యేయం.

ఆ పరమేశ్వరి కరుణా సముద్రురాలు. భక్తులయొక్క కోరికలు ఎటువంటివైనా సరే తీరుస్తుంది. భక్తులు ఏ రకంగా అర్చించినా సంతోషిస్తుంది. బిడ్డ ఏం చేసినా తల్లికి ఆనందమే కదా? బిడ్డల కోరిక ఎటువంటిదైనా తల్లి తీరుస్తుంది. భక్తులు తనను అర్చించినప్పుడు వారి కర్మలకు వచ్చే ఫలితాన్ని ఎక్కువ చేస్తుంది. బిడ్డ కొంచెం చేసినా దాన్ని గొప్పగా భావించటం తల్లియొక్క లక్షణం.

ఆమె పరమానంద స్వరూపిణి. మధుపానం చేసి బాహ్యప్రపంచాన్ని మరచిపోయి బ్రహ్మానందమనుభవిస్తుంటుంది.

ఆమెకు ఆద్యంతాలు లేవు. ఈ సృష్టి ప్రారంభం కాకముందు నుంచీ ఆమె ఉన్నది. సృష్టి అంతం అయిన తరువాతకూడా ఉంటుంది. ఆమె వేదాంత వేద్య. ఆమెయొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసలే వేదాలు. నాలుగువేదాలు ఆమె ఉండే గృహానికి నాలుగు ద్వారాలు. ఆమె వింధ్యపర్వతం మీద ఉంటుంది. అదే సహస్రారం. అంటే భక్తులహృదయాలలోనే ఉంటుంది. అష్టదిగ్గజాలు, కుల పర్వతాల రూపంలో ఈ భూమిని ఆమే ధరిస్తున్నది. వేదాలను సృష్టించి బ్రహ్మకు సమర్పించినది ఆ పరమేశ్వరి. ఆమె బ్రహ్మమయి నాదరూపిణి.

ఆమె విష్ణుమాయ. నిరంతరము సాయుజ్యం కోరేయోగులు తెలుసుకోతగిన మార్గాన్ని మాయతో కప్పి ఉంచుతుంది. అర్హులైన వారికి మాత్రమే ఆ మార్గం దృగ్గోచరమవుతుంది.

ఈ రకంగా కర్మపరిపక్వం కాని జీవులకర్మలను క్షయం చేసి వారికి మోక్షం కలిగించాలనేదే ఆ పరమేశ్వరి ధ్యేయం. ఆ విషయాన్నే 331 నుంచి 340వరకు నామాలలో వివరించబడింది. ఈ నామాలన్నీ వకారంతోనే ప్రారంభమవటం ఇక్కడి విశేషము. ఇక నామాలను చూద్దాం.

## 331. వరదా

**అభిమతాన్ దదాతీతి వరదా**

భక్తులయొక్క మనోభీష్టములను తీర్చునది. ఉపాసకులైన బ్రహ్మావిష్ణువులకు వరములు ప్రసాదించునది. మత్స్య పురాణంలో నారదుడు "ఆ పరమేశ్వరి ఎల్లప్పుడు పైకెత్తబడిన హస్తములు కలది" అంటాడు. అంటే ఆమె ఎప్పుడూ ఇతరులకు ఇవ్వటమే కాని తీసుకోవటమనేది తెలియనిది. దేవీ భాగవతంలో పరమేశ్వరి హిమవంతుడి ఇంట హైమవతిగా జన్మించింది.

తనబిడ్డ యొక్క జాతకం చెప్పమని నారదుణ్ణి అడిగాడు హిమవంతుడు. అప్పుడు నారదుడు చెబుతాడు. "ఈ బిడ్డ సకల శుభలక్షణాలు కలది. ఈమె చేతులు ఎప్పుడూ పైకెత్తే ఉంటాయి. ఈమెకు భర్త అయ్యేవాడు ఇప్పుడు పుట్టలేదు" అంటాడు. ఆ మాటలకు భయపడిన మేనక మహర్షి మాటలకు వివరణ కోరుతుంది. అప్పుడు నారదుడు "ఆమె చేతులు ఎప్పుడూ పైకి ఎత్తే ఉంటాయి అంటే ఇవ్వటమే కాని పుచ్చుకోవటం తెలియనిది. ఎప్పుడూ తన భక్తులయొక్క కోరికలు తీరుస్తూనే ఉంటుంది. ఆమెకు భర్తకాబోయేవాడు ఇప్పుడు పుట్టలేదు. ఎప్పుడో పుట్టి ఉన్నాడు. అతడే ఈశ్వరుడు" అంటాడు. ఆమె నుండి వరాలు కోరేవారి కోరికలను తీర్చుతుంది కాబట్టి వరదా అనబడుతుంది. కోరికలు కోరేవారు దేవతలైనా, రాక్షసులైనా ఎవరైనా సరే వారి అభీష్టం నెరవేరుస్తుంది. పూర్వకాలంలో హయగ్రీవుడు అనే రాక్షసుడు 'నావంటి రూపంగలవాడితో తప్ప ఎవరిచేతా చావకుండా వరం కావాలి' అన్నాడు అతని కోరిక తీర్చింది పరమేశ్వరి. ఆ రాక్షస సంహారం కోసం విష్ణుమూర్తి హయగ్రీవుడుగా మారవలసివచ్చింది. వరాహ పురాణంలో

**నవమ్యాంచ సదాపూజ్యా ఇయం దేవీ సమాధినా**
**వరదా సర్వలోకానాం భవిష్యతి న సంశయః**

తొమ్మిదవ రోజున ఆ పరమేశ్వరిని సమాధితో పూజించినట్లైతే, ఆమె సర్వలోకాలకు వరాలిస్తుంది. దేవీభాగవతంలో

ఆశ్వీయుజమాసంలో శుద్ధపాడ్యమి నుంచి నవమి వరకు పరమేశ్వరిని పూజిస్తే భక్తులకు ఇష్టార్ధప్రాప్తి కలుగుతుంది. అని సుశీలుడు అనే వైశ్యుడికి, ఒక పండితుడు చెబుతాడు. ఆ రకంగానే చేసి ఇష్టార్ధసిద్ధి పొందుతాడు సుశీలుడు.

శంకరభగవత్పాదులవారు తమ సౌందర్యలహరిలోని 4వ శ్లోకంలో

**తదన్యః పాణిభ్యాం అభయవరదో దైవతగణః**
**త్వ మేకా నైవాసి ప్రకటితవరా భీత్యా భినయ**
**భయాత్త్రాతుం దాతుం ఫల మపిచ వాంఛా సమధికం**
**శరణ్యే ! లోకానాం తవ హి చరణా వేవ నిపుణౌ ॥**

తల్లీ ! ఇంద్రాది దేవతలవలె నీవు చేతులయందు వరద, అభయముద్రలు ధరించలేదు. ఎందుకంటే నీ పాదాలనాశ్రయించిన భక్తులకు భయాలు తొలగిపోతాయి. కోరికలు తీరతాయి. కోరినదానికన్న ఎక్కువ ఫలితం లభిస్తుంది.

పరమేశ్వరి చేతులయందు వరదాభయ ముద్రలుండవు. కాని ఆ దేవిని ఆశ్రయించిన వారికి సర్వాభీష్ట సిద్ధి కలుగుతుంది. అందుకే ఆమె వరదా అనబడింది.

## 332. వామనయనా

**వామాని సుందరాణి నయనాని నేత్రాణి ప్రమాణాని వా యస్యాః**

సుందరమైన కనులు గలది. చక్కని ప్రమాణములు గలది. కరుణాపూరితములు మనోహరములు అయిన నేత్రములు గలది. చేసిన కర్మలయొక్క ఫలము అధికము చేయునది. అష్టమూర్తులలోని వాడు వామదేవుడు. అతనికి, నయన - పొందించునది. అంటే శివసాయుజ్యము ప్రసాదించునది. మోక్షము నిచ్చునది.

## 333. వారుణీమదవిహ్వలా

వారుణి మత్-వరుణ సంబంధమై జలములు గలవాడు ఆదిశేషుడు. వేయిపడగలు గలవాడు.

**శింశుమారాత్మనా విష్ణుః భూరాదీనూర్ధ్వతః స్థితాన్ ।**
**దధ్రే । శేషతయా లోకాన్ । సప్తలోకా నథస్థితాన్ ॥**

ఆ పరమేశ్వరి యొక్క అనుగ్రహంతో శ్రీ మహావిష్ణువు శింశుమార రూపంలో ఊర్ధ్వలోకాలను, ఆదిశేషుని రూపంలో అధోలోకాలను మోయగలుగుతున్నాడు.

ఆదిశేషుడు భూమిని మోయటానికి ఏ రకంగా విహ్వలుడు కాడో, అలాగే ఆ పరమేశ్వరి కూడా విహ్వలకాదు.

వారుణీమదము అంటే – ఖర్జూర పండ్లరసము. ఇది వరుణుడికి ప్రియము. అటువంటి వారుణీ మదపానము చేసి వళ్ళు మరచిపోయినది. అంటే బాహ్య ప్రపంచాన్ని మరచి ఆత్మానందాన్ని పొందేది. యోగశాస్త్రంలో

**అథ శ్చోర్ధ్వం స్థితా నాడీ వారుణీ సర్వగామినీ ।**
**పూషా దిగ్దేవతా ప్రోక్తా వారుణీ వాయుదేవతా ॥**

శరీరంలో క్రిందికి పైకి సర్వత్ర సంచరించు వాయుసంచారం గల నాడిని వారుణి అంటారు. దీన్ని యోగసాధనతో అదుపులో ఉంచినట్లైతే సహస్రారం నుంచి అమృతం కురుస్తుంది. అప్పుడు యోగి ఆత్మానందాన్ని పొందుతాడు. వారుణీ విద్యను బ్రహ్మవిద్య అంటారు. పరమేశ్వరి ఎప్పుడూ ఈ స్థితిలోనే ఉండి పరమానందాన్ని అనుభవిస్తుంటుంది. కాబట్టి వారుణీ మదవిహ్వలా అనబడుతుంది.

## 334. విశ్వాధికా

**విశ్వస్మాత్ క్షిత్యాది శివాంతాత్ అధికోత్కృష్టా**

భూమినుండి శివుని అంతముదాకా అంటే శివాది క్షితిపర్యంతము ఉన్నటువంటి ఈ విశ్వముకన్న అధికురాలు.

**విశ్వాధికోరుద్రో మహర్షిః**

విశ్వాధికుడు రుద్రుడు మహర్షి అంటోంది శ్రుతి. అంటే బ్రహ్మస్వరూపిణి. ఆ పరమేశ్వరి ఈ విశ్వంకన్న ముందునుంచే ఉన్నది. కాబట్టి విశ్వాధిక అనబడుతుంది. కార్యముకన్న కారణము గొప్పది. కార్యమయిన విశ్వంకన్న కారణమయిన ఆ పరమేశ్వరి గొప్పది. అందుచేత ఆమె విశ్వాధికా అనబడుతుంది.

## 335. వేదవేద్యా

ఋగ్ యజు స్సామ అథర్వణ వేదములనబడే చతుర్వేదములచే తెలియబడినది. అన్నివేదాలచేత తెలియతగినవాడు ఆ పరమేశ్వరుడొక్కడే.

**శ్రీచక్రస్య చత్వారి ద్వారాణి చతుర్వేద రూపాణి**
**ద్వారప్రవేశేనైవ భవతి పరదేవతా సాక్షాత్కారః**

శ్రీచక్రము యొక్క నాలుగు ద్వారాలు నాలుగు వేదాలరూపాలు. ఆ ద్వారాలలో గనక ప్రవేశించినట్లైతే ఆ పరదేవత సాక్షాత్కారం జరుగుతుంది.

చింతామణి గృహనికి నాలుగు వేదాలు నాలుగు ద్వారాలు

| | | |
|---|---|---|
| పూర్వద్వారం | - | ఋగ్వేదం |
| దక్షిణ ద్వారం | - | యజుర్వేదం |
| పశ్చిమద్వారం | - | అధర్వణ వేదం |
| ఉత్తరద్వారం | - | సామవేదం |

**వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః**

జ్ఞాన ఘన స్వరూపమే వేదము. లోకంలోని సమస్త విషయాలు అంటే ప్రాణికోటికి తెలిసినవి, తెలియనవి అన్నీ వేదంలో ఉన్నాయి. అన్ని విషయాలను తెలిపేదే వేదము. ఏ విధమైన ప్రమాణాలవల్ల తెలుసుకోలేని విషయాలను తెలిపేదే వేదము.

ప్రపంచంలో ఉన్న అన్నిరకాల విజ్ఞానాన్ని బోధించేదే వేదము. అటువంటి వేదరూపంలో ఉండేది ఆ పరమేశ్వరి.

పరమేశ్వరిని గురించి తెలుసుకోవాలంటే ఉన్న మార్గం ఒక్కటే అదే వేదమార్గం. జ్ఞానమార్గం వేదాలసారము ఉపనిషత్తులు. ఆ ఉపనిషత్తులసారము మహావాక్యాలు. అటువంటి మహావాక్యాలవల్ల మాత్రమే తెలియబడేది ఆ పరమేశ్వరి. అందుచేతనే ఆమె వేదవేద్య అనబడుతుంది.

వేదమార్గంచేతనే కాని ఇతర మార్గాలచేత తెలియరానిది. మంత్రశాస్త్రంలో

1. శుద్ధవిద్య 2. సౌభాగ్యవిద్య 3. లోపాముద్రావిద్య 4. తురీయాంబా విద్య. ఈ నాలుగు విద్యలే నాలుగు వేదాలు. వీటివల్లనే ఆ పరమేశ్వరి తెలియబడుతుంది.

మనకు అనేక విషయాలు వేదాలవల్లనే తెలుస్తాయి. పక్షులకు రాత్రిపూట భూమి అంతా అగ్నిగోళంలా కనిపిస్తుంది. అందుచేతనే అవి భూమిమీద తిరగవు. ఈ జగత్తులో పధ్నాలుగు లోకాలున్నాయి. ఈ విషయాలన్నీ వేదంవల్లనే తెలుస్తున్నాయి. ఈ రకంగా సర్వవిజ్ఞానాన్ని మనకందించేది వేదము. అట్టివేదముచేతనే తెలుసుకోబడేది దేవి. అందుచేతనే వేదవేద్యా అనబడుతోంది.

## 336. వింధ్యాచలనివాసినీ

వింధ్యపర్వతమున నివశించునది. పద్మపురాణంలో

**త్రికూటేచ తథా సీతా వింధ్యే యా వింధ్యవాసినీ**

త్రికూట పర్వతం మీద సీత, వింధ్యపర్వతం మీద పరమేశ్వరి ఉంటారని చెప్పబడింది. సప్తశతి పదకొండవ అధ్యాయంలో

**వైవస్వతేఽ న్తరే ప్రాప్తే అష్టావింశతిమే యుగే ।**
**శుమ్భోనిశుమ్భశ్చై వాన్యుత్పత్స్యేతే మహాసురౌ ॥**
**నందగోపగృహే జాతా యశోదాగర్భసంభవా ।**
**తత స్తౌ నాశయిష్యామి వింధ్యాచలనివాసినీ ॥**

వైవస్వత మన్వంతరమందు ఇరవై ఎనిమిదవ మహాయుగంలో శుంభ నిశుంభులని ఇద్దరు రాక్షసులు జన్మిస్తారు. అప్పుడు నందగోపుని ఇంట యశోదాగర్భాన జన్మించి వారిని సంహరించి వింధ్యపర్వతాల మీద ఉంటాను. అంటుంది దేవి

దేవీ భాగవతంలో వింధ్యరాజు నారదుడి మాటలు విని రాత్రికి రాత్రి తన ఆకారాన్ని పెంచేశాడు. సూర్యగమనాన్ని అడ్డగించేశాడు. దాంతో దివారాత్రులు ఆగిపోయినాయి. కాలం స్తంభించిపోయింది. దేవతల కోరికమీద అగస్త్యమహర్షి తాను దక్షిణా పదానికి వెడుతున్నానని, తను తిరిగి వచ్చేవరకు కొద్దిగా వంగి ఉండమని అన్నాడు వింధ్యరాజుతో. ఆ ప్రకారమే ఒంగిపోయాడు వింధ్యరాజు. దక్షిణాపదానికి వెళ్ళిన అగస్త్యుడు మరి తిరిగి రాలేదు. ఆ సమయాన పరమేశ్వరి వింధ్యమీద నివాసం ఏర్పరచుకుని వింధ్యవాసిని అయింది." అని చెప్పబడింది. సాధకుని సహస్రారమే వింధ్యపర్వతము. అక్కడ ఆ దేవి ఉంటుంది.

## 337. విధాత్రీ

జగత్తులను ధరించునది. జగములను పోషించునది. ధాత్రి అంటే ధరించునది – తల్లి అని అర్ధం. విధాత బ్రహ్మ. అతని భార్య విధాత్రి.

అనంతమైన జీవులయొక్క కర్మలను బట్టి ఫలితము నిచ్చేవాడు విధాత. అనంతుడు, కూర్మము మొదలైన రూపాలతో ఈ ప్రపంచాన్ని ధరించేవాడు విధాత. ఆ పరమేశ్వరి సకల జగత్తుకూ కారణమైనది. సృష్టి స్థితి లయకారకురాలు. అష్టదిగ్గజములు, కులపర్వతములతో ఈ భూమిని ధరిస్తున్నది కాబట్టి ధాత్రి అనబడుతున్నది. అష్టదిగ్గజాలు అంటే

| | | | |
|---|---|---|---|
| 1. ఐరావతము | 3. వామనము | 5. అంజనము | 7. సార్వభౌమము |
| 2. పుండరీకము | 4. కుముదము | 6. పుష్పదంతము | 8. సుప్రతీకము |

కులపర్వతాలు ఏడు. అవి

**మహేంద్రో మలయ స్సహ్య శ్శుక్తిమాన్ గంధమాదనః ।**
**వింధ్య శ్చ పారియాత్ర శ్చ సప్తైతే కులపర్వతాః ॥**

| | | | |
|---|---|---|---|
| 1. మహేంద్రగిరి | 3. సహ్యగిరి | 5. గంధమాధనగిరి | 7. పారియాత్రగిరి |
| 2. మలయగిరి | 4. హిమవద్గిరి | 6. వింధ్యగిరి | |

వీటన్నింటి రూపంలోనూ భూమిని ధరించి ఉన్నది కాబట్టి విధాత్రీ అనబడుతోంది.

## 338. వేదజననీ

వేదములను పుట్టించినది. వేదాలను సృష్టించినది. వేదాలకు జన్మనిచ్చినది. వేదమాత. ఈ మహాభూతము యొక్క నిట్టూర్పులే చతుర్వేదాలు పురుషసూక్తంలో ఋక్కులు, సామాలు ఆమె వల్ల వచ్చినవి. అని చెప్పబడింది. దేవీపురాణంలో కుండలినీ శక్తినుంచే అక్షరాలన్నీ వచ్చినాయి. కాబట్టి ఆ కుండలినియే వేదమాత అని చెప్పబడింది.

పరమేశ్వరి నాదబ్రహ్మమయి. నాదరూపిణి. నాదమే వర్ణమయింది. వర్ణమే వేదమయింది. అందుచేత ఆ దేవి వేదజనని అనబడుతుంది.

పరమేశ్వరుని ఉఛ్వాస నిశ్వాసలే వేదాలు. పరమేశ్వరియే శబ్దబ్రహ్మ. వాగ్రూపాలు నాలుగు. ఇవి పరాపశ్యంతి మధ్యమావైఖరి. ఈ వాగ్రూపాలకు కారణము పరమేశ్వరి. వాక్కునుంచే వేదము వచ్చింది. అందుచేత వేదానికి మాత్రుక ఆ దేవి. కాబట్టి పరమేశ్వరి వేదజనని అనబడుతోంది.

## 339. విష్ణుమాయా

దేశకాలామానములచే విభజించటానికి వీలుకాని వాడు విష్ణువు. అట్టి విష్ణువును కప్పి వేస్తుంది ఈ మాయ. అదే విష్ణుమాయ.

శ్రీ మహావిష్ణువే సర్వేశ్వరుడు అని చెప్పబడుతోంది. అటువంటి విష్ణుమూర్తి భక్తుల గర్వం అణచటానికి ప్రదర్శించే మాయ విష్ణుమాయ.

**మాయాం తు ప్రకృతిం విద్యాన్ మాయినంతు మహేశ్వరమ్**

మాయ అనేది ప్రకృతి. మాయను తనవశంలో ఉంచుకునేవాడు మహేశ్వరుడు. మాయనే అవిద్య అనికూడా అంటారు. మాయ ఈశ్వరుని అధీనంలో ఉంటూ, జీవిని తన అధీనంలో ఉంచుకుంటుంది. మాయను సత్యము అని ఒప్పుకోలేము. అసత్యమని తప్పుకోనూ లేము. మనం ఊహించని పనులను జరిపించేది మాయ. అపచ్ఛిన్నుడైన విష్ణువునుకూడా పరిచ్ఛిన్నుడుగా చేయగలిగింది మాయ.

**యాదేవీ సర్వభూతేషు విష్ణుమా యేతి శబ్దితా**
**నమ స్తస్యై నమ స్తస్యై నమ స్తస్యై నమో నమః**

## 340. విలాసినీ

విక్షేపణశక్తి అంటే ఎగురవేయు శక్తి గలది. దేవీభాగవతంలో పరమేశ్వరిని తొమ్మిది మంది పీఠశక్తులు సేవిస్తుంటాయి.

**జయా చ విజయా చైవా ష్యజితా చా పరాజితా ।**
**నిత్యా విలాసినీ దోగ్ర్ధీ । త్యఘోరా మంగళానవా ॥**

జయ, విజయ, అజిత, పరాజితా, నిత్య, విలాసిని, దోగ్ర్ధీ, అఘోర, మంగళ. ఈ శక్తులలో విలాసిని ఒకటి.

సుషుమ్నా మార్గంలో బ్రహ్మరంధ్రాన్ని కప్పి ఉంచే నిక్షేపణశక్తి రూపిణి. దీనినే విలాసిని అంటారు. ఉపాసకులు, యోగులు తెలుసుకోదగిన మార్గాన్ని కప్పి ఉంచుతుంది. విలాసమయ జీవితమే మోక్షబంధకము. ఇదే మాయా సంజ్ఞ గలిగిన పరమేశ్వరి.

ఈ రకంగా ఈ నామాలలో పరమేశ్వరి ధ్యేయరూపం వివరించబడింది.



# 28. వాగ్వాదినీవిద్య

జగత్తంతా నామరూపాత్మకమైనది. ఇందులో ముందుగా నామాత్మకమైన జగత్తును చూద్దాం. ఓంకారమే పరబ్రహ్మ స్వరూపము. పరబ్రహ్మకు ఒక రూపం అంటూ ఉంటే అది ఓంకారమే. ఆ ఓంకారం నుంచే నామరూపాత్మకమైన జగత్తు అంతా ఉద్భవించింది. ఓంకారం నుంచే అచ్చులు, హల్లులు వచ్చినాయి. అంటే ముందుగా వర్ణసమామ్నాయ మేర్పడింది. అక్షరాలనుంచి మాటలు. మాటల నుంచి పదాలు వాక్యాలు. వాటినుంచి మంత్రాలు. వేదాలు, వాటినుంచి ఉపనిషత్తులు, శాస్త్రాలు, సంగీతము, సాహిత్యము ఈ రకంగా నామాత్మకమైన జగత్తు అంతా ఏర్పడింది.

ఆ తరువాత రూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. అందులో ముందుగా పంచ తన్మాత్రలు వచ్చాయి. అవే శబ్ద స్పర్శ, రూప, రస, గంధాలు. వీటినుంచే పంచభూతాలు ఏర్పడినాయి.

వీటిలో ముందుగా ఏర్పడింది శబ్దము. ఇది వాక్కుకు ప్రతిరూపం. వాక్కు నాలుగు రూపాలుగా ఉంటుంది. అవే పరాపశ్యంతి మధ్యమావైఖరీ రూపాలు. పరావాక్కు పరాస్థానంలో ఆరంభమవుతుంది. ఆ తరువాత అది ఆధారచక్రం చేరి పశ్యంతీ వాక్కు అవుతుంది. అది అనాహతం చేరి మధ్యమావాక్కు అవుతుంది. అది విశుద్ధి చక్రంలోని అచ్చులతో కలిసి స్పష్టమైన రూపం పొంది వైఖరీ వాక్కు అవుతుంది. వైఖరీ వాక్కుకు మూలస్వరూపం పరావాక్కు. అది పరమేశ్వరి స్వరూపము. ఆ దేవతను వాగ్వాదినీ అంటారు. మంత్రశాస్త్రంలో వాగ్వాదినీ దేవతామంత్రం ప్రత్యేకంగా ఉంది. ఆ దేవతను గురించే 341 నుంచి 356 నామాలవరకు వివరించటం జరుగుతోంది.

ఆ పరమేశ్వరి యే ఈ స్థూల శరీరానికి అధిపతి. ఇంకా చెప్పాలి అంటే క్షేత్రము క్షేత్రజ్ఞుడు. ఈ రెండూ ఆ పరమేశ్వరియే ఈ రెండింటినీ పాలించేదికూడా ఆ పరమేశ్వరియే. ఆమె ఆత్మస్వరూపి. ఆ పరమేశ్వరికి వృద్ధిక్షయాలు లేవు. గుణాలు లేవు. రూపం లేదు. ఆకారం అంతకన్నా లేదు. ఆ పరమేశ్వరి సకలజనులతోనూ అర్చించబడుతుంది. దేవతలు, గంధర్వులు మొదలైన వారందరితోనూ అర్చించబడుతుంటుంది. ఆమె లోకైకవంద్యురాలు. ఆ దేవి ఎక్కడ ఉంటుంది అంటే వహ్నిమండలవాసిని. ఆధారచక్రంలో ఉండే కుండలిని శక్తియే ఆ పరమేశ్వరి. అటువంటి వాగ్వాదినీ దేవిని గనక అర్చించినట్లైతే వచ్చే ఫలితం ఏమిటో చెబుతున్నారు.

ఆమె విజయ అపజయము ఎరుగనిది. ఆమెనర్చించిన వారికి కూడా అపజయం ఉండదు. తనభక్తుల యొక్క కోరికలు ఎలాంటివైనప్పటికీ ఆ దేవి తీరుస్తుంది. భక్తులపాలిట కల్పవృక్షము. నేను, నాది అనే అహంకార మమకారాలను నాశనం చేస్తుంది. అజ్ఞాను లయిన వారికి జ్ఞానమార్గం చూపుతుంది. మాయాపాశాలను త్రెంచి వేస్తుంది. వేద బాహ్యులను వేదదూరులను నిశ్శేషంగా చేసి లోకంలో జనులంతా సదాచారము పాటించేటట్లు అనుగ్రహిస్తుంది.

అటువంటి వాగ్వాదినీ దేవిని గనక అర్చించినట్లైతే, జ్ఞానం కలుగుతుంది. మోక్షం సిద్ధిస్తుంది. ఆ వాగ్వాదినీ మంత్రం ఇప్పుడు వివరించబడుతోంది. ఇక నామాలను చూద్దాం.

## 341. క్షేత్రస్వరూపా

**క్షేత్రం కామరూపాదికం......**

కామరూపాది వాసస్థలము. కాశీ, రామేశ్వరము, ప్రయాగ మొదలైన పుణ్యతీర్థాలు క్షేత్రాలనబడతాయి. శివాది క్షితి పర్యంతము ఉన్న తత్త్వాలు గల స్థూలశరీరము ఒకటి కాదు. ప్రపంచంలోని అన్ని జీవుల శరీరాలు క్షేత్రాలే. అందుకే జీవి క్షేత్రస్వరూపుడు.

పుణ్యక్షేత్రాలలో ఉండే దేవతామూర్తుల మూలవిరాట్‌లు. ఇవి అన్ని తత్త్వాల సమ్మేళనాలు. జగత్తులో ఉన్న సర్వజీవులయొక్క సమిష్టి రూపము. అదే విరాడ్రూపము. అదే క్షేత్రస్వరూపం.

నామరూపాత్మకమైన ప్రకృతి అంతా క్షేత్ర స్వరూపమే. ఈ ప్రకృతికూడా పరమేశ్వరుని అంశమే. అందుచేతనే క్షేత్రస్వరూపా అనబడుతుంది.

లింగపురాణంలో

**బిభర్తి క్షేత్రతాం దేవీ త్రిపురాంతకవల్లభా ।**
**క్షేత్రజ్ఞత్వ మతో ధత్తే భగవా నంతకాంతకా ॥**

త్రిపురాంతకుని భార్యయైన దేవి క్షేత్రము. అంటే ఈ సృష్టికి మూలకారణము. అంతకాంతకుడైన భగవంతుడు శివుడు. అతడే క్షేత్రములనెరిగినవాడు. క్షేత్రజ్ఞుడు. అని చెప్పబడింది.

ఈ రకంగా స్థూలశరీరాలు, ప్రకృతి అన్నీ ఆ పరమేశ్వరి రూపమే. అందుచేతనే ఆమె క్షేత్రస్వరూపా అనబడుతోంది.

## 342. క్షేత్రేశీ

క్షేత్రాలను పాలించేదేవి. స్థూలశరీరాలను పాలించేదేవి. ప్రకృతిని పాలించే దేవి.

దేహానికి ఐదురకాల ధర్మాలున్నాయి. వాటిని పంచవర్గ ధర్మాలు అంటారు. అవి

1. మనోబుద్ధి చిత్త అహంకారాలు
2. ప్రాణ అపాన వ్యాన ఉదాన సమాన వాయువులు
3. సత్త్వ రజ స్తమోగుణాలు
4. పంచభూతాలు
5. పుణ్యపాపాలు

ఈ రకంగా పంచవర్గ ధర్మముగల దేహాత్మయందు ప్రతిఫలించే జీవసంజ్ఞగల ఆత్మచైతన్యమే క్షేత్రేసి అనబడుతుంది.

దేశంలో అనేక పుణ్యక్షేత్రాలున్నాయి. వాటిలో ఉండే దేవతనే క్షేత్రేశీ. క్షేత్రానికి అధిపతి అంటారు. అవి

1. అష్టాదశ శక్తిపీఠాలు. వీటిని గురించి గతంలో వివరించటం జరిగింది.
2. ద్వాదశ జ్యోతిర్లింగాలు

| | | | |
|---|---|---|---|
| 1. | కాశి | – | విశ్వేశ్వరుడు |
| 2. | హిమాలయం | – | కేదారేశ్వరుడు |
| 3. | ఉజ్జయిని | – | మహాకాళేశ్వరుడు |
| 4. | దారుకావనం | – | నాగేశ్వరుడు |
| 5. | సౌరాష్ట్రం | – | సోమనాధుడు |
| 6. | గౌతమీతీరం | – | త్ర్యంబకేశ్వరుడు |
| 7. | పర్లి | – | వైద్యనాధుడు |
| 8. | నర్మదాతీరం | – | అమరేశ్వరుడు |
| 9. | శ్రీశైలం | – | మల్లిఖార్జునుడు |
| 10. | రామేశ్వరం | – | రామలింగేశ్వరుడు |
| 11. | ఢాకిని | – | భీమశంకరుడు |
| 12. | యల్లోరా | – | మన్మధేశ్వరుడు |

3. విష్ణుక్షేత్రాలలో ముఖ్యమైనవి.

శ్రీకూర్మము, శ్రీరంగము, పద్మనాభము, సింహాచలము, అంతర్వేది, రామతీర్థము, ఉప్మాక, తిరుపతి, మంగళగిరి, అహోబిలం, భద్రాచలం, విష్ణుకంచి, ద్వారక, అయోధ్య మొదలైనవి.

ఈ క్షేత్రాలలో ఉన్న దేవతలు అశేషభక్త సమూహాలతో పూజింపబడుతున్నారు. ఆ దేవతా మూర్తులే క్షేత్రేశీ అనబడుతున్నారు.

## 343. క్షేత్రక్షేత్రజ్ఞపాలినీ

క్షేత్రజ్ఞుడు అంటే జీవుడు. క్షేత్రము అంటే శరీరము. విష్ణుస్మృతిలో "ఓ భూదేవీ ! ఈ శరీరమే క్షేత్రము అనబడుతోంది. దీన్నిగురించి తెలిసినవాడే క్షేత్రజ్ఞుడు. అన్ని శరీరములందు నేనే క్షేత్రజ్ఞుడుగా గుర్తించు" అని విష్ణుమూర్తి చెబుతాడు. భగవద్గీతలో 13వ అధ్యాయం క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగంలో శ్రీ కృష్ణభగవానుణ్ణి అర్జునుడు అడుగుతాడు.

**ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ ।**
**ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ ॥**

కేశవా ! ప్రకృతి, పురుషుడు, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, జ్ఞానము, జ్ఞేయము వీటన్నింటిని గురించి నాకు తెలుసుకోవాలని ఉంది. ఆ మాటవిన్న శ్రీకృష్ణ భగవానుడు చెబుతున్నాడు.

**ఇదం శరీరం కౌంతేయ ! క్షేత్ర మి త్యభిధీయతే ।**
**ఏత ద్యోవేత్తి తం ప్రాహః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥**

కౌంతేయా! ఈ శరీరమే క్షేత్రము. దీనిని తెలుసుకున్నవాడే క్షేత్రజ్ఞుడు. అని ఈ రెండు విషయాలు తెలిసినవాళ్ళు చెబుతున్నారు.

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ! ।**
**క్షేత్ర క్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమః ॥**

అర్జునా ! క్షేత్రానికి క్షేత్రజ్ఞుడికి సంబంధించిన జ్ఞానమే సరి అయినది.

పూర్వకాలంలో మహర్షులు ఎన్నోరకాలుగా క్షేత్ర క్షేత్రజ్ఞతత్త్వాన్ని చాటిచెప్పారు. వేదాలు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు ఈ స్వరూపాన్ని నిరూపించాయి.

**మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవ చ ।**

**ఇంద్రియాణి దశైకం చ పంచచేంద్రియ గోచరాః ॥**

**ఇచ్ఛాద్వేష స్సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః ।**

**ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ ॥**

పంచభూతాలు, అహంకారము, బుద్ధి, మూలప్రకృతి దశేంద్రియాలు, మనస్సు, ఇంద్రియాల విషయాలు. సుఖం, దుఃఖం, కోరిక, ద్వేషం, తెలివి, ధైర్యం ఈ వికారాలతో పాటు వీటి సముదాయాన్ని కలిపి క్షేత్రం అంటారు. అని చెబుతాడు.

లింగపురాణంలో

**చతుర్వింశతితత్త్వాని క్షేత్రశబ్దేన సూరయః ।**

**ఆహుః క్షేత్రజ్ఞ శబ్దేన భోక్తారం పురుషం తథా ॥**

ఇరవై నాలుగు తత్త్వాలను పండితులు క్షేత్రము అంటున్నారు. వాటిని అనుభవించే వాడు క్షేత్రజ్ఞుడు అన్నారు. వాయుపురాణంలో

**అవ్యక్తం క్షేత్రముద్దిష్టం బ్రహ్మక్షేత్రజ్ఞ ఉచ్యతే**

అవ్యక్తము క్షేత్రము. బ్రహ్మ క్షేత్రజ్ఞుడు అని చెప్పబడింది. బ్రహ్మపురాణంలో శరీరాలు క్షేత్రాలు. వాటిని ఎరిగినవాడే యోగాత్మ. అందువలన అతడే క్షేత్రజ్ఞుడు అనగా శరీరంతో చేరిన జీవుడే క్షేత్రజ్ఞుడు అని చెప్పారు. మనుస్మృతిలో ఎవరు ఆత్మల లేదా జీవులతో క్రియలను చేయిస్తాడో అతడే క్షేత్రజ్ఞుడు. క్రియలుచేసేవాడు భూతాత్మ. జీవుడు అనే పేరుగల అంతరాత్మ అన్ని దేహాలలోనూ ఉంటాడు. ఆ జీవుడివల్లనే గతజన్మలలోని సుఖదుఃఖాలు తెలుస్తున్నాయి. ఈ క్షేత్రజ్ఞుడు అన్ని ప్రాణులయందు అంటే ఉన్నతము, నీచము అయిన సర్వప్రాణులయందు వ్యాపించి ఉంటాడు. అతడి శరీరంనుంచి లెక్కలేనన్ని దేహాలు ఆవిర్భవిస్తున్నాయి. అతడే అన్ని ప్రాణులను క్రియావంతులుగా చేస్తున్నాడు.

పరమేశ్వరియే క్షేత్రక్షేత్రజ్ఞ పాలిని. దేహము, దేహి ఈ రెండింటినీ పాలించేది.

క్షేత్రము అంటే సర్వప్రాణులు అని ఇంకొకసారి చెబుతున్నాం. కేవలము మానవులే కాదు. క్రిమికీటకాలు, జంతువులు, పశుపక్ష్యాదుల శరీరాలు కూడా క్షేత్రాలే. ఆ క్షేత్రాలకు అధిపతి క్షేత్రజ్ఞుడు. ఈ రెండింటినీ అంటే క్షేత్రము క్షేత్రజ్ఞులను పాలించేది ఆ పరమేశ్వరి.

## 344. క్షయవృద్ధివినిర్ముక్తా

ఆత్మకు వృద్ధిక్షయాలు లేవు. అవన్నీ శరీరానివే. ఈ రకమైన భావవికారాలను కలిగించేది ఆ పరమేశ్వరి. కాని ఆ వికారాలు ఆమెకు లేవు. అందుకే గీతాచార్యుడు ఆత్మనాశనము లేనిది. దీనిని శస్త్రాలు ఛేదించలేవు అన్నాడు.

వృద్ధిక్షయాలనేవి కర్మలవల్ల ఏర్పడతాయి. జ్ఞాని అయినవాడు కర్మలు చెయ్యడు. అందుచేతనే అతడికి వృద్ధిక్షయాలుండవు. కారుకశ్రుతిలో ఈ విషయం చెప్పబడింది. యాజ్ఞవల్క్యశ్రుతిలో  జ్ఞాని సత్కర్మలచే వృద్ధిని, దుష్కర్మలచే క్షయాన్ని పొందదు అని చెప్పబడింది.

ఆ పరమేశ్వరి ఏ రకమైన వికారాలు లేనిది. నిర్వికారమైనది. ఆ దేవికి గుణాలు లేవు. రూపం లేదు. ఆకారం లేదు. వృద్ధిక్షయాలు లేవు. ఈ వికారాలన్నీ ఆత్మకు ఉన్నట్టు కనిపిస్తాయి. ఇందుకు కారణం ఆత్మశరీరంతో కలిసి ఉండటమే. నిజానికి క్షేత్రజ్ఞుడైన ఆత్మకు వీటితో ఏ సంబంధమూ లేదు. అటువంటి ఆత్మస్వరూపిణి పరమేశ్వరి. అందుచేతనే ఆమె క్షయవృద్ధి వినిర్ముక్తా అనబడుతోంది.

## 345. క్షేత్రపాలసమర్చితా

పూర్వకాలంలో దారుకాసురుడు అని ఒక రాక్షసుడు ఉండేవాడు. బ్రహ్మని గురించి తపస్సు చేసి అనేక వరాలు పొందాడు. అతని ఆగడాలు మితిమీరిపోయినాయి. వాణ్ణి సంహరించటం దేవతలెవరికీ సాధ్యం కాలేదు. ఆఖరుకి శివుడు ఆ రాక్షసుని మీద కాళిని ప్రయోగించాడు. కాళి భయంకరమైన ఉగ్రరూపంతో ఆ రాక్షసుణ్ణి సంహరించింది. రాక్షస సంహారానంతరముకూడా ఆమె కోపము తగ్గలేదు. ఆ కోపాగ్నికి లోకాలన్నీ కల్లోల మయి పోతున్నాయి అప్పుడు శివుడు పసిబాలుడై ఏడవటం మొదలుపెట్టాడు. అది చూసిన కాళి ఆ బాలునిదగ్గరకు తీసుకుని స్తన్యమిచ్చింది. అప్పుడు శివుడు ఆ స్తన్యంతో పాటుగా కోపాగ్నిని కూడా త్రాగేశాడు. ఆ బాలుడినే క్షేత్రపాలశివుడంటారు. క్షేత్రము అంటే శరీరము పాలకుడు అంటే – శరీరాన్ని స్థావరంగా చేసుకొన్న జీవుడు. ఆత్మజ్ఞానం కలవారిచే అర్చించబడుతోంది కాబట్టి ఆ దేవి క్షేత్రపాల సమర్చితా అనబడుతుంది.

క్షేత్రపాలుడు : సకల భూతాలకు అధిపతి శివుడు. అతనిచే అర్చించబడునది. ప్రతిక్షేత్రంలోనూ క్షేత్రపాలకుడు ఒకడుంటాడు. అతనిచే అర్చించబడేది కాబట్టి ఆ దేవి క్షేత్రపాల సమర్చితా అనబడుతోంది.

క్షేత్రమంటే : యాగశాల. దానిని పాలించేవాడు క్షేత్రపాలకుడు. అతనిచే పూజించబడే దేవి.

## 346. విజయా

గొప్ప విజయము గలది. జ్ఞానమే రూపముగా గలది. పద్మడు అనే పేరు గల రాక్షసరాజు గొప్ప బలవంతుడు అతడిని సంహరించి దేవి విజయ, అపరాజిత అని పిలవబడింది అని లింగపురాణంలో చెప్పబడింది.

పరమేశ్వరి తాను చేసే సృష్టి స్థితి లయాలలోను, యుద్ధాలలోనూ కూడా ఎప్పుడూ విజయమే పొందుతుంది. కాబట్టి విజయ అనబడుతోంది.

విజయ అనేది ఒక ముహూర్తము. ఆశ్వీయుజ శుద్ధ దశమినాడు నక్షత్రోదయకాలం విజయ ముహూర్తము అని చింతామణిలో చెప్పబడింది.

విజయదశమి రోజు సాయంత్రం నక్షత్రాలు వచ్చిన తరువాత కాలము విజయ అనబడుతుంది. అని రత్నకోశము చెబుతోంది.

జీవులకు వచ్చే ఆలోచనలలో చెడు ఓడిపోయి మంచే విజయం సాధిస్తుంది. కాబట్టి ఆ పరమేశ్వరి విజయా అని పిలవబడుతోంది.

## 347. విమలా

వి అంటే-విసర్జించినటువంటి, మల అంటే అజ్ఞానము. అజ్ఞానము లేనటువంటిది. జ్ఞానరూపిణి.

ఏ విధమైన మలము లేనిది. కేవలము శుద్ధజ్ఞానరూపిణి. మలములు మూడు రకాలు 1. అణవమల, 2. కార్మికమల, 3. మాయీకమల ఇవి

| | | | |
|---|---|---|---|
| 1. | అణవమల | - | స్థూలదేహానికి సంబంధము |
| 2. | మాయీకమల | - | సూక్ష్మ దేహానికి సంబంధము |
| 3. | కార్మికమల | - | కారణదేహానికి సంబంధం |

ఈ రకమైన మలత్రయము లేనిది.

మంత్రశాస్త్రంలో ప్రతిమంత్రానికి దశసంస్కారాలు చెయ్యాలి. అలాచేస్తేనే ఆ మంత్రాలు విమలములు అవుతాయి. ఈ సంస్కారాలు వరుసగా

1. జనన
2. జీవన
3. తాడన
4. బోధన
5. అభిషేక
6. విమలీకరణము
7. ఆప్యాయన
8. తర్పణ
9. దీపన
10. గోపనములు

పరమేశ్వరికి అటువంటివి ఏవీ అవసరంలేదు.

ఆ పరమేశ్వరి షోడశిమంత్రస్వరూపిణి. అందుచేత విమలా అనబడింది.

## 348. వంద్యా

**వందితుం యోగ్యా-వంద్యా** నమస్కరింపదగినది కాబట్టి వంద్య అనబడుతుంది.

ప్రపంచంలో నమస్కరింపదగినవారు అనేకమంది ఉంటారు. అలాగే నమస్కారాలు అందుకునేవారు అనేకులు ఉంటారు. వీరిలో ఎక్కువమంది తమ పిల్లలచేత, వంశీయులచేత, పరివారజనంచేత, శిష్యులచేత, భక్తులచేత, నమస్కరించబడుతుంటారు. కాని అందరిచేత అంటే చిన్నపెద్దతారతమ్యం లేకుండా జనులందరితోనూ నమస్కరించబడేది ఆ దేవి. అయితే లోకంలో అధికారులు, రాజులు, చక్రవర్తులు మొదలైనవారు వారి రాజ్యం లేదా అధికారానికి లోబడి ఉన్నవారిచేత నమస్కరించబడతారు. కాని పరమేశ్వరి రాజులు, అధికారులచేత కూడా నమస్కరించబడుతుంది. ఈ లోకంలోని వారేకాదు. దేవ, గంధర్వ, యక్ష, కిన్నెర కింపురుష, సిద్ధ, సాధ్యగణాలతో కూడా నమస్కరింపబడుతుంది. అందుచేతనే ఆమె లోకైకవంద్య.

## 349. వందారుజనవత్సలా

వందన మొనర్చు జనులందరియందు వాత్సల్యము గలది. తనను స్తుతించే వారియందు, నమస్కరించేవారియందు అమితమైన వాత్సల్యము గలది. సామాన్యంగా లోకంలోని జీవులకు తమ స్వజనులందు అంటే తన సొంతవారిపైన, బంధువులమీద, శిష్యులమీద, వాత్సల్యముంటుంది. కాని ఆ దేవికి సమస్త జీవరాశి మీద వాత్సల్య ముంటుంది. ఆ వాత్సల్యము మనుషులమీదే కాదు. జంతువులయందు పశుపక్ష్యాదుల

యందు కూడా ఉంటుంది. కాళహస్తిలో పరమేశ్వరుడు సాలెపురుగు, పాము, ఏనుగుల భక్తికి మెచ్చి వాటికి మోక్షాన్ని ప్రసాదించాడు. అలాగే గజేంద్రుడికి కూడా మోక్షమిచ్చాడు విష్ణుమూర్తి. ఈ రకంగా అన్నిరకాలజీవుల మీదా వాత్సల్యము కలిగి వాటికి మోక్షం ప్రసాదించేది. అందుచేతనే ఆ పరమేశ్వరి వందారు జనవత్సలా అనబడుతోంది.

## 350. వాగ్వాదినీ

వాక్కులను పలుకునది. వాగ్వాదిని అను ఒక దేవతామూర్తి. ఈ దేవిని గురించి త్రిపురాసిద్ధాంతంలో

**సర్వేషాం చ స్వభక్తానాం వాదరూపేణ సర్వదా ।**
**స్థిరత్వా ద్వాచి విఖ్యాతా లోకే వాగ్వాది నీతి సా ॥**

సమస్తమైన తన భక్తుల నాలుకలయందు వాగ్రూపంలో ఉండే దేవత కాబట్టి వాగ్వాదిని అనబడుచున్నది. లఘుస్తవంలో కాళిదాసు

**శబ్దానాం జననీ త్వ మత్ర భువనే వాగ్వాదినీ త్యుచ్యతే**

లోకంలో శబ్దాలను పుట్టించే దేవత కాబట్టి ఈమె వాగ్వాదిని అనబడుతున్నది.

వాక్కు నాలుగురూపాలుగా ఉంటుంది.

1. పర 2. పశ్యంతి 3. మధ్యమ 4. వైఖరి

ఇందులో వాక్కు పరారూపంలో ప్రారంభమయి వైఖరిరూపంలో బయటకు వస్తుంది. ఈ పరావాక్కుకు అధిదేవత పరమేశ్వరి. అందుకే ఆవిడవాగ్వాదిని అనబడుతుంది.

ఏదైనా ఒక విషయం గురించి చెప్పాలి అంటే ముందుగా దాని గురించి ఆలోచన పరాస్థానం అంటే సహస్రారం అదే మెదడు ఉండేస్థానం. అక్కడ వస్తుంది. అంటే ముందుగా ఆలోచన పరాస్థానంలో వస్తుంది. అది పరావాక్కు అంటారు. ఈ స్థానానికి అధిదేవత పరమేశ్వరి. కాబట్టి పరమేశ్వరి వాగ్వాదిని అనబడింది.

ఆ తరువాత ఆ ఆలోచన బలపడి ఆధారస్థానంలో చిన్న గాలిబుడగలాగా అవుతుంది. ఇది పశ్యంతీవాక్కు ఇది వాక్కుకు తొలిదశ. పరాస్థానంలో వాక్కును గురించిన ఆలోచన వచ్చింది. ఇప్పుడు వాక్కు ప్రారంభమవుతోంది. ఇది మొలకవచ్చిన ధాన్యపుగింజలా ఉంటుంది. దీన్నిచూసి అది ఏ చెట్టో మనం చెప్పలేము. అవ్యక్తమైన రూపమది.

అలా ప్రారంభమైన ఆవాక్కు క్రమేణా పైకి వెళ్ళి అనుహతం చేరుతుంది. ఇది మధ్యమావాక్కు. ఇక్కడికి చేరేటప్పుడికి, మొలకెత్తినధాన్యపుగింజలా ఉంటుంది. అంటే

రెండు ఆకులతోపాటు ఇంకొక ఆకు కూడా రావటానికి సిద్ధంగా ఉంటుంది. ఈ స్థితిలో వాక్కు యొక్క రూపం అస్పష్టంగా తెలుస్తుంది. ఇక్కడ అచ్చులు లేనటువంటి హల్లులు మాత్రమే ఉంటాయి. అనాహత పద్మం దగ్గర నుండి అక్షరసమామ్నాయంలో క నుంచి హల్లులు మొదలవుతాయి. అందుచేత ఇక్కడ వాక్కేదో స్పష్టంగా తెలియదుకాని దానిరూపం మాత్రం తెలుస్తుంది. ఇది మధ్యమావాక్కు.

అనాహతం నుంచి బయలుదేరిన మధ్యమావాక్కు విశుద్ధి చక్రంచేరి, అక్కడ పదహారుదళాలలోను ఉన్న అచ్చులతో కలిసి స్పష్టమైన రూపాన్ని పొంది ముఖము ద్వారా బయటకు వస్తుంది. ఇది వైఖరీవాక్కు.

ఈ రకంగా వాక్కుకు అధిదేవత ఆ పరమేశ్వరి. అందుచేతనే ఆమె వాగ్వాదిని అనబడుతోంది. మంత్రశాస్త్రంలో వాగ్వాదినీ మంత్రము పదమూడుఅక్షరాలతో ఉన్నది.

**అస్యశ్రీవాగ్వాదినీ మహామంత్రస్య దక్షిణామూర్తి ఋషిః । పంక్తిచ్ఛందః । శ్రీమద్వాగ్వాదిన్యంబాదేవతా। ఐం బీజం। సౌఃశక్తిః। క్లీం కీలకం। జపేవినియోగః।**

**న్యాసము : ఐం । క్లీం । సౌః । సౌః । క్లీం । ఐం ।**

**ధ్యానము : పుస్తకజపవటీహస్తే ! వరదాభయచిహ్నచారుబాహులతే ।**
**కర్పూరామలదేహే ! వాగీశ్వరి ! శోధ యాశు మమ చేతః ॥**

**మంత్రము : ఐం క్లీం సౌః వదవదవాగ్వాదిని స్వాహా**

## 351. వామకేశీ

అందమైన కేశములు గలది. వామకులు అంటే జనులు. వారికి ఈశుడు శివుడు. అతని పత్నివామకేశి. దేవీపురాణంలో అరవైఎనిమిది తీర్థాలు చెప్పారు. వాటిలో జట అనే తీర్థంలో వామకేశుడు దేవుడు. అతని పత్ని వామకేశి. వామకేశ్వరతంత్రంలో ప్రతిపాదించబడిన దేవి.

వామదేవాది ఏకాదశరుద్రులకు ప్రభ్వి. ఏకాదశరుద్రుల వివరాలు.

1. వామదేవ
2. జ్యేష్ఠుడు
3. శ్రేష్ఠుడు
4. రుద్రుడు
5. కాలుడు
6. కలవికరణుడు
7. బలుడు
8. బలప్రమధునుడు
9. బలవికరణుడు
10. సర్వభూతదమనుడు
11. మనోన్మనుడు

విద్యార్థి కల్పతరువులో వీరు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | అజైకపాదుడు | 5. | హరుడు | 9. | కపర్ది |
| 2. | అహిర్బుధ్న్యుడు | 6. | త్ర్యంబకుడు | 10. | మృగవ్యాధుడు |
| 3. | త్వష్ట | 7. | వృషాకపి | 11. | శర్వుడు |
| 4. | రుద్రుడు | 8. | శంభుడు | | |

అయితే వీరిలో మతాంతరం కూడా ఉంది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | అజుడు | 5. | రుద్రుడు | 9. | అపరాజితుడు |
| 2. | ఏకపాదుడు | 6. | హరుడు | 10. | ఈశానుడు |
| 3. | అహిర్బుధ్న్యుడు | 7. | శంభుడు | 11. | త్రిభువనుడు |
| 4. | త్వష్ట | 8. | త్ర్యంబకుడు | | |

బృహదారణ్యకోపనిషత్తులో జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు. మానవుడు మరణించినప్పుడు చుట్టుప్రక్కల వారిని ఇవి రోదింపచేస్తాయి. కాబట్టి వీటిని రుద్రులు అంటారు. అని యాజ్ఞవల్క్యుడు శాకల్యుడికి చెబుతాడు.

వామకేశ్వరుని భార్య వామకేశి.

## 352. వహ్నిమండలవాసినీ

అగ్నిమండలమునందుండునది. షట్చక్రాలలోను రెండురెండు చక్రాలు ఒక మండలము అని చెప్పబడింది.

| | | |
|---|---|---|
| 1. ఆధారస్వాధిష్ఠానాలు | – | అగ్నిమండలము |
| 2. మణిపూర అనాహతాలు | – | సూర్యమండలము |
| 3. విశుద్ధి ఆజ్ఞాచక్రాలు | – | చంద్రమండలము |

నిజానికి వీటిని ఖండాలు అంటారు. అగ్నిఖండము సూర్యఖండము చంద్రఖండము. వీటిలో

ఆధారస్వాధిష్ఠానాల యందుండు దేవి వహ్నిమండల వాసినీ అనబడుతోంది.

వహ్ని అనగా – మూడుసంఖ్య. అగ్ని సూర్యచంద్రమండలములందుండునది.

మూలాధారంలో కుండలినీ శక్తిరూపంలో ఉంటుంది. కాబట్టి వహ్నిమండలవాసిని అనబడుతుంది.

ధ్యాయే త్కుండలినీం దేవీం ఇష్టదేవస్వరూపిణీం ।
సదా షోడశవర్షీయాం పీనోన్నతపయోధరామ్ ।
నవయౌవన సంపన్నాం సర్వాభరణభూషితాం
పూర్ణచంద్రప్రభాం రక్తాం సదాచంచలలోచనామ్ ॥

## 353. భక్తిమత్కల్పలతికా

భక్త జనులకు కల్పలతవలె కోరికలు తీర్చునది. సగము భక్తిగలవారికి పూర్తి భక్తికలుగచేసేది. పరమభక్తులకు, జ్ఞానులకు మోక్షమునిచ్చేది.

దేవీభాగవతంలో భక్తిని గురించి పరమేశ్వరి హిమవంతుడికి వివరిస్తూ

రాజా ! భక్తి మూడు రకాలు

1. దంభాచారంతో ఇతరులకు బాధ కలిగించేది తామసభక్తి.
2. స్వార్థం చూసుకోవటం రాజసభక్తి
3. ధృడదీక్షతో పరమేశ్వరి ప్రీతికోసం చేసేది సాత్వికభక్తి.

తామస, రాజసభక్తులు పరాభక్తికి దోహదం చేస్తాయి. ఫలాపేక్షలేకుండా కేవలము సేవాభావంతో తనకు, పరదేవతకు భేదము లేదని భావించి జితేంద్రియుడై ఆ దేవిని ధ్యానించేవాడు ముక్తి పొందుతాడు. ఈ విషయాలన్నీ గతంలో వివరించటం జరిగింది.

భక్తులు నాలుగురకాలు

1. జ్ఞానులు    2. జిజ్ఞాసులు    3. అర్థార్థులు    4. వ్యాధిపీడితులు

అలాగే భక్తి తొమ్మిదిరకాలు. వీటినే నవవిధభక్తులు అంటారు. అవి.

| | | |
|---|---|---|
| 1. శ్రవణం | 4. పాదసేవనం | 7. దాస్యం |
| 2. కీర్తనం | 5. అర్చనం | 8. సఖ్యం |
| 3. స్మరణం | 6. వందనం | 9. ఆత్మనివేదనం. |

ఈ జన్మలో కొంతభక్తి ఉండి సరిగా అర్చన చేయలేకపోతే మరుజన్మలో పూర్ణభక్తి అలవడుతుంది. ఈ రకంగా పరమేశ్వరిని అర్చించినవారికి ఇహపరసుఖాలు కలుగుతాయి. అందుచేతనే ఆమె భక్తిమత్కల్పలతికా అనబడుతుంది.

# 354. పశుపాశవిమోచనీ

జీవాత్మ పరమాత్మ వేరు. భక్తుడు భగవంతుడు వేరు. అనే ద్వైదీభావము గలవారు పశువులు. బృహదారణ్యకోపనిషత్తులో "తాను వేరు దైవము వేరు అని భావించేవాడు పశువు" అని చెప్పబడింది.

పశువులు అంటే - విద్యాహీనులు. జ్ఞానహీనులు, అజ్ఞానులు వారి యొక్క పాశములు, బంధాలను విడిపించేది. ఆహారనిద్రాభయాదులు జీవులన్నింటికీ ఒకేరకంగా ఉంటాయి. పశువులకు జ్ఞానముండదు. ఆలోచనాశక్తి ఉండదు. ఇహపరాలను గూర్చి తెలియదు. అటువంటి పశువులకు ఆలోచన, ధర్మాధర్మవిచక్షణలను కలుగచేసి వారికి బంధనాల నుండి విముక్తి కలిగిస్తుంది. వికారాల నుండి విముక్తి కలిగిస్తుంది. నేను నాది అనే అహంకారమమకారముల నుండి రక్షణ కల్పిస్తుంది. ప్రతి జీవి ధనధాన్యాలు, సిరిసంపదలు, భోగభాగ్యాలు, భార్యపిల్లలు, బంధువులు, స్నేహితులు వీరంతా శాశ్వతము అనుకుంటాడు. కాని వీరందరూ ఇవాళ్ళ ఉండి రేపు పోయే వారే. సంపాదించిన ధనంగాని, ఆస్తులుగాని పోయేటప్పుడు వెంటరావు. అవన్నీ ఇంటి దగ్గరే ఉంటాయి. మృతదేహం అక్కడ ఉండగానే బంధువులు ఆస్తికోసం తగాదాలు ఆడతారు. కొట్లాడుకుంటారు. మృతుడి మీద ఎవరికీ ప్రేమ ఉండదు. ఒకవేళ అతడు సంపాదించినాస్తులు లేకపోతే అతడు ఏమీ సంపాదించలేదని వాపోతారు. అంతేగాని అతడు పోయాడనికాదు.

ఈరకంగా ఉన్న ఈ ప్రపంచంలో శాశ్వతమైనది ఏదీలేదు. కంటికి కనిపించేవన్నీ అశాశ్వతాలే. కాని మానవుడు బ్రతికి ఉన్నంతవరకు సంసారబంధనాలలో కూరుకుపోయి ఉంటాడు. అటువంటి బంధనాలను త్రెంచి వేస్తుంది ఆ పరమేశ్వరి. అందుకే పశుపాశవిమోచనీ అనబడింది.

క్లేశాలు ఐదురకాలు. వాటినే పంచవిధక్లేశాలు అంటారు.

| | | | |
|---|---|---|---|
| 1. | అవిద్యాక్లేశము | - | దేహమే ఆత్మ అనుకోవటం |
| 2. | అభినవక్లేశము | - | సంసారబంధనాలలో కూరుకుపోవటం |
| 3. | అస్థిగతక్లేశము | - | విషయాభిలాషతో విర్రవీగటం |
| 4. | రాగక్లేశము | - | ధనము, అధికారముల మీద కోరిక |
| 5. | ద్వేషక్లేశము | - | ఉదరపోషణార్థం ఇతరులనాశ్రయించి కోరికలు తీరక వారిని తిట్టటం. |

ఈ క్లేశాలు, మాయ, కర్మ, ఇరవై నాలుగుతత్త్వాలు, త్రిగుణాలు. ఇవన్నీ జీవిని బంధించివేస్తాయి. పరమేశ్వరి ఈ పాశాలను విడదీస్తుంది. పరమేశ్వరిని ఆరాధించినట్లైతే క్రమక్రమంగా పాశాలు అన్నీ తెగిపోతాయి. ఈ రకంగా అజ్ఞానులు అనే పశువుల యొక్క పాశాలను త్రెంచి వేస్తుంది. కాబట్టి ఆమె పశుపాశవిమోచనీ అనబడింది.

## 355. సంహృతాశేషపాషండా

పాషండులనందరినీ సమూలముగా నాశనము చేసేది. పాషండులు అంటే - వేదాలకు వ్యతిరేక ప్రచారం చేసేవారు. వేదశాస్త్రములు కాకుండా, వీటికన్నభిన్నంగా బుద్ధితో ఊహించేదే పాషండము. ఇది దైత్యులను మోహింపచేస్తుంది. ఇటువంటి వారిని సర్వనాశనం చేసేది.

వేదాలు అంటే ఋగ్ యజు స్సామ అధర్వణాలు. శాస్త్రాలు పది. అవి

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | పురాణములు | 5. | శిక్ష | 9. | జ్యోతిషము |
| 2. | న్యాయము | 6. | వ్యాకరణము | 10. | కల్పము |
| 3. | మీమాంస | 7. | ఛందస్సు | | |
| 4. | ధర్మము | 8. | నిరుక్తము | | |

వేదదూరులను, వేదబాహ్యులను నివారించునది. పాషండులను నిశ్శేషముగ నాశనము చేయునది. కాబట్టే ఆమె సంహృతాశేషపాషండా అనబడింది.

## 356. సదాచారప్రవర్తికా

సదాచారము అంటే-వేదాలయందు చెప్పబడినది. అటువంటి సదాచారాన్ని ప్రవర్తింపచేసేది. జ్ఞానకర్మకాండల యందు చెప్పిన విషయాలను పురాణాలలో చెప్పినట్లుగా ప్రవర్తింపచేసేది. కూర్మపురాణంలో "బ్రహ్మయొక్క ఆజ్ఞతో వ్యాసుడు పద్దెనిమిది పురాణాలు, శాస్త్రాలు చెప్పాడు. వేదాలు విభజించాడు. అతడి శిష్యులు ఉపపురాణాలు వ్రాశారు" అని చెప్పబడింది.

పరమేశ్వరి సదాచారాన్ని మాత్రమే ప్రోత్సహిస్తుంది. శ్రుతులు, స్మృతులలో చెప్పినవిషయాలను ఆచరింపచేస్తుంది. సదాచారము అంటే - ఎప్పుడు ఏవిధమైన మార్పులేని వేదవిహితమైన ఆచారము. అంతేకాని కాలానికి అనుగుణంగా మారే ఆచారం కాదు. ఇటువంటి సదాచారాన్ని ప్రోత్సహించి విశ్వమానవకళ్యాణం కోరుతుంది. కాబట్టి ఆమె సదాచార ప్రవర్తికా అనబడింది. ఈ రకంగా వాగ్వాదినీ విద్య వివరించబడింది.

# 29. బ్రహ్మవిద్య

విద్యలు రెండు రకాలు. 1. అపరావిద్య. 2. పరావిద్య. వీటినే లౌకికవిద్య, బ్రహ్మవిద్య అని కూడా అంటారు.

అపరావిద్య దీనివల్ల సంఘంలో ఉన్నతస్థితి పొందటము, ధనధాన్యాలు, భోగభాగ్యాలు, అధికారము, పుత్రపౌత్రాదిసంతతి, సిరిసంపదలు కలుగుతాయి. దీనిని అనుసరించేవారు పూజలు, వ్రతాలు, హోమాలు, అర్చనలు, తర్పణలు, యజ్ఞయాగాదులు చేస్తారు. భక్తుడు భగవంతుడు వేరువేరు అని వీరి భావన. భగవంతుణ్ణి గనక పూజించినట్లైతే భక్తులకు కావలసిన వరాలిస్తాడు అనేది వీరి నమ్మకం. ఆ కోరికల సాధనకోసమే వీరు భగవంతుణ్ణి అర్చిస్తారు. ఇది సగుణారాధన.

కర్మలు ఆచరించటంవల్ల పుణ్యలోకాలు వస్తాయి. ఉత్తమజన్మలు కలుగుతాయి. మరణానంతరము స్వర్గసౌఖ్యాలనుభవించి ఉత్తమజన్మ ఎత్తుతాడు. మళ్ళీ కర్మ చేస్తాడు. ఈ రకంగా కర్మలు చెయ్యటం, జన్మలు ఎత్తటం, మరణించటం చేస్తుంటాడు.

**పున రపి జననం పున రపి మరణం**

అంతేకాని అతడికి కర్మలవల్ల మోక్షం మాత్రంరాదు. మరి మోక్షం రావాలి అంటే పరావిద్యను ఆశ్రయించాలి. అదే బ్రహ్మవిద్య. ఇది నిర్గుణారాధన.

నిర్వికారుడు అయిన పరమేశ్వరుడు చరాచరజగత్తంతా ఆవరించి ఉన్నాడు. ఈ జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. ఛాందోగ్యోపనిషత్తులో సత్యకామజాబాలికి ఒక ముసలి ఆంబోతు చెబుతుంది. సత్యకామా పరబ్రహ్మ నాలుగుపాదాలుగా ఉంటుంది. అందులో మొదటిపాదం. ఈ విశాలవిశ్వంలో నాలుగుదిక్కులూ పరబ్రహ్మలో ఒక పాదం.

భూమి, ఆకాశం, సముద్రాలు, నదులు, పర్వతాలు పరబ్రహ్మలో రెండోభాగం అని అగ్ని చెబుతుంది.

అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు పరబ్రహ్మలో మూడోభాగం అని ఒక హంస చెబుతుంది.

ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రవణం బ్రహ్మ, మనస్సు బ్రహ్మ. ఇది నాల్గవపాదం. అని నీటిపక్షి చెబుతుంది. అలాగే ఉపకోశలుడికి ఆశ్రమంలోని అగ్నులు బ్రహ్మవిద్యను ఉపదేశం చేస్తూ

"ఉపకోశలా ! ప్రాణమే బ్రహ్మ, ఆకాశమే బ్రహ్మ, ఆనందమే బ్రహ్మ, భూమి సూర్యుడు, చంద్రుడు, ఆ పరబ్రహ్మరూపాలే. సూర్యునిలో ఉన్న బ్రహ్మతత్త్వం, నీ లోఉన్న బ్రహ్మతత్త్వం నాలో ఉన్నతత్త్వం. అన్నీ ఒకటే. తూర్పు పడమర ఉత్తర దక్షిణాలు, నేల, నీరు, నింగి, నక్షత్రాలు, అన్నీ ఒకటే. ఆకాశంలోని మెరుపులో ఏతత్త్వమైతే ఉన్నదో అదే నీలోనూ నాలోనూ కూడా ఉన్నది" అంటాయి.

తైత్తిరీయోపనిషత్తులో వరుణ మహర్షి కుమారుడు భృగుమహర్షి. అపరావిద్యలో నిష్ణాతుడు. తండ్రి దగ్గరకు వచ్చి బ్రహ్మవిద్యను బోధించమని అడుగుతాడు. తండ్రి ఆజ్ఞమీద కొంతకాలం తపస్సుచేసి ఆ తరువాత తెలుసుకుంటాడు భృగువు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశాలనడుమ ఆనందమయకోశమున్నది అదే పరబ్రహ్మ నివాసస్థానము. ఆనందమే పరబ్రహ్మ స్వరూపము. లోకంలో సిరిసంపదలు, భోగభాగ్యాలు సుఖాలు అన్నీ ఆరోగ్యవంతుడు, ధనవంతుడు, వేదవేదాంగవిదుడు, కర్మిష్ఠి అయిన పురుషుడు అనుభవించటానికే ఉన్నాయి. అతడు అనుభవించే ఆనందం మానుషానందం.

| | | |
|---|---|---|
| మానుషానందానికి నూరురెట్లు | – | మానవగంధర్వానందం. |
| మానవగంధర్వానందానికి నూరురెట్లు | – | దేవగంధర్వానందం |
| దేవగంధర్వానందానికి నూరురెట్లు | – | పిత్రృదేవానందం |
| పిత్రుదేవానందానికి నూరురెట్లు | – | అజానజదేవానందం |
| అజునజదేవానందానికి నూరురెట్లు | – | కర్మదేవానందం |
| కర్మదేవానందానికి నూరురెట్లు | – | దేవానందం |
| దేవానందానందానికి నూరురెట్లు | – | ఇంద్రానందం |
| ఇంద్రానందానికి నూరురెట్లు | – | బృహస్పతి ఆనందం |
| బృహస్పతి ఆనందానికి నూరురెట్లు | – | ప్రజాపతి ఆనందం |
| ప్రజాపతి ఆనందానికి నూరురెట్లు | – | బ్రహ్మానందం |

ఇది శాశ్వతమైన ఆనందం.

ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మవిద్యను బోధిస్తూ "జీవులు ఏరూపంలో ఉన్నప్పటికీ అనంతచైతన్య సముద్రంలో కలిసిపోయిన తరువాత వాటి

నామరూపాలు పోగొట్టుకుంటాయి. అవి అన్నీ ఏ ఏతత్వంలో కలిసిపోతాయో. అదే బ్రహ్మ. అది అద్వితీయమైనది. సూక్ష్మమైనది సర్వవ్యాపకమైనది. తత్త్వమసి.అదే నీవు. శ్వేతకేతూ అదే నీవు" అంటాడు.

మాండకోపనిషత్తులో "ఒకే రూపము, పేరుగల పక్షులు రెండు ప్రపంచమనే వృక్షాన్ని ఆశ్రయించి ఉన్నాయి. అందులో ఒకటి జీవాత్మ. రెండవది పరమాత్మ. జీవాత్మ తన కర్మలవల్ల వచ్చిన ఫలితాలను అనుభవిస్తోంది. పరమాత్మ కర్మఫలం ఏమీ లేకుండా కూర్చుంది. శరీరమే ఆ వృక్షం. ఆ పక్షులే క్షేత్రజ్ఞ పరమాత్మలు. వారిద్దరూ వేరుకాదు. మాయలోపడిన జీవుడు తానూ పరబ్రహ్మ వేరనుకుంటాడు. కాని ఎప్పుడైతే ఆ మాయ తొలగిపోయిందో అప్పుడు ఆ జీవుడు పరమాత్మలో లీనమయిపోతాడు. అని చెప్పబడింది.

ఈ రకంగా ఉపనిషత్తులలో అనేకచోట్ల, అనేకసార్లు చెప్పబడింది బ్రహ్మవిద్య. దీని సారాంశం. జగత్తులోని జీవులన్నీ ఒక్కటే. ప్రాణమున్నవి ప్రాణంలేనివి, చలనమున్నవి, చలనములేనివి, కొండలు, బండలు, నదులు, సముద్రాలు, చెట్లు, చేమలు, క్రిమికీటకాలు, పశుపక్ష్యాదులు, జంతువులు, మృగాలు, మానవులు. వీరందరిలోని ఆత్మపదార్థం ఒక్కటే. అదే పరబ్రహ్మ.

కర్మలు ఆచరించటంవల్ల వచ్చే ఫలితం అశాశ్వతం. పుణ్యలోకాలు, స్వర్గసుఖాలు అన్నీ అశాశ్వతం. ఈ లోకంలో మనం పొందే ఆనందం అశాశ్వతం. శాశ్వతమైన ఆనందం ఒక్కటే. అదే బ్రహ్మానందం. అదే పరమేశ్వరుడు పొందే ఆనందం.

ఈ విషయాన్నే ఇక్కడ 357 నుంచి 365 వరకు నామాలలో వివరించటం జరిగింది. ఇదే తరుణీవిద్య లేదా బ్రహ్మవిద్య. సర్వకాల సర్వావస్థల యందు షోడశవర్షీయగా ఉండే పరమేశ్వరి జ్ఞానస్వరూపిణి. ఆవిడ శ్రీచక్రమందుంటుంది. ఈమె పరబ్రహ్మస్వరూపిణి కాబట్టి తాపసులచే ఆరాధించబడుతుంది. ఈ తాపసులంతా దృష్టిని అంతర్ముఖం చేసి పరమేశ్వరిని తమదేహంలోనే భావించి, తామే పరబ్రహ్మస్వరూపంగా తలచి తమలో ఉన్న ఆత్మపరబ్రహ్మస్వరూపంగా తలచి తమలో ఉన్న ఆత్మనే అర్చిస్తారు. అది నిర్గుణోపాసన. ఈ ఉపాసనలో మంత్ర తంత్రాలుండవు. కోరికలు అంతకన్నా ఉండవు. జీవాత్మ పరమాత్మల ఏకీభావమే వీరి ఏకైక లక్ష్యం. ఈ దేవిని అర్చించినట్లైతే, వారి యొక్క అజ్ఞానం తొలగించి, జీవాత్మపరమాత్మ రెండూ ఒకటే అనే బ్రహ్మవిద్యను వారికి ఉపదేశం చేసి వారికి సాయుజ్యం ప్రసాదిస్తుంది. ఇక నామాలను చూద్దాం.

## 357. తాపత్రయాగ్నిసం తప్తసమాహ్లాదనచంద్రికా

తాపత్రయము అనేటటువంటి సంసార లక్షణాలు గల అగ్నిచే దహించబడతున్న మానవులకు ఆహ్లాదము కలిగించునది. లేక తాపోపశమనము కలిగించునది. తాపత్రయాలు మూడురకాలు 1. ఆధ్యాత్మికము 2. ఆదిభౌతికము 2. ఆదిదైవికము.

1. ఆధ్యాత్మికములు – శరీరంలోకలిగే వ్యాధులు, మానసికమైన కామము, క్రోధము, జ్వరము, అలసత్వము, కపటము అవిశ్వాసము, అశ్రద్ధ మొదలైనవి.

2. ఆదిభౌతికములు – అగ్ని, వరద, భూకంపాలు, కుక్కల ఏడ్పులు, గుడ్లగూబల అరుపులు, కుక్కలు, నక్కలు, పులులు, పాములు మొదలగు వాటివల్ల కలిగే బాధలు.

3. ఆదిదైవికములు – దేవతావిగ్రహాల కన్నీరు, ఎండ, వాన, గాలి, యక్ష, రాక్షస, పిశాచాల వలన కలిగే బాధలు. ఈ మూడు తాపత్రయము అనబడతాయి. తాపము అంటే – అగ్ని యొక్క గుణము. కాబట్టి ఇది అగ్ని లాగానే దహించివేస్తుంది. ఇటువంటి బాధను ఆ పరమేశ్వరి చల్లార్చి ఆహ్లాదంగా మారుస్తుంది. ఆ పరమేశ్వరిని గనక నమ్మి, ఆమెనే ఆరాధించినట్లైతే భక్తుల యొక్క తాపత్రయాన్ని ఆమె చల్లార్చివేస్తుంది.

## 358. తరుణీ

**నిత్య తారుణ్య త్వా త్తరుణి**

ఎల్లప్పుడూ యవ్వనము గలది. ఎప్పుడూ ఒకే రీతిగా ఉండేది. **సదా షోడశ వర్షీయాం** ఎప్పుడూ పదహారు సంవత్సరాల వయసులోనే ఉండేది. నిత్యయవ్వనసంపన్న. ఎప్పుడూ తరుణిగానే ఉంటుంది. కాబట్టి నిత్యానందస్వరూపిణి. అందుచేతనే ఆ పరమేశ్వరి తరుణీ అనబడుచున్నది.

## 359. తాపసారాధ్యా

తపోవంతులైన మునీశ్వరులచే, ఋషీశ్వరులచే ఆరాధింపబడునది. సంసార బంధనాలలో చిక్కుకున్న వారిచే ఆరాధింపదగినది.

తపము అంటే – మితంగా భోజనం చెయ్యటం. ఉపవాసము, చాంద్రాయణ వ్రతాదులచే శరీరాన్ని శుష్కింపచెయ్యటం – ఆకలి దప్పికలు, శీతోష్ణాలు మొదలగు వాటిని సహించటం – మనోవాక్కాయకర్మలచే ఏకాగ్రత సాధించటం – ఇంద్రియాలను బుద్ధిలో లయం చేసి, ఆ బుద్ధిని పరమేశ్వరుని యందు లయం చేయ్యటం. ఈ పనులు

చేసేవారు సర్వభూతముల యొక్క హితవును కోరాలి. సాధువర్తన కలిగి ఉండాలి. అటువంటి ఉపాసక శ్రేష్ఠులను తాపసులు అంటారు. ఇటువంటి తాపసులచేత ఆ పరమేశ్వరి ఉపాసించబడుతుంది. అందుచేతనే ఆమె తాపసారాధ్యా అనబడుతోంది.

## 360. తనుమధ్యా

సన్ననినడుము గలది. కృశించిన నడుము గలది. దేవి సూక్ష్మరూపమైన మధ్య ప్రదేశము గలది. సాముద్రిక శాస్త్రంలో నడుము సన్నగా ఉండటం శుభసూచకము. సౌందర్యలక్షణము.

పరమేశ్వరి నివాసస్థానం శ్రీచక్రం. శ్రీచక్రమనేది శివశక్తుల సంగమస్థానం. అందులో తొమ్మిదవ ఆవరణ అయిన బిందువునందు ఆ పరమేశ్వరి ఉంటుంది. కాబట్టి ఆ దేవి తనుమధ్యా అనబడుతుంది.

పురుషుని శరీరంలో సుషుమ్నానాడి యందు ఉండునది. కాంచీపురంలో తను మధ్యా అనే దేవత ఉన్నది. తను మధ్య అనేది ఒక రకమైన ఛందస్సు.

**మాం పాతు నీవాయా స్తీరే నివసంతీ బిల్వేశ్వరకాంతా దేవీ తనుమధ్యా**

నీవా నదీతీరంలో ఉన్న తనుమధ్య అనే పేరుగల బిల్వేశ్వరుని దేవి నన్ను రక్షించుగాక.

## 361. తమోపహా

అవిద్య, అజ్ఞానములను పోగొట్టేది. ఉపాసకుల యొక్క అజ్ఞానము పోగొట్టి బ్రహ్మజ్ఞాన్ని ఇచ్చేది అవిద్య. ఇది అజ్ఞానము. కర్మకాండలవల్ల మోక్షం వస్తుంది అనుకోవటం అజ్ఞానం. పూజలు, వ్రతాలు, అర్చనలు, యజ్ఞ యాగాదులు అన్నీ కూడా ద్వైతభావనతో ఉన్నవే. ఈ కర్మలు చెయ్యటంవల్ల లౌకికమైన కోరికలు తీరతాయి. అంతేకాని మోక్షం మాత్రం రాదు. అందుకే ఈశావాశ్యోపనిషత్తులో

**అంధంతమః ప్రవిశంతి యేఽ విద్యాఉపాసతే ।**
**తతో భూయ ఇవ తే తమోయఉ విద్యాయాగ్ం రతాః ॥**

అవిద్యను ఆరాధించేవారు గాఢాంధకారంలో ప్రవేశిస్తారు. యజ్ఞతత్త్వ విజ్ఞానాన్ని ఆనందించేవారు అంతకన్న అంధకారంలో ప్రవేశిస్తారు.

యజ్ఞాలవల్ల, కర్మకాండలవల్ల, పుణ్యఫలితాలు వస్తాయి. వాటివల్ల ఉత్తమజన్మలు కలుగుతాయి. అంతేకాని మోక్షంరాదు. అందుకే వాటిని అవిద్య అన్నారు. అందుచేతనే

అవిద్య నాశ్రయించినవారు అంధకారంలో పడిపోతారు. అటువంటి అవిద్యను నాశనంచేసి భక్తులకు మోక్షాన్ని ప్రసాదిస్తుంది ఆ పరమేశ్వరి.

## 362. చితిః

అవిద్యకు శత్రువు చితి. చితి అంటే – జ్ఞానము స్వతంత్రమైనది. విశ్వసిద్ధికి కారణమైనది. అజ్ఞానవిరుద్ధమైనస్థితి. చరాచరజగత్తులో బ్రహ్మపదార్థము అని దేన్నైతే చెబుతున్నామో అది చితి. కేవలము జడమైనటువంటి ప్రకృతిని చైతన్యవంతంచేసేది చితి. జ్ఞాత జ్ఞాన జ్ఞేయముల యొక్క స్వరూపమే చితి. ఇది సంకల్పములు లేనిది. సంజ్ఞలు లేనిది. ఈ జగత్తులో మొత్తం 84 లక్షల జీవరాసులున్నాయి. వాటిలో

| | | |
|---|---|---|
| స్థిరంగా, కదలిక లేకుండా ఉండేవి | – | 20 లక్షలు |
| జలచరాలు | – | 9 లక్షలు |
| క్రిమికీటకాలు | – | 11 లక్షలు |
| మానవులు | – | 4 లక్షలు |
| మృగాలు | – | 30 లక్షలు |
| పక్షులు | – | 10 లక్షలు |
| మొత్తం జీవరాసులు | – | 84 లక్షలు |

వీటన్నింటియందు చిత్కళారూపంలో ఉండేది చితి. ఇదే జీవము. సర్వస్వానికి సాక్షీభూతము అయిన ఆ పరమేశ్వరి ఈ రూపంలోనే ఉంటుంది. అందుకే ఆమె చితి అనబడింది.

## 363. తత్పదలక్ష్యార్థా

తత్త్వమసి అనే మహావాక్యాలయందు గల తత్ అనే పదము. ఇది శబళ బ్రహ్మను తెలుపుతుంది. పరమేశ్వరి జీవాత్మ పరమాత్మల ఏకీభావం తెలుపుతుంది. హకారసంజ్ఞ గల పరమేశ్వరుడు సకారసంజ్ఞ గలిగిన ప్రకృతితో కలసి శబళబ్రహ్మమై, తొమ్మిది ద్వారాలుగల మానవశరీరము అనే పట్టణంలో ప్రవేశించి, ఇంద్రియములు, ప్రాణములు, మనస్సుతో కూడినవాడై పంజరంలో బంధించబడిన పక్షిలాగా బయటకువచ్చే ఉపాయం తెలియక ప్రాపంచిక బంధనాలతో కొట్టుమిట్టాడుతున్నాడు. అతడే జీవాత్మ. జీవాత్మ పరమాత్మ వేరుకాదు. రెండూ ఒక్కటే. ఈ జీవాత్మను వచ్చిన దారి గుండానే గనక బయటకు పంపగలిగినట్లైతే అతడు పరబ్రహ్మలో లీనమవుతాడు. కాబట్టి ఆ పరమాత్మా ఈ జీవాత్మ రెండూ ఒకటే. ఈ విషయాన్ని తన భక్తులకు తెలియచెయ్యటమే ఆమె యొక్క విలక్ష్యము అందుచేతనే పరమేశ్వరి తత్పదలక్ష్యార్థా అనబడుతోంది.

## 364. చిదేకరసరూపిణీ

చిత్ ఏకరసముగా గలవి. చిదేకరసములు. వాటియొక్క స్వరూపమే ఆ దేవి. అందుకే చిదేక రసరూపిణి అనబడుతోంది. చైతన్యాది ధర్మాలు ఈమె యందు ఉన్నాయి. అంటే ఆనందము, చైతన్యము ఆమెకన్న వేరైనవికావు. "ఆనందము, విషయానుభవము, నిత్యత్త్వము అనే ధర్మాలు చైతన్యం కన్న వేరైనవికావు. కాని వేరైనట్లుగా కనిపిస్తాయి" అని పంచపాదికలో చెప్పబడింది.

సృష్టి స్థితి లయాలు చేసే ఈశ్వరుడికి, పరబ్రహ్మకు భేదంలేదు. ఈశ్వర కలకు బ్రహ్మ కలకు భేదమున్నట్లు కనిపిస్తుంది. అంతేకాని వారికి భేదం లేదు. కాబట్టి ఆ పరమేశ్వరి చిద్రూపిణి. జ్ఞాన రూపిణి. చిదేక రసరూపిణి.

పరమేశ్వరి చిదానంద స్వరూపురాలు. ఆనందఘనస్వరూపిణి. చిదానందమను ఏకరసమే స్వరూపముగా గలది. అందుచేతనే ఆమె చిదేకరసరూపిణి.

## 365. స్వాత్మానందలవీభూతబ్రహ్మాద్యానందసంతతిః

పరమేశ్వరి యొక్క ఆనందము అనిర్వచనీయమైనది. అది అనుభవైకవేద్యము. ఆనందము అనేకరకాలుగా ఉంటుంది. అవి

1. మానుషానందం
2. మానవగంధర్వానందం
3. దేవగంధర్వానందం
4. చిరలోకపితరానందం
5. అజానజదేవానందం
6. దేవానందం
7. బృహస్పతిఆనందం
8. ఇంద్రానందం
9. ప్రజాపతి ఆనందం
10. బ్రహ్మానందం

ఇవన్నీ ఒకదానికన్న ఒకటి నూరురెట్లు ఉంటాయి. ఇతరమైన ఆనందాలు పరమేశ్వరి పొందే బ్రహ్మానందంతో పోలిస్తే చాలా తక్కువైనవి. అందుచేతనే పరమేశ్వరి స్వాత్మానందల వీభూత బ్రహ్మాద్యానంద సంతతిః అని చెప్పబడింది.

ఈ రకంగా ఈ నామాలలో జీవాత్మ పరమాత్మ ఒకటే వేరుకాదు అనే అద్వైతసిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ మానవులు పొందే ఆనందం, ఆ పరమేశ్వరి పొందే బ్రహ్మానందంలో ఎన్నోవంతో చెబుతూ, శాశ్వతమైన ఆనందం పొందటానికి, ఆ పరమేశ్వరి తన భక్తులకు సాయపడుతుంది. అని చెప్పబడింది.

# ౩౦. వాగీశ్వరీ స్వరూపము

వాక్కు యొక్క స్వరూపాన్ని ఇక్కడ వివరించటం జరుగుతోంది. వాక్కు అనేది పరమేశ్వరి స్వరూపం. కౌళసమయాచారులు అంతా ఈ మాటను ఒప్పుకుంటారు. వాక్కుకు నాలుగురూపాలున్నాయి. అవి. 1. పరా 2. పశ్యంతీ 3. మధ్యమా 4. వైఖరి.

పరాస్థానం వాక్కుకు ప్రథమస్థానం. అక్కడ ఆలోచన పుడుతుంది. ఆతరువాత పశ్యంతీస్థానం రెండవది. వాక్కు యొక్క రూపాలలో కౌళ సమయులకు భేదంలేదు. ఎటొచ్చీ వాక్కు యొక్కస్థానాలలోనే వారికి భేదం. సమయాచారుల ప్రకారం పరావాక్కుకు స్థానం సహస్రారం. పశ్యంతిస్థానం ఆధారచక్రం. కాగా కౌళాచారులకు పరావాక్కు యొక్క స్థానం మూలాధారం. పశ్యంతీ వాక్కుస్థానం మణిపూరం. అక్కడి నుంచి ముందుకు వెడితే మధ్యమ, వైఖరిస్థానాలలో గాని, ఆరూపాలలోగాని వారికి తేడాలేదు. ఉన్న తేడా ఏమిటంటే అల్లా పరా, పశ్యంతీ వాక్కులస్థానాలలోనే.

ఏదైనా విషయం చెప్పాలి అంటే ముందుగా ఆలోచన రావాలి. అదే పరావాక్కు. ఆ తరువాత వాక్కు ఆధారచక్రం నుండి బయలుదేరి నెమ్మదిగా స్వాధిష్ఠానమణిపూరాలు దాటి అనాహంతచేరి అక్కడ నుండి కంఠస్థానమైన విశుద్ధిచేరి, ముఖం ద్వారా స్పష్టమైన వైఖరీ వాక్కుగా, నామరూపాత్మకమైనదిగా బయటకు వచ్చి శబ్దతరంగాలుగా చెవి రంధ్రాన్ని చేరుతుంది.

పరావాక్కు – ప్రత్యక్చితీ రూపం గలది. అంటే అవ్యక్తమైనది

పశ్యంతీవాక్కు – పరదేవతా అనబడుతుంది. ఇది పూర్తి అస్పష్టమైనది. అప్పుడే పుట్టిన పిల్లవాడి ఏడుపులా ఉంటుంది.

మధ్యమావాక్కు – పూర్తిగా అస్పష్టం కాదు. అలా అని స్పష్టమూ కాదు. మాటలు వచ్చీరాని  పిల్లలు మాట్లాడినట్లుంటుంది. ఇది పూర్తిగా హల్లులతో కూడినది.

వైఖరీవాక్కు – ఇది స్పష్టమైనవాక్కు

ఇది వాక్కు యొక్క స్వరూపం. వాగీశ్వరీదేవి. ఈ దేవి సదా తనను ధ్యానించే భక్తుల హృదయాలలో ఉంటుంది. మాయాశబలితమైన పరమేశ్వరుని రూపానికి ముఖ్యప్రాణనాడి అయిన సుషుమ్న ఈమె. ఈదేవికి భూతభవిష్యద్వర్తమానాలు తెలుసు. చరాచరజగత్తులో ఏ జీవి ఎప్పుడు ఏ పనిచేస్తోందో గమనిస్తుంటుంది. అన్నిటికీ సాక్షి ఆదేవత. ఆమె సాక్షాత్తూ పరమేశ్వరుడైన మహాకామేశ్వరునితో పూజించబడింది.

ఈ విషయాలను 366 నుంచి 374నామం వరకు వివరించటం జరిగింది. మాతృకలు నాలుగువిధాలుగా ఉంటాయి. అవి 1. స్థూలము. 2. సూక్ష్మము 3. సూక్ష్మతరము 4. సూక్ష్మతమము. ఇప్పుడు వాగ్రూపాలలో

1. స్థూలము – వైఖరీవాక్కు 3. సూక్ష్మతరము – పశ్యంతివాక్కు
2. సూక్ష్మము – మధ్యమావాక్కు 4. సూక్ష్మతమము – పరావాక్కు

ఇక నామాలను చూద్దాం. వాగ్రూపాలను ఈ రకమైన శక్తులుగా గ్రహించాలి.

| | | | | |
|---|---|---|---|---|
| పరా | – | అంబిక | – | శాంతా |
| పశ్యంతీ | – | ఇచ్ఛా | – | వామ |
| మధ్యమా | – | జ్ఞాన | – | జ్యేష్ఠా |
| వైఖరి | – | క్రియా | – | రౌద్రీ |

## 366. పరా

బిందువే పరారూపము. ప్రళయం సంభవించినప్పుడు నామరూపాత్మకమైన జగత్తు అంతా కనిపించకుండా పోతుంది. అంటే లయమయిపోతుంది. అంటే మాయతో కలిసి పరబ్రహ్మలో లీనమయిపోతుంది. గతంలో చెప్పినట్లుగా భూమి జలంతోను, జలం – నిప్పులోను, నిప్పు – వాయువునందు, వాయువు – ఆకాశమునందు, ఆకాశం మాయలోను లీనమవుతున్నాయి. ఈ రకంగా రూపాత్మకజగత్తు లయం చెందుతోంది. అలాగే శాస్త్రాలు పురాణాలు ఇతిహాసాలు అన్నీ వేదాలలో కలిసిపోతాయి. వేదాలు అకార ఉకార మకారాలలో లీనమవుతాయి. అకార, ఉకార, మకారాలు మాయలో కలిసిపోతాయి. ఈ రకంగా నామరూపాత్మక జగత్తంతా మాయలో లీనమయిపోతుంది. ఈ మాయ పరమేశ్వరుడిలో లీనమవుతుంది.

సృష్టి ఆరంభమైనప్పుడు పరమేశ్వరుడి నుండి మాయ బయటకు వచ్చేస్తుంది. అదే శక్తి. త్రికోణము. ఈ రకంగా బిందువు త్రికోణములవల్లనే మళ్ళీ నామ రూపాత్మక జగత్తు ఏర్పడింది. వీటివల్లనే 24 తత్త్వాలు ఏర్పడ్డాయి. నాలుగు వాగ్రూపాలు ఏర్పడ్డాయి. ఈ వాగ్రూపాలే నామాత్మకశాఖ. ఈరకంగా వచ్చిన వాక్కు ముందు అవ్యక్తంగా ఉండి రానురాను వ్యక్తమవుతుంది. అవ్యక్తమైన వాక్కునే పరావాక్కు అంటారు.

ఏదైనా పనిచెయ్యాలంటే ముందుగా ఆ పనిని చెయ్యాలి అనే కోరిక ఉండాలి. ఆ కోరికనే 'విచికీర్షా' అంటారు. అంటే పని చెయ్యటానికి ముందటిస్థితి. ఏదో చెప్పాలి అనుకున్నాడు మానవుడు. అప్పుడు ముందుగా చెప్పాలి అనే కోరిక కలగాలి. ఆ కోరికనే పరావాక్కు అంటారు. ఈ కోరిక అనేది. సహస్రారంలో పుడుతుంది. అదే పరాస్థానము. అందుకే దీన్ని పరావాక్కు అంటారు. పరమేశ్వరునికి మల్లేనే వాక్కు కూడా ఇక్కడ అవ్యక్త రూపంలో ఉంటుంది. అందుచేతనే అది పరావాక్కు. ఇది సమయ మతస్థుల సంప్రదాయం.

కాని కౌళాచారుల ప్రకారం వాక్కుకు జన్మస్థానము మూలాధారము. ఇక్కడ ఇది గాలిబుడగలాగా ఉంటుంది. అదే పరావాక్కు. కుండలినీ శక్తియే ఆధారచక్రంలో పరదేవత. అందుచేతనే అక్కడి వాక్కు పురావాక్కు అనబడుతోంది. వామకేశ్వరతంత్రంలో కుండలిని గురించి చెబుతూ

**భుజంగాకార రూపేణ మూలాధారం సమాశ్రితా**

**................. సా చా వస్థా పరా జ్ఞేయ శైవర్వృతికారణమ్**

కుండలినీ శక్తి నిద్రావస్తలో ఉన్న సర్పాకారంలో ఆధారచక్రంలో స్వయంభూలింగానికి మూడున్నర చుట్లు చుట్టుకుని నిద్రావస్థలో ఉన్నది అని చెప్పుతూ కుండలినీశక్తిని నిద్రలేపినట్లైతే అది బ్రహ్మ విష్ణు రుద్రగ్రంథులు ఛేదించుకుని పరాస్థానం చేరుతుంది. అని చెప్పబడింది. ఈ విషయాన్ని గతంలో వివరించాం. కుండలిని పరాస్థానం చేరుతుంది. కాబట్టే ఈ వాక్కును పరావాక్కు అంటారు.

## 367. ప్రత్యక్చితీరూపా

అంతర్ముఖముగ స్వాత్మను పొందటం ప్రతీచి అనబడుతుంది. ఈ రకంగా ఆత్మజ్ఞానం పొందటం 'ప్రత్యక్చితి' అనబడుతుంది. అంటే అవ్యక్తమైన బ్రహ్మ స్వరూపం గలది. అంతర్గతమైనటువంటి జ్ఞానస్వరూపురాలు.

పరా అనే నామంలో ఉన్న పరదేవతయే సాక్షి స్వరూపము. ఈ శక్తి విజృంభించింది అనే విషయము జ్ఞానము వల్లనే తెలుస్తుంది. పరావాక్కు అంటే – స్వస్వరూపజ్ఞానమే. పరమేశ్వరి శబల బ్రహ్మాకారమైన జ్ఞానస్వరూపురాలు. అందుచేతనే ఆమె ప్రత్యక్చితీ రూపా అనబడుతోంది.

# 368. పశ్యంతీ

పశ్యత్ – చూచుచున్న. పశ్యంతీ – చూచునది అని అర్థం. దీనికే ఉత్తీర్ణ అనే పేరు కూడా ఉన్నది. సౌభాగ్యసుభోదయంలో

**పశ్యతి సర్వం స్వాత్మని కరణానాం సరణి మపి ।**
**య దుత్తీర్ణా తే నేయం పశ్యంతీ త్యుత్తీర్ణేత్యప్యుదీర్యతే ॥**

అన్నింటిని తన ఆత్మనందు చూచునది. అన్ని పనులకు మార్గమును దాటినది కాబట్టి పశ్యంతీ అని, ఉత్తీర్ణ అని అనబడుచున్నది.

పరావాక్కు యొక్క విస్తరణమే పశ్యంతి. పరా అంటే శ్రీచక్రంలోని బిందువు. పశ్యంతీ అంటే బిందువు నుంచి వచ్చిన త్రికోణము. మూలాధారం దగ్గరనుంచి ఆజ్ఞాచక్రం వరకు షట్చక్రాలలోని దళాలలో ఉన్న అక్షరాలు మాతృకావర్ణాలు అనబడతాయి. ఈ మాతృకావర్ణాలన్నీ పశ్యంతీ రూపాలు. వాక్కు యొక్క ధ్వని వాయురూపంలో ఉంటుంది. ఏదైనా ఒక శబ్దం అయింది అంటే ఆ శబ్దాన్ని ధ్వని తరంగాలు దూరతీరాలకు మోసుకుపోతాయి. అందుచేతనే ఆ శబ్దం చాలా దూరం వరకు వినబడుతుంది. ఇక్కడ పరావాక్కుకు, మధ్యమావాక్కుకు మధ్యలో ఉండేది పశ్యంతీవాక్కు. పరాస్థానంలో నుంచి బయలుదేరిన వాక్కుకు రెండవరూపము పశ్యంతి. ఇది వాక్కు యొక్క మొదటి విశ్రాంతి స్థానము అని కూడా అనవచ్చు. ఈ వాక్కును ఇంద్రియాల ద్వారా వినలేము.

గతంలో చెప్పినట్లుగా పరావాక్కు సహస్రారంలో ప్రారంభమవుతుంది. ఇది వాక్కుకు మొదటిదశ. అక్కడ నుంచి మూలాధారం చేరి గాలిబుడగ రూపం ధరిస్తుంది. అది పశ్యంతి.

అయితే పరాస్థానంలో ఆలోచనారూపంలో ఉన్న వాక్కు వాయురూపంలో సుషుమ్న గుండా ఆధారచక్రంలోకి చేరుతుంది.

మూలాధారమనేది పరమేశ్వరికి ప్రతిబింబము. మాయాస్వరూపము. సహస్రారంలో బిందువున్నది. అదే పరాశక్తి. పరావాక్కు. కాగా ఆధారచక్రం త్రికోణం. అవ్యక్తము. ఇక్కడ పశ్యంతీ వాక్కుంటుంది. ఇదే మూలప్రకృతి. చరాచరజగత్తుకు సృష్టి స్థానము. త్రికోణము నుంచే ఈ జగత్తంతా ఆవిర్భవించింది అని గతంలోనే చెప్పాము.

పశ్యంతీవాక్కు మొలకవచ్చిన ధాన్యపుగింజలా ఉంటుంది. కాబట్టి అది ఏ వృక్షమో స్పష్టంగా తెలియదు. అదే ఏదో మొక్క అని మాత్రమే తెలుస్తుంది. ఈ రకంగా పశ్యంతీవాక్కు అస్పష్టంగా ఉంటుంది.

**యత్మంద్రయతే తస్మా త్కుమారీ**

పుట్టిన శిశువు ఏడుపులాగా ఆధారచక్రంలోని వాగ్దేవత మంద్రస్వరంతో ఉంటుంది. అందుకనే అది అస్పష్టమైనవాక్కు.

ఇక్కడ 'కుమారీ' అనే పదంవాడారు. కుమారీ అంటే – తొమ్మిదిసంవత్సరాల బాలిక. బాలాత్రిపురసుందరి అని అర్థం.

ఇంతవరకు చెప్పినది. సమయాచారుల పద్ధతి ప్రకారం వివరణ. ఇక కౌళాచారుల పద్ధతి గనక చూస్తే పరావాక్కు స్థానము ఆధారచక్రం అని ముందే చెప్పాం. ఎందుకంటే కౌళులకు సహస్రారంతో పనిలేదు. వారికి ఆధారస్వాధిష్ఠానాలే ప్రధానం. ఆధార చక్రంలోని పరావాక్కు మణిపూరం చేరుతుంది. ఇది రెండోస్థానం. ఇక్కడ వాక్కు పశ్యంతీ అనబడుతుంది.

## 369. పరదేవతా

**పరా ఉత్కృష్టా చాసౌ దేవతా చ – పరదేవతా**

ఉత్కృష్టమైన దేవత. ఉపాసించదగిన పరమేశ్వరి దేవదేవి. ఆమే పరదేవత.

పరా అన్నప్పుడు వివరించబడిన దేవత బిందురూపంలో ఉంది. ఆ బిందువు నుంచి బయటకు వచ్చిన పశ్యంతి పరదేవతా అనబడుతోంది. ఈ పశ్యంతీస్థానంలో ఉండే దేవతను ఇంద్రియాల ద్వారా తెలుసుకోలేము. దీన్ని మనసుతో తెలుసుకోవచ్చును. అందుచేతనే ఈమె ధ్యేయమాత్రస్వరూపిణి.

**వేదశాస్త్రమయీ వాణీ యస్యాః సా పరదేవతా**

ఎవరి వాక్కులు శ్రుతి స్మృతులో ఆమె పరదేవత.

## 370. మధ్యమా

**మధ్యే స్థితా మధ్యమా** మధ్యయందుండునది. మధ్యమా అను వాక్స్వరూపిణి.

**పశ్యంతీపన కేవలముత్తీర్ణా నాపి వైఖరీవబహిః ।**

**స్ఫుటతర నిఖిలావయవ వాగ్రూపా మధ్యమా తయోః ఆస్మా ॥**

ఆమె పశ్యంతి వంటిది కాదు. వైఖరివలె సమస్తావయవములతో స్పష్టముగా బయటకు వచ్చేదికాదు. ఆ రెండింటి మధ్యలో మధ్యమావాగ్రూపముతో ఉండునది.

పశ్యంతీ వాక్కు దాటిన తరువాత, వైఖరికి ముందు అంటే ఈ రెండింటిమధ్యలో ఉంటుంది. ఈ వాక్కు కూడా పరమేశ్వరి స్వరూపమే. ఇక్కడ నాదం పుడుతుంది. అంటే వాక్కు పూర్తిగా అస్పష్టం కాదు. అలా అని స్పష్టము కాదు. దీన్ని మనస్సుతో గ్రహించవచ్చును. ఇక్కడ వాక్కు మారాకు వచ్చిన ధాన్యపుగింజలా ఉంటుంది. కాబట్టి ఇది ఇదీ అని తెలుస్తుంది. కాని పూర్తిగాకాదు.

**అంతస్సంకల్పరూపా యా క్రమరూపాఽనుపాతినీ ।**
**ప్రాణవృత్తి మతిక్రమ్య మధ్యమా వా క్ప్రవర్తతే ॥**

మధ్యమావాక్కు అనాహత పద్మంలో హృదయస్థానంలో ఉంటుంది. పశ్యంతీ వాక్కు కన్న ఇందులో నాదము ఎక్కువగా ఉంటుంది. వాక్కుకు రెండవ విశ్రాంతి స్థానము అని దీన్ని చెప్పవచ్చు.

మధ్యమావాక్కును రెండురకాలుగా చెప్పవచ్చు. 1. స్థూలమధ్యమ 2. సూక్ష్మమధ్యమ.

పశ్యంతి స్థానం నుంచి మధ్యమ వరకు అంటే ఆధారచక్రం నుండి అనాహతం వరకు గల వాక్కును స్థూలమధ్యమ అంటారు. మధ్యమవాక్కు అంటే అనాహతం వరకు అక్షరసమామ్నాయంలో హల్లులు ఉంటాయి. కాబట్టి ఆధారచక్రంలో బయలుదేరిన గాలిబుడగ అనాహతం వరకు హల్లులతో కలిసి ఉంటుంది. కాబట్టి ఈ వాక్కు మాటలు సరిగారాని పిల్లవాడు చెప్పినట్లుగా అచ్చులు లేకుండా, కేవలము హల్లులతో కలిసి ఉంటుంది. అందుకని వాక్కులో భావం తెలుస్తుంది. కాని మాటలో స్పష్టత ఉండదు.

సమయ, కౌళ మతాల వారిద్దరి ప్రకారము మధ్యమావాక్స్థానము అనాహతమే. ఇందులో ఏరకమైన అనుమానం లేదు.

## 371. వైఖరీరూపా

వి అంటే – విశేషము. ఖర అనగా – కఠినము. వైఖరి – మిక్కిలి కఠినమైన రూపము గలది. ఘనభావము పొందినది. వి – నిశ్చయము, ఖం – చెవిరంధ్రమును, రి – పొందునది. వైఖరి – నిశ్చయముగ చెవిరంధ్రమును సోకునది. విఖరమను ప్రాణముచే ప్రేరేపించబడినది. వైఖరి. అని సౌభాగ్యసుధోదయంలో చెప్పబడింది. యోగశాస్త్రంలో చెప్పబడినటువంటి విఖరము అనే వాయువుచేత ప్రేరేపించబడినది. వైఖరి అనే వాగ్రూపము గల పరమేశ్వరి.

వాగధీశ్వరియే వైఖరి అనబడుతుంది. పరాస్థానంలో బయలుదేరిన వాక్కు నాలుక, దంతాలు మొదలైన స్థానాలకు తాకి స్పష్టమైన రూపం పొందుతుంది. ఆ రకంగా ముఖము ద్వారా బయటకు వచ్చి శబ్దతరంగాలరూపంలో చెవులకు చేరుతుంది. అనాహతం వరకు కేవలము హల్లులరూపంతో అస్పష్టంగా ఉన్న వాక్కు అక్కడ నుంచి విశుద్ధిచక్రం చేరుతుంది. విశుద్ధి చక్రానికి పదహారుదళాలున్నాయి. ఈ పదహారు దళాలలోను అ నుండి అః వరకు అచ్చులు ఉంటాయి. మాతృకాహృదయంలో చెప్పినట్లుగా

**కకారాది క్షకారాంతా వర్ణా స్తే శివరూపిణః ।**
**సమస్త వ్యస్తరూపేణ షట్త్రింశత్ తత్త్వవిగ్రహా ॥**
**అకారాది విసర్గాంతాః స్వరాషోడశయుక్తయః ।**
**నిత్యా షోడశకాత్మానః పరస్పర మమీయత ॥**
**శివశక్తిమయావర్ణా శబ్దార్థప్రతిపాదకా ।**
**శివః స్వరపరాధీనో న స్వతంత్రః పదాప్యసౌ ॥**
**స్వరాః స్వతంత్రా జాయంతే న శివ స్తు కథాచన.**

క నుంచి క్ష వరకు గల హల్లులు శివరూపాలు. అ నుంచి అః వరకు అచ్చులు శక్తి రూపాలు. అచ్చులు స్వతంత్రాలు హల్లులు స్వతంత్రాలుకావు. అందుచేత అనాహతం వరకు వాక్కు యొక్క స్పష్టత తెలియదు. ఈ వాక్కు విశుద్ధి చేరగానే అక్కడ ఉన్న అచ్చులతో కలిసి స్పష్టమైన రూపం పొంది ముఖం ద్వారా శబ్దరూపంలో బయటకు వచ్చి చెవులను చేరుతుంది.

అనాహతంలో వాక్కు క్ గ్ ల్ అనబడే కేవలము హల్లులరూపంలోనే ఉంటుంది. విశుద్ధి చేరిన తరువాత క్ + అ = క, గ్ + ఇ = గి అని స్పష్టమైన రూపు సంతరించుకుంటుంది.

ఈ రకంగా వాక్కు స్పష్టం కావటం నామశాఖ. స్థూలదృష్టికి గోచరమవటం అంటే చెవులకు వినిపించటం రూపశాఖ. ఈ కారణంచేతనే వాక్కు నామరూపాత్మకము అని చెప్పబడుతుంది. ఇలా వైఖరీరూపంలో స్పష్టంగా వచ్చినటువంటి వాక్కు పతివ్రత, ప్రౌఢాంగన, మహాత్రిపురసుందరి, రాజరాజేశ్వరి సదాశివుని వామాంకమందు ఆశీనురాలైన పరమేశ్వరి అని చెప్పబడుతోంది. ఈమెయే వాగీశ్వరీదేవి. మంత్రశాస్త్రంలో వాగీశ్వరీ మహామంత్రమున్నది.

అస్యశ్రీవాగీశ్వరీ మహామంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః । త్రిష్టుప్ఛందః । శ్రీవాగీశ్వరీ దేవతా । ఐం బీజం । హ్రీం శక్తిః । నమః కీలకం । జపే వినియోగః ॥

**న్యాసము** : ఓం ఐం హ్రాం । ఓం ఐం హ్రైం ।
ఓం ఐం హ్రీం । ఓం ఐం హ్రౌం ।
ఓం ఐం హ్రూం । ఓం ఐం హ్రః ॥

**ధ్యానము** : వాణీం పూర్ణనిశాకరోజ్జ్వలముఖీం కర్పూరకుందప్రభాం
చంద్రార్ధాంకిత మస్తకాం నిజకరై స్సంబిభ్రతీ మాదరాత్
వీణా మక్షగుణం సుధాఢ్యకలశం విద్యాం చ తుంగస్తనీం
దివ్యై రాభరణై ర్విభూషిత తనుం హంసాధిరూఢాం భజే ॥

**మంత్రము** : ఓం హ్రీం ఐం హ్రీం ఓం సరస్వత్యై నమః ॥

## 372. భక్తమానసహంసికా

భక్తజనుల హృదయాలలో హంసవలె నుండునది. హంసలు మానససరోవరంలో నివసిస్తాయి. ఇక్కడ భక్తుల మనస్సు అనబడే మానససరోవర మందు నివసించు ఆడుహంస (హంసి).

నాదస్వరూపిణి అయినటువంటి వాగీశ్వరీ దేవి భక్తుల హృదయములందు మంత్రరూపంలో విహరిస్తుంటుంది. ఇక్కడ భక్తులు అంటే ఎల్లవేళలయందు హృదయమున ఎడతెగని తైలధారవలె పరమేశ్వరిని స్మరించేవారు. ధ్యానించేవారు. అటువంటి వారి హృదయములందు విహరిస్తుంది ఆ పరమేశ్వరి. అందుకే భక్తమానస హంసికా అనబడుతోంది.

అస్యశ్రీ అజపామహామంత్రస్య హంసఋషిః । అవ్యక్తగా యత్రీఛందః । పరమహంసో దేవతా । హంబీజం । సఃశక్తిః । సోఽహం కీలకం । అవిద్యా నివృత్తిద్వారా స్వస్వరూప సాక్షాత్కార సిద్ధ్యర్థే జపే వినియోగం ॥

**న్యాసము** : హంసాం సూర్యాత్మనే స్వాహా ।
హంసీం సోమాత్మనే స్వాహా ।
హంసూం నిరజంనాత్మనే స్వాహా ।

హంసైం నిరాభాసాత్మనే స్వాహా ।
హంసౌం అతను సూక్ష్మ ప్రబోధాత్మనే స్వాహా ।
హంసః అవ్యక్త ప్రబోధాత్మనే స్వాహా ॥

**ధ్యానము** : అగ్నీషోమగరుత్మకం ప్రణవకం బిందుత్రినేత్రోజ్జ్వలం
భాస్వ ద్రుద్రముఖం శివాంఘ్రియుగళం పార్శ్వస్థకాలానలమ్ ।
ఉద్య ద్భాస్కరకోటికోటిసదృశం హంసం జగద్వ్యాపినం
నాదబ్రహ్మమయం హృదంబుజపుటే నిత్యం సదా భావయే ॥

అత్మాన మగ్నిషోమాఖ్య పక్ష్మయుగ్మం శివాత్మకం ।
సకారేణ బహిర్యాంతం విశంతం చ హకారతః ॥
హంసస్సోఽహమితి ధ్యాత్వా సోహం వ్యజనహీనతః ।
హృదిసంహృత్యచాత్మానం బ్రహ్మరూపం విభావయేత్ ॥

**మంత్రము** : ఓం హంసహంసాయ విద్మహే పరమహంసాయ ధీమహి । తన్నో హంసః ప్రచోదయాత్ ॥

## 373. కామేశ్వరప్రాణనాడీ

కామేశ్వరుడి యొక్క మాయా శబలితరూపానికి ఆ పరమేశ్వరి ముఖ్యప్రాణనాడి అయిన సుషుమ్నరూపంలో ఉన్నది. ఈ విషయాన్ని శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 28వ శ్లోకంలో

**సుధా మ ప్యాస్వాద్య ప్రతిభయ జరామృత్యు హరిణీం**
**విపద్యన్తే విశ్వే విధిశతమఖముఖాద్యా దివిషదః**
**కరాళం యత్క్ష్వేళం కబళిత వతః కాలకలనా**
**నశంభోస్తన్మూలం తవ జనని ! తాటంకమహిమా ॥**

తల్లీ ! బ్రహ్మేంద్రాది సకలదేవతలు అమృతం త్రాగికూడా ప్రళయకాలంలో లయం చెందారు. లోకాలన్నింటినీ దహించే కాలకూటాన్ని త్రాగినప్పటికీ నీ పతిశంకరునకు హాని కలగలేదు. అందుకు కారణము నీ తాటంకముల ప్రభావమేకదా ! తాటంకములు స్త్రీకి సౌభాగ్యచిహ్నాలు. కాబట్టి నీ యొక్క సౌభాగ్యమెంతటిదోకదా అంటున్నారు.

## 374. కృతజ్ఞా

ప్రాణులయొక్క పుణ్యపాపాలను ఎరుగునది.

**సూర్య స్సోమో యమః కాలో మహాభూతాని పంచ చ ।**

**ఏతే శుభా శ్శుభ స్యేహ కర్మణో నవ సాక్షిణః ॥**

సూర్యుడు, చంద్రుడు, యముడు, కాలము, పంచభూతాలు ఈ తొమ్మిది పుణ్యపాపాలకు, శుభాశుభకర్మలకు సాక్షులు. ఆ పరమేశ్వరి వీరికన్న వేరైనదికాదు. ఉపకారులకు ప్రత్యుపకారము చేసేది. కృతయుగములో ధర్మమువలె జ్ఞానము గలది. అనగా కృతయుగంలో పరిపూర్ణజ్ఞానం ఏరకంగా ఉండేదో, ఆ రకమైన జ్ఞానము గలది.

ఆ పరమేశ్వరి సూర్య చంద్ర కాలమయము, పంచభూతాలరూపంలో ఉండి ప్రపంచంలోని జీవులు ఏ క్షణంలో ఏ పనిచేస్తున్నారో గమనిస్తుంటుంది. శారీరకంగాగాని మానసికంగా గాని ఎవరు మంచి చెడు పనులు చేస్తున్నారో, వాటన్నింటిని ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ ఉంటుంది. అందుచేతనే ఆమె కృతజ్ఞా అనబడుతుంది. ఆమె సర్వజ్ఞ.

**పత్రపుష్పాద్యల్పమపి ప్రయచ్ఛతాంమోక్షం దదాతీతి**

పత్రము పుష్పము మొదలగు అల్పవస్తువులతో అర్చించే వారికి కూడా, వారు అర్పించే వస్తువులను కాకుండా వారి భక్తికి తగినట్లుగా మోక్షము కూడా ప్రసాదిస్తుంది.

సర్వజగత్తును తెలుసుకున్నది. ఆత్మరూపమైనట్టిది. కాబట్టి ఆ పరమేశ్వరి కృతజ్ఞా అనబడుతోంది.

ఈరకంగా వాగీశ్వరీ రూపం వివరించబడింది.



శ్రీ 'ఔ'కార దేవి

## 31. బిందుమండలవాసినీ

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. అతడు బిందురూపంలో ఉన్నాడు. ఆ బిందువే కాలవశమున భిన్నమై వివిధరూపాలు పొందింది. రహస్యాగమములో ఈ విషయాన్ని వివరిస్తూ "కాలవశమున భిన్నమైనటువంటి ఆ బిందువు మూడుభాగాలయింది. అవే 1. స్థూల 2. సూక్ష్మ 3. పరములు. అవి కారణబిందువుతో కలిసి నాలుగు భాగాలవుతున్నాయి. అవి.

| | | | |
|---|---|---|---|
| 1. ఆదిదైవము | 2. అవ్యక్తేశ్వరము | 3. హిరణ్యగర్భుడు | 4. విరాట్స్వరూపము |
| 1. శాంతా | 2. వామా | 3. జ్యేష్టా | 4. రౌద్రీరూపములు |
| 1. అంబిక | 2. ఇచ్ఛా | 3. జ్ఞాన | 4. క్రియాశక్తులు |
| 1. ఆదిదైవము | 2. అవ్యక్తేశ్వరము | 3. హిరణ్యగర్భుడు | 4. విరాట్స్వరూపము |
| 1. కామగిరిపీఠము | 2. పూర్ణగిరిపీఠము | 3. జాలంధరపీఠము | 4. ఓడ్యాణపీఠము |

అని చెప్పబడింది. ఆధారచక్రంలో ఉండేది కుండలినీశక్తి. అదే చరాచర జగత్తుకూ కారణము అని తెలిసినవాడికి మరుజన్మ ఉండదు అని నిత్యాహృదయంలో చెప్పబడింది.

ఇప్పుడు ఆ పరమేశ్వరి కామగిరి, పూర్ణగిరి, జాలంధర, ఓడ్యాణపీఠాల యందు ఉంటుంది. మానవదేహంలోని షట్చక్రాలలోను, శ్రీచక్రంలోని ఆవరణలలోనూ ఈ పీఠాలు నిరూపించబడ్డాయి.

గౌడపాదులవారు తమ సుభగోదయస్తుతిలోని 10వ శ్లోకంలో

**త్రికోణం చాధారం త్రిపురవినుతే ! ష్టారమనఘే !**
**భవే త్స్వాధిష్ఠానం పున రపి దశారం మణిపురం**
**దశారం తే సంవిత్కమల మథమన్వస్రక ముమే**
**విశుద్ధం స్వాదాజ్ఞ శివితి తతో బైందవగృహమ్**

షట్చక్రాలకి శ్రీచక్రంతో ఐక్యత చెప్పబడింది.

1. ఆధారచక్రానికి – త్రికోణంలో ఐక్యత
2. స్వాధిష్ఠానానికి – అష్టకోణంలో ఐక్యత
3. మణిపూరానికి – అంతర్దశారంతో ఐక్యత

4. అనాహతానికి - బహిర్దశారంతో ఐక్యత
5. విశుద్ధిచక్రానికి - చతుర్దశారంతో ఐక్యత
6. ఆజ్ఞాచక్రానికి - అష్టదళము, షోడశ దళములతో ఐక్యత
7. సహస్రారానికి - భూపురంలో ఐక్యత

ఇందులో బ్రహ్మరంధ్రమే బిందువు. కాబట్టి

| | | | | |
|---|---|---|---|---|
| కామగిరిపీఠం | - | ఆధారచక్రం | - | త్రికోణం |
| పూర్ణగిరిపీఠం | - | అనాహతము | - | బహిర్దశారం |
| జాలందరపీఠం | - | ఆజ్ఞాచక్రము | - | అష్టదళ, షోడశదళాలు |
| ఓడ్యాణపీఠం | - | బ్రహ్మరంధ్రం | - | బిందువు |

ఈ విషయాన్ని యోగినీహృదయంలోని చక్రసంకేతంలో 41వ శ్లోకంలో వివరిస్తూ

**భాసనాద్విస్య రూపశ్య స్వరూపే బాహ్యతోऽపిచ**
**ఏతాశ్చ తస్త్రః శక్తస్తు కా - పూ - జా - ఓ - ఇతిక్రమాత్**
**పీఠాః కందే పదే రూపే రూపాతీతే క్రమాస్థితాః**

విశాల విశ్వానికి మానవదేహానికి సమానరూపత్వమున్నది. బ్రహ్మాండమే - విశాలవిశ్వము, పిండాండమే - మానవశరీరము. ఈ రెండు సమిష్టి, వ్యష్టి శరీరాలు. బ్రహ్మాండంలో ఉన్న అవయవాలే పిండాండంలో కూడా ఉన్నాయి. అందుచేత అంబికా, ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులు కా - పూ - జా - ఓ అనే పేర్లు గల పీఠాలయినాయి.

1. కా - కామగిరిపీఠము
2. పూ - పూర్ణగిరిపీఠము
3. జా - జాలంధరపీఠము
4. ఓ - ఓడ్యాణపీఠము

ఈ పీఠాలన్నీ నదీతీరాలయందున్నాయి. ఇప్పుడు పిండాండమందు అంటే మానవశరీరంలో

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | కందం | - | సుషుమ్నానాళము | - | మూలాధారము |
| 2. | పదం | - | హృదయము | - | అనాహతము |
| 3. | రూపం | - | బిందువు | - | ఆజ్ఞాచక్రము |
| 4. | రూపాతీతం | - | కళలకు అతీత | - | బ్రహ్మరంధ్రము |

ఈ పీఠాలలోనే అంబికా మొదలైనశక్తులున్నాయి.

1. కామగిరిపీఠము – వాగ్భవబీజము, త్రికోణంలోని అగ్రకోణం వామాశక్తి, ఆధారచక్రము

2. పూర్ణగిరిపీఠము – త్రికోణంలోని దక్షిణ కోణము. కామరాజ బీజము, జ్యేష్టాశక్తి అనాహతము

3. జాలంధరపీఠము – త్రికోణంలోని ఉత్తరకోణము. శక్తిబీజము, రౌద్రిశక్తి, ఆజ్ఞాచక్రము

4. ఓడ్యాణపీఠము – త్రికోణంలోని బిందువు. అన్నిబీజములు, అంబికాశక్తి, బ్రహ్మరంధ్రము

**చతురస్రం తథా బిందు షట్క యుక్తం చ వృత్తకమ్ ।**
**అర్థ చంద్రం త్రికోణం చ రూపాణ్యేషాం క్రమేణ తు ।**
**పీతో ధూమ్ర స్తథాశ్వేతో రక్తో రూపం చ కీర్తితమ్ ॥**

ఈ పీఠాలు క్రమంగా పృథివీ, వాయు, జల, అగ్ని రూపాలని వివరించబడుతోంది.

1. కామగిరి పీఠము – భూపురము, భూతత్త్వము, పీతవర్ణము
2. పూర్ణగిరి పీఠము – షడ్బిందువులచే ఏర్పడిన వృత్తము, వాయుతత్త్వము, ధ్రూమ వర్ణము
3. జాలంధర పీఠము – అర్ధచంద్రాకారము, జలతత్త్వము, శ్వేత వర్ణము.
4. ఓఢ్యాణ పీఠము – త్రికోణము, అగ్ని తత్త్వము, రక్త వర్ణము.

లలితాసహస్రంలో వీటిని

375. కామరూపా – కామగిరి పీఠము

376. శృంగారరససంపూర్ణా – పూర్ణగిరిపీఠము

378. జాలంధరస్థితా – జాలంధరపీఠము

379. ఓడ్యాణపీఠనిలయా – ఓడ్యాణపీఠము

గా వివరించబడ్డాయి. ఇక నామాలను చూద్దాం.

## 375. కామపూజితా

మన్మథునిచే పూజించదగినది. లక్ష్మీదేవి కుమారుడు అనంగుడు. అతడికి అంగాలు లేకపోయినప్పటికీ పంచదశి మహామంత్రాన్ని పొందగలిగాడు.

కాముడు అంటే ఈశ్వరుడు. జగత్తును సృష్టించటంలో కామనగలవాడు. అతడే కామేశ్వరుడు. పంచకృత్యపరాయణుడు. సృష్టి చెయ్యాలి అని సంకల్పించినప్పుడు మొదటగా పరమేశ్వరిని పూజించి సృష్టి కార్యక్రమం ప్రారంభించాడు. అందుచేత దేవి కామపూజితా అనబడుతోంది.

ఇది కామగిరిపీఠము. మానవశరీరంలోని ఆధారచక్రంలోనూ, శ్రీచక్రంలోని త్రికోణంలోనూ ఉంటుంది.

**అస్యశ్రీ కామగిరిపీఠ మహామంత్రస్య । బ్రహ్మఋషిః । గాయత్రీచ్ఛందః । బ్రహ్మాణీ దేవతా । ఐం బీజం । ఆం శక్తిః । క్లీం కీలకం । జపే వినియోగః ।**

**న్యాసము** : **హ్రాం । హ్రీం । హ్రూం । హ్రైం । హ్రౌం । హ్రః ॥**

**ధ్యానము** : **బ్రహ్మాత్మశక్తిసహిత మరుణం కామసంజ్ఞకం ।**
**గిరిపీఠ మహం వందే సర్వసిద్ధి ప్రదాయకమ్ ॥**

**మంత్రము** : **ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః అం ఆం సౌః కామగిరిపీఠ బ్రహ్మాత్మశక్తి సరస్వత్యై నమః ॥**

## 376. శృంగారరససంపూర్ణా

శృంగారము అను రసముచే పూర్తిగా నిండినది. ఈ నామము పూర్ణగిరి పీఠాన్ని తెలియచేస్తోంది. శృంగ అంటే – రెండు, అర అనగా – ఆరు. అని గ్రహించాలి అంటున్నారు భాస్కరాచార్యులు. ఈ రకంగా చెబితే ఆరు రెళ్ళు పన్నెండుదళాలు గల పద్మము. అనాహతము కాబట్టి శృంగారరసము అంటే అనాహత పద్మము. అక్కడ సం – తరచుగా, పూర్ణ – ఉండునది. అనాహత పద్మమునందు ఉండేది పరమేశ్వరి. మొత్తం పీఠాలు నాలుగు. 1. కామగిరి. 2. పూర్ణగిరి 3. జాలంధర 4. ఓడ్యాణపీఠాలు. ఇందులో రెండవదయిన పూర్ణగిరి పీఠము అనాహతమునందున్నది అని తంత్రశాస్త్రం చెబుతోంది. కాబట్టి శరీరంలోని అనాహతచక్రమే పూర్ణగిరి పీఠము.

పరమేశ్వరి బ్రహ్మానందస్వరూపిణి. ఆనందఘనస్వరూపిణి. శ్రీచక్రమే పరమేశ్వరి స్వరూపం. శృంగ – కోణములచేత, అర – దళములచేత, రస – తొమ్మిది రసములు లేక భావములచేత, సంపూర్ణా – నిండి ఉన్నది. శ్రీచక్రంలోని తొమ్మిది ఆవరణలలోనూ చతుర్దశారము, దశారయుగ్మము, అష్టకోణము, త్రికోణము. అనేవి కోణచక్రాలు వీటిలో మొత్తం కలిపి 45 కోణాలుంటాయి. అలాగే షోడశదళము, అష్టదళము. ఈ రెండింటియందు కలిపి 24 దళాలుంటాయి. అలాగే శ్రీచక్రంలోని తొమ్మిదిఆవరణల యందు తొమ్మిది రకాల రసాలుంటాయి. వీటినే నవరసాలు అంటారు.

1. భూపురం – త్రైలోకమోహనచక్రం – శృంగారరసం
2. షోడశదళం – సర్వాశాపరిపూరక చక్రం – వీరరసం
3. అష్టదళం – సర్వసంక్షోభణచక్రం – కరుణరసం
4. చతుర్దశారం – సర్వసౌభాగ్యదాయకచక్రం – భయానకరసం
5. బహిర్దశారం – సర్వరక్షాకరచక్రం – రౌద్రరసం
6. అంతర్దశారం – సర్వార్థసాధకచక్రం – భీభత్సరసం
7. అష్టకోణం – సర్వరోగహరచక్రం – హాస్యరసం
8. త్రికోణం – సర్వసిద్ధిప్రదచక్రం – అద్భుతరసం
9. బిందువు – సర్వానందమయచక్రం – శాంతరసం

ఈరకంగా శృంగారరసంతోపాటుగా మిగిలినరసాలు అన్నీ అంటే నవరసాలు కలిగినటువంటిది. ఇదే పూర్ణ గిరిపీఠము. షట్చక్రాలలో బహిర్దశారం.

**అస్యశ్రీ పూర్ణగిరిపీఠ మహామంత్రస్య । విష్ణు ఋషిః । అనుష్టుప్ఛందః । నారాయణీదేవతా । క్లీం బీజం । హ్రీం శక్తిః । నమః కీలకం । జపే వినియోగః**

**న్యాసము** : శ్రాం । శ్రీం । శ్రూం । శ్రైం । శ్రౌం । శ్రః ॥

**ధ్యానము** : లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం........ వందే ముకుందప్రియాం

**మంత్రము** : ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః పూర్ణగిరి పీఠ విష్ణ్వాత్మ శక్త్యైః లక్ష్మై నమః ॥

## 377. జయా

జయ స్వరూపిణి. వరాహపర్వతం మీద పూజించబడే దేవత. **తతోజయ ముదీరయేత్**

పరమేశ్వరి ఓంకారస్వరూపిణి. తనను ఆరాధించే భక్తులకు, ఉపాసకులకు వైరాగ్యం కలిగించి, ఆత్మజ్ఞానాన్నిచ్చి వారికి మోక్షం ప్రసాదిస్తుంది. అందుచేతనే జయా అనబడుతోంది. సర్వత్రజయమే కలది. అపజయము ఎరుగనిది. మృత్యువును కూడా జయించినది. మృత్యుదేవత కూడా ఆమెకులోబడే ఉంటుంది. అందుచేతనే ఆ దేవి జయా అనబడుతోంది.

## 378. జాలంధరస్థితా

జాలంధరపీఠమందుండునది. 'జాలంధరము అనేచోట విష్ణుముఖి అనే పేరుతో పూజించబడుతోంది' అని పద్మపురాణంలో చెప్పబడింది.

పరమేశ్వరి జయ అనే పేరుతో జాలంధరపీఠము అని చెప్పబడే ఆజ్ఞా చక్రమందున్నది. పరమేశ్వరి జాలంధరపీఠమందుంటుంది కాబట్టి జాలంధరస్థితా అనబడుతుంది.

**అస్యశ్రీ జాలంధరపీఠ మహామంత్రస్య । రుద్రఋషిః । అతి జగతీచ్ఛందః । శ్రీ గౌరీ దేవతా । సౌః బీజం । ఐం శక్తిః । హ్రీం కీలకం । జపే వినియోగః ॥**

**న్యాసము** : **ఐం । క్లీం । సౌః । సౌః । క్లీం । ఐం ॥**

**ధ్యానము** : **ఆధారే తరుణార్కబింబరుచిరే వాగ్బీజ మగ్నిప్రభం**
**బీజం మన్మథ మింద్రగోపకనిభం హృత్పంకజే సంస్థితం ।**
**రంధ్రే బ్రహ్మపదే చ శాక్తమపరం హేమప్రభా భాసురం**
**యే ధ్యాయంతి పదత్రయం తవ శివే ! తే యాంతి సౌఖ్యం పదమ్॥**

**మంత్రము** : **ఐం క్లీం సౌః శ్రీం హ్రీం ఐం జాలంధరపీఠ రుద్రాత్మ శక్తి గౌర్యై నమః ॥**

## 379. ఓడ్యాణపీఠనిలయా

ఓడ్యాణము అనే పీఠమే నివాసస్థానముగా గలది. పరమేశ్వరి ఓడ్యాణపీఠమందు నివసిస్తుంది. కాబట్టి ఓడ్యాణపీఠనిలయా అనబడుతుంది. ఇది బ్రహ్మరంధ్రం

## 380. బిందుమండలవాసినీ

బిందుమండలము అంటే శ్రీచక్రంలో సర్వానందమయమైన బిందువే. ఆ బిందువు నందుండునది. బిందువు యొక్క మండలం బ్రహ్మరంధ్రం. కాబట్టి బ్రహ్మరంధ్రంలో ఉండేది. బ్రహ్మరంధ్రంపైభాగాన అంటే చంద్రమండలంలో ఉంటుంది. ఓం హ్రీం అని చెప్పబడే శబళ బ్రహ్మరూపమే బిందువు. శబళ బ్రహ్మ అంటే వేరుగా విభజించబడిన బ్రహ్మస్వరూపము. హకార సంజ్ఞగల పరమేశ్వరుడు సకారసంజ్ఞగల ప్రకృతితో కలసి శబళ బ్రహ్మమయి మానవ దేహంలో ప్రవేశించాడు. అంటే ఆ పరమాత్మ తనను తాను విభజించుకున్నవాడై జీవాత్మరూపంలో మానవదేహంలో ప్రవేశించాడు. శంకరభగవత్పాదులవారు **నమస్తే నమస్తే శి బిందుస్వరూపే** అంటూ ఆ పరమేశ్వరిని బిందునామంతోనే సంబోధించారు.

**కల్యాణాయుత పూర్ణచంద్రవదనాం ప్రాణేశ్వరానందినీం**
**పూర్ణాం పూర్ణతరాం పరేశమహిషీం పూర్ణామృతా స్వాదినీం**
**సంపూర్ణాం పరమోత్తమాఽమృతకళాం విద్యావతీంభారతీం**
**శ్రీచక్రప్రియబిందుతర్పణపరాం శ్రీరాజరాజేశ్వరీం**

బిందువు పరమేశ్వరి స్వరూపం. శ్రీచక్రంలోని అన్నికోణాలకు, అన్నిదళాలకు, అన్నిచక్రాలకు, వాగ్స్వరూపాలకు, మాతృకలకు కారణము ఆబిందువే. ఆ బిందువునందు నివసిస్తుంది కాబట్టే పరమేశ్వరి బిందుమండలవాసిని అనబడుతోంది.

ఈరకంగా నాలుగుపీఠాలను వివరించటం జరిగింది. బిందువునందుండే పరమేశ్వరియే బిందుమండలవాసిని.



శ్రీ 'అం'కార దేవి

# 32. రహోయాగము

రహోయాగము అంటే అంతర్యాగము పరమేశ్వరి పూజ రెండు విధాలుగా జరుగుతుంది. అవి 1. బాహ్యపూజ 2. అంతఃపూజ.

బాహ్యపూజ అంటే శ్రీచక్రము, లేదా పరమేశ్వరి ప్రతిమను ఎదురుగా ఉంచి దాన్ని నియమనిష్టలతో పూజించటం ఈ రకమైన పూజలో భగవంతుడు వేరు భక్తుడు వేరు. భక్తుడు భగవంతుణ్ణి పూజించి వరాలడుగుతాడు. భక్తుడి కోరికలు భగవంతుడు తీరుస్తాడు.

ఇక రెండవది అంతఃపూజ. ఈ పద్ధతిలో శ్రీచక్రంగాని, దేవి ప్రతిమగాని ప్రత్యేకంగా ఉండవు. సాధకుడు తానే పరమేశ్వరస్వరూపము అని భావించి తనలో ఉన్న ఆత్మని దర్శిస్తాడు. సనత్కుమార సంహితలో చెప్పినట్లుగా

**బాహ్యపూజా న కర్తవ్యా కర్తవ్యా బాహ్యజాతిభిః**

బాహ్యపూజను బాహ్యజాతులవారు మాత్రమే చేస్తారు. బాహ్యజాతులవారంటే

**బాహ్యజాపూజరతాః కౌలాః క్షపణ శ్చ కపాలికాః**
**దిగంబరా శ్చేతిహాసాః వామకా స్తంత్రవాదినః**

కౌళాచారులు, క్షపణకులు, కాపాలికులు, దిగంబరులు, ఇతిహాసులు, వామాచారులు, తంత్రవాదులు మాత్రమే బాహ్యపూజలు చేస్తారు. మరి అంతారారాధన?

**అంతరారాధనపరా వైదికా బ్రహ్మవాదినః**

వైదికులు, బ్రహ్మవాదులు, మోక్షగాములు అంతరారాధన చేస్తారు. అంతరారాధనలో భగవంతుడు భక్తుడు వేరువేరు కాదు. ఇద్దరూ ఒకటే. ఇది అద్వైతస్థితి. ఇక్కడ 381 నుంచి 387 వరకు నామాలలో అంతరారాధనను వివరిస్తున్నాడు.

కుండలినీశక్తి ఆధారచక్రంలో స్వయంభూలింగానికి మూడున్నరచుట్లు చుట్టుకుని నిద్రావస్తలో ఉంటుంది. దానిని గనక నిద్రలేపగలిగినట్లైతే, అది గ్రంథిత్రయాన్ని ఛేదించుకుని సహస్రకమలం చేరి దాన్ని నోటితో కరచి పట్టుకుంటుంది. సహస్రకమలమే చంద్రమండలం. అప్పుడు ఆ చంద్రమండలంలోనుంచి జాలువారే అమృతపుధారలు సాధకుని శరీరంలోని 72 వేల నాడీమండలాన్ని తడుపుతాయి. ఈ విషయాన్ని గతంలో

'కుండలినీశక్తి'లో వివరించాం. ఈ రకంగా గ్రంథిభేదనము చెయ్యటమే రహోయాగము. అయితే కేవలము కుండలినీశక్తిని జాగృతం చేస్తే సరిపోదు. దానివల్ల సాధకుడికి ముక్తిరాదు. కర్మలవల్ల, వేదశాస్త్రపఠనంవల్ల, ముక్తిరాదు. కేవలం జ్ఞానంవల్లనే ముక్తి లభిస్తుంది.

కాబట్టి సాధకుడు జ్ఞాని కావాలి. కర్మలను, వాటియొక్క ఫలితాలను వదలివెయ్యాలి. అతని యొక్క పాపపుణ్యాలు, ధర్మాధర్మాలు అన్నీ కూడా జ్ఞానాగ్నిలో దగ్ధం చెయ్యాలి. అంటే అన్ని రకాల బంధనాలనుండి విముక్తుడు కావాలి. మనసా వాచా కర్మణా ఫలాపేక్షలేకుండా పరమేశ్వరిని సహస్రారంలో అర్చించాలి. అటువంటి సాధకులమీద దేవికి ప్రీతి ఎక్కువ. ఆ సాధనకు ఫలితంగా వారికి ముక్తిని ప్రసాదిస్తుంది. ఆ పరమేశ్వరి. జీవాత్మను పరమాత్మతో ఐక్యం చెయ్యటము అంటే ఇదే.

దేవిని అర్చించేవారికి ఏమి కావాలన్నా వస్తుంది. బాహ్యపూజ చేసేవారికి ఐహికమైన కోరికలు తీరతాయి. అదే అంతఃపూజ చేసే జ్ఞానులకు మోక్షం లభిస్తుంది.

ఇక నామాలను చూద్దాం.

## 381. రహోయాగక్రమారాధ్యా

సహస్రారమున తన భర్తతో రహస్యముగ విహరించునది. రహోయాగము అంటే అంతర్యాగము. పరమేశ్వరి పూజ రెండువిధాలు అని గతంలో వివరించాం. కాని సందర్భానుసారం మళ్ళీ ఒక్కసారి గుర్తుచేసుకుందాం. బాహ్యపూజ, అంతఃపూజ అని పూజ రెండురకాలు. బాహ్యపూజ అంటే ఎదురుగా దేవి విగ్రహాన్ని కాని, శ్రీచక్రాన్ని కాని ఉంచి చేసేటటువంటిది. ఇది ద్వైతభావనతో కూడిన పూజ. ఇక అంతఃపూజ అంటే అద్వైతభావనతో పూజ ఇందులో భగవంతుడు భక్తుడు ఇద్దరూ ఒకటే. తేడాలేదు. సాధకుడే సాక్షాత్తూ పరబ్రహ్మ. 'అయమాత్మాబ్రహ్మ' అనే మహావాక్యము ఇక్కడ అన్వయించబడుతుంది. పరమేశ్వరుణ్ణి తన శరీరంలోనే ఊహించి, తానే పరమేశ్వరస్వరూపము అని నమ్మి భావనోపనిషత్తులో చెప్పిన ప్రకారం అర్చన చెయ్యటం. ఇది ముఖ్యప్రాణోపాసన.

శంకరభగవత్పాదులవారు తమ సౌందర్యలహరిలోని తొమ్మిదవశ్లోకంలో ఈ విషయం చెబుతూ

**మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం**
**స్థితం స్వాధిష్ఠానే హృదిమరుత మాకాశ ముపరి**
**మనోఽపి భ్రూమధ్యే సకల మపి భిత్త్వాకులపథం**
**సహస్రారే పద్మే నవ రహసి పత్యా విహరసే ॥**

ఓ తల్లీ ! పృథివీతత్త్వమైన ఆధారచక్రము, అగ్నితత్త్వమైన స్వాధిష్ఠానము, జలతత్త్వమైన మణిపూరము, వాయుతత్త్వమైన అనాహతము, ఆకాశతత్త్వమైన విశుద్ధిచక్రము, మనస్తత్త్వమైన ఆజ్ఞాచక్రము దాటి సుషుమ్న ద్వారా సహస్రారంచేరి నీ భర్త అయిన సదాశివునితో కలిసి రహస్యముగ క్రీడించుచున్నావు. గౌడపాదులవారు తమ సుభగోదయస్తుతిలో కుండలినీ ప్రభోదాన్ని వివరిస్తూ నాల్గవశ్లోకంలో

**యదా తౌ చంద్రార్కౌ నిజసదన సంరోధ నవశా**
**దశక్తౌ పీయూష స్రవణహరణే సా చ భుజగీ**
**ప్రబుద్ధా క్షుత్క్రుద్ధా దశతి శశినం బైందవగతం**
**సుధాధారాసారైః స్నపయతి తనుం బైందవకళే ॥**

ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీశక్తిని అంతర్యాగంచేసి నిద్రలేపినట్లైతే అది షట్చక్రాలను దాటి సహస్రారం చేరి సుధాదారలు కురిపిస్తుంది.

ఇదే విషయాన్ని వామకేశ్వరతంత్రం, తంత్రసారంలో కూడా వివరించారు.

రహస్యముగా కుండలినీశక్తిని జాగృతంచేసి దానితో పుణ్యపాపాలను చిదగ్నిలో హోమం చెయ్యటమే రహోయాగము. జ్ఞానంవల్ల కర్మలన్నీ నశిస్తాయి. కాబట్టి కుండలినీ యాగమే రహోయాగము. ఆపస్తంభ సూత్రాలలో "శాస్త్రాలమీద ఆసక్తి గలవాడికి మోక్షంరాదు. మంచి ఇళ్ళలో నివసించటంవల్ల, భోజనాదులవల్ల, లోకులు మనలను గుర్తించటంవల్ల మోక్షంరాదు. ధృడమైన సంకల్పంగలవాడికి, ఏకాంతజీవనం చేసేవాడికి, ఐహికబంధనాలు వదిలించుకున్నవాడికి, ఆత్మయోగికి, అహింసాపరుడికి మాత్రమే ముక్తి లభిస్తుంది" అని చెప్పబడింది. కాబట్టి పుణ్యపాపాలన్నీ జ్ఞానాగ్నిలో దగ్ధంచేసి, సహస్రారంలో పరమేశ్వరిని అర్చించిన వారికి ముక్తి లభిస్తుంది.

శ్రీచక్రాన్ని అర్చన చేసే వారంతా కూడా అంతర్యాగంలో అదే అర్చనచేస్తారు. శ్రీచక్రంలో ఉన్న ఆవరణలన్నీ మన శరీరంలోనే ఉన్నాయి. శరీరమే శ్రీచక్రం. అదే

చరాచరజగత్తు. నవావరణలు శరీరంలోని భాగాలే అని గతంలో చెప్పాం. కాని అది ముఖ్యమైన విషయం కాబట్టి మళ్ళీ చెబుతున్నాం.

**బైందవం బ్రహ్మరంధ్రం చ మస్తకం చ త్రికోణకమ్**
**లలాటేష్టారకం పత్రం భృవో ర్మధ్యే దశారకం**
**బహిర్దశారం కంఠేతు మన్వశ్రం హృదయం భవేత్**
**నాభౌ చ వసుపత్రం చ కట్యాం షోడశపత్రకం**
**వృత్తత్రయం చ ఊరుభ్యాం పద్భ్యాం భూపురత్రయమ్ ॥**

ఈ రకంగా శ్రీచక్రాన్ని శరీరంలోనే భావించి, సహస్రారంలో ఆ పరమేశ్వరిని అర్చించిన జ్ఞానికి మోక్షం లభిస్తుంది.

## 382. రహస్తర్పణతర్పితా

శ్రీ విద్యోపాసనలో ప్రవేశించాలి అనుకునేవాడు. ఏకాంతమును కోరే ప్రవేశించాలి. శ్రీవిద్యలో ముఖ్యమైన విషయం ఏమంటే పుణ్యపాపాలను, ధర్మాలను ప్రకాశ విమర్శలనే చేతులతో, ఉన్మని అనే సృక్కుతో జ్ఞానమనే అగ్నిలో హోమం చెయ్యాలి. ఇక్కడ హోమగుండంలోని అగ్నికి కట్టెలు అవసరం లేదు. అది జ్ఞానాజ్ఞి. సర్వదా మండుతూనే ఉంటుంది. అటువంటి అగ్నిలో శివాది క్షితి పర్యంతము సర్వస్వాన్ని హోమం చెయ్యాలి. ఇలా చెయ్యటాన్నే రహస్తర్పణము అంటారు. దీనివల్ల దేవి తృప్తి చెందుతుంది. ఈ రకంగా సకలభూతాలను, పుణ్యపాపాలను, ధర్మాధర్మాలను, సకలకర్మలను జ్ఞానాజ్ఞిలో హోమంచేసి ఆ పరమేశ్వరుని తృప్తి పరచినవాడు మోక్షం పొందుతాడు.

అంటే శ్రీవిద్య బ్రహ్మవిద్య. శ్రీవిద్యోపాసకుడికి ధనధాన్యాలు, సిరిసంపదలు, భోగభాగ్యాలు, పదవులు, సన్మానాలు, గౌరవము మొదలైన ఐహికమైన వాంఛలు తీరటమేకాదు. సాయుజ్యం కూడా లభిస్తుంది.

ఐహికమైన కోరికలు తీరాలి అంటే పూజలు, అర్చనలు, వ్రతాలు చెయ్యాలి. కాని సాయుజ్యం కావాలంటే అంతర్యాగం చెయ్యాలి. దానివల్ల పరమేశ్వరి తృప్తి చెందుతుంది. అంతర్యాగము అంటే పరమేశ్వరుడనేవాడు ఎక్కడోలేడు. చరాచరజగత్తంతా ఆవరించి ఉన్నాడు. విశాలమైన విశ్వంలోని ప్రతి అణువు పరబ్రహ్మస్వరూపమే. సాధకుడు కూడా పరబ్రహ్మయే. అయమాత్మాబ్రహ్మ. నాలోనే ఈ పరమేశ్వరుడున్నాడు. నేనే పరబ్రహ్మను.

అని భావించి, ఐహికమైన, సంసారబంధనాలు అన్నీ వదిలించుకోవాలి. అంటే కర్మలనుంచి విముక్తుడు కావాలి. ఈ జన్మలో కర్మలు చేయడు సరే. మరి గతంలో చేసిన కర్మలతాలూకు ఫలితం ఏమవుతుంది ? సాధారణంగా అయితే కర్మల యొక్క ఫలితాన్ని అనుభవించటం చేతనే క్షయం చెయ్యాలి. ఈ రకంగా కల్పాంతము అనుభవించినప్పటికీ కర్మఫలం క్షయంకాదు. ఇక రెండోమార్గం పరమేశ్వరోపాసన. మనోవాక్కాయ కర్మలచే ఆ భగవంతుణ్ణి ప్రార్థించటం. ఆ ప్రార్థనలో తాదాత్మ్యముండాలి. అప్పుడు అతని కర్మక్షయం అవుతుంది. అంటే జ్ఞానాగ్నిలో అతడు చేసిన పాపపుణ్యాలన్నీ హోమం చెయ్యబడతాయి. కర్మలన్నీ క్షయం అయిపోతాయి. ఇదే రహస్తర్పణము. గజేంద్రమోక్షంలో మొసలి కర్మను అనుభవించలేక గజేంద్రుడు ఆ పరమేశ్వరుణ్ణి ప్రార్థించాడు. రహస్తర్పణవల్ల పరమేశ్వరి ఆనందిస్తుంది. అప్పుడు సాధకుడికి ముక్తి లభిస్తుంది.

అయితే అంతర్యాగప్రక్రియలో షట్చక్రభేదనము, చతుర్విధైక్యసంధానము వంటివి గురువు దగ్గర మాత్రమే నేర్చుకోవాలి. ఇది యోగప్రక్రియ. చతుర్విధైక్యసంధానము అంటే

**పిండ బ్రహ్మాండయో రైక్యం లింగసూత్రాత్మనో రపి**

**స్వాపా వ్యాకృతయో రైక్యం క్షేత్రజ్ఞ పరమాత్మనోః ॥**

1. పిండ బ్రహ్మాండాలకు ఐక్యము
2. సూక్ష్మ శరీరానికి సూత్రాత్మకు ఐక్యము
3. స్వాపావ్యాకృతులకు ఐక్యము
4. క్షేత్రజ్ఞ పరమాత్మలకు ఐక్యము

ఇవన్నీ గురుముఖైకవేద్యము

## 383. సద్యఃప్రసాదినీ

రహోయాగము, రహస్తర్పణములవల్ల ఆ పరమేశ్వరి అప్పుడే అనుగ్రహిస్తుంది.

పైన చెప్పిన విధంగా అంతర్యాగం గనక చేసినట్లైతే జీవాత్మ పరమాత్మతో ఐక్యమవుతుంది. అదే దీని ఫలితము. అది అనిర్వచనీయమైన ఆనందము. ఆధారచక్రంలో నిద్రావస్తలో ఉన్న కుండలినీశక్తిని జాగృతంచేసి గ్రంధిత్రయాన్ని ఛేదించినట్లైతే కుండలినీశక్తి

సహస్రదళ కమలంలోని దుద్దును తననోటితో కరిచిపట్టుకుంటుంది. అప్పుడు అప్పటివరకు ఘనీభవించి ఉన్న అమృతము ద్రవీభవించి, కుండలిని యొక్క పంటిగాట్ల గుండా క్రిందికి జాలువారి సాధకుని శరీరంలోని 72 వేల నాడీమండలాన్నీ తడుపుతుంది. అప్పుడు సాధకుడు పొందే ఆనందము అనిర్వచనీయము. అనుభవైకవేద్యము. కుండలినీశక్తి సహస్రదళం చేరటమే జీవాత్మ పరమాత్మలకలయిక. సాధకుడు ఎంత ప్రయత్నంచేసినప్పటికీ పరమేశ్వరి దయలేనిదే ఈ ప్రయత్నం సఫలంకాదు.

## 384. విశ్వసాక్షిణీ

అనుకోకుండా, ఉన్నట్టుండి, క్షణాలమీద సాధకుడికి ఆత్మజ్ఞానం కలిగిస్తుంది.

చెట్టుకు కాయకాచింది. ఎదిగింది. పండు తిరిగింది. అది ఎప్పుడు రాలిపోతుందో మనం చెప్పలేం. పక్వానికి వచ్చిన పండు ఏ క్షణానయినా రాలిపోవచ్చు. అలాగే నిరంతరము అంతర్యాగం చేసే సాధకుడికి ఆత్మజ్ఞానము ఏక్షణానైనా కలగవచ్చు.

ఆ విధంగా స్వస్వరూపజ్ఞానాన్ని కలిగించేది ఆ దేవి.

ఈ జగత్తునంతటినీ తానే సృష్టించింది. ఇక్కడ జరిగే ప్రతిపనికీ ఆమె సాక్షి. అయినప్పటికీ వేటికీ ఆమె కారణంకాదు.

ప్రపంచంలో జరిగే ప్రతి విషయాన్ని ఆ దేవి సూర్యుడు, చంద్రుడు, కాలము, యముడు, పంచభూతాలసాయంతో చూస్తూనే ఉంటుంది. ఈ విషయాన్ని గతంలో వివరించాం ఈ విధంగా పరమేశ్వరి విశ్వసాక్షి.

## 385. సాక్షివర్జితా

అన్నింటికీ సాక్షి ఆ పరమేశ్వరియే. ఆమెకు వేరే సాక్ష్యమనేది లేదు. ఈ రకంగా సాక్ష్యాన్ని వర్జించింది కాబట్టి సాక్షివర్జితా అనబడుతుంది.

రెండవవస్తువు అనేది ఏదీ లేదు. పరమేశ్వరికి తనతో సమానమైనవారుకాని, తన కన్న అధికులుగాని ఎవరూలేరు. ఆమె ఏకాకి. కాబట్టి ఆమెకు సాక్ష్యముండటం అసంభవం. సాధకుడు అంతర్యాగం చేశాడు. కుండలినీశక్తిని పైకి పంపి జీవాత్మ పరమాత్మల అనుసంధానం చేశాడు. ఇదే అంతర్యాగానికి ఫలము అని కూడా అన్నాం. మరి దీనికి సాక్ష్యమనేది ఉండదు. అంటే తురీయస్థితికి సాక్ష్యములేదు. అందుచేతనే పరమేశ్వరి సాక్షివర్జితా అనబడుతోంది.

# 386. షడంగదేవతాయుక్తా

షడంగములు అంటే ఆరు అంగాలు అవి.

| | | |
|---|---|---|
| 1. హృదయము | 3. శిఖ | 5. కవచము |
| 2. శిరస్సు | 4. నేత్రము | 6. అస్త్రములు |

వీటిని దేవతలతో లేదా తన శక్తులతో ఆవరించినది. పరమేశ్వరుడికి ఆరు అంగాలున్నాయి. వాటినే ఈశ్వరుని లక్షణాలు అని గతంలో చెప్పాం. అవి

| | | |
|---|---|---|
| 1. సర్వజ్ఞత | 3. అనాదిబోధ | 5. నిత్యత (అలుప్తత) |
| 2. తృప్తి | 4. స్వతంత్రత | 6. అనంతము |

| | | |
|---|---|---|
| 1. సర్వజ్ఞ | – | హృదయదేవి |
| 2. నిత్యతృప్త | – | శిరోదేవి |
| 3. అనాదిబోధ | – | శిఖాదేవి |
| 4. స్వతంత్రత | – | కవచదేవి |
| 5. అలుప్తత | – | నేత్రదేవి |
| 6. అనంతత | – | అస్త్రదేవి |

పరమేశ్వరి ఎల్లప్పుడూ ఈ ఆరుగురు అంగరక్షకులతో కలిసి ఉంటుంది. కాబట్టి షడగందేవతా యుక్తా అనబడుతుంది.

పరమేశ్వరి శృతి స్వరూపిణి. అంటే వేదమయి. కాబట్టి శిక్షాకల్పాది అంగములు గలది. అవి.

| | | |
|---|---|---|
| 1. శిక్ష | 3. ఛందస్సు | 5. జ్యోతిషము |
| 2. వ్యాకరణము | 4. నిరుక్తము | 6. కల్పసూత్రాలు |

వేదానికి ఇవి షడంగాలు. కాబట్టి పరమేశ్వరి షడంగదేవతాయుక్తా అనబడుతుంది.

పరమేశ్వరి ఆరురకాలయిన దేవతలచే పరివేష్టించబడి ఉంటుంది. వారు.

| | | |
|---|---|---|
| 1. అంగదేవతలు | 3. ఆవరణదేవతలు | 5. ఆమ్నాయదేవతలు |
| 2. ఆయుధదేవతలు | 4. నిత్యాదేవతలు | 6. పరివారదేవతలు |

కాబట్టి షడంగదేవతాయుక్తా అనబడుతుంది.

## 387. షాడ్గుణ్యపరిపూరితా

పై నామంలో చెప్పిన షడంగదేవతల శక్తులను, గుణములను కలిగిఉన్నది.

**ఐశ్వర్యస్య చ సర్వస్య వీర్యస్య యశసః శ్రియః**
**జ్ఞాన వైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగఇతీరణా**

| | | |
|---|---|---|
| 1. ఐశ్వర్యము | 3. యశము | 5. జ్ఞానము |
| 2. వీర్యము | 4. శ్రీ | 6. వైరాగ్యము |

అనేటటువంటి పురాణాలలో చెప్పబడిన గుణములతో పరిపూర్ణమైనటువంటిది. కాబట్టి షాడ్గుణ్యపరిపూరితా అనబడుతోంది.

ఈరకంగా ఇక్కడ రహోయాగము, దానివల్ల వచ్చే ఫలితము చెప్పబడ్డాయి.




శ్రీ 'అః'కార దేవి

## 33. ప్రభావిద్య

గతంలో తరుణీవిద్యను ఉపదేశించారు. ఇప్పుడు తరుణీవిద్యకు అంగభూతమైన ప్రభావిద్యను ఉపదేశిస్తున్నారు.

ఆ పరమేశ్వరి కోటిసూర్యప్రభలతో వెలుగొందుతూ ఉంటుంది. ఇక్కడ కోటి అనే నామం సంఖ్యావాచకం కాదు. అనేకానేకమైనటువంటి, లెక్కలేనటువంటి కాంతి కిరణములతో ఆ పరమేశ్వరి విరాజిల్లుతుంటుంది. భైరవయామళంలో పరమేశ్వరుడుపార్వతీ దేవికి శ్రీవిద్యను వివరిస్తూ పంచభూతాలు, తన్మాత్రలు, ఇంద్రియాలు, మనస్సు, మాయ, శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు ఈ ఇరవైఐదు తత్త్వాలకు అతీతంగా ఆ పరమేశ్వరి బిందువునందు ఉంటుంది. ఆమె శరీరం నుంచి ప్రకాశవంతమైన కాంతికిరణాలు వస్తున్నాయి. ఆ కిరణాలు వేయి, రెండువేలు, లక్ష, కోటి, అర్బుదము ఇంకా లెక్కపెట్టటానికి వీలుకాదు అంటున్నాడు. అంటే లెక్కపెట్టలేనన్ని, లెక్కపెట్టటానికి వీలుకానన్ని కిరణాలు ఆ పరమేశ్వరి శరీరం నుంచి వస్తున్నాయి. ఆ కిరణాలవల్లనే ఈ చరాచరజగత్తంతా ప్రవర్తిల్లుతున్నది.

బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యుణ్ణి జనకమహారాజు అడుగుతాడు.

**జనకుడు :** స్వామీ ! ఈ జగత్తులోని కార్యక్రమాలన్నీ దేనివల్ల జరుగుతున్నాయి?

**యాజ్ఞవల్క్యుడు :** సూర్యుని యొక్క వెలుగువల్ల. సూర్యుని వెలుగులోనే జీవులన్నీ కూడా తమకు కావలసినచోటికి పోయి, మళ్ళీ ఆ వెలుగులోనే తిరిగివస్తాయి. తమ కిష్టమైన కార్యాలు చేస్తాయి.

**జ :** మరి సూర్యకాంతులు ఎప్పుడూ ఉండవుకదా ? సూర్యుడు లేనప్పుడు ఏరకంగా కార్యక్రమాలు జరుగుతాయి ? అంటే రాత్రులందు ఏరకంగా జరుగుతుంది.

**యా :** చంద్రునికాంతులతో చంద్రుని కాంతిలో జనులు తమ పనులు నిర్వర్తించుకుంటారు.

**జ :** సూర్యుడు చంద్రుడు ఇద్దరూ లేనప్పుడు అంటే సంధ్యవేళలయందు కార్యక్రమాలు ఏరకంగా జరుగుతాయి ?

**యా :** అగ్నికాంతులతో అంటే దీపపువెలుగులతో జరుగుతాయి.

**జ :** అయితే సూర్యుడు, చంద్రుడు, అగ్ని ఎవరూ లేనప్పుడు కార్యక్రమాలు ఎలా జరుగుతాయి?

**యా :** వాక్కువల్ల, వాక్కు అనేది ఒక వ్యక్తి నుంచి ఇంకొక వ్యక్తికి చేరుతుంది. దానివల్ల పనులు జరుగుతాయి.

**జ:** మరి వాక్కు కూడా లేప్పుడు ఎలా జరుగుతుంది ? అంటే సూర్యుడు చంద్రుడు అగ్ని వాక్కు లేవు. అంతా చీకట్లు, అప్పుడు ఏం జరుగుతుంది ?

**యా :** ఆత్మవల్ల జరుగుతుంది. పెనుచీకట్లు దాటిన తరువాత ఆత్మ యొక్క కాంతులవల్ల జగత్తంతా ప్రవర్తిల్లుతుంది. అసలు ఆత్మ యొక్క కాంతులతోనే చరాచరజగత్తు అంతా నడుస్తున్నది. అని చెబుతాడు. కాబట్టి పరమేశ్వరి నుంచి వచ్చే కిరణాలవల్లనే ఈ జగత్తు అంతా నడుస్తున్నది. ఆ కిరణాలలో అగ్ని 108, సూర్యుడు 116, చంద్రుడు 136 కిరణాలను గ్రహించగలిగారు. ఇప్పుడు సూర్యుని కాంతివల్ల పగలు, చంద్రకాంతుల వల్ల రాత్రి, సంధ్యవేళలయందు అగ్నికాంతులవల్ల జీవకోటి సంచరిస్తున్నది.

ఈ రకంగా అనేకకోట్ల కిరణసముదాయము ఆమె శరీరం నుంచి వస్తుంది. అసలు పరమేశ్వరి అంటే దివ్యమైన తేజోమయమైన కాంతి పుంజము. అందుకే ఆమె ప్రభావతి, ప్రభారూపా అనబడింది. ఆమె మూలప్రకృతి. వ్యక్తావ్యక్తస్వరూపిణి. వివిధాకారాలతో జగత్తంతా వ్యాపించి ఉన్నది. భక్తుల అజ్ఞానపు చీకట్లను పారద్రోలి జ్ఞానజ్యోతులు ప్రసాదిస్తుంది. ఆ దేవి విషయం 388 నుంచి 404 వరకు నామాలలో చెప్పబడింది.

## 388. నిత్యక్లిన్నా

నిత్యము దయతో ఆర్ద్రమైనది. కరుణానిధి. 'భక్తిముక్తులనిచ్చునది నిత్యక్లిన్న అను త్రిపురాదేవి' అని గరుడపురాణంలో చెప్పబడింది.

పరమేశ్వరి అత్యంత దయార్ద్రమైన హృదయము గలది. ఈ సృష్టి అంతా పరమేశ్వరి యొక్క సంతానమే. అటువంటి విశ్వము అంతటి పైనా దయగలది.

షోడశనిత్యలలో మూడవది.

## 389. నిరుపమా

సాటిలేనిది. వేదాలలో 'ఈమెకు సాటిలేదు' అని చెప్పబడింది.

పరమేశ్వరి యొక్క దయను గురించి చెప్పటానికి ఈ జగత్తులో నామరూపాలతో ఉన్న పదార్థం ఇంకొకటి లేదు. నిర్ ఉపమా. ఇంకొక ఉపమానము ఏదీలేదు. అందుచేతనే పరమేశ్వరి నిరుపమా అనబడింది. శ్రుతులలో ఏకమేవాద్వితీయం బ్రహ్మ ఒకటే ఉన్నది. రెండవది లేనిది. అదే పరబ్రహ్మ వాక్కుతో చెప్పటానికిగాని, కంటితో చూడటానికిగాని, మనస్సుతో భావించటానికిగాని రెండవది అనేది లేదు. ఇంకొక రూపము నామము లేని శుద్ధజ్ఞానస్వరూపము.

## 390. నిర్వాణసుఖదాయినీ

భాషలో వ అనే అక్షరానికి బ అనే అక్షరానికి తేడాలేదు. అందుచేత నిర్వాణము అనే మాటను నిర్బాణము అని తీసుకోవాలి. బాణము – శరీరము. నిర్బాణము. శరీరము లేనిది. ఇది వేదార్థం. వేదములో బాణము అనే శబ్దం శరీరానికి వాడబడింది.

నిర్వాణము అంటే అశరీరము. నిర్వాణసుఖమునిచ్చునది. మరణానంతరమువరకు సుఖము నిచ్చేది. ఇక్కడ సుఖము అంటే శాశ్వతసుఖము. అదే మోక్షము. కాబట్టి మరణానంతరము మోక్షము నిచ్చేది. నిత్యక్లిన్న, నిరుపమ అయిన దేవిని గనక అర్చించినట్లైతే వచ్చే ఫలము నిర్వాణసుఖము.

పరమేశ్వరిని అర్చిస్తే ఇహపరాలు రెండూ లభిస్తాయి. పరము అంటే అపరిమితమైన మోక్షము. అదే పరబ్రహ్మ స్థితి. పరబ్రహ్మకు ఏరకమైన క్రియలు ఉండవు. అటువంటి బ్రహ్మజ్ఞానస్థితి కలుగచేస్తుంది. కాబట్టే నిర్వాణసుఖదాయినీ అనబడింది. తన భక్తులకు వైరాగ్యాన్ని కలుగచేసి, వారికర్మలకు తగినఫలితమునిచ్చి, కర్మపరిపక్వత చెందిన తరువాత మోక్షం ప్రసాదిస్తుంది.

## 391. నిత్యాషోడశికారూపా

నిత్యలు పదహారు. వీటినే షోడశనిత్యలు అంటారు. వామకేశ్వరతంత్రంలో

| | | |
|---|---|---|
| 1. కామేశ్వరి | 7. శివదూతి | 13. సర్వమంగళ |
| 2. భగమాలిని | 8. త్వరిత | 14. జ్వాలామాలిని |
| 3. నిత్యక్లిన్న | 9. కులసుందరి | 15. చిత్ర |
| 4. భేరుండ | 10. నిత్య | 16. మహానిత్య |
| 5. వహ్నివాసిని | 11. నీలపతాక | |
| 6. మహావజ్రేశ్వరి | 12. విజయ | |

వశిష్ట సంహితలో మొదటి నిత్య మహాత్రిపురసుందరి. అని చెప్పబడింది. మిగిలినవి కామేశ్వరి నుంచి చిత్ర వరకు పదిహేనునిత్యలు. ఈ రకంగా ఉన్న పదహారునిత్యలలోనూ మహాత్రిపురసుందరి లేదా మహానిత్య ఆ పరమేశ్వరి. ఈ నిత్య మిగిలిన వాటితో కలుస్తుంది. ఏవిధంగా అంటే....... పరమేశ్వరి అర్చనా విధానంలో నిత్యాదేవతలను అర్చించటం ఒక పద్ధతి. అందులో ప్రతిరోజూ, ఆ రోజున ఉన్న తిథి నిత్యను పూజిస్తారు. ఆ విధంగా

పాడ్యమిరోజున కామేశ్వరి, విదియ భగమాలిని, పౌర్ణమి చిత్ర. వీటిని తిథి నిత్యలు అంటారు. ఆ తిథి నిత్యతోపాటుగా మహానిత్య లేదా మహాత్రిపురసుందరిని కూడా ప్రతిదినం విధిగా అర్చించాలి. ఈ రకంగా పరమేశ్వరి స్వరూపమైన మహాత్రిపురసుందరి మిగిలిన అన్ని నిత్యలతో కలుస్తుంది. కాబట్టి ఆ దేవి నిత్యాషోడశికారూపా అనబడుతోంది.

ఆ పరమేశ్వరి నిత్యాయాగముతో సంతోషిస్తుంది. నిత్యమూషోడశి మంత్రరూపంలో ఉండేది. శక్తిరహస్యంలో "కోటివాజపేయాలకన్న, షోడశియాగాల కన్న మహాషోడశి మంత్రాన్ని ఒకసారి పలికే వారి కోరికలను పరమేశ్వరి తీరుస్తుంది" అని చెప్పబడింది. అంటే షోడశిమహామంత్రజపానికి అంత ప్రాముఖ్యత ఉన్నది అని అర్థం.

పరమేశ్వరి షోడశకళాస్వరూపిణి. మిగలిన పదిహేను నిత్యలు ఆమెకు అంగనిత్యలే. అంగి అయిన పరమేశ్వరి వ్యష్టిగ, సమిష్టిగా షోడశనిత్యాకలారూపిణి. అందుచేతనే నిత్యాషోడశికారూపా అనబడుతోంది.

ఈ పదహారుకళలలోను మహాత్రిపురసుందరి సాదాఖ్యకళ. అదే ధృవకళ, బ్రహ్మకళ, చిత్కళ, ఇదే పరమాత్మ స్వరూపం. మిగిలిన కళలు దీని నుంచే పుట్టి లయమవుతున్నాయి.

నిత్య కాలాన్ని సూచిస్తుంది. పదిహేను నిత్యలు పదిహేను తిథులరూపాలు. తిథి అంటే ఒక పగలు ఒక రాత్రి. అదే శివశక్తి స్వరూపము.

| | | |
|---|---|---|
| పదిహేను తిథులు | – | ఒక పక్షము |
| రెండుపక్షములు | – | ఒక మాసము |
| ఆరుమాసములు | – | ఒక ఆయనము |
| రెండు ఆయనములు | – | ఒక సంవత్సరము |

**హయనాత్మా మహాదేవః ప్రజాపతిరితిస్మృతి**

కాలపురుషుడే ప్రజాపతి. కాబట్టి నిత్యాస్వరూపమైన పరమేశ్వరియే కాలము.

## 392. శ్రీకంఠార్ధశరీరిణీ

శ్రీ అనగా విషము. విషమును కంఠమునందు గలవాడు పరమేశ్వరుడు. ఆ పరమేశ్వరుని యొక్క శరీరమందు అర్ధభాగము గలది. అనగా పరమేశ్వరుని యొక్క భార్య పరమేశ్వరి.

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ సృష్టి చెయ్యాలని సంకల్పించి తానే రెండుగా మారాడు. తనలో నుంచి కొంతభాగాన్ని బయటకు పంపాడు. ఆ రకంగా బయటకు వచ్చిన శక్తియే పరమేశ్వరి. పరమేశ్వరుడు ప్రకాశాంశకాగా శక్తి విమర్శాంశ. కాబట్టి ఆమె పరమేశ్వరుని అర్ధశరీరిణి అనబడుతోంది.

దేవీభాగవతంలో చింతామణి గృహంలో శ్రీచక్రాసనం మీద పరమేశ్వరిని వర్ణిస్తూ ఆ ఆసనం మీద భువనేశ్వరుడున్నాడు అని చెప్పి అతని యొక్క

**వామాంకే షణ్ణిషణ్ణా స్వదేవీ శ్రీభువనేశ్వరీ**

**యా దేవీ నిజలీలార్థం ద్విధాభూతాబభూవహ**

వామాంకము మీద భువనేశ్వరీదేవి ఆసీనురాలయి ఉన్నది. అయితే వారిద్దరూ వీరుకాదు. తన యొక్క లీలా వినోదం కోసం పరమేశ్వరి రెండుభాగాలయింది అని చెప్పబడింది. అందుచేతనే ఆమె పరమేశ్వరునికి అర్ధశరీరిణి.

ఇక్కడ అర్ధాంగి అంటే ఒకే దేహంలో ఒక భాగం ఒకరు, ఇంకొకభాగం ఒకరు కాదు. ఇద్దరూ ఒకటే అంటే ప్రతి అణువులోనూ శివభాగము, శక్తిభాగము రెండూ ఉంటాయి. అలాంటి అణువులచేతనే దేహం నిర్మించబడింది. ఈ రకంగా వారు అర్ధశరీరులు. ఇదే విషయం ఉపనిషత్తులలో కూడా చెప్పబడింది.

మాతృకాకోశములో అ కారము అంటే – శ్రీకంఠుడు, ఇంద్రుడు, నొసలు, కేశవుడు అని చెప్పబడింది. అటువంటి శ్రీకంఠుని అర్ధాంగి. అనగా వాగ్రూపమైన దేవి. అక్షరాలన్నింటిలోనూ అకారము శ్రేష్టమైనదేవి. గీతలో భగవానుడు **అక్షరాణా అకారోస్మి** అంటాడు. అ కారము పరబ్రహ్మస్వరూపం. అటువంటి అకారంలో అర్ధశరీరిణి. పరా పశ్యంతి మధ్యమ వాక్కు అస్పష్టమైనవి. వాటికి అచ్చులు కలిస్తేనే అవి పూర్తివైఖరీవాక్కు అవుతాయి.

అటువంటి అకారంలో అర్ధభాగం. అందుకే పరమేశ్వరి శ్రీకంఠార్ధశరీరిణి అనబడుతోంది.

## 393. ప్రభావతీ

ప్రభా అనగా కాంతి అని అర్థం. పరమేశ్వరి కొన్నికోట్ల సూర్యచంద్రుల కాంతులు గలది.

ప్రభా అంటే అణిమాది ఆవరణ దేవతలు. పరమేశ్వరి అణిమాది ఆవరణ దేవతలతో ఆవరించబడినది.

ఆ దేవి కాంతినిప్రసరింపచేసే సూర్యచంద్రులకే కాంతులనిస్తుంది. భైరవ యామళంలో చెప్పినట్లుగా

**జ్యోతిరూపాపరాకారా యస్యాదేహోద్భవాశ్శివే !**
**కిరణా శ్చసహస్రం చ ద్విసహస్రంచ చ లక్షకమ్**
**కోటిరర్బుదమేతేషాం పరాసంఖ్యా న విద్యతే.**

జ్యోతిరూపమైనటువంటి ఆమె దేహము నుంచి కోట్లకొలది కిరణాలు ప్రకాశిస్తున్నాయి. ఆ కిరణాలకు లెక్కలేదు. అవి అనంతమైనవి. వాటినుంచి

**అష్టోత్తరశతంవహ్నేః షోడశోత్తరశతంరవేః ।**
**షట్త్రింశత దుత్తరశతం చంద్రస్యకిరణా శ్శివే ! ॥**

108 కిరణములను అగ్ని, 116 కిరణములు సూర్యుడు, 136 కిరణములు చంద్రుడు గ్రహించారు. ఇవి మొత్తం 360 కిరణా. వీటివల్లనే పగలు రాత్రి కలుగుతున్నాయి. కాలచక్రం తిరుగుతోంది. అని చెప్పబడింది.

కాబట్టి పరమేశ్వరి అంటే తేజోమయమైన కాంతిపుంజము.

ఆ పరమేశ్వరి అణిమాది అష్టసిద్ధులచేతను, విద్యాస్వరూపమగు వశిన్యాదివాగ్దేవతల చేతను ఆవరించబడిఉన్నది.

బహు ప్రభావముగల కుండలినీశక్తియే ప్రభావతి. ఆధారచక్రం నుంచి షట్చక్రాలను గ్రంథిత్రయాన్ని ఛేదించుకుని సహస్రారం చేరుతుంది. ఈ త్రోవలో ఆజ్ఞాచక్రం చేరినప్పుడు ఆ కుండలినీశక్తిని జ్యోతిష్మతీ, ప్రభావతి అని కీర్తిస్తారు.

## 394. ప్రభారూపా

ప్రభారూపములైన అణిమాది దేవతలే శరీరముగా గలది. పరమేశ్వరి మనోమయి కాంతిమయి.

కోటిసూర్యుల కాంతియే రూపముగా గలది. పరమేశ్వరి రూపము తేజోమయమైన కాంతిపుంజము. దేవీభాగవతంలో ఆ దేవి.

**చతుర్దిక్షు చతుర్వేదమూర్తిమద్భి రభిష్టుతమ్**
**కోటిసూర్యప్రతీకాశం చంద్రకోటి సుశీతలమ్**
**విద్యుత్కోటి సమానాభ మరణం తత్పరం మహః ॥**

రూపుదాల్చిన నాలుగువేదాలచేత స్తుతించబడుతున్నది. కోట్లకొలది సూర్యుల కాంతులతో, విరాజిల్లుతూ కోట్లకొలది చంద్రుల చల్లదనము గలిగిఉన్నది. ఆ రూపము కొన్నికోట్ల మెరుపులు ఒక్కసారి మెరిసినట్లుగా తళుక్కున మెరిసింది. అరుణారుణకాంతులు వెదజల్లుతున్నది.

అందుచేతనే ఈశావాస్యోపనిషత్తులో సాధకుడు బ్రహ్మలోకానికి బయలుదేరాడు. బ్రహ్మలోకానికి తలవాకిలి సూర్యమండలము. ఆ మార్గమంతా తేజోమయమైన సూర్య మండలము. తేజోమయమై కాంతిపుంజముతో కప్పబడి ఉంటుంది. ఆ కాంతిలో బ్రహ్మ లోకానికిపోయే త్రోవకూడా కనపడదు. అందుచేత సాధకుడు పరమాత్మను తన కాంతిని కొంత ఉపసంహరించుకోమని కోరతాడు అని చెప్పబడింది. ఈ రకంగా పరమేశ్వరి తేజోమయమైన కాంతిపుంజము. అందుచేతనే ఆమె ప్రభారూపా అని చెప్పబడుతుంది.

## 395. ప్రసిద్ధా

అందరిచేతను నేను 'అహం' అని తెలియబడుటచే ప్రసిద్ధమైనది. దేవీభాగవతంలో

**సర్వచైతన్యరూపాం తా మాద్యాం విద్యాం చ ధీమహీ**

**బుద్ధిం యా నః ప్రచోదయాత్**

సర్వచైతన్యరూపము గల ఆదివిద్యను ధ్యానిస్తున్నాను అని చెప్పబడింది. అంటే అది ప్రసిద్ధమైన రూపము.

ప్రపంచంలో ఉన్నవారంతా, తమకు తెలిసినా తెలియకపోయినా నేను, నాది అని చెప్పుకునే అహం వాచకముగా ప్రసిద్ధమైనది. **వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః** అన్నివేదాల యందు అహం అని తెలుసుకోతగినది. జీవి యందు అహం రూపంలో ప్రసిద్ధమైనది.

ప్రపంచంలోని ప్రతి గ్రామంలోనూ కూడా ఏదో ఒక రూపంలో పూజింపబడుతూనే ఉన్నటువంటిది. ఈ రకంగా ప్రసిద్ధి పొందినది కాబట్టే ఆమె ప్రసిద్ధా అనబడుతోంది.

## 396. పరమేశ్వరీ

పరాత్పరురాలైన ఈశ్వరి. ప్రసిద్ధమైన దేవత. ఈ జగత్తులో జీవులకు వారి వారి కర్మల ననుసరించియే దేహము, ఇంద్రియాలు వస్తాయి. కర్మ ఎప్పుడైతే నశిస్తుందో దేహము కూడా అప్పుడే నశిస్తుంది. మళ్ళీ సంచితకర్మ అనుభవించటానికి జీవి ఈ లోకంలో పుడుతుంది.

ఈ రకంగా జీవి ఈ లోకంలో జన్మిస్తూ, కర్మచేస్తూ, కర్మఫలాన్ని అనుభవించి మరణిస్తూ, మళ్ళీపుడుతూ ఉంటుంది. కర్మక్షయమయ్యే దాకా ఈ విధంగానే జరుగుతుంది. ఈ రకమైన కర్మసంబంధములేనిది పరమేశ్వరి.

## 397. మూలప్రకృతిః

చరాచరజగత్తుకూ మూలమైనటువంటిది. ప్రకృతి అంటే ఈ జగత్తుకు కారణ భూతమైనది ఆ పరమేశ్వరి.

జగత్తులోని ప్రతివస్తువుకు ఏదో ఒకటి మూలుమున్నది. జీవులు పుట్టాలి అంటే తల్లితండ్రులు కావాలి. అలాగే అన్ని జీవాలకు పృథివియే యోని.

| | | |
|---|---|---|
| ఆ భూమి | – | జలం నుంచి పుట్టింది |
| జలం | – | అగ్ని నుంచి పుట్టింది |
| అగ్ని | – | వాయువు నుంచి పుట్టింది |
| వాయువు | – | ఆకాశం నుంచి పుట్టింది |
| మరి ఆకాశము | – | పరబ్రహ్మ నుంచి పుట్టింది. |

ఆ పరబ్రహ్మ – బ్రహ్మపదార్థమే. దానికి మాతృకలేదు. పరబ్రహ్మకు చావుపుట్టుకలు లేవు. అన్నింటికీ ఆ బ్రహ్మయే కారణము. దానికి కారణము ఏదీ లేదు. కాబట్టి బ్రహ్మయే మూలప్రకృతి. అందుకనే పంచరాత్రమందు "వేదమాత, జగన్మాత అయిన సరస్వతి పుట్టింది. ఆమెకు కారణంలేదు. ఆమె మూలప్రకృతి" అని చెప్పబడింది.

నియమితకాలంలో పరిపక్వమైన కర్మలను మాత్రమే జీవులు అనుభవిస్తాయి. మరి అపరిపక్వంగా ఉన్న కర్మను అనుభవించటానికి లేదు. కర్మ చెయ్యగానే దానియొక్క ఫలితం రాదు. కొంతకాలం పడుతుంది. బాగా తిన్న తరువాత కడుపునొప్పి రావటానికి సమయం పట్టినట్లుగా, అందుచేత పరిపక్వమైన కర్మను అనుభవించగానే ప్రళయం సంభవిస్తుంది. అప్పుడు ఈ జీవరాశి అంతా మాయలో కలిసిపోతుంది. ఆ మాయ పరమేశ్వరునిలో లీనమైపోతుంది. అపరిపక్వంగా ఉన్న కర్మ పరిపక్వం అయ్యేదాకా మళ్ళీ సృష్టి జరగదు. ఈ రకంగా జీవులను ఆవిర్భవింపచేసి, వాటితో కర్మను అనుభవింపచేసేదే మూలప్రకృతి.

కొంతకాలం తరువాత అవ్యక్తము అంటే మాయ. ఆ మాయ లేదా అవ్యక్తము నుంచి మహతత్త్వము, దాని నుంచి తమోగుణ ప్రధానమైన అహంకారము పుట్టినాయి. ఈ రకంగా త్రిగుణాలే ప్రధానంగా సృష్టి జరిగింది. దీనిని గతంలో వివరించాము.

అటువంటి సృష్టి అంతటికీ మూలమైనది మూలప్రకృతి. సృష్టి స్థితి లయ తిరోదానము అనుగ్రహము అనే పంచకృత్యాలను నడిపేదే మూలప్రకృతి.

దేవీభాగవతంలో "చరాచరజగత్తును సృష్టించటం కోసం పరమేశ్వరి.

1. దుర్గ 2. లక్ష్మి 3. పార్వతి 4. సావిత్రి 5. రాధ

అను ఐదురూపాలు పొందింది. అవే పంచశక్తులు అని చెప్పబడింది. ఈ పంచశక్తులకు కారణమైనది మూలప్రకృతి.

## 398. అవ్యక్తా

ఇక్కడ నుండి క్రమంగా ఆ పరమేశ్వరిని సకలరూపాలతోను కీర్తిస్తున్నారు.

అవ్యక్తము - కంటికి కనిపించనిది. మాయ యొక్క ప్రకాశరూపము సాంఖ్యసప్తతిలో

**సూక్ష్మలింగ మచేతనమ్ అనాదినిధనం తథా ప్రసవధర్మి ।**
**ని వయవమేకమేవహి సాధారణమేతద్వ్యక్తమ్ ॥**

అవ్యక్తము అంటే సూక్ష్మము. లింగభేదము లేనిది. చేతనము కానిది. ఆద్యంతరహితమైనది. సృష్టియందు సమర్థమైనది, అవయవములులేనిది, ఏకమైనది, విశ్వవ్యాప్తమైనది అని చెప్పబడినది. పంచశిఖాచార్యుడు కూడా "ఆదిమధ్యలులేనిది, మహత్తునకు అవతలది, అవ్యక్తమనబడుతుంది" అన్నాడు. సత్వరజస్తమస్సులు బ్రహ్మ యొక్క గుణాలు కావు. అవి అవ్యక్తము యొక్క ధర్మాలు పరబ్రహ్మ అవ్యక్తపదముచేత చెప్పబడుతున్నది. అది కనులచే గ్రహించబడదు. వాక్కుచే వర్ణించబడదు. శ్రోత్రములచే వినబడదు. ఇతరులైన దేవతలచేతగాని, కర్మచేతగాని, తపస్సుచేతగాని పొందజాలనిది.

అనేక రూపములలో ఉంటుంది. కాని బ్రహ్మ ఇలా ఉంటుంది అని చెప్పటానికి లేదు.

సృష్టిలో ప్రథమసృష్టి మూలప్రకృతి యొక్క అవాఙ్మానస గోచరము. ఇదే మహామాయ అనబడుతుంది. ఇంద్రియాలకు గోచరము కాదు కాబట్టి అవ్యక్తము అనబడుతుంది. ప్రళయకాలంలో నామరూపాత్మకమైన ఈ జగత్తును తనలో లీనం చేసుకుంటుంది. అంటే అస్పష్టమైన పదార్థాలన్నింటినీ కలిగి ఉంటుంది. కాబట్టి అవ్యక్తా అనబడుతుంది.

సుషుప్తావస్థలో ఇంద్రియాలన్నీ పనిచెయ్యటం మానివేస్తాయి. అప్పుడు మిగిలేది ఆత్మ ఒక్కటే. ఆత్మ కూడా నిజరూపంలో మిగులుతుంది. సుషుప్తిలో జాగ్రదావస్థలో చేసిన పనులన్నీ మరిచిపోతాడు. అందుకే తనకేమీ తెలియదని, తాను సుఖంగా ఉన్నానని అంటాడు. ఆ సమయంలో అతననుభవించిన భోగమంతా ముఖ్యప్రాణంలో లయమవుతుంది. ఇదే అవ్యక్తము.

## 399. వ్యక్తావ్యక్తస్వరూపిణీ

వ్యక్తము అంటే మహతత్త్వము. ఇది అవ్యక్తము నుంచి వచ్చినది. అంతటా వ్యాపించినది. సృష్టిలో మొదటగా అవ్యక్తము నుంచి మహతత్త్వము, మహతత్త్వమునుంచి అహంకారము పుట్టినాయి. ఈ రకంగా అవ్యక్తమైనది ఆ పరమేశ్వరియే. వ్యక్తమైనది కూడా ఆ పరమేశ్వరియే. అందుకే ఆమె వ్యక్తావ్యక్తస్వరూపిణి అనబడుతుంది. జగత్తులో ఉన్నటు వంటి తత్త్వముల రూపంలో ఉంటుంది. కాబట్టి పరమేశ్వరి వ్యక్తరూపిణి. బ్రహ్మవైవర్త పురాణంలో 1.వ్యక్తము 2. అవ్యక్తము 3. వ్యక్తావ్యక్తము అని మూడు లింగాలు ఉన్నాయి. అవే క్రమంగా 1. స్వాయంభువము 2. బాణలింగము 3. శైలలింగము స్వాయంభువ లింగము–తనంత తాను పుట్టినది. బాణలింగము నదిలో పుట్టినది. శైలలింగము రాతితో చేయబడినది. వీటిలో అవ్యక్తలింగము మోక్షమిస్తుంది. వ్యక్తలింగము ఇహపరసుఖాలనిస్తుంది.

జగత్తులోని అన్ని ఆకారాలు ఈ వ్యక్తరూపము నుంచే ఉద్భవించినాయి. ఇదే మహతత్త్వస్వరూపము. వ్యక్తము కార్యరూపంలోను, అవ్యక్తము కారణరూపంలోను ఉంటాయి. ఈ రకంగా వ్యక్తము అవ్యక్తము కూడా పరమేశ్వరియే కాబట్టి ఆ దేవి వ్యక్తావ్యక్తస్వరూపిణి అనబడుతుంది.

## 400. వ్యాపినీ

సమస్త జగములందు వ్యాపించినది. సాత్విక, రాజస, తామస సృష్టులందు వ్యాపించినది. అంటే సృష్టి అంతాగుణమయమే కాబట్టి త్రిగుణాత్మకమైనది. అహంకారము నుంచి భూమి వరకు జగత్తు అంతా వ్యాపించినది. నామరూపాత్మకశాఖ ద్వారా సర్వజగత్తునూ ఆవరించినది. ఆత్మరూపంలో అన్నిజీవుల యందు ఆవరించినది. జగత్తంతా ప్రకాశరూపంలో అనగా ఆత్మరూపంలో ఆవరించినది. విమర్శరూపంలో అన్ని రూపాలను పొందినది. ఈ రకంగా లోపలా బయటా కూడా చరాచరజగత్తంతా ఆవరించినది. కాబట్టి ఆ దేవి వ్యాపినీ అనబడుతున్నది.

## 401. వివిధాకారా

ఇందాక చెప్పిన నామాన్నే ఇంకా వివరిస్తున్నారు. ఆ పరమేశ్వరి నామ రూపాత్మకంగా జగత్తంతా వివిధాకారాలతో వ్యాపించి ఉన్నది. నామాత్మకంగా అంటే జగత్తులోని అన్ని నామాలూ ఆ పరమేశ్వరివే. రూపాత్మకము అంటే అన్నిరూపాలు ఆ దేవివే. కాబట్టి బ్రహ్మ మొదలు స్తంభము పర్యంతము నామరూప భేదాలతో విరాజిల్లుతున్నది ఆ పరమేశ్వరి. 25 తత్త్వములు ఆ పరమేశ్వరి రూపమే. అందుచేతనే ఆ దేవి వివిధాకారా అనబడుతోంది.

లోకంలో భగవంతుణ్ణి రాముడని, కృష్ణుడని, అల్లాఅని, ఏసుఅని ఇలా అనేకపేర్లతో అనేక మతాలవారు ఆరాధిస్తుంటారు. ప్రపంచంలోని మానవులు ఎన్ని రకాల ఆభరణాలు ధరించినా, వాటిలోని బంగారం ఒకటే. అలాగే దేవతామూర్తి ఏదైనా అందులోని పరమేశ్వరుడు ఒక్కడే. అంటే వివిధమైన జీవులుగా జన్మించి వారిచేత వివిధ ఆకారాలలో పూజించబడుతున్నాడు. ఈ రకంగా వివిధమైన ఆకారాలు ధరించి ఉన్నాడు.

సృష్టి పదిరకాలుగా జరుగుతోంది. అవి

1. మహత్సృష్టి
2. అహంకారసృష్టి
3. భూతసృష్టి
4. ఇంద్రియసృష్టి
5. అష్టవిధ దేవసృష్టి
6. షడ్విధ ప్రాకృత తమస్సృష్టి
7. వనస్పతి సృష్టి ఇది ఆరురకాలు
8. తిర్యక్సృష్టి ఇది 28 రకాలు
9. మానవసృష్టి
10. కుమారసృష్టి

పరమేశ్వరి వివిధకారలైన అన్ని సృష్టులయందు ఉంటుంది. కాబట్టే వివిధాకారా అనబడుతుంది.

## 402. విద్యాఽ విద్యాస్వరూపిణీ

విద్య అవిద్య ఈ రెండింటి స్వరూపము ఆ దేవి. ఈశావాస్యోపనిషత్తులో విద్య అవిద్యల గురించి చెప్పబడింది. అవిద్యను ఆరాధించేవారు అంటే ఆత్మజ్ఞానం లేకుండా కర్మలను ఉపాసించేవారు గాడాంధకారంలో పడిపోతారు. కర్మలను వదిలిపెట్టి కేవలం ఉపాసనలో పడ్డవారు ఇంకా అంధకారంలో పడిపోతారు. అందుచేత జ్ఞానరహితమైన ఉపాసనవల్లగాని, ఉపాసనరహితమైన జ్ఞానంవల్లగాని సద్గతి కలుగదు. వీటిని విడివిడిగా అనుష్ఠించేవారు ఆత్మజ్ఞానానికిదూరమై తామసలోకాలకుపోతారు. ఆత్మజ్ఞానానికి ఉపాసన, కర్మాచరణ రెండూ ముఖ్యమే. అప్పుడే సత్ఫలితం ఉంటుంది. విద్యను ఉపాసించటంవల్ల దేవలోకము, అవిద్యను ఉపాసించటంవల్ల పిత్రులోకము వస్తాయి. వీటినే ఉత్తరదక్షిణాలు అంటారు. ఈరెండూ తెలిసినవారు అవిద్య అంటే కర్మలచే మృత్యువును జయించి, విద్యతో దైవత్వం పొందుతాడు. విద్య అవిద్య రెండూ పరమేశ్వర స్వరూపాలే.

ఈ రెండింటినీ సమానంగానే ఉపాసించాలి. "అవిద్యవల్ల శరీరాన్ని వదలి, విద్యతో జన్మరాహిత్యం పొందాలి. జగత్తును దాటటానికి కర్మాచరణ, జన్మరాహిత్యానికి ఉపాసన

రెండూ అవసరమే. ఇది తెలిసి ఆచరించినవాడు కర్మలవల్ల సంచితకర్మలను నాశనంచేసి, ఉపాసనవల్ల దైవత్వం పొందుతాడు" అని చెప్పబడింది.

విద్య, అవిద్య రెండూ కూడా ఆ పరమేశ్వరి స్వరూపాలే. అయితే సాధకుడు ఈ విషయాలను తెలుసుకుని ఉపాసనచేసినట్లైతే అతడికి మోక్షం ప్రసాదిస్తుంది. ఆ పరమేశ్వరి. అందుచేతనే ఆమె విద్యావిద్యస్వరూపిణి అనబడింది.

## 403. మహాకామేశనయనకుముదాహ్లాదకౌముదీ

మహా అంటే గొప్పవాడైన కామేశుడు. మహాకామేశుని యొక్క కనులు అనే కలువలకు వెన్నెలవంటిది. కౌముదము అంటే – కైరవము, రక్తపంకజము, కుముదము, కార్తీకపున్నమినాటి వెన్నెల అని అర్థం. కాబట్టి మహాకామేశుని కనులు అనే కలువలకు కార్తీకపున్నమినాటి వెన్నెల వంటిది.

కుముదులు అంటే నీచులైనవారు లౌకికసుఖాలు కోరతారు. కాని ఆసుఖాలన్నీ దుఃఖకారకాలు. అందుచేత వారి కోరికలను మళ్ళించి వారికి ఆహ్లాదము కలిగించునది.

మహాకామేశుని కనులనబడే కలువలను వెలిగించేది ఆ పరమేశ్వరి. అలా ప్రకాశిస్తున్న కామేశ్వరుని కనులు చంద్రసూర్యాగ్నులను పోలుతూ తెలుపు ఎరుపు నీలపురంగులలో ప్రకాశిస్తున్నాయి.

ఉపాసకులకు పరమేశ్వరి జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. కాబట్టి వారందరూ అనిర్వచనీయమైన ఆనందం పొందుతాడు. జ్ఞానజ్యోతులతో ప్రకాశించే పరమేశ్వరి ముఖం చూడాలంటే కామేశ్వరసమానులే కావాలి. అంతేకాని అన్యులకు సాధ్యం కాదు.

పరమేశ్వరి స్వరూపాన్ని చూడటంచేత కామేశునికి ఆహ్లాదం కలుగుతుంది.

## 404. భక్తహార్దతమోభేదభానుమద్భానుసంతతిః

భక్తుల మనసులో ఉండే అజ్ఞానాన్ని నాశనం చేసేది. అజ్ఞానము, భ్రమ, బంధము ఇవన్నీ మనసుకు పట్టిన మలినాలు. భక్తుల హృదయాలలో తమోగుణాన్ని పోగొట్టి సూర్యప్రభలవలె జ్ఞానజ్యోతులు వెలిగించేది.

తన భక్తులయొక్క అజ్ఞానపు చీకట్లను తొలగించి జ్ఞానజ్యోతులనందించేది పరమేశ్వరి. అందుచేతనే భక్తహార్థ తమోభేదాభానుమత్భాను సంతతిః అని చెప్పబడింది.

# 34. శివదూతి విద్య

పూర్వకాలంలో శుంభనిశుంభులు అని దైత్యులు ఉండేవారు. వారు వసుతః బలాఢ్యులు వేదవేదాంగవిదులు. పై పెచ్చు శివుణ్ణి గురించి బ్రహ్మాండమైన తపస్సు చేశారు. వారి తపస్సుకు మెచ్చి శివుడు కరుణించి ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. రాక్షసులందరిలాగానే చావులేకుండా వరం కావాలి అన్నారు శుంభనిశుంభులు. అది మాత్రం అసంభవం. సృష్టిలో ఏ ప్రాణి అయినా మరణించాల్సిందే అది సృష్టి ధర్మం. కాబట్టి ఇంకేదయినా వరమడగండి అన్నాడు శివుడు. వారు బాగా ఆలోచించి పురుషుని వలన మృత్యువు రాకుండా వరమడిగారు. సరేనన్నాడు శివుడు.

అసలే రాక్షసులు. అందులోనూ బలాఢ్యులు వరగర్వితులు. వారి ఆగడాలకు లెక్కలేకుండాపోయింది. యజ్ఞయాగాదులు నాశనం చేశారు. మునిపల్లెలు తగులబెట్టారు. దేవతలను చెరబట్టారు. వీరి బాధలు భరించలేక శివుడికి మొరపెట్టుకున్నారు దేవతలు. ఆ తరువాత అసలు విషయం తెలిసి హిమాలయాలకుపోయి పార్వతిరూపంలో ఉన్న అంబికను ప్రార్థించారు. అప్పుడు అంబిక పార్వతి శరీరం నుంచి బయటకు వచ్చేసింది. పార్వతి దేహం నల్లగా మారిపోయి కాళి అనే పేరుతో హిమాలయాలమీద నివాసం ఏర్పరచుకున్నది. పార్వతి శరీరం నుండి బయటకు వచ్చేసింది కాబట్టి ఆ దేవికి కౌశికి అని పేరు వచ్చింది.

కౌశిక హిమాలయ పర్వతశ్రేణుల మీద తిరుగాడుతోంది. ఆ దేవిని చూశారు చండ ముండులనే రాక్షసులు. తమ ఏలిక దగ్గరకుపోయి ఒక స్త్రీ రత్నాన్ని మేము చూశాము. రత్నాలన్నీ రాజు దగ్గర ఉండటం ధర్మం కాబట్టి ఆ స్త్రీ రత్నాన్ని నువ్వు పరిగ్రహించు అన్నారు. శుంభుడు వీరి మాటవిని సుగ్రీవుడనే రాక్షసుణ్ణి పరమేశ్వరి దగ్గరకు దూతగా పంపాడు.

సుగ్రీవుడు శుంభుని బలపరాక్రమాలను వివరించి చివరకు ఓ దేవీ ! నువ్వు మా రాజును వివాహమాడవలసింది అన్నారు. ఆ మాటలు విన్న దేవి యుద్ధంలో నన్ను జయించిన వారిని మాత్రమే వివాహమాడతానని శపథం చేశాను. కాబట్టి మీ రాజుకు ఈ విషయం చెప్పి నాతో యుద్ధం చెయ్యమను అన్నది.

దూత తెచ్చిన సందేశం విన్న శుంభుడు ధూమ్రలోచనుడనే వాణ్ణి పిలిచి 'నువ్వు ఎలాగయినా సరే ! ఆమెను నా సభకు ఈడ్చుకుని రావలసినది' అన్నాడు. పరమేశ్వరి

ఒక్క హుంకారంతో ఆ రాక్షసుణ్ణి సంహరించింది. ఆ మాటలు విన్న శుంభుడు కోపితుడై చండముండులను పరమేశ్వరితో యుద్ధానికి పంపాడు. వారు వివిధ రకాలయిన సేనలతో దేవిని చుట్టుముట్టారు. అంత దేవి చండముండులను సంహరించి ఈశ్వరుణ్ణి చూసి ఓ దేవా ! శుంభనిశుంభుల వద్దకు నువ్వు దూతగా వెళ్ళవలసింది అన్నది. పరమేశ్వరి ఆజ్ఞ మీద శివుడు ఆమె దూతగా వెళ్ళాడు కాబట్టి ఆమె శివదూతి అని పిలువబడింది.

లలితా సహస్రంలో 405 నుంచి 412 నామాల వరకు శివదూతి విద్యను వివరించటం జరిగింది.

పరమేశ్వరియే శివదూతి. దూతగా వెళ్ళేవాడు సర్వశాస్త్రపండితుడు, వేదాధ్యాయి, లౌకికుడు అయి ఉండాలి. భారతయుద్ధానికి ముందు శ్రీకృష్ణభగవానుడు రాయబారం వెళ్ళాడు. దూత చాలా గొప్పవాడుగా ఉండాలి. అందుకే శివుణ్ణి దూతగా పంపింది పరమేశ్వరి. ఆమె శివునితో ఆరాధించబడుతుంది. ఆ దేవి శివుని రూపంలోనే ఉంటుంది. భక్తుడికి ఆత్మజ్ఞానం కలుగచేసి మోక్షం ప్రసాదిస్తుంది. ఇక నామాలను చూద్దాం.

## 405. శివదూతీ

శివునిదూతగా పొందినది. మార్కండేయపురాణంలో శివుణ్ణి దూతగా పంపినది. కాబట్టి ఆ పరమేశ్వరి శివదూతీ అని ప్రసిద్ధి చెందినది. అని చెప్పబడింది.

భక్తులు పరమేశ్వరుణ్ణి చేరాలంటే శివునిలాగా విరాగులుకావాలి. సర్వస్వాన్ని త్యజించాలి. అందుచేతనే జీవాత్మ పరమాత్మను చేరటానికి వైరాగ్యం కావాలి అని చెప్పటానికే ఇక్కడ శివుడు దూతగా వెళ్ళాడు అని చెప్పబడింది.

షోడశనిత్యలలో ఏడవనిత్య శివదూతి. పుష్కరక్షేత్రంలో శివదూతి అనే దేవత ఉన్నది.

## 406. శివారాధ్యా

శివునిచే ఆరాధించబడినది. బ్రహ్మాండపురాణంలో

**శివో పి యాం సమారాధ్య ధ్యానయోగబలేనచ**

**ఈశ్వర స్సర్వసిద్ధీనాం అర్ధనారీశ్వరోఽ భవత్ ॥**

శివుడు ధ్యానంతో ఆ పరమేశ్వరిని బాగా ఆరాధించి సర్వసిద్ధులకు ప్రభువైనాడు. అర్ధనారీశ్వరుడైనాడు అని చెప్పబడింది.

పంచదశీ మహామంత్రాన్ని అనేకమంది ఉపాసించారు అని గతంలో చెప్పాం. వారిలో శంకరుడు ఒకడు.

**అస్యశ్రీ శంకరవిద్యాంబా మహామంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః । పంక్తిచ్ఛందః శంకర విద్యాంబా దేవతా । హ స క ల హ్రీం । బీజం । హ స క హ ల హ్రీం శక్తిః స క ల హ్రీం కీలకం । జపేవినియోగః ॥**

**న్యాసము** : **మంత్రము యొక్క ఆరు భాగాలతోను న్యాసము చెప్పాలి.**

**ధ్యానము** : **సంకుకుమవిలేపనాం................**

**మంత్రము** : **హ స క ల హ్రీం । హ స క హల హ్రీం । స క ల హ్రీం ।**
**హ స క ల । హ స క హల । స క ల హ్రీం ।**

ఈ రకంగా శివునిచే ఆరాధించబడినది కాబట్టి శివారాధ్యా అనబడుతోంది.

**కటాక్షమోక్షా చరణోగ్రవిత్తా**
**నివేశితార్ణాః కరుణార్ద్ర చిత్తా**
**సుభక్తయే రాతి సమీప్సితం యా**
**భజామహే శ్రీభువనేశ్వరీం త్వాం ॥**

అంటూ శివుడు భువనేశ్వరీ హృదయాన్ని ఇంకా ధూమావతీకవచం, శ్యామలా స్తోత్రం, అన్నపూర్ణాసహస్రం, రేణుకాకవచం. ఇలా అనేకానేకస్తోత్రాలలో పరమేశ్వరిని ప్రార్థించాడు.

## 407. శివమూర్తిః

శివుడే స్వరూపముగా గలది. శివశక్తులకు భేదము లేదు. శివుడు లేక శక్తిలేదు. శక్తి లేక శివుడు లేడు. అందుకే శ్రీచక్రంలో **త్రికోణరూపిణీ శక్తిః బిందురూప పరశ్శివః** శక్తిత్రికోణం రూపంలో ఉంటుంది. శివుడు బిందువురూపంలో ఉంటాడు. ఈ ఇద్దరూ ఒకటే. శివుడు మంగళప్రదుడు. కాబట్టి శివమూర్తి అంటే మంగళములే రూపముగా ధరించినట్టిది.

శక్తికి రూపముండదు. శక్తిమంతుడైన శివుని రూపమే శక్తిరూపము. అందుచేతనే శివశక్తులకు భేదములేదు. వారిద్దరూ ఒకటే. ఆ కారణంచేతనే పరమేశ్వరి శివమూర్తి అనబడుతోంది.

## 408. శివంకరీ

భక్తుని శివునిగ చేయును. ఎప్పుడైతే అవిద్య అనే బంధనాలు తెగిపోయినాయో, అప్పుడు సాధకుడే పరబ్రహ్మ అవుతాడు. భావనోపనిషత్తులో

**ఏ వశివయోగీతి కథ్యత ఇ త్యుపనిషత్**

సాధకుడు తాను పరమేశ్వరి పాదపద్మములనుండి వచ్చే తేజస్సులో లీనమైనట్లుగా తలచి, తాను కూడా ఆ తేజస్సులో ఒక భాగమేనని గ్రహించి సర్వమూ పరబ్రహ్మమయము అని భావించుటయే పరిపూర్ణమైన ధ్యానము.

ఈ విధంగా తననుతాను పరబ్రహ్మస్వరూపంగా భావించి మూడు ముహూర్తముల కాలము ఆ దేవి యందు మనసును లగ్నం చేసినవాడు ఆ పరమేశ్వరితో ఐక్యత పొందుతాడు. దీనినే బ్రహ్మత్వం సిద్ధించటము అంటారు. ఈ విధంగా అంతఃపూజ చేసి సిద్ధుడైన సాధకుడికి కోరిన కోరికలు అప్రయత్నంగా నెరవేరతాయి. అతడు శివయోగి అనబడుతాడు. అతడే పరబ్రహ్మస్వరూపుడు అని చెప్పబడింది.

సాధకుల అజ్ఞానము తొలగించి వారికి ముక్తిని ప్రసాదిస్తుంది. వారికి శుభములు చేకూరుస్తుంది కాబట్టి శివంకరి అనబడుతోంది. ఈ నామము శివదూతి విద్యోపాసనకు ఫలితము. ఆ దేవి తన భక్తుల అభీష్టాలను నెరవేరుస్తుంది. ఆనందము కలుగచేస్తుంది. వారికి శుభములను చేకూరుస్తుంది. మోక్షమునిస్తుంది. శివసాయుజ్యము కలుగచేస్తుంది.

## 409. శివప్రియా

శివునకు ప్రియురాలు. శివుడు ప్రియుడుగాగలది. తన మూర్తి యందు తనకు ప్రేమ ఉండటము సహజము. ఆ పరమేశ్వరి శివమూర్తియే కాబట్టి శివప్రియా అనబడు తోంది. శివ అనగా శుభము అని అర్థం. కాబట్టి శుభమైన మంగళకరమైన కార్యము లందు ప్రీతి గలది. శివునితో ఐక్యత పొందుతుంది కాబట్టి శివప్రియా అనబడుతుంది.

## 410. శివపరా

శివునికన్న పరమైనది. శివుడు కూడా శక్తికి అధీనమైనవాడే. అందుచేత శివుని కన్న వేరైనది ఆ దేవి. భక్తులకు శివుని గురించి బోధిస్తుంది. కాబట్టి శివపరా అనబడుతున్నది. శక్తి యొక్క సహాయము లేనిదే శివుడు కూడా సృష్టి కార్యక్రమము చెయ్యలేడు. అని సౌందర్యలహరిలోని మొదటిశ్లోకంలో శంకరభగవత్పాదుల వారు చెప్పారు. అంటే శివునికన్న పరమైనది శక్తి. అందుకే శివపరా అనబడుతున్నది.

## 411. శిష్టేష్టా

శిష్టులయందు ఇష్టము కలిగినది. విహికకర్మలయందు ఇష్టము గలది. శిష్టేష్టా అన్నప్పుడు రెండు రకాల కర్మలు కనిపిస్తున్నాయి. 1. శిష్టములు – విహితకర్మలు. 2. ఇష్టములు – ప్రియమైనవి. ఈ రెండుకర్మలయందు ప్రీతిగలది.

విహితకర్మలచే పూజించబడినది. పరమేశ్వరి పూజావిధానం చెబుతూ వర్ణాశ్రమ ధర్మాలలో చెప్పబడిన ప్రకారము పరమేశ్వరికి అర్పించేదే పూజ. అంతేకాని గంధము, పూలు అర్పించటంకాదు. 'ఆచారమునుంచే ధర్మము పుడుతున్నది. ధర్మానికి ప్రభువు అచ్యుతుడు' అని బృహన్నారదీయములో చెప్పబడింది. వశిష్టసూత్రాలలో "అవయవ చాపల్యము లేనివారు, వంశపారంపర్యంగా వేదాధ్యయనం చేసేవారు, వేదాలనే ప్రమాణంగా తీసుకునే వారు శిష్టులు అనబడతారు' అని చెప్పబడింది. అటువంటి శిష్టులచే పూజింపబడేది. శిష్టులంటే ఇష్టపడేది.

తేలికగా చెప్పాలంటే శిష్టులు అనగా సదాచారసంపన్నులు వారియందు, వారి ఆచారములందు ప్రీతిగలది.

సదాచార సంపన్నులలో కూడా బ్రహ్మజ్ఞానులు శిష్టేష్టులు అనబడతారు. అటువంటి వారియందుండునది. వారి యందు ప్రీతి గలది. కాబట్టి ఆ పరమేశ్వరి శిష్టేష్టా అనబడుతుంది.

## 412. శిష్టపూజితా

శిష్టుల చేత పూజించబడేది. సదాచార సంపన్నులచే పూజించబడేది. శ్రుతులు స్మృతులు చెప్పిన ప్రకారము నియమనిష్టలచే పూజించబడునది. అందుచేతనే శిష్టపూజితా అనబడుతోంది.

## 413. అప్రమేయా

కొలవటానికి వీలుకానిది. బ్రహ్మనిష్ఠాదులచేతనే కొలువబడినది. అంతేకాని ఇతరులచేత కొలచుటకు వీలుకానిది.

ప్రమేయము అంటే – పరిమాణము అని అర్ధం. అప్రమేయము. పరిమాణము లేనిది. అపరిమాణము. ఆ పరమేశ్వరిని కొలవాలి లేక ఆమె గురించి తెలుసుకోవాలి అంటే ఇంద్రియజ్ఞానము చాలదు. ఇంద్రియాతీతమైన జ్ఞానము కావాలి. 'సత్యంజ్ఞాన

మనంతం బ్రహ్మ’ ఆ దేవి స్వరూపము అనంతమైనది కాబట్టి ఆమె అప్రమేయా అనబడుతున్నది. పరమేశ్వరిని గురించి తెలుసుకోవాలి అంటే ప్రత్యక్ష అనుమానాది ప్రమాణాలు చాలవు. వీటన్నింటికీ అతీతమైనది. అన్ని ప్రమాణాలకు ఆమె సాక్షి. అందుచేతనే ఆమె అప్రమేయా అనబడుతోంది.

## 414. స్వప్రకాశా

ఆత్మకన్నవేరుగాని ప్రకాశము గలది. స్వయముగా ప్రకాశించేది. పరమేశ్వరి ‘స్వంజ్యోతిః’ స్వయంప్రకాశరూపిణి. సూర్యచంద్రాది ఇతరులకు ప్రకాశాన్ని ఇచ్చేదే కాని ఆ దేవికి ఎవరివల్లా ప్రకాశము కలగదు. అందుచేతనే ఆమె స్వప్రకాశా అనబడుతుంది. కట్టెలు స్వయంగా కాలలేవు. వాటికి అగ్ని సాయముకావాలి. అటువంటి అగ్ని సూర్య చంద్రులకు కూడా ప్రకాశాన్ని ఇచ్చేది దేవి. ఆమె అఖండజ్ఞానస్వరూపిణి. ఆత్మస్వరూపిణి కఠోపనిషత్తులో చెప్పినట్లుగా

**న తత్ర సూర్యో భాతి న తత్ర చంద్రతారకం.** ఆత్మ ఉండేచోట సూర్యుడు ప్రకాశించడు. అక్కడ చంద్రుడుగాని, నక్షత్రాలుగాని ప్రకాశించవు.

దేనివల్ల సూర్యచంద్రులు ప్రకాశిస్తున్నారో అదే ఆత్మ. జగత్తులో చైతన్యము, జడము అని రెండు పదార్థాలున్నాయి. కంటికి కనిపించేవన్నీ జడపదార్థాలే. వీటికి చలనము లేదు. ఆత్మచైతన్యము. అది కంటికి కనిపించదు. స్వయంప్రకాశము గలది.

## 415. మనోవాచామగోచరా

మనస్సుకు వాక్కుకు గోచరము కానిది. వేదంలో “వాక్కు ఎవరినైతే వర్ణించలేదో, మనస్సు ఎవరినైతే పొందలేదో అతడే బ్రహ్మ” అని చెప్పబడింది. విష్ణుపురాణంలో ప్రహ్లాదుడు, మనోవాక్కులకతీతమైనది, జ్ఞానులకు మాత్రమే గోచరమైనది అయిన పరమేశ్వరికి నమస్కరిస్తున్నాను” అంటాడు.

ఇందాక చెప్పిన 413, 414 నామాలనే ఇక్కడ ఇంకా వివరిస్తున్నాడు. ఆ పరమేశ్వరి అవాఙ్మానసగోచరమైనది. సృష్టిలో ముందు పుట్టిన వాటికి తరువాత పుట్టిన వాటి గురించి తెలుస్తుంది. కాని తరువాత పుట్టినవాటికి ముందు పుట్టిన వాటి గురించి తెలియదు. అన్నింటికన్నా ముందు నుంచీ ఉన్నది పరమేశ్వరి. కాబట్టి ఆమెకు అన్ని విషయాలు తెలుస్తాయి. పిల్లలకు తమ తల్లి బాల్యం, వివాహం ఇత్యాది విషయాలు తెలియవు

కదా? అలాగే తరువాత పుట్టిన వాక్కు మనస్సు అనే ఇంద్రియాలకు ఆత్మ గురించి తెలియదు. అందుచేతనే పరమేశ్వరి మనోవాచామగోచరా అనబడుతోంది. పరమేశ్వరి పరాస్వరూపిణి. ఇది వాక్కులో ప్రథమరూపం. బయటకు వచ్చేవాక్కు వైఖరి స్వరూపం. ఇది నాల్గవరూపం. నాల్గవరూపానికి మొదటిరూపం గురించి ఎలా తెలుస్తుంది ? అలాగే అవ్యక్తము, మహతత్త్వము, అహంకారము. ఆ తరువాత తన్మాత్రలు పంచభూతాలు. ఇంద్రియాలు. ఇప్పుడు వాగాది ఇంద్రియాలకు తమకు ముందు నాల్గవతరానిదైన అవ్యక్తం గురించి ఎలా తెలుస్తుంది? తెలియదు. అందుకే దేవి మనోవాచామగోచరా అనబడుతుంది. అందుచేతనే పరమేశ్వరి సాక్షాత్కారం కావాలి అంటే యోగసాధనలో ఉన్మనాస్థితికి చేరాలి. ఉన్మన అంటే మనస్సు కూడా పనిచేయనిస్థితి. అప్పుడే ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది.

## 416. చిచ్ఛక్తిః

చిత్ + శక్తి' అంటే చిచ్ఛక్తి అంటే – ఔపమ్యశక్తి. వేదాలకు నిఘంటువైన నిరుక్తంలో యాస్కుడు చిత్ అనగా ఉపమ అన్నాడు.

చిత్ అనేవి రెండు అక్షరాలు. అనంతమైనవి. అవిద్య నశించగానే నిలిచేది విద్య. అదే జ్ఞానము చిత్ అనబడుతుంది. సకలప్రాణికోటి యందు జీవాత్మ రూపంలో ఉన్న పరమాత్మ. ఇదే శివము. శరీరంలోంచి ఈ శివం గనక వెళ్ళిపోతే మిగిలేది శవమే. చిత్ అనే పదార్థాన్నే చైతన్యము అంటారు. జగత్తులోని ప్రతి వస్తువునందు చలనము తెచ్చే శక్తే పరమాత్మ శక్తి. అదే చైతన్యము. చిఛక్తి అనబడుతుంది.

దేవీభాగవతంలో “ఓ రాజా ! అన్ని భూతములందు సర్వశక్తులతో కూడిన చైతన్యశక్తి ఉన్నది. ఈ శక్తిలేనివాడు శవముతో సమానము. అన్ని భూతాలలోనూ ఉన్న చిఛక్తి ఆ పరమేశ్వరియే” అని చెప్పబడింది. కాబట్టి ఆ దేవియే చిఛక్తి.

## 417. చేతనారూపా

పైన చెప్పినఅర్థాన్నే ఇంకా వివరిస్తున్నారు. “పరమేశ్వరుని యొక్క నిర్మలమైన చైతన్యమే చిఛక్తి అనబడుతుంది. దేవీ భాగవతంలోని మొదటిశ్లోకంలో సర్వచైతన్యరూప మయిన విద్యకు నమస్కరింతును” అన్నారు దీన్ని గతంలో వివరించాం.

సకలజీవుల దేహములయందు చైతన్యరూపంలో ఉండేది. చిఛక్తి యొక్క ధర్మమే చైతన్యము. ఇదే ధృవకల, సాదాఖ్యకల, చిత్కల, ఆత్మకల, పరమాకల అనబడుతుంది.

ఇది సహస్రారాన్ని స్థానంగా చేసుకుని, శరీరమంతా వ్యాపించి ఉంటుంది. జాగ్రస్వప్న సుషుప్తులయందు తాను ఉంటూ, వాటిని గురించి తాను తెలుసుకుని, వాటితో సంబంధము ఏమాత్రమూ లేకుండా ఉంటుంది. అదే చైతన్యరూపము

## 418. జడశక్తిః

జడమును సృష్టించేశక్తి. జడాత్మకమైన ప్రకృతిని సృష్టించటానికి ఏర్పడిన మాయా పరిణామశక్తియే జడశక్తి. అంటే ఇదే సృష్టి చేసేశక్తి. విష్ణుపురాణంలో "సర్వభూతశక్తులు జ్ఞానముతోనే తెలుసుకోదగినవి. సృష్ట్యాదిశక్తులన్నీ కూడా బ్రహ్మశక్తులే. అగ్నిని వేడి ఏవిధంగా ఆవరించి ఉంటుందో అలాగే సృష్ట్యాదిశక్తులు బ్రహ్మను ఆవరించి ఉంటాయి. బ్రహ్మ ఈ జగసృష్టికి కారణము. సృష్ట్యాదిశక్తులు వస్తుకారణములు" అని చెప్పబడింది. కాబట్టి జడశక్తి అంటే వస్తుకారణమైనది.

అన్ని శక్తుల సేమ్మళనమే బ్రహ్మపదార్ధము. మాయాశక్తి యొక్క పరిణామస్థితియే జడశక్తి. ప్రకాశవిమర్శాంశల సమిష్టి రూపమే ఈ సృష్టి. అయితే ప్రకాశాంశ లేకుండా శుద్ధ విమర్శాంశ జడశక్తి. అందులో చేతనముండదు.

నిజంగా చెప్పాలంటే అన్ని శక్తులూ ఆ పరమేశ్వరివే. చేతనము ఆమె. జడమూ ఆమె. అందుకే ఇందాక చెప్పిన నామాలలో చేతనాశక్తి ఆ దేవి అని చెప్పి ఇప్పుడు జడశక్తి కూడా ఆమె. అని వివరిస్తున్నారు.

## 419. జడాత్మికా

జడము అంటే దృశ్యము. జడమే స్వరూపముగా గలది. కంటికి కనిపించే పదార్థాలే ఆత్మగా గలది. ఇంకా చెప్పాలి అంటే ఈ ప్రకృతి అంతా జడపదార్ధము. ప్రపంచమనేది చేతనము, జడము అని రెండు భాగాలు. చేతనమే చిఛక్తి కాగా జడమే జడశక్తి. ఈ రెండింటి కలయికవల్లనే సృష్టి ఏర్పడుతున్నది. సత్తు చిత్తు ఆనందము బ్రహ్మపదార్థాలు. చైతన్యరూపాలు. నామరూపాత్మక జగత్తు జడపదార్ధము అది విమర్శాంశ. ఆ జడమే ఆత్మగా గలిగినది జడాత్మికా.



# 35. గాయత్రీ మంత్రము

గాయత్రీ మంత్రము అని సాధారణంగా వాడేస్తుంటాము. కాని గాయత్రి అనేది ఒక ఛందస్సు. అందులో 24 అక్షరాలుంటాయి. ఈ మంత్రంలో ఒక్కొక్క పాదానికి ఎనిమిది అక్షరాలు చొప్పున మూడుపాదాలలోనూ 24 అక్షరాలుంటాయి.

**ఓం భూ ర్భువ స్సువః**
**త త్స వితుర్వరేణ్యం । భర్గో దేవస్య ధీమహి ।**
**ధియో యోనః ప్రచోదయాత్ ॥**

ఇదే గాయత్రీ మంత్రం. ఉపనయనకాలంలో బ్రాహ్మణులకు ఉపదేశం చేసేది. ఈ మంత్రోపదేశం చేసిన తరువాత వటువు సంస్కారవంతుడవుతాడు. మంత్రం సిద్ధించిన తరువాత బ్రహ్మవిద్య పొందటానికి అర్హుడవుతాడు.

ఓంకారమనేది పరబ్రహ్మ స్వరూపం. వాహృతులు దాని అంగాలు. ఈ మంత్రంలో మొత్తం ఏడు వ్యాహృతులున్నాయి. వీటిని సప్తవ్యాహృతులు అంటారు. అవి.

| | | | |
|---|---|---|---|
| 1. ఓం భూః | 3. ఓం సువః | 5. ఓం జనః | 7. ఓగ్ంసత్యం |
| 2. ఓం భువః | 4. ఓం మహః | 6. ఓం తపః | |

ప్రస్తుతము ఉపాసనలో ఉన్న గాయత్రీమంత్రానికి విశ్వామిత్రుడు ఋషి. అయితే ఇది 28వ మహాయుగం. వాటిలో గతంలో కూడా ఈ మంత్రం ఉపాసన చేయబడింది. ఆ గాయత్రీమంత్రానికి ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క ఋషి, ఛందస్సు విడివిడిగా ఉన్నాయి.

ఇప్పుడు 420 నుంచి 468వ నామం వరకూ గాయత్రీ మంత్రం వివరించబడింది. ఈ మంత్రాన్ని త్రిసంధ్యలయందు ఉపాసించాలి.

ఇక మంత్రానికి అధిదేవత పరమేశ్వరి. ఆమె తత్త్వాసనా. పంచకోశాల యందు ఉంటుంది. నిత్యయవ్వన. 431వ నామం దగ్గరనుండి గాయత్రిస్థూలరూపం వర్ణించ బడింది. అలాగే 437వ నామం దగ్గర నుండి గాయత్రి సూక్ష్మరూపం వర్ణించబడింది.

గాయత్రియే కరుకుళ్ళాదేవి. కులమార్గంలో సంచరించే కౌళిని. ఆమెను గనక ఆరాధించినట్లైతే తుష్టి, పుష్టి, మతి, ధృతి, శాంతి, కాంతి లభిస్తాయి. ఆమె తేజోరాశి, త్రినయనా, కామరూపి. మాతృకావర్ణరూపిణి. ప్రాణాయామంచేసి పరమేశ్వరిని ఆరాధించే యోగీశ్వరుల హృదయాలలో ఉంటుంది. ఈ రకంగా గాయత్రీదేవిని ఉపాసనచేసే వారికి సకల కార్య సిద్ధి జరుగుతుంది. ఇక నామాలను చూద్దాం.

## 420. గాయత్రీ

**గయాన్ ప్రాణాన్ త్రాయత ఇతి గాయత్రీ**

ప్రాణములను రక్షించునది గాయత్రి అని ఐతరేయ బ్రాహ్మణంలో చెప్పబడింది. గయలు అంటే ప్రాణాలు అని అర్థం.

**త ద్యత్ప్రాణా న్త్రాయతే తద్గాయత్రీ** ప్రాణరక్షణ చేయునది గాయత్రి అని బృహదారణ్యకోపనిషత్తు వివరించింది. **తస్మాద్గాయంతం త్రాయతే యతః** గానము చేయువానిని రక్షించునది. **గీయతే తత్త్వమనయా గాయత్రీతి** అని శంకర భాష్యం. ఈ మంత్రంలో దైవత్వం గానం చెయ్యబడింది. అందుచేత గాయత్రి అనబడుతుంది.

గాయత్రి మంత్రం రెండు రకాలుగా ఉన్నది.

1. బ్రాహ్మణులకు ఉపనయనకాలంలో ఉపదేశించేది.
2. వేదాలలో నిగూఢమైనది. ఇదే పంచదశి మహామంత్రము.

అందుచేతనే గాయత్రిమంత్రం బ్రాహ్మణులకోసం ఏర్పడగా పంచదశి మహామంత్రం అన్ని వర్ణాలవారికోసం ఏర్పడింది అన్నాడు అగస్త్యమహర్షి ఇంకా చెప్పాలి అంటే గాయత్రీమంత్రము, పంచదశి మహామంత్రము రెండూ ఒక్కటే.

ఈ రెండింటి అర్థం కూడా ఒక్కటే.

శరీరాదులను రక్షించటంచేత గాయత్రి అని, తేజస్స్వరూపమవటంచేత సావిత్రి అని, వాగ్రూపం కావటంచేత సరస్వతి అని చెప్పబడుతోంది.

**సవితృ ద్యోతనా త్సైవ సావిత్రీ పరికీర్తితా**

ప్రపంచాన్ని సృజించి ప్రకాశింపచేస్తుంది. కాబట్టి సావిత్రి అనబడుతోంది.

**జాతః ప్రసవితృత్వాన్ వాగ్రూపత్వా త్సరస్వతీ**

వాగ్రూపము గలది కాబట్టి సరస్వతి. ఇరవైనాలుగు అక్షరాలతో ఏర్పడ్డ ఛందస్సే గాయత్రి. ఛందస్సులు అనేకరకాలున్నాయి. కాని బ్రహ్మజ్ఞానానికి ద్వారం గాయత్రి ఛందస్సు, ఆ గాయత్రియే సోమరసాన్ని తెచ్చి దేవతల కిచ్చింది. ఛాందోగ్యోపనిషత్తులో

ఒకసారి దేవతలంతా గాయత్రి, త్రిష్టుప్, జగతి ఛందస్సులను సోమాన్ని తీసుకురమ్మని పంపారు. వీటిలో త్రిష్టుప్, జగతి ఛందస్సులు సోమాన్ని తేలేక తిరిగి వచ్చేశాయి.

అంతేకాకుండా తిరిగివస్తూ త్రోవలో అలసట కారణంగా తమలోని కొన్ని అక్షరాలను వదలివేశాయి. గాయత్రి మంత్రం సోమం దగ్గరకు వెళ్ళి, దాన్ని రక్షించే వారందరినీ ఓడించి సోమాన్ని తెచ్చి దేవతలకిచ్చింది. తిరిగివచ్చేటప్పుడు త్రోవలో త్రిష్టప్ జగతి ఛందస్సులు వదలివేసిన అక్షరాలను కూడా తీసుకువచ్చింది. ఆ కారణంగా గాయత్రి ఛందస్సు అన్నింటికన్నా గొప్పది అయింది. అంతేకాకుండా ఉదయము మధ్యాహ్నము సాయంకాలము మూడింటిలోనూ వ్యాప్తమై ఉన్నది. బ్రాహ్మణునికి అత్యంతావశ్యకమవటం చేత దాని గౌరవము ఇనుమడించింది. అందుచేతనే గాయత్రిని ఉపేక్షించిన వాడు దేన్నీ పొందలేడు.

గాయత్రి ఛందస్సులో 24 అక్షరాలు ఒక్కొక్క పాదానికి ఆరు చొప్పున నాలుగు పాదాలుగా ఉన్నాయి. ఇతర ఛందస్సులలో ఇంకా ఎక్కువ అక్షరాలున్నాయి. కాని వాటన్నింటిలోకి గాయత్రియే శ్రేష్టమైనది. స్థావరజంగమాత్మకమైన ప్రాణిసమూహమంతా గాయత్రియే. వాక్కు – గాయత్రి, సమస్తప్రాణాలు – గాయత్రి, వాగ్రూపమైన గాయత్రి అందరి పేర్లనూ ఉచ్చరిస్తోంది. కాబట్టి గాయత్రి అందరిపేర్లలోనూ ఉన్నది. ఈరకంగా ప్రాణి జాతి అంతా గాయత్రియే. గాయత్రి అంటే ప్రాణులను రక్షించేది అని అర్థం. ఈ లక్షణాలుగల గాయత్రి ఈ పృథివే తప్ప వేరేకాదు. చరాచరాలన్నీ ఈ భూమిలోనే ఉన్నాయి. అందుచేతనే చరాచరజగత్తునంతటనూ గానంచేస్తూ, పాడుతూ, త్రాణంచేస్తూ – కాపాడుతూ ఉండే గాయత్రియే ఈ భూమి.

పృథివీ రూపమైన గాయత్రి శరీరంలో ఉండే పంచభూతాలు, ఇంద్రియాల సమూహము ఒక్కటే. పురుషుని శరీరరూపమైన గాయత్రి, పురుషుని హృదయకమలంలో ఉండే పురుషుడు ఇద్దరూ ఒకటే.

ఆ పురుషునిలోనే అంటే గాయత్రిలోనే ప్రాణాలు ప్రతిష్టితమై ఉన్నాయి అని చెప్పబడింది.

బృహదారణ్యకోపనిషత్తులో గాయత్ర్యోపాసన వివరిస్తూ "ఉపనిషత్తులో చెప్పిన 'భూమి, అంతరిక్ష్యం, ద్యౌః' ఈ మూడు పదాల్లోనూ మొత్తం ఎనిమిది అక్షరాలున్నాయి. ద్యౌః అనే పదంలో దకార యకారాలను రెండు అక్షరాలుగా లెక్కపెట్టాలి. ఇవి మూడులోకాల పేర్లు. గాయత్రి మంత్రానికి పాదానికి ఎనిమిది అక్షరాలున్నాయి. మూడుపాదాలున్నాయి. కాబట్టి మూడు లోకాలు మొదటిపాదం. ఈ రకంగా మూడులోకాలను గురించి తెలుసుకున్నవాడు ముల్లోకాలను జయిస్తాడు.

ఉపనిషత్తులో చెప్పిన 'ఋచ యజాంసి సామాని' అనే మూడుపదాల్లోనూ ఎనిమిది అక్షరాలున్నాయి. ఇవి గాయత్రికి రెండోపాదం. అంటే వేదాలు రెండవపాదమన్నమాట. ఈ విషయం తెలుసుకున్నవాడు త్రయీవిద్య అనగా వేదవిద్యవల్ల వచ్చే ఫలితాన్ని పొందుతాడు.

మంత్రంలో చెప్పిన 'ప్రాణ అపాన వ్యానం' అనే దాంట్లోని ఎనిమిది అక్షరాలు గాయత్రికి మూడవపాదం. ఇక్కడ వ్యా అనే అక్షరంలో వకార యకారాలను రెండు అక్షరాలుగా లెక్కపెట్టాలి. ఈ విషయం తెలుసుకున్నవాడు సమస్తాన్ని పొందుతాడు.

ఉపనిషత్ మంత్రంలో 'తురీయదర్శి తంపదం' అనేది నాల్గవపాదము. 'దర్శితపదం' అనే పదానికి ఆదిత్యమండలాంతర్గతుడైన పురుషుడు కనిపిస్తున్నాడని అర్థం. అంటే అన్ని లోకాలకు పైన ఆధిపత్యం స్థాపించి ప్రకాశిస్తున్నాడు. ఈ రకంగా గాయత్రిలో నాల్గవపాదం తెలుసుకున్నవాడు కీర్తితో ప్రకాశిస్తాడు.

తురీయపదం సత్యంలో ప్రతిష్ఠితమై ఉన్నది. నేత్రమే సత్యం. ఏదైనా ఒక విషయాన్ని నేను చూశాను. నేను విన్నాను అని చెప్పినప్పుడు చూసినదాన్నే నమ్మటం జరుగుతుంది. అందుచేతనే నేత్రం సత్యం. తురీయపాదానికి ఆశ్రయమైన సత్యం బలంలో ప్రతిష్ఠితమై ఉన్నది. అందుకనే సత్యంకన్న బలం ప్రకాశమైనది. ప్రాణమే ఆ బలం. త్రిపదా గాయత్రి ప్రాణాలను రక్షిస్తుంది. గాయత్రిప్రాణంలో ప్రతిష్టితమైఉన్నది. వాగాది ప్రాణాలను రక్షించేది గాయత్రి. గానము చేసే వాడిని రక్షించేది గాయత్రి. ఉపాసనచేసే వాణ్ణి రక్షించేది గాయత్రి.

ఉపనయన సమయంలో వటువుకు త్రిపదగాయత్రి ఉపదేశిస్తారు.

**అస్యశ్రీగాయత్రీ మహామంత్రస్య విశ్వామిత్రఋషిః । గాయత్రీఛందః । శ్రీ సవితాదేవతా । యంబీజం । ఈం శక్తిః । ణంకీలకం । జపే వినియోగః ॥**

**న్యాసము : ఓంతత్సవితుర్బ్రహ్మాత్మనే ।　　ధీమహి నత్యాత్మనే ।**
**వరేణ్యం విష్ణ్వాత్మనే ।　　ధియో యోనః జ్ఞానాత్మనే ।**
**భర్గోదేవస్యరుద్రాత్మనే ।　　ప్రచోదయాత్ సర్వాత్మనే ॥**

**ధ్యానము : ముక్తావిద్రుమహేమనీల ధవళచ్ఛాయైర్ముఖై స్త్రీక్షణైః**
**యుక్తా మిందునిబద్ధరత్న మకుటాం తత్వార్థ వర్ణాత్మికాం ।**
**గాయత్రీం వరదాభయాం కుశకశా శ్శుభ్రం కపాలం గదాం**
**శంఖం చక్ర మథారవిందయుగళం హస్తై ర్వహంతీం భజే ॥**

**మంత్రము : ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం ॥ భర్గోదేవస్య ధీమహి ।**
**ధియోయోనః ప్రచోదయాత్ ।**

ఇది త్రిపదగాయత్రి. అయితే కొన్ని శాఖలవారు అనుష్టుప్ ఛందస్సులో ఉండే గాయత్రిని ఉపాసిస్తారు.

**తత్సవితు ర్వృణీ మహే । వయం దేవస్య భోజనం । శ్రేష్ఠం వై సర్వధాతమమ్। తురంగ భగస్య ధీమహి**

వాక్కే అనుష్టుప్. వాక్కే శరీరంలో ఉండే సరస్వతి. కాబట్టి వాక్స్వరూపమైన సరస్వతిని వీరికి ఉపదేశిస్తున్నామని వీరికి నమ్మకం.

గాయత్రి ఉపాసకుడు ఆవులు, గుర్రాలు, భూమి దానంగా తీసుకున్నా దానివల్ల కలిగే దోషం మొదటి పాదాన్ని జపిస్తే పోతుంది.

వేదవిద్యతో సమానంగా దానం తీసుకున్నా ఆ దానం వల్లవచ్చే పాపం మంత్రంలోని రెండవపాదాన్ని జపం చేస్తే పోతుంది.

"లోకంలో ఉన్న ప్రాణాలన్నీ దానం తీసుకున్నా, ఆ పాపం మూడవపాదం జపం చేస్తే పోతుంది. అంటే గాయత్రిమహిమ చాలా గొప్పది" అని చెప్పబడింది.

**శుద్ధ గాయత్రీ ప్రత్యక్షరం బ్రహ్మైక్య బోధితా**

శుద్ధగాయత్రిలోని ప్రతి అక్షరము పరబ్రహ్మను గురించే బోధిస్తున్నది. అంటే జీవాత్మ పరమాత్మల ఐక్యాన్ని వివరిస్తుంది.

**మహా మంత్రస్య చాపస్య స్థానే స్థానే పదే పదే**
**గూఢో రహస్య గర్భేన । స్తో ప దేశ సముచ్ఛయః ।**

గాయత్రీ మహామంత్రంలోని ప్రతి అక్షరంలోనూ, ప్రతిస్థానమందు మహా రహస్యమున్నది.

గాయత్రీ మంత్రాన్ని ఉపాసన చేసేవారికి ఇహపరసుఖాలు పూర్తిగా లభిస్తాయి. హృదయపద్మమందు అధిష్టించి ఉన్న గాయత్రిని ఉపాసన చేసేవారు ధర్మాధర్మవిముక్తులై ముక్తిని పొందుతారు.

గాయత్రీమంత్రానికి 24 అక్షరాలున్నాయి. ప్రజాపతి సంవత్సర స్వరూపుడు. అతడే కాలస్వరూపుడు. సంవత్సరానికి 12 మాసాలు. మాసానికి రెండు పక్షాలు. ఈ రకంగా

24 పక్షాలుంటాయి. ఆ 24 పక్షాలే గాయత్రీమంత్రంలోని 24 అక్షరాలు. సంవత్సరానికి మూడుకాలాలు.

1. వేసవి కాలము 2. వర్షాకాలము 3. శీతాకాలము. వీటి స్వరూపంగానే గాయత్రీ మంత్రము మూడుపాదాలుగా ఉన్నది. మంత్రంలోని మూడుపాదాలు 1. భూలోకం 2. భువర్లోక 3. సువర్లోకాలకు ప్రతీక. అందుచేతనే ఆ పాదాలను లోకాలకు అన్వయించి ధ్యానించాలి.

**1. మొదటిపాదము :** భూలోక సమన్వయము. భౌతికమైన సృష్టిరూపంలో ధ్యానం చెయ్యాలి.

**2. రెండవపాదము :** భువర్లోక సమన్వయము. అంటే శక్తి మయాత్మకరూపంలో ధ్యానం చెయ్యాలి.

**3. మూడవపాదము :** సువర్లోక సమన్వయము. అంటే ప్రజ్ఞామయాత్మక దృష్టితో ధ్యానం చెయ్యాలి.

ఈ విధంగా ధ్యానం చేసేటప్పుడు ముందు ద్రవ్యాత్మక లోకానికి అధిష్టాన దేవతలయిన అష్టవసువులు అనుగ్రహం కలుగుతుంది. ఆ తరువాత శక్తి మయాత్మక లోకానికి అధిష్టానదేవతలయిన ఏకాదశరుద్రుల అనుగ్రహం కలుగుతుంది. అటుపైన ప్రజ్ఞామయాత్మకలోకానికి అధిష్టానదేవతలయిన ద్వాదశాదిత్యుల అనుగ్రహం కలుగుతుంది.

గాయత్రీ మంత్రంలోని ప్రతి అక్షరానికీ ప్రత్యేకమైన అర్థం ఉన్నది. ఇప్పుడా అర్థాన్ని వివరిస్తున్నాం.

| | | |
|---|---|---|
| ఓమ్ | – | బ్రహ్మ |
| భూః | – | ప్రణవస్వరూపము |
| భువః | – | దుఃఖనాశనము |
| స్వః | – | సుఖస్వరూపము |
| తత్ | – | ఆ |
| సవితుః | – | తేజస్సుచే ప్రకాశించు |
| దేవస్య | – | దేవునియొక్క |

| | | |
|---|---|---|
| వరేణ్యం | – | శ్రేష్ఠమైన |
| భర్గః | – | పాపనాశనమైన తేజమును |
| ధీమహి | – | ధ్యానింతును |
| యః | – | ఏదైతే |
| నః | – | మా యొక్క |
| ధియః | – | బుద్ధులను |
| ప్రచోదయాత్ | – | ప్రేరేపించునో, ఆ తేజస్సును ధ్యానింతును. |

పంచదశీ మహామంత్రము గాయత్రీమంత్రము రెండూ ఒక్కటే అని చెబుతూ భాస్కరరాయలవారు తమ వరివశ్యా రహస్యంలోని 60, 61, 63 శ్లోకాలలో పంచదశీ మహామంత్రానికి గాయత్రి మంత్రార్థం నిరూపించారు.

పంచదశీ మహామంత్రంలోని కకారానికి సర్వజగత్తునూ సృష్టించాలనే కోరిక గల బ్రహ్మ అని అర్థం. గాయత్రీ మంత్రంలోని మొదటి మూడుపదాలకు బ్రహ్మ అని అర్థం. పంచదశిలో రెండవఅక్షరమైన ఏ కారానికి గాయత్రీ మంత్రంలోని సవితుః – శ్రేష్టమైన అని అర్థం. మూడువ అక్షరమైన ఈ కారము గాయత్రి మంత్రంలోని భర్గోదేవస్యధీ అయిన పరమేశ్వరుణ్ణి సూచిస్తుంది.

ఈ రకంగా శ్రీవిద్యలోని ప్రధమకూటమిలోని అక్షరాలు గాయత్రీమంత్రంలోని ప్రధమపాదంచే తెలియబడు జగత్కారణభూతులైన కామేశ్వరీ కామేశ్వరులను చెబుతోంది. వారిద్దరి సామరస్యమే పరమశివుడు. అతని పరిణామమే ఈ జగత్తు. అతడే సమస్త బుద్ధులకు ప్రేరకుడు. త్రిగుణాతీతుడు. ప్రణవస్వరూపుడు.

గాయత్రీ మంత్రంలోని మహి అనే శబ్దము శ్రీవిద్యలోని ల కారాన్ని సూచిస్తున్నది. ల కారమనేది పృథివీ బీజం. కాబట్టి దాని నుంచి పంచభూతాత్మకమైన జగత్తు తెలుస్తుంది. ఈ జగత్తంతా పరమేశ్వరునివల్ల సృష్టించబడింది. ఆ పరమేశ్వరుని ప్రతిబింబమే మహాత్రిపురసుందరి.

గాయత్రీమంత్రంలోని చివరి రెండుపాదాల అర్థం శ్రీవిద్యలోని హ్రీం కారము ఒక్కటే. ఈ రకంగా గాయత్రి, పంచదశి మహామంత్రాల అర్థం ఒక్కటే.

దేవీభాగవతంలోని 12వ స్కంధంలో గాయత్రీమంత్రాన్ని వివరించారు. ఈ మంత్రానికి 24 మంది ఋషులు, 24 ఛందస్సులు, 24 మంది దేవతలు, 24 శక్తులు,

24 రంగులు, 24 వర్ణతత్త్వాలు 24 వర్ణముద్రలు చెప్పబడ్డాయి. వాటిని కూడా ఇక్కడ ఉటంకిస్తున్నాం.

గాయత్రీ మంత్రానికి 24 మంది ఋషులున్నారు. వారు

| | | |
|---|---|---|
| 1. వామదేవుడు | 9. శౌనకుడు | 17. అగస్త్యుడు |
| 2. అత్రి | 10. యాజ్ఞవల్క్యుడు | 18. కౌశికుడు |
| 3. వశిష్ఠుడు | 11. భరద్వాజుడు | 19. వత్సుడు |
| 4. శుక్రుడు | 12. జమదగ్ని | 20. పులత్స్యుడు |
| 5. కణ్వుడు | 13. గౌతముడు | 21. మాండూకుడు |
| 6. పరాశరుడు | 14. ముద్గలుడు | 22. దుర్వాసుడు |
| 7. విశ్వామిత్రుడు | 15. వ్యాసుడు | 23. నారదుడు |
| 8. కపిలుడు | 16. లోమశుడు | 24. కశ్యపుడు |

గాయత్రీ మంత్రానికి 24 ఛందస్సులున్నాయి. అవి

| | | |
|---|---|---|
| 1. గాయత్రి | 9. శక్వరి | 17. ఆకృతి |
| 2. ఉష్ణిక్ | 10. అతిశక్వరి | 18. వికృతి |
| 3. అనుష్టుప్ | 11. ధృతి | 19. సంకృతి |
| 4. బృహతీ | 12. అతిధృతి | 20. అక్షరపంక్తి |
| 5. త్రిష్టుభము | 13. విరాట్ | 21. భూః |
| 6. పంక్తి | 14. ప్రసారపంక్తి | 22. ర్భువః |
| 7. జగతి | 15. కృతి | 23. స్వః |
| 8. అతిజగతి | 16. ప్రకృతి | 24. జ్యోతిష్మతి |

గాయత్రీ మంత్రానికి దేవతలు 24 మంది ఉన్నారు. వారు

| | | |
|---|---|---|
| 1. అగ్ని | 9. భగుడు | 17. మైత్రావరుణుడు |
| 2. ప్రజాపతి | 10. యముడు | 18. వైశ్వదేవుడు |
| 3. చంద్రుడు | 11. గణేశుడు | 19. మాతృకలు |
| 4. ఈశానుడు | 12. త్వష్ట | 20. విష్ణువు |
| 5. సవిత | 13. పూష | 21. వసువు |
| 6. ఆదిత్యుడు | 14. ఇంద్రాగ్ని | 22. రుద్రుడు |
| 7. బృహస్పతి | 15. వాయువు | 23. కుబేరుడు |
| 8. మైత్రావరుణుడు | 16. వామదేవుడు | 24. అశ్వనీకుమారులు |

ఈ దేవతలలో మైత్రావరుణుడు పేరున్నవారు ఇద్దరున్నారు. అంతేకాని పొరపాటుకాదు.

గాయత్రీమంత్రానికి 24 శక్తులున్నాయి. అవి

| | | |
|---|---|---|
| 1. వామదేవి | 9. కాంతా | 17. సూక్ష్మా |
| 2. ప్రియా | 10. దుర్గా | 18. విశ్వయోని |
| 3. సత్యా | 11. సరస్వతీ | 19. విజయా |
| 4. విశ్వభద్ర | 12. విద్రుమా | 20. వశా |
| 5. విలాసినీ | 13. విశాలేశా | 21. పద్మాలయా |
| 6. ప్రభావతి | 14. వ్యాపినీ | 22. పరాశోభా |
| 7. జయా | 15. విమలా | 23. భద్రా |
| 8. శాంతా | 16. తమోపహారిణీ | 24. త్రిపదా |

గాయత్రీ మంత్రానికి వర్ణాలు (రంగులు) 24 అవి.

| | | |
|---|---|---|
| 1. సంపంగి | 9. పద్మరాగము | 17. పసుపు |
| 2. అవిసె | 10. ఇంద్రనీలమణి | 18. పాలమిశ్రణము |
| 3. పగడము | 11. ముత్యము | 19. సూర్యకాంతి |
| 4. స్పటికము | 12. కుంకుమ | 20. చిలుకతోకరంగు |
| 5. పద్మపుష్పము | 13. కాటుక | 21. శతపత్రకాంతి |
| 6. బాలాదిత్యుడు | 14. రక్తము | 22. కౌతకీపుష్పము |
| 7. శంఖకుందేలు | 15. వైడూర్యము | 23. మల్లికాకుసుమము |
| 8. పగడము | 16. తేనె | 24. కరవీరపుష్పకాంతి |

గాయత్రీ మంత్రానికి 24 వర్ణతత్త్వములున్నాయి. అవి

| | | |
|---|---|---|
| 1. నేల | 9. స్పర్శ | 17. చక్షువు |
| 2. నీరు | 10. శబ్దము | 18. చర్మము |
| 3. కాంతి | 11. వాక్కు | 19. శోత్రము |
| 4. గాలి | 12. పాణి, పాదము | 20. ప్రాణము |
| 5. ఆకాశము | 13. పాయు | 21. అపానము |
| 6. గంధము | 14. ఉపస్థ | 22. వ్యానము |
| 7. రసము | 15. ఘ్రాణము | 23. ఉదానము |
| 8. రూపము | 16. జిహ్వా | 24. సమానము |

గాయత్రీ మంత్రానికి 24 రకాల ముద్రలున్నాయి. అవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | సుముఖము | 9. | షణ్ముఖము | 17. | ముష్టికము |
| 2. | సంపుటము | 10. | అథోముఖము | 18. | మత్స్యము |
| 3. | వితతము | 11. | వ్యాపకాంజలికము | 19. | కూర్మము |
| 4. | విస్తృతము | 12. | శకటము | 20. | వరాహము |
| 5. | ద్విముఖము | 13. | యమపాశము | 21. | సింహక్రాంతము |
| 6. | త్రిముఖము | 14. | గ్రధితము | 22. | మహక్రాంతము |
| 7. | చతుర్ముఖము | 15. | షణ్ముఖోన్ముఖము | 23. | ముద్గరము |
| 8. | పంచముఖము | 16. | ప్రలంబము | 24. | పల్లవము |

అయితే ముప్పైరెండు అక్షరాలు గల గాయత్రీమంత్రానికి ముద్రలు ఈ విధంగా ఉంటాయి.

| | | |
|---|---|---|
| 1. త్రిశూలము | 3. సురభి | 5. లింగము |
| 2. యోని | 4. అక్షమాలా | 6. అంబుజము |

ఈ రకంగా ఉన్న గాయత్రి మంత్రం బ్రహ్మ క్షత్రియ, వైశ్యులందరిచేత జపించబడుతోంది. అయితే

**ఓంకారవ్యాహృతిపూర్వాం గాయత్రీం బ్రాహ్మణో జపేత్**
**త్రిష్టుభం చైవ రాజన్యో జగతీం వైశ్య ఏవ చ.**

ఓం కారవ్యాహృతి పూర్వకమైన గాయత్రిని – బ్రాహ్మణులు

త్రిష్టుప్ ఛందస్సులో – క్షత్రియులు

జగతీ ఛందస్సులో – వైశ్యులు ఈ మంత్రాన్ని జపిస్తారు.

అంతేకాకుండా మంత్రశాస్త్రంలో ప్రతి మంత్రానికి గాయత్రి ఉంటుంది.

**కాత్యాయనాయవిద్మహే కన్యకుమారి ధీమహి తన్నో దుర్గిః ప్రచోదయాత్ ।**
**మహాదేవ్యై చ విద్మహే । విష్ణుపత్న్యైచ ధీమహి తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥**

గాయత్రీమంత్రం అత్యంత మహిమోపేతమైనది

పూర్వకాలంలో ఒకసారి అనావృష్టి వచ్చింది. దాదాపుగా పదిహేను సంవత్సరాలు వర్షపు చుక్కైనా కురవలేదు. పాడిపంటలు లేవు. చెట్లు చేమలు కూడా అంతరించి పోయాయి. భరించలేని కరువు. పశువులు గడ్డిలేక చచ్చిపోతున్నాయి. పసిపిల్లలకు పాలులేవు. ఆకలికి తాళలేక కొందరైతే మృతకళేబరాలను పీక్కుతినే స్థితికి వచ్చారు. ఇంతదాకా ఎందుకు పిల్లలకు పాలు ఇవ్వలేక, వారిని పెంచలేక గొంతు పిసికి చంపేసిన వారు కూడా ఉన్నారు. మొత్తం మీద ఘోరకలి విలయతాండవం చేస్తోంది.

ఆ రోజుల్లో కొంతమంది పండితులు ఒకచోటచేరి ఈదుర్భర స్థితి నుంచి తప్పించుకోవటానికి మార్గం లేదా ? అని ఆలోచించసాగారు. చివరకు వారికి గౌతముడు గుర్తు వచ్చాడు.

గౌతముడు ఒక మహర్షి. మహాతపస్సంపన్నుడు. పరదేవతను ఆరాధిస్తూ ఉండేవాడు. ఆవిడయొక్క కరుణవల్ల విత్తనాలు చల్లగానే అవి మొలకెత్తి ఫలితాన్ని ఇచ్చేటట్లుగా వరం పొందాడు. కాబట్టి ఇప్పుడు మనమంతా గౌతముడిని శరణువేడితే ఆ మహర్షి మనలను కరుణిస్తాడు అని ఆలోచించి గౌతముడి ఆశ్రమానికి ప్రయాణమయ్యారు.

కుటుంబ సమేతంగా వచ్చిన ఇంతమంది పండితులను చూసి, వారికేదో ఆపద వచ్చిందని గ్రహించి, వారిని ఆహ్వానించి ఆతిధ్యమిచ్చాడు గౌతముడు. ఆ తరువాత జరిగిన విషయం తెలుసుకుని, ప్రజలు ఆకలిదప్పులకు అల్లాడుతున్నారన్నమాట విని విచారించి ఆపరదేవతను ప్రార్థించాడు.

**నమో దేవి ! మహావిద్యే ! వేదమాతః ! పరాత్పరే !**
**వ్యాహృత్యాది మహామంత్రరూపే ! ప్రణవరూపిణి !**
**సామ్యావస్థాత్మికే ! మాతః ! నమో హ్రీంకార రూపిణి**
**స్వాహా స్వధా స్వరూపే ! త్వాం నమామి సకలార్థదామ్**
**భక్తకల్పలతాం దేవీం అవస్థాత్రయ సాక్షిణీం**
**కుర్యాతీత స్వరూపాం చ సచ్చిదానంద రూపిణీం**
**సర్వవేదాంత సంవేద్యాం సూర్యమండల వాసినీం**
**ప్రాతర్బాలాం రక్తవర్ణాం మధ్యాహ్నే యువతీం పరాం**
**సాయాహ్నే కృష్ణవర్ణాం తాం వృద్ధాం నిత్యం నమా మ్యహమ్॥**

ఆదేవత మహిమవల్ల వచ్చిన వారందరికీ నివాసం ఏర్పాటుచేసి, గతంలో దేవత తనకిచ్చిన వరమహిమ వల్ల వారందరికీ భోజన సదుపాయాలు ఏర్పాటు చేశాడు. ఇంతకాలం అన్న పానాదులు లేక, అవి ఎలా ఉంటాయో కూడా మరచిపోయిన వాళ్ళకి ఆపరదేవత దయవల్ల పంచభక్ష్యాలతో సమృద్ధిగా ఆహారం దొరికింది. ఆ ఆనందానికి తట్టుకోలేక అన్నదానం చేసి తమ ప్రాణాలని నిలబెట్టిన గౌతముణ్ణి వేనోళ్ళ కొనియాడారు. ఆ పరమేశ్వరిని పరిపరివిధాల స్తుతించారు. పండితులంతా యజ్ఞయాగాలు చెయ్యనారంభించారు. ఆశ్రమానికి ఎటు చూసినా నూరు యోజనాల వరకు ఆశ్రితులున్నారు. అందర్నీ సంరక్షిస్తున్నాడు గౌతముడు.

కొంతకాలానికి నారదుడు వచ్చి గౌతముడు చేస్తున్న పనికి మెచ్చుకుని "మహర్షీ! ఆపదకాలంలో వీళ్ళని ఆదుకున్నావు. వారికోసం ఆ పరాశక్తి ఇచ్చిన వరప్రభావం ఉపయోగించటం వల్ల నీశక్తి మరింతగా పెరిగింది. తనకున్న శక్తితో పదిమందికీ ఎవరైతే ఉపకారం చేస్తారో వారి శక్తి ద్విగుణీకృత మౌతుందని చెప్పబడింది. ఇప్పుడు నీకూ అంతే జరిగింది. ఇంద్రాది దేవతలంతా నువు చేస్తున్న పనిని వేనోళ్ళ కొనియాడుతున్నారు" అన్నాడు. ఈ మాటలు విన్న పండితులకు ఈర్ష్య కలిగింది. గౌతముడికి ఇంత పేరు రావటం వాళ్ళు సహించలేక పోయారు. ఎలాగైనా సరే గౌతముడి ప్రతిష్ఠకు మచ్చ కలిగించాలి అనుకున్నారు.

వానలు పడటం మొదలు పెట్టాయి. క్రమంగా నేల చల్లబడింది. ఏరులు పారాయి. నదులు పొంగాయి. విత్తనాలు మొలకెత్తుతున్నాయి. పండితులు కూడా వెళ్ళిపోవటానికి సన్నద్ధమౌతూ మాయాగోవును ఒకదాన్ని సృష్టించారు. అది వచ్చి ఆశ్రమ ప్రాంగణంలోని పంటను, ఆహారాన్ని నాశనం చెయ్యటం మొదలుపెట్టింది. అది చూసిన గౌతముడికి కోపం వచ్చింది. ఆవును కొట్టటం ఇష్టంలేక అదిలించాడు. అంతే ఆ అదిలింపుకు మాయాగోవు కింద పడి చచ్చిపోయింది. ఇదంతా చాటునుంచి చూస్తున్న పండితులు "గౌతముడు గోవును చంపాడు. గోహత్య మహాపాతకం. ఇంక ఇతడి ఇంటభోజనం చెయ్యటం కూడా పాపం. మేం వెళ్ళిపోతున్నాం" అని బయలుదేరారు. మాయ తెలియని గౌతముడు వారిని బ్రతిమాలాడు. ఈ పాపం పోయే ఉపాయం చెప్పమన్నాడు. అప్పుడు వారు గౌతముడికి అసాధ్యమయ్యేపని ఏదా ? అని ఆలోచించి చివరకు గంగను తెచ్చి గోవుమీద ప్రవహింపచేస్తే ఈ పాపం పోతుందన్నారు.

గౌతముడు చాలా సంవత్సరాలు శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై గౌతముడి కోర్కె ప్రకారం తన జటాజూటం నుంచి రెండు బొట్లు విదిల్చాడు. అంతే చచ్చిన గోవు లేచినుంచుంది. ఈరకంగా గౌతముని చేత తేబడింది కాబట్టి గౌతమి అనీ, గోవును బ్రతికించటానికి వచ్చింది కాబట్టి గోదావరి అనీ ఆనదికి పేరు వచ్చింది.

ఆవు లేచి నుంచోగానే 'గౌతముడు మాయాగోవును బ్రతికించాడు' అని గెలిచేశారు పండితులు. దివ్య దృష్టితో అసలు విషయం తెలుసుకున్న మహర్షి వారిమీద కోపించి "ఇక నుంచీ గాయత్రీ జపం మీకు నిష్ఫలమవుతుంది. వేదాధ్యయనం, యజ్ఞకర్తవ్యం మీకు ఉండవు. మీరంతా ధర్మహీనులు, నీతిదూరులు అయి భ్రష్టుపట్టిపోతారు. వావీ వరుసాలేకుండా పశువుల్లా ప్రవర్తిస్తారు. తరతరాలకు మీగతి ఇంతే" అని శపించాడు.

చేసిన తప్పు క్షమించమని పండితులంతా ప్రాధేయపడగా ద్వాపరయుగంలో పరమేశ్వరి అంశతో యదువంశంలో నందగోవుని ఇంట శ్రీకృష్ణుడు పుడతాడు. అతని జన్మతో మీకు శాపవిమోచన మవుతుంది అన్నాడు.

ఈ రకంగా పండితులు చేసిన తప్పుకు శిక్ష అనుభవించి, పరమేశ్వరి దయవల్ల మళ్ళీ గాయత్రీ అనుష్ఠానం చేసి బ్రహ్మతేజస్సును పొందారు. గాయత్రి జపం చేసినవాడు బ్రహ్మతేజస్సుతో వెలుగొందుతాడు.

## 421. వ్యాహృతిః

వ్యాహృతి అంటే ఉచ్చారణము. వాయుపురాణంలో "నా చే ఉచ్చరింపబడిన దానవై నీవు కలిగితివి. కాబట్టి నీకు వ్యాహృతి అను పేరు కలుగును" అని చెప్పబడింది.

వ్యాహృతి అంటే – శ్రోతేంద్రియానికి తెలిసే స్థూలమగు రూపము ఉచ్చరించబడి వ్యాప్తి చెందేది.

భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్యం అనేవి సప్తవ్యాహృతులు. వీటిలో

| | | |
|---|---|---|
| భూః | – | సన్మాత్ర |
| భువః | – | స్వరము |
| సువః | – | సుఖస్వరూపము |
| మహః | – | సర్వాతిశయము గలది |
| జనః | – | సర్వానికి కారణమైనది |

| | | |
|---|---|---|
| తపః | – | పాలనస్వరూపము గలది |
| సత్యము | – | బ్రహ్మము |

తైత్తిరీయోపనిషత్తులో, శిక్షావల్లిలోని ఐదవ అనువాక్యంలో పరబ్రహ్మకు అంగభూతాలయిన వ్యాహృతుల ఉపాసన చెప్పబడింది. వ్యాహృతులు అంటే కర్మలలో ఉపయోగించేవి అని అర్థం. భూః, భువః, సువః అనేవి మూడు వ్యాహృతులు. మహాచమస్యుడనే మహర్షి తపస్సు చేసి మహః అనే నాల్గవ వ్యాహృతిని కనిపెట్టాడు. మహః అనేదే బ్రహ్మము. మహః అనేది శరీరమైతే భూః, భువః, సువః అనేవి అంగాలు. అంగాలకు ఉనికి లభించినట్లుగా, మహః వల్ల మిగిలిన వాటికి ఉనికి లభిస్తోంది. వ్యాహృతులు బ్రహ్మకు అంగాలు కాబట్టి వీటి ఉపాసన చెప్పబడింది. వ్యాహృతుల ఉపాసన నాలుగురకాలు.

**1. లోకదృష్టితో ఉపాసన :**

| | | |
|---|---|---|
| భూః | – | భూలోకాన్ని దృష్టిలో ఉంచుకుని |
| భువః | – | అంతరిక్ష్యాని దృష్టిలో ఉంచుకుని |
| సువః | – | స్వర్గలోకాన్ని దృష్టిలో ఉంచుకుని |
| మహః | – | ఆదిత్యలోకాన్ని దృష్టిలో ఉంచుకుని |

ఉపాసన చెయ్యాలి. దీనితో లోకాలన్నీ సూర్యుని వెలుగుతో ప్రకాశమవుతాయి.

**2. దేవదృష్టితో ఉపాసన :**

| | | |
|---|---|---|
| భూః | – | అగ్ని దృష్టితో |
| భువః | – | వాయు దృష్టితో |
| సువః | – | ఆదిత్య దృష్టితో |
| మహః | – | చంద్రుని దృష్టితో |

ఉపాసన చెయ్యాలి. అన్ని తేజస్సులు చంద్రునిచే పూజ్యములు

**3. వేద దృష్టితో ఉపాసన :**

| | | |
|---|---|---|
| భూః | – | ఋగ్వేదము |
| భువః | – | సామవేదము |
| సువః | – | యజుర్వేదము |
| మహః | – | ఓంకారము |

ఓంకారాన్ని మొదట, చివర చేర్చటం వల్లనే వేదాలు పూజనీయమవుతున్నాయి.

**4. ప్రాణదృష్టితో ఉపాసన :**

| | | |
|---|---|---|
| భూః | – | ప్రాణవాయువు |
| భువః | – | అపానవాయువు |
| సువః | – | వ్యానవాయువు |
| మహః | – | అన్నము |

గా భావించి ఉపాసన చెయ్యాలి. లోకంలో ప్రాణులన్నీ అన్నం చేతనే వృద్ధి పొందుతున్నాయి. ఈ రకంగా ఈ 16 వ్యాహృతులు హిరణ్యగర్భునికి అంగాలు. వీటిని తెలుసుకోగలిగినవాడే బ్రహ్మను గురించి తెలుసుకోగలుగుతాడు.

## 422. సంధ్యా

"సంధ్య అంటే సూర్యుని చేరిన బ్రహ్మ. ఆత్మ యొక్క అంశలైనటువంటి బ్రహ్మాది సకలభూతములచేత బ్రహ్మకు భిన్నముకానటువంటి సంధ్య ఉపాసించబడుచున్నది. దానికి నేను దాసుడను" అని మహాభారతంలో చెప్పబడింది. అటువంటి సంధ్య కు వేరైనది కాదు కాబట్టి ఆ పరమేశ్వరి సంధ్యానామంతో పిలువబడుతోంది.

'బ్రహ్మాది ఆకారభేదం చేత వేరుగా ఉన్నది. ఐనప్పటికీ కర్మకు సాక్షియై ప్రకాశించే ఈశ్వరశక్తియే సంధ్య' అని భారధ్వాజ స్మృతిలో చెప్పబడింది.

గాయత్రీ మంత్రము నాల్గవపాదముతో కూడినదై సంధ్యారూపిణి అవుతున్నది అని ఆగమాలు చెబుతున్నాయి. అందుచేత సంధ్యాకాలంలో ఉపాసించతగిన దేవత సంధ్య. కాలికాపురాణంలో సంధ్యాదేవి బ్రహ్మ యొక్క కుమార్తె అని చెప్పబడింది. భగవతీపురాణంలో బ్రహ్మ మానసపుత్రిక అయిన సంధ్య తపస్సు చేసి శరీరాన్ని వదిలి వశిష్ఠుని భార్య అరుంధతిగా జన్మించింది అని చెప్పారు.

చిచ్ఛక్తి స్వరూపిణి అయిన పరమేశ్వరియే సంధ్య. సంధ్యాదేవతయే గాయత్రి, సావిత్రి, పరమేశ్వరి. ఈ సంధ్యా దేవతసంధికాలమున ఉపాసించబడుతుంది. సూర్యుడు ఉదయించకముందు, నక్షత్రాలు అస్తమించకముందు కాలము ఉదయసంధ్య. అలాగే సూర్యుడు అస్తమించాడు. కాని నక్షత్రాలు పూర్తిగాలేవు. అది సాయంసంధ్య. ఇవి సంధ్యావందన కాలములు. ఈ సమయంలో ధ్యానించబడేదే సంధ్య. సూర్యుడి యందలి చైతన్యశక్తియే సంధ్య. ఈ దేవిని ఆజ్ఞాచక్రస్థానంలో ధ్యానం చెయ్యాలి.

పంచకోశాలలోను మనోమయకోశము సంధికోశము అదే సంధ్యాస్థానము అని చెప్పబడుతోంది.

**సంధ్యాస్నానం జపో హోమో దేవతానాం చ పూజనం ।**
**ఆతిథ్యం వైశ్వదేవం చ షట్కర్మాణి దినే దినే ।**

సంధ్యావందనము, జపము హోమము, దేవతాపూజ, అతిథిపూజ వైశ్యదేవము ఈ ఆరు ప్రతినిత్యము చేయవలసినవి.

సంధ్య అనగా ఒక సంవత్సరము వయసు గల బాలిక. **ఏకవర్షాభవేత్సంధ్యే** అని చెప్పబడింది.

## 423. ద్విజబృందనిషేవితా

ద్విజులు అంటే రెండు జన్మలు గలవారు. బ్రహ్మక్షత్రియవైశ్యులు. వీరిచే పూజించబడునది. రేణుకాపురాణంలో "సంధ్యాదేవి దేవతలచేత, ద్విజులచేత మహాత్ములచేత కూర్చున్నప్పుడు, పడుకున్నప్పుడు, భోజనం చేస్తున్నప్పుడు, సర్వకాల సర్వావస్థలయందు పూజించబడుతుంది" అని చెప్పబడింది.

ద్విజులు అంటే బ్రాహ్మణక్షత్రియులేకాదు. పక్షులు,పాములు, బల్లులు, చేపలు మొదలైన అండజాలు కూడా ద్విజులే కాబట్టి వీటన్నింటి చేతా పూజించబడేది.

సంధ్యాదేవి యొక్క ప్రాముఖ్యతనే ఇంకా వివరిస్తున్నారు. బ్రహ్మక్షత్రియవైశ్యులు త్రికాలములందు సంధ్యాదేవిని ఉపాసనచేస్తారు. కాబట్టి ద్విజబృందనిషేవితా అనబడుతుంది. వీరికి ఉపనయన సంస్కారము జరుగుతుంది. ఆ తరువాతనే బ్రహ్మవిద్యకు అర్హత వస్తుంది. కాబట్టి బ్రహ్మవిద్యకు అర్హత పొందటానికి సంధ్యాదేవిని ఉపాసించాలి.

## 424. తత్త్వాసనా

శివాది క్షితి పర్యంతము 25 తత్త్వాలను ఆసనముగా గలది. శ్రీచక్రంలో తత్త్వాలు 25 ఉన్నాయి అని గతంలో చెప్పాం. ఆ తత్త్వాలకుపైన బిందువునందు పరమేశ్వరి ఉంటుంది కాబట్టి, తత్త్వములే ఆసనముగా గలది.

పంచభూతాలు, తన్మాత్రలు, ఇంద్రియాలు, మనస్సు, మాయాదులనబడే తత్త్వాలకు వేరుగా ఉన్నది.

**తత్త్వాతీతంచ బైందవమ్** అన్ని తత్త్వములకు అతీతంగా ఉన్నది ఆ పరమేశ్వరి.

గాయత్రిస్థూలరూపము వ్యాహృతి. సూక్ష్మరూపము సంధ్య. కారణరూపము బ్రహ్మభావము. అదే తత్త్వాసనము. తత్త్వాసనా అంటే – బ్రహ్మమే ఆసనముగా గలది. తత్త్వాలు 96 అని, 51అని, 36 అని రకరకాలుగా ఉన్నాయి. వీటన్నింటినీకాదని, వీటిలో కొన్ని ఒక దానిలో ఒకటి లయమవుతాయని చెప్పి శంకరులవారు తత్త్వాలు 25 అన్నారు. ఆ తత్త్వాల స్వరూపమే దేవి. తత్త్వాతీతమైనది పరమేశ్వరి.

## 425. తత్

తత్ అంటే – బుద్ధి తిరగటము అని అర్థం. ఆ పరమేశ్వరి అందరి మనస్సులయందు, బుద్ధియందు తిరుగుతుంటుంది. కాబట్టి ఈ రకంగా చెప్పబడుతోంది.

సృష్టికి ముందు కాలంలో నిర్వికారంగా ఉన్న ఆత్మరూపము. సకలవేదాలచేత తెలియబడు పరబ్రహ్మస్వరూపము.

## 426. త్వమ్

త్వమ్ అంటే తుభ్యం నమః నీకు నమస్కారము. ఇక్కడ త్వం అంటే నిర్వికారమైన పరబ్రహ్మ.

సగుణోపాసనలో తనకు వేరైన దేవత. అదే నిర్గుణోపాసనలో తానే అయిన దేవత. పరబ్రహ్మ స్వరూపము.

## 427. అయీ

పై రెండు నామాలలోనూ వివరించబడి తన కన్న వేరైనది, తన కన్న వేరుకానది. అంటే సగుణ బ్రహ్మ, నిర్గుణబ్రహ్మ ఈ రెండింటి రూపము అయిన ఆ పరమేశ్వరి జగజ్జనని. జ్ఞాన జ్ఞాతృ జ్ఞేయ స్వరూపిణి.

## 428. పంచకోశాంతరస్థితా

పంచకోశముల మధ్యన ఉండునది. పంచకోశములు పంచికా పూజలోని ప్రసిద్ధిచెందిన దేవతలు. వారు శ్రీవిద్య, పరంజ్యోతి, పరా, నిష్కళా, శాంభవి. ఆ మంత్రములందుండునది. శ్రీచక్రంలో శ్రీవిద్య మధ్యలో ఉండగా మిగిలిన నాలుగు దేవతలు నాలుగువైపులా ఉంటారు. కాబట్టి పరమేశ్వరి పంచకోశాంతరస్థితా అనబడుతుంది.

శరీరంలో ఉండే అన్నమయప్రాణమయ మనోమయ విజ్ఞానమయ కోశముల నడుమ ఆనందమయకోశమందు ఆ దేవి ఉంటుంది.

వ్యాససూత్రాలలో ఆనందమయుడే బ్రహ్మ అని చెప్పారు.

<u>తైత్తిరీయోపనిషత్తులోని</u> భృగువల్లిలో

వరుణ మహర్షికుమారుడు భృగుమహర్షి. విద్యాభ్యాసం పూర్తిచేసి బ్రహ్మజ్ఞానం సంపాదించాలనే కోరికతో తన తండ్రి దగ్గరకు వెళ్ళి బ్రహ్మతత్త్వాన్ని ఉపదేశం చెయ్యమని అడిగాడు. దానికి తండ్రి "కుమారా ! అన్నము, ప్రాణము, నేత్రము, శోత్రము, మనస్సు, వాక్కు ఇవన్నీ పరబ్రహ్మ సాధనకు మార్గలే. వీటన్నింటిలోనూ బ్రహ్మతత్త్వం ఇమిడి ఉన్నది. అది దేనిలోనుంచి ఉత్పన్నమైనదో, దేనితో పోషింపబడుతున్నదో, దేనియందులయమవుతున్నదో అన్నిటికీ మూలవస్తువేదో తెలుసుకోవాలి. దాన్ని తపస్సు ద్వారానే సాధించాలి. కాబట్టి వెళ్ళి తపస్సు చెయ్యి" అన్నాడు.

తండ్రి ఆదేశాన్ననుసరించి దీక్ష తీసుకుని నియమనిష్టలతో తపస్సు చెయ్యటం ప్రారంభించాడు భృగువు. కొంతకాలం గడిచింది. ఆ తరువాత అన్నమే పరబ్రహ్మ స్వరూపము అని తెలిసింది. అన్నం మూలంగానే అన్ని ప్రాణులు ఉత్పత్తి అవుతున్నాయి. ప్రాణులన్నీ అన్నంవల్లనే పోషింపబడుతున్నాయి. కాబట్టి అన్నమే పరబ్రహ్మ స్వరూపము. ఈ విషయం తన తండ్రికి చెప్పాడు. దానికి వరుణమహర్షి "నాయనా ! తత్త్వసాధనలో నువ్వు మొదటిమెట్టు మీదనే ఉన్నావు. ఇంకా సాధనచెయ్యి. అన్నం పరబ్రహ్మ స్వరూపమే. కాని అన్నమే పరబ్రహ్మ స్వరూపంకాదు. వెళ్ళి తపస్సు చెయ్యి" అన్నాడు. మళ్ళీ తపస్సు చెయ్యటం మొదలుపెట్టాడు భృగువు. కొంతకాలం గడిచింది. ప్రాణమే బ్రహ్మ అనే విషయాన్ని తెలుసుకున్నాడు. లోకంలోని సమస్త జీవరాశులు ప్రాణంవల్లనే జీవిస్తున్నాయి. ప్రాణం పోయినప్పుడు మృత్యువుతో లయమవుతున్నాయి. అందుచేత ప్రాణమే సర్వ సృష్టికి మూలాధారంఅని భావించాడు. అదే విషయం తండ్రికి చెప్పాడు.

నాయనా ! ఇదివరకటి కన్న కొంచెం ముందుకు వెళ్ళావు. అంతేకాని ప్రాణమే పరబ్రహ్మకాదు. మళ్ళీ మళ్ళీ తపస్సుచెయ్యి అన్నాడు వరుణమహర్షి.

మళ్ళీ తపస్సుచెయ్యటం ఆరంభించాడు భృగువు. కొంతకాలం జరిగింది. మనస్సు వల్లనే ప్రాణులు ఉత్పత్తి అవుతున్నాయి. స్త్రీ పురుషులు మనసుచేతనే ఆకర్షితులౌతున్నారు. అందువల్లనే ప్రాణులు ఉద్భవిస్తున్నాయి. జన్మించిన తరువాత కూడా ఇంద్రియాల సాయం

తోనే జీవనం సాగుతున్నది. అదేవిధంగా చనిపోయిన తరువాత కూడా ఇంద్రియాలకు జ్ఞానం ప్రసాదించే శక్తిపోతుంది. ఇంద్రియాలన్నీ మనస్సులో లీనమవుతాయి. కాబట్టి మనస్సే బ్రహ్మ అనుకున్నాడు భృగువు. ఇదే విషయాన్ని తండ్రికి తెలియచేశాడు. కాదన్నాడు తండ్రి ఇంకా తపస్సు చెయ్యమన్నాడు.

మళ్ళీ కొంతకాలం తపస్సు చేశాడు భృగువు. అప్పుడు అతడికి అర్ధమయింది విజ్ఞానమే బ్రహ్మ. అదే విషయాన్ని తండ్రికి చెప్పాడు. కాదన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చెయ్యమన్నాడు. తండ్రి మాటప్రకారం మళ్ళీ తపస్సు చేశాడు భృగువు. అప్పుడు తెలిసింది ఆనందమే బ్రహ్మ అని సర్వమూ ఆనందం నుంచే జనిస్తుంది. ఆనందంలోనే లయమవుతుంది. ఈ విషయం తండ్రికి తెలియచేశాడు. మహదానందం చెందాడు వరుణ మహర్షి అప్పుడు చెప్పాడు.

"కుమారా ! అన్నింటికన్నా ఉత్తమంగా పరమాత్మను వ్యక్తం చేసే తత్త్వం ఆనందం. అన్నము ప్రాణము, మనస్సు, విజ్ఞానము కూడా పరబ్రహ్మ రూపాలే. ఇవన్నీ ఒక దానికన్న మరొకటి సూక్ష్మమైనది. అన్నింటికీ మించినది ఆనందం. ఈ ఆనందం క్షణికమైనదికాదు. శాశ్వతమైనది. పరబ్రహ్మోపాసన క్రమంగా జరగాలి. ఆహారాన్ని వదలకుండా తింటూ ప్రాణాన్ని నిలుపుకుని, మనసును వికసింపచేసుకుని, దానివల్ల విజ్ఞానం పొంది తద్వారా బ్రహ్మ సాక్షాత్కారం పొందాలి" అన్నాడు.

కాబట్టి పరబ్రహ్మ స్వరూపము పంచకోశములందు ఉంటుంది. కోశము అంటే – వర అని అర్థం.

మానవశరీరంలో ఐదుకోశాలున్నాయి. అవే

1. అన్నమయకోశము
2. ప్రాణమయకోశము
3. మనోమయకోశము
4. విజ్ఞానమయకోశము
5. ఆనందమయకోశము

మొదటి నాలుగుకోశాలనడుమ ఆనందమయకోశముంటుంది. అందులోనే పరబ్రహ్మ ఉంటాడు.

మానవశరీరం మూడురకాలయిన దేహాలుగా విభజించబడుతుంది.

1. స్థూలదేహము 2. సూక్ష్మదేహము 3. కారణదేహము

1. స్థూలదేహము - అన్నమయ కోశము
2. సూక్ష్మదేహము - ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశాలు
3. కారణదేహము - ఆనందమయకోశము

ఈ కోశాలు ఐదు ఒక దానిలో ఒకటి ఉంటాయి. అమ్మవారి బొమ్మవేసినప్పుడు ఆమె చేతిలో ఐదుపూలు వేస్తారు. అవి పంచతన్మాత్రలు. కొన్నిచోట్ల ఆ పూలు విడివిడిగా కాకుండా ఒక దానిలో ఒకటిగా ఉంటాయి. అవి పంచకోశాలు.

1. అన్నమయకోశంలో - ప్రాణమయకోశం ఉంటుంది.
2. ప్రాణమయకోశంలో - మనోమయకోశముంటుంది.
3. మనోమయకోశంలో - విజ్ఞానమయకోశముంటుంది.
4. విజ్ఞానమయకోశంలో - ఆనందమయకోశముంటుంది.

ఆనందమయకోశంలో ఉండేవాడే పరబ్రహ్మ.

పరమేశ్వరియే బ్రహ్మ కాబట్టి ఆమె ఆనందమయకోశమందుంటుంది. అందుచేతనే పంచకోశాంతరస్థితా అనబడుతుంది.

## 429. నిస్సీమమహిమా

మనసు యొక్క యెల్లలను దాటినది. నిరవధికమైన హద్దులు లేని మహిమ గలది.

అపారమైన ప్రభావము, అనంతమైన ప్రతిష్ఠగలది. ఆది మధ్యాంతరహితురాలు, సర్వవ్యాపి, పంచకృత్యపరాయణ అయిన ఆ పరమేశ్వరి మహిమలకు సీమలు లేవు.

## 430. నిత్యయౌవనా

ఏ కాలమునందు ముసలితనము లేనిది. నిత్యము యవ్వనము గలది. సదాషోడస వర్షీయ

భూత భవిష్యద్వర్తమానాలలో ఎక్కడా కూడా బాల్య యవ్వన కౌమార వార్ధక్యాది దశలు లేనిది. ఏకైకమైన యవ్వనస్థితిలో ఉండేది. **నవయవ్వనసంపన్నాం** పదహారు సంవత్సరాల ప్రాయము గలది. ఆ పరమేశ్వరియే కాలాన్ని సృష్టించింది. ఆమె కాలస్వరూపిణి. కాలము ఆమె అధీనంలో ఉంటుంది. కాబట్టి కాలమును బట్టి వచ్చే మార్పులు ఆమెలో రావు. అందుచేతనే నిత్యము యవ్వనములో ఉండి నిత్యయవ్వన సంపన్నా అనబడుతుంది.

## 431. మదశాలినీ

ఆనందమయ విషయమే మదము. పరమేశ్వరి సదామహదానందం పొందుతూ ఉంటుంది కాబట్టి మదశాలినీ అనబడుతుంది. ఏ ఇతర భావావేశము చేతనూ కలవనటువంటి బ్రహ్మానందాన్ని పొందేటటువంటిది. బ్రహ్మానందమనే మదముచే విరాజిల్లునది. పరమానందఘనస్వరూపిణి.

## 432. మదఘూర్ణితరక్తాక్షీ

మదముచే తిరుగుచున్న ఎర్రని కనులు గలది. లోకసంబంధమైన విషయాలకు దూరంగా ఉండటమే ఘూర్ణము. పరమానందం పొందినప్పుడు, లౌకికవిషయాలన్నీ దూరమైపోయి ఎర్రబారిన కనులు గలది.

నిత్యయవ్వనోద్రేకంలో ఎర్రని రంగుతో తిరుగుతున్న కనులు గలది. బ్రహ్మానందంతో ఎర్రబడ్డ కనులు గలది. రక్తిమ కలిగి చలించే నేత్రాలు సాముద్రిక శాస్త్రం ప్రకారము సౌందర్య లక్షణము.

**జపాకుసుమ సంకాశౌమదఘూర్ణితలోచనౌ**

## 433. మదపాటలగండభూః

మదముచేత ఎరుపు తెలుపు కలిసిన రంగు గల చెక్కిళ్ళు గలది. మదముచే అంటే మధువును త్రాగుటచే అని అర్థం. పాటలవర్ణంలో గల చెక్కిళ్ళు నిత్యయవ్వానానికి గుర్తు. యవ్వనంలో చెక్కిళ్ళు శరీరకాంతికన్న ఎక్కువకాంతితో మెరుస్తుంటాయి. నిత్యయవ్వనశాలిని అయిన పరమేశ్వరి మధువును త్రాగటంచేత ఆమె చెక్కిళ్ళు గులాబీల్లాగా ప్రకాశిస్తున్నాయి.

## 434. చందనద్రవదిగ్ధాంగీ

మంచి గంధముచే పూయబడిన అంగములు గలది. అంటే పరమేశ్వరి శరీరమంతా చందనలేపనం కావించటం జరిగింది. కుంకుమ పూల రసముతో కలిపిన మంచి గంధము శరీరావయవములకు రాయబడినది. ఆనందము ఎక్కువైపోయి చందనలేపనము గావించబడినది.

## 435. చాంపేయకుసుమప్రియా

చాంపేయ పుష్పము అనగా – నాగకేసరపుష్పము. చంపకపుష్పము. సంపెంగపూవు, సంపెగపూలమీద పరమేశ్వరికి ప్రీతి ఎక్కువ. చాంపేయము అంటే బంగారురంగు గల పుష్పములందు దేవికి మక్కువ ఎక్కువ.

## 436. కుశలా

సృష్ట్యాది నిర్మాణములందు నేర్పు గలది. కాబట్టి కుశలా అనబడుతుంది.

భూతభవిష్యద్వర్తమాన కాలాలలో ఎప్పుడూ వృద్ధి క్షయాలు అనేవి లేనిది. ఎల్లప్పుడూ ఆరోగ్యంగా ఉండేది. క్షేమంగా ఉండేది. ఏ రకమైన వాంఛలు లేక తృప్తిగా ఉంటుంది. కాబట్టి కుశలా అనబడుతుంది. అన్ని విషయములందు ఆరితేరినది. అంటే పంచకృత్యాలయందు, సర్వవిధవిజ్ఞానమందు, చతుష్షష్టికళలందు, అద్వితీయమైన నేర్పరి కాబట్టి కుశలా అనబడుతుంది.

గాయత్రిరహస్యరూపవర్ణన

## 437. కోమలాకారా

**కోమలః సుకుమారః ఆకారో అవయవ విన్యాసోయస్యాః - సా**

సుకుమారమైన ఆకారము గలది. అవయవనిర్మాణము గలది.

కుశలా అని పైన చెప్పిన నామాన్నే వివరిస్తున్నారు. కోమలము అంటే–మృదుత్వము. కాబట్టి కుసుమకోమలమైన ఆకారము గలది. ఒక్క దేవతలను, మానవులనే కాదు. క్రూరస్వభావులైన రాక్షసులను కూడా సమ్మోహింపచేయునది. సకల జన వశీకరణము చేయురూపము గలది.

## 438. కురుకుళ్ళా

కురుకుళ్ళా అనేది ఒక దేవత. శ్రీపురంలోని అహంకార చిత్తమయ ప్రాకారాల మధ్యలో విమర్శమయమైన బావి యందు ఉంటుంది. లలితాస్తవ రత్నంలో

**కురువిందతరుణినిలయాం కులాచలస్పర్థి కుచనమన్మధ్యాం**
**కుంకుమ విలిప్తగాత్రీం కురుకుళ్ళాం మనసి కుర్మహే సతతం ॥**

కురువిందరత్నములపై నివసించునది, కులపర్వతాలను మించిన కుచయుగములచే వంగిన నడుము గలది, కుంకుమలేపనము గావించబడిన దేహము గలది అయిన కురుకుళ్ళాదేవిని మనసున ధ్యానింతును.

ఈ ప్రాకార ఆవరణలో ఆ దేవి పేరు శ్యామ. ఈమెనే కురుకుళ్ళాదేవి అంటారు. ఈ దేవతాస్వరూపంలోనే ఉంటుంది. కాబట్టి పరమేశ్వరి కురుకుళ్ళా అనబడుతోంది.

సుషుమ్న మార్గంలో ముఖ్య నాడి కురుకుళ్ళా అనబడుతుంది. ఆధారచక్రం దగ్గర నుండి సహస్రారం దాకా, గ్రంథిత్రయముతో సహా ఈ ప్రాణి ఉంటుంది. అందుకే అది కురుకుళ్ళా అనబడుతుంది. భావనోపనిషత్తులో

**వారాహీ పితృరూపా, కురుకుళ్ళావళిదేవతా మాతా**

శ్రీచక్రానికి ప్రధానదేవత శ్రీదేవి. ఆమె శరీరం నుంచి వచ్చిన కాంతి పుంజాలు అష్టసిద్ధులైన అణిమాది దేవతలు. అలాగే సాదకుడి తండ్రి వారాహి. తల్లికురుకుళ్ళావతి. ఇక్కడ మాతా అంటే సాధకుని కోరికలు తీర్చేది. ఐహికవాంఛలు తీర్చి మోక్షాన్ని ప్రసాదించేది. మానవశరీరంలో సుషుమ్నా నాడీమండలంలో ప్రాణనాడి అని చెప్పబడే సుషుమ్నా నాడినే 'కురుకుళ్ళా' అంటారు.

సుధాసింధువు మధ్యన మణిద్వీపమందున్న శ్రీదేవి పట్టణానికి చిత్తము – అహంకారము అనబడే రెండు ప్రాకారాలమధ్య విమర్శరూపమైన బావియందుండేది కురుకుళ్ళా దేవి అనే దేవత. కాబట్టి ఆమెను మాతగా భావించాలి.

## 439. కులేశ్వరీ

సజాతీయులైనటువంటి మాతృ మాన మేయముల సమూహము కులము అనబడుతుంది. అటువంటి వాటికి ఈశ్వరి. త్రిపుటికి ఈశ్వరి. కాబట్టి కులేశ్వరి.

కురుకుళ్ళా అనే దేవత యే కులేశ్వరి అనబడుతుంది.

**మూలాధారాదికం షట్చక్రం కుల మితి స్మృతం**

మూలాధారము స్వాధిష్ఠానము మణిపూరము అనాహతము విశుద్ధిచక్రము ఆజ్ఞాచక్రము ఈ మార్గానికి కులమని పేరు. ఇదే సుషుమ్నా మార్గం. ఈ మార్గంలో సంచరించే ముఖ్యప్రాణస్వరూపిణియే కురుకుళ్ళా దేవి. ఆమెయే కులేశ్వరి అనబడుతున్నది. కులము అంటే నాడీమండలము. దీనికి ఈశ్వరి కాబట్టి కులేశ్వరి అనబడుతుంది. 84 లక్షల జీవరాశికి ఈశ్వరి కాబట్టి కులేశ్వరి అనబడుతుంది.

## 440. కులకుండాలయా

మూలాధారంలో కర్ణికమధ్యన ఉండే బిందువే కులకుండము. అతి సూక్ష్మంగా ఉంటుంది. అదే ఆ దేవి యొక్క స్థానము. ఆ బిందువునందు లయము గలది. అదే కుండలిని అనబడుతుంది. ఈ విషయాన్ని వివరిస్తూ శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని పదవశ్లోకంలో

**సుధాధారాసారై శ్చరణ యుగళాంతర్విగళితైః**
**ప్రపంచం సించంతీ పున రపి రసామ్నాయమహసః**
**అవాప్య స్వాం భూమిం భుజగనిభ మధ్యుష్టవలయమ్**
**స్వమాత్మానం కృత్వా స్వపిషి కులకుండే కుహరిణీ ॥**

తల్లీ ! నీ పాదయుగము నుండి స్రవించు సుధాధారలచే ప్రపంచాన్ని తడిపే అమృతానికి నిధానమై, కాంతులు వెదజల్లే చంద్రుని వదిలి, నీ స్వస్థానమైన ఆధరాచక్రాన్ని చేరి అక్కడ భుజంగాకారము దాల్చి తామరదుద్దు మధ్యలో ఉన్న సన్నని రంధ్రమువలె మిక్కిలి సూక్ష్మమైన పృథివీతత్త్వమందు కుండలినీశక్తివై నిద్రింతువు.

గతంలో చెప్పినట్లుగా ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీశక్తిని జాగృతం చేసినట్లై, అది గ్రంథిత్రయాన్ని ఛేదించి సహస్రారం చేరి సుధా ధారలు కురిపించి, ఆ తరువాత మళ్ళీ ఆధారచక్రంచేరి నిద్రావస్థలోకి జారుకుంటుంది.

సుషుమ్నకు ఆధారమైన మూలాధారము నందుండు కుండలిని ఆలయంగా గలది కాబట్టి కులకుండాలయా అనబడుతుంది.

చిదగ్నికుండమే కులకుండము. అదే బ్రహ్మము. ముఖ్యప్రాణస్వరూపిణి అయిన పరమేశ్వరి నిర్వికార చిన్మాత్ర. బ్రహ్మమే నివాసస్థానముగా గలది.

## 441. కౌళమార్గతత్పరసేవితా

వంశపారంపర్యంగా వచ్చిన మార్గము కులసంబంధమైనది కాబట్టి కౌళము అనబడుతోంది. వ్రతఖండము అనే గ్రంథంలో "ఎవరికి దేవి కులమార్గాన ఉన్నదో, వానిచేత ఆమె ధూపదీపనైవేద్యములచే పూజింపబడును" అని చెప్పబడింది. అయితే కుమార్గాన్ని అనుసరించి సంప్రదాయం ప్రకారము ఆమెకు వివిధరకాలయిన నైవేద్యములు సమర్పించటం జరుగుతుంది.

శ్రీ విద్యను ఉపాసించేవారు మూడు రకాలు అని గతంలో వివరించాం. వారు

1. సమయాచారులు – వైదిక సంప్రదాయాలు
2. మిశ్రమాచారులు – కౌళ, సమయాచారాలను మిళితంచేసి అర్చన చేస్తారు
3. కౌళాచారులు – తంత్రశాస్త్రాల ఆధారంగా పరమేశ్వరి అర్చన చేస్తారు.

ఈ కౌళాచారులచే కులమార్గంలో పూజించబడుతుంది. కౌలము కులమార్గము. పారంపర్యంగా అర్చించబడేది.

1. వంశము అనేకరకాలు వాటిలో

| | | | |
|---|---|---|---|
| 1. | జనకవంశము | – | తండ్రి, తాత, ముత్తాత, ఆపైవారు. |
| 2. | విద్యావంశము | – | గురువు, పరమగురువు, పరమేష్ఠిగురువు |
| 3. | వర్ణము | – | కులాచారం |
| 4. | సుషుమ్నామార్గం. | | |

వీటివల్ల సంక్రమించే విద్య పారంపర్యవిద్య. ఈ సంప్రదాయంలో పరమేశ్వరిని కౌళమార్గంలో అర్చించటం జరుగుతుంది. అందుకే ఆమె కౌళమార్గ తత్పరసేవితా అనబడుతుంది.

## 442. కుమారగణనాథాంబా

కుమారుడు – కుమారస్వామి. గణనాధుడు – గణపతి వీరిద్దరికీ తల్లి. మన్మథ వికారాలను తొలగించేది. వరాహ పురాణంలో

"పరమేశ్వరుడు అవ్యక్తుడు. శక్తి పరమేశ్వరి. వీరి సంయోగముచేత అహంకారం కలుగుతుంది. అహంకారము గలవారిని దేవి బంధిస్తుంది" అని చెప్పబడింది. అంటే భక్తులయొక్క అహంకారము తొలగించి వారికి మోక్షమిస్తుంది ఆ పరమేశ్వరి.

## 443. తుష్టిః

తుష్టి అంటే – సంతోషము. పరమేశ్వరి సర్వభూతాలకు తుష్టిని కలుగచేస్తుంది. మార్కండేయపురాణంలో

**యా దేవీసర్వభూతేషు తుష్టిరూపేణ సంస్థితా ।**

**నమ స్తస్సై నమ స్తస్యై నమ స్తస్యై నమో నమః**

సర్వభూతాల యందు తుష్టిరూపంలో ఉన్న దేవికి నమస్కరిస్తున్నాను.

దేవీభాగవతంలో పరమేశ్వరి అన్ని ప్రాణులయందు బుద్ధి, కీర్తి, ధృతి, లక్ష్మి, శక్తి, శ్రద్ధ, మతి, స్మృతి గా ఉన్నది అని చెప్పబడింది సప్తశతిలో

**యా దేవీ సర్వభూతేషు తుష్టిరూపేణ సంస్థితా**

అన్ని జీవులయందు నివాసముండి తుష్టిరూపంలో ఉండే పరమేశ్వరి అని చెప్పబడింది.

వీటన్నింటివల్ల పరమేశ్వరి సర్వజీవులయందు ఆవరించి ఉన్నది అనే విషయం తెలుస్తోంది.

## 444. పుష్టిః

**దేవదారువనే పుష్టిః**

దేవదారు వనమందు ఉండే దేవి పుష్టి అనబడుతుంది.

**యా దేవీ సర్వభూతేషు పుష్టిరూపేణ సంస్థితా**

తుష్టియే పుష్టి కూడా కారణము. జగత్తులో సకలజీవభావము, వారి వారి ఆహారవిహారాలు, వాటివల్ల కలిగే పుష్టి అన్ని పరమేశ్వరియే. స్థూల శరీరానికే కాకుండా సూక్ష్మశరీరానికి, కారణశరీరానికి కూడా బలము, స్థైర్యము కలిగించేది కాబట్టి ఆ పరమేశ్వరి పుష్టి అనబడుతుంది.

## 445. మతిః

మతి అంటే బుద్ధి. సూత సంహితలో "విష్ణువు మొదలగువారిచే స్తుతించబడు దేవి శుభములు కలుగచేస్తుంది. ఆమెను వేదప్రమాణము ద్వారా తెలుసుకోవచ్చును. అటువంటి మతిని, గౌరిని నేను ద్యానిస్తున్నాను అని చెప్పబడింది. కాబట్టి మతి అంటే – పరమేశ్వరి అని అర్థం.

**యా దేవీ సర్వభూతేషు బుద్ధి రూపేణ సంస్థితా**

జీవులయందు బుద్ధిరూపంలో ఉండి సంకల్ప వికల్పాలను చేసే పరమేశ్వరి మతి అనబడుతుంది. ఈ దేవత సాధకులను అంతర్ముఖులుగా చేసి వారికి స్వస్వరూపజ్ఞానం కలుగచేస్తుంది.

దేవిని ధ్యానించేటప్పుడు ఆమె ఏ ఇంద్రియంలో నిలిస్తే ఆ శక్తి అనబడుతుంది. కంటిలో నిలిస్తే దృశ్యశక్తి. చెవిలో నిలిస్తే శ్రవణశక్తి. మనస్సులో నిలిస్తే మతి అనబడుతుంది.

విష్ణువు మొదలగు దేవతలచే పూజించబడే వేదవిజ్ఞానగని ఆ దేవి. అందుచేతనే ఆమె మతి అనబడుతున్నది.

## 446. ధృతిః

పిండారక క్షేత్రంలో ఉండే దేవి ధృతి

**యా దేవీ సర్వభూతేషు ధృతిరూపేణ సంస్థితా**

సర్వభూతము లందు ధృతిరూపంలో ఉండేది. మనస్సు యొక్క స్థిరమైన భావమే ధృతి అనబడుతుంది. మనసుకు కావలసిన ధైర్యస్థైర్యాలు కలిగిస్తుంది. దీనివల్లనే ఆత్మవికాశము, స్వస్వరూప జ్ఞానము కలుగుతాయి.

## 447. శాంతిః

శాంతి అనేది సత్వగుణ ప్రధానమైనది. పరమేశ్వరిని గనక అర్చించినట్లైతే కామక్రోధలోభమోహ మదమాత్సర్యములనబడే అరిషడ్వర్గాలను నశింపచేసి, సాధకులకు శాంతిని కలిగిస్తుంది. శైవాగమంలో 'మలమాయా వికారాలతో తపించే పురుషుడికి సాధికారస్థానాన్నిచ్చేదే శాంతి. ఇది వాయుసంబంధమైన కళ. అని చెప్పబడింది.

నాసికాద్వారము అంటే ముక్కు. దీనికి 15 అంగుళాల క్రింద హృదయంలో ఉంటుంది. దీన్ని షోడశీకళ అంటారు. ఇదే శాంతి కల. బృహత్పరాశరస్మృతిలో కూడా ముక్కుకు పదిహేను అంగుళాలు క్రిందభాగంలో శాంతికళ ఉంటుంది అని చెప్పబడింది. ఆమెయే శాంతి.

## 448. స్వస్తిమతీ

| | | |
|---|---|---|
| సు అంటే | - | బాగుగా, మంచిగా |
| అస్తి అంటే | - | ఉండటము |
| మత్ | - | కలిగి ఉండటము |

అంటే దేవి స్థితి పరమసత్యము. మామూలుగా అనుకునే సత్యం కాదు. నిజమైన సత్యం. అది సత్యానికి సత్యం. ప్రాణాలు - సత్యము, ప్రాణాలకు - బ్రహ్మసత్యం ఆ పరబ్రహ్మయే సత్యానికి సత్యము.

రత్నకోశము ప్రకారము స్వస్తి అంటే - ఆశీస్సు, క్షేమము, నిష్పాపము, పుణ్యము, మంగళము అని అర్థం. స్వస్తి అంటే అవినాశి అని యాస్కుడు చెప్పాడు. కాబట్టి ఆ పరమేశ్వరి అవినాశి లేక మంగళకారిణి.

అందుచేతనే ఆమె స్వస్థిమతీ అనబడుతోంది. సకల ప్రపంచానికీ క్షేమం చేకూర్చేది. కంటికి కనిపించకపోయినా దేన్నయితే గ్రహించగలుగుతున్నామో, అది స్వస్తిమతి అనబడుతోంది.

## 449. కాంతిః

ఇచ్ఛాశబ్దరూపిణి తేజోమయి

**యా దేవీ సర్వభూతేషు కాంతిరూపేణ సంస్థితా**

సకల ప్రపంచమందు కాంతిరూపంలో ఉన్నది. ప్రతిజీవిలోనూ జీవం రూపంలో ఉన్నది. ప్రతి జీవిలోనూ జీవకళనే తేజస్సు అంటారు. అదే కాంతి. జీవులయందు ఆ రకంగా తేజోమయరూపంలో ఉండేది కాబట్టి పరమేశ్వరి కాంతి అనబడుతోంది.

## 450. నందినీ

నందింపచేసేది. ఆనందింపచేయునది. వశిష్ఠుని ఆశ్రమంలోని గోమాత.

**నందతీతి నందినీ** ఆనందస్వరూపముగా గల పరమేశ్వరీ.

యశోదా, నందుల ఇంట పెరిగిన యోగమాయ. దుర్గాదేవి స్వరూపురాలు గంగానదికిగల నామాలలో ఒకటి.

## 451. విఘ్ననాశినీ

విఘ్నాలను నశింపచేసేది. అవిద్యను నశింపచేసేది.

విఘ్నాలు అనేకానేకముంటాయి. పనినిబట్టి విఘ్నాలుంటాయి. తన భక్తులకు ఆ రకమైన విఘ్నాలు లేకుండా చేసేది. తన ఉపాసకులు ఏవిధమైన అంతరాయము రాకుండా చూసేది.

## 452. తేజోవతీ

సూర్యుడు మొదలగు తేజోమూర్తులకు ఆధారభూతురాలు ఆ పరమేశ్వరి నుండి అనేక వేలకోట్ల కిరణాలు ప్రసరిస్తున్నాయి. అందులో అగ్ని 108 కిరణములు సూర్యుడు 116 కిరణములు చంద్రుడు 136 కిరణములు వెరసి 360 కిరణములను గ్రహించగలిగారు. సూర్యుని ప్రకాశమువల్ల పగలు, చంద్రకాంతులవల్ల రాత్రి, అగ్ని

కాంతులవల్ల సంధ్యవేళలయందు ఈ జగత్తులోని వ్యాపారాలన్నీ జరుగుతున్నాయి. అని గతంలో వివరించాం. అయితే ఈ కిరణాలన్నీ శ్రీచక్రంలోని నవావరణల నుంచే ప్రసరిస్తున్నాయి అని కూడా అంటున్నారు.

| | | | | |
|---|---|---|---|---|
| త్రికోణంలో | 3 × 5 | = | 15 | కిరణములు |
| అష్టకోణంలో | 8 × 1 | = | 8 | కిరణములు |
| అంతర్దశారంలో | 10 × 2 | = | 20 | కిరణములు |
| బహిర్దశారంలో | 10 × 6 | = | 60 | కిరణములు |
| చతుర్దశారంలో | 14 × 4 | = | 56 | కిరణములు |
| అష్టదళపద్మములో | 8 × 8 | = | 64 | కిరణములు |
| షోడశదళపద్మములో | 16 × 7 | = | 112 | కిరణములు |
| భూపురంలో | 10 × 3 | = | 30 | కిరణములు |
| మొత్తం | | | 365 | కిరణములు |

ఇవే సంవత్సరానికి రోజులు. లలితాసహస్రంలోని శ్లోకాలసంఖ్య 182 1/2 అంటే 365 పాదాలు. ఇవే కాంతి కిరణాలుగా భావించాలి అని చెప్పారు.

అయితే వృత్తము లేక బిందువులో 360 కిరణాలు లేదా డిగ్రీలు ఉంటాయి. అంతేకాని 365 కాదు. అందుచేత ఈ లెక్క సరిగా అగుపించటంలేదు. అయినప్పటికీ వారి మతాన్ని కూడా ప్రతిపాదించాం. ఈ రకంగా కాంతిని ఇచ్చే వాటికి మూలాధారమైనది కాబట్టి తేజోవతీ అనబడుతుంది.

## 453. త్రినయనా

సోమసూర్యాగ్నులనబడే మూడు నేత్రాలు గలది. తేజోవంతమైన మూడు నేత్రాలు గలది. కుడికన్ను - సూర్యుడు. ఎడమకన్ను - చంద్రుడు. ఫాలనేత్రము - అగ్ని అలాగే కుడికన్ను పగలు, ఎడమకన్ను - రాత్రి. ఫాలనేత్రము సంధికాలము. **జ్ఞానాత్మనే నేత్రత్రయాయ వౌషట్**

జ్ఞానమే మూడునేత్రాలుగా గలది. ఈ నేత్రాలవల్ల కలిగేది కాలజ్ఞానము. అంటే తిథి, పక్షము, మాసము, ఋతువు, ఆయనము, సంవత్సరము. శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 48వ శ్లోకంలో

**అహస్సూతే సవ్యం తవ నయన మర్కాత్మకతయా**
**త్రియామాం వామం తే సృజతి రజనీనాయకతయా**
**తృతీయా తే దృష్టి ర్దరదళిత హేమాంబుజరుచి**
**స్సమాధత్తే సంధ్యాం దివస నిశయో రంతరచరీమ్ ॥**

ఓ దేవీ ! నీ కుడికన్ను సూర్యాత్మకము పగలు, ఎడమకన్ను చంద్రాత్మకము రాత్రి. నీ మూడవనేత్రము సంధ్యాకాలము సూచించుచున్నది.

## 454. లోలాక్షీ

చలిస్తున్న కనులు గలది. చంచలాక్షి, మృగాక్షి, హరిణాక్షి, కురంగాక్షి, మీనాక్షి ఇవన్నీ కూడా చలిస్తున్న కనులకు ఉదాహరణలు. చలించుచున్న కనులు అనేవి స్త్రీలసౌందర్యానికి గుర్తు అని సాముద్రికశాస్త్రం చెబుతున్నది.

## 455. కామరూపిణీ

ఇది ఇచ్ఛాదేవి యొక్క స్వరూపం. అన్ని కోరికలు తీర్చువాడు. సర్వకామనలను ఇచ్చువాడు కామేశ్వరుడు. ఆ దేవదేవుని భార్య కామేశ్వరి. కామరూపిణి అనబడుతుంది. ఈమెను కామేశ్వరుని శక్తి అని గుర్తించాలి.

పరమేశ్వరి కామాభిమాని అయిన యోగీశ్వరీ రూపము కాబట్టి కామరూపిణి అని చెప్పబడింది.

తన ఇష్టము వచ్చిన రూపాన్ని పొందగలిగినది కాబట్టి కామరూపిణి అనబడుతుంది.

## 456. మాలినీ

మాల గలది కాబట్టి మాలిని. మాతృకావర్ణములు అనే అక్షరమాలను ధరించినది కాబట్టి మాలిని. అకారాది క్షకారాంతము మాతృకారూపమైనది. వీటిలో అ నుంచి హ వరకు మాలలోని పూసలు కాగా క్షకారము మేరువు లేదా కొలికి పూస.

పరమేశ్వరుడు జటాజూటంలో ధరించిన గంగ మాలిని అనబడుతుంది. వామనపురాణంలో పార్వతీదేవికి మాలినీ అని పేరున్నది అని చెప్పబడింది. ఛందస్సులో మాలిని అనేది ఒక వృత్త విశేషము. ఏడు సంవత్సరములుకల బాలిక మాలినీ.

## 457. హంసినీ

హంసలు అనబడే యతులు ఈమె నుంచి అభేదముగా ఉన్నారు. కాబట్టి హంసినీ అనబడుతున్నది.

**గమాగమస్థం గమనాది శూన్యం చిద్రూపదీపం తిమిరాపహారం**
**పశ్యామి తే సర్వజనాంతరస్థం నమామి హంసం పరమాత్మరూపం.**

అన్ని జీవులయందు ఉండే హంస అనే పరమేశ్వరునికి నమస్కారము.

పరమాత్మ అన్నిజీవుల యందు ఉన్నాడు. తానే పరమాత్మ స్వరూపము అహం బ్రహ్మోస్మి అని భావించే జ్ఞానుల యొక్క సంసారభయము లేకుండా చేసేది.

మూలాధారం నుంచి బ్రహ్మరంధ్రందాకా, బ్రహ్మరంధ్రం నుంచి మూలాధారం దాకా తిరిగే శ్వాస హంస అనబడుతుంది. హ కారము ఉచ్ఛ్వాస. స కారము నిశ్వాస. ఈ శ్వాస మీద అదుపు సంపాదించ గలిగినవాడు పరమహంస అనబడతాడు. అంటే ప్రాణాయామంలో ఉచ్ఛ్వాసనిశ్వాసలను బంధించి ఉంచగలిగినవాడు.

పరమచైతన్య స్వరూపిణి అయిన ముఖ్యప్రాణశక్తే హంసిని అనబడుతున్నది.

**హంస హంస స్సోహం హంసస్యో హం హంసః**
**హంసహంసాయ విద్మహే పరమహంసాయ ధీమహి**
**తన్నోహంసః ప్రచోదయాత్. హంసహంసేతి యో బ్రూయాత్**
**హంసోనామ సదాశివః**

## 458. మాతా

సర్వ జనులకు మాత. సర్వజీవులకు తల్లి. మంత్రాలకన్నిటికీ తల్లి. అక్షరాలన్నింటికీ తల్లి. కల్పాంతంలో మహాప్రళయం సంభవించినప్పుడు జగత్తులోని జీవరాశి అంతా ఆ పరమేశ్వరిలో లీనమయిపోతుంది. మళ్ళీ సృష్టి ఆరంభమైనప్పుడు ఆమె గర్భం నుండి బయటకు వస్తుంది. ఈ కారణంగా జగత్తులోని సర్వజీవులకు ఆమె మాత అవుతున్నది. అవ్యక్తమైన పరమేశ్వరి నుంచే నామరూపాత్మక జగత్తు వ్యక్తమవుతున్నది. అందుకే ఆ పరమేశ్వరి మాతా అనబడింది.

తన తల్లి, భార్య లేక భర్త తల్లి, గురువు భార్య, రాజు భార్య, అన్న భార్య. ఈ ఐదుగురు మాతలనబడతారు. బ్రాహ్మీ మొదలైనవారు అష్టమాతృకలు.

లక్ష్మీ బీజానికి మాత అని పేరు. కాయావరోహ క్షేత్రంలో ఉన్న దేవత మాత.

## 459. మలయాచలవాసినీ

మలయ పర్వతం మీద నివసించునది. మలబారు దేశంలో చందనవనంలో భగవతీనామంతో పూజించబడే దేవి. ఈమెనే మలయాల భగవతి అంటారు. చెంగనూరులో పూజించబడే భగవతి అమ్మవారు ప్రతినెలా రజస్వల అవుతుంది. కేరళ ప్రభుత్వం ఆ వస్త్రాలను వేలం కూడా వేస్తుంది.

## 460. సుముఖీ

శోభనమైన ముఖము గలది. మంగళకరమైన ముఖము కలది. జ్ఞానముచేత ముఖకాంతి అధికముగ ప్రకాశించునది. ఆమె ముఖము బ్రహ్మ తేజస్సుతో ప్రకాశిస్తున్నది అని వేదం చెబుతోంది. పరమేశ్వరి బ్రహ్మానందస్వరూపిణి కాబట్టి ఆమె ముఖపద్మము సర్వకాల సర్వావస్థలయందు ప్రకాశిస్తూ ఉంటుంది. షోడశీమంత్రవిభాగములో పూజించబడే దేవత సుముఖీ

## 461. నళినీ

కాళ్ళు, చేతులు, ముఖము, కనులు ఒకటేమిటి శరీరంలోని అంగాలన్నీ కూడా పద్మంరూపంలో ఉండేది కాబట్టి నళినీ అనబడుతుంది.

తామరపద్మమువంటి ముఖము, తామరరేకులవంటి కనులు, తామరతూడులవంటి చేతులు, తామర పద్మములవంటి పాదాలు కలది కాబట్టి ఆ పరమేశ్వరి నళినీ అనబడుతోంది.

గంగానదికి నందిని, నళిని, సీతా అని అనేక పేర్లున్నాయి.

నలుడనే రాజు దేవిని సేవించి తరించాడు. కాబట్టి ఆమె నలినీ అనబడింది.

## 462. సుభ్రూః

**శోభనే భ్రువౌయస్యా-సాః**

మంగళకరమైన కనుబొమలు గలది. సుభప్రదమైన మన్మథుని ధనుస్సువలె ఉన్న కనుబొమలు కలది. గతంలో 'వదనస్మరమాంగల్య గృహతోరణ ఛిల్లికా' అనే నామంలో దీన్ని వివరించాం. సప్తశతిలో

**భ్రువౌచ సంధ్యయోస్తేజ శ్రవణా వనిలస్య చ**

కనుబొమలు సంధ్యాకాలము చెవులు వాయుతేజము అని చెప్పబడింది. శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 47వ శ్లోకంలో

**భ్రువౌ భుగ్నే కించి ద్భువనభయ భంగవ్యసనిని**
**త్వదీయే నేత్రాభ్యాం మధుకరరుచిభ్యాం ధృతగుణమ్**
**ధను ర్మన్యే సవ్యేతర గృహీతం రతిపతేః**
**ప్రకోష్ఠే ముష్టౌచ స్థగయతి నిగూఢాం తర ముమే ! ॥**

దేవీ ! కొంచెము వంగిన నీ కనుబొమలను తుమ్మెదల వంటి కాంతిగల కనులచేత కట్టబడిన అల్లెత్రాడుగల మన్మథుని యొక్క కుడిచేతిలో పట్టుకోబడిన ముంజేయి పిడికిలి కప్పుచుండగా రహస్యంగా ఉన్న ధనుస్సుగా తలంతును.

ఇక్కడ పరమేశ్వరి కనుబొమలను మన్మథుని ధనుస్సుగా ఊహించటం జరిగింది.

## 463. శోభనా

సౌందర్యము గలది. సౌందర్యవతి. పైన చెప్పిన నామాలలో పరమేశ్వరి రూపము వర్ణించి ఇప్పుడు ఆమె మిక్కిలి సౌందర్యవతి అని చెబుతున్నారు. ఆ పరమేశ్వరి మంగళకరమైన రూపము గలది.

**యా దేవీ సర్వభూతేషు కాంతిరూపేణ సంస్థితా**

పరమేశ్వరి అన్ని భూతములయందు కాంతిరూపంలో ఉంటుంది. ప్రపంచంలో అందమైన దృశ్యాలన్నీ పరమేశ్వరి అంశలే.

మహిషాసురుని సంహరించటం ఎలాగా అని దేవతలందరూ ఆలోచిస్తున్నారు. అప్పుడు వారి తేజస్సులతో ఒక స్త్రీ రూపం ఏర్పడింది.

**తతః సమస్త దేవానాం తేజోరాశిసముద్భవామ్**

ఆ దేవతల నుంచి వచ్చిన తేజస్సుతో ఒక సుందరమైన స్త్రీ రూపము ఉద్భవించింది.

ఈ కారణాలచేతనే పరమేశ్వరి శోభనా అనబడుతుంది.

## 464. సురనాయికా

దేవతలకు నాయకురాలు. దేవతలయందు శ్రేష్ఠురాలు. సకలదేవతలకు మూలకారణము దేవతలందరిలోనూ మహత్తరమైన మహిమ గలది. దేవతలలో అత్యంత సౌందర్యవతి. అందరి దేవతల శక్తి ఆమెలోనే ఉన్నది. అందుకే పరమేశ్వరి సకల దేవతాశక్తి సమైక్యరాలు. రాక్షససంహారం చెయ్యటానికి దేవతల పక్షాన నాయకత్వం వహించింది. దేవతలను కష్టకాలంలో ఆదుకుంటుంది. అందుకే సురనాయికా అనబడుతుంది.

## 465. కాలకంఠీ

కాలకంఠుడైన శివుని భార్య. లింగపురాణంలో దారుకాసురుడనే రాక్షసుని సంహరించటానికి శివుడు కాలకంఠి అనే శక్తిని సృష్టించాడు. కోకిల వంటి కంఠనాదము గలదిగాన కాలకంఠీ అనబడుతోంది. కాలంజరపురంలో పూజించబడే దేవత. శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 66వ శ్లోకంలో

**విపంచ్యా గాయంతీ వివిధమపదానం పశుపతే**
**స్త్వయారబ్ధే వక్తుం చలిత శిరసా సాధువచనే**
**తదీయై ర్మాధుర్యై రపలపితతంత్రీకలరవాం**
**నిజాం వీణాం వాణీ నిచుళయతి చోళేన నిభృతమ్ ॥**

తల్లీ ! సరస్వతి నీ ఎదురుగా నీ పతి పశుపతి వీరగాధలను గానం చేస్తుంటే నీవు ఆనందించి ఆమెను ప్రశంసించావు. నీ వాక్కులు తన వీణానాదం కన్న మధురంగా ఉన్నాయని తెలిసి సరస్వతీదేవి తన వీణ కనపడకుండా కప్పి వేసింది.

పరమేశ్వరి వాక్కు మధురము అని చెబుతున్నాడు.

## 466. కాంతిమతీ

కాంతి కలది. కాంతియుతములైన, తేజోవంతమైన సకలావయవములు గలది. పరమేశ్వరి సకలదేవతల సమిష్టిరూపం అందుచేత వారందరి తేజస్సూ ఆమెలోనే ఉన్నది. అందుచేతనే కాంతిమతి అనబడుతోంది.

## 467. క్షోభిణీ

పరమేశ్వరుడికి సృష్టి చెయ్యాలనే సంకల్పం కలిగేటట్లు చేసింది. సృష్టికాలంలో నిర్గుణుడైన పరబ్రహ్మలో ప్రవేశించి, చాంచల్యము కలిగించి సృష్టి చెయ్యాలనే కోరిక అతనికి కలిగించింది. మన్మథుని పంచబాణాలలో ఒకటి.

మనః క్షోభమువల్ల కొందరు దేవతలను సృష్టించింది. కాబట్టి క్షోభిణీ అనబడుతుంది.

## 468. సూక్ష్మరూపిణీ

తెలుసుకోవటానికి వీలులేని రూపము గలది.

కఠోపనిషత్తులో చెప్పినట్లుగా **అణోరణీయాం**. చిన్న దానిలో కూడా అతి చిన్నదైనది. దేవికి స్థూలసూక్ష్మరూపాలున్నాయని గతంలో వివరించాం. సూక్ష్మరూపము అంటే మంత్రరూపము. జ్ఞానేంద్రియాలు. కర్మేంద్రియాలు, పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి. వీటిని సూక్ష్మదేహమంటారు.

ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలను సూక్ష్మదేహమంటారు.

శబ్దము మొదలైన విషయాలకన్న వాటి ఇంద్రియాలు సూక్ష్మాలు. మనస్సు - సూక్ష్మతరము. బుద్ధి ఇంకా సూక్ష్మతరము బుద్ధి కన్న ఆత్మ ఇంకా సూక్ష్మమైనది. పరమేశ్వరి ఆత్మస్వరూపిణి కాబట్టి సూక్ష్మరూపిణీ అనబడింది.

ఈ రకంగా 420 నుంచి 468 నామాల వరకు గాయత్రీ మంత్రం వివరించబడింది.



శ్రీ 'క'కార దేవి

# 36. షట్చక్రాలు

ఆత్మ ఒక్కటే సత్యము నిత్యము అయినది. జీవాత్మను పరమాత్మతో ఏకం చెయ్యటమే సాయుజ్యం. మోక్షవాదులకు బాహ్యపూజలేదు.

**బాహ్యపూజా న కర్తవ్యా కర్తవ్యా బాహ్యజాతిభిః**

బాహ్యపూజలు చేసేవారు లౌకికవాదులు

**అంతరారాధనపరా వైదికా బ్రహ్మవాదినః**

వైదికులు, బ్రహ్మవాదులు అంతరారాధన చేస్తారు. అంతరారాధన అంటే – తానే పరబ్రహ్మ స్వరూపమని భావించి తన దేహంలోని షట్చక్రాలలోనూ పరమేశ్వరితత్త్వాన్ని ఆరాధిస్తారు.

అసలు షట్చక్రాలు అంటే ఏమిటి ? మానవశరీరంలో ఆరుచక్రాలున్నాయి. వాటినే షట్చక్రాలు అంటారు. వీటిలో ఒక్కొక్క దానికి ఒక్కొక్క తత్త్వము కూడా ఉన్నది.

**మహీం మూలాధారే, కమపి మణిపూరే హుతవహం**
**స్థితం స్వాధిస్థానే హృదిమరుత మాకాశ ముపరి**
**మనోఽపి భ్రూమధ్యే సకల మపి భిత్వా కులపథం**
**సహస్రారే పద్మే అహరహసి పత్యా విహరసే ॥**

1. మూలాధారము – భూ తత్త్వాత్మకమైనది
2. స్వాధిష్ఠానము – అగ్ని తత్త్వాత్మకమైనది
3. మణిపూరము – జల తత్త్వాత్మకమైనది
4. అనాహతము – వాయు తత్త్వాత్మకమైనది
5. విశుద్ధిచక్రము – ఆకాశ తత్త్వాత్మకమైనది.
6. ఆజ్ఞాచక్రము – మనస్తత్త్వాత్మకమైనది

వీటన్నింటి పైనా సహస్రదళపద్మమున్నది. అదే సహస్రారము. అక్కడ పరమేశ్వరి పరమశివునితో కలిసి ఉంటుంది.

ఈ చక్రాలు మానవశరీరంలో ఎక్కడున్నాయి ?

**మూలాధారం గుదస్థానం । స్వాధిష్ఠానం తు మేహనం**

**నాభి స్తు మణిపూరాఖ్యాం । హృదయం చాబ్జ మనాహతం**

**తాలుమూలం విశుద్ధాఖ్యం । ఆజ్ఞాం చ నిటలాంబుజమ్**

**తస్మా దూర్థ్వ మధోముఖం వికసితం పద్మసహస్రచ్ఛదమ్**

**నిత్యానందమహీ సదాశివపురీ శక్తే నమ శ్శాశ్వతం ॥**

| | | |
|---|---|---|
| మూలాధారం గుదస్థానం | – | ఆధారచక్రము గుదస్థానంలో ఉన్నది. |
| స్వాధిష్ఠానంతుమేహనం | – | స్వాధిష్ఠానము లింగస్థానంలో ఉన్నది. |
| నాభిస్తుమణిపూరాఖ్యం | – | మణిపూరము నాభిస్థానంలో ఉన్నది |
| హృదయంచాబ్జమనాహతం | – | అనాహతము హృదయస్థానంలో ఉన్నది |
| తాలుమూలం విశుద్ధాఖ్యం | – | విశుద్ధి చక్రం కంఠస్థానంలో ఉన్నది |
| ఆజ్ఞాంచ నిటలాంబుజమ్ | – | ఆజ్ఞాచక్రము భ్రూమధ్యభాగంలో ఉన్నది |

తస్మా దూర్థ్వమదోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదమ్ – వాటి పైన సహస్రదళ పద్మమునందు ఆ పరమేశ్వరి ఉంటుంది.

ఈ చక్రాలకు విడివిడిగా దళాలుంటాయి.

| | | | |
|---|---|---|---|
| 1. | ఆధారచక్రానికి | – | 4 దళాలు |
| 2. | స్వాధిష్ఠానానికి | – | 6 దళాలు |
| 3. | మణిపూరానికి | – | 10 దళాలు |
| 4. | అనాహతానికి | – | 12 దళాలు |
| 5. | విశుద్ధిచక్రానికి | – | 16 దళాలు |
| 6. | ఆజ్ఞాచక్రానికి | – | 2 దళాలు |
| 7. | సహస్రారానికి | – | వేయి దళాలు |

వీటిలో ప్రతి చక్రానికి కొన్ని కిరణాలుంటాయి.

శంకర భగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 14వ శ్లోకంలో

**క్షితౌ షట్పంచాశ ద్విశ మధిక పంచాశ దుదకే**

**హుతాశే ద్వాషష్టి చతురధిక పంచాశదనిలే**

**దివి షట్త్రింశ న్మనసి చ చతుష్షష్టి రితియే**

**మయూఖాస్తేషాం అప్యుపరి తవ పాదాంబుజయుగమ్**

| | | |
|---|---|---|
| క్షితౌషట్పంచాశ | - భూతత్త్వాత్మకమైనమూలాధారానికి | 56 కిరణాలు |
| ద్విశమధికపంచాశదుదకే | - జలతత్త్వాత్మకమైన మణిపూరానికి | 52 కిరణాలు |
| | ఈ మొత్తం అగ్నిదేవునివి | 108 కిరణాలు |
| హుతాసేద్వాష్షష్టి | - అగ్నితత్త్వాత్మకమైన స్వాధిష్ఠానానికి | 62 కిరణాలు |
| చతురధికపంచాశదనిలే | - వాయుతత్త్వాత్మకమైన అనాహతానికి | 54 కిరణాలు |
| | ఈ మొత్తం సూర్యునివి | 116 కిరణాలు |
| దివిద్విషట్త్రింశన్ | - ఆకాశతత్త్వాత్మకమైన విశుద్ధి చక్రానికి 36 x 2 = | 72 కిరణాలు |
| మనసిచ చతుష్షష్టిరతియే | - మనస్తత్త్వాత్మకమైన ఆజ్ఞాచక్రానికి | 64 కిరణాలు |
| | ఈ మొత్తం చంద్రునివి | 136 కిరణాలు |

మానవశరీరము మూడు ఖండాలుగా ఉన్నది. అవి 1. అగ్ని మండలము 2. సూర్యమండలము 3. చంద్రమండలము.

**1. అగ్నిమండలము :** ఆధార, మణిపూరచక్రాలను అగ్నిమండలము అంటారు. అస్యశ్రీ అగ్ని మండల మహామంత్రస్య । అగ్నిఋషిః । అనుష్టుప్ఛందః । శ్రీ అగ్ని మండలం దేవతా । రంబీజం । ధూమ్రార్చిశ్శక్తిః । ఊం కీలకం । జపేవినియోగః ॥

**న్యాసము : రాం । రీం । రూం । రైం । రౌం । రః ।**

**ధ్యానము : సదాశివప్రియం రౌద్రం సప్తాస్యం సర్వతోముఖం ।**
**వందే తం శిఖినం నిత్యం హవ్య కవ్యవహం ముదా ॥**

**మంత్రము : హ్రీం శ్రీం సౌః శ్రీఅగ్నిమండల శ్రీపాదుకాం పూజయామినమః ॥**

దీనిలో 108 కిరణాలున్నాయి.

**మూలాధారము (పృథివీతత్త్వాత్మకము) 56 కిరణాలు :**

| | | | |
|---|---|---|---|
| 1. ఉడ్డీశ్వర | 6. పూర్ణేశ్వరి | 11. అనంత | 16. పాతాద దేవి |
| 2. ఉడ్డీశ్వరి | 7. కామేశ్వర | 12. స్వరసా | 17. నారదాఖ్య |
| 3. జలేశ్వర | 8. కామేశ్వరి | 13. శంకర | 18. నాదా |
| 4. జలేశ్వరి | 9. శ్రీకంఠ | 14. మతి | 19. ఆనంద |
| 5. పూర్ణేశ్వర | 10. గగనా | 15. పింగళ | 20. హాకినీ |

| | | | |
|---|---|---|---|
| 21. ఆలస్య | 30. హాకినీ | 39. అనాదివిమల | 48. కూలాలికా |
| 22. డాకినీ | 31. ఆధారేశ | 40. మాతంగీ | 49. మిత్రేశ |
| 23. మహానంది | 32. రక్త | 41. సవర్ణావిమల | 50. కుబ్జా |
| 24. లాకినీ | 33. చక్రేసి | 42. పుళింద | 51. ఉడ్డీశ |
| 25. యోగ్య | 34. చండా | 43. యోగవిమల | 52. లక్ష్మీ్వ |
| 26. లౌకినీ | 35. కురంగేశ | 44. శాంభరీ | 53. షష్ఠీశ |
| 27. అతీత | 36. కతాళా | 45. సిద్ధవిమల | 54. కులేశ్వరి |
| 28. శాకినీ | 37. మదద్రీశ | 46. వాచాపరా | 55. చర్వాధీశ |
| 29. పాదం | 38. మహేచ్చుష్మా | 47. సమయవిమలా | 56. అజా |

ఇవి ఆధారచక్రంలోని నాలుగు దళాల యందు దళానికి ఏడుచొప్పున రెండు ఆవృత్తులుగా ఉంటాయి.

**మణిపూరము, (జలతత్త్వాత్మకము) 52 కిరణాలు :**

| | | | |
|---|---|---|---|
| 1. సద్యోజాత | 14. విద్యా | 27. విద్యావాగీశ్వర | 40. రత్నమేఖలా |
| 2. మాయా | 15. అచింత్య | 28. చిత్రా | 41. పింగళ |
| 3. వామదేవ | 16. శాంతా | 29. చతుర్విధేశ్వర | 42. యశోవతీ |
| 4. శ్రీః | 17. శశిరేఖ | 30. సుకమలా | 43. సాధ్యాఖ్య |
| 5. అఘోర | 18. ఉమా | 31. ఉమాంగేశ్వర | 44. హింసానంద |
| 6. పద్మా | 19. తీవ్ర | 32. మన్మథా | 45. పరదివ్యేషు |
| 7. తత్పురుష | 20. గంగా | 33. కృష్ణేశ్వర | 46. వామా |
| 8. అంబికా | 21. మణివాహా | 34. క్రియా | 47. మారదివ్యోషు |
| 9. అనంత | 22. సరస్వతీ | 35. శ్రీకంఠ | 48. జ్యేష్ఠా |
| 10. నివృత్తి | 23. అంబువాహా | 36. లయా | 49. పీఠేషు |
| 11. అనాధ | 24. కమలా | 37. అనంత | 50. రౌద్రి |
| 12. ప్రతిష్ఠా | 25. తేజోఽధీశ | 38. సతీ | 51. సర్వేశ్వర |
| 13. జనశ్రిత | 26. పార్వతీ | 39. శంకర | 52. సర్వమయీ |

ఈ రశ్మలు మణిపూరంలోని షడ్దళాలలోను వరుసగా 4,4,6,4,5,3 చొప్పున రెండు ఆవృత్తులుగా ఉంటాయి.

**గమనిక :** స్వాధిష్ఠాన మణిపూరాలకు పేర్లు కొన్ని గ్రంథాలలో అటూ, ఇటూ మారుతున్నాయి. పాఠకులు గమనించగలరని మనవి :

**2. సూర్యమండలము :** స్వాధిష్ఠాన అనాహతచక్రాలను సూర్యమండలం అంటారు.

**అస్యశ్రీ సూర్యమండల మహామంత్రస్య । సూర్య ఋషిః । త్రిష్టుప్ఛందః । శ్రీ సూర్యమండలం దేవతా। హ్రాం బీజం। తపినీ శక్తిః। ఈం కీలకం। జపేవినియోగః ॥**

**న్యాసము : హ్రాం । హ్రీం । హ్రూం । హ్రైం । హ్రౌం । హ్రః ।**

**ధ్యానము : ఆదిత్యం సర్వకర్తారం కళాద్వాదశ సంయుతం ।**
**పద్మహస్త ద్వయం వందే సర్వలోకైక సాక్షిణమ్ ॥**

**మంత్రము : హ్రీం శ్రీం క్లీం శ్రీసూర్యమండల శ్రీపాదుకాం । పూజయామి నమః ॥**

దీనిలో 116 కిరణాలున్నాయి.

**స్వాధిష్ఠానము (అగ్ని తత్త్వాత్మకము) కిరాణాలు 62 :**

| | | | |
|---|---|---|---|
| 1. పరాపర | 16. స్మరా | 31. స్వాద | 47. పింగళా |
| 2. చండీశ్వర | 17. స్వచ్ఛ | 32. ప్రచండ డాకిని | 48. కరాలా |
| 3. పరమ | 18. స్పర్శ | 33. యోగేశ్వర | 49. సదాఖ్య |
| 4. చతుష్మతీ | 19. భూతేశ్వర | 34. చండా | 50. కుబ్జికా |
| 5. తత్పర | 20. శబ్ద | 35. పీఠేశ్వర | 51. కాళరాత్రీ గురు |
| 6. గృహ్యకాళి | 21. ఆనంద | 36. కోశలా | 52. పరా |
| 7. అపర | 22. డాకిని | 37. కులకోలేశ్వర | 53. సిద్ధగురు |
| 8. సంవర్తా | 23. ఆలస్య | 38. పావని | 54. శాంతాతీతా |
| 9. చిదానంద | 24. రత్న డాకిని | 39. కుక్షీశ్వర | 55. రత్నగురు |
| 10. నీలకుబ్జా | 25. ప్రభానంద | 40. సమయా | 56. శాంతా |
| 11. అఘోర | 26. చక్రడాకిని | 41. శ్రీకంఠ | 57. శివగురు |
| 12. గంధా | 27. యోగానంద | 42. కామా | 58. విద్యా |
| 13. సమరస | 28. పద్మడాకినీ | 43. అనంత | 59. మేలగురు |
| 14. రసా | 29. అతీత | 44. రేవతి | 60. ప్రతిష్ఠా |
| 15. లలిత | 30. కుబ్జడాకిని | 45. శంకర | 61. సమయగురు |
| | | 46. జ్వాలా | 62. నివృత్తి |

ఇక్కడ పది దళాలున్నాయి. రశ్మలు 9 దళాలలో 3 చొప్పున 9 × 3 = 27 పదవ దళమందు 4. ఈ రకంగా రెండు ఆవృత్తులుగా ఉంటాయి.

**అనాహతము (వాయుతత్త్వాత్మకము) కిరణాలు 54 :**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | ఖగేశ్వర | 14. | లీలా | 27. | సామర | 41. | శిరస |
| 2. | భద్రా | 15. | ప్రియ | 28. | సాకినీ | 42. | కులదీపికా |
| 3. | కూర్మ | 16. | కుముద | 29. | హామర | 43. | శిభేశ |
| 4. | ఆధారా | 17. | కౌళిక | 30. | హాకినీ | 44. | సర్వేశా |
| 5. | మేష | 18. | మేనకా | 31. | ఆధారేశ | 45. | వర్మా |
| 6. | కోశా | 19. | డామర | 32. | రాక | 46. | బహురూపా |
| 7. | మీనా | 20. | డాకినీ | 33. | చక్రీశ | 47. | అస్త్రేశ |
| 8. | మల్లికా | 21. | రామా | 34. | బిందు | 48. | మహత్తరీ |
| 9. | జ్ఞానా | 22. | రాకినీ | 35. | కుకురా | 49. | పరగురు |
| 10. | విమలా | 23. | లామర | 36. | కులా | 50. | మంగళా |
| 11. | మహానందా | 24. | రాకినీ | 37. | మయశ్రీశ | 51. | పరాధిగురు |
| 12. | శర్వరి | 25. | కామర | 38. | కుబ్జికా | 52. | కోశటి |
| 13. | తీవ్ర | 26. | కాకినీ | 39. | హృదీశ | 53. | పూజ్యగురు |
| | | | | 40. | కామకల | 54. | రామా |

ఇక్కడ 12 దళాలున్నాయి.

ఈ రశ్మలు 3,6,9 దళములందు మూడు చొప్పున, మిగిలిన 9 దళాలయందు రెండు చొప్పున, రెండు ఆవృత్తులుగా ఉంటాయి.

**3. చంద్రమండలము :** విశుద్ధి ఆజ్ఞాచక్రాలను చంద్రమండలమంటారు.

**అస్యశ్రీ సోమమండల మహామంత్రస్య సోమఋషిః । గాయత్రీఛందః । శ్రీ సోమండలం దేవతా । సంబీజం । అమృతాశక్తిః ఆం కీలకం । జపే వినియోగః॥**

**న్యాసము** : సాం । సీం । సూం । సైం । సౌం । సః ।

**ధ్యానము** : క్షీరోదార్ణ వసం భూతం శశినం సర్వకామదం ।
స్రవంత మమృతం నిత్యం స్వకళాభి ర్వృతం భజే ॥

**మంత్రము** : హ్రీం శ్రీం ఐం శ్రీ సోమమండల శ్రీ పాదుకాం పూజయామి నమః॥

దీనిలో 136 కిరణాలున్నాయి.

**5. విశుద్ధి చక్రము, (ఆకాశ తత్త్వాత్మకము) కిరాణాలు : 72**

| | | | |
|---|---|---|---|
| 1. హృదయ | 19. మనోభయ | 37. వాము | 55. బహుళ |
| 2. కౌలికి | 20. హేలా | 38. ఐఫఘ్నీ | 56. మహత్తరీ |
| 3. ధర | 21. కోక | 39. కుల | 57. తాత |
| 4. కాంతా | 22. మహారక్తా | 40. సింహ | 58. కుండలినీ |
| 5. భోగ | 23. జ్ఞానగుహ్యా | 41. సంహార | 59. కులాతీత |
| 6. విశ్వా | 24. కుబ్జికా | 42. కులాంబికా | 60. కులేశీ |
| 7. మయ | 25. స్వర | 43. విశ్వంభర | 61. అజ |
| 8. యోగిని | 26. డాకినీ | 44. కామా | 62. ఈధికా |
| 9. మహః | 27. జ్వలన | 45. కోటిలా | 63. శనంత |
| 10. బ్రహ్మసారా | 28. శాకినీ | 46. కూనమాతా | 64. దీపికా |
| 11. శన | 29. మహాకుల | 47. గాలవ | 65. ఏష |
| 12. శబరీ | 30. లాకినీ | 48. కంకాళీ | 66. రోచికా |
| 13. ద్రవ | 31. మహోజ్వల | 49. వ్యోమ | 67. శిఖ |
| 14. కాళికా | 32. కాకినీ | 50. వ్యోమా | 68. మెచికా |
| 15. రస | 33. తేజః | 51. శ్వసన | 69. పరమ |
| 16. జుష్టచండాలీ | 34. శాకినీ | 52. నాదా | 70. పరా |
| 17. మోహ | 35. మూర్ధా | 53. ఖేచర | 71. పర |
| 18. అఘోరేశి | 36. హాకినీ | 54. మహాదేవి | 72. చిత్ |

ఇందులో 16 దళాలున్నాయి. వీటిలో మొదటి రెండు దళాలలోను, చివరి రెండు దళాలలోనూ మూడు మూడు చొప్పున 4×3 = 12, మిగిలిన 12 దళాలలోనూ రెండు రెండు చొప్పున 12 × 2 = 24. రెండు ఆవృత్తులుగా ఉంటాయి.

**6. ఆజ్ఞా చక్రము (మనస్తత్త్వాత్మకము) కిరాణాలు 64 :**

| | | | |
|---|---|---|---|
| 1. పట | 5. చిత్ | 9. సృష్టి | 13. స్థితి |
| 2. పరా | 6. చిత్పరా | 10. సృష్టిపరా | 14. స్థితిపరా |
| 3. భర | 7. మహామాయా | 11. ఇచ్ఛా | 15. నిరోధ |
| 4. భరా | 8. మహామాయాపరా | 12. ఇచ్ఛాపరా | 16. నిరోధపరా |

17. ముక్తి
18. ముక్తిపరా
19. జ్ఞాన
20. జ్ఞానపరా
21. సత్య
22. సతీపరా
23. అసత్య
24. అసతీపరా
25. సదసత్
26. సదసత్పరా
27. క్రియా
28. క్రియాపరా
29. ఆత్మ
30. ఆత్మపరా
31. ఇంద్రియాంశ్రయ
32. ఇంద్రియాంశ్రయాపరా
33. గోచర
34. గోచర పరా
35. లోకముఖ్య
36. లోకముఖ్యపరా
37. వేదవత్
38. వేదవత్పరా
39. సంవిత్
40. సంవిత్పరా
41. కుండలిని
42. కుండలినీపరా
43. సౌషుమ్నా
44. సౌషుమ్నాపరా
45. ప్రణసూత్ర
46. ప్రణసూత్రపరా
47. స్యంధ
48. స్యందపరా
49. మాతృక
50. మాతృకపరా
51. స్వరోద్భవ
52. స్వరోద్భవపరా
53. వర్ణజ
54. వర్ణజపరా
55. శబ్దజ
56. శబ్దజపరా
57. వర్ణజ్ఞాత
58. వర్ణజ్ఞాతపరా
59. వర్గజ
60. వర్గజపరా
61. సంయోగ
62. సంయోగపరా
63. మంత్ర విగ్రహా
64. మంత్ర విగ్రహాషూ

ఆజ్ఞా చక్రంలో రెండు దళాలున్నాయి. ఇవి ఒక్కొక్క దానిలోనూ నాలుగు నాలుగు చొప్పున ఎనిమిది ఆవృత్తులుగా ఉంటాయి. ఈ కిరణములన్నింటిపైన దేవి యొక్క పాద యుగళమున్నది. అదే ఈ కిరణములకు ఆధారము.

ఇప్పుడు 108 + 116 + 136 = 360 కిరణాలు. అవే డిగ్రీలు. ఇది వృత్తరూపము లేక బిందువు. ఈ రకంగా 360 కిరణాలు పరమేశ్వరి పాదారవిందములనుండి ప్రసరిస్తున్నాయి. ఈ 360 కిరణాలే 360 రోజులు సంవత్సరస్వరూపము.

**హయనాత్మా మహాదేవః ప్రజాపతి రితి స్మృతిః**

కాలపురుషుడే ప్రజాపతి. లలితాసహస్రంలో 469 నుంచి 542 దాకా నామాలలో ఈ షట్చక్రాలను, వాటిలో ఉండే దేవతలను వివరించటం జరిగింది. ఇక నామాలను చూద్దాం.

## 469. వజ్రేశ్వరీ

జాలంధరపీఠంలో ఉండే దేవత. షోడశనిత్యలలో ఆరవనిత్య వజ్రేశ్వరి. శ్రీచక్రంలో ముందుగా బిందువు. దాని నుంచి త్రికోణం వచ్చింది. దీని మూడుకోణాలలోనూ కామేశ్వరి, వజ్రేశ్వరి భగమాలిని అని మూడుశక్తులుంటాయి. వాటిలో రెండవదేవత వజ్రేశ్వరి.

విశుద్ధి చక్రం కంఠస్థానంలో ఉంటుంది. ఆ చక్రానికి అధిదేవత వజ్రేశ్వరి. ఈమెయే వాగీశ్వరి దేవత కూడా.

పరమేశ్వరి నివసించే మణిద్వీపానికి ఉన్న ప్రాకారాలలో పదకొండవ ప్రాకారంలో వజ్ర అనబడే నది ఉన్నది. దానికి అధిష్ఠానదేవత వజ్రేశ్వరి. ఆ ప్రాంతంలో ఎప్పుడూ ప్రవహిస్తూ ఉండే వజ్ర అనే పేరుగల నది ఒకటి ఉన్నది. దాని అలలమీద కలకల రావములు చేస్తూ హంసలు తిరుగుతుంటాయి. దాని గట్టున వజ్రేశి అనే దేవత ఉంటుంది. ఆమె వజ్రాలతో చేసిన నగలు ధరించి ఉంటుంది.

## 470. వామదేవీ

వామదేవుని శక్తి వామదేవి. దేవతలు "ఇతడు మనకు నమస్కరింపతగినవాడు. కాబట్టి వామదేవుడైనాడు" అన్నారు. వామదేవుడు అంటే – నమస్కరింపదగినవాడు. అని ఐతరేయోపనిషత్తులో చెప్పబడింది. అర్ధనారీశ్వరుడు పరమేశ్వరుడు. అతని వామభాగమునున్నటువంటిది వామదేవి. దేవీభాగవతంలో

**వామాంకే షణ్ణిషణ్ణా స్వదేవీ శ్రీభువనేశ్వరీ**

భువనేశ్వరుని వామాంకం మీద ఉండేది భువనేశ్వరి. శివుని యొక్క ఉత్తరముఖము వామదేవుడు. అతని శక్తి వామదేవి.

వామాచారంలో పూజించేవారి దేవత. వామాచారుల కోరికలు సదా తీరుస్తూ ఉంటుంది. వామము అంటే – విపరీతము. విపరీతమార్గముచే సుఖమునిచ్చేది వామదేవి.

అతి సుందరమైన శరీరలావణ్యం గల దేవత. దుర్గాదేవి యొక్క పేరు. షట్చక్రాలలో అనాహతచక్రానికి అధిష్ఠానదేవత.

## 471. వయోవస్థావివర్జితా

బాల్య, కౌమార, యవ్వన, వృద్ధాప్యదశలు ఏవీ లేనిది. వయస్సుతోపాటుగా వచ్చే అవస్థలు లేనిది. **సదాషోడశవర్షీయాం.** ఎల్లప్పుడూ పదహారు సంవత్సరాల ప్రాయంలోనే ఉంటుంది నిత్యయవ్వనసంపన్న.

కాలము అనేది పరమేశ్వరుడిచే కల్పించబడింది. అటువంటి కాలానికి అతీతురాలు పరమేశ్వరి. అందుచేత వయస్సుతోను, కాలంతోనూ వచ్చే మార్పులు ఆమెకు ఉండవు. అందుకే ఆమె వయోవస్థా వివర్జితా అనబడుతుంది. షట్చక్రాలలోను మణిపూరచక్రానికి అధిష్ఠానదేవత.

## 472. సిద్ధేశ్వరీ

దేవతలలో గోవులను కాచేవారు సిద్ధులు. వీరిచే పూజింపబడుతుంది. కాబట్టి సిద్ధేశ్వరి అనబడుతుంది.

కాశీక్షేత్రంలో సర్వసిద్ధులు ప్రసాదించే దేవి ఉన్నది ఆమె సిద్ధేశ్వరీదేవి.

సిద్ధులు అనేకరకాలు ప్రత్యేకంగా అష్టసిద్ధులు అని ఎనిమిది సిద్ధులు ప్రసిద్ధిచెందాయి. శ్రీచక్రంలోని భూపురంలోని మొదటిరేఖలో ఈ సిద్ధి దేవతలుంటారు.

**నిధివాహనసమారూఢా వరదా భయకరాంబుజా**

**పద్మరాగప్రతీకాశా ప్రసీద త్వమణిమాదయః**

**గరిమాణం లఘిమాణం వశిత్వ మణి మహిమానౌ**

**ప్రాకామ్యం భక్త్యాహం వందే ప్రాప్తించ సర్వకామదమ్ ॥**

| | | |
|---|---|---|
| 1. అణిమా | – | శరీరాన్ని అతి చిన్నగా చెయ్యటం |
| 2. మహిమ | – | శరీరం అతి పెద్దదిగా చెయ్యటం |
| 3. గరిమ | – | శరీరము బరువును విపరీతంగా పెంచటం |
| 4. లఘిమ | – | శరీరము బరువును విపరీతంగా తగ్గించటం |
| 5. ప్రాప్తి | – | కావలసిన వస్తువులు పొందటం |
| 6. ప్రాకామ్యం | – | ఆకాశసంచారము |
| 7. ఈశిత్వము | – | సమస్థానికీ అధికారం పొందటం |
| 8. వశిత్వం | – | సమస్త భూతాలను లోబరచుకోవటం |

ఈ దేవతలను అర్చిస్తే ఆ ఫలితాలు వస్తాయి. కాని సిద్దేశ్వరి అనే దేవత ఈ శక్తులేగాక, దూరశ్రవణము దూరదృష్టి, భవిష్యద్వాణి వంటి సిద్ధులు కూడా ప్రసాదిస్తుంది.

షట్చక్రాలలోనూ స్వాధిష్ఠానానికి అధిదేవత. కుర్తాళం పీఠానికి అధిదేవత సిద్ధేశ్వరి ఆ పీఠం పేరే సిద్ధేశ్వరీపీఠం.

## 473. సిద్ధవిద్యా

పంచదశీ మహామంత్రము సిద్ధవిద్యామంత్రము. దానికి శోధనలేదు. సిద్ధాదిశోధన అవసరం లేకుండానే ఈ మంత్రాన్ని ఉపదేశం పొందవచ్చు.

సామాన్యంగా ఏదైనా మంత్రాన్ని తీసుకోవాలనుకున్నప్పుడు ఆ మంత్రం మనకు సిద్ధిస్తుందా లేదా అనే విషయం ముందుగా తెలుసుకోవాలి. దీనికి అర్వాణచక్రం వేసి మంత్రం తీసుకోబోయేవాడికి, మంత్రం ఏ రకంగా ఉన్నదో చెబుతారు. అర్వాణచక్రంలో మంత్రం నాలుగురకాలుగా వస్తుంది. 1. సుసిద్ధము 2.సిద్ధము 3. సాధ్యము 4. అరిష్టము

1. సుసిద్ధము అంటే – గత జన్మలలోనే ఈ మంత్రం సాధకుడికి సిద్ధించింది. కాబట్టి మంత్రం తీసుకుని ఏ కొద్దిపాటి జపం చేసినా సిద్ధిస్తుంది.

2. సిద్ధము అంటే – మంత్రాన్ని గట్టిగా నియమనిష్టలతో ఉపాసనచేసినట్లైతే సిద్ధిస్తుంది.

3. సాధ్యము అంటే – చాలా శ్రమపడి ఉపాసన చేస్తే మంత్రం సిద్ధించవచ్చు. అంత తేలిక మాత్రం కాదు.

4. అరిష్టము అంటే – మంత్రాన్ని తీసుకుంటే ఉపాసకుడికి భయం వేస్తుంది. పిచ్చికలలు వస్తాయి. ఒక రకమైన ఉన్మాదానికి కూడా లోనవుతాడు. ఇటువంటి వారు ఆ మంత్రాన్ని వదిలివేసినట్లైతే ఆ బాధలు తప్పుతాయి.

అయితే పంచదశి మహామంత్రం విషయంలో ఈ రకమైనవి ఏవీ చూడవలసిన అవసరంలేదు. సిద్ధశోధన చెయ్యవలసిన అవసరం లేదు. ఇది మహామంత్రము. మహామంత్రాలను ఉపాసన చెయ్యాలి అంటే గతజన్మలో వాటితో అనుబంధం ఉండాలి. లేకపోతే వంశపారంపర్యంగా రావాలి. కాని శ్రీవిద్య సిద్ధవిద్య. దీనికి అటువంటి నియమాలు నిష్టలు అవసరంలేదు. అది సిద్ధిస్తుందా లేదా అని చూడవలసిన అవసరం కూడా లేదు.

దేశంలో చాలామంది ఏరకమైన మంత్రోపాసనా లేకుండానే లలితాసహస్రం పారాయణ చేస్తుంటారు. వారందరికీ కూడా గతజన్మలోనే పరమేశ్వరితో అనుబంధం ఉన్నదన్నమాట. లేకపోతే వారలాచెయ్యరు. ఈ రకంగా అనుబంధమున్నవారు తమ స్నేహితులవల్లనో, ఇతరులవల్లనో పారాయణ జరిగేచోటికి వెళ్ళి క్రమేణా వారు కూడా లలితాసహస్రం పారాయణ చెయ్యటానికి అలవాటుపడతారు. వీరందరికీ గతజన్మలో పరమేశ్వరితో అనుబంధమున్నది అనే విషయం మరిచిపోకూడదు. అలా కొంతకాలం పారాయణ చేసిన తరువాత మంత్రోపదేశం కూడా తీసుకోవచ్చును. మంత్రం సిద్ధిస్తుందా లేదా అనే విషయం ఆలోచించవలసిన అవసరంలేదు. తప్పనిసరిగా సిద్ధిస్తుంది.

మంత్రోపాసన చేసినట్లైతే శ్రీవిద్యలో కొన్ని ఇబ్బందులు వస్తాయట కదా ? అని చాలా మంది అడుగుతుంటారు. మంచి గురువు దగ్గర ఉపదేశం పొంది సత్సంకల్పంతో జపం చేస్తే చెడు ఎప్పుడూ జరగదు. కాకపోతే మంత్రాన్ని ఎప్పుడూ మంచి కోసమే వాడాలి. అంతే కాని చెడు కోసం మంత్రాన్ని ఉపయోగించకూడదు. అలాంటప్పుడు దానివల్ల ఇబ్బందులు వస్తాయి. మంత్ర జపం చేసేటప్పుడు సత్సంకల్పమనేది ముఖ్యం. మనసా వాచా కర్మణా అందరి క్షేమాన్నే కోరాలి. శ్రీవిద్య మీద ఆసక్తి గలవారి కోసం ఈ విషయం ఇక్కడ చెప్పబడింది.

పుట్టుకతోనే జ్ఞానవైరాగ్యాలు కలవారు సిద్ధులు సనకసనందనాదులు, వారిచే ఉపాసించబడే విద్య కాబట్టి ఇది సిద్ధవిద్య.

షట్చక్రాలలో ఆధారచక్రంలో ఉండే దేవత సిద్ధవిద్య. ఉపాసనవల్ల చిత్తశుద్ధిని, జ్ఞానాన్ని ప్రసాదించేవి సిద్ధవిద్యలు. అవి.

**కాళీ తారా మహావిద్యా షోడశీ భువనేశ్వరీ**
**భైరవీ ఛిన్నమస్తా చ విద్యా ధూమావతీ తథా**
**బగళా సిద్ధవిద్యా చ మాతంగీ కమలాత్మికా**
**ఏతా దశమహావిద్యాః సిద్ధవిద్యాః ప్రకీర్తితాః ॥**

## 474. సిద్ధమాతా

సిద్ధులకు తల్లి. పుట్టుకతోనే జ్ఞానవైరాగ్యాలు పొందిన సనకసనందనాదులకు తల్లి. ఆమె వారిని సర్వదా రక్షిస్తుంటుంది. స్మరించినంతమాత్రం చేతనే భక్తుల ఆపదలను తొలగించి వారిని రక్షించటానికి సదాసిద్ధంగా ఉంటుంది. ప్రపంచంలోని అన్ని జీవులు పరమేశ్వరి యొక్క సంతానమే. ఆమె వారిని ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉంటుంది. సంసార తాపత్రయాలనుండి రక్షించటానికి సదాసిద్ధంగా ఉంటుంది. కాబట్టి సిద్ధమాత అనబడుతుంది. ఆజ్ఞానచక్రాధిష్ఠానదేవత సిద్ధమాత.

## 475. యశస్వినీ

యశస్సు గలది. కీర్తి గలది కాబట్టి యశస్విని అనబడింది. **తస్యనామ మహద్యశః** దానియొక్క నామమే మహాద్యశము.

సిద్ధేశ్వరి, సిద్ధవిద్యా, సిద్ధమాత అని చెప్పటంచేత పరమేశ్వరి సకలప్రపంచానికి సిద్ధులను ప్రసాదిస్తుంది. అందుచేతనే ఆమె గొప్ప కీర్తి గలది. యశస్విని అనబడింది. మేధాదేవి అయిన దేవతయే యశస్విని. సహస్రదళపద్మంలో ఉండే దేవత యశస్విని.

ఇప్పటివరకు షట్చక్రాలకు అధిష్ఠానదేవతలను చెప్పి ఇప్పుడు చక్రాలను వివరిస్తున్నారు.

యోగినీన్యాసం ప్రకారము ఇక్కడ నుండి 67నామాలతో షట్చక్రాలను వివరిస్తున్నారు. ఈ చక్రాలలో యోగినీదేవతలున్నారు. డ ర ల క స హ య అనే ఏడు అక్షరాలచేత వారి పేర్లు ప్రారంభమవుతాయి.

1. డ – డాకిని
2. ర – రాకిని
3. ల – లాకిని
4. క – కాకిని
5. స – సాకిని
6. హ – హాకిని
7. య – యాకిని

షట్చక్రాలలో ప్రతి చక్రానికీ కొన్ని దళాలున్నాయి. ఆ దళాలలో కొన్ని అక్షరాలున్నాయి. ఆ చక్రానికి ఒక దేవత ఉన్నది. వాటిని ఈ దిగువ ఇవ్వటం జరిగింది.

| చక్రము | దళాలు | అధిపతి | దేవత | అక్షరాలు | తత్త్వము |
|---|---|---|---|---|---|
| విశుద్ధి | 16 | మహేశ్వరుడు | డాకిని | అ నుంచి అః వరకు | ఆకాశ |
| అనాహతము | 12 | రుద్రుడు | రాకిని | క నుంచి ఠ వరకు | వాయువు |
| మణిపూరము | 10 | విష్ణువు | లాకిని | డ నుంచి ఫ వరకు | జలము |
| స్వాధిష్ఠానము | 6 | బ్రహ్మ | కాకిని | బ నుంచి ల వరకు | అగ్ని |
| మూలాధారము | 4 | గణపతి | సాకిని | వ నుంచి స వరకు | భూమి |
| ఆజ్ఞా | 2 | సదాశివుడు | హాకిని | హ, క్ష | మనస్సు |
| సహస్రారం | 1000 | పరమేశ్వరుడు | యాకిని | అన్ని అక్షరాలు | ఆత్మ |

షట్చక్రాలను గురించి చెప్పేటప్పుడు ముందు ఆధారచక్రం చెప్పకుండా విశుద్ధి చక్రం నుంచి ప్రారంభిస్తారు. ఇలా పై నుంచి కాకుండా, క్రింద నుంచీ కాకుండా మధ్యలో నుంచి ఎందుకు ప్రారంభించాలి అని అనుమానం వస్తుంది. దీనికి కారణము. అ కారాది క్ష కారాంతము వర్ణాలు విశుద్ధి చక్రం నుంచి ప్రారంభమయి ఆజ్ఞాచక్రంతో పూర్తవుతాయి. అందుచేత అదేక్రమంలో షట్చక్రాలను కూడా చెప్పటం జరుగుతోంది. ముందుగా విశుద్ధి చక్రం.

## 476. విశుద్ధిచక్రనిలయా

కంఠస్థానానికి కొంచెం దిగువగా 16 దళాలతో ఉండే పద్మాన్ని విశుద్ధి చక్రం అంటారు. ఇది తెల్లని రంగులో ఉంటుంది. దీని పదహారు దళాలలోను అ నుంచి అః వరకు అచ్చులుంటాయి. పరాస్థానంలో అవ్యక్తంగా బయలుదేరిన వాక్కు ఇక్కడికి రాగానే అచ్చులతో కలిసిన వైఖరీవాక్కుగా మార్పు చెందుతుంది. ఈ పదహారుదళాలందు పదహారుశక్తులు పరివేష్టించి ఉండగా చక్రాధిష్ఠానదేవత వజ్రేశ్వరి దీని మధ్యన ఉంటుంది. దీని కర్ణికయందు త్రికోణము, దానియందు చంద్రమండలము దానిలో తెల్లని ఏనుగు, దానిమీద హం ఆకాశబీజము ఉంటాయి. ఇక్కడ మహేశ్వరుడుంటాడు.

## 477. ఆరక్తవర్ణా

ఆ రక్తము అంటే – పాటలవర్ణము. ఎరుపు, తెలుపు రంగులు కలిసినది. పరమేశ్వరి రంగు జపాకుసుమము, అరుణారుణము. అంటే తెలుపుతో కలిసిన ఎరుపురంగు.

## 478. త్రిలోచనా

మూడు కనులు గలది. సోమసూర్యాగ్నులే మూడునేత్రాలు. ఋగ్ యజుస్సామాలే మూడునేత్రాలుగా గలది. ఈ మూడు నేత్రాలు భూతభవిష్యద్వర్తమానకాలాలను కూడా సూచిస్తున్నాయి. ఈ రకంగా మూడుకనులు గలది.

## 479. ఖట్వాంగాది ప్రహరణా

ఖట్వాంగము అంటే మంచంకోడు. మానవుడి పుర్రె గ్రుచ్చబడిన ఒక కర్ర. ఇక్కడ ఉన్న వజ్రేశ్వరీదేవి ఖట్వాంగము, ఖడ్గము, త్రిశూలము, చర్మములను తన నాలుగుచేతులయందు ధరించి ఉంటుంది.

## 480. వదనైకసమన్వితా

వదనము – ముఖము, ముఖరంధ్రము. ఇక్కడ ఒకే శిరస్సు గలది అని చెప్పవచ్చును.

## 481. పాయసాన్నప్రియా

పాయసము నందు ప్రీతి గలది. పాలతోవండిన అన్నమునందు ప్రీతి గలది. అయితే కేవలము పాలు, బియ్యము కలిపి వండటంకాదు. పాయసమంటే...

**తండులేషు క్షిపేత్ క్షీరం ద్విగుణం వా తదర్ధకం**
**అలాభే విన్యసే త్తోయం తస్యార్ధం గోఘృతం పరం**
**తండులార్ధాన్ భిన్నముద్గాన్ గుడం విన్యస్య పాచయేత్**
**నివేదయే త్తతో మంత్రీ పాయసాన్నం శివాయ చ ॥**

బియ్యం – ఒక శేరు
పాలు – రెండు శేర్లు
ఆవు నెయ్యి – అర్ధశేరు
పెసరపప్పు – అర్ధశేరు
బెల్లం – అర్ధశేరు

ఈ రకంగా వండిన అన్నాన్ని పాయసము అంటారు.

## 482. త్వక్ స్థా

త్వక్ అంటే చర్మము. చర్మమునందుండునది. మానవదేహము తొమ్మిది ధాతువులతో నిర్మించబడింది.

**త్వక్ సృగ్ మాంస మేధోస్తి ధాతవ శక్తిమూలకాః**
**మజ్జా శుక్ల ప్రాణ జీవధాతవ శ్శివమూలకాః**
**నవధాతు రయం దేహో నవయోనిసముద్భవః**

చర్మము, రక్తము, మాంసము, మేద, ఎముకలు, మజ్జ, వీర్యము, ప్రాణము, జీవము అనే తొమ్మిది ధాతువులచేతనే ఈ శరీరం నిర్మించబడింది. అందులో చర్మము అనే ధాతువునందు ఈ చక్రాధిష్ఠానదేవత ఉంటుంది. శరీరం మీద కాలి చర్మం రాకపోయినా, గాయాలవల్ల చర్మం మళ్ళీ రాకపోయినా **ఓం త్వక్స్థాయై నమః** అని జపం చేస్తూ ఈ దేవతను ప్రార్థించినట్లైతే చర్మం లేనిచోట చర్మం వస్తుంది. అ చక్రాధిష్టానదేవత వజ్రేశ్వరి చర్మధాతువుకు పుష్టినిస్తుంది.

## 483. పశులోకభయంకరీ

పశువులు – అజ్ఞానులు. భగవంతుడు వేరు భక్తులు వేరు అని భావించేవారు. జీవాత్మ పరమాత్మల ఏకీభావం ఒప్పుకోనివారు. వీరందరికీ పతి పశుపతి. **పశూనాంపతిః** పశుపతి. అతడే పరమేశ్వరుడు. పరమేశ్వరుని శక్తి పరమేశ్వరి. ఆమె పశులోకభయంకరి అనబడుతుంది.

ఈ అజ్ఞానులకు ద్వైతభావం ఉంటుంది. అహంబ్రహ్మాస్మి అనే మహావాక్యాలను వీరు కలలో కూడా ఊహించరు. ఒకవేళ ఊహించగలిగినా దాన్ని ఒప్పుకోరు. అటువంటి పశులోకానికి భయంకరి పరమేశ్వరి.

## 484. అమృతాదిమహాశక్తి సంవృతా

అమృతా మొదలైన మహాశక్తులచే పరివృత అయి ఉండేది. ఈ చక్రానికి అధిష్ఠానదేవత అయిన వజ్రేశ్వరి ఈ చక్రము యొక్క కర్ణికలో ఉండగా, ఇక్కడి పదహారు దళాలలోను అ నుంచి అః వరకు ఉన్న శక్తులు ఆమెను చుట్టి ఉంటాయి. ఆ శక్తులు

| | | | |
|---|---|---|---|
| 1. అమృతా | 5. ఉషఃకేసి | 9. కార | 13. ఓంకారి |
| 2. ఆకర్షిణి | 6. ఊర్ధ్వ | 10. షా | 14. ఔషధి |
| 3. ఇంద్రాణి | 7. ఋద్ధిత | 11. ఏకపదా | 15. అంబికా |
| 4. ఈశాని | 8. ఋకార | 12. ఐశ్వర్యా | 16. అఃక్షరా |

## 485. డాకినీశ్వరీ

వజ్రేశ్వరీదేవి మంత్రానికి బీజము, శక్తి, కీలకము అన్నీ కూడా డకార సంకేతంగా ఉంటాయి. కాబట్టి ఈమె డాకినీ అనబడుతుంది.

యోగినీన్యాసంలో విశుద్ధి చక్రాన్ని గురించి వివరిస్తూ

**గ్రీవాకూపే విశుద్ధౌ నృపదళకమలే శ్వేతరక్తాం త్రినేత్రాం**
**హస్తైః ఖట్వాంగ ఖడ్గాం త్రిశిఖ మపి మహాచర్మ సంధారయంతీం**
**వక్త్రేణైకేన యుక్తాం పశుజన భయదాం పాయసాన్నైకసక్తాం**
**త్వక్స్థాం వందే ఽమృతాద్యైః పరివృతవపుషం డాకినీం వీరవంద్యాం ॥**

కంఠస్థానంలో విశుద్ధిచక్రము 16 దళాలు కలిగి ఉన్నది. దీనియందు ఎరుపురంగుతో మూడుకనులు గలిగి ఖట్వాంగము ఖడ్గము త్రిశూలము చర్మము తన నాలుగు చేతులయందు ధరించి ఒకే ముఖముతో పశుప్రాయులకు భయము కలిగించు డాకినీదేవి అమృత మొదలైన 16 శక్తులచే పరివృత అయి ఉంటుంది. ఈమెకు పాయసాన్నమునందు మక్కువ ఎక్కువ.

**విశుద్ధి చక్రాధిష్ఠానదేవతా డాకినీయుక్త మహేశ్వర ।**

**స్వరూపిణ్యంబా శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః ॥**

శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 37వ శ్లోకంలో

**విశుద్ధౌ తే శుద్ధ స్పటిక విశదం వ్యోమజనకం**
**శివం సేవే దేవీ మపి శివసమానవ్యవసితాం**
**యమో కాంత్యా యాంత్యా శశికిరణసారూప్యసరణే**
**ర్విధూతాం తర్ధ్వాంతా విలసతి చకోరీవ జగతి ॥**

విశుద్ధి చక్రంలో స్పటికమువలె స్వచ్ఛమైనవాడు. ఆకాశతత్త్వాత్మకుడు అయిన శివుడు, అతనితో సమానమైన దేవి ఉంటారు. ఇక్కడ శివాశివులిద్దరూ శుద్ధస్పటికాలవలె ప్రకాశిస్తుంటారు. ప్రాణాయామం చెయ్యటంవల్ల కాంతిని కోల్పోయిన షోడశకళలకు శివాశివుల శరీరకాంతులచే మళ్ళీ ప్రకాశము కలుగుతుంది. అంటే సాధకుడి యొక్క అజ్ఞానం తొలగించబడుతుంది.

షట్చక్రనిరూపణంలో "విశుద్ధి చక్రము యొక్క కర్ణికయందు వృత్తరూపంలో ఉన్న వియన్మండలము చంద్రబింబమువలె ప్రకాశిస్తూ ఉంటుంది. దీని బీజము హం. ఇది ఆకాశబీజము ఈ బీజానికి నాలుగుచేతులున్నాయి. ఆ చేతులయందు పాశము అంకుశము వరద అభయ ముద్రలు ఉంటాయి. ఆ బీజములో ఐదుముఖాలు, మూడుకనులు, పదిచేతులు గలిగి వ్యాఘ్రచర్మధారియైన మహేశ్వరుడుంటాడు. ఈ చక్రానికి అధిదేవత డాకిని. యోగాభిలాషులకు ఇది మోక్షద్వారము" అని చెప్పబడింది.

సంతానోపనిషత్తులో మాతృగర్భంలో పిండం ఏవిధంగా ఏర్పడుతుంది ? ఏ రకంగా అభివృద్ధి చెందుతుంది ? అనే విషయాలు చెప్పబడ్డాయి.

మాతృగర్భంలో శుక్లరక్తబిందువులు మిశ్రమం కావటంచేత రజోబిందువు ఏర్పడుతుంది. ఈ రెండు బిందువులు కలిసిన తరువాత వారాంతానికి బుద్బుదాకారం (బుడగ) ధరిస్తుంది. పక్షాంతాన పిండముగా ఏర్పడి మాసాంతాన అది గట్టిపడుతుంది.

**ఏకరాత్రే కలలం భవతి**
**సప్తరాత్రోషితం బుద్బుదం భవతి**
**అర్ధమాసాభ్యంతరేణ పిండో భవతి**
**మాసాంతరేణ కఠినోభవతి**

శుక్లరక్తబిందువుల మిశ్రమం కావటంచేత అది పాటలవర్ణంలో ఉంటుంది. దీనికి ఒకే ముఖము ఉంటుంది. ఈ ముఖరంధ్రం ద్వారానే తల్లి భుజించిన ఆహారం పిండానికి అందుతుంది. ఈ గర్భస్థశిశువునే వజ్రేశ్వరి అంటారు.

విశుద్ధి చక్రంలో చెప్పన దేవత ఈ పిండమే. అందుకే అది పాటలవర్ణంలో ఉంటుంది. ఒకే ముఖం ఉంటుంది. పాయసాన్నప్రియ. గర్భిణి అయిన తల్లికి ఈ నెలలో పాయసాన్నము మంచి ఆహారము.

## 486. అనాహతాబ్జనిలయా

హృదయస్థానమందు అనాహతమనే పద్మమున్నది. ఇది వాయుతత్త్వాత్మకమైనది. దీనికి 12 దళాలుంటాయి. దీనికి అధిదేవత రుద్రుడు. ఈ చక్రం బంగారు రంగులో ప్రకాశిస్తూ ఉంటుంది. దీని పన్నెండు దళాలలోనూ క నుండి ఠ వరకు అక్షరాలు శక్తిరూపాలలో ఉంటాయి. ఈ చక్రానికి అధిదేవత వామదేవి. పరాస్థానంలో పుట్టిన వాక్కు ఇక్కడికి వచ్చి మధ్యమగా మారుతుంది.

## 487. శ్యామాభా

నల్లని కాంతి కలది. శ్యామల వర్ణము గలది శ్యామ అనే 16 సంవత్సరాలబాలిక. ఈ చక్రంలో ఉండే వామదేవి నల్లనిరంగులో ఉంటుంది.

## 488. వదనద్వయా

రెండు ముఖములు గలది. వామదేవి రెండు తలల కలిగి ఉంటుంది అని చెప్పబడింది.

## 489. దంష్ట్రోజ్జ్వలా

వరాహము యొక్క దంతముల వంటి దంతములతో ప్రకాశించునది. వామదేవికి దంతాలు కోరలులాగా ఉంటాయి. ఈ దేవి నల్లగా ఉంటుంది. దంతాలు తెల్లగా ప్రకాశిస్తుంటాయి. అందుచేత దంష్ట్రోజ్వలా అనబడుతుంది.

## 490. అక్షమాలాది ధరా

తన నాలుగుచేతులయందు అక్షమాల, శూలము, కపాలము, డమరుకము ధరించి ఉంటుంది. అక్షమాల అంటే రుద్రాక్షలమాల కాదు. అ నుంచి హ వరకు యాభై అక్షరాలుమాలగా క్ష కారము కొలికిపూసగా ఉంటాయి.

## 491. రుధిరసంస్థితా

రక్తమునందు ప్రీతి గలది. రక్తమునందుండునది. శరీరంలోని ధాతువులలో రక్తము ఒకటి. వామదేవి ఆ రుధిరధాతువుకు అధిదేవత. ఈమె వృట్టి కరదేవత. అనాహతపద్మము రక్తానికి కేంద్రస్థానము అందుకే వామదేవి రుధిరసంస్థితా అనబడుతోంది. శరీరంలో గనక రక్తం తక్కువ అయినట్లైతే **'ఓం రుధిర సంస్థితాయై నమః'** అని జపం గనక చేసినట్లైతే రక్తవృద్ధి జరుగుతుంది.

## 492. కాలరాత్ర్యాదిశక్త్యోఘవృతా

కాళరాత్రి అని ఒక శక్తి ఉన్నది. సప్తశతిలో బ్రహ్మదేవుడు పరమేశ్వరిని ధ్యానిస్తూ

**కాళరాత్రి ర్మహారాత్రి ర్మోహరాత్రి శ్చ దారుణా అంటాడు.**

అనాహతపద్మంలో పన్నెండు దళాలుంటాయి. ఆ పన్నెండు దళాలలోను క నుంచి ఠ వరకు పన్నెండు అక్షరాలు శక్తులరూపంలో ఉంటాయి. అవి.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | కాళరాత్రి | 4. | ఘంటాధారిణి | 7. | ఛాయా | 10. | జ్ఞనరూపా |
| 2. | ఖాతీత | 5. | ఙామిని | 8. | జయా | 11. | టంకహస్తా |
| 3. | గాయత్రి | 6. | చంద్ర | 9. | ఝుంకారి | 12. | ఠంకారిణి |

వీరంతా చుట్టూ పరివేష్టించి ఉండగా వామదేవి మధ్యలో ఉంటుంది.

## 493. స్నిగ్ధౌదనప్రియా

ఘృతముచేత స్నిగ్ధమైన అన్నము నందు ప్రీతి గలది. వామదేవికి నేతితో తడిపిన అన్నము నందు మక్కువ ఎక్కువ. ఇక్కడ నేయి అంటే ఆవునేయి మాత్రమే అని గుర్తించాలి.

## 494. మహావీరేంద్రవరదా

చాలా గొప్ప పండితులు. ఒకే మాటకు రెండువైపులా కూడా వాదించగలవారు. ఒక మాటను ఔను అని, మళ్ళీ అవసరమైతే దాన్నేకాదని మెప్పించగలవారు. చమత్కారముతో కూడిన భాషణ చేసేవారు.

మహావీర - అంటే - సోమయాగమునందు ఉపయోగించే పాత్ర. మహావీరము అనేది పానపాత్ర విశేషము. మహావీరులు అంటే - ఎడతెరపి లేకుండా బ్రహ్మానందాన్ని

పానం చేసేవారు. ఇంద్రునివలన బ్రహ్మను తెలుసుకున్నవారు. అన్నింటికీ సాక్షి ఆ పరబ్రహ్మే అని తెలిసినవారు. తురీయస్థితి తెలిసినవారు.

శ్రీవిద్యోపాసకులను వీరులు అంటారు. వారిలో కూడా మహావీరులు. మనువు, చంద్రుడు, కుబేరుడు మొదలైనవారు వారిచేత అర్చించబడినది.

అద్వైతసిద్ధాంతము బాగా తెలిసినవారిచేత ఉపాసింపబడేది. దేవదానవ యుద్ధంలో విష్ణువు, రుద్రుడు మహావీరులు. వీరికి వరాలిచ్చేది. కాబట్టి మహావీరేంద్రవరదా అనబడుతున్నది.

## 495. రాకిణ్యంబాస్వరూపిణీ

ఈ అనాహత చక్రంలో ఉండే వామదేవి యొక్క మంత్రంలో శక్తిబీజము, కీలకము అన్నీ రకార సంకేతాలే. కాబట్టి రాకిని అని పిలువబడుతుంది.

యోగినీన్యాసంలో

**హృత్పద్మే భానుపత్రే ద్వివదనలసితాం దంష్ట్రిణీం శ్యామవర్ణాం**
**అక్షం శూలం కపాలం డమరుక మపి భుజై ర్ధారయంతీం త్రినేత్రాం**
**రక్తస్థాం కాళరాత్రిప్రభృతి పరివృతాం స్నిగ్ధభుక్తైకసక్తాం**
**శ్రీమద్వీరేంద్రవంద్యా మభిమతఫలదాం రాకినీం భావయామః ॥**

హృదయస్థానంలో ఉండే అనాహతపద్మము పన్నెండు దళాలు కలిగి హేమవర్ణంతో ప్రకాశిస్తుంది. ఇది వాయుతత్త్వాత్మికమైనది. దీని కర్ణికలో రాకినీ దేవత రెండు ముఖములు, మూడు నేత్రములు, కోరలు కలిగి నాలుగుచేతులయందు అక్షమాల, శూలము, కపాలము, డమరుకము ధరించి నల్లనిరంగులో ఉంటుంది. ఈమెకు స్నిగ్ధాన్నము నందు మక్కువ ఎక్కువ. క కారము నుంచి ఠ కారము వరకు గల పేర్లతో పన్నెండు శక్తులు ఆ దేవిని పర్యవేష్టించి ఉంటారు. ఈ దేవత మహాపండితులతోను, జ్ఞానులతోను, శ్రీవిద్యాదురంధరులతోనూ ఉపాసించబడుతుంది.

**అనాహతాధిష్ఠానదేవతారాకినీ యుక్త రుద్రస్వరూపిణ్యంబా**
**శ్రీపాదుకాం పూజయామితర్పయామి నమః**

శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 38వ శ్లోకంలో అనాహత పద్మాన్ని వివరిస్తూ

**సమున్మీలత్సంవిత్కమలమకరందైకరసికం**
**భజే హంసద్వంద్వం కిమపి మహతాం మానసచరం**
**యదాలాపా దష్టాదశగుణిత విద్యాపరిణతిః**
**యదాదత్తే దోషాద్గుణ మఖిల మద్భ్యఃపయ ఇవ ॥**

అనాహతచక్రంలో శివశక్తులు ఇద్దరూ రాజహంసల రూపంలో ఉంటారు. హంసరూపము అంటే 26వ తత్త్వము. ఈ హంసద్వంద్వమువల్లనే అష్టాదశవిద్యలూ ఉద్భవించినాయి. ఈ తత్త్వాన్ని సేవించేవారు అష్టాదశవిద్యలయందు ప్రావీణ్యులౌతారు. షట్చక్రనిరూపణంలో "అనాహతపద్మము యొక్క కర్ణికలో షట్కోణాకృతిగా ధూమ్రవర్ణంలో వాయుమండలమున్నది. దీని బీజము 'యం' దీని వాహనము లేడి అని చెప్పబడింది.

సంతానోపనిషత్తులో "అనాహతపద్మములో వామదేవికి రెండు వదనాలున్నాయి. గర్భస్థపిండానికి మొదటినెలలో నోరు ఏర్పడగా, రెండవనెలలో ముక్కు ఏర్పడుతుంది. ఈ రెండూ వదనాలు. అందుచేతనే వామదేవికి రెండు ముఖాలున్నాయని చెప్పబడింది. ఈ మాసములో నేతితో తడిపిన అన్నము తల్లీ బిడ్డలకు మంచి ఆహారము.

## 496. మణిపూరాబ్జనిలయా

నాభిస్థానంలో ఉండే చక్రాన్ని మణిపూరము అంటారు. ఇది పదిదళాలు గల చక్రము జలతత్త్వాత్మకము. దీని దళాలలో డ నుంచి ఫ వరకు అక్షరాలు శక్తులరూపంలో ఉంటాయి. ఇందులో ఉండే దేవత పేరు 'వయోవస్థా వివర్జితా' కాలంతోపాటుగా వచ్చేవయోభేదంగాని, బాల్యకౌమారాది అవస్థలుగాని ఈమెకు ఉండవు. ఎప్పుడూ నిండు యవ్వనవతిగానే ఉంటుంది. ఇది విష్ణుస్థానము.

## 497. వదనత్రయసంయుతా

మూడు ముఖములు గలిగినది. మూడుశిరస్సులు గలిగినది. మూడు ముఖ భాగములు గలిగినది.

## 498. వజ్రాదికాయుధోపేతా

మణిపూరానికి అధిష్ఠాత్రి అయిన వయోవస్థావివర్జితా అనే దేవతకు నాలుగుచేతులు ఉంటాయి. ఆ చేతులలో వజ్రము, శక్తి, దండము, అభయముద్రలు ఉంటాయి.

## 499. డామర్యాదిభిరావృతా

మణిపూరంలో పదిదళాలు ఉంటాయి. వీటిలో డ నుంచి ఫ వరకు శక్తులు ఉంటాయి. అవి

1. డామరి
2. ఢంకారిణి
3. ణామిరి
4. తామసి
5. స్థాణ్వి
6. దాక్షాయణి
7. ధాత్రి
8. నందా
9. పార్వతి
10. ఫట్కారిణి

ఈ శక్తులు చుట్టూ పరివేష్టించి ఉండగా ఆ పద్మము యొక్క కర్ణికలో వయోవస్థా వివర్జితా అనబడే దేవత ఉంటుంది.

## 500. రక్తవర్ణా

రక్తమువలె ఎర్రనిరంగు గలది.

## 501. మాంసనిష్ఠా

ఈ దేవతకు మాంసము అనే ధాతువునందు అభిమానము ఎక్కువ. మణిపూరము మాంసధాతువుకు స్థానము. ఇక్కడ ఉండే దేవత మాసంధాతువునకు అధిష్ఠాత్రి. శరీరానికి మాంసమేపుష్టి. ఇది అన్నిజీవుల శరీరాలయందు ఉంటుంది. ఎవరికైనా శరీరంలో మాంసము సరిగా లేకపోయినప్పుడు **'ఓం మాంసనిష్ఠాయై నమః'** అని జపం చేసినట్లైతే ఈ దేవత అనుగ్రహం కలుగుతుంది. సాధకుని శరీరంలో మాంసవృద్ధి జరుగుతుంది.

## 502. గుడాన్న ప్రీతమానసా

**గుడేన మిశ్ర మన్నం గుడాన్నం**

బెల్లముతో కలిపివండిన అన్నమందు ప్రీతికలది. అయితే గుడాన్నమంటే కేవలము అన్నంలో బెల్లం కలపటంకాదు. అది తయారు చెయ్యటానికి ఒక పద్ధతి ఉన్నది.

**తండులేషు చతుర్భాగం గుడం నిక్షిప్య సాధకః**
**ద్విభాగం విన్యసే ద్దుగ్ధం తస్యార్ధం ప్రక్షిపేద్ ఘృతం**
**నారికేళం చ కదళీఫలమేలాం వినిక్షిపేత్**
**కృత్వా గుడాన్న మేవం తు శంభవే వినివేదయేత్ ॥**

బియ్యం - ఒక శేరు

బెల్లం - పావుశేరు

పాలు - రెండు శేర్లు

నెయ్యి - అర్ధశేరు

వీటికి కొబ్బరి, అరటిపండు కలిపి వండిన పదార్థమే గుడాన్నము.

ఈ రకంగా వండిన బెల్లంతో కలిపినఅన్నాన్ని ఈ దేవతకు నివేదన చెయ్యాలి. ఈ ఆహారము శరీరపుష్టినిస్తుంది.

## 503. సమస్త భక్త సుఖదా

ఈ రకంగా ఉపాసనచేసినట్లైతే వయోవస్థావివరిజతా అనబడే ఈ దేవత భక్తుల యొక్క కోరికలు తీర్చి వారికి సమస్త సుఖాలను ఇస్తుంది.

## 504. లాకిన్యంబాస్వరూపిణీ

మణిపూరాధిష్ఠా దేవత యొక్క బీజము, శక్తి కీలకము అన్నీ కూడా ల కార సంకేతంగానే ఉంటాయి. కాబట్టి ఈ దేవతను లాకిన్యంబా అంటారు.

యోగినీన్యాసంలో మణిపూరాన్ని వివరిస్తూ

**దిక్పత్రే నాభిపద్మే త్రివదన విలసద్దంష్ట్రిణీం రక్తవర్ణాం**
**శక్తిం దంభోళిదండాం అభయమపి భుజై ర్ధారయంతీం మహోగ్రాం**
**డామర్యాద్యై పరీతాం పశుజన భయదాం మాంసధాత్వైకనిష్ఠాం**
**గౌడాన్నాసక్తచిత్తాం సకల సుఖకరీం లాకినీం భావయామః ॥**

నాభిస్థానంలో పదిదళాలుగల పద్మమున్నది. దానిలో మూడు ముఖములు, కోరలు గలిగి, రక్తవర్ణములో ఉన్నది, చేతులయందు వజ్రము, శక్తి, దండము, అభయముద్రలు గలిగినది. మాంసధాతువునందుండునది, గుడాన్నమునందు ప్రీతిగలది, సమస్తసుఖాలను ఇచ్చేది అయిన లాకినీ దేవికి నమస్కరిస్తున్నాను.

**మణిపూరాధిష్ఠాన దేవతా లాకినీయుక్త విష్ణుస్వరూ పిణ్యంబా**
**శ్రీపాదుకాంపూజయామి తర్పయామి నమః**

శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 40వ శ్లోకంలో మణిపూరాన్ని వివరిస్తూ

**తటిత్వంతం శక్త్యా తిమిర పరిపంథి స్ఫురణయా**
**స్ఫురన్నానారత్నాభరణపరిణద్ధేంద్రధనుషమ్**
**తవ శ్యామం మేఘం క మపి మణిపూరైక శరణం**
**నిషేవే వర్షంతం హరమిహిరతప్తం త్రిభువనమ్ ॥**

స్వాధిష్ఠానంలో మహాసంవర్తాగ్ని వల్ల దహనమైన లోకాలను ఇక్కడ, శివాశివులు తమ అమృతపుధారలతో తడుపుతుంటారు. ఇక్కడ శివుడు మేఘరూపంలో ఉండగా శక్తిసౌదామిని (మెరుపు) రూపంలో ఉంటుంది.

షట్చక్రనిరూపణంలో "మణిపూరచక్రం యొక్క కర్ణికలో అగ్నిమండలమైన త్రికోణము ఎర్రని రంగులో ఉన్నది. అక్కడ అగ్ని బీజము రం. మేషవాహనముపై నున్నది. ఈ బీజము అంక భాగాన సింధూరవర్ణము గల రుద్రమూర్తి ఉంటాడు. అతడు భస్మలేపనం చేసుకుని తెల్లగా మెరుస్తూ ఉంటాడు. అతడికి మూడుకనులుంటాయి. అభయవరద ముద్రలు ధరించి ఉంటాడు. అతడు సృష్టి సంహారకారి" అని చెప్పబడింది.

సంతానోపనిషత్తులో "మణిపూరంలో ఉండే దేవి వయోవస్థావివర్జితా ఆమెకు మూడుశిరస్సులుంటాయి.

గర్భస్థశిశువుకు మూడవనెలలో చక్షువులు ఏర్పడతాయి. ఇప్పుడు ఆ శిశువుకు నోరు, ముక్కు, కనులు ఏర్పడ్డాయి. ఈ మూడు ఇంద్రియాలే మూడు శిరస్సులు. ఈ నెలలో గర్భిణి స్త్రీకి గుడాన్నము మంచి పౌష్టికాహారము. **మాసత్రయేణ పాదప్రదేశో భవతి.** గర్భస్థ శిశువుకు ఈ నెలలో కాళ్ళు చేతులు వస్తాయి.

## 505. స్వాధిష్ఠానాంబుజగతా

మూలాధార చక్రానికి కొద్దిగా పైభాగాన ఉంటుంది స్వాధిష్ఠానచక్రము. ఇది ఆరుదళాలు గల పద్మము. అగ్నితత్త్వాత్మకము. దీనికి అధిదేవత బ్రహ్మ. దీనిలోని ఆరుదళాలలోను బ నుంచి ల వరకు అక్షరాలుంటాయి. ఈ చక్రాధిష్ఠానదేవత 'సిద్ధేశ్వరి'.

## 506. చతుర్వక్త్రమనోహరా

ఈ దేవతకు నాలుగుముఖాలుంటాయి. ఈ ముఖాలనే శిరస్సులుగా కూడా తలంచవచ్చును.

## 507. శూలాద్యాయుధసంపన్నా

సిద్ధేశ్వరి అనే దేవతకు నాలుగుచేతులు ఉంటాయి. ఈ చేతులయందు శూలము, పాశము, కపాలము, అభయముద్రలు ఉంటాయి. అందుకనే ఈమె శూలాద్యాయుధ సంపన్నా అనబడుతుంది.

## 508. పీతవర్ణా

ఈ దేవి పసుపుపచ్చని శరీరవర్ణము గలిగి ఉంటుంది.

## 509. అతిగర్వితా

ఈమె మహాసౌందర్యవతి. సౌందర్యము సంపదలతో కూడి అతిశయము కలది. కాబట్టి అతి గర్వితా అనబడుతుంది.

## 510. మేదోనిష్ఠా

తల లోపల ఉండే మెత్తని తెల్లని మాంసాన్నే మేదస్సు అంటారు. ఇదే మెదడు. ఈ సిద్ధేశ్వరీ దేవత మేదోధాతువు నందు ఉంటుంది. మేదస్సు కావలసినవారు **'ఓం మేదోనిష్ఠాయై నమః'** అని జపంచేసి ఆ దేవతను తృప్తిపరచినట్లైతే మేదస్సువృద్ధి అవుతుంది.

## 511. మధుప్రీతా

సిద్ధేశ్వరీదేవి మధువు అంటే తేనె యందు ప్రీతి గలది. తేనె మేదస్సును పెంచుతుంది. తేనె, నెయ్యి, పంచదారలను త్రిమధురములు అంటారు.

ఛాందోగ్యోపనిషత్తులోని మూడవఅధ్యాయంలో మధువిజ్ఞానం చెప్పబడింది. ఆదిత్యునియందు మధువును ఆరోపించి, ఆ విధంగా ఆదిత్యుణ్ణి ఉపాసించటమే మధువిద్య. దూరంగా ఆకాశంలో కనిపించేవాడు సూర్యుడు. అతడే దేవతలను తృప్తిపరచేవాడు. అందుచేతనే అతను దేవతలకు మధువువంటివాడు.

ప్రపంచమంతా ఈ సూర్యరశ్మి ప్రసరిస్తున్నది. అది ప్రసరించినంతమేర వృక్షసంపద అభివృద్ధి చెంది సస్యశ్యామలమవుతుంది. జీవజాలము జీవిస్తుంది. ఆ పరమేశ్వరియే సూర్యునిరూపంలో ఈ పని చేస్తున్నది. అందుకే ఆమె మధుప్రీతా అనబడింది.

## 512. బందిన్యాదిసమన్వితా

సిద్ధేశ్వరీదేవి ఈ పద్మము మధ్యలో ఉండగా బందిని మొదలైన దేవతాశక్తులు చుట్టూ ఉన్న ఆరు దళాలలోనూ ఉంటారు. వారు

| | | |
|---|---|---|
| 1. బందిని | 3. మహామాయ | 5. రమా |
| 2. భద్రకాళి | 4. యశస్విని | 6. లంబోష్ఠితా |

## 513. దధ్యన్నాసక్త హృదయా

దధ్యన్నమునందు ఆసక్తి గలది. దధ్యన్నము అంటే పెరుగుతో కలిపిన అన్నము.

**దధ్నా చాన్విత శుద్ధాన్నం లవణేన సమన్వితం**
**ఆర్ద్రమరీచి సంయుక్తం ధానక పత్ర సంయుతం**
**తథానాగరఖండాఢ్యం దధ్యన్నం చే త్ప్రకీర్తితమ్ ॥**

మంచి బియ్యంతో అన్నం వండి దానిలో పెరుగును కలపాలి. దానిలో మిరియాల పొడి, ఉప్పు, కరివేపాకులను కలిపి చేసే దాన్ని దధ్యన్నము అంటారు.

ఈ రకంగా తయారుచేసిన దధ్యన్నమునందు మక్కువ గలది.

## 514. కాకినీరూపధారిణీ

స్వాధిష్ఠానచక్రానికి అధిదేవత అయిన సిద్ధేశ్వరీదేవి యొక్క బీజము, శక్తి, కీలకము అన్నీ కకార సంకేతంగానే ఉంటాయి అందుచేత ఆమె కాకిని అనబడుతుంది.

యోగినీన్యాసంలో స్వాధిష్ఠానాన్ని వివరిస్తూ

**స్వాధిష్ఠానాఖ్యపద్మే రసదళలసితే వేదవక్త్రాం త్రినేత్రాం**
**హస్తాభ్యాం ధారయంతీం త్రిశిఖగుణకపాలాభయాం ఉన్మత్త గర్వాం**
**మేదోధాతు ప్రతిష్ఠాం అళిమదముదితాం బందినీ ముఖ్యయుక్తాం**
**పీతాం దధ్యోదనేష్టాం అభిమతఫలదాం కాకినీం భావయామః ॥**

ఆరు దళాలు గల స్వాధిష్ఠానచక్రంలో నాలుగు శిరస్సులు, మూడుకనులు గలిగి, చేతులయందు త్రిశూలము, పాశము, కపాలము, అభయముద్ర కలిగి, అతిశయించిన గర్వముకలదై మద్యముత్రాగి సంతసించుచున్నది. మేదస్సు అను ధాతువునందుండునది, బందిన్యాదిశక్తులతో పరివేష్ఠితమైన కాకినీ దేవిని ధ్యానించుచున్నాను.

**స్వాధిష్ఠాన దేవతా కాకినీయుక్త బ్రహ్మస్వరూపిణ్యంబా**
**శ్రీ పాదుకాంపూజయామి తర్పయామి నమః**

శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 39వ శ్లోకంలో స్వాధిష్ఠానచక్రాన్ని వివరిస్తూ

**తవ స్వాధిష్ఠానే హుతవహమధిష్ఠాయ నిరతం**
**తమీడే సంవర్తం జనని ! మహతీం తాంచ సమయాం**
**యదాలోకే లోకాన్ దహతి మహతీ క్రోధకలితే**
**దయార్ద్రా యా దృష్టి శ్శిశిరముపచారంరచయతి ॥**

స్వాధిష్ఠానము అగ్నిస్థానము. ఇక్కడ ఉండే అగ్నిని సంవర్తాగ్ని అంటారు. ఇక్కడ శివుడు సంవర్తాగ్నిరూపంలో లోకాలను దహించివేస్తుంటే, దేవి తన కరుణాదృక్కులతో ఆ లోకాలను శమింపచేస్తూ ఉంటుంది.

షట్చక్రనిరూపణంలో “స్వాధిష్ఠానము లింగస్థానంలో సింధూరపు రంగులో ఉంటుంది. దీని ఆరుదళాలలోను బంధిని మొదలైన శక్తులు విద్యుల్లతలలాగా ప్రకాశిస్తుంటాయి. దీనికి అధిదేవత బ్రహ్మ. బీజం - వం. ఈ మండలము అర్ధచంద్రాకారంలో ఉంటుంది.

సంతానోపనిషత్తులో “ఈ చక్రంలో సిద్ధేశ్వరీ దేవికి నాలుగుముఖాలుంటాయి. వీటినే నాలుగుశిరస్సులు అంటారు. గర్భస్థశిశువుకు ఈ నెలలో చెవులు ఏర్పడతాయి. ఇప్పుడు నోరు, ముక్కు, కన్ను, చెవి. ఈ నాలుగే ఆ దేవతముఖాలు.

**అధచతుర్థమాసే జఠరకటి ప్రదేశో భవతి**

ఈ సమయంలో పిండానికి ఉదరము, కటి ప్రదేశము ఏర్పడతాయి. ఈ మాసంలో గర్భిణీ స్త్రీకి మధువు మంచి ఆహారము. అది తల్లికి బిడ్డకి కూడా క్షేమము.

## 515. మూలాధారాంబుజారూఢా

దీన్నే ఆధారచక్రము అంటారు. మూల అంటే - గుదస్థానం. శరీరం అంతటికీ ఆధారమైన చక్రము గుదస్థానంలో ఉంటుంది. కాబట్టి దీన్ని మూలాధార చక్రము అంటారు. ఈ పద్మానికి నాలుగు దళాలుంటాయి. వాటిలో వ నుంచి స వరకు అక్షరాలుంటాయి. దీనికి అధిదేవత గణపతి ఈ చక్రంలో ఉండే దేవత సిద్ధ విద్యాదేవి.

దీనిలో పసుపురంగులో వర్తులాకారంలో భూమండలమున్నది. దానిమీద తెల్లని గుఱ్ఱం. ఆ గుఱ్ఱంమీద లం అనే బీజముంటుంది. ఇదే కుండలినీస్థానం. దీని మధ్యన విద్యుత్కాంతులతో త్రికోణముంటుంది. అందులో క్లీం బీజముంటుంది. ఆ బీజం మీద స్వయంభూలింగానికి మూడున్నర చుట్లుచుట్టుకుని సర్పాకారంలో కుండలినీశక్తి ఉంటుంది. ఇది గణపతిస్థానము.

## 516. పంచవక్త్రా

ఈ చక్రాధిష్ఠానదేవత అయిన సిద్ధవిద్యాదేవికి ఐదుముఖాలుంటాయి. అవే ఐదుతలలు. ఈ ఐదుతలలే సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానులు.

## 517. అస్థిసంస్థితా

సిద్ధ విద్యాదేవత అస్థి ధాతువు నందు ఉంటుంది. ఎముకలు పుష్టిగాలేనివారు, ఎముకలు విరిగినవారు త్వరగా కోలుకోవాలంటే **'ఓం అస్థి సంస్థితాయై నమః'** అని జపం చెయ్యాలి.

## 518. అంకుశాది ప్రహరణా

సిద్ధ విద్యాదేవత తన నాలుగుచేతులయందు అంకుశము, కమలము, పుస్తకము, జ్ఞానముద్ర ధరించి ఉంటుంది.

## 519. వరదాదినిషేవితా

ఈ సిద్ధవిద్యాదేవి ఆధారచక్రంలోని మధ్యప్రదేశంలో ఉండగా, ఆమె చుట్టూ

1. వరద 2. శ్రీ 3. షండా 4. సరస్వతి

అనే శక్తులు పరివేష్టించి ఉంటాయి.

## 520. ముద్గౌదనాసక్తచిత్తా

ముద్గాన్నము అంటే – పెసరపప్పు కలిపి వండిన అన్నము. దీని తయారీ విధానము

**సుశాలితండుల ప్రస్థం తదర్ధముద్గభిన్నకం**
**చతుఃఫలం గుడం ప్రోక్తం తన్మానం నారికేళకం**
**ముష్టిమాత్రం మరీచం స్యా త్తదర్థం సైంధవం రజః**
**తదర్ధం జీరకం విద్యా త్కుడవం గోఘృతంవిదుః**

**గోక్షీరేణ స్వమాత్రేణ సంయోజ్యకమలాననే**

**మందాగ్నిపచనా దేవ సిద్ధాన్న మిదముత్తమమ్ ॥**

| | | |
|---|---|---|
| మంచి బియ్యం | – | ఒక శేరు |
| పెసరపప్పు | – | అర్ధశేరు |
| బెల్లం | – | పావుశేరు |
| కొబ్బరి | – | పావుశేరు |
| మిరియాలపొడి | – | గుప్పెడు |
| సైంధవలవణం | – | అరగుప్పెడు |
| జీలకర్ర | – | ఉప్పులో సగము |
| పాలు | – | సరిపోయినంత |
| నెయ్యి | – | కొద్దిగా |

వీటిని సన్నని మంటమీద ఉడికిస్తే వచ్చేదే ముద్గాన్నము.

ఈ రకంగా తయారుచేసిన ముద్గాన్నము లేక సిద్ధాన్నము నందు ఈ దేవికి మక్కువ ఎక్కువ.

## 521. సాకిన్యంబా స్వరూపిణీ

మూలాధార చక్రాధిదేవత అయిన సిద్ధవిద్యాదేవి యొక్క బీజము, శక్తి, కీలకము అన్నీ స కార సంకేతంగా ఉంటాయి. కాబట్టి ఈమెను సాకిని అంటారు. యోగినీన్యాసంలో ఆధారచక్రాన్ని వివరిస్తూ

**మూలాధారపద్మే శ్రుతిదళలసితే పంచవక్త్రాం త్రినేత్రాం**

**ధూమ్రాభాం అస్థిసంస్థాం సృణి మపి కమలం పుస్తకం జ్ఞానముద్రాం**

**భిభ్రాణాం బాహుదండై స్సులలితవరదాపూర్వశక్త్యావృతాం తాం**

**ముద్గాన్నాసక్త చిత్తాం మధుమద ముదితాం సాకినీం భావయామః ॥**

ఆధారచక్రంలో ఐదుముఖాలు మూడుకనులు కలిగి ధూమ్రవర్ణముతో నున్నది, ఎముకలు యందుండునది. అంకుశము, కమలము, పుస్తకము, జ్ఞానముద్ర చేతులయందు ధరించినది, ముద్గాన్నమునందు ఆసక్తి కలది అయిన సాకినీదేవికి నమస్కరిస్తున్నాను.

**మూలాధారాధిష్ఠాన దేవతాసాకినీయుక్త శ్రీగణపతి**
**స్వరూపిణ్యంబా శ్రీపాదుకాంపూజయామి తర్పయామి నమః**

శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 41వ శ్లోకంలో ఆధారచక్రాన్ని వివరిస్తూ

**తవాధారే మూలే సహ సమయయా లాస్యపరయా**
**నవాత్మానం మన్యే నవరస మహాతాండవ నటం**
**ఉభాభ్యామేతాభ్యా ముదయవిధి ముద్దిశ్య దయయా**
**సనాదభ్యాం జజ్ఞే జనక జననీమ జ్జగదిదమ్ ॥**

ఆధారచక్రంలోని శివాశివులకు భైరవీ భైరవులని లేదా నవాత్మ, నవాత్మకుడు అని పేర్లు. వీరిద్దరూ మంకెన్న పూలవంటి కాంతితో ప్రకాశిస్తుంటారు. శివుడు తాండవం చేస్తుండగా దేవి శృంగారంతో కూడిన నాట్యం చేస్తుంటుంది. అదే లాస్యం. వీరిద్దరూ జగత్తును సృష్టించే కార్యక్రమంలో నిమగ్నమై ఉంటారు.

**జపాకుసుమసంకాశౌ మధు ఘూర్ణితలోచనౌ**
**జగతః పితరౌవందే భైరవీ భైరవాత్మకౌ ॥**

మంకెన్నపూలవంటి శరీరచ్ఛాయగలిగి మధుపానముచే మత్తెక్కిన కనులు గలిగి, ఈ జగత్తుకు మాతాపితురులైన భైరవీ భైరవులకు నమస్కారము.

షట్చక్ర నిరూపణంలో "ఆధారచక్రం గుదస్థానానికి దగ్గరగా ఉంటుంది. దీనిలోని నాలుగదళాలు ఎరుపురంగులో ఉంటాయి. ఈ పద్మము మధ్యభాగంలో చతురస్రాకారమైన పృథివీమండలమున్నది. అది పీతవర్ణంలో ఉంటుంది.

**మూలాధారే ధరాచక్రం చతుష్కోణం ప్రియంవదే**
**పీతవర్ణం పరివృతం చాష్టశూలైః కులాచలైః ॥**

కులపర్వతాలే దీని ఎనిమిది దిక్కులయందు శూలములుగా ఉన్నాయి. దీనియందు లం పృథివీబీజమున్నది. ఇదే ఇంద్రబీజం. ఇది పచ్చనిరంగుతో పెద్దపెద్దచేతులతో వజ్రాయుధం ధరించి ఐరావతము ఎక్కి ఉంటుంది. దాని అంకభాగాన ఒక శిశువు ఉన్నాడు. అతడే ఇంద్రుడు అని యామళగ్రంథాలు చెబుతున్నాయి. ఇక్కడికి కొద్దిగా పైభాగన స్వయంభూలింగానికి మూడున్నరచుట్లుచుట్టుకుని కుండలినీశక్తి నిద్రిస్తూ, తన ముఖంచేత బ్రహ్మరంధ్రాన్ని కప్పి ఉంచుతుంది.

సంతానోపనిషత్తులో “ఇక్కడ సిద్ధవిద్యాదేవి ఐదుముఖాలతో ఉంటుంది. గర్భస్థశిశువుకు ఈ నెలలో చర్మము ఏర్పడుతుంది. **పంచమేమాసే పృష్ఠవంశోభవతి** ఐదవనెలలో బిడ్డకు వెన్నెముక ఏర్పడుతుంది. గతంలో

| | | |
|---|---|---|
| మొదటినెలలో | – | నోరు |
| రెండవనెలలో | – | ముక్కు |
| మూడవనెలలో | – | కనులు |
| నాల్గవనెలలో | – | చెవులు |
| ఐదవనెలలో | – | చర్మము |

ఏర్పడి పంచేంద్రియ స్ఫూర్తి కలుగుతుంది. గర్భిణీ స్త్రీకి ఈ సమయంలో ముద్గాన్నము మంచి ఆహారము.

## 522. ఆజ్ఞాచక్రాబ్జనిలయా

భ్రూమధ్యభాగంలో రెండుదళాలు కలిగి ఉన్న స్థానాన్ని ఆజ్ఞాచక్రము అంటారు. ఈ చక్రానికి అధిదేవత సదాశివుడు. ఈ చక్రంలో సిద్ధమాతా అనే దేవత ఉంటుంది. ఆమెకు ఆరుముఖాలుంటాయి. ఈ పద్మము యొక్క రెండు దళాలలోనూ హకార క్షకారాలుంటాయి.

ఇది గంగ యమున సరస్వతిల సంగమస్థానము. ఇడ పింగళ సుషుమ్నల సంగమస్థానము. కూటత్రయము, మండలత్రయము, ఖండత్రయముల సమాప్తిస్థానము.

| | | |
|---|---|---|
| కూటత్రయము | – | వాగ్భవకూటమి, కామరాజకూటమి, శక్తికూటమి |
| ఖండత్రయము | – | చంద్రఖండము, సూర్యఖండము, అగ్నిఖండము |
| మండలత్రయము | – | చంద్రమండలము, సూర్యమండలము, అగ్నిమండలము, |

ఇది త్రిపురానివాసస్థానము. అన్ని ఇంద్రియాలకు ఇక్కడి నుంచే ఆజ్ఞలు జారీచేయబడతాయి. కాబట్టి దీన్ని ఆజ్ఞాచక్రము అంటారు. ఇది ఆత్మస్థానము.

## 523. శుక్లవర్ణా

సిద్ధమాత అనే ఈ దేవి తెల్లనిరంగులో ఉంటుంది.

## 524. షడాననా

సిద్ధమాతకు ఆరుముఖాలుంటాయి. వాటినే ఆరు శిరస్సులు అంటారు. ఇది కుమారస్వామి శక్తిగా భావించవచ్చు.

## 525. మజ్జాసంస్థా

ఈ సిద్ధేశ్వరీదేవత మజ్జ యందుంటుంది. మజ్జ అంటే – ఎముకల యందు ఉండే గుజ్జులాంటి పదార్ధము. **'ఓం మజ్జాసంస్థాయై నమః'** అని జపం చేస్తే మజ్జ అనే పదార్ధం లోపించిన వారికి అది కలుగుతుంది.

## 526. హంసవతీముఖ్యశక్తిసమన్వితా

సిద్ధమాత అనబడే ఈ దేవత ఆజ్ఞాచక్ర కర్ణికలో ఉండగా రెండు దళాలయందు హంసవతీ క్షమావతి అని రెండు శక్తులు పరివేష్టించి ఉంటాయి. ఈ రెండు శక్తులే ఉచ్ఛ్వాసనిశ్వాసలు.

## 527. హరిద్రాన్నైకరసికా

హరిద్రాన్నమునందు ప్రీతి గలది.

**మరీచీ రజనీచూర్ణై ర్జీరకాద్యైశ్చ సంయుతం**
**ఆజ్యేన సంప్లుతం దేవి ! హరిద్రాన్న మితీరితమ్**

ఈ విధంగా తయారుచేసిన దాన్ని 'పులిహోర' అంటారు. హరిద్రాన్నమునందు సిద్దమాతకు మక్కువ ఎక్కువ.

## 528. హాకినీరూపధారిణీ

ఆజ్ఞాచక్రాధిష్ఠానదేవత అయిన సిద్ధమాత యొక్క మంత్రానికి శక్తి, బీజము, కీలకము అన్నీ హకార సంకేతంగా ఉంటాయి కాబట్టి ఈమెను హాకినీ అంటారు.

యోగినీన్యాసంలో

**భ్రూమధ్యే బిందుపద్మే దళయుగకలితే శుక్లవర్ణాం కరాబ్జైః**
**బిభ్రాణాం జ్ఞానముద్రాం డమరుక మక్షమాలాం కపాలం**

**షడ్వక్త్రాధారమధ్యాం త్రినయనలసితాం హంసవత్యాదియుక్తాం**

**హరిద్రాన్నైకరసికాం సకలశుభకరీం హాకినీం భావయామః ॥**

కనుబొమల మధ్య రెండు దళములు గల పద్మమున్నది. ఆ పద్మమునందు హాకినీ దేవత ఉంటుంది. ఆమె చేతులలో జ్ఞానముద్ర, డమరుకము, అక్షమాల, కపాలము ధరించి ఉంటుంది. హాకినీ దేవతకు మూడుకనులు, ఆరు తలలు ఉంటాయి. ఆమెకు హరిద్రాన్నమునందు ప్రీతి ఎక్కువ.

**ఆజ్ఞాచక్రాధిష్ఠానదేవతా హాకినీయుక్త సదాశివ**

**స్వరూపిణ్యంబా శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః**

శంకరభగవత్పాదులవారు సౌందర్య లహరిలోని 36వ శ్లోకంలో ఆజ్ఞాచక్రాన్ని వివరిస్తూ

**తవాజ్ఞాచక్రస్థం తపనశశికోటిద్యుతిధరం**

**పరం శంభుం వందే పరమిళిత పార్శ్వం పరచితా**

**యమారాధ్యన్ భక్త్యా రవి శశి శుచీనామవిషయే**

**నిరాలోకేలోకే నివసతి హి భాలోకభువనే ॥**

ఆజ్ఞాచక్రంలో శివాశివులు కోట్లకొలది సూర్యచంద్రులకాంతులతో ప్రకాశిస్తూ ఉంటారు.

లక్ష్మీధరుడు తన కర్ణావతంస స్తుతిలో

**ఆజ్ఞాత్మక ద్విదళ పద్మగతే తదానీం**

**విద్యున్నిభే రవిశశి ప్రయుతోత్కటాభే**

**గండస్థలప్రతిఫల త్కరదీప జ్వాల**

**కర్ణావతంసకలికే కమలాయతాక్షి ! ॥**

ఆజ్ఞా చక్రమనబడే రెండుదళములు గల పద్మమందున్న ఓ దేవీ ! మెరుపుతీగవలె కోట్లకొలది సూర్యచంద్రులకాంతులతో ప్రకాశిస్తున్నావు. షట్చక్రనిరూపణంలో "ఆజ్ఞాచక్రము అనేది గురువు యొక్క ఆజ్ఞలు లభించే స్థానము. ఇక్కడ నుంచే శరీరంలోని వివిధభాగాలకు ఆజ్ఞలు జారీచేయబడతాయి. ఇక్కడ ఓంకారాన్ని ధ్యానించేవాడు జ్ఞాని అవుతాడు. సర్వజ్ఞుడై సర్వదర్శి అయిన మునీంద్రుడవుతాడు. ఈ చక్రము కర్ణికలో త్రికోణమున్నది. ఈ

త్రికోణంలో ప్రణవానికి ఆధారమైన అకార ఉకారాలుంటాయి. దానిమీద బిందురూపంలో మకారముంటుంది. సంతానోపనిషత్తులో

**షష్ఠేమాసి నాసాక్షిశ్రోత్రాణి భవంతి**

ఆరవనెలలో గర్భస్థశిశువుకు ముక్కు, చెవులు, కనులు మొదలైన అవయవసౌష్టవం ఏర్పడుతుంది. ఈ నెలలోనే మనస్సుకూడా ఏర్పడుతుంది. అదే ఆరవ అవయవము. అందుచేతనే సిద్ధమాతకు ఆరు తలలుంటాయి. ఈ సమయంలో గర్భిణీస్త్రీకి హరిద్రాన్నము మంచి ఆహారము.

## 529. సహస్రదళపద్మస్థా

షట్చక్రాలకు పైన బ్రహ్మరంధ్రం దగ్గర సహస్రదళపద్మమున్నది. ఇందులో ఎనిమిది దిక్కులకు ఎనిమిది దళాలుంటాయి. ఒక్కొక్క దళంలోనూ 125 చిన్నచిన్న దళాలుంటాయి. ఈరకంగా మొత్తం వేయిదళాలుంటాయి. అందుకే దీన్ని సహస్రదళపద్మము అంటారు. ఇక్కడ ఉండేవాడు పరమేశ్వరుడు. ఈ చక్రానికి అధిదేవతగా ఉండేవాడు పరమేశ్వరుడు. ఈ చక్రానికి అధిదేవత యశస్విని. ఇక్కడ సహస్రదళాలలోను అన్ని రంగులు, అన్ని అక్షరాలు ఉంటాయి. ఇది పరమాత్మస్థానము. సహస్రదళంలో వేలకొలది సూర్యకాంతులు ప్రసరిస్తూ ఉంటాయి. యోగీశ్వరులకు ఇక్కడే ఆత్మదర్శనమవుతుంది. అంటే స్వస్వరూపజ్ఞానం కలుగుతుంది. ఇది జీవాత్మ పరమాత్మల సంగమస్థానం.

## 530. సర్వవర్ణోపశోభితా

సహస్రారంలో యశస్విని అనే ఈ దేవత అన్ని వర్ణములు అంటే రంగులతోనూ ప్రకాశిస్తుంటుంది. అన్ని అక్షరములతోనూ ప్రకాశిస్తుంటుంది. పైన చెప్పిన షట్చక్రాలలోను అక్షరాలు విడివిడిగా ఉంటాయి అని చెప్పాం. కాని ఇక్కడ అ నుంచి క్ష వరకు అన్ని అక్షరాలు ఉంటాయి.

**సర్వవర్ణే మహాదేవీ సంధ్యావిద్యేసరస్వతీ**

## 531. సర్వాయుధధరా

ఇంతవరకు చెప్పిన చక్రాలలో దేవతలు తమ నాలుగుచేతులయందు ఆయుధాలు ధరించి ఉంటారు. కాని ఇక్కడ ఉండేది పరమేశ్వరి. ఆవిడకు అనేక చేతులు ఉంటాయి. **సహస్రాణి సహస్రధా బాహువోస్తవమేతయః** కాబట్టి అన్ని చేతులయందు అన్నిరకాల ఆయుధాలు ధరించి ఉంటుంది. ఆమె చేతిలో లేని ఆయుధం లోకంలో లేనేలేదు.

## 532. శుక్లసంస్థితా

ఈ దేవత సర్వధాతుసారమైన శుక్లమందుంటుంది. ఇది శరీరమంతా వ్యాపించి ఉండే ధాతువు. కాబట్టి ఈ దేవత జీవకోటి శరీరమంతా వ్యాపించి ఉంటుంది.

ధాతుపుష్టి లేని వాళ్ళు ఓం శుక్ల సంస్థితాయై నమః అని జపం చేస్తే ధాతువృద్ధి కలుగుతుంది.

ఇప్పటి దాకా

**1. ఓం త్వక్కుస్థాయై నమః**
**2. ఓం రుధిరసంస్థితాయై నమః**
**3. ఓం మాంసనిష్ఠాయై నమః**
**4. ఓం మేధోనిష్ఠాయై నమః**
**5. ఓం అస్తి సంస్థితాయై నమః**
**6. ఓం మజ్జా సంస్థాయై నమః**
**7. ఓం శుక్ల సంస్థితాయై నమః**

అని మంత్రాలు చెప్పటం జరిగింది. వీటికి

**వశిన్యాది వాగ్దేవతాఋషిః । అనుష్టుప్ఛందః । శ్రీ లలితాత్రిపురసుందరీ దేవతా । ఐం బీజం । సౌం శక్తిః । క్లీం కీలకం । జపే వినియోగః**

**న్యాసము : ఐం । క్లీం । సౌః । సౌః । క్లీం ః । ఐం**

**ధ్యానము : సకుంకుమవిలేపనా.........**

## 533. సర్వతోముఖీ

ఈ దేవతకు అన్నివైపులా ముఖాలుంటాయి. **సహస్రశీర్షాపురుషః సహస్రాక్షస్స హస్రపాత్** పరమేశ్వరుడికి కొన్నివేల తలలు ఉంటాయి. అంటే ప్రపంచంలోని జీవరాశి అంతా పరమేశ్వరి స్వరూపమే. అందుకే అన్ని జీవుల యొక్క శిరస్సులూ ఆ దేవతకుంటాయి. ఇదే విశ్వరూపము. విశ్వుడు ప్రపంచంలోని జీవరాశికంతటికీ ప్రతీక. అకారాది క్షకారాంతము సర్వదేవతలు ఇక్కడ పరమేశ్వరిరూపంలో ఉంటారు. అందుకే ఈ దేవి అన్నివైపులకూ ముఖాలుంటాయి. కాబట్టే ఈమె సర్వతోముఖీ అనబడింది.

## 534. సర్వౌదనప్రీతచిత్తా

అన్నిరకాలయిన ఆహారములందు ఈమెకు ప్రీతి ఉంటుంది. ప్రపంచంలోని సకల జీవరాశి రూపము ఈ పరమేశ్వరియే. అందుకే అన్ని జీవుల తలలు ఈమెకు ఉన్నాయి. అలాగే అన్నిరకాల ఆహారపదార్థాలను కూడా ఈ దేవి ప్రేమగానే స్వీకరిస్తుంది.

మనం కూడా అన్నాన్ని ఎప్పుడూ ఉపేక్షించరాదు. **అన్నంననింద్యాత్** అన్నాన్ని నిందించరాదు. అన్నము పరబ్రహ్మస్వరూపము అని అందుకే చెబుతారు.

## 535. యాకిన్యంబాస్వరూపిణీ

యశశ్వినీ అనబడే ఈ దేవత యొక్క బీజము, శక్తి, కీలకము అన్నీ యకార సంకేతముగానే ఉంటాయి. అందుకే ఆమెను యాకినీ అంటారు.

యోగినీన్యాసంలో

**ముండవ్యోమస్థపద్మే దశశతదళకే కర్ణికా చంద్ర సంస్థాం**
**రేతోనిష్ఠాం సమస్తాయుధకలితకరాం సర్వతోవక్త్ర పద్మాం**
**ఆదిక్షాంతార్ణశక్తి ప్రకటపరివృతాం సర్వవర్ణాం భవానీం**
**సర్వాన్నాసక్తచిత్తాం పరశివరసికాం యాకినీం భావయామః ॥**

బ్రహ్మరంధ్రం దగ్గర సహస్రదళపద్మమున్నది. దాని కర్ణికలో అన్నిరకాల ఆయుధాలు ధరించి అన్నివైపులకు ముఖములు కలిగి, సర్వవర్ణములతోను ప్రకాశించునది, అన్నిరకాలైన ఆహారములందు ప్రీతి కలది, శుక్లమునందు ఉండునది అయిన యాకినీ అనే దేవత ఉన్నది.

**యోఽహమస్మి బ్రహ్మోహమస్మి । అహమస్మి బ్రహ్మోహమస్మి ।**
**తత్త్వమసి । బ్రహ్మోహమస్మి । సోహం బ్రహ్మోహమస్మి । ఓం**
**బ్రహ్మో హ మస్మి । ఆత్మైవేదగ్ం సర్వం । బ్రహ్మై వేదగ్ం**
**సర్వం । సర్వమేతద్బ్రహ్మ । సర్వం ఖిల్విదం బ్రహ్మ ।**
**బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి ॥**

షట్చక్రనిరూపణంలో "ఆజ్ఞాచక్రం దాటిన తరువాత యోగి మహానాదాన్ని దర్శిస్తాడు. అతడికి వాక్సిద్ధి కలుగుతుంది. సహస్రదళము పూర్ణచంద్రునిలాగా ప్రకాశిస్తుంటుంది. దానికిరణాలు సూర్యకిరణాలవలె కాంతివంతంగా, చంద్రకిరణాలవలె చల్లగా ఉంటాయి. ఇక్కడ అకారాది సర్వవర్ణములు ఉంటాయి. ఇది కేవలము ఆనందరూపమైనది. ఇది చంద్రమండలము. ఇక్కడ వృద్ధిక్షయాలు లేనివాడు, కళంకరహితుడు అయిన చంద్రుడుంటాడు. ఈ చంద్రమండలము మధ్యన మహాశూన్యమున్నది.

**తదంతః శూన్యం తత్సకల సురగణైః సేవితంచాతిగుప్తం**

ఆ మహాశూన్యాన్ని దేవతలు రహస్యంగా సేవిస్తుంటారు. ఆ శూన్యము చాలా రహస్యమైనది. అతి ప్రయత్నము మీదగాని దాన్ని పొందలేరు. అక్కడే పరమేశ్వరుడుంటాడు. ఆయన సర్వాత్మరూపి. అజ్ఞానము మోహము పోగొట్టి సాధకుడికి సుధాధారలచే ఆత్మజ్ఞానం కలిగిస్తాడు. అప్పుడు సాధకుడు జీవాత్మ పరమాత్మల సమైక్యము సాధించి పరమహంస అవుతాడు.

**శివస్థానంశైవాః పరమపురుషం వైష్ణవగణాః**
**లపంతీతిప్రాయో హరిహరపదం కేచిదపరే ।**
**పదం దేవ్యా దేవీచరణయుగళాం భోజరసికా**
**మునీనా మప్యంతే ప్రకృతి పురుషస్థాన మమలం ॥**

ఈ ప్రదేశాన్ని శివస్థానమని శైవులు, పరమపురుషస్థానమని వైష్ణవులు, దేవీస్థానమని శాక్తేయులు, హరిహరస్థానమని కొందరు, ప్రకృతి పురుష స్థానమని మరికొందరు అంటారు.

**ఇదం స్థానంజ్ఞాత్వా నియత నిజచిత్తో నరవరౌ**
**న భూయత్ సంసారే పునరపి న బుద్ధస్త్రిభువనే**
**సమగ్రాశాక్తః స్యాన్నియమ మనసస్తస్యకృతినః**
**సదాకర్తుం ఖగతిరపి వాణీసువిమలా ॥**

ఈ స్థానాన్ని తెలుసుకున్న సాధకుడికి పునర్జన్మలేదు. ఈ లోకంలో బంధం ఉండదు. పాపపుణ్యాలుండవు. సంసారబంధనాలుండవు. ఇష్టార్థసిద్ధి కలుగుతుంది. ఇక్కడకు చేరిన యోగికి సాయుజ్యం లభిస్తుంది. సంతానోపనిషత్తులో

**సప్తమేమాసే జీవసంయుక్తో భవతి ।**
**అష్టమేమాసే సర్వసంపూర్ణో భవతి । నవమే జీవతి ॥**

ఏడవమాసంలో జీవం ఏర్పడుతుంది. పూర్వజన్మలో చేసిన కర్మతో జీవుడు ఇందులో ప్రవేశిస్తాడు. ఎనిమిదవ మాసంలో శిశువుకు అన్ని అవయవాలు పూర్తిగా ఏర్పడతాయి. తొమ్మిదవ మాసంలో చలనం ఏర్పడుతుంది. గర్భిణీ స్త్రీ అన్నిరకాల ఆహారాలు భుజించవచ్చును.

## 536. స్వాహా

దేవతలకు యజ్ఞంలో హవిస్సు అందచేసేటప్పుడు 'స్వాహా' అనే శబ్దాన్ని ఉచ్చరిస్తారు.

**ఇంద్రాయస్వాహా - ఇంద్రాయ ఇదం న మమ**

**అగ్నయే స్వాహా - అగ్నయే ఇదం న మమ**

ఈ రకంగా స్వాహా శబ్దంతో దేవతలకు ఆహుతులు అర్పిస్తారు. అంటే అగ్నిలో వేసిన ఆ హవిస్సు స్వాహాదేవి ద్వారా దేవతలకు చేరుతుంది. దేవీ భాగవతంలో

బ్రహ్మదేవుడు లోకాలన్నీ సృష్టించిన తరువాత దేవతలంతా బ్రహ్మవద్దకు వచ్చి, విధాతా ! ఆకలి బాధకు తట్టుకోలేకుండా ఉన్నాము. దీనికి ఏదైనా ఒక ఉపాయం చెప్పు అని అడిగారు. దానికి బ్రహ్మ 'ఇలాంటి విషయాలు చెప్పటానికి స్థితికారకుడైన నారాయణుడున్నాడు. మీరు వెళ్ళి అతన్ని వేడుకోండి. తరుణోపాయం చూపిస్తాడు' అన్నాడు ప్రజాపతి సలహా మీద దేవతలందరూ వైకుంఠానికి వెళ్ళి శ్రీహరిని ప్రార్థించారు. అప్పుడు ఆ హరి 'దేవతలారా ! భూలోకంలో బ్రాహ్మణులు, క్షత్రియులు చేసే యజ్ఞ యాగాలకు సంబంధించిన హవ్యము మీ ఆకలిని పోగొడుతుంది. ఆ హవ్యము మీ పేరుచెప్పి అగ్నిలో వేస్తారు. కాబట్టి దాన్ని అగ్నిమూలంగా మీకు అందించే శక్తివేరే ఉన్నది. ఆ శక్తి కోసం మీరంతా ఆ పరదేవతను ప్రార్థించండి. ఆవిడ ప్రసన్నురాలైతే ఆ శక్తిని పంపుతుంది' అన్నాడు.

దేవతలంతా అత్యంత శ్రద్ధాభక్తులతో పరమేశ్వరిని ఆరాధించారు. దేవి వారి దీక్షకు మెచ్చి ఆ శక్తిని పంపించింది. బ్రహ్మ ఆ శక్తికి నమస్కరించి "తల్లీ ! నువ్వు అగ్నిదేవునికి దాహకశక్తివై, అతని యందు హోమం చేసిన హవ్యాన్ని దేవతలకు అందించు" అన్నాడు. దానికి ఆ శక్తి "నేను శ్రీహరికి తప్ప ఇతరులకు చెందను. అగ్నికి దాహకశక్తిగా ఉండను' అని చెప్పి వెళ్ళి విష్ణుమూర్తిని గురించి తపస్సు చెయ్యటం ప్రారంభించింది.

కొంతకాలానికి హరి ప్రత్యక్షమై "దేవీ ! నీ మనసు నాకర్థమయింది. మరుజన్మలో నగ్నజిత్తు అనే రాజుకు నాగ్నజితిగా పుట్టి, నా అంశతోపుట్టిన శ్రీకృష్ణుని వివాహమాడు కాని ఇప్పుడు మాత్రం స్వాహ అనే పేరుతో అగ్నిదేవునికి ఇల్లాలివై, అతనికి దాహకశక్తివై ఉండు" అన్నాడు. స్వాహాదేవి విష్ణుమూర్తి మాటలకు ఒప్పుకుంది. అగ్నికి స్వాహాదేవికి వివాహమయింది. వారికి ముగ్గురుపిల్లలు కలిగారు. వారే

1. ఆహవనీయాగ్ని 2. గార్హ పత్యము 3. దక్షిణాగ్ని ఈ రకంగా స్వాహాదేవి అనుగ్రహంవల్ల దేవతల ఆకలిబాధ తీరింది. అని చెప్పబడింది. కాబట్టి స్వాహాదేవి అగ్నిదేవుని దాహకశక్తి. యజ్ఞంలో దేవతలకర్పించిన హవిస్సులను దేవతలకు చేరుస్తుంది.

మార్కండేయపురాణంలో "ఓ దేవీ ! నీ నామాన్ని ఉచ్చరించటం వల్ల దేవతలందరూ తృప్తి చెందుతున్నారు. యాగాలు అన్నింటిలోనూ స్వాహా అనే నామాన్ని ఉచ్చరిస్తే చాలు దేవతలు ప్రీతి చెందుతారు" అని చెప్పబడింది.

అగ్నిదేవుణ్ణి ప్రార్థించేటప్పుడు **స్వాహాంతు దక్షిణే పార్శ్వే** అంటాము. అంటే అగ్నిదేవుని దక్షిణభాగంలో స్వాహాదేవి ఉంటుంది.

పద్మపురాణంలో మహేశ్వరపుర పీఠాధిష్ఠాన దేవత స్వాహాఅనే పేరు గలది అని చెప్పబడింది.

## 537. స్వధా

పితృదేవతలకు తర్పణలు అర్పించేటప్పుడు కుడిచేతి బొటనవేలు కిందికి ఉంచి నువ్వులు నీళ్ళు వదులుతూ స్వధాంతర్పయామి, స్వధాంతర్పయామి, స్వధాంతర్పయామి. అంటారు. ఆ వదిలిన తర్పణ స్వధాదేవి ద్వారా పితృదేవతలకు చేరుతుంది. దేవీభాగవతంలో 'పితృదేవతలకు సిద్ధకర్మలలో తర్పణద్వారా ఆహారం లభించేటట్లు చేశాడు బ్రహ్మ. కాని వారికి అది సక్రమంగా అందటంలేదు. పితృదేవతలు వారి బాధలు బ్రహ్మకు చెప్పుకున్నారు. వారి కష్టాలు తీర్చటానికి బ్రహ్మ 'స్వధా అనే కన్యను సృష్టించాడు. ఆమె అపురూప సౌందర్యరాశి. ఈమెను పితృదేవతలకు సమర్పించాడు.

శ్రాద్ధకర్మలలో పితృదేవతలకు సమర్పించిన తర్పణలను సవ్యంగా వారికి అందించటమే ఈమెపని.

దేవీవామే స్వధాంతథా అగ్నిదేవుడికి స్వాహాదేవి కుడి ప్రక్కన ఉంటే స్వధాదేవి ఎడమ ప్రక్కన ఉంటుంది.

## 538. అమతిః

అమతి – అజ్ఞానము. అవిద్యాస్వరూపము మొట్టమొదటిగా సృష్టి అవ్యక్తము. మూలప్రకృతి.

## 539. మేధా

మేధ అంటే – బుద్ధి అని అర్థం. సకలశాస్త్రసారమైనది మేధ. సర్వభూతాలయందు ఆ పరమేశ్వరి మేధారూపంలో ఉన్నది.

కాశ్మీరుమండలంలో మేధాదేవి పూజింపబడుతున్నది అని పద్మపురాణంలో చెప్పబడింది.

## 540. శ్రుతిః

వేదరూపిణి

**ఋచో యజూగ్ంషి సామాని త ద్దైవాథర్వణానిచ**

**బ్రాహ్మణ స్సహజం రూపం నిత్యైషా శక్తి రవ్యయా ॥**

గురుశిష్య పరంపరంగా వచ్చినది. ఒకరు చెప్పుట వలన ఇంకొకరికి ఇలా ఒకరి నుంచి ఒకరికి పారంపర్యంగా వచ్చే విద్య. ఋగ్ యజు స్సామ అధ్వరణ వేదాలు శ్రుతులనబడతాయి. పరమేశ్వరి వేదమాత. సృష్టాదికాలంలో వేదాలను సృష్టించి బ్రహ్మదేవుడికిచ్చింది. ఆమె యొక్క ఉచ్ఛ్వాసనిశ్వాసలే వేదాలు. అందుకే ఆమె శ్రుతి అనబడుతోంది.

## 541. స్మృతిః

మన్వాదిస్మృతులరూపం కలిగినటువంటిది. వేదాలు స్మృతులు కూడా ఆ పరమేశ్వరి రూపాలే. ఆ దేవి శ్రవణస్మరణాత్మకమైన రూపము గలది. స్మరించుటయే దేవి యొక్క స్మృతి అని దేవీపురాణంలో చెప్పబడింది. ఎప్పుడూ పరమేశ్వరి నామాన్ని విడవకుండా చెయ్యటమే స్మృతి అనబడుతుంది.

వేదాలన్నీ బాగా ప్రచారమయిన తరువాత, ప్రతివారూ వేదాలను చదవలేరు. చదివినా అర్థం చేసుకోలేరు కాబట్టి, వేదాలసారాన్ని మనువు, పరాశరుడు, యాజ్ఞవల్క్యుడు మొదలైనవారు స్మృతులును వ్రాశారు. శ్రుతిపూర్వకమైన వాటి మననరూపమే స్మృతి.

సర్వజీవుల యొక్క భూతభవిష్యద్వర్తమానాలనన్నింటినీ ఆ పరమేశ్వరి స్మృతి పథంలో ఉంచుకుంటుంది. కాబట్టి 'స్మృతి' అనబడుతుంది.

# 542. అనుత్తమా

పరమేశ్వరికన్న ఉత్తమమైన వస్తువు ఏదీలేదు. అందుచేత ఆమె 'అనుత్తమా' అనబడుతుంది. వేదంలో పరమేశ్వరునితో సమానమైన వారుకాని, అతని కన్న అధికులుగాని లేరు" అని చెప్పబడింది.

దేవీ భాగవతంలో జనులు బలములేనివాడిని శక్తిహీనుడు అంటున్నారు కాని విష్ణుహీనుడు, రుద్రహీనుడు అనటంలేదు" అని చెప్పారు.

అందరికన్న ఉత్తమమైనది సర్వోత్తతమమైన దేవత.

ఈ రకంగా 542వ నామం వరకూ షట్చక్రాలను వివరించి, సహస్రారంలో ఉండే దేవత యశస్విని. ఆమె యాకిని అనే పేరుతో పిలువబడుతుంది. ఆమె అనంతమైనది శాశ్వతమైనది. దేవతలకు హవిస్సులర్పించే స్వాహాదేవి ఆమె. పితృదేవతలకు తర్పణలందించే స్వధాదేవి ఆమె. జగత్తుకు మూలకారణమైన మూలప్రకృతి ఆమె. ఆ దేవతయే బుద్ధి. వేదమాత, శ్రుతులు స్మృతులు కూడా ఆమెయే. ఈరకంగా ఆమె ఉత్తమమైనది. ఆమెకన్న అధికులుగాని, ఆమెతో సములుగానిలేరు అని చెప్పబడింది.




శ్రీ 'ఖ'కార దేవి

# 37. విమర్శరూపిణీవిద్య

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ సృష్టి ప్రారంభం కాకముందు, గతంలో జరిగిన కల్పంలో కర్మ పరిపక్వం కాకుండా తనలో లీనమైపోయినటువంటి జీవులయొక్క కర్మను పరిపక్వం చేసి, వాటికి మోక్షం కలిగించాలనే ఉద్దేశ్యంతో తనలో నుంచి కొంతశక్తిని బయటకు పంపాడు. అదే విమర్శశక్తి. అయితే బిందురూపుడయిన పరబ్రహ్మ నుంచి కొంతభాగము బయటకు వచ్చినట్లైతే, అతని యొక్క బిందుత్వానికి ముప్పు వాటిల్లదా అనేది సందేహం. అలా జరగదు. ఎందుకంటే

**పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమేవావ శిష్యతే ॥**

పూర్ణస్వరూపుడయిన పరబ్రహ్మ నుంచి అనంతమైన విశ్వం బయటకు వచ్చినప్పటికీ, పరబ్రహ్మ యొక్క పూర్ణత్వానికి హానిరాదు.

సున్నాలో నుంచి సున్నా తీసి వేసినా, లేక సున్నాకు సున్నా కలిపినా సున్నాయే ఉంటుంది. అంతేకాని దాని విలువమారదు.

ఈరకంగా పరబ్రహ్మ నుంచి బయటకు వచ్చినదే శక్తి. అదే విమర్శరూపము. పరమేశ్వరుడు ప్రకాశరూపము. వీరిద్దరే ప్రకాశవిమర్శాంశలు. శివశక్తులు, కామేశ్వరీ కామేశ్వరులు. ప్రకాశాంశ అవ్యక్తము. విమర్శాంశ వ్యక్తము. శ్రీవిద్యలో బిందువు ప్రకాశాంశ. త్రికోణము విమర్శాంశ. ఈ రెండూ ఎప్పుడూ కలిసే ఉంటాయి. విడివిడిగా ఉండవు అందుకే

**త్రికోణరూపిణీశక్తిః బిందురూపపర శ్శివః**

శక్తి త్రికోణము కాగా బిందువు శివుడు

ఈ త్రికోణంనుంచే నామరుపాత్మకమైన జగత్తు ఏర్పడింది.

ఇక శ్రీవిద్యలో చూసినట్లైతే సృష్టి ప్రారంభమైన తరువాత, శ్రీవిద్యను లోకంలో ప్రచారం చెయ్యాలనే ఉద్దేశ్యంతో పరమేశ్వరుడు, తనలో నుంచి బయటకు వచ్చినటువంటి ఆత్మస్వరూపమైనటువంటి పరమేశ్వరికి శ్రీవిద్యను మొట్టమొదటగా ఉపదేశించాడు. వీరిద్దరే ప్రకాశాంశ విమర్శాంశలు. శివ శక్తులు. ఆ తరువాత పరమేశ్వరి నుండి పరంపరగా శ్రీవిద్య ఉమామహేశ్వరులకు, వారి నుండి లక్ష్మీనారాయణులకు, వారి నుండి వాణీ

హిరణ్యగర్భులకు, వారి నుండి ఇంద్రాది దేవతలకు, వారి నుండి సనక సనందనాది ఋషులకు, వారి నుండి విద్యారణ్యుడు, గౌడపాదుడు మొదలైన మానవులకు శ్రీవిద్య సంక్రమించింది.

మొత్తం మీద చూసినట్లైతే పరమేశ్వరుడు ప్రకాశాంశ. పరమేశ్వరి విమర్శాంశ. వారిద్దరూ వేరుకాదు. ఇద్దరూ ఒకటే. అదే అర్ధనారీశ్వరతత్త్వము.

లలితాసహస్రంలో 543 నుంచి 559 వరకు నామాలలో విమర్శరూపిణీ విద్య వివరించబడింది. దీన్నే కాత్యాయనీవిద్య అని కూడా అంటారు.

ఆ దేవతను కీర్తించినా, ఆవిడగాథలను శ్రవణం చేసినా పుణ్యమే. పూర్వజన్మల సుకృతం ఉంటేనే ఆమెకు నమస్కరించటమైనా జరుగుతుంది. ఆ దేవిని అర్చించినట్లైతే ఇహలోక బంధనాలు తెగిపోతాయి. ఆమె వేదస్వరూపిణి. స్థావరజంగమాత్మకమైన జగత్తుకు మాతృక. ఆమె భక్తులకు వ్యాధులు రావు. అపమృత్యువుండదు. కలియుగంలో వచ్చే పాపాలన్నింటినీ ఆమె నసింపచేస్తుంది. ఇక నామాలను చూద్దాం.

## 543. పుణ్యకీర్తిః

**పుణ్యా పుణ్యప్రదా కీర్తి ర్యస్యాః – సా**

పుణ్యమైన కీర్తి గలది. పుణ్యాన్ని ఇచ్చేటటువంటి కీర్తి గలది. పరమేశ్వరి పుణ్యదాయిని. ఆ దేవి తన భక్తులకు పుణ్యాన్ని పంచి పెడుతుంది. శ్రీవిద్య యొక్క ఉపాసన, శ్రీచక్రపూజ, అర్చన, లలితాసహస్రపారాయణ, పంచదశి, షోడశిమంత్రజపము అతి పుణ్యప్రదాలు. ఇవి పరమేశ్వరి భక్తులకు ముక్తిని ప్రసాదిస్తాయి. జ్ఞానాన్ని ప్రసాదిస్తాయి. దేవతలందరిలోకి ఆ పరమేశ్వరియే ఉత్తమమైనది. అంతకన్న అధికులు ఎవరూలేరు. కాబట్టి తన భక్తులకు ఎక్కువ పుణ్యఫలాన్ని అందించేశక్తి ఆ పరమేశ్వరికి తప్ప వేరెవరికీలేదు. అందుచేతనే ఆమె పుణ్యకీర్తి అనబడుతోంది.

## 544. పుణ్యలభ్యా

పుణ్యము చేత మాత్రమే పొందతగినది. పరమేశ్వరిని దర్శించటమనేది సామాన్యవిషయంకాదు. మానవుడి యొక్క పూర్వజన్మలకర్మఫలితాన్ని బట్టి ఉంటుంది. గతంలో చెప్పినట్లుగా పరమేశ్వరిని అర్చించాలన్నా, ఆరాధించాలన్నా, కూడా గతజన్మలో చేసిన సుకృతం ఉండాలి. అలాగే ఆవిడ మంత్రాన్ని జపం చెయ్యాలంటే అర్వాణచక్రం

వేసి చూస్తే అందులో సిద్ధము, సాధము, సుసిద్ధము అని వస్తాయి అని గతంలో వివరించాము. గత జన్మలలో ఆ దేవిని బాగా అర్చించి ఉంటే, జపం బాగా చేసి ఉంటే, అనగా శ్రీవిద్యలో నిష్ణాతుడై ఉంటే, ఈ జన్మలో అతడికి శ్రీవిద్య సుసిద్ధమవుతుంది. అలాగే మిగిలినవి కూడా.

గతజన్మలోని కర్మలఫలితంగానే మోక్షసాధనాలు సమకూరతాయి. వాటిని గతంలో వివరించాం. కాని మళ్ళీ ఒక్కసారి గుర్తుచేస్తున్నాం. మోక్షసాధనాలు నాలుగు. అవి

1. నిత్యానిత్యవివేకము
2. వైరాగ్యము
3. షట్సంపత్తి
4. ముముక్షుత్వము

ఈ లక్షణాలు కావాలంటే ఉపాసనలో సాదకుడు నిష్ణాతుడు కావాలి. దీనికి జన్మజన్మల సుకృతం ఉండాలి.

అందుకే పరమేశ్వరిని అర్చించాలంటే గతజన్మలో చేసిన సుకృతం ఉండాలి అంటాడు శంకరభగవత్పాదులు తమ సౌందర్య లహరిలోని మొదటి శ్లోకంలో

**శివ శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం**
**న చే దేవం దేవో న ఖలు కుశలః స్పందితు మపి**
**అత స్త్వా మారాధ్యాం హరిహర విరంచాదిభిరపి**
**ప్రణన్తుం స్తోతుంవా కథ మకృతపుణ్యఃప్రభవతి**

ఓ తల్లీ ! సర్వమంగళకారుడైన శివుడు కూడా జగన్నిర్మాణశక్తివైన నీతో కూడనిదే ఈ సృష్టిని చేయలేడు. కాబట్టి పూర్వజన్మ సుకృతం లేనివాడు హరిహర బ్రహ్మాదులచే అర్చించబడు నిన్ను స్మరించటానికి కూడా అనర్హుడే కదా ?

దేవీభాగవతంలో "వేదాంతులు, తపోవంతులు, పుణ్యచరితులు మాత్రమే దానిని గాంచగలరు. ఆశ గలవారు పరమేశ్వరిని గాంచలేరు" అని చెప్పబడింది.

కాబట్టి పుణ్యచరితులు మాత్రమే దేవిని దర్శించగలరు.

## 545. పుణ్యశ్రవణకీర్తనా

**పుణ్యే విహితకర్మరూపే శ్రవణకీర్తనే యస్యాః - సా**

పుణ్యమైన విహితకర్మలను వినుట పొగడుట గలది. పరమేశ్వరి యొక్క మంత్ర జపంగాని, కీర్తనలుగాని కథలు, గాథలుగాని వినటంవల్ల పుణ్యఫలం వస్తుంది. కాబట్టి దేవిని గురించిన విషయాలను వినటము, కీర్తించటము వల్ల పుణ్యము వస్తుంది.

పుణ్యప్రదము, శుభప్రదము అయిన విషయాలను శ్రవణం చేయుటయందుగాని, కీర్తనలను వినుటయందుగాని ఆసక్తి గలది. శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 66వ శ్లోకంలో

**విపంచ్యా గాయంతీ వివిధముపదానం పశుపతే**
**స్త్వయారబ్ధే వక్తుం చలితశిరసా సాధువచనే**
**తదీయై ర్మాధుర్యై రపలపిత తంత్రీకలరవాం**
**నిజాం వీణాం వాణీ నిచుళయంతి చోళేన నిభృతమ్ ॥**

సరస్వతీదేవి తన వీణను శృతిచేసి నీ పతి అయిన శివుని వీరగాథలు పాడుచుండగా మెచ్చుకోలుగా నీవు ఆమెను అభినందించావు. అప్పుడు నీ వాక్కులు వీణానాదం కన్న మధురంగా ఉండటంచేత సిగ్గుపడి సరస్వతి ఆ వీణను గుడ్డతో కప్పివేసింది.

ఈ శ్లోకంలో పరమేశ్వరి తన భర్త అయిన శివుని వీరగాథలు వినటానికి ఆసక్తిగా ఉన్నది అని చెప్పబడింది. ఈ రకంగా పుణ్యాన్ని కలిగించే విషయాలను వినటమునందు ఆసక్తి గలది.

## 546. పులోమ జార్చితా

పులోముని కుమార్తె అయిన శచీదేవిచే పూజించబడినది.

పురూరవుడు రాజ్యం చేస్తున్న రోజులలో ఒకనాడు వనంలో ఊర్వశిని చూసి మోహించాడు. వారిద్దరూ కలిసి కొంత కాలం కాపురం చేశారు. వారికి పదిమంది సంతానం కలిగారు. అందులో ఆరవవాడి పేరు 'ఆయువు' ఇతని కుమారుడు నహుషుడు. వేదవేదాంగవిదుడు. తత్త్వవేత్త. పండితుడు. అనేక యజ్ఞాలు, యాగాలు నిర్వహించాడు. వంద అశ్వమేధాలు చేశాడు.

త్వష్టప్రజాపతి కుమారుడు వృత్రుడు. రాక్షసనైజం కలవాడు. యుద్ధంలో ఇంద్రుణ్ణి ఓడించాడు. వృత్రాసురునితో గెలవలేక ఇంద్రుడు అతనితో స్నేహంచేసి, వృత్రుడు ఏమరుపాటుగా ఉన్నప్పుడు అతణ్ణి సంహరించాడు. ఆ కారణంగా ఇంద్రుడికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంది. అతడి ముఖంకళావిహీనమైపోయింది. దాంతో ఇంద్రుడు అమరావతిని వదిలి మానససరోవరానికి పారిపోయి అక్కడ ఒక పద్మంలో దాక్కున్నాడు.

రాజు లేకుండా రాజ్యం సాగదు కాబట్టి ఇంద్రపదవికి అర్హుడైన వ్యక్తికోసం వెదికారు దేవతలు నూరు అశ్వమేధాలు చేసినవాడు ఇంద్రపదవికి అర్హుడు. భూలోకంలో నహుష

చక్రవర్తి ఆ పనిచేశాడు. కాబట్టి అతడికి ఇంద్రపదవిని కట్టబెట్టారు దేవతలు. ధర్మపరుడైన నహుషుడు, ఇంద్రపదవి వచ్చేసరికి భోగలాలసుడైనాడు. సర్వకాలసర్వావస్థలయందు భోగాలలో తేలియాడుతూ చివరకు ఇంద్రుని భార్య శచీదేవి కావాలి అన్నడు. దేవతలు పరిపరివిధాల నచ్చచెప్పటానికి ప్రయత్నించారు. వినలేదు నహుషుడు. చివరకు దేవగురువైన బృహస్పతి శచీదేవికి భువనేశ్వరీ మంత్రాన్ని ఉపదేశించి 'అమ్మా ! ఈ మంత్రాన్ని జపించు ఆమెయే నీ కష్టాలు తీరుస్తుంది' అన్నాడు.

బృహస్పతి మాటప్రకారం శచీదేవి పరమేశ్వరిని ఆరాధించింది. ఆమె ప్రసన్నమైంది. ఇంద్రుడు అశ్వమేధం చేశాడు. అతని పాపం పోయింది. నహుషుడికి పెద్దపామై పొమ్మని అగస్త్యుడు శాపమిచ్చాడు. ఈ రకంగా పరమేశ్వరి దయవల్ల శచీదేవికి నహుషుని పీడ వదిలింది. ఈ విధంగా పులోముని కుమార్తెతో అర్చించబడింది కాబట్టి ఆ దేవి పులోమజార్చితా అనబడింది.

## 547. బంధమోచనీ

అవిద్యాసంబంధమైన బంధాలను విడిపించేది. లౌకిక బంధాల నుండి విముక్తి కలిగించేది. అరిషడ్వర్గాలను జయింపచేసేది. రాగద్వేషాల నుండి తన భక్తులకు విడుదల కలిగించేది.

యయాతిదేవయానిల కుమారుడు తుర్వసుడు. అతని పెంపుడు కుమారుడు ఏకవీరుడు. పండితుడు, శాస్త్రవేత్త, ధర్మవిధుడు, పైగా పరాక్రమశాలి. ఏకవీరుడు రాజ్యం చేస్తున్నరోజులలో గంగానదీ తీరాన ఉన్న ఒక చిన్న రాజ్యాన్ని 'రభ్యుడు' అనే రాజు పాలిస్తున్నాడు. అతనికి పరమేశ్వరి అనుగ్రహంవల్ల ఒక కుమార్తె కలిగింది. ఆమె పేరు ఏకావళి.

ఒక రోజున రాకుమార్తె 'ఏకావళి, తన చెలికత్తె యశోవతితో కలిసి గంగాతీరానికి వెళ్ళింది. అక్కడ కాలకేతుడనే రాక్షసుడు రాకుమారిని చూసి మోహించి, వారిద్దరినీ ఎత్తుకుపోయాడు.

యశోవతి పరమేశ్వరి అనుష్ఠానమున్నది. ఒకరోజు రాత్రి పరమేశ్వరి ఆమెకు కలలో కనిపించి మరునాడు ఉదయమే గంగానది ఒడ్డుకువెడితే అక్కడ ఏకవీరుడు అనే రాజుంటాడు. అతనికి జరిగిన విషయం చెప్పు. అతడు రాక్షసుణ్ణి చంపి మిమ్మల్ని రక్షిస్తాడని చెప్పింది.

పరమేశ్వరి మాటప్రకారం మరుసటిరోజు ఏకవీరుణ్ణి కలిసింది. విషయం తెలుసుకున్న ఏకవీరుడు రాక్షసుణ్ణి సంహరించి ఏకావళిని వివాహమాడాడు. ఈ రకంగా పరమేశ్వరిని అర్చించటంచేత రాకుమార్తె చెరవిడింది. ఏకావళికేకాదు పరమేశ్వరిని అర్చించే ఎవరికైనా సరే బంధనాలు ఉండవు. కాబట్టి ఆ దేవి 'బంధమోచనీ' అనబడుతుంది.

## 548. బంధురాలకా

స్త్రీలకు నుసటన ఉండే ముంగురులు వంకరలు తిరిగి ఉంటాయి. ఇది సౌందర్యలక్షణం. ఆ విషయమే ఈ నామంలో చెబుతున్నారు. మనోహరమై, దట్టమై, వంకరలు తిరిగిన ముంగురులు గలది.

అయితే ఈ నామం అసలు **బర్బరాలకా** అంటున్నారు. భాస్కరాచార్యులవారు. బర్బరాలకా అంటే పొట్టిగా వంకరలు తిరిగిన వెంట్రుకలు అని భావము. ముఖముకు పైభాగాన ఉండే ముంగురులు ఎప్పుడూ పొట్టిగానే ఉంటాయి. అందుచేత బర్బరాలకా అనే నామమే సరియైనది అంటున్నారు.

ఏదిఏమైనా ముంగురులు సౌందర్యలక్షణముగా గమనించాలి.

## 549. విమర్శరూపిణీ

ప్రకాశాత్మ అయిన పరబ్రహ్మ యొక్క స్వాభావిక ప్రకాశరూపము విమర్శ. సౌభాగ్యసుభగోదయంలో

**స్వాభావికీ స్ఫురత్తా విమర్శరూపాஉ స్య విద్యతే శక్తిః**
**సైవ చరాచర మఖిలం జనయతి జగ దేత దపిచ సంహరతి ॥**

"పరమేశ్వరుడికి స్వాభావిక స్ఫురణ విమర్శరూపముగా ఉన్నది. ఆ విమర్శశక్తియే చరాచరములను పుట్టించుచున్నది" అని చెప్పబడింది.

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ సృష్టి చెయ్యాలని సంకల్పించినవాడై తనను తాను రెండుభాగాలుగా విభజించుకున్నాడు. లేక తనలో నుంచి కొంతభాగాన్ని బయటకు పంపాడు.

అదే విమర్శరూపము. పరమేశ్వరుడు – ప్రకాశరూపముగా పరమేశ్వరుని నుండి బయటకు వచ్చిన శక్తివిమర్శరూపము. వారే శివశక్తులు అని గతంలో వివరించటం జరిగింది.

ఈ రకంగా బయటకు వచ్చిన విమర్శరూపమే శక్తి. ఈ సృష్టికి కారణము. కాబట్టి ఈ జగత్తంతా విమర్శరూపమైన శక్తి నుంచే ఆవిర్భవించింది.

మాతృకావివేచనము అనేగ్రంథంలో

**వాచకేన విమర్శేన వినా కిం వా ప్రకాశ్యతే**
**వాచ్యేనాపి ప్రకాశేన వినా కింవా విమృశ్యతే**
**తస్మా ద్విమర్శో విస్ఫూర్త్యై ప్రకాశం సమపేక్షతే**
**ప్రకాశ శ్చాత్మనోజ్ఞానే విమర్శం సమపేక్షతే ॥**

వాచకరూపమైన విమర్శ లేకుండా ప్రకాశముండదు. అలాగే వాచ్యమైన ప్రకాశం లేకుండా విమర్శ కూడా ఉండదు. కాబట్టి విమర్శకు ప్రకాశము అవసరము. అలాగే ఆత్మజ్ఞానమైన ప్రకాశానికి విమర్శ అవసరము. ఈ రెండింటికీ అవినాభావ సంబంధమ్మున్నది. ఈ రెండింటిలోనూ ఒకటి లేకుండా ఇంకొకటి ఉండదు.

## 550. విద్యా

విద్య అంటే జ్ఞానరూపమైనది, మోక్షదాయకమైనది విద్య. దేవీమాహాత్మ్యంలో "ఆ పరాశక్తి విద్యగా ఉన్నది" అని చెప్పబడింది. గౌడపాదులవారు కూడా పరమేశ్వరియే విద్య అని చెబుతున్నారు. మాయతో కూడినది అవిద్య. మాయలేనిది జ్ఞానము. అని శైవతంత్రంలో చెప్పారు.

విద్యయే స్వరూపంగా గల దేవి. దేవి వేదస్వరూపిణి. జ్ఞానస్వరూపిణి. కంటికి కనిపించే వాటిసాయంతో కంటికి కనిపించని దాన్ని కొనుక్కొవటమే విద్య అనబడుతుంది.

దేనిచేత అక్షరపరబ్రహ్మను గురించి తెలుసుకోగలమో అది విద్య. వేదంలో రెండురకాల విద్యలు చెప్పబడ్డాయి. 1. అపరావిద్య 2. పరావిద్య. ముండకోపనిషత్తులో వీటిని వివరించటం జరిగింది.

శునకుని కుమారుడు శౌనకుడు విద్యాభ్యాసం పూర్తిచేసి గృహస్థాశ్రమం స్వీకరించటానికి విముఖుడై తన గురువైన అంగిరసుణ్ణి అడుగుతాడు. "అర్యా ! దేన్ని గురించి తెలుసుకుంటే నాకు సర్వమూ తెలుస్తుందో, దాన్ని గురించి వివరించండి" అంటాడు. దానికి అంగిరసుడు "నాయనాలోకంలో తెలుసుకోవలసిన విద్యలు రెండు ఉన్నాయి. 1. అపరావిద్య 2. పరావిద్య

అపరావిద్య లౌకికప్రయోజనాలకు వర్తిస్తుంది. బుద్ధి సంపన్నులైన మహర్షులు యజ్ఞకర్మలు చేస్తారు. యజ్ఞాలవల్ల పుణ్యలోకాలు కలుగుతాయి. లోకంలో మనం చేసే కర్మలన్నింటివల్లా పుణ్యఫలం కలుగుతుంది. తద్వారా సిరిసంపదలు, భోగభాగ్యాలు, ఉన్నత పదవులు కలుగుతాయి.

పరావిద్య అంటే మోక్షవిద్య. సర్వ సంఘ పరిత్యాగం చేసి విరాగి అయినవాడు మాత్రమే అనుసరించగలిగినది. సాధకుడికి మోక్షమార్గం చూపేది.

ముందుగా అపరావిద్యనుపాసించి, కర్మఫలాన్ననుభవించి, ఆ తరువాత పరావిద్యను తెలుసుకోవాలి అంటాడు. అలాగే

ఛాందోగ్యోపనిషత్తులో దేవర్షి అయిన నారదుడు సనత్కుమారుని దగ్గరకుపోయి, స్వామీ గతంలో నేను వేదవేదాంగాలు ఉపనిషత్తులు, చతుష్షష్టికళలు, సర్వశాస్త్రాలు అభ్యసించాను. సంగీతసాధన చేశాను. కానీ నాకు మనశ్శాంతి లేదు. ఆత్మజ్ఞానం కలగలేదు. కాబట్టి నాకు ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించి, దుఃఖవిమోచన కలిగించండి అంటాడు. తరువాత సనత్కుమారుడు నారదుడికి బ్రహ్మోపదేశం చేస్తాడు.

కాబట్టి విద్య అనేది పరావిద్య. జ్ఞానస్వరూపం. అపరావిద్య పూర్తిగా తెలిసిన తరువాతనే పరావిద్య లభ్యమవుతుంది. పరమేశ్వరియే జ్ఞానస్వరూపం. కాబట్టి విద్యా అంటే ఆ పరమేశ్వరియే కాని వేరుకాదు.

## 551. వియదాదిజగత్ప్రసూః

వియత్ అంటే ఆకాశము. ఆకాశము మొదలైన జగత్తులను ప్రసవించినది. లేక సృష్టించినది.

సృష్టిలో మొట్టమొదటగా ఆకాశం ఉద్భవించింది. ఆకాశం నుంచి – వాయువు, వాయువు నుంచి – అగ్ని, అగ్ని నుంచి – నీరు, నీటి నుంచి – భూమి. ఈ రకంగా పంచభూతాలు తన్మాత్రలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు. గుణాలు క్రమేణా 84 లక్షల జీవరాశి ఆవిర్భవించింది.

ప్రళయం జరిగినప్పుడు కర్మ క్షయం కానటువంటి జీవరాశి అంతా, తమ కర్మ తమతోనే మూటకట్టుకుని మాయలో లీనమైపోయాయి. ఇక పంచభూతాలు క్రిందనుంచి పైకి లయమైయాయి. అంటే

| | | |
|---|---|---|
| భూమి | – | జలంలో లీనమైపోయింది |
| జలం | – | అగ్నిలో లీనమైపోయింది |
| అగ్ని | – | వాయువులో లీనమైపోయింది |
| వాయువు | – | ఆకాశంలో కలిసిపోయింది. |

వీటన్నింటినీ కలుపుకున్న ఆకాశం మాయలో కలిసిపోగా, మాయ పరమాత్మునిలో లీనమైపోతుంది. ఈ విధంగా జగత్తునంతా తన గర్భాన ధరిస్తాడు పరమేశ్వరుడు. గర్భం ధరించటమనేది స్త్రీ లక్షణం కాబట్టి పరమాత్మకు స్త్రీత్వము ఆపాదించబడుతోంది. లేకపోతే, పరమాత్మకు లింగబేధాలు లేవు.

ఆ రకంగా గర్భంలో దాచుకున్న జగత్తును కొంతకాలానికి మళ్ళీ బయటకు పంపాడు పరమాత్మ. అదే జగత్సృష్టి. అందుకే శ్రీమద్భాగవతంలో

**ఒక పరి జగముల వెలినిడి**

**ఒక పరి లోపలికి గొనుచు ఉభయము గనుచున్**

ఒకసారి ఈ జగత్తులను తన గర్భం నుంచి బయటకు వదులుతాడు. అది సృష్టి. జగత్తును తన లోపల ఇముడ్చుకోవటం లయము. ఇది పరమాత్మ లక్షణం. పరమేశ్వరియే పరబ్రహ్మ. కాబట్టి ఈ లక్షణాలన్నీ ఆ దేవికి ఉన్నాయి.

## 552. సర్వవ్యాధిప్రశమనీ

సమస్తమైన వ్యాధులను నాశనము చేయునది. పరమేశ్వరి తన భక్తుల యొక్క వ్యాధులన్నింటినీ శమింపచేస్తుంది. వ్యాధులు అనేకరకాలు వాటిలో ముఖ్యమైనవి.

1. శారీరకములు 2. మానసికములు

శారీరకములు అంటే శరీరంలో కలిగే మార్పులవల్ల, శీతోష్ణాలవల్ల వచ్చేవి. లేదా పూర్వజన్మల కర్మ ఫలితంగా వచ్చే దీర్ఘవ్యాధులు. జ్వరం దగ్గర నుంచీ అన్నిరకాల వ్యాధులు. వీటిని నాశనం చేస్తుంది. ఇక రెండవది మానసికవ్యాధులు. ఇవి శరీరానికి సంబంధించినవి కావు. తన వారు దూరం కావటంవల్లనో, తానుకోరుకున్నది దొరకకపోవటంవల్లనో ఈ రకమైన వ్యాధికలుగుతుంది. ఇది మనసుకు సంబంధించిన వ్యథ. దీనికి వైద్యశాస్త్రంలో మందులేదు. కాని పరమేశ్వరి ఈరకమైన వ్యాధిని కూడా నాశనం చెయ్యగలదు. రోగి యొక్క మనసును ఆ పరమేశ్వరి మీదికి మళ్ళించటమువల్ల ఈ వ్యాధులు ఉపశమిస్తాయి.

జగత్తంతా పరమేశ్వరి స్వరూపమే. ఈ వ్యాధులు గత జన్మకర్మలు. వాటిని అనుభవించటం వల్ల కర్మక్షయం అవుతుంది. ఈ రకమైన జ్ఞానంవల్ల వ్యాధుల ఉపశమనం కలుగుతుంది.

## 553. సర్వమృత్యునివారిణీ

లోకంలో పుట్టిన ప్రతిప్రాణి మరణించి తీరవలసినదే. ఈ లోకము మరము. అంటే మరణము స్వభావంగా కలిగినటువంటిది. అయితే మృత్యువు రెండు రకాలు 1. అపమృత్యువు 2. కాలమృత్యువు

1. కాలమృత్యువు అంటే ప్రతిప్రాణికీ మరణమున్నది. ఎప్పుడో ఒకప్పుడు ప్రతివారూ మరణించాలి. కాబట్టి ఆయువు తీరగానే మృత్యువాతపడటం.

2. అపమృత్యువు అంటే అనుకోకుండా, ఆయువు తీరకుండానే మరణించటం. నీటిగండము, వాహనగండము. ఇలాంటి వాటివల్ల అంటే ప్రమాదాలు, యుద్ధాలు, భూకంపాలు, వరదలవల్ల మృత్యువు కలుగుతుంది.

పరమేశ్వరుణ్ణి నమ్మినవాడికి మృత్యువుండదు. వేదంలో 'మహాదేవుని తెలుసుకున్నవాడు మృత్యువును జయిస్తున్నాడు' అని చెప్పబడింది. లోకంలో పుట్టిన ప్రతిప్రాణీ మరణించి తీరాలి కదా ? మరి మృత్యువును ఏ రకంగా జయిస్తాడు ? అని సందేహము. ఇక్కడ విషయం ఏమిటంటే పుట్టిన ప్రతి ప్రాణీ తప్పనిసరిగా మరణిస్తుంది. పుట్టనివారికి మరణంలేదు. కాబట్టి అసలు పుట్టనేలేదు అనుకోండి. అప్పుడు మరణమే ఉండదుకదా. ఈ రకంగా మరణాన్ని జయించినట్లేకదా ? జన్మ లేకుండా ఉండాలంటే ఏం చెయ్యాలి ? ముక్తి రావాలి. జీవాత్మని పరమాత్మతో ఏకం చెయ్యాలి. అప్పుడు పునర్జన్మ ఉండదు. దీనికి జ్ఞానం కావాలి. వైరాగ్యం కావాలి. అందుకే అన్నపూర్ణాష్టకంలో శంకరాచార్యులవారు

**అన్నపూర్ణే ! సదాపూర్ణే ! శంకరప్రాణవల్లభే !**
**జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాం దేహి చ పార్వతి !**

అంటూ జ్ఞానవైరాగ్యాలు ప్రసాదించమని ఆ పరమేశ్వరిని వేడుకుంటున్నారు.

ఈ విధంగా పరమేశ్వరి తన భక్తులకు జ్ఞానవైరాగ్యాలు ఇచ్చి ముక్తిని ప్రసాదిస్తుంది. అందుచేత 'సర్వమృత్యునివారిణీ' అనబడుతుంది.

## 554. అగ్రగణ్యా

అందరిలోనూ మొట్టమొదటిది. గణితికెక్కినది. సృష్టిలో ముందుగా ఉన్నది ఆ పరమేశ్వరియే. ఆమె నుంచే ఈ జగత్తంతా సృష్టించబడింది. కాబట్టి అందరికన్నా ఆది, అనాది అయినది ఆ పరమేశ్వరియే అందుకే అగ్రగణ్యా అనబడుతోంది.

దేవతలు చాలామంది ఉన్నారు. వారందరూ సాధకుల కోర్కెలు తీరుస్తారు. అయితే ఈ దేవతలంతా కల్పించబడిన వాళ్ళు. **సాధకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా.** వీరందరికీ అంతం ఉన్నది. అనంతమైనది ఆ పరమేశ్వరి ఒక్కతే. అందుచేత దేవతలందరిలోకీ ఆమె అధికురాలు.

## 555. అచింత్యరూపా

పరమేశ్వరి నిర్గుణస్వరూపిణి. కాబట్టి చింతించటానికి వీలులేదు. రూపంలేదు. ఈమె అవ్యక్తస్వరూపిణి. పంచభూతభావనలేనిది. అవాంగ్మాన గోచరమైనది. మనస్సుకు, వాక్కుకు కూడా కారణమైనది. అంటే వాటికన్న పురాతనమైనది. కాబట్టే ఇంద్రియాలతో ఆత్మను తెలుసుకోలేము అంటోంది కఠోపనిషత్తు

**నచక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతి నోమనః** ఆత్మ ఉన్న చోటికి వాక్కు వెళ్ళలేదు. కనులు పోలేవు. అందుకే పరదేవత రూపము చింతించరానిది. ఆలోచించలేనిది. అచింత్యరూపా అని చెప్పబడింది.

## 556. కలికల్మషనాశనీ

కలియుగంలో పాపాలు ఎక్కువగా ఉంటాయి. ఎందుకంటే ధర్మం చాలా వరకు నశించిపోతుంది. ప్రజలకు పాపభీతి ఉండదు. ఐహికసుఖాలమీద వాంఛ బాగా పెరుగుతుంది. ఈ పాపాలను నశింపచేయటం ఒక్క పరమేశ్వరి వల్ల తప్ప ఎవరివల్లా కాదు. కూర్మపురాణంలో "నీటివల్ల నిప్పు చల్లారుతుంది. సూర్యుని వెలుగులవల్ల చీకట్లు తొలగిపోతాయి. అలాగే కలియుగంలో పరమేశ్వరిని స్మరిస్తేనే చాలు పాపాలు నశిస్తాయి" అని చెప్పబడింది. బ్రహ్మాండపురాణంలో "తెలిసిగాని, తెలియకగాని చేసిన పాపాలు పరమేశ్వరిని స్మరించినంత మాత్రానే నశిస్తాయి" అని చెప్పారు. కాబట్టి కలియుగంలో పాపాలను నశింపచేసే శక్తి ఆ పరమేశ్వరికి తక్క అన్యులకు లేదు.

## 557. కాత్యాయనీ

కతుడనే మహర్షి కుమార్తె కాత్యాయని. కతులు అనబడే బ్రహ్మవేత్తల యందు నెలకొని ఉన్నది కావటంచేత కాత్యాయని అనబడుతుంది. నిరంతరము కన్యాత్వమునే కోరి పరాధీనత లేనటువంటి స్వాతంత్ర్యము గలది. కాత్యాయని. రాక్షససంహారం కోసం దేవతల తేజస్సుతో ఆవిర్భవించిన దేవత. కాలికాపురాణంలో

**కాత్యాయనీ చోద్యాణే కామాఖ్యా కామరూపకే**
**పూర్ణేశీ పూర్ణగిరౌ చండీ జాలంధరే స్మృతా**

ఓడ్యాణ పీఠమందు కాత్యాయని, కామరూపమందు కామాఖ్య, పూర్ణగిరిలో పూర్ణేశ్వరి, జాలంధరపీఠంలో చండీ అని ప్రసిద్ధిచెందినది.

దేవీపురాణంలో

**కం బ్రహ్మ కం శిరః ప్రోక్త మశ్మసారం చ కం మతం ।**
**ధారణాద్వాసనా ద్వాపి తేన కాత్యాయనీ మతా ॥**

కం అనగా బ్రహ్మ, శిరస్సు, అస్మసారము అనబడును. దానిని ధరించుటచేత ఆమె కాత్యాయని అనబడుతున్నది. అంటే బ్రహ్మ శిరస్సు మొదలగు స్థానములందు వసించుటచేత ఆమె కాత్యాయని అనబడుతుంది. దేవీకవచంలో నవదుర్గలను చెబుతూ

**ప్రథమం శైలపుత్రీతి ద్వితీయం బ్రహ్మచారిణీ ।**
**తృతీయం చంద్రఘంటేతి కూష్మాండేతి చతుర్థకం ॥**
**పంచమం స్కందమాతేతి షష్ఠం కాత్యాయనీ తథా ।**
**సప్తమం కాలరాత్రీతి మహాగౌరీతి చాష్టమం ॥**
**నవమంసిద్ధిధాత్రీ చ నవదుర్గాః ప్రకీర్తితాః ।**

నవదుర్గలలో ఆరవదుర్గ కాత్యాయని

## 558. కాలహంత్రీ

**కాలస్య మృత్యోః హంత్రీ**

మృత్యువును చంపునది. వేదంలో ఎరుగువాడు కాలకాలుడు. గుణి సర్వవిద్య కాలకాలుడు అంటున్నది. అంటే బ్రహ్మకాలమునకు కాలుడు అని అర్థం.

**కాలోహి దురతిక్రమో మృత్యుః తమపి హంతీతి తథోచ్యతే**

కాలము అంటే మృత్యువు. అటువంటి మృత్యువుకు కూడా మృత్యువు ఆ పరమేశ్వరి అందుచేతనే కాలహంత్రీ అనబడుతోంది.

ప్రళయం సంభవించినప్పుడు అన్ని జీవరాశులతోపాటుగా దేవతలు కూడా నశిస్తారు. అప్పుడు మిగిలేది ఒక్క పరమేశ్వరియే అందుకే ఆమె కాలహంత్రీ అనబడుతోంది. సప్తశతిలో చెప్పినట్లుగా

**కాలాకాష్ఠాదిరూపేణ పరిణామప్రదాయినీ**

కాష్ఠ అంటే – పద్దెనిమిది రెప్పపాట్ల కాలము

కల అంటే – ముప్పైకాష్ఠల కాలము

ఈ రకంగా కాలంలో మార్పులు కలిగిస్తుంది.

క్షణాలు, విఘడియ, ఘడియ, జాము, పగలు, రాత్రి, తిథి, పక్షము, మాసము, ఋతువు, ఆయనము, సంవత్సరము ఈ రకంగా యుగాలు, కల్పాలు అంటూ కాలంలో వివిధరకాలయిన తేడాలను చూపుతుంది ఆ పరమేశ్వరి. కాలాన్ని మ్రింగేస్తుంది. అందుకే కాలహంత్రీ అనబడుతుంది.

## 559. కమలాక్షనిషేవితా

కమలాక్షుడు అంటే – విష్ణువు. అతనిచే ఎక్కువగా సేవించబడినది. పద్మపురాణంలో

**ఇంద్రనీలమయీం దేవీం విష్ణు రర్చయతే సదా**

**విష్ణుత్వం ప్రాప్తవాం స్తేన**

ఇంద్రనీలమయమైన పరమేశ్వరిని అర్చించి విష్ణువు విష్ణుత్వం పొందినాడు అని చెప్పబడింది.

జగత్పరిపాలకుడైన విష్ణువుచే సేవించబడినది కాబట్టి కమలాక్షనిషేవితా అనబడింది.

విష్ణుస్థానం కావాలి అంటే విమర్శరూపిణీ విద్యను ఉపాసించాలి. ఇదే ఆ దేవత ఉపాసనా ఫలం.

ఈ రకంగా విమర్శరూపిణి అనే కాత్యాయనీ విద్యను వివరించటం జరిగింది.

## 38. పరమేశ్వరి - స్థూలరూపము

గతంలో ఆరవనామం దగ్గర నుంచి 54వ నామం వరకు పరమేశ్వరి యొక్క స్వరూపాన్ని వర్ణించారు. మళ్ళీ ఇక్కడ ద్వైదీభావం కలిగిన భక్తులకోసం స్థూలరూపాన్ని వివరిస్తున్నారు. శ్రీచక్రపూజ ఎవరు చేస్తారు అనే విషయం చెబుతూ యోగి హృదయంలో

**ఆజ్ఞాంతం సకలంప్రోక్తం తత స్సకల నిష్కలం**
**ఉన్మన్యంతం పరేస్థానం నిష్కళంచ త్రిధాస్థితం**

శరీరంలో 19 చక్రాలున్నాయి. అవి

1. అకులము నుంచి - అజ్ఞ వరకు - మొదటి జట్టు
2. ఆజ్ఞ నుంచి - ఉన్మని వరకు - రెండవజట్టు
3. బ్రహ్మరంధ్రం లేదా మహాబిందువు - మూడవజట్టు

మొదటిజట్టువారు సకలులు. కేవలము ఐహిక వాంఛలయందే ఆసక్తి గలవారు.

రెండవ జట్టువారు మధ్యములు. కొంతసేపు మోక్షము అంటారు. మరికొంతసేపు ఇహము అంటారు.

మూడవజట్టు వారు కేవలము మోక్షవాదులు.

ఇప్పుడు వీరిలో మధ్యమాధికారులకోసము పరమేశ్వరి స్థూలరూపం వర్ణించటం జరుగుతోంది. ఆ పరమేశ్వరి తాంబూల చర్వణంలో ఎర్రనైన నోటితో, దాడిమీ కుసుమము అంటే దానిమ్మపూల వంటి రంగుతో ప్రకాశిస్తుంటుంది. ఆమె చంచలనేత్ర మహాసౌందర్యవతి. లోకంలోని సౌందర్యమంతా మూర్తీభవించిన దేవతామూర్తి. ముల్లోకాలనూ సమ్మోహనం చేయగల మోహినీరూపం. సాక్షాత్తూ శంకరుణ్ణి మోహింపచేసింది.

అన్నింటికన్నా పురాతనమైనది. జన్మలేనటువంటిది. ఆదియైనది. అందరి జన్మలకు కారణం ఆమె. ఆత్మజ్ఞాని అయిన మృదుని పత్ని. కోటిసూర్యప్రభలతో విరాజిల్లుతుంటుంది. ఏ రకమైన కోరికలులేనిది. అందరి కోరికలు తానే తీరుస్తుంది. భక్తుల కోసమే నవనిధులను ఉపయోగిస్తుంది. జగత్తునంతటినీ నియంత్రిస్తుంది. అఖిలాండకోటి బ్రహ్మాండాలకు మహాసామ్రాజ్ఞి. ఇక నామాలను చూద్దాం.

## 560. తాంబూలపూరితముఖీ

**తాంబూలేన పూరితం ముఖం యస్యాః - సా**

తాంబూలముచే నిండిన ముఖము గలది. తాంబూలచర్వణమునందు ప్రీతిగలది.

శంకరభగవత్పాదులు తమ సౌందర్య లహరిలోని 65వ శ్లోకంలో పరమేశ్వరి తాంబూలాన్ని చెబుతూ

**రణేజిత్వా దైత్యా నపహృత శిరస్త్రైః కవచిభిః**
**నివృత్తై శ్చండాంశ త్రిపురహర నిర్మాల్యవిముఖైః**
**విశాఖేంద్రో పేంద్రై శ్శశివిశద కర్పూరశకలాః**
**విలీయంతే మాత స్తవ వదన తాంబూల కబళాః ॥**

తల్లీ ! యుద్ధంలో రాక్షసులను జయించి, శిరస్త్రాణాలను తీసివేసి, యుద్ధభూమి నుంచి తిరగివస్తూ, చండీశ్వరునిచేత అనుభవింపతగిన శివనిర్మాల్యము వద్దు అన్నటువంటి విష్ణువు, ఇంద్రుడు, కుమారస్వామి మొదలైనవారు నీ నోటి వెంటవచ్చిన తాంబూల కబళములు తీసుకుంటున్నారు.

శివుని యొక్క నిర్మాల్యంకన్న, పరమేశ్వరి తాంబూల కబళమే మిన్న అంటున్నారు. **కర్పూరవీటికామోదస్సమాకర్షద్దిగంతరా** అన్నప్పటి అర్థమే ఇక్కడ కూడా చెప్పబడుతుంది.

## 561. దాడిమీకుసుమప్రభా

దాడిమీ వృక్షము - అంటే దానిమ్మ చెట్టు. ఈ చెట్టు రెండు రకాలుగా ఉంటుంది. 1. పండు దానిమ్మ 2. పువ్వు దానిమ్మ

పండు దానిమ్మనే కాయదానిమ్మ అనికూడా అంటారు. ఈ చెట్టుకు పూలు పెద్దగా ఉండవు. కాయలే ఇక్కడ ప్రాముఖ్యత

పూవ్వుదానిమ్మ. ఈ చెట్టు అసలు కాయలు కాయదు. కేవలం పూలే పూస్తుంది. ఈ పూలు ఎరుపురంగులో ఉంటాయి. పరమేశ్వరి శరీరవర్ణం, దానిమ్మపూలరంగు రెండూ ఒకటిగానే ఉంటాయి. అందుకే ఆ దేవి దాడిమీ కుసుమప్రభలతో ప్రకాశిస్తుంది అని చెప్పబడింది.

## 562. మృగాక్షీ

**మృగస్యేన అక్షిణీయస్యాః - సా**

జింకవంటికనులు గలది. పరమేశ్వరి లేడివంటి కనులు గలది. లేడికళ్ళు పెద్దగా ఉంటాయి. స్థిరంగా ఉండవు. చంచలమైనవి. లేడి ఎప్పుడూ బెదురు చూపులు చూస్తూ ఉంటుంది. విశాలము, ఔదార్యము, చంచలము అనేవి లోకము యొక్క సృష్టి స్థితులను సూచిస్తాయి. గతంలో పరమేశ్వరి విశాలాక్షి అని చెప్పాము. అదే అర్థం ఇక్కడ కూడా.

## 563. మోహినీ

**మెహయతీతి మోహినీ**

మోహింపచేయునది కాబట్టి మోహిని అనబడుతుంది. లఘునారదీయంలో 'ఓ సుందరీ ! ఈ లోకమంతా నీ చేత మోహింపచేయబడుచున్నది. అందుకని నీ పేరు మోహిని అవుతున్నది. ఈ పేరు నీ గుణమువల్లనే పుట్టినది.

జగత్తులన్నింటినీ మోహింపచేయునది. మహామాయా స్వరూపము.

దేవదానవులకు పూర్వకాలం నుండి పోరు జరుగుతూనే ఉన్నది. ఇది ధర్మాధర్మాలకు, న్యాయాన్యాయాలకు మధ్యన జరిగే పోరు. ఈ పోరులో ముందుగా రాక్షసులే విజయం సాధిస్తారు. దేవతలు నానాకష్టాలు అనుభవించి చివరకు ఏదో ఒక ఉపాయంతో దానవులను ఓడిస్తారు. ధర్మానికీ, మంచికీ ఎప్పుడూ ముందు పరాజయమే కలుగుతుంది. కాని అంతిమ విజయం మాత్రం ధర్మానిదే. దేవదానవ సంగ్రామాలన్నీ ఈ విషయమే చెబుతాయి.

ప్రతిసారీ దేవతలంతా అసురులచేతిలో ఓడిపోవటం, మరణించటం కూడా జరుగుతోంది. ఆ సమయంలో దేవతలంతా విష్ణువు దగ్గరకు పోయి మరణం లేకుండా ఏదైనా ఉపాయం చెప్పమన్నారు. అమృతపానం చేసిన వారికి మరణముండదు. అమృతం పాలసముద్రంలో ఉన్నది. సాగరమథనంచేస్తే అమృతం పుడుతుంది అని చెప్పాడు విష్ణువు. రాక్షసుల సహాయంతో సాగరమథనం చేశారు. దేవతలు. ఐరావతము, ఉచ్చైశ్వరము, కల్పవృక్షము, కామధేనువు, కాలకూటము సముద్రం నుంచి పుట్టినాయి. చివరకు అమృతం పుట్టింది. అమృతం మాదంటే మాదని పోట్లాడుకున్నారు దేవదానవులు. ఇంతలో

విష్ణుమూర్తి మోహినీరూపంలో వచ్చాడు. ఆమె రూపానికి తన్మయులైపోయారు రాక్షసులు. అమృతం నేను పంచుతానన్నది మోహిని. సరే అన్నారు. రాక్షసులు. అసురులను సమ్మోహింపచేసి అమృతాన్ని దేవతలకిచ్చింది.

ఈ రకంగా సమ్మోహింపచేసినది మోహిని. బ్రహ్మాండపురాణంలో

**ఆదౌ ప్రాదు రభూ చ్ఛక్తి ర్బ్రహ్మణో ధ్యానయోగతః**
**ప్రకృతి ర్నామ సా ఖ్యాతా దేవానా మిష్టసిద్ధిదా ।**
**ద్వితీయ మదభూ ద్రూపం ప్రవృత్తేఽమృతమంథనే**
**సర్వసమ్మోహజనక మవాఙ్మానస గోచరం**
**యద్దర్శనా దభూ దీశ స్సర్వజ్ఞోఽపి విమోహితః**

బ్రహ్మ యొక్క తపః ఫలంగా పరమేశ్వరి మొదటగా దేవతల కోరికలు తీర్చటానికి ప్రకృతిగా అవతరించింది. ఆ సాగరమథనం చేసేటప్పుడు అందరినీ మోహింపచేస్తూ మోహిని అయింది. ఈ రూపాన్ని శివుడు మోహించాడు అని చెప్పబడింది. ఈ శివకేశవుల పుత్రుడే హరిహరసుతుడు అయ్యప్ప.

## 564. ముఖ్యా

అన్నింటికన్న ముఖ్యమైనది. ముందుగా పుట్టినది. వేదంలో 'నేను సత్యము కన్న ముందుగా పుట్టితిని" అని చెప్పబడింది. దేవతలందరికన్నా ముందుగా పుట్టినది పంచకృత్యాలను నిర్వహించే దేవి. అందుకే ఆమె ముఖ్యమైనది అనబడుతుంది.

## 565. మృడానీ

మృడము – అనగా సుఖము అని అర్థం. శివరహస్యము అనే గ్రంథంలో 'జనులకు సుఖాన్ని కలిగించే మృడునకు నమస్కారము' అని చెప్పబడింది.

ఎల్లవేళలయందు ఆత్మజ్ఞానంలో తేలియుండేవాడు మృడుడు. ఆనందస్వరూపుడు. పరమేశ్వరుడు సత్త్వగుణ ప్రధానుడైనప్పుడు మానవులకు సుఖశాంతులు ప్రసాదిస్తాడు. అందుచేత మృడుడు అనబడతాడు. ఆ మృడుని యొక్క శక్తి మృడానీ.

## 566 మిత్రరూపిణీ

**మిత్రాణాం సూర్యాణామివ రూపం యస్యాః – సా**

స్నేహితులరూపము గలది. సూర్యుల యొక్క రూపము గలది.

పరమేశ్వరి కోటిసూర్యప్రభలతో వెలుగొందుతున్నది. కాబట్టి సూర్యరూపము గలది. ఆమె **ఉద్యద్భాను సహస్రాభా** అని, **తరుణాదిత్యపాటలా** అని చెప్పబడింది. కాబట్టి మిత్రరూపిణి.

మిత్రుడు అంటే – సూర్యుడు, స్నేహితుడు అని అర్థం. **హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజత స్రజాం** అనబడింది. కాబట్టి మిత్రరూపిణి. ఆకాశంలో దూరంగా కనిపించేవాడు సూర్యుడు. అతడు దేవతలను తృప్తిపరచేవాడు. కాబట్టి అతడు మధువువంటివాడు. ఆ సూర్యుడివల్లనే కాంతులు ప్రసరిస్తున్నాయి. ఎండలు కాస్తున్నాయి. వెలుగులు చిమ్మబడుతున్నాయి. మంచుకరిగినదులు ప్రవహిస్తున్నాయి. నీరు ఆవిరిగా మారి వర్షం కురుస్తోంది. పంటలు పండుతున్నాయి. జన జీవనం సాఫీగా సాగుతున్నది. ఒక్క మాటలో చెప్పాలంటే సూర్యుడు జీవనప్రదాత. అటువంటి సూర్యునిరూపము గలది.

సూర్యులు 12 మంది. వీరినే ద్వాదశాదిత్యులు అంటారు.

| | | |
|---|---|---|
| 1. ఇంద్రుడు | 5. పూష | 9. విష్ణువు |
| 2. ధాత | 6. అర్యముడు | 10. అంశుమంతుడు |
| 3. పర్జన్యుడు | 7. భగుడు | 11. వరుణుడు |
| 4. త్వష్ట | 8. వివస్వంతుడు | 12. మిత్రుడు |

ఈ రకంగా ద్వాదశాదిత్యులరూపం గలది.

బృహదారణ్యకోపనిషత్తులో “పన్నెండునెలలతో కూడిన సంవత్సరమే ఆదిత్యుడు. ప్రాణుల యొక్క ఆయుర్దాయాన్ని ‘అదదానా’ అంటే గ్రహిస్తుంది. కాబట్టి ఇవి ఆదిత్యులనబడతాయి అని చెప్పబడింది. సూర్యుని కళలు పన్నెండు అవి.

| | | |
|---|---|---|
| 1. తపిని | 5. జ్వాలిని | 9. విశ్వకల |
| 2. తాపిని | 6. రుచికల | 10. బోధిని |
| 3. ధూమ్ర | 7. సుషుమ్న | 11. ధారిణీ |
| 4. మరీచి | 8. భోగద | 12. క్షమా |

సూర్యుడు అంటే అతని కళలే. కాబట్టి సూర్యునిరూపంలో ఉంటుంది. అంటే అతని కళలరూపంలోనే ఉంటుంది.

పరమేశ్వరి తన బక్తజనులకు కోరికలు తీరుస్తుంది కాబట్టి, వాళ్ళ హితవును కోరుతుంది కాబట్టి ఆమె భక్తులకు స్నేహరూపము గలది.

## 567. నిత్యతృప్తా

**నిత్యం సర్వకాలం తృప్తా**

సర్వకాల సర్వావస్థలయందు తృప్తి గలిగినది.

**నిత్యేన సర్వరూపానందేన వా తృప్తా**

నిత్యమైన సర్వరూపానందమందు తృప్తినొందినది. ఏరకమైన వాంఛలు లేనటువంటిది. నిత్యము స్వరూపానందము అంటే ఆత్మజ్ఞానము లేక ఆత్మానందము గలది. కేవలము బ్రహ్మానందమే స్వరూపముగా గలది.

## 568. భక్తనిధిః

**భక్తానాం నిధి రివ**

భక్తులకు నిధి వంటిది. భక్తుల కోరికలు తీర్చేది. భక్తులకు ఆశ్రయస్థానమైనది. భక్తులు వారికి కావలసినవి ఎంత తీసుకున్నప్పటికీ తరగని నిధులు గలది.

దేవీభాగవతంలో

**యస్యా స్తు పార్శ్వ భాగేతు నిధీతవ్యౌ శంఖపద్మకౌ**
**నవరత్నమహానద్యా స్తదా వై కాంచనస్రవా ॥**

పరమేశ్వరికి రెండు ప్రక్కలా శంఖ పద్మ నిధులున్నాయి. అక్కడ బంగారము, రత్నాలు కలిసిన నదులు ప్రవహిస్తుంటాయి.

పరమేశ్వరి ప్రక్కన శంఖ పద్మ నిధులు ఉన్నాయి. అవి నవనిధులలోకీ శ్రేష్ఠమైనవి. వాటిలో నుంచి ఎంత సంపద తీసుకున్నా అవి తరిగిపోనివి. నవనిధులు

| | | |
|---|---|---|
| 1. కాళ | 4. మాణవక | 7. శంఖ |
| 2. మహాకాళ | 5. వైసర్ప | 8. పద్మ |
| 3. పాండుక | 6. సర్వరత్న | 9. పింగళక |

భక్తులకోరికలు తీర్చటానికే పరమేశ్వరి ఈ నిధులను తన దగ్గర ఉంచుకున్నది.

## 569. నియంత్రీ

**జగ న్నియామకత్వా న్నియంత్రీ**

లోకాలను నియమించునది. నియంత అంటే ఏకైకము. ఒకే ఆధారము. సకల దేవతలకు పరమేశ్వరి ముఖ్యురాలు అందుచేత నియంత్రీ అనబడుతుంది.

సమస్తదేవతలను, దిక్పాలకులను, గ్రహాలను, నక్షత్రాలను నియమించి లోకపాలన సజావుగా జరిగేటట్లు చూస్తుంది. మధుకైటభ సంహారం తరువాత త్రిమూర్తులతో 'బ్రహ్మ సృష్టి కార్యక్రమం చూస్తాడు. హరిహరులు ఇద్దరూ అతడికి సహాయకారిగా ఉంటారు. కాళి లక్ష్మి సరస్వతి అనే శక్తులు మీ ముగ్గురికీ సహాయంగా ఉంటాయి. మీరు వెళ్ళి, మీ స్థావరాలు ఏర్పరచుకుని, సృష్టి కార్యం చూడండి అని చెబుతుంది. అంటే త్రిమూర్తులను ఆ పనులకు నియమించిందన్నమాట.

జీవులందరికీ వారివారి కర్మఫలాన్ని బట్టి జన్మలిస్తుంది. ఆ జన్మలో కష్టసుఖాలు, సుఖదుఃఖాలు కర్మఫలితంగానే కలుగుతాయి. వీటన్నింటినీ కలుగుచేసేది. నియంత్రించేది నియంత్రీ అనబడుతుంది.

## 570. నిఖిలేశ్వరీ

**నిఖిలస్య కృత్స్నప్రపంచస్య ఈశ్వరీ**

సకల ప్రపంచాలకు ఈశ్వరి. చతుర్దశభువనాలకు ఈశ్వరి. అనేకకోటి బ్రహ్మాండాలకు ఈశ్వరి.

ఈశ్వర అనే శబ్దం నాయకత్వాన్ని సూచిస్తుంది. రాజరికాన్ని, ప్రభుత్వాన్ని సూచిస్తుంది. రాజు, చక్రవర్తి అనే అర్థంలో వాడబడుతుంది. అన్నిలోకాలు ఆ పరమేశ్వరి ఆధీనంలోనే ఉన్నాయి. ఆ దేవి నియంత్రణలోనే ఉన్నాయి.

**నాౖ విష్ణుః పృథివీ పతిః**

విష్ణ్వంశలేనివాడు రాజు కాలేడు. ఆ పరమేశ్వరి విష్ణ్వంశ గలది. విష్ణుశక్తి. అందుచేతనే నిఖిలేశ్వరి అనబడుతోంది.

ఈ రకంగా పరమేశ్వరి స్థూలరూపం వర్ణించబడింది.



# 39. ప్రజ్ఞానఘనరూపిణీ

పరమేశ్వరి జ్ఞానస్వరూపిణి. సమస్త విషయాలు తెలిసినటువంటిది. ఏ విషయాన్ని తెలుసుకోవటంచేత చరాచర జగత్తులోని అన్ని విషయాలు తెలుస్తాయో, ఆ విషయం పూర్తిగా తెలిసినటువంటిది. అవిద్య అజ్ఞానము అనేవి లేశ మాత్రం కూడా లేనటువంటిది. నేను నాది అనే అహంకార మమకారాలు లేనటువంటిది. అజ్ఞానులు ఈ శరీరమే ఆత్మ అనుకుంటారు. జగత్తులో కంటికి కనిపించేదంతా సత్యము అని నమ్ముతారు. సిరి సంపదలు, భోగ భాగ్యాలు, భార్యా పిల్లలు ఇవన్నీ శాశ్వతము అని నమ్ముతారు. వీటివల్ల వచ్చే ఇహలోక ఆనందమే పరమానందము. దానిని మించినది లేదు అనుకుంటారు.

**అర్థాగృహే నివర్తంతే స్మశానే మిత్రబాంధవాః ।**
**సుకృతం దుష్కృతం చైవ గచ్ఛంత మను గచ్ఛతి ॥**

ఈ లోకంలో సంపాదించిన ధనధాన్యాలు ఇంటివద్దనే ఉంటాయి. మిత్రులు, బంధువులు మహా అయితే స్మశానం దాకా వస్తారు. ఆ తరువాత ఎవ్వరూ మనతో రారు. మరణానంతరము కూడా జీవితోపాటుగా వెళ్ళేది కేవలము అతను చేసిన పాపపుణ్యాలు మాత్రమే. అదే కర్మఫలం. ఆ కర్మఫలాన్ని అనుభవించి, కర్మశేషం అనుభవించటానికిగాను మళ్ళీ ఈ లోకంలో పుడతాడు జీవి. ఈ రకంగా సంసారంలో పడి గానుగకు కట్టిన ఎద్దులాగా తిరుగుతుంటాడు. అంతేకాని బంధనాల నుంచి విముక్తుడుకాడు.

ఈ రకంగా విముక్తి రావాలి అంటే జ్ఞానం కావాలి. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' అనే విషయం తెలియాలి.

ఈ జగత్తంతా పరమేశ్వర స్వరూపమని, ఆ పరబ్రహ్మ ఒక్కడే సత్యము నిత్యము అయినవాడు. మిగిలినవన్నీ మిధ్యా స్వరూపాలే. కంటికి కనిపించే సిరి సంపదలు, భోగ భాగ్యాలు శాశ్వతంకావు. భార్యా పిల్లలు అంతకన్నా శాశ్వతం కాదు.

**ఋణానుబంధరూపేణ పశుపత్ని సుతాలయాః**

పూర్వజన్మలలోని ఋణానుబంధమే ఈ జన్మలో భార్యా పిల్లలు, పశువులు అన్నీ కూడా. ఋణం తీరగానే వారంతా మనల్ని వదిలి వెళ్ళిపోతారు. కాబట్టి ఈ బంధాలు ఏవీ శాశ్వతంకావు. వీటివల్ల వచ్చే ఆనందం కూడా శాశ్వతం కాదు. శాశ్వతమైనది బ్రహ్మానందం ఒక్కటే.

ఈ విషయాన్ని తెలుసుకోవటమే జ్ఞానసముపార్జన. పరమేశ్వరి జ్ఞానస్వరూపిణి. చిదగ్ని కుండ సంభూత. అందుకే ప్రజ్ఞానఘనరూపిణి.

ఆ దేవిని చతుర్విధవాసనలతోను పొందవచ్చు. అంటే జగత్తే పరబ్రహ్మ స్వరూపం అని భావన చేయటం ద్వారా ఆమెను పొందవచ్చు. ఆమెకు ఆద్యంతాలు లేవు. మహాప్రళయం జరిగినప్పుడు కూడా ఆమె ఉంటుంది. ఆమె పరాశక్తి. జ్ఞానముచేత మాత్రమే పొందదగినది. మధుపానం చేసినప్పుడు కూడా బాహ్యేంద్రియజ్ఞానం మరిచిపోయి, కేవలం ఆత్మానందాన్ని మాత్రమే పొందేది. ఆమె మాతృకావర్ణరూపిణి. అక్షరాలే రూపంగా గలది. ఆమె మహాకైలాసము. అంటే సహస్రారంలో ఉంటుంది. శ్రీచక్రంలోని బిందువు నందుంటుంది. ఆమె మహనీయురాలు. దయామూర్తి. మహాసామ్రాజ్యము అంటే ఆత్మసామ్రాజ్యానికి అధిపతి. ఈ విషయాలను 571 నుంచి 583 వరకు నామాలలో వివరించటం జరిగింది.

## 571. మైత్ర్యాదివాసనాలభ్యా

మైత్రి మొదలగు చతుర్విధ వాసనలతో పొంద దగినది. అవి

1. మైత్రి 2. కరుణ 3. ముదిత 4. ఉపేక్ష

1. స్నేహితులయందు చూపేది మైత్రి
2. దుఃఖితులయందు చూపేది కరుణ
3. పుణ్యాత్ములందు చూపేది ముదిత
4. పాపాత్ములందు చూపేది ఉపేక్ష

ఈ నాలుగు రకాల వాసనలచేత పొందదగినది. భాగవతంలో వీటిని వివరించటం జరిగింది. మైత్రి మొదలగు వాటిచేత పరిశుద్ధమైనటువంటి చిత్తము గలవారు క్లేశాలను తొలగించి యోగమార్గంలో పయనించేవారు సమాధిస్థితిని పొందుతారు. అంటే అలాంటి పరమయోగులకు ఆత్మసాక్షాత్కారమవుతుంది.

ఈ నాలుగు వాసనలను నిత్యజీవితంలో ఆచరించే వారికి పరమేశ్వర సాక్షాత్కారమవుతుంది. అంటే సాధకుడు సుఖము, దుఃఖము, పుణ్యము, పాపముల విషయమై జాగ్రత్త పడాలి.

సహృదయులైన వారితో బేధభావం లేకుండా చాలా సఖ్యంగా ఉండాలి అదే మైత్రి. దుఃఖించేవారు, బాధపడేవారు వీరందరియందు జాలి కలిగి ఉండటమే కరుణ. పుణ్య పురుషులతో సాంగత్యం చెయ్యటమే ముదిత. పాపాత్ములందు నికృష్టమైన యేహ్యాభావన లేకుండా ఉండటమే ఉపేక్ష. ఈ చతుర్విద వాసనలు గలవారికి ఆ దేవి లభిస్తుంది. అందుకే భాగవతంలో

**నీ పాద కమల సేవయు**
**నీ పాదార్చకుల తోడి నెయ్యమును**
**నితాంతాపార భూతదయయును**
**తాపసమందార ! నాకు దయచేయగదే ॥**

## 572. మహాప్రళయసాక్షిణీ

మహాప్రళయం సంభవించినప్పుడు జగత్తులోని జీవరాశి అంతా లయమైపోతుంది. లోకంలోని జీవరాశితో పాటుగా మిగిలినవారు కూడా లయం అయిపోతారు. అంటే గతంలో చెప్పినట్లుగా దేవ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య గణాలన్నీ నాశనమయిపోతాయి. వీరందరికీ దైవత్వము, గంధర్వత్వము అనేవి గతజన్మలో చేసినటువంటి పుణ్యఫలంవల్ల వచ్చినవే. కల్పాంతందాకా బ్రహ్మ తన పదవిలో ఉంటాడు. కల్పాంతాన ఆ పరబ్రహ్మలో లీనమైపోతాడు. ఇప్పటిదాకా తొమ్మిదిమంది బ్రహ్మలు ఉన్నారు. వారే నవబ్రహ్మలు. వారు

| | | |
|---|---|---|
| 1. భృగువు | 4. అంగిరసుడు | 7. దక్షుడు |
| 2. పులస్త్యుడు | 5. అత్రి | 8. వసిష్ఠుడు |
| 3. పులహుడు | 6. క్రతువు | 9. మరీచి |

అలాగే ఇంద్రపదవి కూడా. నూరు అశ్వమేధాలు చేసినవాడు ఇంద్రుడవుతాడు.

ఉత్తమ మనువు కాలంలో – సుశాంతుడనేవాడు ఇంద్రుడు
రైవతమన్వంతరంలో – విభుడనేవాడు ఇంద్రుడు
చాక్షుషమన్వతరంలో – మనోజవుడు ఇంద్రుడు

ఇతనికే బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంది. ఆ సమయంలో నూరు అశ్వమేధాలు చేసిన నహుషుణ్ణి ఇంద్రుడి స్థానంలో కూర్చుండబెట్టారు.

కాత్యాయనీ విద్యను ఉపాసన చేస్తే విష్ణుత్త్వం సిద్ధిస్తుంది. కఠోపనిషత్తులో యమధర్మరాజు నచికేతుడితో" అగ్నిచయనం చేసినవారు శాశ్వతంగా స్వర్గలోకం పొందుతారు. అంతేకాని వారికి మోక్షం రాదు. ఈ విషయం తెలిసి కూడా నేను అగ్నిచయనం చేసి ఈ పదవిలో ఉన్నాను." అంటాడు. ఈ రకంగా పైన చెప్పిన పదవులన్నీ జీవులు చేసిన పుణ్యకర్మలవల్ల వచ్చినవే. కాబట్టి వారి కర్మఫలం క్షయంకాగానే ప్రళయం సంభవిస్తుంది. ఆ మహాప్రళయానికి ఏకైక సాక్షి ఆ పరమేశ్వరియే అప్పుడు ఉండేది చిత్కలారూపమైన ఆమె తప్ప ఇంకెవరూ కాదు. అందుకే పంచదశిస్తవంలో

**కల్పోపసంహరణకల్పితతాండవస్య**
**దేవస్య ఖండపరశోః పరభైరవస్య ।**
**పాశాంకుశైక్షవశరాసనపుష్పబాణా**
**సా సాక్షిణీ విజయతే తవ మూర్తి రేకా ॥**

కల్పాంతంలో చేయబడిన శివతాండవానికి పాశము అంకుశము, ధనుర్బాణాలు ధరించిన పరమేశ్వరియే సాక్షి.

## 573. పరాశక్తిః

శరీరం తొమ్మిది ధాతువులతో ఏర్పడింది. పదవధాతువు సాక్షాత్తూ పరమేశ్వరి.

**త్వగసృగ్ - మాంస మేధో స్థిధాతవశక్తి మూలకాః**
**మజ్జా శుక్ల ప్రాణ జీవ ధాతవ శ్శివమూలకాః**
**నవధాతు రయం దేహో నవయోని సముద్భవః**
**దశమీ యోని రే కైవ పరాశక్తి స్తదీశ్వరీ ॥**

చర్మము, రక్తము, మాంసము, మెదడు, ఎముకలు అనే ఐదూ శక్తి ధాతువులు. కాగా మజ్జ, శుక్లము, ప్రాణము, జీవము అనేవి శివధాతువులు. ఈ తొమ్మిది ధాతువులతోను ఈ దేహం ఏర్పడింది. పదవ ధాతువు సాక్షాత్తూ ఆ పరమేశ్వరి అయి ఉన్నది. ఆమెయే పరాశక్తి. ఉత్కృష్టమైన శక్తియే పరాశక్తి. లింగపురాణంలో

**యస్య యస్య పదార్థస్య యా యా శక్తి రుదాహృతా**
**సా సా విశ్వేశ్వరీ దేవీ సర్వా మహేశ్వరీ**
**శక్తిమంతః పదార్థా యే తే వై సర్వవిభూతయః**
**పదార్థే శక్తయో యా యా స్తాం తాం గౌరీం విదు ర్బుధాః ॥**

జగత్తులో ఏ ఏ పదార్థానికి ఏ ఏ శక్తి చెప్పబడిందో, ఆ శక్తి పరమేశ్వరియే. ఆ పదార్థాలు మహేశ్వరుడు. శక్తిగల పదార్థాలన్నీ నీ విభూతులే. పదార్థాలలో ఉండే శక్తి అంతా గౌరియే. అని పండితులకు తెలుసును. పండితులు అంటే జ్ఞానులని అర్థం.

## 574. పరానిష్ఠా

ఉత్కృష్టమైన అంతము గలది. అన్ని కర్మలు, అన్ని జగత్తులు కూడా ఈ పరమేశ్వరి యందే లయం చెందుతాయి. ఇదే విషయాన్ని భగవానుడు గీతలో చెబుతూ

**సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే**

అర్జునా ! అన్ని కర్మలూ జ్ఞానమందు అంతమవుతాయి. సూతగీతలో శాస్త్రాధ్యయనం చెయ్యాలి. గురూపదేశం పొందాలి. విషయాన్ని తెలుసుకోవాలి. ఆత్మకన్న భిన్నమైనది ఏదీ లేదు. జగత్తులోని అన్ని వస్తువులలోనూ ప్రకాశించేది ఆత్మ ఒక్కటే అనే విషయం తెలుసుకుని ఆత్మ సాక్షాత్కారము పొందాలి. కాబట్టి ఆత్మసాక్షాత్కారమంటే తేలిక అయినది కాదు. ఉత్కృష్ఠమైనది. అదే పరానిష్ఠ అనబడుతుంది.

| | | |
|---|---|---|
| సకల ఇంద్రియాలు | – | మనస్సులో లయం అవుతాయి. |
| మనసు | – | బుద్ధిలో లయమవుతుంది |
| బుద్ధి | – | ఆత్మలో లయమవుతుంది |

ఈ రకంగా చేసి ఉన్మనాస్థితిలో స్వరూప జ్ఞానం పొందటమే పరానిష్ఠ అనబడుతుంది.

## 575. ప్రజ్ఞానఘనరూపిణీ

నిత్యము జ్ఞానమయమైనది. అవిద్యా లేక అజ్ఞానముచేత ఏ మాత్రమూ తాకబడనిది. కొంచెముకూడా అవిద్యా సంబంధము లేనటువంటిది. మహోన్నతమైన నిత్యజ్ఞాన స్వరూపము గలది. పరానిష్టా అనే నామంలోని స్వరూపస్థితియే ప్రజ్ఞాన ఘనరూపము. అంటే పరమేశ్వరి జ్ఞానముకన్న వేరైన స్థితి లేనటువంటిది. ఉప్పుగడ్డ పైన క్రింద, లోపల, ప్రక్కల వివిధ రుచులతో ఉండదు. ఎక్కడైనా అది ఒకే రుచిలో ఉప్పగానే ఉంటుంది. అలాగే ఈ ఆత్మ లోపల, బయట అంతటా జ్ఞానమయమైనది. అందుచేతనే ఆమె ప్రజ్ఞాన ఘనరూపిణి అనబడుతున్నది.

## 576. మాధ్వీపానాలసా

మాధ్వీ అంటే – మధువు. ద్రాక్ష రసము. ద్రాక్ష రసము కన్న వేరైనటువంటి మధు పానము చేసినప్పటికీ నిశ్చలమైన మనసు గలది. మధు పానం చేసినప్పుడు మనోచాంచల్యం కలుగుతుంది. కాని పరమేశ్వరి విషయంలో అలా జరగదు. నిరంతరము బ్రహ్మానందానుభవము పొందుతూ విశ్రాంతిగా నిర్వికారస్థితిలో ఉండేటటువంటిది. అదే ప్రజ్ఞాన ఘనరూపము. ఆ స్థితిలో బాహ్యేంద్రియాలు పని చెయ్యవు. ద్వైతభావన ఉండదు. అంతా బ్రహ్మమయమే.

సాధకుడు యోగస్థితిలో కుండలిని జాగృతం చేసి, గ్రంథిత్రయాన్ని ఛేదించి, కుండలినిని సహస్రారం చేర్చినప్పుడు అక్కడినుండి సుధాధారలు వర్షిస్తాయి. వాటితో యోగి శరీరంలోని 72వేల నాడీమండలము తడుస్తుంది. ఆ స్థితిలో సాధకుడు అవ్యాజమైన, అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందుతాడు. అతని శరీరం కంపిస్తుంది. ఆనందంలో తేలియాడుతాడు. ఆ స్థితిలో సాధకుడు నృత్యం చేస్తాడు. ఆ ఆనందము వర్ణనాతీతము అనుభవైక వేద్యము. అదే బ్రహ్మానందము.

ఈ రకంగా బాహ్యేంద్రియ జ్ఞానము, ద్వైత భావము నశించి బ్రహ్మానందంతో నిండినది కాబట్టే మాధ్వీపానాలసా అనబడుతోంది.

## 577. మత్తా

మధుపానముచే మదించినది. బ్రహ్మానందాన్ని పొందటము అనే మధుపానముచే మదించినది. మధుపానం చేస్తే బాహ్యేంద్రయ జ్ఞానం నశిస్తుంది. కాని బ్రహ్మానందం వలన నిర్వికార నిర్గుణస్థితి ఏర్పడుతుంది. ఆస్థితియే మత్తా అనబడుతుంది. తురీయ స్థితిలో ఉండేది.

## 578. మాతృకావర్ణరూపిణీ

మాతృకలు అంటే అకారాది క్ష కారాంతము ఉండే అక్షరాలు. క్షరము కానిది నాశనము లేనిది అక్షరము. ఆ అక్షరముల రూపం కలది. మాతృకల యొక్క వర్ణము అంటే రంగును తెలియచేసేది అని అర్థం.

ప్రతి అక్షరానికి ఒక దేవత ఉన్నది. ఆ దేవతయొక్క చేతులయందు ఆయుధాలు, ఆ దేవత పరిధి, రంగు వివరించబడ్డాయి.

**మాతృకా వశినీ యుక్తాం యోగినీభి సమన్వితాం**
**గంధద్వారాదిసహితాం సంస్మరేత్ త్రిపురాంబికాం ॥**

వశిన్యాది శక్తులతోను, యోగినీ గణములతోను, గంధాకర్షిణి మొదలైన ఆకర్షణ దేవతలతోను కూడిన మాతృకా రూపమయిన త్రిపురాంబికను పూజిస్తున్నాను.

సనత్కుమార సంహితలో అక్షర దేవతల గూర్చి చెప్పబడింది. అందులో అక్షరాలను ఐదు భాగాలుగా చేశారు.

**1. స్వరాత్మిక శక్తులు :** ఇవి అకారాది శక్తులు వీటికి ఎనిమిది చేతులుంటాయి. ఆ చేతులలో పాశము, అంకుశము, అభయ, వరదముద్రలు, పుస్తకము, అక్షమాల, కమండలము, వ్యాఖ్యా ముద్రలను కలిగి ఉంటాయి.

**2. వ్యంజన శక్తులు :** వీటికి నాలుగు చేతులుంటాయి. వాటిలో పాశము, అంకుశము, అక్షమాల, కమండలము ఉంటాయి.

3. య ర ల వ శక్తుల చేతులలో పాశము, అంకుశము, అభయ, వరద ముద్రలు ఉంటాయి.

4. శ ష స హ శక్తుల చేతులలో పాశము, అంకుశము, అభయు, వరదముద్రలుంటాయి.

5. ళ, క్ష శక్తులకు కూడా నాలుగు చేతులే ఉంటాయి. ఆ చేతులలో పాశము, అంకుశము, చెరకుగడ, పుష్పబాణము ఉంటాయి. ఇక

| | | |
|---|---|---|
| అకారాది శక్తులు | - | ధూమ్రవర్ణాలు |
| క నుంచి ఠ వరకు శక్తులు | - | సింధూర వర్ణాలు |
| డ నుంచి ఫ వరకు శక్తులు | - | గౌరవర్ణాలు |
| బ నుంచి ల వరకు శక్తులు | - | అరుణ వర్ణాలు |
| వ నుంచి స వరకు శక్తులు | - | కనక వర్ణాలు |
| హకార క్ష కారముల శక్తులు | - | విద్యుత్ వర్ణాలు |

ఈ శక్తులకు పరిధులు కూడా చెప్పబడ్డాయి.

| | | |
|---|---|---|
| అ కార శక్తిమండల విస్తీర్ణము | - | 80 లక్షల యోజనాలు |
| ఆ కార శక్తిమండల విస్తీర్ణము | - | 160 లక్షల యోజనాలు |

| | | |
|---|---|---|
| ఇ కార శక్తిమండల విస్తీర్ణము | - | 90 లక్షల యోజనాలు |
| ఈ కార శక్తి మండల విస్తీర్ణము | - | 180 లక్షల యోజనాలు |
| ఉ కార శక్తిమండల విస్తీర్ణము | - | కోటియోజనాలు |
| ఊ కార శక్తిమండల విస్తీర్ణము | - | రెండు కోట్ల యోజనాలు |
| ఋ కార శక్తిమండల విస్తీర్ణము | - | 50 లక్షల యోజనాలు |
| ౠ కార శక్తిమండల విస్తీర్ణము | - | కోటి యోజనాలు |
| ఌ ౡ కారశక్తి మండల విస్తీర్ణము | - | అనంతము |
| ఏ ఐ శక్తిమండల విస్తీర్ణము | - | 150 లక్షల యోజనాలు |
| ఓ ఔ శక్తిమండల విస్తీర్ణము | - | 150 లక్షల యోజనాలు |
| అంతఃశక్తిమండల విస్తీర్ణము | - | 320 లక్షల యోజనాలు |
| వ్యంజన శక్తులమండల విస్తీర్ణము | - | 40 లక్షల యోజనాలు |

యోగి అయినవాడు నిష్ఠగా ఈ బీజాలను ధ్యానం చేసినట్లైతే, వాటి శక్తులు ఇంత మేర విస్తరిస్తాయన్న మాట.

వశిన్యాదిశక్తులు, అక్షరాలు తమ తమ ఆయుధాలతో ఉన్నట్లుగా భావన చెయ్యటం వల్లనే శ్రీచక్రానికి మూడు ప్రస్తారాలు వచ్చినాయి.

ఈ రకంగా అక్షర స్వరూపం గలది కాబట్టే పరమేశ్వరి మాతృకా వర్ణరూపిణి అనబడుతోంది.

యజ్ఞవైభవ ఖండంలో

**యథా పరతర శ్శంభుః ద్విధాశక్తిః శివాత్మనా**

**తథైవ మాతృకా దేవీ ద్విధా భూతా సతీ స్వయమ్**

**ఏకా కారేణ శక్తి స్తు వాచికా చేతరేణ తు**

**శివస్య వాచికా సాక్షా ద్విద్యేయం పదగామినీ ॥**

పరమేశ్వరుడు శివుడు, శక్తి అని రెండుగా ఉన్నట్లుగానే మాతృకాదేవి కూడా అచ్చులు హల్లులు అని రెండు విధాలుగా ఉన్నది. దానిలో అచ్చులు శక్తి రూపము హల్లులు శివరూపము.

శ్రీవిద్యార్ణవ తంత్రంలో శ్రీచక్ర ప్రస్తారాలను వివరిస్తూ

**ప్రస్తారో త్రివిధఃప్రోక్తః శ్రీచక్రస్య తథాశ్వరీ**
**మేరు కైలాస భూ సంజ్ఞా బేదాస్య త్రిధాభవేత్**
మేరు ప్రస్తారకం యంత్రం నిత్యా తాదాత్మకం స్మృతం
**మాతృకాయ స్తు కైలాస ప్రస్తారాఖ్యాం సురేశ్వరీ**
**భూప్రస్తారం మహాదేవీ వశిన్యాత్మక ముత్తమమ్ ॥**

శ్రీచక్రము యొక్క ప్రస్తారాలు మూడు రకాలు

1. భూప్రస్తారము 2. మేరు ప్రస్తారము 3. కైలాస ప్రస్తారము

1. భూప్రస్తారంలో వశిన్యాది దేవతల తాదాత్మ్యము
2. మేరు ప్రస్తారంలో షోడశ నిత్యల తాదాత్మ్యము
3. కైలాస ప్రస్తారంలో మాతృకా తాదాత్మ్యము చెప్పబడ్డాయి.

ఈ రకంగా కైలాస ప్రస్తారంలో మాతృకలచే తాదాత్మ్యము చెందుతున్నది కాబట్టి మాతృకావర్ణరూపిణీ అనబడుతోంది.

జ్ఞానార్ణవ తంత్రంలో చెప్పినట్లుగా

**అకారః ప్రథమో దేవీ క్షకారోంత్యః తతః పరం**
**అక్షమాలేతి విఖ్యాతా మాతృకా వర్ణరూపిణీ**

అకారము నుండి క్షకారము వరకు ఉండే అక్షర సముదాయ స్వరూపిణి కాబట్టి మాతృకావర్ణ రూపిణీ అనబడుతోంది.

## 579. మహాకైలాస నిలయా

కైలాస పర్వతం కన్న వేరైనది మహాకైలాసము. అక్కడ నివసించేది పరమేశ్వరి. అది పరమశివునికి నివాస స్థానము త్రిపురాసారంలో

**ఏతత్ కైలాససంజ్ఞం పదం అకులపదం**
**బిందురూపీ స్వరూపీ యత్రా స్తే దేవదేవః**

కైలాసము అనేది అకులస్థానము బిందురూపము. అక్కడ దేవదేవుడుంటాడు అని చెప్పబడింది. అంటే సహస్రారమే కైలాస స్థానము. అక్కడ ఆ పరమేశ్వరి ఉంటుంది.

శ్రీచక్రమే కైలాసము. అందులో బిందువు మహాకైలాసము. ఆ బిందువునందుండునది పరమేశ్వరి. కాబట్టి ఆమె మహాకైలాస నిలయా అనబడుతోంది.

## 580. మృణాలమృదుదోర్లతా

తామరతూడులోని దారంలాగా మృదువైన హస్తములు గలది. పరమేశ్వరి సుషుమ్న రూపిణి. **బిసతంతు తనీయసీ** అని గతంలో చెప్పబడింది. అంత సన్నగా మృదువుగా ఉంటుంది కాబట్టే మృణాల మృదుదోర్లతా అనబడుతుంది.

## 581. మహనీయా

**పూజ్యాత్వాన్ – మహనీయా**

పూజించతగినది కాబట్టి మహనీయా అనబడుతున్నది. ఆ పరమేశ్వరి ఇంద్రాది దేవతలచే ఆరాధించబడుతుంది. కాబట్టి మహనీయా అనబడుతుంది.

## 582. దయామూర్తిః

దయయే రూపముగా గలది. పరమేశ్వరి జగత్తులో ఉండే జీవరాసికంతటికీ మాత. అందుచేత ఆమెయొక్క దయకు ప్రేమకు హద్దులు ఉండవు. కేవలము దయయే మూర్తిగా గలది కాబట్టి దయామూర్తి. దయ అంటే – ఆనందము అని అర్థం చెప్పబడింది. ఆ దేవి ఆనందస్వరూపిణి. బ్రహ్మానందమే స్వరూపముగా గలది. అందుకే దయాస్వరూపిణి.

శ్రీచక్రంలోని తొమ్మిదవ ఆవరణ సర్వానందమయచక్రము. అది పరబ్రహ్మస్థానము. అక్కడ ఉంటుంది. కాబట్టే పరమేశ్వరి దయామూర్తి. శరీరంలో అనాహత పద్మమనబడే హృదయస్థానంలో ఉంటుంది. ఆ హృదయంలోనే దయ, ఆనందము, కరుణ అనేవన్నీ ఉంటాయి. అక్కడ ఉంటుంది. కాబట్టే పరమేశ్వరి దయామూర్తి.

## 583. మహాసామ్రాజ్యశాలినీ

**మహాకైలాసాధిపత్యం – మహాసామ్రాజ్యం. త చ్ఛాలినీ**

మహాసామ్రాజ్యమంటే మహాకైలాసాధిపత్యమే. అటువంటిదానితో ప్రకాశించునది.

సామ్రాజ్యాలన్నింటిలోకీ అధికమైనది, ఉన్నతమైనది మహా సామ్రాజ్యము. అటువంటి మహా సామ్రాజ్యానికి పాలకురాలు. చతుర్దశ భువనాలను పాలించేటటువంటిది. అనేక కోటి బ్రహ్మాండాలకు నాయకురాలు. మహా సామ్రాజ్యము అంటే ఆత్మ సామ్రాజ్యము. ఈ ఆత్మ సామ్రాజ్యానికి ప్రభ్వి. పెద్దవాటన్నింటిలోకి అతిపెద్దది ఆత్మ. అటువంటి ఆత్మ సామ్రాజ్యానికి ప్రభ్వి. కాబట్టి మహా సామ్రాజ్యశాలినీ అనబడుతోంది. ఈ రకంగా పరమేశ్వరి ప్రజ్ఞాన ఘనరూపిణీ అని వర్ణించబడింది.

# 40. ఆత్మవిద్య

ముడిపదార్థం గురించి మనకు తెలిసినట్లైతే ఆ పదార్థంతో తయారయిన వస్తువుల గురించి తేలికగా తెలుస్తుంది. ఉదాహరణకు మట్టిని గురించి తెలిస్తే, మట్టితో తయారుచేసే కుండలు, బానలు, చట్లు, మొదలైన వస్తువులగురించి తెలుస్తుంది. అలాగే బంగారం గురించి తెలిస్తే దానితో తయారుచేసే నగల పేర్లు వేరయినా, వాటన్నింటిలోఉండేది బంగారమే అని తెలుస్తుంది. అదే విధంగా ఏ విషయం తెలుసుకోవటంవల్ల సర్వమూ తెలుస్తాయో, దాన్ని తెలుసుకోవాలి. ప్రతివిషయంలోనూ అంతర్గతంగా ఉండే తత్త్వాన్ని గనక తెలుసుకుంటే మిగిలిన విషయాలన్నీ తెలుస్తాయి.

నదులు తూర్పునుంచి పడమరకు ప్రవహించినా, పడమర నుంచి తూర్పుకు ప్రవహించినా, చివరకు అవి సముద్రంలోనే కలుస్తాయి. సూర్యరశ్మికి నీరు ఆవిరిగామారి మేఘాలరూపం ధరిస్తుంది. ఆ మేఘాలు మళ్ళీ వర్షించి నదులుగా ప్రవహిస్తాయి. ఆ నదులు మళ్ళీ సముద్రంలో కలుస్తాయి. సముద్రంలో కలిసేవరకు వాటికి గంగ, గోదావరి, కృష్ణ అని వివిధరకాల పేర్లుంటాయి. కాని సముద్రంలో కలిసిన తరువాత ఆ నదీజలాన్ని విడదియ్యలేము. అలాగే జీవించి ఉన్నంతవరకు మనిషి, పులి, సింహము, ఆవు, మేక ఇత్యాదినామాలుంటాయి. కాని మరణించిన తరువాత జీవి తన ఉనికిని కోల్పోతాడు. అన్ని జీవాత్మలూ ఆ పరమేశ్వరునిలోని భాగాలే.

సృష్టి ఆరంభంకాకముందు, కృతయుగారంభంలో పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయి ఇతరులతో సంబంధం లేకుండా, తనకు సమానమైన వారుగాని, తనకన్న అధికులుగాని లేకుండా ఏకాకిగా ఉండేవాడు. ఈ రకంగా ఉన్న పరబ్రహ్మ బిందు స్వరూపుడు. ఆ ఏకత్వం అనేకం కావాలని సంకల్పించింది. రకరకాల వస్తువులుగా, చిత్ర విచిత్ర సమ్మేళనాలతో రూపుదాల్చింది. ఘన ద్రవ, వాయు పదార్థాలుగా మార్పు చెంది భిన్న రూపాలతో ఈ సృష్టి ఆకారం పొందింది. జీవరాశి ఉత్పన్నమయింది. సృష్టిలో భాగంగానే హకార సంజ్ఞ గలిగిన పరమేశ్వరుడు సకార సంజ్ఞ గలిగిన ప్రకృతితో కలిసి శబళబ్రహ్మమై బ్రహ్మరంధ్రం ద్వారా మానవ శరీరంలో ప్రవేశించి, ఇంద్రియాల ద్వారా ప్రాపంచిక సుఖాలననుభవిస్తూ పంజరంలోని పక్షిలాగా, ఈ దేహంలో బంధించబడి, బయటకు పోయే మార్గం తెలియక, కొట్టుమిట్టాడుతున్నాడు. జీవాత్మ అనబడే ఈ హంసకు

| | | |
|---|---|---|
| అగ్ని చంద్రమండలాలే | – | రెక్కలు |
| ఓంకారము | – | శిరస్సు |
| జ్ఞాననేత్రము | – | ముఖము |
| హకారసకారాలే | – | పాదాలు |

ఈ రకంగా పరమాత్మ అన్ని ప్రాణులలోనూ, పాలలో ఉన్న నెయ్యిలాగా ఆవరించి ఉన్నాడు. అన్ని జీవాత్మలూ ఆ పరమాత్మలోని భాగాలే. మర్రిచెట్టు చాలా పెద్ద వృక్షం. కాని దానికి కారణమైన విత్తనంలో చూస్తే ఏమీ కనిపించదు. అంటే విత్తనంలో అంత పెద్ద వృక్షానికి కారణమైనది, మనకంటికి కనిపించనంత సూక్ష్మంగా దాగి ఉన్నది. అదేవిధంగా ఆత్మ బయటకు కనిపించకుండా సూక్ష్మరూపంలో సర్వత్రా వ్యాపించి ఉన్నది. ఆత్మకు నాశం లేదు. ముసలితనం లేదు. ఆత్మకు పాపం అంటదు. శోకం తాకదు. ఆకలి దప్పికలు ఉండవు. స్వప్నప్రపంచంలో ప్రభువులాగా విహరించే చైతన్యమే ఆత్మ సుషుప్తిలో ఆనందాన్ని అనుభవించేదే ఆత్మ.

ప్రకాశబిందువు పరబ్రహ్మస్వరూపమైన చంద్రమండలం. అకారబీజం. విమర్శ బిందువు శక్తి బీజం. అగ్నిమండలం హకార బీజం. ఈ రెండింటి సామరస్యమే అహం. ఇదే పరబ్రహ్మ స్వరూపం. పరమేశ్వరుని ప్రతిబింబమే శక్తి. అదే మాయ. అందుచేతనే శక్తి లేకుండా శివుడుగాని, శివుడు లేకుండా శక్తిగాని ఉండవు. ఇక్కడ శివశక్తులు అంటే త్రిమూర్తి ద్వంద్వంలోని వారు కాదు. పరమేశ్వరీ పరమేశ్వరులు. వీరిద్దరి కలయిక లేనిదే స్వరూప జ్ఞానం కలగదు. అహమనేది ఆత్మరూపం. ఇదే ఆత్మమంత్రం. ఆత్మమంత్రము, హంస మంత్రము రెండూ సమాన ధర్మాలు కలిగి ఉన్నాయి.

శరీరం అశాశ్వతమైనది. శాశ్వతమైన ఆత్మకు అశాశ్వతమైన శరీరం ఆవాసంగా ఉంటుంది. శరీరం ఉన్నంతకాలము ఆత్మకు గుణదోషాలు, సుఖ దుఃఖాలు అంటినట్లు, వాటితో శతమతమవుతున్నట్లూ అనిపిస్తుంది. ఆత్మ శరీరంతో సంబంధం ఏర్పరచుకోవటం వల్ల జీవులకు సుఖ దుఃఖాలతో సంబంధం ఏర్పడుతుంది. మానవుడు మాసిన వస్త్రాన్ని వదిలి నూతనవస్త్రాన్ని ధరించినట్లే ఆత్మజీర్ణమైన ఈ దేహాన్ని వదిలి ఇంకొక దేహాన్ని ఆశ్రయిస్తున్నది. ఆత్మ శరీరం నుంచి విడిపోతే భౌతిక బంధనాల నుండి విముక్తి కలుగుతుంది.

శ్రీవిద్య అనేది ఆత్మవిద్య. అదే బ్రహ్మవిద్య. అందులో షోడశి మహా మంత్రము మోక్ష కారకము. ఆ మంత్రాధిదేవత సాక్షాత్తూ పరబ్రహ్మ స్వరూపము.

ఆత్మవిద్యయే శ్రీవిద్య. అదే మహాషోడశి అని చెప్పి 584 నుంచి 590వ నామం వరకు ఆత్మవిద్యను వివరిస్తున్నారు.

## 584. ఆత్మవిద్యా

**ఆత్మజ్ఞానరూపత్వాత్ ఆత్మవిద్యా**

ఆత్మ జ్ఞాన రూపము గలది కావటంచేత ఇది ఆత్మవిద్య అనబడుతుంది.

అసలు ఆత్మ అంటే ఏమిటి? ఐతరేయోపనిషత్తులో పరమేశ్వరుడు పూర్వకల్పంలో ఏ విధంగా అయితే సృష్టి ఉన్నదో, అదే విధంగా మళ్ళీ సృష్టి చెయ్యాలి అని సంకల్పించాడు. లోకాలను సృష్టించాడు. లోక పాలకులను సృష్టించాడు. ఇంద్రియాలకు అధిష్ఠాన దేవతలను సృష్టించాడు. చివరకు విరాడ్రూపాన్ని పోలిన మానవుణ్ణి సృష్టించాడు. ఇప్పుడు పరమేశ్వరుడు మానవదేహంలో ప్రవేశించాలి అనుకున్నాడు. అలా ప్రవేశించటానికి రెండు మార్గాలున్నాయి. 1. పై నుంచి (శిరస్సు నుంచి) 2. క్రింద నుంచి (పాదాల దగ్గర నుంచి) పాదాల దగ్గర నుంచి ప్రవేశించటమనేది సేవకా లక్షణం. అందుచేత పరమాత్మ శిరస్సునుంచే మానవదేహంలో ప్రవేశించాడు. అదే ఆత్మ. అని చెప్పబడింది.

హకార సంజ్ఞగల పరమేశ్వరుడు సకార సంజ్ఞ కలిగిన ప్రకృతితో కలిసి శబళ బ్రహ్మమై నవరంధ్రాలతోనూ, దశేంద్రియాలతోనూ కూడినటువంటి మానవదేహంలో ప్రవేశించి, బయటకు వెళ్ళే మార్గం తెలియక పంజరంలో బంధించబడిన పక్షిలాగా కొట్టుమిట్టాడుతున్నాడు. ఇదే జీవాత్మ. ఈ జీవాత్మ గనక వచ్చిన దారిగుండానే బయటకు వెళ్ళగలిగినట్లైతే పరమాత్మలో లీనమవుతుంది. అంటే ఆత్మను బ్రహ్మరంధ్రంగుండా గనక బయటకు పంపగలిగినట్లైతే అది పరమాత్మలో లీనమవుతుంది.

తైత్తిరీయోపనిషత్తులో వరుణమహర్షి కుమారుడు భృగుమహర్షి. విద్యాభ్యాసం పూర్తిచేసి ఆత్మవిద్యను బోధించమని తండ్రిని అడుగుతాడు. ఈ విషయమంతా గతంలో పంచకోశాంతర స్థితా అనే నామంలో వివరించటం జరిగింది.

బృహదారణ్యకోపనిషత్తులో ప్రజాపతి ఒకసారి ఆత్మను గురించి ఒక ప్రకటన చేశాడు. "ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించదు. శోకం తాకదు. ఆత్మకు ఆకలిదప్పికలు లేవు. మానవుడు సత్యకాముడు సత్యసంకల్పుడు అయి ఆత్మజిజ్ఞాసను అలవరచుకోవాలి. ఆత్మకోసం అన్వేషించినవాడు, ఆత్మను అనుభవించిన వాడు ఆత్మ స్వరూపాన్ని పొందుతాడు.

ఈ మాట విని దేవతల రాజైన ఇంద్రుడు, రాక్షసరాజైన విరోచనుడు బ్రహ్మదగ్గరకు వచ్చి ఆత్మవిద్యను పొందేటందుకుగాను, ఆయనకు శిష్యరికం చేస్తారు. విరోచనుడు దేహమే ఆత్మ అనుకుని వెళ్ళిపోతాడు. కాని ఇంద్రుడు మళ్ళీ, మళ్ళీ బ్రహ్మచర్యమవలంబిస్తాడు. చివరకు ఇంద్రునిపట్టుదలకు మెచ్చి బ్రహ్మ ఆత్మతత్త్వాన్ని పూర్తిగా వివరించాడు.

శరీరం అశాశ్వతమైనది. ఆఖరు క్షణాలురాగానే మృత్యువు శరీరాన్ని కబళిస్తుంది. శాశ్వతమైన ఆత్మకు అశాశ్వతమైన శరీరమే ఆవాసం. శరీరంలో ఉన్నంతకాలమూ ఆత్మకు సుఖదుఃఖాలు, గుణదోషాలు అంటినట్లు, వాటితో శతమతమవుతున్నట్లు కనిపిస్తుంది. ఆత్మ శరీరంతో సంబంధం ఏర్పరచుకోవటంవల్లనే జీవులకు సుఖదుఃఖాలు ఏర్పడతాయి. శరీరం నుంచి విడిపోగానే ఆత్మకు ఈ బంధనాలతో సంబంధముండదు.

భౌతిక విషయాలనుండి విముక్తి పొంది, ఆత్మను మనస్సుకు, ఇంద్రియాలకు విలక్షణమైనదిగా గ్రహించి ఆత్మ తేజోమయము అని భావించి అనుభవజ్ఞుడు ఆనందిస్తాడు. ఆత్మజ్ఞానం పొందినవాడు ముక్తి సామ్రాజ్యంలో విహరిస్తాడు. అని చెప్పబడింది.

కఠోపనిషత్తులో వాజశ్రవుడు 'విశ్వజిత్' అనే యాగం చేస్తూ, దానిలో భాగంగా తనకుమారుడైన నచికేతుణ్ణి యమధర్మరాజుకు దానమిస్తాడు. నచికేతుడు యముడి దగ్గరకు వెళ్ళేసరికి అతడు ఇంట్లో లేడు. అందుచేత మూడు రోజులపాటు యముడు తిరిగి వచ్చేదాకా అతని ఇంటనే నిరాహారియై ఎదురుచూస్తూ కూర్చున్నాడు. యముడు తిరిగి వచ్చి, విషయం తెలుసుకుని, నచికేతుడికి మూడు వరాలిస్తాను కోరుకోమంటాడు. అందులో మూడవ వరంగా ఆత్మజ్ఞానం ఉపదేశించమని అడుగుతాడు నచికేతుడు. చివరకు యముడు నచికేతుడికి ఆత్మజ్ఞానాన్ని వివరిస్తాడు.

"ఆత్మజ్ఞానం అనే పదం వినటానికి కూడా చాలామందికి అర్హత ఉండదు. అందుకే వాళ్ళు దానికి ఇష్టపడరు. కొందరికి ఇది విన్నా అర్థం కాదు. దీన్నిగురించి చెప్పే గురువు దొరకటం కూడా చాలా విశేషం. బ్రహ్మజ్ఞానం పొందిన గురువుద్వారా ఈ విషయాన్ని తెలుసుకోవటం పూర్వజన్మ సుకృతం. అంటూ ప్రారంభించి...

ఆత్మసాక్షాత్కారమనేది వేదాలు వల్లించటం వల్ల, శాస్త్రాలు చదవటంవల్ల, ధారణశక్తివల్ల, ఉపన్యాసాలు వినటంవల్ల, ఉపదేశించటంవల్ల లభించదు. అది ఆత్మవల్ల మాత్రమే సాధ్యపడుతుంది. అర్హుడైన వ్యక్తికి ఆత్మ తన నిజస్వరూపం చూపుతుంది.

ఆత్మ అనేది సూక్ష్మమైన బుద్ధిచేత మాత్రమే గ్రహించబడుతుంది. ఆత్మసర్వవస్తువులందు ఉన్నది కాని పైకి కనపడదు.

శబ్దము, రూపము, రసము, వాసన లేనిది, ఆద్యంతాలు లేనిది, అయినటువంటి ఆత్మతత్త్వాన్ని తెలుసుకున్నవాడు మృత్యువాత పడడు. అని చెబుతాడు.

ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకుని కుమారుడు శ్వేతకేతువు. విద్యాభ్యాసం పూర్తి చేశాడు. ఆత్మవిద్యను తెలుసుకోవాలనీ, దాన్ని వివరించమని తండ్రిని అడిగాడు. చెప్పటం మొదలుపెట్టాడు ఉద్దాలకుడు.

నదులు తూర్పునుంచి పడమరకు ప్రవహించినా, పడమర నుంచి తూర్పుకు ప్రవహించినా చివరకు అవి సముద్రంలోనే కలుస్తాయి. సూర్యరశ్మికి నీరు ఆవిరి అయి మేఘాలుగా మారి కొండలమీద వర్షం కురిసి, వాగులుగా, ఏరులుగా, నదులుగా ప్రవహించి చివరకు సముద్రంలో కలుస్తుంది. నీరు ప్రవహించేటప్పుడు ఇది గంగానది, ఇది డొంకవాగనీ, ఇది బుడమేరు అని రకరకాల పేర్లతో పిలువబడుతుంది. కాని సముద్రంలో చేరగానే నదులకు, వాగులకు అన్నింటికీ వాటికి ప్రత్యేకమైన గుర్తింపు ఇంక ఉండదు. అలానే జీవి అనేది ఏ రూపంలో ఉన్నప్పటికీ, చైతన్య సముద్రంలో కలిసిపోయాక తన రూపాన్ని పోగొట్టుకుంటుంది. ఈ రకంగా జీవులన్నీ ఏ తత్త్వంలో కలిసిపోతాయో, అదే ఆత్మ తత్త్వం. అది అద్వితీయమైనది, సూక్ష్మమైనది, సర్వవ్యాపకమైనది. అదే నీవు తత్త్వమసి శ్వేతకేతూ అదే నీవు.

అదే విధంగా ఉపకోశలుడికి అగ్నులు ఆత్మ తత్త్వాన్ని వివరిస్తాయి. భూమి, చంద్రుడు, సూర్యుడు అన్నీ ఆ పరబ్రహ్మ యొక్క రూపాలే. ఆకాశంలోని సూర్యునిలో ఏ తత్త్వమైతే ఉన్నదో అదే నాలోనూ, నీలోనూ కూడా ఉన్నది. తూర్పు పడమర ఉత్తరదక్షిణాలు, నేల, నీరు, నింగి, ఆకాశము, నక్షత్రాలు వీటన్నింటిలో ఉన్నతత్త్వం ఒక్కటే. ఆకాశంలోని మెరుపులో ఏ తత్త్వమైతే ఉన్నదో, అదే నాలోనూ ఉన్నది. అదే చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నది. అదే ఆత్మతత్త్వం. అదే బ్రహ్మతత్త్వం.

సనత్కుమారుడు నారదుడికి ఉపదేశించిన భూమా విద్య అంతా ఆత్మవిద్యే.

ఈ రకంగా ఆత్మ విద్యను గురించి ఉపనిషత్తులన్నింటిలోనూ వివరించబడింది. పరబ్రహ్మను గురించిన జ్ఞానమే ఆత్మజ్ఞానము. ఆత్మవిద్యయే బ్రహ్మవిద్య, ఆత్మవిద్య కలది కాబట్టి పరమేశ్వరి ఆత్మవిద్యా అనబడుతోంది.

## 585. మహావిద్యా

ఆత్మవిద్యే మహావిద్య. అదే బ్రహ్మ విద్య. సర్వ అనర్థాలను తొలగిస్తుంది కాబట్టి అది మహత్తత్త్వము గలిగినది. పరమేశ్వరి బ్రహ్మవిద్యా స్వరూపిణి కాబట్టి మహావిద్యా అని చెప్పబడుతోంది.

దేవీ భాగవతంలో మణిద్వీపంలోని ప్రాకారాలను వివరిస్తూ అక్కడ ఆమ్నాయ దేవతలు, భువనేశ్వరి అవతారమూర్తులు మహావిద్యలు సప్తకోటి మంత్రాలు ఉంటాయి.

**కాళీ తారా మహావిద్యా షోడశీ భువనేశ్వరీ**
**భైరవీ ఛిన్నమస్తా చ విద్యా ధూమవతీ తథా**
**బగళా సిద్ధ విద్యా చ మాతంగీ కమలాత్మికా**
**ఏతా దశ మహావిద్యా సిద్ధ విద్యాః ప్రకీర్తితాః ॥**

ఈ పది మహావిద్య సిద్ధవిద్యలుగా ప్రసిద్ధి చెందినాయి. వనదుర్గా పంచశతీ విద్యకు మహావిద్య అని పేరుంది. ఉపనిషత్తులలో చెప్పిన ఆత్మవిద్య అంతా మహావిద్యయే.

## 586. శ్రీవిద్యా

శ్రీ అంటే పరమేశ్వరి. స్త్రీ దేవతల గురించి చెప్పే యంత్ర తంత్ర మంత్ర విషయాలను 'విద్య' అని అంటారు. కాబట్టి శ్రీవిద్య అంటే ఆ పరమేశ్వరి యొక్క యంత్ర మంత్ర తంత్ర విభాగము. ఉపాసనాకాండ. విష్ణుపురాణంలో "ఓ దేవీ! యజ్ఞ విద్య, మహావిద్య, గుహ్యావిద్య, ఆత్మవిద్య, మోక్షవిద్య అన్నీ నువ్వే. కర్మకాండ, ఉపాసన, మంత్రవిద్య, బ్రహ్మావిద్య అన్నీ నువ్వే." అని చెప్పబడింది.

పంచదశీ స్వరూపంగల విద్య. అదే శ్రీవిద్య. పంచదశీ మహామంత్రాన్ని గురించి గతంలో వివరించటం జరిగింది. పంచదశి మహామంత్రం అంటే విశ్వరూపమే. అదే వైశ్యానరాత్మ. పరమేశ్వర స్వరూపము. అసలు ఆ మంత్రం పంచభూతాలనుండి ఏర్పడింది. ఈ మంత్రంలో హ క ర స ల అనే అక్షరాలున్నాయి. ఇవి పంచభూతాల బీజాలు.

**హకారద్వయ సంభూతం కకారస్తు ప్రభంజనః**
**రేఫాదగ్నిః సకార శ్చ జలతత్త్వసముద్భవః**
**లకారాత్పృథివీబీజం తస్మా ద్విశ్వమయీా చసా ।**

| | | |
|---|---|---|
| హకారము | - | ఆకాశము |
| కకారము | - | వాయుబీజం |
| రకారము | - | అగ్నిబీజము |
| సకారము | - | జలబీజము |
| లకారము | - | పృధ్వీబీజము |

ఈ రకంగా శ్రీవిద్య పంచభూతమయమైనది. తైత్తిరీయోపనిషత్తులో

**ఆకాశాద్వాయుః**
**వాయోరగ్నిః**
**అగ్నేరాపః**
**ఆపః పృథ్వీ**

అని చెప్పబడింది. అంటే

| | | |
|---|---|---|
| ఆకాశము నుండి | - | వాయువు |
| వాయువు నుండి | - | అగ్ని |
| అగ్ని నుండి | - | జలము |
| జలము నుండి | - | భూమి ఉద్భవించాయి |

ఈ కారణం చేత

1. ఆకాశమందు - ఆకాశతత్త్వము ఒకటే ఉన్నది
2. వాయువు నందు - ఆకాశ, వాయుతత్త్వాలున్నాయి
3. అగ్నియందు - ఆకాశ, వాయు, అగ్నితత్త్వాలు
4. జలమునందు - ఆకాశ, వాయు, అగ్ని, జలతత్త్వాలున్నాయి
5. భూమియందు - ఆకాశ, వాయు, అగ్ని, జల, భూతత్త్వాలున్నాయి.

ఈ రకంగా చూసినట్లైతే

| | | |
|---|---|---|
| ఆకాశము | - | 5 భాగాలు |
| వాయువు | - | 4 భాగాలు |
| అగ్ని | - | 3 భాగాలు |
| జలము | - | 2 భాగాలు |
| భూమి | - | 1 భాగము |
| వెరసి | - | 15 భాగాలు |

ఈ రకంగా పంచభూతాలు మొత్తం 15 భాగాలుగా అయినాయి. ఈ 15 భాగాలవల్లనే 15 అక్షరాలు గల పంచదశీ మహామంత్రం ఏర్పడింది.

ఇప్పుడు మంత్రంలో

| | | | |
|---|---|---|---|
| ఆకాశం | 5 భాగాలు | బీజం హకారం | 5 హకారాలు |
| వాయువు | 4 భాగాలు | బీజం కకారం | 4 కకారాలు |
| అగ్ని | 3 భాగాలు | బీజం రకారం | 3 రకారాలు |
| జలం | 2 భాగాలు | బీజం రకారం | 2 రకారాలు |
| పృధ్వి | 1 భాగం | బీజం లకారం | 1 లకారం |

అయితే వాయుబీజం కకారం. ఇవి 4 ఉన్నాయి. కాని మంత్రంలో కకారాలు మూడు మాత్రమే ఉన్నాయి. అందుచేత కకారానికి బదులుగా ఈ కారం వాయుతత్త్వాత్మకంగా తీసుకోవాలి. అప్పుడు మంత్రంలో ఉన్న ఈకారము ఒకటి, మూడు హ్రీంకారాలలోనూ మూడు వెరసి నాలుగు ఈకారాలుంటాయి. ఇక మంత్రంలో లకారాలు మూడున్నప్పటికీ వాటిని ఒకటిగానే పరిగణించాలి. ఎందుకంటే అవి భూలోక భువర్లోక సువర్లోకాలకు ప్రతీక.

మంత్రంలో ఉన్న మూడు కకారాలచేత సాధకులు మూడు రకాలుగా విభజించబడుతున్నారు.

**కకారత్రయవాచ్య స్తు సకలాః ప్రళయాః కళాః**
**విజ్ఞానకేవలశ్చేతి త్రిఃప్రకారా ఉపాసకాః**

1. సకలులు – వీరు భగవంతుడు వేరు భక్తుడు వేరు అని నమ్ముతారు. వీరు కేవలము ఐహికవాదులు. భోగభాగ్యాల కోసం ప్రాకులాడతారు.

2. ప్రళయాకలులు – వీరు మిశ్రమ దృష్టి గలవారు. కర్మలను ఆచరిస్తుంటారు. వీరికి జ్ఞానదృష్టి కూడా ఉంటుంది.

3. నిష్కలులు – వీరు కేవలము జ్ఞాన స్వరూపులు. మోక్షవాదులు. నిర్గుణ బ్రహ్మను మాత్రమే ఆరాధిస్తారు.

ఈ రకంగా పంచభూతాల స్వరూపమే పంచదశీ మహామంత్రం.

పంచదశీ మహామంత్రంలో మొత్తం 37 బీజాలున్నాయి.

**ఏవం సప్తత్రింశ త్సంఖ్యాక పదైర్మ హావిద్యా**

**షట్త్రింశ త్తత్త్వానాం తత్త్వాతీతస్య చాభిదాత్రయమ్ ॥**

| బీజాలు | | తత్త్వాలు | |
|---|---|---|---|
| హకారములు | 5 | పంచభూతాలు | 5 |
| ఈకారములు | 4 | తన్మాత్రలు | 5 |
| రేఫలు | 3 | ఇంద్రియాలు | 10 |
| పకారాలు | 2 | మనస్సు, బుద్ధి, అహంకారము | 3 |
| లకారాలు | 3 | ప్రకృతి, పురుషుడు | |
| కకారాలు | 3 | కలా, విద్యా, రాగము, | |
| | | కాలము, నియతి | 5 |
| ఆకారాలు | 10 | మాయ, శుద్ధ విద్య, మహేశ్వరుడు | |
| | | సదాశివుడు | 4 |
| బిందువులు | 3 | శక్తి, శివుడు | 2 |
| నాదములు | 3 | | |
| ఏకారము | 1 | | |
| మొత్తం | 37 | | 36 |

తత్త్వాతీతము పరమేశ్వరుడు
అదే ఏకారము

పంచదశీ మహామంత్రానికి అర్థాన్ని చూసినప్పటికీ, అది పరమేశ్వర రూపమే. మంత్రం మూడు కూటములుగా ఉన్నది. అందులో

ప్రథమ కూటమి – ఇది సృష్టికూటమి

| | | |
|---|---|---|
| క | – | బ్రహ్మాస్వరూపం |
| ఏ | – | భారతీ స్వరూపం |
| ఈ | – | విష్ణు స్వరూపం |
| ల | – | పృథివీ రూపం |

హ – రుద్ర రూపం

రేఫ – రుద్రాణి

ఈం – ఇది శాంత, అంబికల సమిష్టి రూపం

ద్వితీయ కూటమి– స్థితి కూటమి

ఈ కూటమిలో మధ్యన ఉన్న హకారము వదలివేయాలి. అప్పుడు **హ స క ల హ్రీం** అవుతుంది.

హకారము – బ్రహ్మరూపము

సకారము – భారతి రూపము

కకారము – విష్ణువు రూపము

లకారము – పృథివి రూపము

హకారము – రుద్రరూపము

రకారము – రుద్రాణిరూపము

ఈంకారము – శాంతా అంబికల సమిష్టి రూపము

మూడవ కూటమి – సంహార కూటమి

రెండవ కూటమిలో వదలివేసిన హకారాన్ని మూడవ కూటమి మొదటన చేర్చాలి. అప్పుడు ఈ కూటమి కూడా రెండవ కూటమిలాగానే **హ స క ల హ్రీం** అవుతుంది. దాని అర్థంకూడా పైన చెప్పినట్లే ఉంటుంది.

ఈ రకంగా పంచదశీ మహామంత్రం పరమేశ్వరి రూపమేకాని వేరుకాదు. అందుచేతనే ఆ దేవి శ్రీవిద్యా అనబడుతోంది.

శ్రీవిద్యలో ప్రధానంగా పూజించబడే శ్రీచక్రము పంచదశీ మహామంత్రం నుంచే వచ్చింది. మంత్రంలో మొత్తం తొమ్మిది బీజాలున్నాయి. అవి

ల, స, హ, ఈ, ఏ, ర, క, అర్ధచంద్రము, బిందువు. ఈ తొమ్మిది బీజాలనుంచే తొమ్మిది ఆవరణలు వచ్చాయి.

1. లకారము పృథివీ బీజం. దీనివల్ల భూపురం పుట్టింది
2. సకారము చంద్రబీజం. దీనివల్ల షోడశదళం పుట్టింది.
3. హకారము శివబీజం. దీనివల్ల అష్టదళము పుట్టింది

| | | |
|---|---|---|
| 4. | ఈకారము | మాయాబీజం. దీనివల్ల చతుర్దశారము పుట్టింది |
| 5. | ఏకారము | శక్తి బీజం. దీనివల్ల బహిర్దశారం పుట్టింది |
| 6. | రకారము | అగ్నిబీజం. దీనివల్ల అంతర్దశారం పుట్టింది |
| 7. | కకారము | మన్మథబీజం. దీనివల్ల అష్టదళం పుట్టింది |
| 8. | అర్ధచంద్రము | త్రిగుణాత్మకము. దీనివల్ల త్రికోణం పుట్టింది |
| 9. | బిందువు | పరబ్రహ్మాత్మకము. దీనివల్ల బిందువు పుట్టింది |

ఈ రకంగా మంత్ర, యంత్ర, తంత్రాలన్నీ పరమేశ్వరి స్వరూపమే. కాబట్టి ఆమె శ్రీవిద్యా అనబడుతోంది.

## 587. కామసేవితా

కామ అంటే మహాకామేశ్వరుడు. అతనిచే సేవించబడినది.

కాముడు – మన్మథుడు. మనువు, చంద్రుడు, కుబేరుడు మొదలగు శ్రీవిద్యోపాసకులు పన్నెండుమందిలోనూ ఒకడు. అతనిచే సేవించబడినది. లక్ష్మీదేవి కుమారుడైన అనంగుడు (మన్మథుడు) అయికూడా శ్రీవిద్యను పొందగలిగాడు. వ్రేళ్ళు లేనివాడైనప్పటికీ పరమేశ్వరికి మ్రొక్కాడు. మెడ లేనివాడయి కూడా శ్రీవిద్యామణిని ధరించాడు. నాలుక లేనివాడయినప్పటికీ దాని రుచి తెలుసుకున్నాడు. అతడే ఆ మంత్రానికి ఋషి అని అరుణోపనిషత్తులో చెప్పబడింది.

మన్మథుడు అంగములు లేనివాడయినప్పటికీ శ్రీవిద్యను పొందగలిగాడు. అర్చనాదివిధులు జ్ఞానికి అనవసరము. శివశక్తులు ఇద్దరూ ఒక్కటే. అనే విషయం తెలుసుకున్నవాడే ముక్తి పొందుతాడు.

మన్మథుడు పరమేశ్వరిని ధ్యానించి, చెరకువిల్లు పూలబాణాలు ఆయుధాలుగా పొందగలిగాడు. వాటితో లోకాలన్నీ జయిస్తున్నాడు. శంకర భగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 6వ శ్లోకంలో ఈ విషయాన్ని వివరిస్తూ

**ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ పంచ విశిఖాః**
**వసంత స్సామంతో మలయమరు దాయోధన రథః**
**తథా ప్యేకః సర్వం హిమగిరిసుతే ! కామపి కృపాం**
**అపాంగా త్తే లబ్ధ్వా జగ దిద మనంగో విజయతే ॥**

తల్లీ ! ఆ మనిషిని చూడబోతే అనంగుడు. అతనికి అసలు శరీరమే లేదు. ఇక ధనుస్సును చూద్దామా – పూవులతో తయారయినది. పట్టుకుంటే నలిగిపోతుంది. అల్లెత్రాడును చూద్దామా – తుమ్మెదల వరుస అవి సరిగా ఉండవు. బాణాలు చూద్దామా – పూలబాణాలు. అవీ తన్మాత్రలు. సామంతుడు (చెలికాడు) చూద్దామా – వసంతుడు. అది కాలం. పలకలేదు. మాట్లాడలేదు. సలహా చెప్పలేదు. ఇక రథం చూద్దామా – మలయ మారుతం. దక్షిణ కొండగాలి. అది ఎప్పుడు ఉంటుందో, ఉండదో తెలియదు.

అతడికి నుంచోటానికి కాళ్ళు లేవు. ధనుస్సు పట్టుకోవటానికి చేతులు లేవు. సలహా చెప్పే సచివుడు లేడు. రథం లేదు గుర్రాలు లేవు. ఇన్ని అవలక్షణాలు ఉండి కూడా కేవలము నీ కృపాకటాక్ష వీక్షణాలవల్లనే అతడు లోకంలో ప్రసిద్ధులైన తపోధనులతో యుద్ధంచేసి గెలవగలుగుతున్నాడు.

సృష్టి ప్రారంభానికి ముందు మహాకామేశ్వరునితో సేవించబడినది. కాబట్టి కామసేవితా అనబడుతోంది.

## 588. శ్రీషోడశాక్షరీవిద్యా

శ్రీవిద్యలో ప్రధానమైన మంత్రము షోడశాక్షరి. ఇది పదహారు అక్షరాలు గల మంత్రము. దీనినే శుద్ధవిద్య అనికూడా అంటారు. అయితే శుద్ధవిద్య అనే మంత్రం ఇంకొకటి ఉన్నది. దానికి సదాశివుడు ఋషి గాయత్రి ఛందస్సు. దీనిలో మూడు బీజాక్షరాలు మాత్రమే ఉంటాయి. దీని మంత్రము ఐం ఈం ఔం. దీన్ని గతంలో వివరించాం.

షోడశి మంత్రము పదహారు అక్షరాల మంత్రము.

**కామరాజ మంత్రాంతే శ్రీబీజేన సమన్వితా**
**షోడశాక్షరీ విద్యేయం శ్రీవిద్యేతి ప్రకీర్తితా ॥**

మన్మథుడు ఉపాసించిన మంత్రానికి చివర శ్రీం బీజాన్ని కలిపితే, అది షోడశి అవుతుంది.

**క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । శ్రీం ॥**

లొల్లా లక్ష్మీధరులు, భాస్కరాచార్యులవారు కూడా దీన్ని సమర్థించారు. కాని పంచదశీ మహామంత్రానికి ఈం బీజం చేర్చినట్లైతే షోడశాక్షరి అవుతుంది. అని కొందరి వాదన. వీరి ప్రకారం మంత్రం.

**క ఏ ఈ ల హ్రీం । హ స క హల హ్రీం । సకల హ్రీం । ఈం ॥**

అయితే ఇది కేవలము పదహారు అక్షరాల మంత్రం. అంతేకాని బ్రహ్మవిద్య కాదు. బ్రహ్మవిద్య అంటే మోక్షవిద్య. జీవాత్మను పరమాత్మలో కలిపేందుకు సాధనమైన విద్య. బ్రహ్మవిద్య అయిన షోడశిని 'మహాషోడశి' అంటారు. దీనిలో ఇరవై ఎనిమిది అక్షరాలుంటాయి.

**అష్టౌ బీజాక్షరా ణ్యాదౌ పశ్చా త్పంచదశీ తతః ।**
**పంచబీజాక్షరా ప్యేషా శ్రీ మహాషోడశీ మతా ॥**

పంచదశీ మహామంత్రానికి ముందు ఎనిమిది బీజాక్షరాలు, తరువాత ఐదు బీజాక్షరాలు ఉన్నట్లైతే, దాన్ని మహాషోడశి అంటారు. ఇది బ్రహ్మవిద్య. ఐతే ముందు ఉండవలసిన బీజాక్షరాలు ఏవి ? తరువాత ఉండవలసినవి ఏవి ?

**శ్రీబీజమాయా స్మరయోనిశక్తిః సర్వం చ మాయా కమలాత్మవిద్యా ।**
**శక్త్యాదిబీజాని విలోమితాని శ్రీషోడశార్ణాః పరదేవతాయాః ॥**

దీని ప్రకారం మహాషోడశికి పదహారు అక్షరాలే ఉంటాయి. ప్రణవము అంటే ఓంకారము. అయితే **శ్రీం హ్రీం క్లీం ఐం సౌః** అనేవి శక్తి ప్రణవాలు. అవే పంచ ప్రణవాలు. ఈ పంచ ప్రణవాలు, **ఓం హ్రీం శ్రీం** మొత్తం ఎనిమిది బీజాలు పంచదశి మహామంత్రానికి ముందు, తరువాత మళ్ళీ పంచప్రణవాలు. అక్షరాలను లెక్క పెట్టేటప్పుడు పంచదశి మంత్రంలోని మూడు కూటాలను మూడు అక్షరాలుగా లెక్కపెట్టాలి. ఇప్పుడు 8+3+5 = 16 అక్షరాలుంటాయి. ఇదే మహాషోడశి. విడివిడిగా చూస్తే ఇందులో 28 అక్షరాలుంటాయి. ఇప్పుడు మహాషోడశి మంత్రము.

**శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం క ఏ ఈ ల హ్రీం ।**
**హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । సౌః ఐం క్లీం హ్రీం శ్రీం ॥**

ఈ మంత్రంలో మొత్తం 16 అక్షరాలుంటాయి. ప్రతి అక్షరంలోనూ శివశక్తులు ఉంటాయి. అలా గనక చూసినట్లైతే 16 × 2 = 32 భాగాలవుతాయి. అదే పదహారు జతలు. అవి నోటిలోని దంతాలు.

ఈరకంగా షోడశి మంత్రరూపిణి కాబట్టి పరమేశ్వరి శ్రీ షోడశాక్షరీ విద్యా అనబడుతోంది.

## 589. త్రికూటా

త్రిపుటియే స్వరూపంగా గలది. మూడు కూటములుగా గలది.

శిరస్సు - వాగ్భవకూటమి

కంఠము నుండి కటి వరకు - కామరాజకూటమి

కటి నుండి క్రింది భాగము - శక్తి కూటమి

ఈ మూడింటినీ త్రికూటములు అంటారు. ఇదే పరమేశ్వరి స్వరూపం. మంత్ర స్వరూపం.

త్రికోణంలోని మూడు కోణాలయందు

1. మండలత్రయము - చంద్ర సూర్య అగ్ని మండలాలు
2. గుణత్రయము - సత్వరజస్తమో గుణాలు
3. బీజత్రయము - వాగ్భవకామరాజశక్తి బీజాలు
4. శక్తిత్రయము - ఇచ్ఛా జ్ఞానక్రియా శక్తులు
5. మూర్తిత్రయము - బ్రహ్మవిష్ణు రుద్రులు
6. త్రిపుటి - జ్ఞాత జ్ఞాతృజ్ఞేయములు
7. అవస్థాత్రయము - జాగ్రస్వప్న సుషుప్తులు
8. పీఠత్రయము - పూర్ణగిరి, కామరాజ, జాలంధర పీఠాలు
9. ముల్లోకాలు - భూలోక భువర్లోక సువర్లోకాలు

ఈ రకంగా మూడు కూటముల స్వరూపము గలది. కాబట్టి పరమేశ్వరి త్రికూటా అని చెప్పబడింది.

## 590. కామకోటికా

కాముడు అంటే శివుడు. అటువంటి శివుడు ఏకదేశముగా గలది. శక్తి సామరస్యమైన పరబ్రహ్మ స్వరూపము గలది.

ధర్మార్థ కామ మోక్షాలనబడే చతుర్విధ పురుషార్థాలలో మోక్షమే స్వరూపంగా గలది.

ఈ రకంగా ఆత్మవిద్యను వివరించటం జరిగింది.

# 41. దాక్షాయణీ విద్య

బ్రహ్మ మానసపుత్రుడు దక్షుడు. ప్రజాపతులలో ఒకడు. ఇతడి భార్య వీరిణి. ఈమెనే ధరణి అని కూడా అంటారు. ఇతనికి యాభైమంది ఆడపిల్లలు. వారిలో పెద్ద కుమార్తె సతీదేవి. ఆమె పేరే దాక్షాయణి. 591 నుంచి 621వ నామం వరకు దాక్షాయణీ విద్య చెప్పబడింది. ఈమె పరమేశ్వరి యొక్క రూపం. రాక్షస సంహారం చెయ్యటమే ఈమె ధ్యేయం. భగవంతుడి యొక్క అవతార విశేషమే రాక్షస సంహారం అయితే పూర్తిగా రాక్షస ప్రవృత్తిగల వారిని సంహరించటం, గర్వించినవారి గర్వం అణచి వారికి సన్మార్గం చూపటం. ఇదికూడా భగవంతుడి లక్ష్యమే అందుచేతనే అనేకసార్లు దేవతలకు కూడా గర్వభంగమవుతుంది. కృష్ణావతారంలో శ్రీకృష్ణుడు సత్యభామ గర్వాన్ని పోగొట్టి సత్యాన్ని తెలియచేస్తాడు. విష్ణుమూర్తి నారదుడి గర్వాన్ని అణచివేస్తాడు. ఈ రకంగా దక్షుడు కూడా తాను గొప్పవాడిని ప్రజాపతిని. తనను అందరూ గౌరవించాలి అని అహంకరించాడు. అతని అల్లుడే అయినప్పటికీ యాగానికి శివుణ్ణి పిలవలేదు. అతణ్ణి అవమానించాడు నిందించాడు. ఫలితంగా దక్షయజ్ఞం నాశనమై పోయింది. దక్షునితల కూడా ఎగిరిపోయింది. చివరకు దేవతల కోరికమీద అతడికి మేక తల అతకించబడింది.

ఆ దేవి గురుమూర్తి. శ్రీవిద్యను లోకంలో ప్రచారం చేసింది ఆమెయే. ఆమే గురుశిష్యులుగా రెండు రూపాలు పొంది శ్రీవిద్యను దేవలోకం నుంచి భూలోకానికి, మనదాకా తెచ్చింది. సద్గుణ సంపన్నురాలు. గోవులకు మాత. గోవులు అంటే జీవులు. జగత్తులోని జీవరాశికంతటికీ తల్లి.

కుమారస్వామిని కన్న తల్లి. లోకంలో అజ్ఞానులందరికీ తల్లి. ఆమె దేవతలచేత కూడా పూజింపబడుతుంది. దండనీతి బాగా తెలుసు. దేవీ భాగవతంలో చెప్పినట్లుగా మణిద్వీపంలో నాలుగు మంటపాలున్నాయి. వాటిలో

**చతుర్థే మంటపే చైవ జగద్రక్షా వివించనమ్**

నాల్గవ మంటపంలో మంత్రులతో సమాలోచనలు జరిపి జగత్తును రక్షిస్తుంటుంది.

దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తుంది. మరి ఆమె ఎక్కడ ఉంటుంది. సహస్రారమనేది చంద్రమండలం. అక్కడ వృద్ధిక్షయాలు లేని చంద్రుడుంటాడు. ఆ చంద్రరూపమే పరమేశ్వరి.

ఆమె హృదయస్థానంలో ఉన్న అనాహత పద్మంలో ఉంటుంది. అది భానుమండలము. అక్కడ సూర్యునివలె ప్రకాశిస్తూ ఉంటుంది. అదే దహరాకాశము.

ఆధారచక్రంలోని త్రికోణమందుంటుంది. ఆ త్రికోణంలోని దీపశిఖయే పరమేశ్వరి.

ఆమె దేవతల చేత కూడా పూజించబడుతుంది. ఈ దేవతను అర్చించేటప్పుడు ప్రతిరోజూ ఆ తిథిన ఉన్న నిత్యాదేవతను పూజిస్తూ మహాత్రిపురసుందరిని అంటే 16వ నిత్యను తప్పనిసరిగా పూజించాలి. అన్ని కళల స్వరూపమూ ఆమె. కళలకు అధిపతి కూడా ఆమె. ఆమెకు లక్ష్మీ సరస్వతులు వింజామరలు వీస్తుంటారు. ఆమెయే ఈ సృష్టికి మూలమయిన ఆదిశక్తి. అద్వితీయమైనది. ఆద్యంతములు లేనిది. నిర్గుణమైనది. ఆమె సత్యము, నిత్యము, అనంతము అయినది. పరమపవిత్రురాలు అనేక కోటి బ్రహ్మాండాలను సృష్టించినది ఆ పరమేశ్వరియే. ఇదే పరమేశ్వరి ఉపాస్యరూపము. ఇక నామాలను చూద్దాం.

## 591. కటాక్షకింకరీభూతకమలాకోటిసేవితా

పరమేశ్వరి యొక్క కృపాకటాక్ష వీక్షణాలు ఎవరియందుంటాయో వారికి కోటిమంది లక్ష్మీదేవులు సేవిస్తుంటారు. తన భక్తులమీద అవ్యాజమైన కరుణగలది. వారు కోరిన దానికన్న కొన్ని రెట్లు ఎక్కువగా ఇచ్చేది. దేవి కరుణ ఉన్నంతమాత్రంచేత లక్ష్మీ అనే పేరుగల దేవతలు అనేకమంది ఆ భక్తునికి సేవకులవుతారు.

పరమేశ్వరి బిందురూపిణి. ఓడ్యాణపీఠంలో బిందుమండలమందుంటుంది. ఆ దేవిని ప్రతి ఆవరణలోను 64 కోట్లమంది యోగినీ గణము సేవిస్తుంటారు. మొత్తంమీద $64 \times 9 = 576$ కోట్లమంది యోగినీగణం ఆమెను సేవిస్తుంటారు. ఆ పరమేశ్వరిని ప్రార్థించినవారికి ఈ యోగినీ దేవతలు కోరికలు తీరుస్తాయి.

## 592. శిరఃస్థితా

**శిరసి బ్రహ్మరంధ్రే గురురూపతయా స్థితా ॥**

శిరసున బ్రహ్మరంధ్రం దగ్గర గురురూపంతో ఉండేది. శ్రీచక్రంలోని బిందువే ఉపాసకులకు బ్రహ్మరంధ్రము.

**బైందవమ్ బ్రహ్మరంధ్రం చ మస్తకం చ త్రికోణకమ్ ॥**

ఉపాసకులు బ్రహ్మరంధ్రం దగ్గర గురువును భావించి అక్కడ నమస్కరించటం జరుగుతుంది. అందుచేతనే దేవి శిరస్థితా అనబడుతోంది.

ఉపాసనలో బ్రహ్మరంధ్రం దగ్గర పరమేశ్వరిని భావన చెయ్యటం సంప్రదాయం. కాబట్టి పరమేశ్వరి శిరస్థితా అనబడుతుంది.

## 593. చంద్రనిభా

శిరోభాగంలో సహస్రారంలో చంద్రుడున్నాడు. ఇది చంద్రమండలము. ఇక్కడ ఉన్న చంద్రుడు షోడశ కళాప్రపూర్ణుడు. అతడికి వృద్ధిక్షయాలు ఉండవు.

ఆజ్ఞాచక్రంలో ఉన్న కుండలిని సహస్రారానికి చేరినట్లైతే అక్కడ కోట్లకొలది సూర్యచంద్రుల కాంతులతో దివ్యమైన తేజోబింబము దర్శనమవుతుంది. అక్కడకు చేరిన కుండలిని సహస్రదళ పద్మాన్ని తననోటితో కరిచి పట్టుకుంటుంది. ఆ చంద్రమండలంలోని మధువు అంతా ఘనీభవించి ఉంటుంది. కాని కుండలిని ప్రజ్వలితమయ్యేటప్పుడు వచ్చిన స్వాధిష్ఠానాగ్ని యొక్క వేడివల్ల సహస్రారంలో ఘనీభవించిన అమృతము యోగియొక్క శరీరంలోని 72వేల నాడీమండలాన్ని తడుపుతుంది.

ఇప్పుడు పరమేశ్వరి కోట్లకొలది సూర్యచంద్రుల కాంతులతో ఇక్కడ ప్రకాశిస్తున్నది. అందుచేతనే చంద్రనిభా – చంద్రుని కాంతులతో ప్రకాశించునది అని చెప్పబడింది.

## 594. ఫాలస్థా

ఫాలభాగమందు హ్రీంకార రూపంలో ఉండే దేవి. ఫాలభాగము – లలాటము. లలాట భాగాన ఆ దేవి భువనేశ్వరీ బీజంతో ఉంటుంది. అందుకనే జపం చేసేటప్పుడు కనులు మూసుకుని, దృష్టిని భృకుటి స్థానంలో కేంద్రీకృతం చెయ్యాలి అని చెప్పటం జరుగుతుంది. ఆజ్ఞాచక్రంలో నివశించే దేవి.

## 595. ఇంద్రధనుః ప్రభా

ఇంద్రధనుస్సు వలె ప్రకాశించునది. ఉపాసకులను మూడు భాగాలుగా విభజించారు. యోగినీ హృదయంలో

**ఆజ్ఞాంతం సకలం ప్రోక్తం తత స్సకల నిష్కలం ।**
**ఉన్మన్యంతం పరేస్థానం నిష్కళంచ త్రిధాస్థితం ॥**

ఉపాసకులు 1. సకలులు 2. నిష్కలులు 3. ప్రళయాకలులు

1. సకలులు కేవలం ఐహికవాదులు. వీరు అకులం దగ్గర నుండి ఆజ్ఞాచక్రం దాకా పరమేశ్వరిని ఉపాసన చేస్తారు.

2. నిష్కలులు. వీరు మోక్షవాదులు. బ్రహ్మరంధ్రం దగ్గర ఉపాసన చేస్తారు.

3. సకల నిష్కలులు. వీరినే ప్రళయాకలులు అంటారు. వీరు శుద్ధాశుద్ధ మిశ్రులు. అంటే ద్వైదీభావం కలవారు. వీరు ఆజ్ఞాచక్రంనుంచి ఉన్మన వరకు దేవీ ఉపాసన చేస్తారు.

శరీరంలో మొత్తం 19 చక్రాలున్నాయి. అవి. మొదటి జట్టులో తొమ్మిది.

రెండవ జట్టులో తొమ్మిది. మూడవ జట్టులో బ్రహ్మరంధ్రం ఒక్కటి.

ఆజ్ఞాచక్రం నుంచి ఉన్మని వరకు తొమ్మిది చక్రాలు

**ఇందౌ తదర్థం రోదిన్యాం నాదోనాదాంత ఏవ చ ।**

**శక్తిః పున ర్వ్యాపికాయాం సుమనా ఉన్మన గోచరే ॥**

| | | |
|---|---|---|
| 1. బిందువు | 4. నాదము | 7. వ్యాపిక |
| 2. అర్ధ చంద్రము | 5. నాదాంతము | 8. సుమన |
| 3. రోదిని | 6. శక్తి | 9. ఉన్మన |

భృకుటి స్థానంలో ఉండేది బిందువు. ఆపైన అర్ధచంద్రం ఉంటుంది.

**దీపాకారో అర్ధమాత్రశ్చ లలాటే వృత్త ఇష్యతే**

**అర్ధచంద్ర స్తదాకారః పాదమాత్ర స్తదూర్ధ్వకే ॥**

లలాటంలో బిందువున్నది. దానిపైన అర్ధమాత్ర లేక అర్ధచంద్రమున్నది. దీని కాంతికూడా అష్టమి నాటి చంద్రునిలాగా ఉంటుంది. ఇది దీపాకారంగా అర్ధచంద్రా కారంలో ఉంటుంది. దీని ఉచ్చారణ కాలము 1/4 వంతు మాత్ర. అంటే 64 లవములు. మాత్రకు 256 లవములు. బిందు ఉచ్చారణ కాలము 128 లవములు.

ఇంద్రధనుస్సు నానా వివిధరకాలయిన కాంతులు గలది. ఉదయంపూట ఉపాసకులు భృకుటి స్థానంలో దేవిని భావించి వివిధ వర్ణాలు కలదానినిగా అర్చిస్తారు.

**సర్వవర్ణే ! మహాదేవి ! సంధ్యా విద్యే సరస్వతీ**

ఇక్కడ పరమేశ్వరి ఏడు రంగులు కలిగి ఉంటుంది. సప్తవర్ణుడు లేక సప్త జిహ్వుడి (అగ్ని దేవుడు) వంటి తేజస్సు గలది.

## 596. హృదయస్థా

హృదయస్థానంలో ఉండేది. పరమశివుని స్థానమే ఉపనిషత్తు హృదయము. ఆ ఉపనిషత్తు హృదయమందుండునది. లేక ఉపనిషత్తులతో ప్రతిపాదింపబడినది. మఱ్ఱి విత్తనంలో గల శక్తి అంతటా వ్యాపించినట్లే హృదయస్థానంలో ఉన్న ఈ శక్తి జగత్తంతా వ్యాపించి ఉన్నది. పరమేశ్వరి హృదయస్థానంలో ఉంటుంది.

**పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చా పృధోముఖమ్**

అని మొదలుపెట్టాలి

**స బ్రహ్మ స శివ స్స హరి స్స ఇంద్రః సః అక్షరః పరమస్వరాట్**

హృదయస్థానంలో ఉన్నవాడే బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఇంద్రుడు, అక్షర స్వరూపుడైన పరబ్రహ్మ. అని చెప్పబడింది. అతడే పరమేశ్వరుడు. ఉపాసకులు మధ్యాహ్నకాలంలో హృదయంలో ఉండే దేవిని ఉపాసించాలి.

## 597. రవిప్రఖ్యా

హృదయమందు సూర్యమండలమున్నది.

| | | |
|---|---|---|
| ఆధారస్వాధిష్ఠానాలు | – | అగ్ని మండలం |
| మణిపూర అనాహతాలు | – | సూర్యమండలం |
| విశుద్ధి ఆజ్ఞాచక్రాలు | – | చంద్రమండలం |

హృదయస్థానము మణిపూరం. అది సూర్యమండలము. అక్కడ దేవిని ఉపాసించాలి.

**సూర్యమండల మధ్యస్థాం దేవీం త్రిపుర సుందరీం**
**పాశాంకుశధనుర్బాణహస్తాం ధారయంతీం ప్రపూజయేత్ ॥**

ఆధార స్వాధిష్ఠానాలలో కౌళులు మాత్రమే అర్చించాలి అని చెప్పి, సమయాచారులు మణిపూరం దగ్గర నుంచి మాత్రమే పరమేశ్వరిని అర్చించాలి అన్నారు గౌడపాదులు.

సూర్యునితో సమానమైన కాంతి గలది. పరమేశ్వరి తేజోరూపిణి. అందుకనే

| | | |
|---|---|---|
| అగ్ని రూపంలో | – | ఉదయం పూట |
| సూర్య రూపంలో | – | మధ్యాహ్న కాలంలో |
| చంద్రుని రూపంలో | – | సాయం సమయంలో |

భక్తులచే ధ్యానింపబడుతూ ఉంటుంది.

## 598. త్రికోణాంతరదీపికా

మూలాధార చక్రంలో త్రికోణమున్నది. దాని మధ్యలో అగ్నిమండలమున్నది. ఆ త్రికోణము మధ్యలో ప్రకాశించు దీపశిఖయే పరమేశ్వరి.

తంత్రరాజంలో "జీవుల మూలాధారంలో అగ్ని ఉన్నది.

హృదయ స్థానంలో సూర్యుడున్నాడు. శిరస్సులో సహస్రదళ పద్మంలో చంద్రుడున్నాడు అని చెప్పబడింది. నిత్యావిద్య ఈ మూడింటిచేత త్రిఖండమైనది.

విష్ణుపురాణంలో ఇతడు శక్రాది పురములందు మధ్యాహ్న కాలంలో ఉన్నప్పుడు మూడు పురములను సృష్టిస్తాడు. ఇటువంటి త్రికోణమందుంటుంది. కాబట్టి త్రికోణాంతరదీపికా అనబడుతోంది.

## 599. దాక్షాయణీ

దక్ష ప్రజాపతి యొక్క కుమార్తె. దేవీభాగవతంలో విష్ణువు యొక్క నాభికమలం నుంచి పుట్టిన బ్రహ్మ కొన్ని వేల సంవత్సరాలు తపస్సు చేసి పరమేశ్వరిని మెప్పించి ఆమె అనుజ్ఞతో సృష్టి కార్యక్రమం ప్రారంభించాడు. అందులో భాగంగా మానసికంగా

| | | | |
|---|---|---|---|
| 1. మరీచి | 3. అత్రి | 5. పులస్త్యుడు | 7. క్రతువు |
| 2. అంగీరసుడు | 4. వసిష్ఠుడు | 6. పులహుడు | |

అనేవారిని సృష్టించాడు. వీరు బ్రహ్మ మానసపుత్రులు వీరు కాక

| | |
|---|---|
| రోషము వల్ల | – రుద్రుడు |
| తొడ నుంచి | – నారదుడు |
| కుడి చేతి బ్రొటన వేలు నుంచి | – దక్షుడు |
| ఎడమచేతి బ్రొటన వేలు నుంచి | – వీరిణి అనే కన్య |

పుట్టారు. దక్షుడు వీరిణిని వివాహం చేసుకున్నాడు. వీరికి యాభైమంది కుమార్తెలు, ఐదుగురు కుమారులు కలిగారు. వీరిలో పెద్దకుమార్తె సతి. ఆమె పేరే దాక్షాయణి. ఈమె పరమేశ్వరియొక్క అంశతో పుట్టింది.

## 600. దైత్యహంత్రీ

**దైత్యాదీనాం, భండాసురాదీనాం హంత్రీం**

భండాసురాది దైత్యులను సంహరించినది. భండాసుర, మహిషాసుర, శుంభ, నిశుంభ, మొదలగు దైత్యులను సంహరించినది. వేదాన్ని దూషించేవారు, పరబ్రహ్మ లేడనేవారు, దేవతలను నిందించేవారు, ధర్మాన్ని నాశనం చేసేవారు, తేలిక అయిన అర్థంలో చెప్పాలి అంటే సంఘ వ్యతిరేకులు, సమాజ వ్యతిరేకులు – వీరు దైత్యులు అనబడతారు. దితియొక్క సంతానం దైత్యులు. వీరంతా ధర్మదూరులు. వీరు యజ్ఞయాగాలను ద్వేషిస్తారు. బ్రహ్మను ద్వేషిస్తారు. కేవలము ఐహికవాంఛల కోసమే జీవిస్తారు. తమోగుణ ప్రధానులు. ఇటువంటివారిని సంహరిస్తుంది కాబట్టి దైత్యహంత్రీ అనబడుతుంది.

## 601. దక్షయజ్ఞవినాశినీ

దక్షుని యొక్క కుమార్తె దాక్షాయని అని గతంలో వివరించటం జరిగింది. దక్షుడు తన కుమార్తె అయిన సతీదేవిని శివునికిచ్చి వివాహం చేశాడు.

ఒకరోజున బ్రహ్మ ఒక యాగం చెయ్యటానికి ఉపక్రమించి, ఆ యాగానికి దేవతలనందరినీ ఆహ్వానించాడు. అనుకున్నట్లుగానే అందరూ విచ్చేశారు. దక్షప్రజాపతి కొద్ది ఆలస్యంగా వచ్చాడు. అతడు రావటంతోనే దేవతలంతా లేచినుంచుని ఆయన్ను గౌరవించారు. శివుడు మాత్రం లేవలేదు సరికదా తలత్రిప్పి చూడను కూడా లేదు. అది అవమానంగా భావించాడు దక్షుడు. తన ఇంటికి మిగిలిన కుమార్తెలను పిలిచేవాడు. కాని సతీదేవిని మాత్రం పిలవటం మానేశాడు. ఈ రకంగా చాలాకాలం గడిచింది.

ఒకసారి దక్షుడు యజ్ఞం చెయ్యాలి అనుకున్నాడు. దేవతలందరికీ వర్తమానం పంపాడు. కుమార్తెలందరికీ కబురంపాడు. కానీ సతీదేవిని మాత్రం పిలువలేదు. పుట్టింటికి వెళ్ళి చాలాకాలమయింది. సోదరీమణులను చూసి ఎంతో కాలమయింది. తండ్రి యాగం చేస్తున్నాడు. పిలవకపోతే మాత్రం ఏమిటి? వెడదామనుకుంది. భర్తతో అదే మాట చెప్పింది. పిలవకుండా వెళ్ళటం మంచిది కాదు. వద్దు అవమానం పొందవలసి వస్తుంది అన్నాడు భర్త. సతీదేవి వినలేదు. సరే వెళ్ళమని భటులను తోడిచ్చి పంపాడు.

పుట్టింటికి చేరింది దాక్షాయణి. తండ్రి పలకరించలేదు. తనే వెళ్ళి నేను వచ్చాను అంది. ఎందుకు వచ్చావు? నిన్నెవరు పిలిచారు. అన్నాడు దక్షుడు, నేను చేసిన తప్పేమిటి? అని అడిగింది సతీదేవి. నీ భర్త ఒక అహంభావి. నా అంతటివాణ్ణి గౌరవించడు. సేవలు చెయ్యడు. అంటూ శివుణ్ణి దూషించాడు. ఈ అవమానం భరించలేక యోగాగ్ని సృష్టించుకుని అందులో దగ్ధమైపోయింది దాక్షాయణి.

భటులు తెచ్చిన వార్తను విన్నాడు. సతీ వియోగాన్ని భరించలేకపోయాడు. ప్రళయకాల రుద్రుడై పోయాడు. వీరభద్రుని సృష్టించి దక్షయజ్ఞం నాశనం చెయ్యమన్నాడు. శివుని ఆజ్ఞను శిరసా వహించిన ప్రమథగణాలు దక్షుని యజ్ఞాన్ని పాడుచేశాయి. వీరభద్రుడు దక్షప్రజాపతిని సంహరించాడు. ఆ తరువాత దేవతలందరి కోరికపై దక్షునికి మేకతల అంటించి బ్రతికించారు. అప్పటి నుంచే దక్షుడు అజముఖుడైనాడు.

ఈ రకంగా దక్షుని యజ్ఞం నాశనం కావటానికి కారణమైంది కాబట్టి ఆ దేవి 'దక్ష యజ్ఞ వినాశినీ' అనబడింది.

## 602. దరాందోళితదీర్ఘాక్షీ

కొంచెము చంచలమై, చెవులవరకు వ్యాపించిన కనులు గలది. భయాన్ని నశింపచేసే దీర్ఘమైన కనులు గలది. ఆమెయొక్క కడకంటి చూపు సోకినంత మాత్రం చేతనే భయాలు తొలగిపోతాయి.

కొంచెము చలించే ఆ కర్ణాంత విశాలనేత్రములు గలది. వీక్షణ మాత్రం చేతనే సమస్త లోకాలను భృత్యులుగా చేసుకోగలిగినది.

## 603. దరహాసోజ్జ్వలన్ముఖీ

చిరునగవుతో ప్రకాశించే ముఖము గలది. సుందరమగు మందహాసముచే ప్రకాశించు ముఖము గలది. ఆనందమే స్వరూపంగా గలది. హృదయంలో ఉన్న ఆనందం ముఖంలో కనిపిస్తుంది కాబట్టి దరహాసో జ్వలన్ముఖి అనబడుతుంది. ఇది ఆత్మనందానికి సూచికము. దేవి బ్రహ్మానంద స్వరూపిణి.

## 604. గురుమూర్తిః

**గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**
**గురుః సాక్షాత్ పరబ్రహ్మా తస్మై శ్రీ గురవే నమః ॥**

అజ్ఞానమనే అంధకారాన్ని పారద్రోలి, జ్ఞానజ్యోతిని వెలిగించేవాడు గురువు. సాధకుడికి మంత్రోపదేశం చేసి, దీక్ష ఇచ్చి, సాధనా విధానము చెప్పి, ముక్తి మార్గం చూపేవాడు గురువు. అతడు త్రిమూర్తి స్వరూపుడు. సాక్షాత్తూ పరమేశ్వరుడు.

శక్తి రహస్యంలో చెప్పినట్లుగా

**గుకార స్త్వంధకారః స్యాత్ రుకార స్తన్నివర్తకః**

గుకారము అంటే కటిక చీకటి రుకారము అనగా దానిని పోగొట్టేది.

**అఖండమండలాకారం వ్యాప్తంయేన చరాచరం ।**
**తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః ॥**

విశాలమైన విశ్వమంతా వ్యాపించినవాడు, శిష్యుని యొక్క అజ్ఞానాన్ని పారద్రోలి జ్ఞానజ్యోతిని వెలిగించేవాడు అయిన గురువు యొక్క పాదాలకు నమస్కరిస్తున్నాను.

**అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా**
**చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః**

ఏ మహాత్ముడు నీకు బాగా గుర్తుంటాడో, ఏ మహానుభావుని రూపం నీ మనసులో సదా నిలిచిపోతుందో, ఏ సన్యాసి నీకు స్వప్నంలో కూడా కనిపించి సన్మార్గాన్ని బోధిస్తుంటాడో, ఏ సాధువు చెప్పిన ధర్మసూత్రాలు నీ మదిలో సదా నిలిచిపోతాయో, ఏ మహనీయుని దగ్గరకు వెళ్ళగానే నీ అనుమానాలు తీరిపోతాయో, ఏ వ్యక్తి దగ్గర నీకు ప్రశాంతత, ఆనందము కలుగుతుందో, ఏ వ్యక్తి మీద నీకు నమ్మకము గురి కుదురుతాయో, ఆ మహనీయుడే నీకు గురువు. స్థూలంగా చెప్పాలంటే తన శిష్యునకు సన్మార్గాన్ని బోధించి తరుణోపాయం చూపేవాడు గురువు.

గురువు ఏ జాతివాడైనా, ఏ మతంవాడైనా, ఏ కులంవాడైనా సరే అతన్ని పూజించాలి. గౌరవించాలి. ఆరాధించాలి. లోకంలో అస్థిరమైనవి ఐహికసుఖాలనిచ్చేవి ఎన్ని ఉన్నప్పటికీ గురుకటాక్షం లేకపోతే అవన్నీ నిష్ప్రయోజనం ఈ విషయాన్ని శంకరభగవత్పాదులవారు తమ గుర్వష్టకంలో వివరిస్తూ గురువు అంటే సాక్షాత్తూ పరమేశ్వరుడే అని చెప్పారు.

**శరీరం సురూపం తథా వా కలత్రం**
**యశ శ్చారుచిత్రం ధనం మేరుతుల్యమ్**
**మన శ్చేన్న లగ్నం గురో రంఘ్రిపద్మే**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిం ॥**

అందమైన శరీరమున్నది. ఇంకా అందమైన భార్య ఉన్నది. బోలెడంత ధనమున్నది. కావలసినంత కీర్తి ఉన్నది. అయినప్పటికీ గురుకటాక్ష వీక్షణాలు లేకపోయినట్లైతే అవన్నీ నిష్ప్రయోజనము అందుకనే

**న గురోరధికం తత్త్వం నగురోరధికం తపః**

**తత్త్వ జ్ఞానాత్ పరంనాస్తి తస్మై శ్రీ గురవే నమః**

గురువును మించిన తపస్సు లేదు. గురువును మించిన తత్త్వం వేరే లేదు. భగవంతుడు కోపిస్తే గురువు రక్షిస్తాడు. కాని గురువు కోపిస్తే ఆ పరమేశ్వరుడు కూడా రక్షించలేడు అందుకనే పరమేశ్వరుడికన్నా కూడా గురువే అధికుడు.

సృష్టి ఆవిర్భావ కాలంలో, కృతయుగం ప్రారంభంలో సర్వానందమయమైన ఓడ్యాణ పీఠమనే బిందుమండలమందు, పరమాత్మ స్వరూపుడైన కామేశ్వరుడు ఊర్ధ్వానంద నాథ అనే పేరుతో అనుత్తరానందం కోసం మాయాస్వరూపిణి స్వాత్మరూప అయిన కామేశ్వరీ దేవికి శ్రీవిద్యను ఉపదేశించాడు. కామేశ్వరీ కామేశ్వరులిద్దరూ పరబ్రహ్మ స్వరూపులే. వారికి బేధం లేదు. అయినప్పటికీ లోకాలను అనుగ్రహించాలి అనే కోరికతో, సత్సంకల్పంతో పరమాత్మ తానే గురుశిష్యులుగా మారి సర్వోపనిషత్సారమైన శ్రీవిద్యా తంత్రాన్ని ఆమెకు ఉపదేశించాడు.

ఈ రకంగా పరమాత్మ శ్రీవిద్యను లోకంలో వ్యాప్తి చెయ్యటం కోసం తాను ఊర్ధ్వ దేవానందనాథ అనే దీక్షానామం ధరించి, కామేశ్వరీదేవికి శ్రీవిద్యను ఉపదేశించి ఆమెకు మిత్రేశదేవనాథ అని నామకరణం చేశాడు.

కామేశ్వరీ కామేశ్వరులు తమదీక్షా నామాలతో ఓడ్యాణ పీఠమనే బిందుమండలము నందు పురాణదంపతులుగా ఉన్నారు. ఇది శ్రీవిద్యకు మొదటి స్థానము.

ఆ తరువాత పరమేశ్వరుని ఆజ్ఞమేరకు ఆ పరాభట్టారిక శ్రీవిద్యా రహస్య వ్యాప్తి కోసం తనయొక్క అంశలు, అవ్యక్త మహత్తత్త్వ అహంకార స్వరూపులు, వాగ్భవ కామరాజశక్తి బీజాధిపతులు, సత్త్వరజస్తమో గుణాధిపతులు, సృష్టి స్థితిలయకారకులు అయిన త్రిమూర్తి ద్వంద్వానికి శ్రీవిద్యను ఉపదేశించింది. వారిద్వారా ఉపదేశ పరంపరగా ఈ విద్య విస్తరించి దివ్యౌఘ, సిద్ధౌఘ, మానవౌఘ గురుమండలం లోకంలో ప్రసిద్ధి చెందింది.

| | | |
|---|---|---|
| దివ్యౌఘులు అంటే | – | దేవతలు |
| సిద్ధౌఘులు అంటే | – | సనకసనందనాది సిద్ధులు |
| మానవౌఘులు అంటే | – | విద్యారణ్య, గౌడపాద, శంకర ప్రభృతులు |

బిందు మండలవర్తిని అయిన ఆ పరమేశ్వరి మొదటగా శ్రీవిద్యను త్రికోణంలోని ఉత్తరకోణంలోని జాలందర పీఠంలో ఉన్న శక్తి బీజాధిపతులైన ఉమామహేశ్వరులకు ఉపదేశించి, వారికి ఊర్ధ్వదేవనాథ, కామేశ్వర్యంబా అని నామకరణం చేసింది. ఉమామహేశ్వరులు శ్రీవిద్యను ఉపాసన చేసి కొంత కాలం తరువాత యోనిచక్రంలోని దక్షిణ కోణంలోని పూర్ణగిరి పీఠంలో ఉన్న, కామరాజ బీజాధిపతులైన లక్ష్మీనారాయణులకు ఆ విద్యను ఉపదేశించి వారికి షష్ఠీశ దేవనాథ వజ్రేశ్వర్యంబా అని నామకరణం చేశారు. షష్టీశ దేవనాథ ద్వంద్వము శ్రీవిద్యను కొంత కాలము ఉపాసన చేసి యోనిచక్రంలోని అగ్రకోణంలోని కామగిరి పీఠాధిపతులు, వాగ్భవ బీజాధిపతులైన వాణీ హిరణ్య గర్భులకు శ్రీవిద్యనుపదేశించి వారికి మిత్రేశనాథ, భగమాలిన్యంబా అని నామకరణం చేశారు. మిత్రేశనాథ ద్వంద్వము శ్రీవిద్యను ఇంద్రాది దేవతలకు, వారు సనకసనందనాది సిద్ధులకు, వారు విద్యారణ్యాది మానవులకు ఉపదేశించారు. ఈ రకంగా శ్రీవిద్య ఈ రోజున మనదాకా వచ్చింది. అందుచేతనే జపం చేసేటప్పుడు ముందుగా

**ఆదినాథ సమారంభాం శంకరాచార్య మధ్యమాం ।**
**అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్ ॥**

అంటూ ఆ పరమేశ్వరుని దగ్గర నుండి మనకు మంత్రోపదేశం చేసిన గురువుదాకా అందరికీ నమస్కరించాలి.

ఈ రకంగా శ్రీవిద్యా సంప్రదాయాన్ని వెలుగులోకి తెచ్చినది ఆ పరమేశ్వరి. అందుచేతనే ఆమె గురుమూర్తి అనబడుతోంది.

## 605. గుణనిధిః

గుణములకు నిధి, సత్త్వరజస్తమో గుణాలకు ఆ పరమేశ్వరి నిధి. ఈ గుణాలు మూడే అయినప్పటికి వృత్తి బేదం చేత అనంతమవుతున్నాయి.

| | | |
|---|---|---|
| 1. ఐశ్వర్యము | 3. యశము | 5. జ్ఞానము |
| 2. వీర్యము | 4. శ్రీ | 6. వైరాగ్యము |

వీటిని షడ్గుణాలు అంటారు. అలాగే పంచభూతాల యొక్క గుణాలు శబ్ద స్పర్శ రూప రస గంధాలు. త్యాగము, శౌర్యము, ఔదార్యము మొదలైనవి గుణాలు. గుణములు అంటే – నవవ్యూహాలు. కామకలావిద్యలో

**కాలవ్యూహః కులవ్యూహో నామవ్యూహ స్తథైవ చ**
**జ్ఞానవ్యూహ స్తథా చిత్తవ్యూహ స్స్యా త్తదనంతరమ్**
**నాదవ్యూహ స్తథా బిందువ్యూహ స్స్యా త్తదనంతరమ్**
**కలావ్యూహ స్తథా జీవవ్యూహ స్స్యా దితి తే నవ ॥**

1. కాలవ్యూహము–నిమిషము మొదలు కల్పాంతమువరకు ఉన్న కాలము యొక్క సముదాయము.
2. కులవ్యూహము – ఎరుపు, తెలుపు, నీలము మొదలైన రంగులను గురించి తెలిపేది.
3. నామవ్యూహము – లోకంలోని ప్రాణులపేర్లను తెలిపేది.
4. జ్ఞానవ్యూహము – ఇంద్రియాలద్వారా ప్రపంచాన్ని గురించి తెలుసుకునే జ్ఞానము.
5. చిత్తవ్యూహము – మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, మహతత్త్వము అనే అహంకార పంచకము గురించి తెలిపేది.
6. నాదవ్యూహము – రాగము, ఇచ్ఛ, ప్రయత్నము, మాయ శుద్ధవిద్య, మహేశ్వరుడు, సదాశివుడు, పరా, పశ్యంతి మధ్యమ, వైఖరిల గురించి తెలిపేది.
7. బిందువ్యూహము – ఆధారాది షట్చక్రాల సమూహము
8. కళావ్యూహము – యాభై కళలుగా వర్ణస్వరూపాలయిన అక్షరాలను గురించి తెలిపేది.
9. జీవవ్యూహము – భోక్తలగు జీవసమూహము.

వీటన్నింటినీ కలిపి నవవ్యూహాలంటారు.

**నవవ్యూహాత్మకోదేవః పరానంద పరాత్మకః**
**నవాత్మా భైరవో దేవో భుక్తిముక్తిప్రదాయకః**
**పరానందః పరాశక్తిః చిద్రూపాఽనంద భైరవీ**
**తయో ర్యదా సామరస్యం జగ దుత్పద్యతే తదా ॥**

పరానందుడు, పరాత్మకుడు, అయిన భైరవుడు నవవ్యూహాత్మకుడు. ఆయనే భుక్తిముక్తి ప్రదాత. పరానందమయమైన పరాశక్తి చిద్రూప అయిన ఆనందభైరవి అవుతుంది. ఈ భైరవీ భైరవులకు సామరస్యం ఎప్పుడు కలుగుతుందో అప్పుడు జగత్తు ఉత్పత్తి అవుతుంది.

వీటన్నింటిచేత ఆ పరమేశ్వరి గుణనిధి అవుతుంది.

## 606. గోమాతా

ధేనువులకు తల్లి. కామధేను రూపమయినది. గో అనే శబ్దం వాక్కు అవటంచేత, అన్ని వర్ణాలకు మాత ఆ పరమేశ్వరియే అని చెప్పబడుతోంది.

పూర్వకాలంలో, అంటే సృష్టి ప్రారంభంలో పంటలు పండించటమువంటివి లేవు. అప్పుడు ఉన్నదంతా పశుసంపదయే. ఆ రోజులలో అందరూ పాలు త్రాగి జీవించేవారు. అప్పట్లో పశుసంపద అంటే ఆవులు. అంతేకాని గేదెలు కావు. శ్రీకృష్ణుడు కూడా గోవర్ధనగిరి ఎత్తి గోవులను రక్షించాడు. అందుచేత పశుసంపద అంటే గోసంపదే. ఇవే జీవులన్నింటికీ ఆహారమైన పాలను ప్రసాదించాయి. అందుకే గోవు మాత అయింది.

గో అనే శబ్దానికి – స్వర్గము, వృషభము, వజ్రము, చంద్రుడు, నేత్రము, దిక్కు, బాణము. ఇలా అనేకార్థాలున్నాయి. వీటన్నింటికీ మాత కాబట్టే ఆ పరమేశ్వరి గో మాతా అనబడుతోంది.

## 607. గుహజన్మభూః

గుహుడు అంటే – కుమారస్వామి. అతనికి తల్లి కాబట్టి గుహ జన్మ భూః అనబడింది.

అవిద్యతో కూడిన వారు గుహులు. వీరే జీవులు అటువంటి జీవులకు జన్మస్థానమైనది.

జీవులకు ఉత్పత్తిస్థానము ఆ పరమేశ్వరి. బాగా కాగిన లోహపు ముద్దనుంచి నిప్పురవ్వలు ఎలా వస్తాయో అదే విధంగా పరమేశ్వరి నుండి జీవులు పుడుతున్నాయి.

శరీరంలో హృదయస్థానము నివాసముగా గలది. తైత్తిరీయోపనిషత్తులో చెప్పిన విధంగా పంచకోశాల నడుమ ఉండేది.

శరీరంలో హృదయస్థానము నివాసముగా గలది.

## 608. దేవేశీ

**దేవానాం బ్రహ్మవిష్ణ్వా దీనాం ఈశీ ఈశ్వరీ**

బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతలకు ఈశ్వరి.

పంచదశీ మహామంత్రాన్ని జపించి తరించిన వారిలో విష్ణువు, శివుడు, ఇంద్రుడు, అగ్ని, సూర్యుడు ఇత్యాది దేవతలు ప్రముఖులు. కాబట్టి అటువంటి దేవతలకు కూడా ఈశ్వరి.

దేవీ భాగవతంలో మధుకైటభ సంహారం చేసిన తరువాత దివ్యమైన విమానంలో త్రిమూర్తులు మణిద్వీపం చేరి, అక్కడ పరమేశ్వరిని దర్శించి, ఆమెను పరిపరివిధాల కీర్తిస్తారు.

వృత్రాసురుని బాధలు పడలేక స్థితికారకుడైన విష్ణుమూర్తితో కలిసి దేవతలంతా హిమాలయాలకు వెళ్ళి ఆ పరమేశ్వరిని నియమనిష్ఠలతో పరిపరివిధాల ప్రార్థిస్తారు.

శుంభనిశుంభులు దేవతలను నానాబాధలు పెడుతుంటే సహించలేక చివరకు హిమాలయ ప్రాంతాలకు వెళ్ళి

**నమోదేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః**
**నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాః స్మృతాః ॥**

అంటూ పరిపరివిధాల ప్రార్థించారు. ఈ రకంగా దేవతలందరిచేత పూజించబడిన దేవత. దేవతలకు ఈశ్వరి. కాబట్టి దేవేశీ అనబడుతోంది.

దివి అంటే ఆకాశము. దివియందు సంచరించేవారు దేవతలు. వారందరికీ ఈశ్వరి. కాబట్టి దేవేశి.

శరీరంలో వివిధమైన ఇంద్రియాలున్నాయి. వీటన్నింటికీ దేవతలున్నారు. ఇంద్రియాలకు ముఖ్యమైనది ప్రాణశక్తి. అదే పరమేశ్వరి స్వరూపము. ఈ విధంగా ఆ దేవి దేవేశీ అనబడుతోంది.

## 609. దండనీతిస్థా

అర్థశాస్త్రమునందు ఉండేది. నీతిశాస్త్రంలో చెప్పబడేది ఈ దేవియే.

పరమేశ్వరి దేవేశి కావటంచేతనే దండనీతి కలిగి ఉంటోంది. విద్యలు నాలుగు రకాలు.

**ఆన్వీక్షకీ త్రయీ వార్తా దండనీతి స్త్వ మేవ చ**

1. అన్వీక్ష – విజ్ఞానబోధకమైన విద్య
2. త్రయీవిద్య – ధర్మాధర్మాలను వివరించేది
3. వార్తావిద్య – అర్థానర్థ బోధకము
4. దండనీతి – నేరం చేసినవారిని శిక్షించి సన్మార్గంలో పెట్టటము.

దేవీ పురాణంలో అన్యాయ మార్గంలో చరించేవారిని శిక్షించేది కాబట్టి దండనీతిస్థా అనబడింది.

## 610. దహరాకాశరూపిణీ

హృదయాకాశము నందుండునది. ఈ బ్రహ్మపురం (శరీరం)లో దహరమనే పుండరీకము (హృత్పద్మము) ఉన్నది. దాని మధ్య ఆకాశమున్నది. అందులో పరబ్రహ్మ ఉన్నాడు. అని వేదం చెబుతోంది. ఈ విషయాన్ని గతంలో వివరించాం.

జగత్తులో పైన కనిపించే ఆకాశము – మహదాకాశము. ఘటంలో కనిపించే ఆకాశము – ఘటాకాశము హృదయస్థానంలో ఉండే ఆకాశము – దహరాకాశము. ఆ దహరాకాశమే రూపంగా గలది. కాబట్టి దహరాకాశ రూపిణీ అనబడుతోంది.

## 611. ప్రతిపన్ముఖ్యరాకాంతతిథిమండలపూజితా

పాడ్యమి నుంచి పూర్ణిమవరకు గల తిథులయందు పూజింపబడునది.

పరమేశ్వరి అనుష్ఠానంలో తిథుల ప్రకారం చేసే విధానం ఒకటి ఉన్నది అని గతంలో వివరించాం. అయినప్పటికీ ఇక్కడ అది అత్యావశ్యకము కాబట్టి మళ్ళీ చెబుతున్నాం.

**ప్రతిప న్నామ విజ్ఞేయా చంద్రస్య ప్రథమాకళా**
**ద్వితీయాద్యా ద్వితీయాద్యా పక్షయోః శుక్లకృష్ణయోః**

పాడ్యమి మొదలైన తిథులు పదిహేను. ఇవి శుక్ల కృష్ణ పక్షాలయందుంటాయి.

**దర్శాద్యాః పూర్ణిమాంతస్తు కళాః పంచద శైవ తు ।**
**షోడశీతు కలాజ్ఞేయా సచ్చిదానందరూపిణీ ॥**

పాడ్యమి మొదలు పూర్ణిమ వరకు తిథులు పదిహేను. పదహారవ కళ సాక్షాత్తూ ఆ పరమేశ్వరి అయి ఉన్నది.

చంద్రకళలు తిథులస్వరూపాలు. తిథులు నిత్యాస్వరూపాలు. కాబట్టి అర్చనా విధానంలో ఆ రోజు ఉండే తిథిని బట్టి ఆ నిత్యాదేవిని పూజించాలి. పాడ్యమినాటి నిత్యాదేవత కామేశ్వరి. విదియనాడు భగమాలిని. ఈ రకంగా రోజూ తిథుల మాదిరిగానే నిత్యాదేవతలుకూడా మారుతుంటారు. అర్చనా విధానంలో ఆ రోజు ఉన్న తిథి ఆధారంగా, ఆ రోజున ఉండే నిత్యాదేవతను అర్చించాలి. ఇలాగే ప్రతిరోజూ ఒక్కొక్క నిత్యను పదిహేను తిథులయందు అర్చిస్తూ, పదహారవ నిత్య అయిన మహాత్రిపురసుందరిని ప్రతిరోజూ అర్చించాలి. ఇది తిథిమండల పూజ.

తిథులు దేవతాస్వరూపాలు. వరాహపురాణంలో తిథి దేవతల ఉత్పత్తి ఎలా జరిగిందో వివరిస్తూ

| | | | |
|---|---|---|---|
| 1. వహ్ని | 5. భుజంగ | 9. దుర్గ | 13. యముడు |
| 2. దస్ర | 6. షణ్ముఖ | 10. దిక్కులు | 14. హరుడు |
| 3. ఉమ | 7. సూర్య | 11. కుబేరుడు | 15. చంద్రుడు |
| 4. విష్ణు | 8. మాతలు | 12. కేశవుడు | |

నిత్యాదేవతలు ఆ పరమేశ్వరికి ప్రతీక. అందుచేతనే నిత్యాదేవతల స్థితిని బట్టి అర్చించబడుతుంది. ఈ తిథి దేవతలలోనే మతాంతరాలున్నాయి.

## 612. కలాత్మికా

కళలే స్వరూపంగా గలిగినది.

అగ్నికళలు – 10, చంద్రకళలు – 16, సూర్యకళలు – 12. ఈ కళలే స్వరూపంగా గలది.

| | |
|---|---|
| తంత్రగ్రంథాలలో అగ్నికళలు | 108 |
| చంద్ర కళలు | 136 |
| సూర్యకళలు | 116 |
| వెరసి | 360 |

షోడశ కళలు, చతుష్షష్ఠి కళలు గతంలో వివరించబడ్డాయి. ఈ కళలకన్నింటికీ అధిదేవత. కాబట్టే కలాత్మికా అనబడుతోంది.

జాగ్రదవస్థలో నాలుగు కళలున్నాయి. అవి శక్తి స్వరూపాలు 1. ఉత్పత్తి 2. జాగ్రత్త 3. బోధ 4. మనోవ్యాపారము స్వప్నావస్థలో నాలుగు కళలున్నాయి. అవి శివశక్తి స్వరూపాలు. 1. అభిలాష 2. భ్రమ 3. చింత 4. విషయవాంఛ సుషుప్తిలో నాలుగు కళలున్నాయి. అవి శివస్వరూపాలు 1. మరణము 2. పరాకు 3. మూర్ఛ 4. నిద్ర

తురీయావస్థ కళలు నాలుగు అవి.

1. వైరాగ్యము 2. మోక్షేచ్ఛ 3. మనశ్శుద్ధి 4. సద్వస్తు విచక్షణ. ఈ పదహారు కళలూ పరమేశ్వరి స్వరూపాలే. ఈ రకంగా కళలన్నింటికీ ప్రతిరూపము. అందుచేత కలాత్మికా అనబడుతుంది.

## 613. కలానాథా

ఇటువంటి కళలకు అధిపతి. కలాత్మికా అనే నామంలో వర్ణించిన కళలన్నీ పొంది ఉన్నది కాబట్టి కళానాథా అనబడుతుంది. 64 కళలకు స్థానమైనది. కళానాథుడు అంటే – చంద్రుడు. చంద్రమండలానికి శ్రీచక్రస్వరూపమున్నది. కాబట్టి పరమేశ్వరి చంద్రరూప, చంద్రస్వరూపిణి. చంద్రుడు షోడశకళా ప్రపూర్ణుడు. షోడశకళలనేవి ఈ శరీరంలోనే ఉన్నాయి. ప్రశ్నోపనిషత్తులోని ఆరవ ప్రశ్నలో

| | | | |
|---|---|---|---|
| 1. ప్రాణము | 5. అగ్ని | 9. మనస్సు | 13. వేదమంత్రాలు |
| 2. శ్రద్ధ | 6. జలము | 10. అన్నము | 14. కర్మలు |
| 3. ఆకాశము | 7. భూమి | 11. బలము | 15. లోకాలు |
| 4. వాయువు | 8. ఇంద్రియాలు | 12. తపస్సు | 16. ప్రాణులపేర్లు |

వీటన్నింటికీ ముఖ్య ప్రాణరూపంలో పరమేశ్వరియే అధిపతి. అందుచేతనే కళానాథా అనబడుతున్నది.

## 614. కావ్యాలాపవినోదినీ

వాల్మీకి మొదలైన కవులచే రచింపబడిన పద్దెనిమిది లక్షణాలు గల కావ్యాలు, దశవిధ రూపకాల ఆలాపనచే సంతసించునది. దోషరహితములై, గుణాలంకార సహితములై రసవ్యంజకములైన శబ్దార్థములు కావ్యములనబడతాయి.

| | | | |
|---|---|---|---|
| 1. నగర | 6. సూర్యోదయ | 11. విప్రలంభము | 16. యుద్ధం |
| 2. సముద్ర | 7. ఉద్యానవన | 12. వివాహము | 17. ప్రయాణం |
| 3. శైల | 8. మధుపాన | 13. కుమారోదయం | 18. నాయికాభ్యుదయం |
| 4. ఋతు | 9. రతి | 14. మంత్రం | |
| 5. చంద్రోదయ | 10. జలక్రీడ | 15. ద్యూతం | |

ఇవి కావ్యంలో ఉండే 18 రకాల వర్ణనలు.

**దశవిధరూపకాలు :**

1. నాటకము – వీర శృంగార రసాలలో ఒకదానికి మాత్రమే ప్రాధాన్యము.
2. ప్రకరణము – శృంగార రస ప్రాధాన్యము
3. భాణము – శృంగార వీరరసములు సూచన మాత్రము

| | | | |
|---|---|---|---|
| 4. | ప్రహసనము | – | హాస్యరస ప్రధానము |
| 5. | డిమము | – | దేవగంధర్వ పిశాచాదులు నాయకులు |
| 6. | వ్యాయోగము | – | వీరరస ప్రధానము |
| 7. | సమవాకారము | – | వీరరస ప్రధానము |
| 8. | వీధి | – | శృంగార రసము సూచనా మాత్రము |
| 9. | అంకము | – | కరుణరస ప్రధానము |
| 10. | ఈహామృగము | – | శృంగార రసానికి రసాభాస. |

ఇక్కడ వీటి ప్రాముఖ్యత ఏమీలేదు. కాబట్టి వీటిని వివరించటం అనవసరం.

పరమేశ్వరి తన ఆస్థానంలోని వశిన్యాది వాగ్దేవతలు చేసే వేదాంతవిచారము, రహస్య నామాలాపము, సంగీతాలాపములను వింటుంది. కాబట్టి కావ్యాలాపవినోదినీ అనబడుతుంది.

## 615. సచామరరమావాణీసవ్యదక్షిణ సేవితా

లక్ష్మీ, సరస్వతులు కుడి ఎడమలందుండి వింజామరలచేత వీస్తూ పరమేశ్వరిని సేవిస్తుంటారు. సర్వైశ్వర్యప్రదాయిని అయిన లక్ష్మీదేవి, సర్వజ్ఞానమయి అయిన సరస్వతీదేవి ఇద్దరూకూడా హృదయపూర్వకంగా, భక్తి ప్రపత్తులతో ఆ దేవిని సేవిస్తుంటారు.

## 616. ఆదిశక్తిః

సమస్త జగత్తులనూ సృష్టించేది కాబట్టి ఆదిశక్తి. ఇచ్ఛాశక్తి స్వరూపురాలు. జగత్సృష్టికి కారణమైనది. సకలసృష్టికీ కారణమైన మొదటి శక్తి. మాయాశబలితరూపము. ఈ జగత్తును సృష్టించాలి అనుకుని పరమేశ్వరుడు తనను తాను రెండుగా విభజించుకున్నాడు. ఆ సమయంలో పరబ్రహ్మ నుంచి బయటకు వచ్చినదే శక్తి. అదే మాయాస్వరూపము. నామరూపాత్మకమైన జగత్తు అంతా ఆ శక్తినుంచే ఆవిర్భవించింది. అన్ని శక్తులూ దానిలోనే ఉన్నాయి. కాబట్టి అది మూలశక్తి. అన్నింటికీ చైతన్యరూపమైన ముఖ్యప్రాణశక్తి. ఐశ్వర్యప్రదాయిని అయిన లక్ష్మికి, విజ్ఞానప్రదాయిని అయిన సరస్వతి కూడా మూలశక్తి అదే ఆదిశక్తి.

# 617. అమేయాత్మా

అమేయము – కొలవటానికి వీలు కానిది. పరమేశ్వరిని కొలవటం వీలుకాదు. ఆమెకు మించినదిగాని, ఆమెతో సమమైనదిగాని ఇంకేదీ ఈ జగత్తులో లేదు. లింగపురాణంలో చెప్పినట్లుగా చతుర్దశభువనాలలోను, ఈ బ్రహ్మాండమంతటిలోనూ కొలవదగినది ఆ పరమేశ్వరి రూపమే. కొలిచేవాడు ఈశ్వరుడు అంతేకాని వేరెవరూకాదు.

ఆత్మ అంటే – జీవుడు. అగ్నిలో నిప్పురవ్వలు ఏరకంగా ఉంటాయో, అలాగే పరమేశ్వరునిలో ఈ జీవులందరూ ఉంటారు. శివుని యొక్క ఎనిమిదవ మూర్తి ఆత్మ. ఇది మిగిలిన ఏడు మూర్తులను వ్యాపించి ఉన్నది కాబట్టి విశ్వమంతా వ్యాపించి ఉన్నది అని అర్థం.

ఆత్మ అంటే – పరబ్రహ్మమే. ఆ పరబ్రహ్మయే జీవులన్నింటి యందు బ్రహ్మరంధ్రం గుండా ప్రవేశించాడు అని చెప్పటం జరిగింది.

ఆత్మ అనేది **అణోరణీయాం మహతోమహీయాం** అణువుకన్న చిన్నదైనది. మహత్తు కన్న పెద్దదైనది. ఆది మధ్యాంతములు లేనిది. సృష్టిస్థితిలయాలకు కారణభూతమైనది, నిరాకారమైనది, నిర్గుణమైనది, అన్నింటికీ సాక్షీభూతమైనది, జీవులు చేసిన కర్మలకు తగిన ఫలితాన్ని ఇచ్చేది, సత్యము, నిత్యము అయినది, జ్ఞానమయమైనది, అనంతమైనది, అపరిచ్ఛిన్నమైనది, ఆనందమయమైనది, స్వతంత్రము, స్వతఃసిద్ధము, స్వతః ప్రమాణము గలది, నిర్మలము, నిశ్చయము, శుద్ధము, అనంతము అయినది. ఇదే ఆత్మ. ఆత్మ అంటే – పరబ్రహ్మమే.

ఆత్మ అనేది అమేయము. ఇది సర్వవ్యాప్తి. ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నది కాబట్టి దీన్ని కొలవటానికి వీలులేదు. ఆత్మను తెలుసుకోవటం కష్టము. ఇంద్రియాలచేత ఇది తెలుసుకోబడదు. ఆత్మ ఉండే చోటికి కనులుగాని, చెవులుగాని మనస్సుగాని పోలేవు. ఇంద్రియాలకు అతీతమైనది. ఇంద్రియాలకు ఆ శక్తినిచ్చేదే ఆత్మ. కళ్ళకు చూసే శక్తిని ఇచ్చేది ఆత్మ. చెవులకు వినికిడి శక్తిని ఇచ్చేది ఆత్మ. మనసుకు ఆలోచించే శక్తిని ఇచ్చేది ఆత్మ. ఈ రకంగా ఇంద్రియాలకు వాటిశక్తినిచ్చేదే ఆత్మ.

కాబట్టి ఆత్మను ఇంద్రియాల ద్వారా తెలుసుకోలేము. అందుకే అది అమేయాత్మా అనబడుతున్నది.

## 618. పరమా

పరం అంటే – బ్రహ్మ అని అర్థం. అతడే శివుడు. పరబ్రహ్మ నాలుగు రూపాలు కలిగి ఉంటుంది. వాటిలో

| | | |
|---|---|---|
| మొదటిరూపము | – | పురుషుడు |
| రెండవరూపము | – | వ్యక్తము |
| మూడవరూపము | – | అవ్యక్తము |
| నాల్గవరూపము | – | కాలము |

అని విష్ణుపురాణంలో చెప్పబడింది. వీటన్నింటికన్నా గొప్పది. అదే పరమేశ్వరి.

కార్యకారణములకన్న వేరైనది అయిన నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వరూపము పరమ అనబడుతుంది. నశించేటటువంటి దేహాదులచే నశించనిది. శ్రేష్ఠమైనది. వేదమందు చెప్పబడినది. లింగపురాణంలో

**గౌరీరూపాణి సర్వాణి శరీరాణి శరీరిణాం**
**శరీరిణ స్తథా సర్వే శంకరాంశేఉ వ్యవస్థితా ॥**

ప్రపంచలోని జీవరాశి అంతా పరమేశ్వరి యొక్క అంశమే. అందులోని చైతన్యము శంకరాంశ.

ఈ జగత్తును అందంగా ప్రకాశింపచేసే తత్త్వమే పరమా అనబడుతుంది.

## 619. పావనాకృతిః

పవిత్రమైన శరీరము గలది. సచ్చరిత్ర గలది. జ్ఞానము గలది. తపస్సు, జ్ఞానము, విద్య, బుద్ధి అనేవి జీవిని పవిత్రుడుగా చేస్తాయి.

పరమైనదంతా పావనమైనదే. జగత్తులో పవిత్రమైనవన్నీ ఒక ఆకారం ధరిస్తే, ఆ స్వరూపమే పరమేశ్వరి. శ్రేష్ఠమైన వాటి సముదాయమే పరమేశ్వరి. కేవలము దర్శనమాత్రంచేతనే భక్తులను పవిత్రులుగా చేస్తుంది. అటువంటి స్వరూపం గలది. ఆ పరమేశ్వరి రూపాన్ని దర్శించి ధన్యత చెందాలని అనేకానేకులు ఎదురుచూస్తుంటారు. అంటే దర్శనమాత్రంచేతనే ఆమె భక్తుల పాపాలను నాశనం చేస్తుంది. వారికి ముక్తి లభిస్తుంది. అభీష్టసిద్ధి గలుగుతుంది. అందుచేతనే ఆ పరమేశ్వరి 'పావనాకృతిః అని చెప్పబడింది.

## 620. అనేకకోటి బ్రహ్మాండజననీ

అనంతమైన – లెక్కించటానికి సాధ్యం కానటువంటి బ్రహ్మాండాలను సృష్టించినది. ఆ బ్రహ్మాండాలకు తల్లి.

స్థూలమైన పంచభూతాల చేరికయే బ్రహ్మాండము. ఆ బ్రహ్మాండాభిమాని విరాడ్రూపుడు. ఆ విరాడ్రూపుని సృష్టించినది, అతనికి తల్లి. వేదంలో విరాట్పురుషుడు బ్రహ్మాండానికి ఆత్మ, స్వరాట్ స్వరూపము అని చెప్పబడింది. అంటే బ్రహ్మాండానికి ఆత్మ, శరీరము అయిన విరాట్, స్వరాట్‌లను దేవతలకు తల్లి.

ఇన్నికోట్ల బ్రహ్మాండాలను సృష్టించిన పరమేశ్వరి, మనం నివసించే ఈ జగత్తు దిక్పాలకులతో, సూర్య చంద్రాది గ్రహాలతో, త్రిమూర్తులు, త్రిశక్తులు మొదలైన వారితో నిండి ఉన్నది. ఈ రకంగా ఉన్న స్థావరజంగమాత్మకమైన జగత్తే ఒక బ్రహ్మాండము. ఇటువంటివి అనేక కోటిబ్రహ్మాండాలను సృష్టించింది ఆ దేవి.

మహాసంకల్పంలో

**మహాజలౌఘస్య మధ్యే పరిభ్రమమాణానాం**

**అనేకకోటి బ్రహ్మాండానాం ఏకతమే**

మహా జలరాశి నడుమ పరిభ్రమిస్తున్నటువంటి అనేక కోట్ల బ్రహ్మాండాలయందు ఒకదానిలో మనము ఉన్నాము. మనమున్నది భూలోకం. దీని క్రింద ఏడు లోకాలున్నాయి. అలాగే పైన ఆరులోకాలున్నాయి.

**అతల వితల సుతల తలాతల రసాతల మహాతల**

**పాతాళ సప్తలోకానాం ఉపరితలే.......**

**భూ, ర్భువ, స్సువ, ర్మహ, ర్జన, స్తప, స్సత్య మితి సప్తలోకానాం అథోభాగే......**

అని చెప్పబడింది. మనం ఎలా ఉన్నామో ఆ లోకాల వారు కూడా అలాగే ఉంటారు. సైన్సు ప్రకారం ఇతర గ్రహాలలో కూడా నీరున్నది. అక్కడ జీవులు నివసించే ఛాయలున్నాయి. కాబట్టి మనకు తెలియనివి, కంటికి కనిపించనివి అనేక లోకాలున్నాయి. వాటన్నింటినీ సృష్టించినది పరమేశ్వరి. అందుచేతనే ఆమె 'అనేకకోటి బ్రహ్మాండజననీ' అనబడుతోంది.

## 621. దివ్యవిగ్రహా

దివ్యమైన రమణీయమైన దేహము గలది. దివ్యము అంటే – ఆకాశము. విగ్రహము – దేహము. ఆకాశమువలె విస్తారమైన దేహము గలది. చరాచరజగత్తునంతా ఆక్రమించినది.

దేవతలకు సహజమైన ప్రకాశము గలది. **ఉమా హైమవతీం బహుశోభమానాం** అని చెప్పబడింది. అలాగే పరమేశ్వరి స్వరూపాన్ని వివరిస్తూ **నిజారుణ ప్రభాపూర మద్యద్బ్రంహ్మాండ మండలా** ఈ రకంగా దేవి ప్రకాశిస్తుంటుంది. అని చెప్పటం జరిగింది. అందుచేతనే ఆమె దివ్యవిగ్రహా అనబడుతోంది.

ఈ రకంగా దాక్షాయనీ విద్యను వివరించటం జరిగింది. ఇదే పరమేశ్వరి ఉపాశ్యరూపము.




శ్రీ 'గ'కార దేవి

# 42. లోపాముద్ర విద్య

పంచదశీ మహామంత్రాన్ని జపించి తరించినవారు పన్నెండుమంది మహానుభావులు అని గతంలో చెప్పటం జరిగింది. వారిలో లోపాముద్ర ఒకరు. ఈమె అగస్త్యుని భార్య. అగస్త్యుడు హయగ్రీవుని దగ్గర శ్రీవిద్యను ఉపదేశం పొందాడు. శ్రీవిద్య హాదివిద్య కాదివిద్య అని రెండు విధాలుగా ఉన్నది. పంచదశి మహామంత్రం హకారంతో మొదలయితే హాదివిద్య. కకారంతో మొదలయితే కాదివిద్య. లోపాముద్ర ఉపాసించిన మంత్రం హాదివిద్య. పైన చెప్పిన పన్నెండుమందీ శ్రీవిద్యను పన్నెండువిధాలుగా ఉపాసించారు. వీటిలో హాదివిద్య, కాదివిద్య రెండే శ్రేష్టమైనవి. కాగా హాదివిద్యలో లోపాముద్ర ఉపాసనచేసిన మంత్రం శ్రేష్ఠమైనది.

పరమేశ్వరి క్లీంకార బీజస్వరూపురాలు. క్లీంకారము మహాసమ్మోహనము. ఆమెను ఉపాసించినట్లైతే ముల్లోకాలూ వశమవుతాయి. పరమేశ్వరి మహామంత్రం గుహ్యాతి గుహ్యమైనది. అంటే అతి రహస్యమైనది. ఆమెను అర్చిస్తే వచ్చే ఫలం కైవల్యము. అదే సాయుజ్యం. ఆమె ఆదియైనది. అంటే సృష్టి ప్రారంభంకాకముందు నుంచీ ఉన్నది. జగత్తంతా శూన్యంగా ఉన్నప్పుడు ఆమె ఉన్నది. త్రిమూర్తులను, త్రిశక్తులను కూడా ఆమె సృష్టించింది. అందుచేతనే మానవులే కాదు దేవతలు కూడా ఆమెకు నమస్కరిస్తారు. ఆమె త్రిమూర్తి స్వరూపం గలది. దేవతలచే పూజించబడుతుంది. మనకు కావలసిన వాగ్భవ, కామరాజ, శక్తిబీజాలే ఆ దేవత మంత్రం. సుగంధద్రవ్యాలు కలిపిన హరిచందనం లేపనం గావించబడుతుంది. పాపిట సింధూరం ధరించి ఉంటుంది. ఆవిడే ఉమాదేవి. హిమవంతుని కుమార్తె. శుంభ నిశుంభులతో బాధలు పడలేక దేవతలు హిమాలయాలకు వెళ్ళి ఉమాదేవినే ప్రార్థించారు.

ఆ ఉమాదేవి గౌరవర్ణం గలది కాబట్టి గౌరి అనబడుతోంది. ఆమెను గంధర్వులు సేవిస్తూ ఉంటారు. సృష్టి స్థితి లయాలకు కారణం ఆమె. ప్రళయకాలంలో ఈ సృష్టి మొత్తాన్ని తన కడుపులో దాచుకుని, జీవుల కర్మలు పరిపక్వం చెందిన తరువాత మళ్ళీ వారిని బయటకు పంపుతుంది. ఆవిడే వాగధీశ్వరి అనబడుతుంది.

ఆమెను తెలుసుకోవాలంటే ధ్యానమే మార్గము. ఆమె ఇటువంటిది అని చెప్పటానికి వీలులేనటువంటిది. అనంతమైనది. జగత్తంతా ఆమె రూపమే. ఆమెను అర్చించిన భక్తులకు జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. ఆ పరమేశ్వరి జ్ఞానస్వరూపిణి. ఉపనిషత్తుల సారమే ఆమె

రూపము. సత్యము నిత్యము ఆనందమయము. సంకల్పమాత్రంచేతనే లోకాలను సృష్టిస్తుంది. ఆమెను కంటితో చూడలేము. ఇతర ఇంద్రియాలతో తెలుసుకోలేము. ఆమె తప్పించి ఇంకా తెలుసుకోవలసినది ఏదీలేదు. ఆ పరమేశ్వరి యోగిని స్వరూపం గలది. తన భక్తులకు యోగాన్నిస్తుంది. వారు యోగము అనుభవించే సాధనం కూడా చూపుతుంది. యోగముచేతనే అంటే జీవాత్మ పరమాత్మల సామరస్యంచేతనే ఆనందం పొందుతుంది. ఆమె కాలస్వరూపిణి. ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులరూపము ఆమె. అన్నిలోకాలకు ఆధారమైనది ఆమె. సత్తు ఆమె, అసత్తు ఆమె. ఆ దేవియే అష్టమూర్తి. అజ్ఞానాన్ని పటాపంచలు చేస్తుంది. లోకాలను సక్రమంగా నడిపిస్తుంది. ఆమె ఏకాకి. ఆమెకు ఎవరూ లేరు. అందరికీ ఆమే ఉన్నది. ఆమె పరబ్రహ్మ స్వరూపము. రెండవది ఏదీ లేనటువంటిది. ద్వైతాన్ని వర్జించినది. అంటే జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటేనని భక్తులకు సాయుజ్యం ప్రసాదిస్తుంది.

ఈ విషయాలను 622 నుండి 669 నామాల వరకు వివరించటం జరిగింది.

## 622. క్లీంకారీ

క్లీం అనేది కామరాజబీజము. క్లీం అంటే శివకాముడు. అతని భార్య శివకామేశ్వరి. క్లీం కారబీజస్వరూపురాలు. హ్రీం అనేది భువనేశ్వరి బీజమని అది ప్రత్యేకమైన మంత్రమని చెప్పటం జరిగింది. అలాగే క్లీం కూడా ప్రత్యేకమైన మంత్రము. పరమేశ్వరి సర్వసమ్మోహన విగ్రహం అందరినీ ఆకర్షిస్తుంది. సర్వజనులను వశీకరణం చేస్తుంది. క్లీం కామరాజబీజం. సృష్టిని కామించినవాడు, సృష్టి చెయ్యాలి అనుకున్నవాడు ఈశ్వరుడు. కాబట్టి అతడు శివకామేశ్వరుడు. అతని భార్య లేక అతని శక్తి కాబట్టి ఆ దేవి క్లీంకారీ అనబడుతుంది.

## 623. కేవలా

అన్నిరకాలయిన ధర్మాలను వదలివేయుటవలన ఒంటరిగా ఉంటుంది. కాబట్టి కేవలా అనబడుతుంది. ఏ ధర్మములు లేనటువంటిది. ధర్మాధర్మ వివర్జితా. పరమేశ్వరికన్న భిన్నమైన పదార్థం ఏదీలేదు. కాబట్టి ఆమెకు ధర్మాధర్మాలు ఉండవు. అందుకే ఆమె ఏకాకి. సజాతీయలుగాని, విజాతీయులుగాని ఎవరూ లేనట్టిది. కేవలము శుద్ధ బ్రహ్మ స్వరూపమైనట్టిది. ఈంకారము పరమేశ్వరి బీజం. దీనివల్లనే మోక్షం వస్తుంది. కేవలము ఈంకారము వల్లనే అది జరుగుతుంది. కాబట్టి ఆమె కేవలా అనబడుతుంది.

## 624. గుహ్యా

మిక్కిలి రహస్యమైనది. గృహను ప్రవేశించినది గుహ్యా. కంటికి కనిపించదు. రహస్యాతి రహస్యము. పరమేశ్వరి సూక్ష్మరూపమైన మంత్రము అతి రహస్యము. అందుకే త్రిశతి ఫలశృతిలో 'తల్లి జారిణి అని తెలిసినప్పుడు, ఆ విషయాన్ని ఎంత జాగ్రత్తగా దాచుకుంటావో, శ్రీవిద్యను కూడా అంత రహస్యంగా ఉంచాలి అని చెప్పబడింది. శ్రీవిద్య అంత రహస్యమైనది.

**రాజ్యం దేహి శ్రియం దేహి న దేహి షోడశాక్షరీ**

ధన ధాన్యాలు ఇచ్చెయ్యి, రాజ్యాలు దానం చెయ్యి. కాని షోడశిమంత్రాన్ని మాత్రం చెప్పవద్దు అది గోప్యం. అంటే ఎవరికీ చెప్పవద్దని కాదు. అర్హత లేనివారికి చెప్పవద్దు.

పరమేశ్వరి హృదయమనే గుహలో పదిలంగా రహస్యంగా ఉన్నది. పంచకోశాలయందు రహస్యంగా ఉన్నది. కాబట్టి గుహ్యా అనబడుతుంది.

## 625. కైవల్యపదదాయినీ

కేవలము ఒక స్వభావము మాత్రమే ఉండేది. గుణరహితమైనది. ఇది ఐదవముక్తి. షట్చక్రాలలో పరమేశ్వరిని అర్చించే వారికి అంటే అంతరారాధనాపరులకు ముక్తి కలుగుతుంది. అయితే ఒక్కొక్క చక్రంలో ఒక్కొక్క రకమైన ముక్తి కలుగుతుంది.

ఆధారస్వాధిష్ఠానాలు అంధకార బంధురాలు. ఇక్కడ పరమేశ్వరిని అర్చించే వారికి ముక్తి ఉండదు. వీరికి ఐహికవాంఛలపైననే ఆసక్తి. ఇక ఆ పరమేశ్వరిని

1. మణిపూరంలో అర్చించే వారు - సార్ష్టిరూపముక్తి పొందుతారు. అంటే దేవి పురమునకు దగ్గరగా ఇంకొకపురము నిర్మించుకుని అక్కడ ఉంటారు.

2. అనాహతంలో అర్చించేవారు - సాలోక్యముక్తి పొందుతారు. వీరు దేవి పట్టణంలోనే ఒక మూల నివశించగలుగుతారు.

3. విశుద్ధి చక్రంలో అర్చించేవారు - సామీప్యముక్తి పొందుతారు. అంటే దేవికి అతి దగ్గరగా సేవకులుగా ఉంటారు.

4. ఆజ్ఞాచక్రంలో అర్చించేవారు - సారూప్యముక్తి పొందుతారు. వీరు వేరే దేహము ధరించి దేవితో సమానమైన రూపంలో ఉంటారు.

5. సహస్రారంలో అర్చించేవారు – సాయుజ్యం పొందుతారు. ఇది శాశ్వతమైన ముక్తి. వీరి జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది.

ఏ రకమైన మార్పులూ లేకుండా స్వరూపమాత్రంతో ఉండే చిచ్ఛక్తియే కైవల్యము. వేదంలో 'అరణ్యంలో తపస్సు, శ్రద్ధ గలిగి విద్వాంసులు శాంతస్వరూపులై బిక్షాటనాపరులై ఉండేవారు, పరమాత్మ ఉండే చోటికి సూర్యద్వారం గుండా వెళతారు. అది అర్చిరాదిమార్గము.

బ్రహ్మలోకానికి పోయే మార్గం అతి కాంతియైన బింబముతో కప్పబడి ఉంటుంది. ఆ కాంతిని మనం చూడలేము. అందుకే సాధకుడు ఆ కాంతిబింబాన్ని కొద్దిగా తొలగించి బ్రహ్మలోకానికి దారి చూపమని వేడుకుంటాడు.

**హిరణ్యయేన పాత్రేణ సత్యస్యా పిహితం ముఖం**
**తత్త్వం పూష న్నపావృణు సత్యధర్మాయ దృ ష్టయే.**

ఓ సూర్యభగవానుడా ! సర్వమూ నీకు తెలుసునయ్యా ! గగన వీధిలో ఒంటరిగా ప్రయాణించే ఓ బాటసారీ ! నీ తేజోమయమైన కాంతి పుంజాన్ని కొద్దిగా తగ్గించినట్లైతే బ్రహ్మలోకమార్గం నాకు కనపడుతుంది. కాబట్టి నీ కాంతిని కొద్దిగా ఉపసంహరించుకో అంటూ జ్యోతిరూపమైన సూర్యుణ్ణి ప్రార్థిస్తున్నారు.

పరమేశ్వరిని అర్చించినవారికి కేవలము ఇహమే కాకుండా పరము కూడా లభించింది.

కైవల్యము అంటే తురీయాతీతము. మనోవృత్తులు శాశ్వతముగా వదలటమే మోక్షము. ఐహికబంధనాల నుండి విముక్తి పొందటమే ముక్తి. అదే సాయుజ్యము.

తన భక్తులకు మోక్షం ప్రసాదిస్తుంది. వేదంలో చెప్పినట్లుగా, కర్మలు చేస్తూ ఉండేవారికి చంద్రలోకం ప్రాప్తిస్తుంది.

ఇతర దేవతల ఉపాసన చేసేవారికి – సూర్యమండలం లభిస్తుంది.

శ్రీ విద్యోపాసకులుకు బ్రహ్మజ్ఞానము లభిస్తుంది. అంత్యకాలంలో మోక్షము కూడా లభిస్తుంది.

విద్యలు రెండు రకాలు 1. అపరావిద్య 2. పరావిద్య. అపరావిద్య కేవలము ఐహికపరమైనది. ఈ విద్యను ఉపాసించేవారు లౌకికమైనవన్నీ పొందుతారు. పరావిద్య

నిత్యము సత్యము, శాశ్వతమైనది అయిన పరబ్రహ్మను చేరుస్తుంది. పరావిద్యోపాసకులు మోక్షవాదులు అదే వీరి లక్షణం. దానికోసం శరీరాన్ని శుష్కింపచేసి, నియమనిష్ఠలతో కాలంగడుపుతూ, మనసా వాచా కర్మణా పరమేశ్వరినే ధ్యానించేవారికి ముక్తి లభిస్తుంది.

జీవి తను చేసిన కర్మల ఫలితాలను అనుభవించాలి. కర్మ శేషం లేనివారికి అతి త్వరలో ముక్తి లభిస్తుంది.

ఈ రకంగా సాధకుల యొక్క కర్మను బట్టివారికి కైవల్యము ప్రసాదిస్తుంది.

కైవల్యము కేవలము జ్ఞానఫలం. తైత్తిరీయంలో "ఈ విషయాలు తెలుసుకున్నవాడు సూర్యుడు ఉత్తరాన ఉండగా మరణిస్తే అతడు సూర్యునితో సాయుజ్యం పొందుతాడు. సూర్యుడు దక్షిణాన ఉన్నప్పుడు మరణిస్తే పితురుల మహిత పొంది చంద్రునితో సాయుజ్యం పొందుతాడు. ఈ రెండూ కాకుండా పరబ్రహ్మను గురించి తెలుసుకుంటే అతడు బ్రహ్మపదం పొందుతాడు" అని చెప్పబడింది. కేవలము కర్మలను మాత్రమే చేసేవాడు చంద్రలోకం పొందుతాడు. కర్మలన్నింటినీ పరిత్యజించి పరబ్రహ్మను ధ్యానించేవాడు బ్రహ్మలోకం పొందుతాడు. ఈ రకంగా జీవుల కర్మలను బట్టి వారికి మోక్షాన్ని ప్రసాదిస్తుంది. కాబట్టే ఆమె కైవల్యపదదాయనీ అనబడుతోంది.

## 626. త్రిపురా

శరీరంలో ఇడ పింగళ సుషుమ్నలు మూడు ముఖ్యనాడులు. ఈ నాడులనే త్రిపురములు అంటారు. అలాగే మనస్సు, బుద్ధి, చిత్తము త్రిపురములు. ఆ ప్రదేశాలలో ఉండటంచేత దేవికి త్రిపుర అని పేరు వచ్చింది. ఈ త్రయములు అన్నీ ఎవరివల్ల కలిగాయో ఆమె త్రిపుర. లోకంలో మూడుగా చెప్పబడేవన్నీ త్రిపురములే.

త్రిమూర్తులకన్న కూడా పురాతనమైనది. త్రిమూర్తులను కూడా ఆమె సృష్టించింది. కాబట్టి త్రిపురా అనబడుతోంది. తత్త్వాలకు అతీతమైనది. ఈ జగత్తు అంతా తత్త్వముల చేతనే ఆవిర్భవించింది. **తత్త్వాతీతంచ బైందవమ్.** శ్రీచక్రంలో ఈ తత్త్వాలకు అతీతంగా బిందువున్నది. ఆ బిందువలోనే పరమేశ్వరి ఉంటుంది. అంటే ఆ దేవి తత్త్వాలన్నింటికీ అతీతమైనది కాబట్టే త్రిపురా అనబడుతోంది.

బ్రహ్మతత్త్వమే – స్థూలశరీరాభిమాని అయిన ఆత్మతత్త్వముగ సూక్ష్మశరీరాభిమాని అయిన విద్యాతత్త్వముగ, కారణశరీరాభిమాని అయిన శివతత్త్వముగ ఉన్నాడు. అవే త్రిపురములు. లఘుస్తవంలో

**దేవానాం త్రితయం త్రయీ హుతభుజాం శక్తిత్రయం త్రిస్వరా**
**త్రై లోక్యం త్రిపదీ త్రిపుష్కరమథో త్రిబ్రహ్మ వర్ణా స్త్రయః**
**య త్కించి జ్జగతి త్రిధా నియమితం వస్తు త్రివర్గాత్మకం**
**త త్సర్వం త్రిపురేతి నామ భగవ త్యన్వేతి తే తత్త్వతః ॥**

బ్రహ్మ విష్ణు రుద్రులు, ఆహవనీయ, గార్హపత్య, దక్షిణాగ్నులు, ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులు, వామజ్యేష్ఠరౌద్రులు, ఉదాత్తము అను దాత్తము స్వరితాలు. భూలోకభువర్లోక సువర్లోకాలు, స్వర్గమర్త్యపాతాళాలు, గంగాయమున సరస్వతులు, త్రిబ్రహ్మలు, త్రివర్ణములు, అకారఉకారమకారాలు. ఈ రకంగా మూడుగా ఉన్నవన్నీ త్రిపుటి. అదే త్రిపుర. వాటి స్వరూపమే కాబట్టి ఆమె త్రిపురా అనబడుతుంది.

## 627. త్రిజగద్వంద్యా

**త్రిభి ర్జగద్భి ర్వంద్యా**

ముల్లోకములచే నమస్కరించబడునది. జగత్తు అంటే కేవలము చెట్లుపుట్టలుకాదు. అందులో ఉండే సమస్తజీవజాలము. ఆ దేవి భూలోక భువర్లోక సువర్లోకాలలో ఉండే వారందరితోనూ నమస్కరింపబడేది.

మనకు కనిపించే మానవులే కాకుండా యక్ష కిన్నెర కింపురుష సిద్ధ సాధ్య గంధర్వాదులచేత కూడా నమస్కరింపబడునది. దేవ దానవులచే నమస్కరింపబడేది. అందుకే ఆ పరమేశ్వరి 'త్రిజగత్‌వంద్యా' అనబడుతోంది.

## 628. త్రిమూర్తిః

త్రిమూర్తి – మూడు సంవత్సరములు గల కన్య. ఎరుపుతెలుపు కలిసిన రంగుగలది.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, వామ జ్యేష్ఠ రౌద్రి, ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులు. ఇవన్నీ పరమేశ్వరికి సంబంధించినవే కాబట్టి ఆమె త్రిమూర్తి అనబడింది. వరాహపురాణంలో "బ్రహ్మ ఈరకంగా శివునకు చెప్పి విష్ణువును స్మరించాడు. అప్పుడు విష్ణువు వారిద్దరి మధ్యనా ప్రత్యక్షమైనాడు. ఆ సమయాన వారు ముగ్గురూ ఒకటై పరస్పరం చూసుకున్నారు. ఆ దృష్టి నుండి దివ్యరూపమైన కన్యకామణి పుట్టింది. ఆమె నలుపు, తెలుపు పీతవర్ణాలు కలిగి ఉన్నది. ఆ బాలిక వారితో "నేను భగవద్దృష్టితో పుట్టాను నేను సర్వశక్తిసమన్వితమైన పరమేశ్వరిని" అని చెప్పింది.

కాబట్టి పరమేశ్వరి త్రివర్ణములు కలిగిఉన్నది. ఆమె త్రిమూర్తి. ఆ పరమేశ్వరి శ్వేతవర్ణం గలిగి సత్వగుణంతో బ్రహ్మనిష్ఠురాలుగా, రక్తవర్ణం గలిగి రజోగుణంతో వైష్ణవిగా, పసుపువర్ణం గలిగి తమోగుణంతో రౌద్రిగా పిలువబడుతుంది. పరమాత్మ ఒక్కడే అయినప్పటికీ మూడురకాలుగా త్రిమూర్తులుగా ఉన్నట్లుగానే, దేవి ఒక్కతే అయినప్పటికీ ప్రయోజనం కోసం మూడువిధాలవుతున్నది.

దేవీభాగవతంలో

**శాంభవీ శుక్లరూపా చ శ్రీవిద్యా రక్తరూపికా ।**
**శ్యామలా శ్యామరూపాస్యా ది త్యేతా గుణశక్తయః**

| | | |
|---|---|---|
| శాంభవి | – | తెలుపు రంగు |
| శ్రీవిద్య | – | ఎరుపు రంగు |
| శ్యామ | – | నలుపు రంగు అని చెప్పబడింది. |

## 629. త్రిదశేశ్వరీ

దేవతలకు ఈశ్వరి. మూడు అవస్థలకు ఈశ్వరి. పదముగ్గురువిశ్వేదేవతలకు ఈశ్వరి. ముప్పైమూడుగుణాలకు ఈశ్వరి.

త్రిదశులు – బాల్య కౌమార యవ్వన వార్ధక్యములనబడు దశలలో ఎల్లప్పుడూ మూడవదశయందే ఉండేవారు – దేవతలు.

ధర్ముడు అనేవాడు ఒక మనువు. అతడికి పదిమంది భార్యలు. అందులో విశ్వ అను భార్యకు పుట్టినవారు విశ్వేదేవతలు.

దేవతలకు, విశ్వేదేవతలకు కూడా ఈశ్వరి ఆ పరమేశ్వరి. జాగ్రస్వప్నసుషుప్తులందు మార్పులేని శరీరాభిమాని అయిన దేవత. సృష్టిస్థితిలయాలనబడే మూడుదశలకు ఈశ్వరి. 33 మంది దేవతలకు ఈశ్వరి. వీరు

| | |
|---|---|
| ఏకాదశరుద్రులు | 11 |
| ద్వాదశాదిత్యులు | 12 |
| అష్టవసువులు | 8 |
| ఇంద్రుడు, ప్రజాపతి | 2 |
| మొత్తం | 33 మంది |

యజ్ఞాలలో హవిర్భాగంతీసుకునేది వీరే.

## 630. త్ర్యక్షరీ

వాగ్భీజము, కామరాజ బీజము, శక్తిబీజము. ఈ మూడింటి యొక్క సమూహము.

త్ర్యక్షరీ – **శుద్ధవిద్యాకుమారీచ**

శుద్ధవిద్యా మంత్రస్వరూపిణి అని, బాలామంత్రస్వరూపురాలని, త్రివర్ణ మంత్రస్వరూపిణి అని చెప్పవచ్చును.

| | | |
|---|---|---|
| ఐం | – | వాగ్భవబీజము |
| క్లీం | – | మన్మథబీజము |
| సౌః | – | శక్తిబీజము |

వామకేశ్వరతంత్రంలో

**వాగీశ్వరీ జ్ఞానశక్తి ర్వాగ్భవే మోక్షరూపిణీ**
**కామరాజే క్రియాశక్తిః కామేశీ కామరూపిణీ**
**శక్తిబీజే పరాశక్తి రిచ్ఛైవ శివరూపిణీ**
**ఏవం దేవీ త్ర్యక్షరా తు మహాత్రిపురసుందరీ ॥**

| | | | |
|---|---|---|---|
| వాగీశ్వరి | జ్ఞానశక్తి | వాగ్భవబీజం | మోక్షప్రదం |
| కామేశి | క్రియాశక్తి | కామరాజబీజం | కామరూపిణి |
| శివరూపిణి | ఇచ్ఛాశక్తి | శక్తిబీజం | పరాశక్తి |

ఈ రకంగా త్ర్యక్షరియే మహాత్రిపురసుందరి అని చెప్పబడింది.

అక్షరత్రయవిభాగరూపిణి. యుగాక్షర, మాసాక్షర, నిత్యాక్షరములు అనే వీటి సమూహమే ఆ పరమేశ్వరి.

## 631. దివ్యగంధాఢ్యా

దివియందు పుట్టినవారు దివ్యులు వీరే దేవతలు. ఈ లోకంలో ఉండే రాజులా కాకుండా పరలోకములోని దివ్యుల సంబంధముతో నిండినది. అంటే దేవతలచేత సేవించబడేది.

మనోహరమైన హరిచందనము మొదలైన పరిమళద్రవ్యాలచే ఒప్పునది. గంధాష్టకముచే సేవించబడునది. గంధాష్టకము అంటే సువాసనలు వెదజల్లే ఎనిమిది పదార్థాలు విద్యార్థికల్పతరువులో అవి.

| | | | |
|---|---|---|---|
| 1. జాపత్రి | 3. దాల్చినచెక్క | 5. నాగకేసరములు | 7. కస్తూరి |
| 2. లవంగాలు | 4. ఏలకులు | 6. మిరియాలు | 8. ఆకుపత్రి |

అయితే వీటికి మతాంతరమున్నది.

| | | | |
|---|---|---|---|
| 1. చందనము | 3. కర్పూరము | 5. కుంకుమపువ్వు | 7. జటామాంసి |
| 2. అగరు | 4. కచోరము | 6. గోరోచనము | 8. కుందురుష్కము |

ఈ ద్రవ్యాలు కలిపిన గంధాన్ని దివ్యగంధము అంటారు. అటువంటి దివ్యగంధముచే అలంకరించబడినది.

## 632. సిందూరతిలకాంచితా

సిందూరము అంటే – ఎర్రని చూర్ణము, గోరోచనము సీమంతమందు సిందూర తిలకముచే భాసించునది. పాపటయందు సింధూరము ధరించునది. ఇది సౌభాగ్య చిహ్నము. పరమేశ్వరి స్వరూపాన్ని వివరిస్తున్నప్పుడు ఫాలభాగాన కస్తూరికా తిలకమున్నది అని చెప్పాం. **ముఖచంద్రకళంకాభామృగనాభ విశేషకా** ఇప్పుడు పాపిట సిందూరం ధరించింది అని చెబుతున్నారు. స్త్రీలచే పూజించబడినది. శ్రీకృష్ణపరమాత్ముని తమకు భర్తగా ఇమ్మని గోపికలంతా ఆ దేవిని పూజించారు.

## 633. ఉమా

ఉకారము శివుడు. మా అంటే పార్వతి. ఉమ అంటే శివశక్తులు అని అర్థం.

తారకాసుర సంహారం కోసం దేవతలు పరమేశ్వరిని ప్రార్థించారు. అప్పుడు ఆమె వారికి ప్రత్యక్షమై నా అంశతో హిమవంతునికి ఒక కుమార్తె పుడుతుంది. ఆమెను శివునకిచ్చి వివాహం చెయ్యండి. వారిద్దరికీ పుట్టిన కుమారుడు తారకుని సంహరిస్తాడు అని చెబుతుంది.

కొంతకాలానికి హిమవంతుని భార్య మేనక గర్భవతి అయి ఆడపిల్లను ప్రసవించింది. ఆ బాలిక దినదినప్రవర్ధమానమైంది. సర్వకాలసర్వావస్థలయందు శివనామాన్నే జపిస్తుండేది. రానురాను తాను శివుణ్ణి తప్ప వేరెవరినీ వివాహమాడను అని తేల్చి చెప్పింది. ఆ సమయంలో శివుడు విరాగియై తపోదీక్షలో ఉన్నాడు. అతణ్ణి భర్తగా పొందాలంటే తపస్సు ఒక్కటే మార్గం. అందుకని తపస్సు చెయ్యటానికి ఇంటి నుంచి బయలుదేరింది. అప్పుడు తల్లి అయిన మేనక కుమార్తెను వారిస్తూ ఉ – ఓయమ్మా, మా – వద్దు అన్నది. అప్పటి నుండీ ఆమెకు 'ఉమా' అనే పేరు సార్థకమై పోయింది.

ఉత్తమమైన చిత్తవృత్తి గలది. సూతసంహితలో పరానుభూతియు, సంసార పాపములను నశింపచేయునదియు, సదాశివుని కన్న మించిన శోభనసంపద గల ఉమ అను పేరు గల అనేక విధాలయిన వైభవముగల ఉత్తమ చిత్తవృత్తికి మ్రొక్కెదను అని చెప్పబడింది.

విష్ణు శివ బ్రహ్మ వాచకములైన అకార ఉకార మకారములతో కూడిన త్రిమూర్త్యాత్మకమైన ప్రణవస్వరూపిణి. అందుచేతనే ఉమా అంటే – దేవీ ప్రణవము అని చెప్పబడినది. లింగపురాణంలో శివుడు దేవితో 'అకార ఉకార మకారములు నా ప్రణవము. ఉకార మకార అకారములు నీ ప్రణవమందు గలవు' అంటాడు.

మహావాసిష్టంలో "ఓంకార సారశక్తి గలదగుటచే ఉమ అని కీర్తించబడింది" అని చెప్పబడింది. ఉమ అంటే చంద్రకళ. ఇది ముల్లోకాలలోను నిద్రించువారి మేల్కొనువారి హృదయాలను ప్రేరేపిస్తుంది.

శివసూత్రాలలో ఇచ్ఛాశక్తి ఉమాకుమారి అని చెప్పబడింది. యోగుల యొక్క ఇచ్ఛకు ఉమ అని పేరు, సింధువనమున ఉండే దేవత.

ఉమా అంటే – కాంతి అని అర్థం.

**యా దేవీ సర్వభూతేషు కాంతిరూపేణ సంస్థితా**

అన్ని జీవులయందు కాంతిరూపంలో ఉంటుంది.

కేనోపనిషత్తులో "ఒకసారి దేవదానవులకు భీకరయుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో దేవతలు విజయం సాధించారు. ఆ తరువాత వారందరూ ఒకచోట చేరి యుద్ధం ఏ రకంగా జరిగింది. తాము ఏ విధంగా విజయం సాధించాము అనే విషయాలను గాథలుగా చెబుతున్నారు. ఆ విజయానికి కారణం నేనే అని ప్రతివారూ చెబుతున్నారు.

అగ్నిదేవుడు అంటున్నాడు. "ఆ యుద్ధంలో నేను నిప్పులు కురిపిస్తుంటే రాక్షసులంతా మాడిమసి అయిపోయారు"

వాయుదేవుడు అంటున్నాడు " ఆయుద్ధంలో నేను చండప్రచండగా గాలులు వీస్తుంటే రాక్షసులు ఆ గాలులకు కొట్టుకుపోయారు"

పరబ్రహ్మతత్త్వం ఈ మాటలువిన్నది. దేవతలంతా గర్వించి ఉన్నారు వారికి జ్ఞానోదయం చెయ్యాలి అనుకున్నది. అనుకున్నదే తడవుగా వారి ఎదుట పెద్ద

భూతాకారంగా ప్రత్యక్షమైంది. దాన్ని చూసి భయపడ్డారు దేవతలు. ఆ భూతం ఏమిటో వారికి అర్థం కాలేదు. అప్పుడు వారు అగ్నిదేవుని దగ్గరకు వచ్చి, “ఓ దేవా ! నీ పరాక్రమం వల్లనే రాక్షసులను జయించగలిగాము. ఇప్పుడు ఆ భూతం ఏమిటో కనుక్కోవలసినది అన్నారు. సరేనన్నాడు అగ్నిదేవుడు. ఆ భూతాన్ని సమీపించాడు. అప్పుడు ఆ భూతం అగ్నిని చూసి ఎవరు నువ్వు ? అన్నది.

**అగ్ని :** నేను అగ్నిదేవుడను. జాతవేదుడు అంటారు నన్ను.

**భూతం :** నీ శక్తి ఏమిటి ?

**అగ్ని :** ఎటువంటి వస్తువునైనా క్షణాల్లో దహించివేస్తాను.

**భూతం :** అలా అయితే ఈ గడ్డిపరకను దహించు. అంటూ ఒక గడ్డిపరకను చూపించింది. అగ్నిదేవుడు శతవిధాల ప్రయత్నించాడు. గడ్డిపరక కసికందలేదు. అవమానంతో వెళ్ళిపోయాడు అగ్నిదేవుడు. ఆ తత్త్వం ఏమిటో తెలుసుకోవటం తనవల్ల కాలేదన్నాడు. దేవతలంతా ఈ సారి వాయువును ప్రార్థించారు. ఆ తత్త్వం ఏమిటో తెలుసుకోమని అర్థించారు. సరేనన్నాడు వాయువు. ఆ తత్త్వం దగ్గరకు వెళ్ళాడు. అప్పుడు ఆ భూతం వాయువుతో అన్నది.

**భూతం :** ఎవరు నువ్వు ?

**వాయువు :** నేను వాయుదేవుడను. ఆకాశంలో చరిస్తుంటాను. అందుచేత నన్ను మాతరిశ్వుడంటారు.

**భూతం :** నీ గొప్పతనం ఏమిటి ?

**వాయువు :** ఏ వస్తువునైనా క్షణాల్లో ఎగరగొట్టగలను.

**భూతం :** అలా అయితే ఈ గడ్డిపరకను ఎగరగొట్టు.

వాయుదేవుడు తన శక్తి అంతా కూడదీసుకుని గాలులు వీచాడు. గడ్డిపరక కదలను కూడాలేదు. అవమానంతో వెళ్ళిపోయాడు వాయువు. దేవతల దగ్గరకు వెళ్ళి ఆ తత్త్వం ఏమిటో తనకు తెలియలేదు అన్నాడు. ఈ సారి దేవతలు ఇంద్రుణ్ణి వెళ్ళమన్నారు. ఇంద్రుడు బయలుదేరి ఆ తత్త్వాన్ని సమీపించాడు.

ఆ తత్త్వం మాయమైపోయింది. ఆ స్థానంలో ఉమాదేవి ఉన్నది. అప్పుడు ఇంద్రుడు ఆమెతో అమ్మా ! ఇప్పటి దాకా ఇక్కడ ఉన్న తత్త్వం ఏమిటి ? అన్నాడు అందుకు ఉమాదేవి.

దేవేంద్రా ! అదే పరబ్రహ్మతత్త్వము. దాన్ని మీరు గుర్తించలేకపోయారు. ఆ తత్త్వానికీ నాకూ తేడాలేదు. మేమిద్దరమూ ఒకటే అని చెబుతుంది. ఈ రకంగా పరబ్రహ్మను ముందుగా దర్శించినవాడు కాబట్టే ఇంద్రుడు దేవతలకు రాజయినాడు. అగ్ని వాయువులు దిక్పాలకులయినారు అని చెప్పబడింది.

కాబట్టి ఉమ అంటే ఆ పరబ్రహ్మమే. ఆరు సంవత్సరాల బాలికను కూడా ఉమ అంటారు.

## 634. శైలేంద్రతనయా

పర్వతరాజు యొక్క కుమార్తె పార్వతి. దక్షయజ్ఞం సమయంలో దాక్షాయణి దగ్ధమైపోయింది. సతి వియోగాన్ని భరించలేని శివుడు కొంతకాలం దేశాల వెంబడి తిరిగి ఆ తరువాత విరాగియై హిమాలయాల్లో తపస్సు చేసుకుంటున్నాడు.

వజ్రాంగుడి కుమారుడు తారకాసురుడు బ్రహ్మను మెప్పించి ఇప్పటివరకు తన సృష్టిలో ఉన్న ఏ ప్రాణితోనూ మరణం లేకుండా వరం పొందాడు. వరబలంతో గర్వించి దేవతలను బాధించటం ప్రారంభించాడు. దేవతలంతా హిమాలయాలకుపోయి ఆ పరమేశ్వరిని ప్రార్థించారు. ఈ లోకంలో తన అంశపుడుతుందని, దాన్ని శివునకిచ్చి వివాహంచేస్తే, వారికి కలిగే కుమారుడు తారకుణ్ణి సంహరిస్తాడు అని చెప్పింది. అప్పుడు హిమవంతుడు ఆ పరమేశ్వరుణ్ణి ప్రార్థించి తన యింట, తన కుమార్తెగా పుట్టమన్నాడు. అతని కోరిక మన్నించి హిమవంతుని ఇంట పుట్టి హైమవతిగా ప్రసిద్ధిచెందింది.

ప్రసిద్ధి చెందిన పర్వతాలు ఏడు. అవి

1. హిమవత్పర్వతము
2. నిషధము
3. వింధ్యపర్వతము
4. మాల్యవంతము
5. పారియాత్రము
6. గంధమాదనము
7. హేమకూటము

వీటిలో హిమవత్పర్వతము శ్రేష్ఠమైనది. అందుకే దాన్ని శైలేంద్రము అంటారు. ఆ పరమేశ్వరి హిమవంతుని గర్భానపుట్టింది కాబట్టి శైలేంద్రతనయా అనబడుతుంది.

## 635. గౌరీ

గౌరవర్ణము గలది గౌరి. పై నామంలో చెప్పిన శైలేంద్రతనయయే గౌరి. దక్షయజ్ఞం సమయంలో యోగాగ్నిలో భస్మమైపోయిన సతీదేవియే మళ్ళీ హిమవంతుడు, మేనకలకు గౌరిగా జన్మించింది.

కాళి నల్లగా ఉంటుంది. పరమేశ్వరుడు ఆమెను నల్లనిదానా అంటాడు. ఈ పరిహాసం భరించలేక కాళి బ్రహ్మను గురించి తపస్సుచేసి గౌరవర్ణముతో ఉండేటట్లు వరం పొందింది.

వరుణుని యొక్క ప్రియురాలు గౌరి.

**కన్యాకుబ్జే తథాగౌరీ** కన్యాకుబ్జ మందు పీఠాధిదేవత గౌరి.

**అష్టవర్షా భవేత్కన్యా గౌరీ** ఎనిమిది సంవత్సరముల బాలిక గౌరి అని చెప్పబడింది.

మంత్రశాస్త్రంలో గౌరీ పంచాక్షరి మంత్రమున్నది

**అస్యశ్రీ గౌరీ పంచాక్షరీ మహామంత్రస్య ఆనందభైరవ ఋషిః। పంక్తిచ్ఛందః। శ్రీ గౌరీ దేవతా। ఐం బీజం। హ్రీం శక్తిః। క్లీం కీలకం। జపే వినియోగః।**

**న్యాసము** : **మహేశ్వర్యై నమః।** **అనంతరూపిణ్యై నమః।**
**మహాలక్ష్మై నమః।** **సర్వలోక రక్షణ్యై నమః।**
**త్రిపురసుందర్యై నమః।** **త్రైలోక్యమోహిన్యై నమః।**

**ధ్యానము** : **గౌరి ! మమ ప్రియే ! దేవి ! శంకరార్ధ శరీరిణి !**
**సౌభాగ్యం కురు మే దేవి ! శివశక్త్యైక్య నమోఽస్తు తే ॥**
**ధనధాన్య పశుక్షేత్రం భర్తృసంరక్షణం తథా।**
**సుపుత్రం చ మహాదేవి ! దేహి మే కరుణాలయే ॥**

**మంత్రము** : **ఐం హ్రీం శ్రీం క్లీం గౌర్యై నమః ॥**

## 636. గంధర్వసేవితా

గంధర్వులచేత సేవింపబడునది. మానవుల తరువాత గొప్ప శక్తులు గల వారిలో గంధర్వులు ఒకరు. వీరు రెండు రకాలుగా ఉన్నారు.

1. మానవ గంధర్వులు – మనుష్యులుగా ఉండి, తాము చేసిన పుణ్యకర్మలవల్ల గంధర్వత్వం పొందినవారు.

2. దేవ గంధర్వులు – వీరు పుట్టుకతోనే గంధర్వులుగా ఉన్నారు. దేవతలలో ఒక జాతి. విశ్వావసువు మొదలైనవారు దేవగంధర్వులు. పరమేశ్వరి గంధర్వులచే సేవింపబడుతుంది.

గంధర్వులు మంచి సంగీతవిద్వాంసులు. అందుకే గంధర్వగానం అంటారు. వీరంతా ఆకాశంలో చరిస్తూ పర్వతశిఖరాలమీద ఉంటూ, హిమాలయ శిఖరాలమీద వీణా వేణు మృదంగాల వాద్యాలతో పరమేశ్వరిని కీర్తిస్తూ సేవించుకుంటారు. అందుకే ఆ దేవి 'గంధర్వసేవితా' అనబడింది.

## 637. విశ్వగర్భా

విశ్వము గర్భమునందు గలది. ప్రళయం సంభవించినప్పుడు జగత్తు అంతా లయమైపోతుంది. కర్మక్షయమైన జీవులకు మోక్షం కలుగుతుంది. కర్మక్షయం కాని జీవులు ఆ కర్మఫలాన్ని అనుభవించాలి. కర్మ చెయ్యగానే ఫలితంరాదు. కర్మ పరిపక్వం కావాలి అప్పుడే ఫలితం వస్తుంది. ఈ జీవులు గతంలో చేసిన కర్మతాలూకు ఫలితాన్ని అనుభవించాయి. కాని వర్తమానంలో చేసిన కర్మఫలితాన్ని అనుభవించాలి అంటే ఆ కర్మ పరిపక్వత చెందే వరకు ఆగాలి. అటువంటి జీవసమూహం అంతా కూడా మాయా స్వరూపిణి అయిన పరమేశ్వరిలో లీనమైపోతుంది. అలాగే పంచభూతాలు కూడా

| | | |
|---|---|---|
| భూమి | – | జలంలో కలిసిపోతుంది |
| జలం | – | అగ్నిలో కలిసిపోతుంది |
| అగ్ని | – | వాయువులో కలిసిపోతుంది |
| వాయువు | – | ఆకాశంలో కలిసిపోతుంది |
| ఆకాశం | – | మాయలో కలిసిపోతుంది |

ఈ రకంగా సృష్టి అంతా పరమేశ్వరిలో లీనమైపోతుంది. ఇప్పుడు ఆ సృష్టి అంతటినీ తన గర్భంలో దాచుకుని, మాయాశక్తి పరమేశ్వరునిలో లీనమైపోతుంది. ఈ రకంగా విశ్వమంతా తన గర్భంలో దాచుకుంటుంది. కాబట్టి ఆమె విశ్వగర్భా అనబడుతోంది.

## 638. స్వర్ణగర్భా

స్వర్ణము యొక్క గర్భం నుంచి పుట్టినది. వాయుపురాణంలో

**హిరణ్య మస్య గర్భో భూ ద్ధిరణ్య స్యాపి గర్భజః**
**యస్మా ద్ధిరణ్యగర్భ స్సః పురాణేఽస్మి న్నిరుచ్యతే ॥**

ఈమె గర్భము హిరణ్యము. లేక హిరణ్యగర్భము నుండి పుట్టినది కాబట్టి హిరణ్యగర్భా అనబడుతోంది.

హిరణ్యగర్భుడు – హిరణ్యమును గర్భములో కలవాడు బ్రహ్మ. పరమేశ్వరి బ్రహ్మదేవుని స్వరూపమే. కాబట్టి స్వర్ణగర్భ అనబడుతోంది. దేవి భూదేవతా స్వరూపము. బంగారం అంతా భూగర్భంలోనే ఉంటుంది. కాబట్టి ఆమె స్వర్ణగర్భ.

## 639. అవరదా

అవరులు అనగా – అనార్యులైన రాక్షసులు. వారిని చంపుతుంది కాబట్టి అవరదా అనబడుతుంది.

కాంతి కలిగినటువంటి, ప్రకాశము గలిగినట్టి దంతాలుకలది.

కొన్నిచోట్ల ఈ నామాన్ని 'వరదా' అని చెప్పటం జరుగుతోంది. వరదా – వరములను ఇచ్చునది. భక్తుల యొక్క కోరికలను తీర్చునది. భక్తులకు జ్ఞానాన్ని ప్రసాదించేది. భక్తుల హృదయాలను బట్టి వారివారి కోరికలు తీరుస్తుంది. అందుకే వరదా అనబడుతుంది.

## 640. వాగధీశ్వరీ

**వాచాం అధీశ్వరీ** వాక్కులకు అధీశ్వరి. వాక్కుకు మూలమైన పరాశక్తి. వాక్కు నాలుగురూపాలుగా ఉంటుంది. అని గతంలో వివరించాం. అవి పరా పశ్యంతీ మధ్యమా వైఖరి. వీటిలో మొట్టమొదటిది పరావాక్కు. అఖరుది వైఖరీవాక్కు. వైఖరీవాక్కులో మిగిలిన మూడు అంటే పరా, పశ్యంతీ, మధ్యమలు కలిసిపోయి ఉంటాయి. మూడూ దాదాపుగా అవ్యక్తములు. కంటికి కనిపించవు. నాల్గవదైన వైఖరీవాక్కు మాత్రమే స్పష్టంగా తెలుస్తుంది. అయితే వాక్కుకు ప్రారంభదశ పరావాక్కు. ఇది పరాస్థానంలో అంటే సహస్రారంలో ఉద్భవిస్తుంది. సైన్సు ప్రకారము కూడా ముందుగా ఆలోచన వచ్చేది మెదడులోనే. ఆ మెదడు సహస్రారంలో ఉన్నది. అదే పరాస్థానము. పరావాక్కు పరదేవతా స్వరూపము. అందుచేతనే పరమేశ్వరి వాగధీశ్వరీ అనబడుతున్నది. భారతి, వాణి, సరస్వతి మొదలైన పేర్లతో చెప్పబడే దేవత ఈమె. వశిన్యాది దేవతలుగా చెప్పబడేది కూడా ఈమె.

| | | | |
|---|---|---|---|
| 1. వశిని | 3. మోదిని | 5. అరుణ | 7. సర్వేశ్వరి |
| 2. కామేశ్వరి | 4. విమల | 6. జయ | 8. కౌళిని |

వీరందరూ వాగ్దేవతలు. సరస్వతీదేవి స్వరూపాలు. వీరందరికీ అధీశ్వరి కాబట్టి వాగధీశ్వరీ అనబడుతుంది.

# 641. ధ్యానగమ్యా

ధ్యానముచేత ఎరుగబడినది. వేదంలో ధ్యానయోగము చేత దేవతాశక్తిని పొందవచ్చును అని చెప్పబడింది. పరమేశ్వరిని పూజించటము, స్తోత్రం చెయ్యటమువల్ల కాకుండా నిశ్చలమైన మనస్సుతో ధ్యానించటంచేత మాత్రమే పొందదగినది ఆ పరమేశ్వరి. అందుచేతనే ధ్యానగమ్యా అనబడుతుంది. భగవంతుడు సత్యజ్ఞానస్వరూపుడు. అనంతుడు, అవ్యయుడు. వీటికి భిన్నమైనవాడు జీవి. పరమాత్మ – జీవాత్మల మధ్య భేదాలు

| **పరమాత్మ** | – | **జీవాత్మ** |
|---|---|---|
| సత్యము | – | అసత్యము |
| శాశ్వతము | – | అశాశ్వతము |
| అనంతము | – | అంతముగలది |
| జ్ఞాని | – | అజ్ఞాని |
| శాశ్వతమైన ఆనందము | – | క్షణికానందము |

ఈ రకంగా జీవాత్మ పరమాత్మలు భిన్న ధృవాలు అయితే జీవుడు అవిద్యను వదిలి, తానే పరబ్రహ్మ అని తెలుసుకున్నప్పుడు అతడే పరబ్రహ్మ అవుతాడు.

అజ్ఞాని అయిన జీవి ధ్యానము ద్వారా గాని, ఇంకొక మార్గం ద్వారా కాని పరమాత్మ దర్శనం చేసుకోలేడు. ఇది కేవలము జ్ఞానంద్వారానే జరగాలి. బ్రహ్మను గురించి తెలుసుకోవటం బ్రహ్మద్వారానే జరుగుతుంది. ధ్యానం చెయ్యాలంటే ఇద్దరికీ ఒకే లక్షణాలుండాలి. ధ్యానంకాని ఇంకొకటిగాని చేసి పరమాత్మను చేరలేడు. జ్ఞాని మాత్రమే ఆ పని చెయ్యగలడు.

అందుచేతనే పరమేశ్వరి భక్తులను కనికరించాలనే ఉద్దేశ్యంతో సగుణబ్రహ్మను ఏర్పరచింది. ఆ సగుణబ్రహ్మయే భగవంతుడు. సాధకుని యొక్క కోరిక మేరకు భగవంతుడికి రూపం కల్పించబడింది.

**సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా**

భంగవంతుడికి ఆరు లక్షణాలుంటాయి. అవి

1. సర్వజ్ఞత
2. నిత్యతృప్త
3. అనాదిబోధ
4. స్వతంత్రత
5. అనంతత
6. అలుప్తత

వీటిని గతంలో వివరించటం జరిగింది. ఈ లక్షణాలు జీవిలో కూడా ఉంటాయి. కాని అవి అతని అజ్ఞానం వల్ల బయటకు కనపడవు. ఈ అజ్ఞానం గనక వదలినట్లైతే, జీవికి భగవత్సాక్షాత్కారము జరుగుతుంది. దీనికి ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తుల బలం తగ్గి విజ్ఞానం పెరిగితే, జీవి తానే భగవత్స్వరూపుడనని తెలుసుకుంటాడు. దీనికి సగుణోపాసనే సాధనము.

ధ్యానము అంటే – విషయాన్ని ధారణచేసే స్థలంలో బుద్ధిని స్థిరంగా ఉంచటము. మళ్ళీ ధ్యానము రెండు రకాలు 1. సగుణ ధ్యానము 2. నిర్గుణధ్యానము. ధ్యానంలో ఒక ముఖ్యసూత్రం గుర్తుంచుకోవాలి. ఏ దేవతనైతే అర్చిస్తామో, అదే రూపాన్ని మనం కూడా పొందుతాము. అంటే ఆ రూపం పూర్తిగా మనకు రాకపోయినా, దాని లక్షణాలు తప్పనిసరిగా వస్తాయి. అందుచేతనే సగుణబ్రహ్మను ఆరాధించేవారికి ఆ దేవత లక్షణాలే వస్తాయి. మరి నిర్గుణబ్రహ్మోపాసన చేసేవారికి నిర్గుణత్వం, నిరాకారత్వం వస్తుంది. అదే సాయుజ్యం. అంటే నిరాకార అయిన పరమేశ్వరిని ధ్యానం చేస్తే మోక్షం కలుగుతుంది.

## 642. అపరిచ్ఛేద్యా

పరిచ్ఛేదము – ఇటువంటిది, ఇంతటిది అని చెప్పతగినది. అపరిచ్ఛేదము – ఇటువంటిది అని చెప్పటానికి వీలులేనిది. లోకంలోని ప్రతివస్తువూ కంటికి కనిపిస్తుంది. కాబట్టి దాన్ని గురించి చెప్పవచ్చు. అందుకే అది పరిచ్ఛేదము. అయితే పరమేశ్వరి కంటికి కనపడదు. ఆమె ఇటువంటిది అనిగాని, ఆమెను గురించి ఇంకేమైనాగాని చెప్పలేము. అందుకే ఆమె అపరిచ్ఛేద్యమైనది. సత్యము జ్ఞానము అనంతమయమైనది పరబ్రహ్మ. జ్ఞానము ఎంత ? అంటే అపరిచ్ఛేద్యము. అనంతమైనది. ఆ దేవి రూపము లేనిది. జగత్తంతా వ్యాపించి ఉన్నది. జగత్తులోని ప్రతి వస్తువూ ఆ పరమేశ్వరి రూపమే. కళ్ళు పరమేశ్వరి స్వరూపం. కాని కళ్ళే పరమేశ్వరి రూపం కాదు. చెవులు పరమేశ్వరి స్వరూపం. అలా అని చెవులే దేవిరూపం కాదు. ఈ రకంగా జగత్తులోని ప్రతి వస్తువూ ఆమె స్వరూపమే. అందుచేత ఆమె రూపాన్ని నిర్ణయించటంకాని, వర్ణించటంకాని చేయలేము. అందుకే ఆమె అపరిచ్ఛేద్యా అనబడుతోంది.

## 643. జ్ఞానదా

అన్నింటికీ మూలమైనది ఏదో, దేనివలన ఈ జగత్తు సృష్టించబడుతోందో, ఆ విషయపరిజ్ఞానమే జ్ఞానము అనబడుతుంది. ఏ విషయాన్ని తెలుసుకున్నంత మాత్రం

చేత అన్ని విషయాలూ తెలుస్తాయో ఆ విషయమే జ్ఞానము. జ్ఞానమనేది పరమాత్మ స్వరూపము అందుచేతనే పరమాత్మ తేజోమయమైన కాంతిపుంజము అని చెప్పబడింది. అదే జ్ఞానజ్యోతి సాధకుడు కుండలినీశక్తిని నిద్రలేపి సహస్రారం చేర్చగలిగితే అక్కడ తానెవరు అనే విషయం తెలుస్తుంది. అదే స్వరూపజ్ఞానం. ఆత్మజ్ఞానం. **బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి.** బ్రహ్మను గురించి తెలుసుకున్నవాడు తాను కూడా బ్రహ్మమే అవుతాడు. ఈ చరాచర జగత్తు అంతా తనలో చూడగలుగుతాడు అదే జ్ఞానము. ఆ జ్ఞానాన్ని పొందినవాడు జ్ఞాని. ఇతని దృష్టిలో కులాలు లేవు. మతాలు లేవు. రూపభేదం, రంగు భేదం లేదు. జగత్తులోని మానవులంతా ఒకటే. శంకర భగవత్పాదులవారికి కాశీలో ఒక ఛండాలుడు త్రోవలో అడ్డు వస్తాడు. అతణ్ణి తప్పుకోమంటారు శంకరుని శిష్యులు. అప్పుడు ఆ ఛండాలుడు ఎవర్ని తప్పుకోమన్నారు? నన్నా ? నా ఆత్మనా ? ఆత్మనే గనక అయితే నీలో ఉన్నది, నాలో ఉన్నది ఒకే ఆత్మ. ఈ శరీరాన్ని అయితే అందరి శరీరాల్లోని రక్తమాంసాలు ఒకటే. మరి ఎవరు తప్పుకోవాలి? అని అడుగుతాడు. దీంతో శంకరులవారికి జ్ఞానోదయమవుతుంది. అప్పుడు ఆ ఛండాలుడి పాదాలమీద పడతాడు శంకరుడు. ఆ వచ్చిన వాడు సాక్షాత్తూ పరమేశ్వరుడు. ఈ రకంగా అనేకమందికి అనేకచోట్ల జ్ఞానోదయమవుతుంది. జ్ఞానికి అన్ని విషయాలు తెలుస్తాయి. సకల శాస్త్రాలు తెలుస్తాయి. వాటిని ప్రత్యేకంగా చదువవలసిన అవసరం లేదు.

జ్ఞానమనేది రెండు రకాలుగా ఉంటుంది. 1. ఐహలోక జ్ఞానము 2. పరలోక జ్ఞానము. ఐహలోక జ్ఞానము అంటే ఈ లోకంలోని వస్తువులను గురించిన పరిజ్ఞానము. లౌకికమైన అన్ని విషయాలు పూర్తిగా తెలుస్తాయి.

2. పరలోక జ్ఞానము – పరదేవతను గురించి ఆత్మను గురించి క్షుణ్ణంగా తెలుసుకోవటం. అటువంటి జ్ఞానము పూర్తిగా ఇచ్చేది.

ఈ జ్ఞానమనే దాన్ని భక్తులకు ఇచ్చేది. జ్ఞానదా అంటే తన భక్తులకు జ్ఞానాన్ని సమకూర్చేది. బంధజ్ఞానాన్ని పోగొట్టి పరమజ్ఞానాన్ని ఇచ్చేది.

## 644. జ్ఞానవిగ్రహా

జ్ఞానమే శరీరముగా గలది. జ్ఞానమే పరబ్రహ్మ. జ్ఞానమే బంధహేతువు, ఈ విశ్వమంతా జ్ఞానాత్మకము. జ్ఞానానికి మించినది ఏదీ లేదు. జ్ఞానమే విద్య అని విష్ణుపురాణం చెబుతోంది.

పరమేశ్వరి జ్ఞానమే మూర్తిగా దాల్చినది. ఆమె చిదగ్నికుండ సంభూత. జ్ఞానమయి. జ్ఞానజ్యోతి అని గతంలో వివరించటం జరిగింది. ఆ దేవి ప్రజ్ఞాన ఘనరూపిణి. పాదాది శిరః పర్యంతము జ్ఞానమూర్తి. విశ్వమంతా జ్ఞానమయము. జ్ఞానానికి మించినది ఏదీ లేదు. విద్య అవిద్య రెండూ జ్ఞానస్వరూపమే అని గుర్తించాలి.

అయితే ఈ జ్ఞానము ఎక్కడ ఏ రూపంలో ఉంటుంది? అంటే అన్ని జీవులయొక్క హృదయాంతరాళాలలోనూ ప్రకాశరూపంలో ఉంటుంది. అంతఃకరణ వృత్తులను ప్రకాశింపచేస్తుంది. ఈ జగత్తును ప్రకాశింపచేసేవి సూర్యుడు చంద్రుడు అగ్ని అని గతంలో చెప్పుకున్నాం. అవి బయట ఉన్న వాటినే ప్రకాశింపచేస్తాయి. అంతేకాని లోపల ఉన్నవాటిని ప్రకాశింపచేయలేవు. ఈ జ్ఞానజ్యోతి బయట, లోపల ఉన్న అన్నింటినీ ప్రకాశింపచేస్తుంది.

గతజన్మలోని విషయాలు కొన్ని మనకు గుర్తుంటాయి. కలలో ఏవో వస్తువులు, సంఘటనలు చూస్తాం. అవన్నీ గతజన్మలో మనకు పరిచయమున్నవే. వాటిని ఈ జన్మలో ఎక్కడా చూడలేదు. అయినా ఎక్కడో చూసినట్లుంటుంది. అలాగే కొంతమందిని వారు క్రొత్త వారైనా సరే మనకు ఎక్కడో పరిచయం ఉన్నట్లు అనిపిస్తుంది. కొంతమందిని చూస్తే విపరీతమైన కోపం, చికాకు, అసహ్యం అనిపిస్తుంది. ఇవన్నీ గతజన్మ వాసనలు. మనకు తెలియకుండానే గతజన్మలోని జ్ఞానం మనకు తెలియచేస్తుంది.

కాబట్టి జ్ఞానమనేది సత్యము నిత్యము. అదే పరబ్రహ్మ స్వరూపము. జ్ఞానము జీవులందరికీ ఉంటుంది. ఈ జ్ఞానమనేది లౌకిక విషయ పరిజ్ఞానము, ఆత్మ జ్ఞానము అని రెండు రకాలు. లౌకిక విషయ పరిజ్ఞానము అంటే ఇతర వస్తువులకు, విషయాలకు సంబంధించిన జ్ఞానము. భౌతిక శాస్త్రము, రసాయన శాస్త్రము మొదలగు విషయాలు.

ఈ రకంగా అన్ని రకాల జ్ఞానాలు, అన్ని రకాల విషయ సంపద మూర్తీభవించిన ఆ పరమేశ్వరివే. అందుచేతనే ఆ దేవి జ్ఞానస్వరూపిణి. జ్ఞానమయి జ్ఞానవిగ్రహా అనబడుతోంది.

## 645. సర్వ వేదాంత సంవేద్యా

వేదాంతము వేదముల చివర చెప్పబడినది. ఉపనిషత్తు. వేదం మొత్తం నాలుగు భాగాలుగా ఉంటుంది.

**1. సంహితలు :** ఇది మంత్రభాగం. ఇందులో స్తోత్రాలు ఆవాహనలు ఉంటాయి.

**2. బ్రాహ్మణాలు :** సంహితలో ఉన్న విషయాన్ని వివరించేవి బ్రాహ్మణాలు. యజ్ఞయాగాదులు ఎలా చెయ్యాలి? యజ్ఞాల విలువ ఏమిటి? అనే విషయాలు ఇందులో చెప్పబడ్డాయి.

**3. అరణ్యకాలు :** బ్రాహ్మణాలకు ఉపనిషత్తులకు మధ్యస్థాయిలో ఉంటాయి. ఇవికూడా బ్రాహ్మణాలలాగానే కర్మవిధులను ప్రతిపాదిస్తాయి. కాని వీటిలో కర్మల భౌతిక భాగం ఉండదు. కర్మల వెనుక గల నిగూఢమైన తత్త్వం మీద ధ్యానానికి ప్రాధాన్యత ఇవ్వబడింది.

ఏకాంతవాసం చేసేవారు, అరణ్యాలలో నివశించే వారికోసం ఇవి నిర్దేశించబడ్డాయి.

**4. ఉపనిషత్తులు :** ఇది బ్రహ్మవిద్య. జీవాత్మ, పరమాత్మ, జ్ఞానము, మోక్షముల గురించి వివరించేవి.

పరమేశ్వర స్వరూపము అనేది ఉపనిషద్వాక్యాలచే తనే ఎరుగబడునది. ఉపనిషత్సారమే బ్రహ్మవిద్య. అందుచేతనే పరమేశ్వరి 'సర్వవేదాంత సంవేద్యా' అనబడుతున్నది.

## 646. సత్యానంద స్వరూపిణీ

సత్యము ఆనందము స్వరూపముగా గలది.

పరమేశ్వరికి బాధలు దుఃఖాలు, కష్టాలు ఉండవు. ఆమె కేవలము ఆనంద స్వరూపిణి.

**సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ.**

సత్యము నిత్యము అయినది, ఆనందస్వరూపమైనది, అనంతమైనది ఆ పరబ్రహ్మ.

ఆనంద స్వరూపము గలది. ఆనందం రెండు రకాలు 1. లౌకికానందం 2. పరమానందం.

1. లౌకికానందమనేది క్షణికానందం. ఇది శాశ్వతం కాదు. ఈ ఆనందంలో దుఃఖము ఉంటుంది. త్రిపురా రహస్యంలో ఈ విషయం చాలా గొప్పగా చెప్పబడింది.

పూర్వకాలంలో దశార్ణ దేశాన్ని ముక్తాచూడుడు అనే రాజు పాలిస్తుండేవాడు. అతనికి ఇద్దరు కుమారులు. పెద్దవాడు హేమచూడుడు. రెండవవాడు మణిచూడుడు. వీరు మంచి రూప గుణ లావణ్యాలు గలవారు. వేదవేదాంగవిదులు. సకల శాస్త్ర విశారదులు. ఒకరోజు వీరు వేటకు వెళ్ళారు. అక్కడ పెద్ద వడగళ్ళ వాన వచ్చింది. దాంతో హేమచూడుని గుఱ్ఱం దారి తప్పి దగ్గరలో ఉన్న వ్యాఘ్రపాద మహర్షి ఆశ్రమం

చేరింది. అక్కడ ఒక మునిబాలిక అత్యంత రూప లావణ్యవతి అతనికి స్వాగతం పలికింది. ఆమె పేరు హేమలేఖ.

హేమచూడుడు తొలిచూపులోనే ఆమెను ప్రేమించాడు. వ్యాఘ్రపాదుని అనుమతితో హేమలేఖను వివాహమాడాడు హేమచూడుడు. ఆమెతో సహా రాజ్యానికి తిరిగి వచ్చాడు. సుఖంగా కాపురం చేస్తున్నాడు.

ఒకరోజున హేమచూడుడు తన భార్యతో "దేవీ ! నన్ను నువ్వు ఇష్టపడే వివాహమాడావు కదా! మరి ఎందుకు పరాకుగా ఉంటావు. నేను వచ్చిన సంగతికూడా వెంటనే నీకు తెలియదు. నిన్ను ప్రేమగా దగ్గరకు తీసుకున్నా, కొద్దిసేపటిదాకా నువ్వు ఈ లోకంలోకి రావు. ఏదో ఆలోచిస్తుంటావు. ఈ సుఖాలు నీకు ఇష్టం లేదా? నిజం చెప్పు" అంటాడు.

దానికి హేమలేఖ "రాజా ! ఇవి సుఖాలు కాదు. దుఃఖహేతువులు. నిజంగా ఇదే సుఖమైతే రతిక్రీడలో పాల్గొన్న పశువు, తరువాత వళ్ళునొప్పితో ఎందుకు బాధపడుతుంది? కాబట్టి ఇది నిజమైన సుఖం కాదు. ఇది క్షణికం. అనుభవించినంతవరకే ఉంటుంది. ఆ తరువాత ఉండదు. ఇది దుఃఖహేతువు. అంటూ భర్తకు జ్ఞానబోధ చేస్తుంది.

కాబట్టి లౌకిక విషయాలవల్ల వచ్చే సుఖం శాశ్వతమైనది కాదు.

2. పరమానందం. ఇది శాశ్వతమైన ఆనందం నిత్యము సత్యము అయినది. పరబ్రహ్మ అనుభవించే ఆనందం ఇదే. శ్రీచక్రంలోని తొమ్మిదవ ఆవరణ అయిన సర్వానందమయ చక్రంలో ఆ పరమేశ్వరి ఉంటుంది. అంటే ఆమె ఆనందమయి.

సాధకుడు కుండలినీ శక్తిని సహస్రారం చేరిస్తే అక్కడ నుండి అమృతపు ధారలు కురిసి యోగి శరీరంలోని నాడీ మండలమంతా తడుస్తుంది. అప్పుడు అతడు పొందే ఆనందం అనిర్వచనీయం.అది అనుభవైక వేద్యం.

పంచకోశాలలోను ఐదవదైన ఆనందమయ కోశమందు ఆ పరమేశ్వరి ఉంటుంది. ఆమె సత్యానంద స్వరూపిణి.

## 647. లోపాముద్రార్చితా

అగస్త్య మహర్షి భార్య లోపాముద్ర. శ్రీవిద్యను ఉపాసించినవారిలో 12 మంది శ్రేష్ఠులున్నారు అని చెప్పబడింది. వారిలో లోపాముద్ర ఒకరు. ఈమె ఉపాసించిన పంచదశి మహామంత్రం హాదివిద్యకు సంబంధించినది.

**అస్యశ్రీ లోపాముద్రాంబా మహామంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః । అనుష్టుప్ ఛందః । లోపాముద్రా విద్యాంబా దేవతా । హ స క ల హ్రీం బీజం । హ స క హ ల హ్రీం శక్తిః । స క ల హ్రీం కీలకం । జపే వినియోగః ।**

**న్యాసము : కూటత్రయముతో రెండు ఆవృత్తులు న్యాసము అని చెప్పాలి.**

**ధ్యానము : సకుంకుమ విలేపనా ...**

**మంత్రము : హ స క ల హ్రీం । హ స క హల హ్రీం । స క ల హ్రీం ।**

## 648. లీలాక్లప్త బ్రహ్మాండ మండలా

లీలామాత్రం చేత, ఏ విధమైన కష్టము లేకుండా, అనాయాసంగా ఈ బ్రహ్మాండాన్ని ఏర్పరచేది. పరమేశ్వరుని యొక్క ఇచ్ఛాశక్తియే పరమేశ్వరి. ఈశక్షితి వలన కల్పించబడినదియే బ్రహ్మాండ మండలము. జ్ఞానవాసిష్టంలో చెప్పినట్లుగా

**తస్యశక్తి ముల్లాస మాత్రం జగ దితి స్థితమ్ ॥**

పరమేశ్వరి యొక్క సంకల్ప మాత్రం చేతనే అఖిలాండకోటి బ్రహ్మాండాలు సృష్టించబడుతున్నాయి. అందుచేత పరమేశ్వరి లీలాకప్త బ్రహ్మాండ మండలా అనబడుతోంది.

## 649. అదృశ్యా

కనిపించనిది. కంటికిగాని ఇతర ఇంద్రియాలకుగాని కనిపించనిది. పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు. అందుకే కంటికి కనిపించడు. ఉపనిషత్తులలో చెప్పినట్లుగా కళ్ళకు చూసే శక్తినిచ్చేది ఆ పరమేశ్వరుడు. చెవులకు వినికిడి శక్తినిచ్చేది ఆ పరమేశ్వరుడు. ఈ రకంగా ఇంద్రియాలకు ఆయాశక్తిని సమకూర్చేవాడు పరమేశ్వరుడు. కాబట్టి కంటితో అతణ్ణి చూడలేము చెవులతో అతని గురించి వినలేము. ఇంద్రియాలతో అతని గురించి తెలుసుకోలేము. అందుచేతనే ఆ పరమేశ్వరి అదృశ్యా అనబడుతోంది.

నామరూపాత్మకమైన జగత్తును కంటితో చూడగలము. రూపమున్నదానిని చూడగలము. కాని రూపం లేనిదానిని మాత్రం మనం చూడలేము. పరమాత్మకు రూపం లేదు. అందుకే కంటికి అగుపడదు.

## 650. దృశ్యరహితా

దృశ్యము లేనిది. కాబట్టి కంటికి కనిపించదు. పైన చెప్పిన నామార్థాన్నే మళ్ళీ ఇక్కడ చెబుతున్నారు. ప్రాపంచిక వ్యవహారాలు లేనటువంటిది. దృశ్యము అంటే కంటికి మాత్రమే కనిపించేది అని అర్థం కాదు. గాలి కంటికి కనిపించకపోయినా శరీరానికి తాకుతుంది. అంటే స్పర్శతో తెలుస్తుంది. శబ్దం చెవులకు తెలుస్తుంది. ఈ రకంగా ఇంద్రియాలచే గుర్తించబడనిది దృశ్యరహితా.

ప్రపంచమంతా పరమేశ్వరి ఆవరించి ఉన్నది కాని పరమేశ్వరిలో ప్రపంచం లేదు. అందుకే ఆమె కనిపించదు. కాబట్టి ఆమె దృశ్యరహితా అనబడుతోంది.

## 651. విజ్ఞాత్రీ

**విశేషేణ జానాతీతి - విజ్ఞాత్రీ**

విశేషముగ ఎరుగుది. వేదంలో

**విజ్ఞాతార మనేకేన విజానీయాత్**

తెలుసుకొను దానిని అనేకముచే ఎరుగదగును అని చెప్పబడింది.

**సాక్షి చేతా కేవలో నిర్గుణ శ్చ**

కేవలము సాక్షి మాత్రంగా ఉండి ప్రపంచాన్ని గురించి తెలుసుకుంటుంది. ఆమె జ్ఞానరూపిణి. శరీరంలోని ఇంద్రియాలన్నీ కేవలం జడపదార్థాలు. వీటికి స్వయంగా పని చేసేశక్తి ఉండదు. ఆ శక్తే చైతన్యము. అటువంటి శక్తిని ఇంద్రియాలకు అనుగ్రహించేది పరమేశ్వరి. అందుచేతనే ఆమె విజ్ఞాత్రీ అనబడుతోంది.

## 652. వేద్యవర్జితా

వేద్యము - తెలుసుకొనవలసినది. వేద్యవర్జితా. తెలుసుకొనవలసినది అంటూ లేనిది. సర్వజ్ఞత గలది. అన్ని విషయములయందు పరిపూర్ణమైన జ్ఞానము గలది. పరమేశ్వరికన్న భిన్నమైనది ఏదీ లేదు. కాబట్టి ఆమె తెలుసుకోవలసినది ఏదీ లేదు. అందుచేతనే వేద్యవర్జితా అనబడుతోంది.

## 653. యోగినీ

యోగము అంటే – ఐక్యభావన. అటువంటి ఐక్యభావము గలది. ఐక్యభావము నిచ్చేది.

అసలు యోగాలు నాలుగు రకాలు

| | |
|---|---|
| 1. మంత్ర యోగము | 3. హఠ యోగము |
| 2. రాజయోగము | 4. లయయోగము |

యోగము అంటే – అదృష్టము అనికూడా అర్థం.

**1. మంత్ర యోగము :** మంత్ర జపం చెయ్యటంవల్ల వచ్చే ఫలితము. మంత్రసిద్ధి జరిగినవారికి అతీంద్రియ శక్తులు వస్తాయి. వీటిని సమాజశ్రేయస్సుకే వాడాలి. లేకపోతే సాధకుడు ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తుంది.

**2. రాజయోగము :** ఇది జాతకుడి అదృష్టం. అప్పటి వరకు సామాన్యుడుగా ఉన్న అతడికి రాజయోగం పడుతుంది. దాంతో అతను ముఖ్యమంత్రో, ప్రధానమంత్రో అవుతాడు. అయితే అందరికీ అలా జరగదు. తాను ఉన్నటువంటి స్థితిలో, అదే వృత్తిలో ఉన్నతుడు కావటం రాజయోగం. పైన చెప్పినట్లు పదవులు అలంకరించటం విపరీత రాజయోగం.

**3. హటయోగము :** ఇది యోగ ప్రక్రియలో ఒక పద్ధతి. ఈ పద్ధతిలో హటయోగులు సిద్ధులు సంపాదిస్తారు. నీటిమీద నడవటం. గాలిలో తేలటంవంటివి. అటువంటివారు ఇప్పుడు లేరనే చెప్పవచ్చు.

**4. లయయోగం :** సాధకుని సాధనశక్తి ఎంత ఉన్నది అనే విషయం ఇక్కడ తెలుస్తుంది. యోగి అయినవాడి ప్రాణాలు బ్రహ్మరంధ్రంద్వారా బయటకు పోతాయి. ఇది చాలా గొప్ప అదృష్టం. అటువంటి వాడికి పునర్జన్మ ఉండదు. అతడి ఆత్మ పరమాత్మలో లీనమైపోతుంది. అంత్యకాలంలో యోగులు ఈ విధంగానే చేస్తారు. యాదవ వంశ నాశనం తరువాత బలరాముడు యమునానదీ తీరంలో చేసిన పని ఇదే. యోగి యొక్క సాధనను బట్టి సహజంగానే ఈ పని జరుగుతుంది. అందుచేతనే “మహాత్ముల పాపపుణ్యంబులు మరణకాలంబునందెలియు” అంటారు.

యోగశాస్త్ర ప్రకారం జీవాత్మను పరమాత్మతో సంధానం చెయ్యటమే యోగము. జ్ఞాత జ్ఞానము జ్ఞేయముల యొక్క ఏకత్వ భావనే యోగము. మనసును అదుపు చేసి,

ఇంద్రియాలను అంతర్ముఖం చెయ్యటమే యోగము. **"యోగః చిత్త వృత్తి నిరోధక్తః"** మనసును అదుపుచేయటమే యోగము. మనసును గనక నిశ్చలం చెయ్యగలిగితే ఏకాగ్రత కుదురుతుంది. జపంలో కూర్చునప్పుడు అనేక విషయాలు కళ్ళముందు తిరుగుతాయి. అంటే మనసు పరి పరి విధాల ఆలోచిస్తోందన్న మాట. అలాంటప్పుడు ముందుగా మనస్సును నిరోధించి, తరువాత లక్ష్యాన్ని ఏకాగ్రం చెయ్యాలి.

ఏకాగ్రతతో చేసిన జపం త్వరగా సిద్ధిస్తుంది. మనసా వాచా కర్మణా చేసే అర్చనకు ఫలితం ఎక్కువ. అందుచేతనే యోగం చెయ్యండి అనటం జరుగుతుంది.

షట్చక్రాలలోను అకారాది క్షకారాంతము మాతృకలున్నాయి అవి

| **చక్రము** | **అక్షరాలు** | **అక్కడ ఉండే దేవత పేరు** |
|---|---|---|
| విశుద్ధి | అ నుంచి అః వరకు | డాకిని |
| అనాహతము | క నుంచి ఠ వరకు | రాకిని |
| మణిపూరము | డ నుంచి ఫ వరకు | లాకిని |
| స్వాధిష్ఠానము | బ నుంచి ల వరకు | కాకిని |
| మూలాధారము | వ నుంచి స వరకు | సాకిని |
| ఆజ్ఞా | హకార క్షకారాలు | హాకిని |
| సహస్రారము | సర్వవర్ణములు | యాకిని |

ఈ విధంగా షట్చక్రాలలో అక్షరాలతోపాటుగా యోగినీ దేవతలు కూడా ఉన్నాయి. అలాగే శ్రీచక్రంలోని తొమ్మిది ఆవరణలలోను విడివిడిగా యోగినీదేవతలున్నారు.

| **ఆవరణ** | **చక్రంపేరు** | **యోగినీ పేరు** |
|---|---|---|
| 1. భూపురం | త్రైలోక్యమోహన చక్రం | ప్రకటయోగిని |
| 2. షోడశదళం | సర్వాశా పరి పూరకం | గుప్తయోగిని |
| 3. అష్టదళం | సర్వ సంక్షోభిణీ చక్రం | గుప్తతరయోగిని |
| 4. మన్వస్రం | సర్వ సౌభాగ్యదాయక చక్రం | సంప్రదాయయోగిని |
| 5. బహిర్దశారం | సర్వార్థసాధక చక్రం | కుళోత్తీర్ణయోగిని |
| 6. అంతర్దశారం | సర్వ రక్షాకర చక్రం | నిగర్భయోగిని |
| 7. అష్టకోణం | సర్వ రోగహర చక్రం | రహస్యయోగిని |
| 8. త్రికోణం | సర్వ సిద్ధిప్రద చక్రం | అతిరహస్యయోగిని |
| 9. బిందువు | సర్వానందమయ చక్రం | పరాపరరహస్యయోగిని |

ఇవికాక పన్నెండు మంది యోగినులున్నారు. వారు

| | | |
|---|---|---|
| 1. విద్యాయోగిని | 5. దీపికాయోగిని | 9. మేధాయోగిని |
| 2. రేచికాయోగిని | 6. జ్ఞానయోగిని | 10. వ్యోమరూపాయోగిని |
| 3. మోచికాయోగిని | 7. ఆప్యాయనీయోగిని | 11. సిద్ధరూపాయోగిని |
| 4. అమృతాయోగిని | 8. వ్యాపినీయోగిని | 12. లక్ష్మీయోగిని |

పరమేశ్వరి చతుష్షష్టికోటియోగినీ గణసేవితా అని చెప్పబడుతోంది. వీరందరూ ఆ దేవితో సమానమైన శౌర్యము, పరాక్రమము, పాండిత్యము, చతురత కలవారు. శ్రీచక్రంలోని ప్రతి ఆవరణలోనూ ఒక్కొక్క మూల ఒక్కొక్కయోగిని చొప్పున, ఆవరణకు 8 మంది యోగినులుంటారు. వీరిలో ఒక్కొక్కరికీ ఎనిమిది కోట్లమంది పరిచారికలుంటారు. ఈ రకంగా ఆవరణకు 64 కోట్లమంది యోగినులుంటారు. ఇలా తొమ్మిది ఆవరణలయందు కలిపి 9 × 64 = 576 కోట్లమంది యోగినీగణం దేవిని సేవిస్తుంటుంది.

భాస్కరరాయలవారిని కాశీలోని పండితులంతా ఈ యోగినీదేవతలను వివరించమని అడిగినప్పుడు, ఆ యోగినీదేవతలు ప్రత్యక్షమై వారి వారిపేర్లు, రూపాలు, వాహనాలు, ఆయుధాలు మొదలైన వివరణ ఇచ్చాయి.

## 654. యోగదా

యోగమును ఇచ్చునది. యోగము అంటే తనకు లేని దాన్ని పొందటము. భక్తులంతా పరమేశ్వరిని ఆరాధిస్తారు. ఆ దేవిని తమ కోరికలు తీర్చమని వేడుకుంటారు. వాళ్ళకి ఉన్నవే మళ్ళీ ఇమ్మని దేవిని ఎవరూ అడగరు. వాళ్ళకి లేనివి ఇమ్మని అడుగుతారు. ధనధన్యాలు, సిరిసందలు, భోగభాగ్యాలు లేదా కైవల్యము వీటిని అడుగుతారు.

భక్తుల యొక్క ప్రాప్తాన్నిబట్టి వారు కోరినవి వారికి ప్రసాదిస్తుంది పరమేశ్వరి. అందుచేతనే యోగదా అనబడుతుంది.

జీవికి అనుభవించే శక్తినిస్తుంది కాబట్టి 'యోగదా' అనబడుతుంది. మంచి దృశ్యాన్ని చూడాలి అనుకున్నాడు. ఆ దృశ్యాన్ని చూసే శక్తి కంటికి ప్రసాదించేది పరమేశ్వరి. మంచి విషయాన్ని వినే శక్తి చెవులకు ప్రసాదించేది పరమేశ్వరి. ఈ రకంగా ఇంద్రియాల ద్వారా అనుభవించే శక్తినిచ్చేది ఆ పరమేశ్వరి కాబట్టి యోగదా అనబడుతోంది.

## 655. యోగ్యా

మనస్సుచేత ఇంద్రియాలను నిగ్రహించి జీవాత్మను పరమాత్మతో కలపటమే యోగము. దుఃఖము యొక్క సంయోగ వియోగమే యోగము. యోగము నాలుగురకాలు అని గతంలో వివరించాం. డాకిని మొదలైన షట్చక్రాలలోని యోగినీ సమూహము వీటియొక్క స్వరూపమైనది కాబట్టి పరమేశ్వరి యోగ్యా అనబడుతోంది. యోగ్యా అంటే – అనుభవసాధనమగు యోగము. యోగ్యత – అర్హత. ఫలితాన్ని అనుభవించే అర్హత. ఇప్పుడు ఇక్కడ చెప్పిన మూడు నామాలు

1. యోగిని, 2. యోగదా 3. యోగ్యా. యోగ విషయంలో త్రిపుటి అని చెప్పవచ్చు. ఆ పరమేశ్వరియే యోగిని. యోగాన్ని ఇచ్చేది ఆమె. ఆ యోగం అనుభవించే సాధనం చూపేది ఆమె.

భక్తులు భగవంతుణ్ణి ఏదో ఒక ఫలితమపేక్షించి మాత్రమే అర్చిస్తారు. వీటిలో ఒక్కొక్క ఫలితం కోసం ఒక్కొక్క ప్రక్రియ ఆచరిస్తారు. ఒక్కొక్క దేవత నారాధిస్తారు. విద్య కావాలంటే – సరస్వతి. ధనం కావాలంటే – లక్ష్మి. అయితే అన్నిరకాల ఫలితాలను ఇవ్వగల యోగ్యత ఆ పరమేశ్వరి ఒక్కతికే ఉన్నది. అందుచేత ఆమె యోగ్యా అనబడుతుంది.

## 656. యోగానందా

యోగము అంటే – జీవాత్మ పరమాత్మల సమైక్యము. అదే శివశక్తుల సామరస్యము. జీవాత్మ పరమాత్మను చేరితే అనిర్వచనీయమైన ఆనందం కలుగుతుంది. కుండలినీశక్తిని జాగృతంచేసి, సహస్రారం చేర్చినట్లైతే అక్కడ నుంచి అమృతపుధారలు కురిసి యోగి శరీరంలోని 72వేల నాడీమండలము తడపబడుతుంది. అప్పుడు సాధకుడు అనిర్వచనీయమైన ఆనందం పొందుతాడు. అది అనుభవైకవేద్యము. యోగం వల్ల ఈ రకమైన ఆనందం పొందుతుంది. కాబట్టే ఆ పరమేశ్వరి యోగానందా అనబడుతుంది.

పరమేశ్వరి యోగనిద్రాస్వరూపిణి. నిద్ర ఆనందాన్నిస్తుంది. అందుకే యోగనిద్రలో అద్భుతమైన ఆనందం ఉంటుంది. మధుకైటభ సంహారానికి ముందు విష్ణుమూర్తి యోగనిద్రలో ఉన్నాడు. బ్రహ్మ పరమేశ్వరిని ప్రార్థించి విష్ణుమూర్తిని వదలమంటాడు. ఆ రకంగా యోగనిద్రలో నుంచి బయటకు వచ్చి రాక్షస సంహారం చేశాడు శ్రీ మహావిష్ణువు.

హరివంశంలో పరమేశ్వరి ఆనందఘనమైన యోగనిద్రగా ఉంటుంది. దేవతలలో కూడా విష్ణువు తప్ప ఆమెను ఎవరూ ధరించలేరు ఆమె మాయాశక్తి అని చెప్పబడింది.

యోగత్రిపుట యొక్క అనుభవఫలమే యోగానందము. జీవాత్మ పరమాత్మల ఏకీభావమే యోగము యొక్క ఫలము. ఆ సమయంలో కలిగే ఆనందస్వరూపమే పరమేశ్వరి. యోగసాధన వలన చిత్తశుద్ధి కలుగుతుంది. చిత్తశుద్ధి వలన బ్రహ్మానందం కలుగుతుంది. యోగసాధనకు మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష అనబడే సాధనాలుండాలి. అష్టాంగమార్గాలుండాలి. అష్టాంగమార్గాలు అంటే

| | | | |
|---|---|---|---|
| 1. యమ | 3. ఆసన | 5. ప్రత్యాహార | 7. ధ్యాన |
| 2. నియమ | 4. ప్రాణాయామ | 6. ధారణ | 8. సమాధి |

ఇవన్నీ సాధనచేస్తేనే యోగం సిద్ధిస్తుంది. యోగంలో 'సుమన' వరకు మనసు పనిచేస్తుంది. సుమన దాటిన తరువాత ఉన్మన. ఇక్కడ మనసు కూడా పనిచెయ్యని స్థితి. ఆ స్థితిలోనే బ్రహ్మానందం కలుగుతుంది.

అవస్థాత్రయంలో సుషుప్తి మూడవది. సుషుప్తి అంటే గాఢనిద్ర. ఈ స్థితిలో కూడా సాధకుడు ఆనందాన్ని అనుభవిస్తాడు. అతడి ఇంద్రియాలు మనస్సులో లీనమవుతాయి. మనస్సు ప్రాణంలో లీనమవుతుంది. కాబట్టి అప్పుడు చలించేది ముఖ్యప్రాణము ఒక్కటే. అయితే సుషుప్తి నిద్రావస్థ. ఇది తమోగుణ ప్రధానమైనది. కాబట్టి ఇక్కడ పొందే ఆనందము బ్రహ్మానందంలాగానే ఉంటుంది. కాని బ్రహ్మానందం మాత్రంకాదు.

యోగానందలక్ష్మీనృశింహరూపం. నందగోపుని కుమార్తె మహామాయాశక్తి.

## 657. యుగంధరా

రథాన్ని గుర్రాలు ఏవిధంగా మోస్తున్నాయో, బండిని ఎద్దులు ఏవిధంగా మోస్తున్నాయో అదేవిధంగా పరమేశ్వరి సకలలోకాలను ధరిస్తున్నది కాబట్టి యుగంధరా అనబడుతున్నది. యుగము అంటే కాలచక్రము. కృతయుగము, ద్వాపరయుగము, త్రేతాయుగము, కలియుగము, ఈనాలుగు యుగాలు కలిపితే ఒక మహాయుగము. ఇటువంటి యుగాలను ధరించేది. కాలస్వరూపిణి.

## 658. ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణీ

ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులస్వరూపమైన గుణత్రయ స్వరూపము గలది.

**ఇచ్ఛా శిరః ప్రదేశ శ్చ జ్ఞానం తదధోగతా ।**
**క్రియాపదగతా హ్యస్యా ఏవంశక్తి త్రయం వపుః ॥**

| | | |
|---|---|---|
| ఇచ్ఛాశక్తి | – | శిరస్సు |
| జ్ఞానశక్తి | – | కంఠము నుంచి కటి వరకు |
| క్రియాశక్తి | – | కటి నుంచి పాదాలవరకు |

ఈ రకంగా రూపం కలిగి ఉన్నది ఆ పరమేశ్వరి. వామకేశ్వరతంత్రంలో

**త్రిపురా త్రివిధాదేవీ బ్రహ్మవిష్ణ్వీశ్వరరూపిణీ**
**జ్ఞానశక్తిః క్రియాశక్తిః ఇచ్ఛాశ క్త్యాత్మికా ప్రియా ॥**

త్రిపురసుందరి త్రివిధమైన దేవి. బ్రహ్మవిష్ణు శివరూపిణి. ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తి స్వరూపిణి.

చలనాత్మకమైన క్రియాపరురాలు ఆ పరమేశ్వరి. క్రియాశక్తి ఐదురకాలు

1. స్పందము 2. పరిస్పందము 3. ప్రక్రమము 4. పరిశీలనము 5. ప్రచారము

మాలినీ విజయతంత్రంలో చెప్పినట్లుగా "జగత్కారకుడైన బ్రహ్మ సృష్టిచెయ్యాలి అనుకున్నప్పుడు ఆ పరాశక్తి ఇచ్ఛాశక్తి అవుతుంది. వేగంగా దీన్ని జ్ఞాపకం చేస్తుంది. కాబట్టి జ్ఞానశక్తి అవుతున్నది. దానిని తెలుసుకుని ఆ వస్తువులను చేయటం వలన క్రియాశక్తి అవుతున్నది అని చెప్పబడింది.

శివమే బ్రహ్మ. అది శాంతమైనది. దాని స్పందనశక్తియేఇచ్ఛ. అని వాసిష్ఠరామాయణంలో చెప్పబడింది.

బ్రహ్మ ఈ సృష్టిని గురించి ఆలోచించనప్పుడు పరాశక్తి అతని యందు ఇచ్ఛాశక్తి రూపంలో ఉంటుంది. దానితో స్పందన ఏర్పడుతుంది. తరువాత ఇచ్ఛాశక్తి పరాశక్తి అనే జ్ఞానశక్తి అవుతుంది. తరువాత క్రియాశక్తి గలిగి సృష్టి జరుగుతుంది. కాబట్టి ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులరూపం ఆ పరమేశ్వరి.

ప్రకాశ విమర్శాంశలు రెండూ కలిసి దంపతులై ఈ జగత్తును సృష్టించాయి. అయితే ప్రకాశరూపము – పురుషుడు. కాగా విమర్శరూపము స్త్రీరూపము.

ప్రకాశరూపము – వామజ్యేష్ఠరౌద్రి శక్తులు ఇవే సమిష్టిగా అంబికా అనబడుతున్నాయి. అలాగే

విమర్శరూపము – ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులు. సమిష్టిగా ఇవి శాంతా అనబడుతున్నాయి. ఇప్పుడు

**వామేచ్ఛా బ్రహ్మభారత్యౌ జ్యేష్ఠాజ్ఞాన హరిక్షితీ ॥**

**రౌద్రీ క్రియాశివాపర్ణే ఇత్యే తన్మిధునత్రయం**

| | | |
|---|---|---|
| ఇచ్ఛా వామశక్తులు | – | వాణీ హిరణ్యగర్భులు |
| జ్యేష్ఠా జ్ఞానశక్తులు | – | లక్ష్మీనారాయణులు. |
| శివా – అపర్ణే | – | శివపార్వతులు |

ఈ రకంగా పంచదశి మహామంత్రం మూడు మిధునాలవుతుంది.

| | | |
|---|---|---|
| బ్రహ్మ, సరస్వతి | – | వాగ్భవకూటమి |
| లక్ష్మీనారాయణులు | – | కామరాజకూటమి |
| శివపార్వతులు | – | శక్తికూటమి |

ఈ రకంగా పంచదశికి అర్థం చెప్పటం జరిగింది. ఈ విధంగా పరమేశ్వరి త్రిశక్తి స్వరూపిణి. త్రిమూర్తి స్వరూపమే.

## 659. సర్వాధారా

సమస్త జగత్తుకూ ఆధారరూపమైనది. మార్కండేయపురాణంలో "పరమేశ్వరి ఒక్కతే. కాని ఆమె నుంచి నిత్యానిత్యములు, స్థూలసూక్ష్మాలు, మూర్తామూర్తాలు. మూర్తిమంతములు అన్నీ ఆమె నుంచి వచ్చినవే.

ఆ దేవి సమస్త బ్రహ్మాండాలకు అధిపతి. అన్నింటికీ సూత్రాత్మ ఆమె. గ్రహాలు గతులు తప్పకుండా తిరుగుతున్నాయి అంటే కారణం ఆమె.

## 660. సుప్రతిష్ఠా

శోభనమైన ప్రతిష్ఠగలది. అఖిలాండకోటి బ్రహ్మాండాలకు ఆధారమైనది. దేవతలందరిలోనూ శ్రేష్ఠమైనది. భక్తుల యొక్క కోరికలు తీర్చేది. సకలదేవతాగణానికి అధినాయక. భక్తవరద.

ఎన్ని సంవత్సరాలుమారినా, యుగాలుమారినా అవన్నీ పరమేశ్వరి రూపమే. యుగాలు, కల్పాలు అన్నీ కూడా ఆమె జగదాధారత్వము సుస్థిరం. అందుకే సుప్రతిష్ఠా అనబడుతోంది.

## 661. సదసద్రూపధారిణీ

సత్తు అంటే – బ్రహ్మ. అసత్తు అంటే – జగత్తు. ఈ సృష్టిలో పరబ్రహ్మ ఆవిడే. ఈ సృష్టి అంతా ఆవిడే. కాబట్టి సత్తు, అసత్తు రెండూ ఆమెయే.

సత్తు అంటే – పారమార్థికసత్యము. అసత్తు అంటే – తుచ్ఛము. ఈ రెండింటినీ ప్రకాశింపచేసేది ఆ పరమేశ్వరి.

అసత్తు అంటే నామరూపాలు గలది. కళ్ళకు కనిపించేది అయిన జగత్తు. ఇదే మాయ. సత్తు అంటే జగత్తును సృష్టించిన పరబ్రహ్మ. అవ్యక్తము ఇదే పరమేశ్వరి. ఈ రకంగా వ్యక్తావ్యక్తరూపాలు ధరించినది పరమేశ్వరి. అందుచేతనే సదసద్రూపధారిణీ అనబడుతోంది. "సత్యాసత్యాలు రెండూ పరమేశ్వరుని నుంచే కలుగుతున్నాయి. కాబట్టి సదసద్రూపమే పరమేశ్వరి యొక్క ఉపాస్యరూపము'' అని వేదం చెబుతోంది లింగపురాణంలో

**భూత భావవికారేణ ద్వితీయేన స దుచ్యతే**
**వ్యక్తం తేనవిహీనత్వా దవ్యక్త మన దిత్యసి"**

తన కన్న వేరైనదేదీ కూడా త్రికాలములలోనూ లేదు. అని పరమేశ్వరుడు చెబుతున్నాడు. ప్రపంచమంతా పరమేశ్వరి స్వరూపమే. జీవులు కంటికి కనిపిస్తాయి. కనిపించవు. ఈ రెండు భావనలు పరమేశ్వరియే. అందుచేతనే ఆమె సదసద్రూపధారిణీ అనబడుతోంది.

**ఆరూపా చ సరూపా చ సగుణా నిర్గుణా తథా**
**నామరూపాఽ తిరిక్తా చ సత్తామాత్రా చిదాత్మికా ॥**

నామరూపాలకు కారణమైనది కాబట్టి రూపం లేనిది. ఆవిడ కారణంచేతనే నామరూపాలు కలుగుతున్నాయి. కాబట్టి రూపమున్నది. ఈ రకంగా రూపం ఉన్నది. లేదు. అందుచేతనే ఆ పరమేశ్వరి 'సదసద్రూప ధారిణీ' అనబడుతోంది.

అవస్థలు మూడు జాగ్రస్వప్నసుషుప్తులు.

1. జాగ్రదావస్థలో స్థూలమైన జగత్తు కంటికి కనిపిస్తుంది.
2. స్వప్నావస్థలో జగత్తు కంటికి కనిపించదు. కేవలము మనస్సుకు మాత్రమే కనిపిస్తుంది. ఎందుకంటే ఆ స్థితిలో ఇంద్రియాలన్నీ మనసును ఆశ్రయించి ఉంటాయి.

3. సుషుప్తిలో మనస్సు కూడా పనిచేయదు. అది ముఖ్యప్రాణంలో లయమవుతుంది. కాబట్టి సుషుప్తి అంటే గాఢనిద్ర. అందులో సుఖమున్నది. కాని సుషుప్తి, సమాధి వేరువేరని గుర్తుంచుకోవాలి. ఈ మూడుస్థితులు ఆ పరమేశ్వరియే. అందుకే ఆమె సదసద్రూపధారిణీ అనబడుతోంది.

## 662. అష్టమూర్తిః

ఎనిమిది స్వరూపాలుగా ఉన్నది. అనేక మూర్తి సముదాయాలు ఈ రకంగా ఉన్నాయి.

**1. పంచభూతాని చంద్రార్కా వాత్మేతి మునిపుంగవ !**
**మూర్తి రష్టౌ శివ స్యాహు ర్దేవదేవస్య ధీమతః**
**ఆత్మా తస్యాఽ ష్టమీ మూర్తి ర్యజమానాహ్వయా పరా ॥**

పంచభూతాలు, చంద్రుడు, సూర్యుడు, యజ్ఞదీక్ష గల సోమయాజి. వీరు అష్టమూర్తులు.

2. 1. భవుడు 3. ఈశానుడు 5. రుద్రుడు 7. భీముడు
2. శర్వుడు 4. పశుపతి 6. ఉగ్రుడు 8. మహాదేవుడు.

3. ఈశ్వరగీతలో

**భూమి రాపోఽనలో వాయుః ఖం మనోబుద్ధి రేవ చ ।**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥**

పంచభూతాలు, మనస్సు, బుద్ధి, అహంకారము వీటిని అష్టమూర్తులంటారు.

4. శక్తిరహస్యంలో

**లక్ష్మీ ర్మేధా ధరా పుష్టి ర్గౌరీ తుష్టిః ప్రభా ధృతిః**
**ఏతాభిః పాహి తనుభి రష్టాభి ర్మాం సరస్వతి !**

1. లక్ష్మీ 2. మేధ 3. ధర 4. పుష్టి
5. గౌరీ 6. తుష్టి 7. ప్రభ 8. ధృతి

5. యోగశాస్త్రంలో

**గుణభేదాత్మమూర్తి : అష్టధాపరికీర్తితా**

**జీవాత్మా చాంతరాత్మా చ పరమాత్మా చ నిర్మలః**
**శుద్ధాత్మా జ్ఞానరూపాత్మా మహాత్మా సప్తమఃస్మృతః**
**అష్టమ స్తే షు భూతాత్మే త్యష్టాత్మానః ప్రకీర్తితాః ॥**

గుణభేదములచే ఆత్మ ఎనిమిది రకాలుగా అవుతున్నది. అవి.

| | | | |
|---|---|---|---|
| 1. జీవాత్మ | 3. పరమాత్మ | 5. శుద్ధాత్మ | 7. మహాత్మ |
| 2. అంతరాత్మ | 4. నిర్మలాత్మ | 6. జ్ఞానరూపాత్మ | 8. భూతాత్మ |

6. విష్ణుపురాణంలో

| | | | |
|---|---|---|---|
| 1. సూర్యుడు | 3. పృథివి | 5. వాయువు | 7. దీక్షితుడైన బ్రాహ్మణుడు |
| 2. జలము | 4. అగ్ని | 6. ఆకాశము | 8. చంద్రుడు |

వీరి భార్యలు వరుసగా

| | | | |
|---|---|---|---|
| 1. సువర్చల | 3. సుకేశి | 5. పరాశివ | 7. దీక్ష |
| 2. సోమ | 4. స్వాహా | 6. దితి | 8. రోహిణి |

వీరి కుమారులు

| | | | |
|---|---|---|---|
| 1. శని | 3. లోహితాంగ | 5. స్కంద | 7. సంతాన |
| 2. శుక్ర | 4. జీవ | 6. స్వర్గ | 8. బుధ |

7.

| | | | |
|---|---|---|---|
| 1. అనంగకుసుమ | 3. అనంగమదన | 5. అనంగరేఖ | 7. అనంగాంకుశ |
| 2. అనంగమేఖల | 4. అనంగమదనాతుర | 6. అనంగవేగిని | 8. అనంగమాలిని |

8.

| | | | |
|---|---|---|---|
| 1. బ్రాహ్మి | 3. కౌమారి | 5. వారాహి | 7. చాముండ |
| 2. మహేశ్వరి | 4. వైష్ణవి | 6. మాహేంద్రి | 8. మహాలక్ష్మి |

9.

| | | | |
|---|---|---|---|
| 1. జ్ఞానేంద్రియాలు | 3. అహంకార చతుష్టయం | 5. భూతపంచకం | 7. కర్మ |
| 2. కర్మేంద్రియాలు | 4. ప్రాణపంచకం | 6. కామము | 8. అవిద్య. |

ఈ రకంగా ఎనిమిదిగా ఉన్న స్వరూపమంతా ఆ పరమేశ్వరియే. అందుకే ఆమె అష్టమూర్తి అనబడుతోంది. అంతేకాకుండా

1. కాదివిద్య  2. హాదివిద్య  3. సంఖ్యావిద్య  4. భూమావిద్య

ఈ నాలుగు లింగభేదంతో ఎనిమిది అవుతున్నాయి. వీటి స్వరూపం కూడా పరమేశ్వరియే అందుకే ఆవిడ అష్టమూర్తి.

## 663. అజా

పుట్టుకయే లేనిది. అష్టమూర్తుల రూపం ధరించి ఉన్నప్పటికీ, జీవులకు ఉండేటటువంటి షడ్భావవికారాలు లేనిది. షడ్భావవికారాలు అంటే :

| | | |
|---|---|---|
| 1. పుట్టటము | 3. ఉండటము | 5. క్షయం కావటము |
| 2. పెరగటము | 4. పరిణామం చెందటము | 6. నశించటము |

ఇవి ఏవీకూడా లేనటువంటిది. భావవికారాలు లేనటువంటిది. నిత్యము సత్యము అయిన పరబ్రహ్మస్వరూపము.

## 664. జైత్రీ

ప్రసిద్ధమైన అవిద్యారూపాన్ని జయించినది. అజ్ఞానాన్ని జయించి తన వశంలో ఉంచుకున్నది. జ్ఞానస్వరూపిణి. సర్వమును జయించినది. సర్వమును తనకు లోబరచుకున్నది. సర్వమును అతిక్రమించి ఉన్నది. సర్వప్రపంచాన్నీ ఏకాధిపత్యంగా పాలించునది. పంచకృత్యపరాయణ అయిన పరమేశ్వరి.

రాక్షసులను వధించిన తరువాత విజయోత్సవం జరిపించుకునేది. సర్వరాక్షససంహార సూచకముగా ఆశ్వీయుజశుద్ధ దశమినాడు విజయోత్సవము చేసుకునేది. ఆ రోజు విజయదశమి. ఈ రకంగా విజయం కలిగినది కాబట్టి జైత్రీ అనబడుతుంది.

## 665. లోకయాత్రా విధాయినీ

పధ్నాలుగు లోకాలయొక్క సృష్టిస్థితిలయాలనబడే యాత్రను చేసే స్వభావం గలది. ఈ లోకాలలో జన్మించే ప్రతిజీవికీ వారు చేయవలసిన పనులు అన్నీ ముందుగానే నిర్ణయిస్తుంది. కాబట్టి లోకయాత్రా విధాయినీ అనబడుతోంది. లోకంలోని మానవాళికి వర్ణాశ్రమధర్మాలను విధించినది. గత జన్మలో చేసిన కర్మల ఫలితాలను అంటే సంచితకర్మను వారు తరువాత జన్మలలో జాగ్రత్తగా అనుభవించేటట్లు ఏర్పాటు చేసేది. ఆ కర్మ ఫలితము అనుభవించటానికి అనుగుణంగా శరీరాన్నిఏర్పాటుచేసేది.

జీవులు తాము చేసిన కర్మలననుసరించి వారికి మానవులు, పశువులు, పక్షులు, గంధర్వులు, యక్షులు. ఇలా వారికి జీవనవిధానం ఏర్పరుస్తుంది. వారందరూ ఆ విధంగా కర్మఫలం అనుభవించేటట్లు చూస్తుంది. కాబట్టి ఆ పరమేశ్వరి లోకయాత్రా విధాయినీ అనబడుతుంది.

## 666. ఏకాకినీ

ఒంటరిగా ఉండేది. ఇంకొకరు ఎవరూలేనిది. బృహదారణ్యకోపనిషత్తులో చెప్పినట్లుగా ఈ సృష్టికి పూర్వం మానవాకారంలో ఉన్న విరాడాత్మ మాత్రమే ఉండేది. అతని కన్న భిన్నమైనది ఏదీలేదు. అంతటా నేనే ఉన్నాను అనుకున్నాడు. పురుషాకారంలో ఉన్న ప్రజాపతి తాను ఒక్కడే అయి ఉండి కూడా భయభ్రాంతుడైనాడు. కాని తాను తప్ప ఇంకెవరూ లేరనే ఆలోచనతో ఆ భయాన్ని పోగొట్టుకున్నాడు.

పరమేశ్వరుడు ఏకాకి. ఒంటరివాడు. అతనితో సమానమైనవారుగాని, అతని కన్నఎక్కువైన వారుగాని ఎవరూ లేరు. **ఏకమేవాద్వితీయమ్ బ్రహ్మ.** పరబ్రహ్మ అద్వితీయమైనది. రెండవది అనేదిలేనిది. సజాతీయత, విజాతీయత మొదలైన ఏరకమైన భేదభావాలు లేనటువంటిది. శ్రీమద్భాగవతంలో

**ఒరులు గారు నాకు ఒరులకు నే నౌదు**
**ఒంటివాడను చుట్ట మొకడు లేడు**

అతనికి ఎవరూ ఏమీకారు. అంటే అతడికి ప్రేమ, అభిమానం, ఆప్యాయత, అనురాగం ఏవీ ఉండవు. ఎవరి మీదా పక్షపాతం ఉండదు. కాని అందరికీ అతడు కావాలి. ఒంటరివాడు, చుట్టాలు, పక్కాలు ఎవరూలేనివాడు. నా అనేవారు ఎవరూ లేనివాడు. అందుకే ఆ పరమేశ్వరుడు ఏకాకి.

## 667. భూమరూపా

భూమరూపము అంటే పరబ్రహ్మరూపము. సర్వాధారస్వరూపము. ఏ అవస్థలో రెండవది కనపడదో, రెండవది వినపడదో, అటువంటి స్థితి భూమారూపము. అదే తురీయావస్థ. పరమసుఖావస్థ. ఇంద్రియాలన్నీ మనసులో, మనసు బుద్ధిలో, బుద్ధి ఆత్మలో లయమయ్యేస్థితి భూమారూపము. అమృతస్వరూపమైనది. నిత్యము సత్యమైనది. నిరవధికమైనది. అఖండమైనది. అటువంటిస్థితిలోనే పరమేశ్వరి ఎల్లవేళలయందు ఉంటుంది కాబట్టి భూమరూపా అనబడుతుంది.

భూమ అంటే అనేకము అని అర్థం. పరమేశ్వరి ఏకాకి అయినప్పటికీ అనేకరూపాలు గలది. దేవీపురాణంలో దేవి ఏకాకి అయినప్పటికీ ఉపాదులచే భూమ అవుతున్నది. స్ఫటికము తెల్లగా ఉన్నప్పటికీ అనేక రంగులతో అనేకరీతులుగా కనిపిస్తుంది. అలాగే పరమేశ్వరి కూడా అనేకరూపాలు గలది అని చెప్పబడింది. వాయువు ఒకటేకాని సుగంధ,

దుర్గంధ భరితమవుతున్నది అలాగే ఉమాదేవి కూడా కూర్మపురాణంలో కామేశ్వరీ, శక్తి ఒకటే అయినప్పటికీ ఉపాధిభేదంతో ఒకరికి పరాశక్తిగా ఇంకొకరికి వేరుగా కనిపిస్తుంది అని చెప్పబడింది.

## 668. నిర్ద్వైతా

ద్వైతభావనలేనిది. పరమేశ్వరి ఏకాకి. ఇంకొకరెవరూ లేనిది. పరబ్రహ్మస్వరూపము. నిర్ద్వైతా. రెండవవారులేనిది. కంటికి కనిపించే జగత్తంతా ద్వైతము. భగవంతుడు వేరు భక్తుడు వేరు అనేది ద్వైతభావన. ఇటువంటి భావన లేనిది పరమేశ్వరి. ఇది అద్వైతభావన. అంటే భక్తుడు భగవంతుడు ఇద్దరూ ఒకటే. జగత్తంతా పరబ్రహ్మ స్వరూపము. అంతకుమించినది ఏదీలేదు. ఆకాశంలో కనిపించే సూర్యునిలో ఉన్న తేజస్సే నాలోనూ ఉన్నది. అగ్నిలో ఉన్న తేజస్సే నాలోనూ ఉన్నది. దూరంగా మిలమిలామెరిసే నక్షత్రాలలో ఉన్న తేజస్సే నాలోనూ ఉన్నది.

ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుతో “మానవుడు నిద్రించేటప్పుడు ఆత్మలో తాత్కాలికంగా లీనమవుతాడు. మరణకాలంలో వాక్కు మనసులో లీనమవుతుంది. మనసు ప్రాణంలో లీనమవుతుంది. ప్రాణం తేజస్సులో లీనమవుతుంది. చివరకు అది పరమశక్తితో కలిసిపోతుంది. ఆ శక్తి అతి సూక్ష్మమైనది. కాని విశ్వమంతా వ్యాపించి ఉన్నది. అదే సత్యము. అదే నిత్యము. అదే ఆత్మ. అదే నీవు శ్వేతకేతూ అదేనీవు.

జీవించినంత కాలము పులి, సింహము, క్రిమి కీటకము ఇత్యాది పేర్లుంటాయి. మరణించిన తరువాత ఆ పేర్లన్నీ పోతాయి. జీవికి గుర్తింపు ఉండదు. ఆ జీవి పరమాత్మలో చేరిపోతుంది. అదే నీవు. శ్వేతకేతూ ఆ పరమాత్మే నీవు అని చెబుతాడు. ఇది అద్వైతసిద్ధాంతం. భగవంతుడు, భక్తుడు ఇద్దరూ వేరుకాదు. జీవాత్మ అజ్ఞానంతో ఉన్నంతవరకూ తాను వేరు అనుకుంటుంది. బంధనాలు విడివడి అజ్ఞానపు పొరలు తొలగిపోతే తానే పరబ్రహ్మ అని తెలుస్తుంది.

**బ్రహ్మవి ద్బ్రహ్మై వ భవతి**

బ్రహ్మ నెరిగినవాడు కూడా బ్రహ్మమే. ఈ రకంగా అద్వైతసిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తుంది కాబట్టి పరమేశ్వరి నిర్ద్వైతా అనబడుతుంది.

## 669. ద్వైతవర్జితా

ద్వైతమనేది లేదు. జీవాత్మ పరమాత్మ అనే భేదభావంలేనిది.

ద్వైతభావనకు ఆశ్రయం ఇవ్వనిది. ద్వైతులను వర్జించినది. ఏకాకినీ దగ్గర నుండి చెప్పిన నామాలనే ఇంకా వివరిస్తున్నారు. తనను మించినవారు ఇంకెవరూలేరు. తనతో సమానులు కూడా ఎవరూలేరు. తనకు అంటూ ఎవరూలేరు. తాను మాత్రం అందరికీ ఉంటుంది. పరమాత్మ జీవులందరిలోనూ ఆవరించి ఉన్నాడు. సృష్టి అంతా పరబ్రహ్మమయమే. ఇది అద్వైతం.

ద్వైతంలో స్వతంత్రము పరతంత్రము అని రెండు ఉన్నాయి. అక్కడ జీవుడు వేరు దేవుడు వేరు. దేవుడు స్వతంత్రుడు. జీవి పరతంత్రుడు. మరణానంతరము జీవి అంగుష్టమాత్రదేహుడై శ్రీమన్నారాయణుని సేవిస్తూ వైకుంఠంలో నారాయణుని సమీపంలో ఉండి పోతాడు. అది సామీప్యముక్తి. కాని అద్వైతంలో జ్ఞానికి సాయుజ్యం లభిస్తుంది. జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. ఇక్కడ ద్వైతమనేది లేదు. ఉన్నదంతా ఒక్కటే. అందుకే పరమేశ్వరి ద్వైతవర్జితా అనబడుతుంది.

ఈ రకంగా లోపాముద్ర విద్యను వివరించటం జరిగింది.



శ్రీ 'ఘ'కార దేవి

# 43. సావిత్రీవిద్య

సృష్టి నిమిత్తం పరమేశ్వరి దుర్గ, లక్ష్మి, పార్వతి, సావిత్రి, రాధ అనే ఐదురూపాలు ధరించింది. వీటిలో నాల్గవశక్తి సావిత్రి. శుద్ధ స్ఫటికరూపిణి. ఆనందప్రదాయిని, బ్రహ్మతేజస్సుతో వెలుగుతూ ఉంటుంది. ఛందోశాస్త్రాలకు, మంత్రం, తంత్ర శాస్త్రాలకు అధిదేవత. ఆమెయే బ్రహ్మవిద్య.

మద్రదేశాధిపతి అశ్వపతి మహారాజు. ఆయనకు పరమేశ్వరి సావిత్రీదేవి దయవల్ల ఒక కుమార్తె పుట్టింది. ఆ బాలికకు సావిత్రి అని నామకరణం చేశారు.

ద్యుమత్సేన మహారాజుకుమారుడు సత్యవంతుడు. శత్రువులవల్ల రాజ్యం పోగొట్టుకుని అడవులపాలయినాడు ద్యుమత్సేనుడు. సావిత్రీ సత్యవంతుల వివాహం జరిగింది. సత్యవంతుడు అల్పాయుష్కుడు అతని ఆయుర్దాయం తీరిపోయింది. అతన్ని తీసుకుపోవటానికి వచ్చాడు యముడు. పతివ్రత అయిన సావిత్రి యముణ్ణి చూసింది. వెంబడించింది. సావిత్రి అడిగిన ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పాడు యముడు. ఆవిడ పాతివ్రత్యానికి మెచ్చి చివరకు భర్త ప్రాణాలను కూడా అనుగ్రహించాడు. ఈ కథ తెలియనివారుండరు. ఇక్కడ పతివ్రతా శిరోమణి అయిన సావిత్రి ఆరాధించినది ఆ సావిత్రీదేవినే.

**తప్తకాంచన వర్ణాభాం జ్వలంతీం బ్రహ్మతేజసా ।**
**గ్రీష్మ మధ్యాహ్న మార్తాండ సహస్రసమితప్రభాం ॥**

**ఈషద్ధాస్య ప్రసన్నాస్యాం రత్నభూషణ భూషితాం ।**
**వహ్నిశుద్ధాం శుకాధానాం భక్తానుగ్రహ విగ్రహాం ॥**

**సుఖదాం ముక్తిదాం శాంతాం కాంతాం చ జగతాం విధే ।**
**సర్వసంపత్స్వరూపాంచ ప్రదాత్రీం సర్వసంపదాం ॥**

**వేదాధిష్టాతృ దేవీంచ వేదశాస్త్రస్వరూపిణీం ।**
**వేదబీజ స్వరూపాంచ భజే తాం వేదమాతరం ॥**

పరమేశ్వరి అయిన సావిత్రి గాయత్రిస్వరూపిణి. వైదికమార్గతత్పరులకు, మూడుకులాల వారికి కూడా మూడు సంధ్యలయందు ఆరాధించదగిన దేవత.

సవితృమండలతేజశ్శక్తియే సావిత్రి. ప్రపంచమంతా ఈ దేవి నుంచే ఉత్పన్నమైనదే. సృష్టికారణశక్తి ఆమె. వేదమాత. నారదుడు చూస్తుండగానే వేదాలన్నీ కూడా సావిత్రీదేవి ముఖం నుంచి బయటకు వచ్చినాయి. ఈమె ప్రభావతి అనబడుతోంది. సూర్యగమనాన్ని నిరోధించిన రాక్షసులను సంహరించినది ఈమె. ప్రాతఃసాయంసంధ్యలలో బ్రాహ్మణులు వదిలే అర్ఘ్యప్రదానమిదే.

రామరావణ సంగ్రామంలో అగస్త్యమహర్షి సావిత్రీవిద్యనే ఆదిత్యహృదయంరూపంలో రాముడికి ఉపదేశం చేశాడు.

ఈమె అన్నిరకాల జపతపాలకు మూలస్థానము. వేదవేదాంగాలకు, అన్ని ఛందస్సులకు, సకల మంత్రాలకు, తంత్రాలకు కారణము. ఈ దేవి శుద్ధసత్వస్వరూపిణి. బ్రహ్మరూప. పరమానందస్వరూప. సచ్చిదానందస్వరూపిణి. ఈ దేవి సర్వార్ధధాత్రి. సర్వలోక వశంకరి. చతురంగబలేశ్వరి.

ఆమెను అర్చించినవారికి అన్నీ శుభాలే జరుగుతాయి. తన భక్తులకు భోగభాగ్యాలు, సిరిసంపదలు ఇస్తుంది. రాజ్యాలు ఇస్తుంది. ఆమె అర్చనావిధానం చాలా సులభమైనది. ఆమె సుఖారాధ్య. సులభంగా పొందదగినది. రాక్షససంహారం చేస్తుంది. అంటే మనలోని అంతశ్శత్రువులను సంహరించి జ్ఞానోదయం కలుగుచేస్తుంది.

670 నుంచి 701 వరకు నామాలలో సావిత్రీ విద్యను వివరించటం జరిగింది.

## 670. అన్నదా

**అన్నం జనేభ్యో దదాతి**

జనులకు అన్నము ఇచ్చేది. అన్నము అంటే బియ్యంతో వండిన పదార్ధమేకాదు. జీవి బ్రతకటం కోసం తీసుకునే ఆహారం ఏదైనా అన్నమే.

వేదంలో చెప్పినట్లుగా పంచభూతాలలో అఖరుగా భూమి ఉద్భవించింది. భూమి నుంచి ఓషధులు పుట్టినాయి. ఆ ఓషధుల నుంచే అన్నము వచ్చింది. ఈ రకంగా లోకంలోని జీవరాశులన్నింటికీ అన్నము నిస్తుంది. కాబట్టి ఆ దేవి అన్నదా అనబడుతోంది.

యజ్ఞయాగాలు చేసేటప్పుడు అగ్నిలో ఆదిత్యుడికి ఆహుతులు అర్పించటం జరుగుతుంది. ఆ ఆహుతుల వలన సూర్యుడికి ప్రకాశం పెరుగుతుంది. దాంతో నదులు, సముద్రంలోని నీరు ఆవిరి అయిపోయి మేఘాలుగా మారుతుంది. మళ్ళీ వర్షరుతువురాగానే

ఆ మేఘాలు వర్షిస్తాయి. ఈ వర్షాలవల్ల వాగులు, వంకలు, యేరులుగా నీరు ప్రవహించి, నదులుగా మారి సముద్రంలో కలుస్తుంది. ఈ వర్షపునీటితోను, ప్రవహించే నీటితోను సాగుబడి జరిగి పంటలు పండుతాయి. ఆ పంటలవల్లనే జీవులకు ఆహారం లభ్యమవుతుంది. ఇక్కడ ఆదిత్యునిశక్తికి సావిత్రి అని పేరు. ఆమె పరమేశ్వరి స్వరూపము.

పూర్వజన్మలలో చేసిన కర్మఫలంవల్ల ఎవరికి ఏ రకమైన ఆహారం ప్రాప్తమో అది అన్నంగా లభిస్తుంది. జీవులలో క్రిమికీటకాల మొదలు మానవులదాకా అనేకరకాలున్నాయి అని గతంలో వివరించాం. వీటికి అన్నింటికీ కూడా సమానమైన లక్షణాలు కొన్ని ఉన్నాయి. అవే ఆహారనిద్రామైధునాలు. వీటన్నింటికన్న మానవుడికి ప్రత్యేకంగా ఉన్నది మనస్సు. ఆలోచనాశక్తి. ధర్మాధర్మ యుక్తాయుక్త విచక్షణ. మిగిలిన జీవులకు వేటికీ ఈ లక్షణం లేదు. అందుచేత మిగిలిన జన్మలన్నింటిలోకీ మానవజన్మ దుర్లభమైనది అని చెప్పబడింది.

అందులోనూ బ్రాహ్మణజన్మ మరీ దుర్లభము. ఎందుచేతనంటే, లోకంలో అనాదిగా కొంతమంది ఆధ్యాత్మికచింతన, సత్యాన్వేషణలో కాలం గడుపుతున్నారు. వారే బ్రాహ్మణులు. అయితే వారి సంతతి సత్యాన్వేషణ చెయ్యకపోయినప్పటికీ, వారికి ఆ లక్షణాలు కొన్ని వంశానుగతంగా లభ్యమవుతాయి. అందుచేత మిగిలినవారి కన్న బ్రహ్మను గురించిన పరిజ్ఞానము వారికి ఎక్కువ ఉంటుంది. అందుచేత యుక్తాయుక్త విచక్షణ కూడా ఎక్కువగానే ఉంటుంది. కాబట్టే బ్రాహ్మణజన్మ మరీ దుర్లభమని చెప్పబడింది.

జీవులకుండే లక్షణాలు కొన్ని ఉన్నాయి. అందులో మానవుడికి ఉండేవి 33. అవి

| | | |
|---|---|---|
| సప్తధాతువులు | – | 7 |
| ఇంద్రియాలు | – | 10 |
| ప్రాణాలు | – | 5 |
| మానసికప్రవృత్తులు | – | 11 |
| వెరసి | – | 33 |

ఈ 33 లక్షణాలు గలవాడే మానవుడు. మిగిలిన జీవులకు ఈ లక్షణాలు ఒకటొకటి తగ్గుతూ ఉంటాయి. ఈ లక్షణాలను బట్టే ఇది మృగమని, పశువని, పక్షిఅని, క్రిమిఅని, కీటకము అని నిర్ణయించటం జరుగుతుంది. స్థావర జంగమాత్మకమైన జగత్తులో మొత్తం 84 లక్షల జీవరాసులున్నాయి. వాటిలో

| | | |
|---|---|---|
| స్థావరములు | – | 20 లక్షలు |
| మృగాలు | – | 30 లక్షలు |
| క్రిములు | – | 11 లక్షలు |
| పక్షులు | – | 10 లక్షలు |
| జలచరాలు | – | 9 లక్షలు |
| మానవులు | – | 4 లక్షలు |
| వెరసి | – | 84 లక్షలు |

జీవులు అన్నింటికీ ఒకటే ఆహారంకాదు. ఎక్కువ లక్షణాలు గల జీవులు, తక్కువ లక్షణాలు గల వాటిని ఆహారంగా తీసుకుంటాయి. ఇది ప్రకృతి సహజము కాని మానవుడు జగత్తులోని అన్ని పదార్థాలను ఆహారంగా తీసుకుంటాడు.

విజ్ఞుడైనవాడు కేవలము శాఖాహారం మాత్రమే ఆహారంగా తీసుకుంటాడు. అయితే శాఖాహారంలో కూడా సత్వరజస్తమోగుణాలు గలపదార్థాలున్నాయి. ఆహారంలోని సూక్ష్మాంశ భోక్త యొక్క మనస్సుగా మారుతుంది. అందుకని తీసుకునే ఆహారాన్ని బట్టి మనస్సు యొక్క ప్రభావము, ప్రవృత్తి ఉంటాయి. అందుకే పవిత్రమైన ఆహారాన్ని మాత్రమే తీసుకోవాలి. వీటిలో

| | | |
|---|---|---|
| రాజసాహారంవల్ల | – | మనోచాంచల్యం కలుగుతుంది. |
| తామసాహారం వల్ల | – | నిద్ర ఎక్కువ అవుతుంది |

కాబట్టి సాత్వికాహారమే శ్రేష్ఠము.

అయితే మనం తీసుకునే ఆహారం ఏవిధంగా వచ్చింది అనే దానిమీద కూడా ఉపాసకుడికి ఫలితము వస్తుంది. ఎవరైనా దానం చేసిన పదార్థాలు తింటే, మన ఉపాసన ఫలం కొంతవారికి చెందుతుంది. అన్యాయార్జితమైన ఆహారం తింటే, దాని ఫలితం కూడా అనుభవించాలి. అందుచేత కష్టపడి సంపాదించిన ఆహారం మాత్రమే తీసుకోవాలి. ఈశావాశ్యోపనిషత్తులోని మొదటి మంత్రంలో

**ఈశావాస్య మిందగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్**
**తేన త్యక్తేన భుంజీథాః మా గృధః కస్యస్విద్ ధనమ్**

అనిత్యమైన ఈ ప్రపంచంలో పరివర్తనాశీలమైనది ఏదైతే ఉన్నదో అదంతా పరమేశ్వరుడిచే ఆవరించబడి ఉన్నది. ఈ ఐశ్వర్యము నిత్యముకాదు. అశాశ్వతమైన

వాటి మీద కోరికలు వదలిపెట్టు. ప్రాపంచిక సుఖాలను పరిత్యజించు. ఇతరుల ధనాన్ని ఆశించకు. ఇతరులమీద ఆధారపడకు అని చెప్పబడింది.

అంటే నీకు కావలసిన ధనం నువ్వే సంపాదించుకో అంతేకాని ఎవరినీ యాచించవద్దు అంటోంది. ఈ రకంగా కష్టపడి సంపాదించిన ధనంతోనే ఫలితం ఎక్కువ వస్తుంది. అది కూడా మంచి పనిచేసి ధనార్జన చెయ్యాలి. అలా సంపాదించే ఆహారం కూడా దోషరహితంగా ఉండాలి. దోషాలు మూడురకాలు.

| | | | |
|---|---|---|---|
| 1. | జాతిదోషము | – | ఉల్లి, వెల్లుల్లి, ముల్లంగి పంటలు ఈ రకమైనవి |
| 2. | ఆశ్రయదోషము | – | పాలు సాత్వికమైన ఆహారము. కాని రాగి గిన్నెలోపోస్తే దోషము. |
| 3. | నిమిత్త దోషము | – | స్మశానంలో పండించినవి, మలమూత్రాదులతో కలిసిన మురుగు నీటితో పండించిన పంటలు. |

ఇటువంటివి తినటానికి పనికిరావు. అలాగే పిల్లి, ఎలుక, కుక్క, కాకి ముట్టుకున్న ఆహారం కూడా తినకూడదు. ఈ రకంగా దోషంలేని ఆహారాన్ని వండేవారు, వడ్డించేవారు కూడా పరిశుభ్రులై ఉండాలి. వారు ప్రేమతో వాత్సల్యంతో వడ్డించాలి. అటువంటి ఆహారం తిన్నవాడి మనస్సు నిశ్చలంగా ఉంటుంది. అతడి ఉపాసనకు మంచి ఫలితం వస్తుంది.

ఈ రకంగా ఎవరి ప్రాప్తాన్నిబట్టి వారికి అన్నము సమకూరుస్తుంది కాబట్టి దేవి అన్నదా అనబడుతుంది.

## 671. వసుధా

వసు అంటే ధనము. ధనాన్ని ఇచ్చేది. పుట్టుక లేనటువంటి ఈ ఆత్మ అన్నము, ధనము ఇస్తుంది అని బృహదారణ్యకం చెబుతోంది. ప్రసిద్ధమైనదైన ఈ ఆత్మ కర్మఫలాన్ని బట్టి అన్నము, ధనము సమకూరుస్తుంది.

**వసు ధనం రత్నం చ దదాతి**

ధనాన్ని, రత్నాలను ఇస్తుంది కాబట్టి వసుదా అనబడుతుంది. ఆ పరమేశ్వరి తన భక్తులకు ఐహక సుఖాలనిస్తుంది. ఐహకసుఖాలు అంటే ధనము, ఆహారము, ఆరోగ్యము. అన్నిటికీ మించి ఉత్తమమైన మోక్షాన్ని కూడా ఇస్తుంది.

## 672. వృద్ధా

వృద్ధి చెందినది. పరమేశ్వరి సర్వజ్యేష్ఠురాలు. అందరికన్న పెద్దది. కాబట్టి విశ్వరూపంతో బాగా వృద్ధి పొందినది. లోకాలను అభివృద్ధి పరచినది.

బ్రహ్మమే వృద్ధా అనబడుతున్నది. దేవి త్రిమూర్తులకు కూడా ముందే ఉన్నది. వారిని కూడా ఆమె సృష్టించింది కాబట్టి వృద్ధా అనబడుతోంది.

## 673. బ్రహ్మాత్మైక్య స్వరూపిణీ

బ్రహ్మ, ఆత్మ రెండూ ఒకటే అనే స్వరూపం గలది. బ్రహ్మమే తానైనది. మహా వాక్యాలలో చెప్పినట్లుగా

1. ప్రజ్ఞానంబ్రహ్మ
2. అహంబ్రహ్మాస్మి
3. తత్త్వమసి
4. అయమాత్మా బ్రహ్మ

ఇవి మహావాక్యాలు. వీటియొక్క అర్థం ఆ పరబ్రహ్మస్వరూపం నేనే. అహంబ్రహ్మాస్మి - నేనే ఆ పరబ్రహ్మను. ఈ విషయం తురీయానికిచేరితే తెలుస్తుంది. ఇదే అద్వైతసిద్ధాంతము, పరమేశ్వరి యొక్క రూపము. ఈ రకంగా పరమేశ్వరి తురీయస్థితి రూపమైనది. కాబట్టి బ్రహ్మాత్మైక్యస్వరూపిణి అనబడుతుంది.

అహం అనేది జీవమంత్రం. సోహం అనేది పరమేశ్వరమంత్రం. ఈ జగత్తులోని ప్రతి పదార్థము ఆ పరబ్రహ్మ నుంచే పుట్టి, పరబ్రహ్మవల్లనే వృద్ధిచెంది, ఆ పరబ్రహ్మ నందే లయమవుతున్నది. అందుకే ఆ దేవి బ్రహ్మాత్మైక్యస్వరూపిణి అనబడుతోంది. పిపీలికాది బ్రహ్మ పర్యంతము, బ్రహ్మము మొదలు స్తంభము వరకు, శివాది క్షితి పర్యంతము. అంతా పరబ్రహ్మమయం. లోకంలో స్థావరములు (కదలనివి) జంగమములు (కదిలేవి) ప్రాణమున్నవి, ప్రాణములేనివి కొండలు, బండలు, చెట్లు, చేమలు, పశువులు, పక్షులు కంటికి కనిపించేవి, కనిపించనివి అన్నీ పరమేశ్వరస్వరూపమే. కాబట్టే పరమేశ్వరి బ్రహ్మాత్మైక్యస్వరూపిణీ అనబడుతోంది.

## 674. బృహతీ

బృహత్ అనగా గొప్పది. గొప్పదానికన్న గొప్పది. పరమేశ్వరి నామరూపాత్మకమైన జగత్తుకు మూలకారణమైనది. కారణము ఎప్పుడూ కార్యము కన్న గొప్పది. జగత్తు

గొప్పది. జగత్తును సృష్టించినవాడు ఇంకా గొప్పవాడు. అందుకనే పరమేశ్వరి గొప్ప దానికన్న గొప్పది. కఠోపనిషత్తులో ఆత్మ గురించి చెబుతూ **మహతో మహీయాన్** అన్నారు. ఆత్మ మహాత్ములకన్న కూడా మహత్తయినది.

ముప్పైఆరు అక్షరాలు గల ఛందస్సు బృహతి.

## 675. బ్రాహ్మణీ

బ్రాహ్మణీ – బ్రాహ్మణుని భార్య సుమంగళి. ఉదయం నిద్రలేచిన దగ్గర నుంచి రాత్రి పడుకునేవరకు నియమనిష్ఠలతో కాలం గడిపేవాడు బ్రాహ్మణుడు. అతని భార్య బ్రాహ్మణి.

బ్రాహ్మణి – దివ్యజ్ఞానము, తెల్లని పుష్పములు ధరించినది.

శివుడు బ్రాహ్మణుడు. అతని భార్య బ్రాహ్మణి. ఛాందోగ్యంలో 'నువ్వు దేవతలకు బ్రాహ్మణుడవు. నేను మనుషులలో బ్రాహ్మణుడను' అని చెప్పబడింది. పరమశివునికి బ్రాహ్మణత్వము చెప్పబడింది. బ్రాహ్మణత్వము అనేది కులంకాదు. సత్యాన్వేషణ బ్రహ్మజ్ఞానం.

శ్రీచక్రార్చనలో సుమంగళిని అర్చించటమనేది ఆచారము. ఆమె బ్రాహ్మణి. సాక్షాత్తూ పరమేశ్వరస్వరూపురాలు.

## 676. బ్రాహ్మీ

అవిద్యను మించిన జ్ఞానము గలది. ఉపనిషత్తులలో చెప్పినట్లుగా దేనివల్లనైతే ఈ భూతజాలమంతా ఉద్భవిస్తున్నదో, దేనివల్లనైతే వృద్ధిచెందుతున్నదో, దేనివల్లనైతే లయం చెందుతున్నదో అది బ్రహ్మము. అట్టి బ్రహ్మ యొక్క శక్తి బ్రాహ్మి. ఆమె సరస్వతి. సప్తమాతృకలలో మొట్టమొదటిది. శుంభ నిశుంభులతో యుద్ధం చేసినప్పుడు ఈ శక్తి పరమేశ్వరికి అండగా నిలిచింది. సత్యము, నిత్యము, శాశ్వతమైనది అంతా బ్రహ్మమే.

## 677. బ్రహ్మానందా

బ్రహ్మమే ఆనందముగా గలది. గొప్ప ఆనందం గలది. ఆ ఆనందం వర్ణించనలవి గానిది. నిరతిశయ ఆనందస్వరూపిణి. తైత్తిరీయంలో

లోకంలోని సంపద అంతా యవ్వనవంతుడు, ఆరోగ్యవంతుడు, కర్మిష్టి, బలశాలి, వేద వేదాంగవిశారదుడు అయిన బ్రాహ్మణుడు అనుభవించటానికే ఉన్నది. అటువంటి బ్రాహ్మణుడు అనుభవించే ఆనందము – మానుషానందము

| | | |
|---|---|---|
| మానుషానందానికి నూరురెట్లు | – | మనుష్యగంధర్వానందం |
| మనుష్యగంధర్వానందానికి నూరురెట్లు | – | దేవగంధర్వానందం |
| దేవగంధర్వానందానికి నూరురెట్లు | – | చిరలోకపితరానందం |
| చిరలోకపితరానందానికి నూరురెట్లు | – | అజానజదేవానందం |
| అజానజదేవానందానికి నూరురెట్లు | – | కర్మదేవానందం |
| కర్మదేవానందానికి నూరురెట్లు | – | దేవానందం |
| దేవానందానికి నూరురెట్లు | – | ఇంద్రానందం |
| ఇంద్రానందానికి నూరురెట్లు | – | బృహస్పతి ఆనందం |
| బృహస్పతి ఆనందానికి నూరురెట్లు | – | ప్రజాపతి ఆనందం |
| ప్రజాపతి ఆనందానికి నూరురెట్లు | – | బ్రహ్మానందం |

ఇటువంటి బ్రహ్మానందాన్ని పొందేది ఆ పరమేశ్వరి. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాల నడుమ, ఆనందమయకోశము నందుండి బ్రహ్మానందాన్ని అనుభవించేది.

## 678. బలిప్రియా

బలి అంటే – అజ్ఞానాన్ని విడిచి, అరిషడ్వర్గాలను జయించినవారు. అట్టివారి యందు ప్రీతి గలది.

కేవలము జ్ఞానులు, అరిషడ్వర్గాలను జయించిన వారు అంటే జితేంద్రియులు. కాబట్టి జితేంద్రియులైన జ్ఞానులపై ప్రీతి గలది. కాబట్టి బలిప్రియా అనబడుతోంది.

ప్రహ్లాదుని కుమారుడు విరోచనుడు. అతని కుమారుడు బలి. వేదవేదాంగవిదుడు. ధర్మపరుడు. కాని ఇంద్రుని పదభ్రష్టుని కావించాడు. విష్ణుమూర్తి వామనావతారమెత్తి బలిని పాతాళానికి పంపాడు. ఆ బలిచక్రవర్తి యందు ప్రీతి కలది.

పూజాకాలంలో నివేదన చెయ్యటం జరుగుతుంది. అటువంటి నివేదనలందు ప్రీతి గలది. నివేదన చేసే ఏ పదార్థాన్నైనా బలి అనే అంటారు. అయితే అరిషడ్వర్గాలను

వదలివేయటమే ముఖ్యమైన బలి. ఇదే కాకుండా పూజలోను, హోమం దగ్గర, ఊరేగింపు సమయంలోనూ, పూజాంతమునందు ఈ విధంగా దేవతలకు బలి సమర్పణ చేస్తారు.

నవరాత్రులలో అమ్మవారికి జంతుబలి ఇవ్వవచ్చు అని దేవీభాగవతం చెబుతోంది. దీని కోసం కోడి, పంది, ఎనుబోతులు శ్రేష్ఠమైనవి. వీటియందు ప్రీతి గలది కాబట్టే బలిప్రియా అనబడుతుంది.

**కూష్మాండ మిక్షుదండం చ శ్రీఫలం నారికేళకమ్ ।**
**ఏతే బలిసమాః ప్రోక్తాః తృప్తా భాగసమా సదా ॥**

| | | |
|---|---|---|
| బ్రాహ్మణుడు | – | గుమ్మడిపండును |
| క్షత్రియుడు | – | చెరకుగడను |
| వైశ్యుడు | – | శ్రీఫలమును (మారేడు పండు) |
| శూద్రుడు | – | కొబ్బరికాయను |

పరమేశ్వరికి నివేదనగా సమర్పించాలి. వాటి వలన దేవి ప్రీతి చెందుతుంది.

## 679. భాషారూపా

సంస్కృత ప్రాకృత భాషలే రూపముగా గలది. ఆమెను కొందరు సంస్కృతభాషలో, కొందరు తెలుగులో, మరికొందరు హిందీలో ఈ రకంగా రకరకాల భాషలలో ఆమెను స్తుతిస్తారు. అన్ని భాషలు ఆమెవే.

పరమేశ్వరి మాతృకావర్ణరూపిణి. అకారాది క్షకారాంతము అక్షరాలన్నీ పరమేశ్వరిమయము. భాష అంతా ఈ అక్షరములతోనే ఉంటుంది. బాషలయందు భేదమున్నప్పటికీ వాటి ఉపయోగం ఒక్కటే. పరమేశ్వరికి భాషాభేదం లేదు. అన్ని భాషలరూపము ఆమే. అందుకే భాషారూపా అనబడుతుంది.

## 680. బృహత్సేనా

అపారమైన చతురంగబలములు గలది. సేనాసమూహము గలది. సంకల్పమాత్రం చేతనే సేనలను ఆవిర్భవింపచేయునది.

పరమేశ్వరి వేదమాత. వేదమంత్రాలన్నీ పరివారమై ఆమెను స్తుతి చేస్తాయి. దేవీభాగవతంలో చతుర్వేదాలు రూపుదాల్చి ఆ పరమేశ్వరిని స్తుతిచేస్తున్నాయి. సప్తకోటి మంత్రాలు ఆమెను ఆమ్నాయ దేవతలరూపంలో స్తుతిస్తున్నాయి అని చెప్పబడింది. కాబట్టి పరమేశ్వరి అనంతసేనావాహిని గలది అందుచేత బృహత్సేనా అనబడుతోంది.

## 681. భావాభావవివర్జితా

భావములు అంటే – ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయువులు.

అభావములు అంటే – ప్రాగాభావ, ప్రధ్వంసాభావ, అంత్యతాభావ, అన్యోన్యా భావములు.

వీటిచే వదలిపెట్టబడినది. వీటికన్న వేరైనది. వీటన్నిటిపైన ఉన్నది కాబట్టే ఆమె భావాభావవివర్జితా అనబడుతోంది. అంటే ఈ లోకంలో ప్రియమైనవిగాని, అప్రియమైనవిగాని లేనిది. కేవలము సాక్షి మాత్రమైనది. బావన అంటే – కళ్ళకు కనిపించే ప్రపంచము. అభావన అంటే – ప్రపంచానికి కారణమైన అవ్యాకృతము. అవిద్య. ఈ రెండింటినుంచి విడివడినది.

## 682. సుఖారాధ్యా

ఏ రకమైన నిష్ఠలు, నియమాలు లేక ఆరాధింపదగినది. పరమేశ్వరిని చాలా సులభరీతిలో ఉపాసించవచ్చు అని కూర్మపురాణం చెబుతోంది. అంటే

ఉపవాసాలు మొదలైనవాటి ద్వారా శరీరాన్ని కష్టపెట్టనవసరంలేదు. మడి ఆచారాలు ఏవీలేవు. ఈ రకంగా సుఖంగా సేవించబడేది. మామూలుగా పూజావిధానంలో వాడే పత్రము, పుష్పము, ఫలము, తోయము మొదలైనవన్నీ భావనా మాత్రంచేతనే సమర్పించవచ్చును. వివిధరకాలయిన సంబారాలు అవసరంలేదు. అందుచేత పరమేశ్వరి సుఖారాధ్యా అనబడుతోంది.

## 683. శుభకరీ

శుభములను చేసేది. పుణ్యముచేసేది. అంటే భక్తులకు ఎల్లవేళలయందు కూడా మంచినే చేసేది. సకలశుభాలను, మంగళకరములను చేయునది. అత్యంత శుభకరమైన మోక్షాన్ని ప్రసాదించేది. దేవీభాగవతశ్రవణ ఫలాన్ని వివరిస్తూ.....

**అపుత్రో లభతేపుత్రాన్ అర్థార్థీ అర్థమాప్నుయాత్**
**విద్యార్థీ ప్రాప్నుయాద్విద్యాం కీర్తి మండిత భూతలః ॥**

| | | |
|---|---|---|
| సంతానహీనులకు | – | సంతానం కలుగుతుంది |
| ధనహీనులకు | – | సంపద కలుగుతుంది |
| విద్యార్థులకు | – | విద్య వచ్చి ఎనలేని కీర్త కలుగుతుంది |

ఈ రకంగా పరమేశ్వరిని అర్చించినవారికి విద్య, అర్థము, సంతానము, వివాహము, ఆయుష్షు, ఆరోగ్యము ఎవరికి ఏది కావాలంటే అది లభిస్తుంది. అందుచేతనే ఆమె శుభకరీ అనబడుతుంది.

## 684. శోభనాసులభాగతిః

శుభములనిచ్చే పరమేశ్వరి తన భక్తులచే సులభముగా పొందబడునది. చతుర్విధ పురుషార్థాలు అంటే ధర్మార్థకామమోక్షాలు. వీటన్నింటినీ కూడా తన భక్తులకు సమర్పించేది. తన భక్తుల యొక్క కోరికలు తేలికగా తీర్చేది. ఏ విధమైన శ్రమలేకుండా, అతి తేలికగా ఉపాసింపదగినది. అర్చించినంత మాత్రంచేతనే ఫలితాన్ని ఇచ్చేది.

**ఆశానాం పూరకం చక్రం అర్చకానా మహర్నిశమ్**

సాధకుడు పొందతగిన గతులలో ఈ దేవియే ఉత్తమగతి. అంటే పరమేశ్వరి సాయుజ్యము, ఆమెలో ఐక్యమే ఉత్తమోత్తమమైన గతి. అంతకన్నా ఎక్కువ అనేది లేనేలేదు. మానవులచేతనే కాదు దేవతలచేత కూడా ఆరాధింపబడి తేలికగా పొందదగినది. కరుణామృతమూర్తి.

ఈ నామాన్ని రెండుగా విభజించవచ్చు.

1. శోభన 2. సులభా. అంటే

**1. శోభనాగతిః :** శుభగాన్ని కలుగచేసేది. మంగళకరమైనది. మంగళప్రదమైనది. సర్వమంగళా. భక్తులకు సదా శుభము జరిగేటట్లు చూసేది. శోభనా అనేది గతంలో 463వ నామం. శోభనాసురనాయికా.

అమ్మవారికి 'శోభనా' అనే విశేషణం

1. సుముఖీ నళినీ శోభనా సురనాయకా
2. శోభనా శులభాగతిః
3. సుహాసిన్యర్చనప్రీతా శోభనాశుద్ధ మానసా

ఈ మూడు చోట్ల కూడా ఆ పరమేశ్వరి మంగళప్రదాయని అని చెప్పటం జరిగింది.

**2. సులభాగతిః :** సుఖముగా పొందతగినది. గతంలో ఇదే విషయాన్ని 'సుఖారాధ్యా' అనే చోట వివరించాము.

ఒకే పదాన్ని పదేపదే వాడటంలో విశేషము ఏమంటే ఆ పదానికి ఉన్న లక్షణానికి బలము ఎక్కువ అని చెప్పటం. అంటే పరమేశ్వరి సర్వశుభాలను ఇచ్చేది. అతి సులభంగా ఆమెను ఆరాధించి పొందవచ్చు. ఏ విధమైన నిష్ఠలు నియమాలు అవసరంలేదు. కావలసినదల్లా త్రికరణశుద్ధి, మనసారా ఆమెను ప్రార్థిస్తేచాలు భక్తుని యొక్క కోరికలు అన్నీ తీరినట్లే.

## 685. రాజరాజేశ్వరీ

రాజులు, మహారాజులు, చక్రవర్తులు, యక్షగరుడకిన్నెర కింపురుషులకు దేవతలకు కూడా ఈమె ఈశ్వరి.

మనలను పాలించే వారు – రాజులు

రాజులను శాసించేవారు – రారాజులు చక్రవర్తులు

చక్రవర్తులను పాలించేవారు శాసించేవారు – దేవతలు

అటువంటి దేవతలతో కూడా అర్చించబడేది. వారికి కూడా ఈశ్వరి.

మంత్రాలలో రాజు వంటిది షోడశాక్షరి. అందుకే మహాషోడశిని మంత్రరాజము అన్నారు. అటువంటి మంత్రరాజముచే అర్చించబడునది. రాజులు – యక్షులు.

యక్షులకు రాజు కుబేరుడు. అటువంటి కుబేరునిచేత అర్చించబడునది.

పంచదశి మహామంత్రాన్ని జపించి తరించినవారిలో కుబేరుడు ఒకడు. ఈయన ఉపాసించినది కామరాజమంత్రం.

## 686. రాజ్యదాయినీ

రాజ్యమును ప్రసాదించునది. స్వర్గాధిపత్యము నిచ్చునది.

సృష్టి ఆరంభంలో త్రిమూర్తులను ఆవిర్భవింపచేసి వారికి సృష్టిస్థితిలయాలను అప్పగించింది.

| | | |
|---|---|---|
| బ్రహ్మకు | – | సత్యలోకాధిపత్యము |
| విష్ణువుకు | – | వైకుంఠాధిపత్యము |
| రుద్రునకు | – | కైలాసాధిపత్యము |

| | | |
|---|---|---|
| ఇంద్రునకు | – | స్వర్గాధిపత్యము |
| కుబేరునకు | – | ధనాధిపత్యము |
| అగ్నికి | – | తేజోవతి నగరాన్ని |
| యముడికి | – | సంయమని నగరాన్ని |
| నైరుతికి | – | కృష్ణాంగన నగరాన్ని |
| వరుణుడికి | – | శ్రద్ధావతి నగరాన్ని |
| వాయువుకు | – | గంధవతి నగరాన్ని |
| కుబేరుడికి | – | అలకాపురి నగరాన్ని |
| ఈశానుడికి | – | యశోవతి నగరాన్ని |

సప్తశతిలో సురథుడు అనే రాజు శత్రువులవల్ల సర్వస్వాన్నీ పోగొట్టుకున్నాడు. అలాగే సమాధి అనే వైశ్యుడు భార్యాపుత్రల స్వార్థం వల్ల సంపద అంతా పోగొట్టుకుని అరణ్యాలపాలయ్యాడు. అక్కడ వారికి సుమేధుడు అనే మహర్షి దేవీమాహాత్మ్యాన్ని పూర్తిగా వివరించాడు. దేవీమాహాత్మ్యము ఆసాంతం విన్న వారు కూడా ఋషి సలహామీద కొంతకాలం పరమేశ్వరిని అర్చించారు. అంతట ఆ దేవి ప్రత్యక్షమై 'మీకు ఏంకావాలో కోరుకోండి' అంటుంది. సురథుడు తన రాజ్యం తనకు కావాలి అంటాడు. పరమేశ్వరి అనుగ్రహించింది. సురథుడు మళ్ళీ రాజైనాడు. ఈ రకంగా పరమేశ్వరి తన భక్తులకు వారి అర్హతలను బట్టి రాజ్యాన్ని ప్రసాదిస్తుంది. అంతేకాదు దేవీభాగవతంలో ఒక చిన్నకథ ఉన్నది.

పూర్వకాలంలో హిమాలయప్రాంతంలో చక్రవాకపు పక్షి ఒకటి ఉండేది. అది దేశాల వెంబడి తిరుగుతూ, ఒకనాడు కాశీపట్టణానికి వచ్చింది. ఆ రోజు దానికి ఆహారం దొరకలేదు. ఆహారం కోసం కాశీనగరమంతా తిరిగింది. ఉపయోగంలేదు. చివరకు అన్నపూర్ణాదేవి ఆలయంలో ఏమైనా ఆహారం దొరుకుతుందేమోనని అక్కడికి వెళ్ళింది. ఆలయమంతా మూడుసార్లు కలయదిరిగింది. తనకు తెలియకుండానే మూడు ప్రదక్షిణాలు చేసింది. అపరాహ్నమైనప్పటికీ ఆహారం దొరకక, వెతుకుతూ తనకు తెలియకుండానే పరమేశ్వరికి ప్రదక్షిణాలు చేసింది. అనాలోచితంగా ఉపవాసం కూడా ఉన్నది. కాబట్టి ఆ ఫలం దానికి దక్కింది. తరువాత కొంతకాలానికి అది చచ్చి స్వర్గానికి వెళ్ళి అక్కడ సుఖాలనుభవించి కర్మశేషం అనుభవించటానికి కాశీనగరానికి రాజుగా పుట్టింది.

ఈ రకంగా చేసే కర్మ, అర్చన తక్కువైనా దానికి ఫలితం ఎక్కువగా ఇచ్చేది. రాజ్యాలను ఇచ్చేది ఆ పరమేశ్వరి. అందుకే ఆమె రాజ్యదాయినీ అనబడుతోంది.

## 687. రాజ్యవల్లభా

పైన చెప్పిన రాజ్యములు ప్రియముగా గలది. రాజ్యములకు వల్లభా. అంటే ప్రభివి, రాజు. పరమేశ్వరి చిన్నచిన్న రాజ్యాలకు కాదు. లోకాలకు ప్రభ్వి. అఖిలాండకోటి బ్రహ్మాండాలకు నాయకురాలు. జగత్తంతా ఆమె అధీనంలోనే ఉంటుంది. కాబట్టి, వివిధ శాఖలు చూడటానికి వివిధ వ్యక్తులను నియమించింది. వారే త్రిమూర్తులు దిక్పాలకులు మొదలైనవారు. వీరెవరూ స్వతంత్రులు కారు. వీరంతా పరమేశ్వరి ఆజ్ఞకు బద్ధులు. ఆమె అధికారానికిలోబడి పనిచేసేవారు.

పరమేశ్వరి శ్రీచక్రనాయిక. అంటే శ్రీచక్రానికి రాజరాజు. చక్రవర్తి. సామ్రాజ్ఞి. శ్రీచక్రంలో ఉండే వివిధ ఆవరణలలో ఉండే దేవతలు ఈమెకు లోబడి ఉండే వారే. అందుచేతనే ఈమె రాజ్యవల్లభా అని పిలువబడుతోంది.

## 688. రాజత్కృపా

**రాజంతీ శోభమానా కృపా యస్యాః - సా**

ప్రకాశించు దయగలది. ఎక్కువ దయగలది. అఖిలాండకోటి బ్రహ్మాండనాయిక అయిన ఆ పరమేశ్వరి యొక్క కృపాకటాక్షవీక్షణాలు అపారమైనవి. శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 13వ శ్లోకంలో దేవి యొక్క అపారమైన కృపను వర్ణిస్తూ

**నరం వర్షీయాంసం నయన విరసం నర్మసు జడం**
**తవా పాంగాలోకే పతిత మనుధావంతి శతశః**
**గల ద్వేణీ బంధాః కుచకలశ విస్రస్త నిచయాః**
**హఠాత్కృట్య త్కాంచో విగళిత దుకూలా యువతః ॥**

తల్లీ ! నీ కృపాకటాక్ష వీక్షణాలకు పాత్రుడైనవాడు ముసలివాడైనా, అందవిహీనుడు, అనాకారి అయినా, జడుడైనా, యువతులు అతన్నేవలచి, కొప్పులు వీడగా, మొలనూలు తెగగా, పైటలు జారగా, అతని కోసం పరుగెడతారు. అంటే వంటిమీద ఉన్న బట్టలు కూడా సరిగా చూసుకోకుండా అతడికోసం పరుగెడతారు.

**మూకం కరోతి వాచాలం, పంగుం లంఘయ తేగిరిం**

**యత్కృపాతమహం వందే.......**

ఆ దేవికరుణ గనక ఉంటే మూగవాడు – మాట్లాడతాడు. కుంటివాడు కొండలు, పర్వతాలు కూడా అధిగమించగలుగుతాడు.

## 689. రాజపీఠనివేశితనిజాశ్రితా

రాజులు కూర్చునే సింహాసనములయందు తనను ఆశ్రయించిన వారిని ఉంచునది. పరమేశ్వరి ఎవరినైతే అనుగ్రహిస్తుందో, వారిని బహువిధప్రజ్ఞాశాలిగ చేస్తుంది. సర్వాధికుడుగా చేస్తుంది.

చదువురానివాడు, అక్షరజ్ఞానహీనుడు, అడవిలో గొర్రెలు కాచుకునే కాళిదాసును మహాకవిగా అనుగ్రహించింది. అలాగే సింహాసనాలమీద తన యందు అచంచలమైన భక్తివిశ్వాసాలు గలవారిని అధిష్టింపచేస్తుంది.

దేవేంద్రుడు తారకాసురుడు, మహిషాసురుడు, మొదలైన రాక్షసులచేత పదవీచ్యుతుడై, ఆమెను ప్రార్థించినప్పుడు, అతని మొర ఆలకించి మళ్ళీ ఇంద్రుణ్ణి స్వర్గాధిపతిగా నియమించింది.

దేవీభాగవతంలో రాజ్యం నుంచి గెంటివేయబడిన సుదర్శనుణ్ణి మళ్ళీ రాజును చేసింది.

అయోధ్యానగారానికి రాజు సూర్యవంశస్థుడైన ధృవసంధి. అతని పెద్దభార్య కుమారుడు సుదర్శనుడు. రాజు ఒకరోజు వేటకు వెళ్ళి సింహం చేతిలో హతమవుతాడు.

ధృవసంధి రెండవభార్య తండ్రి అయిన యుధాజిత్తు సుదర్శనుణ్ణి రాజ్యం నుంచి గెంటివేసి, తన మనుమడైన శత్రుజిత్తుకు పట్టాభిషేకం చేస్తాడు.

సుదర్శనుడు తల్లితో సహా భరద్వాజుని ఆశ్రమం చేరి అక్కడ క్లీం బీజాన్ని జపించి తరించాడు. అప్పుడు ఆ దేవి కరుణ వల్ల అతడు కాశీరాజు కుమార్తె శశికళను వివాహమాడి యుధాజిత్తును ఓడించి తన రాజ్యాన్ని దక్కించుకుంటాడు. ఇదంతా పరమేశ్వరి కృపవల్లనే జరిగింది.

ఈ రకంగా అనేకచోట్ల అనేకమంది భక్తులను రాజులుగా నియమించింది.

## 690. రాజ్యలక్ష్మీః

రాజ్యాభిమానము గల లక్ష్మి. రాజ్యముల యొక్క వైభవానికి కారణమైనది. రాజ్యాలన్నీ ఆమె యొక్క అధీనంలోనే ఉంటాయి కాబట్టి సంపన్నురాలు. నిరవధికమైన శ్రేయస్సు గలది.

అష్టలక్ష్ములలో రాజ్యలక్ష్మి ఒకరు.

## 691. కోశనాథా

కోశము - వర, ధనాగారము.

లోకంలోని ధనాగారం మొత్తానికి అధిపతి. పరమేశ్వరి ఉండేది మణిద్వీపంలో, చింతామణి గృహంలో చింతామణులు - చింతలను తీర్చేమణులు. చితి - మృతదేహాన్ని దహించివేస్తుంది. కాగా చింత - మానవశరీరాన్ని దహించి వేస్తుంది. ఈ రెండింటికీ తేడా జాగ్రత్తగా గమనించాలి. చితి - మృతదేహాన్ని దహిస్తే, చింత - బ్రతికి ఉన్న దేహాన్ని దహించివేస్తుంది. అటువంటి చింతలను తీర్చే మణులు - చింతామణులు. అమూల్యమైనవి. లెక్కలేనన్ని ధనరాశులను ఒక్కక్షణంలో ఇవ్వగలవు. దేవీభాగవతంలో

**యస్యా స్తు పార్శ్వభాగేతు నిధీతౌ శంఖపద్మకౌ ।**

**నవరత్నమహానద్య స్తదావై కాంచనస్రవా ॥**

పరమేశ్వరికి రెండువైపులా శంఖపద్మనిధులున్నాయి. నవరత్నాలు, బంగారము కలిసిన నదులు ప్రవహిస్తున్నాయి. అంటే పరమేశ్వరి వద్ద లెక్కలేనంత సంపద ఉన్నది. దాన్ని లోకంలోని తన భక్తుల కోరికలు తీర్చటానికే ఉపయోగిస్తుంది. తన భక్తులు అంటే - అందరూ ఆమె భక్తులే. అన్నీ ఆమె రూపాలే. కృష్ణుడు, శివుడు, విష్ణువు. అంతేకాదు జినుడు, బుద్ధుడు, క్రీస్తు, అల్లా అన్నీ ఆమె రూపాలే. జనులందరూ ఆమె భక్తులే. ఈ రకంగా భక్తకోటికి ఇవ్వటానికే ఆమె వద్ద సంపద ఉన్నది. ఆ సంపదకంతటికీ ఆమె అధికారిణి.

కోశనాథా - కోశములకు అధిపతి. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశాలు. వీటన్నింటికీ ఆధిపత్యం ఆమెదే. ఈ రకంగా ఆమెకోశనాథా అనబడుతుంది.

## 692. చతురంగబలేశ్వరీ

చతురంగబలాలు అంటే – నాలుగువిధాలయిన సైన్యము. అవి 1. రథ, 2. గజ 3. తురగ 4. పదాతిదళాలు. అవి ఆనాటికాలంలో. మరి ఈనాడు త్రివిధసేనలు అంటే – వాయుసేన, నౌకాసేన, పదాతిసేన. వీటన్నింటికీ పరమేశ్వరియే సర్వసేనాని. ఈ సేనఅంతా ఆమెకనుసన్నలలో మెలుగుతుంటుంది. సర్వసైన్యాధిపతి – కుమారస్వామి స్వరూపురాలు.

చతురామ్నాయాలకు ఈమె అధిపతి. అందుచేత చతురంగబలేశ్వరీ అనబడుతోంది.

నాలుగువేదాలకు ఈమె అధిపతి. మాత. అందుచేత చతురంగబలేశ్వరీ అనబడుతోంది. స్థూల సూక్ష్మ కారణ మహాకారణ దేహాలకు ఈమె అధిపతి. అందుచేత చతురంగబలేశ్వరీ అనబడుతోంది.

## 693. సామ్రాజ్యదాయినీ

రాజసూయము చేసినవాడు, మహామండలేశ్వరుడు, రాజాధిరాజు. వీరిని సామ్రాట్టులు అంటారు. వారు పాలించేది సామ్రాజ్యము. అటువంటి సామ్రాజ్యాన్ని ఇచ్చేది దేవి.

రాజులు పాలించేవి రాజ్యాలు. అటువంటి కొన్నిరాజ్యాలు కలిస్తే సామ్రాజ్యము. గతకాలంలో మనదేశం అంతా కూడా అఖండభారతంగా ఉండేది. పాకిస్తాన్, బర్మా, బంగ్లాదేష్, శ్రీలంక ఇవన్నీ మన ప్రాంతాలే. ఈ అఖండవైదిక సామ్రాజ్యాన్ని పాలించినవారే కౌరవపాండవులు. అటువంటి సామ్రాజ్యాన్ని ఇచ్చేది పరమేశ్వరి.

రాజసూయము అనేది – ఒక యాగము ఇది రాజులు తమ పరాక్రమాన్ని నిరూపించుకోవటానికి మాత్రమే చేస్తారు. యాగం చేసేవారు తమ ఆధిపత్యాన్ని అంగీకరించవలసినదిగా ఇతర రాజులకు వర్తమానం పంపుతారు. దానిని అంగీకరించని వారితో యుద్ధంచేసి గెలుస్తారు. ఈ విధంగా రాజులందరినీ గెలిచి, యాగపరిసమాప్తిగా పూర్ణాహుతి చేసి అవబృధస్నానం చేస్తారు. ఈ రకంగా చేసినవారు ఉత్తమోత్తములు. వారి జన్మలు పరమపావనము. కాని ఇందులో నియమాలకు గనక వ్యతిరేకంగా జరిగితే ఈ యాగం చేసినవారు అవమానాలు పొందుతారు. దానికి భారతంలోని పాండవులే ఉదాహరణ. ఈరకంగా అఖండ సామ్రాజ్యాన్నీ ప్రసాదించేది, పరమేశ్వరి. సామ్రాజ్యాలను పాలించిన వారిని చక్రవర్తులు అంటారు. అలాంటి వారు మనదేశంలో ఆరుగురు ఉన్నారు.

**హరిశ్చంద్రో నలో రాజా పురుకుత్సః పురూరవః ।**

**సగరః కార్తవీశ్చ షడేత్తే చక్రవర్తినః ॥**

| | | |
|---|---|---|
| 1. హరిశ్చంద్రుడు | 2. నలుడు | 3. పురుకుత్సవుడు |
| 4. పురూరవుడు | 5. సగరుడు | 6. కార్తవీర్యార్జునుడు |

బ్రహ్మ విద్యయే ఆత్మవిద్య. ఆత్మవిద్యనుపాసించినవారు ఆత్మసామ్రాజ్యానికి అధిపతులు. అటువంటి ఆత్మసామ్రాజ్యాన్ని ప్రసాదించేది పరమేశ్వరి.

## 694. సత్యసంధా

సత్యమందు దాటరాని ప్రతిజ్ఞ గలది. పరమేశ్వరి పరబ్రహ్మ స్వరూపిణి. పరబ్రహ్మమే స్థానముగా గలది నిత్యము సత్యము అయినది. సత్యమైన ప్రతిజ్ఞగలది. తన భక్తులకు ఎప్పుడూ సత్యాన్నే బోధించేది. సత్యము అంటే – పరబ్రహ్మరూపము. ఆ పరబ్రహ్మరూపాన్ని వారికి అందచేసేది.

## 695. సాగరమేఖలా

సముద్రాలే మొలనూలుగా గలది. అంటే విరాట్స్వరూపము. చరాచరజగత్తే ఆమె స్వరూపము.

అదేవిధంగా పరమేశ్వరి సముద్రాలే మొలనూలుగా గలది. విరాడ్రూపిణికి భూలోకము కటిప్రదేశము భూలోకానికి చుట్టూ ఉన్న సముద్రాలే మేఖలా. దేవీభాగవతంలో పరమేశ్వరి విరాడ్రూపాన్ని వర్ణిస్తూ

| | | |
|---|---|---|
| సత్యలోకం | – | శిరస్సు |
| సూర్యచంద్రులు | – | కనులు |
| దిక్కులు | – | చెవులు |
| కడకంటి చూపు | – | సృష్టి |
| లజ్జ | – | పైపెదవి |
| లోభము | – | క్రిందిపెదవి |
| సముద్రాలు | – | కడుపు |

అని చెప్పటం జరిగింది. దీన్ని గతంలో వివరించాం.

## 696. దీక్షితా

జ్ఞానము ఇచ్చునది. దీక్ష తీసుకున్నటువంటివాడు దీక్షితుడు. గురువురూపంలో శిష్యుడికి మంత్రదీక్షనిచ్చి అతడి పాపాలను పోగొడుతుంది కాబట్టి దీక్షితా అనబడింది.

గురువు శిష్యునకు మంత్రోపదేశం చేస్తాడు. దీనినే మంత్రదీక్ష ఇవ్వటం అంటారు. ఈ దీక్ష నాలుగురకాలు.

**1. స్పర్శదీక్ష :** గురువు శిష్యుని తాకినంత మాత్రంచేతనే అతడికి శక్తివస్తుంది.

**2. ధ్యానదీక్ష :** గురువు దూరంగా ఉన్నప్పటికీ శిష్యుని శ్రేయస్సును కోరి ధ్యానం చేస్తుంటాడు. దానివల్ల శిష్యునికి శక్తి వస్తుంది.

**3. దృగ్దీక్ష :** ఇది కంటిచూపుతోనే ఇచ్చే దీక్ష. దీనిలో శిష్యుడు పవిత్రుడు కావాలనే తలంపుతో గురువు తన దృష్టిని సారిస్తాడు.

**4. మంత్రదీక్ష :** గురువు శిష్యునకు ధర్మసూత్రాలు చెప్పి మంత్రదీక్ష ఇచ్చి అతనికి తరుణోపాయం చూపుతాడు.

పరమేశ్వరి కరుణాంతరంగ. గురువురూపంలో శిష్యుడికి అనేకానేక విజ్ఞానదాయక విషయాలు చెప్పి అతడికి దీక్ష ఇచ్చి అతని పాపాన్ని క్షయం చేస్తుంది.

శ్రీవిద్యలో అఖరుది పూర్ణదీక్ష. పూర్ణదీక్షపరులకు, పరమేశ్వరికీ భేదంలేదు. పూర్ణదీక్షాపరుడు అన్ని మంత్రాలమీద అధికారం కలిగిఉంటాడు.

సద్గురువు దగ్గర ఉపదేశం తీసుకుంటే మంత్రం త్వరగా సిద్ధిస్తుంది. అందుకని ముందుగా మంచి గురువును ఎన్నుకుని, అతడిని అన్నివిధాల పరిక్షించి అప్పుడు మాత్రమే అతని దగ్గర తీసుకోవాలి.

లెక్క చెప్పేవాడికి ఆ లెక్కమీద పూర్తి పట్టు ఉంటే, అతను చెప్పిన లెక్క విద్యార్థికి తేలికగా అర్థం అవుతుంది. అలాగే మంత్రోపదేశం చేసేవాడికి మంత్రం మీద పట్టుఉండాలి. అంటే అతడికి మంత్రం సిద్ధించి ఉండాలి. మంత్రార్థం పూర్తిగా తెలిసిఉండాలి. అనుష్టానక్రమం తెలిసి ఉండాలి. అంతేకాని ధనానికో, మరింకెందుకో ఆశపడి మంత్రానిచ్చే వారి దగ్గరమంత్రోపదేశం పొందితే, గురువుకు కావలసినది లభిస్తుంది. అంతేకాని శిష్యుడికి మాత్రం ఏమీరాదు.

శ్రీవిద్యోపాసన చెయ్యాలి అంటే దీక్ష ఎంతో అవరసం. దీక్ష తీసుకోవటంవల్ల అతడి శక్తి పెరుగుతుంది. ఎప్పుడైతే గురువు తన చేతిని శిష్యుడితలపై ఉంచి దీక్షనిచ్చాడో, అప్పుడు గురువులో ఉన్న శక్తి కొంత మేర శిష్యుడిలో ప్రవేశిస్తుంది.

ఈ రకంగా దీక్షనిచ్చి శిష్యుని కృతార్థునిగ చేసేది.

## 697. దైత్యశమనీ

దైత్యులను నాశనము చేసేది. అధర్మపరులే దైత్యులు. వీరు ఎక్కడోలేరు మనలోనే ఉన్నారు. దేవదానవులిద్దరూ ఒక తండ్రి సంతానమే అనే మాట మనం మరిచిపోకూడదు. కశ్యపునికి దితియందు కలిగినవారు దైత్యులు. అదితియందు గలిగినవారు దేవతలు. దనువు నందు గలిగినవారు దానవులు. వీరందరూ శక్తి, యుక్తి, శౌర్యపరాక్రమాలలో సమానమైనవారు. నిష్ఠాగరిష్ఠులు. అయితే దేవతలు ధర్మస్వరూపులు. మిగిలినవారు అధర్ములు. అవైదికులు, అజ్ఞానులు, దేహమే ఆత్మ అని నమ్మేవారు. పూర్వకాలంలో బ్రహ్మదేవుని దగ్గర పరబ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోవటానికి వెళ్ళారు. దేవరాజైన ఇంద్రుడు, రాక్షసరాజు విరోచనుడు. కంటిపాపలో కనిపించేదే ఆత్మ. అని చెప్పాడు బ్రహ్మ. కనుపాపలో కనుపించేది ఈ శరీరమే. కాబట్టి ఈ శరీరమే ఆత్మ అని నమ్మి తన రాజ్యానికి తిరిగి వచ్చేశాడు. విరోచనుడు అదే విషయాన్ని ప్రచారం చేశాడు. ఇంద్రుడు ఆ మాటలు నమ్మక బ్రహ్మ దగ్గర దీక్ష తీసుకుని పరబ్రహ్మతత్త్వాన్ని తెలుసుకున్నాడు. ఈ కథ బృహదారణ్యకంలో ఉంది. దీన్ని గతంలో వివరించాం.

## 698. సర్వలోకవశంకరీ

సమస్త లోకాలనూ వశం చేసుకునేది. చతుర్దశభువనాలలోనూ ఉన్న జీవుల్ని తన ఉపాసకులకు వశం చేస్తుంది. పరమేశ్వరి అనుష్ఠానం చేసిన వారికి సర్వలోకాలు వశమవుతాయి. ఈ విషయం చెబుతూ దుర్వాసుడు శ్రీదేవీ మహిమ్నః స్తుతిలోని 40వ శ్లోకంలో

**ఏవం యః స్మరతి ప్రబుద్ధసుమతిః శ్రీమత్స్వరూపం పరం**
**వృద్ధోఽప్యాశు యువా భవ త్యనుపమః స్త్రీణా మనంగాయతే**
**సోఽప్యైశ్వర్య తిరస్కృతాఖిలసురః శ్రీజృంభితాత్మాలయః**
**పృథ్వీపాలకిరీటకోటివలభీ పుష్పార్చితాంఘ్రి ర్భవేత్ ॥**

ఆ పరమేశ్వరిని ఆరాధించేవాడు ముల్లోకాలను సమ్మోహనం చెయ్యగలుగుతాడు. అష్టైశ్వర్యాలు పొందుతాడు. లోకంలోని పాలకులు, రాజులు, అధికారులు అందరూ కూడా అతని పాదాలకు శిరస్సు వంచి నమస్కరిస్తారు.

కాబట్టి పరమేశ్వరి భక్తులకు సర్వలోకాలు వశమవుతాయి.

## 699. సర్వార్థదాత్రీ

సకల పురుషార్థాలను ఇచ్చేది. ధర్మార్థ కామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాలను అనుగ్రహించేది.

దేవీపురాణంలో

**ధర్మాదీన్ చింతితా నర్థాన్ సర్వలోకేషు యచ్ఛతి**
**అతో దేవీ సమాఖ్యాతా సర్వైః సర్వార్థసాధినీ ॥**

ధర్మాది చింతితార్థములను అన్ని లోకాలకు ఇస్తుంది. కాబట్టి సర్వార్థధాత్రీ అనబడుతుంది అని చెప్పబడింది.

సమస్త వాంఛితములు ఈడేర్చునది. వాంఛితార్థప్రదాయినీ.

## 700. సావిత్రీ

లోకాలను సృష్టించినవాడు పరమశివుడు. అతని భార్య సావిత్రి. ప్రజలను పుట్టించటంచేత సవిత అంటున్నారు. సూర్యుణ్ణి ప్రకాశింపచేస్తుంది. కాబట్టి సావిత్రీ అనబడుతుంది.

**బుద్ధిః కర్మాణి వాఽ స్మాకం యః ప్రేరయతి తస్య తు దేవస్య సవితుః ఖ్యాతమ్**

జీవుల యొక్క బుద్ధిని, కర్మను ప్రేరేపించువాడు సవిత అనబడతాడు.

**సవితా సర్వభూతానాం సర్వభావాన్ ప్రసూయతే**
**సవనా త్పావనా చ్చైవ సవితా తేన చోచ్యతే**

జీవకోటికి సర్వభావాలు కలిగించేవాడవటంచేత సవిత అనబడతాడు.

సవిత అంటే జగత్తులను సృష్టించేవాడు. అతని శక్తి సావిత్రి.

**త్రిదశై రర్చితా దేవీ వేదయోగేషు పూజితా**
**భావశుద్ధిస్వరూపా చ సావిత్రీ తేన సా స్మృతా ॥**

దేవతలచేత పూజింపబడేది. యోగంచేత ఆరాధించబడేది. స్మృతులచే కొనియాడబడేది శుద్ధమైనది సావిత్రి అనబడుతుంది.

**సావిత్రీపుష్కరేనామ్నా తీర్థానాం ప్రవరే శుభా**

పుష్కరతీర్థంలోని దేవతసావిత్రి

## 701. సచ్చిదానందరూపిణీ

సత్ చిత్ ఆనందరూపము గలది. పరబ్రహ్మ స్వరూపిణి.

కాలబాధ్యమైనది కాబట్టి - సత్

జ్ఞానస్వరూపమైనది కాబట్టి - చిత్

నిరతిశయ ఆనందస్వరూపం కాబట్టి - ఆనందము.

ఈ మూడు పరబ్రహ్మ లక్షణాలు. సావిత్రి అనే ఈ దేవత పరబ్రహ్మ స్వరూపిణి అని చెబుతున్నారు.

ఆమెను అర్చించిన వారికి పరమసుఖాన్నిస్తుంది అంటూ సావిత్రీవిద్యను వివరించారు.




శ్రీ 'జ'కార దేవి

# 44. సరస్వతీవిద్య

**సరస్వతి ! నమస్తుభ్యం వరదే కామ రూపిణి !**
**విద్యారంభం కరిష్యామి సిద్ధి ర్భవతు మే సదా ॥**

పరమేశ్వరి జగత్తును సృష్టించేందుకుగాను దుర్గ, లక్ష్మి, పార్వతి, సావిత్రి, రాధ అనే పేర్లతో ఐదుభాగాలుగా అయింది. వీరినే పంచశక్తులు అంటారు. సరస్వతిని గురించి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. ఆమెను బ్రహ్మదేవుడు సృష్టించి, తానే వివాహమాడాడు. సరస్వతి సంగీత, సాహిత్యాలకు అధిదేవత. వీణాపాణి.

రాధ ముఖం నుంచి పుట్టిన సరస్వతి చాలా అందగత్తె. ఆమె కృష్ణుని ప్రేమిస్తుంది. కృష్ణుడు “నీకు తగినవాడను నేను కాదు. నా అంశతో విష్ణుమూర్తి ఉన్నాడు. అతణ్ణి వివాహమాడు” అన్నాడు. ఆ ప్రకారమే విష్ణువుకు భార్య అయింది సరస్వతి. ఒకనాడు లక్ష్మి సరస్వతులకు తగవువచ్చి సరస్వతిని భూలోకంలో నదిగా పుట్టమని శపించింది లక్ష్మి. అప్పటినుంచి సరస్వతినదిగా, త్రివేణీ సంగమంలో అంతర్వాహినిగా ఉన్నది.

శరన్నవరాత్రులలో ఏడవరోజు మూలానక్షత్రం. ఆ రోజున సరస్వతీదేవి అలంకారం వేస్తారు. జ్ఞానదేవత ఈమె. ఇచ్ఛాశక్తిగా ఉండే ఈ దేవికి బృహస్పతి, బ్రాహ్మణస్పతి, వాచస్పతి, వాక్పతి అని కూడా పేర్లున్నాయి.

**యా కుందేందు తుషార హార ధవళా యా శుభ్ర వస్త్రాన్వితా**
**యా వీణా వరదండ మండిత కరా యా శ్వేత పద్మాసనా**
**యా బ్రహ్మా చ్యుత శంకర ప్రభృతిభి ర్దేవై స్సదా పూజితా**
**సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా ॥**

సరస్వతి అంటే – అంతటా వ్యాపించినది అని అర్థం. బ్రహ్మలోకంలో బ్రహ్మవర్చస్సు నాశ్రయించినది. నదీ రూపంలో ప్రవహిస్తున్నది. వాగ్దేవత, బ్రాహ్మి, భారతి, వాణి అని కూడా ఈమె పిలువబడుతుంది.

చేతులయందు – 1. అక్షమాల
2 పుస్తకము
3. వీణ ధరించి

హంసవాహనయై శ్వేతవస్త్రాలు ధరించి ఉంటుంది.

**శ్వేత పద్మాసనా దేవీ శ్వేతగంధానులేపనా**

**అర్చితా మునిభిః సర్వైః ఋషిభిః స్తూయతే సదా ॥**

**ఏవం ధ్యాత్వా సదా దేవీం వాంఛితం లభతే నరః**

శ్వేతపద్మంలో కూర్చుని ఉంటుంది. తెల్లని గంధపు పూతపూయబడి, భక్తుల కోరికలు తీరుస్తుంటుంది. ఈ దేవి చేతిలోని

| | | |
|---|---|---|
| 1. అక్షమాల | – | అక్షరమాల. భాషకు, మంత్రశాస్త్రానికీ ప్రతీక. |
| 2. పుస్తకము | – | వేదవేదాంగాలకు, సాహిత్యానికి ప్రతీక |
| 3. వీణ | – | సంగీతానికి ప్రతీక. |

ఈ వీణకు మానవశరీరంలోని ఇడ పింగళ నాడులే తంత్రులు.

ధవళవస్త్రాలు జ్ఞానప్రదాలు

| | | |
|---|---|---|
| శ్వేతపద్మము ఆసనం | – | అజ్ఞానాన్ని తొలగించే బుద్ధి ప్రదాయిని |
| వీణానాదం | – | పరబ్రహ్మోపాసనకు మార్గం. |

అంతర్యాగంలో సాధకుడు భ్రూ మధ్యం నుండి సహస్రారానికి పోయేటప్పుడు కొన్ని ధ్వనులు వినిపిస్తాయి. సాధకుడు షణ్ముఖీముద్రతో చెవులు మూసుకుని జాగ్రత్తగా విన్నట్లైతే మొదటగా 'చిణి' అని వినిపిస్తుంది. తరువాత ఆ శబ్దము పెరిగి "చిణిచిణి" అని ఘోష పెడుతుంది. తరువాత అది ఘంటానాదమవుతుంది. ఘంటానాదం క్రమంగా విజృంభించి శంఖనాదంగా మారుతుంది. అది అతి మనోహరంగా మారి వీణానాదం అవుతుంది. అది క్రమంగా నిర్మలమైన వేణునాదమవుతుంది. ఆ తరువాత అరిషడ్వర్గాలను జయించిన సూచకంగా భేరీనాదంగా మారుతుంది. తరువాత విజయోత్సవ చిహ్నంగా మృదంగనాదం అవుతుంది. తరువాత వర్షపాతం జరుగుతున్నట్లు మేఘనాదం వినిపిస్తుంది. ఇది పరబ్రహ్మోపాసనలో రాజయోగం అని చెప్పబడుతుంది. ఉపాసనాక్రమంలో కూడా సరస్వతీదేవిని ఆరాధించటం జరుగుతుంది.

సరస్వతీదేవి చేతిలోని వీణపేరు కచ్ఛపి. ఆమె తన వీణను సృతిచేసి పరమేశ్వరి ఎదుట పరమశివుని వీరగాధలు గానము చేస్తున్నది ఆమె వీణానాదానికి మెచ్చుకోలుగా పరమేశ్వరి మాటలాడగా, ఆమె వాక్కు, తన వీణానాదం కన్న మధురంగా ఉన్నదని తెలిసి, సరస్వతీదేవి తన వీణ కనపడకుండా కప్పివేసింది. శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 66వ శ్లోకంలో ఈ విషయాన్ని వివరించారు.

**విపంచ్యా గాయంతీ వివిధమపదానం పశుపతే**
**స్త్వయారబ్ధే వక్తుం చలితశిరసా సాధువచనే !**
**తదీయై ర్మాధుర్యై రపలపితతంత్రీకలరవాం**
**నిజాం వీణాం వాణీ నిచుళయతి చోళేన నిభృతమ్ ॥**

అజ్ఞానాంధకారాన్ని తొలగించి జ్ఞానజ్యోతులు వెలిగిస్తుంది. అష్టైశ్వర్యాలను అనుగ్రహించి భక్తుల కోరికలు తీరుస్తుంది.

**యః స్ఫటికాక్షగుణ పుస్తక కుండికాఢ్యాం**
**వ్యాఖ్యా సముద్యతకరాం శరదిందుశుభ్రాం**
**పద్మాసనాం చ హృదయే భవతీముపాసే**
**మాతః స విశ్వకవితాం కిం చక్రవర్తీ ॥**

చేతలయందు పుస్తకము, అక్షమాల, కమండలము ధరించి, పద్మాసనాసీనయై, శరత్కాల చంద్రబింబమువలె ప్రకాశించే దేవిని ధ్యానించే వారికి ప్రపంచాన్ని సమ్మోహనం చేయగల కవిత్వం సిద్ధిస్తుంది.

కాశ్మీరులో ఉన్నది శారదా పీఠం దీనిని అధిరోహించినవాడు జగద్గురువు అనబడతాడు. ఈ పీఠంలో ఎనిమిదిమంది దిగ్గజాల వంటి పండితులుంటారు. వారందర్నీ ఓడించి ఈ పీఠాన్ని అధిరోహించి జగద్గురువైనవారు శంకరాచార్యులు ఒక్కరే. ఆంధ్ర రాష్ట్రంలో ఆదిలాబాదుజిల్లాలోని, మధోల్ మండలంలోని బాసరలో సరస్వతీదేవాలయం ఉన్నది.

702 నుంచి 727 నామాలవరకు సరస్వతీవిద్యను వివరించటం జరిగింది.

ఆమె దేశకాలమానాలకు అతీతమైనది. సర్వవ్యాపి. సర్వులను వశంచేస్తుంది. సర్వశాస్త్రాలరూపం ఆమె. హృదయపద్మంలోని దహరాకాశంలో రహస్యంగా సేవించ బడుతుంది. ఆమె పరమపతివ్రత. సాధ్వి. ఆమె శ్రీవిద్యకు గురువు ఇంద్రియాలకు అతీతమైనది. మణిపూరం దగ్గరనుండి సూర్యమండలంలో ఆరాధించబడే మాయా స్వరూపిణి. మాతృకాగణాలకు తల్లి. బ్రహ్మాదిదేవతలచే ఆరాధింపబడేది. ఆమె స్వతంత్రమైనది. అన్ని తంత్రాలను భక్తులకు ఇచ్చింది. జ్ఞానమూర్తి అయిన దక్షిణామూర్తి రూపిణి. సనకాదిసిద్ధులచే పూజింపబడుతుంది. ఆమెను అర్చిస్తే ఆత్మజ్ఞానం లభిస్తుంది.

## 702. దేశకాలపరిచ్ఛిన్నా

దేశముచేతగాని, కాలముచేతగాని కొలవబడినదికాదు. హద్దులులేనిది. ఎల్లలులేనిది. కాలము లేనిది. అంటే ఇంతకాలము ఉంటుంది అని కొలతలేనిది. లోకంలో ప్రతివారికీ ఆయుఃప్రమాణమున్నది. మానవుడి ఆయువు వందసంవత్సరాలు. బ్రహ్మ ఆయువు ఒక కల్పం. అయితే పరబ్రహ్మకు మాత్రం ఆయువులేదు. త్రిమూర్తులను కూడా నియమించింది ఆమెయే. సృష్టికి ప్రారంభమందున్నది ఆమె. మహాప్రళయం తరువాత ఉన్నది కూడా ఆమె. కాబట్టి పరబ్రహ్మ నిత్యము సత్యము అయినది. శాశ్వతమైనది. చావుపుట్టుకలు లేనటువంటిది. యుగాలు మారినా, జగాలుమారినా, కల్పాలుమారినా ఆ పరబ్రహ్మ మాత్రం అలానే ఉంటుంది. అందుచేతనే దేశకాలములచే దానికి అపరిచ్ఛేదములేదు. అతడు ఎప్పటినుంచీ ఉన్నాడో తెలియదు. సౌరసంహితలో ఆకాశము వలె సర్వవ్యాపియైన పురుషునకు మించినది ఆ సత్యము. అది దేశకాలములకు అతీతమైనది అనంతమైనది.

కఠోపనిషత్తులో చెప్పినట్లుగా "అనిత్యమైన శరీరాల మధ్యన శరీరంలేనిదిగా, అశాశ్వతమైన వాటి మధ్య శాశ్వతమైనదిగా ఉంటుంది. ఆత్మ నిత్యము, సత్యము, సర్వవ్యాపకమైనది".

పంచభూతాలలో భూమిలో ఉన్నది. లేదా వాయువులోనే ఉన్నది. ఆకాశంలో మాత్రమే ఉన్నది అని చెప్పటానికి వీలులేదు. ఆత్మ సర్వత్రా వ్యాపించి ఉన్నది. అందుచేత దేశాపరిచ్ఛిన్నములేదు. ఇప్పుడు లేదు. గతంలో లేదు. ముందు రాబోయేకాలంలో ఉండబోదు అని చెప్పటానికి లేదు. సృష్టికి ముందూ ఉన్నది. లయం తరువాతా ఉంటుంది. కాబట్టి కాల అపరిచ్ఛేదం కూడా లేదు.

దేశకాలాలకు ముందు నుంచీ ఉన్నది. అసలు వీటన్నింటికీ కారణమైనది ఆత్మే అదే పరమేశ్వరి. పరబ్రహ్మ స్వరూపము. తాను తప్ప మిగిలినదంతా మాయ. అందుచేత ఆమె దేశకాలపరిచ్ఛిన్నా అనబడుతోంది.

## 703. సర్వగా

పరమేశ్వరికి దేశము, కాలము వంటి హద్దులులేవు. కాబట్టి ఆమె సర్వాంతర్యామి. వరాహపురాణంలో సృష్టి చెయ్యాలనే సంకల్పంతో పరమేశ్వరి శ్వేతపర్వతం మీద బ్రాహ్మీరూపంలో తపస్సు చేస్తోంది. అప్పుడు బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై ఏ వరం కావాలి అని అడిగాడు. దానికి ఆమె ! ఓ దేవా ! నేను ఒకచోట ఉండకుండా సర్వాంతర్యామిగా

ఉండేటట్లుగా నాకు వరమివ్వవలసినది అన్నది. దానికి బ్రహ్మ "ఓ సర్వరూపా ! నువ్వు అన్నింటినీ పొందదగిన దానవు కాగలవు" అన్నాడు. అదే విషయాన్ని ఇక్కడ సర్వగా అని చెప్పారు. దేవీగీతలో

**సర్వం దృశ్యం మమ స్థానం సర్వే కాలా ప్రతాత్మకాః ।**
**ఉత్సవా సర్వకాలేషు యతోఽహం సర్వరూపిణీ ॥**

అన్నింటికీ అధిష్ఠానము నేనే. దేశకాలవస్తువులన్నీ నేనే. కాలములన్నింటి యందు నేనే ఉన్నాను. దేశములన్నింటి యందు నేనే ఉన్నాను. ఇంద్రియాలకు అనుభవము నా వల్లనే వస్తున్నది అని చెప్పబడింది.

దేవీపురాణంలో దేవియే వేదము, దేవియే యజ్ఞము, దేవియే స్వర్గము, చరాచర జగత్తంతా ఆమె చేతనే వ్యాపించబడిఉన్నది. లోకంలో అన్నపానీయాలు ఆమె స్వరూపమే పశువులు, పక్షులు, చెట్లు, చేమలు, కొండలు, బండలు అన్నీ ఆమె స్వరూపమే కాబట్టి ఆమె సర్వాంతర్యామి సర్వగా అనబడుతోంది.

ఉపనిషత్తులు కూడా ఈ విషయాన్నే ప్రతిపాదిస్తున్నాయి. ఛాందోగ్యోపనిషత్తులో

సత్యకామజాబాలికి పరబ్రహ్మస్వరూపాన్ని గురించి వివరించి చెప్పటం జరిగింది.

ఈ విశాలమైన ప్రపంచంలో నాలుగుదిక్కులూ బ్రహ్మతత్త్వంలో ఒక భాగం. భూమి, ఆకాశం, సముద్రాలు, పర్వతాలు, నదులు అన్నీ రెండవభాగం అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు అన్నీ పరబ్రహ్మలో మూడవభాగం. ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రవణం బ్రహ్మ, మనస్సు బ్రహ్మ ఇది నాల్గవభాగం.

ఉపకోశలుడికి అగ్నులు బ్రహ్మతత్త్వాన్ని వివరిస్తాయి. భూమి, సూర్యుడు, చంద్రుడు, ఆకాశం అన్నీ పరబ్రహ్మ యొక్క రూపాంతరాలే. సూర్యునిలో ఉన్న బ్రహ్మతత్త్వం, నాలో ఉన్న బ్రహ్మతత్త్వం ఒకటే. నాలుగుదిక్కులు, నక్షత్రాలు, నేల, నీరు, నింగి వీటిలో ఉన్న బ్రహ్మతత్త్వము, నాలో ఉన్న బ్రహ్మతత్త్వము ఒకటే. ఆకాశంలోని మెరుపులో ఏ తత్త్వమైతే ఉన్నదో, అదే నాలోనూ ఉన్నది. అదే చరాచరజగత్తంతా వ్యాపించి ఉన్నది. అదే బ్రహ్మతత్త్వము.

ఉద్దాలకుని కుమారుడు శ్వేతకేతువు. విద్యాభ్యాసం పూర్తిచేసి బ్రహ్మవిద్యను ఉపదేశం చెయ్యమని తండ్రిని అడిగాడు. తండ్రి అయిన ఉద్దాలకుడు చెబుతున్నాడు నాయనా శ్వేతకేతూ ! ఒక మర్రిపండును తీసుకునిరా అన్నాడు ఉద్దాలకుడు. మర్రిపండు తెచ్చాడు శ్వేతకేతు 'దాన్ని పగులగొట్టు' అన్నాడు తండ్రి.

పగులకొట్టాడు కుమారుడు 'అక్కడ ఏం కనిపిస్తోంది ?' అడిగాడు తండ్రి. 'చిన్నచిన్న గింజలు కనిపిస్తున్నాయి' అన్నాడు శ్వేతకేతు 'ఒక గింజను తీసి పగులకొట్టు' గింజలు పగులకొట్టాడు శ్వేతకేతు.

'ఏముందక్కడ ?' ప్రశ్నించాడు ఉద్దాలకుడు.

'ఏమీ కనిపించటంలేదు' అన్నాడు కుమారుడు.

'ఇంత పెద్ద మర్రిచెట్టు శూన్యంలో నుంచిరాదుకదా ? ఆ గింజలో ఏమీలేదని చెప్పావు. కాని అందులో ఇంత పెద్దమ్రాను, కొమ్మలు, రెమ్మలతో ఉన్న ఈ చెట్టుకు కారణమై, నీకు కనిపించని జీవపదార్థమున్నది. అదేవిధంగా, బయటకు కనిపించకుండా సూక్ష్మాతిసూక్ష్మంగా ఉన్న ఆత్మ సర్వత్రా వ్యాపించి ఉన్నది. అన్నింటికీ ఆధారమైనది, ఉండి కూడా మనకు కనిపించదు. నీకు ఒక్క విషయం చెబుతాను విను. కాస్త ఉప్పు తీసుకుని ఒక గ్లాసు నీటిలో కలుపు. రేపు ఉదయం రా' అన్నాడు ఉద్దాలకుడు. తండ్రి చెప్పిన ప్రకారం నీళ్ళలో ఉప్పుకలిపి మర్నాడు వచ్చాడు శ్వేతకేతు. అప్పుడు ఉద్దాలకుడు. "శ్వేతకేతూ ! నిన్న నీళ్ళలో కలిపిన ఉప్పును తీసుకుని రా! " అన్నాడు. ఆ ఉప్పునీటిలో బాగా కలిసిపోయింది. దాన్ని విడదీయటం సాధ్యంకాదు. ఆ మాటే చెప్పాడు శ్వేతకేతు.

'అయితే సరే ! ఆ నీళ్ళు ఒకసారి రుచిచూడు' అన్నాడు తండ్రి. 'నీళ్ళు చాలా ఉప్పుగా ఉన్నాయి' అన్నాడు కుమారుడు. 'కుమారా ! నీళ్ళలో ఉప్పు కలిసిపోయినట్లే ఆత్మ అన్ని వస్తువులలోనూ కలిసిపోయి ఉంటుంది. అది సర్వాంతర్యామి' అన్నాడు ఉద్దాలకుడు.

ఈ రకంగా పరమేశ్వరుడు సర్వవ్యాపి. చరాచరజగత్తంతా ఆవరించి ఉన్నాడు. పరమేశ్వరుడు, పరమేశ్వరి ఇద్దరూ ఒకటే. కాబట్టే ఆమె సర్వగా అని చెప్పబడుతోంది.

## 704. సర్వమోహినీ

సర్వులను మోహింపచేయునది. ద్వైతబుద్ధి కలవారిని మోహింపచేస్తుంది. అద్వైతులు జ్ఞానులు. జీవాత్మ, పరమాత్మ రెండూ ఒకటే అని నమ్మేవారు. ద్వైతులు జీవుడు వేరు, దేవుడు వేరు అని నమ్మేవారు. ఈ ద్వైతులను మోహింపచేస్తుంది. కూర్మపురాణంలో ఈ పరాశక్తి నా రూపము గలది. బ్రహ్మరూపిణి. ఆమె మాయ. ఈ జగమంతా ఆమెచే మోహితమవుతున్నది అని చెప్పబడింది.

64 తంత్రాల ద్వారా లోకంలో ఐహికవాదులనందరనీ మోహింపచేస్తున్నది. శుద్ధబ్రహ్మను ఆవరించి ఉన్న మాయయే నిజమని నమ్మేవారిని మోహింపచేస్తుంది. జగత్తంతా మాయామయమని తెలిసినవారు జ్ఞానులు. వారికి సాయుజ్యం లభిస్తుంది.

దేవతలు, రాక్షసులు క్షీరసాగరమధనం చేసినప్పుడు అమృతం పుట్టింది. ఆ అమృతం కోసం దేవతలు రాక్షసులు తగవులాడుకుంటుండగా మోహిని వచ్చి రాక్షసులనందరినీ సమ్మోహనంచేసి అమృతాన్ని దేవతలకు పంచింది. ఈ రకంగా అజ్ఞానులను, ఆత్మజ్ఞానం లేనివారిని సర్వులను మోహింపచేస్తుంది. కాబట్టి సర్వమోహినీ అని చెప్పబడింది.

## 705. సరస్వతీ

సరస్వతి జ్ఞానాధిష్ఠానదేవి. జ్ఞానముద్రాస్వరూపిణి. పరమేశ్వరి లోకాలను సృష్టించటం కోసం పంచశక్తులను సృష్టించింది అని గతంలో చెప్పాం. వారిలో సావిత్రియే సరస్వతి.

సర్వమోహినీ అంటే – అందరికీ భ్రమ కలిగించేది అని గతంలో వివరించారు. ఇప్పుడు జ్ఞానాన్ని ఇచ్చే సరస్వతిని చెబుతున్నారు. ఈమె విద్యాదేవత. జ్ఞానస్వరూపురాలు. ద్వైతభావన నశింపచేసి బ్రహ్మజ్ఞానాన్ని కలిగిస్తుంది.

జ్ఞానమనేది అజ్ఞానంతో ఆవరించబడి ఉంటుంది. దీనితో జీవులన్నీ భ్రమిస్తాయి. ఆ అజ్ఞానం ఛేదించబడితే జ్ఞానసముపార్జన కలుగుతుంది. అదే ముక్తి.

మత్స్యపురాణంలో సృష్టి చెయ్యాలని బ్రహ్మ తపస్సు చేసినప్పుడు అతని శరీరం నుంచి 10 మంది కుమారులు, 10 మంది కుమార్తెలు ఉద్భవించారు. వారిలో ఆఖరుది శతరూప. ఆమె సరస్వతి అని చెప్పబడింది.

బ్రహ్మవైవర్త పురాణంలో సృష్టి కోసం రాధ తన నాలిక నుండి ఒక కన్యను ప్రసవించింది. ఆమె సరస్వతి అని చెప్పబడింది.

ఋగ్వేదంలో ఇంద్రునికి, శంబరాసురునికి యుద్ధం జరుగుతుంది. ఇంద్రుడు కోటలోని రహస్యాలను చెప్పమని వాణిని ప్రార్థిస్తాడు. అప్పుడు సరస్వతి శంబరుని కోటలో చిక్కుకుంటుంది. అందుచేత ఆమె తన పూర్వపు ఔన్నత్యం కోల్పోయింది. ఈ కారణంగానే శుద్ధవైదికమైన సంస్కృతం ప్రాకృతంగా మారిపోయింది అని చెప్పబడింది.

ఐం అనేది వాగ్బీజము. దీనిని జపించినవారు సర్వశాస్త్ర పండితులౌతారు. దేవీభాగవతంలో....

పూర్వకాలంలో కోసలదేశంలో దేవదత్తుడనే బ్రాహ్మణుడుండేవాడు. అతడికి సంతానం లేదు. అందుచేత పుత్రకామేష్ఠి చెయ్యాలనుకుని తమసానదీ తీరాన యాగం ఆరంభించాడు. ఆ యాగానికి

| | | |
|---|---|---|
| వేదవేదాంగవిదుడైన సుహోత్రుడు | – | బ్రహ్మ |
| యాజ్ఞవల్క్యుడు | – | ఆధ్వర్యుడు |
| బృహస్పతి | – | హోత |
| గోబిలుడు | – | ఉద్గాత |

యాగం ఆరంభమైంది. గోబిలుడు సామవేదాన్ని గానం చేస్తున్నాడు. దేవతలు కూడా ఆ గానానికి ముగ్ధులవుతున్నారు. కాని మధ్యలో చిన్న పొరపాటు జరిగింది. ఊపిరి పట్టటంవల్ల గోబిలుడికి స్వరం తప్పింది దాంతో కోపించిన దేవదత్తుడు గోబిలుని మూర్ఖుడా ! అని సంబోధించాడు. దానికి కోపించి గోబిలుడు "నీకు మూర్ఖుడైన కుమారుడే కలుగుతాడు" అని చెప్పి వెళ్ళిపోయినాడు.

యజ్ఞం పూర్తయింది. దేవదత్తుని భార్య గర్భవతి అయింది. పండంటి మగబిడ్డను ప్రసవించింది. ఏళ్ళు గడిచినాయి. బాలుడికి విద్యరాలేదు. పిల్లలు అందరూ ఎగతాళి చేస్తున్నారు. అది భరించలేక అడవికి వెళ్ళిపోయాయి. అక్కడ తపస్సు చెయ్యటం ప్రారంభించాడు బాలుడు.

అడవిలో ఒక వేటగాడు పందిని కొట్టి దాని వెంట పరుగెడుతున్నాడు. అది అరుస్తూపోయి ఈ బాలుడి (ఉతద్యుని) ఆశ్రమం ప్రక్క నుంచి పారిపోయింది.

పంది అరిచిన అరుపు ఐం వాగ్బీజంగా వినిపించింది బాలుడికి. దాంతో అతడు 'ఐం' బీజోపాసన మొదలుపెట్టాడు. పార్వతీ పరమేశ్వరులు అతడి దీక్షకు మెచ్చి అతణ్ణి సర్వశాస్త్ర పండితునిగా అనుగ్రహించారు. కాబట్టి ఆ దేవిని అర్చిస్తే పాండిత్యం అబ్బుతుంది. వేదవేదాంగాలు ఉపనిషత్తులు సర్వశాస్త్రాలు, సంగీతము, సాహిత్యము అబ్బుతాయి.

ఈ దేవిని అర్చించటానికి జాజులు, మల్లెలు, మొల్లలు, పొగడలు, తామర, మందార, మొగలి, నల్లకలువపూలను, ఆ ఋతువులలో పూచే పూలను మాత్రమే వాడాలి. అని శారదా తిలకం చెబుతోంది.

ఎర్రకలువలు, పలాశ, బిల్వపుష్పాలను తేనెతో కలిపి హవనం చేస్తే మహామేధావి అవుతాడు. బృహస్పతితో సమానమైన వాడవుతాడు. అని తంత్ర గ్రంథాలలో చెప్పబడింది.

అయితే మలినమైనవి, వాడిపోయినవి, నేలమీదపడినవి, సగము విరిగినవి, పురుగులున్నవి, ఎలుకలు కొరికినవి, వెంట్రుకలతో కలసినవి, దొంగిలించిన పుష్పాలు పూజకు వాడరాదు. మధ్యాహ్నం తరువాత పూలను కోయరాదు. అని శారదాతిలకంలో చెప్పబడింది. ఈమె చదువులతల్లి.

ఈ దేవత బ్రహ్మస్వరూపిణి. బ్రహ్మను గురించి చెప్పే గ్రంథాలన్నీ కూడా సరస్వతీ రూపంలోనే పూజింపబడతాయి. ఋగ్వేదంలో సరస్వతీ సూక్తము ఉన్నది. అలాగే సరస్వతీ దేవి దశశ్లోక మహామంత్రాలున్నాయి. ఇవన్నీ ఋగ్వేదంలో ఉన్నాయి.

**వీణాధరే ! విపులమంగళదానశీలే !**
**భక్తార్తినాశినివిరించిహరీశవంద్యే !**
**కీర్తిప్రదేఽ ఖిల మనోరథదే ! మహార్హే !**
**విద్యాప్రదాయిని ! సరస్వతి ! నౌమి నిత్యమ్ ॥**

## 706. శాస్త్రమయీ

సరస్వతీదేవియే శాస్త్రము. ఆ దేవిని గురించి తెలుసుకోవాలి అంటే శాస్త్రాలే మనకు ఆధారము. గ్రంథకర్తను గురించి తెలుసుకోవాలంటే గ్రంథాలు ఆధారం. అలాగే సరస్వతిని గురించి తెలుసుకోవాలంటే శాస్త్రాలు ఆధారం.

శ్రుతులు, స్మృతులు, శాస్త్రాలు అన్నీ వర్ణమయాలు. పరమేశ్వరి మాతృకావర్ణరూపిణి. కాబట్టి చతుర్వేదాలు.

| | | | | |
|---|---|---|---|---|
| 1. శిక్ష | 3. ఛందస్సు | 5. జ్యోతిషము | 7. మీమాంస | 9. పురాణము |
| 2. వ్యాకరణము | 4. నిరుక్తము | 6. కల్పము | 8. న్యాయము | 10. ధర్మశాస్త్రము |

ఇవన్నీ సరస్వతీ స్వరూపమే. అన్ని శాస్త్రాలలోనూ పరబ్రహ్మతత్త్వాన్నే వివరించటం జరుగుతుంది. కాబట్టి సరస్వతీదేవి శాస్త్రమయి అనబడుతోంది.

ఏదైనా ఒక విషయం నిర్ధారణ చెయ్యాలంటే అది శాస్త్రాల ఆధారంగానే జరుగుతుంది. ఆ శాస్త్రాలన్నీ సరస్వతిరూపాలే. అందుకే బ్రహ్మపురాణంలో పరమేశ్వరి శరీరఅవయవాలే శాస్త్రాలు. ఆమె ఉచ్ఛ్వాస నిఃశ్వాసలే వేదాలు. పరమేశ్వరి యొక్క

| | | |
|---|---|---|
| అభిమానంతో | – | మహామంత్రాలు |
| మధురాలాపనతో | – | కావ్యాలు, నాటకాలు, అలంకారాలు |

| | | |
|---|---|---|
| జిహ్వా నుంచి | - | సరస్వతి |
| చుబుకమునుంచి | - | వేదాంగాలు |
| కంఠం ఊర్ధ్వరేఖ నుంచి | - | మీమాంస, న్యాయశాస్త్రము |
| కంఠం మధ్యరేఖ నుంచి | - | ఆయుర్వేదము |
| కంఠం మొదటి రేఖ నుంచి | - | చతుష్షష్టితంత్రాలు |
| బాహువుల నుంచి | - | కామశాస్త్రము |

ఈ రకంగా అన్ని శాస్త్రాలు పరమేశ్వరి నుంచే ఆవిర్భవించాయి. కాబట్టి ఆమె శాస్త్రమయీ అనబడుతోంది.

## 707. గుహాంబా

గుహలో ఛాయారూపముగా నుండు తల్లి. హృదయము అనే గుహలో ఛాయా రూపంతో ఉండేది. స్థూలసూక్ష్మకారణ శరీరాదులుకానిది. పంచకోశాలకు లోపలిదైనది గుహ అనబడుతుంది. హృదయస్థానంలో దహరాకాశంలో ఉండే గుహ యందు ఉంటుంది. ఇక్కడ జీవాత్మరూపంలో ఉంటుంది. అందుకే గుహాంబా అనబడుతుంది.

గుహుడు – కుమారస్వామి. అతని తల్లి తారకాసుర సంహారం కోసం పరమేశ్వరి అంశ పార్వతిగ హిమవంతుని ఇంట జన్మించింది. ఆమె శివుణ్ణి వివాహమాడింది. శివపార్వతులకు పుట్టినవాడే కుమారస్వామి. అతడే స్కందుడు. కుమారుని పోషించటానికి అగ్నినుంచి

| | | |
|---|---|---|
| 1. స్కంద | 4. రేవతి | 7. శతపూతనా |
| 2. స్కందాపస్మార | 5. పూతనా | 8. ముఖకుండికా |
| 3. శకున | 6. అంధపూతనా | 9. నైగమేయ |

అనబడే తొమ్మిదిమంది దాదులను సృష్టించింది. కుమారస్వామిని వీరే పెంచి పెద్ద చేశారు. కుమారుడు పెద్దవాడైన తరువాత ఇంక మా పని ఏమిటి అని వీళ్ళు పరమేశ్వరిని అడగగా దేవపూజలు, పితృపూజలు జరగని ఇళ్ళలో శిశుపీడాకారులుగా ఉండండి అని దేవి వీరిని ఆదేశించింది. వీరే బాలగ్రహాలు. వీరంతా కుమారస్వామికి తల్లలాంటివారు. అందుచేత గుహాంబా అనబడుతోంది.

## 708. గుహ్యరూపిణీ

రహస్యమైనది. జ్ఞానరూపిణి, సూతసంహితలో

**గురుమూర్తిధరాం గుహ్యం గుహ్యవిజ్ఞాన రూపిణీం ।**
**గుహ్యభక్తజనప్రీతాం గుహాయాం నిహితం నమః ॥**

గురుమూర్తి అయిన దానిని, రహస్యమైనదానిని, రహస్యజ్ఞానస్వరూపిణిని, రహస్యభక్తులకు ప్రీతి గలిగించు దానిని గుహ యందుండే దేవికి నమస్కరిస్తున్నాను.

బ్రహ్మ ఒక్కడే అయినా రెండు రూపాలు పొందుతున్నాడు. అయితే ఈ ద్వైతం ఎక్కువకాలం సాగదు. అది నిజమని కొంతకాలమే అనిపిస్తుంది. అద్వైతమే నిత్యము. ఇది పరమరహస్యమైనది. సామాన్యుడికి అర్థం కాదు.

**సర్వోపనిషదాం దేవీ గుహ్యోపనిష దుచ్యసే**

అన్ని ఉపనిషత్తులలోకి ఆ పరమేశ్వరి గుహ్యోపనిషత్తు.

పరమేశ్వరి దహరాకాశరూపంలో ఉంటుంది. కాబట్టి గుహ్యరూపిణీ అనబడుతుంది.

## 709. సర్వోపాధివినిర్ముక్తా

ఏ రకమైన ఉపాదులు లేనట్టిది. అద్వైతమూర్తి. పరబ్రహ్మ స్వరూపిణి. కేవలము నిరాకారమైనది. చిన్మయ స్వరూపము. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే. కాని అవిద్యతో భేదము ఉన్నట్లుగా కనిపిస్తుంది. ఉపనిషత్తులలో చెప్పినట్లుగా ఒకే కొమ్మ మీద ఒకే రూపం గల రెండు పక్షులు కూర్చుని ఉన్నాయి. వాటిలో ఒకటేమో కర్మఫలాలను అనుభవిస్తోంది. రెండవది ప్రశాంతంగా కూర్చుని ఉన్నది. అవే జీవాత్మ పరమాత్మలు. వాటిలో జీవాత్మ కర్మఫలాలనుభవిస్తున్నది. ఆ రెండూ ఒక్కటే. తేడా లేదు. అయితే అవిద్య చేత రెండింటికీ భేదం ఉన్నది అనుకుంటోంది జీవాత్మ. అవిద్య తొలగిపోగానే తానే పరమాత్మ స్వరూపాన్ని అని తెలుసుకుంటుంది. పరబ్రహ్మలో లీనమయిపోతుంది.

పరమేశ్వరికి ఏరకమైన ఉపాధిలేదు. కాబట్టి సర్వోపాధివినిర్ముక్తా అనబడింది.

ఆత్మకి గుణాలతో సంబంధంలేదు. అది నిరాకారము, నిర్గుణము. స్పటికమువలె స్వచ్ఛంగా తెల్లగా ఉంటుంది. అయినప్పటికీ ప్రక్కన ఉన్న వస్తువుల నీడ అందులో ప్రతిఫలించి రంగులుగా కనిపిస్తుంది. అంతే. ఆ వస్తువులు లేకపోతే అది అత్యంత స్వచ్ఛంగా ఉంటుంది. అలాగే పరమేశ్వరి కూడా.

## 710. సదాశివపతివ్రతా

ఎల్లకాలములందు శివుడే భర్తగా గలది. భూతభవిష్యద్వర్తమానాలలో కూడా శివుని భర్తగా పొందినది. భర్తతో అవినాభావసంబంధం కలిగి ఉండటం పాతివ్రత్యమునకు గుర్తు. పరమేశ్వరికి సదాశివునిలో గల అన్ని విభూతులు, ధర్మాలు ఉన్నాయి. అన్నివిధాల సదాశివునితో సమానమైనది. పరమేశ్వరుడు చేసే పంచకృత్యాలయందు భాగస్వామిని. ఒకే నాణానికి పరమేశ్వరుడు బొరుసు కాగా పరమేశ్వరి బొమ్మ. వారిది విడదీయలేని అనుబంధం. శివుడు లేకుండా శక్తిలేదు. అలాగే శక్తిలేకుండా శివుడులేదు. అందుచేత ఆమె సదాశివ పతివ్రతా అనబడుతోంది. సౌందర్య లహరిలోని 96వ శ్లోకంలో శంకరభగవత్పాదులవారు పరమేశ్వరి పాతివ్రత్యాన్ని వివరిస్తూ....

**కళత్రం వైధాత్రం కతికతి భజంతే న కవయః**
**శ్రియో దేవ్యాః కో వా న భవతి పతిః కై రపి ధనైః**
**మహాదేవం హిత్వా తవ సతి సతీనామ చరమే**
**కుచాభ్యా మాసంగ కురవకతరో రస్య సులభః ॥**

తల్లీ ! లోకంలో కవీశ్వరుడు లేక పండితుడు – సరస్వతీ పతి అవుతాడు. ధనవంతుడు లక్ష్మీపతి అవుతాడు. కాని పార్వతీపతి మాత్రము మహాదేవుడు ఒక్కడే అంటారు.

## 711. సంప్రదాయేశ్వరీ

సంప్రదాయము – వంశానుగతంగా వచ్చేది. గురువుగారి దగ్గర నుండి శిష్యుడికి వచ్చేది. శ్రీవిద్యా సంప్రదాయము గురుశిష్య పరంపరగా ఆ పరమేశ్వరుని దగ్గర నుంచి ఇప్పటిదాకా వస్తున్నది. దాన్ని గతంలో వివరించాం. అటువంటి సంప్రదాయ స్వరూపిణి.

వేదాలు వల్లెవేస్తే బ్రహ్మజ్ఞానం అబ్బదు. శాస్త్రాలు చదివినా రాదు. కేవలము గురూపదేశం వల్లనే అది వస్తుంది. అటువంటి గురుసంప్రదాయానికి మూలమైనది పరమేశ్వరి. అందుకే ఆమె సంప్రదాయేశ్వరీ అనబడుతున్నది.

## 712. సాధ్వీ

సాధ్వీ–పతివ్రతా అని అర్థం. భూతభవిష్యద్వర్తమానకాలాలలోను, అన్నియుగాల లోను, అన్ని కల్పాలలోనూ, ప్రతి సృష్టిలోనూ కూడా భర్తను అనుసరించి ఉండేది. తన భర్తతో అవినాభావసంబంధము గలది. పైన చెప్పిన సదాశివపతివ్రతా అనే నామమే మళ్ళీ ఇక్కడ చెబుతున్నారు.

## 713. గురుమండలరూపిణీ

**ఆదినాథ సమారంభాం శంకరాచార్య మధ్యమాం ।**
**అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరామ్ ॥**

బిందుస్వరూపుడైన పరమేశ్వరుడు సృష్టి కోసం తనను తాను రెండు భాగాలుగా విభజించుకున్నాడు. అవే ప్రకాశాంశ, విమర్శాంశలు. శివశక్తి స్వరూపాలు. శ్రీవిద్యను భూలోకంలో వ్యాప్తి చెయ్యాలనే కోరికతో పరమేశ్వరుడు ఆ విద్యను పరమేశ్వరికి ఉపదేశించాడు. కొంతకాలానికి పరమేశ్వరి శ్రీవిద్యను ఉమామహేశ్వరులకు చెప్పగా, వారు లక్ష్మీనారాయణులకు, వారు వాణీ హిరణ్యగర్భులకు, వారు ఇంద్రాది దేవతలకు, వారు సనకసనందనాది సిద్ధులకు, వారు విద్యారణ్య, గౌడపాద, శంకర భగవత్పాదాదులకు ఈ విద్యను ఉపదేశించారు. ఈ రకంగా శ్రీవిద్య దివ్యౌఘ, సిద్ధౌఘ, మానవౌఘాలుగా సంప్రదాయసిద్ధంగా వచ్చింది. ఈ గురుమండలము అంతా గతంలో వివరించాము.

గురు మండలాన్ని పూజించటమంటే పరమేశ్వరిని అర్చించటమే. అందుకే చక్రార్చన చేసేటప్పుడు ముందుగా గురుమండలాన్ని అర్చించాలి. శ్రీచక్రంలో గురుమండలాన్ని ఎక్కడ అర్చించాలి అనే దానిమీద భిన్న సంప్రదాయాలున్నాయి.

బిందువు మీదే అర్చించాలని కొందరు, త్రికోణం మీద అని మరికొందరు, అష్టకోణమని ఇంకొందరు ఇలా భిన్న సంప్రదాయాలు. అయితే కంచి, శృంగేరీ పీఠాధిపతులు కూడా అంగీకరించిన సంప్రదాయం అష్టకోణం మీద గురుమండలాన్ని అర్చించటం. అది కూడా ముందు నుండి వెనుకవైపుకు ఐదవకోణం మీద గురుమండలాన్ని ఉంచాలి.

**విమలా జయనీ యోర్మధ్యే, అరుణా వాగ్దేవతా**
**సమీపే గురుమండలం యజేత్**

అష్టకోణంలో వశిని మొదలైన వాగ్దేవతలుంటారు. వీరిలో విమల నాల్గవది. జయ ఆరవది. వీరిద్దరి మధ్యన ఐదవకోణంలో అరుణావాగ్దేవతా సమీపంలో గురుమండలాన్ని అర్చించాలి.

**స్వగురుః :**

**అస్యశ్రీస్వగురుమహామంత్రస్య। బ్రహ్మేఋషిః। గాయత్రీ ఛందః । శ్రీగురుర్దేవతా। హంబీజం । సఃశక్తిః । సోఽహం కీలకం । జపే వినియోగః ॥**

**న్యాసము** : హంసాం। హంసీం । హంసూం । హంసైం । హంసౌం । హంసః ।

**ధ్యానము** : వందే గురుపదద్వంద్వ మవాఙ్మానస గోచరం ।
రక్తశుక్లప్రభామిశ్ర మతర్క్యం త్రైపురం మహః ॥

**మంత్రము** : ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః హంసశ్శివ స్సోఽహం స్వరూప నిరూపణ హేతవే స్వగురువే నమః । అస్మత్స్వగురు శ్రీ విరజానందనాథ శ్రీ పాదుకాం పూజయామి నమః ॥

**పరమగురుః :**

అస్యశ్రీ పరమగురు మహామంత్రస్య । సదాశివఋషిః । పంక్తిశ్ఛందః । శ్రీ పరమగురుర్దేవతా । బీజాది ధ్యానాంతం పూర్వవత్ ॥

**మంత్రము** : ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః సోఽహం హంసశ్శివః స్వచ్ఛప్రకాశ విమర్శహేతవే పరమగురవే నమః । అస్మత్పరమగురు శ్రీ సదానందనాథ శ్రీ పాదుకాం పూజయామి నమః ॥

**పరమేష్ఠి గురుః**

అస్యశ్రీ పరమేష్ఠి గురుమహామంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః। పంక్తిశ్ఛందః । శ్రీ పరమేష్ఠి గురుర్దేవతా । అన్యత్సర్వం పూర్వవత్ ॥

**మంత్రము** : ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః హంసశ్శివ స్సోఽహం హంసః స్వాత్మారామపంజరవిలీన తేజోహేతవే పరమేష్ఠి గురవే నమః । అస్మత్పరమేష్ఠి గురు శ్రీ శుకానందనాథ శ్రీపాదుకాం పూజయామి నమః ।

## 714. కులోత్తీర్ణా

కులము అంటే ఇంద్రియాల గుంపు. ఆ ఇంద్రియాలను దాటినది. అతీంద్రియమైనది. ఇంద్రియాలచే ఎరుగబడింది కాదు.

లౌకిక విషయాలను అనుభవించటానికి ఉన్నవే ఇంద్రియాలు. ఇంద్రియాలకు అధిపతి మనస్సు. మనసును గనక వశం చేసుకుంటే ఇంద్రియాలన్నీ మన అధీనంలోనే ఉంటాయి. ఆ రకంగా ఇంద్రియాలను అధిగమించేటట్లు, వశం చేసుకునేటట్లు చేసేది ఆ పరమేశ్వరి.

తండ్రులు, తాతలు, ముత్తాతలు ఈ రకంగా వంశపరంపర అంతా కులము అనబడుతుంది. సంసారసంబంధమైన ఈ పరంపరలోంచి దరిచేర్చేది.

కులము అంటే అజ్ఞానము. అజ్ఞానికి గురువురూపంలో జ్ఞానోపదేశంచేసి, సాధకుణ్ణి కడ తేర్చేది. కాబట్టి కులోత్తీర్ణా అనబడుతోంది.

## 715. భగారాధ్యా

భగము అంటే – సూర్యమండలము. పరమేశ్వరి భానుమండలంలో ఉంటుంది. అక్కడే ఆ దేవిని ఆరాధించాలి. శ్రీవిద్యనుపాసించినవారిలో సూర్యుడు ఒకడు. ఇతడు ఉపాసించినది హాదివిద్య. దీన్ని గతంలో వివరించటం జరిగింది.

| | | |
|---|---|---|
| 1. ఐశ్వర్యము | 3. యశస్సు | 5. జ్ఞానము |
| 2. ధర్మము | 4. సిరి | 6. వైరాగ్యము |

వీటిని షట్భగాలు అంటారు. వీటిచేత ఆరాధించబడేది.

| | | | |
|---|---|---|---|
| 1. అణిమ | 3. మహిమ | 5. ఈశిత్వ | 7. ప్రాకామ్య |
| 2. లఘిమ | 4. గరిమ | 6. వశిత్వ | 8. ప్రాప్తి |

ఇవి అష్టసిద్ధులు. వీటిని అష్టభగాలు అంటారు. వీటిచేత ఆరాధించబడేది. కాబట్టి భగారాధ్యా అనబడుతున్నది.

## 716. మాయా

ప్రసిద్ధమైన పరబ్రహ్మను ప్రకటించటానికి అనుకూలమైనది మాయ. దేవీపురాణంలో

**విచిత్ర కార్యకరణా అచింతి త ఫలప్రదా**

**స్వప్నేంద్రజాలవ ల్లోకే మాయా తేన ప్రకీర్తితా ॥**

విచిత్రమైన కార్యాలు చేసేది. కోరనటువంటి ఫలాన్ని ఇచ్చేది. ఇంద్రజాలమువలె ఉండేది మాయ. పరబ్రహ్మ నుంచి బయటకు వచ్చిన శక్తే మాయ. ఈ జగత్తు అంతా మాయాశక్తితోనే నిర్మించబడుతోంది. మాయకు పరమేశ్వరికీ తేడా లేదు.

మాయ నీటిగుంటలో తేలి ఆడే నాచువంటిది. నాచును దూరంగా తోసివేస్తే అది విడిపోతుంది. కాని మళ్ళీ వచ్చి చేరుతుంది. అలాగే వేదాంత విచారము సజ్జన సాంగత్యము చేసినంతకాలము ఈ మాయ వదలివేసినట్లుంటుంది. కాని ఆ తరువాత వెంటనే వచ్చి

చేరుతుంది. అంటే విషయవాంఛలయందు మనస్సు ఎప్పుడైతే లగ్నమవుతుందో అప్పుడు మాయ ఆవరించింది అని అర్థం.

జగత్తులోని ప్రతిప్రాణీ మాయకులోబడే ఉంటుంది. పరమేశ్వరుడు ఒక్కడే మాయకు అతీతుడు. పాము కోరలయందు విషముండటం వల్ల పాముకు ఏ అపాయమూ ఉండదు. అలాగే తనను ఆవరించి ఉన్న మాయవల్ల పరమేశ్వరుడికి ఏ విధమైన ఇబ్బందీరాదు. పాము కాటు తగిలిన ప్రాణికి మాత్రం హాని కలుగుతుంది. అలాగే మాయ కూడా.

మాయతో కప్పబడ్డప్పుడు, తాను మాయా ప్రభావంలో ఉన్నాను అని తెలుసుకుంటే చాలు ఆ మాయ విడిపోతుంది. జీవాత్మ పరమాత్మల మధ్య మాయ అనే తెర ఉన్నది. ఆ తెరను తొలగిస్తే చాలు ఆత్మ సాక్షాత్కారమవుతుంది.

మాయ రెండు విధాలుగా ఉంటుంది. 1. విద్యామాయ 2. అవిద్యామాయ.

1. విద్యామాయ భగవంతుడి సన్నిధికి తీసుకునిపోతుంది. ఇది వివేకము, వైరాగ్యము అని రెండు రకాలు. దీనిని ఆశ్రయించినవారు భగవంతుని శరణు పొందుతారు.

2. అవిద్యామాయ. ఇది అజ్ఞానము. ఇది కామక్రోధాది అరిషడ్వర్గాలు అని ఆరు రకాలు. దీనివల్లనే మానవుడికి నేను, నాది అనే బుద్ధి పుడుతుంది. దీనివల్ల అతడు సంసారానికి బందీ అవుతాడు.

కానీ విద్యామాయ వ్యక్తంకాగానే అవిద్యామాయ తొలగిపోతుంది. మురికినీటిలో సూర్యచంద్రుల ప్రతిబింబాలు కనిపించవు. అలాగే మాయ తొలగనంతవరకు అంటే నేను, నాది అనే అహంకార మమకారాలు నశించనంత వరకు ఆత్మసాక్షాత్కారం జరగదు.

మాయకు ఎవరూ అతీతులుకారు. జ్ఞానజ్యోతులతో మాయ అనే అంధకారాన్ని పటాపంచలు చెయ్యాలి. పూర్వజన్మలోని కర్మవాసనే మాయ.

## 717. మధుమతీ

మధువు – మద్యము, పుష్పరసము, తేనె అని అర్థం. ఛాందోగ్యోపనిషత్తులోని మూడవ అధ్యాయంలో మధు విజ్ఞానం చెప్పబడింది.

ఆకాశంలో దూరంగా మనకు కనిపించేవాడే సూర్యుడు. అతడే దేవతలను తృప్తిపరచేవాడు. అందుచేతనే అతడు దేవతలకు మధువు వంటివాడు. పరమేశ్వరి సవితృదేవతాశక్తి అయిన సావిత్రి. కాబట్టి మధుమతీ అని చెప్పబడుతోంది.

## 718. మహీ

పైన చెప్పినట్లుగా రహస్యమైనది అయినప్పటికీ ఆమె భూమివలె ప్రకటితమైనది. అన్నింటియందు వ్యాపించి ఉన్నది. కాబట్టి మహత్ – గొప్పదైనది. ప్రకృతి అంతా మహి అని చెప్పబడుతోంది.

పరమేశ్వరి భూ దేవతా స్వరూపురాలు. వేదాలలో మహి అనే దేవత అదితి అని, ఉపమాయ అని చెప్పబడింది. పరమేశ్వరి క్షమయే స్వరూపంగా గలది కాబట్టి మహీ అనబడుతోంది.

## 719. గణాంబా

గణాలకు తల్లి. గణములు అంటే సమూహాలు. ప్రమధాదిగణాలకు తల్లి. గణనాధునికి తల్లి. దేవగణాలకు తల్లి. ఈ రకంగా అన్నింటికీ ఆ పరమేశ్వరియే మాత కాబట్టి గణాంబా అనబడుతోంది.

## 720. గుహ్యకారాధ్యా

దేవతలలో ఒక విభాగానికి చెందినవారు గుహ్యకులు. వారు బ్రహ్మ మొదలైనవారు. నవనిధులను కాపాడే మణిభద్రుడు మొదలైనవారు. వీరిచే ఆరాధింపబడుతుంది. కాబట్టి గుహ్యకారాధ్యా అనబడుతుంది.

గుహ్యము అంటే – రహస్యము. రహస్య ప్రదేశాలయందు ఆరాధించబడుతుంది కాబట్టి గుహ్యకారాధ్యా అనబడుతుంది. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలు గుహ్యకాలు. సహస్రారము, ద్వాదశాంతము గుహ్యకాలు. వీటియందు ఆరాధించబడుతుంది కాబట్టి గుహ్యకారాధ్యా అనబడుతుంది.

అంతర్యాగంలో శరీరంలో ఉండే షట్చక్రాలలోను ఆరాధించబడుతుంది కాబట్టి గుహ్యకారాధ్యా అనబడుతుంది.

## 721. కోమలాంగీ

కోమలమైన అంగములు గలది. పరమేశ్వరి యొక్క స్థూలశరీరాన్ని వర్ణించేటప్పుడు ఆమె అంగాలు అన్నీ అతి సుకుమారంగా ఉన్నాయి అని చెప్పటం జరిగింది. దేవి వేదస్వరూపిణి. వేదానికి ఆరు అంగాలున్నాయి అవి.

| | | |
|---|---|---|
| 1. శిక్ష | 3. ఛందస్సు | 5. జ్యోతిషము |
| 2. వ్యాకరణము | 4. నిరుక్తము | 6. కల్పము |

వీటినే షడంగాలు అంటారు. ఈ షండంగాలు కలది. కాబట్టి కోమలాంగి అనబడుతోంది.

పరమేశ్వరి వేదాలనే అంగాలుగా కలిగి ఉన్నది.

| | | |
|---|---|---|
| యజుర్వేదము | – | శిరస్సు |
| ఋగ్వేదము | – | దక్షిణపక్షము |
| సామవేదము | – | ఉత్తరపక్షము |
| అధర్వణవేదము | – | పుచ్ఛము |
| బ్రాహ్మణాలు | – | ఇతర అవయవాలు |

ఈ రకంగా అంగాలు కలిగి ఉన్నది. కాబట్టి కోమలాంగీ. దేవి శరీరంలో

| | | |
|---|---|---|
| 1. హృదయదేవి | 3. శిఖాదేవి | 5. నేత్రదేవి |
| 2. శిరోదేవి | 4. కవచదేవి | 6. అస్త్రదేవి |

ఈ ఆరుగురు అంగాలుగా ఉన్నారు కాబట్టి కోమలాంగి అనబడుతున్నది.

## 722. గురుప్రియా

గురువునందు ప్రీతి గలది. గురుపత్ని కన్న వేరైనదికాదు. జగద్గురువైన పరమేశ్వరుని పత్ని. మంత్రోపదేశం చేసే గురువుల యందు ప్రేమగలది.

శ్రీవిద్యను ప్రచారం చెయ్యాలనే సంకల్పంతో పరమేశ్వరికి మొదటగా మంత్రోపదేశం చేసినవాడు పరమేశ్వరుడు. ఆయనే ఆదిగురువు. గురుమూర్తి. ఆదినాథుడు. ఆయన భార్య కాబట్టి పరమేశ్వరి గురుప్రియా అనబడుతుంది.

బ్రహ్మ విద్యను ఉపదేశించే గురు స్వరూపం గలది. అంటే గురువు కేవలం పరబ్రహ్మ స్వరూపుడు, అతని భార్య గురుప్రియా.

పరమేశ్వరికి శ్రీవిద్యోపాసకులయందు, శ్రీవిద్యోపదేశం చేసే గురువులయందు మక్కువ ఎక్కువ. కాబట్టి గురుప్రియా అనబడుతుంది.

## 723. స్వతంత్రా

ఇతర వస్తువుల సహాయం లేకుండానే సృష్టి కార్యక్రమం చేసేది. తనకన్న ఎక్కువవారు కాని, తనతో సమానులుగాని లేనిది.

పంచకృత్యాలయందు అంటే – సృష్ట, స్థితి, లయ, తిరోదాన, అనుగ్రహములందు ఎవరి సహాయము లేకుండానే వాటిని నెరవేర్చేది.

పరమేశ్వరి అర్చనకు 64 తంత్రాలున్నాయి. అప్పుడు పరమేశ్వరి పరమేశ్వరునితో 'ఓ స్వామీ ! నా భక్తులు పండితులయి కూడా ఈ తంత్రాలమాయలో పడి అజ్ఞానులవుతున్నారు. కాబట్టి వారిని ఉద్ధరించటానికి ఏదైనా ఇంకొక తంత్రాన్ని చెప్పవలసినది' అని అడగగా పరమేశ్వరుడు శ్రీవిద్యాతంత్రము అనే స్వతంత్ర తంత్రాన్ని ఇచ్చాడు.

ప్రపంచంలో అన్ని జీవులు ఏదో విధంగా ఎవరో ఒకరి మీద ఆధారపడి బ్రతకాల్సిందే. ఏ ఆధారము అవసరంలేదు అనుకునేవారు కనీసం పంచభూతాల మీదనయినా ఆధారపడాలి. కాని పరమేశ్వరి ఎవరి మీదా ఆధారపడక స్వతంత్రంగా ఉంటుంది. అందుకే ఆమె స్వతంత్రా అందరికీ ఆమె ఆధారము.

## 724. సర్వ తంత్రేశీ

అరవైనాలుగు తంత్రాలను సమర్థించినది. ఆ తంత్రాలన్నింటికీ అధిదేవత. ఆ తంత్రాలచే ఆరాధించబడునది.

తంత్రము–మంత్రశాస్త్రంలో ఒక భాగము. కేవలము మంత్రము అంటే మంత్రభాగం మాత్రమే ఉంటుంది. కాని తంత్రము అంటే – మంత్రభాగంతో పాటు క్రియ కూడా ఉంటుంది. లౌకికవాదులు, ఐహికసుఖాలు కోరేవాడు ఈ తంత్రాలను వాడతారు.

**బాహ్యాపూజరతాఃకౌళా వామకా స్తంత్ర వాదినః**

కౌళులు, వామాచారులు, తంత్రవాదులు వీరందరూ బాహ్యపూజ చేస్తారు. ఇదంతా తంత్రమే. అయితే వీటిలో మళ్ళీ తేడాలు అంటే ఎక్కువ తక్కువలు. చేసే కర్మలో ఉన్న భేదాలు మాత్రమే. వాటిని బట్టే కౌళాచారులు, వామాచారులు అంటూ చెప్పటం జరుగుతుంది. అర్చనావిధానం మంత్రం. దానిలో ఉన్న ఆచారాలు తంత్రం. ఈ తంత్రాలు రెండు రకాలుగా ఉంటాయి.

1. వశీకరణాలు 2. కార్యసాధకాలు.

1. వశీకరణాలు అంటే – అక్కడికి వచ్చిన వారంతా కూడా అవాక్కయిపోయి తదేకంగా ఆ కార్యక్రమాన్ని చూస్తారు. చాలా బాగుంది. గొప్పగా చేశారు అంటూ మెచ్చుకుంటారు. దీనికి రంగురంగుల రంగవల్లులు వివిధరకాలపాత్రలు వివిధరకాల పూజాద్రవ్యాలు పెడతారు. అక్కడ జరుగుతున్నదేమిటో జనానికి అర్ధంకాదు. అయినా స్థాణువులా కూర్చుండిపోతారు.

2. కార్యసాధకాలు అంటే – సంకల్పసిద్ధి త్వరగా జరగటానికి సాధనాలు వాడటం. ఉదాహరణకు ఒక మంత్ర జపం చేస్తున్నాం. అవిశి చెట్టు క్రింద కూర్చుని ఆ జపంచేస్తే మంత్రం త్వరగా సిద్ధిస్తుంది. ఇంకా తేలికగా చెప్పాలంటే ఎండలో పెడితే కాగితం ఎండుతుంది. కాని సూర్యరశ్మికి కాగితానికి మధ్యన భూతద్దం పెడితే కాగితం మండిపోతుంది. ఇది తంత్రం. ఈ రకంగా జపంచేస్తే, ఈ విధమైన సామ్రాగిని ఉపయోగిస్తే, కార్యసాధన త్వరగా జరుగుతుంది. అని చెప్పేవే తంత్రాలు. ఇవి మొత్తం అరవైనాలుగు తంత్రాలు. ఇవికాక మోక్షమార్గం చూపే శ్రీవిద్యాతంత్రము అనే స్వతంత్ర తంత్రాన్ని పరమేశ్వరుడు చెప్పాడు. ఈ విషయాలన్నీ గతంలో వివరించాం.

తంత్రాలలోసాధారణంగా వశీకరణము, ఆకర్షణ, విద్వేషణ, సమ్మోహన, ఉచ్చాటన, మారణాలు అనేవి ఉంటాయి. భండాసురయుద్ధంలో విశుక్రుడు పరమేశ్వరి సేన మధ్యన పాతిపెట్టిన జయవిఘ్నయంత్రం కూడా ఇలాంటి తాంత్రికప్రక్రియయే.

అయితే ఈ తంత్రాలలో ఎక్కువ భాగము వేద విరుద్ధమైన చర్యలే చెప్పబడ్డాయి. ఇవి పూర్తిగా ఐహికవాంఛలకే ప్రాధాన్యమిస్తాయి. అందుచేత ఈ తంత్రాలను నిషేధించటం జరిగింది. వీటి వ్యామోహంలో పడినవారు ఎంతటి పండితులైనా, విజ్ఞానవంతులైనా సరే మాయలో పడిపోతున్నారు.

సమయాచారతత్పరులకు శుభాగపంచకము ప్రామాణికము. అవి వశిష్ఠ, సనక, సనందన, సనత్కుమార, శుక మహర్షులు వ్రాసిన సంహితలు. అయితే పరమేశ్వరి ఈ తంత్రాలన్నీ ఒప్పుకుంటుంది. ఎందుకంటే పరమేశ్వరుడు అమృతస్వరూపుడు. పరమేశ్వరి విషస్వరూపిణి అంటే – భక్తుల యొక్క కోరికలు తీరుస్తుంటుంది. వారు ఏదడిగితే అది ఇస్తుంది. ఐహికవాంఛలకుపయోగపడే ధనధాన్యాలు, భోగభాగ్యాలు, సిరిసంపదలు

ఇస్తుంది. దాంతో వారంతా భోగాలనుభవిస్తూ సంసారలంపటంలోపడి కొట్టుమిట్టాడు తుంటారు. అంతేకాని మోక్షం జోలికిపోరు. ఈ రకంగా తంత్రాలను సృష్టించింది కాబట్టి పరమేశ్వరి సర్వతంత్రేశీ అనబడుతోంది.

## 725. దక్షిణామూర్తిరూపిణీ

దక్షిణామూర్తి రూపం గలది.

**శుద్ధస్ఫటికసంకాశం శశిఖండవిభూషితం**

**వ్యాఘ్ర చర్మధరం శాంతం జటామకుటమండితం**

**ముఖపంకేరుహోల్లాసం సోమసూర్యాగ్నిలోచనం**

**భావయామి మహాదేవం దక్షిణామూర్తి విగ్రహం ॥**

దక్షిణముఖంగా కూర్చుని, త్రిమూర్తులకు గురువుగా ప్రసిద్ధి చెందినవాడు. ఒకసారి బ్రహ్మ విషయంలో అనుమానం వచ్చి సనక సనందనాదులు పరమేశ్వరుణ్ణి ప్రార్థించారు. అప్పుడు ఆయన పదహారు సంవత్సరాల వయస్సుతో భాండీరము అనే వటవృక్షం క్రింద దక్షిణాభిముఖంగా పద్మాసనంలో, చిన్మయముద్రతో, తురీయస్థితిలో దర్శనమిచ్చాడు. అతన్ని చూడగానే వారి సంశయాలన్నీ ఎగిరిపోయినాయి. అతడే దక్షిణామూర్తి. సర్వవిద్యలకు నది. సర్వవిద్యా ప్రపంచానికీ గురువు. కేవలము సరస్వతీదేవి రూపము.

దక్షిణామూర్తి అనే పేరులో దక్షిణ అంటే – సృష్టి స్థితి లయ కారుకుడైన సగుణ బ్రహ్మ. మూర్తి అంటే – నిర్గుణ బ్రహ్మ. పరమేశ్వరి సగుణ, నిర్గుణ బ్రహ్మ స్వరూపిణి. కాబట్టే ఆమె దక్షిణామూర్తిరూపిణీ అనబడింది.

**అస్యశ్రీ దక్షిణామూర్తి మహామంత్రస్య బ్రహ్మాఋషి । గాయత్రీఛందః । శ్రీదక్షిణామూర్తిః పరమాత్మా దేవతాః ఓం బీజం । స్వాహాశక్తిః । నమఃకీలకం । జపే వినియోగః ॥**

**న్యాసము : ఓం ఆం ఓం ॥ ఓం ఈం ఓం ॥ ఓం ఊం ఓం ॥ ఓం ఐం ఓం॥**
**ఓం ఔం ఓం॥ ఓం అః ఓం ॥**

**ధ్యానము** : **భస్మవ్యాపాండురాంగః శశిశకలధరో జ్ఞానముద్రాక్షమాలా**
**వీణాపుస్తైర్విరాజత్కరతలకమలో యోగపట్టాభిరామః ।**
**వ్యాఖ్యాపీఠే నిషణ్ణో మునివరనికరై స్సేవితః సుప్రసన్నః**
**సవ్యాళః కృత్తివాసా స్సతతమవతునో దక్షిణామూర్తి రీశః ॥**

**మంత్రము** : **ఓం నమోభగవతే దక్షిణామూర్తియే మహ్యం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛస్వాహా ॥**

## 726. సనకాది సమారాధ్యా

బ్రహ్మ సృష్టి చెయ్యాలనే సంకల్పంతో కొంతమంది మానసపుత్రులను సృష్టించాడు. వారిలో సనకాదులు కూడా ఉన్నారు. వీరు మొత్తం నలుగురు 1. సనక, 2. సనందన 3. సనత్కుమార 4. సనత్సుజాత అని వీరి పేర్లు. వీరు బ్రహ్మ చెప్పినట్లుగా సృష్టి కార్యక్రమం చెయ్యకుండా ఊర్ధ్వరేతస్కులై, తపోవనాలకు వెళ్ళిపోయారు. అటువంటి వారిచేత ఆరాధించబడినది పరమేశ్వరి.

శ్రీవిద్యా పరంపరలో సిద్ధౌఘమునందున్న వారు సనక సనందనాదులు. ఇంద్రాది దేవతలు శ్రీవిద్యను సనక సనందనాదులకు చెప్పారు. వారు ఆవిద్యను మానవులకు ఉపదేశించారు. ఈ రకంగా సనక సనందనాదులు శ్రీవిద్యాపరంపరలోనివారు. బ్రహ్మపురాణంలో

**త్వమేవాఽనాది రఖిలా కార్యకారణరూపిణీ ।**
**త్వా మేవ హి విచిన్వంతి యోగినః సనకాదయః ॥**

నీవే ఆదివి. కార్యకారణరూపిణివి. సనకాదియోగగణాలు నిన్నే వెదకుతున్నాయి అని చెప్పబడింది. సనకసనందనాదులు సిద్ధులు. సదాకౌమారావస్థలోనే ఉంటారు. పుట్టుకతోనే జ్ఞానస్వరూపులు. పరమేశ్వరిని ఆరాధించి తరించిన వారు.

సనక సనందన సనత్కుమార సనత్సుజాతలతోపాటుగా వీరితో సమానమైన జ్ఞానులచే ఆరాధించబడుతుంది ఆ పరమేశ్వరి. అందుకే సనకాది సమారాధ్యా అనబడుతోంది.

# 727. శివజ్ఞాన ప్రదాయినీ

శివసంబంధమైన జ్ఞానాన్ని గొప్పగా ఇచ్చేది. సరస్వతీవిద్యను అనుష్ఠానం చేస్తే వచ్చే ఫలితము శివజ్ఞానము. జ్ఞానస్వరూపిణి అయిన పరమేశ్వరి తన భక్తులకు పరిపూర్ణమయిన బ్రహ్మజ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. భగవంతుణ్ణి ఏరూపంతో, ఏ పేరుతో ఆరాధించినప్పటికీ జ్ఞానాన్నిచ్చేది పరమేశ్వరియే. శివుడు పరమానందస్వరూపుడు. నిర్వికారుడు. ఆయనకు తెలిసిన జ్ఞానము – ఆత్మజ్ఞానము. అటువంటి ఆత్మజ్ఞానాన్ని ప్రసాదిస్తుంది పరమేశ్వరి. వాయుపురాణంలో

**స్పందేన లక్ష్యతే వాయుః, వహ్ని రౌష్ణేన లక్ష్యతే**
**చిన్మాత్ర మమలం శాంతం శివం ఇత్యుదితం తు యత్ ॥**

వాయువు స్పర్శచేత తెలియబడతాడు. అగ్ని ఉష్ణమువలన తెలియబడతాడు. కాని శివుడు జ్ఞానమువల్లనే తెలియబడతాడు. శివుడంటే జ్ఞానస్వరూపమన్నమాట. అటువంటి శివజ్ఞానాన్ని తన భక్తులకు ఇచ్చేది కాబట్టి. శివజ్ఞాన ప్రదాయినీ అనబడుతుంది.

ఈ రకంగా సరస్వతీవిద్యను వివరించటం జరిగింది.

శ్రీ 'చ'కార దేవి

# 45. నందివిద్య

పంచదశీ మహామంత్రాన్ని ఉపాసించి తరించినవారిలో నందీశ్వరుడు ఒకడు.

ఇక్కడ పరమేశ్వరి చిత్కల. అంటే కేవలము జ్ఞానస్వరూపిణి. అదే షోడశీకల. ధృవకల, పరమాకల, బ్రహ్మకల అనబడుతుంది. చిత్కల జీవులందరి శరీరాలలోనూ ఉంటుంది. అదే అఖండాకారుడైన పరమేశ్వరునిశక్తి. బ్రహ్మరంధ్రంద్వారా మానవదేహంలోకి ప్రవేశించింది. ఈ రకంగా అన్ని జీవులయందు పరమేశ్వరస్వరూపమైన చిత్కల ఉన్నది. అయితే జీవిలో చిత్కల లాగానే ఆనందకల ఇంకొకటి ఉన్నది. అదే అద్వైతానందం.

జగత్తును సృష్టించింది ఆ పరమేశ్వరి అంటే సృష్టి అంతా ఆమె యొక్క సంతానమే. జీవి ఏరూపంలో ఉన్నా అది ఆమె సంతానమే. అందుకే అన్ని జీవులను ఒకే రకమైన భావంతో ప్రేమగా చూస్తుంది. అంతేకాదు తనను అర్చించేవారికి శుభాలు చేకూరుస్తుంది. అర్చించటము అంటే ఆమె నామాలను ఉచ్ఛరిస్తేచాలు, సంతోషిస్తుంది. అలా సంతోషించి భక్తులకు కావలసినవన్నీ సమకూరుస్తుంది. ఈ రకంగా మిథ్య అయిన జగత్తుకు కారణమౌతుంది. నియమ నిష్ఠలతో ఆరాధించేవారికి ముక్తినిస్తుంది. ముక్తి అంటే జ్ఞానము. అసలు పరమేశ్వరి రూపమే జ్ఞానము. ఆమె సాకారగుణాన్ని చూస్తే నృత్యమునందు ఆమెకు చాలా ప్రీతి. లజ్జాపూరితమైనది. అప్సరాంగనలచేత కూడా పూజించబడుతుంది. నమస్కరించబడుతుంది. తన భక్తులను సంసారసాగరం నుంచి రక్షిస్తుంది. జీవి చేసిన పాపాలు కల్పాంతము అనుభవించినా క్షయం కావు. అటువంటి పాపాలను పరమేశ్వరి జ్ఞానంచేత నశింపచేస్తుంది.

జీవుల యొక్క దౌర్భాగ్యాన్ని దూదిపింజలాగా ఎగరకొడుతుంది. భక్తులకు జననమరణాలు లేకుండా చేస్తుంది. వారు ముసలివారైనా లోకాలను వశీకరణం చేసే శక్తిని ప్రసాదిస్తుంది.

భక్తులభాగ్యాలను, సిరిసంపదలను కొన్ని రెట్లు పెంచుతుంది. ఆమెను తలచుకోగానే భక్తుల హృదయాలు ఆనందడోలికలలో తేలియాడుతాయి. వారికి సంపూర్ణారోగ్యం కలుగచేస్తుంది. వారికి మృత్యువును రానివ్వదు. అంటే వారికి జన్మలేకుండా చేస్తుంది. పుట్టుకే లేనివారికి చావు ఉండదుకదా ! ఆ రకంగా వారికి సాయుజ్యాన్ని ప్రసాదిస్తుంది.

ఈ రకంగా నందికేశుడుపాశించిన విద్యను 728 నుంచి 749 వరకు నామాలలో వివరించారు. ఇక నామాలను చూద్దాం.

## 728. చిత్కలా

చిత్ అంటే – సచ్చిదానందరూపమైనది. పరబ్రహ్మ యొక్క కల.

**చిత్తేషు చిత్కలా నామశక్తిః సర్వశరీరిణామ్**

లోకంలో ఉండే జీవులందరి శరీరాలలోనూ చిత్కల అనే శక్తి ఉంటుంది. అది అఖండాకారుడైన ఆ పరమేశ్వరుని యొక్క కల. ఐతరేయోపనిషత్తులో చెప్పినట్లుగా పరమేశ్వరుడు విరాట్స్వరూపాన్ని పోలిన మానవుణ్ణి సృష్టించాడు. ఆ తరువాత బ్రహ్మరంధ్రం ద్వారా అతనిలో ప్రవేశించాడు. ఈ రకంగా ప్రవేశించిన పరమేశ్వరరూపమే చిత్కల. భగవద్గీతలో

**మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః**

నా అంశయే లోకమందు సనాతనుడైన జీవుడు అని చెప్పబడింది. లోకంలోని సమస్తజీవులు అతని అంశలే. ఈ చిత్కలయే చైతన్యము. దీని స్వరూపమైనది పరమేశ్వరి.

## 729. ఆనందకలికా

పరబ్రహ్మ యొక్క స్వల్పాంశమే ఆనందకళ. జీవిలో చిత్కల లాగానే ఇంకొక విశేషమున్నది. అదే ఆనందకళ. ఇది హింసరూపిణి. ఇది అఖండమైన ఆనందం. అద్వైతానందం, శాశ్వతమైన ఆనందం. అయితే ఈ ఆనందం మనకు మూడు రాకలుగా తెలుస్తుంది.

1. ప్రతిబింబానందం – ఇంద్రియాల ద్వారా అనుభవించబడుతుంది.
2. వాసనానందం – ఇది కారణ ప్రశక్తి లేక భావసామాన్యముగా కలిగేది.
3. నిజానందం – ఇదే బ్రహ్మానందం కేవలము జ్ఞానమువల్లనే కలుగుతుంది.

ఇది నాశనములేనిది. అటువంటి బ్రహ్మానందంలో లేశ మాత్రమే ఈ ఆనందకలిక. పరమేశ్వరి అటువంటి రూపం కలిగి ఉంటుంది.

## 730. ప్రేమరూపా

**ప్రేమ స్నేహో భక్తి రేవ రూపం యస్యాః – సా**

ప్రేమ అంటే – స్నేహము, భక్తి అని అర్థం. ఇవి రూపంగా గలది. ఈ జగత్తంతా పరమేశ్వరుడికి తాను నిర్మించిన జగత్తు మీద తనకు ప్రేమ ఉంటుంది. దేవికి సకలజీవరాశి

యందు సమానమైన ప్రేమ ఉంటుంది. క్రిమికీటకాల దగ్గరనుంచీ ఆ పరమేశ్వరి సృష్టితాలే. అందుచేత ఆమె దృష్టిలో అన్ని జీవులూ ఒకటే. అన్నిటియందు సమానమైన ప్రేమ, వాత్సల్యము ఉంటాయి. తన బిడ్డలమీద ప్రేమ ఉండటం ప్రతి తల్లికీ సహజమే. అయితే తల్లికి కొంతమంది బిడ్డలే ఉంటారు. కాని పరమేశ్వరికి ఈ లోకమంతా బిడ్డలే. అందుచేతనే అన్ని జీవులయందు ప్రేమకలిగి ఉంటుంది. తల్లి గనుక వారేది కోరితే అది ఇచ్చేస్తుంది. ప్రేమ అనేది ఆనందరూపం. కాబట్టి పరమేశ్వరి ప్రేమ అనే ఆనందరూపం గలది.

## 731. ప్రియంకరీ

**ప్రియం కరోతీతి - ప్రియంకరీ**

భక్తులకు ప్రియమును చేయునది. పరమేశ్వరి ప్రేమ స్వరూపి కాబట్టి ప్రియంకరి. భక్తుల యొక్క కోరికలన్నింటినీ తప్పక తీరుస్తుంది. భక్తుల సంకల్పం ఏమిటోచూసి, వారి అనుష్టానాన్ని బట్టి వారి కోరికలు తీరుస్తుంది. యజ్ఞయాగాదులు చేసేవారి కోరిక ఏమిటో చూసి వారి కోరిక తీరుస్తుంది. ఈ రకం ధనధాన్యాలు, భోగభాగ్యాలు, సిరిసంపదలు, రాజ్యాలు ఏంకావాలంటే అవి ఇస్తుంది. ఈ విధంగా ఇహమే కాదు పరం కూడా. అంటే మోక్షం కూడా ప్రసాదిస్తుంది. అందుచేతనే పరమేశ్వరి తనను అర్చించేవారికి ఇహము పరము కూడా ఇస్తుంది అని చెప్పబడుతోంది. ఇలా భక్తుల కోరికలు తీర్చి వారికి ప్రియాన్ని కలుగచేస్తుంది. కాబట్టి ప్రియంకరీ అనబడుతోంది.

## 732. నామపారాయణప్రీతా

పరమేశ్వరి నామపారాయణప్రీత. అంటే ఆవిడ నామాలను గనక పారాయణచేస్తే దేవి ప్రీతి చెందుతుంది. 'లలితాసహస్రము' ఆమె నామాలు. కాబట్టి లలితాసహస్రం పారాయణ చెయ్యటంవల్ల ఆమె ఆనందిస్తుంది. పంచదశిమహామంత్రంలోని 15 అక్షరాలే త్రిశతిలోని నామాలు. అవన్నీ పరమేశ్వరిని గురించే వివరిస్తున్నాయి. కాబట్టి త్రిశతి పారయణతో ఆనందించేది.

శ్రీచక్రంలో ఉన్న నవావరణలలోని దేవతల పేర్లే ఖడ్గమాల. ఆ దేవతలంతా తన స్వరూపాలే. కాబట్టి ఖడ్గమాలపారాయణతో ఆనందించేది.

సహస్రనామాలతోపాటుగా అష్టోత్తరశతనామాలు. వాటి పారాయణవల్ల ప్రీతి పొందేది.

ఈ రకంగా పరమేశ్వరి నామాలే కాకుండా, బాల, లలిత, రాజరాజేశ్వరి దేవతలనర్చించినా, బాల, పంచదశి, షోడశిమంత్రానుష్ఠానం చేసినా పరమేశ్వరి చాలా ఆనందిస్తుంది.

నన్ను పూజించినా, పూజించకపోయినా సరే, నా నామాలను జపిస్తేచాలు. నేను ఆనందిస్తాను అని అంటోంది పరమేశ్వరి. సప్తశతి, మహావిద్య వంటివి పారాయణచేసినా దేవికి ఆనందం కలుగుతుంది. దేవీభాగవతంలో

**అకారాది క్షకారాంతైః స్వరై ర్వర్ణై స్తు యోజితైః**
**అసంఖ్యేయాని నామాని భవంతి రఘునందన !**

అకారాది క్షకారాంతమైన వర్ణాలు అచ్చులతో కలిసి అసంఖ్యాకములైన నీ నామాలవుతున్నాయి.

లఘుస్తుతిలో

**ఆ ఈ పల్లవితైః పరస్పయుతై ర్ద్వి త్రి క్రమాద్యక్షరైః**
**కాదిక్షాంతగతై స్వరాదిభి రథ క్షాంతైశ్చ తైస్తైః స్వరైః**
**నామాని త్రిపురే భవంతి ఖలు యా న్యతంత గోప్యాని తే**
**తేభ్యో భైరవపత్ని ! వింశతిసహస్రేభ్యః పరేభ్యో నమః ॥**

అ నుంచి అః వరకు అచ్చులు - 16

క నుంచి క్ష వరకు హల్లులు - 35 వీటిలో అకారం చేరిస్తే 36 అవుతాయి. వీటిని ఒక్కొక్క అచ్చుతోనూ కలిపితే 36 × 16 = 576. నామాలవుతాయి. ఇవి ప్రథమాక్షరాలు. వీటిలో ఒక్కొక్క అక్షరాన్ని మొదటి అక్షరంగా చేసి చెప్పాలి. అంటే

1. **అం కం అం ఆం ఈం నమః**
2. **అం కం కం ఆం ఈం నమః**
3. **అం కం ఖం ఆం ఈం నమః**
4. **అం కం గం ఆం ఈం నమః**

ఈ రకంగా లెక్కవేస్తూపోతే మొత్తం 20,736 నామాలవుతాయి. ఇక్కడ ప్రతి నామంలోనూ ఏడు అక్షరాలుంటాయి. ఈ రకంగా వచ్చిన ఈ నామాలను ఒకరోజు గాని, వారంలోగాని, పక్షంలోగాని ఏదైనా కొంతకాలంలో పారాయణచెయ్యాలి. దీనివలన పరమేశ్వరి ప్రీతి చెందుతుంది.

## 733. నందివిద్యా

**నందినో నందికేశ్వరస్య విద్యా । తదుపాసిత విద్యా**

నందికేశ్వరునిచే ఉపాసించబడిన విద్యాస్వరూపిణి. నామపారాయణ విద్య – నందివిద్య అనబడుతుంది. పంచదశి మహామంత్రాన్ని ఉపాసించి తరించిన వారిలో నందికేశ్వరుడు ఒకడు. అతడుపాసించిన మంత్రము.

**అస్యశ్రీ నందికేశ్వర విద్యాంబా మహామంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః । పంక్తిచ్ఛందః । నందికేశ్వర విద్యాంబా దేవతా । స ఏ ఈ ల హ్రీం బీజం । స హ హ ల హ్రీం శక్తిః । స క ల హ్రీం కీలకం । జపే వినియోగః**

**న్యాసము : కూటత్రయముతో రెండు ఆవృత్తులు న్యాసము చెప్పాలి.**

**ధ్యానము : సకుంకుమవిలేపనా ............**

**మంత్రము : స ఏ ఈ ల హ్రీం । స హ హ ల హ్రీం । స క ల హ్రీం ।**

## 734. నటేశ్వరీ

నటేశ్వరుడు – పరమేశ్వరుడు. నాట్యభంగిమలో ఉన్నవాడు. అతని యొక్క శక్తి. అతడు చిదానంద ఘనరూపుడు. ప్రదోషకాలంలో ఈశ్వరుడు నృత్యం చేస్తాడు.

**సరస్వతి వీణ మీటగా – పురందరుడు వేణువూదగా**
**హరీ మృదంగము వాయించంగా – ధిమిం ధిమిం ధిమి**
**ధిమి తక అనుచును తాండవ కేళిసల్పెను.**
**శంకరుడడుగో ప్రదోషకాలము – ఝణం ఝణం ఝణ ఝణ తక అనుచును తాండవ కేళిసల్పెను.**

అని పరమేశ్వరుని తాండవాన్ని వర్ణిస్తారు. ఆ రకంగా నాట్యంచేసే నటేశ్వరుని శక్తి. చిదంబరంలోని నటరాజు యొక్క శక్తి.

## 735. మిథ్యాజగదధిష్ఠానా

అసత్యమైనది ఈ జగత్తు. ఇదంతా మిధ్య. ఆ రకంగా మిధ్యయైన జగత్తునకు ఆధారమైనది. అంటే ద్వైతబుద్ధి మాయచే కల్పించబడుతుంది. అద్వైతమే పరమార్ధము. బ్రహ్మసత్యం జగన్మిధ్య.

ముత్యపుచిప్పును చూసి – వెండి అనుకుంటాం. స్థాణువును చూసి – మనిషి అనుకుంటాం. అలాగే రజ్జు సర్పభ్రాంతి. అయితే ఇదంతా భ్రాంతి అని మరిచిపోకూడదు. ఈ భ్రాంతి మాయచేత కల్పించబడుతుంది. మాయాశక్తి పరమేశ్వరి. అందుచేత మిథ్య అయిన జగత్తుకు ఆధారమైనది ఆ పరమేశ్వరియే. అందుచేతనే ఆమె 'మిథ్యాజగదధిష్ఠానా' అనబడుతోంది.

## 736. ముక్తిదా

ముక్తి నిచ్చునది. ముక్తి అంటే – విముక్తి ఐహిక బంధనాల నుంచి విముక్తి. అరిషడ్వర్గాల నుంచి విముక్తి. నేను నాది అనే అహంకార, మమకారాల నుంచి విముక్తి. ఎప్పుడైతే సాధకుడీ అహంకార, మమకారాల నుంచి విముక్తుడైనాడో, అప్పుడతడు సాయుజ్యం పొందుతాడు. పరబ్రహ్మలో లీనమవుతాడు. అతడే సాక్షాత్తూ పరబ్రహ్మ స్వరూపుడవుతాడు.

వేదాలను వల్లించటం వల్ల ముక్తిరాదు. శాస్త్రపాండిత్యంవల్ల ముక్తిరాదు. అధికారం పొందటంవల్ల ముక్తిరాదు. యజ్ఞయాగాదికర్మలవల్ల ముక్తిరాదు. మరి దేనివల్ల వస్తుంది? కేవలము ఆత్మజ్ఞానం వల్ల మనస్సును స్వాధీనపరచుకుని, ఇంద్రియాలను బంధించి దృష్టిని అంతర్ముఖం చేసినట్లైతే ఆత్మసాక్షాత్కారమవుతుంది. అంటే తానెవరో తెలుస్తుంది. తానే పరబ్రహ్మ. ఈ లోకాలు అన్నీ తనలోనే ఉన్నాయి. అన్ని జీవరాశులు తననుంచే ఉద్భవించాయి. సర్వస్వమూ తనయందే ఉన్నది. అనే విషయం తెలుస్తుంది. అదే ఆత్మసాక్షాత్కారం అటువంటి వ్యక్తికి సాయుజ్యం లభిస్తుంది. బ్రహ్మపురాణంలో

**యేఽర్చంతి పరాం శక్తిం విధినాఽవిధినా పివా**
**న తే సంసారిణో నూనం ముక్తా ఏవ న సంశయః ॥**

క్రమం తప్పకుండా నియమ నిష్ఠలతో పరమేశ్వరిని ఆరాధించినవారు ముక్తజీవులు.

పరమేశ్వరుణ్ణి తెలియకుండా అర్చించినా ముక్తి కలుగుతుంది అని చెబుతోంది పురాణం. కాళహస్తీశ్వర మహాత్మ్యంలో ఏనుగు, పాము, సాలెపురుగు. ఈ మూడు పరమేశ్వరుని అలంకారం కోసం జీవితాన్ని బలిఇచ్చాయి. ఆ ఫలితంగా వాటికి ముక్తినిచ్చాడు పరమేశ్వరుడు. అలాంటప్పుడు క్రమం తప్పకుండా అర్చించేవారి సంగతి చెప్పేదేమీ లేదు. "ముక్తిని కోరే వారందరూ సర్వభూతాంతరాత్మ అయిన పరమేశ్వరిని ఆశ్రయించాలి" అని కూర్మపురాణంలో చెప్పబడింది.

ఈ రకంగా భక్తులకు ముక్తిని ప్రసాదిస్తుంది. కాబట్టి 'ముక్తిదా' అనబడుతున్నది.

## 737. ముక్తిరూపిణీ

మోక్షమే రూపంగా గలది. పరమేశ్వరి రూపము జ్ఞానము. పరబ్రహ్మసాక్షాత్కారం జరిగింది లేక ఆత్మ సాక్షాత్కారమయింది. అంటే అర్థం – జ్ఞానం కలిగింది. భేద భావం నశించింది. అజ్ఞానం పటాపంచలయింది అంటే జ్ఞానోదయమైంది అన్నమాట. స్వ స్వరూప జ్ఞానం కలిగింది అంటే ముక్తి కలిగింది అన్నమాట. ఇంద్రియాలను – మనస్సులోను. మనస్సును, బుద్ధిలోను బుద్ధిని – ముఖ్యప్రాణంలో లయం చెయ్యటమే ముక్తి. ఇదే తురీయస్థితి. తురీయాతీతస్థితి కూడా. పరమేశ్వరి ఎప్పుడూ ఈ స్థితిలోనే ఉంటుంది. అందుచేతనే ముక్తిరూపిణీ అనబడుతోంది.

## 738. లాస్యప్రియా

నర్తనమందు ప్రేమ గలది. నాట్యము మీద ప్రేమగలది. స్త్రీలు చేసే నృత్యాన్ని లాస్యము అంటారు. అది శృంగార పరమైనది. పురుషులు చేసేది తాండవము. అది వీరము, రౌద్రము. ఆధారచక్రంలో శివుడు తాండవము చేస్తూ ఉంటే దేవి లాస్య నాట్యం చేస్తోంది. శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 41వ శ్లోకంలో

**తవాధారే మూలే సహ సమయయా లాస్యపరమా**
**నవాత్మానం మన్యే నవరస మహాతాండవ నటమ్**

ఆధారచక్రంలో శివుడు తాండవం చేస్తుంటాడు. పరమేశ్వరి లాస్య నృత్యం చేస్తుంది. అందుకే ఆమె లాస్యప్రియా అనబడుతుంది.

## 739. లయకరీ

లయము అనేది చిత్తవృత్తి విశేషము. **దశధ్యానం మనోలయః** పది ధ్యానాలు చేసిన ఫలితం ఒక్క లయ లోనే వస్తుంది. ధ్యానం చేసేవారికి మనస్సును లయం చేసేది. భక్తుల హృదయాంతరాళాలలో ఆత్మ అనే భావన కలుగచేస్తుంది.

## 740. లజ్జా

సప్తశతిలో

**యా దేవీ సర్వభూతేషు లజ్జా రూపేణ సంస్థితా**
**నమ స్తస్యై నమ స్తస్యై నమ స్తస్యై నమో నమః**

పరమేశ్వరి అన్ని భూతాలయందు లజ్జారూపంలో ఉంటుంది. లజ్జ అంటే – నమ్రత. ఇది స్త్రీలకు అలంకారము. పరమేశ్వరి ముగ్ధ కాబట్టి లజ్జా అనబడుతోంది. ఈ లజ్జ అనేది నిరహంకార సూచకము.

## 741. రంభాదివందితా

రంభాది అప్సరాంగనలచే నమస్కరింపబడేది. బ్రహ్మ పిక్కల నుంచి పుట్టినవారు అప్సరసలు. అయితే క్షీరసాగరమథన సమయంలో వీరు పుట్టారు అని భాగవతం చెబుతోంది. అప్సరసలు ఇంద్రుని కొలువులో ఉండి నృత్య గీతాదులచే దేవతలను రంజింపచేస్తుంటారు. వీరిలో

1. రంభ 2. ఊర్వశి 3. మేనక 4. తిలోత్తమ 5. ఘృతాచి

అనేవారు ముఖ్యులు. వీరు అవివాహితులు. దేవ వేశ్యలవంటివారు. మునుల తపస్సులు పాడుచెయ్యటానికి ఇంద్రుడు వీరిని పంపుతుంటాడు. ఇటువంటి వారిచే పూజించబడునది. అంటే ఈ రకంగా ముల్లోకాలతోనూ పరమేశ్వరి పూజించబడుతుంది అని అర్థం.

రంభ అంటే హృల్లేఖ హ్రీంకారము. పరమేశ్వరి హ్రీంకారముచే జపించబడుతుంది.

## 742. భవదావసుధావృష్టిః

సంసార మనే దావానలాన్ని అమృతవర్షం కురిపించి శమింపచేసేది. సంసార సాగరంలో పడికొట్టుకుపోతున్న వారిని రక్షించి వడ్డుకుచేర్చేది. మానవుడుగా పుట్టిన జీవి కర్మలు చేస్తాడు. మరణానంతరము కర్మ ఫలితాన్ని స్వర్గ నరకాల్లో అనుభవించి, కర్మశేషమనుభవించటం కోసం మళ్ళీ పుడతాడు. మళ్ళీ కర్మలు చేస్తాడు. ఈ రకంగా గానుగకు కట్టిన ఎద్దులాగా సంసారమనే సాగరంలో పడికొట్టుకుంటూ ఉంటాడు. అటువంటి వారికి ఈ సంసారమంతా మిధ్య అని చెప్పి జ్ఞానోపదేశంచేసి వారికి తరుణోపాయం చూపేది పరమేశ్వరి.

భవుడు అంటే శివుడు. అతని యొక్క ఆస్థి అయిన రత్నాలు, ధనము. వీటిని భక్తులకు పంచేది. శివుని యొక్క ఆస్థి జ్ఞానము. అది రత్నాలకన్న విలువైనది. ఆ జ్ఞానాన్ని భక్తులకు పంచేది.

## 743. పాపారణ్యదవానలా

జీవి చేసిన కర్మలవల్ల పాప పుణ్యాలు వస్తాయి. వాటిని అతడే అనుభవించాలి. ఇదే కర్మ. పూర్వజన్మలలో చేసిన కర్మనే సంచితకర్మ అంటారు. దీన్ని రాబోయే జన్మలలో అనుభవించాలి. కర్మ అంతటిని ఒకేసారి అనుభవించటం జరగదు. కాబట్టి ఒక్కొక్క జన్మలో ఇంతకర్మ అనుభవించాలి అని పరమేశ్వరుడు విభజిస్తాడు.

ఆ ప్రకారం ఈ జన్మలో అనుభవించవలసిన కర్మ ఎక్కుపెట్టిన బాణం లాంటిది. దాన్ని ఆపటం ఎవరివల్లా కాదు. దాన్ని అనుభవించి తీరాలి. ఇక మిగిలినది సంచితకర్మ. అంటే రాబోయే జన్మలలో అనుభవించటానికి ఉన్నది. ఇది అమ్ములపొదిలోని బాణాలవంటిది.

కర్మను అనుభవించి క్షయం చేసుకోవాలంటే చాలా కష్టం. కల్పాంతంవరకూ అనుభవించినా కర్మ క్షయం కాదు. దీనికి వేరే మార్గం ఉంది. అదే పరమేశ్వరుణ్ణి ఆరాధించటం. మనసా వాచా కర్మణా పరమేశ్వరుణ్ణి గనక ఆరాధించినట్లైతే ఈ సంచితకర్మ నాశనమవుతుంది. అంటే జ్ఞానంవల్ల కర్మక్షయమవుతుంది. అందుకే పరమేశ్వరి పాపాలు అనే అడవికి దావానలం లాంటిది. దావానలం అడవిని ఏవిధంగా దహించివేస్తుందో అలాగే పరమేశ్వరిఆరాధన సంచితకర్మను నాశనం చేస్తుంది. సంచితకర్మ అంతా జ్ఞానాగ్నిలో దహించబడుతుంది. గజేంద్రమోక్షంలో గజేంద్రుడు చివరకు చేసిన పని ఇదే.

## 744. దౌర్భాగ్యతూలవాతూలా

దౌర్భాగ్యము అనే గడ్డిని దూరంగా విసిరి పారేసే గాలి వంటిది. దౌర్భాగ్యాలు అనే దూదిపింజలరాశికి పరమేశ్వరి ప్రచండమారుతం వంటిది. వాతూలుడు – వాయుదేవుడు. ఇతణ్ణే మాతరిశ్వుడు అంటారు. మహాశక్తిశాలి. పెనుగాలులు సృష్టించి పర్వతాలను కూడా ఎగరగొట్టగల సమర్థుడు. అటువంటి వాయుదేవుడికి దూదిపింజలు ఒక్క లెక్కకాదు. అదేవిధంగా పరమేశ్వరి తన భక్తుల యొక్క దౌర్భాగ్యాన్ని అంటే – ముసలితనం, రోగం, దరిద్రం వంటివి. అయితే దౌర్భాగ్యాలు ఎనిమిది. అవి

| | | | |
|---|---|---|---|
| 1. ఋణము | 3. ముసలితనము | 5. చోరత్వము | 7. రోగము |
| 2. యాచన | 4. జారత్వము | 6. దరిద్రము | 8. భుక్తశేష భోజనము. |

ఈ విధంగా వివిధరకాలయిన దౌర్భాగ్యాలను ఎగరగొట్టి వేయునది.

## 745. జరాధ్వాంతరవిప్రభా

ముసలితనము అనే చీకటిని నాశంచేసేది. పరమేశ్వరి తన భక్తుల ముసలితనాన్ని హరించి వేస్తుంది. అంటే ముసలితనం వల్ల వచ్చే అగచాట్లు రాకుండా చేస్తుంది. ముసలితనం అనే అంధకారానికి సూర్యకిరణాలు ఆ దేవి. పరమేశ్వరి కృపకు పాత్రులైనవారికి ముసలితనముండదు. ఇదే విషయాన్ని శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని నరం వర్షీయాంసం అనే 13వ శ్లోకంలో వివరించారు. గతంలో ఆ శ్లోకాన్ని మేము వివరించటం జరిగింది. పరమేశ్వరి కృపగనక ఉన్నట్లైతే ముసలివాడైనా, కురూపి, అందహీనుడు అయినా ముల్లోకాలను వశం చెయ్యగలుగుతాడు అని దాని భావం.

## 746. భాగ్యాబ్ధిచంద్రికా

భాగ్యము అనే సముద్రానికి వెన్నెల వంటిది. సంపద అనే సముద్రానికి పరమేశ్వరి శరత్కాల పూర్ణిమ నాటి చంద్రుని వంటిది. చంద్రుని యొక్క వృద్ధి క్షయాలను బట్టి సముద్రంలో ఆటుపోట్లు ఉంటాయి. అలాగే భక్తుల యొక్క భాగ్యము పరమేశ్వరి కృపా కటాక్ష వీక్షణాలను బట్టి పెరుగుతూ ఉంటుంది. అందుచేతనే ఆమె భాగ్యాబ్ధి చంద్రికా అనబడుతుంది.

## 747. భక్తచిత్తకేకిఘనాఘనా

పరమేశ్వరి భక్తుల యొక్క చిత్తములు అనే నెమళ్ళను సంతోషపెట్టటంలో మేఘము వంటి స్వరూపం గలది. మేఘాలను చూడగానే నెమళ్ళు సంతోషంతో పురివిప్పి నాట్యమాడతాయి.

ఘనాఘనము - తొలి కారుమేఘము. భక్తుని హృదయంలో పరమేశ్వరి మీద భక్తిభావం పొడచూపగానే, అతడి హృదయం ఆనందడోలికలలో తేలిఆడుతుంది. అందుచేతనే ఆమె భక్తచిత్తకేకి ఘనాఘనా అనబడుతోంది.

## 748. రోగపర్వతదంభోళిః

రోగములు అనే పర్వతాలకు వజ్రాయుధము వంటిది. పూర్వకాలంలో పర్వతాలకు రెక్కలు ఉండేవి. దాంతో అవి ఒకచోటి నుంచి ఇంకొకచోటికి ఇష్టం వచ్చినట్లు ఎగిరిపోయి జనావాసాల మీద వాలి పోతుండేవి. ఆ సమయంలో అపారమైన జననష్టం జరిగేది.

అప్పుడు దేవరాజైన ఇంద్రుడు వజ్రాయుధంతో వాటి రెక్కలు నరికి పారేశాడు. మేనక హిమవంతుల కుమారుడు మైనాకుడు. ఇంద్రుడి ధాటికి భయపడి సముద్రంలోకి పోయి దాక్కున్నాడు.

రోగాలు. 1. శారీరకాలు. 2. మానసికాలు. అని రెండురకాలు.

1. అనారోగ్యకారణంగా వచ్చేవి శారీరకాలు.

2. మనకు ఏదైనా రాలేదనో, ఉన్నది పోయిందనో బాధించేవి మానసికాలు.

వీటిలో శరీరకాల కన్న మానసికాలు మరీ బాధిస్తాయి. వీటినే చింత అంటారు. చితి చచ్చిపోయిన శరీరాన్ని దహించి వేస్తే, చింత బ్రతికి ఉన్న శరీరాన్ని దహించివేస్తుంది.

ఇటువంటి రోగాలను వజ్రాయుధంతో ఇంద్రుడు పర్వతాల రెక్కలు తెగనరికినట్లుగా, జ్ఞానఖడ్గంతో నాశనం చేస్తుంది ఆ పరమేశ్వరి.

## 749. మృత్యుదారుకుఠారికా

మృత్యువు అనే కట్టెకు గొడ్డలిపెట్టువంటిది పరమేశ్వరి. సాధకులు దేవిని ఉపాసించి జ్ఞానాన్ని పొందుతారు. ఈ జ్ఞానులు సాధనచేసి సాయుజ్యం పొందుతారు. అంటే వీరికి పునర్జన్మ ఉండదు. జన్మలేని వారికి మరణముండదు కదా ? అందుచేత వీరు మృత్యుంజయులు. కాబట్టే పరమేశ్వరి తన భక్తులకు మృత్యువు అనే కట్టెను నరికివేస్తుంది అని చెప్పబడుతోంది.

ఈ రకంగా నందివిద్య 22 నామాలలో వివరించబడింది.



శ్రీ 'ఛ'కార దేవి

# 46. మంగళచండీవిద్య

కశ్యపుడికి దితియందు జన్మించినవాడు వజ్రాంగుడు. ఇతడి భార్య వరాంగి. ఇతడు వీలైనంతవరకు దేవతలను బాధించేవాడు. వీరి కుమారుడు తారకాసురుడు. బ్రహ్మను గూర్చి తపస్సుచేసి తనతో సమానమైన వారు ప్రస్తుత సృష్టిలో లేకుండా వరం పొందాడు. వరబలంతో దేవతలను నానాహింసలపాలుచేశాడు. చివరకు కుమారస్వామి చేతిలో మరణించాడు.

తారకాసురుడికి ముగ్గురు కుమారులున్నారు. 1. విద్యున్మాలి. 2. తారకాక్షుడు 3. కమలాక్షుడు. వీరు బ్రహ్మను గురించి తపస్సుచేసి సకలసౌఖ్యాలు కామగమనము గల మూడు పట్టణాలు కావాలి అన్నారు. వారడగినట్లే మూడు పట్టణాలు ఇస్తూ బ్రహ్మదేవుడు ఆ పట్టణాలు ఒకదానితో ఒకటి కలియకుండా ఉన్నంతవరకూ మిమ్మలను ఎవరూ ఓడించలేరు అవి కలిశాయంటే వీరు బలహీనులౌతారు అన్నాడు. అంతట వాళ్ళు మయుణ్ణి పిలిచి వెండి, బంగారము, ఇనుములతో ఆ పట్టణాలను తయారుచేయించారు.

తారకాక్షుని కుమారుడు హరి. అతడు విష్ణువును గూర్చి తపస్సుచేసి తమ వారిలో ఎవరు చచ్చిపోయినా సరే, వాళ్ళని నీళ్ళలోపడెయ్యగానే వారు బ్రతికి, వారితోపాటు సమానమైన బలం గల వాళ్ళు ఇంకా పదిమంది పుట్టేటట్లు వరం సంపాదించి, అలా చెయ్యగల బావులను తమ పట్టణాలలో నిర్మింపచేశాడు. ఇప్పుడు వారు అజేయులు. వారికి మరణం సంభవించటం కూడా చాలా కష్టం. ఈరకంగా అభేద్యమైన త్రిపురాలను కలిగి ఉన్నారు కాబట్టి వారిని త్రిపురాసురులు అన్నారు.

త్రిపురాసురులు తమ పట్టణాలలోనే ఉంటూ కామగమనంతో కావలసిన చోటికిపోతూ, ఎక్కడబడితే అక్కడ ఆ పురాలతోసహా దిగేవారు. ఆ ధాటికి అక్కడ పట్టణాలు, కట్టడాలు నాశనమైపోయేవి. ఈ రకంగా భూలోకం, దేవలోకం నాశనమవుతున్నాయి. వాళ్ళని చంపటానికి దేవతల శక్తి చాలటంలేదు. దేవతలంతా శివుణ్ణి ఆశ్రయించి, త్రిపురాసురసంహారం చెయ్యటానికి తమ శక్తులన్నీ అతడికిచ్చారు. అప్పుడు శివుడు.

| | | |
|---|---|---|
| భూమి | – | రథముగా |
| రవి, చంద్రులు | – | చక్రాలుగా |
| నాలుగువేదాలు | – | గుర్రాలు |

| | | |
|---|---|---|
| బ్రహ్మ | – | సారథి |
| మేరువు | – | విల్లు |
| శ్రీహరి | – | అస్త్రం |

గా చేసుకుని త్రిపురాసుర సంహారానికి బయలుదేరారు.

ఆ యుద్ధంలో శివుని రథచక్రం త్రిపురాసురులు ఆయుధాలవల్ల దెబ్బతిన్నది. అప్పుడు శివుడు విష్ణుమూర్తి సలహామేరకు పరమేశ్వరిని ప్రార్థించగా చండరూపంలో ఉన్న దుర్గ ప్రత్యక్షమై అతడికి సాయంచేసింది. పాసుపతాస్త్రంతో త్రిపురాసుర సంహారం చేశాడు శివుడు. చండిక అనే ఈ దేవత దుర్గకు ఇంకొకరూపం. మూలప్రకృతి. స్త్రీలకు ప్రత్యక్షదైవం, కరుణామయి.

ఈ రకంగా శివునిచే పూజింపబడి ఆయనకు మంగళం చేకూర్చింది కాబట్టి ఆమె మంగళచండి అయింది. ఆ తరువాత మనువంశంలో పుట్టిన మంగళుడనేవాడు ఈ దేవిని ఆరాధించాడు. కన్యలు మంగళవారాలలో ఈ దేవిని ఆరాధిస్తారు. కాబట్టి ఈమె మంగళచండి. ఈ దేవత అభీష్టఫలదాయిని.

750 నుండి 790 నామం వరకూ మంగళచండీవిద్య చెప్పబడుతోంది.

మహేశ్వరి అనే దేవతయే మంగళచండి. ఆమె అన్నిరకాల ఆహారాన్ని మనకు ఇస్తుంది. అపర్ణా అనే పేరుతో పిలువబడింది. తన భక్తులుకాని వారిని, అంటే నాస్తికులమీద ఆమెకు కోపం ఎక్కువ. అధర్మపరులైన రాక్షసులను సంహరిస్తుంది. అన్ని లోకాలవారిచేత పూజింపబడుతుంది. సకల జగత్తుకూ కారణభూతురాలు. ధర్మార్థకామాలను ఇస్తుంది. మూడునేత్రాలు గలది. సత్వరజస్తమోగుణాలరూపం గలది. స్వర్గము, అపవర్గము (శాశ్వతమైన సుఖము) రెండింటినీ ఇచ్చేది ఆమె. జ్ఞానమయి. దాసానిపూవ్వులాగా పాటలవర్ణంతో ప్రకాశిస్తుంటుంది. యజ్ఞాదికర్మ స్వరూపం ఆమె. ఏ వ్రతంచేసినా ఆమెకు ఇష్టమే. ఏ దేవతను ఆరాధించినా ఆమెకు సమ్మతమే. చంచలస్వభావులకు, ఆమె పట్ల నమ్మకం లేనివారికి దుర్లభమైనది. అన్నిటికన్న గొప్పది. మేరుపర్వతమే ఆమె నివాసస్థానము. మందారపూలయందు ఆమెకు ముక్కువ ఎక్కువ. జ్ఞానులచే ఆరాధించబడుతుంది. ఈ విశాలవిశ్వమే ఆమెరూపము. పాపరహిత సహస్రశిరస్సులు గలది. అంతర్ముఖమైనది. పరాకాశమందుంటుంది. ప్రాణాలను ఇచ్చేది ఆమె. అసలు ప్రాణరూపమే ఆమె. మార్తాండభైరవుడు, మంత్రిణిశ్యామల ఇత్యాదులచే పూజించ

బడుతుంది. ఆమెను త్రిపురేశీ అని కూడా అంటారు. రాక్షస సంహారం చెయ్యటానికి అపరిమితమైన సేన ఆమెకు ఉన్నది. త్రిగుణాలకు అతీతమైనది పరా, అపరా. రెండు విద్యలూ ఆమె.

ఆమెను అర్చించినవారికి ఇహము, పరము రెండూ ఏది కావాలంటే అది ఇస్తుంది.

## 750. మహేశ్వరీ

మహా అంటే – చాలా గొప్పదైన ఈశ్వరి. మహా అంటే – బ్రహ్మ. ఈ జగత్తును సృష్టించటానికి, వాటి స్థితికి, లయకు కూడా కారకురాలు. ఆమెయే ప్రభివి. మహేశ్వరుని శక్తి మహేశ్వరి. ఈమెయే మంగళచండి అనబడుతోంది.

ఇక్కడ పరమేశ్వరి సూర్య చంద్ర అగ్నుల స్వరూపమైనది. పంచభూతాల స్వరూపమైనది. కంటికి కనిపించేదంతా ఆమె. కంటికి కనిపించనిది కూడా ఆమె. ఈ రెండింటికీ మధ్య ఏ భేదమూలేనిది. **అణోరణీయాం మహతోమహీయాం** చిన్న వాటికన్న, అణువుకన్నా కూడా చాలా చిన్నదైనది. పెద్దవాటికన్న అంటే మహత్తుకన్న కూడా పెద్దదైనది. మహాప్రళయం సంభవించినప్పుడు కర్మక్షయం కాని జీవరాశినంతటినీ, వాటి కర్మ పరిక్వం అయి, అనుభవించే స్థితివచ్చే వరకూ తన ఉదరంలో ధరించి ఉండేది. వాటి కర్మపరిపక్వం కాగానే మళ్ళీ ఆ జీవులకు జన్మను కలిగించేది. ఆ పరమేశ్వరి ఎలా ఉంటుంది అనేది వాక్కుతో చెప్పనలవికాదు. చెవులతో వినజాలనిది. కంటితో చూడజాలనిది ఎందుకంటే **నచక్షుర్గచ్ఛతిః నాహగ్గచ్ఛతినోమనః** ఆత్మ ఉండేచోటికి కనులు పోలేవు. చెవులు పోలేవు. మనస్సుపోలేదు. అంటే ఇంద్రియాలతో ఆత్మను గురించి తెలుసుకోవటం సాధ్యంకాదు అంటోంది ఉపనిషత్తు. అటువంటి మహత్తు గలిగిన పరబ్రహ్మస్వరూపము మహేశ్వరి. 208వ నామము మాహేశ్వరీ అని చెప్పబడింది.

## 751. మహాకాళీ

మహా అనే శబ్దానికి అర్థం ఇందాక చెప్పినదే వర్తిస్తుంది. గొప్పదైన కాళి. త్రిశక్తులలో కాళి ఒకతె. ఈమె రుద్రుని శక్తి. మధుకైటభులసంహారానికి దోహదం చేసిన దేవి.

**ఖడ్గం చక్రగదేషచాపపరిఘాన్ శూలం భుసుండీం శిరః**
**శంఖం సం ధతీం కరై స్త్రినయనాం సర్వాంగభూషావృతామ్**
**యాం హన్తుం మధుకైటభౌ జలజభూస్తష్టావ సుప్తే హరౌ**
**నీలాశ్మద్యుతిమాస్యపాదదశకాం సేవే మహాకాలికాం ॥**

| | | |
|---|---|---|
| 1. ఖడ్గము | 5. బాణాలు | 9. శిరస్సు |
| 2. చక్రము | 6. ఇనుపకట్లగుదియ | 10. శంఖము |
| 3. గద | 7. శూలము | |
| 4. ధనుస్సు | 8. భుశుండి | |

తన పదిచేతులయందు ధరించి, మూడుకనులు గలిగి సర్వాభరణాలంకృతమై, విష్ణువు యోగనిద్రలో ఉన్నప్పుడు మధు కైటభ సంహారం కోసం బ్రహ్మతో స్తుతించబడిన దేవి. ఇంద్రనీలాల వంటి శరీరకాంతి గలది. పది ముఖాలు, పదిపాదాలు గలది అయిన మహాకాళికను సేవించుచున్నాను.

మహాకాళ క్షేత్రంలో ఉండే మహాకాళేశ్వరుని పత్ని. కలకత్తాలో దక్షిణేశ్వరం ఆలయంలో వెలసినదేవత దక్షిణకాళి.

**అస్యశ్రీ దక్షిణకాళి మహామంత్రస్య । భైరవఋషిః । ఉష్ణిక్ఛందః । శ్రీ దక్షిణకాళీ దేవతా । క్రీం బీజం । హూం శక్తిః । హ్రీం కీలకం । జపేవినియోగః**

**న్యాసము** : క్రాం । క్రీం । క్రూం । క్రైం । క్రౌం । క్రః ॥

**ధ్యానము** : **శవారూఢాం మహాభీమాం ఘోరదంష్ట్రాం హసన్ముఖీం**
**చతుర్భుజాం ఖడ్గముండవరాభయకరాం శివాం**
**ముండమాలాధరాం దేవీం లలజ్జిహ్వాం దిగంబరాం**
**సదా సంచింతయే త్కాళీం స్మశానాలయ వాసినీం ॥**

**మంత్రము :** **క్రీంక్రీంక్రీం హూంహూం హ్రీంహ్రీం దక్షిణకాళికే**
**క్రీంక్రీంక్రీం హూం హూం హ్రీంహ్రీం స్వాహా**

మహాకాళి అంటే – అనంతమైన కాలస్వరూపం. యుగాలు, మన్వంతరాలు, కల్పాలు అనే విభాగాలేవీ ఉండవు. ఆద్యంతములు లేనంటువంటిది ఈ కాలస్వరూపం. భూతభవిష్యద్వర్తమాన భేదాలు లేనటువంటిది. పగలు, రాత్రి, తిథులు, పక్షాలు మాసాలు సంవత్సరాలు లేనిది. అన్నీ కలిసి ఉన్న అఖండమైన కాలస్వరూపం. ఈ కాలచక్రాన్ని నియమానుసారం పరిభ్రమింపచేసే మహేశ్వరశక్తి. మృత్యువుకు మృత్యువు. రాక్షససంహారంకోసం పరమేశ్వరి అంశగా జన్మించినది.

## 752. మహాగ్రాసా

అపరిమితమైన కబళము (ఆహారము) గలది. లోకంలోని ప్రతిజీవికీ ఏదోరూపంలో ఆహారాన్ని అందిస్తున్నది కాబట్టి మహాగ్రాసా అనబడుతుంది. అన్ని జీవులకు ఒకే ఆహారంకాదు. భిన్నమైన ఆహారపదార్థాలు. జగత్తులో కనిపించే ప్రతివస్తువూ కూడా ఇంకొకదానికి ఆహారమే అవుతున్నది. కొన్నిటికి శాఖాహారం. కొన్నిటికి మాంసాహారం. బలమైన జీవి బలహీనమైన దాన్ని ఆహారంగా తీసుకుంటుంది. ఇది ప్రకృతి సహజం. సృష్టి అంతా పరమేశ్వరి మయం కాబట్టి ఆమె మహాగ్రాసా అనబడుతోంది.

## 753. మహాశనా

గొప్పదైన అన్నము లేక ఆహారం గలది. చరాచరజగత్తంతా పరమేశ్వరస్వరూపమే. కాబట్టి పై నామంలో చెప్పినట్లుగా ఈ జగత్తులో ఉన్న ప్రతివస్తువు ఇంకొక దానికి గ్రాసమే. విశ్వానికి ప్రతీక అయిన వైశ్యానరుడికి – ఈ విశ్వమే ఆహారము. అందుకే పరమేశ్వరి మహాశనా అనబడుతోంది.

శివాదిక్షితి పర్యంతము తత్త్వాలు అశనముగా గలది.

అనంతకోటి బ్రహ్మాండాలు అశనముగా గలది.

## 754. అపర్ణా

పోయిన ఋణము గలది. ఋణ శేషము లేనిది. తారకాసుర సంహారం కోసం మేనకా హిమవంతులకు పరమేశ్వరి అంశతో కుమార్తె జన్మించింది. ఆమె పర్వతరాజు కుమార్తె కాబట్టి – పార్వతి.

హిమవంతుని కుమార్తె కాబట్టి – హైమవతి.

ఈ బాలిక యుక్తవయసురాగానే పరమశివుణ్ణి తప్ప వేరెవరినీ వివాహంచేసుకోను అని తపస్సు చెయ్యటానికి అడవులకు వెళ్ళిపోయింది.

అక్కడ రకరకాల పద్ధతులలో, కఠోరనియమనిష్ఠలతో తపస్సు సాగించింది.

| | | |
|---|---|---|
| ఎండాకాలంలో | – | చుట్టూ మండే కట్టెలు ఉంచుకుని. |
| శీతాకాలంలో | – | మెడలోతున ఉన్న చల్లటినీటిలో మునిగి తపస్సు చేసింది. |

| | | |
|---|---|---|
| కొంతకాలం | – | ఒంటిపూట భోజనం |
| కొంతకాలం | – | భూశయనము |
| కొంతకాలం | – | ఆహారాన్ని వదిలి, కేవలము ఆకులు అలములు తిని తపస్సు చేసింది. |
| మరికొంతకాలం | – | ఆకులు కూడా వదిలేసింది. |

ఈ రకంగా ఆకులు కూడా తినటంమానివేసింది. కాబట్టి అపర్ణా అని పిలువబడింది.

## 755. చండికా

చండి – కోపము గలిగినది. భగవద్భక్తులు కాని వారియందు కోపముగా నుండునది.

పరమేశ్వరి యొక్క రూపవిశేషము. దుర్గాదేవియే చండిక. ప్రచండమైన పరాక్రమము గలది. తీక్షణమైన శాసనములు గలది. శత్రువుల హృదయాలలో భయాన్ని కలుగచేసేది.

**తతో దేవీశరీరా త్తు వినిష్క్రాంతాఽ తిభీషణా**

**చండికాశక్తి రత్యుగ్రా శివాశతనినాదినీ**

పరమేశ్వరి శరీరమునుండి అతిభయంకరమైన, అత్యుగ్రమైన స్వరూపం ఒకటి బయటకు వచ్చింది. ఆమె ఆజ్ఞలకు భయపడే గాలి సవ్యంగా వీస్తున్నది. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. చంద్రుడు చల్లదనాన్నిస్తున్నాడు. చండముండాది రాక్షససంహారం చెయ్యటానికే చండిక ఆవిర్భవించింది.

దేవీభాగవతంలో ఏడుసంవత్సరాల బాలిక చండిక అనబడుతుందని చెప్పబడింది.

**అస్యశ్రీ చండీనవార్ణ మహామంత్రస్య బ్రహ్మవిష్ణు రుద్రా ఋషయః। గాయత్ర్యుష్ణి గనుష్టుభశ్ఛందాంసి। శ్రీమహాకాళీ మహలక్ష్మీ మహాసరస్వత్యో దేవతాః। రక్తదంతికా దుర్గా భ్రామర్యో బీజాని। నందా శాకంభరీ భీమా శ్శక్తయః। అగ్నివాయుసూర్యా స్తత్వాని। శ్రీమహాకాళీ మహలక్ష్మీ మహాసరస్వతీ ప్రీత్యర్థే జపే వినియోగః।**

**న్యాసము** : **ఐం ॥ హ్రీం ॥ క్లీం ॥ చాముండాయై ॥ విచ్చే ॥ ఐం హ్రీం క్లీం చాముండాయైవిచ్చే॥**

**ధ్యానము** : **యా దేవీ మధుకైటభప్రశమనీ యా మాహిషో న్మూలినీ**
**యా ధూమ్రేక్షణచండముండదమనీ యారక్తబీజాశనీ।**

**యా శుంభాదినిశుంభదైత్యదమనీ యా సిద్ధలక్ష్మీః పరా**
**సా చండీ నవకోటిశక్తిసహితా మాం పాతు విశ్వేశ్వరీ ॥**
**మాత ర్మే మధుకైటభఘ్ని మహిషప్రాణాపహారోద్యమే**
**హేలానిర్మిత ధూమ్రలోచనవధే హేచండముండార్దినీ ।**
**నిశ్శేషీకృతరక్తబీజదనుజే నిత్యే నిశుంభాపహే**
**శుంభధ్వంసిని సంహరాశు దురితం దుర్గే నమస్తేఽంబికే ॥**

**మంత్రము** : ఐం హ్రీం క్లీం చాముండాయైవిచ్చే ॥

## 756. చండముండాసురనిషూదినీ

చండముండాది రాక్షసులను సంహరించింది. కాబట్టి చండముండాసురనిషూదినీ అనబడుతోంది. అందుకే ఆమె చాముండా అనబడుతోంది. సప్తశతిలో

**యస్మా చ్ఛండం చ ముండం చ గృహీత్వా తా వుపాగతా**
**చాముండేతి తతో లోకే ఖ్యాతా దేవీ భవిష్యసి**

నువ్వు చండముండులను ఇద్దరినీ చంపి నా దగ్గరకు తెచ్చావు. కాబట్టి ఇక లోకంలో చాముండ అనే పేరుతో ప్రసిద్ధిచెందుతావు.

వరాహపురాణంలో దేవి రురుడు అనే రాక్షసునితో యుద్ధంచేసి అతని శిరస్సు ఖండించింది. ఆ తరువాత అతని శిరస్సును మొండాన్ని శూలానికి గ్రుచ్చి తీసుకుపోయింది కాబట్టి చాముండా అనబడింది.

## 757. క్షరాక్షరాత్మికా

అపారమైన సంఖ్య గలవి, క్షరము అనగా నాశనములేనివి అయిన వర్ణములు రూపముగా గలది.

పంచభూతాత్మకమైన జగత్తును తన రూపముగా గలది. క్షరము అంటే నశించేది. అక్షరము – నాశనము లేనిది. పరమేశ్వరి జగత్తులోని అన్ని జీవుల యొక్క స్వరూపంతోనూ ఉన్నది. ఆ జీవులన్నీ నాశనమవుతాయి. పరబ్రహ్మరూపం కాబట్టి ఆమెకు నాశనంలేదు. ఈరకంగా దేవి క్షరా, క్షరాత్మికా. అంటే నాశనము ఉన్నది, నాశనములేనిది రెండూ ఆమె.

అకారాది క్షకారాంతము ఉండేవి మాతృకావర్ణాలు ఆ వర్ణ సముదాయమే పరమేశ్వరి. వరాహపురాణంలో

**ఏకాక్షరేతి విఖ్యాతా సర్వాక్షరమయీ శుభా**

**సైవ విశ్వేశ్వరీ దేవీ సైవో క్తా ప్యమితాక్షరా**

ఏకాక్షరరూపిణి ఆమే. అమితాక్షరరూపిణీ ఆమే. అంటే ఒకే అక్షరం ఓంకారంతో ధ్యానించబడేది ఆ పరమేశ్వరియే. అనేకాక్షరాలు గల నామాలతో ధ్యానించబడేది ఆమెయే. శ్రీమద్భాగవతంలో

**విష్ణో స్తు త్రీణి రూపాణి పురుషాఖ్యాని యే విదుః**

**ప్రథమం మహత స్రష్టా ద్వితీయం త్వండ సంస్థితా**

**తృతీయం సర్వభూతస్థం తాని జ్ఞాత్వా విముచ్యతే**

పరమేశ్వరునికి మూడురూపాలు.

1. మహత్తుకు కారణరూపం. మహత్తును సృష్టించింది.
2. బ్రహ్మాండగోళము నందలిది. అండములోది
3. సర్వ భూతాంతరాత్మ. భూమిమీద ఉండేది. వీటిని తెలుసుకున్నవాడు ముక్తి పొందుతాడు.

## 758. సర్వలోకేశీ

**సర్వేషాం లోకానాం ఈశీ ఈశ్వరీ**

సమస్తలోకాలకు ఈశ్వరి. జగత్తులో 14 లోకాలున్నాయి. ఊర్ధ్వలోకాలు. అథోలోకాలు.

| | | | |
|---|---|---|---|
| 1. భూలోక | 3. సువర్లోక | 5. జనోలోక | 7. సత్యలోకాలు |
| 2. భువర్లోక | 4. మహాలోక | 6. తపోలోక | ఇవి ఊర్ధ్వలోకాలు. |
| 1. అతల | 3. సుతల | 5. రసాతల | 7. పాతాళాలు |
| 2. వితల | 4. తలాతల | 6. మహాతల | ఇవి అథోలోకాలు. |

ఈ లోకాలన్నింటికీ ప్రభ్వి. శ్రీచక్రంలోని మన్వస్రం 14 కోణాలు గల చక్రం ఈ లోకాలకు ప్రతీక. శ్రీచక్రాధిదేవత పరమేశ్వరి. కాబట్టి ఆ పరమేశ్వరే ఈ లోకాలకు ఈశ్వరి. అందుచేతనే సర్వలోకేశీ అనబడుతోంది.

## 759. విశ్వధారణీ

**విశ్వం ధారయతీతి తథా**

విశ్వమును ధరించునది. పరమేశ్వరి. సకల జగత్తులకు కారణభూతురాలు. వాటికి ఆధారమైనది. వాటిని ధరించేది. కాబట్టి విశ్వధారిణీ అనబడుతోంది.

మహాప్రళయం సంభవించినప్పుడు ఈ విశ్వాలన్నింటినీ తన గర్భంలో ధరిస్తుంది. కాబట్టి విశ్వధారిణీ అనబడుతుంది.

## 760. త్రివర్గదాత్రీ

త్రివర్గములు అంటే ధర్మార్థకామాలు. వీటిని ఇచ్చేది. సత్వరజస్తమోగుణాలు. వీటిని కల్పిస్తుంది. కాబట్టి త్రివర్గధాత్రీ అనబడుతుంది. ఉపాసనాపరులకు వారివారి యోగ్యతలను బట్టి త్రివర్గాలను ప్రసాదిస్తుంది. మంగళచండీ విద్యకు ఈ నామమే ఫలశ్రుతి.

## 761. సుభగా

ఐదుసంవత్సరాల కన్య సుభగ. ప్రపంచంలోని సువాసినులందరి సౌభాగ్యము స్వరూపముగా గలది. విశ్వకోశాన్ననుసరించి భగ అంటే – ఐశ్వర్యము, మాహాత్మ్యము, జ్ఞానము, వైరాగ్యము, యోని, కీర్తి, వీర్యము, ప్రయత్నము, ఇచ్ఛా, శ్రీ, ధర్మ, రవి, ముక్తి అని అర్థం చెప్పబడింది. ఇవన్నీ కలిగి ఉన్నది దేవి. తన భక్తులకు వీటన్నింటినీ ప్రసాదించునది పరమేశ్వరి. శోభాయమానమైన రవిని గలిగినది.

విష్ణుపురాణంలో విష్ణువు యొక్క సర్వశక్తులు ఋగ్ యజుస్సాములని పేర్లు గలవి. మూడురకాలైన శక్తులు జగత్తును నాశనంచేస్తాయి. ప్రతినెలలోనూ సూర్యుడు ఎక్కడ ఉంటాడో అక్కడ త్రివేదముల స్వరూపం గల విష్ణుశక్తి ఉంటుంది.

| | | |
|---|---|---|
| ఉదయం పూట | – | ఋగ్వేదము |
| మధ్యాహ్నం | – | యజుర్వేదము |
| సాయంసమయాన | – | సామవేదము |

ప్రకాశిస్తుంటాయి. ఈ రకంగా విష్ణువు వేదాలరూపంలో ఎప్పుడు సూర్యునితోనే ఉంటాడు. ఈ మూడు శక్తులూ త్రిమూర్తులే. ఈ రకంగా శక్తిరూపం దాల్చిన రవికి ఉదయాస్తమయాలు లేవు. ఇక్కడ ఉండే విష్ణువు సప్తమయుడు. సప్తమయుడు అంటే

1. దేవతలు 3. గంధర్వులు 5. యక్షులు 7. రాక్షసులు
2. ఋషులు 4. అప్సరసలు 6. సర్పాలు

మొదలైన ఏడుగణాలతో కూడినవాడు. ఈ రకంగా రవిశోభాయమానుడవుతున్నాడు.

**పూజ్యతే యా సురైః సర్వైయతః స్తాం చైవ భజతే ।**
**సేవాయాం భజతేర్ధాతో ర్భగవత్యేన సా స్మృతా ॥**

దేవతలచే భజింపబడునది. తనను భజించే వారిని అనుగ్రహించేది కాబట్టి సుభగా పద్మపురాణంలో

**త్రిలోక సౌభాగ్యమయీం భుక్తిముక్తి ప్రదా ముమాం**
**ఆరాధ్య సుభగాం భక్త్యా నారీ వా కిం న విందతి**

దేవతలకు శుభములు చేకూర్చేది. భుక్తి ముక్తి ప్రసాదించేది అయిన పరమేశ్వరిని (ఉమను) భక్తితో ఆరాధించటం శుభప్రదము వరాహపురాణంలో

**ఇక్షవ స్తరురాజ శ్చ నిష్పావా జీవరధాన్యకే**
**వికారవ చ్చ గోక్షీరం కుసుంభం కుంకుమం తథా**
**లవణం చేతి సౌభాగ్యాష్టకం స్థావరముచ్యతే ॥**

1. చెరకు 3. జీలకర్ర 5. గోక్షీరము 7. పూలు
2. పారిజాతము 4. ధాన్యము 6. కుంకుమపువ్వు 8. ఉప్పు

ఇవి సౌభాగ్యాష్టకాలు. పరమేశ్వరి వీటి స్వరూపమైనది కాబట్టి సుభగా అనబడుతోంది.

## 762. త్ర్యంబకా

మూడునేత్రములు గలది. దేవీపురాణంలో

**సోమసూర్యానలా స్త్రీణి యన్నేత్రాణ్యంబకాని**
**సా తేన దేవీ త్ర్యంబకేతి మునిభిః పరికీర్తితా ॥**

సూర్యచంద్రాగ్నులు ముగ్గురు ఆమెకు కనులు కాబట్టి ఆమెను త్ర్యంబక అంటారు.

ఆమె మృత్యుంజయస్వరూపిణి. త్రిమూర్తులకు జనని. త్రిలోకాలకు జనని, త్రిశక్తులకు జనని. ఈ విధంగా త్రిపుటికంతటికీ ఆమె తల్లి. భూతభవిష్యద్వర్త మాన కాలాలు మూడు ఆమే.

**భూతం భవద్భవిష్యదితి సర్వమోంకార ఏవ**

భూతభవిష్యద్వర్తమాన కాలాలు మూడూ పరమేశ్వరస్వరూపమైన ఓంకారమే అంటోంది మాండూక్యోపనిషత్తు.

ఈ రకంగా ఆమె త్రిపుటి కాబట్టి త్ర్యంబకా అంటే ఆ పరమేశ్వరియే.

## 763. త్రిగుణాత్మికా

త్రిగుణ స్వరూపం కలది. సత్వరజస్తమోగుణాలను త్రిగుణాలు అంటారు. సత్వరజస్తమోగుణాల సామరస్యం గలది. సృష్టి అంతా గుణత్రయ విభాగం వల్లనే ఏర్పడింది అని గతంలో వివరించటం జరిగింది. ఈ గుణాలు గలవారు మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులు. వీరియొక్క సమైక్యరూపిణి కాబట్టే పరమేశ్వరి త్రిగుణాత్మికా అనబడుతున్నది.

## 764. స్వర్గాపవర్గదా

**య న్న దుఃఖేన సంఛన్నం న చ గ్రస్త మనంతరం**
**అభిలాషోపనీతం య త్తత్సుఖం స్వః పదాస్పదమ్**

ఏదైతే దుఃఖముచేత ఇప్పుడుగాని తరువాతగాని చెడదో, అభిలాషచే ఏది పొందదగినదో అది 'స్వః' అనే పదంతో చెప్పబడుతోంది అంటోది వేదం.

ఈ రకంగా శ్రుతి ప్రసిద్ధమైనది. స్వర్గము – నిత్యసుఖము అపవర్గము – మోక్షము. ఈ రెండు సుఖాలను ఇచ్చేది పరమేశ్వరి.

పరమేశ్వరి భోగాలను, మోక్షాన్ని రెండింటినీ ఇస్తుంది అని గతంలోనే చెప్పాం. ఐహికసుఖాలు కావాలంటే మోక్షం వదలుకోవాలి. అలాగే మోక్షం కావాలంటే ఐహికవాంఛలు కూడదు. కాని పరమేశ్వరి అర్చించిన వారికి ఇహపరాలు రెండూ ఒనగూడుతాయి.

దేవతల శక్తి తక్కువ. వారు భోగభాగ్యాలు, సిరిసంపదలు ఇవ్వగలరు. అంతేగాని మోక్షాన్ని మాత్రం ఇవ్వలేరు. అది వారి పరిధికి మించినది. అనేకమంది రాక్షసులు బ్రహ్మను గురించి తపస్సు చేసి చావులేకుండా వరం కావాలి అన్నారు కాదన్నాడు బ్రహ్మ. ఎందుకని ? ఇక్కడ తపస్సు చేసింది కర్మ బ్రహ్మను గురించి అతని ఆయువు బ్రహ్మకల్పం. కల్పాంతంకాగానే అతను పరబ్రహ్మలో లీనమవుతాడు. అతనికే శాశ్వతత్త్వం లేదు.

అలాంటప్పుడు అతను తనకులేని శాశ్వతత్వాన్ని మనకు ఎలా ప్రసాదించగలుగుతాడు? అలాగే మిగిలిన దేవతలు కూడా. మోక్షమివ్వగలిగిన శక్తి ఆ పరమేశ్వరికి ఒకర్తెకే ఉన్నది.

కర్మలు చేస్తే పుణ్యం వస్తుంది. సంకల్పం నెరవేరుతుంది. కాని మోక్షం మాత్రంరాదు. నిష్కామ్యకర్మ చేస్తే ఫలితం రాదు. అది మోక్షమార్గం. ఈ రకంగా స్వర్గము, అపవర్గము రెండింటినిచ్చేదీ ఆ పరమేశ్వరియే. అందుచేత స్వర్గాపవర్గదా అనబడుతోంది.

## 765. శుద్ధా

**అవిద్యక మాలిన్య శూన్యా**

అవిద్యా సంబంధమైన మాలిన్యములేనిది. పవిత్రమైనది, పరిశుద్ధమైనది. జ్ఞానస్వరూపిణి. గుణములు, రాగద్వేషాలు ఏమాత్రంలేనిది. శుద్ధచైతన్యస్వరూపము. నిత్యశుద్ధ బుద్ధ ముక్తత్వము.

## 766. జపాపుష్పనిభాకృతిః

దాసానిపూవ్వుతో సాటియైన ఆకారము గలది. దక్షిణామూర్తి సంహితలో జపం లేకుండా మంత్రం గల వారికి ఫలితమునిచ్చేది అజపా మంత్రము. ఇది సంసారపాశాలను ఛేదిస్తుంది.

ఇక్కడ ఆకారము అంటే శరీరము వర్ణము అని అర్థం. పరమేశ్వరి దాసానిపువ్వు లాగా ఎరుపురంగులో ఉంటుంది.

**అరుణకిరణజాలై రంచితాశావకాశాః**

**అరుణాంకరుణాతరంగితాక్షీం**

ఈ రకంగా అనేకచోట్ల పరమేశ్వరి శరీరచ్ఛాయ వర్ణించబడింది. ఆమె పాటలవర్ణము గలది.

## 767. ఓజోవతీ

ఓజస్సు అంటే తేజస్సు, బలము, కాంతి అని అర్థం. పరమేశ్వరి దివ్యమైన తేజస్సుతో ప్రకాశిస్తూ ఉంటుంది. కాబట్టి ఓజోవతి అనబడింది.

మానవశరీరం ఏడు ధాతువులతో ఏర్పడింది. కాగా ఎనిమిదవ ధాతువు ఓజస్సు, ఇది అన్ని ఇంద్రియాలసారమైనది.

**ఓజస్తేజోంశధాతూనా మవష్టంభప్రకాశయోః**

ఓజస్సు అనగా ప్రకాశము. బలము, కాంతి, తేజస్సు. ఇవి ఓజస్సు లక్షణాలు. అవన్నీ కలిగి ఉన్నది పరమేశ్వరి. అందుకే ఆమె ఓజోవతీ అనబడింది.

## 768. ద్యుతిధరా

కాంతిని ధరించునది.

**ద్యుతి మంగగతాం కాంతిం ధారయన్ ద్యుతిధరః**

తేజస్సును విరజిమ్ము అంగసంపద గలది. ఆమె దేహంలోని అవయవాలన్నీ తేజస్సుతో ప్రకాశిస్తుంటాయి. ఆమె బ్రహ్మవర్చస్సు అనే అగ్ని తేజస్సుతో ప్రకాశిస్తుంటుంది. అందుకే ద్యుతిధరా అనబడుతున్నది.

## 769. యజ్ఞరూపా

**యజ్ఞోవైవిష్ణుః** అంటోంది వేదం. అంటే యజ్ఞమే విష్ణువు. కాబట్టి విష్ణువుకన్న వేరుకానటువంటి పరమేశ్వరి యజ్ఞరూప అనబడుతోంది. పద్మపురాణంలో ఈశ్వరుణ్ణి గురించి చెబుతూ

**వేదపాదో యూపదంష్ట్రః క్రతుహస్త శ్చితీముఖః**
**అగ్నిజిహ్వో ధర్మరోమాః బ్రహ్మశీర్షో మహాతపాః**
**అహోరాత్రేక్షణో దివ్యో వేదాంతశ్రుతి భూషణః**
**స్రువతుండ శ్చాజ్యనాసః సామఘోషస్వనో మహాన్**
**ధర్మసత్యమయః శ్రీమాన్ క్రమవిక్రమ సత్క్రియః**
**ప్రాయశ్చిత్తనఖో ధీరః పశుజానుర్మహా భుజః**
**ఔద్గాత్రాంత్రో హోమలింగః ఫలబీజ మహౌషధిః**
**వాయ్వంతరాత్మా మంత్రస్ఫిగ్వికృతః సోమశోణితః**
**వేదస్కంధో హవిర్గంధో హవ్యకవ్యాతి వేగవాన్**
**ప్రాగ్వంశకాయో ద్యుతిమాన్ నానాదీక్షాభిరర్చితః**
**దక్షిణాహృదయో యోగీ మహామంత్రమయో మహాన్**
**ఉపాకర్మోஉష్టచుబుకః ప్రవర్గ్యావర్తభూషణః**

**నానాచ్ఛందోగతిపథో గుహ్యోపనిషదాసనః**

**ఛాయాపత్నీ సహాయోవై మేరు శృంగ ఇవోచ్ఛ్రితః**

| | | |
|---|---|---|
| వేదాలే | – | అతనిపాదాలు |
| యూపస్తంభాలు | – | కోరలు |
| క్రతువులు | – | హస్తాలు |
| యాగార్ధమైనకాష్టములచితి | – | ముఖము |
| అగ్నియే | – | నాలుక |
| ధర్మాలే | – | రోమాలు |
| తపోవంతులైన బ్రాహ్మణులే | – | తల |
| అహోరాత్రాలు | – | చూపులు (దృష్టి) |
| వేదాంతశ్రుతులు | – | చెవికమ్మలు (అలంకారాలు) |
| స్రువమే | – | తుండము |
| ఆజ్యమే | – | ముక్కు |
| సామఘోషయే | – | గొప్పధ్వని |
| సత్క్రియలే | – | అతని క్రమవిక్రమములు |
| ప్రాయశ్చిత్తములే | – | నఖములు |
| పశువు | – | జానువు |
| ఔద్గాత్రమే | – | ఆంత్రము (ప్రేగు) |
| హోమమే | – | లింగము |
| ఫలములే | – | అవయవాలు |
| వాయువు | – | అతని అంతరాత్మ |
| మంత్రాలు | – | పెదవులు |
| సోమరసము | – | రక్తము |
| వేదాలు | – | భుజాలు |
| వేది | – | స్కంధము |
| హవిస్సు | – | గంధము |
| హవ్యకవ్యములు | – | వేదాలు |

| | | |
|---|---|---|
| ప్రాగ్వంశికలు | – | దేహము |
| దానము | – | హృదయము |
| ఉపకర్మలు | – | పెదవులు, గడ్డము |
| ప్రవర్గ్యలు | – | భూషణములు |
| నానాఛందస్సులు | – | మార్గాలు |
| గుహ్యోపనిషత్తు | – | అతని ఆసనము |
| ఛాయ | – | పత్ని |

అతడు ధర్మసత్యమయుడు, నానాదీక్షలచే అర్చించబడినవాడు, పర్వతమువలె ఉన్నతుడు అని చెప్పబడింది. ఆమ్నాయరహస్యంలో

**ఇంద్రియద్వారసంగృహ్యైః గంధాద్యై రాత్మదేవతాం ।**

**స్వభావేన సమారాధ్య జ్ఞాతు స్సోయం మహామఖః ॥**

ఇంద్రియాలను జయించి మిక్కిలి భక్తితో ఆత్మను ఆరాధించటమే మహాయజ్ఞము అని చెప్పబడింది. అటువంటి ఆత్మారాధన యజ్ఞము కన్న వేరుకాదు. ఆరూపంలోనే పరమేశ్వరి ఉంటుంది. కాబట్టి యజ్ఞరూపా అనబడుతుంది.

**కర్మ బ్రహ్మోద్భ వం విద్ధి బ్రహ్మాఽక్షరసముద్భవం ।**

**తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥**

కర్మ వేదం వలన ఏర్పడగా, వేదం పరమాత్మ వలన ఏర్పడింది. ఆ కారణంగా సర్వగతమైన బ్రహ్మ యజ్ఞమందే ప్రతిష్ఠితమై ఉన్నది. ఈ యజ్ఞము జగత్ప్రవర్తక సాధనం కాబట్టి పరమేశ్వరి యజ్ఞరూపా అనబడుతుంది.

**అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః**

**యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః**

| | | |
|---|---|---|
| భూతాలు | – | అన్నం వలన వృద్ధి చెందుతాయి |
| అన్నం | – | మేఘము వలన సంభవిస్తుంది |
| మేఘాలు | – | యజ్ఞం వలన |
| యజ్ఞము | – | కర్మవలన సంభవిస్తాయి |

ఈ రకంగా సర్వదేవతలకు, సర్వజీవులకు తుష్టికారణమైన యజ్ఞరూపంలో ఉంటుంది పరమేశ్వరి. అందుచేత యజ్ఞరూపా అనబడుతుంది.

ప్రజాపతి యజ్ఞంవల్ల ప్రజలను సృష్టించి మీరు వర్ణాశ్రమధర్మాలను నెరవేరుస్తూ వేదంలో చెప్పబడ్డట్లుగా యజ్ఞకర్మలు చేస్తుండండి. అప్పుడు దేవతలు మీ కోరికలు నెరవేరుస్తారు అని చెప్పాడు. అందుచేత యజ్ఞాలు మానవకల్పితాలుకావు అని గుర్తించాలి.

యజ్ఞాలు మూడురకాలు. అవి 1. పాకయజ్ఞాలు 2. హవిర్యాగములు 3. సోమసంస్థలు.

**1. పాకయజ్ఞాలు :** ఇవి మళ్ళీ ఏడువిధాలు.

| | | |
|---|---|---|
| 1. ఔపాసన | 4. అష్టకము | 6. సర్పబలి |
| 2. స్థాలీపాకము | 5. మాసశ్రాద్ధము | 7. ఈశానబలి |
| 3. వైశ్వదేవము | | |

**2. హవిర్యాగాలు :** ఇవి మళ్ళీ ఏడురకాలు.

| | | |
|---|---|---|
| 1. అగ్నిహోత్రాలు | 4. చాతుర్మాస్యాలు | 6. నిరూఢపశుబంధము |
| 2. దర్శపూర్ణిమాసలు | 5. పిండ, పితృయజ్ఞాలు | 7. సౌత్రామణి |
| 3. ఆగ్రయణం | | |

**3. సోమసంస్థలు :** ఇవి మళ్ళీ ఏడురకాలు.

| | | |
|---|---|---|
| 1. అగ్నిష్టోమము | 4. అతిరాత్రము | 6. వాజపేయం |
| 2. అత్యగ్నిష్టోమము | 5. ఆప్తోర్యామం | 7. పౌండరీకం |
| 3. ఉక్థము | | |

ఇవి కాకుండా అంబాయజ్ఞము, అంతర్యాగము, బహిర్యాగము అని కూడా ఉన్నాయి. ఇవన్నీ పరమేశ్వరి రూపమే. అందుచేత పరమేశ్వరి యజ్ఞరూపా అనబడుతోంది.

## 770. ప్రియవ్రతా

సకలదేవతలవ్రతాలు ప్రియముగా గలది. అన్ని వ్రతములు ప్రియముగా గలది. భవిష్యోత్తరపురాణంలో

**దేవం దేవీంచ నోద్దిశ్య య త్కరోతి వ్రతం నరః**

**తత్సర్వం శివయో స్తుష్టై జగజ్జననశీలయోః ॥**

మానవుడు భగవంతుని ప్రీతి కోసం చేసే యజ్ఞాలన్నీ పార్వతీపరమేశ్వరులకే చెందుతాయి. జగత్తంతా శివశక్తిమయం. అందుచేత భేదంలేదు. అని చెప్పబడింది.

పరమేశ్వరి తన ప్రియుడగు సదాశివుడే వ్రతముగా గలది కావటంచేత ప్రియవ్రతా అనబడుతున్నది.

## 771. దురారాధ్యా

చంచలములైన ఇంద్రియములు గల వారికి అంటే స్థిరభావనలేనివారు, చంచలస్వభావం గల వారు ఆరాధించటానికి వీలుకానిది. స్థిరభావన అంటే పరమేశ్వరి మీద నమ్మకంలేని వారికి ఆమెను ఆరాధించటం సాధ్యంకాదు. అందుకే శ్రీవిద్యను ఎవరికి ఉపదేశించాలి అనే విషయాన్ని చెబుతూ యోగినీ హృదయంలో

**న దేయం పరశిష్యేభ్యో నాస్తికేభ్యో న చేశ్వరీ**
**న శుశ్రూషాలసానాంచ నైవానర్థప్రదాయినః**

1. ఇతరుల శిష్యులకు చెప్పరాదు. అంటే ఇతర మతాలవారికి, ఇతర సంప్రదాయాలవారికి ఈ విద్యను ఉపదేశించరాదు. ఉదా॥ వైష్ణవుడికి శ్రీవిద్యను చెప్పరాదు.

2. నాస్తికులకు చెప్పరాదు. నాస్తికులు అంటే వేదదూరులు. వేదంలేదు అని నమ్మేవారు. వీరి దృష్టిలో వేదాలు అభూతకల్పనలు. మానవప్రోక్తాలు. కొంతమంది స్వార్థంతో వీటిని చెప్పటం జరిగింది. వేదమే అబద్ధం అన్నవారు భగవంతుణ్ణి అసలు ఒప్పుకోరుకదా. వీరే చార్వాకులు. నాస్తికులు 'న అస్తి' బ్రహ్మములేదు అనేవారు.

3. శిష్యులు కాని వారికి చెప్పరాదు. సాధకుడికి గురువు యందు నమ్మకముండాలి. అతణ్ణి సాక్షాత్తూ పరమేశ్వరుడని గుర్తించాలి. అతణ్ణి సేవించి విద్యను ఉపదేశం పొందాలి.

ఇదే విధంగా ఇంద్రియలోలురు, మందబుద్ధులు, చపలచిత్తులు వీరిచే ఆరాధింప వీలుకానిది.

## 772. దురాధర్షా

చపలమైన ఇంద్రియాలు గల వారిచేత అర్చించబడదు. ఇందాక చెప్పినట్లుగా అల్పబుద్ధులు, మందబుద్ధులు, చపలచిత్తులచే ఆరాధించబడనిది. కాబట్టి దురాధర్షా అనబడుతోంది.

## 773. పాటలీకుసుమప్రియా

ఎరుపు తెలుపు వర్ణముల సంయోగమే పాటల వర్ణము. ఇది జపాకుసుమము. దాడిమీకుసుమము అని గతంలో వివరించాం. పద్మపురాణంలో

**శ్రీవృక్షే శంకరోదేవః పాటలాయాస్తు పార్వతీ**

శ్రీవృక్షము – మారేడు చెట్టు. బిల్వవృక్షము. దీనికి శంకరుడు దేవుడు. కాగా పాటలవృక్షానికి పార్వతి దేవత అని చెప్పబడింది. అందుచేతనే పరమేశ్వరి పాటలీకుసుమప్రియా అనబడుతోంది.

## 774. మహతీ

మహత్తైన పరిణామము గలది. కాబట్టి మహతీ అనబడుతుంది. దేనిచేతనైతే లోకంలోని అన్నివస్తువులు కూడా కొలవబడుతున్నాయో అది మహతీ.

పరమేశ్వరి మహనీయురాలు. పూజ్యురాలు కాబట్టి మహతీ అనబడుతోంది. లోకవాసులచే పూజించబడే మాహాత్మ్యము గలది. మనువులు వారి సంతతి సప్తఋషులు. ఈ రకంగా జగత్తంతా హిరణ్యగర్భునిచేతనే సృష్టించబడింది. ఆ హిరణ్యగర్భతత్త్వాన్నే మనం మహత్తు అంటాము. అంటే విశాలమయిన ప్రపంచానికి ప్రవర్తకురాలు. కాబట్టి పరమేశ్వరి మహతీ అనబడుతోంది.

కఠోపనిషత్తులో ఆత్మని గురించి చెబుతూ **అణోరణీయాం మహతో మహీయాం** అణువుకన్నా చిన్నదైనది. సూక్ష్మాతి సూక్ష్మమైనది. అదేవిధంగా మహత్తు అంటే గొప్ప దానికన్న ఇంకా గొప్పదైనది. అంతకన్న గొప్పది ఇంకేదీలేదు అని చెప్పబడింది. అదే పరమేశ్వరి. అందుచేతనే ఆమె మహతీ అనబడుతోంది.

ఈ బ్రహ్మాండం చాలా పెద్దది. దీని పరిమాణం 1,87,74,920 కోట్ల యోజనాలున్నది అని మన గ్రంథాలు చెబుతున్నాయి. బ్రహ్మాండమంతా ఆమె స్వరూపమే. ఇలాంటివి అనేకకోట్ల బ్రహ్మాండాలను సృష్టించి, వాటన్నిటియందూ ఆవరించి ఉన్నది. అందుచేతనే ఆమె మహతీ అనబడుతోంది.

నారదుని వీణపేరు మహతి.

## 775. మేరునిలయా

**మేరు రేవ నిలయో యస్యాః - సా**

మేరు పర్వతము నివాసముగా గలది. మేరువు బంగారు పర్వతము. ఇది భూమి చుట్టూ మేఖలవలె ఉంటుంది. సూర్యచంద్రులు దీని చుట్టూ తిరుగుతుంటారు. ఈ పర్వతశిఖరం మీద దేవతలు ఉంటారు.

దీని ఎత్తు లక్షయోజనాలు. దీనికి నాలుగువైపులా ఒక్కొక్కవైపునా రెండురెండు చొప్పున మొత్తం ఎనిమిది పర్వతాలున్నాయి.

| | | |
|---|---|---|
| తూర్పున | - | జఠర, దేవకూటములు |
| పడమర | - | పవమాన, పారియాత్రములు |
| ఉత్తరాన | - | త్రిశృంగము, మకరము |
| దక్షిణాన | - | కైలాసము, కరవీరము. |

ఇక్కడ బ్రహ్మస్థానమున్నది. అదే బ్రహ్మపురి. ఈ పర్వతం చుట్టూ ఉన్న ఎనిమిది పర్వతాలు అష్టదిక్పాలకుల నివాసాలు.

విష్ణుపాదాల నుంచి వచ్చిన గంగ ఈ మేరువునందే ఉద్భవించింది. ఇక్కడి నుండి మొదటగా బ్రహ్మలోకానికి ఏకవేణిగా వెళ్ళింది. అంటే అప్పుడు గంగానది ఒకటే పాయ. అక్కడ నుండి ధృవపదము, సప్తర్షిమండలాలకు ప్రదక్షిణచేసి, చంద్రమండలానికిపోయి, మళ్ళీ బ్రహ్మలోకంచేరి, అక్కడ నుండి నాలుగుపాయలుగా చీలి.

1.సీత 2. అలకనంద 3. చతుర 4. భద్ర

అని ప్రసిద్ధి చెందింది. ఆ యొక్క మేరు పర్వతం మీదనే పరమేశ్వరి కూడా ఉంటుంది. కాబట్టి మేరునిలయా అనబడింది.

మేరువు అనేది శ్రీచక్రం యొక్క రూపం. శ్రీచక్రంలోని తొమ్మిదవ ఆవరణలో పరమేశ్వరి ఉంటుంది. కాబట్టి ఆమె మేరునిలయా అనబడుతుంది.

తొమ్మిది అక్షరాలు గల మంత్రాన్ని నవార్ణవమంత్రము అంటారు. జ్ఞానార్ణవతంత్రంలో

**భూమి శ్చంద్ర శివో మాయా శక్తిః కృష్ణమాదనౌ ।**

**అర్ధచంద్ర శ్చ బిందు శ్చ నవార్ణో మేరు రుచ్యతే ॥**

| | | | |
|---|---|---|---|
| 1. | భూమి | – | ల కారము |
| 2. | చంద్ర | – | స కారము |
| 3. | శివ | – | హ కారము |
| 4. | మాయా | – | ఈ కారము |
| 5. | శక్తి | – | ఏ కారము |
| 6. | కృష్ణమాద్య | – | రే ఫ |
| 7. | మాదన | – | క కారము |
| 8. | అర్ధచంద్ర | – | నాదము |
| 9. | బిందు | – | బిందువు |

ఈ తొమ్మిది అక్షరాల సముదాయమే పంచదశి మహామంత్రం. ఇదే నవార్ణవమంత్రం. వీటి నుంచే శ్రీచక్రము ఆవిర్భవించింది. ముందుగా

1. లకారము పృథివీ బీజము. దీనివల్ల – భూపురం పుట్టింది.

2. స కారము చంద్రబీజం షోడశకళాత్మకం. దీనివల్ల – షోడశదళం పుట్టింది.

3. హ కారము శివబీజం అష్టమూర్త్యాత్మకం. దీనివల్ల – అష్టదళం పుట్టింది.

4. ఈ కారము మాయా బీజము. దీనివల్ల – చతుర్దశభువనాత్మకమైన చతుర్దశారం పుట్టింది.

5. ఏ కారము శక్తి బీజము. దీని నుంచి – దశావతారాలకు ప్రతీకగా బహిర్దిశారం పుట్టింది.

6. ర కారము అగ్ని బీజం. దీనివల్ల – అగ్ని కళలతో కూడిన అంతర్దశారం పుట్టింది.

7. క కారము మన్మథ బీజము వసుకోణాత్మకం. దీనివల్ల – అష్టకోణం పుట్టింది.

8. అర్ధచంద్రము. త్రిగుణాత్మకము. దీనివల్ల – త్రికోణం పుట్టింది.

9. బిందువు. పరబ్రహ్మాత్మకం. దీనివల్ల బిందువు పుట్టింది.

ఇటువంటి మేరువునందు పరమేశ్వరి ఉంటుంది. కాబట్టి ఆమె మేరునిలయా అనబడుతున్నది.

## 776. మందారకుసుమప్రియా

**మందారో దేవతరుః తస్యకుసుమం ప్రియం యస్యా - సా**

దేవతా వృక్షమైన మందారపువ్వుల యందు ప్రీతి గలది. తెల్లజిల్లేడు పూవునందు కూడా దేవికి ప్రీతి ఎక్కువ. మందారపూవుకే జపాకుసుమము అని కూడా పేరు. మందారం కూడా పరమేశ్వరి వర్ణంలోనే ఉంటుంది. పూజకు శోభాయమానమైనది. కాబట్టి ఆమెకు మందార పూలయందు మక్కువ ఎక్కువ.

## 777. వీరారాధ్యా

వీరులచేత ఆరాధించబడునది. వీరులు అంటే శ్రీవిద్యోపాసకులలో శ్రేష్ఠులు. నిరంతరము ఆత్మానందాన్ని అనుభవించేవారు. ద్వైతభావములేనివారు. పరమజ్ఞానులు.

త్రిమూర్తులు, ఇంద్రాదిదేవతలు. వీరిచేత ఆరాధించబడినది. కాబట్టి వీరారాధ్యా అనబడుతుంది. కర్మానుష్టానంలో నిష్ణాతులైన వారిచే ఆరాధించబడుతుంది. కాబట్టి వీరారాధ్యా అనబడుతోంది. ఈ విషయమంతా గతంలో 'మహావీరేంద్రవరదా' అనే నామంలో వివరించబడింది.

## 778. విరాడ్రూపా

విరాడ్రూపము గలది. విశ్వరూపము గలది. విశ్వంలోని జీవులన్నింటికీ ప్రతీకయైన వైశ్వానరుని రూపం గలది. ఈ విషయమంతా 'విశ్వరూపా' అనే 256వ నామంలో వివరించాం. అందుకని మళ్ళీ చెప్పటంలేదు. విరాడ్రూపాన్ని వర్ణిస్తూ పిల్లలు దసరాపండుగలో పాటలు పద్యాలు పాడతారు.

**ధరసింహాసనమై నభంబుగొడుగై**
**తద్దేవతల్ భృత్యులై పరమామ్నాయము**
**లెల్లవందిగణమై బ్రహ్మాండమాకారమై**
**శ్రీ భార్యామణియై విరించి కొడుకై**
**శ్రీగంగ సత్పుత్రియై, వరస న్నీఘనరాజ**
**సౌమ్ముసనిజమై వర్ధిల్లు నారాయణా !**
**జయాభవ ! విజయీ భవ ! దిగ్విజయీ భవ.**

అంటూ విరాడ్రూపాన్ని స్తోత్రం చేస్తారు. పరమేశ్వరి అటువంటి విరాడ్రూపం గలది.

శ్రీమద్భాగవతంలోని వామనావతారంలో వామనుడు విశ్వరూపం ధరిస్తాడు.

**ఇంతింతై వటుడింతైత మరియుదానింతై నభోవీధిపై**
**నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై**
**నంతై చంద్రుని కంతయై ధృవునిపై నంతై మహర్వాటిపై**
**నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై ॥**

ఆ క్షణంలో ఆకాశంలో ఉన్న సూర్యబింబము

**రవిబింబం బుపమింప బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై**
**శ్రవణాలంకృతమై గళాభరణమై సౌవర్ణకేయూరమై**
**ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచ ద్వస్త్రమై నూపుర**
**ప్రవరంబై పదపీఠమై వటుడు దా బ్రహ్మాండమున్ న్నిండుచోన్ ॥**

అని చెబుతారు. కాబట్టే పరమేశ్వరి విరాడ్రూపా అనబడుతోంది.

## 779. విరజా

**విగతం రజః పాపం యస్యాః-సా**

విగతమైనటువంటి, పోయినటువంటి, నాశనమైనటువంటి పాపములు కలది. అంటే పాపరహితురాలు. పరమేశ్వరి దగ్గర రజోగుణమనేది ఏ మాత్రములేదు. శుద్ధసత్వగుణప్రధానురాలు. కాబట్టి విరజా అనబడుతున్నది. బ్రహ్మాండపురాణంలో

**విరజే విరజే మాతా బ్రహ్మణా సంప్రతిష్ఠితా ।**
**యస్యాః సందర్శనాన్మర్త్యః పునాత్యా సప్తమం కులమ్ ॥**

విరజాక్షేత్రంలో విరజామాత బ్రహ్మచేత ప్రతిష్ఠింపబడినది. ఆమెను దర్శించిన వాడి ఏడుతరాలు తరిస్తాయి అనిచెప్పబడింది. విరజాక్షేత్రం ఉత్కలదేశంలో ఉన్నది.

## 780. విశ్వతోముఖీ

అన్నివైపులకు ముఖము గలది. అన్ని దిక్కులకు ముఖము గలది. 'ఆ పరమేశ్వరుడికి అన్నివైపులా కళ్ళు ముఖాలు ఉన్నాయి' అని వేదం చెబుతోంది. ఎక్కడైతే పరమేశ్వరిని ధ్యానించాలని అనుకుంటారో అక్కడ ఆమె ప్రతిష్టింపబడుతుంది. అక్కడ ఆవిర్భవిస్తుంది.

ఈ రకంగా ఎక్కడ కావాలంటే అక్కడ ఆవిర్భవిస్తుంది. కాబట్టి ఆమె అన్ని ప్రదేశాలలోనూ ఉన్నది. విశ్వతోముఖీ అనబడుతున్నది. వేదంలో

**సహస్రశీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్**

పరమేశ్వరుడికి అనేకవేల శిరస్సులు, కనులు, ముఖాలు, చేతులు ఉన్నాయి. అంటే సృష్టిలోని జీవరాశి అంతా పరమేశ్వరస్వరూపమే. జగత్తంతా పరమేశ్వరమయమే. అతడు అంతటా వ్యాపించి ఉన్నాడు. సర్వాంతర్యామి అని వేదం చెబుతోంది. కాబట్టి పరమేశ్వర స్వరూపమైన పరమేశ్వరి విశ్వతోముఖీ అనబడుతున్నది.

## 781. ప్రత్యగ్రూపా

**ప్రత్యక్ తాదృశం రూపం యాస్యాః-సా**

ప్రతికూలమైన గతి కలది. అనుకూలమైన గతి అంటే - బయట ప్రపంచాన్ని చూడటం. ప్రతికూలము అంటే బాహ్యదృష్టికాదు. అంతఃదృష్టి గలది. అంతర్ముఖమైనది. ఇంద్రియాలు విషయోన్ముఖం కావటం బాహ్యదృష్టి. అదే దృష్టిని మనలోపల ఉన్న ఆత్మదర్శనం కోసమని లోపలకు త్రిప్పినట్లైతే అది అంతఃదృష్టి. పరమేశ్వరుడు ఇంద్రియాలను సృష్టించాడు. అవి బాహ్యజగత్తును మాత్రమే చూస్తాయి. అయితే వాటికి ఆత్మని దర్శించేశక్తి ఉంది. ఇంద్రియాలను స్వాధీనం చేసుకుని మనసును అదుపులో ఉంచినట్లైతే ఆత్మ సాక్షాత్కారమవుతుంది. ఆత్మే పరమేశ్వరి రూపము. అందుచేత ఆమె రూపము ప్రత్యక్‌గా అంతరాత్మ నందే చూడదగినది.

## 782. పరాకాశా

ఉత్కృష్టమైన ఆకాశమే పరాకాశము. అదే పరబ్రహ్మ. ఆకాశమే పరబ్రహ్మ. ఆకాశము అన్నింటికన్న గొప్పది' అని ఛాందోగ్యం చెబుతున్నది. ఇక్కడ ఆకాశము అంటే పంచభూతాలలోని ఆకాశం కాదు. పరమాత్మ స్వరూపమే ఆకాశము. అన్నిటా వ్యాపించి ఉండేది. సర్వవ్యాపి. కూర్మపురాణంలో "ఆమె లోకాలకు ముఖ్యకారణము. సర్వాత్మిక, తేజోవతి, మహేశ్వరి. ఈ రకంగా ఆమె శక్తి అనాది సిద్ధమైనది. ఆకాశమనే పేరుతో దివియందు ప్రకాశిస్తున్నది" అని చెప్పబడింది.

బ్రహ్మపరాకాశంలో ప్రతిష్ఠితుడై ఉన్నాడు. అని వేదం చెబుతోంది. స్వచ్ఛంద తంత్రంలో

**ద్వాదశాంతం లలాటోర్ధ్వం కపాలోర్ధ్వా వసానకం ।**
**ద్వ్యంగుళోర్ధ్వం శిరోదేశాత్ పరంవ్యోమ ప్రకీర్తితా ॥**

నొసటికి పైన ద్వాదశస్థానమున్నది. అక్కడ కపాలము యొక్క పైభాగము అంతమవుతుంది. శిరస్సుకు రెండు అంగుళాలపైన పరాకాశమున్నది" అని చెప్పబడింది. అక్కడ ఆ పరాకాశంలో పరబ్రహ్మ ఉంటాడు.

సప్తసముద్రాల కవతల ఉండే ఆకాశమే పరాకాశము. అక్కడ పరమేశ్వరి 16 సంవత్సరాలు గల కన్య. కాబట్టి అటువంటిరూపం గల దేవి పరాకాశా అనబడుతుంది.

తపస్సుచేత పొందదగిన మార్గమే పరాకాశము.

ఉత్కృష్టమైన పాపాలను, దుఃఖాలను నశింపచేయునది. అందుచేత పరమేశ్వరి పరాకాశా అనబడుతున్నది.

## 783. ప్రాణదా

ప్రాణములను ఇచ్చేది. ప్రాణమే బ్రహ్మ. తైత్తిరీయోపనిషత్తులోని భృగువల్లిలో "వరుణమహర్షి కుమారుడు భృగుమహర్షి. విద్యాభ్యాసం పూర్తిచేసి బ్రహ్మోపదేశం చెయ్యమని తండ్రిని కోరాడు. తండ్రి ఆదేశం మేరకు తపస్సుచేసి ప్రాణం బ్రహ్మ అని తెలుసుకున్నాడు అని చెప్పబడింది. ఈ విషయాన్ని 'పంచకోశాంతరస్థితా' అనే నామంలో వివరించటం జరిగింది.

లోకంలోని సమస్తజీవరాశులు ప్రాణంవల్లనే జీవిస్తున్నాయి. ప్రాణంవల్లనే రక్షించబడుతున్నాయి. ప్రాణం పోయినప్పుడు మృత్యువులో లీనమైపోతున్నాయి. అందుచేత ప్రాణమే సర్వసృష్టికీ మూలాధారం.

ఛాందోగ్యోపనిషత్తులో ఒక కథ ఉన్నది. పూర్వకాలంలో ఒకసారి ఇంద్రియాలన్నీ తమలో తాము పోట్లాడుకోవటం మొదలుపెట్టాయి. దీనికి కారణం ఎవరు గొప్ప అనే విషయం తేలకపోవటమే. ఆ వాదన ఎంతకీ తెగలేదు. చివరకు అన్నీ కలిసి ఒక నిర్ణయానికి వచ్చి తమకు జన్మనిచ్చిన ప్రజాపతి దగ్గరకు పోయి 'మాలో ఎవరుగొప్పవారో తేల్చి చెప్పండి' అన్నాయి.

ప్రజాపతి ఒక్కక్షణం ఆలోచించి "మీలో ఎవరు గొప్పో తేల్చుకునే ఉపాయం ఒకటి ఉన్నది చెబుతాను వినండి. మీలో ఏదిలేకపోతే ఈ శరీరం పనికిరాకుండా పోతుందో,

పనిచెయ్యకుండా పోతుందో అది అన్నిటికన్నా శ్రేష్ఠమైనది. మీరందరూ విడివిడిగా ఒక సంవత్సరంపాటు ఈ శరీరాన్ని విడిచిపెట్టి వెళ్ళండి అప్పుడు తెలుస్తుంది" అన్నాడు ప్రజాపతి.

ముందుగా వాక్కు శరీరంనుంచి నిష్క్రమించింది. ఒక సంవత్సరంపాటు శరీరానికి దూరంగా ఉండి తరువాత వచ్చి మిగిలిన ఇంద్రియాలను అడిగింది. నేను లేనప్పుడు మీరు ఎలా జీవించి ఉండగలిగారు ?

నువ్వు వెళ్ళిపోవటంవల్ల శరీరానికి పెద్దనష్టం ఏమీ జరగలేదు. కేవలం మాటరాలేదు. అంతేకాని మిగిలిన శరీరం యథాతథంగా పనిచేసింది. కళ్ళు చూస్తూనే ఉన్నాయి. చెవులు వింటూనే ఉన్నాయి. మనసు ఆలోచిస్తూనే ఉన్నది. ఈ రకంగా మిగిలిన పనులన్నీ సాగాయి. పసిపిల్లవాడికి మాటలురావు. అతడు బ్రతకటంలేదా ? మూగవాడు జీవించటంలేదా ? అలాగే శరీరం జీవించే ఉన్నది" అన్నాయి. ఆ మాటలు విన్న వాక్కు మారు మాట్లాడకుండా శరీరంలో ప్రవేశించింది.

తరువాత శరీరం నుంచి దృష్టి నిష్క్రమించింది. సంవత్సరం తరువాత తిరిగివచ్చి తను లేకపోవటం చేత శరీరం ఎలా ఉన్నది ? అని అడిగింది. దానికి మిగిలిన అవయవాలు. "నువ్వు లేకపోతే చెప్పుకోతగ్గ ఇబ్బంది ఏదీ కలగలేదు. ఈ శరీరం బ్రతికే ఉన్నది. కేవలం చూపు మాత్రం లేదు. అయితే ఏం ? గ్రుడ్డివాడు బ్రతకటం లేదా ? అలాగే శరీరం జీవించే ఉన్నది" అన్నాయి. మారు మాట్లాడకుండా దృష్టి శరీరంలో ప్రవేశించింది.

తరువాత శ్రవణశక్తి శరీరాన్ని విడిచివెళ్ళిపోయి, ఒక సంవత్సరం తరువాత తిరిగివచ్చి 'నేను లేకపోతే శరీరం ఎలా ఉంది ?' అని అడిగింది. దానికి మిగిలిన ఇంద్రియాలు. "నువ్వు లేకపోతే వచ్చిన నష్టం ఏమీ పెద్దగాలేదు. చెవిటివాడు బ్రతకటం లేదా ? చెవులు పనిచెయ్యలేదు. అంతేకాని మిగిలిన శరీరమంతా బాగానే ఉన్నది" అన్నాయి. మారు మాట్లాడకుండా శ్రవణం శరీరంలో ప్రవేశించింది.

తరువాత మనస్సు శరీరం నుంచి నిష్క్రమించి సంవత్సరం తరువాత తిరిగివచ్చి 'నేను లేకపోతే ఈ శరీరం ఎలా ఉన్నది ? అని అడిగింది. దానికి ఇంద్రియాలు నువ్వు లేకపోయినా పెద్దగా నష్టం ఏమీరాలేదు. మిగిలిన అవయవాలు బాగానే పనిచేస్తున్నాయి. అయితే కేవలం ఆలోచన మాత్రం లేకపోయింది. అయితే మాత్రం ఏం ? పసిపిల్ల

వాడికి మనసుండదు కదా ? అతడు జీవించటంలేదా ? పిచ్చివాడు ఆలోచించలేడు. అతడు జీవించటంలేదా ? అలాగే ఈ శరీరం ఉన్నది" అన్నాయి. మనస్సు కూడా మారుమాట్లాడకుండా శరీరంలో ప్రవేశించింది.

అఖరుకు ప్రాణం బయటకు పోవటానికి సిద్ధమవుతున్నది. అప్పుడు ఇంద్రియాలతో తనకున్న బంధాన్ని త్రెంచి పారేస్తున్నట్లనిపించింది. శరీరానికి ఊపిరి అందటం కష్టమవుతోంది. కళ్ళు కనిపించటం మానేస్తున్నాయి. కాళ్ళుచేతులు కదలటం మానేస్తున్నాయి. శరీరం గాలిలో తేలిపోతున్నట్లనిపించింది. దాంతో ఇంద్రియాలకు భయం పట్టుకున్నది. అప్పుడు ఇంద్రియాలన్నీ ప్రాణం చుట్టూ చేరి "ప్రాణమా ! నువ్వు మాత్రం శరీరం నుంచి బయటకు వెళ్ళకు. నువ్వు గనక వెళ్ళిపోతే శరీరం చచ్చిపోతుంది. అప్పుడు మేమంతా ఉపయోగం లేకుండా పోతాము. మా అందరిలోకీ నువ్వే శ్రేష్ఠుడివి. ఈ మాట మేమంతా అంగీకరిస్తున్నాం. నువ్వు ఇక్కడే ఉండి మమ్మల్ని జీవింపచెయ్యి" అని వేడుకున్నాయి.

"ఈ రకంగా ఇంద్రియాలన్నీ ప్రాణం లేకపోతే తమ ఉనికిలేదు అని ఒప్పుకున్నాయి. అందుచేతనే వాక్కు, చక్షువు, శ్రోత్రము అన్నీ ప్రాణవంతమైతేనే పనిచేస్తాయి. అందుకనే అవన్నీ ప్రాణము అనే సంకేతంతోనే పిలువబడతాయి. అంటే ప్రాణం లేకుండా వీటికి స్వేచ్ఛలేదు. అసలు ప్రాణమే ఇన్ని రూపాలుగా మారింది" అని చెప్పబడింది.

ఈ రకంగా అన్ని ఇంద్రియాలకు ఆధారమైన ప్రాణాన్ని ఇచ్చేది ఆ పరమేశ్వరి. కాబట్టే ఆమె ప్రాణదా అనబడుతున్నది.

## 784. ప్రాణరూపిణీ

ప్రాణమే బ్రహ్మ. బృహదారణ్యకోపనిషత్తులో ఈ విషయం చెప్పబడింది.

దేవదానవులిద్దరూ ప్రజాపతి పుత్రులే. కాని వారిలో దేవతల సంఖ్య తక్కువ. అసురుల సంఖ్య ఎక్కువ. వీరు ధర్మాధర్మాలకు, న్యాయాన్యాయాలకు ప్రతీకలు. అందుచేత మంచి, ధర్మము, న్యాయము గలవారు. దేవతలయ్యారు. అవి లేనివారు అసురులయ్యారు. వీరిద్దరి మధ్యనా ఎప్పుడూ యుద్ధమే జరుగుతుంది. దానిలో తాత్కాలికంగా అధర్మం జయించినా, చివరకు ధర్మానికే విజయం లభించేది. కాని ప్రతిసారి అసురులను జయించటం కష్టమయ్యేది. అందుకని దేవతలు ఉద్గీతను ఉపాసించి, తద్వారా అసురుల మీద విజయం సాధించాలనుకున్నారు. ఉద్గీత అంటే ఓంకారమే.

ఈ విధంగా ఆలోచించిన దేవతలు ముందుగా వాగింద్రియంతో నువ్వు మా కోసం ఉద్గానం చెయ్యి అన్నారు. వాగింద్రియం సరేనన్నది. దేవతల కోసం ఉద్గానం చేసింది. అందులోని భోగాన్ని దేవతల కోసం కాగా స్పష్టమైన నిర్దుష్టమైన ఉచ్చారణను తన కోసం గానం చేసింది. ఈ ఉద్గానంవల్ల దేవతలు తమను జయిస్తారని భయపడ్డ రాక్షసులు పాపంతో వాగింద్రియాన్ని హింసించారు. అందువల్ల వాక్కు తన శక్తిని కోల్పోయింది. నోటివెంట వచ్చే వాటిలో అపశబ్దాలు, అబద్ధాలు, నిషిద్ధమైన మాటలు వచ్చాయి. అనరాని మాటలు అనటం మహాపాపం. అందుచేత వాక్కులో ఉద్గానమహాత్మ్యం తగ్గిపోయింది.

తరువాత దేవతలు ముక్కును ఆశ్రయించారు. నువ్వు మా కోసం ఉద్గానం చెయ్యమని కోరారు. సరేనంది ముక్కు. అందులోని సామాన్యభోగాన్ని దేవతలకు కాగా చక్కటి ఘ్రాణశక్తిని తనకోసం ఉపయోగించుకుంది. అసురులకీ విషయం తెలిసి ఈ ఉద్గానంద్వారా దేవతలు తమను జయిస్తారేమోనని భయపడ్డారు. ఘ్రాణశక్తిని పాపంతో కొట్టారు. దాని ఫలితంగా ముక్కు అనర్హమైన వాటిని పీల్చటం మొదలుపెట్టింది. ఉద్గాన ఫలితం తగ్గిపోయింది.

తరువాత దేవతలు చక్షురింద్రియాన్ని ఆశ్రయించారు. తమకోసం ఉద్గానం చెయ్యమన్నారు. సరేనన్నది చక్షువు. అందులోని సామాన్య భోగాన్ని దేవతలకిచ్చి దృశ్యశక్తిని తన కోసం ఉంచుకున్నది. దీనివల్ల దేవతలు తమను జయిస్తారేమోనని భయపడి అసురులు చక్షువును పాపంతో కొట్టారు. దానిఫలితంగానే చక్షువు చూడరాని దృశ్యాలను చూస్తున్నది. అది మహాపాపం. దానివల్ల ఉద్గానఫలం తగ్గిపోయింది.

తరువాత దేవతలు మనస్సును ఉద్గానం చెయ్యమని కోరారు. సరేనన్నది మనస్సు. అందులో సామాన్యభోగాన్ని దేవతలకిచ్చి శుభసంకల్పాన్ని తన కోసం ఉంచుకుంది. ఈ విషయం తెలిసిన అసురులు మనసును పాపంతో కొట్టారు. దానిపలితంగానే మనస్సు చేయకూడని పాపాలుచేస్తున్నది. దానివల్ల ఉద్గానఫలం తగ్గిపోయింది.

ఇప్పుడు దేవతలు ప్రాణాన్ని ఆశ్రయించి తమ కోసం ఉద్గానం చెయ్యమన్నారు. సరే అంది ప్రాణం. తనను శరణువేడిన దేవతల కోసం ఉద్గానం చెయ్యటం ప్రారంభించింది. ఈ విషయం తెలిసిన అసురులు ప్రాణాన్ని పాపంతో కొట్టాలనుకున్నారు. కాని రాతికి తగిలిన మట్టిబెడ్డలాగా పొడిపొడిగా అయిపోయారు. ప్రాణాన్ని ఢీ కొన్న అసురులు అనేకవిధాలుగా ధ్వంసమైపోయారు. అసురులు దేవతలచేతిలో పరాభూతులైనారు.

ఈ ప్రాణం అన్ని అవయవాలకు రసం. (సారం) కాబట్టి అంగిరసం అయింది. ఏ ఆధారము లేకుండా నోటిలో (ఆకాశంలో) ఉంటుంది. కాబట్టి అయాస్యమైంది. ప్రాణం ఏ అవయవాన్నుంచైనా తప్పుకుంటే ఆ అవయవం నిర్జీవమవుతుంది.

ప్రాణమే బ్రహ్మణస్పతి. ఎందుకంటే ప్రాణమే యజస్సులకు పతి. ప్రాణమే సామము. ఈ రకంగా ప్రాణమే బ్రహ్మము కాబట్టి పరబ్రహ్మస్వరూపమైన పరమేశ్వరి ప్రాణరూపిణి అవుతున్నది.

శరీరంలో రెండురకాలయిన వాయువులు సంచరిస్తుంటాయి. అవి.

1. **ప్రధానవాయువులు -** ఇవి మళ్ళీ ఐదురకాలు.

1. ప్రాణ 2. అపాన 3. వ్యాన 4. ఉదాన 5. సమానవాయువులు.

2. **ఉపవాయువులు -** ఇవి మళ్ళీ ఐదురకాలు.

1. నాగ 2. కూర్మ 3. కృకర 4. దేవదత్త 5. ధనుంజయములు.

వీటిని వివరించటంలేదు. ఈ వాయువులవల్లనే శరీర వ్యాపారం సాగుతున్నది. ఇవన్నీ ప్రాణస్వరూపాలే. ఇవి లేకపోతే శరీరం నశిస్తుంది. అందుకే పరమేశ్వరి ప్రాణరూపిణీ అనబడుతోంది.

## 785. మార్తాండభైరవారాధ్యా

ఆదిత్య మండలాంతర్వర్తి మార్తాండుడు అనబడతాడు. ఆయనే సూర్యుడు. అష్టభైరవులలో మార్తాండభైరవుడు ఒకడు. అతనిచే ఆరాధించబడిన దేవి. మార్తాండ భైరవారాధ్యా అనబడుతున్నది.

మణిద్వీపంలో ఇరవై రెండవ ప్రాకారంలో ఉన్నవాడు మార్తాండభైరవుడు. చక్షుష్మతీ, ఛాయాదేవి ఇతని భార్యలు. ఇతనిచేత ఆరాధించబడునది పరమేశ్వరి.

మణిమల్లుడు అనే రాక్షసుణ్ణి సంహరించటానికి శివుడు భూలోకానికి వచ్చాడు. అతడే మార్తాండభైరవుడు. అతనిచే అర్చించబడినది పరమేశ్వరి. కాబట్టి మార్తాండభైరవారాధ్యా అనబడుతున్నది.

భీరువులు – భయము గల స్త్రీలు. వారిచే ఆరాధించబడుదేవత.

## 786. మంత్రిణీన్యస్తరాజ్యధూః

పరమేశ్వరి యొక్క మంత్రిణి శ్యామల. రాజ్యభారమంతా శ్యామలాదేవి భుజస్కంధాలపైనే ఉంటుంది. అటువంటి శ్యామలచే ఆరాధించబడునది.

**శ్రీకృష్ణ శ్యామలా చైవ**

శ్రీకృష్ణ పరమాత్ముడే శ్యామలారూపి. సకల లోక స్థితి కారకుడు. అటువంటి శ్యామలచేత ఆరాధించబడునది.

## 787. త్రిపురేశీ

శ్రీచక్రంలోని రెండవ ఆవరణ షోడశదళము చంద్రకళా స్వరూపము.

**ఏతాస్తు గుప్త యోగిన్యః త్రిపురేశీ పదాంతికే**

ఈ ఆవరణకు అధిదేవత త్రిపురేశీ. ఇక్కడ ఉండే యోగిని పేరు గుప్తయోగిని.

ఈ త్రిపురేశీయే ఆ పరమేశ్వరి. కాబట్టి ఆమె త్రిపురేశి అనబడుతోంది. స్థూల సూక్ష్మ కారణ దేహాలకు ప్రభ్వి. ముఖ్య ప్రాణరూపిణి.

త్రిపురములకు ఈశ్వరి. బ్రహ్మ విష్ణు రుద్రులకు దేవశిల్పి మయుడు పురములను నిర్మించాడు. ఆపురములకు ఈశ్వరి త్రిపురేశి.

శిరోభాగము – బ్రహ్మ, మధ్యభాగము – విష్ణువు. అధోభాగము – రుద్రుడు. ఈ మొత్తానికి అధిపతి పరమేశ్వరి. కాబట్టి త్రిపురేశి అనబడింది.

## 788. జయత్సేనా

రాక్షస సమూహాలను సంహరించే సేనాసమూహము గలది. సర్వత్ర విజయము పొందు శక్తిసేనలతో కూడినది. భండాసురుడు, మహిషాసురుడు మొదలైన రాక్షసులను సంహరించినది.

సప్తకోటి మహామంత్రాలు పరమేశ్వరి సైన్యము. ఈ మంత్రానుష్ఠానం వల్లనే అంతః శత్రువులను జయించటం జరుగుతుంది.

## 789. నిస్త్రైగుణ్యా

త్రిగుణాలకు అతీతమైనది. నిర్గతమైన త్రిగుణములు గలది. సత్వరజస్తమోగుణాలు మూడింటికీ ఆమె కారణము. అయినప్పటికీ ఆ మూడింటిలో ఏ ఒక్కటీ లేనిది. నిర్గుణస్వరూపురాలు.

## 790. పరాపరా

పరా, అపరా స్వరూపము గలది. దీన్ని గురించి ముండకోపనిషత్తులో చెప్పబడింది.

శునకుని కుమారుడు శౌనకుడు. కఠోరనియమాలతో బ్రహ్మచర్యం పాటించి విద్యాభ్యాసం పూర్తిచేశాడు. మంచి మేధావి. విద్యార్థిగా గురుకులంలో మంచి పేరు సంపాదించాడు. విద్యాభ్యాసం పూర్తయింది. ఇక గృహాశ్రమం స్వీకరించాలి. ఆ దశలో ఒకనాడు గురువుగారైన అంగిరసుణ్ణి ఈవిధంగా అడిగాడు.

"గురుదేవా ! దేన్ని గురించి తెలుసుకుంటే సర్వమూ తెలుస్తాయో దాన్ని దయచేసి నాకు వివరించండి" దానికి అంగిరసుడు –

లోకంలో తెలుసుకోదగిన విద్యలు రెండు ఉన్నాయి. 1. పరావిద్య. 2. అపరావిద్య.

పరమేశ్వరుడికి సంబంధించినది పరావిద్య. ధర్మములు, కర్మలు వాటి సాధన మొదలైన విషయాలకు సంబంధించినది అపరావిద్య.

చతుర్వేదాలు, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిషము, నిరుక్తము ఇవన్నీ అపరావిద్య. ఇది లౌకికప్రయోజనాలకు ఉపయోగిస్తుంది. వేదాలలో యజ్ఞాదికర్మలు చెప్పబడ్డాయి. ఆ కర్మలను ఆచరిస్తే ఫలితం వస్తుంది. ఈ రకంగా సంసారసుఖాలను భవించటానికి కావలసిన ధనము, పలుకుబడి లభిస్తాయి. ఈ విద్య ఐహికంగా ఉన్నత స్థితులకు తీసుకుపోతుంది. ఇది ధర్మాధర్మాలు, పుణ్యపాపాలు, ప్రసంగాలతో మిళితమై ఉంటుంది. వేదాలు, వేదాంగాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలు అన్నీ అందులోని భాగాలే. ఈ చదువువల్ల జరామృత్యు భయంపోదు. ఐహికసమున్నతికి సాధన మాత్రమే. ప్రపంచంలో చాలామంది ధనము, కీర్తి, పదవి కావాలని ఇష్టపడతారు. స్వర్గసుఖాలు కావాలి అని యజ్ఞయాగాలు చేస్తారు. ఇలాంటివారు విషయవాంఛలలోపడి సతమతమవుతుంటారు. అంతేకాని వీటివల్ల మోక్షంరాదు.

పరావిద్య వల్ల పరమాత్మానుభవం, బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతాయి. మోక్షం సిద్ధిస్తుంది. పరావిద్య లౌకిక లంపటంలో ఇరుకున్న వారికి కష్టసాధ్యము. ఈ విద్యను సాధించాలంటే ముక్తి మార్గంలో అచంచలదీక్షతో ముందుకు సాగాలి. లక్ష్యం తప్పకుండా ముందుకు నడిస్తే బ్రహ్మలోకప్రాప్తి కలుగుతుంది. పరావిద్యను వివేకవంతులు మాత్రమే పొందగలుగుతారు. ఇది చర్మచక్షువులకు గోచరించదు. ఇంద్రియాలకు అందుబాటులో

ఉండదు. కరచరణాది శరీరభాగాలు లేనిది. సమస్త విశ్వము కూడా ఆత్మ యొక్క అధీనంలోనే ఉంటుంది. ఆత్మ సర్వవ్యాపకమైనది. ఈ భావాన్ని కలిగించేదే పరావిద్య. ఇదే బ్రహ్మజ్ఞానం.

బృహదారణ్యకోపనిషత్తులో నారదుడు వచ్చి సనత్కుమారుణ్ణి "స్వామీ ! వేదవేదాంగాలు చదివాను. ఎన్నో కళలు నేర్చుకున్నాను. శాస్త్రాలు అబ్యసించాను. సంగీత సాధనచేశాను. కాని నాకు మనశ్శాంతి కలుగలేదు. ఆత్మజ్ఞానం కలుగలేదు. కాబట్టి ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించండి" అని అడుగుతాడు.

అప్పుడు సనత్కుమారుడు "నారదా ! నవ్వు ఇంతవరకు అభ్యసించింది కష్టసాధ్యమైన పరావిద్య కాదు. నీకు ఎన్నో సిద్ధాంతాలు తెలుసు. కాని ఆచరణలేదు. వాటి ఆంతర్యం నీకు తెలియదు. నీకు తెలిసినదంతా అపరావిద్య. పదాలగారడి. కాబట్టి దాన్ని వదిలిపెట్టి విశ్వమంతా వ్యాపించి ఉన్న ఆత్మతత్త్వాన్ని తెలుసుకో. అదే పరావిద్య. అది సాధించటానికి మానసిక పవిత్రత కావాలి. మనస్సు మలినరహితమైతేనే ఆత్మానుభవం కలుగుతుంది. అంతఃకరణ నిర్మలమవుతుంది. అప్పుడు సత్యదర్శనమవుతుంది. సత్యం బాలభానునిలాగా హృదయంతరాళాల్లో ప్రకాశిస్తుంది. అదే పరావిద్య. దానివల్ల శాశ్వతమైన అనందం లభిస్తుంది" అని చెబుతాడు.

ఈ రకంగా పరావిద్య అపరావిద్య రెండూ ఉన్నాయి. ఆ రెండూ పరమేశ్వరి స్వరూపమే.

కొంతమందికి భోగం కావాలి, కొంతమందికి మోక్షం కావాలి. పరమేశ్వరి జగజ్జనని. తన బిడ్డలకు ఎవరికి ఏది కావాలంటే అది ఇస్తుంది. అందుచేత పరా, అపరావిద్యలు రెండూ కూడా పరమేశ్వరి స్వరూపమే. కాబట్టే ఆ దేవి 'పరాపరా' అనబడుతోంది.

ఈ రకంగా మంగళచండీవిద్య వివరించబడింది.



# 47. కపర్దినీవిద్య

కపర్ది – శివుడు. కపర్దకము – గవ్వ, శివుని జడముడి. కపర్దిని – కపర్ది అనే పేరుగల శివుని యొక్క శక్తి. జటాజూటము ధరించినది. గవ్వలమాలలచే అలంకరించబడినది. శక్తి.

కపర్దినీశక్తి సాక్షాత్తూ పరమేశ్వరస్వరూపము. సత్యము, జ్ఞానము, ఆనందమే రూపంగా గలది. శాశ్వతమైనది. నిత్యమైనది. బ్రహ్మానందస్వరూప అయిన పరబ్రహ్మ. ఆమె పరమేశ్వరి. ఈమె ఎప్పుడూ ఒంటరిగా ఉండదు. శివునితో కలిసే ఉంటుంది. శివుడు లేకుండా శక్తిలేదు. శక్తి లేకుండా శివుడు లేదు. ఇద్దరూ ఎప్పుడూ కలిసే ఉంటారు. అదే శివశక్తుల సామరస్యము. కళల యొక్క రూపం ఈమె. కళలు విద్యాకళలని, వృత్తి కళలని, దేవకళలని ఉన్నాయి. వీటన్నింటి యొక్క స్వరూపం ఆ పరమేశ్వరియే. తనను నమ్మినవారి కోరికలు ఎటువంటివైనా సరే తీరుస్తుంది. ఆమె కామేశ్వరుని శక్తి. కామేశ్వరి. కామరూపిణి. సమస్తకళలకు నిధి. కవిత్వం కూడా ఒక కళే. కవులు వ్రాసినవి కావ్యాలు. ఆ కావ్యాలనే కళల రూపము ఆమే. శృంగారాది నవరసాలచే తెలియబడేది. రసానికి నిధి. రసము అంటే బ్రహ్మానందం. అటువంటి బ్రహ్మానందాన్ని ఎల్లప్పుడూ పొందేది. ఈ రకంగా అమితమైన ఆనందం పొందటం వల్ల పుష్టిగా ఉంటుంది. శివాది క్షితి పర్యంతము 36 తత్త్వాలతో నిండినదై పుష్టిగా ఉంటుంది. ఆది అనాది అయినది ఆమే. సృష్టి ప్రారంభానికి ముందే ఉన్నది. దేవతలను సృష్టించినది ఆమే. అంతేకాదు సృష్టికి కారకులయిన త్రిమూర్తులను సృష్టించింది కూడా ఆమే.

అందుచేత అందరూ ఆమేను పూజిస్తారు. అందరూ అంటే – అన్ని లోకాలవారూ ఆమెను పూజిస్తారు. మానవులు, గంధర్వులు, దేవతలు ఇంతేకాదు. రాక్షసులు కూడా పరమేశ్వరిని అర్చిస్తారు. ఆమె ఈ జగత్తునంతటనూ పోషిస్తుంది. కలువల వంటి కనులు గలిగి ఉంటుంది. కోట్లకొలది సూర్యకాంతులతో ప్రకాశిస్తుంటుంది. అమితమైన తేజస్సుతో ఉంటుంది. అది దివ్యమైన జ్ఞానజ్యోతి. ఆమె అణువుకన్నా చిన్నది. మహత్తుకన్న గొప్పది. పరులకన్న పరమైనది. అంటే దేవతలకన్న కూడా శ్రేష్ఠమైనది. చేతిలో పాశం ధరించి ఉంటుంది. అంటే భక్తుల యొక్క పాశాలను, బంధనాలను త్రెంచివేసి వారికి మోక్షం ప్రసాదిస్తుంది. తన భక్తులను ఇబ్బందులపాలుచేసే అభిచారికమంత్రాలను విభేదిస్తుంది.

ఈ రకంగా కపర్దినీ విద్య 791 నుంచి 812వ నామం వరకు చెప్పబడుతోంది.

## 791. సత్యజ్ఞానానందరూపా

**సత్యం జ్ఞానం ఆనందశ్చ రూపం యస్యాః**

సత్యము, జ్ఞానము, ఆనందము రూపములుగా గలది. వేదంలో చెప్పినట్లుగా

**సత్యం జ్ఞాన మనంతంబ్రహ్మ. విజ్ఞాన మానందం బ్రహ్మ.**

అక్షరమైనది. అనశ్వరమైనది. సత్యము అంటే – త్రికాలాబాధ్యమైనది. దేశకాలములచేత బాధించబడినది. ఎల్లవేళలయందు ఉండేది. శాశ్వతమైనది. మాండూక్యోపనిషత్తులో చెప్పినట్లుగా

**త్రికాలాతీతం తదప్యోం కారమేవ**

భూతభవిష్యద్వర్తమాన కాలాలు మూడింటికీ అతీతమైనది. అన్ని కాలాలలోను ఒకే రకంగా ఉండేది. వృద్ధిక్షయాలు లేనిది. నిత్యమైనది. అదే పరబ్రహ్మ. దానికి జాతిమతభేదాలులేవు. తనవారు, బయటవారు అనే తేడాలేదు ఏకాకి. తనుగాక రెండవది ఏదీలేదు. సృష్టికి పూర్వం పరబ్రహ్మ ఏకాకిగా ఈ శూన్యం మొత్తాన్ని ఆదరించి ఉండేది. ఇతరుల సహాయసహకారాలు లేకుండా ప్రకాశించేది. సూర్యచంద్రాగ్నులు ప్రకాశించటానికి కాంతులను శక్తిని ఇచ్చేది. లోకంలో అన్ని జీవులయందు ఉన్న చైతన్యము. సంకల్పవికల్పాలు లేనటువంటిది. కేవలము సాక్షి మాత్రము అయినటువంటిది. అదే సత్యము. జ్ఞానస్వరూపము. ఆనందము అంటే – ప్రేమస్వరూపం.

| | | |
|---|---|---|
| ప్రియము | – | పుత్రాదులను చూసినప్పుడు కలిగేది. |
| మోదము | – | కోరుకున్నది దొరికినప్పుడు కలిగేది. |
| ప్రమోదము | – | మోదము ఎక్కువగా కలగటము |

వీటిని మించినటువంటిది ఆనందం. అది అనిర్వచనీయము. అనుభవైకవేద్యము. పరమేశ్వరి ఎప్పుడూ ఆ స్థితిలోనే ఉంటుంది. కాబట్టే సత్యజ్ఞానానందరూపా అనబడుతోంది.

ఆ పరమేశ్వరిని చేరాలంటే నిర్గుణోపాసన ఒక్కటే మార్గము. అదే మోక్షదాయకం. బాహ్యపూజలు చేసే వారికి, కర్మిష్ఠులకు తమ కోరికలు తీరతాయి కాని ఆత్మసాక్షాత్కారం కాదు. ఈశావాశ్యోపనిషత్తులో

**అంధం తమః ప్రవిశన్తి యేఽ విద్యాముపాసతే**

**తతోభూయ ఇవ తే తమోయఉ విద్యాయాగ్ం రతాః**

అవిద్యను ఆరాధించేవారు గాఢాంధకారంలో ప్రవేశిస్తారు. అనగా కర్మిష్ఠులకు మోక్షంలేదు. అలాగే యజ్ఞయాగాదిక్రతువులు చేసేవారు ఇంకా అంధకారంలో కూరుకుపోతారు.

వీటివల్ల కోరికలు తీరి ఆనందం కలిగినా, అది తాత్కాలికానందమే. ఆ ఆనందం తరువాత దుఃఖముంటుంది. కాబట్టి శాశ్వతమైన ఆనందం కావాలి అంటే కైవల్యమొక్కటే మార్గము. అదే సాయుజ్యము. బ్రహ్మను తెలుసుకున్నవాడు కూడా బ్రహ్మమే కాబట్టి, అప్పుడు సాధకుడు పొందే ఆనందం బ్రహ్మానందము.

ఈ రకంగా పిపీలికాది బ్రహ్మపర్యంతము ఒకే రకమైన ప్రేమతో ఉంటుంది. కాబట్టి ఆమె సత్యజ్ఞానానందరూపా అనబడుతోంది.

## 792. సామరస్యపరాయణా

శివశక్తుల ఏకీభావమే సామరస్యము. అటువంటి సామరస్యమే పరస్థానముగా గలది. ఎక్కువ తక్కువలు లేని సామరస్యమే అధికముగా గలది.

**పరస్పర తపస్సంపత్ ఫలాయిత పరస్పరౌ ।**
**ప్రపంచమాతాపితరౌ ప్రాంచౌ జాయాపతీ స్తుమః ॥**

ఒండొరుల తపస్సు ఫలితంగా వారు ప్రపంచానికి తల్లితండ్రులై ప్రాచీన దంపతులవుతున్నారు.

ఇది శివశక్తుల సమరసభావన. పరమేశ్వరికి శివునకు భేదం ఏమాత్రమూ లేదు. సత్యజ్ఞానానందముల సామరస్యము గలది ఆ పరమేశ్వరి. అందుకే సామరస్య పరాయణా అనబడుతోంది.

## 793. కపర్దినీ

**కపర్దినామకస్య శివస్య పత్నీ**

కపర్ది అనుపేరు గల శివుని భార్య.

విశేషముగా పొగడ్తలు గలది. గవ్వలమాలలచే అలంకరించబడునది. ఇది గిరిజన సంప్రదాయం.

మహాజటాజూటమును ధరించినది. గంగా జలప్రవాహాన్ని శోధించేవాడు కపర్దుడు. అతని శక్తి కపర్దిని.

గంగా ప్రవాహము పరమానంద స్వరూపమైనది. కాబట్టి ఇక్కడ దేవి పరమానందస్వరూప. కాళిదాసు తన లఘుస్తవంలో

**అర్భట్యా శశిఖండమండిత జటాజూటాం**

చంద్రఖండముచే అలంకరించబడిన జటాజూటము గలది అన్నాడు.

## 794. కలామాలా

**కలానాం చతుష్షష్ట్యాది రూపాణాం మాలా పరంపరా**

అరవైనాలుగు కలల పరంపర. లావణ్యముగా నుండునది. శోభను పొందినది.

కళలు మొత్తం అరవైనాలుగు. ఇవి విద్యాకళలు, వృత్తికళలు, అలాగే చంద్రకళలు, సూర్యకళలు, బ్రహ్మకళలు, రుద్రకళలు, అగ్నికళలు ఈ రకంగా అనేకమైన కళలున్నాయి. ఈ కళలన్నింటినీ మాలగా ధరించినది. వీటన్నింటినీ గతంలో వివరించాం. ఈ కళలచే పరివేష్టింపబడినది.

## 795. కామధుక్

కోరకలను పితుకునది. మనోరథమును పూరించునది. కామధేను స్వరూపం గలది.

పరమేశ్వరి తన భక్తుల కోరికలు తీర్చటంలో కామధేనువు వంటిది. అందుచేత కామధుక్ అనబడుతోంది.

## 796. కామరూపిణీ

కామ అనగా – పరమేశ్వరుడు. అతడే రూపంగా గలది. కాబట్టి కామరూపిణి.

సృష్టి ఆరంభం కాకముందు ఆ పరబ్రహ్మ "నేను అనేకములు కాదలచుకున్నాను. నేను ఈ సృష్టిని చేస్తాను. అని సంకల్పించాడు. అందుచేత అతడు కామేశ్వరుడైనాడు. కామేశ్వరుని రూపమే శరీరముగా గలది కామరూపిణీ. అన్ని కోరికలు తీర్చేది. కాబట్టి కామరూపిణీ. ప్రపంచాన్ని నిర్మించాలనే కోరికతో పుట్టిన ఇచ్ఛాశక్తి స్వరూపురాలు. భక్తులు తనను ఏ పేరుతో పిలిస్తే ఆ పేరుతో పలుకుతుంది. ఏ రూపంతో ఆరాధిస్తే ఆ రూపంతో దర్శనమిస్తుంది. అందుచేత కామరూపిణీ.

## 797. కలానిధిః

సమస్త కళలకు నిధి. ఈ కళలన్నీ గతంలో చెప్పినవే. వాటికి నిధి ఆ పరమేశ్వరి. అందుచేత ఆమె కళానిధి అనబడుతోంది. షోడశకలాప్రపూర్ణుడైన చంద్రుని రూపం గలది.

## 798. కావ్యకలా

కవి యొక్క కర్మ కావ్యాలు వ్రాయటం. సాహిత్యం ముఖ్యంగా మూడురకాలు. 1. వేదాలు 2. పురాణాలు 3. కావ్యాలు.

1. **ప్రభుసమ్మితాలు** – ప్రభువు యొక్క శాసనంలాగా నిర్దేశించి చెప్పేవి. వేదాలు.
2. **మిత్రసమ్మితాలు** – మిత్రునివలె ధర్మాన్ని బోధించేవి. పురాణాలు.
3. **కాంతాసమ్మితాలు** – స్త్రీసాహచర్యంలాగా రమ్యంగా ఉంటూ హితబోధ చేసేవి కావ్యాలు.

కవులచే వ్రాయబడినవి కావ్యాలు. పురాణాలలో కథ, ధర్మము ప్రధానంగా ఉంటే, కావ్యాలు రసప్రధానంగా ఉంటాయి.

ఈ కావ్యాలు ప్రధానంగా రెండు రకాలు.

1. దృశ్యకావ్యాలు – చూచి ఆనందించేందుకు వీలైనవి. నాటకాదులు.
2. శ్రవ్యకావ్యాలు – విని, లేదా చదివి ఆనందించేందుకు వీలైనవి.

ఇవి మళ్ళీ పద్యకావ్యాలు, గద్యకావ్యాలు, పద్యము, గద్యము కలిసిన చంపూకావ్యాలు ఇలా అనేకరకాలున్నాయి.

ఈ కావ్యాలన్నీ కవులచేతనే వ్రాయబడతాయి. కవిత్వము అనేది ఒక కళ. చతుష్షష్టికళలు ఆ పరమేశ్వరి రూపమే. కవిత్వం కూడా వాటిలో ఒకటి. అందుచేత పరమేశ్వరి కలారూపం అయినట్లుగానే కావ్యరూపం కూడా. కాబట్టే కావ్యకలా అనబడుతోంది.

కావ్యుడు అనే పేరు గల రాక్షసగురువైన శుక్రాచార్యుని యందు మృతసంజీవినీ విద్యాకలారూపంలో ఉన్నది.

ఈ కలలన్నింటినీ స్తుతించటానికి శక్తినిచ్చేది. చైతన్యకల. దాన్ని ఆశ్రయించే మిగిలిన కళలన్నీ ఉంటాయి. అదే బ్రహ్మ కల. పరమేశ్వరి బ్రహ్మకలారూపమైనది.

## 799. రసజ్ఞా

నవవిధ రసాలను ఎరిగినది. శృంగారాది నవరసాలచే తెలియబడు చైతన్యస్వరూపిణి. నవరసాలు అంటే

| | | |
|---|---|---|
| 1. శృంగారము | 4. అద్భుతము | 7. భయానకము |
| 2. వీరము | 5. హాస్యము | 8. రౌద్రము |
| 3. కరుణ | 6. భీభత్సము | 9. శాంతము |

శ్రీచక్రంలోని తొమ్మిది ఆవరణలలోనూ ఇవి ఉంటాయి. ప్రపంచంలోని అన్ని పదార్థాలలోనూ ఉన్న రససారరూపంలో తెలియబడునది.

రసేంద్రియస్వరూపమైనది. రసము అంటే – ఆనందము. ఆనందస్వరూపమైనది. బ్రహ్మానందస్వరూపిణి. కాబట్టి పరమేశ్వరి రసజ్ఞా అనబడుతోంది.

## 800. రసశేవధిః

**రసస్య బ్రహ్మామృతస్య శేవధిః నిధిః**

బ్రహ్మామృతమునకు నిధి. బ్రహ్మాండపురాణంలో

**రస ఏవ పరం బ్రహ్మ రస ఏవ పరాగతిః**

**రసో హి కాంతిదః పుంసాం రసో రేత ఇతి స్మృతః**

**రసోవై రససంలబ్ధ్వా హ్యానందీ భగవత్యపి**

రసమే పరబ్రహ్మ. రసమే పరాగతి. రసమే వీర్యము. అతడే రసము. రసాన్ని పొందినవాడు ఆనందిస్తాడు. వేదప్రమాణమైన ఈ రసము ప్రాణముగ ఉన్నది. అట్టి ప్రాణము లేక ఎవరూ జీవించరు అని చెప్పబడింది. వేదంలో కూడా రసమంటే ప్రాణము అని చెప్పబడింది.

రసము అంటే – బ్రహ్మానందం. రసశేవధి అంటే – ఆనంద ఘనస్వరూపం. ఎంత అనుభవించినా తరగని ఆనందసాగరం. ఎంతమంది ఎంతగా అనుభవించినా తరగని బ్రహ్మానంద ఘనస్వరూపము. అదే పరమేశ్వరి. కాబట్టి ఆమె రసశేవధిః అనబడుతోంది.

## 801. పుష్టా

శివాది క్షితి పర్యంతము 36 తత్త్వాలతో కూడిన శరీరము గలది. కాబట్టి పుష్టా అనబడుతోంది. రసశేవధికావటంచేత పుష్టా అనబడుతున్నది. సకల తత్త్వస్వరూపిణి, సకలకలాస్వరూపుణి అనటంచేత, బ్రహ్మానంద శేవధికావటంచేత పరమేశ్వరి పుష్టా అనబడుతున్నది. పుష్టికి మూలకారణం – ఆనందం. పరమేశ్వరి స్వయంగా ఆనందరూపిణి కాబట్టి పుష్టా అనబడుతోంది.

## 802. పురాతనా

**సర్వేషాం ఆదిభూతత్వాత్ పురాతనా**

అన్నింటికీ మొదలుగా ఉన్నది. ఈ సృష్టికి ముందు నుంచీ ఉన్నది. సృష్టి ప్రారంభానికి ముందు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ ఒక్కడే ఉన్నాడు. లోకాలను లోకపాలకులను కూడా సృష్టించింది ఆయనే. అతడే పరమేశ్వరుడు. ఈ రకంగా సృష్టికి ముందు నుంచీ ఉన్నది. కాబట్టి పురాతనా అనబడుతోంది. దేశకాలమానాలులేవు. కాలస్వరూపమే ఆమె.

**హయనాత్మా మహాదేవః ప్రజాపతి రితి స్మృతః.**

కాలస్వరూపుడు ప్రజాపతి అని తంత్రాలు చెబుతున్నాయి. కాబట్టి పరమేశ్వరికి కాలంతో నిమిత్తంలేదు. ఆద్యంతములు లేనిది. శాశ్వతమైనది. నిత్యమైనది. కాబట్టి ఎల్లప్పుడూ ఉంటుంది. అందుచేతనే ఆమె పురాతన అనబడుతోంది.

## 803. పూజ్యా

**అత ఏవ సర్వేషాం పూజ్యా**

అందరిచేత పూజింపదగినది. అందరికీ పూజ్యురాలు.

**పూజయితుం యోగ్యా**

పూజించుటకు యోగ్యమైనది. సృష్టికంతటికీ మూలకారణమైనది. కాబట్టి పూజింపదగినది. దేవతలు, గంధర్వులు, యక్షులు, కిన్నెరలు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు, రాక్షసులు వీరందరినీ సృష్టించినది ఆ పరమేశ్వరియే. అందుచేత వీరందరిచేత పూజించతగినది.

నిరాకారుడు నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. అతన్ని మోక్షవాదులు మాత్రమే అర్చిస్తారు. ఐహికవాదులు సగుణ బ్రహ్మను అర్చిస్తారు. అదే పరమేశ్వరి. అందుచేత అందరికీ పూజనీయ అవుతున్నది.

జగత్తంతా పరమేశ్వరిమయం. అన్ని దేవతలు ఆమె రూపమే. ప్రతి గ్రామంలోని దేవత కూడా పరమేశ్వరి స్వరూపమే. అందుచేత ఏ దేవతను పూజించినా, ఏ వ్రతంచేసినా ఆమెకే దక్కుతుంది. త్రిమూర్తులను పూజించినా ఆ పరమేశ్వరికే దక్కుతుంది. కాబట్టి సర్వదేవతలలోను శ్రేష్ఠురాలైన పరమేశ్వరి పూజ్యా అనబడుతుంది.

## 804. పుష్కరా

**పుష్కం పోషణం రాతి అదత్తే అసౌ పుష్కరా**

పుష్కము - పోషణము, రాతి - పొందునది, పోషించునది. సర్వమును పోషించునది. సర్వత్రా వ్యాపించినది. తామరవలె సర్వత్రా వ్యాపించి ఉండునది. విష్ణుపురాణంలో

**న్యగ్రోథః పుష్కరద్వీపే బ్రహ్మణః స్థానముత్తమమ్**

పుష్కర ద్వీపంలో ఒక మర్రిచెట్టు ఉన్నది. ఆ మర్రిచెట్టు బ్రహ్మకు స్థానమని చెప్పబడుతోంది. పద్మపురాణంలో

**విశాఖాస్థో యదా భానుః కృత్తికాసు చ చంద్రమాః**
**స యోగః పుష్కరోనామ పుష్కరే ఒ_ష్యతి దుర్లభః**

విశాఖ యందు సూర్యుడు, కృత్తికయందు చంద్రుడు ఉండే కాలము పుష్కరయోగము అంటారు. ఈ యోగము అతి దుర్లభము. పరమేశ్వరి ఈ యోగకాలస్వరూపిణి. కాబట్టి పుష్కరా అనబడుతోంది.

పన్నెండు సంవత్సరాలకు ఒకసారి వచ్చేకాలము పుష్కరము అనబడుతుంది.

## 805. పుష్కరేక్షణా

పుష్కరము అంటే - కలువ. కలువలవంటి కనులు గలది.

పుష్కరము అంటే - భూమి. పద్మపురాణంలో దేవతలు పద్మము యొక్క కర్ణికను భూమి అంటున్నారు. పద్మంలో ఉండే సారపురుగులు దివ్యమైన పర్వతాలు. పద్మము యొక్క రేకులు మ్లేచ్ఛ దేశాలు. క్రింది రేకులు సర్పాలు.

ఈ రకంగా నారాయణుని కోరికతో భూమి జన్మించింది అని చెప్పబడింది. అటువంటి విష్ణువునందు దయతో కూడిన చూపుగలది. పుష్కరేక్షణా

**పుష్కరే ణోపమితే అక్షిణీయస్యేతి పుష్కరాక్షః**

పద్మముల వంటి మనోహరమైన నేత్రములు గలది.

## 806. పరంజ్యోతిః

పరము అనగా - ఉత్కృష్టమైనది. అన్నింటికన్న గొప్పది. పరమైనటువంటిది బ్రహ్మైకమైన జ్యోతిస్సు. బృహదారణ్యకంలో చెప్పినట్లుగా జ్యోతిస్సులకన్న జ్యోతిస్సు ఉన్నది అని చెప్పబడింది. కఠోపనిషత్తులో ఆత్మ చాలా ప్రకాశవంతమైనది. అక్కడ సూర్యుడుకాని, చంద్రుడుకాని, నక్షత్రాలుగాని ప్రకాశించవు. భైరవయామళంలో

పరమేశ్వరి కొన్నివేల కోట్ల సూర్యచంద్రులకాంతులతో ప్రాకశిస్తున్నది. ఆ కాంతి నుండి అగ్ని 108, సూర్యుడు 116, చంద్రుడు 136 కిరణాలను మాత్రమే గ్రహించ గలిగారు. వీటివల్లనే జగత్తు ప్రవర్తిల్లుతున్నది అని చెప్పబడింది. దీన్ని గతంలో వివరించాం. ఈ రకంగా సూర్యచంద్రులకు కూడా తేజస్సును ఇచ్చేది ఆ పరమేశ్వరి. అందుచేతనే ఆమె పరంజ్యోతి అనబడుతోంది. అన్ని జీవులయందు ఆత్మరూపంలో ప్రకాశిస్తున్నది. కాబట్టి ఆ పరమేశ్వరి పరంజ్యోతి అనబడింది.

## 807. పరంధామా

పరంధామ అంటే - అమితమైన తేజస్సు అని అర్థం. గీతలో

**న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః**

**య ద్గత్వా న నివర్తంతే త ద్ధామ పరమం మమ.**

ఆ జ్యోతిని సూర్యుడు ప్రకాశింపచేయడు. చంద్రాగ్నులు ప్రకాశింపచేయరు. అది స్వయంప్రకాశము. దానిని పొందువారు తిరగిరారు అని చెప్పబడింది.

ధామ అంటే అవస్థ. ఎవరు జాగ్రస్వప్న సుషుప్తులను తెలుసుకుంటాడో అతడికి ఆత్మసాక్షాత్కారమవుతుంది.

ఏ స్థితి నుండి తిరిగి ప్రాకృతికస్థితి లేదో అది పరాస్థితి. మూడు అవస్థలకు పైన ఉన్నది తురీయము.

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాఖ్యం వేదధామత్రయం తు యః**

**స ఏవాత్రానమ ద్దృశ్యం తస్మిన్ సర్వం ప్రకల్పితమ్**

జాగ్రస్వప్న సుషుప్తులకు సాక్షిగా ఉండి ఎవరిని తెలుసుకొంటున్నారో, దానిని ఆత్మ అంటారు. కంటికి కనిపించేది, కనిపించనది అంతా దానియందే కల్పితమై ఉన్నది. కూర్మపురాణంలో

**సైషా మాహేశ్వరీ గౌరీ మమశక్తి ర్నిరంజనా**

**శాంతం సత్యం సదానందం తద్ధామ పరమంపదమ్**

నిరంజనము, శాంతము, సత్యము, సదానందస్వరూపాలైన నా శక్తులు మహేశ్వరి, గౌరి, పరమ ధామములు అని చెప్పబడింది.

అందుచేత పరమేశ్వరి పరంధామ అనబడుతోంది.

## 808. పరమాణుః

పరమైన అణురూపిణి. చాలా చిన్నదై కంటికి కనిపించని దాన్ని పరమాణువు అంటారు. దీన్ని కాంపౌండు మైక్రోస్కోప్‌లో మాత్రమే చూడగలము. అంతటి చిన్నది. త్రసరేణువుకన్న చిన్నదైనది. కాంతికిరణాలు ప్రసరిస్తున్నప్పుడు అందులో ఎగురుతూ కనిపించేది త్రసరేణువు. దానికన్న చిన్నది. ఆత్మను గురించి చెబుతూ కఠోపనిషత్తులో **అణోరణీయాన్** అన్నారు. అణువుకన్న కూడా చాలా చిన్నది.

అణువణువునా పరమేశ్వరి ఉన్నది. ప్రతి అణువులోనూ ఆమె ఉన్నది. అందుచేతనే అణువుకన్న కూడా పరిమాణములో చిన్నదైన పరమాణువు అని చెప్పటం జరిగింది. ఈ పరమాణువు కంటితోనే కాదు చెవులు, ముక్కు ఏ ఇతర అవయవాలవల్ల తెలుసుకోలేనిది. అత్యంత చిన్నదైనది. అందుకే ఆమె పరమాణువు అనిచెప్పబడింది.

## 809. పరాత్పరా

పరులైన వారికన్న కూడా పరమైనది. పరులు అంటే – శ్రేష్టులు. శ్రేష్టులైనవారికన్న కూడా శ్రేష్టమైనది. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు శ్రేష్టులు. వారికన్న కూడా శ్రేష్టమైనది. కాలమానంలో అతి పెద్దది బ్రహ్మకల్పం. ఇది బ్రహ్మ యొక్క ఆయుష్షు. ఇతడు కర్మబ్రహ్మ. త్రిమూర్తులలో మొదటివాడు. సృష్టికర్త. ఇతని ఆయువు కన్న ఎక్కువైనది. పరమేశ్వరికి

కాలమానం లేదు. ఆయువులేదు. చావు పుట్టుకలు లేవు. శాశ్వతమైనది. నిత్యము సత్యము అయినది. కాళికాపురాణంలో చెప్పినట్లుగా బ్రహ్మ యొక్క రాత్రింపగళ్ళు పర అనబడతాయి. పరబ్రహ్మకు దివారాత్రములులేవు. వేదంలో చెప్పినట్లుగా

| | | |
|---|---|---|
| ఇంద్రియాలకన్న | – | మనస్సు శ్రేష్ఠమైనది. |
| మనస్సు కన్న | – | బుద్ధి శ్రేష్ఠమైనది |
| బుద్ధి కన్న | – | మహత్తు శ్రేష్ఠమైనది. |
| మహత్తు కన్న | – | అవ్యక్తము శ్రేష్ఠమైనది |
| అవ్యక్తము కన్న | – | పరబ్రహ్మము శ్రేష్ఠమైనది. |

పరబ్రహ్మ కన్న శ్రేష్ఠమైనది ఏదీలేదు. అందుకే ఆమె పరాత్పరా అనబడుతోంది.

## 810. పాశహస్తా

ఎడమభాగంలో క్రిందిచేతిలో పాశము ఉన్నది. పాశములను చేతితో తొలగించునది. పరమేశ్వరి చేతిలో పాశము అనే ఆయుధమున్నది. అది రాగస్వరూపమైనది అని గతంలో వివరించాం. దీనితోనే మానవుడు కట్టివేయబడుతున్నాడు. వామకేశ్వరతంత్రంలో చెప్పినట్లుగా మనలో ఉన్న రాగము అనే అనురాగాన్ని దేవికి సమర్పించి ఆమెను అర్చించాలి. అప్పుడే సాయుజ్యం సిద్ధిస్తుంది.

## 811. పాశహంత్రీ

పాశములను నశింపచేయునది.

**ఘృణాలజ్జాభయం శంకాజుగుప్సా చేతి పంచమీ ।**
**కులంశీలం తథాజాతి రష్టౌపాశాః ప్రకీర్తితాః ॥**

| | | | |
|---|---|---|---|
| 1. దయ | 3. మోహము | 5. సంశయము | 7. బలము |
| 2. జుగుప్స | 4. భయము | 6. కులము | 8. శీలము |

ఇవి అష్టవిధపాశాలు. అయితే

| | | | |
|---|---|---|---|
| 1. పశుపాశము | 3. బంధపాశము | 5. ఆశాపాశము | 7. దుఃఖపాశము |
| 2. భవపాశము | 4. మోహపాశము | 6. కర్మపాశము | 8. కేశపాశము |

ఇవికూడా అష్టపాశాలే. ఈ పాశాలను నశింపచేసేది.

**పాశయుక్తో భవే జ్జీవః పాశముక్తో భవే చ్ఛివః**

పాశబద్ధుడు జీవుడు. పాశాలను త్రెంచుకున్నవాడు ఈశ్వరుడు.

భక్తుల యొక్క పాశాలను అంటే బంధనాలను త్రెంచివేస్తుంది. కాబట్టి పాశహంత్రీ అనబడుతుంది. అనిరుద్ధుడు బాణుడితో యుద్ధంచేస్తూ నాగపాశంతో బంధించబడినప్పుడు, ఆ పరమేశ్వరి అతడికి విముక్తి కలిగించింది.

## 812. పరమంత్రవిభేదినీ

పరమంత్రములు అంటే తనను గాని, తన భక్తులను గాని ఇబ్బందుల పాలుచెయ్యటం కోసం ప్రయోగించే మంత్రాలను విభేదించేది. భండాసురుడు వేసిన జయవిఘ్న మంత్రాన్ని మహాగణపతితో నాశనం చేయించింది. అసురులు వేసిన రాక్షసాస్త్రాలను నాశనం చేసింది.

తనను జపించువారికి పరులవలన భయము లేకుండా కాపాడేది.

పంచదశీ మహామంత్రాన్ని పన్నెండుమంది ఉపాసకుల ద్వారా భిన్నవిధానాలలో ప్రచారం చేయించింది. కాబట్టి పరమంత్రవిభేదినీ అనబడుతోంది. ఈ రకంగా కపర్దినీ విద్య చెప్పబడింది.



శ్రీ జకార దేవి

# 48. జ్ఞానవిద్య

విద్య అంటే జ్ఞానము. మానవుడు తను పుట్టక ముందు ఎక్కడ ఉన్నాడు? మరణానంతరము ఎక్కడికి పోతాడు? పునర్జన్మ ఉన్నదా, లేదా? భగవంతుడు అనే వాడున్నాడా? చరాచర జగత్తు ఏ విధంగా వచ్చింది? సృష్టి స్థితి లయాలు ఏ విధంగా జరుగుతున్నాయి? దానికి కారణం ఎవరు ? సైన్సు ప్రకారం స్త్రీ పురుషకణాలు కలిస్తే పిండోత్పత్తి జరుగుతుంది. కాని అలా ప్రతి చోటా జరగటం లేదు కదా? ఏ రకమైన లోపాలు లేకపోయినా పిల్లలు లేని భార్యాభర్తలు చాలామంది ఉన్నారు. దీనికి కారణం ఏమిటి? అసలు జగత్తు ఏ విధంగా సృష్టించబడుతోంది? ఈ ప్రశ్నలకు సమాధానమే జ్ఞానము.

ఏ వస్తువు గురించి తెలుసుకుంటే అన్నింటి గురించి పూర్తిగా తెలుస్తుందో, ఆ వస్తువే ఆత్మ. ఆత్మ గురించిన విషయాలను తెలుసుకోవటమే ఆత్మజ్ఞానము. ఆత్మ అన్ని జీవులలోనూ ఉన్నది. తన స్వరూపము అంటే తన ఆత్మ. తన ఆత్మను గురించి తెలుసుకునేదే స్వరూప జ్ఞానము. అదే ఆత్మ జ్ఞానము. అయితే తన ఆత్మ, ప్రక్కవాడి ఆత్మ అని వేరే లేవు. ఉన్నదంతా ఒక్కటే. అదే పరమాత్మ ఆ జీవిలో ఉన్న ఆ పరమాత్మ స్వరూపాన్నే ఆత్మ అంటున్నారు. ఇది జీవాత్మ. అది పరమాత్మ. ఈ రెండూ వేరు కాదు.

ఒకే చెట్టు మీద రెండు పక్షులు కూర్చుని ఉన్నాయి ఒకటి ఏ విధమైన ఆహారం తినకుండా హాయిగా ఉన్నది. రెండవది దొరికిన ఆహారం తింటూ విచారంగా ఉన్నది. ఆ పక్షులు రెండూ ఒకే జాతికి చెందినవి. ఒకే రంగు, ఒకే రూపం గలవి. అవే జీవాత్మ, పరమాత్మ. జీవాత్మ కర్మఫలాలు అనుభవిస్తోంది. పరమాత్మకు కర్మఫలం లేదు కాబట్టి హాయిగా కూర్చుని ఉన్నది. అయితే అజ్ఞానంవల్ల తానే పరమాత్మను అని తెలుసుకోలేకపోతోంది జీవాత్మ. కాని అజ్ఞానపు పొరలు వీడిపోయి, ఎప్పుడైతే తాను పరమాత్మ స్వరూపమే అని తెలుసుకోగలిగిందో అప్పుడు జీవాత్మ పరమాత్మలో లీనమైపోతుంది. అంటే రెండు పక్షులూ ఒక్కటే అయిపోతాయి. ఇదే జ్ఞానము.

చరాచర జగత్తంతా పరమేశ్వరమయం. ఈ జగత్తులో కంటికి కనిపించేది, కనిపించనది అంతా పరమేశ్వరమయమే. పరమేశ్వరుడు సర్వశక్తి సమన్వితుడు. నిత్యతృప్తుడు. అతడు తన భక్తుల హృదయారవిందాలలో ఉంటాడు. హంస అంటే శ్వాస, మునులయొక్క మానసమనే సరోవరంలో హంసలా విహరిస్తూ ఉంటాడు. అతడు

సత్యస్వరూపుడు సత్యవ్రతుడు. సర్వాంతర్యామి. అన్నిచోట్లా ఉంటాడు. పంచభూతాలలో అంతర్యామిగా ఉంటాడు. సాక్షాత్తూ సృష్టికారకుడైన కర్మబ్రహ్మను కూడా అతడే సృష్టించాడు. అనేక రూపాలలో ఉంటాడు. జ్ఞానులందరూ అతణ్ణి చేరటం కోసమే ఆరాటపడుతుంటారు. అతడే ఈ లోకాలను సృష్టించాడు. అతడు ఉన్నాడన్న భయంతోనే గాలి సక్రమంగా వీస్తోంది. దేవతలు వారి విధులను సక్రమంగా నిర్వర్తిస్తున్నారు. అతడే సకల జగత్తుకూ అధిష్ఠానము. ప్రాణులందరికీ ఆరాధ్యము. ప్రాణాలకు ముఖ్యప్రాణము. జీవులకు ప్రాణాలు పోసేవాడు. లోకంలో భక్తజనుల కోసం 51 పీఠాలయందున్నాడు. అతన్ని అదుపు చేసే వారెవరూ లేరు. అందరికన్నా అతడే అధికుడు. నిర్జన ప్రదేశంలో, పవిత్ర ప్రదేశంలో ఉంటాడు. ఇంద్రాది మహావీరులను సృష్టించినది ఆయనే. పంచభూతాలలో మొదటిది అయిన ఆకాశాన్ని సృష్టించినది ఆయనే. జీవులకు వారివారి అర్హతలను బట్టి ముక్తిని ప్రసాదిస్తాడు. అతడే మూలశక్తి.

అతన్ని కేవలము భావనా మాత్రంచేతనే తెలుసుకోవచ్చు. తన భక్తులయొక్క భవబంధాలకు విమోచనం కల్పిస్తాడు. సంసారచక్రాన్ని త్రిప్పేది అతడే. అతడు వేదస్వరూపం శాస్త్రస్వరూపం. మంత్రరూపం, ప్రళయకాలంలో బ్రహ్మాండాలను తన ఉదరంలో దాచుకునేవాడు అతడే. లోకాలను ప్రవర్తింప చేయటం కోసం చతుర్వర్ణాలను అతడే సృష్టించాడు. ఉపనిషత్తులసారం అంతా అతడే. శాంతికల, ధృవకల, నిత్యాకల, బ్రహ్మకల అతడే.

అనంతమైనవాడు. ఆకాశమే అతని నివాసస్థానము. కల్పనలు, ప్రాపంచిక వాసనలు లేనివాడు. కాలస్వరూపుడు. భక్తులయొక్క దుఃఖాన్ని నాశనం చేస్తాడు. అతడే అర్ధనారీశ్వరుడు. స్త్రీ పురుష బేధములు లేనివాడు. కార్యము కారణము మొదలైనవి లేనివాడు జనన మరణాలు లేనివాడు. భక్తసులభుడు. అంతఃపూజ చేసేవారికి దర్శనమిస్తాడు. బాహ్యపూజలు చేసే లౌకికులకు దుర్లభుడు. అతడే వేదవిద్య అకార, ఉకార మకార స్వరూపుడు. త్రిపుటి.

ఆ పరమేశ్వరుడికి జన్మ, మృత్యు, జరా, వ్యాధులు ఏ మాత్రమూలేవు. అతడు నిరాధారుడు. అందరికి అతడే ఆధారము. అతడికి ఆధారం ఎవరూలేరు. జగత్తంతా అతని శరీరమే. అతడు తన ఆత్మలోనే క్రీడిస్తాడు. స్త్రీపురుషులుగా ఏర్పడి క్రీడిస్తాడు. భక్తులదహరాకాశంలో క్రీడిస్తుంటాడు. మునీశ్వరుల హృదయాలలో విహరిస్తాడు.

అటువంటి పరమేశ్వరుణ్ణి ఆరాధిస్తే సాధకుడి జీవాత్మ పరమాత్మను చేరుతుంది. అంటే కుండలినీశక్తి సహస్రారం చేరి అక్కడున్న చంద్రమండలాన్ని తన నోటితో కరిచిపట్టుకుంటుంది. అప్పుడు అక్కడి నుంచి అమృతపుధారలు స్రవించి యోగి శరీరంలోని 72 వేల నాడీమండలాన్ని తడుపుతాయి.

ఈ రకంగా జ్ఞానజ్యోతి అయిన పరమేశ్వరి లక్షణాలను, జ్ఞానరూపిణి అయిన ఆమె ఉపాసనా ఫలితాన్ని 813 నుంచి 877 వరకు గల నామాలలో వివరించబడింది.

## 813. 814. మూర్తా, అమూర్తా

**రూపవ ద్వస్తు మూర్తం. వాయ్వాకాశాదికం అమూర్తం**

రూపము ఉన్నటువంటి వస్తువు మూర్తము. భూమి, నీరు, అగ్ని మొదలైనవి. వాయువు, ఆకాశము వంటి రూపం లేని వస్తువులు అమూర్తము. పంచీకృతములైన పంచమహాభూతాలు మూర్తాలు. అపంచీకృతములైన భూత సూక్ష్మాలు అమూర్తాలు. ఇంకా చెప్పాలి అంటే కంటికి కనిపించేది మూర్తం. ఒక ఆకారం గలది మూర్తము. అలాగే కంటికి కనిపించనిది, ఒక ఆకారము లేనిది అమూర్తము. పంచీకృతము అంటే గతంలో దేవి సూక్ష్మరూపాన్ని వర్ణించేటప్పుడు వివరించాం. కాబట్టి మళ్ళీ చెప్పటంలేదు.

దేవి స్థూలరూపం మూర్తము సూక్ష్మరూపం అమూర్తము కంటికి కనిపించే పదార్థాలన్నింటిలోనూ కూడా కంటికి కనిపించనటువంటి పదార్థమొకటి ఉంటుంది. అది అమూర్తము. విష్ణుపురాణంలో

**ద్వే రూపే బ్రహ్మణ స్తస్య మూర్తం చా మూర్త మేవ చ**

పరబ్రహ్మకు మూర్తము అమూర్తము అని రెండు రూపాలున్నాయి.

**క్షరాక్షరాస్వరూపే తే సర్వభూతే ష్వవస్థితే**
**అక్షరం బ్రహ్మ కూటస్థం క్షరం సర్వ మిదం జగత్ ॥**

బ్రహ్మకు మూర్తము అమూర్తము అని రెండు రూపాలున్నాయి. 1. క్షరము 2. అక్షరము.

| | | |
|---|---|---|
| 1. క్షరము | – | నామరూపాత్మకమైన ప్రపంచము |
| 2. అక్షరము | – | కంటికి కనిపించని పరమాత్మ |

వీటిని గురించి బృహదారణ్యకోపనిషత్తులో ఈ విధంగా ఉంది. “ఇంద్రియాలకు శరీరానికి కారణభూతమైన పంచభూతాలను సత్యం అంటారు. విజ్ఞులు నేతి, నేతి ఇది కాదు, ఇది కాదు అంటూ బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోవటానికి ప్రయత్నిస్తారు. బ్రహ్మకు రెండు రూపాలున్నాయి. 1. మూర్తము 2. అమూర్తము. అవే స్థూలము, సూక్ష్మము మర్త్యరూపము, అమృతరూపము. అంటే నశించేది, నశించనిది. మరణము ఉన్నది, మరణము లేనిది నిర్వచించటానికి వీలైనది, నిర్వచించటానికి వీలుకానిది.

పంచభూతాలలో మొదటి మూడు పృథివి, జలము, అగ్ని ఈ మూడూ మూర్తాలు. స్థూలమైనవి. కంటికి కనిపిస్తాయి. వీటికి ఒక ఆకారము ఉన్నది. వీటిని నిర్వచించటానికి వీలవుతుంది. ఇవి నశిస్తాయి. మిగిలిన రెండూ అమూర్తాలు. అవి వాయువు, ఆకాశం. వీటికి నాశనం లేదు. కంటికి కనపడవు. వీటికి ఆకారం లేదు. వీటిని నిర్వచించటానికి వీలు లేదు.

ప్రాణంకన్న భిన్నమైనది. దేహంలో ఉన్న ఆకాశం కన్న భిన్నమైనది. మొదటి మూడు భూతాలచేత నిర్మించబడింది ఈ శరీరం. ఇది మూర్తము, మర్త్యము నాశనమైపోతుంది.

ప్రాణాలు, శరీరంలో ఉన్న ఆకాశం. ఈ రెండూ అమూర్తాలు. ఇవి నాశనం లేనివి.

లింగ శరీరరూపమైన పురుషుని వాసనామయరూపం పసుపులో ముంచిన వస్త్రం లాగా, తెల్లని గుడ్డలాగా, వర్షాకాలంలో కనిపించే ఆర్ద్రపురుగులాగా, అగ్నిజ్వాలలాగా, తెల్లని పద్మంలాగా, మెరుపుకాంతిలాగా ఉంటుంది. ఈ విషయం తెలుసుకున్న వాడి సంపద విద్యుత్ప్రకాశంలాగా ఒక్కసారిగా అంతటా వ్యాపించి ఉంటుంది.

బ్రహ్మను గురించి ఇంతకన్న చెప్పటం కష్టం. నేతి నేతి అనుకుంటూ, మనకు లభించింది బ్రహ్మమేనా? అని ప్రశ్నించుకుంటూ, ఇది కాదు అని తెలుసుకుంటూ, ఇలా పోగాపోగా, చివరకు మిగిలేదే బ్రహ్మము. కనిపించే విషయాలను నిషేధిస్తూపోతే, మిగిలేదే బ్రహ్మము. అది సత్యానికి సత్యం, ప్రాణానికి ప్రాణం.

ఈ రకంగా కంటికి కనిపించే స్థూలరూపం మూర్తము, కనిపించని సూక్ష్మరూపం అమూర్తము. రెండూ పరమేశ్వరి రూపాలే. కాబట్టే ఆమె మూర్తామూర్తా అనబడింది.

## 815. నిత్యతృప్తా

నిత్యము తృప్తి చెందేది. కేవలం భక్తి మాత్రంచేతనే ప్రీతి చెందేది.

తృప్తి అనేది ఆనందం యొక్క లక్షణం. పరమేశ్వరి బ్రహ్మానందమే స్వరూపముగా గలది. కాబట్టి నిత్యతృప్తా అనబడుతోంది. పరమేశ్వరిని అర్చించటానికి అనేక పూజావిధానాలున్నాయి. చతుష్షష్ట్యుపచారాలు, షోడశోపచారాలు ఈ రకంగా అనేకమున్నాయి. కాని

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**త దహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః ॥**

భక్తితో సమర్పించే నీటిబొట్టుతోనైనా సరే నేను సంతసిస్తాను. అంటున్నాడు భగవానుడు.

పైన చెప్పిన ఉపచారాలన్నీ సంప్రదాయసిద్ధము. కార్యసాధనకు అనుకూలము. వాటివల్ల పనులు జరుగుతాయి. కాని భగవత్సాక్షాత్కారం కావాలి అంటే భక్తి, అందులోనూ తాదాత్మ్యము ఒక్కటే ప్రధానమైనది. భక్తులు చేసే ఉపచారముతో నిత్యము తృప్తి చెందేది.

## 816. మునిమానసహంసికా

మహర్షుల యొక్క మనస్సు అనే సరోవరంలో తిరుగాడే ఆడు హంస.

మంత్రానుష్ఠానంలో నిష్ణాతులైన వారిని మునులు అంటారు. వారియొక్క మనస్సునందు సదా పరమేశ్వరిని ధ్యానిస్తుంటారు. కాబట్టి ఆ పరమేశ్వరి ఎల్లవేళలయందు వారి హృదయాలలోనే ఉంటుంది. వారి మనసులే 'మానస సరోవరం'. హంసలు మానస సరోవరంలోనే తిరుగాడుతాయి. కాబట్టి పరమేశ్వరి అనే హంస మునులయొక్క మనస్సు అనే సరోవరంలో తిరుగాడుతుంటుంది.

లలితా త్రిశతిలో 211వ నామము **హ్రీంకార దీర్ఘికాహంసీ** అని చెప్పబడింది. దీర్ఘికము అంటే దిగుడు బావి. హ్రీంకారమనే దిగుడుబావిలో ఆ పరమేశ్వరి హంస. రాజోద్యానవనంలో క్రీడాసరస్సు హ్రీంకారము. అక్కడివారికి హాయినిచ్చినట్లే సంసార సాగరమనే వనంలో సంచరించే మానవులకి హ్రీంకారమనే సరస్సు హాయినిస్తుంది. ఆహ్లాదాన్ని కలుగచేస్తుంది. అందులోని హంసను, ఆ పరమేశ్వరిని చూసినప్పుడు తాపసులు తాము పడ్డశ్రమ అంతా మరచిపోతారు.

కామేశ్వరీ కామేశ్వరులు హంస ద్వంద్వముగా చెప్పబడ్డారు. సౌందర్యలహరిలోని 38వ శ్లోకంలో అనాహతపద్మాన్ని వర్ణిస్తూ శంకరభగవత్పాదులవారు

**సమున్మీల త్సంవి త్కమల మకరందైకరసికం ।**
**భజే హంసద్వంద్వం కి మపి మహతాం మానసచరమ్ ॥**

శరీరంలో ఇడ పింగళ నాడులున్నాయి. అవి ఉచ్ఛ్వాస, విశ్వాసలను చేస్తుంటాయి. ఈ శ్వాసక్రియనే హంస అంటారు. సమాధికోరే సాధకుడు ఈ శ్వాసను బంధిస్తాడు. అప్పుడు ఆ శ్వాసగమనం ఆగిపోతుంది. ఇలా ఎంతసేపు శ్వాసను దిగ్బంధం చెయ్యకలడనేది అతని సాధనమీద అది ఆధారపడి ఉంటుంది. శ్వాసను బంధించి, శ్వాసమీద ఆధిపత్యం సంపాదించగలవాడు పరమహంస అనబడతాడు. శంకర భగవత్పాదులవారు పరమహంస అని పిలువబడ్డారు.

పుణ్యానందముని ఆశ్రమంలో కూర్చుని ఉన్న సమయంలో ఆకాశంలో శివశక్తులు రెండూ హంసల రూపంలో ఎగురుతూ మాట్లాడుకున్న విషయాన్నే 'కామకలావిలాసము' అనే పేరుతో ఒక గ్రంథాన్ని వ్రాశాడు. దానికి **శ్రీవిద్యాసర్వస్వము** పేరుతో మేము తెలుగులో వివరణ వ్రాశాము.

## 817. సత్యవ్రతా

సత్యము అంటే – బ్రహ్మ. సత్యమే వ్రతముగా గలది. బ్రహ్మవ్రతమే ప్రియముగా గలది. పరబ్రహ్మను సేవించే వ్రతాలలో యజ్ఞము శ్రేష్ఠమైనది. యజ్ఞమే విష్ణుస్వరూపమని గతంలో వివరించాం. ఆ విష్ణువు పరమేశ్వరిఅంశ సంభూతుడు. యజ్ఞము పరమేశ్వరి స్వరూపము. అందుచేత పరమేశ్వరి సత్యవ్రతా అనబడుతోంది.

ఎల్లవేళల యందు పరమేశ్వరి ధ్యానము, ఉపాసన మొదలైన వాటియందు మనసును లగ్నం చెయ్యటమే బ్రహ్మోపాసన. అదే సత్యవ్రతము.

దేవీభాగవతంలో సత్యవ్రతుని కథ ఒకటుంది. పూర్వకాలంలో కోసలదేశంలో దేవదత్తుడు అనే పండితుడు ఉండేవాడు. అతనికి చాలాకాలం సంతానంలేదు. మిగిలిన పండితులతో ఆలోచించి పుత్రసంతానం కోసం తమసానదీ తీరాన యజ్ఞం చెయ్యటం ప్రారంభించాడు ఆ యజ్ఞానికి.

సహోత్రుడు – బ్రహ్మ
యాజ్ఞవల్క్యుడు – అధ్వర్యుడు

| | | |
|---|---|---|
| బృహస్పతి | – | హోత |
| గోబిలుడు | – | ఉద్గాత |
| సమర్థులైన పండితులు | – | ఋత్విక్కులు |

ఉద్గాత అంటే యజ్ఞ సమయంలో సామవేదాన్ని పారాయణ చేసేవాడు. గోబిలుడు వేదాన్ని చక్కగా పారాయణ చేస్తున్నాడు. దేవతలు కూడా దీనికి బాగా సంతోషించారు. కాని ఒకరోజు వేదపారాయణ చేస్తుండగా ఊపిరి పట్టి స్వరం తప్పు వచ్చింది. దానికి దేవదత్తుడు కోపించి "ఓరి మూర్ఖుడా! పుత్రులకోసం నేను యజ్ఞం చేస్తుంటే నువ్వు వేదాం తప్పు చదువుతావా? దానివల్ల నాకు చెడుఫలితం రాదా?" అన్నాడు. ఆ మాటలకు కోపించిన గోబిలుడు "నాకు ఊపిరి పట్టటం వలన స్వరం తప్పు వచ్చింది. అంతేకాని నేను కావాలని తప్పు చదవలేదు. అయినప్పటికీ నన్ను 'మూర్ఖుడు' అన్నావు కాబట్టి నీకు మూర్ఖుడైన కుమారుడే పుడతాడు" అన్నాడు.

ఆ మాటలు విన్న దేవదత్తుడు చాలా విచారించి పుత్రులు లేకపోయినా పరవాలేదు. అంతేకాని మూర్ఖుడైనవాడు, విద్యావిహీనుడు అయిన కుమారుడు ఉండి ప్రయోజనం ఏముంటుంది. అంటూ దుఃఖించాడు. ఆ రకంగా శపించినందుకు గోబిలుడు కూడ చాలా చింతించి 'నేను తొందరపడకుండా ఉంటే బాగుండేది. సరే. ముందుగా నీకు మూర్ఖుడు పుట్టినా, పరమేశ్వరి అనుగ్రహంవల్ల తరువాత వాడు గొప్పపండితుడౌతాడు అన్నాడు.

దేవదత్తుని భార్య గర్భవతి అయి మగశిశువును ప్రసవించింది. బాలుడికి ఏడు సంవత్సరాలు వయసురాగానే, ఉపనయనం చేసి, వేదం చెప్పటం మొదలుపెట్టాడు. ఎంతకాలమైనప్పటికీ బాలుడికి వేదం రాలేదుసరికదా పలకటానికి నోరుకూడా తిరగలేదు. దాంతో తోటిపిల్లలు ఎగతాళి చెయ్యటం మొదలుపెట్టారు. అది భరించలేని బాలుడు ఇంట్లోనించి వెళ్ళిపోయి గంగానదీ తీరం చేరాడు. అక్కడ తపస్సు చేద్దాము అని అతడి సంకల్పం. కాని ఏం చెయ్యాలో, ఎలా చెయ్యాలో తెలియదు. చిన్న పర్ణశాల నిర్మించుకుని ప్రతిరోజూ మధ్యాహ్నందాకా అందులో కదలకుండా కళ్ళుమూసుకుని కూర్చునేవాడు. అపరాహ్ణం వేళ అడవిలోకి పోయి, దొరికిన కాయో పండో తిని మళ్ళీ పర్ణశాలలో అదే స్థితిలో కూర్చునేవాడు. ఎవరితోనూ మాట్లాడేవాడు కాదు. అయితే ఎల్లవేళలా సత్యమే చెప్పేవాడు. అందుచేత అతణ్ణి అందరూ సత్యవ్రతుడు అనేవారు. అలా చాలా రోజులు గడిచినాయి.

ఒక రోజు అడవిలో వేటగాడు ఒక పందిని తరుముతూ వస్తున్నాడు. అది అరుచుకుంటూ సత్యవ్రతుడి ఆశ్రమం ప్రక్కనుంచిపోయింది. ఆ పంది చేసిన శబ్దం 'ఐం'కారంలా వినిపించింది సత్యవ్రతుడికి. దాంతో వాగ్బీజమైన ఐంకారాన్ని జపించటం మొదలుపెట్టాడు సత్యవ్రతుడు. ఆకాశంలో అదే సమయంలో పార్వతీ పరమేశ్వరులు వెడుతున్నారు. సత్యవ్రతుడి దీక్షకుమెచ్చి పాండిత్యాన్ని అనుగ్రహించింది పరమేశ్వరి.

వేటగాడు పందిని తరుముకుంటూ వచ్చి సత్యవ్రతుణ్ణి చూసి పంది ఎటుపోయింది అని అడిగాడు దానికి సత్యవ్రతుడు.

**యా పశ్యతి న సా బ్రూతే యా బ్రూతే సా న పశ్యతి**
**అహో । వ్యాధ । స్వకార్యార్థిన్ ! కింపృచ్ఛసి పునఃపునః**

ఓ కిరాతకుడా ! నీ పని కావాలనే కోరికతో నన్ను మాటిమాటికీ అడుగుతున్నావు. చూసే కనులు మాట్లాడలేవు. మాట్లాడే నోరు చూడలేదు. కాబట్టి నేను ఏం చెప్పగలను. ఈ మాటలకు అందరూ ఆశ్చర్యపోయారు. సత్యవ్రతుడు తరువాత కాలంలో పెద్దపండితుడుగా ప్రసిద్ధి చెందారు.

## 818. సత్యరూపా

సత్యమే రూపముగా గలది. సత్యాన్ని రక్షించునది.

పరమేశ్వరి త్రికాలములందు ఉంటుంది. కాబట్టి సత్యమైనది. మిగిలిన దేవతలు ఎక్కడో మాత్రమే గలరు. కాని పరమేశ్వరి అన్ని జీవులయందు ఉన్నది. లోకంలో అన్నీ పరమేశ్వరి రూపమే. కాబట్టి ఆమె 'సత్యరూపా' అనబడుతోంది.

## 819. సర్వాంతర్యామినీ

సమస్తమైన అంతఃకరణలను నియమించునది. పరమేశ్వరి సర్వజీవులయొక్క హృదయాకాశములయందు జీవరూపంలో ఉంటుంది. జీవులను సృష్టించి, తాను ఆ జీవులందు ప్రవేశిస్తుంది. ఐతరేయోపనిషత్తులో "ఈ రకంగా పరబ్రహ్మ జీవకోటిని సృష్టించి, తాను ఆ జీవరాసిలో ప్రవేశించాలి అనుకుంది. అందుకు రెండే మార్గాలు ఉన్నాయి. 1. పై నుంచి 2. క్రింద నుంచి

క్రిందనుంచి ప్రవేశించటమనేది సేవకుల లక్షణం కాబట్టి పైనుంచి అంటే బ్రహ్మరంధ్రంద్వారా శరీరాలలో ప్రవేశించింది" అని చెప్పబడింది.

హకార సంజ్ఞగల పరమేశ్వరుడు, సకారసంజ్ఞ గల ప్రకృతితో కలిసి శబళ బ్రహ్మమై, తొమ్మిదిద్వారాలు గల మానవ శరీరము అనే పట్టణంలో ప్రవేశించి, ఇంద్రియాలు, ప్రాణాలు, మనస్సుతో కూడినవాడై, పంజరంలో బంధించబడిన పక్షిలాగా, బయటకు వచ్చే ఉపాయం తెలియక, ప్రాపంచిక బంధనాలలోపడి కొట్టుమిట్టాడుతున్నాడు. అంటువంటి హంస అనబడే జీవుడికి

అగ్ని, చంద్రమండలాలు - రెక్కలు

ఓంకారము - శిరస్సు

జ్ఞాననేత్రము - ముఖము

హకార సకారాలు - పాదాలు

ఈ రకంగా ఉన్న హంస అనే జీవుడు పాలలో కలిసిన నెయ్యిలాగా సమస్త ప్రాణికోటిని ఆవరించి ఉన్నాడు. అందుచేతనే పరమేశ్వరి సర్వాంతర్యామిణీ అనబడుతోంది.

## 820. సతీ

**పాతివ్రత్యాత్ సద్రూపత్వాచ్చ సతీ**

పాతివ్రత్యము సద్రూపముగా గలది కాబట్టి సతి. దక్షుని యొక్క కుమార్తె సతి.

సత్ అంటే - బ్రహ్మ అని అర్థం. త్రికాలములందు ఉండునది. భూతభవిష్యద్వర్తమాన కాలాలలో ఉండేది. కాబట్టి సతీ అనగా - బ్రహ్మము. నిత్యము సత్యమైనది.

పతివ్రత. పతియే వ్రతముగా గలది. అన్నివేళలయందు భర్తనే అనుసరించేది.

దక్షుని కుమార్తె దాక్షాయణి. తండ్రిచేస్తున్న యజ్ఞానికి వెళ్ళి, అక్కడ పరాభవింపబడి, యోగాగ్నిలో భస్మమై, మరుజన్మలో హిమవంతుని ఇంట హైమవతిగా జన్మించింది.

దేవీ సప్తశతిలోని ప్రథమ చరితంలో

1. కాళీ
2. తారా
3. ఛిన్నమస్తా
4. సుముఖీ
5. భువనేశ్వరీ
6. బాలా
7. కుబ్జా

మధ్యమ చరితంలో

1. లక్ష్మి
2. లలితా
3. కాళీ
4. దుర్గా
5. గాయత్రీ
6. అరుంధతి
7. సరస్వతి

ఉత్తమ చరితంలో

| | | | |
|---|---|---|---|
| 1. బ్రాహ్మీ | 3. కౌమారి | 5. వారాహి | 7. చాముండా |
| 2. మాహేశ్వరి | 4. వైష్ణవి | 6. మాహేంద్రి | |

వీరందరూ సమిష్టి రూపాలయిన

| | | | |
|---|---|---|---|
| 1. నందా | 3. శాకంభరీ | 5. రక్తదంతికా | 7. భ్రామరీ |
| 2. శతాక్షి | 4. భీమా | 6. దుర్గా | |

ఏడుగురు సతులు అని చెప్పబడుతున్నారు. వీరందరి సమిష్టిరూపమే పరమేశ్వరి. అందుచేత సతీ అని చెప్పబడుతున్నది.

## 821. బ్రహ్మాణీ

పంచభూతాలయందు అంతర్యామిగా ఉండేది బ్రహ్మ. దీన్ని జ్ఞానంతో మాత్రమే సాధించగలము. చతుర్దశ భువనాలకు ఆధారమైంది బ్రహ్మ. తనకన్న ఎక్కువైనది మరొకటి లేదు. సర్వము తానే అయినది. అంతటా తానే ఉండేది. ఆది మధ్యాంత రహితమైనది. శుద్ధ బుద్ధ ముక్త స్వరూపము. సంతత శ్రీకరము. సకల మంగళకరము. ఈ జగత్తునంతా ఆవరించి ఉన్నది.

తైత్తిరీయంలో చెప్పినట్లుగా

విజ్ఞానమయకోశము లోపల ఆనందమయ కోశమున్నది. ఇక్కడ ఆనంద మయుడున్నాడు. అతడికి

ప్రియము (తనవారిని చూసినప్పుడు కలిగే ఆనందం) - శిరస్సు
మోదము (కోరుకున్నది లభించునపుడు కలిగే సంతోషము) - దక్షిణపక్షమ
ప్రమోదము (మోదము ఎక్కువైనప్పుడు కలిగేది) - ఉత్తరపక్షము
ఆనందము (అన్నిటికీ మించిన సంతోషము) - ఆత్మ

చరాచర జగత్తంతా బ్రహ్మమే. ఆకాశానికి కారణం బ్రహ్మ. అతడు స్వయంభువు. ఆనందకారకుడు. బ్రహ్మనుగూర్చిన ఆనందంతోనే గాలి వీస్తోంది. సూర్యుడు ఉదయిస్తున్నాడు. ఇంద్రాది దేవతలు తమ విధులను నిర్వహిస్తున్నారు.

ఈ రకంగా ఆనందమయ కోశంలో ఉన్న పరమేశ్వరి స్వరూపమే బ్రహ్మాణీ అనబడుతోంది.

## 822. బ్రహ్మజననీ

సకల ప్రపంచాన్ని పుట్టించునది కాబట్టి జనని. సృష్టికి పూర్వమే ఉన్నది. సృష్టి చెయ్యాలని సంకల్పించినప్పుడు, ముందుగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులను సృష్టించింది. ఈ రకంగా సృష్టికర్త అయిన బ్రహ్మను సృష్టించింది. కాబట్టే ఆమె బ్రహ్మ జననీ అనబడుతోంది. వేదాలు బ్రహ్మముఖం నుంచే వచ్చాయి. అవి పరబ్రహ్మ స్వరూపాలు. ఆ వేదాలను సృష్టించింది కూడా పరమేశ్వరియే కాబట్టి బ్రహ్మజననీ అనబడుతోంది. జ్ఞానులంతా పరబ్రహ్మను చేరాలి, సాయుజ్యం పొందాలి అనుకుంటారు. అటువంటి బ్రహ్మభావన వారిలో కలుగచేసేది పరమేశ్వరి. కాబట్టి బ్రహ్మజననీ అనబడుతోంది.

## 823. బహురూపా

నామరూపాత్మకమైన జగత్తును సృష్టిస్తున్నది. అంతటా తానే ఉన్నది. అన్ని జీవులయందు తానే ఉన్నది. ఈ రకంగా అన్ని రూపాలలోనూ ఉన్నది కాబట్టి పరమేశ్వరి బహురూపా అనబడుతుంది. దేవీ పురాణంలో

**బహూని యస్యా రూపాణి స్థిరాణి చ చరాణిచ**
**దేవమానుషతిర్యంచో బహురూపా తత శ్శివా**

స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తులో అన్ని రూపాలు ఆ పరమేశ్వరివే. దేవతలు, మానవులు. అందరూ ఆమే. అందుచేత బహురూపా అనబడుతున్నది.

లింగపురాణంలో

**శంకరాః పురుషాః సర్వే స్త్రియ స్సర్వా మహేశ్వరీః**
**స్త్రీలింగ మఖిలం గౌరీ పుంలింగం తు మహేశ్వరః**

లోకంలోని పురుషులంతా శివస్వరూపులు కాగా స్త్రీలంతా శక్తిస్వరూపులు. ఈ రకంగా శివా శివరూపంలో ఈ ప్రపంచమంతా పరమేశ్వరీ స్వరూపమే అవుతుంది. కాబట్టి బహురూపా అనబడుతోంది. వామన పురాణంలో

**విశ్వం బహువిధం జ్ఞేయం సా చ సర్వత్ర వర్తతే**
**తస్మా త్సా బహురూపత్వా ద్బహురూపా శివా మతా ॥**

అనేక విధాలుగా ఉన్న ఈ ప్రపంచంలో అన్నిరూపాలలోను పరమేశ్వరి కనిపిస్తుంది. కాబట్టి బహురూపా అనబడుతోంది. నారదపురాణంలో

**ఉమైవ బహురూపేణ పత్నీత్వేన వ్యవస్థితా**

ఉమాదేవియే శివుని అన్ని రూపాలయందు పత్నిగా ఉన్నది కాబట్టి బహురూపా అనబడుతోంది.

విద్యలన్నీ పరమేశ్వరి రూపాలే

| | | |
|---|---|---|
| బాల | మహావిద్య | వారాహి |
| పంచదశి | సౌభాగ్యవిద్య | బగళా |
| షోడశి | శుద్ధవిద్య | అశ్వారూఢా |

ఇలా ఒకటేమిటి? అన్నిరకాల విద్యలూ పరమేశ్వరి స్వరూపమే. కాబట్టి ఆమె బహురూపా అనబడుతుంది.

## 824. బుధార్చితా

బుధులచేత అర్చించబడునది. బుధులు అంటే పండితులు జ్ఞానులు అని అర్థం. భగవానుడు గీతలో చెప్పినట్లుగా

**చతుర్విధా భజంతే మాం జనా స్సకృతినోఽర్జున ।**
**ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥**

అర్జునా ! చోరులవల్ల, వ్యాధులవల్ల ఆపదలు పొందేవాడు, నా తత్త్వాన్ని తెలియగోరువాడు, ధనాన్ని కోరేవాడు, దరిద్రుడు, వీరంతా నన్ను అర్చిస్తారు.

ఇక్కడ పండితులు, జ్ఞానులేకాక అనేకమంది అనేక రకాలయిన కోరికలతో పరమేశ్వరిని అర్చిస్తారు. అయితే ఐహికవాంఛాపరులంతా బాహ్యపూజలు చేస్తే, జ్ఞానులు అంతఃపూజ చేస్తారు. ఈ రకంగా వీరు పరమేశ్వరి సాయుజ్యం కోరి ఆమెను అర్చిస్తారు కాబట్టి దేవి బుధార్చితా అనబడుతుంది.

## 825. ప్రసవిత్రీ

పిపీలికాది బ్రహ్మపర్యంతము ప్రసవింప చేయునది కాబట్టి పరమేశ్వరి ప్రసవిత్రీ అనబడుతున్నది. ఆ దేవి అనేకకోటి బ్రహ్మాండాలకు తల్లి. విష్ణు ధర్మోత్తరంలో

**ప్రజానాం చ ప్రసవనాత్ సవితేతి నిగద్యతే**

భూతములను సృష్టించింది కాబట్టి సవిత అనబడుతుంది దేవీపురాణంలో

**బ్రహ్మాద్యః స్థావరాంతాశ్చ యస్యా ఏవ సముద్గతాః**

**మహదాది విశేషాంతం జగద్యస్యాః సముద్గతం**

**తా మేవ సకలార్థానాం ప్రసవిత్రీం పరాం నమః ॥**

బ్రహ్మము మొదలు స్తంభము వరకు అన్నింటికీ జన్మకు కారణభూతురాలయిన పరమేశ్వరికి నమస్కారము. అని చెప్పబడింది.

ఈ రకంగా సకల జగత్తును ప్రసవింపచేసింది కాబట్టి ప్రసవిత్రి అనబడుతుంది.

## 826. ప్రచండాజ్ఞా

చండా – కోపము గలది. ప్రచండా తీవ్రమయిన కోపముగలది. ఆజ్ఞ – శాసనము. ఆ పరమేశ్వరి తీవ్రమైన శాసనములు గలది. ఆమె యొక్క ఆజ్ఞలు మీరటానికి లేదు. శాసనాలు ధిక్కరించటానికి లేదు. ఎదురులేని పాలనాతంత్రము గలది. చండశాసనురాలు తైత్తిరీయంలో

పరబ్రహ్మను గూర్చిన భయంతోనే గాలి వీస్తున్నది. సూర్యుడు ఉదయిస్తున్నాడు. ఇంద్రాదిదేవతలు తమ విధులను సక్రమంగా నిర్వర్తిస్తున్నారు. దేవతలు తమ విధులను సక్రమంగా నిర్వర్తించటానికి కారణము బ్రహ్మ ఉండటమే. అని చెప్పబడింది. అందుచేత జగత్తులో ప్రతివిషయము సక్రమంగా జరుగుతున్నదంటే దానికి కారణము పరమేశ్వరిపట్ల భయము అందుకే ఆమె ప్రచండాజ్ఞా అనబడుతోంది.

## 827. ప్రతిష్ఠా

సకల జగత్తులకు అధిష్ఠానము కాబట్టి విశ్వాసాన్ని ప్రతిష్ఠిస్తున్నది. అందుచేత పరమేశ్వరి ప్రతిష్ఠా అనబడుతోంది. ఈ జగత్తంతటికీ ఆమె ఆధారభూతురాలు. బ్రహ్మగీతలో

**ప్రతిష్ఠా సర్వవస్తూనాం ప్రజ్ఞైషా పరమేశ్వరి**

పరమేశ్వరి స్వరూపమైన విజ్ఞానమే ప్రపంచమున ప్రతివస్తువుకు ఆధారమైనది. అన్నీ ఆ దేవియందు ప్రతిష్ఠించబడి ఉన్నాయి కాబట్టి ఆమె ప్రతిష్ఠా అనబడుతోంది. ఈ ప్రపంచం సమృద్ధిగా ఉండటానికి కారణమైనది కాబట్టి, పరమేశ్వరి ప్రతిష్ఠా అనబడుతున్నది.

## 828. ప్రకటాకృతిః

అందరిచేత అనుభవించదగు రూపము గలది ప్రతిష్ఠితమైన కారణమే ప్రకటాకృతి. తాము ఎవరు అనేది ఎవరికీ తెలియదు. కాని హృదయస్థానమందు తాకి గుండెలమీద చెయ్యి వేసుకుని అందరూ నేను అని చెబుతారు. అంటే పరమేశ్వరుడు హృదయస్థానంలో ఉన్నాడని తెలియకుండానే చెబుతున్నారు. సూతసంహితలో

**త మహం ప్రత్యయవ్యాజాత్ సర్వే జానంతి జంతవః ।**

**తథాపి శివరూపేణ న విజానంతి మాయయా ॥**

అతనిని అహం అని అందరూ తెలుసుకొనుచున్నారు. కాని మాయచేత అతడే శివుడు అని తెలుసుకోలేకపోతున్నారు. శ్రీచక్రముయొక్క ప్రథమావరణ. భూపురము త్రైలోక్యమోహన చక్రము. అందులో ఉండే యోగిని పేరు ప్రకటయోగిని.

ప్రకటమైన ఆకారం కలిగి, ఇంద్రియాలకు కనిపించే రూపంలో ఉన్నది. లోకాలన్నీ ఆవరించి దృశ్యమానమైంది కాబట్టి పరమేశ్వరి ప్రకటాకృతిః అనబడింది.

## 829. ప్రాణేశ్వరీ

ప్రాణాలకు ఈశ్వరి. అధిష్ఠాన దేవత. ముఖ్యప్రాణము. ఇంద్రియాలకు అధిష్ఠాన దేవత. వేదంలో పరమేశ్వరుడు ప్రాణానికి ప్రాణము అని చెప్పబడింది.

శరీరంలో ప్రాణము ఐదు రూపాలుగా ఉంటుంది.

1. ప్రాణ    3. వ్యాన    5. సమాన వాయువులు
2. అపాన    4. ఉదాన

ఈ ఐదింటికీ ముఖ్య ప్రాణస్వరూపిణి ఆ పరమేశ్వరి. జీవరాశి (ప్రాణులు) ముఖ్యంగా మూడు రకాలు.

1. అండజాలు - గ్రుడ్డు నుంచి పుట్టినవి
2. జారజాలు - స్త్రీ జననేంద్రియం నుంచి పుట్టినవి.
3. ఉద్భిజాలు - భూమి నుంచి పుట్టినవి.

జీవులు తమ కర్మఫలాన్ని అనుసరించి పునర్జన్మ పొందుతుంటాయి. ఈ రకంగా వాటికి జన్మనిచ్చేది పరమేశ్వరి. అన్ని ప్రాణులమీద అధికారం కలిగినది కాబట్టి ఆమె ప్రాణేశ్వరీ అనబడుతోంది.

## 830. ప్రాణదాత్రీ

**ప్రాణానాం ధాత్రీ**

ప్రాణములనిచ్చునది. జగత్తులన్నింటినీ జీవింపచేయునది, జగత్తులోని జీవులందరికీ పరమేశ్వరి వారి వారి కర్మఫలాన్ని బట్టి ప్రాణాలను అంటే మరుజన్మనిస్తుంది. కాబట్టి ప్రాణధాత్రీ అనబడుతుంది.

## 831. పంచాశత్పీఠరూపిణీ

అక్షరాలు మొత్తం 51. అచ్చులు 16 హల్లులు 35 ఇవి పీఠాలు. వీటిని మాతృకాపీఠాలు అంటారు. తంత్రశాస్త్రాలలో పీఠాలు 51 అని ఉన్నది. ఆ పీఠాల రూపంలో ఉన్నటువంటిది.

ఋగ్వేదంలో **ఆదిక్షాంతమూర్తిః** అంటే అకారము నుంచి క్షకారందాకా ఉన్న 51 అక్షరముల రూపమే పరబ్రహ్మ. అని చెప్పబడింది. అదే పరమేశ్వరి స్వరూపం.

ఈ మాతృకారూపిణి నుండే సకల మంత్రశాస్త్రము వచ్చింది. వాగ్రూపాలలో వైఖరీ స్థానాలయిన 51 పీఠాలు భారతదేశంలోని వివిధ ప్రదేశాలలో ఉన్నాయి. వీటినే మాతృకాపీఠాలు అంటారు.

**కామరూపం వారణాసీ నేపాలం పౌండ్రవర్ధనం**
**పురస్థిరంకాన్యకుబ్జమ్ పూర్ణశైలం తథార్బుదం**
**ఆమ్రాతకేశ్వరైకామ్రం త్రిస్రోత్రః కామకోటకం**
**కైలాసం భృగునగరం కేదారం చంద్రపుష్కరం**
**శ్రీపీఠ మోంకారపీఠం జాలంధ్రం మాలవం తథా**
**కులాంతకం దేవీకోటం గోకర్ణం మారుతేశ్వరం**
**అట్టహాసం చ విరజం రాజగేహం మహాప థం**
**కోలాపుర మేలాపురం కాలేశశ్చ జయంతికా**
**ఉజ్జయిన్యపి చిత్రా చ క్షీరకం హస్తినాపురం**
**ఉద్దేశశ్చ ప్రయాగాఖ్యాం షష్ఠీమాయాపురీ తథా**

**జలేశో మలయః శైలో మేరు ర్గిరివర స్తథా**

**మహేంద్రో వామనశ్చైవ హిరణ్యపురమేవచ**

**మహాలక్ష్మీ పురోధ్యానం ఛాయాఛత్ర మతః పరం**

**ఏతే పీఠా సముద్దిష్టా మాతృకా రూపకాస్థితాః ॥**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | కామరూపము | 18. | ఓంకారపీఠము | 35. | క్షీరకము |
| 2. | వారణాసి | 19. | జాలంధరము | 36. | హస్తినాపురము |
| 3. | నేపాలము | 20. | మాలాఓత్కలము | 37. | ఓడ్డీశము |
| 4. | పౌండ్రవర్ధనము | 21. | కులాంతము | 38. | ప్రయాగ |
| 5. | పురస్థిరము | 22. | దేవీకోటము | 39. | షష్ఠము |
| 6. | కన్యాకుబ్జము | 23. | గోకర్ణము | 40. | మాయాపురము |
| 7. | పూర్ణశైలము | 24. | మారుతేశ్వరము | 41. | జలేశము |
| 8. | అర్బుదము | 25. | అట్టహాసము | 42. | మలయము |
| 9. | ఆమ్రాతకేశ్వరము | 26. | విరజము | 43. | శైలము |
| 10. | ఏకామ్రము | 27. | రాజగేహము | 44. | మేరువు |
| 11. | త్రిస్రోతము | 28. | మహాపథము | 45. | గిరివరము |
| 12. | కామకోటకము | 29. | కోలాపురము | 46. | మహేంద్రము |
| 13. | కైలాసము | 30. | మేలాపురము | 47. | వామనము |
| 14. | భృగునగరము | 31. | ఓంకారము | 48. | హిరణ్యపురము |
| 15. | కేదారము | 32. | జయంతికము | 49. | మహాలక్ష్మీ |
| 16. | పూర్ణచంద్రము | 33. | ఉజ్జయిని | 50. | ఓడ్యాణము |
| 17. | శ్రీపీఠము | 34. | చిత్రము | 51. | ఛాయాఛత్రము |

ఈ 51 పీఠాలకు సమానమైన స్థానాలు శ్రీచక్రంలోను మానవదేహంలోనూ ఉన్నాయి.

**శ్రీపర్వతం శిరస్థానే కేదారంతు లలాటకే ।**

**వారణాసీ మహాప్రాజ్ఞ ! భృవోర్ఘాణస్యమధ్యమే ॥**

**కురుక్షేత్రం కుచస్థానే ప్రయాగం వ్రాత్సరోరుహే ।**

**చిదంబరంతు హృత్పద్మా ఆధారే కమలాలయం ॥**

**ఆత్మతీర్థం సముత్సృజ్య బహిస్తీర్థాని యో౽వ్రజేత్ ।**
**కంఠస్థన మహారత్నం త్యక్త్వా కాచంవిమార్గతే ॥**
**తీర్థాని తోయ పూర్ణాని దేహాని కాష్ఠాది నిర్మితాన్ ।**
**యోగినో న ప్రపూజ్యంతే స్వాత్మ ప్రత్యయకారణమ్ ॥**
**శివమాత్మని పశ్యంతి ప్రతిమాసు న యోగినః ।**
**అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమాః పరికల్పితాః ॥**

ఈ రకంగా చెప్పటంవల్ల మాతృకావర్ణరూపిణి అయిన దేవి మాతృకాపీఠ రూపిణి అయింది.

## 832. విశృంఖలా

సంకెలలు లేనిది అదుపులేనిది. పరమేశ్వరి సర్వస్వతంత్రమయి. ఆమె అధికారానికి ఏ హద్దూ లేదు. భక్తులయొక్క సంసార శృంఖలాలను జ్ఞానజ్యోతులచే త్రెంచి పారేస్తుంది. యోగులకు శృంఖలాలయిన గ్రంథులను భేదిస్తుంది. కాబట్టి పరమేశ్వరి విశృంఖలా అనబడుతుంది.

విశృంఖలా – వస్త్రహీన. దిగంబరి. అలంపురి మొదలైన శక్తి క్షేత్రాలలో పరమేశ్వరి దిగంబరి. కాబట్టి విశృంఖలా అనబడుతుంది.

## 833. వివిక్తస్థా

వివిక్తము అంటే – జనులు లేని పవిత్రప్రదేశము. ఎక్కడైతే లోకులు కనిపించరో ఆదేశమంతా పవిత్రము. అందుచేతనే తపస్సు చేసేటప్పుడు నిర్జన ప్రదేశంలో, పవిత్రమైన చోట మాత్రమే చెయ్యాలి.

పరమేశ్వరి తాను విడిగా ఉండటంచేత వివిక్తస్థా అనబడుతుంది. పంచభూతాల మధ్యన ఉన్నప్పటికీ వాటితో ఆమెకు సంబంధం లేదు. జీవులమధ్యన ఉన్నప్పటికీ వారితో సంబంధం లేదు. లోకంలో ఎన్నిరకాల ఆకారాలున్నప్పటికీ వాటితో సంబంధం లేకుండా, భిన్నంగా, ఒకే ఆకారంతో ఉండేది. లోకవ్యవహారాలు లేనిచోట ఉంటుంది. ఆకాశంలో ఉంటుంది.

## 834. వీరమాతా

వీరులు అంటే – శ్రీవిద్యలో నిష్ణాతులైనవారు ఉపాసక శ్రేష్ఠులు. ఈ విషయం 'మహావీరేంద్రవరదా' అనే నామంలో వివరించబడింది.

యుద్ధంలో వెన్ను చూపనివారు వీరులు. వీరిని రక్షించునది.

**ఉత్సాహం సాహసం ధైర్యం బుద్ధిఃశక్తిః పరాక్రమః**
**షడైతే యత్ర తిష్టంతి తత్ర దేవోఽపి తిష్ఠతి**

ఉత్సాహము, సాహసము, ధైర్యము, బుద్ధి, శక్తి, పరాక్రమము, ఇవి ఎక్కడుంటాయో, దేవతలు కూడా అక్కడే ఉంటారు.

ఇవన్నీ వీరుల లక్షణాలు. కాబట్టి వీరులను రక్షిస్తుంది.

మహావీరులైన త్రిమూర్తులు, ఇంద్రుడు, దిక్పాలకులు, కుమారస్వామి, గణపతిలకు తల్లి.

## 835. వియత్ప్రసూః

వియత్ అనగా – ఆకాశము. ఆకాశాన్ని ప్రసవించినది. సృష్టిలో అన్నింటికన్నా ముందు నుంచి ఉన్నది. ఆత్మనుంచే అన్నీ ఆవిర్భవించినాయి. వేదంలో 'ఆత్మ నుంచి ఆకాశం పుట్టింది' అని చెప్పబడింది.

పరమేశ్వరినుంచే మహతత్త్వము. దాని నుంచి అహంకారము పంచభూతాలు ఉద్భవించినాయి. కాబట్టి ఆకాశానికి తల్లి పరమేశ్వరి. అందుకే వియత్ప్రసూః అని చెప్పబడింది.

## 836. ముకుందా

ముక్తినిచ్చేది కాబట్టి ముకుందా అనబడుతోంది. పరమేశ్వరి తనను నమ్మినవారికి, భక్తులను, జ్ఞానులకు వారి అర్హతలను బట్టి ముక్తినిస్తుంది కాబట్టి ముకుందా అనబడుతుంది.

**కదాచి దాద్యా లలితా పుంరూపా కృష్ణవిగ్రహా**

పరమేశ్వరి అయిన లలితాంబికయే. ముకుందుడు అనగా కృష్ణుని రూపం ఎత్తింది.

సప్తశతి ద్వాదశోధ్యాయంలో

**వైవస్వతేం తరే ప్రాప్తే అష్టావింశతిత మే యుగే ।**
**శుంభో నిశుంభశ్చైవాన్ ఉత్పత్స్యేతౌ మహాసురౌ ॥**
**నందగోపగృహే జాతా యశోదాగర్భసంభవా ।**
**తతస్తౌన్నాశయిష్యామి వింధ్యాచలనివాసినీ ॥**

వైవస్వత మన్వంతరంలోని 28వ మహాయుగంలో శుంభ నిశుంభులని ఇద్దరు రాక్షసులు పుడతారు. అప్పుడు నేను నందగోపుని ఇంట యశోదా గర్భాన పుట్టి, వారిని సంహరించి, వింధ్యాచలం మీద ఉంటాను. అని చెప్పబడింది. అందుచేత లలితాంబిక యే శ్రీకృష్ణుడు. అందుచేతనే పరమేశ్వరి ముకుందా అనబడుతోంది.

## 837. ముక్తినిలయా

పంచవిధముక్తులకు స్థానమైనది. పరమేశ్వరిని అర్చించేవారికి ఐదురకాల ముక్తులు వారి వారి అర్హతలను బట్టి లభిస్తాయి.

1. మణిపూరంలో పరమేశ్వరిని ఆరాధించేవారు దేవిపురానికి దగ్గరగా ఇంకొక పురము నిర్మించుకుని ఉంటారు. దీన్ని 'సార్ష్టిరూపముక్తి' అంటారు.

2. అనాహతంలో పరమేశ్వరిని అర్చించే వారు దేవి పట్టణంలోనే నివశించగలుగుతారు. దీన్ని 'సాలోక్యముక్తి' అంటారు.

3. విశుద్ధి చక్రంలో పరమేశ్వరిని ఆరాధించేవారు దేవికి అతిదగ్గరగా సేవకులుగా ఉంటారు. దీన్ని 'సామీప్యముక్తి' అంటారు.

4. ఆజ్ఞాచక్రంలో పరమేశ్వరిని పూజించేవారు వేరే దేహం ధరించి, దేవితో సమానమైన రూపంలో ఉంటారు. దీన్ని 'సారూప్యముక్తి' అంటారు.

5. సహస్రారంలో దేవిని అర్చించేవారు జన్మరాహిత్యం పొందుతారు. ఇది 'సాయుజ్యము'.

ఈ రకంగా ఐదురకాల ముక్తులకు స్థానమైనది పరమేశ్వరి.

## 838. మూలవిగ్రహరూపిణీ

బాల, బగళ మొదలైన శక్తులకు మూలభూతమైనది. ఇది ఒక్కటే శ్రీవిద్య. ఇందులోనుంచి అనేక శక్తులు ఉత్పత్తి అవుతున్నాయి.

మూలము అంటే – కారణము. ప్రపంచానికి కారణం బ్రహ్మ. బ్రహ్మయొక్క స్వరూపమే పరమేశ్వరి. అందుచేత విగ్రహరూపిణీ అనబడుతోంది.

పరమేశ్వరుడికి సృష్టి చెయ్యాలనే సంకల్పం కలిగింది. అంటే తాను అనేకం కావాలనుకున్నాడు. అప్పుడు తనలోనుంచి కొంతశక్తిని బయటకు పంపాడు. ఆ శక్తే మూలవిగ్రహరూపిణి అనబడుతుంది.

మూలము అంటే – మంత్రం. మంత్రం దేవతా స్వరూపము. దేవతలందరినీ సృష్టించింది ఆ పరమేశ్వరి. అంటే దేవతలకు మూలం ఆమే. కాబట్టి మూలవిగ్రహ రూపిణీ అనబడుతోంది.

## 839. భావజ్ఞా

భావములను ఎరుంగునది. భావనమాత్రము చేతనే తెలియబడునది. పరమాత్మ ఇంద్రియాలవల్ల తెలియబడదు. ఉపనిషత్తులలో ఆత్మను కంటితో చూడలేము, చెవులతో వినలేము, చర్మముతో ఆత్మ ఉనికిని తెలుసుకోలేము. ఆత్మను ఏ ఇంద్రియాలద్వారా తెలుసుకోలేము. జ్ఞానంతో మాత్రమే తెలుసుకోవాలి. ఆత్మ ఉన్నది అని భావన చెయ్యటంద్వారా మాత్రమే ఆత్మను తెలుసుకోవాలి. అందుచేతనే ఆత్మ స్వరూపమయిన పరమేశ్వరి భావజ్ఞా అనబడుతుంది.

## 840. భవరోగఘ్నీ

భవము అంటే సంసారము. సంసారమనే రోగము. దాన్ని నాశనం చేసేది. భవబంధాలను తెంచివేసేది. నేను నాది అనే అహంకార మమకారాలను నాశనం చేసేది. తద్వారా జ్ఞానాన్ని కలిగించేది.

సంసారబంధనాలు త్రెంచి వెయ్యాలంటే పరమేశ్వరి ధ్యానమే శరణము. దానివల్లనే అజ్ఞానం పటాపంచలవుతుంది. భవబంధాలనుండి విముక్తి కలుగుతుంది. అందుచేతనే భవరోగఘ్నీ అనబడుతుంది.

## 841. భవచక్రప్రవర్తినీ

భవచక్రము అంటే – సంసార చక్రం. పరమేశ్వరి ఈ సంసార చక్రాన్ని ప్రవర్తింపచేస్తుంది. కాబట్టి భవచక్ర ప్రవర్తినీ అనబడుతుంది. మనుస్మృతిలో చెప్పినట్లుగా పరమేశ్వరుడు సమస్త భూతాలయందు వ్యాపించి సృష్టి స్థితి లయాలను ఎల్లప్పుడూ నడిపిస్తున్నాడు. కాబట్టి సంసారమనే బండిని నడిపించేది పరమేశ్వరియే.

జన్మించిన తరువాత జీవి కర్మను చేస్తూనే ఉంటుంది. ఆ కర్మఫలితాన్ని మరణానంతరము స్వర్గ నరకాలలో అనుభవించి, కర్మశేషాన్ని అనుభవించటంకోసం మళ్ళీ జన్మిస్తుంది. మళ్ళీ కర్మ చేస్తుంది. ఈ రకంగా సంసారమనే బండి చక్రంలో పడి గిరగిరా తిరుగుతూ ఉంటుంది. జీవి చేసిన కర్మననుసరించి ఉత్తర జన్మలనిచ్చేది పరమేశ్వరి. ఈ రకంగా సంసారచక్రాన్ని త్రిప్పేది పరమేశ్వరి. అందుచేతనే ఆమె భవ చక్రప్రవర్తినీ అనబడుతుంది.

భవచక్రము అంటే – అనాహతము. అనాహతంలో ఉండేది. దహరాకాశరూపిణి. ఆ పరమేశ్వరి.

శ్రీచక్రంలోని శివచక్రాలు, భవచక్రాలనబడతాయి. వీటిని ప్రవర్తింపచేసేది పరమేశ్వరి కాబట్టి భవచక్ర ప్రవర్తినీ అనబడుతోంది.

## 842. ఛందస్సారా

ఛందస్సు అంటే – వేదము. పరమేశ్వరి వేదరూపంలో ఉంటుంది కాబట్టి ఛందస్సారా అనబడుతున్నది. వేదసారాంశమే దేవి.

ఛందస్సు – గాయత్రి మొదలగు మంత్రాలు. పరమేశ్వరి గాయత్రి మొదలగు మంత్రస్వరూపంలో ఉన్నది. మంత్ర సారాంశమే పరమేశ్వరి.

ఛందస్సు అనేది పద్యలక్షణం. సారము అంటే – గొప్పదనము, బలము అని అర్థం. వైఖరీ రూపంలో సరస్వతీ రూపంలో పొగడబడుతుంది.

పరమేశ్వరి వేదరూపంలో ఉన్నది. వైదిక ఛందోబద్ధమైన మంత్రం, మంత్రాల సముదాయమే వేదం. వేదాలసారము – ఉపనిషత్తులు. ఉపనిషత్తులలో ప్రతిపాదించింది పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మ స్వరూపమే పరమేశ్వరి. కాబట్టి ఛందోబద్ధమైన వేదమంత్రాల సారము, ఉపనిషత్సారము అంతా ఆ పరమేశ్వరియే. అందుకే ఆమె ఛందస్సారా అనబడుతోంది.

## 843. శాస్త్రసారా

శాశించేది శాస్త్రము. ఈ రకంగా చెయ్యాలి. ఈ రకంగా చెయ్యకూడదు అని నిర్దేశించేదే శాస్త్రము. శాస్త్రాలు రెండు రకాలు.

**1. పౌరుషేయాలు :** ఇవి పురుషుడివల్ల చెప్పబడ్డాయి ఇవి మొత్తం పది.

1. పురాణాలు
2. న్యాయశాస్త్రము
3. మీమాంశ
4. ధర్మశాస్త్రము
5. శిక్ష
6. కల్పము
7. వ్యాకరణము
8. నిరుక్తము
9. ఛందస్సు
10. జ్యోతిష్యము

**2. అపౌరుషేయాలు :** ఇవి సాక్షాత్తూ బ్రహ్మముఖం నుండి వచ్చినాయి. ఇవే చతుర్వేదాలు. ఈ రకంగా మొత్తం శాస్త్రాలు 10+4=14. వీటన్నింటికీ పరమేశ్వరియే కారణము. వీటిసారము పరమేశ్వరియే అందుచేతనే శాస్త్రసారా అనబడుతోంది.

## 844. మంత్రసారా

**దైవాధీనం జగ త్సర్వం మంత్రాధీనం తు దైవతమ్**

చరాచర జగత్తు అంతా కూడా దైవము యొక్క అధీనంలో ఉంటుంది. దైవం మంత్రానికి అధీనం అయి ఉంటుంది. కాబట్టి మంత్రానికి ప్రాముఖ్యత ఉన్నది.

**మననాత్త్రాయత ఇతి మంత్రః**

మననము చేయుటవలన మననము చేయువానిని రక్షించునది మంత్రము. దేవతల దయకు పాత్రులు కావాలంటే మంత్ర జపం చెయ్యాలి. దీన్నే ఉపాసన అంటారు.

అరణి మథిస్తే అగ్ని ఎలా పుడుతుందో అలాగే మంత్రాన్ని జపించినట్లైతే శక్తి పుడుతుంది. ఆ శక్తి సాధకుడికి సర్వార్థాలూ చేకూరుస్తుంది. బీజాక్షరాలచే సంపుటం చేయబడిన మంత్రజపంవల్ల దేవతానుగ్రహం త్వరగా కలుగుతుంది. ఆయా దేవతలయొక్క తత్త్వాలకు అనుగుణమైన బీజాక్షరాలు ఋషులచేత సంపుటీకరణం చేయబడ్డాయి.

పరమేశ్వరుని బీజం ఓంకారము. అలాగే

1. శ్రీం – లక్ష్మీబీజం
2. క్లీం – మన్మథ బీజం
3. గం – గణపతి బీజం
4. ఐం – వాగ్బీజం
5. హ్రీం – మాయాబీజం

దేవతలకే కాక పంచభూతాలకు కూడా విడివిడిగా బీజాక్షరాలున్నాయి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | లం | – పృధివీబీజం | 4. | రం | – అగ్నిబీజం |
| 2. | హం | – ఆకాశబీజం | 5. | వం | – అమృతబీజం |
| 3. | యం | – వాయుబీజం | | | |

ప్రతి మంత్రంలోనూ దేవత పేరూ, బీజాక్షరాలూ ఉంటాయి. అసలు మంత్రాలు మూడు రకాలు అవి

1. వైదికములు 2. తాంత్రికములు. 3. అపభ్రంశములు

1. వేదాలలో చెప్పబడిన మంత్రాలను వైదికమంత్రాలు అంటారు అవి జ్ఞానప్రదాలు.
2. కామ్యప్రదమైనవి తాంత్రికాలు.
3. సంస్కృతంలో కాక ఇతర భాషలలో ఉన్న మంత్రాలను అపభ్రంశాలు అంటారు.

**వైదికా ప్రణవై ర్యుతా ప్రణవేన విహీనంతు**
**తాంత్రికా ఏవ ప్రకీర్తితాః ॥**

ఓంకార సహితములైనవి వైదికమంత్రాలని, ఓంకార రహితములైనవి తాంత్రికాలని చెప్పబడుతున్నాయి.

మంత్రాలను స్త్రీ, పురుష, నపుంసకమంత్రాలు అని మూడు రకాలుగా విభజించవచ్చు.

'స్వాహా' అనే పదము చివరకలవి స్త్రీ మంత్రాలు.

'హుంఫట్' అనే పదము చివర కలవి పురుష మంత్రాలు.

'నమః' అనే పదం చివర కలవి నపుంసక మంత్రాలు

పురుష దేవతలనుపాసించే వాటిని – మంత్రాలని

స్త్రీ దేవతలనుపాసించే వాటిని – విద్యలని అంటారు. వీటిలో

| | |
|---|---|
| ఒక అక్షరము గల మంత్రాలను | – పిండము |
| మూడు అక్షరములు గల మంత్రాలను | – కర్తరులు |
| మూడు నుంచి తొమ్మిది వరకు అక్షరాలు గల మంత్రాలను | – బీజము |
| పది నుంచి ఇరవై అక్షరాలు గల మంత్రాలను | – మంత్రాలు అని |
| ఇరవై కన్న ఎక్కువ అక్షరాలున్న మంత్రాలను | – మాలామంత్రాలు అంటారు. |

వైదిక మంత్రాలు సమయాచారానికి, తాంత్రిక మంత్రాలు కౌళ, వామాచారాలకు సంబంధించినవి. ఈ రకంగా మంత్రాల సారాంశమంతా పరమేశ్వరి స్వరూపమే కాబట్టి ఆమె మంత్రసారా అనబడుతుంది.

## 845. తలోదరీ

తలము అంటే లోకము. బ్రహ్మాండము అని అర్థం. లోకాలను ఉదరముగా గలది. విరాడ్రూపిణి. దేవియొక్క పాదాది శిరః పర్యంతము చతుర్దశ లోకాలు అని భావిస్తే తలము అనే లోకము ఉదరము అవుతుంది. అందుచేత తలోదరి అనబడుతుంది. సర్వానికి కారణస్థానమైనది. కృశించిన ఉదరము గలది.

## 846. ఉదారకీర్తిః

మహత్తరమైన కీర్తి గలది. సర్వత్రా వ్యాపించిన కీర్తి గలది. పరమేశ్వరిని ఉపాసించటంవల్ల అనతికాలంలోనే కీర్తి దిగంతాలకు వ్యాపిస్తుంది. తన భక్తులకు అపారమయిన కీర్తిని ప్రసాదిస్తుంది.

శ్రీవిద్య అనేది అత్యుత్తమైనది. దాని మంత్ర తంత్రాలను ఉపాసన చేసేవారి పట్ల దేవి అతిశయమైన కీర్తి కలిగి ఉంటుంది. అందుకే పరమేశ్వరి ఉదారకీర్తిః అనబడుతుంది.

## 847. ఉద్దామవైభవా

దామ అంటే – బంధించే త్రాడు అనంతకోటి బ్రహ్మాండాలకు ప్రభ్వి. పరమపూజ్యమగు దేవత. అనంత స్వరూపిణి. మహదైశ్వర్య సంపన్నురాలు. జ్ఞాన స్వరూపిణి. కేవలము ముక్తియే స్వరూపిణిగా గలది. భక్తులపాలిట కల్పవల్లి కాబట్టి ఉద్దామ వైభవా అనబడుతుంది.

## 848. వర్ణరూపిణీ

వర్ణముల యొక్క రూపమైనది. వేదంలో నాలుగు వర్ణాలున్నాయని చెప్పబడింది. పురుష సూక్తంలో

**బ్రాహ్మణోస్య ముఖమాసీత్ బాహూ రాజన్యః కృతః**

**ఊరూతదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత**

| | | |
|---|---|---|
| పరమేశ్వరుని ముఖం నుంచి | – | బ్రాహ్మణుడు |
| బాహువుల నుంచి | – | క్షత్రియుడు |
| ఊరువుల నుంచి | – | వైశ్యుడు |
| పాదాల నుంచి | – | శూద్రుడు జన్మించారు |

భగవద్గీతలో

**చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః**

గుణాల, కర్మల విభాగంచేత నాలుగు వర్ణాలను నేను సృష్టించాను అంటున్నాడు భగవానుడు. బృహదారణ్యకోపనిషత్తులో "నామరూపాత్మకమైన సృష్టికి ఆరంభంలో పరబ్రహ్మ స్వరూపం మాత్రమే ఉన్నది. అంటే విరాట్స్వరూపంలో ఉన్న అగ్ని. అదే బ్రాహ్మణరూపం. అంతవరకు క్షత్రియాది ఇతర వర్ణాలు లేవు. క్షత్రియులు లేకపోవటంవల్ల పాలనా వ్యవహారాలు కష్టమైనాయి. అప్పుడు బ్రహ్మ నేను బ్రాహ్మణుడను ఇవి నా విధులు" అని తలచి క్షత్రియుల్ని సృష్టించాడు. దేవతలలో ఇంద్రుడు, సోముడు, వరుణుడు, రుద్రుడు, మేఘుడు, యముడు మొదలైన వారంతా క్షత్రియులే ఇక్కడ ప్రజాపతి క్షత్రియుల్ని ప్రత్యేక ప్రయోజనం కోసం సృష్టించాడు. వారు బ్రాహ్మణులకు రక్షకులు.

క్షత్రియుల్ని సృష్టించిన తరువాత కూడా బ్రహ్మ తన పనిలో కృతకృత్యుడు కాలేకపోయాడు. ధనాన్ని కూడబెట్టేవారు లేకపోవటంవల్ల తన పనిలో సమర్థుడు కాలేకపోయాడు. అందుకని బ్రహ్మ వైశ్య జాతిని సృష్టించాడు. వసువులు, రుద్రులు, ఆదిత్యులు, విశ్వే దేవతలు, మరుత్తులు మొదలైన దేవతలను గణాలుగా సృష్టించాడు. వైశ్యులంతా గణాలుగా, సమూహాలుగా సృష్టించబడ్డారు.

| | | |
|---|---|---|
| వసువులు | – | 8 |
| రుద్రులు | – | 11 |
| ఆదిత్యులు | – | 12 |
| విశ్వేదేవతలు | – | 13 |
| మరుద్గణాలు | – | 49 |
| దేవ వైశ్యులు | – | 93 మంది |

సేవకులు లేకపోవటంవల్ల బ్రహ్మ తన పనిలో సమర్ధుడు కాలేకపోయాడు. అందుచేత శూద్రులను సృష్టించాడు. పూషుడు శూద్రుడు. భూమియే పూష. పూషా దేవతయే అందర్నీ పోషిస్తున్నది అని చెప్పబడింది.

ఈ రకంగా నాలుగు వర్ణాల వారిని పరమేశ్వరుడే సృష్టించాడు. ఇక్కడ మనం సరిగా అర్ధం చేసుకోవలసినది ఏమంటే

1. బ్రహ్మ తేజస్సుతో ఉన్నవాడు బ్రాహ్మణుడు. సత్యాన్వేషి. బ్రహ్మదర్శనం కోసం పరితపించేవాడు. అతని ముఖం అగ్ని తేజస్సుతో ప్రకాశిస్తుంటుంది.

2. బ్రాహ్మణులను రక్షించటానికి వచ్చినవాడు క్షత్రియుడు. రక్షణ అతని విధి. కాబట్టి పరాక్రమ సంపన్నుడు. బాహు బలం కలవాడు. బ్రహ్మయొక్క బాహువులే ఇతని జన్మస్థానం.

3. ధనం సంపాదించటానికి, రహస్యంగా ఉంచటానికి ఆవిర్భవించినవాడు వైశ్యుడు. గుహ్యమైన స్థానం ఊరువులు. అందుచేతనే వైశ్యుడు బ్రహ్మ ఊరువుల నుంచి ఉద్భవించాడని చెప్పబడింది.

4. వీరందరినీ పోషించాలి కాబట్టి శూద్రుడు జన్మించాడు. ఇతడి కర్తవ్యం మిగిలినవారి పోషణ. వ్యవసాయము అందుచేతనే ఇతను పాదాలనుంచి పుట్టాడు.

ఈ రకంగా అన్ని వర్ణాలవారు పరమేశ్వరినుంచే ఉద్భవించారు. కాబట్టి ఆమె వర్ణరూపిణీ అనబడింది.

## 849. జన్మమృత్యుజరాతప్తజనవిశ్రాంతిదాయినీ

పుట్టటము, పెరగటము, ముసలితనం, మరణం ఈ రకమైన శారీరక మార్పులవల్ల ప్రతి జీవి అవస్థ పడుతూనే ఉంటుంది. అటువంటి అవస్థలను జనులకు లేకుండా చేసేది పరమేశ్వరి.

ఈ సంసార సాగరంలో పూర్వజన్మ కర్మఫలితం వలన జన్మించటం జరుగుతుంది. పుట్టిన ప్రతిజీవికి శారీరకావస్థలు తప్పవు. మరణం తథ్యం. ఈ ప్రక్రియలో అనేకమైన కష్టాలను జీవి అనుభవిస్తాడు. ఈ కష్టాలు రెండు రకాలుగా ఉంటాయి. 1. కర్మఫలం వల్ల వచ్చే కష్టాలు. ఇవి అనుభవించక తప్పదు. 2. మానసికమైన బాధలు. కష్టాలు అనుభవించవలసి వచ్చిందే అని జీవి బాధపడుతుంటాడు. కర్మఫలంవల్ల వచ్చే కష్టాలు

ఎక్కుపెట్టి వదిలిన బాణం లాంటివి. వాటిని అనుభవించక తప్పదు. అవి అనుభవించాల్సి వచ్చింది అని మనం పడే బాధ అసలు కష్టం కన్న ఎక్కువైనది. ఈ రకమైన బాధలను ముందుగా రూపుమాపుతుంది పరమేశ్వరి. తన భక్తులకు ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించటంద్వారా శాశ్వతమైన ఆనందాన్ని పొందే అవకాశం కల్పిస్తుంది. ఆ ఆనందం ముందు ఈ కష్టాలను మరిచిపోతాడు. ఈ రకంగా ఆత్మజ్ఞానాన్ని పంచి తన భక్తులకు బాధలను తీరుస్తుంది కాబట్టి జన్మమృత్యు జరాతప్తజనవిశ్రాంతిదాయినీ అనబడుతుంది.

## 850. సర్వోపనిషదుద్ఘుష్టా

పరమేశ్వరి అన్ని ఉపనిషత్తులలోనూ ప్రతిపాదించబడిన పరబ్రహ్మ స్వరూపిణి.

వేదాలు మొత్తం మూడు కాండలుగా ఉన్నాయి. అవి 1. కర్మ 2. ఉపాసన 3. జ్ఞానకాండలు. వీటిలో ఉపాసన, జ్ఞానకాండలను ఉపనిషత్తులు అంటారు.

| | | |
|---|---|---|
| ఉప అంటే | - | సమీపము నందు |
| ని అనగా | - | దిగువ స్థానంలో |
| షద్ అంటే | - | కూర్చునుట |

గురువుగారి దగ్గర ఆయన కన్న దిగువస్థానంలో కూర్చుని, వారు చెప్పే బ్రహ్మోపదేశాన్ని శ్రద్ధగా వినటం మనోవాక్కాయ కర్మలలో ఎక్కడా కూడా గురువు తనకన్న తక్కువ వాడు అనే భావన రాకూడదు. గురువు ఏ స్థితిలో ఉన్నప్పటికీ, అతను తనకన్న గొప్పవాడే అని మరిచిపోకూడదు.

ఉపనిషత్తు అంటే బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్యా పరిశీలకులైన విద్వాంసులకు కర్మ, జన్మ, మరణాలను లేకుండా చేసేది. ఆ జన్మాది మరణాదికమైన దానిని నశింపచేసేది. బ్రహ్మ పదార్థ లాభాన్ని కలుగచేసేది.

ఉపనిషత్తులన్నీ గురుశిష్య సంవాదంగానే ఉంటాయి. బ్రహ్మశోధకుడైన శిష్యుడు, బ్రహ్మజ్ఞాని అయిన గురువును సమీపించి, ఆయన దగ్గర నియమనిష్ఠలతో కొంతకాలం గడిపి, గురువుగారి అనుగ్రహం పొంది ఆయన దగ్గర బ్రహ్మోపదేశం పొందుతాడు. ఆ సమయంలో శిష్యుడు తన అనుమానాలను అడుగుతుంటాడు. గురువుగారు వాటిని తీరుస్తుంటారు.

వేదాలన్నింటికీ కలిపి 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. వాటిలో 108 ముఖ్యమైనవి. అందులోనూ

**ఈశ కేన కఠ ప్రశ్న ముండక మాండూక్య తిత్తిరిః**

**ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం దశః**

1. ఈశావాశ్యోపనిషత్తు
2. కేనోపనిషత్తు
3. కఠోపనిషత్తు
4. ప్రశ్నోపనిషత్తు
5. ముండకోపనిషత్తు
6. మాండూక్యోపనిషత్తు
7. తైత్తిరీయోపనిషత్తు
8. ఐతరేయోపనిషత్తు
9. ఛాందోగ్యోపనిషత్తు
10. బృహదారణ్యకోపనిషత్తు

ఇవి ముఖ్యమైనవి అన్నారు శంకరభగవత్పాదులవారు

వేదాలయొక్క సారాంశమే ఉపనిషత్తులు. వీటిలో పరమాత్మ స్వరూపాన్ని వివరించటానికి ఎక్కువ ప్రయత్నం చేశారు.

**బ్రహ్మసత్యం జగన్మిథ్య** పరబ్రహ్మ ఒక్కటే సత్యము, నిత్యము అయినది. శాశ్వతమైనది. ఆది మధ్యాంతములు లేనటువంటిది. జన్మమృత్యు జరాదులు లేనటువంటిది. ఎవరియందు ఏ రకమైన అపేక్ష, పక్షపాతము లేనటువంటిది. జీవులు చేసిన కర్మలననుసరించి వారికి పునర్జన్మను ప్రసాదించేది. అర్హత గల వారికి మోక్షాన్ని ఇచ్చేది. **సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ** సత్యమైనది. జ్ఞానమయమైనది. అనంతమైనది ఆ పరబ్రహ్మ. ఈ చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నది. చైతన్య రూపంలో అందరి హృదయాలలోనూ కొలువై ఉన్నది. దానికి జాతిబేధం లేదు. రూపబేధం లేదు. లింగబేధం లేదు. అన్ని జీవులయందు పిపీలికాది బ్రహ్మపర్యంతము, బ్రహ్మము మొదలు స్తంభమువరకు అన్నిటా ఆక్రమించి ఉన్నది. అంతటా తానై ఉన్నది. జగత్తులో ఉన్న సర్వపదార్థాలు ఆ పరమేశ్వరుని రూపమే. ప్రాణమున్నవి, ప్రాణము లేనివి, చలనమున్నవి, చలనంలేనివి. అన్నీ పరబ్రహ్మ స్వరూపాలే లోకంలో నాలుగు దిక్కులూ పరబ్రహ్మ స్వరూపమే. సముద్రాలు, నదులు, పర్వతాలు, చెట్లు చేమలు, పశువులు, పక్షులు, క్రిమికీటకాలు అన్నీ పరబ్రహ్మస్వరూపమే దూరంగా ఆకాశంలో ప్రకాశించే సూర్యునిలో ఉన్న తేజస్సే అన్నిజీవులయందు ఉన్నది. అగ్నిలో ఉండే తేజస్సే అన్ని జీవులయందు ఉన్నది. సృష్టిస్థితిలయాలు అతనివల్లనే జరుగుతున్నాయి. బ్రహ్మయందున్న భయంవల్లనే గాలి వీస్తోంది. అగ్నిమండుతోంది. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. దిక్పాలకులు తమ పనులను తాము సక్రమంగా నిర్వర్తిస్తున్నారు.

పరబ్రహ్మ త్రికాలజ్ఞుడు. త్రికాలాతీతుడు. త్రిగుణాతీతుడు. సర్వతత్త్వాతీతుడు. అతనివల్లనే ఈ లోకం సృష్టించబడుతోంది. అతనివల్లనే ప్రవర్తిల్లుతున్నది. అతనివల్లనే లయమవుతున్నది. పంచకృత్యాలకు కారకుడు అతడే. మానవదేహంలో పంచకోశాల యందు ఉన్నాడు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాల మధ్య ఆనందమయకోశ మందున్నాడు. అతడు ఎప్పుడూ బ్రహ్మానందం పొందుతూనే ఉంటాడు. అది శాశ్వతమైన ఆనందం. అనిర్వచనీయం అనుభవైక వేద్యం. లోకంలో జరిగే ప్రతిపనికి సాక్షి ఆయన. ప్రళయం జరిగినప్పుడు లోకాలను తన ఉదరంలో దాచుకుని, సృష్టి చెయ్యాలనుకున్నప్పుడు ఆ లోకాలను వమనం చేస్తాడు. అంటే బయటకు పంపుతాడు.

సృష్టి ఆరంభం కాక ముందు తానొక్కడే ఉన్నాడు. సృష్టి అంతమైన తరువాతకూడా అతడే ఉంటాడు. అతడు సత్యము నిత్యమైనవాడు. అతన్ని ఎవరైతే తెలుసుకుంటారో వారుకూడా బ్రహ్మత్వాన్ని పొందుతారు. **బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి** ఆ పరబ్రహ్మ ఈ పరమేశ్వరి. కాబట్టి ఆమె 'సర్వోపనిషదుద్ఘుష్టా' అనబడుతోంది.

## 851. శాంత్యతీతకలాత్మికా

ఆకాశమునందుండేకల శాంత్యతీతకల. దాని స్వరూపమందుండునది. శైవాగమంలో

**శాంత్యతీతకలా ద్వైతనిర్వాణానంద బోధదా**

శాంత్యతీతకల అంటే ద్వైతభావన తొలగించి, ఆనందాన్ని బోధించేది అని చెప్పబడింది. కాబట్టి పరమేశ్వరి ద్వైతబుద్ధిని తొలగించి మహదానందాన్నిస్తుంది. అని భావము.

సహస్రారంలో ఉండే కల శాంత్యాతీతకల. కలలలో ఉత్తమమైనది. జ్ఞానమే స్వరూపముగా గలది. ఇదే ధృవకల, సాదాఖ్యకల, చిత్కల, బ్రహ్మకల, పరాకల అనబడుతోంది.

## 852. గంభీరా

అంతములేనిది. అనంతమైనది కాబట్టి గంభీరా అనబడుతోంది. మహాద్రూపురాలు.

**జ్ఞానైశ్వర్యబల వీర్యాదిభి ర్గంభీరా**

జ్ఞానము, ఐశ్వర్యము, బలము, వీర్యము, మొదలగు వానిచే నిండి ఉన్నది. కాబట్టి పరమేశ్వరి గంభీరా అనబడుతున్నది.

పరమేశ్వరి అనంతమైనది. ఆమె ఈ విశ్వాన్ని ఇచ్ఛాశక్తితో సృజించి కాపాడి గంభీరురాలై, దేశకాలాలకు అతీతమై ప్రకాశిస్తుంటుంది. అని శివసూత్రాలలో చెప్పబడింది.

పరమేశ్వరి జ్ఞానస్వరూప. ధ్యానకాలంలో ఆమెను మహాహ్రదముగా భావించి ధ్యానించినట్లైతే మంత్రసిద్ధి జరుగుతుంది.

## 853. గగనాంతస్థా

గగనమునందుంటుంది. ఆకాశమునందు ఉంటుంది. దహరాకాశమందుంటుంది. భూతాకాశమందుంటుంది. పరాకాశమందుంటుంది. మహాప్రళయకాల మందు ఆకాశము నశించినప్పటికీ పరమేశ్వరి మాత్రం ఉంటుంది.

గగనము అంటే హకారము. అంతస్థములు అనగా – య ర ల వ లు ఇవి పంచభూతాల బీజాలు. ఈ రకంగా పంచభూత స్వరూపిణి అయిన పరమేశ్వరి హ య ర ల వ రూపిణి.

పరమేశ్వరి ఆకాశంలో ఉంటుంది అంటే భూతాకాశంలో ఉంటుంది. దహరాకాశంలోనూ ఉంటుంది. అందుచేతనే గగనాంతస్థా అనబడుతోంది.

## 854. గర్వితా

గర్వము అంటే – జగత్తును నిర్మించే పరాహంత. అటువంటి పరాహంత ఈమెయందు పుట్టినది. స్వాధిష్ఠానంలో ఉండే దేవి పీతవర్ణ, అతిగర్వితా అని చెప్పబడుతోంది.

## 855. గానలోలుపా

తతము, అనద్ధము, సుషిరము, ఘనము అనే నాలుగు విధములగుంపే గానము. అటువంటి గానమందు ఆసక్తి కలది.

పరమేశ్వరి, శ్రీకృష్ణుని స్వరూపమని గతంలో వివరించాం. ఆ శ్రీకృష్ణుడు మురళీగాన లోలుడు, కాబట్టి శ్రీకృష్ణుని స్వరూపమయిన పరమేశ్వరి గానలోలుపా అనబడుతుంది.

గతంలో పరమేశ్వరి సామగాన ప్రియ అని కూడా చెప్పబడింది. వీణాదులందు ఆసక్తి గలది. సంగీత పాఠములయందు ఆసక్తి గలది.

## 856. కల్పనారహితా

కల్పనలు లేనిది. ప్రాపంచికపు వాసనలు అన్నీ కల్పితాలు. అటువంటి వాసనలు లేనిది. కల్పాంతము నందు జీవులకు హితవు చేయునది.

ప్రళయకాలంలో కర్మ పరిపక్వంకాని జీవులను తన గర్భమునుంచుకొనునది.

గుణములచే కల్పించబడిన సంకల్ప వికల్పములందుగాని, భావనాకల్పమునందు గాని, రూపకల్పనయందుగాని ఏ రకమైన సంబంధము లేనిది.

కల్పనలు అనేవి దృశ్యానికేగాని దృక్కుకు ఉండవు. పరమేశ్వరి కేవలము ద్రుగ్రూపము. అందుచేత ఆమెకు కల్పనలుండవు.

## 857. కాష్ఠా

పద్దెనిమిది రెప్పపాట్ల కాలము కాష్ఠ అనబడుతుంది. సప్తశతిలోని పదకొండవ అధ్యాయంలో

**కలాకాష్ఠాదిరూపేణ పరిణామ ప్రదాయినీ ।**
**విశ్వస్యోపరతౌశక్తే నారాయణి ! నమోఽస్తు తే ॥**

కాష్ఠ - 18 రెప్పపాట్ల కాలము. కల - 30 కాష్టముల కాలము. ఈ రకంగా కాలంలో మార్పులు కలిగిస్తూ జగత్తును నాశనం చేసే శక్తిగల ఓ నారాయణీ ! నీకు ప్రణామములు. అని చెప్పబడింది. అంటే పరమేశ్వరి కాలస్వరూపిణి.

**సా కాష్ఠా సా పరా గతిః**

పరమేశ్వరియే గమ్యమైనది. మార్గమైనది. కాబట్టి కాష్ఠా అనబడుతోంది.

కాష్ఠా అనే శబ్దము దారుహరిద్రమందు, కాలమాన భేదమందు ఉన్నది. కాలమానం పైన చెప్పాం ఇక హరిద్రావృక్షముయొక్క కొయ్యముక్క కాష్ఠ అనబడుతుంది. అని మైరాళతంత్రం చెబుతోంది. కాబట్టి పరమేశ్వరి కాలస్వరూపిణి. అలాగే దారు స్వరూపిణి. లింగపురాణంలో

**చరాచరాణాం భూతానాం సర్వేషా మవకాశతః**
**వ్యోమాత్మా భగవా న్దేవో భీమ ఇత్యుచ్యతే బుధైః**
**మహామహిమ్నో దేవస్య భీమస్య పరమాత్మనః**
**దశస్వరూపా దిక్పత్నీ సుతః స్వర్గశ్చ సూరిభిః**

సకల చరాచరభూతాలకు అవకాశమిచ్చేవాడు వ్యోమాత్మకుడైన దేవుడు భీముడు. ఆ భీమునికి పది దిక్కులయందు భార్యలున్నారు. స్వర్గము అతని కుమారుడు.

వాయుపురాణంలో భీమదేవుని ఆరవదేహము – ఆకాశము, దిక్కులు – భార్యలు, స్వర్గము వారి కుమారుడు అని చెప్పబడింది.

గగనాత్మకుడైన భీముడు అనుపేరు గల పరమేశ్వరుని భార్య కాష్ఠ. స్వర్గమాత. దిక్స్వరూపిణి.

వేదాంతవాక్యములచే నిరూపించబడిన తత్త్వముకూడా కాష్ఠా అనబడుతున్నది. సూతసంహితలో

**ప్రతీత మప్రతీతం వా స దస చ్చ పర శ్శివః ।**
**ఇతి వేదాంతవాక్యానాం నిష్ఠా కాష్ఠేతి కథ్యతే ॥**

ప్రత్యక్షముగాగాని, పరోక్షంగాగాని, సత్తుగాని, అసత్తుగాని అదియే పరమశివుడు.

## 858. అకాంతా

అకము – పాపము, దుఃఖము. వాటిని అంతము లేదా నాశనము చేయునది. పరమేశ్వరి తన భక్తజనుల పాపాలను, దుఃఖాలను నాశనం చేస్తుంది కాబట్టి అకాంతా అనబడుచున్నది.

## 859. కాంతార్ధవిగ్రహా

విగ్రహము – దేహము. అర్ధవిగ్రహము – అర్ధదేహము. కాంతుడు – భర్త అయిన శివుడు.

తన భర్తయైన ఈశ్వరుని అర్ధదేహంగా గలది. కాంతునియొక్క అర్ధభాగమే కాంతార్ధము. ఇదే నారీశ్వరతత్త్వము.

అర్ధనారీశ్వరుడు అంటే సగం దేహం పురుషుడు. సగం దేహం స్త్రీ అని అర్థం. బొమ్మలో కుడివైపు శివుడు, ఎడమ భాగం పార్వతి ఉంటుంది. ఇది సరికాదు. శరీరాన్ని నిలువుగా కోసినట్లైతే అందులో ఒక భాగం శివుడని, రెండవ భాగం శక్తి అని కాదు. శివశక్తులు ప్రతి అణువులోనూ ఆవరించి ఉన్నారు. ఒక అణువును రెండు భాగాలుగా చేస్తే అందులో ఒక భాగం శివుడుకాగా, రెండవ భాగం శక్తి. ఈ రకంగా జగత్తంతా శివశక్తులమయం అని గుర్తించాలి.

షోడశి మహామంత్రం చెప్పేటప్పుడు, అందులోని పదహారు అక్షరాలను శివ, శక్తి భాగాలుగా విడదీస్తే మొత్తం 16 × 2 = 32 భాగాలవుతాయి. అవే నోటిలోని పలువరుస. క్రింది వరుస భాగాలు కాగా పై వరుస శక్తి భాగాలు.

ఈ రకంగా అర్ధనారీశ్వర తత్త్వము అంటే ప్రతి అణువులోనూ శివశక్తులుంటాయి. అందుచేతనే పరమేశ్వరి కాంతార్ధవిగ్రహా అనబడుతుంది.

## 860. కార్యకారణ నిర్ముక్తా

కార్యములు, కారణములచే విడివడినది. కార్యములు–మహత్వాదులు. కారణములు – మూలప్రకృతి. ఈ కార్యకారణాలు లేనిది. వాస్తవంగా చైతన్యంలో అవి లేవు.

పరమేశ్వరి కార్యరూపమయినటువంటి మహదాది తత్త్వాలతో సూచించబడే నామరూపాత్మకమైన జగత్తును, దానికి కారణమైనటువంటి అవ్యాకృతాన్ని వదిలినటువంటి కేవల నిర్వికారచైతన్య స్వరూపిణి. కాబట్టి 'కార్యకారణ నిర్ముక్తా' అనబడుతోంది. ఆమెకు కారణాలుగాని, కార్యాలుగాని ఏ మాత్రం లేవు.

సూక్ష్మదేహము అంటే పంచప్రాణాలు, దశేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయము. వెరసి 19. ఇది కంటికి కనిపించనిది. కాని దీని విశేషం జ్ఞానులకు తెలుస్తుంది. జ్ఞాన చక్షువులకు కనిపిస్తుంది. స్థూలదేహాన్ని ఆయా పనులు చేసేటట్లుగా చూసేది ఈ సూక్ష్మదేహమే. స్థూలదేహంలో ఉన్న ఇంద్రియాలలో ప్రవేశించి ఆ అనుభూతులు పొందుతూ ఉంటుంది. ఈ రకంగా స్థూలదేహం పనులు చేస్తుంది. వాటియొక్క అనుభూతులు పొందేది సూక్ష్మదేహము. సుఖదుఃఖాలు, రాగద్వేషాలు, లోభము, మోహము, శోకము, చింత, అలసత్వము, ఇవన్నీ సూక్ష్మదేహం యొక్క ధర్మాలు. ఇది కారణదేహంలో కలుగుతుంది అందుచేత దానికి ఇది కార్యము అనబడుతుంది.

సూక్ష్మదేహానికి ప్రకృతి కారణము. కాబట్టి అది కారణ దేహము అనబడుతున్నది. అరిషడ్వర్గాలు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియాల లక్షణాలు. జ్ఞానము, సంకల్పము, సందేహము మొదలైనవన్నీ ప్రయత్న సాధ్యకృత్యాలు కాబట్టి కృతులు అనబడతాయి. ఇవన్నీ సుషుప్తిలో జీవియొక్క కారణదేహంలో లయమై ఉంటాయి కాబట్టి కారణదేహాన్ని ప్రకృతి అంటారు. సుషుప్తిలో జీవికి ప్రవర్తన ఉండదు. సూక్ష్మదేహం కారణదేహంలో లీనమై ఉంటుంది. అందుచేత సూక్ష్మదేహానికి ఉన్న ధర్మాలన్నీ కారణదేహం నుంచి కలిగినవే.

కారణదేహంలో ఉన్నటువంటి కృత్యాలన్నీ సూక్ష్మదేహానికి వచ్చి అక్కడ నుంచి స్థూలదేహంతో కార్యాలు చేయిస్తాయి. ఈ రకంగా కార్యకారణాలు ఏవీ లేనిది పరమేశ్వరి.

## 861. కామకేళీతరంగితా

**కామస్య కామేశ్వరస్య కేళీనాం క్రీడావిలాసానాం**

**తరంగాః పరంపరాః సంజాతా అస్యాః**

కామేశ్వరుని క్రీడా విలాసములయొక్క పరంపరలు గలది.

| | | |
|---|---|---|
| కామ | – | కామేశ్వరుని యొక్క |
| కేళి | – | పంచకృత్య పరాయణత్వము |
| తరంగిత | – | కలుగునట్లు చేయునది. |

జగత్సృష్టికి సంకల్ప స్వరూపమైనది. ఇచ్ఛాశక్తి స్వరూపిణి. సృష్టి చెయ్యాలనే భావాన్ని పరమేశ్వరుడికి కలిగిస్తుంది. పంచకృత్యములు చెయ్యాలనే భావన పరమేశ్వరుడికి కలిగిస్తుంది. అందుచేతనే కామకేళీ తరంగితా అనబడుతోంది.

## 862. కనత్కనకతాటంకా

**కనతీ దీప్యమానే కనకస్య వర్ణమయే తాటంకే కర్ణాభరణవిశేషౌ యస్యాః**

దేదీప్యమానంగా ప్రకాశించే చెవికమ్మలు అనబడే బంగారు ఆభరణాలు కలది. సూర్య చంద్రులే కర్ణాభరణాలు.

**కన చ్ఛ్రీచక్ర తాటంక విటంక వదనాం బుజా ॥**

అంటోంది దేవీభాగవతం. ఇవన్నీ గతంలో 'తాటంక యుగళీభూత తపనోడుపమండలా' అనే నామంలో వివరించబడినాయి.

## 863. లీలావిగ్రహధారిణీ

అనాయాసముగా అవతారవిశేషములు గలది. పంచకృత్యాలు నిర్వహించేటప్పుడు

| | | |
|---|---|---|
| సృష్టి చెయ్యటానికి | – | బ్రహ్మగా |
| స్థితి కార్యానికి | – | విష్ణువుగా |
| లయం చెయ్యటానికి | – | రుద్రుడుగా |

| | | |
|---|---|---|
| తిరోదానమునకు | – | మహేశ్వరుడుగా |
| అనుగ్రహానికి | – | సదాశివుడుగా |

రూపుదాలుస్తుంది. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చెయ్యటానికి అనేక రూపాలు దాలుస్తుంది. వీటిలో కొన్ని పూర్తి అవతారాలు. కొన్ని అంశలు అలాగే భక్తులు తనను ఏ రూపంలో ఆరాధిస్తే వారికి ఆ రూపంలోనే దర్శనమిస్తుంది. కాబట్టి ఆమె లీలావిగ్రహధారిణీ అనబడుతోంది.

## 864. అజా

పుట్టుకలేనిది. భారతంలో "నేను పుట్టలేదు. పుట్టబోను. పుడుతూ ఉండటము ఎప్పుడూ లేదు. సర్వభూతాలకు క్షేత్రజ్ఞుడను నేనే. అందువలన నేను అజుడు అవుతున్నాను" అని చెప్పబడింది. పుట్టటము అనేది చావటంకోసమే పుట్టిన ప్రతివాడికి చావు తప్పదు. చచ్చినవాడు మళ్ళీ పుట్టి తీరతాడు.

పరమేశ్వరి శుద్ధ మాయా స్వరూపము. జననములేనిది. జననములేక వ్యాపించునది. అందుచేతనే అజా అనబడుతున్నది.

## 865. క్షయవినిర్ముక్తా

క్షయము లేనిది. మరణము లేనిది. నాశనము లేనిది. ఇందాకటి నామంలో పుట్టుక లేనిది పరమేశ్వరి అని చెప్పి ఇప్పుడు నాశనంలేనిది అంటున్నారు. ఈ రకంగా పరమేశ్వరికి జరామరణాలు లేవు. పుట్టుక లేనటువంటిది కాబట్టి ఆమెకు మరణంకూడా లేదు. ఆమె నిత్యము, సత్యము శాశ్వతమైనది.

## 866. ముగ్ధా

**ముగ్ధా సౌందర్యవతీ**

సౌందర్యముగలది. ఆ దేవిని గురించి చెప్పేటప్పుడు **సదాషోడశవర్షీయాం** నిత్యము పదహారు సంవత్సరాల ప్రాయమునందుండునది. అందమైన ఆకారము గలది.

## 867. క్షిప్రప్రసాదినీ

**క్షిప్రం స్వల్పదినై రేవ ప్రసీద తీతి**

శీఘ్రముగా కొన్ని దినములలోనే అనుగ్రహించునది సౌరపురాణంలో

**క్రమేణ లభ్యతేఽ న్యేషాం ముక్తి రారాధనా ద్విజాః ।**

**ఆరాధనా దుమేశస్య తస్మిన్ జన్మని ముచ్యతే ॥**

ఇతర దేవతలనారాధిస్తే క్రమంగా ముక్తి కలుగుతుంది. కాని పరమేశ్వరుణ్ణి ఆరాధిస్తే, ఆ జన్మలోనే ముక్తి కలుగుతుంది.

పరమేశ్వరి అనుగ్రహం కావాలి అంటే ఎక్కువ కష్టపడవలసిన అవసరం లేదు. అతిసులభంగా ఆమె ప్రసన్నమవుతుంది.

**ఆశానాం పూరకం చక్రం అర్చకానా మహర్నిశం**

భక్తులయొక్క కోరికలు అహర్నిశలు తీరుస్తూనే ఉంటుంది. అందుచేతనే క్షిప్ర ప్రసాదినీ అనబడుతుంది.

## 868. అంతర్ముఖసమారాధ్యా

ఆత్మాభిముఖమైన చిత్త ప్రవృత్తిగలవారిచే బాగుగా ఆరాధింపబడేది.

పూజ రెండు విధాలు 1. బాహ్యపూజ 2. అంతఃపూజ

1. బాహ్యపూజ అంటే షోడశ ఉపచారాలు, చతుష్షష్టి ఉపచారాలతో పరమేశ్వరిని పూజించటం.

2. అంతఃపూజ అంటే మన శరీరంలోనే దేవతని అర్చించటం. అంతఃపూజ భావనోపనిషత్తులో వివరించబడింది.

**"సలిలమితి సౌహిత్యకరణగ్ం సత్త్వమ్"**

ఇక్కడ నుంచి అంతర్యాగము వివరించబడుతోంది. బాహ్యమైన వస్తువులన్నీ విషయ వాంఛలకు ప్రతీకలు. కాబట్టి వాటిని వదలి పెట్టెయ్యాలి. శరీరంలో ఉండే వస్తువులచేతనే పూజ జరగాలి. పూజకు ముఖ్యమైనది జలము. సాధకుని శరీరంలో సత్వరజస్తమో గుణాలున్నాయి. వీటిలో మొదటి దానిని పెంపొందించి, మిగిలిన రెండింటినీ తగ్గించాలి. సత్వగుణమే జలము.

**"కర్తవ్య మకర్తవ్య మౌదాసీన్యమితి వివేక భావనాయుక్త ఉపచారః"**

**ఉపచారాలు :** బాహ్యపూజలో దేవికి రాజోపచారాలు, దేహోపచారాలు, మంత్రోపచారాలు అని వివిధరకాలైన ఉపచారాలున్నాయి. అయితే అంతఃపూజలో

ఉపచారము అంటే నిత్యము కాని వాటిని వదలివేయటము. బ్రహ్మపదార్థమే సత్యము కాబట్టి మిగిలినవి వదలివేయాలి. ఉదాసీనభావము తూష్ణీభావంగా రూపొందకూడదు. ఇదే అంతఃపూజలో ప్రధానమైన ఉపచారము.

**"అస్తి నాస్తీతి కర్తవ్యతా అనుపచారః"**

**అనుపచారాలు :** బ్రహ్మము ఒక్కటే సత్యము, నిత్యము. అది కనిపించనంత మాత్రము చేత లేదు. అనుకోరాదు. సర్వజీవరాశులయందు పరబ్రహ్మమున్నది. అంతేకాని బ్రహ్మము లేదనుకోవటము అపచారము తెలియనితనము. అపరాధము. ఇదే అనుపచారము చేయతగనిది.

**"బాహ్యాంతఃకరణానాం రూపగ్రహణ యోగ్యతాస్తీ త్యావాహనమ్"**

**ఆవాహన :** దేహంలో బాహ్యేంద్రియాలు, అంతరింద్రియాలు ఉన్నాయి. ఆత్మ అనేది ఈ ఇంద్రియాలద్వారానే ప్రకాశిస్తోంది. కాబట్టి వాటియొక్క దేవతారూపాన్ని ఆవాహన చెయ్యటమే దేవిని ఆవాహన చెయ్యటము.

**"తస్యబాహ్యాంతఃకరణానామేకరూప విషయ గ్రహణమాననమ్"**

**ఆసనము :** శరీరంలో ఉన్న జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే పద్నాలుగు విభిన్నమైన ధర్మాలు కలిగి ఉన్నాయి. ఆ ధర్మాలను అరికట్టి సర్వము బ్రహ్మపదార్థము అని భావించటమే ఆసన సమర్పణ.

**"రక్త శుక్ల పదైకీకరణం పాద్యమ్"**

**పాద్యము :** అంటే కాళ్ళు కడుక్కునే నీరు ఆ దేవి సాధకుడి శరీరంలో ద్వాదశాంతంలో ఉన్నది. బ్రహ్మము (ప్రకాశశక్తి) ఆత్మశక్తిలో ప్రవేశించి శుక్లబిందువయింది. విమర్శశక్తి శుక్లబిందువులో ప్రవేశించి రక్తబిందువయింది. ఈ రెండింటి కలయిక వలన మిశ్రమ బిందువు ఏర్పడింది. ఇప్పుడు

| | | |
|---|---|---|
| రక్తబిందువు | – | చంద్రుడు |
| శుక్లబిందువు | – | అగ్ని |
| మిశ్రమబిందువు | – | సూర్యుడు |

మిశ్రమ బిందువు నుంచి నాదము, దాని నుంచి కళలు ఆవిర్భవిస్తాయి. ఇప్పుడు మిశ్రమ బిందుస్వరూపమైన కామేశ్వరీద్వంద్వము యొక్క

కుడికాలు - శుక్లవర్ణమైన ప్రకాశాంశము

ఎడమకాలు - రక్తవర్ణమైన విమర్శాంశము

ఈ రెండు పాదాలనూ ధ్యానిస్తూ, వాటికి భేదము లేదు అనుకోవటమే పాద్యము

**"ఉజ్జ్వల దామోదానుసంధానమర్ఘ్యమ్"**

**అర్ఘ్యము :** అంటే చేతులు కడుక్కునే నీరు. శ్రమ తీరటానికి ఇచ్చే అల్పాహారం అంటే త్రాగేందుకు ఇచ్చేనీరు. అంతఃపూజలో ఆత్మయే శ్రీదేవి అని గ్రహించి బ్రహ్మానందాను సంధానము చెయ్యటమే అర్ఘ్యప్రదానము

**"స్వచ్ఛం స్వతస్సిద్ధ మిత్యాచమనీయమ్"**

**ఆచమనము :** ఆచమనము అంటే మంత్రపూర్వకంగా నోటిలోకి తీసుకునే నీరు ఆత్మ స్వరూపమైన దేవి స్వచ్ఛమైనది. ఆ స్వచ్ఛత స్వయంసిద్ధమైనది అని గ్రహించుట.

**"చిచ్ఛంద్రమయీ సర్వాంగప్రవణగ్ంస్నానమ్"**

**స్నానము :** బాహ్యపూజలో దేవతకు పంచామృత స్నానము చేయిస్తారు. కాని అంతః పూజలో అది లేదు. కుండలినీశక్తి ఆధారచక్రంలో నిద్రిస్తూ ఉంటుంది. సాధకుడు ప్రాణాయామంచేసి కుండలినీ శక్తిని గనక నిద్రలేపినట్లైతే, అది షట్చక్రాలగుండా ప్రయాణించి గ్రంథిత్రయాన్ని భేదించి సహస్రారంచేరి తననోటితో సహస్రదళ పద్మాన్ని కరిచి పట్టుకుంటుంది. అప్పుడు సహస్రారము అనే చంద్రమండలం నుండి అమృతధారలు స్రవించి శరీరంలోని డెబ్భైరెండువేల నాడీమండలాన్నీ తడుపుతాయి. ఈ రకంగా అమృతవర్షము కురిపించటమే ఆత్మదేవత (పరదేవత)కు స్నానము. ఈ అమృతవర్షము వలన శరీరము సమశీతోష్ణమవుతుంది.

**"చిదగ్ని స్వరూప పరమానందశక్తిస్ఫురణం వస్త్రం"**

వస్త్రము అంటే శరీరాచ్ఛాదనకు ఉపయోగించేది. సాధకుని శరీరంలోని కాంతి అంతా ఆ పరాశక్తి యొక్క తేజస్సే. ఈ విషయం తెలిసి బ్రహ్మానందము పొందుటమే వస్త్రప్రదానము

**"ప్రత్యేకగ్ం సప్తవింశతిథా భిన్నత్వేనేచ్ఛాజ్ఞాన క్రియాత్మక బ్రహ్మ గ్రంథి మద్రసతంతు బ్రహ్మనాడీ బ్రహ్మసూత్రమ్"**

**యజ్ఞోపవీతము :** దీన్నే బ్రహ్మసూత్రము అంటారు. జగత్తు అంతా బ్రహ్మమయమని సూత్రము కాబట్టి ఇది బ్రహ్మసూత్రము. దేహంలో ఉండేనాడులలో సుషుమ్నానాడి ముఖ్యమైనది దీన్నే బ్రహ్మనాడి అంటారు. అంతఃపూజలో ఈ సుషుమ్నానాడినే బ్రహ్మసూత్రము అని భావించాలి.

గాయత్రీ మంత్రానికి ప్రతీక యజ్ఞోపవీతము. తొంభై ఆరు బెత్తలు ప్రమాణంకల సూత్రము (దారము) తయారుచేసి దాన్ని మూడుచుట్లు చుట్టాలి. ఇప్పుడు రెండు చివరలుకలిపి ముడివెయ్యాలి. ఇందులోని సూత్రములో మూడుపోగులుంటాయి. అంటే మొత్తం ఇరవై ఏడు పోగులు ఉంటాయి. తోంభై ఆరు బెత్తలు ప్రమాణము తత్త్వములు.

| | | |
|---|---|---|
| మూడు ఆవృతులు | - | త్రిగుణములు |
| మూడు ముడులు | - | మూడుగ్రంథులు |
| మూడు గ్రంథులు | - | బ్రహ్మముడి |
| ఇరవైఏడు పోగులు | - | ఇరవై ఏడు భేదములు కల జగత్తు |

బ్రాహ్మణులు యజ్ఞోపవీతాన్ని ధరించి కర్మలుచేస్తారు. యజ్ఞోపవీతాన్ని తీసివేయట మంటే సన్యాసం స్వీకరించటము. అట్టి సన్యాసి బ్రహ్మకాండను చేసేవాడు. సర్వకర్మ విముక్తుడు జీవన్ముక్తుడు.

సుషుమ్నానాడిలో సూక్ష్మనాడులు కలిసే చోటును గ్రంథి అంటారు.అది ఇరవై ఏడు సూక్ష్మనాడుల సమూహము. అందుకనే సుషుమ్నానాడి యజ్ఞోపవీతము కంటె సత్యమైనది. సహజమైనది. ఇదే కంఠసూత్రము.

**"స్వవ్యతిరిక్తవస్తు సంగరహిత స్మరణం విభూషణమ్"**

**ఆభరణాలు :** దేవతకు కంఠసూత్రంతో పాటుగా వివిధ ఆభరణాలు సమర్పించాలి. సాధకుడు తానుకూడా పరబ్రహ్మస్వరూపమే అని,మాయా మోహంచేత తాను మనిషిగా ఉన్నానని గ్రహించి మాయాది వస్తువులతో తనకు సంబంధము లేదు అని వాటిని పరిత్యజించటమే దేవికి ఆభరణాలు అర్పించటము.

**"సత్పంగపరిపూతా మన్మరణంగంధః"**

**గంధము :** దేహానికి గంధము రాసుకోవటంచేత సువాసన రావటమే కాకుండా పవిత్రత కూడా వస్తుంది. సాధకుడి సహస్రారంలో ఆ పరాశక్తి ఉన్నది, దాని కాంతిచేతనే అతని శరీరము తేజస్సుతో ప్రకాశిస్తుందని ముందే చెప్పటం జరిగింది. ఈ రకంగా

జరగటంచేత సాధకుడు తాను ఎప్పుడూ పవిత్రుడనే అనే భావం కలిగి ఉంటాడు. ఇదే దేవికి శ్రీచందనం సమర్పణ.

**"సమస్త విషయాణాం మననం స్థైర్యేణానుసంధానం కుసుమమ్"**

**పూజ:** భగవంతుణ్ణి భక్తుడు నానావిధ పుష్పాలతో పూజిస్తాడు. ఇంద్రియవాంఛలకు లోనుగాకుండా, మనసును పరబ్రహ్మమందు లయం చేసి, సర్వము బ్రహ్మమయమని తెలుసుకోవటమే పుష్పపూజ.

**"అహింసా ప్రథమం పుష్పం, పుష్ప మింద్రియ నిగ్రహః**
**దయాక్షమాజ్ఞానపుష్పం పంచపుష్పం తతఃపరం"**

అహింస, ఇంద్రియనిగ్రహము, దయ, క్షమ, జ్ఞానము అనేవి పంచపుష్పాలు. సాధకుడు అరిషడ్వర్గాలు జయించి, అహంకారమనే పుష్పంతో దేవిని పూజించాలి. అంటే ఈ స్థితిలో నేను, అనే అహంకారాన్ని, నాది అనే భ్రాంతిని వదలివెయ్యాలి.

**"తేషా మేవ సర్వదాస్వీకరణం ధూపః"**

**ధూపం :** సాధకుడు ఇంద్రియచాపల్యానికి లోనుగాకుండా, ఇంద్రియాలను తన స్వాధీనంలో ఉంచుకోవటమే ధూపము.

**"పవనావచ్ఛిన్నోర్ధ్వజ్వలన వచ్ఛిదుల్కాకాశదేహో దీపః"**

**దీపం :** బ్రహ్మతేజస్సు వాయువుతో కలసి జ్వాలగా ప్రకాశిస్తుంది. అది విశ్వమంతా వ్యాపించి ఉంది. సాధకుడి శరీరము పరబ్రహ్మము యొక్క కాంతి పుంజములతో ప్రకాశిస్తోంది. ఇప్పుడు సాధకుడు ఆకాశాన్నే తన శరీరంగా భావించి, తన శరీరంలో ఉన్న ఆ పరాశక్తిని చిత్కలను దీపముగా భావించటమే దేవికి దీపసమర్పణ.

**"సమస్తయాతాయాత వర్జనం నైవేద్యమ్"**

**నైవేద్యము :** పూజానంతరము నైవేద్యము చెయ్యాలి. ఇంద్రియ చాంచల్యము లేకుండా అంటే ఇంద్రియాలను జయించి బ్రహ్మాకారవృత్తితో ఉండటమే నైవేద్యము. ఇది బ్రహ్మానందానుభవము.

**"అవస్థాత్రయైకీకరణం తాంబూలమ్"**

**తాంబూలము :** ఆకు వక్క సున్నము కలిస్తే తాంబూలము అవుతుంది. అవే జాగ్ర స్వప్న సుషుప్తి అనే మూడు అవస్థలు. ఆ మూడు అవస్థలను తురీయావస్థలో విలీనం చెయ్యటమే తాంబూల సమర్పణ.

**మూలాధారాది బ్రహ్మబిల పర్యంతం, బ్రహ్మరంధ్రాదిమూలాధార పర్యంతం గతాగత రూపేణ ప్రాదక్షిణ్యమ్"**

**ప్రదక్షిణము :** శరీరంలో ప్రాణవాయువు ఆధారచక్రం నుండి సహస్రారము వరకు, సహస్రారం నుంచి ఆధారచక్రం వరకుసుషుమ్నా మార్గంగుండా తిరుగుతూ ఉంటుంది. ఈ రకంగా ప్రాణవాయువు సంచారము చెయ్యటమే ఆత్మరూపంలో ఉన్న దేవతకు ప్రదక్షణము. దీనికే అజపారూప హంస అని పేరు.

హకారసంజ్ఞ గల పరమాత్మ సకార సంజ్ఞగల ప్రకృతితో కలసి హంసరూపమైన శబల బ్రహ్మము అవుతాడు. ఈ శబలబ్రహ్మము తొమ్మిదిద్వారాలు గల మానవశరీరము అనే పట్టణంలో ప్రవేశించి ఇంద్రియములు, ప్రాణములు, మనస్సుతో కూడిన వాడై పంజరంలో బంధించబడిన పక్షిలాగా బయటకు వచ్చే ఉపాయం తెలియక ప్రాపంచిక బంధనాలతో కొట్టుమిట్టాడుతున్నాడు. అటువంటి హంస అనబడే జీవుడికి.

| | | |
|---|---|---|
| అగ్ని, చంద్రమండలాలు | – | రెక్కలు |
| ఓంకారము | – | శిరస్సు |
| జ్ఞాననేత్రము | – | ముఖము |
| హకారసకారములు | – | పాదాలు |

(హకారము రుద్రబీజము సకారము శక్తి బీజము)

ఈ రకంగా ఉన్న హంస అనే జీవుడు పాలలో ఉన్న నెయ్యిలాగా సమస్త ప్రాణికోటినీ ఆశ్రయించి ఉన్నాడు.

సహస్రారము అనేది ఎనిమిది దళాలు కలిగిన పద్మము. ఇందులోని ఒక్కొక్క దళంలోనూ చిన్నచిన్న రేకులు నూటఇరవై అయిదు చొప్పున ఉంటాయి. ఈ రకంగా మొత్తం వెయ్యి దళాలుంటాయి. అందుకే దాన్ని సహస్రదళ కమలం అంటారు. ఎనిమిది దళాలు ఎనిమిది దిక్కులకు తిరిగి ఉంటాయి.

ఎనిమిది దళాల వివరాలు ఈ విధంగా ఉంటాయి.

| | | |
|---|---|---|
| తూర్పు దిక్కు | – | సద్బుద్ధి |
| ఆగ్నేయం | – | నిద్ర, దప్పిక, ఆలస్యము |
| దక్షిణము | – | క్రూరబుద్ధి |

| | | |
|---|---|---|
| నైరుతి | – | తాపబుద్ధి |
| పడమర | – | విలాసము |
| వాయువ్యము | – | నడచుట మొ॥ విషయములందు బుద్ధి |
| ఉత్తరము | – | సురతము నందు ఆసక్తి |
| ఈశాన్యము | – | ద్రవ్యము దానంచేసే తలంపు |
| పద్మాంతరాళంలో | – | ఇహపరలోక విముక్తి |
| కింజల్కము (తామరపువ్వులోని కేసరములు) | – | మెలకువ |
| తామరదుద్దు | – | కల |
| దుంప | – | నిద్ర |

ఆత్మ ఏ క్షణానైతే సహస్రారాన్ని వదులుతుందో ఆక్షణంలోనే పరబ్రహ్మలో ఐక్యమవుతుంది.

**"తురీయావస్థా నమస్కారః"**

**నమస్కారము :** దేవికి నమస్కారము చెయ్యటమంటే సాధకుడు తురీయావస్థ చేరటమే.

**"దేహశూన్య ప్రమాతృతా నిమజ్జనం బలిహరణమ్"**

**బలిహరణము :** సాధకుడి స్థూలశరీరము మాయతోకూడుకున్నది. సూక్ష్మశరీరము జ్ఞాన స్వరూపము తాను జ్ఞానస్వరూపుడు కాబట్టి జీవాత్మను పరమాత్మయందు విలీనం చేసినట్లు భావించటమే బలిసమర్పణ.

**"సత్యమస్తికర్తవ్య మకర్తవ్య మౌదాసీన్య విత్యాత్మ విలాపనగ్ం హోమః"**

**హోమము :** పూజ, జపము అయిన తరువాత హోమము చేయటం విధి.సాధకుడి అహంభావము, జీవభావము, పరబ్రహ్మ స్వరూపం ఉంది, లేదు అనే ద్వైదీభావము మొదలైనవన్నీ పరబ్రహ్మమనే అగ్నిలో విలీనము అనే ఆహుతి చేయటమే హోమము.

**"స్వయం తత్పాదుకా నిమజ్జనం పరిపూర్ణధ్యానమ్"**

**ధ్యానము :** సాధకుడు తాను ఆ దేవి యొక్క పాదముల నుండి వచ్చే తేజస్సులో విలీనమయినట్లుగా తలచి, తానుకూడా ఆ తేజస్సులో ఒక భాగమేనని, సర్వము పరబ్రహ్మ మమయని భావించటమే పరిపూర్ణ ధ్యానము.

**"ఏవం ముహూర్తత్రయం భావనయా యుక్తో భవతి, తస్య దేవతాత్మైక్యసిద్ధిః**

**బ్రహ్మత్వసిద్ధి :** ఈ విధంగా తననుతాను పరబ్రహ్మ స్వరూపంగా భావించి మూడు ముహూర్తముల కాలము దేవియందు మనసును లగ్నం చేసినవాడు ఆ దేవితో ఐక్యత పొందుతాడు. దీనినే బ్రహ్మత్వం సిద్ధించటం అంటారు.

**"చింత్రితకార్యాణ్యయత్నేన సిధ్యంతి స ఏవ శివయోగీతి కథ్యత ఇత్యుపనిషత్"**

**ఫలము :** ఈ విధంగా అంతఃపూజ చేసి సిద్ధుడైన సాధకుడికి కోరిన కోరికలు అప్రయత్నంగా నెరవేరతాయి. అతడినే శివయోగి అంటారు అని ఈ ఉపనిషత్తులో చెప్పబడింది.

## 869. బహిర్ముఖసుదుర్లభా

బాహ్యవిషయాలయందు ఆసక్తిగల వారికి లభించనిది. దుర్లభమైనది.

తనలో ఉన్న ఆత్మయే పరమేశ్వరుడు అని తెలుసుకోలేనివారికి లభ్యము కానిది. ఇంద్రియాలద్వారా ఆత్మను దర్శించాలనుకునేవారికి దుర్లభమైనది. లౌకికవాదులకు లభ్యము కానిది.

పూర్వకాలంలో ఒకసారి ఇంద్రుడికి బ్రహ్మతత్త్వాన్ని గురించి తెలుసుకోవాలని పించింది. ఆ కాలంలో దధ్యుడు అనే మహర్షి చాలా శ్రేష్ఠుడు. బ్రహ్మజ్ఞాని. అందుకని అతని దగ్గరకు వెళ్ళి "స్వామీ ! మీవల్ల నాకు ఒక సహాయం కావాలి" అన్నాడు ఇంద్రుడు. 'చేస్తాను" అనే మాటను మహర్షి దగ్గర తీసుకున్న తరువాత చెప్పాడు "నాకు పరబ్రహ్మ తత్త్వాన్ని గురించి తెలియజెయ్యండి" అని

ఆ మాటలు విన్న దధ్యుడు కొంచెంసేపు మాట్లాడలేదు. అది చూచి, మహర్షి ఏదో సంశయిస్తున్నాడని గ్రహించి 'ఏమిటి మహర్షీ ఆలోచిస్తున్నావు. నాకు బ్రహ్మవిద్య చెబుతావాలేదా?" అన్నాడు. ఆలోచించాడు మహర్షి. చెబితే అపాత్రదానం చెప్పకపోతే అసత్యపాపం ఏం చెయ్యాలో పాలుపోలేదు మహర్షికి. మళ్ళీ ఇంద్రుడే "ఏం మహర్షీ ! మాటిచ్చావు నిలబెట్టుకుంటావా లేదా?' అన్నాడు. చేసేందేంలేక మర్నాడు ఉదయం మిగిలిన శిష్యులతో కలిసి రమ్మాన్నాడు దధ్యుడు ఇంద్రుణ్ణి.

మర్నాడు ఉదయం కౌపీనం ధరించి దర్భలు చేత్తో పట్టుకుని వచ్చాడు ఇంద్రుడు. అందరితోపాటే కూర్చున్నాడు. చెప్పటం మొదలుపెట్టాడు మహర్షి.

అంతా మిథ్య, కంటికి కనిపించేదేదీ నిజం కాదు ఈ రాజ్యాలు, సింహాసనము, అప్సరసలు, సుఖాలు ఏవీ నిజం కాదు అన్నాడు మహర్షి.

ఆ మాటలు విన్న ఇంద్రుడు లేచి మహర్షీ నువ్వు అబద్ధం చెబుతున్నావు. ఏది అసత్యం. నా రాజ్యామా నా సింహాసనమా, అప్సరసలా ? కేవలం నన్ను ఎగతాళి చెయ్యటానికే ఈ మాటలు చెబుతున్నావు. ఇలాంటి మాటలు ఇంకొకసారి చెప్పావంటే నీ తల నరికి పారేస్తాను జాగ్రత్త" అని హెచ్చరిస్తూ అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

అతని దృష్టిలో ఇంకా రాజ్యము. అప్సరసలూ అంతా నిజమే. కాబట్టి అటువంటి వాడికి బ్రహ్మవిద్యను చెప్పరాదు. వారికి పరబ్రహ్మ సాక్షాత్కారంకాదు. అందుకే ఆ పరమేశ్వరి బహిర్ముఖ సుదుర్లభా అనబడింది.

శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 95వ శ్లోకంలో

**పురారాతే రంతః పుర మసి తత స్త్వచ్చరణయో**
**స్సపర్యా మర్యాదా తరళ కరణానా మసులభా**
**తథాహ్యేతే నీతా శ్శత మఖ ముఖా స్సిద్ధి మతులాం**
**తవ ద్వారోపాంతస్థితిభి రణి మాద్యాభి రమరాః ॥**

తల్లీ ! పాదపద్మములను పూజించు భాగ్యము చపలచిత్తులైన వారికి లభించదు. ఇంద్రాదిదేవతలకు కూడా నిను సేవించే భాగ్యము లభించక నీ ద్వారము చెంతకావలి ఉన్నారు.

స్థిరచిత్తులకే కాని చంచల చిత్తులకు నిన్ను సేవించే భాగ్యము లభించదు.

## 870. త్రయీ

త్రయీవిద్య అదే వేదవిద్య. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము. వీటిలోని విషయాన్ని త్రయీవిద్య అంటారు కూర్మపురాణంలో

**మమైవాఽ న్యా పరా శక్తి ర్వేదసంజ్ఞా పురాతనీ ।**
**ఋగ్యజుస్సామరూపేణ సర్గాదౌ సంప్రవర్తతే ॥**

"ప్రాచీనమైన నా పరాశక్తియే వేదము అనే పేరుతో ఋగ్ యజు స్సామములనే పేరుతో ఉన్నది" అంటుంది పరమేశ్వరి. అంటే ఆ వేదాలు పరమేశ్వరి స్వరూపమే దేవీపురాణంలో

**ఋగ్యజుస్సామభావేన సాంగవేదగతా యతః ।**
**త్రయీతి కథ్యతే లోకే దృష్టాఽ దృష్టప్రసాదినీ ॥**

పరమేశ్వరి ఋగ్ యజు స్సామరూపమున ఉన్న పరమేశ్వరి త్రయీ అని చెప్పబడింది. నిత్యాతంత్రంలో

**అకారాదిస్సామవేదో ఋగ్వేదశ్చ తదాదికః ।**
**యజుర్వేద ఇకారాది స్తేషాం సంయోగత శ్శుచిః ॥**

ఋక్, స్సామవేదాలు అకారంతో ప్రారంభంకాగా యజుర్వేదం ఇకారంతో ప్రారంభమవుతుంది. ఈ మూడింటి స్వరూపమే దేవి. కాబట్టి త్రయీ అనబడుతుంది.

తైత్తిరీయోపనిషత్తులోని ఐదవ అనువాకంలో పరబ్రహ్మకు అంగభూతాలయిన వ్యాహృతుల ఉపాసన చెప్పబడింది. వ్యాహృతులు అంటే కర్మలలో ఉపయోగించేవి అని అర్థం. భూః, భువః, సువః అనేవి మూడు వ్యాహృతులు. ఈ వ్యాహృతులను వేదదృష్టితో ఉపాసన చెయ్యాలి. అప్పుడు

| | | |
|---|---|---|
| భూః | – | ఋగ్వేదము |
| భువః | – | సామవేదము |
| సువః | – | యజుర్వేదము |
| మహః | – | ఓంకారము |

అని భావన చెయ్యాలి అన్నారు.

ఛాందోగ్యోపనిషత్తులో ప్రజాపతి లోకాలను సృష్టించి వాటిసారాన్ని గ్రహించాలనే తలంపుతో తపస్సు చేశాడు. ఆ తరువాత లోకాలనుండి రసాన్ని అంటే సారాన్ని తీశాడు.

| | | |
|---|---|---|
| పృథివి నుండి | – | అగ్ని అనే రసాన్ని |
| అంతరిక్షం నుండి | – | వాయువు అనే రసాన్ని |
| ద్యులోకం నుండి | – | ఆదిత్యుడు అనే రసాన్ని |

సారంగా గ్రహించాడు. తరువాత అగ్ని, వాయువు, ఆదిత్యులను గూర్చి తపస్సు చేశాడు. వారి నుండి వేదాలసారాన్ని పిండాడు. అంటే

| | | |
|---|---|---|
| అగ్ని నుండి | – | ఋగ్వేదాన్ని |
| వాయువు నుండి | – | యజుర్వేదాన్ని |
| ఆదిత్యుని నుండి | – | సామవేదాన్ని |

సారంగా గ్రహించాడు. ఆ తరువాత ప్రజాపతి మూడు వేదాలను గూర్చి తపస్సు చేశాడు. అదే త్రయీవిద్య దానినుండి మళ్ళీ సారాన్ని తీశాడు అంటే

ఋగ్వేదము నుంచి – భూలోకము

యజుర్వేదము నుంచి – భువర్లోకము

సామవేదం నుంచి – సువర్లోకము

రసం రూపంలో గ్రహించాడు అని చెప్పబడింది. ఇదే త్రయీవిద్య. వేదాలు పరమేశ్వరుని స్వరూపము అందుచేత పరమేశ్వరి త్రయీ అని చెప్పబడింది. త్రయీవిద్య అంటే వాగ్భవబీజము ఐం.

## 871. త్రివర్గనిలయా

ధర్మార్థకామాలకు నెలవైనది. భూతభవిష్యద్వర్తమానాలకు, అకార ఉకార, మకారాలకు స్థానమైనది. అందుచేత పరమేశ్వరి త్రివర్గ నిలయా అనబడుతున్నది.

## 872. త్రిస్థా

మూడు లోకాలలోనూ కూడా భేదము లేక ఉండునది. మార్కండేయ పురాణంలో

**త్రయోలోకా స్త్రయో దేవా స్త్రైవిద్యం పావకత్రయం**
**త్రీణి జ్యోతీంషి వర్గాశ్చ త్రయో ధర్మాదయ స్తథా**
**త్రయో గుణా స్త్రయశ్శబ్దాస్త్రయో దోషాస్తథాశ్రమాః**
**త్రయః కాలా స్తథావస్థాః పితరోహర్నిశాదయః**
**మాత్రాత్రయం చ తే రూపం త్రిస్థే దేవి సరస్వతి ॥**

| | | |
|---|---|---|
| 1. త్రిమూర్తులు | 4. త్రివేదాలు | 7. జ్యోతిస్త్రయము |
| 2. త్రిగుణాలు | 5. త్రికాలాలు | 8. అవస్థాత్రయము |
| 3. త్రిలోకాలు | 6. త్రివర్గము | 9. ఆశ్రమత్రయము |

ఈ త్రయములన్నింటియందు ఉంటుంది. కాబట్టి పరమేశ్వరి త్రిస్థా అనబడుతుంది.

## 873. త్రిపురమాలినీ

అంతర్దశార చక్రమందు అభిమానము గల దేవత. త్రిపురముల యొక్క స్వరూపము గలది. పంచదశి మహామంత్రంలోని మూడు కూటములను త్రికూటములు అంటారు. అవే త్రిపురములు. వాటి స్వరూపముగలది గాన పరమేశ్వరి త్రిపురమాలిని అనబడుతుంది.

## 874. నిరామయా

### నిర్గతా ఆమయా రోగా యస్యాః-సా

నశించిన వ్యాధులు గలది. ఆమయములు అంటే - వ్యాధులు పరమేశ్వరికి ఏ రకమైన వ్యాధులు లేవు. రోగాలు అనేవి శరీరానికేగాని ఆత్మకు కాదు. పరమేశ్వరి పరబ్రహ్మరూపం. కాబట్టి ఆమెకు ఏ వ్యాధులు లేవు.

## 875. నిరాలంబా

జగత్తులో సర్వానికీ ఆలంబమైనది పరమేశ్వరియే. కాని వేరెవరూ కాదు. అందుచేత అందరికి ఆలంబమైనది పరమేశ్వరి. ఆమెకు వేరెవరి సహాయ సహకారాలూ అవసరం లేదు. ఏ ఆధారమూ అవసరం లేదు. ఆలంబనము అనేది దృశ్యపదార్థాలకే గాని దృగ్రూపానికి కాదు. అందుచేత పరమేశ్వరి నిరాలంబా అనబడుతోంది.

## 876. స్వాత్మారామా

దేవిస్వతంత్రురాలు. తన ఆత్మయందే క్రీడిస్తుంటుంది. అయితే ఒకటిగా క్రీడించదు. రెండుగా క్రీడిస్తుంది. బృహదారణ్యకంలో "పరమేశ్వరుడు రెండవదానిని కోరాడు. తనను స్త్రీ పురుషుల జంటగా చేసుకున్నాడు. వారు పరస్పరం భార్యాభర్తలు అయినారు." అని చెప్పబడింది.

ఈ రకంగా పరమేశ్వరుడు తన ఆత్మయందే తాను క్రీడిస్తున్నాడు. కాబట్టి పరమేశ్వరి స్వాత్మారామా అనబడుతోంది.

పరమేశ్వరుడు ఒకడే. తాను అనేకం కావాలనుకుని అనేక రూపాలు పొందాడు. ఈ రకంగా తనవే అయిన అనేక రూపాలలో విహరిస్తున్నాడు. కాబట్టి స్వాత్మారామా అనబడుతున్నాడు.

కంటికి కనిపించే ప్రపంచమంతా పరమేశ్వరి స్వరూపమే. ఈ రకంగా ఈ లోకంలో విహరించినా అదంతా తనస్వరూపమే కాబట్టి స్వాత్మారామా అనబడుతోంది.

## 877. సుధాస్రుతిః

సహస్రార కర్ణికలోని చంద్రమండలం నుండి కారే అమృత స్వరూపిణి.

సాధకుడు కుండలినీ శక్తిని జాగృతం చేసినట్లైతే, అది గ్రంథిత్రయాన్ని ఛేదించి, షట్చక్రాలను దాటి సహస్రారం చేరి అక్కడున్న కర్ణికను (అదే చంద్రమండలం) నోటితో కరచి పట్టుకుంటుంది. అప్పుడు అక్కడినుంచి అమృతపు ధారలు స్రవిస్తాయి. వాటితో యోగిశరీరంలోని 72 వేల నాడీమండలము తడుస్తుంది. అప్పుడతడు అనిర్వచనీయమైన ఆనందం పొందుతాడు. అది అనుభవైక వేద్యము అని గతంలో వివరించాం. ఆ అమృతపు ధారలే పరమేశ్వరి రూపము. అందుచేతనే ఆమె సుధాస్రుతిః అని చెప్పబడుతోంది.

ఈ రకంగా 813 నుంచి 877 వరకు నామాలలో జ్ఞానవిద్యను వివరించారు.




శ్రీ 'ఝ'కార దేవి

# 49. నిత్యనైమిత్తిక కర్మవిధి

లలితా సహస్రంలో ఇప్పటిదాకా అనేక విషయాలను వివరించి ఇక ఉపాసన విధానాన్ని వివరిస్తున్నారు.

బృహదారణ్యకోపనిషత్తులాగానే ఇందులో కూడా చివరి భాగంలో ఖిలకాండ అంటే ఉపాసనా విధానము వివరించబడుతోంది. ఇందులో మొదటగా నిత్య, నైమిత్తిక కర్మలను వివరిస్తున్నారు. ఈ కర్మలు రెండు రకాలు 1. నిత్యము 2. నైమిత్తికము. ఇవి ఫలాపేక్ష లేకుండా ప్రతివారూ చేసి తీరవలసినవి.

1. నిత్యకర్మలు – వీటిని ప్రతినిత్యం విధిగా నిర్వర్తించాలి. వీటికి తిధివార నక్షత్రాలతో పని లేదు. సంధ్యావందనము, అగ్నికార్యము, వైశ్యదేవము, దేవతార్చన మొదలైనవి. ఇవి చేస్తే పుణ్యం రాదు కాని చెయ్యకపోతే పాపం మాత్రం వస్తుంది.

2. నైమిత్తిక కర్మలు – నిమిత్తం ఆచరించేవి. అంటే దేని నిమిత్తమైనా ఆచరించే కర్మలు. ఆబ్దీకాలు, అమావాస్య తర్పణాలు, మిధున, కన్య, ధనుస్సు, మీన సంక్రమణాలు మొదలైనవి. ఇవి తిధులనుబట్టి గాని, నక్షత్రాన్నిబట్టి గాని ఆచరించాలి. ఇవికూడా చెయ్యకపోతే పాపం.

ఇక వ్రతాలు, పూజలు మొదలైనవి కామ్యకర్మలు. అవి వీటితో బాటుగా లెక్కలోకి రావు. అయితే దేవ పితృకార్యాలన్నీ యజ్ఞాలే.

పరమేశ్వరి యజ్ఞములందు ప్రీతిగలది. యజ్ఞము విష్ణుస్వరూపమైనది. యజ్ఞాన్ని చేసేది ఆమే. యజమాని అయిన సోమయాజి కూడా ఆమే. పరమేశ్వరి వేదసమ్మతమైన ధర్మాలను రక్షిస్తుంది. ఆమె విష్ణుస్వరూపురాలే కాకుండా లక్ష్మీస్వరూపురాలు కూడా. తన భక్తుల ధనధాన్యాలను వృద్ధి పరుస్తుంది. ఆమె వేదమాత. వేదపండితులైన, శ్రోత్రీయులయందు ప్రీతి గలిగి ఉంటుంది.శ్రోత్రీయులైన బ్రాహ్మణుల రూపంలోనే ఉంటుంది. సమస్త జగత్తులకు, అఖిలాండకోటి బ్రహ్మాండాల సృష్టి స్థితి లయాలకు కారణమైనది. అటువంటి పరమేశ్వరిని గనక నిత్యకర్మలో భాగంగా అర్చించినట్లైతే తన భక్తులను సంసారమనే లంపటంలోంచి బయటపడేస్తుంది.

అందుచేతనే నిత్యకర్మలలో భాగంగా ప్రతిరోజూ గృహంలో పరమేశ్వరిని అర్చించాలి. నైమిత్తిక కర్మలలో భాగంగా ప్రతిపూర్ణమికి హోమాలు, ప్రత్యేక అర్చనలు పారాయణలు చెయ్యాలి.

యోగినీ హృదయంలో నైమిత్తికకర్మను గురించి చెబుతూ

**పుష్యభేనతు వారేచ సౌరేచ పరమేశ్వరి**
**గురో ర్దినే స్వనక్షత్రే చతుర్ద శ్యష్టమీషు చ**
**చక్రపూజాం విశేషేణ యోగినీనాం సమాచరేత్**

నిత్యపూజను నిష్ఠతో చేసేవారికి మాత్రమే నైమిత్తికార్చన యందు అధికారమున్నది. పుష్యమి నక్షత్రము, ఆదివారము, గురువుల జన్మదినము, సాధకుని జన్మనక్షత్రము, చతుర్దశి, అష్టమితిథులయందు, నైమిత్తికార్చన చెయ్యాలి. యోగులు, యోగినులు, వీరులతో కలిసి విశేషద్రవ్యాలతో చక్రార్చన చెయ్యాలి. పూజలో చెప్పిన ద్రవ్యాలు మాత్రమే వాడాలి. అంతేకాని పర్యాయములు వాడరాదు అని చెప్పబడింది.

ఈ విషయాలను 878 నుంచి 887 వరకు నామాలలో వివరించటం జరిగింది.

## 878. సంసారపంక నిర్మగ్నసముద్ధరణపండితా

సంసారము అనే బురదలో మునిగినవారిని ఉద్ధరించుటలో అఖండురాలు. కూర్మపురాణంలో

**యే మనా గపి శర్వాణీం స్మరంతి శరణార్థినః ।**
**దుస్తరాపారసంసారసాగరే న పతంతి తే ॥**

పరమేశ్వరిని శరణుజొచ్చినవారు సంసారసాగరంలో పడరు. అని చెప్పబడింది.

ఈ విషయాన్ని శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 3వ శ్లోకంలో వివరిస్తూ

**అవిద్యానా మంతస్తిమిరమిహిరద్వీపనగరీ**
**జడానాం చైతన్యస్తబకమకరందస్రుతిఝురీ**
**దరిద్రాణాం చింతామణిగుణనికా జన్మజలధౌ**
**నిమగ్నానాం దంష్ట్రా మురరిపు వరాహస్య భవతి ॥**

అమ్మా ! నీ పాదరేణువు అజ్ఞానమనే అంధకారాన్ని పోగొట్టే సూర్యబింబము. మందబుద్ధులకు జ్ఞానము కలిగించే దీపము. దరిద్రులకు సకల సంపదలిచ్చే చింతామణి. సంసారసాగరంలో మునిగిపోయిన వారికి, సముద్రంలో మునిగిపోయిన భూమిని బైటికి తీసుకువచ్చిన వరాహస్వామి అవుతున్నది.

సంసారసాగరంలో మునిగిపోయిన వారిని పరమేశ్వరి రక్షిస్తుంది.

## 879. యజ్ఞప్రియా

**యజ్ఞాః ప్రియాః యస్యాః**

యజ్ఞములు ప్రియముగా గలది. యజ్ఞము విష్ణుస్వరూపమని గతంలో వివరించబడింది. అటువంటి విష్ణుస్వరూపమైన యజ్ఞమందు ప్రీతిగలది.

నిత్య, నైమిత్తిక కర్మలయందు, దేవ, పితృయాగములందు, చండీయాగము, రుద్రయాగము, పాకయాగము మొదలైన యాగములు ఆచరించుటలో ప్రీతిగలది. అందుచేత పరమేశ్వరి యజ్ఞప్రియా అనబడుతున్నది.

## 880. యజ్ఞకర్త్రీ

**యజ్ఞస్యకర్తా**

యజ్ఞము నొనర్చునది

**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవచ**

సర్వయజ్ఞములను ఆచరించువాడను, అనుభవించువాడను నేనే అని భగవానుడు గీతలో చెప్పాడు. కాబట్టి యజ్ఞము చేసేది ఆమే. అందుచేత ఆమె యజ్ఞకర్త్రీ అనబడుతున్నది. యజ్ఞంచేసే వాడు కర్త. సోమయాజి. అతడు పరమేశ్వర స్వరూపుడు. అతని భార్య శక్తి స్వరూపము. అందుచేతనే ఆమె యజ్ఞకర్త్రీ అనబడుతోంది.

యజ్ఞం చెయ్యాలంటే భార్యాభర్తలు ఇరువురూ ఉండాలి. భార్యలేనివాడు యజ్ఞం చెయ్యరాదు. ఆ కారణంచేతనే ఉత్తరకాండలో శ్రీరామచంద్రుడు యజ్ఞం చెయ్యటానికి స్వర్ణసీతను చేయించాడు. సోమయాజి భార్య సోమిదేవమ్మ పరమేశ్వరి ఇక్కడ సోమిదేవి స్వరూపురాలు కాబట్టి యజ్ఞకర్త్రీ అనబడుతోంది.

## 881. యజమానస్వరూపిణీ

యజమాని సోమయాజి. పరమేశ్వర స్వరూపం దీక్షితమూర్తి. అతని భార్య దీక్ష. వారి కుమారుడు సంతానుడు. లింగపురాణంలో ఆ ప్రభువునే పండితులు ఉగ్రుడు అని పిలుస్తారు. ఇతరులు ఈశానుడు అంటారు. ఉగ్రుడైన దేవునకు దీక్ష అనే పేరుగల భార్య ఉన్నది. సంతానుడు వారి కుమారుడు" అని చెప్పబడింది.

వాయుపురాణంలో శివుని ఉగ్రతనువు బ్రాహ్మణ స్వరూపము. ఉగ్రుని పత్ని దీక్ష. కుమారుడు సంతానుడు అని చెప్పబడింది.

యజ్ఞమే పరమేశ్వరుడు. కార్యకారణాలకు భేదం లేదు. కాబట్టి యజ్ఞస్వరూపమైన పరమేశ్వరియే, యజమాని అయిన సోమయాజి. యజ్ఞ దీక్షితుడైన బ్రాహ్మణుడు పరమేశ్వరి. అష్టమూర్తులలో ఎనిమిదివ వాడైన సోమయాజి. ఇతడు దీక్ష తీసుకుని కంకణధారణ చేస్తాడు. కాబట్టి యజమాని అనబడుతున్నాడు. పరమేశ్వరి యజమాన స్వరూపిణి.

## 882. ధర్మాధారా

ధర్మములకు అడ్డులేని ప్రవాహము. శ్రుతి, స్మృతులకు సమ్మతమైనవి ధర్మాలు. అంటే వేదవిరుద్ధముకానివి ధర్మాలు. వేదాలలోను, ధర్మశాస్త్రాలలోను చెప్పబడినటువంటిది.

ఈ ధర్మాలు అన్ని కాలాలయందు, అన్ని ప్రాంతాలయందు ఒకే రకంగా ఉండవు. దేశ కాల మాన పరిస్థితులననుసరించి మారుతుంటాయి. ఇవి పెద్దలచే నిర్ణయించబడి ఉంటాయి. ఎక్కువమందికి మేలు చేకూర్చేవిధంగా ఉంటాయి. నీతి నియమాలకు లోబడి ఉంటాయి. దేశ శ్రేయస్సు, సంఘ శ్రేయస్సు దృష్టిలో పెట్టుకుని చెప్పబడతాయి. సంవర్తస్మృతిలో "దేశదేశాలయందు పారంపర్యముగా వచ్చినది ఆచారము. వేదాలకు విరుద్ధముగానిది ధర్మము" అని చెప్పబడింది. అటువంటి ధర్మాలకు అడ్డులేని ప్రవాహము.

ధర్మమే ఆధారముగా గలది. ధర్మమునందు ఉండేది. ఆ పరమేశ్వరిచేతనే అన్నింటికీ ధర్మము ఆధారంగా చెయ్యబడింది. కాబట్టి పరమేశ్వరి ధర్మాధారా అనబడుతోంది.

## 883. ధనాధ్యక్షా

**ధనస్య అధ్యక్షా స్వామినీ**

ధనమునకు స్వామి. కుబేరస్వరూపురాలు. ధనము లక్ష్మీస్వరూపం. లక్ష్మీదేవి పరమేశ్వరి అంశ. కాబట్టి ధనానికి స్వామి పరమేశ్వరియే.

ధనాధిపతి కుబేరుడు. పంచదశీ మహామంత్రాన్ని జపించి తరించిన వారిలో కుబేరుడు ఒకడు. ఇతడు కూడా పరమేశ్వరి స్వరూపమే. కాబట్టి ఆమె ధనాధ్యక్షా అనబడుతోంది.

## 884. ధనధాన్యవివర్ధినీ

ధనధాన్యాలను వృద్ధి పరచేది.

యజ్ఞకాలంలో అహంకారం లేకుండా దక్షిణ రూపంలో ఇవ్వబడేది ధనము.

ఒకసారి బ్రహ్మాది దేవతలు యజ్ఞం చేసి యజ్ఞఫలం సఫలంకావాలి అని పరమేశ్వరిని పరిపరి విధాల ప్రార్థించారు. పరమేశ్వరి సలహామీద విష్ణుమూర్తి లక్ష్మీదేవి అంశతో దక్షిణాదేవిని సృష్టించి వారికిచ్చాడు. బ్రహ్మ ఆమెను యజ్ఞపురుషుడికి సమర్పించాడు. యజ్ఞం సఫలమైంది.

కాబట్టి దక్షిణ లేని కర్మ సఫలం కాదు. అందుచేత యజ్ఞకాలంలో ధనాన్ని దక్షిణగా ఇస్తారు. అలాగే హోమకాలంలో పేల్చబడునది అవటంచేత ద్రవ్యాన్ని యజమానికి పుష్కలంగా ఇస్తుంది. కాబట్టి పరమేశ్వరి ధనధాన్యవివర్ధినీ అనబడుతుంది.

ఆ పరమేశ్వరి లక్ష్మీ స్వరూపంతో ధనాన్ని , భూదేవి స్వరూపంతో ధాన్యాన్ని ఇస్తుంది కాబట్టి ధనధాన్యవివర్ధినీ అనబడుతున్నది.

## 885. విప్రప్రియా

వేద శాస్త్రాలు బాగా తెలిసినవారు బ్రాహ్మణులు. వారిని విప్రులు అంటారు. బ్రహ్మవైవర్తపురాణంలో

**జన్మనా బ్రాహ్మణోజ్ఞేయః సంస్కారై ర్ద్విజఉచ్యతే**
**విద్యయా యాతి విప్రత్వం త్రిభి శ్ర్శోత్రియ ఉచ్యతే**

జన్మచేత బ్రాహ్మణుడవుతున్నాడు. ఉపనయనాది సంస్కారములచే ద్విజుడు అనబడుతున్నాడు. విద్యచేత విప్రుడవుతున్నాడు. ఈ మూడు లక్షణాలు గలవాడు శ్రోత్రీయుడు అని చెప్పబడింది. అటువంటి విప్రులు అభీష్టముగా గలది.

వేదపఠనంచేత బ్రాహ్మణుడికి విప్రత్వం వస్తుంది. పరమేశ్వరి వేదస్వరూపిణి. వేదజనని కాబట్టి వేదపండితులయిన విప్రులందు అపేక్ష కలిగి ఉంటుంది.

## 886. విప్రరూపా

పై నామంలో చెప్పిన విప్రుల రూపం గలది. అందుకే 'దేవతలయందు వేదవేత్తలైన బ్రాహ్మణులున్నారు.' అని వేదం చెబుతోంది.

పరాశర స్మృతిలో

**బ్రాహ్మణా జంగమం తీర్థం త్రిషులోకేషు విశ్రుతం ।**
**యేషాం వాక్యోదకేనైవ శుద్ధ్యంతి మలినా జనాః ॥**

బ్రాహ్మణులు కదిలియాడే తీర్థములు. వాటివలన మలినమైన జనులు పరిశుద్ధులౌతున్నారు. ఆపస్తంబస్మృతిలో

**అవమానాత్తపోవృద్ధిః సన్మానా త్తపసః క్షయః**
**అర్చితః పూజితో విప్రః దుగ్ధా గౌ రివ సీదతి**
**ఆప్యాయతే యథాహస్సు తృణై రమృత సంభవైః**
**ఏవం జపైశ్చ హోమైశ్చ పున రాప్యాయతే ద్విజః**

అవమానంతో – తపో వృద్ధి కలుగుతుంది.
సన్మానంతో – తపస్సు క్షీణిస్తుంది

విప్రుడు పూజించబడినట్లైతే పాలుపితికిన ఆవులాగా కృశించిపోతాడు. మృదువైన గడ్డితిని గోవు బలిసినట్లుగా మంత్రజపంతోను, హోమంతోను బ్రాహ్మణుడు పుష్టిగా ఉంటాడు. అటువంటి విప్రుని రూపంలో ఉంటుంది పరమేశ్వరి. బ్రహ్మవైవర్తపురాణంలో

**అవిద్యోవా సవిద్యోవా బ్రాహ్మణో మామకీ తనుః**

విద్వాంసుడైనా, విద్యావిహీనుడైనా బ్రాహ్మణుడు నా స్వరూపము అని పరమేశ్వరి చెప్పింది. అందుచేతనే ఆమె విప్రప్రియా అనబడుతోంది.

## 887. విశ్వభ్రమణకారిణీ

సమస్త బ్రహ్మాండముల యొక్క సృష్టి స్థితి లయాలను చేసేది. కాలచక్రం తిరగటానికి పరమేశ్వరియే కారణము.

విశ్వము అంటే విష్ణువు. అతడికి భ్రమణము కలుగచేయునది. కాలికాపురాణంలో ఒకసారి శ్రీమహావిష్ణువు గరుడునిమీద ఎక్కి ఆకాశమార్గంలో వెడుతూ కామరూప దేశంలో ఉన్న కామాఖ్యాదేవికి నమస్కరించలేదు. దానికి కోపించినదేవి విష్ణువును సముద్రంలోకి త్రోసివేసింది. కొంతకాలం తరువాత లక్ష్మీదేవి విష్ణుమూర్తి కనపడక వెతుకుతూ కామరూపం వచ్చి కామాఖ్యాదేవిని ప్రసన్నం చేసుకుని విష్ణువును రక్షించుకున్నది. ఆ తరువాత విష్ణువు పరమేశ్వరిని పూజించి వైకుంఠం చేరాడు. అని చెప్పబడింది.

ఈ రకంగా విష్ణువుయొక్క భ్రమణానికి కారణమైనది కాబట్టి విశ్వభ్రమణకారిణి అనబడింది.

సమస్త లోకాలకు తిరిగే శక్తి ఇస్తుంది కాబట్టి విశ్వభ్రమణకారిణీ అనబడింది.

ఈ రకంగా నిత్యనైమిత్తిక కర్మల ప్రాధాన్యత వివరించబడింది.

# 50. సన్యాసులజ్ఞానవిషయము

బ్రాహ్మణుడికి నాలుగు ఆశ్రమాలు చెప్పబడ్డాయి. అవి.

1. బ్రహ్మచర్యము 2. గృహస్థాశ్రమము 3. వానప్రస్థము 4. సన్యాసము

మిగిలిన వర్ణాలవారికి సన్యాసం లేదు. మిగిలిన మూడు ఆశ్రమాలే ఉంటాయి. అందుచేతనే భారతంలో ధృతరాష్ట్రుడు కుంతి, గాంధారి మొదలగు వారితో కలిసి చివరిదశలో వానప్రస్థానికి వెళ్ళి, అక్కడ దావాగ్నిలో దగ్ధమైపోతాడు.

సన్యాసాశ్రమం స్వీకరించటమంటే, కేవలము కాషాయం కట్టటం కాదు. ముందుగా భార్య అనుమతి తీసుకుని, తనకున్న యావదాస్తిని ప్రజలకు దానం చెయ్యాలి. ఆ తరువాత శిరోముండనం, కౌపీనధారణ, కాషయవస్త్రం, దండకమండలాలు, భిక్షాటన. ఇది చేయవలసిన విధానం. మొట్టమొదటి భిక్ష భార్యదగ్గరే స్వీకరించాలి.

సన్యాసికి ఐహికబంధనాలు ఉండరాదు. కేవలము భగవన్నామస్మరణలోనే కాలం గడపాలి. మనోవాక్కాయకర్మలతో నిరంతరము భగవంతుణ్ణే ధ్యానం చెయ్యాలి. అది కూడా ఓంకారోపాసన మాత్రమే చెయ్యాలి. అది మోక్షానికి మార్గం.

కర్మలు చేస్తే ఏరకమైన ఫలితం వస్తుందో కర్మ చెయ్యకపోయినా అదే ఫలితం వస్తుంది. అనే స్థితికి అతడు చేరాలి. సన్యాసి భిక్షాటన కూడా చెయ్యరాదు. తనని తాను పోషించుకోవాలి అని చెబుతోంది ఈశావాస్యోపనిషత్తు.

సన్యాసి సాకారాన్ని అర్చించరాదు. నిరాకారాన్నే ధ్యానించాలి. పరమేశ్వరి పరబ్రహ్మ స్వరూపం. మహాప్రళయకాలంలో ఈ జగత్తునంతటినీ తన ఉదరంలో దాచేసుకుంటుంది. అంటే ఇందులో ఉన్న జీవరాశినంతటినీ బక్షించేస్తుంది. జగత్తులోని జీవజాలమంతా ఆమె ఆహారమే.

ఆమె స్థితికారకుడైన విష్ణువు స్వరూపం. ఆమెకు, శ్రీమహావిష్ణువుకూ భేదంలేదు. ఆ దేవికి జననమరణాలు లేవు. అన్ని కారణాలకు ఆమె స్థానము. తన భక్తులకు కోర్కెలు తీర్చి, ఐహికసుఖాలనిచ్చి వారిని అజ్ఞానాంధకారంలో ఉంచి, సంసారసాగరంలో ముంచివేస్తుంది. యోగి ఆధారచక్రంలోని కుండలినీశక్తిని మేల్కొల్పితే, అది సుషుమ్నగుండా ప్రయాణించి సహస్రారం చేరుతుంది.

ఆ పరమేశ్వరికి ఉపాసకులయందు ప్రీతి ఎక్కువ. కర్మ వాసనలేనటువంటిది. కర్మ అనేది శరీరానికేగాని ఆత్మకు కాదు. పరమేశ్వరి ఆత్మస్వరూపిణి. ఆమెను సన్యాసి నాదరూపంలోనే ఉపాసించాలి. అంతేకాని సన్యాసి కామ్యమంత్రాలను ఉపాసించరాదు. అలా నాదోపాసనచేసినట్లైతే బ్రహ్మ సాక్షాత్కారం కలుగుతుంది. అదే ఆత్మ సాక్షాత్కారం ఆమె శ్రీచక్రంలో బిందువునందుంటుంది.

అలాగే మానవదేహంలో సహస్రారంలో ఉంటుంది. అన్ని తత్త్వాలకు అతీతమైనది. ఆమెను ఉపాసించినట్లైతే ఆత్మ సాక్షాత్కారం కలిగి జీవాత్మ పరమాత్మ ఒకటే అనే భావం కలుగుతుంది. అదే బ్రహ్మత్వసిద్ధి. తద్వారా సన్యాసికి ముక్తి కలుగుతుంది.

ఈ విషయం 888 నుంచి 906 వరకు నామాలలో వివరించటం జరిగింది.

## 888. విశ్వగ్రాసా

చరాచరజగత్తును మ్రింగివేసేది. అనగా చరములను, అచరములను సంహరించునది. కారకములలో

**యస్య బ్రహ్మ చ క్షత్రం చోభే భవతి ఓదనః**
**మృత్యు ర్యస్యోప సేచనం క ఇత్థా వేద యత్ర సః**

ఆ పురుషునకు బ్రహ్మ క్షత్రియులు ఆహారము. మృత్యువు అతడికి నంచుకునే పదార్థము. దీనిని ఎవరు తెలుసుకోగలుగుతారు ?

చరాచరజగత్తునంతా ప్రళయకాలంలో గ్రహించునది. కాబట్టి పరమేశ్వరి విశ్వగ్రాసా అనబడుతున్నది. సృష్టిలో ఒక జీవిని ఇంకొక జీవి ఆహారంగా తీసుకుంటుంది. ఇది సాధారణన్యాయము. గడ్డి, ధాన్యాలు. వీటిని పశువులు, పక్షులు ఆహారంగా తీసుకుంటాయి. ఈ పశుపక్షులు మృగాలకు ఆహారం. మృగాలు మానవుడికి ఆహారం. ఈ రకంగా ఒక దానికి ఒకటి ఆహారము. అయితే ప్రళయకాలంలో సర్వజగత్తునూ పరమేశ్వరుడు మ్రింగి వేస్తాడు. అంటే ఈ జగత్తంతా అతడికి ఆహారం. అందుకే పరమేశ్వరి విశ్వగ్రాసా అనబడుతోంది.

## 889. విద్రుమాభా

పగడమువలె ఎర్రని కాంతి గలది. పగడము సింహళప్రాంతంలోను, దక్షిణభారతం లోనూ సముద్రతీరంలో దొరుకుతుంది. ఇందులో కూడా జాతి పగడాలు మంకెన్న పువ్వులాగా పాటలవర్ణంలో ఉంటాయి. పరమేశ్వరి శరీరకాంతి మంచిజాతిగల పగడపుకాంతివలె ప్రకాశిస్తుంది. అందుచేతనే ఆమె విద్రుమాభా అనబడుతుంది.

జ్ఞానవృక్షముతో సమానమైనది.

## 890. వైష్ణవీ

**విష్ణోరియం వైష్ణవీ**

విష్ణుమూర్తి యొక్క శక్తి వైష్ణవి. దేవీపురాణంలో

**శంఖ చక్రగదాన్ ధత్తే విష్ణుమాతా తథాఽరిహా**

**విష్ణురూపాఽథవా దేవీ వైష్ణవీ తేన గీయతే**

1. శంఖము, చక్రము, గద ధరించినది.
2. విష్ణువునకు తల్లి.
3. శత్రువులను చంపునది.
4. విష్ణురూపము గలది.

ఈమె వైష్ణవీ అనబడుతున్నది. పరమేశ్వరి విష్ణువు యొక్క శక్తి. లక్ష్మీ స్వరూపురాలు. స్థితికారిణి. సర్వవ్యాపి. శంఖచక్రములు ధరించిన గరుడవాహనమైనది. కాబట్టి వైష్ణవీ అనబడుతోంది. సప్తశతిలో

**శంఖ చక్ర గదా శార్గ&జ గృహీత పరమాయుధే**

**ప్రసీద వైష్ణవీరూపే నారాయణి ! నమోఽస్తు తే ॥**

వైష్ణవీరూపం ధరించి శంఖము, చక్రము, గద, ధనుస్సు ఆయుధములు గలగిన ఓ నారాయణీ నీకు ప్రణామములు.

## 891. విష్ణురూపిణీ

శ్రీ మహావిష్ణువుతో వేరుగాని రూపము గలది. సృష్టికి పూర్వం పరమేశ్వరి ఈ జగత్తును సృష్టించటం కోసం అతని అంశతో బ్రహ్మ విష్ణు రుద్రులను సృష్టించింది అని చెప్పబడింది. అలాగే తన అంశలే అయిన మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతులను సృష్టించి వారికి సహాయకులుగా ఉంటారని చెప్పింది. కాబట్టి శ్రీమహావిష్ణువు అంటే పరమేశ్వరి అంతేకాని వేరుకాదు.

బ్రహ్మాండపురాణంలో 'నా రూపమే గోపికా స్త్రీలను మోహింపచేయునది' అని చెప్పటంచేత పరమేశ్వరియే విష్ణురూపిణి అనబడుతుంది.

**ఆద్యా శక్తిర్మహేశస్య చతుర్ధా భిన్న విగ్రహా**
**భోగే భవానీరూపా సా దుర్గారూపా చ సంగరే**
**కోపేచ కాళికారూపా పుంరూపాచ మదాత్మికే**

ఆ పరమేశ్వరుని శక్తినాలుగురూపాలుగా ఉంటుంది.

1. భోగరూపంలో – భవాని
2. యుద్ధరంగంలో – దుర్గ
3. కోపమున – కాళి
4. పురుషరూపంలో – విష్ణువు

అని బ్రహ్మాండపురాణంలో విష్ణుమూర్తి చెబుతాడు. కాబట్టి పరమేశ్వరి విష్ణురూపిణి అని చెప్పబడింది. ఆమె విష్ణురూపిణి కాబట్టి భక్తులు ఆమెను సేవించి విష్ణుసాన్నిధ్యం పొందుతారు.

కూర్మపురాణంలో హిమవంతుడు పరమేశ్వరిని

**సహస్ర మూర్ధాన మనంత శక్తిం సహస్ర బాహుం పురుషం పురాణం**
**శయానమబ్ధౌ లలితే తవైవ నారాయణాఖ్యం ప్రణతోఽస్మిరూపం ॥**

వేయితలలు గల దానిని, గొప్పశక్తి గల దానిని, వేయి చేతులు గల దానిని, సాగరమందు శయనించు దానిని ఓ దేవీ ! నీదైన నారాయణరూపమునకు నమస్కరించు చున్నాను. అంటూ స్తుతిస్తాడు.

కూర్మపురాణంలో శివుడు మంకణుడు అనే వాడికి విశ్వరూపం చూపుతాడు. అది చూచిన అతడు ఆ రూపాన్ని వర్ణించి నీ పార్శ్వమందున్నది ఎవరు ? అంటాడు. అప్పుడు శివుడు

**మమ సా పరమా మాయా ప్రకృతి స్త్రిగుణాత్మికా**
**యోచ్యతే మునిభి శ్శక్తి ర్జగద్యోని స్సనాతనీ**
**స ఏవ మాయయా విశ్వం వ్యామోహయతి విశ్వజిత్**

ఆమెయే పరమైన మాయాశక్తి. మునులు ఆ శక్తినే త్రిగుణాత్మకమైన ప్రకృతి అంటున్నారు. ఆమెయే ఈ విశ్వానికి ప్రాచీనమైన యోని. (మూలకారణము) ఆమె మాయతో విశ్వాన్ని మోహింపచేస్తున్నది. అతడు విశ్వాన్ని తెలుసుకుంటున్నాడు. నారాయణుడే మాయారూపుడు అని వేదాలు చెబుతున్నాయి అంటాడు.

కాబట్టి నారాయణుడే పరమశక్తి. పరమేశ్వరియే విష్ణురూపిణి. అందుచేతనే ఆమె విష్ణురూపిణీ అనబడింది.

## 892. అయోనిః

కారణములేనిది. యోని అనేది ఒకస్థానం. జన్మస్థానం. అయోనిః – స్థానములేనిది. జన్మస్థానములేనిది పరమేశ్వరి.

ప్రతిపదార్థానికి జన్మ ఉంటుంది. ఆ జన్మస్థానమే యోని. జగత్తులో చెట్లుచేమలు మొదలైన వాటన్నింటికీ జన్మస్థానం పృథివి. అందుచేతనే **పృథివీయోనిః** అని చెప్పబడింది. అయితే పరమేశ్వరి సకలభూతాలకు, జగస్సృష్టికీ కారణమైనది. కాబట్టి ఆమె జగద్యోని.

పరమేశ్వరికి జననమరణాలు లేవు. జననమే లేని దేవికి ఇంక జనస్థానం ఎక్కడ ఉంటుంది ? అందుకే ఆమె అయోనిః అని చెప్పబడుతోంది. జన్మమనేది కనిపించే ఈ జగత్తుకేగాని కనిపించని పరమేశ్వరికి కాదు. అందుచేత ఆమెకు జన్మస్థానం లేదు.

## 893. యోనినిలయా

యోని అంటే – త్రికోణము. శ్రీచక్రంలో ఎనిమిదవ ఆవరణ సర్వసిద్ధిప్రదచక్రము. ఈ చక్రం మధ్యన బిందురూపంలో పరమేశ్వరునితో కలిసి ఉంటుంది. అందుచేత ఆమె యోనినిలయా అనబడుతోంది.

**త్రికోణరూపిణీ శక్తిః బిందురూప పరశ్శివః**

బిందురూపుడైన పరబ్రహ్మ నుంచి కొంతశక్తి బయటకు వచ్చింది. అదిశక్తి కాబట్టి త్రికోణరూపంలో ఉన్నది. దాని నుంచే ఈ జగత్తంతా ఆవిర్భవించింది. బిందురూపంలో ఉన్న శివుడు కూడా ఆ త్రికోణంలోనే ఉన్నాడు. శివశక్తులు ఎప్పుడూ కలిసే ఉంటారు.

యోని అంటే – కారణము. పరమేశ్వరి సమస్త జగత్తుకూ కారణము. అన్ని లోకాలు ప్రళయకాలంలో పరమేశ్వరిలోనే లీనమవుతున్నాయి. అందుచేత ఆమె యోనినిలయా అనబడుతోంది.

## 894. కూటస్థా

అజ్ఞానానికి అధ్యక్షురాలు. అజ్ఞానమునకు స్థానమైనది. మానవులను మోహంలో పడేసి సంసారసాగరంలో ముంచివేస్తుంది. పరమేశ్వరి విషస్వరూపిణి. భక్తుల యొక్క

కోరికలు వెంటనే తీర్చేస్తుంది. సామాన్యంగా భక్తులు ఐహికవాంఛలనే కోరతారు. ధనధాన్యాలు, పుత్రపౌత్రాదులు, సిరిసంపదలు, భోగభాగ్యాలు. ఇవన్నీ భక్తులకిస్తుంది. వీటివల్ల వారు సంసారలంపటంలో ఇంకా కూరుకుపోతారు.

కూటత్రయమునందుటుంది. 1. వాగ్భవ 2. కామరాజ 3. శక్తికూటాలు. వీటియందు ఉండునది పరమేశ్వరి.

కూటము అంటే యంత్రము. శ్రీచక్రమనే యంత్రరాజంలో ఉంటుంది. కాబట్టి ఆమె కూటస్థా అనబడుతోంది.

మేరు పర్వతంలోని మధ్యకూటమినందుంటుంది. కాబట్టి కూటస్థా అనబడుతోంది.

అన్ని జీవుల యొక్క హృదయాలలో ఉంటూ కూడా, అవి చేసే కర్మలతో ఏ రకమైన సంబంధములేనిది కావటంచేత కూటస్థా అనబడుతోంది.

## 895. కులరూపిణీ

కులము అంటే–కౌళమార్గము. ఇది బాహ్యాపూజ. వంశాచారాన్ని బట్టి ఇది వస్తుంది.

కులము అంటే – వంశము. ఇది రెండురకాలు.

తండ్రి, తాత, ముత్తాతల నుంచి వచ్చేది. దీనిని జననవంశము అంటారు. రెండవది గురువు, పరమగురువు, పరమేష్ఠి గురువు. వీరి ద్వారా గురు సంప్రదాయంగా వచ్చేది. ఈ రెండురకాల వంశాలు పరమేశ్వరిరూపమే కాబట్టి ఆమె కులరూపిణీ అనబడుతోంది.

ఆధారచక్రం నుంచి సహస్రారం దాకా సుషుమ్నానాడి ఉన్నది. ఆ మార్గంకుండానే కుండలినీశక్తి ప్రయాణం చేస్తుంది. ఈ మార్గాన్నే కులమార్గము అంటారు. ఈ మార్గంలో చరించే ముఖ్యప్రాణస్వరూపిణి కాబట్టి కులరూపిణీ అనబడుతుంది.

## 896. వీరగోష్ఠీప్రియా

వీరుల యొక్క సభలయందు ప్రీతిగలది. వీరగాథలయందు ప్రీతి గలది. తాను దైత్యసంహారం చేసినప్పుడు అంటే, మహిషాసురుడు, భండాసురుడు, శుంభనిశుంభులు ఇత్యాది రాక్షససంహారగాథలయందు ప్రీతి గలది.

వీరులు అంటే ఉపాసక శ్రేష్ఠులు. శ్రీవిద్యా విశారదులు. భక్తితత్పరులు. అరిషడ్వర్గాన్ని జయించినవారు. సర్వకాలసర్వావస్థలయందు పరమేశ్వరి ధ్యానంతోనే కాలం గడిపేవారు. అటువంటివారు చేసే వేదాంతగోష్ఠులయందు ప్రీతిగలది.

## 897. వీరా

మహిషాసుర, భండాసురాది రాక్షసులను సంహరించినది. కాబట్టి పరమేశ్వరి వీరా అనబడుతోంది. ప్రపంచంలో దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తుంది. కాబట్టి వీరా అనబడుతుంది. వీరులైన శ్రీవిద్యోపాసకులరూపంలో ఉంటుంది. కాబట్టి వీరా అనబడుతుంది.

ధర్మపరులయందు, వీరులయందు పరమేశ్వరి ఉంటుంది. కాబట్టి ఆమె వీరా అనబడుతుంది.

## 898. నైష్కర్మ్యా

కర్మలు లేనటువంటిది. వదలబడిన కర్మలు గలది. పరమేశ్వరికి ఏ రకమైన కర్మలుగాని వాటివల్ల వచ్చే ఫలితాలుగాని లేవు.

అసలు కర్మ అంటే – క్రియాచరణ, పని. క్రియలన్నీ దేహానికేగాని ఆత్మకు కాదు. పరమేశ్వరి ఆత్మ స్వరూపిణి. కాబట్టి ఆమెకు కర్మలు ఉండవు. అందుచేతనే నైష్కర్మ్యా అనబడుతోంది. కర్మలనేవి పుణ్యపాపాల సముదాయము. పుణ్యపాపాలతో దేవికి సంబంధంలేదు. కాబట్టి ఆమె నైష్కర్మ్యా అనబడుతోంది.

## 899. నాదరూపిణీ

ప్రణవము యొక్క శిరస్సు పైనున్నదియే నాదము. ఆనందరూపమైన పరమేశ్వరి నాదరూపమున అనాహతచక్రంలో ఉన్నది. అంతర్ముఖులైన వారు దాన్ని దర్శించ గలుగుతారు అని జ్ఞానులు చెబుతున్నారు. నాదము అనేది రోదినికి పైభాగాన ఉన్నది.

**ఇందౌ తదర్థం రోదిన్యాం నాదో నాదాంత ఏవ చ**

బిందువు, అర్ధచంద్రము, రోదిని, ఆ తరువాత నాదము ఉన్నాయి. ఆ నాదరూపిణి అయిన పరమేశ్వరిని ధ్యానిస్తున్నాను అని స్వచ్ఛంద్రతంత్రంలో చెప్పబడింది.

అక్షరాలు పుట్టకముందు ఉండే స్థితి నాదము. ఆ నాదమే రూపాంతరం చెంది వర్ణాలుగా పరిణమిస్తుంది. వేదాలన్నీ నాదరూపమే. వేదమాత పరమేశ్వరి. కాబట్టి ఆమె నాదరూపిణీ అనబడుతుంది.

అవ్యక్తమైన పరమేశ్వరి శక్తిని లోకంలో వ్యక్తపరిచేది నాదమే. ఈ నాదము జగత్తునంతా ఆవరించి ఉన్నది. ఏ విషయాన్ని గ్రహించటానికైనా నాదమే ఆధారము. ఆ నాదము పరమేశ్వరి రూపము.

అందుచేత పరమేశ్వరి నాదరూపిణీ అవుతున్నది.

## 900. విజ్ఞానకలనా

విజ్ఞానము అంటే పరబ్రహ్మ సాక్షాత్కారము. కలనా అంటే – ఆత్మ సాక్షాత్కారము.

ఆ పరమేశ్వరి బ్రహ్మజ్ఞానమే స్వరూపంగా గలది. జ్ఞానాన్ని బోధించే ఉపనిషత్తులు వేదాలలో భాగాలు. ఆ వేదాలు బ్రహ్మ చెప్పినవే. అందుచేతనే పరమేశ్వరి విజ్ఞానకలనా అనబడుతోంది.

ఆత్మానందాన్నిచ్చే బ్రహ్మజ్ఞానమే విజ్ఞానము. ఇటువంటి విజ్ఞాన స్వరూపిణి కాబట్టే ఆ దేవి విజ్ఞానకలనా అనబడుతోంది.

## 901. కల్యా

కళలను సృష్టించుటయందు నేర్పరి. పరమేశ్వరి సర్వకళలకు నిధి. ఆనందకలా స్వరూపిణి. కాబట్టి కల్యా అనబడుతున్నది. సకల శుభములు మూర్తీభవించినది.కాబట్టి కల్యా అనబడుతోంది.

## 902. విదగ్ధా

**విదగ్ధా చాతుర్యశీలా**

చాతుర్య స్వభావం గలది. నైపుణ్యం గలది.

పరమేశ్వరి అత్యంత చతురమైన స్వభావముగలది. సంభాషణలో చాతుర్యము గలది. సృష్టిస్థితిలయాలలో నేర్పరితనము గలది. కార్యనిర్వహణలో నైపుణ్యము గలది. అందుచేత ఆమె విదగ్ధా అనబడుతోంది.

## 903. బైందవాసనా

కనుబొమ్మల మీద వృత్తాకారంలో ఉండేది బైందవము, అది ఆసనముగా గలది. స్వచ్ఛందతంత్రంలో

**హాకినీ మండలా దూర్ధ్వం బిందురూపంతు వర్తులమ్**

హాకినీ మండలానికి పైభాగాన బిందువు వర్తులాకారమైనది అని చెప్పబడింది. అక్కడ శివుడుంటాడు. అతడికి

**వామభాగే సమాసీనా శాంత్యతీతా మనోన్మనీ**

ఎడమవైపున ఆసీనురాలై శాంత్యతీత, మనోన్మని ఉంటుంది. అదే సర్వానంద మయమైన బిందుచక్రము.

బిందువుల సమూహమే బైందవము. అది ఆసనముగా గలది. బిందువుతో కూడిన హకారముబ్రహ్మ. సకారము బిందువు విసర్గతో కూడినది హరి. ఈ రకంగా లోకంలో హరిహరులకు భేదం లేదు అని జ్ఞానార్ణవతంత్రమందు చెప్పబడింది.

వామాదిత్రయము, ఇచ్ఛాదిత్రయము, జాగ్రదాదిత్రయము. ఇదంతా బిందురూపమే. అటువంటి బిందుత్రయంతో కూడినదే త్రిపుర.

శ్రీచక్రానికి కారణం బిందువు. ఆ బిందువును ఆసనంగా గలది. కాబట్టి బైందవాసనా మానవశరీరంలో సహస్రారమందు పరమేశ్వరి ఉంటుంది. అదే బిందుస్థానము. అందుచేతనే దేవి బైందవాసనా అనబడుతోంది.

జ్ఞానార్ణవతంత్రంలో

**బిందువ్యూహం ప్రవక్ష్యామి బీజరూపం వరాననే !**
**హ కారం బిందురూపేణ బ్రహ్మాణం విద్ధి పార్వతి !**
**స కారం బిందుసర్గాభ్యాం హరిశ్చాహం సురేశ్వరి !**
**అవినాభావ సంబంధో లోకే హరిహరావితి ॥**

ఓ శ్రేష్ఠురాలా ! పార్వతీ ! బీజరూపమైనటువంటి బిందువ్యూహాన్ని గురించి చెబుతాను వినవలసినది.

బిందువుతో కూడిన హకారము - బ్రహ్మ
విసర్గతో కూడిన సకారము - నేను (శివుడు) హరి.

లోకమందు హరిహరులు అవినాభావ సంబంధులు. ఈ రకంగా మూడు బిందువుల కలయికయే త్రిపుర అని చెప్పబడింది. ఆ బిందువు పైన ఉండే త్రిపురవాసినియే బైందవాసనా అనబడుతుంది.

**బ్రహ్మరంధ్రే మహాస్థానే వర్తతే సతతం శివా ।**
**చిచ్ఛక్తిః పరమాదేవీ మధ్యమే సుప్రతిష్ఠితా ॥**

బ్రహ్మరంధ్రంలో పరమేశ్వరుడు ఉంటాడు. చిచ్ఛక్తి అయినటువంటి పరమేశ్వరి కూడా ఆ బ్రహ్మ రంధ్రమందే ఉంటుంది. అదే బిందువు.

బిందువునందు ఉంటుంది కాబట్టే ఆమె బైందవాసనా అనబడుతోంది.

## 904. తత్త్వాధికా

తత్త్వాలు అనేకరకాలు 36 అనీ, 51 అనీ, 96 అనీ రకరకాల వాదనలు ఉన్నాయి. ఇవన్నీ కాదని 24 తత్త్వాలనే చెప్పారు శంకరభగవత్పాదులు. ఈ తత్త్వాలు జగత్తంతా వ్యాపించి ఉన్నాయి. ఈ తత్త్వముల వల్లనే జగత్తు సృష్టించబడింది. ఈ తత్త్వాలన్నీ నాశనమయిపోతాయి. మిగిలేది ఒక్కటే అదే పరమేశ్వరతత్త్వం ఈ తత్త్వాలన్నింటికీ అతీతమైంది. అదే ఈ జగత్తును సృష్టిస్తున్నది. పంచకృత్యాలు చేస్తున్నది. అదే పరమేశ్వరి తత్త్వము. అందుచేతనే ఆమె తత్త్వాధికా అనబడుతోంది.

## 905. తత్త్వమయీ

తత్త్వవిస్తారము గలది. పరమేశ్వరి ఆత్మస్వరూపిణి. అంటే పరబ్రహ్మస్వరూపిణి. అందుచేత మిగిలిన విద్యాతత్త్వము, విష్ణుతత్త్వము, రుద్రతత్త్వము, బ్రహ్మతత్త్వము, మహేశ్వరతత్త్వము, సదాశివతత్త్వము. వీటన్నింటి కన్న అధికమైనది. అదే పరబ్రహ్మతత్త్వము. బ్రహ్మజ్ఞానమే స్వరూపంగా గలది.

## 906. తత్త్వమర్థస్వరూపిణీ

మహావాక్యాలలో ఉండే తత్ – అదిత్వం – నీవు. ఈ పదాలకు జీవాత్మ పరమాత్మలు. తత్ – శివుడు. త్వం – జీవుడు. ఈ రెండింటి స్వరూపమే పరమేశ్వరి. అఖండసచ్చిదానంద పరబ్రహ్మస్వరూపమే పరమేశ్వరి. జీవాత్మ పరమాత్మ రెండూ వేరుకాదు. రెండూ ఒకటే. అనే విషయాన్ని తెలియచేస్తుంది. కాబట్టి పరమేశ్వరి తత్త్వమర్థస్వరూపిణీ అనబడింది.

ఈ రకంగా సన్యాసులకు జ్ఞానవిషయం బోధించబడింది.



# 51. అగ్నిష్టోమాది సంకేతము

దూరంగా ఆకాశంలో ప్రకాశిస్తూ కాంతినిచ్చేవాడు సూర్యుడు. అతడు అమృత మయుడు. అతని కాంతివల్లనే లోకాలన్నీ ప్రవర్తిల్లుతున్నాయి. సూర్యుని యొక్క వేడివల్లనే సముద్రంలోని నీరు ఆవిరై మేఘాలుగా మారుతున్నది. ఆ మేఘాలు తిరిగి వర్షిస్తున్నాయి. ఆ వర్షాలవల్ల వాగులు, వంకలు, ఏరులు, నదులు పొంగి ప్రవహిస్తున్నాయి. వాటివల్లనే సాగునీరు లభ్యమవుతున్నది. పంటలు పండుతున్నాయి. జీవికి ఆహారం లభిస్తోంది. కాబట్టి మనకు ప్రత్యక్షదైవం సూర్యభగవానుడే అందుచేత అతణ్ణి అర్చించాలి. అయితే సూర్యభగవానుడు ఆకాశంలో ఉంటాడు. అతన్ని అర్చించటం చాలా కష్టం. భూలోకంలో సూర్యుడికి ప్రతీక అగ్ని. కాబట్టి అగ్నిని గనక ఆరాధించినట్లైతే సూర్యుని ఆరాధించినట్లే అని చెబుతోంది వేదం. శ్రీచక్రం అగ్నిష్టోమాత్మకము. జగత్తు అగ్నిష్టోమమయము. రుద్రయామళంలో ఈ విషయాలు చెప్పబడ్డాయి.

**అగ్నిష్టోమాత్మకం చక్రం అగ్నిష్టోమమయం జగత్**
**అగ్నావంతర్భాభానుః అగ్నిష్టోమమయం స్మృతమ్**

శ్రీచక్రము అగ్నిష్టోమాత్మకమై ఉన్నది. జగత్తు అంతా అగ్నిష్టోమమయమే. జగత్తే శ్రీచక్రం కాబట్టి శ్రీచక్రము అగ్నిష్టోమాత్మకము. అగ్ని యొక్క అంతర్భాగంలో భానుడు ప్రకాశిస్తున్నాడు. కాబట్టి జగత్తు అగ్నిష్టోమమయంగా చెప్పబడుతున్నది.

**త్రిఖండం మాతృకాచక్రం సోమసూర్యానలాత్మకం**
**త్రికోణం బైందవం సౌమ్య మష్టకోణం చ మిశ్రకమ్**
**చక్రం చంద్రమయం చైవ దశారద్వితయం తథా**
**చతుర్దశారం వహ్నేస్తు చతుశ్చక్రం చ భానుమత్**

మాతృకాచక్రమైన శ్రీచక్రము సోమసూర్య అనలాత్మకమై మూడు ఖండాలుగా ఉన్నది. అందులో

| | | |
|---|---|---|
| బిందువు, త్రికోణము, అష్టకోణము | – | చంద్రఖండము |
| దశారద్వయము, చతుర్దశారము | – | అగ్నిమయము |
| మిగిలినవి | – | భానుమయము |

**ఏ తత్ప్రసాదా దింద్రాద్యా వసవోఽ ష్టోమరుద్గణాః ।**
**యేయే సమృద్ధాలోకేఽస్మిన్ త్రిపురాచక్రసేవకాః ॥**
**పురత్రయంచ చక్రస్య సోమసూర్యా నలాత్మకమ్ ।**
**మహాలక్ష్మ్యాః పురం చక్రం తత్రై వాస్తే సదాశివః ॥**

శ్రీచక్ర ప్రసాదంవల్లనే ఇంద్రాదిదేవతలు, అష్టవసువులు, మరుద్గణాలు వెలయు చున్నారు. లోకంలో సిరిసంపదలతో వెలయు వారందరూ శ్రీచక్రసేవకులే. శ్రీచక్రము యొక్క పురత్రయము సోమ సూర్య అనలాత్మకమై ఉన్నది. ఈ చక్రము మహాలక్ష్మీపురము. ఇందే సదాశివుడున్నాడు అని చెప్పబడింది.

మానవశరీరమే శ్రీచక్రం. అందుకే శరీరం కూడా మూడుభాగాలుగా ఉంటుంది.

| | | |
|---|---|---|
| ఆధారస్వాధిష్ఠానాలు | - | అగ్నిమండలం |
| మణిపూరఅనాహతాలు | - | సూర్యమండలం |
| విశుద్ధి ఆజ్ఞాచక్రాలు | - | చంద్రమండలం |
| సహస్రారం | - | చంద్రలోకం |

ఈ రకంగా శ్రీచక్రాన్ని భావించి అర్చన చేస్తే సిరిసంపదలు భోగభాగ్యాలు, ఉన్నతపదవులు లభిస్తాయి.

## 907. సామగానప్రియా

**సామగానం ప్రియం యస్యాః**

సామగానమునందు ప్రీతి గలది.

సామము సాధువైనది, ఉత్తమమైనది. శుభప్రదమైనది. సామోపాసన గురించి తెలుసుకున్నవాడు లోకంలో ఐదువిధాలయిన సామాలను ఆరోపించుకుని ఉపాసన చేస్తాడు.

| | | |
|---|---|---|
| సాధువైనది | - | సామము |
| అసాధువైనది | - | సామంకాదు |
| సామరూపము అంటే | - | ఉత్తమరూపము |
| అసామరూపము అంటే | - | అశుభరూపము |

సామం కలిగింది అంటే - శుభం కలిగింది.

అసామం కలిగింది అంటే - కీడు కలిగింది అని అర్థం.

అంటూ ఛాందోగ్యోపనిషత్తులోని రెండవ అధ్యాయంలో పంచవిధసామోపాసన, సప్తవిధసామోపాసన చెప్పబడింది.

సామవేదము అంతా సంగీతపరమైనదే. సామగానం చేసినట్లైతే దేవతలు సంతోషిస్తారు అని దేవీభాగవతంలోని సత్యవ్రతునికథలో చెప్పబడింది. అలాగే పరమేశ్వరి కూడా సామవేద పఠనమందు మిక్కిలి ప్రేమ గలిగినది. అందుచేతనే ఆమె సామగానప్రియా అనబడింది.

## 908. సోమ్యా

సోమయాగానికి తగినది సోమ్యా. పరమేశ్వరి చంద్రమండలంలో ఉంటుంది. యజ్ఞంలో సోమలతారూపంలో ఉంటుంది. అందుచేత సోమ్యా అనబడుతున్నది. సోమేశ్వరుడు అనే శివుని స్వరూపము గలది.

## 909. సదాశివకుటుంబినీ

సదాశివుడికి భార్య శ్యామల. శుద్ధవిద్య అశ్వారూఢ రూపము గలది. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు, సదాశివుడు. వీరు పంచబ్రహ్మలు. వీరిలో ఐదవవాడు సదాశివుడు. అటువంటి సదాశివునితో భేదము లేనటువంటిది. వేదంలో ఈ శక్తినే అదితి అని, ఇడా అని, సరస్వతి అని వివిధనామాలతో వివరించబడింది. రాజరాజేశ్వరి, శుద్ధవిద్యా, అశ్వారూఢా, శ్యామలా మొదలైన దేవతలంతా సదాశివకుటుంబానికి చెందినవారే కాబట్టి పరమేశ్వరి సదాశివకుటుంబినీ అనబడుతోంది.

## 910. సవ్యా పసవ్యమార్గస్థా

పరమేశ్వరి ఆరాధించే పద్ధతులలో రెండు మార్గాలు ప్రసిద్ధమైనవి. 1. సవ్యము. 2. అపసవ్యము. అవే సమయాచారము వామాచారము. వీటిలో మళ్ళీ అనేకరకాలున్నాయి. సమయాచారాన్నే దక్షిణాచారము అనే పేరుతో ప్రస్తుతం వ్యవహరిస్తున్నారు. ఇది వేదసమ్మతమైన శిష్టాచారము. రెండవది వామాచారము వేదబాహ్యమైనది. తాంత్రికమైనది.

క్షీరసాగరమధన కాలంలో దేవతలు ఆచరించినది సమయాచారము. రాక్షసులది వామాచారము. సాధకుని యొక్క మానసిక ప్రవృత్తిని బట్టి ఈ ఆచారాలు ఉపదేశించ

బడ్డాయి. దక్షిణాచార వామాచారాలు రెండూ పరమేశ్వరిని అర్చించటానికే ఏర్పడ్డాయి. ఈ అర్చనావిధానం కోసం 64 తంత్రాలు ఉన్నాయి. ఈ రెండుమార్గాలలోనూ పరమేశ్వరి సేవించబడుతుంది. కాబట్టి 'సవ్యాపసవ్యమార్గస్థా' అనబడుతుంది.

శ్రీచక్రార్చన చేసేటప్పుడు కొన్ని ఆవరణలలో దేవతలను సవ్యంగాను, కొన్ని ఆవరణలలో అపసవ్యంగాను అర్చించటం జరుగుతుంది.

శ్రీచక్రంలోని ఆవరణలను ఏవిధంగా అర్చిస్తారో ఈ దిగువ ఇవ్వబడింది.

| | | | |
|---|---|---|---|
| 1. | భూపురం | – | ప్రాదక్షిణ్యేన సవ్యము |
| 2. | షోడశదళము | – | వామావర్తేన అపసవ్యము |
| 3. | అష్టదళము | – | ప్రాదక్షిణ్యేన సవ్యము |
| 4. | మన్వస్రము | – | వామావర్తేన అపసవ్యము |
| 5. | బహిర్దశారము | – | వామావర్తేన అపసవ్యము |
| 6. | అంతర్దశారము | – | వామావర్తేన అపసవ్యము |
| 7. | అష్టకోణము | – | వామావర్తేన అపసవ్యము |
| 8. | త్రికోణము | – | ప్రాదక్షిణ్యేన సవ్యము |

ఈ రకంగా భూపురము, అష్టదళము, త్రికోణములను సవ్యంగాను, షోడశదళము, మన్వస్రము, బహిర్దశారము, అంతర్దశారము, అష్టకోణములను అపసవ్యంగానూ అర్చిస్తారు. బిందువునందు శివశక్తులుంటారు. అక్కడ ఇంకే దేవతలు ఉండరు కాబట్టి సవ్యము, అపసవ్యము అనే ప్రసక్తిరాదు.

ఈ రకంగా కొన్ని ఆవరణలలో సవ్యంగాను, కొన్ని ఆవరణలలో అపసవ్యంగాను అర్చన జరుగుతుంది. కాబట్టి పరమేశ్వరి సవ్యాపసవ్యమార్గస్థా అనబడుతోంది.

ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉండే కుండలినీశక్తి ముఖ్యప్రాణ స్వరూపిణి. అది జాగృతమైనప్పుడు సుషుమ్నగుండా బయలుదేరి సహస్రారం దాకా చేరి అక్కడ నుండి మళ్ళీ మూలాధారానికి వస్తుంది. భావనోపనిషత్తులో

**మూలాధారాది బ్రహ్మబిలపర్యంతం, బ్రహ్మరంధ్రాది**

**మూలాధార పర్యంతం గతాగతరూపేణ ప్రాదక్షిణ్యమ్**

ఈ రకంగా ప్రాణవాయువు ఆధారచక్రం నుండి సహస్రారానికి, సహస్రారం నుంచి ఆధారచక్రానికి సుషుమ్న గుండా తిరగటాన్నే అంతఃపూజలో ప్రదక్షిణ అంటారు.

ఈ విధంగా సవ్యంగాను అపసవ్యంగాను తిరుగుతుంది. కాబట్టి సవ్యాపసవ్యమార్గస్థా అనబడుతోంది పరమేశ్వరి.

## 911. సర్వాపద్వినివారిణీ

ఈ విధంగా సవ్య, అపసవ్య మార్గాలలో పరమేశ్వరిని ఆరాధించే వారికి ఏ రకమైన ఆపదలు రాకుండా చూస్తుంది ఆ పరమేశ్వరి. గీతాచార్యుడు చెప్పినట్లుగా

**అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్ ॥**

ఏ విధమైన సందేహాలు లేకుండా మనోవాక్కాయ కర్మలచే పరమేశ్వరిని ఉపాసించేవారి బాధలను తొలగించి వారి రక్షణభారము పరమేశ్వరుడు స్వయంగా తనే స్వీకరిస్తాడు.

కూర్మపురాణంలో “సంగరహితులై నన్ను శరణుపొందేవారు, సర్వభూతములందు దయగలవారు, శాంతులు, వేదాంతులు, బుద్ధిమంతులు, తాపసుల, కష్టాలు అనతికాలంలోనే లీనమయిపోతాయి. పై లక్షణాలు లేకపోయినా నిత్యము నా నామజపం చేసేవారు, నన్నే ధ్యానించేవారి ఆపదలు కూడా త్వరగా వదలిపోతాయి.

దేవిని స్మరించేవారి అన్ని ఆపదలను పరమేశ్వరి తొలగిస్తుంది. అందుచేతనే ఆమె సర్వాపద్వినివారిణీ అనబడుతుంది. వరాహపురాణంలో బ్రహ్మాదులు దేవిని ప్రార్థిస్తూ

**శరణం త్వాం ప్రపద్యంతే యే దేవీం పరమేశ్వరీం ।**
**న తేషా మాపదః కాశ్చిజ్జాయంతే క్వాపి సంకటే ॥**

పరమేశ్వరీ ! నిన్ను శరణు పొందితే వారికి కొంచెమైన ఆపదలు కలగవు. ఇందులో సందేహంలేదు అంటారు.

దేవిని స్మరించేవారి ఆపదలన్నింటినీ ఆ పరమేశ్వరియే తొలగిస్తుంది. కాబట్టి ఆమె సర్వాపద్వినివారిణీ అనబడుతుంది.

ఈ విధంగా అగ్నిష్టోమాది సంకేతం వివరించబడింది.

# 52. జపయజ్ఞము

**మననాత్ త్రాయత ఇతి మంత్రః**

మననము చేయుట వలన మననము చేయువారిని రక్షించునది మంత్రము.

ఏదైనా ఒక అక్షరం గాని, కొన్ని అక్షరాల సముదాయాన్ని గాని మంత్రము అంటారు. బీజాక్షరాలతో మంత్రాలు సంపుటం చెయ్యబడతాయి అని చెప్పబడింది. అసలు బీజాక్షరాలు అంటే ? భాషకు ఉన్నవి 50 అక్షరాలు. ఇవన్నీ బీజాక్షరాలే. ఇవే సంయుక్తాక్షరాలు, ద్విత్వాలు అని చెప్పబడుతుంటాయి. కాబట్టి బీజములు అంటే భాషకు ఉన్న అక్షరాలే అవే మాతృకలు. ఏవైనాసరే కొన్ని అక్షరాలను కలిపి అదే పనిగా మననంచేసినట్లైతే దానివల్ల ఫలితం వస్తుంది. 'రామ' అనేది కూడా మంత్రమే.

జపం అంటే – మంత్రావృత్తి. సామాన్యంగా జపం కామ్యం కోసమే చెయ్యటం జరుగుతుంది. కామ్యం కోసం చేసే ఏ పనికైనా నియమనిష్ఠలు ఉంటాయి. అలా నియమనిష్ఠలతో, ఏకాగ్రతతో చేసే మంత్ర ఆవృత్తినే జపం అంటారు. జపం చేసేటప్పుడు మనోవాక్కాయకర్మలతో, తాదాత్మ్యంచెంది చెయ్యాలి. అప్పుడే మంత్రం త్వరగా సిద్ధిస్తుంది. అంతేకాని ఏదో ఆలోచిస్తూ చేసిన జపంవల్ల కాలం వృధాతప్ప ఫలితం ఉండదు. అయితే జపం చేసేటప్పుడు దేన్ని జపమాలగా వాడాలి ? అనే దానిమీద భిన్నాభిప్రాయాలున్నాయి. అసలు జపమాలను వాడితే మాలతిరుగుతున్నదా ? లేదా ? అనేదానిమీదనే ధ్యాస ఉంటుంది. తప్ప మంత్రం మీద ధ్యాస ఉండదు. కాబట్టి మాలలేకుండా జపం చెయ్యటం శ్రేయస్కరం. తరువాత జపసంకల్పం ఎప్పుడూ ఇతరులమేలుని కోరేదిగానే ఉండాలి. అంతేకాని ఇతరులకు కీడుకలగాలని మాత్రం ఆశించకూడదు. ఇతరులవల్ల మనకి ఆపదవస్తుంది అనిపిస్తే నన్ను రక్షించమని భగవంతుణ్ణి వేడుకోవాలి. అంతేకాని అవతలి వ్యక్తిని శిక్షించమని అతడికి హాని కలిగించమని మాత్రం అడగకూడదు.

పరమేశ్వరి రాగద్వేషాలు ఏమాత్రమూలేనిది. మధురమైన స్వభావం గలది విదుషీమణి. 64 కళలు ఆమెయందున్నాయి. అన్నింటియందు ఆమె ప్రవీణురాలు. ఆమె ధీరులచే అంటే అద్వైతబుద్ధి గలవారిచే పూజించబడుతుంది. జపం చేసేటప్పుడు కామ్యం కోసం కాక మోక్షసాధన కోసం దేవిని ప్రార్థించటం ఉత్తమం. అందుకే ఆమె అర్చనలో చైతన్యమునే అర్ఘ్యంగా వాడాలి. జ్ఞానపుష్పాలంటే పరమేశ్వరికి చాలా ప్రీతి. ఆమె స్వయం ప్రకాశి. ఇతరుల సహాయం ఆమెకు అవసరంలేదు. ఆమె ఇతరులకు

సహాయం చేస్తుంది. ఎప్పుడూ సంతుష్టాంతరంగయై ఉంటుంది. సజ్జనుల హృదయాలలో ఉంటుంది.

అటువంటి పరమేశ్వరిని గనక మంత్రానుష్ఠానంతో అర్చినట్లైతే సాధకుడికి ఇహపరాలు అన్నీ సమకూరుతాయి.

## 912. స్వస్థా

దుఃఖము వలన గలుగు చాంచల్యము లేనిది. రాగద్వేషాలనేవి ఆ పరమేశ్వరికి ఏమాత్రమూ ఉండవు. అందుచేత ఆమెకు చిత్తచాంచల్యము కలగదు. ఆ దేవి గుణాతీతురాలు. ఎల్లవేళల మంచి ఆరోగ్యస్థితిలో స్థిరమైన చిత్తముతో ఉంటుంది. అంతే కాదు పరమేశ్వరి ఎక్కడ ఉంటుంది అంటే స్వస్థా-తన యందే ఉంటుంది. హృదయ స్థానంలో ఉంటుంది. మానవుని యొక్క దహరాకాశంలో ఉంటుంది. దహరాకాశరూపిణి. అందుచేతనే దహరాకాశము భక్తులకు పవిత్రస్థానము.

## 913. స్వభావమధురా

మధురమైన స్వభావము గలది. స్వభావముచేతనే అందరితోనూ కోరబడునది. ఆ దేవి యొక్క స్వభావమే కాదు. మాట మధురం, చూపు మధురం, రూపం మధురం, వదనం మధురం. ఒకటేమిటి ఆ పరమేశ్వరి అంతా మధురమే. ఆమె నుంచి అమృతధారలు వర్షిస్తాయి. తన భక్తులకు ఎనలేని ఆనందాన్నిస్తుంది. అదే బ్రహ్మానందం. అది అనిర్వచనీయం. అనుభవైకవేద్యం. తనను తలచినంత మాత్రంచేతనే భక్తజనహృదయాలలో ఆనందమును కలుగచేయు స్వభావము గలది. అందుచేతనే ఆమె స్వభావమధురా అనబడుతోంది.

## 914. ధీరా

పండితురాలు ధైర్యవతి. ఆ పరమేశ్వరి 64 కళలయందు పాండిత్యము గలది. సజ్జనులకు ఉండవలసిన ధైర్యము, ఓర్పు, వాక్చాతుర్యము, బలము మొదలైన గుణాలన్నీ ఆమెకు ఉన్నాయి. అందుచేత ధీర అనబడుతుంది.

భగవంతుడు భక్తుడు ఒకటే. వీరిద్దరి మధ్య భేదం లేదు. అనే అద్వైతబుద్ధి గలవారు ధీరులు. అటువంటి ధీరులరూపంలో ఉండేది కాబట్టి పరమేశ్వరి ధీరా అనబడుతోంది.

## 915. ధీరసమర్చితా

**ధీరైః పండితైః సమర్చితా**

ధీరులచే పూజించబడునది. ధీరులు అంటే అద్వైతబుద్ధి గలవారు అని గతంలో చెప్పాం. అటువంటి జ్ఞానులచే అర్చించబడునది. అంతర్ముఖులైన వారిచే పూజించబడునది. కాబట్టి ధీరసమర్చితా అనబడుతోంది. చంచలచిత్తులకు అందుబాటులో ఉండనిది.

## 916. చైతన్యార్ఘ్యసమారాధ్యా

చైతన్యము అనే అర్ఘ్యంచేత పూజింపబడునది. భావనోపనిషత్తులో

**ఉజ్జ్వల దామోదాను సంధానమర్ఘ్యమ్**

అర్ఘ్యము అంటే చేతులు కడుక్కునే నీరు. త్రాగేందుకు ఇచ్చే నీరు. అంతఃపూజలో ఆత్మయే శ్రీదేవి అని గ్రహించి బ్రహ్మానందానుసంధానం చెయ్యటమే అర్ఘ్యప్రదానము అని చెప్పబడింది.

పరమేశ్వరిని అర్చించేటప్పుడు బాహ్యపూజ కన్న అంతఃపూజ విశేషఫలప్రదము. **సోహం భావేన పూజయేత్** సాధకుడు తానే పరమేశ్వరస్వరూపము అని భావించి అర్చన చెయ్యాలి.

చైతన్యము అంటే – చిద్రూపము. ఆత్మ ఈ చైతన్యమే అర్ఘ్యము అని భావించి అర్చన చెయ్యాలి. అందుచేత పరమేశ్వరి చైతన్యార్ఘ్యసమారాధ్యా అనబడుతోంది. ఇక్కడ జ్ఞానమే అర్ఘ్యము అని భావన. ఆత్మజ్ఞానంతో, ఆత్మనే అర్ఘ్యముగా ఉపయోగించి దేవిని అర్చించాలి. జ్ఞానంతో ఆత్మానుభవం పొంది ఆత్మార్పణ గావించాలి.

## 917. చైతన్యకుసుమప్రియా

పరమేశ్వరి పూజలో బయటనుంచి పుష్పాలుకొని తేవటంకాదు చేయవలసినది. ఆత్మ చైతన్యాన్నే పుష్పాలుగా భావించి దేవిని అర్చించాలి. శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని మూడవశ్లోకంలో **జడానాం చైతన్యస్తబకమకరంద స్రుతిఝరీ** అన్నారు. చైతన్యపుష్పములో స్రవించే తేనే దేవి. చైతన్యకుసుమాలు ఎనిమిది.

| | | | |
|---|---|---|---|
| 1. అహింస | 3. క్షమ | 5. వివేకము | 7. సత్యము |
| 2. ఇంద్రియనిగ్రహము | 4. కనికరము | 6. తపస్సు | 8. ధ్యానము |

సాధకుడు వీటిని కలిగి ఉండాలి. ప్రపంచంలో ఇతరులపట్ల వీటిని వినియోగించాలి. అదే చైతన్యకుసుమారాధన. దానియందు ప్రీతి గలవి. కాబట్టి పరమేశ్వరి చైతన్యకుసుమప్రియా అనబడుతుంది.

**అహింసా ప్రథమ పుష్పం పుష్ప మింద్రియ నిగ్రహః**
**దయా క్షమా జ్ఞాన పుష్పం పంచపుష్పం తతః పరం**

1. అహింస 2. ఇంద్రియనిగ్రహము 3. దయ 4. క్షమ 5. జ్ఞానము

వీటిన పంచపుష్పాలు అంటారు. వీటితో ఆ పరమేశ్వరిని అర్చించాలి. అదే చైతన్యకుసుమార్చన. అటువంటి అర్చన యందు ప్రీతి గలది. కాబట్టి పరమేశ్వరి చైతన్యకుసుమప్రియా అనబడుతుంది.

## 918. సదోదితా

నిత్యము స్వయం ప్రకాశము గలది. పరమేశ్వరి నిత్యబ్రహ్మస్వరూపిణి. ఉదయించే సూర్యమండలములాగా ప్రకాశిస్తుంటుంది. అన్నిచోట్ల ప్రత్యక్షమవుతుంది. స్మరించినంత మాత్రంచేతనే స్ఫురిస్తుంది. సర్వకాలసర్వావస్థలయందు భక్తుల హృదయాలలో ఉండేది. కాబట్టి సదోదితా అనబడుతుంది.

## 919. సదాతుష్టా

ఎప్పుడూ సంతుష్టిగలది. సజ్జనులయందు ప్రీతిగలది. పరమేశ్వరికి ఏ రకమైన కోరికలులేవు. ఎల్లప్పుడూ సంతృప్తి కలిగి ఉంటుంది. ఆమె నిత్యానందస్వరూపిణి. అందుచేత సదాతుష్టా అనబడుతోంది. తన భక్తుల కోర్కెలను తీర్చి, వారిని సంతుష్టాంత రంగులుగా చేస్తుంది. కాబట్టి సదాతుష్టా అనబడుతోంది.



# 53. యాగఫలము

యాగము – దేవతలకు హవిర్భాగాలివ్వటము. యజ్ఞము అని అర్థం. యజ్ఞం చేసేటప్పుడు దేవతలకు హవిర్భాగం ఇస్తారు. ఈ రకంగా హవిర్భాగం తీసుకునేవారు 33 మంది దేవతలు అని బృహదారణ్యకోపనిషత్తులో చెప్పబడింది.

ఒకసారి జనకమహారాజుయాగం చేస్తున్నాడు. సంప్రదాయం ప్రకారం ఆధ్యాత్మిక ప్రవచనాలు, వాదనలు జరుగుతున్నాయి. అప్పుడు జనకుని గోశాలలో నుంచి వేయి బాగా బలసిన ఆవులు, ఆంబోతులు తీసుకువచ్చారు భటులు. వాటి గిట్టలకు కొమ్ములకు బంగారు తాపడాలున్నాయి. వాటిమీద పట్టువస్త్రాలు కప్పబడి ఉన్నాయి. జనక మహారాజు లేచి ఆధ్యాత్మిక ప్రపంచంలో రారాజు ఎవరో, వారు వీటిని తోలుకుపోవచ్చును అన్నాడు. యాజ్ఞవల్క్యుడు తన శిష్యుణ్ణి పిలిచి గోవులను ఆశ్రమానికి తోలుకుపొమ్మాన్నాడు. అప్పుడు సభలోని పండితులు అడ్డుకుని అనేకవిధాల యాజ్ఞవల్క్యుణ్ని పరిక్షించారు. ఆ సమయంలో శాకల్యుడు అడిగిన ప్రశ్నకు సమాధానం చెబుతూ

దేవతలు 33 మంది. వారికే యజ్ఞాలలో హవిర్భాగము ఇవ్వబడుతుంది. వారు

| | | | |
|---|---|---|---|
| ద్వాదశాదిత్యులు | – | 12 | మంది |
| అష్టవసువులు | – | 8 | మంది |
| ఏకాదశరుద్రులు | – | 11 | మంది |
| ఇంద్రుడు, ప్రజాపతి | – | 2 | ఇద్దరు |
| వెరసి | | 33 | మంది |

అంటాడు. వీరికే హవిర్భాగం ఇవ్వటం జరుగుతుంది. అది తీసుకుని దేవతలు యజ్ఞఫలాన్ని మనకందచేస్తారు.

పరమేశ్వరి ప్రీతి కోసం యాగాలు చెయ్యటం జరుగుతుంది. చండీయాగము, అంబాయాగము వంటి యాగాలతో తృప్తి చెందిన దేవి యజమానికి ఫలితాన్నిస్తుంది.

పరమేశ్వరి మధ్యందిన మార్తాండునిలాగా తెలుపు ఎరుపు కలిసిన రంగులతో ప్రకాశిస్తుంటుంది. ఆ దేవి తనను అర్చించేవారి కోరికలను బట్టి వివిధ రంగులలో దర్శనమిస్తుంది. ఈ విషయం బృహదరాణ్యకోపనిషత్తులోను, వేదంలోనూ చెప్పబడింది.

యజ్ఞం చేసిన తరువాత, ఆ క్రియలో ఆఖరుగా ఋత్విక్కులకు దక్షిణసమర్పించాలి. ఆ దక్షిణతో వారు సంతృప్తి చెందాలి. అప్పుడే యాగఫలం మనకు దక్కుతుంది. దక్షిణలేని కర్మ సఫలంకాదు. పరమేశ్వరి దక్షిణ ఇవ్వటం చేతనే ఆరాధింపబడుతుంది. తృప్తి చెందుతుంది. అర్చనావిధానంలో దక్షిణాచార సంపన్నులుచేసే అర్చనలతో తృప్తి చెందుతుంది. ఆ విధంగా యాగం పూర్తి అయిన తరువాత, కర్తకు వాంఛితార్థాన్నిస్తుంది.

ఈ విషయం 920 నుంచి 922 వరకు నామాలలో వివరించబడింది.

## 920. తరుణాదిత్యపాటలా

తరుణాదిత్యుడు – మధ్యందినమార్తాండడు. పాటలా – పాటలవర్ణము గలిగినది. మధ్యాహ్నకాలమునందున్న సూర్యునివలె ఎరుపుతెలుపు కలిసిన రంగుతో ప్రకాశించేది. పరమేశ్వరి శ్యామవర్ణంలో ఉంటుందని, గౌరవర్ణంలో ఉంటుందని చెప్పటం తప్పుకాదు. ఆమె తనను అర్చించే వారి మనసును బట్టి వివిధ వర్ణములలో ప్రకాశిస్తుంటుంది. బృహదారణ్యకోపనిషత్తులో పరమేశ్వరుడు మంచి వస్త్రంలాగా, తెల్లని ఉన్నిగుడ్డలాగా, వర్షాకాలంలో కనిపించే ఆర్ద్రపురుగులాగా, అగ్నిజ్వాలలాగా, తెల్లనిపద్మంలాగా, మెరుపు కాంతిలాగా ఉంటాడు. ఈ విషయం తెలుసుకున్నవాడి సంపద విద్యుత్ప్రకాశంలాగా అంతటా వ్యాపిస్తుంది అని చెప్పబడింది. వేదంలో

**శాంతా ధవళవర్ణాభా మోక్షధర్మ ప్రకల్పనే**
**స్త్రీవశ్యే రాజవశ్యేచ జనవశ్యే చ పాటలా**
**పీతా ధనస్య సంపత్తౌ కృష్ణా మారణకర్మణి**
**బభ్రుర్విద్వేషణే ప్రోక్తా శృంగారే పాటలాకృతిః**
**సర్వవర్ణా సర్వలాభే ధ్యేయా జ్యోతిర్మయీ పరమ్ ॥**

| | | |
|---|---|---|
| మోక్షమిచ్చేటప్పుడు | – | శ్వేతవర్ణము, శాంతము. |
| స్త్రీ, రాజ, జనవశ్యమందు | – | పాటలవర్ణము |
| ధనసంపత్తిలో | – | పీతవర్ణము |
| మారణకర్మలో | – | కృష్ణవర్ణము |
| విద్వేషములందు | – | కపిలవర్ణము |
| శృంగారమున | – | పాటలవర్ణము |
| సర్వార్థములందు | – | సర్వవర్ణములు |

కలిగి ఉంటుంది. ఈ రకంగా సర్వవర్ణములతోను శోభించు దేవిని సేవించుట శ్రేయస్కరము.

## 921. దక్షిణా

ఏదైనా క్రతువు సఫలం కావాలి అంటే అఖరున బ్రాహ్మణుడికి దక్షిణ సమర్పించాలి. క్రతువంతా పూర్తి అయిపోయిన తరువాత **యధాశక్తి హిరణ్యం తుభ్య మహం సంప్రతతే నమమ.** అంటూ యధాశక్తి వశిష్ఠుని చేతిలో దక్షిణ ఉంచి ఆయన పాదాలకు నమస్కరించాలి. అప్పుడే యాగము పూర్తి అయినట్లుగా చెప్పబడుతుంది.

ఒకసారి బ్రహ్మ యజ్ఞం చేసి, యజ్ఞం సఫలం కావాలని పరమేశ్వరిని పరిపరివిధాల ప్రార్థించాడు. పరాశక్తి సలహామీద విష్ణువు లక్ష్మి అంశతో దక్షిణను సృష్టించి బ్రహ్మకు ఇవ్వగా, బ్రహ్మ ఆమెను యజ్ఞపురుషుడికి సమర్పించాడు. యజ్ఞం సఫలమైంది. ఈ విషయం గతంలో వివరించటం జరిగింది.

కాబట్టి దక్షిణలేని కర్మ సఫలం కాదు. పరమేశ్వరి దక్షిణా స్వరూపురాలు. యాగాలలో ఋత్విక్కులకు ఇచ్చే దక్షిణ పరదేవతా స్వరూపము. ఈ దక్షిణే యజ్ఞయాగాది క్రతువులందు పూర్తి ఫలితాన్నిచ్చేది.

## 922. దక్షిణారాధ్యా

పరమేశ్వరి సమయాచారుల చేత, దక్షిణాచారులచేత కూడా ఆరాధింపబడునది. కాబట్టి దక్షిణారాధ్యా అనబడుతోంది. క్రతువు చివరలో ఇచ్చే దక్షిణ యజమానిని కవచమువలె కాపాడుతుంది. దక్షిణ తీసుకుని ఋత్విక్కులు సంతోషించాలి. వారు తృప్తి చెందితేనే యజమానికి ఫలం దక్కుతుంది. వారు తృప్తి చెందితేనే పరమేశ్వరి సంతసిస్తుంది. ఈ రకంగా దక్షిణ దానముచే ఆరాధింపబడుతుంది కాబట్టి పరమేశ్వరి దక్షిణారాధ్యా అనబడుతుంది. ఈ విధంగా యాగఫలం వివరించబడింది.



# 54. యతి - అనుష్ఠానము

యతి అంటే సన్యాసి, జితేంద్రియుడు, పరివ్రాజకుడు.

యతీశ్వరుడు ఏకాక్షరీ మంత్రాన్ని మాత్రమే అనుష్ఠానం చెయ్యాలి. అది కూడా ఓంకారమే. యతి మనోవాక్కాయ కర్మలతో సదా పరమేశ్వరుణ్ణే ఆరాధిస్తూ ఉండాలి. ఎల్లఎడలా పరమేశ్వరుణ్ణే దర్శిస్తుండాలి. జగత్తంతా పరబ్రహ్మ స్వరూపంగానే భావించాలి.

పూజ రెండు రకాలు 1. బాహ్యపూజ 2. అంతఃపూజ. యతికి బాహ్యపూజలేదు. అంతఃపూజ మాత్రమే చెయ్యాలి. అంటే ప్రాణాయామంచేసి ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీశక్తిని జాగృతం చెయ్యాలి. అప్పుడు ఆ శక్తి మేల్కొని పూత్కారం చేస్తూ ఊర్ధ్వముఖంగా బయలుదేరుతుంది. అలా బయలుదేరి షట్చక్రాలను భేదించి, గ్రంథిత్రయాన్ని దాటి సహస్రారం చేరి సహస్రకమలాన్ని తన నోటితో కరచిపట్టుకుంటుంది. అప్పుడు అక్కడి నుండి అమృతపుధారలు స్రవించి సాధకుని శరీరంలోని 72 వేల నాడీమండలాన్నీ తడుపుతాయి.

ఈ రకంగా కులమార్గంలో కౌళినిని గనక అర్చించినట్లైతే ఆ దేవి అవిచ్ఛిన్నమైనటువంటి కైవల్యాన్ని ప్రసాదిస్తుంది.

ఆమె స్తోత్రప్రియ. శ్రుతులలో ఆమె వైభవము చెప్పబడింది. మానవుడి పూర్వజన్మ కర్మను బట్టి అతని మానసికస్థితి ఉంటుంది. అట్టి మానసికస్థితిని నియంత్రిస్తుంది. ఆ పరమేశ్వరి జగత్తునంతా సృష్టించింది. ఈ జగత్తుకు అధిపతి. కాని ఆమెకు ఏ విషయమందు ఆసక్తి ఉండదు. విరాగి. ఆమె తన భక్తులపట్ల పరమ ఉదారస్వభావురాలు. ఎప్పుడూ ఆనందస్థితిలోనే ఉంటుంది. తనను ఈ రకంగా అర్చించే భక్తులకు ఆనందస్థితి అంటే సాయుజ్యము ప్రసాదిస్తుంది.

ఈ విషయాన్ని 923 నుంచి 941 వరకు నామాలలో వివరించటం జరిగింది.

## 923. దరస్మేరముఖాంబుజా

చిరునగవుతో కూడిన ముఖారవిందము గలది. పరమేశ్వరి మనోహరమైన మందహాసంతో ప్రకాశించే ముఖము గలిగినది. కాబట్టి దరస్మేరముఖాంబుజా అనబడింది.

దరము అనగా – శంఖము.

స్మేర అంటే – ప్రకాశము

పరమేశ్వరి ముఖపద్మము శంఖంలాగా తెల్లగా ప్రకాశిస్తున్నది.

కల్పాంతమునందు అంటే మహాప్రళయకాలంలో కూడా చిరునవ్వుతో కూడిన ముఖము గలది. భక్తులను ఆదరించటంలో చిరునగవుతో కూడిన ప్రసన్నమైన ముఖము కలది.

## 924. కౌళినీ

కులమార్గంలో ఉండేది కాబట్టి కౌలినీ అనబడుతుంది.

విభిన్నకులములను ఏకము చేయునది. భిన్నజాతికి చెందిన భోక్తలను, భోజ్యములను ఏకము చేయునది.

మానవులదంతా ఒకజాతి. వీరు తీసుకునే ఆహారం భిన్నజాతులకు సంబంధించినది. అంటే కూరలు, కాయలు, పండ్లు, మాంసము ఇత్యాదులు. ఈ రకంగా తీసుకున్న ఆహారం శరీరంలో జీర్ణమయి, రక్తము, మాంసము, ఎముకలు, మజ్జ, వెంట్రుకలు, చర్మములుగా మార్పు చెందుతుంది. ఇంకొకజాతిని ఆహారంగా తీసుకున్నప్పటికీ, వాటిని జీర్ణంచేసి మానవదేహంలోని భాగాలుగా ఏకం చేస్తుంది. ఇదేవిధంగా పశుపక్ష్యాదులకు కూడా జరుగుతుంది. ఈ రకంగా భిన్నజాతులను ఏకం చేస్తుంది. కాబట్టి కౌళినీ అనబడుతుంది.

## 925. కేవలా

పరమేశ్వరి సాక్షాత్తూ పరబ్రహ్మమే. కాబట్టి కేవలా అనబడుతుంది. అంతటా ఉన్నది తానొక్కతే. వేరెవ్వరూ లేరు. **ఏకమే వాద్వితీయం బ్రహ్మ** తానుగాక రెండవపదార్థమేదీలేదు. జ్ఞానస్వరూపిణి.

ఆ పరబ్రహ్మ శబళబ్రహ్మయై శరీరంలో ప్రవేశించి బ్రహ్మ కలను సహస్రారంలో వదిలి కేవలయై కులమార్గంలో కుండలిని చేరి ఆధారచక్రంలో నిద్రిస్తున్నది. కాబట్టి పరమేశ్వరి కేవలా అనబడుతున్నది.

## 926. అనర్ఘకైవల్యపదదాయినీ

అమూల్యమైనది, అవిచ్ఛిన్నమైనది అయిన ముక్తినిస్తుంది. అదే సాయుజ్యము. సహస్రారంలో పరమేశ్వరిని అర్చించే వారికి సాయుజ్యం లభిస్తుంది. అటువంటి ముక్తిని భక్తులకు వారి అర్హతనుబట్టి ఇస్తుంది. అంతములేని కైవల్యమునిస్తుంది. ఆమె సాన్నిధ్యమును మించిన కైవల్యమేలేదు. అటువంటి కైవల్యమునిస్తుంది. కాబట్టి పరమేశ్వరి 'అనర్ఘకైవల్యపదదాయినీ' అనబడుతుంది.

## 927. స్తోత్రప్రియా

స్తోత్రములందు ప్రీతిగలది. స్తోత్రము అంటే లోకసంబంధమైన గుణాలను అనువదించి చెప్పటము. ఇది ఆరువిధాలు.

**నమస్కార స్తథా శీ శ్చ సిద్ధాంతోక్తిః పరాక్రమః ।**

**విభూతిః ప్రార్థనా చేతి షడ్విధం స్తోత్రలక్షణం ॥**

1. నమస్కారము
2. ఆశీస్సు
3. సిద్ధాంతోక్తి
4. పరాక్రమము
5. విభూతి
6. ప్రార్థన

ఈ విధంగా చేసే స్తోత్రాలయందు ప్రీతిగలది. స్తుతిరూపమైన నామములు గలది. లలితాసహస్రంలో ఆమెను స్తుతిచేస్తూ అనేక నామాలున్నాయి. వాటిలో కొన్ని

1. స్తుతిమతీ
2. త్రిజగద్వంద్యా
3. సామ్రాజ్యదాయినీ
4. మిథ్యాజగదధిష్ఠానా
5. ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణీ
6. భండాసురేంద్ర నిర్ముక్తశస్త్రప్రత్యస్త్రవర్షిణీ

ఈ రకమైన స్తుతినామాలు గలది.

మంత్రాలతో కలిసిన వైదికస్తుతులందు ప్రీతిగలది.

సహస్రనామాలు, త్రిశతి, ఖడ్గమాల, సప్తశతి మొదలగు స్తోత్రపాఠములందు ప్రీతి గలది.

## 928. స్తుతిమతీ

పరమేశ్వరిని స్తుతించటంతో జ్ఞానము, ఐశ్వర్యము లభిస్తాయి. మానవులచేత, దేవతలచేత స్తుతింపబడదగిన గుణములు కలది. లోక కంటకులైన రాక్షససంహారముచేసిన వైభవముగలది. తనను నామాలతోగాని, స్తోత్రాలతోగాని స్తుతించే వారియందు ప్రీతిగలది.

## 929. శ్రుతిసంస్తుతవైభవా

శ్రుతులచేత గొప్పగా పొగడబడిన విభుత్వముగలది. వేదాలలో లెస్సగా పరిచితమైన వైభవముగలది.

**సర్వే వేదా యత్పద మామనంతి**

నాలుగువేదములచేత కొనియాడబడు వైభవము గలది. కాబట్టి పరమేశ్వరి శ్రుతి సంస్తుతవైభవా అనబడుతోంది.

పరమేశ్వరుని గొప్పతనాన్ని చెప్పటానికి వేయితలలుగల ఆదిశేషుడికి కూడా శక్యముకాదు.

## 930. మనస్వినీ

**మనః అస్యాః స్వతంత్రతయా తిష్ఠతి**

మనస్సు ఈమె యందు స్వతంత్రంగా అధివసించి ఉన్నది. అంటే మనస్సు ఆమెపైనే ఆధారపడి ఉన్నది.

పరమేశ్వరికి మనోవికృతులు ఏమాత్రమూలేవు. ఎల్లవేళలయందు తురీయాతీత స్థితిలో ఉండేటటువంటి సచ్చిదానందమాత్రస్వరూపిణి. కాబట్టి ఆమె మనస్వినీ అనబడుతోంది.

మనోవికృతులు పదకొండు. అవి :

| | | | |
|---|---|---|---|
| 1. కామ | 4. శ్రద్ధ | 7. అధృతి | 10. భీః |
| 2. సంకల్ప | 5. సత్యము | 8. శ్రీః | 11. ధీః |
| 3. విచికిత్స | 6. ధృతి | 9. హ్రీః | |

ఈ వికృతులు మానవుని పూర్వకర్మను బట్టి మారుతుంటాయి. అంటే పండితుడి యందు ఒక రకంగాను పామరుడి యందు ఒక రకంగాను ఉంటాయి. కాబట్టి మనస్సును పూర్వజన్మ సుకృతాన్ని బట్టి ప్రేరణచేసేది ఆ పరమేశ్వరి. అందుకే మనస్విని అనబడుతుంది.

జీవి జన్మించినప్పుడు స్థూలసూక్ష్మకారణ దేహాలు మూడు ఉంటాయి. స్థూలదేహం ఈ జన్మలో కల్పించబడింది. సూక్ష్మకారణదేహాలు పురాకృతసుకృతాలు. అవి గతజన్మలలో నుండి వస్తూనే ఉంటాయి. గత జన్మలలో ఉన్న బలమైన కోరికలు పూర్తిగా తీరకపోతే, అవి ఈ జన్మలో కొనసాగుతాయి. వాటి ఆధారంగానే క్రొత్త కోరికలు కూడా పుడతాయి. ఈ రెండూ కలిసి మనసులో పనిచేస్తాయి. తదనుగుణంగా మానవుడి ఆలోచనలు సాగుతాయి. ప్రతిజన్మలోను జీవి మనస్సుకు, కర్మలకు సాక్షి పరమేశ్వరియే. కాబట్టి ఆమె మనస్వినీ అనబడుతోంది.

## 931. మానవతీ

ఆదరణ గలది, గౌరవము గలది. కీర్తి ప్రతిష్ఠలు గలది. పరమేశ్వరి అపారమైన ఆదరాభిమానాలు కలిగి కామేశ్వరి అనే కీర్తి, దైత్యహంత్రి అనే ప్రతిష్ఠ గలది కావటంచేత మానవతీ అనబడుతోంది.

మానవతీ - అంటే పతివ్రత అని కూడా అర్థం. ప్రతిజన్మలోనూ పరమేశ్వరుడినే భర్తగా పొందుతుంది. కాబట్టి ఆమె మహాపతివ్రత. మానవతీ అనబడుతుంది.

## 932. మహేశీ

మహేశుని భార్య మహేశి. దేవీపురాణంలో

**మహాదేవాత్ సముత్పన్నా మహద్భిర్యత ఆదృతా**

**మహేశస్య వధూర్యస్మాత్ మహేశీ తేనసాస్మృతా**

మహాదేవుని వలన పుట్టింది. గొప్పవారిచే ఆదరించబడింది. మహేశ్వరుని అర్థాంగి కాబట్టి మహేశీ అనబడుతుంది.

వేదాలలో ప్రతిపాదింపబడే దేవతయే మహేశీ. ఈమె మహా ప్రభ్వి. సకల భువనాలకు అధిపతి. అఖిలాండకోటి బ్రహ్మాండాలకు అధిపతి. కాబట్టి మహేశి అనబడుతుంది.

పరమేశ్వరుడికి ఆరు అంగాలున్నాయి. అవి.

| | | |
|---|---|---|
| 1. సర్వజ్ఞత | 3. స్వతంత్రత | 5. సంపూర్ణత |
| 2. అనాదిబోధ | 4. నిత్యత | 6. అనంతత |

వీటన్నింటినీ కలిగి ఉన్నది. కాబట్టి పరమేశ్వరి మహేశీ అనబడుతోంది.

## 933. మంగళాకృతిః

**మంగళరూపా ఆకృతి ర్యస్యాః**

మంగళరూపమైన ఆకారము గలది.

**సర్వమంగళమాంగల్యే ! శివే ! సర్వార్థసాధకే !**

**శరణ్యే ! త్ర్యంబకే ! దేవి ! నారాయణి ! నమోஉస్తు తే ॥**

అన్నిరకాలయిన శుభములు కలిసి ఆకృతి ధరించినది. సర్వమంగళస్వరూపురాలు. శోభనమైన నిత్యమంగళస్వరూపురాలు. కాబట్టి మంగళాకృతిః అనబడుతోంది.

## 934. విశ్వమాతా

**విశ్వస్య జగతో విష్ణో ర్వా మాతా**

జగత్తులకు తల్లి. విష్ణువుకు తల్లి.

పరమేశ్వరి ఈ జగత్తుకంతటికీ తల్లి. సమస్త ప్రపంచాన్ని ప్రసవించిన మూలప్రకృతి అని ముందే చెప్పాం. ఈ కారణాలచేత పరమేశ్వరి విశ్వమాతా అని చెబుతోంది. శ్రీమాతయే – విశ్వమాత.

## 935. జగద్ధాత్రీ

భూ రూపముచే జగత్తును ధరించినది.

వామకేశ్వరతంత్రంలో

**శింశుమారాత్మనావిష్ణుః భూరాదీనూర్ధ్వతః స్థితాన్**

**దధ్రే శేషతయాలోకాన్ సప్తలోకాన్ అధస్థితాన్**

శ్రీ మహావిష్ణువు శింశుమార (మొసలి) రూపంలో ఊర్ధ్వలోకాలను, ఆదిశేషుని రూపంలో అధోలోకాలను మోస్తున్నాడు. శ్రీ మహావిష్ణువు అంటే పరమేశ్వరి రూపమే. కాబట్టి పరమేశ్వరియే ఈ రకంగా జగత్తులను ధరిస్తున్నది. కాబట్టి జగద్ధాత్రీ అనబడుతోంది. జగాలనన్నింటినీ పోషించేది ఆమె. కాబట్టి జగద్ధాత్రీ అనబడుతుంది.

## 936. విశాలాక్షీ

**విశాలే విస్తీర్ణే అక్షిణీయస్యాః**

విశాలమైన కనులు గలది. విస్తీర్ణమైన కనులు గలది. సర్వకాల సర్వావస్థలయందు అతి జాగ్రత్తగా, విప్పారిన నయనాలతో లోకముల యోగక్షేమాలు చూస్తుంటుంది. కాబట్టి విశాలాక్షి అనబడుతోంది.

త్రికాలములు అంటే భూతభవిష్యద్వర్తమానకాలములను తెలిసినది. కాబట్టి విశాలాక్షీ అనబడుతుంది.

**వారణాస్యాం విశాలాక్షీ**

అష్టాదశ శక్తి పీఠాలయందు వారణాశిలో ఉండేది విశాలాక్షి

విశాల అంటే బదరికాశ్రమం. హిమాలయాల దగ్గర ఉండే నేపాల్‌దేశము.

## 937. విరాగిణీ

**విరాగో వైరాగ్యం అస్యాః అస్తీతి విరాగిణీ**

వైరాగ్యము గలది. విషయ వాంఛలు ఏమాత్రములేనిది. రాగద్వేషాలు అణుమాత్రము కూడా లేనిది. అరిషడ్వర్గాలను పూర్తిగా జయించినది. కేవలము నిర్గుణస్వరూపిణి. త్రిగుణాలు సృష్టించబడక ముందే ఉన్నది. గుణాలను ఆ పరమేశ్వరియే సృష్టించింది. గుణాలకు కారణభూతమైనది. ఈ రకంగా గుణాలకు, అరిషడ్వర్గాలకు అతీతమైనది కాబట్టి విరాగిణీ అనబడుతున్నది.

## 938. ప్రగల్భా

**సృష్ట్యాదికర్మసు ప్రౌఢత్వాత్ ప్రగల్భా**

సృష్ట్యాది కర్మలయందు మంచి నేర్పు గలది. కాబట్టి ప్రగల్భా అనబడుతుంది.

సృష్టి, స్థితి, లయ, తిరోదాన, అనుగ్రహములనబడే పంచ కృత్యములయందు ఎనలేని ప్రతిభగలది. నేర్పుగలది. రాక్షస సంహారంలో అనన్య సామాన్యమైన నేర్పుగలది. భక్తులకోరికలు తీర్చటంలో సాటిలేనిది. జగత్తులో తను తప్ప ఇంకేదీ లేనిది. కాబట్టి పరమేశ్వరి ప్రగల్భా అనబడుతున్నది.

## 939. పరమోదారా

దేశకాలములకన్న గొప్పదైన మహిమ గలది. చెప్పలేని గొప్పతనము గలది.

ప్రకృష్ఠమైన ఆనందాన్ని అంతటా ఇచ్చేది. సంసార సాగరాన్ని నశింపచేసేది.

ఆ పరమేశ్వరి ఉత్కృష్ఠమైన ఔదార్యము గలది. భక్తుల కోరికలు తీర్చటంలో అత్యంత ఉదారస్వభావురాలు. ఎన్ని పాపాలు చేసినప్పటికీ మనసా వాచా కర్మణా పరమేశ్వరిని ఒక్కసారి గనక ధ్యానిస్తేచాలు, వారిని కాచి రక్షిస్తుంది.

**క్రూరాత్ము దజామీలుడు**

**నారాయణ అనుచు ఆత్మ నందనుబిలువన్**

**ఏ రీతి నేలుకొంటివి ?**

అటువంటి ఉదారస్వభావురాలు. కాబట్టే పరమోదారా అనబడుతోంది.

## 940. పరామోదా

ఉత్కృష్టమైన కీర్తి గలది. పరమేశ్వరి ఆత్మానందస్వరూపిణి. పరమానందమే ఆ దేవిస్వరూపము. చిదానంద ఘన స్వరూపిణి. కాబట్టి పరమేశ్వరి పరామోదా అనబడుతోంది.

## 941. మనోమయీ

శుద్ధ బ్రహ్మకు మనస్సు స్థానము. అందుచేత పరమేశ్వరి మనోమయి అనబడుతుంది. ఎటువంటి ద్వైతభావము లేకుండా వృత్తశూన్యమైన మనస్సు పరమేశ్వరికి నివాసస్థానము. అటువంటి నిర్మలమైన మనస్సు స్థానముగా గలది. కాబట్టి పరమేశ్వరి మనోమయి అనబడుతుంది. మనస్సు అనేది సంకల్పవికల్పాలకు కారణమైనది. మాయాస్వరూపం. ఈ మాయ గనక పటాపంచలైతే పరమేశ్వరి సాక్షాత్కరిస్తుంది.

మనస్సే పరబ్రహ్మస్వరూపము. తైత్తిరీయోపనిషత్తులో ఈ విషయం చెప్పబడింది. దీన్ని గతంలో వివరించాం. కాని పాఠకులకు మళ్ళీ గుర్తు చేస్తున్నాం. వరుణమహర్షి కుమారుడు భృగుమహర్షి. విద్యాభ్యాసం పూర్తిచేసి బ్రహ్మోపదేశం చెయ్యమని తండ్రిని అడిగాడు. బ్రహ్మతత్త్వం చెబితే తెలిసేదికాదు. తపస్సు చేసి తెలుసుకోమన్నాడు తండ్రి.

కొంతకాలం తపస్సుచేశాడు భృగువు. అప్పుడు అన్నమే బ్రహ్మ అని తెలిసింది. ఈ విషయం తండ్రికి చెప్పాడు. కాదన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చెయ్యమన్నాడు. ఇప్పుడు తెలిసింది ప్రాణమే బ్రహ్మ అని. కాదన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చెయ్యమన్నాడు. తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు తెలిసింది. మనస్సే బ్రహ్మ. మనస్సు అనేది సంకల్ప వికల్పాలకు నెలవైంది. మనసుతోనే ఆలోచించటం జరుగుతుంది. ఈ ఆలోచన వల్లే స్త్రీ పురుషులు ఏకమవుతారు. సంసారం అభివృద్ధి చెందుతుంది. కాబట్టి ఈ జగత్తుకు కారణం మనస్సు. మనస్సే బ్రహ్మ అని చెప్పబడింది. అటువంటి మనస్సునందు నివాసముండేది కాబట్టి మనోమయీ అనబడుతుంది.

ప్రతి జీవిలోనూ జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలుంటాయి. ఇవి వాటి పని నిర్వర్తిస్తూ ఉంటాయి. అయితే వీటన్నింటినీ సక్రమంగా నడిపించేది మనస్సు. అదే పరాశక్తి.

నివృత్తి ధర్మం గల బుద్ధి ప్రకాశాత్మకము. పరబ్రహ్మ స్వరూపం. ప్రవృత్తి ధర్మం గల మనసు విమర్శాత్మకం. శక్తిస్వరూపం. జీవిలో బుద్ధి వికసిస్తే మనస్సు లయమవుతుంది. మనస్సు వికసిస్తే బుద్ధి లయమవుతుంది. ప్రాపంచిక విధానమంతా ప్రవృత్తిరూపం. అందుకని ఆ పరమేశ్వరి ప్రవృత్తికి కారణమైన మనసునందుంటుంది. అందుచేతనే మనోమయీ అనబడుతుంది.

ఈ రకంగా యతి అనుష్ఠానం వివరించబడింది.




శ్రీ 'ఇ'కార దేవి

# 55. స్మార్తకర్మ

శ్రుతులయందు చెప్పిన కర్మలు స్మార్తము అనబడతాయి. స్మార్తకర్మలు చెయ్యటం వల్ల పరమేశ్వరి సంతసిస్తుంది. ఇవి యజ్ఞాలు యాగాలు క్రతువులు మొదలైనవి. అగ్నిహోత్రము, దర్శపూర్ణమాసలు, చాతుర్మాస్యము, పశుయాగము, సోమయాగము వీటిని పంచయజ్ఞాలంటారు.

యజ్ఞము అనేది విష్ణుస్వరూపం. కాబట్టి యజ్ఞం చెయ్యాలి. దేవయజ్ఞం, పితృయజ్ఞం, బ్రహ్మయజ్ఞం, మనుష్యయజ్ఞం, భూతయజ్ఞం. ఈ రకంగా యజ్ఞయాగాది క్రతువులు వేదాలలో చెప్పిన విధంగా చెయ్యాలి. ఇవిగాక వాజపేయము, పౌండరీకము, చైనము మొదలగు కర్మలు కూడా ఉన్నాయి.

పరమేశ్వరికి యజ్ఞములయందు మక్కువ ఎక్కువ. యజ్ఞము పరమేశ్వరి స్వరూపము. యజమాని ఆమె స్వరూపమే. యజమాని భార్య కూడా దేవిస్వరూపమే.

ఈ రకంగా స్మార్తకర్మలు చేసిన వారికి ఆ పరమేశ్వరి శాశ్వతమైన ఐశ్వర్యమునిస్తుంది. అంతేకాని మోక్షాన్ని ఇవ్వదు. కర్మలు చెయ్యటంవల్ల మోక్షంరాదు. పుణ్యం మాత్రమే వస్తుంది. తద్వారా స్వర్గలోక సుఖాలనుభవించి తిరిగి ఉత్తరజన్మ ఎత్తుతాడు. అదే స్మార్తకర్మల వలన ఫలితం. ఈ విషయాన్నే 942 నుంచి 963 వరకు నామాలలో చెప్పటం జరిగింది.

## 942. వ్యోమకేశీ

ఆకాశమే కేశములుగా గలది. ఆకాశమే ఆమె శిరస్సు. పరమేశ్వరుడు వ్యోమకేశుడు. అతని శక్తి కాబట్టి పరమేశ్వరి వ్యోమకేశి.

## 943. విమానస్థా

ఆకాశంలో తిరిగేవి విమానాలు. వాటిరూపంలో ఉండేది పరమేశ్వరి. కాబట్టే విమానస్థా అనబడుతోంది.

విమానము అంటే మెడ పై భాగము. శరీరంలో సహస్రారం శిరస్సునందుంటుంది. ఆ సహస్రారంలోని చంద్రమండలంలో ఉంటుంది పరమేశ్వరి. అందుకే విమానస్థా అనబడుతోంది.

దేవి మేరుపర్వత శిఖరాగ్రాన ఉంటుంది. అందుచేత విమానస్థా అనబడుతుంది.

శ్రీచక్రంలో పైభాగాన తొమ్మిదవ ఆవరణలో ఉంటుంది. కాబట్టి విమానస్థా అనబడుతుంది. సదా అంతరిక్షంలోనే ఉంటుంది. కాబట్టి విమానస్థా అనబడుతుంది.

## 944. వజ్రిణీ

వజ్రి – వజ్రాయుధం ధరించినవాడు. ఇంద్రుడు అతని భార్య వజ్రిణీ. ఇంద్రాణి, శచీదేవి.

వజ్రమును ఆయుధముగా ధరించినది.

వజ్రములు పొదిగిన ఆయుధములు ధరించినది.

## 945. వామకేశ్వరీ

వామకేశ్వర తంత్రరూపము గలది. వామకేశ్వర తంత్రాన్ని ప్రతిపాదించే దేవి.

దేవతలలో వామకులు అనేవారు ఒక గణము. వారికి ఈశ్వరి. కాబట్టి వామకేశ్వరి అనబడింది.

వామకేశ్వరుని శక్తి కాబట్టి వామకేశ్వరి అనబడింది.

## 946. పంచయజ్ఞప్రియా

ఐదురకాల యజ్ఞములయందు ప్రీతి గలది. వేదములో ఈ యజ్ఞాలను.

1. అగ్నిహోత్ర
2. దర్శపూర్ణమాసలు
3. చాతుర్మాస్యలు
4. పశుయాగము
5. సోమయాగము

స్మృతులలో

1. దేవయజ్ఞము
2. పితృయజ్ఞము
3. బ్రహ్మయజ్ఞము
4. మనుష్యయజ్ఞము
5. భూతయజ్ఞము

పాంచరాత్రాగమంలో

1. అభిగమనము
2. ఉపాదానము
3. ఇజ్య
4. స్వాధ్యాయము
5. యోగము

కులాగమమునందు పూజావిధులు ఐదురకాలు.

1. కౌవల
2. యామళ
3. మిశ్ర
4. చక్రయక్
5. వీరసంగ్రహము

మంత్రమహౌదధిలో

| | | |
|---|---|---|
| 1. ఆతురీ | 3. దౌర్బోధీ | 5. భవాని |
| 2. సౌతుకీ | 4. త్రాసిసాధన | |

పంచగవ్యములు

| | | |
|---|---|---|
| 1. గోమూత్రము | 3. గోక్షీరము | 5. గోఘృతము |
| 2. గోమయము | 4. గోదధి | |

| | | |
|---|---|---|
| 1. ద్యురూపాగ్నిలో | 3. పృథివీరూపాగ్నిలో | 5. స్త్రీరూపాగ్నిలో |
| 2. పర్జన్యరూపాగ్నిలో | 4. పురుషరూపాగ్నిలో | |

చేసే యాగాలు. వీటన్నింటినీ పంచయజ్ఞాలు అంటారు. వీటియందు పరమేశ్వరికి ప్రీతి ఎక్కువ. అందుచేత పంచయజ్ఞప్రియా అనబడుతోంది.

దైనందిన జీవితంలో ప్రతివారూ ఏదోరకంగా హింసచేస్తారు. హింస అంటే జంతువులను చంపటము లేక బాధించటమేకాదు. చెట్ల ఆకులు, పూవ్వులు, కాయలు, దుపంలు వంటివి కోసుకురావటం కూడా హింసే. అయితే చెట్లు బాధపడటం మన కంటికి కనిపించదు. అంతమాత్రంచేత అది హింసకాకపోదు. ఈ రకంగా ఎటువంటి వారైనా సరే హింస చేస్తూనే ఉంటారు. అటువంటి హింసలకు ప్రాయశ్చిత్తమే పంచయజ్ఞాలు. పరమేశ్వరికి వీటియందు ప్రీతి. కాబట్టి పంచయజ్ఞప్రియా అనబడుతుంది.

## 947. పంచప్రేతమంచాధిశాయినీ

బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వరులు నాలుగుకాళ్ళుగ, సదాశివుడు పలకగ ఉన్న మంచముపైన అధిష్ఠించి ఉన్నది.

| | | |
|---|---|---|
| ఆధార స్వాధిష్ఠాల తరువాత | – | బ్రహ్మగ్రంథి |
| మణిపూర అనాహతాల తరువాత | – | విష్ణుగ్రంథి |
| అనాహత, విశుద్ధిల తరువాత | – | రుద్రగ్రంథి |
| లలాటం పైన | – | ఈశ్వరగ్రంథి |
| సహస్రారంలో | – | సదాశివగ్రంథి |

ఇవే పంచప్రేతాసనాలు. వీటిపైన బైందవ స్థానంలో మహాకామేశ్వరుడు. అతని వామాంకమునందు మహాకామేశ్వరి ఉంటారు. అందుచేతనే పరమేశ్వరి పంచప్రేత మంచాధిశాయినీ అనబడింది.

గతంలో 'పంచప్రేతాసనాసీనా' అనే నామంలో ఇచ్చిన వివరణ అంతా ఇక్కడ కూడా వర్తిస్తుంది.

## 948. పంచమీ

పంచ బ్రహ్మలలో ఐదవవాడయిన సదాశివుని భార్య. త్రిమూర్తులలో రుద్రుడు శ్రేష్ఠుడు. పరమశివుడు మాయాయుక్తుడు. అంబాసహితుడైన సదాశివుడు మాయతో కూడినవాడు కాబట్టి సర్వజ్ఞుడు. వీరందరిలోనూ సదాశివుడే శ్రేష్ఠుడు అని సూతగీత యందు చెప్పబడింది.

బ్రహ్మాది శక్తులలో ఐదవది వారాహి

1. బ్రాహ్మి
2. మాహేశ్వరి
3. కౌమారి
4. వైష్ణవి
5. వారాహి

కాబట్టి పంచమీ అంటే – వారాహి దేవత అని అర్థం. మకార పంచకంలో ఐదవది ఆనందరూపము. కాబట్టి పంచమీ అంటే – ఆనందరూపిణి.

పంచవిధ ముక్తులలో ఐదవది సాయుజ్యము. పరమేశ్వరి ఎప్పుడూ తురీయాతీతంలోనే ఉంటుంది. కాబట్టి పంచమీ అనబడుతుంది.

## 949. పంచభూతేశీ

పృథివి మొదలైన పంచభూతాలకు ఈశ్వరి. ఐదువిధాలయిన భూతాలుగా పుట్టినది. పంచమహాభూతాత్మురాలు.

పంచభూతేశి – వైజయంతిమాల. దీనిని పంచభూతమాల అనికూడా అంటారు. ముత్యములు, మాణిక్యములు, మరకతములు, ఇంద్రనీలమణులు, వజ్రములు వీటితో సమానమైన వర్ణములు గలది.

| | | |
|---|---|---|
| పృథివి నుండి | – | నీలమణి |
| నీటి నుండి | – | ముత్యము |
| తేజస్సు నుండి | – | కౌస్తుభము |
| వాయువునుండి | – | వైడూర్యము |
| ఆకాశము నుండి | – | పుష్యరాగము |

వచ్చినాయి. ఈ మొత్తం కలిసి వైజయంతిమాల అయి విష్ణువునలంకరించింది. అని విష్ణుపురాణంలో చెప్పబడింది. కాబట్టి పంచభూతేశి అంటే వైజయంతిమాలచే అలంకరించబడినది.

పంచభూతాలను తన వశములో ఉంచుకుని, వాటిని కావలసినవిధంగా ఉపయోగించి ఈ జగత్తును సృష్టిస్తున్నది. కాబట్టి పరమేశ్వరి పంచభూతేశీ అనబడింది.

## 950. పంచసంఖ్యోపచారిణీ

**పంచ సంఖ్యా గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యాఖ్యా ఉపచారా అస్యాః**

గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యములను ఐదు ఉపాచారములచే పూజించబడునది.

పరమేశ్వరి పూజలో ఉపచారాలు చెయ్యటం విధి. అవి 1. పంచోపచారాలు 2. షోడస్యోపచారాలు 3. చతుష్షష్ఠి ఉపచారాలు ఇలా ఉంటాయి. వీటిలో సాధారణంగా జపం చేసుకునే సమయంలో **లమిత్యాది పంచపూజాం కరిష్యే** అంటారు. అవి

1. లం పృథివీతత్త్వాత్మికాయై శ్రీపరదేవతాయై గంధం సమర్పయామి.
2. హం ఆకాశతత్త్వాత్మికాయై శ్రీ పరదేవతాయై పుష్పం సమర్పయామి.
3. యం వాయుతత్త్వాత్మికాయై శ్రీ పరదేవతాయై ధూపమాఘ్రాపయామి.
4. రం తేజస్తత్త్వాత్మికాయై శ్రీ పరదేవతాయై దీపం సమర్పయామి.
5. వం అమృతతత్త్వాత్మికాయై శ్రీ పరదేవతాయై నైవేద్యం సమర్పయామి.

సం సర్వతత్త్వాత్మికాయై శ్రీ పరదేవతాయై సర్వోపచార పూజాం సమర్పయామి.

ఈ రకంగా పంచోపచారములచే పూజింపబడేది. కాబట్టి పంచసంఖ్యోపచారిణీ అనబడుతుంది.

పరమేశ్వరి నుంచే పంచభూతాలు ఏర్పడ్డాయి. వాటివల్లనే మానవుడికి రాగద్వేషాలు, అహంకార మమకారాలు కలుగుతున్నాయి. కాబట్టి వాటితోనే పరమేశ్వరిని అర్చించాలి. అంటే వాటిని త్యజించి, పరమేశ్వరికి నివేదన చెయ్యాలన్నమాట. అదే పంచోపచారపూజ. ఈ రకంగా పూజించబడుతుంది. కాబట్టి పంచసంఖ్యోపచారిణీ అనబడుతుంది.

## 951. శాశ్వతీ

మరల మరల అభ్యసించబడునది.

**ఈ శ్వత్ సర్వేషుకాలేషు భవతీతి శాశ్వతః**

సర్వకాలములందు ఉండునది. కాబట్టి శాశ్వతి నిత్యురాలు.

**సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ**

సత్యము జ్ఞానము అనంతమైనది. భూతభవిష్యద్వర్త మానకాలాలు మూడింటియందు ఉండేది.

**శాశ్వతం శివ మచ్యుతమ్**

పరమేశ్వరుడు శాశ్వతుడు. నాశనములేనివాడు. అదే పరమేశ్వరి. అందుకే శాశ్వతీ అనబడుతున్నది.

## 952. శాశ్వతైశ్వర్యా

**శాశ్వతం నిత్యం ఐశ్వర్యం యస్యాః సౌ**

నిత్యమైన ఐశ్వర్యముగలది. ఆమె ఐశ్వర్యము మహదైశ్వర్యము. బ్రహ్మాదిదేవతలు ఆమె సింహాసనానికి కాళ్ళు. లక్ష్మీపార్వతులు వింజామరలు వీస్తుంటారు. ఇంద్రుడు తమ్మిపడిగ. ఈ రకంగా పధ్నాలుగు భువనాలలోను ప్రసిద్ధులైన దేవతలు, సృష్టిస్థితి లయకారకులైన త్రిమూర్తులు ఎల్లవేళలా ఆమెను సేవిస్తూ ఉంటారు.

ఐశ్వర్యానికి ఫలము కోరికలన్నీ తీరిపోవటం. ఇంక ఏ కోరికా లేకపోవటం. అటువంటి కోరికలులేని స్థితి శాశ్వతముగా పొందినది. అందుచేత శాశ్వతైశ్వర్యా అనబడుతోంది. ఇదే మోక్షస్థితి. రాగద్వేషాలు లేకుండా ఉండే స్థితి. దేవి ఎల్లవేళలయందు ఆ స్థితిలోనే ఉంటుంది. తన భక్తులకు అర్హతలను బట్టి ఆ స్థితిని ప్రసాదిస్తుంది. అందుకే ఆమె శాశ్వతైశ్వర్యా అనబడుతోంది.

## 953. శర్మదా

**శర్మ సుఖందత్తే**

సుఖము నిచ్చునది. పరమేశ్వరి తన భక్తులకు సుఖము సంతోషము ఇస్తుంది. కాబట్టి శర్మదా అనబడుతోంది. శర్మము అంటే – సుఖం. అది వట్టి సుఖం కాదు. అనంతమైన సుఖము. మహదానందము. ఆ దేవివలన భక్తులు అనంత సుఖ స్వరూపమైన బ్రహ్మానందాన్ని పొందుతున్నారు.

కోరికలు ఉన్నవాడు ఆనందం పొందలేడు. ఒక కోరిక తీరితే ఇంకొక కోరిక పుడుతుంది. కోరికలు లేనటువంటి స్థితే ఆనందము. అటువంటి ఆనందస్వరూపిణి పరమేశ్వరి. అదే బ్రహ్మానందం. ఇది ముక్తి పొందినవారికి మాత్రమే లభిస్తుంది. ఇటువంటి ఆనందాన్ని ఇస్తుంది. కాబట్టి పరమేశ్వరి శర్మదా అనబడుతోంది.

## 954. శంభుమోహినీ

**శం భావయతి భవతే వా శంభుః**

సుఖమును గలిగించువాడు శంభుడు. సుఖస్వరూపుడు శంభుడు. శంభుడు ఇంద్రియాలను జయించినవాడు. అటువంటి శంభుని చలింపచేయునది. శంభుని భ్రమింపచేయునది. శంభుని మోహింపచేయునది. సృష్టి ప్రారంభానికి ముందు మహా కామేశ్వరుణ్ణి చలింపచేసి సృష్టి చెయ్యాలనే సంకల్పం కలిగించింది కాబట్టి శంభుమోహినీ అనబడుతుంది.

అమృతం కోసం దేవదానవులు క్షీరసాగరమధనం చేస్తున్నారు. క్షీరసాగరంలో నుంచి కామధేనువు, కల్పవృక్షం, ఐరావతం, కాలకూటం పుట్టినాయి. చివరగా అమృతం వచ్చింది. ఆ అమృతం కోసం దేవదానవులు మళ్ళీ తగవులాడుకుంటున్నారు. ఈ సమయంలో విష్ణుమూర్తి మోహినీ రూపంలో అక్కడికి వచ్చి రాక్షసులను భ్రమింపచేసి అమృతాన్ని దేవతలకు పంచాడు. అప్పుడు మోహినిని చూశాడు గరళకంఠుడు. అంతే, అతని మనస్సుకాస్తా చలించిపోయింది. ఆ తరువాత జరిగినదే హరిహరసుత (అయ్యప్ప) జననం. ఈ రకంగా జితేంద్రియుడైన శంభుని కూడా మోహింపచేసింది. కాబట్టి శంభుమోహినీ అనబడుతోంది.

## 955. ధరా

**ధరా పృథ్వీస్వరూపా**

పృథ్వీ స్వరూపము గలది. సమస్త జగత్తులను ధరించునది.

**సర్వస్య జగతోధారణాత్**

చరాచరజగత్తునంతటినీ ధరించునది. జగత్తులకన్నింటికీ అధిష్ఠానమైంది. ఆధారమైంది. అదే పృథివి. వరాహరూపంలో విష్ణువు యొక్క కోరలచే రక్షించబడినది. క్షమాస్వరూపిణి.

## 956. ధరసుతా

**ధరస్య హిమవత్పర్వతస్య సుతా**

ధరుడు – హిమవంతుడు. హిమవంతుని కుమార్తె పార్వతి పరమేశ్వరి స్వరూపము. కాబట్టి ఆ పరమేశ్వరి ధరసుతా అనబడుతున్నది. ఈ భూమి నుంచి పుట్టే ప్రతి వస్తువు అంటే కొండలు, బండలు, ఔషధులు అన్నీ పరమేశ్వరి స్వరూపమే. అందుకే ప్రకృతి స్వరూపమైన పరమేశ్వరి ధరసుతా అనబడుతోంది.

## 957. ధన్యా

**ధన్యా కృతార్థా**

కృతార్థురాలు.

ఉపనిషత్తులను భావించటము, మహావ్రతాలభావన, బంధమోక్షము, గతాగతముల కారణచింత, పంచేంద్రియాలను శాంతింపచేయుట, భూతదయతో చేయు ధ్యానము ధన్యము అని బ్రహ్మాండపురాణంలో చెప్పబడింది.

పరమేశ్వరి సకలైశ్వర్యములతో తులతూగునది. కాబట్టి ధన్యా అనబడుతున్నది. తన భక్తులందరినీ ధన్యులుగా చేస్తుంది. కాబట్టి ధన్యా అనబడుతుంది. చెయ్యాలనుకున్నది అంతా చేస్తుంది. ఏమీ మిగల్చదు. కాబట్టి ధన్యా అనబడుతుంది.

## 958. ధర్మిణీ

**ధర్మశీలత్వాత్ ధర్మిణీ**

ధర్మగుణం గలది కాబట్టి ధర్మిణీ అనబడుతుంది. పరమేశ్వరి శ్రుతి, స్మృతులలో చెప్పిన సకలధర్మస్వరూపిణి.

**ధర్మాన్ ధారయతీతి ధర్మీ**

ధర్మాలను ధరించునది. ధర్మాలను ఆచరించునది. కాబట్టి ధర్మిణీ అనబడుతున్నది.

ధర్మము అంటే – పుణ్యము, న్యాయము, స్వభావము, ఆచారము, వేదోక్తవిధి, సత్కార్యము, నీతి అని అర్థం. సమాజంలో ఎక్కువమందికి మంచిని చేకూర్చేది ధర్మము. శిష్టరక్షణకోసం రాక్షస సంహారం చెయ్యటం ధర్మం. ఈ రకంగా ధర్మాన్ని ఆచరించేది. తన భక్తులతో కూడా ధర్మాన్ని ఆచరింపచేసేది. కాబట్టి ధర్మిణీ అనబడుతుంది.

# 959. ధర్మవర్ధినీ

**ధర్మం వర్ధయతీతి ధర్మవర్ధనీ**

ధర్మాన్ని వృద్ధి పరచునది. శృతి స్మృతులలో చెప్పిన విధానమే ధర్మము. అటువంటి ధర్మాలను ఆచరించటానికి ప్రోత్సహించేది కాబట్టి పరమేశ్వరి దర్మవర్ధినీ అనబడుతుంది. ఆమెను ఆరాధించేవారి హృదయాలలో ధర్మవర్తన, మోక్షవాంఛ ప్రవర్తిల్లచేస్తుంది. కాబట్టి ధర్మవర్ధినీ అనబడుతుంది.

మోక్షగామి అయినవాడు ఆచరించవలసిన ధర్మాలు కొన్ని ఉన్నాయి. అవి

1. భూశయనము
2. మితాహారము
3. శాంతస్వభావము
4. ఇంద్రియాలను జయించటము
5. సద్గుణసంపత్తి
6. పరోపకారము
7. మితభాషణ
8. శాకాహారభక్షణ
9. సాత్వికాహారభక్షణ
10. చాంద్రాయణాది వ్రతాచారణ

ఇవి సామాన్య ధర్మాలు. ఇవికాక

1. బ్రహ్మచర్య పాలన
2. దేవఋణము ప్రితృఋణము తీర్చుకోవటం
3. యజ్ఞయాగాదులు నిర్వర్తించటం.

ఇవికూడా ధర్మాలే. ఇటువంటి ధర్మాలను చెయ్యటానికి పరమేశ్వరి తన భక్తులను ప్రోత్సహిస్తుంది. కాబట్టి ధర్మవర్ధినీ అనబడుతుంది.

ధర్మానికి నాలుగుపాదాలున్నాయి. అవి

1. సత్యము 2. న్యాయము 3. దయ 4. తపస్సు

ఈ నాలుగుపాదాలు గల ధర్మాన్ని రక్షించేది.

**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే**

ధర్మం నాశనమయిపోయినప్పుడు, ఆ ధర్మాన్ని రక్షించటానికి పరమాత్మ ప్రతియుగంలోనూ అవతరిస్తూనే ఉంటాడు.

## 960. లోకాతీతా

అన్ని లోకాలకు అతీతమైనది. సత్యలోకం తరువాత కైలాసమున్నది. కైలాసానికి పైన విష్ణులోకమున్నది. దానిపైన గోలోకమున్నది. గోలోకానికి పైభాగాన మణిద్వీపమున్నది. అక్కడ పరమేశ్వరి నివశిస్తుంది. ఈ రకంగా అన్ని లోకాలకు అతీతమైనది. కాబట్టి లోకాతీతా అనబడుతుంది.

మానవశరీరంలో ఆధారాదిషట్చక్రాలు ఉన్నాయి. వాటిపైభాగాన సహస్రదళ పద్మమున్నది. అందులో చంద్రమండలమున్నది. ఆ చంద్రమండలంలో పరమేశ్వరి ఉంటుంది. అందుచేతనే లోకాతీతా అనబడుతోంది.

## 961. గుణాతీతా

**అత ఏవ గుణా న తీతా**

గుణములను మించినది. పరమేశ్వరుడు నిరాకారుడు నిర్గుణస్వరూపుడు. గుణాలు ఏవీ లేనివాడు గుణాలకు పూర్వమే ఉన్నవాడు. గుణాలను సృష్టించినవాడు.

పంచతన్మాత్రలైన శబ్ద స్పర్శ రూప రస గంధాలను సృష్టించినవాడు. సత్వరజస్తమో గుణాలను సృష్టించినవాడు.

ధైర్యము, సాహసము, పరాక్రమము, దయ, క్షమ ఇత్యాదిగుణాలను సృష్టించినవాడు. ఉప్పు, పులుపు, తీపి, కారం, చేదు, వగరు మొదలైన గుణాలను సృష్టించినవాడు.

ఇన్ని గుణాలను సృష్టించినప్పటికీ, తన కంటూ ఏ గుణములేనివాడు. గుణాతీతుడు. అందుచేతనే పరమేశ్వరి గుణాతీతా అనబడుతుంది.

## 962. సర్వాతీతా

అన్నింటినీ మించినది. అన్నింటికీ అతీతమైనది. 'శబ్దాన్ని కూడా మించినది ఆత్మరూపము' అని జ్ఞానార్ణవ తంత్రం చెబుతోంది. చరాచరవస్తుసముదాయానికి అతీతమైనది. నామరూపాత్మకమైన జగత్తుకు అతీతమైనది. త్రిగుణాలకు అతీతమైనది త్రిశుక్తులకు అతీతమైనది. త్రిమూర్తులకు అతీతమైనది. సృష్టి,స్థితి, లయాలకతీతమైనది. పంచభూతాలకు అతీతమైనది. చతుర్వింశతి తత్త్వాలకు అతీతమైనది. ఈ రకంగా అన్ని పదార్థాలకు అతీతమైనది. కాబట్టి సర్వాతీతా అనబడుతోంది.

## 963. శమాత్మికా

**శమః ప్రపంచోపశమ ఏవ ఆత్మా స్వరూపం యస్యాః**

ప్రపంచోపశమమే స్వరూపముగా గలది. నృశింహోపనిషత్తులో "ప్రపంచోపశమము నాల్గవశివాద్వైతము" అని చెప్పబడుతోంది.

**ఉపశాంతోఽయ మాత్మా**

శాంతమే స్వరూపంగా గల ఆత్మస్వరూపము. ఇది శాంతమైన ఆత్మగుణాలు గల వారి దగ్గర మాత్రమే ఉంటుంది. నిష్క్రియాపరత్వము గలది. శాంతస్వభావం గలది. కాబట్టి శమాత్మికా అనబడుతోంది.

ఈ రకంగా స్మార్తకర్మలను గురించి వివరించబడింది.



శ్రీ 'ట'కార దేవి

## 56. సువాసినీపూజ

చక్రార్చనలో సువాసినీపూజ అత్యంత ముఖ్యమైనది. సువాసిని అంటే సుమంగళి. భర్తతో సంసారం చేస్తున్న స్త్రీ. బిడ్డల తల్లి.

పరమేశ్వరి నిత్యసువాసిని. లోకంలోని సువాసినులందరియందు ఉంటుంది. కాబట్టి పూజావిధానంలో ఒక స్త్రీని పరమేశ్వరి స్వరూపంగా భావించి ఆమెను షోడశోపచారవిధిని పూజించాలి. ఆ సువాసినికి కులమతాలతో సంబంధంలేదు. ఈ పూజకు ఎక్కువ కులం వారు కూర్చోవాలని, తక్కువ కులం వారు కూర్చొనరాదని ఏ రకమైన నియమాలు లేవు. అందరు స్త్రీలు పరమేశ్వరి స్వరూపమే. అందుకని ఎవరినైనా సువాసినిగా కూర్చుండబెట్టవచ్చు. అయితే ఇందులో ఏరకమైన స్వార్థం ఉండరాదు. సువాసినిగా కూర్చునే స్త్రీకి మంత్రానుష్ఠానము తప్పనిసరిగా ఉండితీరాలి. మంత్రోపదేశం లేకపోతే బ్రాహ్మణ స్త్రీ అయినా పూజకు పనికిరాదు. మంత్రోపదేశం గనక ఉంటే తక్కువ కులం స్త్రీనయినా సువాసినిగా అర్చించవచ్చు. అని కులార్ణవతంత్రం చెబుతోంది. చక్రార్చన చేసినప్పుడల్లా శక్త్యానుసారం సువాసినీపూజ చెయ్యాలి.

నవరాత్రులలో తొమ్మిదిరోజులూ పరమేశ్వరిని అర్చించటం జరగుతుంది. దేవీ నవరాత్రులు సంవత్సరానికి నాలుగుసార్లు చెయ్యాలి.

1. చైత్రమాసం 2. ఆషాఢమాసం 3. ఆశ్వీయుజమాసం 4. మాఘమాసం

ఈ నవరాత్రులలో ఉదయంపూట కుమారి అర్చన. రాత్రిపూట సువాసిని అర్చన చెయ్యాలి.

పరమేశ్వరి మంకెన్నపువ్వు వంటి శరీరచ్ఛాయతో ప్రకాశిస్తుంటుంది. ఆమె బాలాత్రిపురసుందరి రూపం కూడా. పరమేశ్వరి నిత్యసుమంగళి. అందుకనే దేవీపూజలో విధిగా సువాసిని అర్చన చెయ్యబడుతుంది. సువాసినీ అర్చనతో ఆమె ప్రీతి చెందుతుంది. ఈ రకంగా అర్చన చేసిన వారి మనోవాంఛితాలన్నీ ఆ పరమేశ్వరి నెరవేరుస్తుంది.

## 964. బంధూకకుసుమప్రఖ్యా

బెంగాల్ ప్రాంతంలో ప్రసిద్ధమైనది బంధూకవృక్షము. బంధూకపుష్పపుకాంతివలె ఎర్రనైన కాంతి గలది. దీన్నే మన ప్రాంతంలో జపాకుసుమము అంటారు. అదే

మంకెనచెట్టు. పరమేశ్వరి జపాకుసుమములాగా, దాడిమీ కుసుమములాగా అరుణారుణ వర్ణంతో ప్రకాశిస్తుంది అని గతంలో వివరించటం జరిగింది.

**జపాకుసుమ సంకాశౌ మధుఘూర్ణిత లోచనౌ**

**జగతః పితరౌవందే భైరవీ భైరవాత్మకౌ ॥**

## 965. బాలా

బాలా అంటే - కుమారీ అని అర్థం. త్రిపురాసిద్ధాంతంలో

**బాలా లీలావిశిష్టత్వాత్ బాలే తికథితా ప్రియే.**

బాలలీలలు కల దానివి కాబట్టి బాలా అనబడుచున్నావు అని చెప్పబడింది.

పరమేశ్వరియే బాలాత్రిపురసుందరి రూపంలో ఉన్నది. భండాసురునితో యుద్ధం జరుగుతున్నప్పుడు భండాసురుని పుత్రులందరినీ బాల సంహరించింది. ఈ విషయం భండాసురవధలో వివరించబడింది. నవరాత్రులలో పూజచేసేటప్పుడు ప్రతిరోజూ కుమారీ పూజ చెయ్యాలి. అందులో రెండు సంవత్సరాల బాలిక నుంచి పది సంవత్సరాల బాలిక వరకు, రోజూ ఒకరిని చొప్పున, వయస్సు ప్రకారం అర్చించాలి.

**ఏకవర్షా నకర్తవ్యా కన్యా పూజా విధౌనృప ।**

**పరమజ్ఞాతు భోగానాం గంధాదీనాంతు బాలికా ॥**

**కుమారికా తు సా ప్రోక్తా ద్వివర్షా యా భవే దిహ ।**

**త్రిమూర్తిశ్చ త్రివర్షాచ కల్యాణీ చతురబ్దికా ॥**

**రోహిణీ పంచవర్షా చ షడ్వర్షా కాలికా స్మృతా ।**

**చండికా సప్తవర్షా స్యా దష్టవర్షా చ శాంభవీ ॥**

**నవవర్షా భవే ద్దుర్గా సుభద్రా దశవార్షి కీ ।**

**అత ఊర్ధ్వం నకర్తవ్యా సర్వకార్య విగర్హితా ॥**

| | | |
|---|---|---|
| రెండు సంవత్సరాల వయసు గలది | - | కుమారి |
| మూడు సంవత్సరాల వయసు గలది | - | త్రిమూర్తి |
| నాలుగు సంవత్సరాల వయసు గలది | - | కళ్యాణి |

| | | |
|---|---|---|
| ఐదు సంవత్సరాల వయసు గలది | – | రోహిణి |
| ఆరు సంవత్సరాల వయసు గలది | – | కాళి |
| ఏడు సంవత్సరాల వయసు గలది | – | చండిక |
| ఎనిమిది సంవత్సరాల వయసు గలది | – | శాంభవి |
| తొమ్మిది సంవత్సరాల వయసు గలది | – | దుర్గ |
| పది సంవత్సరాల వయసు గలది | – | సుభద్ర |

రెండు సంవత్సరాలకన్న తక్కువ వయస్సువారుగాని, పది సంవత్సరాలకన్న ఎక్కువ వయస్సువారు కాని కుమారి పూజకు పనికిరారు.

వీరిని అర్చించినట్లైతే పరమేశ్వరి మహాప్రీతి చెందుతుంది. మంత్రశాస్త్రంలో బాలామంత్రం ప్రత్యేకంగా ఉన్నది.

**వాగ్భవం ప్రథమం బీజం కామరాజం ద్వితీయకమ్**
**తృతీయం శక్తికూటాఖ్యం నిగమ త్రితయోద్ధృతమ్**
**ఇత్థం కుమారీ విద్యాయా బీజత్రయ ముదీరితమ్ ॥**

బాలామంత్రానికి

| | | |
|---|---|---|
| మొదటిది | – | వాగ్భవబీజము |
| రెండవది | – | కామరాజబీజము |
| మూడవది | – | శక్తిబీజము |

## 966. లీలావినోదినీ

ప్రాపంచిక క్రీడయే లీల. జగస్సృష్టి స్థితి లయలే లీల. అటువంటి క్రీడయే వినోదముగా గలది. పరమేశ్వరి పంచకృత్యపరాయణ. అటువంటి పంచకృత్యములే క్రీడగా గలది కాబట్టి లీలావినోదినీ అనబడుతున్నది.

## 967. సుమంగలీ

**శోభనం మంగళం అస్యాః**

శోభనమైన మంగళము గలది. ఇది సువాసినికి పేరు. పరమేశ్వరి నిత్యసుమంగళి. ఆమె భర్త మృత్యుంజయుడు. అతడు మృత్యువుకు కూడా మృత్యువు.

జగత్తులో శ్రీవిద్యామంత్ర దీక్ష తీసుకున్న స్త్రీ మూర్తులందరియందు ఉంటుంది. కాబట్టి సుమంగళీ అనబడుతుంది. మంగళము అంటే బ్రహ్మ. కాబట్టి ఆమె పరబ్రహ్మ స్వరూపము.

**అశుభాని నిరాచష్టే తనోతి శుభసంతతిం**

**స్మృతి మాత్రేణ యత్పుంసాం బ్రహ్మ తన్మంగళం విదుః**

ఏ పరమశక్తిని స్మరించినంత మాత్రంచేత సర్వమానవులకు దౌర్భాగ్యాలు నశిస్తాయో ఆ దేవత సుమంగళి అనబడుతుంది.

మానవులు చెడుపనులు చెయ్యకుండా చేసేది, మంచి పనులు మాత్రమే ఆచరించేటట్లు చేసే శక్తి ఏదైతే ఉన్నదో అదే సుమంగళి.

## 968. సుఖకరీ

**సుఖ కర్తృత్వా త్సుఖకరీ**

సుఖమును చేయునది సుఖకరీ అనబడుతుంది. శరన్నవరాత్రులు, వసంత నవరాత్రలు జరిపే సందర్భంలో ప్రతిరోజూ కుమారీపూజ విధిగా చెయ్యాలి అని చెప్పబడింది. అలాగే శ్రీచక్రార్చన చేసేటప్పుడు అర్చనలో భాగంగా సువాసినీ పూజ చేస్తారు. ఈరెండు పూజలయందు పరమేశ్వరికి ప్రీతి ఎక్కువ. ఆ పూజచేసే వారియందు కూడా దేవికి ప్రీతి. వారియొక్క కోరికలు తీరుస్తుంది. వారికి ఇహము పరము అన్నీ సమకూరుస్తుంది. వారి అర్హతనుబట్టి శాశ్వతమైన ఆనందాన్ని ప్రసాదిస్తుంది. అదే ముక్తి.

లోకంలో తాత్కాలికంగా సుఖాన్ని కలుగచేసే సిరిసంపదలు, భోగభాగ్యాలు అన్నీ దుఃఖదాయకాలు. వీటివల్ల తాత్కాలిక సుఖం కలిగినా చివరగా దుఃఖమే మిగులుతుంది. శాశ్వతమైన సుఖాన్ని, ఆనందాన్ని ఇచ్చేది ముక్తి ఒక్కటే. అటువంటి మోక్షము ప్రసాదిస్తుంది. కాబట్టి సుఖకరీ అనబడుతుంది.

## 969. సువేషాఢ్యా

**శోభనేన వేషేణ ఆఢ్యా యుక్తా**

శోభనమైన వేషముతో కూడినది. మంచి అలంకారముతో ఉన్నది.

పరమేశ్వరి మంచి గుణవంతురాలు, శీలవంతురాలు, ఔదార్యసంపన్నురాలు. ఎంతటివారినైనా సమ్మోహనం చెయ్యగల వస్త్రభూషణాదులచే అలంకరించబడి ఉంటుంది. కాబట్టి సువేషాఢ్యా అనబడుతుంది.

## 970. సువాసినీ

సర్వకాల సర్వావస్థలయందు జీవించిఉన్న భర్త గలది. నిత్యసుమంగళి నిత్యమూ ఐదు అలంకారాలు గలది.

1. పసుపు కుంకుమ
2. గాజులు
3. మెట్టెలు
4. మంగళసూత్రాలు
5. నల్లపూసలు

ఇవి సౌభాగ్యాభరణాలు. సుమంగళిచిహ్నాలు. వీటిని నిత్యము ధరించునది. వీటిని ధరించి సువాసినిరూపంలో సర్వత్రా ఉండేది. కాబట్టి సువాసినీ అనబడుతుంది.

## 971. సువాసిన్యర్చనప్రీతా

**సువాసినీనా మర్చనేన ప్రీతా**

సువాసినీ స్త్రీల అర్చనచే ప్రీతినొందినది. శ్రీచక్రార్చన చేసిన తరువాత ముత్తైదువ అయిన ఒక స్త్రీని పరమేశ్వరి స్వరూపంగా భావించి ఆమెను షోడశోపచారవిధిని అర్చిస్తారు. ఇది సువాసినీపూజ. ఈ రకమైన పూజ యందు ప్రీతి గలది. అందుచేతనే సువాసిన్యర్చనప్రీతా అనబడుతోంది.

## 972. ఆశోభనా

**సమంతతః సౌందర్యవతీ**

అంతటా సౌందర్యము గలది.

తారకాసుర సంహారం కోసం దేవతలు పరమేశ్వరిని ప్రార్థించగా, ఆమె వారికి దర్శనమిచ్చింది. ఆమె రమణీయాంగి, కుమారి, నవయవ్వనయై అలరారుతున్నది. కిణకిణమను కింకిణుల మంజుల రావముచేయు మంజీర మేఖలము గలది. బంగారు కేయూరములతోను, గ్రైవేయములతోను అలంకరించబడినది. మెడను జాతిమణులతో కూర్చిన హారములు ధరించినది. శిగలో ధరించిన కేతకీ మొదలైన పూలవాసనకు గండుతుమ్మెదలు ఝుంకారము చేస్తున్నాయి. కర్పూరపు వీడియము నమలుచున్నది. అష్టమినాటి చంద్రుని వంటి ముఖము గలది. వెడల్పైన కనుబొమ్మలు, పద్మములవంటి కనులు గలది. ఎత్తైన నాసిక, మధురాధరము గలది. ఆమె దంతములు మల్లెమొగ్గలు.

వజ్రాలు పొదిగిన కిరీటం ధరించింది. కేశపాశాలు మల్లిక, మాలతీ సుమాలహారాలతో గుబాళిస్తున్నాయి. కస్తూరితిలకము ధరించింది. రక్తవస్త్రములు ధరించి దానిమ్మపూలవలె ఎర్రనికాంతులు విరజిమ్ముతున్నది. చేతులయందు పాశము, అంకుశము, వరద, అభయముద్రలు ధరించి జగన్మోహనాకారంగా ఉన్నది. అని దేవీభాగవతంలో చెప్పబడింది. పరమేశ్వరి అద్వితీయసౌందర్యవతి. అందుకే ఆశోభనా అనబడుతుంది.

## 973. శుద్ధమానసా

**శుద్ధం మానసం యస్యాః**

శుద్ధమైన మనస్సు గలది.

పరమేశ్వరి ఏవిధమైన రాగద్వేషాలు లేనటువంటిది. నిర్మలమైన మనస్సు గలది. అంతేకాదు. నిర్మల మనస్సులయందు నివసించునది.

సంకల్ప వికల్పాలకు కారణము మనస్సు. ఎప్పుడైతే కోరికలు నశిస్తాయో, అప్పుడు మనస్సు నిర్మలము, శుద్ధము అవుతుంది. కోరికలు లేని మనస్సు ముఖ్యప్రాణంలో లయం చెందటమే తురీయస్థితి. పరమేశ్వరి ఎల్లవేళలయందు తురీయస్థితిలోనే ఉంటుంది. కాబట్టి శుద్ధమానసా అనబడుతుంది.

ఈ రకంగా 964 నుంచి 973 నామాలదాకా సువాసినీ అర్చన వివరించబడింది.



శ్రీ 'ర'కార దేవి

# 57. చక్రార్చన

పరమేశ్వరి యొక్క యంత్రరూపాన్నే శ్రీచక్రము అంటారు. ఇందులో మొత్తం తొమ్మిది ఆవరణలుంటాయి. ఆ ఆవరణలలో వివిధ దేవతలు ఉంటారు. వీరందరినీ తొమ్మిది ఆవరణలలోనూ విడివిడిగా అర్చించటాన్నే శ్రీచక్రపూజ, నవావరణార్చన లేదా చక్రార్చన అంటారు. శ్రీచక్రం మూడు ప్రస్తారాలుగా ఉంటుంది. అవి

1. భూప్రస్థారము
2. మేరు ప్రస్థారము
3. కైలాస ప్రస్థారము

అలాగే శ్రీచక్రపూజ కూడా మూడురకాలు అవి.

1. సృష్టిపూజ 2. స్థితిపూజ 3. సంహారపూజ. వీటిలో

| | | |
|---|---|---|
| మేరు చక్రం మీద | – | సృష్టిక్రమంలోను |
| కైలాసము, అర్ధమేరువుల మీద | – | సంహారక్రమము |
| భూప్రస్థారం మీద | – | స్థితిక్రమము |

లో ఈ అర్చన చెయ్యాలి. అయితే ఈ అర్చనావిధానంలో

| | | |
|---|---|---|
| 1. సృష్టిక్రమము | – | బిందువు దగ్గర మొదలుపెట్టి భూపురం దాకా అన్ని ఆవరణలను అర్చించటం. |
| 2. సంహారక్రమము | – | భూపురం దగ్గర మొదలుపెట్టి బిందువుదాకా ఆవరణ దేవతలను అర్చించటం. |
| 3. స్థితి క్రమము | – | అంతర్దశారం దగ్గర మొదలుపెట్టి భూపురం దాకా, ఆ తరువాత అష్టకోణం దగ్గర నుండి బిందువు దాకా ఆవరణ దేవతలను అర్చించాలి. |

చక్రార్చన ఎప్పుడూ సంహారాంతంగానే ఉండాలి. ప్రతి ఆవరణలోను ధూప దీప నైవేద్యాలు సమర్పించాలి. చక్రార్చనలో పాత్రాసాధన అనేది సంప్రదాయాన్ని బట్టి వేరువేరుగా ఉంటుంది. కాబట్టి దాన్ని గురు సంప్రదాయం ప్రకారమే చెయ్యాలి.

శ్రీచక్రాధి దేవత అయిన పరమేశ్వరి సృష్టికి ముందునుంచీ ఉన్నది. మేరుపర్వత శిఖరాన త్రిపురముల యందు ఉంటుంది. ఆమె పరబ్రహ్మ స్వరూపం. కాబట్టి జ్ఞానమయి. జ్ఞానముచేతనే ఆమెను తెలుసుకోవాలి. గుణాతీతురాలు. మహాత్రికోణమందుంటుంది. ఆమె నిష్కళంక. ఆమె చరిత్ర మహాద్భుతము. తన భక్తుల కోరికలను తీరుస్తుంది. ఆమెను పునశ్చరణ ద్వారానే పొందాలి. ఆమె తత్త్వాతీత. షడధ్వాతీత. కరుణాసముద్రురాలు. పాపాత్ములు పుణ్యాత్ములు అనే భేదం లేకుండా అందరి మీదా ఒకే రకమైన కరుణచూపుతుంది. భక్తుల యొక్క అజ్ఞానపు చీకట్లను పారద్రోలి జ్ఞానజ్యోతులు వెలిగిస్తుంది. ఆ బాలగోపాలము ఆమెను ఎరుగుదురు. ఆ పరమేశ్వరి శాసనాలు మీరటానికి లేదు. ఇటువంటి పరమేశ్వరి ఎక్కడ ఉంటుంది. అంటే శ్రీచక్రరాజమందు ఉంటుంది. ఆమె త్రిపురసుందరి. శివునితో తాదాత్మ్యం చెందిన లలితాంబిక. పరమేశ్వరి శ్రీచక్రంలో ఉంటుంది. కాబట్టి శ్రీవిద్యలో చక్రార్చన చాలా ముఖ్యమైనది.

**ఆశానాం పూరకం చక్రం అర్చకానాం అహర్నిశం**

తనను అర్చించే భక్తుల కోరిక ఇహముగాని పరముగాని తప్పక తీరుస్తుంది.

## 974. బిందుతర్పణసంతుష్టా

శ్రీచక్రంలో తొమ్మిదవ ఆవరణ సర్వానందమయ చక్రము. అక్కడ ఉండేది బిందువు. అదే నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయిన పరబ్రహ్మ. నాలుగు వర్ణములవారు తర్పణ చెయ్యటంచేత తృప్తి చెందుతుంది కాబట్టి బిందుతర్పణసంతుష్టా అనబడుతుంది.

| | | |
|---|---|---|
| బ్రాహ్మణులు | – | క్షీరముతోనూ |
| క్షత్రియులు | – | ఆజ్యముతోనూ |
| వైశ్యులు | – | తేనెతోనూ |
| శూద్రులు | – | కల్లుతోనూ |

బిందువునందు పరమేశ్వరికి తర్పణ చెయ్యాలి అని తంత్ర శాస్త్రాలు చెబుతున్నాయి.

శ్రీచక్రంలో బిందువు ముఖ్యమైనది. అది శివశక్తుల సంగమస్థానం. కాబట్టి అర్చనా కాలంలో పరమేశ్వరికి బిందువునందే తర్పణ చెయ్యాలి. ఆ తర్పణ దేవిని సంతృప్తి పరుస్తుంది. అందుచేతనే దేవి బిందుతర్పణసంతుష్టా అనబడుతుంది.

## 975. పూర్వజా

మొదట పుట్టినది. అన్నింటికన్నా ఆదియైనది. చతుర్ముఖుడైన బ్రహ్మకు పూర్వమే ఉన్నది. కర్మ బ్రహ్మను కూడా ఆమే సృష్టించింది. సృష్టికి ముందు పరమేశ్వరి ఇచ్ఛాశక్తిగా పరమేశ్వరునియందు ఆవిర్భవించి సృష్టి చెయ్యాలనే సంకల్పం కలిగించింది. ఈ రకంగా జగత్తును సృష్టించక పూర్వమే ఆమె ఉన్నది. ఆమె కారణంచేతనే ఈ జగత్తంతా సృష్టించబడింది. అందుచేతనే 'పూర్వజా' అనబడుతోంది.

## 976. త్రిపురాంబికా

శ్రీచక్రంలో ఎనిమిదవ ఆవరణ అయిన సర్వసిద్ధిప్రద చక్రమునకు అధిదేవత త్రిపురాంబా అనబడుతుంది.

ఎనిమిదవ ఆవరణే మహాత్రికోణము. దానికి అధిదేవత. త్రిపురములకు అధిపతి. స్థూలసూక్ష్మ కారణ దేహాలకు అధిపతి. వాగ్భవకామరాజు శక్తికూటాలకు అధిపతి. సత్వరజస్తమో గుణాలకు అధిపతి. సృష్టి స్థితి లయాలకు అధిపతి, జాగ్రస్వప్న సుషుప్తులకు అధిపతి. ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులకు అధిపతి. వామజ్యేష్ఠరౌద్రి శక్తులకధిపతి. మాతృ మాన మేయముల కధిపతి. ఈ రకంగా త్రిపుటికంతటికీ అధిపతి.

శ్రీచక్రంలో నవావరణ దేవతలు అంటే ఇచ్ఛా జ్ఞాన క్రియా శాంతాశక్తులు నలుగురు. వీరు ప్రకాశాంశ స్వరూపులు. వామా, జ్యేష్ఠా, రౌద్రి, అంబికా, పశ్యంతిలు విమర్శరూపులు ఈ తొమ్మిదిమంది నవావరణ దేవతలు. వీరికి మూలమైనది కాబట్టి పరమేశ్వరి త్రిపురాంబా అనబడుతున్నది.

## 977. దశముద్రాసమారాధ్యా

దశముద్రలతో, నిత్యాహృదయంలో చెప్పబడినట్లుగా ఆరాధించబడునది.

స్థితికాలమందు త్రిపురసుందరీ దేవి దశముద్రల రూపము పొంది నవచక్రాత్మకమైన ఈ విశ్వాన్ని సర్వసంక్షోభిణీ మొదలైన ముద్రలచే పాలించుచున్నది. శ్రీచక్రంలోని ఒక్కొక్క ఆవరణలో ఒక్కొక్క ముద్రను ప్రదర్శించాలి.

సర్వసంక్షోభిణీముద్ర – భూపురము

సర్వవిద్రావిణీముద్ర – షోడశదళము

| | | |
|---|---|---|
| సర్వాకర్షిణీముద్ర | – | అష్టదళము |
| సర్వవశంకరీ ముద్ర | – | మన్వస్రము |
| సర్వోన్మాదినీముద్ర | – | బహిర్దశారము |
| సర్వమహాంకుశముద్ర | – | అంతర్దశారము |
| సర్వఖేచరీముద్ర | – | అష్టకోణము |
| సర్వబీజముద్ర | – | త్రికోణము |
| సర్వయోనిముద్ర | – | బిందువు |
| సర్వత్రిఖండముద్ర | – | శ్రీచక్రమంతా |

సర్వత్రిఖండముద్ర త్రిపురసుందరీ రూపము. శ్రీచక్రమంతా వ్యాపించి ఉంటుంది. కాబట్టి ఈ ముద్ర ఆ దేవి సన్నిధిని కలుగచేస్తుంది. ఈ ముద్ర అన్ని చక్రములందు వ్యాపించి ఉంటుంది కాబట్టి బిందువులో ఉన్న త్రిపురసుందరితోపాటుగా అన్ని ఆవరణ దేవతలను ఆహ్వానించటానికి సర్వత్రిఖండముద్ర ఉపయోగపడుతుంది.

పరమేశ్వరి ఆరాధనలో ఈ ముద్రలను ప్రదర్శించాలి. అది పరమేశ్వరకి ప్రీతిదాయకం. కుడిచేతివ్రేళ్ళు శివతత్త్వము. ఎడమచేతి వ్రేళ్ళు శక్తితత్త్వము. ఈ రెండూ కలపటము అంటే శివశక్తుల సామరస్యము అదే సృష్టికి ప్రతీక.

ఈ ముద్రలు వేయటంలో సంప్రదాయ భేదమున్నది. కాబట్టి ముద్రలను వారివారి సంప్రదాయాలనుబట్టి గురువుగారి దగ్గర నేర్చుకోవటం మంచిది.

ఈ రకంగా పదిముద్రలచేత ఆరాధించబడుతుంది కాబట్టే దశముద్రాసమారాధ్యా అనబడింది.

## 978. త్రిపురా

మేరు పర్వత శిఖరాన తూర్పు, నైరుతి, వాయువ్య దిశలలో నిర్మించబడిన మూడు పురములు గలది. కాబట్టి త్రిపురా అనబడుతోంది.

ఇడా పింగళా సుషుమ్నా మూడు నాడుల స్వరూపంలో ఉన్నది కాబట్టి త్రిపురా అనబడుతుంది.

జాగ్రస్వప్న సుషుప్తులందుంటుంది కాబట్టి త్రిపురా అనబడుతుంది. చంద్రసూర్యాగ్నుల స్వరూపము కాబట్టి త్రిపురా అనబడుతున్నది.

సృష్టి స్థితి లయాల స్వరూపం. త్రిమూర్తుల స్వరూపం. త్రిశక్తుల స్వరూపం. ఈరకంగా త్రిపుటి అంతా పరమేశ్వరి రూపమే కాబట్టి త్రిపురా అనబడుతోంది.

## 979. శ్రీ వశంకరీ

శ్రీ వశంకరి – బ్రహ్మమునే వశము చేయునది. పరమేశ్వరి తన భక్తులకు మోక్షము ఇస్తుంది మోక్షము అంటే పరబ్రహ్మస్వరూపము. అనగా అర్హులైన భక్తులకు మోక్షమనే పరబ్రహ్మను వశం చేస్తుంది. కాబట్టి శ్రీ వశంకరి అనబడుతుంది. శ్రీ అంటే – లక్ష్మి. లక్ష్మీదేవిని కటాక్షింపచేయునది. భక్తులకు సిరిసంపదలను ఇచ్చునది. కాబట్టి శ్రీవశంకరీ అనబడుతుంది.

## 980. జ్ఞానముద్రా

తర్జని అంగుష్ఠములను కలపటమే జ్ఞానముద్రా అనబడుతుంది. చేతికి ఉన్న ఐదువ్రేళ్ళలో

| | | |
|---|---|---|
| కనిష్ఠిక | – | భార్య సంబంధము |
| అనామిక | – | పుత్ర సంబంధము |
| మధ్యమ | – | ధన సంబంధము |
| తర్జని | – | జీవాత్మ |
| అంగుష్ఠము | – | పరమాత్మ |

జీవాత్మ పరమాత్మల ఏకీభావమే జ్ఞానము. అందుచేత తర్జని, అంగుష్ఠాలను కలిపి సున్నాలా ఉంచితే అది జ్ఞానముద్ర అవుతుంది. దీన్నే చిన్మయముద్ర అని కూడా అంటారు. ఈ ముద్ర పరదేవతా స్వరూపము జీవాత్మ పరమాత్మల ఏకీభావమును చెబుతుంది. ఈ రెండు వ్రేళ్ళూ సున్నాలా ఉండటం పరబ్రహ్మ బిందురూపుడు అని చెప్పటం. అన్ని ముద్రలకన్న ఈ ముద్ర ఉత్తమోత్తమము. పరమేశ్వరికి ప్రీతిదాయకము.

## 981. జ్ఞానగమ్యా

జ్ఞానముచే పొందదగినది. ఏ ఇతర ఆధారాలు లేకుండా తనకు తానే ప్రకాశించేది. స్వయంప్రకాశి. ఇతరులను ప్రకాశింపచేస్తుంది అదే జ్ఞాన స్వరూపము. అటువంటి దేవతారూపం గురించి తెలుసుకోవటము జ్ఞానముచేత మాత్రమే సాధ్యమవుతుంది.

వేదాలు చదివినంత మాత్రంచేత ముక్తిరాదు. శాస్త్ర పాండిత్యంవల్ల ముక్తిరాదు. ఆధ్యాత్మిక ప్రవచనాలు చేస్తే ముక్తిరాదు. వాటిని విన్నంతమాత్రంచేత కూడా ముక్తిరాదు. విన్న విషయాన్ని మనసుకు పట్టించుకోవాలి. దాన్ని ఆచరణలో పెట్టాలి. ఈ జగత్తంతా పరమేశ్వర స్వరూపమే అని భావించాలి. త్రికరణశుద్ధిగా వాటిని ఆచరించాలి. తెలియని విషయాలను సద్గురువు దగ్గర తెలుసుకోవాలి. అప్పుడే ముక్తి లభిస్తుంది. జీవాత్మ పరమాత్మ ఒక్కటే ఆ రెండూ వేరు కాదు అనే భావన కలగటమే జ్ఞానము.

**జ్ఞానా దేవ తు కైవల్యం**

జ్ఞానంవల్లనే ముక్తి లభిస్తుంది. అందుచేత సాయుజ్యము అనేది కేవలం జ్ఞానంతో మాత్రమే పొందటానికి వీలవుతుంది. ఆ జ్ఞానస్వరూపమే పరమేశ్వరి కాబట్టే ఆమె జ్ఞానగమ్యా అనబడుతోంది. కూర్మపురాణంలో

**య త్తు మే నిష్కలం రూపం చిన్మాత్రం కేవలం శివం**
**సర్వోపాధి వినుర్ముక్త మనంత మమృతం పరం**
**జ్ఞానేనైకేన తల్లభ్యం క్లేశేన పరమం పదం**

నా నిష్కళమైన రూపము చిన్మాత్రము. కేవలము శివమైనది. సమస్త ఉపాధులచేత వదలబడినది. అటువంటి అమృతపరమైన నా రూపము కేవలము జ్ఞానముచేతనే పొందదగినది. జ్ఞానదృష్టిగల వారు మాత్రమే నన్ను చేరగలరు అని చెప్పబడింది.

జ్ఞాన స్వరూపమైన పరబ్రహ్మను చేరాలి అంటే కేవలము జ్ఞానమే మార్గము. అందుకే పరమేశ్వరి జ్ఞానగమ్యా అనబడుతోంది.

## 982. జ్ఞానజ్ఞేయస్వరూపిణీ

జ్ఞానముచేత మాత్రమే తెలుసుకోగలిగిన దృశ్యరూపము గలది. వేదాంత వాక్యాల విచారమువల్ల కలిగేటటువంటి జ్ఞానము, దాని ఫలితంగా పొందేటటువంటి పరదేవతా పదము. ఈ రెండూ ఒక్కటే. అంటే జ్ఞానము ఆమే. జ్ఞానంచేత పొందదగినది కూడా ఆమె. అందుచేతనే పరమేశ్వరి జ్ఞానాజ్ఞేయస్వరూపిణి అనబడుతోంది.

## 983. యోనిముద్రా

దశముద్రలలో తొమ్మిదవది యోనిముద్ర. దీన్నే నమస్కారముద్ర అని కూడా అంటారు. అన్ని ముద్రలయందు కూడా ఉత్తమమైన ముద్ర ఇది. బిందుతత్త్వాన్ని తెలుసుకోకుండా మాయలో పడేస్తుంది. ఇదే మూల ప్రకృతి. మహాత్రికోణాకారంలో

ఉంటుంది. యోగినీ హృదయంలో దీన్ని గురించి వివరిస్తూ “శివశక్తుల సామరస్యం గలిగి పరమానందమయమైన పరబ్రహ్మను ఉపాసించే స్థానమే బిందువు. సర్వానందమయ చక్రమైన బిందుస్థానంలో యోనిముద్రాశక్తి పరిపాలిస్తున్నది అని చెప్పబడింది. గుద మేఢ్రాంతము యోని అంటున్నారు.

అన్ని ఆవరణలలోనూ అర్చన పూర్తయిన తరువాత నమస్కారం చెయ్యటానికి యోనిముద్రను ఉపయోగిస్తారు. **ఇతి యోనిముద్రయా ప్రణమేత్**

## 984. త్రిఖండేశీ

దశముద్రలలో ఆఖరుది త్రిఖండముద్ర. ఆ త్రిఖండముద్రకు ఈశ్వరి. ఈ ముద్రను నవావరణలలో సర్వత్రా ఉపయోగించటం జరుగుతుంది. ఇది పరమేశ్వరి స్వరూపము.

త్రిఖండములు - మూడు ఖండములు. వాటికి ఈశ్వరి. కాబట్టి త్రిఖండేశీ అనబడుతోంది.

పంచదశి మహామంత్రం మూడు ఖండాలుగా ఉన్నది. అవి

1. అగ్ని ఖండము 2. సూర్య ఖండము 3. చంద్ర ఖండము

ఈ మూడు ఖండాలకు ఈశ్వరి. కాబట్టి త్రిఖండేశీ. మానవ శరీరము మూడు భాగాలుగా ఉంటుంది.

1. వాగ్భవ కూటమి 2. కామరాజ కూటమి 3. శక్తి కూటమి

ఈ మూడు కూటములకు ఈశ్వరి

వ్యాహృతులు మూడు

| | | | |
|---|---|---|---|
| 1. | భూః | - | భూలోకము |
| 2. | భువః | - | భువర్లోకము |
| 3. | సువః | - | సువర్లోకము |

ఈ మూడు వ్యాహృతులకు అధిపతి.

ఈ రకంగా త్రిపుటికంతటికీ అధిపతి. అందుచేతనే త్రిఖండేశీ అనబడుతోంది.

## 985. త్రిగుణాంబా

గుణత్రయానికి కారణభూతురాలు. పరమేశ్వరి మూలప్రకృతి స్వరూపం. ఆమెనుంచే సత్వరజస్తమో గుణాలు ఉద్భవించినాయి. అందుచేతనే ఆమె త్రిగుణాలకు అంబా - తల్లి అనబడుతోంది. వాయుపురాణంలో

**యోగీశ్వరీ శరీరాణి కరోతి వికరోతి చ**
**నానాకృతి క్రియారూపా నానావృత్తిః స్వలీలయా**
**త్రిధా య ద్వర్తతే లోకే తస్మా త్సా త్రిగుణోచ్యతే ॥**

యోగీశ్వరి శరీరాలను సృష్టిస్తుంది. నాశనం చేస్తుంది. ఆమె అనేక రూపాలు గలది. అనేక కృత్యములు గలది. అనేక నామములుగలది. తన లీలలచే త్రివిధముగ నున్నది. కాబట్టి త్రిగుణాంబా అనబడుతున్నది అని చెప్పబడింది విష్ణుపురాణంలో

**సర్వభూతేషు సర్వాత్మన్ యాశక్తి పరా**
**తవ గుణాశ్రయా నమ స్తస్యై శాశ్వతాయై సురేశ్వరి ॥**

సర్వభూతములందు, సర్వప్రాణులందు ఉండు నీ శక్తి త్రిగుణములకు ఆధారమై ఉన్నది. గుణాశ్రయురాలైన సురేశ్వరికి నమస్కారము అని చెప్పబడింది.

సృష్టి స్థితి లయాదులచేత పరమేశ్వరి త్రిగుణా అని చెప్పబడుతోంది. త్రిగుణాలకు తల్లి కాబట్టి ఆమె త్రిగుణాంబా అనబడుతుంది.

## 986. త్రికోణగా

**త్రికోణం యోనిచక్రం గచ్ఛతీతి త్రికోణగా**

యోని చక్రమును పొందినది

**త్రికోణరూపిణీ శక్తిః బిందురూపః పర శ్శివః**

పరమేశ్వరి త్రికోణరూపిణి. పరమేశ్వరుడు బిందురూపుడు. బిందువికసనము వల్లనే త్రికోణం ఏర్పడింది. సృష్టి ప్రారంభానికి ముందు అంతా శూన్యంగా ఉండేది. పరమేశ్వరుడు బిందురూపంలో అంతటా ఆవరించి ఉన్నాడు. ఆ పరమేశ్వరుడు సృష్టి చెయ్యాలనే సంకల్పంతో తననుంచి కొంతశక్తిని బయటకు పంపాడు. అదే విమర్శరూపము. మాయాశక్తి త్రికోణము. ఆ శక్తియే

| | | |
|---|---|---|
| సత్త్వగుణ సంయోగంతో | – | అవ్యక్తంగాను |
| రజోగుణ సంయోగంతో | – | మహత్తత్త్వంగాను |
| తమోగుణ సంయోగంతో | – | అహంకారంగాను |

అవుతున్నది. ఈ రకంగా త్రికోణమే పరమేశ్వరి స్వరూపం కాబట్టి ఆమె త్రికోణగా అనబడుతున్నది.

## 987. అనఘా

**అఘం న విద్యతేஉ స్యేతి అనఘః**

ఏ విధమైన పాపములు లేనిది. ఏ విధమైన దుఃఖములు లేనిది. పాపరహితురాలు. కర్మలేశము ఏ మాత్రములేనిది. సచ్చిదానంద స్వరూపిణి. శుద్ధజ్ఞాన స్వరూపిణి.

## 988. అద్భుతచారిత్రా

**అద్భుతాని ఆశ్చర్యకరాణి చారిత్రాణి యస్యాః**

ఆశ్చర్యకరమైన చరిత్ర కలది. లోకంలో ఎవరికీ చేతకానటువంటి పనులు చేసింది. కాబట్టి ఆశ్చర్యకరమైన చరిత్ర గలది.

త్రిమూర్తులకు కూడా సాధ్యంకాని భండాసుర, మహిషాసుర సంహారం చేసింది. దేవదానవ యుద్ధంలో రాక్షసులను తమ పరాక్రమంవల్లనే గెలవగలిగాము అని దేవతలు గర్వించినప్పుడు వారికి జ్ఞానోదయం చేసింది.

తారకాసుర సంహారానికి దేవతలకు దారి చూపింది. భక్తులకు ముక్తిని చేకూర్చుతుంది. పంచకృత్యాలు చేస్తుంది. ఈ రకంగా సృష్టిలో దేవతలవల్ల కూడా కాని పనులను చేస్తుంది కాబట్టి అద్భుతచారిత్రా అనబడుతుంది.

## 989. వాంఛితార్థప్రదాయినీ

**వాంచితార్థాన్ ప్రదాతుం శీలమస్యాః**

కోరిన కోరికలనిచ్చు స్వభావం కలది.

**ఆరోగ్యార్థేஉ ర్చయేత్సూర్యం ధర్మమోక్షాయ మాధవం**

**శివం ధర్మార్థమోక్షాయ చతుర్వర్గాయ చండికామ్ ॥**

| | | |
|---|---|---|
| ఆరోగ్యాన్నిచ్చేవాడు | - | సూర్యుడు |
| ధర్మము, మోక్షములను ఇచ్చేవాడు | - | మాధవుడు |
| ధర్మార్థ మోక్షాలనిచ్చేవాడు | - | శివుడు |
| పై నాల్గింటినీ ఇచ్చేది | - | చండిక |

ప్రతి దేవతకు కొంతపరిధి ఉంటుంది. దానిని మించి వారేమీ చేయలేరు. కాని పరమేశ్వరికి పరిధి లేదు. ఆమెను భక్తులు ఏ కోరిక కోరినా తీర్చగలదు. అందుకే వాంఛితార్థప్రదాయినీ అనబడుతుంది.

## 990. అభ్యాసాతిశయజ్ఞాతా

మరణము వరకు కాలము వేదాంత చింతనతోనే గడపాలి. విన్న విషయాలే మళ్ళీ మళ్ళీ వినాలి. ఆలోచించాలి. వాటిని తర్కించాలి. ఈ రకంగా అభ్యాసం చెయ్యటంవల్లనే అందులో ఉండే రహస్యాలు బోధపడి, చివరకు ఆత్మసాక్షాత్కారం జరుగుతుంది. బ్రహ్మాండ పురాణంలో

**ధ్యానైకదృశ్యా జ్ఞానాంగీ విద్యాత్మా హృదయ స్సదా ।**
**ఆత్మైక్యా న్ముక్తి మాయాతి చిరానుష్ఠాన గౌరవాత్ ॥**

ఆమె అవయవాలు జ్ఞానము. ఆమె శరీరము శాస్త్రము. ఆమె స్థానము హృదయము. అటువంటి దేవి చిరకాల అనుష్ఠానమువలన, ఆత్మైక్యమువలన ప్రత్యక్షమవుతుంది. అని చెప్పబడింది.

ఆమెను గురించిన పునశ్చరణవల్లనే తెలుసుకోదగినది కాబట్టి 'అభ్యాసాతిశయజ్ఞాతా' అనబడుతుంది.

## 991. షడధ్వాతీతరూపిణీ

అధ్వము అనగా – మార్గము అని అర్థం. ఇవి ఆరు రకాలు.

| | | |
|---|---|---|
| 1. వర్ణ | 3. మంత్ర | 5. తత్త్వ |
| 2. పద | 4. కలా | 6. భువనములు |

వీటినే షడధ్వలు అంటారు. వీటిలో మొదటి మూడు విమర్శాంశలు కాగా మిగిలినవి ప్రకాశాంశలు.

విరూపాక్ష పంచాంశికలో పదములు, మంత్రములు, వర్ణములు విమర్శ గుణములని, భువన, తత్త్వ, కలాత్మకములు ప్రకాశగుణములని చెప్పబడింది. జ్ఞానార్ణవ తంత్రంలో ఈ విధంగా షడధ్వలచే నిర్మలమైన శ్రీచక్రమును చింతించుము అని చెప్పబడింది.

ఈ ఆరు మార్గాలు పరమాత్మవల్లనే కలుగుతున్నాయి. వీటికి అతీతమైనది ఆ పరమేశ్వరి. అందుచేతనే షడధ్వాతీతరూపిణీ అనబడుతోంది.

## 992. అవ్యాజకరుణామూర్తిః

ఎనలేని కరుణ గలది. ఏ రకమైన ప్రతిఫలం ఆశించకుండాను, ఏ కారణం లేకుండానే తన భక్తులమీద దయ చూపిస్తుంది. వాంఛారహితురాలు. అన్ని జీవులమీదా ఒకేరకమైన ప్రేమ, కరుణ గలిగి ఉంటుంది. దానికి కులమత భేదాలు లేవు. వయోభేదాలు లేవు. జాతిభేదం లేదు. వీడు ధనికుడని, వీడు దరిద్రుడని తేడా లేదు. పాలిచ్చే ఆవుమీద, విషం క్రక్కే పాముమీద కూడా ఒకే రకమైన కరుణ చూపిస్తుంది. అందుకే ఆమె అవ్యాజ కరుణామూర్తిః అనబడుతుంది.

## 993. అజ్ఞానధ్వాంతదీపికా

అజ్ఞానమనే చీకటిలో దీపములాంటిది. భగవానుడు గీతలో చెప్పినట్లుగా 'ప్రకాశిస్తున్న జ్ఞానజ్యోతిచే భక్తులయొక్కఅజ్ఞానాంధకారమును పటాపంచలు చేస్తుంది.

చీకటివల్ల వస్తువులు కంటికి కనపడవు. వాటిమీద వెలుతురు ప్రసరిస్తే అవి కనిపిస్తాయి. అలాగే అజ్ఞానపు చీకట్లు క్రమ్ముకొని సంసార సాగరంలో మునిగిపోతున్న వాడికి జ్ఞానజ్యోతులు ప్రసరింపచేసి అజ్ఞానాన్ని పటాపంచలు చేస్తుంది పరమేశ్వరి. అంటే గురువు రూపంలో శిష్యునికి జ్ఞానోపదేశం చేస్తుంది. జ్ఞానమార్గం ముక్తిమార్గం చూపుతుంది.

**అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా ।**
**చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః ॥**

ఈ దేహమే ఆత్మ అనుకుంటారు. అదే అజ్ఞానము. ఇలా భావించినవారు పతనమై పోతారు. బృహదారణ్యకోపనిషత్తులో ఈ విషయం వివరించబడింది. దాన్ని గతంలో వివరించాం. కాని ఇప్పుడు మళ్ళీ గుర్తు చేస్తున్నాము. దేవతల రాజైన ఇంద్రుడు, రాక్షస రాజైన విరోచనుడు బ్రహ్మజ్ఞానం కోసం ప్రజాపతి దగ్గరకు వెళ్ళి నియమనిష్ఠలతో కొంత కాలం గడిపారు. ఆ తరువాత ప్రజాపతి 'మీ కనుపాపలో కనిపించే పురుషుడే పరబ్రహ్మ' అన్నాడు. వారిద్దరూపోయి నీటిలో తమ ముఖాలు చూసుకున్నారు. వారి కనుపాపలలో వారి రూపమే కనిపించింది. అందుకని ఈ దేహమే ఆత్మ అని ప్రచారం చేశాడు విరోచనుడు. అందుచేతనే రాక్షసులు అజ్ఞానంతో నాశనమైపోయారు. ఇంద్రుడు మళ్ళీ మళ్ళీ బ్రహ్మచర్యం పాటించి పరబ్రహ్మ స్వరూపాన్ని తెలుసుకుని తరించాడు. ఈ రకంగా దేహమే ఆత్మ అని భావించే అజ్ఞానులకు జ్ఞానజ్యోతులు చూపించేది కాబట్టి అజ్ఞానధ్వాంత దీపికా అనబడుతోంది.

## 994. ఆబాలగోపవిదితా

ఆ బాలగోపాలము అందరికీ తెలిసినది. యాదువులు యజ్ఞం చెయ్యటం మొదలు పెట్టారు. కృష్ణుడు వద్దు అన్నాడు. ఇంద్రుణ్ణి అర్చించవలసిన అవసరం లేదు అన్నాడు. దాంతో కోపించిన ఇంద్రుడు వడగళ్ళ వాన కురిపించాడు. శ్రీకృష్ణ పరమాత్ముడు గోవర్ధనగిరినెత్తి బాలురను, వృద్ధులను, గోవులను అందరినీ రక్షించాడు. అంటే పిల్లల దగ్గరనుండి పశువులదాకా అందరినీ రక్షించాడు. పరమేశ్వరి రూపమే శ్రీకృష్ణుడు. అందుచేతనే ఆ బాలగోపవిదితా అనబడుతున్నది.

ఈ రకంగా పసిపిల్లల మొదలు పశువులవరకు అందరిచేత తెలియబడు దేవత కాబట్టి ఆబాలగోపవిదితా అనబడుతున్నది.

## 995. సర్వానుల్లంఘ్యశాసనా

దేవేంద్రాదులు కూడా మీరుటకు వీలులేని శాసనములు గలది. లోకంలోని సర్వజీవులు, గోళాలు, గ్రహాలు, మానవులు, దేవతలు, గంధర్వులు, యక్షులు ఎవరూకూడా ఆ పరమేశ్వరి ఆజ్ఞను మీరటానికి లేదు. అందుచేతనే సర్వానుల్లంఘ శాసనా అనబడుతున్నది. శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 24వ శ్లోకంలో

**జగ త్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే**
**తిరస్కుర్వ న్నేతత్స్వమపి వపురీశ స్థిరయతి**
**సదాపూర్వ స్సర్వం తదిద మనుగృహ్ణాతి చ శివః**
**తమజ్ఞా మాలంబ్య క్షణచలితయో ర్భ్రూలతికయోః ॥**

ఓ భగవతీ ! బ్రహ్మ లోకాలను సృష్టిస్తున్నాడు. విష్ణువు రక్షిస్తున్నాడు. రుద్రుడు లయంగావిస్తున్నాడు. మహేశ్వరుడు ఈ ముగ్గురినీ తనలో లీనం చేసుకుని తాను సదాశివునిలో లీనమవుతున్నాడు. సదాశివుడు ఇదంతా నీ ఆజ్ఞ ప్రకారమే ఈపనంతా చేస్తున్నాడు.

ఉపనిషత్తులలో ‘‘జగస్సృష్టికి కారకుడు పరబ్రహ్మ. అతడి శాసనాలు అనుల్లంఘనీయాలు. అతడున్నాడన్న భయంతోనే గాలి సవ్యంగా వీస్తోంది. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. చంద్రుడు వెన్నెలలు విరజిమ్ముతున్నాడు. దిక్పాలకులు తమ పనులు

క్రమం తప్పకుండా నిర్వర్తిస్తున్నారు. త్రిమూర్తులు సృష్టి స్థితి లయాలు గావిస్తున్నారు." అని చెప్పబడింది.

అందుచేతనే పరమేశ్వరి "సర్వానుల్లంఘ్యశాసనా" అనబడుతున్నది.

## 996. శ్రీచక్రరాజనిలయా

శ్రీచక్రరాజమందు నివశించునది. శంకరభగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 11వ శ్లోకంలో శ్రీచక్రాన్ని వివరిస్తూ

**చతుర్భిః శ్రీకంఠై శ్శివయువతిభిః పంచభి రపి**
**ప్రభిన్నాభి శంభో ర్నవభి రపి మూలప్రకృతిభిః**
**చతుశ్చత్వారింశ ద్వసుదళ కలాశ్రతివలయ**
**త్రిరేఖాభి స్సార్థం తవ శరణకోణాః పరిణతాః ॥**

తల్లీ ! నాలుగు శివచక్రములతోను, ఐదు శక్తి చక్రములతోను, తొమ్మిది మూలప్రకృతులతోను, అష్టదళము, షోడశదళము, మేఖలాత్రయము, భూపురములతో 44 కోణములు గలిగి శ్రీచక్రము అలరారుతున్నది.

శ్రీచక్రంలోని నవావరణలు, వాటిలోని దేవతలు, మానవదేహమే శ్రీచక్రము అనే విషయాలు 68వ నామంలో వివరించబడ్డాయి.

శ్రీచక్రంలో మర్మస్థానాలు 28, సంధులు 24 ఉంటాయి.

**ద్విరేఖా సంగమస్థానం సంధిరిత్యభిధీయతే**

రెండు రేఖలు కలిసిన చోటును సంధి అంటారు.

**త్రిరేఖా సంగమస్థానం మర్మం మర్మవిదో విదుః**

మూడు రేఖలు కలిసేచోటును మర్మస్థానము అంటారు.

ఇక్కడ సంధులుగాని, మర్మస్థానాలుగాని కోణాలయందు మాత్రమే ఉంటాయి. ఈ రకంగా

**మన్వస్ర ద్విదశార అష్టకోణ వృత్త చతుష్టయమ్**
**అష్టావింశతి మర్మాణి చతుర్వింశతి సంధయః**

మన్వస్రము, దశారద్వయము, అష్టకోణములందు 28 మర్మస్థానాలు, 24 సంధులు ఉంటాయి. శ్రీచక్రంలో శక్తిచక్రాలన్నీ కోణాకారంలోనే ఉంటాయి. అయితే శ్రీచక్రంలో 45 కోణాలుంటాయి. అవి

| | | |
|---|---|---|
| త్రికోణంలో | - | 3 |
| అష్టకోణంలో | - | 8 |
| అంతర్దశారంలో | - | 10 |
| బహిర్దశారంలో | - | 10 |
| మన్వస్రంలో | - | 14 |
| వెరసి | - | 45 కోణాలు |

అయితే శ్రీచక్రంలో బీజాక్షరాలుండాలా? వద్దా? ఇక్కడ సంప్రదాయభేదమున్నది.

**బీజాక్షరయుతం చక్రం యతీనా ముత్తమోత్తమమ్**
**బీజాక్షర విహీనంతు గృహస్థానాం ప్రశస్తకమ్**

బీజాక్షరాలున్న శ్రీచక్రము యతీశ్వరులకు ఉత్తమమైనది. బీజాక్షరాలు లేని శ్రీచక్రము గృహస్థులకు ప్రశస్త్యము. కాగా ఇంకొక సంప్రదాయంలో

**బీజం వినా తునిర్జీవం శవవ త్పరికీర్తితమ్**
**బీజహీనం తు య చ్ఛక్రం త చ్ఛక్రం సిద్ధిదం న చ**

బీజాక్షరములు లేని శ్రీచక్రము నిర్జీవమైన శవమువంటిది. దానిమీద పూజ సిద్ధించదు ఈ రకంగా సంప్రదాయ భేదమున్నది కాబట్టి గురుసంప్రదాయాన్నే పాటించాలి.

శ్రీచక్రంలో మూడు ప్రస్తారాలున్నాయి. అని శ్రీవిద్యార్ణవ తంత్రంలో చెప్పబడింది.

**ప్రస్తారో త్రివిధఃప్రోక్తః శ్రీచక్రస్య**
**మేరుకైలాస భూసంజ్ఞా భేదాస్య త్రిధాభవేత్**

శ్రీచక్రం మూడు ప్రస్తారాలుగా ఉంటుంది. అవి

**1. భూప్రస్తారము :** బల్లపరుపుగా ఉంటుంది. వెండి బంగారం, రాగి రేకులమీద, నేలమీద గీస్తారు.

**2. మేరుప్రస్తారము :** బోర్లించిన గరాటులా ఉంటుంది. ఒక దానిమీద ఒకటిగా తొమ్మిది అంతస్థులుగా ఉంటుంది. దీనిపొడవు వెడల్పు ఎత్తులు సమానంగా ఉంటాయి.

**3. కైలాసప్రస్తారము :** ఇదికూడా మేరువులాగానే ఉంటుంది. కాకపోతే ఎత్తు తక్కువ.

1. భూ ప్రస్తారంలో – వశిన్యాది దేవతల తాదాత్మ్యం
2. మేరు ప్రస్తారంలో – షోడశ నిత్యల తాదాత్మ్యం
3. కైలాస ప్రస్తారంలో – మాతృకా తాదాత్మ్యం చెప్పబడ్డాయి.

అయితే వీటిలో ఇంకా అనేక రకాలున్నాయి.

**1. మేరు ప్రస్తారము : (సమదళము) శృంగేరీ సంప్రదాయము :** ఇది బోర్లించిన గరాటులాగా ఉంటుంది. ఒకదానిమీద ఒకటిగా తొమ్మిది ఆవరణలు ఉంటాయి. ఇందులో దళాలన్నీ సమంగా ఉంటాయి. అందుకే దీనిని సమదళము అంటారు. ఇందులో వృత్తాలు మూడు భూపురానికి, షోడశీదళానికి మధ్యన ఉన్నాయి. ఈ చక్రము శృంగేరి సంప్రదాయంలోనిది.

**2. మేరు ప్రస్తారము : (సమదళము)** శ్రీ కళ్యాణానంద భారతీవారి సంప్రదాయము: ఇందులో వృత్తాలు మూడు ఒకచోట కాకుండా భూపురానికి షోడశీదళానికి మధ్యన ఒకటి, షోడశీదళానికి అష్టదళానికి మధ్యన ఒకటి, అష్టదళానికి చతుర్దశారానికి మధ్యన ఒకటి ఉంటాయి. ఇది గుంటూరులోని శృంగేరీ శ్రీవిరూపాక్ష పీఠానికి సంబంధించిన శ్రీ కళ్యాణానంద భారతీస్వామి వారి సంప్రదాయంలోది.

**3. మేరు ప్రస్తారము : (ఊర్ధ్వదళము)** ఇందులోని దళాలు ఊర్ధ్వముఖంగా ఉంటాయి. ఇవి భారతదేశంలో అతికొద్దిగా మాత్రమే ఉన్నాయి.

**4. మేరు ప్రస్తారము : (అధోదళము)** ఇందులోని దళాలు అధోముఖంగా ఉంటాయి. వీటిని మద్రాసులో తయారుచేస్తున్నారు.

**5. కూర్మ ప్రస్తారము :** ఇది వైష్ణవ సంప్రాదాయంలోని శ్రీచక్రము. కూర్మవతారంలో ఉన్న విష్ణుమూర్తి వీపుమీద శ్రీచక్రము ఉంటుంది.

**6. శివకామేశ్వరము :** ఇది శైవ సంప్రదాయంలోని శ్రీచక్రము. శివలింగము మీద శ్రీచక్రము ఉంటుంది.

**7. అర్ధమేరువు :** ఇందులో భూపురము, షోడశీదళము, అష్టదళములు ఒకదాని మీద ఒకటిగా ఉండి ఆపైన కోణములన్ని సమతలముగా ఉంటాయి.

**8. కైలాస ప్రస్తారము :** ఇదికూడా మేరులానే ఉంటుంది. కాకపోతే పొడవు వెడల్పులు సమానంగా వుంటాయి. కాని ఎత్తు 1/4 వంతు మాత్రమే ఉంటుంది. ప్రస్తుతము ఇవి కాశీలో దొరుకుతున్నాయి.

ఈ చిత్రాలన్నీ ప్రక్కపేజీలలో ఇవ్వబడ్డాయి.

అసలు శ్రీచక్రము పంచదశీ మహామంత్రంనుంచే ఆవిర్భవించింది అని 'వరివశ్యా రహస్యము'లో భాస్కరరాయలవారు అన్నారు. ఇదే విషయం జ్ఞానార్ణవతంత్రంలో కూడా చెప్పబడింది. పంచదశి మహామంత్రంలో బీజాక్షరాలను ఒకసారి లెక్కపెట్టిన దానిని మళ్ళీ లెక్కించకుండా అంటే పునరావృత్తి లేకుండా చూస్తే 9 అక్షరాలే వస్తాయి. ఆ 9 బీజాక్షరాలవల్లనే శ్రీచక్రం ఏర్పడింది.

**భూమి శ్చంద్రః శివో మాయా శక్తిః కృష్ణమాదనౌ ।**
**అర్ధచంద్ర శ్చ బిందుశ్చ నవార్ణో మేరు రుచ్యతే ॥**

| | | | |
|---|---|---|---|
| ఇందులో | 1. భూమి | – | ల కారము |
| | 2. చంద్ర | – | స కారము |
| | 3. శివ | – | హ కారము |
| | 4. మాయా | – | ఈ కారము |
| | 5. శక్తి | – | ఏ కారము |
| | 6. కృష్ణమాద్య | – | రే ఫ |
| | 7. మాదన | – | క కారము |
| | 8. అర్ధచంద్ర | – | నాదము |
| | 9. బిందు | – | బిందువు |

ఈ 9 అక్షరముల సముదాయమే పంచదశి మహామంత్రము. దానినుంచే శ్రీచక్రం ఆవిర్భవించింది. ముందుగా

1. ల కారము పృధివీ బీజము. దీనివల్ల భూపురం పుట్టింది.
2. స కారము చంద్రబీజము దీనివల్ల షోడశకళలుండే షోడశదళము పుట్టింది.
3. హ కారము శివబీజము అష్టమూర్త్యాత్మకము. దీనివల్ల అష్టదళము పుట్టింది.
4. ఈ కారము మాయాబీజము. అందుచేత దీనివల్ల చతుర్దశభువనాత్మకమైన చతుర్దశారము పుట్టింది.
5. ఏ కారము శక్తిబీజము. దీనివల్ల దశావతారాలకు ప్రతీకగా బహిర్దశారము పుట్టింది.
6. ర కారము అగ్నిబీజము. దీనివల్ల అగ్నికళలతో కూడిన అంతర్దశారము పుట్టింది.
7. క కారము మన్మథ బీజము. వసుకోణాత్మకము. దీనివల్ల వసుకోణము పుట్టింది.
8. అర్ధచంద్రము, త్రిగుణాత్మకము. దీనివల్ల త్రికోణం పుట్టింది.
9. బిందువు పరబ్రహ్మాత్మకము. దీనినుంచి పరబ్రహ్మాత్మకమైన బిందువు పుట్టింది.

ఈ రకంగా పంచదశీ మహామంత్రం నుంచే శ్రీచక్రం పుట్టింది. మరి పంచదశీ మహామంత్రానికి ఆధిదేవత త్రిమూర్తి ద్వంద్వము, పరమేశ్వర స్వరూపము అయినప్పుడు శ్రీచక్రానికి ఆధిదేవత కూడా ఆ పరమేశ్వరి స్వరూపమే కదా.

పరమేశ్వరి ఈ శ్రీచక్రంలోనే ఉంటుంది. కాబట్టి శ్రీచక్ర రాజనిలయా అనబడుతుంది.

## 997. శ్రీమత్త్రిపురసుందరీ

**త్రిపురస్య పరశివస్య సుందరీ పత్నీ**

త్రిపురుడు – త్రిపురాసురులను జయించినవాడు పరమశివుడు. అతని భార్య త్రిపురసుందరీ అనబడుతుంది. త్రిపురుడు – మూడు పురములు గలవాడు. బ్రహ్మావిష్ణు శివపురములు గలవాడు. అతని భార్య. శ్రీచక్రానికి అధిష్ఠానదేవత ముల్లోకాలను పాలించేతల్లి. భూతభవిష్యద్వర్తమానాలయందు, జాగ్రస్వప్న సుషుప్తులయందు, స్థూల సూక్ష్మ కారణదేహాలయందు సాక్షీభూతమైనది. చరాచర జగత్తును నడిపించేది లోకాలను పాలించే ఆదిశక్తి. కాళికాపురాణంలో

**ప్రధానేచ్ఛావశా చ్ఛంభోః శరీర మభవ త్త్రిధా**
**తత్రోర్ధ్వభాగ స్సంజ్ఞాతః పంచవక్త్ర శ్చతుర్భుజః ।**
**పద్మకేసరగౌరాంగః కాయో బ్రహ్మ మహేశ్వరి**
**తన్మధ్యభాగో నీలాంగ ఏకవక్త్ర శ్చతుర్భుజః ॥**

**శంఖచక్రగదాపద్మపాణిః కాయ స్స వైష్ణవః**
**అభవ త్తదధోభాగే పంచవక్త్ర శ్చతుర్భుజః ।**
**స్ఫటికాభ్రమయ శ్శుక్ల స్సకాయ శ్చంద్రశేఖరః**
**ఏవం త్రిభిః పురై ర్యోగాత్ త్రిపురః పరమశ్శివః ॥**

శివుని శరీరము మూడు భాగాలయింది. అందులో 1. పై భాగము – ఐదు ముఖములు, నాలుగు చేతులు, పద్మకేసరములవలె గౌరవర్ణముగల బ్రహ్మ.

2. మధ్యభాగము – నల్లని దేహము, ఏకముఖము, నాలుగు చేతులయందు శంఖచక్ర గదాపద్మములు ధరించిన విష్ణువు.

3. అథోభాగము – ఐదు ముఖాలు, నాలుగు చేతులు, స్ఫటికమువలె తెల్లని దేహముగల చంద్రశేఖరుడు. ఈ రకంగా మూడు పురముల సంబంధముచేత పరమశివుడు త్రిపురుడు అని పిలువబడ్డాడు.

ఆ త్రిపురుని యొక్క శక్తి త్రిపురసుందరి అని పిలువబడుతుంది.

## 998. శ్రీశివా

**శ్రీయుక్తా శివా శ్రీశివా**

శ్రీతో అనగా శోభతో కూడినది. శివశక్తులకు భేదంలేదు. వారిద్దరూ ఒకటే. అందు చేతనే పరమేశ్వరి శివా అనబడుతోంది. శివునియొక్క శక్తి శివుని అర్ధాంగి కాబట్టి శివా.

## 999. శివశక్త్యైక్యరూపిణీ

శివశక్తుల సామరస్యము గలది. శివతత్త్వముతో ఏకత్వము పొందినది. బ్రహ్మకన్న బ్రహ్మశక్తి వేరు కాదు. శక్తికీ శక్తిగల వానికి భేదము లేదు. ఇక్కడ శక్తిగలవాడు శివుడు. అందుకే పరమేశ్వరి శివశక్త్యైక్యరూపిణీ అనబడుతోంది.

పరమేశ్వరునితో ఐక్యముగల రూపము గలది. భైరవ యామళంలో

**చతుర్భి శ్శివచక్రై శ్చ శక్తిచక్రై శ్చ పంచభిః**
**శివశక్త్యాత్మకం జ్ఞేయం శ్రీచక్రం శివయో ర్వపుః**

నాలుగు శివచక్రములతోను, ఐదు శక్తి చక్రములతోను శ్రీచక్రము శివశక్తుల స్వరూపంగా విరాజిల్లుతున్నది. వీటిలో

**త్రికోణమష్టకోణం చ దశకోణద్వయంతథా**
**చతుర్దశారం చైతాని శక్తిచక్రాణి పంచభిః**

1. త్రికోణము
2. అష్టకోణము
3. దశారద్వయము
4. చతుర్దశారము

ఈ ఐదు శక్తి చక్రాలు

**బిందుశ్చాష్టదళం పద్మం పద్మ షోడశ పత్రకం**
**చతురస్రంచ చత్వారి శివచక్రా ణ్యనుక్రమాత్**

1. బిందువు
2. అష్టదళము
3. షోడశ దళము
4. భూపురము

ఈ నాలుగు శివచక్రాలు

అయితే పరమేశ్వరి శివశక్త్యైక్యరూపిణి. అంటే శివశక్తులు కలిసే ఉంటారు. విడివిడిగా ఉండరు. అందుకే శ్రీచక్రంలోకూడా శివచక్రాలకు శక్తి చక్రాలకు అవినాభావ సంబంధమున్నది. అది ఎలా అంటే

**త్రికోణే బైందవంశ్లిష్టం అష్టారేష్టదళాంబుజమ్**
**దశారయే షోడశారం భూగృహం భువనాశ్రకే**

| | | |
|---|---|---|
| త్రికోణంలో | – | బిందువున్నది |
| అష్టకోణంలో | – | అష్టదళ పద్మమున్నది |
| దశారయుగ్మంలో | – | షోడశదళమున్నది |
| చతుర్దశారంలో | – | భూపురమున్నది |

**శైవానామపి శాక్తానాం చక్రాణాంచ పరస్పరమ్**
**అవినాభావ సంబంధం యో జానాతి స చక్రవిత్**

ఈ రకంగా శివశక్తి చక్రాలయొక్క అవినాభావ సంబంధము నెరిగినవాడే చక్రవిదుడు. అతడే చక్రసంకేతము నెరిగినవాడు.

**న తేషాం సిద్ధిదా విద్యా కల్పకోటిశతై రపి**

ఈ విషయం తెలియకుండా ఎన్ని కోట్ల సంవత్సరాలు జపం చేసినప్పటికీ మంత్రం సిద్ధించదు.

ఈ రకంగా శివశక్తులు కలిసే ఉంటారు. అదే అర్ధనారీశ్వరతత్త్వము. ప్రతి అణువు లోను వారిద్దరూ కలిసే ఉన్నారు. అందుకే పరమేశ్వరి శివశక్త్యైక్యరూపిణీ అనబడుతోంది.

శివశక్తులు ఒకటిగా ఉన్నారు కాబట్టి ఈ సమైక్యతత్త్వానికి జగత్కారణత్వము కలుగుతున్నది. వీరిద్దరూ కలిసే ఉన్నారు కాని ఒకే బొమ్మను చూసి కొందరు ఎద్దు అని కొందరు ఏనుగు అని అనుకుంటున్నారు. అలాగే ఒకే బ్రహ్మను చూసి కొందరు శివుడని కొందరు శక్తి అని అనుకుంటున్నారు. కాబట్టి చైతన్యశక్తియుతమైన పరబ్రహ్మమే శివశక్త్యైక్యరూపిణి అనబడుతోంది.

హకార సంజ్ఞగల పరమేశ్వరుడు సకార సంజ్ఞగల ప్రకృతితో కలిసి శబళ బ్రహ్మమైనాడు. ఇదే హంస మంత్రము. హంసస్వరూపిణి. ముఖ్యప్రాణస్వరూపిణి. ఆ పరమేశ్వరి శివశక్త్యైక్యరూపిణి.

పరమేశ్వరుని శక్తులు ఐదు

1. ధూమవతీ శక్తి – పృథివీ శక్తి
2. హ్లాదశక్తి – జలశక్తి
3. భాస్వచ్ఛక్తి – అగ్నిశక్తి
4. స్పందన శక్తి – వాయుశక్తి
5. వైభవ శక్తి – ఆకాశశక్తి

వీటి సమిష్టిరూపము పరమేశ్వరి. ఈ పంచభూత శక్తులు సత్తాతో చేరి శివశక్త్యైక్యరూపిణీ అనబడుతోంది.

## 1000. లలితాంబికా

లలితా సహస్రనామాలలో మొదటి మూడు నామాలలోను పరమేశ్వరి సృష్టి స్థితి లయ కారిణి అని చెప్పి ఆ తరువాత పరమేశ్వరి పంచకృత్య పారాయణగా ఇప్పటిదాకా వివరించారు. ఇప్పుడు ఆమె ప్రత్యేకనామాన్ని వివరిస్తున్నారు.

లలితాంబికా – లలితమైన అంబికా. పద్మపురాణంలో

**లోకానతీత్య లలితే లలితా తేన సోచ్యతే**

లోకములను మించిన లలిత కాబట్టి ఆమె లలిత అనబడింది.

కిరణములు లేక ఆవరణ దేవతలు పై స్థానమున ఉన్న బిందువునందే ప్రకాశించేది.

| | | | |
|---|---|---|---|
| 1. శోభ | 3. గాంభీర్యము | 5. స్థైర్యము | 7. లాలిత్యము |
| 2. విలాసము | 4. మాధుర్యము | 6. తేజస్సు | 8. ఔదార్యము. |

ఇవి లలిత అనే పదానికి అర్థాలు. వీటిని గలది కాబట్టి లలితా అనబడుతోంది. లలితము అంటే సౌకుమార్యము, లాలిత్యము అని కూడా అర్థం. వాటిని గలది లలిత. ఆమె ధనుస్సు – చెరకు, బాణాలు – పుష్పాలు. అవన్నీ లలితములు కాబట్టి లలితా అనబడుతుంది. ప్రయాగపీఠాధిష్ఠాన దేవత లలితా అనబడుతుంది.

'లలితాంబికా' అనేది ఆరు అక్షరాలమంత్రం.

ఓంకారము బ్రహ్మకంఠం నుంచి వచ్చింది. కాబట్టి మంగళకరమైనది. ఓం కారపూర్వకము కాని మంత్రం సత్ఫలితాన్ని ఇవ్వదు. అందుచేతనే ముందుగా ఓంకారాన్ని చెప్పకపోవటం దోషం. ఇప్పుడు ఈ నామానికి ఓంకారం గనక ముందు చేర్చినట్లైతే "ఓం లలితాంబికా" ఆరు అక్షరాలవుతుంది.

**అస్యశ్రీ సౌభాగ్య విద్యాలలితా త్రిపురసుందరీ మహామంత్రస్య దక్షిణామూర్తిఋషిః । పంక్తిచ్ఛందః । శ్రీసౌభాగ్యవిద్యేశ్వరీ లలితా త్రిపురసుందరీ దేవతా । ఐం క ఏ ఈ ల హ్రీం బీజం । సౌః సకల హ్రీం శక్తిః । క్లీం హ స క హల హ్రీం కీలకం । జపే వినియోగః ॥**

**న్యాసము : ఐం క ఏ ఈ ల హ్రీం । సర్వజ్ఞశక్తిధామ్నే హ్రాం ।**
**క్లీం హ స క హల హ్రీం । నిత్య తృప్తిశక్తిధామ్నే హ్రీం ।**
**సౌః సకల హ్రీం । అనాదిబోధశక్తి ధామ్నే హ్రూం ।**
**ఐం క ఏ ఈ ల హ్రీం । స్వతంత్రశక్తిధామ్నే హ్రైం ।**
**క్లీం హ స క హల హ్రీం । నిత్యాలుప్తశక్తిధామ్నే హ్రౌం ।**
**సౌః సకల హ్రీం । అనంతశక్తిధామ్నే హ్రః ॥**

**ధ్యానము : సకుంకుమవిలేపనా ........ స్మరామ్యంబికామ్ ॥**

**మంత్రము : ఐం క ఏ ఈ ల హ్రీం । క్లీం హ స క హల హ్రీం । సౌః సకల హ్రీం।**

ఈ రకంగా 974 నుంచి 1000 నామాలదాకా శ్రీచక్రపూజ వివరించబడింది.



శ్రీ 'ద'కార దేవి

# 58. ఫలశ్రుతి

గురువుగారూ ! ఇప్పటిదాకా లలితాసహస్రనామాలకు చక్కటి భాష్యం చెప్పారు. అయితే ఈ సహస్రనామాలను చదవటం వల్ల ఫలితము ఏమైనా ఉన్నదా ? దయచేసి వివరించండి. అన్నాడు నారాయణభట్టు. ఆ మాటలు విన్న రత్నాకరుడు "నారాయణ భట్టారకా ! లలితాసహస్రానికి ఉత్తరభాగం కూడా ఉన్నదయ్యా. అందులో 86 శ్లోకాలలో సహస్రనామ పారాయణ ఫలం వివరించడింది. ఇప్పుడు దాన్ని మీకు వివరిస్తాను వినండి" అంటూ ప్రారంభించాడు.

లలితాసహస్రం చెప్పిన తరువాత హయగ్రీవుడు అంటున్నాడు. ఓ అగస్త్యమహర్షీ!

**అనేన సదృశం స్తోత్రం న భూతం న భవిష్యతి**

**సర్వరోగ ప్రశమనం సర్వసంపత్ప్రవర్ధనమ్**

ఈ స్తోత్రంతో సమానమైనది గతంలోగాని, ఇప్పుడుగానిలేదు. ఇక ముందు కూడా రాబోదు. దీన్ని పఠించినంత మాత్రంచేతనే సర్వరోగాలు ఉపశమిస్తాయి. సర్వసంపదలు ప్రాప్తిస్తాయి.

**సర్వాపమృత్యు శమనం కాలమృత్యునివారణం**

**సర్వజ్వరార్తి శమనం దీర్ఘాయుష్య ప్రదాయకమ్**

అపమృత్యువును శాంతింపచేస్తుంది. అకాలమృత్యువును నివారిస్తుంది. అన్నిరకాల జ్వరాలను తగ్గించి సంపూర్ణాయుష్యునిస్తుంది.

**పుత్రప్రదం అపుత్రాణాం పురుషార్థప్రదాయకమ్**

**ఇదం విశేషాచ్ఛ్రీదేవ్యాః స్తోత్రం ప్రీతి విధాయకమ్**

పుత్రులులేని వారికి పుత్రలనిస్తుంది. ధర్మార్థకామమోక్షాలనిస్తుంది. లలితాదేవికి విశేషమైన ప్రీతి కలిగిస్తుంది.

పరమేశ్వరి యందు భక్తి ఉన్నవారు ప్రతినిత్యము ఈ సహస్రనామాలను పారాయణ చెయ్యాలి. ఉదయాన్నేలేచి స్నానము సంధ్యావందనము ముగించి ముందుగా శ్రీచక్రాన్ని అర్చించాలి. తరువాత పంచదశి మహామంత్రాన్ని కనీసం 300 సార్లు జపంచేసి ఆ తరువాత సహస్రనామపారాయణ చెయ్యాలి. అలా చేసినట్లైతే

**గంగాది సర్వతీర్థేషు యఃస్నాయాత్ కోటిజన్మసు**

గంగానది మొదలైన పవిత్రతీర్థాలలో కోటిజన్మలు స్నానం చేసిన ఫలం వస్తుంది.

కాశీక్షేత్రంలో కోటిశివలింగాలు ప్రతిష్ఠించిన ఫలం వస్తుంది. శ్రోత్రీయులైన బ్రాహ్మణులకు కోటిబారువుల బంగారం దానంచేసిన ఫలం దక్కుతుంది. గంగానదీతీరంలో కోటి అశ్వమేధాలు చేసిన ఫలం దక్కుతుంది. ఎడారి ప్రాంతంలో కోటిబావులు త్రవ్వించిన ఫలం దక్కుతుంది. కరువుకాలంలో కోటిమంది సద్బ్రాహ్మణులకు భోజనం పెట్టిన ఫలం దక్కుతుంది. వేయి నామాలూ పారాయణ చెయ్యనవసరం లేదయ్యా. అందులో ఒక నామం పారాయణ చేసినా అతని పాపాలన్నీ ప్రక్షాళనమైపోతాయి. నిత్యకర్మలు చెయ్యకపోవటంవల్ల కలిగే పాపము పోతుంది. నిత్యము ఈ నామాలను పారాయణచేసేవాడి అభీష్టాలు ఆ పరమేశ్వరి నెరవేరుస్తుంది.

**నవమ్యాం వా చతుర్దశ్యాం సితాయాం శుక్రవాసరే**
**కీర్తయే న్నామ సాహస్రం పౌర్ణమాస్యాం విశేషతః**

ప్రతి మాసంలోను శుద్ధనవమి, చతుర్దశి, పౌర్ణమియందు లలితాసహస్రాన్ని విశేషంగా పారాయణ చెయ్యాలి.

అగస్త్యమహర్షీ ! వేయి అశ్వమేథాలు, నూరు వాజపేయాలు లలితాసహస్రంలోని ఒక నామానికి కూడా సాటిరావు. సర్వకాలసర్వావస్థలయందు పరమేశ్వరిని గంధపుష్పాదులచే పూజించేవాడే దాత, ముని, తపస్వి అవుతున్నాడు.

చందనము, అగరు, కర్పూరములను, కుంకుమతో కలిపి పరమేశ్వరికి లేపనము గావించినవాడు చిరకాలము జీవిస్తాడు. సహస్రనామ పారాయణచేసి జ్వరంగా ఉన్నవాడి తలను తాకితే ఆ జ్వరం తగ్గిపోతుంది. భస్మముచేతిలోకి తీసుకుని సహస్రనామ పారాయణ చేసి దాన్ని ధరించినట్లైతే సర్వవ్యాధులు ఉపశమిస్తాయి. పిల్లలు లేనివారికి పిల్లలు కలుగుతారు.

మహర్షీ ఇహముగాని పరముగాని ఎవరికి ఏమి కావాలంటే అది కలుగుతుందయ్యా. సంతానంలేనివారికి సంతానం కలుగుతుంది. అలాగే సిరిసంపదలు, భోగభాగ్యాలు, సర్వమూ సిద్ధిస్తాయి. అర్హులైనవారికి మోక్షం కూడా సిద్ధిస్తుంది.

ఈ రకంగా లలితాసహస్రనామాలను పారయణచేస్తే అన్ని కోరికలు తీరతాయి. అయితే అర్థంలేని విద్య వ్యర్థం. కాబట్టి పారాయణ చేసేటప్పుడు ఆ నామం యొక్క అర్థం కూడా తెలుసుకుని పారాయణ చేస్తే దానివల్ల వచ్చే ఫలితము కొన్ని రెట్లు ఉంటుంది.

భగవంతుణ్ణి ఆరాధించేవారు రెండు రకాలుగా ఉంటారు. 1. లౌకికవాదులు 2. పారలౌకికులు. లౌకికవాదులు అంటే ఈ లోకంలో పొందే సుఖసౌఖ్యాలు, భోగభాగ్యాలు, ఉన్నతపదవులు ఆశించేవారు. వీరిదృష్టిలో శ్రీచక్రంలో ఉండే పరమేశ్వరి సాకార అంటే ఒక ఆకారము కలిగినటువంటిది.

**చతుర్భుజే ! చంద్రకళావతంసే ! కుచోన్నతే ! కుంకుమరాగశోణే ! ।**
**పుండ్రేక్షుపాశాంకుశపుష్పబాణహస్తే ! ॥**

ఆమె 4 భుజముల యందు పాశము, అంకుశము, ఇక్షుచాపము, పుష్పబాణాలు ధరించి ఉంటుంది. కొంతమంది దృష్టిలో ఆ దేవి దశభుజ, గౌడపాదులవారు ఆ దేవిని స్తుతి చేస్తూ

**భవాని శ్రీహస్తైః ర్వహసి ఫణిపాశం సృణి మథో**
**ధనుః పౌండ్రం పౌష్పం శరమథ జపస్ర క్శుకవరౌ ।**
**అథద్వాభ్యాం ముద్రా మభయ వరదానైకరసికాం**
**క్వణద్వీణాం ద్వాభ్యా మురసి కరాభ్యాం చ భిభృషే ॥**

చేతులయందు సర్పరూపపాశము, 2 అంకుశము 3 పుండ్రేక్షు చాపము, 4 పుష్పబాణము 5. జపమాల, 6. శుకవరము 7,8 వరదఅభయముద్రలు 9,10 చేతులయందు వీణ ధరించి పది బాహువులతో ఉంటుంది.

ఈ విధంగా ప్రకాశించే పరమేశ్వరిని గనక ఆరాధించినట్లైతే సాధకుడికి ముల్లోకాలను రంజింపచేసే కవిత్వము, ధనధాన్యాలు, భోగభాగ్యాలు లభిస్తాయి. ఈ విధంగా లౌకికవాదుల కోరికలు తీరతాయి.

ఇక పారలౌకిక లేక మోక్షవాదులను గనక చూసినట్లైతే, వారికి కావలసినది ఇహంకాదు పరం. అంటే సాయుజ్యం. శ్రీచక్రంలో ఉన్న ఒక్కొక్క ఆవరణ, జగత్తులోని ఒక్కొక్క దానికి గుర్తు.

| | | |
|---|---|---|
| భూపురం | – | భూలోక భువర్లోక సువర్లోకాలకు |
| షోడశదళం | – | చంద్రకళలు |
| అష్టదళం | – | అష్టమూర్తులు |
| చతుర్దశారం | – | చతుర్దశ భువనాలు |

| | | |
|---|---|---|
| బహిర్దశారం | – | దశావతారాలు |
| అంతర్దశారం | – | అగ్నికళలు |
| అష్టకోణం | – | అష్టవసువులు |
| త్రికోణం | – | త్రిమూర్తులు, త్రిశక్తులు, త్రిగుణాలు, షోడశనిత్యలు, పంచదశ తిధులు, అ నుంచి క్ష వరకు అక్షరాలు ఈ రకంగా అన్నీ ఇక్కడే ఉన్నాయి. జగత్తంతా ఈ త్రికోణంలోనే ఉంది. |
| బిందువు | – | పరమేశ్వర స్వరూపం. నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ బిందురూపంలోనే ఉన్నాడు. అదే ఈ బిందువు. తేజోమయమైన కాంతి పుంజము. |

ఈ రకంగా ఉన్న శ్రీచక్రాన్ని అర్చించినట్లైతే చరాచర జగత్తును అర్చించినట్లే. విశ్వమానవాళినంతటినీ అర్చించినట్లే. జగత్తులోని ప్రాణికోటినంతటినీ అర్చించినట్లే.

మోక్షవాదులకు బాహ్యపూజలేదు. వారు శ్రీచక్రాన్ని తమ శరీరంలోనే ఊహించుకుని అంతరారాధన చేస్తారు. వీరు తమ శరీరంలో బిందువు అంటే బ్రహ్మరంధ్రం దగ్గర పరమేశ్వరి సాక్షాత్కారం పొందుతారు. సాధకుడు, పరమేశ్వరి ఇద్దరూ ఒక్కటే. వేరు కాదు అని తెలుసుకుంటారు. ఇదే ఆత్మసాక్షాత్కారము. ఈ విధంగా ఆత్మసాక్షాత్కారం పొందిన వారికి సాయుజ్యం లభిస్తుంది. మోక్షం సిద్ధిస్తుంది. వారి ఆత్మ పరమాత్మలో లీనమైపోతుంది. వారికి మరుజన్మ ఉండదు.

**యత్రా పి భోగో న చ తత్ర మోక్షః యత్రా పి మోక్షో న చ తత్ర భోగః ।**
**శ్రీ సుందరీ సేవన తత్పరాణాం భోగ శ్చ మోక్షశ్చ కరస్థ ఏవ ॥**

లోకంలో భోగభోగ్యాలు అనుభవించే వారికి మోక్షము లభించదు. అలాగే మోక్షగాములకు సిరిసంపదలుండవు. కాని ఆ పరమేశ్వరిని అర్చించేవారికి ఇహము, పరము రెండూ లభిస్తాయి. అంటూ లలితా సహస్రనామ పారాయణ ఫలితాన్ని వివరించాడు రత్నాకరుడు.



# 59. పారాయణ ఎవరు చెయ్యాలి ?

గురువుగారూ ! ఇంతవరకూ లలితాసహస్రనామ వ్యాఖ్య, పారాయణ ఫలితము కూలంకషంగా వివరించారు. అయితే చిన్న సందేహం పీడిస్తోంది. సహస్రనామాలను ఎవరైనా పారాయణ చెయ్యవచ్చా ? నిషేధం ఏమైనా ఉన్నదా ? తెలియచెయ్యండి అన్నాడు కృష్ణశర్మ. సమాధానం చెబుతున్నాడు రత్నాకరుడు.

నీ అనుమానం నాకు అర్థమయిందయ్యా ! జాగ్రత్తగా విను. ఎవరైనా అంటే ఏ కులంవారైనా పారాయణ చెయ్యవచ్చా అని కదా నీ అనుమానం ? చెయ్యవచ్చు. 'బిందుతర్పణ సంతుష్టా' అనే 974వ నామంలో చాతర్వర్ణాలవారు శ్రీచక్రంలోని బిందువు దగ్గర తర్పణ చేస్తారు అని చెప్పుకున్నాం కదా. అంటే ఏ కులంవారైన సరే లలితాసహస్రము పారాయణ చెయ్యవచ్చు. శ్రీచక్రాన్ని అర్చించవచ్చు అనే కదా ? అది కాకుండా గాయత్రీ మంత్రము బ్రహ్మ క్షత్రియుల కోసం ఏర్పడగా, పంచదశి మహామంత్రం చాతుర్వర్ణాలవారి కోసము ఏర్పడింది అని అగస్త్య మహర్షి శ్రీవిద్యాదీపిక అనే గ్రంథంలో వ్రాశాడు. కాబట్టి ఈ సహస్రనామాలను ఎవరైనా పారాయణ చెయ్యవచ్చు. ఇందులో సందేహంలేదు.

ఇక పారాయణ చేసేవారు రెండురకాలు.

1. పూజావిధానంలో పారాయణ. 2. మంత్రంగా పారాయణ. మొదటివిధానంలో అమ్మవారికి షోడశోపచారవిధిని అర్చన చేస్తూ పూజచేయవలసినప్పుడు సహస్రనామాలను విడివిడిగా చదవకుండా, శ్లోకాలను పారాయణ చెయ్యటం.

రెండవవిధానంలో దీన్ని ఒక మంత్రంగా భావించి అంగన్యాసకరన్యాసాలు చెప్పి సహస్రనామ పారాయణ చెయ్యటం.

ఈ రెండింటిలోను మొదటిది కేవలం పూజావిధానం. దీన్నిఎవరైనా చెయ్యవచ్చు. రెండవదైన మంత్ర భాగంగా పారాయణ చెయ్యాలంటే గురువుగారి దగ్గర ఉపదేశం ఉండితీరాలి. అయితే మొదటిపద్ధతి అయిన పూజావిధానంలో కూడా శ్లోకాలుగా పారాయణచేసే కన్న నామాలను చెప్పటమే ఉత్తమం. ప్రతి నామానికీ ముందు ఓంకారము, తరువాత నమః అని చెప్పటం ఉత్తమోత్తమమైన సంప్రదాయం. నామపారాయణప్రీతా అన్నారు. కాబట్టి ఈ రకంగా శ్లోకాలు చదువుతాము. ఇందులో సమయం తక్కువ పడుతుంది. అనరాదు. దేనివల్ల ఫలితమెక్కువ ఉంటుందో ఆలోచించి చెయ్యటం మంచిది.

పారాయణ క్రమంలో కూడా ప్రతినామము స్పష్టంగా ఉచ్చరించాలి. తప్పులు రాకుండా చూసుకోవాలి. లేకపోతే దుష్ఫలితాలు వచ్చే ప్రమాదం ఉన్నది. అంతేకాదు. పారాయణలోగాని, జపంలోగాని, అర్చనలోగాని తాదాత్మ్యత కావాలి. అప్పుడు సంఖ్యతో నిమిత్తం ఉండదు. ఫలం మాత్రం ఎక్కువ ఉంటుంది.

సువాసిని, కుమారి పూజలు చేసేటప్పుడు కూడా మన బంధువులనో, కావలసిన వారినో కూర్చోబెట్టరాదు. అక్కడ ఉండేది పరదేవత అనే భావంతో సరియైన వ్యక్తులను కూర్చోబెట్టి, వారిని పరమేశ్వరి స్వరూపంగానే భావించి అర్చించాలి. సువాసినికి ఏవిధమైన అంగవైకల్యముగాని, వ్యాధిగాని, కురుపులుగాని ఉండరాదు. సంపూర్ణ ఆరోగ్యవంతురాలు సంతానవతి అయి ఉండాలి. దీక్షాపరురాలై ఉండాలి.

పరమేశ్వరిని అర్చించేటప్పుడు వెండి, బంగారములతో చేసిన పూలను వాడటం శ్రేష్ఠము. వీటిని ప్రతిసారీ కడిగివాడాలి. పరమేశ్వరిని రోజూ రెండు పర్యాయాలయినా అర్చించాలి. దేవికి రాత్రిపూజ చాలా ముఖ్యము. పగలు శివ రూపము రాత్రి శక్తి రూపము.

ఈ విషయాలను గ్రహించి ఆ పరమేశ్వరిని గనక అర్చించినట్లైతే సాధకుడికి ఆయురారోగ్య ఐశ్వర్యాలు, సిరిసంపదలు, భోగభాగ్యాలు, ధనధాన్యాలు లభిస్తాయి. మనోవాంఛితము నెరవేరుతుంది. ఇష్టకామ్యార్థసిద్ధి జరుగుతుంది. అర్హులకు సాయుజ్యం లభిస్తుంది.

నాయనలారా ! ఇప్పటిదాకా నాకు తెలిసిన విషయమంతా లలితారహస్యనామ భాష్యంగా మీకు వివరించాను. ఇదేదో నా గొప్పతనం కాదు. శంకర భగవత్పాదులవారు తమ సౌందర్య లహరిలోని 100వ శ్లోకంలో

**ప్రదీపజ్వాలాభి ర్దివసకరనీరాజనవిధిః**
**సుధా సూతే శ్చంద్రోపలజలల వై ర ర్ఘ్య రచనా**
**స్వకీయై రంబోభి స్సలిలనిధి సాహిత్యకరణం**
**త్వదీయాభి ర్వాగ్భి స్తవ జనని ! వాచాం స్తుతి రియమ్**

ఓ పరమేశ్వరీ ! నీవిచ్చిన వాక్కులతో, నీవిచ్చిన జ్ఞానంతో నిన్ను స్తోత్రం చేస్తూ ఉంటే, సూర్యుడికి దివిటీలతో హారతి ఇచ్చినట్లుగా ఉన్నది. చంద్రకాంతిమణుల నుండి

జాలువారే జలబిందువులచే చంద్రునికి అర్ఘ్యమిచ్చినట్లుగా ఉన్నది. సముద్రంలోని నీటిని తీసుకుని మళ్ళీ సముద్రుడికే తర్పణలు అర్పించినట్లుగా ఉన్నది అంటారు.

అలాగే పరమేశ్వరి కృపచేత నాకు తెలిసినంతవరకు, నా బుద్ధికి తోచినంతవరకు, నాకు గుర్తున్నంతవరకు లలితారహస్యనామభాష్యాన్ని మీకు వివరించాను. మీ జన్మ ధన్యమైంది. ఆ పరమేశ్వరి మీకు ఆయురారోగ్య, ఐశ్వర్యాలను, సుఖశాంతులను ప్రసాదించుగాక.

**లోకా సమస్తా స్సుఖినో భవన్తు !**

అన్నాడు రత్నాకరుడు.

లలితారహస్యనామ భాష్యము, ఫలస్పృతి ఆసాంతం విన్నటువంటివారైన శిష్యులు నారాయణభట్టు, కృష్ణశర్మలు గురువుగారికి ప్రదక్షిణలుచేసి, పరిపరివిధాల ఆయనను పూజించి ఇంత మంచి భాష్యం చెప్పినందుకు గురువుగారిని సత్కరించి పాదాభివందనం చేసి వారి దగ్గర సెలవు తీసుకున్నారు.

**హరితస గోత్రీకుడు శ్రీ క్రోవి పురుషోత్తమ శర్మ,**

**శ్రీమతి లక్ష్మీ నరసమ్మగార్ల పౌత్రుడు**

**శ్రీ క్రోవి కృష్ణమూర్తి శ్రీమతి సత్యపర్వత వర్ధనమ్మగార్ల**

**జ్యేష్ఠపుత్రుడు అయిన క్రోవి పార్థసారథి**

**సర్వజనామోదము పొందునట్లుగా సులభశైలిలో వ్రాసిన**

**"శ్రీవిద్యా సారథి" అను లలితా రహస్యనామ భాష్యము సమాప్తము.**

***ఓం తత్సత్***

# ౬౦. శ్రీ లలితాంబా త్రిశతీస్తోత్ర రత్నమ్

**శ్రీ బ్రహ్మాండ పురాణే**

స కుంకుమ విలేపనా మళిక చుంబి కస్తూరికాం ।
స మంద హసితేక్షణాం స శరచాప పాశాంకుశాం ।
అశేష జనమోహినీ మరుణ మాల్య భూషాంబరాం ।
జపాకుసుమ భాసురాం జపవిధౌ స్మరే దంబికామ్ ॥

**అగస్త్య ఉవాచ :**

హయగ్రీవ దయాసింధో భగవన్ భక్తవత్సల ।
త్వత్త శ్శృత మశేషేణ శ్రోతవ్యం యద్య దస్తి తత్ ॥ 1

రహస్యం నామసాహస్ర మపి తత్సంశ్రుతం మయా ।
ఇతః పరం చ మే నాస్తి శ్రోతవ్య మితి నిశ్చయః ॥ 2

తథాపి మమ చిత్తస్య పర్యాప్తి ర్నైవ జాయతే ।
కార్త్స్న్యార్థః ప్రాప్య ఇత్యేవ శోచయిష్యా మ్యహం ప్రభో ॥ 3

కిమిదం కారణం బ్రూహి జ్ఞాతవ్యాంశోఽపి వా పునః ।
అస్తి చేన్మమ తం బ్రూహి బ్రూహిత్యుక్త్వా ప్రణమ్య తమ్ ॥ 4

**సూత ఉవాచ :**

సమాలలంబే తత్పాద యుగళం కలశోద్భవః ।
హయాననో భీతభీతః కిమిదం కిమిదం త్వితి ॥ 5

ముంచ ముంచేతి తం చోక్త్వా చింతాక్రాంతో బభూవ సః ।
చిరం విచార్య నిశ్చిన్వ న్వక్తవ్యం సమయేత్యసౌ ॥ 6

తూష్ణీం స్థితః స్మరన్నాజ్ఞాం లలితాంబా కృతాం పురా ।
తంప్రణమ్యైవ స ముని స్తత్పాదా వత్యజన్ స్థితః ॥ 7

వర్షత్రయావధి తథా గురుశిష్యౌ తథా స్థితౌ ।
తచ్ఛృణ్వంతశ్చ పశ్యంత స్సర్వలోకా స్సువిస్మితాః ॥ 8

తత్ర శ్రీలలితాదేవీ కామేశ్వర సమన్వితా ।
ప్రాదుర్భూతా రహస్యేవం హయగ్రీవ మవోచత ॥ 9

**శ్రీ దేవ్యువాచ :**

అశ్వాననావయోః ప్రీతి శ్శాస్త్ర విశ్వాసినే త్వయా ।
రాజ్యం దేయం శిరో దేయం న దేయా షోడశాక్షరీ ॥ 10

స్వమాతృజారవ ద్గోప్యా విద్యైషే (వే) త్యాగమా జగుః ।
తతోఽతి గోపనీయా మే సర్వపూర్తికరీ స్తుతిః ॥ 11

మయా కామేశ్వరేణాపి కృతా సా గోపితా భృశమ్ ।
మదాజ్ఞయా వచో దేవ్యశ్చక్రు ర్నామసహస్రకమ్ ॥ 12

అవాభ్యాం కథితం ముఖ్యం సర్వపూర్తికరం స్తవమ్ ।
సర్వక్రియాణాం వైకల్య పూర్తి ర్యజ్జపతో భవేత్ ॥ 13

సర్వపూర్తికరం తస్మా దిదంనామకృతం మయా ।
తద్బ్రూహి త్వ మగస్త్యాయ పాత్రభూతో న సంశయః ॥ 14

పత్న్యస్య లోపాముద్రాఖ్యా మా ముపాస్తేఽతిభక్తితః ।
అయం చ నితరాం భక్త స్తస్మాదస్య వదస్వ తత్ ॥ 15

అముంచమాన స్త్వత్పాదౌ వర్షత్రయ మసౌ స్థితః ।
ఏతత్ జ్ఞాతు మతో భక్త్యా హీదమేవ నిదర్శనమ్ ॥ 16

చిత్తపర్యాప్తి రేతస్య నాన్యథా సంభవిష్యతి ।
సర్వపూర్తికరం తస్మా దనుజ్ఞాతో మయా వద ॥ 17

**సూత ఉవాచ :**

ఇత్యుక్త్వాంతర్దధా వంబా కామేశ్వర సమన్వితా ।
అథోత్థాప్య హయగ్రీవః పాణిభ్యాం కుంభసంభవమ్ ॥ 18

**హయగ్రీవ ఉవాచ :**

సంస్థాప్య నికటే వాచ మువాచ భృశవిస్మితః ।
కృతార్థోఽసి కృతార్థోఽసి కృతార్థోఽసి ఘటోద్భవ ॥ 19

త్వత్సమో లలితాభక్తో నాస్తి నాస్తి జగత్త్రయే ।
యేనాగస్త్య స్వయం దేవీ తవ వక్తవ్య మన్వశాత్ ॥ 20

సచ్ఛిష్యేణ త్వ యాహం చ దృష్టవానస్మితాం శివాం ।
యతన్తే యద్దర్శనాయ బ్రహ్మ విష్ణ్వీశ పూర్వకాః ॥ 21

అతః పరం తే వక్ష్యామి సర్వపూర్తికరం స్తవం ।
యస్య స్మరణ మాత్రేణ పర్యాప్తి స్తే భవే ద్ధృది ॥ 22

రహస్య నామసాహస్రా దతిగుహ్యతమం మునే ।
అవశ్యకం తతో హ్యేతల్లలితాం సముపాసతామ్ ॥ 23

తదహం తే ప్రవక్ష్యామి లలితాంబానుశాసనాత్ ।
శ్రీమత్పంచదశాక్షర్యాః కాదివర్ణ క్రమాన్మునే ॥ 24

పృథ గ్వింశతి నామాని కథితాని ఘటోద్భవ ।
ఆహత్య నామ్నాం త్రిశతీ సర్వ సంపూర్తికారిణీ ॥ 25

రహస్యాతిరహస్యైషా గోపనీయా ప్రయత్నతః ।
తాం శృణుష్వ మహాభాగ సావధానేన చేతసా ॥ 26

కేవలం నామబుద్ధి స్తే న కార్యా తేషు కుంభజ ।
మంత్రాత్మకత్వ మేతేషాం నామ్నాం నామాత్మతాపి చ ॥

తస్మా దేకాగ్రమనసా శ్రోతవ్యం భవతా మునే ।

**సూత ఉవాచ :**

ఇత్యుక్త్వాతు హయగ్రీవః ప్రోచే నామ శత త్రయమ్ ॥ 28

అస్య శ్రీలలితా త్రిశతీస్తోత్ర మహామంత్రస్య భగవాన్ హయగ్రీవ – ఋషిః; అనుష్టుప్ – ఛందః; శ్రీలలితా మహేశ్వరీ దేవతా; ఐం – బీజం; సౌః – శక్తిః; క్లీం – కీలకం; మమ చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థే జపే వినియోగః ॥ ఐమిత్యాదిభి రంగన్యాస కరన్యాసాః కుర్యాః ।

**ధ్యానమ్ :**

అతిమధుర చాపహస్తా మపరిమితామోద బాణ సౌభాగ్యాం ।
అరుణా మతిశయ కరుణా మభినవ కుళ సుందరీం వందే ।

**హయగ్రీవ ఉవాచ :**

కకారరూపా కల్యాణీ కల్యాణగుణ శాలినీ ।
కల్యాణశైలనిలయా కమనీయా కళావతీ ॥ 1

కమలాక్షీ కల్మషఘ్నీ కరుణామృత సాగరః ।
కదంబ కాననావాసా కదంబ కుసుమ ప్రియా ॥ 2

కందర్పవిద్యా కందర్ప జనకాపాంగ వీక్షణా ।
కర్పూరవీటి సౌరభ్య కల్లోలిత కకుప్తటా ॥ 3

కలిదోషహరా కంజ లోచనా క్రమవిగ్రహా ।
కర్మాది సాక్షిణీ కారయిత్రీ కర్మఫలప్రదా ॥ 4

ఏకారరూపా చైకాక్ష ర్యేకానేకాక్షరాకృతిః ।
ఏత త్త దిత్యనిర్దేశ్యా చైకానంద చిదాకృతిః ॥ 5

ఏవ మిత్యాగమా బోధ్యా చైకభక్తిమదర్చితా ।
ఏకాగ్రచిత్త నిర్ధ్యాతా చైషణా రహితాదృతా ॥ 6

ఏలాసుగంధి చికురా చైనః కూట వినాశినీ ।
ఏకభోగా చైకరసా చైకైశ్వర్య ప్రదాయినీ ॥ 7

ఏకాతపత్ర సామ్రాజ్యప్రదా చైకాంత పూజితా ।
ఏధమానప్రభా చైజ దనేజ జ్జగదీశ్వరీ ॥ 8

ఏకవీరాది సం సేవ్యా చైకప్రాభవ శాలినీ ।
ఈకారరూపిణీశిత్రీ ఈప్సితార్థ ప్రదాయినీ ॥ 9

ఈదృగిత్య వినిర్దేశ్యా ఈశ్వరత్వ విధాయినీ ।
ఈశానాది బ్రహ్మమయీ ఈశిత్వా ద్యష్టసిద్ధిదా ॥ 10

ఈక్షిత్రీ క్షణసృష్ట్యాండ కోటిరీశ్వర వల్లభా ।
ఈడితా చేశ్వరార్ధాంగ శరీరేశాధిదేవతా ॥ 11

ఈశ్వర ప్రేరణకరీ చేశతాండవ సాక్షిణీ ।
ఈశ్వరోత్సంగ నిలయా చేతబాధా వినాశినీ ॥ 12

ఈహా విరహితా చేశశక్తి రీషత్స్మితాననా ।
లకారరూపా లలితా లక్ష్మీ వాణీ నిషేవితా ॥ 13

లాకినీ లలనారూపా లస ద్దాడిమ పాటలా ।
లలంతికా లసత్ఫాలా లలాట నయనార్చితా ॥ 14

లక్షణోజ్జ్వల దివ్యాంగీ లక్ష్యకోట్యండ నాయికా ।
లక్ష్యార్థా లక్షణాగమ్యా లబ్ధకామా లతాతనుః ॥ 15

లలామరాజదళికా లంబముక్తా లతాంచితా ।
లంబోదర ప్రసూర్లభ్యా లజ్జాఢ్యా లయవర్జితా ॥ 16

హ్రీంకారరూపా హ్రీంకారనిలయా హ్రీంపద ప్రియా ।
హ్రీంకారబీజా హ్రీంకార మంత్రా హ్రీంకార లక్షణా ॥ 17

హ్రీంకారజప సుప్రీతా హ్రీం మతిః హ్రీం విభూషణా ।
హ్రీంశీలా హ్రీంపదారాధ్యా హ్రీంగర్భా హ్రీంసదాభిదా ॥ 18

హ్రీంకారవాచ్యా హ్రీంకార పూజ్యా హ్రీంకార పీఠికా ।
హ్రీంకారవేద్యా హ్రీంకార చింత్యా హ్రీంహ్రీం శరీరిణీ ॥ 19

హకారరూపా హలధృత్పూజితా హరిణేక్షణా ।
హరప్రియా హరారాధ్యా హరి బ్రహ్మేంద్ర సేవితా ॥ 20

హయారూఢా సేవితాంఘ్రిర్హయమేధ సమర్చితా ।
హర్యక్షవాహనా హంసవాహనా హతదానవా ॥ 21

హత్యాది పాపశమనీ హరిదశ్వాది సేవితా ।
హస్తి కుంభోత్తుంగ కుచా హస్తికృత్తి ప్రియాంగనా ॥ 22

హరిద్రా కుంకుమా దిగ్ధా హర్యశ్వా ద్యమరార్చితా ।
హరికేశసఖీ హాదివిద్యా హాలామదాలసా ॥ 23

సకారరూపా సర్వజ్ఞా సర్వేశీ సర్వమంగళా ।
సర్వకర్త్రీ సర్వభర్త్రీ (ధాత్రీ) సర్వహంత్రీ సనాతనీ ॥ 24

సర్వానవద్యా సర్వాంగ సుందరీ సర్వసాక్షిణీ ।
సర్వాత్మికా సర్వసౌఖ్య దాత్రీ సర్వవిమోహినీ ॥ 25

సర్వాధార సర్వగతా సర్వావగుణ వర్జితా ।
సర్వారుణా సర్వమాతా సర్వాభరణ భూషితా ॥ 26

కకారార్థః కాలహంత్రీ కామేశీ కామితార్థదా ।
కామ సంజీవినీ కల్యా కఠినస్తన మండలా ॥ 27

కరభోరూః కళానాథ ముఖీ కచ జితాంబుదా ।
కటాక్షస్యంది కరుణా కపాలి ప్రాణనాయికా ॥ 28

కారుణ్య విగ్రహా కాంతా కాంతిధూత జపావళిః ।
కలాలాపా కంబుకంఠీ కర నిర్జిత పల్లవా ॥ 29

కల్పవల్లీ సమభుజా కస్తూరీ తిలకోజ్జ్వలా ।
హకారార్థా హంసగతి ర్హాటకాభరణోజ్జ్వలా ॥ 30

హారహారి కుచాభోగ హాకినీ హల్యవర్జితా ।
హరిత్పతి సమారాధ్యా హఠాత్కార హతాసురా ॥ 31

హర్షప్రదా హవిర్భోక్త్రీ హార్దసం తమసాపహా ।
హల్లీ హాలాస్య సంతుష్టా హంసమంత్రార్థ రూపిణీ ॥ 32

హానోపాదాన నిర్ముక్తా హర్షిణీ హరిసోదరీ ।
హాహా హూహూ ముఖస్తుత్యా హానివృద్ధి వివర్జితా ॥ 33

హయ్యంగవీన హృదయా హరి కోపారుణాంశుకా ।
లకారార్థా లతాపూజ్యా లయస్థి త్యుద్భవేశ్వరీ ॥ 34

లాస్యదర్శన సంతుష్టా లాభాలాభ వివర్జితా ।
లం ఘ్యేతరాజ్ఞా లావణ్య శాలినీ లఘు సిద్ధిదా ॥ 35

లాక్షారస సవర్ణాభా లక్ష్మణాగ్రజ పూజితా ।
లభ్యేతరా లబ్ధశక్తి సులభాలాంగలాయుధా ॥ 36

లగ్నచామరహస్త శ్రీశారదా పరివీజితా ।
లజ్జాపద సమారాధ్యా లంపటా లకుళేశ్వరీ ॥ 37

లబ్ధమానా లబ్ధరసా లబ్ధ సంపత్సమున్నతిః ।
హ్రీంకారిణీ హ్రీంకారాది హ్రీంమధ్యా హ్రీంశిఖామణిః ॥ 38

హ్రీంకార కుండాగ్నిశిఖా హ్రీంకార శశిచంద్రికా ।
హ్రీంకార భాస్కరరుచి హ్రీంకారాంబోధ చంచలా ॥ 39

హ్రీంకార కందాంకురితా హ్రీంకారైక పరాయణా ।
హ్రీంకార దీర్ఘికా హంసీ హ్రీంకారోద్యాన కేకినీ ॥ 40

హ్రీంకారారణ్య హరిణీ హ్రీంకారావాల వల్లరీ ।
హ్రీంకార పంజర శుకీ హ్రీంకారాంగణ దీపికా ॥ 41

హ్రీంకార కందరా సింహీ హ్రీంకారాంబుజ భృంగికా ।
హ్రీంకార సుమనో మాధ్వీ హ్రీంకార తరు మజరీ ॥ 42

సకారాఖ్యా సమరసా సకలోత్తమ సంస్తుతా ।
సర్వ వేదాంత తాత్పర్యభూమి స్సదసదాశ్రయా ॥ 43

సకలా సచ్చిదానందా సాధ్వీ సద్గతి దాయినీ ।
సనాకాది మునిధ్యేయా సదాశివ కుటుంబినీ ॥ 44

సకలాధిష్ఠానరూపా సత్త్వరూపా సమాకృతిః ।
సర్వప్రపంచ నిర్మాత్రీ సమానాధిక వర్జితా ॥ 45

సర్వోత్తుంగా సంగహీనా సద్గుణా సకలేష్టదా ।
కకారిణీ కావ్యలోలా కామేశ్వర మనోహరా ॥ 46

కామేశ్వర ప్రాణనాడీ కామేశోత్సంగ వాసినీ ।
కామేశ్వరాలింగితాంగీ కామేశ్వర సుఖప్రదా ॥ 47

కామేశ్వర ప్రణయినీ కామేశ్వర విలాసినీ ।
కామేశ్వర తపస్సిద్ధిః కామేశ్వర మనః ప్రియా ॥ 48

కామేశ్వర ప్రాణనాథా కామేశ్వర విమోహినీ ।
కామేశ్వర బ్రహ్మవిద్యా కామేశ్వర గృహేశ్వరీ ॥ 49

కామేశ్వరా హ్లాదకరీ కామేశ్వర మహేశ్వరీ ।
కామేశ్వరీ కామకోటి నిలయా కాంక్షితార్థదా ॥ 50

లకారిణీ లబ్ధరూపా లబ్ధధీ ర్లబ్ధ వాంఛితా ।
లబ్ధపాప మనోదూరా లబ్ధాహంకార దుర్గమా ॥ 51

లబ్ధశక్తిర్లబ్ధదేహా లబ్ధైశ్వర్య సమున్నతిః ।
లబ్ధబుద్ధి ర్లబ్ధలీలా లబ్ధ యౌవనశాలినీ ॥ 52

లబ్ధాతిశయ సర్వాంగ సౌందర్యా లబ్ధవిభ్రమా ।
లబ్ధరాగా లబ్ధగతి ర్లబ్ధ నానాగమ స్థితిః ॥ 53

లబ్ధభోగా లబ్ధసుఖా లబ్ధహర్షాభిపూజితా ।
హ్రీంకారమూర్తి ర్హ్రీంకారసౌధ శృంగ కపోతికా ॥ 54
హ్రీంకార దుగ్ధాబ్ధిసుధా హ్రీంకార కమలేందిరా ।

హ్రీంకార మణీదీపార్చి ర్హ్రీంకార తరు శారికా ॥ 55
హ్రీంకార పేటిక మణీర్హ్రీంకారాదర్శ బింబికా ।

హ్రీంకార కోశాసిలతా హ్రీంకారాస్థాన నర్తకీ ॥ 56
హ్రీంకార శుక్తికా ముక్తా మణీర్హ్రీంకార బోధితా ।

హ్రీంకారమయ సౌవర్ణ స్తంభ విద్రుమ పుత్రికా ॥ 57
హ్రీంకార వేదోపనిష ద్ర్హీంకారాధ్వర దక్షిణా ।

హ్రీంకార నందనారామ నవ కల్పక వల్లరీ ॥ 58

హ్రీంకార హిమవద్గంగా హ్రీంకారార్ణవకౌస్తుభా ।
హ్రీంకారమంత్ర సర్వస్వ హ్రీంకారపర సౌఖ్యదా ॥ 59

**శ్రీ హయగ్రీవ ఉవాచ :**

ఇతీదం తే మయాఽఖ్యాతాం దివ్యనామ్నాం శతత్రయం ।
రహస్యాతి రహస్యత్వా ద్గోపనీయం మహామునే ॥ 60

శివవర్ణాని నామాని శ్రీదేవీ కథితాని వై ।
శక్త్యక్షరాణి నామాని కామేశ కథితాని హి ॥ 61

ఉభయాక్షర నామాని హ్యుభాభ్యాం కథితాని వై ।
తదన్యైర్గ్రథితం స్తోత్ర మేతస్య సదృశం కిము ॥ 62

నానేన సదృశం స్తోత్రం శ్రీదేవీ ప్రీతిదాయకం ।
లోకత్రయేఽపి కల్యాణం సంభవే న్నాత్ర సంశయః ॥ 63

**సూత ఉవాచ :**

ఇతి హయముఖగతం స్తోత్రరాజం నిశమ్య ।
ప్రగళిత కలుష్యా(షో)ఽభూచిత్తపర్యాప్తి మేత్య ।
నిజగురు మథనత్వాత్ కుంభజన్మా తదు క్తైః ।
పున రధిక రహస్యం జ్ఞాతు మేవం జగాద ॥ 64

**అగస్త్య ఉవాచ :**

అశ్వానన మహాభాగ రహస్య మపి మే వద ।
శివవర్ణాని కాన్యత్ర శక్తివర్ణాని కానిహి ॥ 65

ఉభయో రపి వర్ణాని కాని మే వద దేశిక ।
ఇతి పృష్టః కుంభ జేన హయగ్రీవోఽవదత్పునః ॥ 66

**శ్రీ హయగ్రీవ ఉవాచ :**

తవ గోప్యం కి మస్తీహ సాక్షా దంబా కటాక్షతః ।
ఇదం త్వతిరహస్యం తే వక్ష్యామి శృణు కుంభజ ॥ 67

ఏత ద్విజ్ఞాన మాత్రేణ శ్రీవిద్యా సిద్ధిదా భవేత్ ।
కత్రయం హద్వయం చైవ శైవోభాగః ప్రకీర్తితః ॥ 68

శక్త్యక్షరాణి శేషాణి హ్రీంకార ఉభయాత్మకః ।
ఏవం విభాగ మజ్ఞాత్వా శ్రీవిద్యా జపశాలినః ॥ 69

న తేషాం సిద్ధిదా విద్యా కల్ప కోటిశతై రపి ।
చతుర్భి శ్శివచక్రై శ్చ శక్తిచక్రైశ్చ పంచభిః ॥ 70

నవచక్రై స్తు సంసిద్ధం శ్రీచక్రం శివయో ర్వపుః ।
త్రికోణ మష్టకోణం చ దశకోణ ద్వయం తథా ॥ 71

చతుర్దశారం చైతాని శక్తిచక్రాణి పంచ వై ।
బిందు శ్చాష్టదళం పద్మం పద్మం షోడశ పత్రకమ్ ॥ 72

చతురస్రం చ చత్వారి శివచక్రా ణ్యనుక్రమాత్ ।
త్రికోణే బైందవం శ్లిష్ట మష్టారేఽష్ట దళాంబుజమ్ ॥ 73

దశారయో ష్షోడశారం భూపురం భువనాశ్రకే ।
శైవానా మపి శాక్తానాం చక్రాణాం చ పరస్పరమ్ ॥ 74

అవినాభావ సంబంధం యో జానాతి స చక్రవిత్ ।
త్రికోణరూపిణీ శక్తి ర్బిందురూప శివ స్స్మృతః ॥ 75

అవినాభావ సంబంధ స్తస్మా ద్బిందుత్రికోణయోః ।
ఏవం విభాగ మజ్ఞాత్వా శ్రీచక్రం య స్సమర్చయేత్ ॥ 76

న తత్ఫల మవాప్నోతి లలితాంబా న తుష్యతి ।
యే చ జానంతి లోకేఽస్మిన్ శ్రీవిద్యాం చక్రవేదినః ॥ 77

సామాన్య వేదిన స్తే వై విశేషజ్ఞోఽతిదుర్లభః ।
స్వయం విద్యా విశేషజ్ఞో విశేషజ్ఞం సమర్చయేత్ ॥ 78

తస్మై దేయం తతో గ్రాహ్యం శ్రీవిద్యా చక్ర వేదినా ।
అంధం తమః ప్రవిశంతి యే హ్యవిద్యా ముపాసతే ॥ 79

ఇతి శ్రుతి రపాహైతా నవిద్యోపాసకాన్ పునః ।
విద్యాఽనుపాసకా నేవ నిందత్యారుణికీ శ్రుతిః ॥ 80

అశ్రుతా సశ్రృతాస శ్చ యజ్వానో యే ప్యయజ్వనః ।
స్వర్యంతో నాపేక్షంత ఇంద్ర మగ్నిం చ యే విదుః ॥ 81

సికతా ఇవ సంయంతి రశ్మిభి స్సముదీరితాః ।
అస్మాల్లోకా దముష్మా చ్ఛే త్యపాహారుణికీ శ్రుతిః ॥ 82

యః ప్రాప్తః పృశ్నిభావం వా యది వా శంకర స్స్వయం ।
తేనైవ లభ్యతే విద్యా శ్రీమత్పంచదశాక్షరీ ॥ 83

ఇతి తంత్రేషు బహుధా విద్యాయా మహిమోచ్యతే ।
మోక్షైకహేతు విద్యా తు శ్రీ విద్యైవ న సంశయః ॥ 84

న శిల్పాదిజ్ఞానయుక్తే విద్వ చ్ఛబ్దః ప్రయుజ్యతే ।
మోక్షైకవిద్యా సా శ్రీవిద్యైవ న సంశయః ॥ 85

తస్మా ద్విద్యావిదే దద్యాత్ ఖ్యాపయే త్తద్గుణా న్సుధీః ।
స్వయం విద్యావిశేషజ్ఞో విద్యామాహాత్మ్య వేద్యపి ॥ 86

విద్యావిదం నార్చయే చ్చే త్కో వా తం పూజయే జ్జనః ।
ప్రసంగా దేత దుక్తం తే ప్రకృతం శృణు కుంభజ ॥ 87

యః కీర్తయే త్సకృ ద్భక్త్యా దివ్యం నామ్నాం శతత్రయం ।
తస్య పుణ్యఫలం వక్ష్యే విస్తరేణ ఘటోద్భవ ॥ 88

రహస్య నామసాహస్ర పాఠే యత్ఫల మీరితం ।
త త్కోటి కోటిగుణిత మేకనామ జపాద్భవేత్ ॥ 89

కామేశ్వరాభ్యాం తదిదం కృతం నామ శతత్రయం ।
నాన్యేన తులయే దేత త్స్తోత్రేణాన్యకృతేన తు ॥ 90

శ్రియః పరంపరా యస్య భావినీ తూత్తరోత్తరం ।
తేనైవ లభ్యతే నామ్నాం త్రిశతీ సర్వకామదా ॥ 91

అస్యా నామ్నాం త్రిశత్యా స్తు మహిమా కేన వర్ణ్యతే ।
యా స్వయం శివయే ర్వక్త్ర పద్మాభ్యాం పరినిస్సృతా ॥ 92

నిత్యా షోడశికా రూపా న్విప్రా నాదౌతు భోజయేత్ ।
అభ్యక్తాన్ గంధ తైలేన స్నాతాఽనుష్ణేన వారిణా ॥ 93

అభ్యార్చ్య వస్త్ర గంధాద్యైః కామేశ్వర్యాది నామభిః ।
అపూపైశ్శర్కరాజ్యైశ్చ ఫలైః పుష్పై స్సుగంధిభిః ॥ 94

విద్యావిదో విశేషేణ భోజయే త్షోడశ ద్విజాన్ ।
ఏవం నిత్యబలిం కుర్యా దాదౌ బ్రాహ్మణ భోజనే ॥ 95

పశ్చాత్త్రిశత్యా నామ్నాంతు బ్రాహ్మణాన్ క్రమశోఽర్చయేత్ ।
తైలాభ్యంగాదికం దద్యా ద్విభవేసతి భక్తితః ॥ 96

శుక్ల ప్రతిపదారభ్య పౌర్ణమాస్యావధి క్రమాత్ ।
దివ సే దివసే విప్రా భోజ్యా వింశతి సంఖ్యయా ॥ 97

దశభిః పంచభి ర్వాపి తిభి రేకేన వా దినైః ।
త్రింశ త్షష్టిం శతం విప్రాన్ భోజయే త్త్రిశతం క్రమాత్ ॥ 98

ఏవం యః కురుతే భక్త్యా జన్మమధ్యే సకృన్నరః ।
తస్యైవం సఫలం జన్మముక్తి స్తస్య కరే స్థితౌ ॥ 99

రహస్య నామసాహస్రై రర్చనేఽప్యేవ మేవ హి ।
ఆదౌ నిత్యబలిం కుర్యా త్పశ్చా ద్బ్రాహ్మణ భోజనమ్ ॥ 100

రహస్య నామసాహస్ర మహిమా యో మయోదితః ।
స శీక రాణు రత్రైక నామ్నో మహిమ వారిధేః ॥ 101

వాగ్దేవీ రచితే నామ సాహస్రే యద్యదీరితం ।
త త్త త్ఫల మ వాప్నోతి నామ్నోఽప్యేకస్య కీర్తనాత్ ॥ 102

ఏత దన్యైర్జపై స్తోత్రై రర్చనై ర్యత్ఫలం భవేత్ ।
తత్ఫలం కోటి గుణితం భవేన్నామ శతత్రయాత్ ॥ 103

రహస్య నామసాహస్ర కోట్యావృత్త్యా స్తు యత్ఫలం ।
తద్భవే త్కోటి గుణితం నామత్రిశతి కీర్తనాత్ ॥ 104

వాగ్దేవీ రచితే స్తోత్రే తాదృశో మహిమా యది ।
సాక్షాత్కామేశ కామేశీ కృతేఽస్మిన్ గృహ్యతా మితి ॥ 105

సకృ త్సంకీర్తనాదేవ నామ్నా మస్మిన్ శతత్రయే ।
భవే చ్చిత్తస్య పర్యాపి ర్న్యాన మన్యానపేక్షిణి ॥ 106

న జ్ఞాతవ్య మిత స్త్వన్య జ్జగత్సర్వం చ కుంభజ ।
యద్య త్సాధ్యతమం కార్యం తత్తదర్థ మిదం జపేత్ ॥ 107

త త్త త్సిద్ధి మవాప్నోతి పశ్చా త్కార్యం పరీక్షయేత్ ।
యే యే ప్రసంగా స్తంత్రేషు తై స్తైర్య త్సాధ్యతే ధ్రువమ్ ॥ 108

తత్సర్వం సిద్ధ్యతి క్షిప్రం నామ త్రిశత కీర్తనాత్ ।
ఆయుష్కరం పుష్టికరం పుత్రదం వశ్యకారకమ్ ॥ 109

విద్యాప్రదం కీర్తికరం సుకవిత్వ ప్రదాయకం ।
సర్వ సంపత్ప్రదం సర్వ భోగదం సర్వ సౌఖ్యదమ్ ॥ 110

సర్వాభీష్ట ప్రదం చైవ దేవీ నామ శతత్రయం ।
ఏత జ్జపపరో భూయా న్నాన్య దిచ్ఛే త్కదాచన ॥ 111

ఏతత్కీర్తన సంతుష్టా శ్రీదేవీ లలితాంబికా ।
భక్తస్య యద్య దిష్టంస్యా త్త త్త త్పూరయతే ధ్రువమ్ ॥ 112

తస్మా త్కుంభోద్భవ మునే కీర్తయ త్వ మిదం సదా ।
అపరం కించి దపి తే బోద్ధవ్యం నావశిష్యతే ॥ 113

ఇతి తే కథితం స్తోత్రం లలితా ప్రీతిదాయకం ।
నావిద్యావేదినో బ్రూయా న్నాభక్తాయ కదాచన ॥ 114

న శఠాయ న దుష్టాయ నావిశ్వాసాయ కర్హిచిత్ ।
యో బ్రూయా త్త్రిశతీం నామ్నాంతస్యానర్థో మహాన్ భవేత్ ॥ 115

ఇత్యాజ్ఞా శాంకరీ ప్రోక్తా తస్మాద్గోప్య మిదం త్వయా ।
లలితా ప్రేరితేనైవ మయోక్తం స్తోత్ర ముత్తమమ్ ॥ 116

రహస్య నామసాహస్రా దతిగోప్య మిదం మునే ।
ఏవ ముక్త్వా హయగ్రీవః కుంభజం తాపసోత్తమం ॥ 117

స్తోత్రేణానేన లలితాం స్తుత్వా త్రిపుర సుందరీమ్ ।
ఆనందలహరీ మగ్న మానస స్సమవర్తత ॥ 118

*ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే, ఉత్తరఖండే, హయగ్రీవాగస్త్య సంవాదే,*
*లలితోపాఖ్యానే, స్తోత్రఖండే, లలితాంబా త్రిశతీ స్తోత్రరత్నం సమాప్తమ్.*

## 61. శ్రీదేవీ ఖడ్గమాలా స్తోత్రరత్నమ్

ప్రీంకారాసనగర్భితానలశిఖాం సౌః క్లీం కళాం బిభ్రతీం
సౌవర్ణాంబరధారిణీం వరసుధా ధౌతాం త్రినేత్రోజ్జ్వలామ్
వందేపుస్తక పాశమంకుశధరాం స్రగ్భూషితాముజ్జ్వలాం
త్వాంగౌరీం త్రిపురాం పరాత్పరకళాం శ్రీచక్రసంచారిణీమ్.

అస్య శ్రీ శుద్ధశక్తిమాలామహామంత్రస్య, ఉపస్థేంద్రియా ధిష్ఠాయిా వరుణాదిత్య ఋషిః దైవీ గాయత్రీచ్ఛందః సాత్విక కకార భట్టారక పీఠస్థిత కామేశ్వరాంక నిలయా మహాకామేశ్వరీ శ్రీ లలితా పరాభట్టారికా దేవతా, ఐం బీజం క్లీం శక్తిః సౌః కీలకం, మమఖడ్గ సిద్ధ్యర్థే జపేవినియోగః మూలమంత్రేణ షడంగన్యాసం కుర్యాత్,

ధ్యానము : తాదృశం ఖడ్గమాప్నోతి యేనహస్త స్థితేన వై ।
అష్టాదశ మహాద్వీప సమ్రాడ్భోక్తా భవిష్యతి ॥

ఆరక్తాభాం త్రినేత్రా మరుణిమ వసనాం రత్నతాటంకరమ్యాం ।
హస్తాంభోజైస్సపాశాంకుశ మదన ధనుస్సాయ కైర్విస్ఫురంతీం ।
ఆపీనోత్తుంగ వక్షోరుహ కలశలుఠత్తార హారోజ్జ్వలాంగీం ।
ధ్యాయేదంభోరుహస్థా మరుణిమవసనా మీశ్వరీ మీశ్వరాణామ్ ॥

లమిత్యాది పంచపూజాం కుర్యాత్, యథాశక్తి మూలమన్త్రం జపేత్.

**న్యాసము :**

ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఓం నమస్త్రిపురసుందరి హృదయదేవి, శిరోదేవి, శిఖాదేవి, కవచదేవి, నేత్రదేవి, అస్త్రదేవి.

**షోడశ నిత్యలు :**

కామేశ్వరి, భగమాలిని, నిత్యక్లిన్నే, భేరుండే, వహ్నివాసిని, మహావజ్రేశ్వరి శివదూతి త్వరితే కులసుందరి, నిత్యే, నీలపతాకే, విజయే, సర్వమంగళే, జ్వాలామాలిని, చిత్రే మహానిత్యే పరమేశ్వర పరమేశ్వరి

**గురుమండలం :**

మిత్రేశమయి, షష్ఠీశమయి, ఉడ్డీశమయి, చర్యానాథమయి, లోపాముద్రామయి, అగస్త్యమయి, కాలతాపనమయి, ధర్మాచార్యమయి, ముక్తకేశీశ్వరమయి, దీపకళా

నాథమయి, విష్ణుదేమయి, ప్రభాకర దేవమయి, తేజో దేవమయి, మనోజ దేవమయి, కళ్యాణ దేవమయి, వాసుదేవమయి, రత్నదేవమయి, శ్రీరామానందమయి.

**ప్రథమావరణలో ప్రథమరేఖలోని దేవతలు :**

అణిమాసిద్ధే, లఘిమాసిద్ధే, గరిమాసిద్ధే, మహిమాసిద్ధే, ఈశిత్వసిద్ధే, వశిత్వసిద్ధే, ప్రాకామ్యసిద్ధే, భుక్తిసిద్ధే, ఇచ్ఛాసిద్ధే, ప్రాప్తిసిద్ధే, సర్వకామసిద్ధే.

**ప్రథమావరణలో ద్వితీయరేఖలోని దేవతలు :**

బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి వైష్ణవి వారాహి, మాహేంద్రి, చాముండే, మహాలక్ష్మి,

**ప్రథమావరణలో తృతీయరేఖలోని దేవతలు :**

సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వవశంకరి, సర్వోన్మాదిని సర్వమహాంకుశే, సర్వఖేచరి, సర్వబీజే, సర్వయోనే, సర్వత్రిఖండే, త్రైలోక్య మోహన చక్రస్వామిని, ప్రకటయోగిని.

**ద్వితీయావరణలోని దేవతలు :**

కామాకర్షిణి, బుద్ధ్యాకర్షిణి, అహంకారాకర్షిణి, శబ్దాకర్షిణి, స్పర్శాకార్షిణి, రూపాకర్షిణి, రసాకర్షిణి, గంధాకర్షిణి, చిత్తాకర్షిణి, ధైర్యాకర్షిణి, స్మృత్యాకర్షిణి, నామాకర్షిణి, బీజాకర్షిణి, ఆత్మాకర్షిణి, అమృతాకర్షిణి, శరీరాకర్షిణి, సర్వాశా పరిపూరక చక్రస్వామిని, గుప్తయోగిని.

**తృతీయావరణలోని దేవతలు :**

అనంగకుసుమే, అనంగమేఖలే, అనంగమదనే, అనంగమదనాతురే, అనంగరేఖే, అనంగవేగిని, అనంగాంకుశే అనంగమాలిని, సర్వసంక్షోభణ చక్రస్వామిని, గుప్తతరయోగిని.

**చతుర్థావరణలోని దేవతలు :**

సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వాహ్లాదిని, సర్వసమ్మోహిని, సర్వస్తంభిని, సర్వజృంభిణి, సర్వవశంకరి, సర్వరంజని, సర్వోన్మాదిని, సర్వార్థసాధికే, సర్వసంప్తిపూరణి, సర్వమంత్రమయి, సర్వద్వంద్వ క్షయంకరి, సర్వసౌభాగ్యదాయక చక్రస్వామిని, సంప్రదాయ యోగిని.

**పంచమావరణలోని దేవతలు :**

సర్వసిద్ధిప్రదే, సర్వసంపత్ప్రదే సర్వప్రియంకరి, సర్వమంగళకారిణి, సర్వకామప్రదే, సర్వదుఃఖ విమోచని, సర్వమృత్యుప్రశమని, సర్వవిఘ్న నివారిణి, సర్వాంగసుందరి, సర్వసౌభాగ్యదాయిని, సర్వార్థ సాధక చక్రస్వామిని, కుళోత్తీర్ణయోగిని.

**షష్ఠావరణలోని దేవతలు :**

సర్వజ్ఞే సర్వశక్తే సర్వైశ్వర్యప్రదాయిని సర్వజ్ఞానమయి సర్వవ్యాధి వినాశిని, సర్వాధార స్వరూపే, సర్వపాపహరే, సర్వానందమయి, సర్వరక్షా స్వరూపిణి, సర్వేప్సిత ఫలప్రదే, సర్వ రక్షాకరచక్ర స్వామిని, నిగర్భయోగిని.

**సప్తమావరణలోని దేవతలు :**

వశిని, కామేశ్వరి, మోదిని, విమలే, అరుణి జయిని, సర్వేశ్వరి, కౌళిని, సర్వరోగహర చక్రస్వామిని, రహస్యయోగిని.

**అష్టమావరణలోని దేవతలు :**

బాణిని, చాపిని, పాశిని, అంకుశిని, మహాకామేశ్వరి మహావజ్రేశ్వరి, మహా భగమాలిని, సర్వసిద్ధిప్రద చక్రస్వామిని, అతిరహస్యయోగిని.

**నవమావరణలోని దేవత :**

శ్రీశ్రీ మహాభట్టారికే, సర్వానందమయ చక్రస్వామిని పరాపర రహస్యయోగిని,

**నవావరణల అధిదేవతలు :**

త్రిపురే, త్రిపురేశి, త్రిపురసుందరి, త్రిపురవాసిని త్రిపురా శ్రీః త్రిపురమాలిని, త్రిపురాసిద్ధే, త్రిపురాంబ, మహా త్రిపుర సుందరి.

మహామహేశ్వరి, మహామహారాజ్ఞి, మహామహాశక్తే, మహామహా గుప్తే, మహా మహాజ్ఞప్తే, మహామహానందే, మహామహాస్కంధే, మహామహాశయే మహామహా శ్రీచక్రనగర సామ్రాజ్ఞి ! నమస్తే నమస్తే నమస్తే నమః.



# నవావరణలు


భూపురము
ప్రథమావరణము


షోడశదళ పద్మము


అష్టదళ పద్మము
తృతీయావరణము


చతుర్దశారము
చతుర్థావరణము


బహిర్దశారము
పంచమావరణము


అంతర్దశారము
షష్ఠావరణము


అష్ట కోణ చక్రము
సప్తమావరణము


త్రికోణము
బిందువు
అష్టమ నవమావరణములు

# 62. అకారాదిగ అనుక్రమణిక

**ఈ (1)**

271. ఈశ్వరీ

**ఉ (5)**

846. ఉదారకీర్తిః
6. ఉద్యద్భానుసహస్రాభా
847. ఉద్దామవైభవా
281. ఉన్మేషనిమిషోత్పన్నవిపన్న భువనావళిః
633. ఉమా

**ఏ - 1**

(1) 666. ఏకాకినీ

**ఓ - 2**

(2) 767. ఓజోవతి
379. ఓడ్యాణపీఠనిలయా

**అం (3)**

518. అంకుశాదిప్రహరణా
868. అంతర్ముఖసమారాధ్యా
295. అంబికా

**క (83)**

86. కంఠాదికటిపర్యంతంమధ్య కూటస్వరూపిణి
591. కటాక్షకింకరీభూతకమలా కోటిసేవితా
21. కదంబమంజరీక్లప్తకర్ణపూ రమనోహరా
60. కదంబవనవాసినీ
323. కదంబకుసుమప్రియా
31. కనకాంగదకేయూరకమనీయ భుజాన్వితా
862. కనత్కనకతాటంకా
793. కపర్దినీ
559. కమలాక్షనిషేవితా
80. కరాంగుళినఖోత్పన్ననారాయణ దశాకృతిః
326. కరుణారససాగరా
26. కర్పూరవీటికామోదసమాకర్ష ద్దిగంతరా
613. కలానాధా
794. కలామాలా
328. కలాలాపా
327. కలావతీ
556. కలికల్మషనాశినీ
856. కల్పనారహితా
901. కల్యా
612. కలాత్మికా
797. కలానిధిః
324. కల్యాణీ
514. కాకినీరూపధారిణీ
557. కాత్యాయనీ
330. కాదంబరీప్రియా
859. కాంతార్ధవిగ్రహా
329. కాంతా
449. కాంతిః
466. కాంతిమతీ
322. కామకలారూపా
861. కామకేళితరంగితా
590. కామకోటికా
63. కామదాయినీ
795. కామధుక్

**ఖ (1)**



**గ (24)**

978. త్రిపురా
787. త్రిపురేశీ
628. త్రిమూర్తిః
478. త్రిలోచనా
760. త్రివర్గదాత్రీ
871. త్రివర్గనిలయా
872. త్రిస్థా
762. త్ర్యంబకా
630. త్ర్యక్షరీ
482. త్వక్స్థా
426. త్వమ్

**ద (38)**

489. దంష్ట్రోజ్జ్వలా
601. దక్షయజ్ఞవినాశినీ
921. దక్షిణా
922. దక్షిణారాధ్యా
725. దక్షిణామూర్తిరూపిణీ
609. దండనీతిస్థా
513. దధ్యన్నాసక్తహృదయా
582. దయామూర్తిః
603. దరహాసోజ్జ్వలన్ముఖీ
923. దరస్మేరముఖాంబుజా
602. దరాందోళితదీర్ఘాక్షీ
977. దశముద్రాసమారాధ్యా
610. దహరాకాశరూపిణీ
599. దాక్షాయణీ
561. దాడిమీకుసుమప్రభా
631. దివ్యగంధాఢ్యా
621. దివ్యవిగ్రహా
696. దీక్షితా
191. దుఃఖహంత్రీ
194. దురాచారశమనీ
771. దురారాధ్యా
772. దురాధర్షా
189. దుర్గమా
188. దుర్లభా
190. దుర్గా
193. దుష్టదూరా
650. దృశ్యరహితా
5. దేవకార్యసముద్యతా
64. దేవర్షిగణసంఘాతస్తూయ మానాత్మ వైభవా
608. దేవేశీ
702. దేశకాలాపరిచ్ఛిన్నా
697. దైత్యశమనీ
600. దైత్యహంత్రీ
195. దోషవర్జితా
744. దౌర్భాగ్యతూలవాతూలా
768. ద్యుతిధరా
423. ద్విజబృందనిషేవితా
669. ద్వైతవర్జితా

**ధ (14)**

884. ధనధాన్యవివర్ధినీ
883. ధనాధ్యక్షా
957. ధన్యా
956. ధరసుతా
955. ధరా
959. ధర్మవర్ధినీ
255. ధర్మాధర్మవివర్జితా

**న (76)**

**ప (82)**

366. పరా
782. పరాకాశా
809. పరాత్పరా
790. పరాపరా
940. పరామోదా
354. పశుపాశవిమోచనీ
483. పశులోకభయంకరీ
368. పశ్యంతీ
773. పాటలీకుసుమప్రియా
167. పాపనాశనీ
743. పాపారణ్యదవానలా
481. పాయసాన్నప్రియా
246. పార్వతీ
619. పావనాకృతిః
811. పాశహంత్రీ
810. పాశహస్తా
594. ఫాలాస్థా
508. పీతవర్ణా
543. పుణ్యకీర్తిః
544. పుణ్యలభ్యా
545. పుణ్యశ్రవణకీర్తనా
288. పుణ్యాపుణ్యఫలప్రదా
802. పురాతనా
291. పురుషార్థప్రదా
546. పులోమజాఽర్చితా
801. పుష్టా
444. పుష్టిః
804. పుష్కరా
805. పుష్కరేక్షణా
803. పూజ్యా
975. పూర్వజా
292. పూర్ణా
828. ప్రకటాకృతిః
938. ప్రగల్భా
826. ప్రచండాజ్ఞా
575. ప్రజ్ఞానఘనరూపిణీ
611. ప్రతిపన్ముఖ్యరాకాంతతిథి మండలపూజితా
827. ప్రతిష్ఠా
367. ప్రత్యక్చితీరూపా
781. ప్రత్యగ్రూపా
393. ప్రభావతీ
394. ప్రభారూపా
825. ప్రసవిత్రీ
395. ప్రసిద్ధా
261. ప్రాజ్ఞాత్మికా
783. ప్రాణదా
830. ప్రాణధాత్రీ
784. ప్రాణరూపిణీ
829. ప్రాణేశ్వరీ
731. ప్రియంకరీ
770. ప్రియవ్రతా
730. ప్రేమరూపా

**బ (24)**

547. బంధమోచనీ
512. బందిన్యాదిసమన్వితా
964. బంధూకకుసుమప్రఖ్యా
548. బంధురాలకా

678. బలిప్రియా
869. బహిర్ముఖసుదుర్లభా
823. బహురూపా
965. బాలా
974. బిందుతర్పణసంతుష్టా
380. బిందుమండలవాసినీ
111. బిసతంతుతనీయసీ
824. బుధార్చితా
674. బృహతీ
680. బృహత్సేనా
903. బైందవాసనా
100. బ్రహ్మగ్రంథివిభేదినీ
265. బ్రహ్మరూపా
822. బ్రహ్మజనని
673. బ్రహ్మాత్మైక్యస్వరూపిణీ
677. బ్రహ్మానందా
821. బ్రహ్మాణీ
83. బ్రహ్మోపేంద్రమహేంద్రాది దేవసంస్తుతవైభవా
675. బ్రాహ్మణీ
676. బ్రాహ్మీ

**భ (36)**

747. భక్తచిత్తకేకిఘనాఘనా
568. భక్తనిధిః
372. భక్తమానసహంసికా
117. భక్తసౌభాగ్యదాయినీ
404. భక్తహార్దతమోభేదభానుమద్భాను సంతతిః
119. భక్తిగమ్యా
118. భక్తిప్రియా
353. భక్తిమత్కల్పలతికా
120. భక్తివశ్యా
277. భగమాలినీ
279. భగవతీ
715. భగారాధ్యా
74. భండపుత్రవధోద్యుక్తబాలా విక్రమనందితా
72. భండసైన్యవధోద్యుక్తశక్తివిక్ర మహర్షితా
65. భండాసురవధోద్యుక్తశక్తిసేనా సమన్వితా
79. భండాసురేంద్రనిర్ముక్తశస్త్ర ప్రత్యస్త్ర వర్షిణీ
115. భద్రప్రియా
116. భద్రమూర్తి
121. భయాపహా
841. భవచక్రప్రవర్తినీ
742. భవదావసుధావృష్టిః
175. భవనాశినీ
840. భవరోగఘ్నీ
112. భవానీ
114. భవారణ్యకుఠారికా
746. భాగ్యాబ్ధిచంద్రికా
275. భానుమండలమధ్యస్థా
839. భావజ్ఞా
113. భావనాగమ్యా
681. భావాభావవివర్జితా
679. భాషారూపా
294. భువనేశ్వరీ
667. భూమరూపా

**మ (112)**

228. మహాయంత్రా
230. మహాయాగక్రమారాధ్యా
225. మహాయోగేశ్వరీశ్వరీ
218. మహారతిః
212. మహారూపా
210. మహాలక్ష్మీ
48. మహాలావణ్యశేవధిః
585. మహావిద్యా
494. మహావీరేంద్రవరదా
221. మహావీర్యా
217. మహాశక్తిః
753. మహాశనా
109. మహాసక్తిః
216. మహాసత్త్వా
229. మహాసనా
583. మహాసామ్రాజ్యశాలినీ
224. మహాసిద్ధిః
718. మహీ
220. మహైశ్వర్యా
932. మహేశీ
232. మహేశ్వరమహాకల్పమహాతాండవసాక్షిణీ
750. మహేశ్వరీ
501. మాంసనిష్ఠా
40. మాణిక్యముకుటాకారజానుద్వయవిరాజితా
458. మాతా
578. మాతృకావర్ణరూపిణీ
576. మాధ్వీపానాలసా
931. మానవతీ
716. మాయా
785. మార్తాండభైరవారాధ్యా
456. మాలినీ
208. మాహేశ్వరీ
566. మిత్రరూపిణీ
735. మిథ్యాజగదధిష్ఠానా
836. ముకుందా
736. ముక్తిదా
837. ముక్తినిలయా
737. ముక్తిరూపిణీ
16. ముఖచంద్రకళంకాభమృగనాభివిశేషకా
564. ముఖ్యా
866. ముగ్ధా
520. ముద్గౌదనాసక్తచిత్తా
816. మునిమానసహంసికా
813. మూర్తా
89. మూలకూటత్రయకళేబరా
397. మూలప్రకృతిః
88. మూలమంత్రాత్మికా
838. మూలవిగ్రహరూపిణీ
515. మూలాధారాంబుజారూఢా
99. మూలాధారైకనిలయా
562. మృగాక్షీ
211. మృడప్రియా
565. మృడానీ
580. మృణాళమృదుదోర్లతా
749. మృత్యుదారుకుఠారికా
181. మృత్యుమథనీ
510. మేదోనిష్ఠా

**ల (14)**

35. లక్ష్యరోమలతాధారతానసము న్నేయమధ్యమా
740. లజ్జా
739. లయకరీ
1000. లలితాంబికా
504. లాకిన్యంబాస్వరూపిణీ
738. లాస్యప్రియా
648. లీలాక్లప్తబ్రహ్మాండ మండలా
863. లీలావిగ్రహధారిణీ
966. లీలావినోదినీ
665. లోకయాత్రావిధాయినీ
960. లోకాతీతా
647. లోపాముద్రాఽర్చితా
171. లోభనాశినీ
454. లోలాక్షీ

**వ (79)**

17. వదరస్మర మాంగల్య గృహతోరణ చిల్లికా
18. వక్త్రలక్ష్మీ పరీవాహచలన్మీ నాభలోచనా
498. వజ్రాదికాయుధోపేతా
944. వజ్రిణీ
469. వజ్రేశ్వరీ
497. వదనత్రయసంయుతా
488. వదనద్వయా
480. వదనైకసమన్వితా
349. వందారుజనవత్సలా
348. వంద్యా
471. వయోఽవస్థావివర్జితా
331. వరదా
519. వరదాదినిషేవితా
848. వర్ణరూపిణీ
286. వర్ణాశ్రమవిధాయినీ
671. వసుదా
352. వహ్నిమండలవాసినీ
989. వాంఛితార్థప్రదాయినీ
640. వాగధీశ్వరీ
350. వాగ్వాదినీ
351. వామకేశీ
945. వామకేశ్వరీ
470. వామదేవీ
332. వామనయనా
333. వారుణీమదవిహ్వలా
451. విఘ్ననాశినీ
346. విజయా
651. విజ్ఞాత్రీ
900. విజ్ఞానకలనా
253. విజ్ఞానఘనరూపిణీ
902. విదగ్ధా
550. విద్యా
402. విద్యాఽవిద్యాస్వరూపిణీ
889. విద్రుమాభా
337. విధాత్రీ
336. వింధ్యాచలనివాసినీ
885. విప్రప్రియా
886. విప్రరూపా
549. విమర్శరూపిణీ
347. విమలా
943. విమానస్థా

**ష (5)**



**స (120)**

850. సర్వోపనిషదుద్ఘుష్టా
534. సర్వౌదనప్రీతచిత్తా
910. సవ్యాపసవ్యమార్గస్థా
284. సహస్రపాత్
283. సహస్రాక్షీ
105. సహస్రారాంబుజారూఢా
282. సహస్రశీర్షవదనా
529. సహస్రదళపద్మస్థా
521. సాకిన్యంబాస్వరూపిణీ
385. సాక్షివర్జితా
695. సాగరమేఖలా
712. సాధ్వీ
128. సాధ్వీ
197. సాంద్రకరుణా
907. సామగానప్రియా
792. సామరస్యపరాయణా
693. సామ్రాజ్యదాయినీ
700. సావిత్రీ
632. సిందూరతిలకాంచితా
473. సిద్ధవిద్యా
474. సిద్ధమాతా
472. సిద్ధేశ్వరీ
192. సుఖప్రదా
968. సుఖకరీ
682. సుఖారాధ్యా
106. సుధాసారాభివర్షిణీ
61. సుధాసాగరమధ్యస్థా
877. సుధాసృతిః
660. సుప్రతిష్ఠా
260. సుప్తా
462. సుభ్రూః
967. సుమంగలీ
460. సుముఖీ
55. సుమేరుశృంగమధ్యస్థా
464. సురనాయికా
970. సువాసినీ
971. సువాసిన్యర్చనప్రీతా
969. సువేషాఢ్యా
468. సూక్ష్మరూపిణీ
264. సృష్టికర్త్రీ
908. సౌమ్యా (సోమ్యా)
36. స్తనభారదళన్మధ్యపట్టబంధ వళిత్రయా
928. స్తుతిమతీ
927. స్తోత్రప్రియా
493. స్నిగ్ధౌదనప్రియా
541. స్మృతిః
723. స్వతంత్రా
537. స్వధా
258. స్వపంతీ
913. స్వభావమధురా
764. స్వర్గాపవర్గదా
638. స్వర్ణగర్భా
912. స్వస్థా
448. స్వస్తిమతీ
414. స్వప్రకాశా
365. స్వాత్మానందలవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః

876. స్వాత్మారామా

505. స్వాధిష్ఠానాంబుజగతా

54. స్వాధీనవల్లభా

536. స్వాహా

**హ (11)**

457. హంసినీ

526. హంసవతీముఖ్యశక్తి సమన్వితా

84. హరనేత్రాగ్నిసందగ్ధకామసంజీవనౌషధిః

527. హరిద్రాన్నైకరసికా

297. హరిబ్రహ్మేంద్రసేవితా

528. హాకినీరూపధారిణీ

596. హృదయస్థా

303. హృద్యా

304. హేయోపాదేయవర్జితా

301. హ్రీంకారీ

302. హ్రీమతీ

**క్ష (9)**

865. క్షయవినిర్ముక్తా

344. క్షయవృద్ధివినిర్ముక్తా

757. క్షరాక్షరాత్మికా

867. క్షిప్రప్రసాదినీ

343. క్షేత్రక్షేత్రజ్ఞపాలినీ

345. క్షేత్రపాలసమర్చితా

341. క్షేత్రస్వరూపా

342. క్షేత్రేశీ

466. క్షోభిణీ

| | | |
|---|---|---|
| 1. | అకారాది నామములు | 39 |
| 2. | ఆకారాది నామములు | 9 |
| 3. | ఇకారాది నామములు | 3 |
| 4. | ఈకారాది నామములు | 1 |
| 5. | ఉకారాది నామములు | 5 |
| 6. | ఏకారాది నామములు | 1 |
| 7. | ఓకారాది నామములు | 2 |
| 8. | అంకారాది నామములు | 3 |
| 9. | కకారాది నామములు | 83 |
| 10. | ఖకారాది నామములు | 1 |
| 11. | గకారాది నామములు | 24 |
| 12. | చకారాది నామములు | 29 |
| 13. | ఛకారాది నామములు | 1 |
| 14. | జకారాది నామములు | 18 |
| 15. | డకారాది నామములు | 2 |
| 16. | తకారాది నామములు | 46 |
| 17. | దకారాది నామములు | 38 |
| 18. | ధకారాది నామములు | 14 |
| 19. | నకారాది నామములు | 76 |
| 20. | పకారాది నామములు | 82 |
| 21. | బకారాది నామములు | 24 |
| 22. | భకారాది నామములు | 36 |
| 23. | మకారాది నామములు | 112 |
| 24. | యకారాది నామములు | 13 |
| 25. | రేఫాది నామములు | 38 |
| 26. | లకారాది నామములు | 14 |
| 27. | వకారాది నామములు | 79 |
| 28. | శకారాది నామములు | 62 |
| 29. | షకారాది నామములు | 5 |
| 30. | సకారాది నామములు | 120 |
| 31. | హకారాది నామములు | 11 |
| 32. | క్షకారాది నామములు | 9 |
| | మొత్తము | 1000 |

# మావద్ద లభించు గ్రంథములు

## 1. వ్రతకథలు - పూజలు

| | |
|---|---|
| 1. శ్రీ వినాయక వ్రతం | వెల రూ. 10-00 |
| 2. శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 25-00 |
| 3. శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. వరలక్ష్మీ వ్రతం | 7-50 |
| 6. కేదారేశ్వర వ్రతం | 7-50 |
| 7. త్రినాధ వ్రతం(కలర్) | 7-50 |
| 8. త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. క్షీరాబ్ధి వ్రతం | 10-00 |
| 10. మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 20-00 |
| 12. శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 20-00 |
| 13. కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 20-00 |
| 14. సంతోషీమాతా వ్రతం | 20-00 |
| 15. ఏడు శనివారాల వ్రతం | 20-00 |
| 16. సత్యనారాయణవ్రతం | 20-00 |
| 17. శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 20-00 |
| 18. శివదీక్ష | 10-00 |
| 19. కాత్యాయనీ వ్రతం | 20-00 |

**20.** సౌభాగ్య గౌరీవ్రతం **20-00**

**21.** తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) **36-00**

**22.** స్త్రీల వ్రతకథలు **30-00**

**23.** స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి(నేదునూరిగంగాధరరావుగారి) **54-00**

**24.** స్త్రీలపాటలు (కామేశ్వరీపాటతో) **36-00**

**25.** సర్వదేవతా పూజావిధానం **20-00**

**26.** ఆరువ్రతాలు **30-00**

**27.** ధన్వంతరీ వ్రతకల్పం **10-00**

**28.** రాహుకాలంలోదుర్గాదేవీపూజా **10-00**

**29.** తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు **10-00**

**30.** శ్రీ చక్రపూజ **10-00**

**31.** శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ **36-00**

**32.** శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) **36-00**

**33.** లక్ష్మీ - గౌరీ నిత్యపూజ **10-00**

**34.** శ్రీలలితానిత్యపూజ(లలితాసహస్రనామస్తోత్రంతో) **10-00**

**35.** శ్రీ గాయత్రీ నిత్యపూజ **10-00**

**36.** అన్నపూర్ణ నిత్యపూజ **10-00**

**37.** శ్రీ సరస్వతీ నిత్యపూజ **10-00**

**38.** మహిషాసుర మర్థనీపూజ **10-00**

**39.** రాజరాజేశ్వరీ నిత్యపూజ **10-00**

**40.** శ్రీ దుర్గానిత్యపూజ **10-00**

**41.** కాలభైరవ నిత్యపూజ **10-00**

| | |
|---|---|
| **42.** శివపూజ | **10-00** |
| **43.** వీరభద్ర పూజ | **10-00** |
| **44.** ఆంజనేయ నిత్యపూజ | **10-00** |
| **45.** నాగేంద్ర స్వామి పూజ | **10-00** |
| **46.** సుబ్రహ్మణ్య నిత్యపూజ | **10-00** |
| **47.** రామదేవుని కథ | **10-00** |
| **48.** శివదేవుని కథ | **10-00** |
| **49.** లక్ష్మీనరసింహపూజ | **10-00** |
| **50.** వేంకటేశ్వరపూజ | **10-00** |
| **51.** బ్రహ్మంగారి నిత్యపూజ | **10-00** |
| **52.** సూర్య నిత్యపూజ | **10-00** |
| **53.** నవగ్రహ నిత్యపూజ | **10-00** |
| **54.** రుక్మిణీ కల్యాణం | **20-00** |
| **55.** ఉమామహేశ్వర వ్రతం | **20-00** |
| **56.** శ్రీ కామేశ్వరీ వ్రతం | **20-00** |
| **57. 16** సోమవారముల వ్రతము | **20-00** |
| **58.** పార్వతీకల్యాణం | **20-00** |
| **59.** సహస్రకమలవర్తి వ్రతము | **20-00** |
| **60.** పంచముఖ ఆంజనేయనిత్యపూజ | **20-00** |
| **61.** అష్టనాగపూజ | **36-00** |
| **62.** పూజలు ఎందుకుచేయాలి ? | **36-00** |
| **63.** ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | **36-00** |

**64.** ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? **36-00**

**65.** ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? **36-00**

**66.** ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? **36-00**

**67.** హనుమద్ వ్రతం **36-00**

**68.** పంచాయతన పూజ **45-00**

**69.** **28** వ్రతములు **108-00**

**70.** **కలశపూజలు (9ఒకేసారి)** **150-00**

**71.** **కలశపూజలు (విడివిడిగా)** (ప్రింటులో) **150-00**

**72.** ప్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) **150-00**

**73.** అర్చన **40-00**

**74.** శ్రీరామ కర్ణామృతము **99-00**

**75.** శ్రీ దేవీ భాగవతం **99-00**

**76.** శ్రీ దేవీ భాగవతం (కేస్‌బైండ్) **360-00**

**77.** క్షేత్రనామార్చన **63-00**

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

**1.** శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు **40-00**

**2.** శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు (కేస్‌బైండ్) **63-00**

**3.** స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు
(పత్రికసైజ్ కేస్ బైండ్) **108-00**

పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం

**4.** **లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ)** **,, 40-00**

**5.** **లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు)** **,,40-00**

| | | |
|---|---|---|
| **6.** | సర్వదేవతా స్తోత్రమంజరి | **120-00** |
| **7.** | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః **(63)** | **20-00** |
| **8.** | లలితా సహస్రనామ స్తోత్రమ్(క్రౌన్) | **36-00** |
| **9.** | లలితా సహస్రనామములు | **20-00** |
| **10.** | లక్ష్మీ సహస్రనామములు | **20-00** |
| **11.** | దుర్గా సహస్రనామములు | **20-00** |
| **12.** | ఆంజనేయ సహస్రనామములు | **20-00** |
| **13.** | శివ సహస్రనామములు | **20-00** |
| **14.** | విష్ణు సహస్రనామములు | **20-00** |
| **15.** | గణపతి సహస్రనామములు | **20-00** |
| **16.** | సుబ్రహ్మణ్య సహస్రనామములు | **20-00** |
| **18.** | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | **20-00** |
| **19.** | శ్రీరామా సహస్రనామములు | **20-00** |
| **20.** | లక్ష్మీనృసింహసహస్రనామములు | **20-00** |
| **21.** | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | **20-00** |
| **22.** | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | **20-00** |
| **23.** | మణిద్వీపవర్ణన (పెద్దది) | **20-00** |
| **24.** | సంధ్యావందనం | **20-00** |
| **25.** | మంత్రపుష్పమ్ | **20-00** |
| **26.** | త్రిభాషా హనుమాన్‌చాలీసా | **10-00** |
| **27.** | హనుమాన్ చాలీసా | **9-00** |
| **28.** | మణిద్వీపవర్ణన (పాకెట్) | **10-00** |

